GOPINATHA RAMAYANAM - Volume II - A Telugu [illegible]
of 19th Century by Gopinathamu Venkata Ka[illegible]

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 500 004.

ముద్రణ : 1987

ప్రతులు : 2000

వెల : రూ. 54/-

ప్రతులకు :
తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవన్, సైఫాబాదు,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
ది ప్రింటర్ (ఆఫ్‌సెట్)
నెం. 3-6-684/ఎస్,

# ప్రకాశక విజ్ఞప్తి

ఒక జాతి సంస్కృతికి దర్పణం ఆ జాతిసాహిత్యం. భిన్నత్వంలో ఏకత్వం భాసించే భారతీయసంస్కృతికి పలు భారతీయ భాషా సాహిత్యాలు భాష్యం చెప్పాయి. ఆ పలు భాషలలో తెలుగు భాష ఒక విశిష్టమైన స్థానాన్ని కలిగిఉంది.

అపారమైన చరిత్ర, సంస్కృతి కలిగిన తెలుగుజాతి ఆయా కాలాలలో వెలువడిన సాహిత్యాన్నంతా పరిరక్షించుకొంటూ తన సంస్కృతిని సుసంపన్నం చేసుకొంటూ వస్తున్నది. ఈ సంస్కృతి భాండాగారాన్ని ఒకతరం నుంచి మరోతరానికి అందించడానికి అంకిత భావంతో కొందరు వ్యక్తులు, కొన్ని సంస్థలు చేస్తున్న కృషి అనుస్యూతంగా సాగుతూ వస్తున్నది. అందుకే ఆ పెన్నిధిని మరింత పరిపుష్టంచేసి ఆగామి యుగాలకు అందించడం అవుతున్నది.

ఈ సంకల్పంతో శిల్పితమైన తెలుగు విశ్వ విద్యాలయం తెలుగు వారి చరిత్ర, సంస్కృతి సర్వతోముఖ వికాసానికి చేసే కృషిలో ఉత్తమ సాహిత్యాన్ని అందించడం అన్నది ఒక భాగం. ఆ ఆశయంతో ప్రకటితమైనది ప్రకృత గ్రంథం.

"మా నిషాద! ప్రతిష్ఠాం త్వమగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్."

శోకంలో నుంచి అప్రయత్నంగా వెలువడిన ఈ శ్లోకం భారతీయ సాహిత్య లోకంలో ఆదికావ్యమైన రామాయణం ఆవిర్భావానికి అంకురార్పణ గావించింది. వాక్య విశారదుడైన ఆదికవి వాల్మీకి సంస్కృతభాషలో రచించిన రామాయణం క్రమేణ దేశ భాష లన్నింటిలోకి అనూదితమై వివిధ సాహితీరూపాలలో అలరారింది. విశ్వ సాహితిలోని రామాయణ కథా సంవాది రచనలన్నింటికీ వాల్మీకి రచనమే మొదటి సంచి అని విజ్ఞుల విశ్వాసం.

ఆర్షధర్మబద్ధమైన భారతీయసంస్కృతికి ప్రతిబింబంగా నిలిచిన రామాయణం మన సమాజంలోని కట్టుబాట్లకు, సత్సంప్రదాయాలకు, జనజీవనసరళికి, ఆదర్శ కుటుంబానికి, ఆధ్యాత్మిక సంస్కృతికి, ఒక సువ్యవస్థకు, ఒక సుస్థిర రాజ్యపాలనకు సంకేతంగా సంభావిత మవుతున్నది గురు శిష్యుల సత్సంబంధానికి, తండ్రీ కొడుకుల ధర్మవత్స లతకు, అన్నదమ్ముల అనుబంధానికి, ఆలుమగల అనురాగానికి, స్నేహితుల సఖ్యతకు,

యజమానుడు అనుయాయుల భక్తి విశ్వాసాలకు, పాలక పాలితుల మధ్య నుండే సద్భావన, సదవగాహనలకు రామాయణంలోని ప్రతిపాత్ర ఏదో ఒక ప్రతీక. అందుకే రామాయణ కథాంశం అన్ని కాలాలలోను, అన్ని యుగాలలోను నిత్య నూతనమై నిలిచింది. పరమ పవిత్రమైన రామకథ ఎన్ని విధాలుగా కీర్తించినా, ఎన్నెన్ని రకాలుగా రచించినా తనివి తీరదనే భావన భారతీయులలో జీర్ణించుకొనిపోయింది

రామాయణం సంస్కృతభాషలో ఆదికావ్యమైనప్పటికీ తెలుగులో మాత్రం రామాయణం కంటే భారతమే ముందు వెలువడింది. అయినా రామాయణాన్ని తెలుగు కవులు నాటినుంచి నేటిదాకా పలువిధాలుగా ప్రవచిస్తూనే ఉన్నారు, ప్రపంచీకరిస్తూనే ఉన్నారు. పద్యం, గద్యం, ద్విపద, నాటకం వంటి బహు ప్రక్రియలలో తెలుగులో వెలువడిన రామాయణాలలో భాస్కర రామాయణం, రంగనాథ రామాయణం, మొల్ల రామాయణం, అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయం, తిక్కన నిర్వచనోత్తర రామాయణం, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణం, గోపీనాథ రామాయణం, వాసుదాసుల శ్రీమద్రామాయణం, జనమంచి వారి, విశ్వనాథ వారి శ్రీమద్రామాయణ కల్పవృక్షం వంటివి ప్రముఖంగా ఎన్నదగినవి.

తెలుగు రామాయణాలలో ఈనాడు గోపీనాథ రామాయణం దాదాపుగా అలభ్యమనే చెప్పాలి. 1923 లో వావిళ్ళవారు ప్రకటించిన తరువాత ఇది మళ్ళీ వెలుగుచూసినట్టులేదు. అందుకే రామాయణాన్ని నిత్య పారాయణం చేసే తెలుగు పాఠక లోకానికి ఈ గోపీనాథ రామాయణాన్ని అందించాలనే సంకల్పంతో దీనిని పునర్ముద్రించాం. మూలమైన వాల్మీకి రామాయణాన్ని అనుసరించి రాయబడడం గోపీనాథ రామాయణం ప్రత్యేకత. అందువల్ల సంస్కృత రామాయణంలోని కావ్య ఔచిత్యాన్ని తెలుగులో ఆవిష్కరింపజేసే ఈ గోపీనాథ రామాయణం సహృదయుల మన్ననలకు పాత్రమై, మా యత్నం సాఫల్యమొందగలదని భావిస్తున్నాం.

హైదరాబాదు,
8-8-1987.

ప్రకాశకులు
తెలుగు విశ్వ విద్యాలయం

# విషయసూచిక.

## కిష్కింధాకాండము.

| విషయము. | | పుట. |
| --- | --- | --- |

## సుందరకాండము.

| విషయము. | | పుట. |
|---|---|---|

**విషయసూచిక సమాప్తము.**

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# గోపీనాథ

# రామాయణము

## కిష్కింధాకాండము.

---



కైవల్యరమాధిప
రాకేందుసమానముఖ పురందరమకుటా
స్తోకానేకమణీశో
భాకీలితచరణ సత్యభామారమణా. 1

వ. దేవా యవధరింపుము కుశీలవు లగుకుశలవు లవ్వాలికథ యిట్లని చదువం దొడంగి
రట్లు రాముండు సౌమిత్రిసహితంబుగాఁ బద్మోత్పలఝషాకుల యగుపంపాపు
ష్కరిణి నధిగమించి మదనోద్దీపనకరంబు లగుతదీయసుషమావిశేషంబు లవలో
కించి కామశరనిపీడ్యమానమానసుండై లక్ష్మణున కిట్లనియె. 2

—రాముఁడు వసంతఋతువుం జూచి మన్మథాభితప్తుఁడై విలపించుట.—

క. విలసితతరుశోభితయై, సలలితవైడూర్యవర్ణసతిలాగ్రనట
జ్జలజోత్పలయుతయై రా. జిలుచున్నది కంటె పంప చిరశుభలీలన్. 3

తే. ఎచటశిఖరాన్వితము లై నపృథునగంబు,లట్ల యుచ్ఛ్రితతరువు లొప్పారుచుండు
నట్టిపంపాసరోవరప్రాంతచిత్ర, వనము శోభిలుచున్నది యనఘ కంటె. 4

తే. భరతు నెడఁ బాసి సతిని గోల్పడి దురంత,దుఃఖభారంబుచే స్రుక్కి తూలుచున్న
నన్నిచటఁ జాలఁ బీడించుచున్నవాని,మాడ్కి వర్తించుచున్నాఁడు మాధవుండు.

చ. వివిధసుమోపశోభితయు విశ్రుతకీర్తియు శీతవారియు
న్నవజలజాతయుక్తయును నాగమృగద్విజజుష్టయు న్విచి
త్రవనయు నైనపంప పరితాపమునం దపియించుచున్న నా
కవిరళసమ్మదం బహరహం బొనగూర్చుచు నున్న దెంతయున్. 6

తే. శాడ్వలం బిదె శిఖిగలచ్ఛాయ గలిగి, వివిధపాదపకుసుమసంవీత మగుచు
ఘనపరిస్తోమములచేతఁ గప్పఁబడిన, యట్ల శోభిల్లుచున్నది యనఘ కంటె. 7

తే. ప్రసవభారసమృద్ధస్ఫురన్మహీరు, హాగ్రములు పుష్పితాగ్రలతాభివృతము
లగుచుఁ గాంతాపరిష్వక్తు లైననరుల, కరణి శోభిల్లుచున్నవి కంటె నన్న. 8

తే. జాతపుష్పఫలద్రుమోపేతయగుట, నిదిసురభిమాస మిక్కాల మింపు మెఱయ
గంధవంతమై మదనవికారహేతు, వై సుఖానిలమై యున్న దనఘ కంటె. 9

తే. తోయదంబులు పరిమళతోయమట్ల, పుష్పవర్షంబుఁ గురియుచు భూరిభూరు
హోత్కరలతాభియుతములై యొప్పుచున్న, వమలచరిత వనస్వరూపములు కంటె.

క. వివిధవనభూజములు గం,ధవాహచలితంబు లగుచు ధారుణియందుం
బ్రవిమలశిలలందును విరు, లవిరళగతిఁ గురియుచున్న వంతటఁ గంటే. 11

తే. పడినవియుఁ బడుచున్నవి పాదపస్థి,తములు నగుసుమములచేతఁ దగఁ బవనుఁడు
వేడ్కమెయిఁబట్టియాడెడువిధముతోఁచెఁ,జూచితే కాననములందు సూరివినుత.

క. మానితపుష్పితతరుశా, ఖానిచయంబులఁ గదల్చి గాడ్పు ప్రచలిత
స్థానము లగు తేఁటులచే, మానుగ నొప్పారె గీయమానుఁడుఁ బోలెన్. 18

క. గిరికందరములు వెలువడి, పరభృతసంగీతనాదపద్ధతికిఁ దగం
దరువులపైఁ బవమానుఁడు, సరసంబుగ నాడుచున్న చందము దోఁచెన్. 14

తే. అట్టిపవనునిచేత నీయడవిలోని, విటపివిటపాగ్రనిచయ మొక్కటికి నొకటి
పెనుచుకొని ముడివీడక తనరుచున్న, వనఘ కంటివె రమ్యవనాంతరమున. 15

తే. మఱియు నిమ్మ్యోడఁడమ్మిక్రొవ్విరులతావి,సంగ్రహించుచుమార్గజశ్రమమువాయ
సరసితరఁగలపై నుండి చల్లగాలి, విసరుచున్నది సంతోష మెసఁగఁ గంటె 16

క. అనిలరయోత్క్షిప్తములై, ఘనతరువులు మధుపగీతకలన న్మధువా
సన నుల్లసిల్లు వనముల, ననఘా ధ్వనిసేయుచున్నయట్లు చెలఁగెడిన్. 17

వ. మఱియు రమ్యప్రస్థసంజాతపుష్పితద్రుమంబులచేతఁబరస్పరసంశ్లిష్టాగ్రంబులై యిచ్చటఁ బర్వతంబులు మహోన్నతంబులై నపుష్పరాసులచందంబున నందం బగుచున్నవి యిచ్చటఁ బాదపంబులు పుష్పసంఛన్నశిఖరంబులై మారుతోత్క్షేప చంచలంబులై మధుకరోత్తంసంబులై గీతంబుఁ బాడుచున్నచందంబునం జూపట్టుచున్నవి విలోకింపుము

తే. కుసుమితము లైనయీకొండగోఁగుమ్రాఁకు 18
లంతటఁ జెలంగుచున్న వత్యద్భుతముగ

జాతరూపభూషణములు పీతచేల
ములు ధరించినపురుషులుఁబోలెఁ గంటె 19

చ. అనఘసతీవియోగజనితార్తిఁ దపించెడునాకు శోకదీ
పనకర మీ వసంత మిది బంధురతచ్ఛుకశారికార్భటు
ల్తనరెడు మన్మథుండు నిశితప్రదరంబుల నేఁచుచున్నవాఁ
డనుపమభంగిఁ బైకము కలార్భటి నన్బిలువం దొడంగెడిన్. 20

తే. అంగజాస్త్రాభివిద్ధుండ నైననాకు, రమ్యకాననిర్ఝరరాజియందుఁ
దాప మధికంబు సేయుచు నేపుమీఱఁ, గూయుచున్నవి యీవారికుక్కుటములు.

క. పన్నుగ నాశ్రమపదమున, మున్నీకుక్కుటరవంబు భూసుత విని తా
నన్నుఁ బిలిచి సంతోషా,భ్యున్నతయై కూడి యాడుచుండుం గాదే. 22

వ. మఱియు నిచ్చటిఖగంబులు విచిత్రపత్రంబులై భృంగరాజప్రముదితంబులై నానావిధమధురస్వరయుక్తంబులై యాత్మీయవ్యూహాభినందితంబులై పురుష విహంగంబులం గూడి వృక్షగుల్మలతాప్రతానంబులమీఁద వ్రాలుచున్నవి విలోకింపు మీపుష్కరిణీతీరంబునం గలవృక్షంబులు నత్యూహకృతశబ్దంబుల చేతఁ బుంస్కోకిలరుతంబులచేత ననంగప్రదీపనంబులై ధ్వనిసేయుచున్నవాని పోలికఁ జూపట్టుచున్న వదియునుంగాక. 23

క. ఏలాలతావృతములై, కూలంబునఁ జూతతరులు కోకిలశుకవా
చాలత వియోగి నగు న,న్నోలగమున నవ్వి తెగడుచున్నవి కంటే. 24

క. తరుపల్లవ హేతియు నళి, గురురవనిస్వనుఁ డశోకకుసుమాంగార
స్ఫురణుఁ డగువసంతానలుఁ, డురుగతి నన్నేర్చఁ దొడఁగెనుజ్జ్వలుఁ డగుచున్.

క. మృదుభాషిణిని సుకేశిని, సదమలగుణవతిని పరమసాధ్వి నళికచ
న్ముదిత నెడఁబాసి ధర మా,నద బ్రతుకుట నిష్ప్రయోజనం బగుఁ గాదే. 26

క. సముదంచితరుచిరార,ణ్యము నభినవరమ్యకోకిలాకులసీమాం
తము నగునీఘనవనము,సయము మత్ప్రియకరయఁగడుఁ బ్రియంబై యుండున్.

క. మారాయాసప్రభవము, వారక వరసురభిగుణవివర్ధిత మగునీ
దారుణశోకాగ్ని నను, న్గాఱియపెట్టంగఁ దొణఁగె ఘనగుణశాలీ. 28

తే. సీత నెడఁబాసి యీమహీజాతములను, బన్నుగా విలోకించుచు నున్నకతన
ననఘచారిత్ర మన్మథుఁ డంత కంత, కధికుఁడై యేర్చుచున్నవాఁ డనఘచరిత.

తే. మనుకులోత్తమ పరిదృశ్యమానుఁడైన, స్వేదసంసర్గశామకాంచితవసంతుఁ
డరయఁగ నదృశ్యమానయైనట్టిసీత, యును మనోవ్యథఁ గావించుచున్నవారు.

తే. రాజసుత క్రూరుఁడైన చైత్రవనపవనుఁ, డవనివిరహులకంతకుం డగుసుధుండు
నన్నిపుడు కడునేర్చుచు నున్నవారు, జానకీశోకసంతప్యమానచిత్తు. 31

క. స్ఫటికగవాక్షప్రతిమ, స్ఫుటపింఛము లనిలవేగమున విచ్చి శిఖు

ల్నటియించుచున్న వెంతయుఁ, జటులగతిం గంటె నరసిసామీప్యమునన్. 32

క. మదమూర్ఛితంబులై యివి, ముదితలతోఁ గూడి కామమున రంజిలుచు
న్మదనవశగతుఁడ నగుననుఁ, బదపడి బాధింప సాగె భవ్యగుణాఢ్యా. 33

తే. అచలసానువులందు నృత్యంబు సేయు,విభునిఁ గనుఁగొని మన్మథావిష్టయగుచు
శిఖిని యిది తాను నృత్యంబు సేయుచున్న, దనుసరించి విలోకింపు మనఘచరిత.

తే. అట్లు నృత్యంబు గావించునట్టిశిఖినిఁ, గన్గొని శిఖండి రుచిరపక్షములు విచ్చి
విపులరుతముల ననుఁ జూచి యపహసించు,చున్నదానివిధంబున నున్నదిపుడు.

క. వనమున నీశిఖితన్విని, దనుజుం డెత్తికొనిపోక తక్కినకతన
న్వినుమీ మయూరమునకును, జననుతభార్యాభియోగసౌఖ్యము గలిగెన్.

తే. జనవరకుమార యీపుష్పసమయమందు, నాతి నెడఁబాసియుండుట నాకుఁ జాల
దుష్కరంబగుచున్నది తోడరి పక్షి, జాతులందును రాగ మీరీతినుండు. 37

చ. తరణికులేంద్ర దానవుఁడు ధారుణిజం గొనిపోక యున్న రా
గరస మెలర్ప నీశిఖిని కాంతునిఁ గూడి సుఖించినట్ల యా
సరసిజనేత్ర పర్వతవిశాలవనంబుల వల్లికాగృహో
త్కరముల నన్నుఁ గూడి సతతంబు సుఖించుచు నుండు నేకదా. 38

తే. లక్ష్మణా యీవసంతకాలంబునందుఁ, జాల సమ్మోద మొనగూర్పఁ జాలినట్టి
యీప్రసూనంబు లీతరు లీవనంబు, లీచఖులు నిష్ఫలంబులై తోఁచె నాకు. 39

క. అనఘా యీసుమములు శో,భనతరచేతోహరప్రభారుచిరము ల
య్యును నిష్ఫలంబులై మే,దినిఁ బడుచున్నయవి కంటె తేంట్లు రొదలిడన్. 40

క. కనుఁగొంటె శకునసంఘము, లనంగ మదవర్ధనంబులై మధురరవం
బొనరించెడు నన్యోన్యం, బును బిల్చుచు నున్నవానిపోలిక ననఘా. 41

క. ఈశుకము లీమయూరము, లీశారిక లీపికంబు లెంతయు నన్నుం
గాసిపడఁ జేయుచున్నవి, లేశము కృప లేక సీత లేనికతమునన్. 42

ఉ. కాయజుఁ డంబుజాస్త్రములఁ గైకొని మాటికి నేయఁ గోయిల
ల్మ్రోయ శిఖుల్ నటింప నవకోమలకైరవపుష్పగంధియై
వాయువు వీవ నేగతి నివాస మొనర్చెద నివ్వనంబునం
దా యెలనాగఁ బాసి కుసుమాకర మీగతి గాసి సేయఁగన్. 43

తే. ఈమొగడ లీఫలంబులు నీసుమంబు, లీననలు నీవసంతమందానిలంబు
నామదికి వేడ్క సేయకున్నవి కుమార,యువతి నెడఁబాసి యొంటిగ నున్నకతన.

క. మారోన్మాదకరము లగు,శారిక లటు గుంపుగూడి సమనాదముల
న్వారక యుత్తరోత్తరమును, జీరుకొనుచు నున్నభంగిఁ జెలఁగెడి మ్రోలన్. 45

చ. ఇనకులవర్య సీత వసియించినచోట వసంత మేనియు
న్ఘనతరమన్మథవ్యసనకారణమైన తదీయవైఖరు

ల్గనుఁగొని పారవశ్యమున గాసిలి నన్ను మదిం దలంచి నా
యనువునఁ జాల మారజనితార్తికి లోఁబడుఁ గాదె లక్ష్మణా. 46

తే. సరసిజానన యున్న దేశంబునందుఁ, గంతు సంతాపకరుఁడు వసంతుఁ డేల
యుండు నట్లుండెనేని నయ్యుత్పలాక్షి, యెంటిమెయి నెత్తెఱంగున నుండఁగలదు.

ఆ. అతివ యున్న దేశమందు నిక్కంబుగ, నీవసంతుఁ డుండెనేని యేమి
సేయఁ గలదు పరులచేఁ జిక్కి యున్నచో, నతివఁ దలఁచుకొనిన నడలుగదుర.

తే. ఆసరోజాక్షి యాశ్యామ యాలతాంగి, యామధురమంజుభాషిణి యామృగాక్షి
నిక్కము వసంతుబారికిఁ జిక్కెనేని, వెతలఁ గుందుచుఁ బ్రాణంబు విడువఁగలదు.

తే. పరమసాధ్వియు సతియు మద్విరహశోక, తప్తయును గాననను బాసి ధైర్యమూఁది
సారసేక్షణ జీవింపఁ జాల దనుచు, నామనంబునఁ దోఁచెడు నయచరిత్ర. 50

తే. ఏను ధీరుండ నగుట నొక్కింత బుద్ధిఁ, దాల్మిఁ బూనితి మరుని చెయ్దములకోర్చి
భూమిసుత గోల యగుట నాపొందు విడిచి, తెంపు సేయక యెట్లు వర్తింపనేర్చు.

తే. పురుషశార్దూల నాయందు భూమిపుత్త్రి, భావము నిరంతరం బెడఁబాయకుండు
నట్ల యద్దేవియందు ననన్యమగుచు, నాదుభావంబు వర్తించుఁగాదె యెపుడు.

ఆ. వనజముఖిని గూడి వర్తించునాఁ డెవ్వఁ, డధికసౌఖ్యకారి యైతనర్చె
నట్టిపవనుఁ డిప్పు డాసతి లేకుంటఁ, జేసి కాల్పఁ దొడఁగె జిచ్చుఁబోలి. 53

తే. ఈవసంతానిలుండు మహీకుమారిఁ, గూడి యున్నచో నామీఁదఁ గూర్మి నెఱపి
విరులతావులు పైసోఁక వీచుచుండు, నట్టివాఁ డెంత యపకారి యయ్యె నేఁడు.

చ. అని బహుభంగులన్ రఘుకులాగ్రణి రాముఁడు మన్మథార్తుఁడై
జనకసుతం దలంచుకొని సారెకుఁ బెక్కుతలంపు లూరఁగాఁ
దనమది నుమ్మలించుచుఁ బదంపడి లక్ష్మణుతోడ నిట్లను
ఘనతరమన్మథవ్యసనకారణమైనవనంబుఁ జూచుచున్. 55

క. మును గౌతమీతటంబున, జనకజతోఁ గూడి యున్నసమయంబునఁ దా
వినువీధిఁ జనుచు నీఖగ, మనఘా ననుఁ గాంచి పరుష మాడెం బెలుచన్. 56

క. అమలగుణాకర యిక్ష్వాకకము నేఁ డిటు మరల సౌమ్యగతిఁ గొని యీవృ
క్షముమీఁద నుండి కడుహ, ర్షమున న్మృదునిస్వనంబు సలిపెడుఁ గంటే. 57

వ. వత్సా యీఖగంబు తొల్లి యాకాశంబున నుండి క్రూరనాదంబు సేయు టది
సీతావియోగసూచకంబై యిప్పుడు వృక్షాగ్రంబున నుండి హర్షనాదంబు
సేయు టది క్రమ్మఱ సీతాసంశ్లేషసూచకంబై యున్నది గావునఁ దొల్లి జన
స్థానంబున సీతాప్రతిహారకంబైనయీఖగం బిప్పుడు నన్ను సీతాసమీపంబు
నొందించు నని యూహించెద. 58

తే. కుసుమితాగ్రంబు లగుమ్రానికొమ్మలందు
మధురముగఁ గూయుచున్నయీమత్తవిహగ

నిస్స్వనంబుల వింటివె నృపకుమార
ప్రసవశరునిగుణారవార్భటులుఁ బోలె. 59

తే. ఘనమదోద్ధూత యగుప్రౌఢ గజితనల్ల, మారుతోద్ధూత మైనశృంగారతిలక
మంజరినిగూడి యున్నయీయుత్తమధుప, రాజమును బోలఁజూచితె రాజపుత్ర.

క. విరహులకు శోకవర్ధన, కర మైనయశోకతరువుఁ గంటె నను సమీ
రరయోత్థిప్రస్తబకో, త్కరములఁ దర్జించుచున్నకరణి నలరెడిన్. 61

క. కుసుమితవిటపాగ్రము లగు, రసాలధరణీరుహములు రాజిలుఁ గంటే
లసదంగరాగమహిమో, ల్లసితు లయినసరులమాడ్కి లక్ష్మణ మ్రోలన్. 62

క. చూచితె లక్ష్మణ యీపం, పాచిత్రవనంబులందు భావజకేళీ
ప్రాచుర్యంబున నలరెడు, ఖేచరసురసిద్ధసాధ్యకిన్నరతతులన్. 63

క. పరిమళయుక్తము లగునీ, సరసిజములు పుష్పగంధి సలిలంబులపైఁ
దరుణాదిత్యునివైఖరిఁ, గర మొప్పుచు నున్న నవఘ కనుఁగొంటె రహిన్. 64

వ. మఱియు నిమ్మహాపుష్కరిణి ప్రసన్నసలిలయై పద్మనీలోత్పలయుతయై హంస
కారండవాకీర్ణయై సౌగంధికసమన్వితయై తరుణసూర్యప్రతీకాశమట్పదాహత
కింజల్కపుంజరంజితకంజాతశోభితయై చిత్రప్రస్థవనాంతరయైచక్రవాకోపశోభి
తయై సలిలార్థిమాతంగమృగయూథవిరాజితయై యొప్పుచున్నది విలోకింపుము.

ఆ. క్రౌంచచక్రవాకకారండవబలాక, హంసముఖ్యజలవిహంగమములు
భంగడోలికాభిసంగతి నూఁగుచు, నెసఁగుచున్న వక్షి కింపు గాఁగ. 66

ఆ. పవనవేగచలితబంధురకల్లోల, తాడ్యమాననవ్యతామరసము
లనఘచరిత కంటె జనకకుమారిక, కన్నులట్ల క్రాలుచున్న విపుడు. 67

తే. పద్మకేసరవర్ణిని పద్మగంధి, పద్మపత్రవిశాలాక్షి పద్మహస్త
క్షితికుమారిక లేనిచో జీవితంబు, వ్యర్థ మని తోఁచుచున్న దవార్యచరిత. 68

తే. దూరదేశస్థయును గడుదుర్లభయును, మధురభాషిణి యగుసీత మరల నిపుడు
సంస్మరింపంగఁ జేసె నీసరసిజాస్త్రుఁ, డితనికౌటిల్య మేమని యెన్నవచ్చు. 69

తే. వీరశేఖర పుష్పితవృక్షుఁ డైన, యీవసంతుఁడు మిగుల నన్నేఁచఁ డేని
పరఁగ నభ్యాగతుం డైనమునిబాధ, కోర్చి యేచందమున నైన నుండవచ్చు.

క. తొయ్యలినిఁ గూడి యున్నపు, డెయ్యవి హృద్యంబు లగుచు నెసఁగుచునుండుం
దొయ్యలి లేనికతంబున, నియ్యెడ నవి యెల్లఁ జాల హేయము లయ్యెన్. 11

తే. నీలకుంతల యగుసీత నేత్రకోశ, సన్నిభము లని నాదృష్టి సంభ్రమమునఁ
జూడఁ గోరెడు సారెకు శుభచరిత్ర, లలితనవపద్మకోశపలాశములను. 72

తే. అబ్జకేసరసంస్పృష్టుఁ డై సుగంధ్య, నోకహాంతరనిర్గతుం డై కరువలి
సీతనిశ్వాసపవనంబురీతి హృద్య, మగుచు వీచెడుఁ గంటివె యలఘుచరిత.

క. వారక పంపాదక్షిణ, తీరంబున శైలసానుదేశములందుఁ

భూరిసుమద్యుతితోఁ నల, రారెడు నదె కర్ణికారయష్టిని గంటే. 74

క. అతులితబహుధాతుసమన్విత మగునీధరము వాయు వేగాతిశయో
త్థిత మగువిచిత్రరజమును, జితవిసుతా సాంద్రభ్రుగ సృజించెడుఁ గంటే. 75

క. సురుచిరపుష్పితనిమ్న, త్ర రమ్యకింశుకతరుప్రతానంబుల నీ
గిరిసానువు లొప్పారెడుఁ, గర ముజ్జ్వలితంబు లైనకై వడిఁ గంటే. 76

వ. మఱియుఁ బంపాతీరనముద్భూతమాలతీమల్లికాకరవీర కేతకీసింధువారవాసంతికామాధవీకుంద గుల్మచిరిబిల్వమధూకవకుళవంజుళ చంపకతిలకనాగవృక్షనీపవరణఖర్జూర పద్మక నీలాశోకలోధ్రాంకోలకురంటక పూర్ణకపారిభద్రకచూతపాటలకోవిదారముచుళిందార్జున కేతకోద్దాలకశిరీషశింశుపాధవ శాల్మలీకింశుకకురవకతిమిశన క్తమాలచందనస్పందనప్రముఖనిఖిలతరులతాప్రతానంబులు పుష్పితాగ్రంబులై గంధవంతంబులై మనోహరంబులై నానావర్ణంబులై మహోన్నతంబులై చూపట్టుచున్నవి విలోకింపుము. 77

క. అనిలచలితవిటపము లగు, ఘనతరసన్నిహితవృక్షగణములను గరం
బనువ ర్తించుచు నున్నవి, మునుకొని లత లబ్జముఖులు పురుషులఁ బోలెన్. 78

తే. ప్రతివనంబును బ్రతిపాదపంబు బ్రతిన
గంబు తిరుగుచుఁ బవనుండు కర మనేక
మధురసాస్వాదుఁ డగుటఁ బ్రమదము నొంది
యున్నచందాన నిటు వీచు చున్నవాఁడు. 79

వ. మఱియుఁ గొన్ని తరువు లీషద్వికసితకుసుమంబులై కొన్నిపాదపంబులు ముకుళసంవీతంబులై వృంతపర్ణబాహుళ్యంబున శ్యామంబులై ప్రకాశించుచున్నవి విలోకింపుము. 80

మ. అదె చంచన్మకరందలుబ్ధమధుపం బత్యంతరాగంబుతోఁ
నిది మృష్టం బిది వాసితం బిది మహోహృద్యం బటంచుర్ రసా
స్పదపుష్పంబులమీఁద నుండి పరపుష్పశ్రేణిపై వ్రాలు చు
న్నది యీయాముంగలివృక్షషండములలోనం గంటె వీరో త్తమా. 81

వ. మఱియు నిచ్చట వసుంధర తమయంతం దాము రాలి పడిననానావిధరుచిరకుసుమసంఘాతపరిస్తీర్ణయై శయనా స్తరణపరిస్తీర్ణయైనదానియట్ల సుఖావహాకృతినై యొప్పుచున్నది యిచ్చటిగిరిసానువులందు విశీర్ణంబులై నవివిధపుష్పంబుల చేత నభిసంవృతంబులై వివిధప్ర స్తరంబులు పీతర క్తంబులుగా రచియింపంబడినవానిచందంబునం జూపట్టు చున్నయవిహిమాంతంబునందలివృక్షంబులకుసుమసంభవంబు వీక్షింపుము పుష్పమానంబునందుఁ బరస్పరస్పర్ధవలనం దరువులు పుష్పితంబు లైనవానిమాడ్కి నుత్ప్రేక్షింపం దగియున్నవి మఱియుఁ గుసుమో త్తంసవిటపంబు లగుమఱికొన్ని పాదపంబులు భ్రమరనాదమిషంబున నొండొంటిం జీరుచున్నవానియట్ల యులరుచున్న వదియునుం గాక, 82

శా. నాకు న్మోహముఁ బుట్టఁ జేయుచు మహానందానురాగంబుతో
నీకారండవ మంగనాయుతముగా నీనీటిలోఁ జొచ్చి య
స్తోకాంభోరుహషండమండలములందుం గ్రీడఁ గావించె నీ
వాకర్ణింపుము తత్కలస్వనము సొంపారంగ వీతెంచెడిన్. 88

తే. ఇనకులోత్తమ విను మిట్టి హ్రస్వరూప, మెలమి మందాకినికిఁ గల్గె నేని జగతి
నధికవిఖ్యాతదృష్టిచిత్తాపహారి, గుణము లన్నియు దానికిఁ గూర్పవచ్చు. 89

తే. ఇట్టిరమ్యవనంబున నిట్టివేళ, నుత్పలేక్షణ నాయొద్ద నుండె నేని
యుష్ణకరవంశతిలక యయోధ్యనైన, నింద్రపదమైనఁ దృణముగా నెంచఁగాదె.

ఉ. ఆమదిరాయతాక్షి జనకాధిపనందినిఁ గూడి యిచ్చట
న్గోమలశాడ్వలంబుల నికుంజముల న్విహరింపఁ గల్గిన
న్దామరసాసనాదులపదంబులలోఁ గలసౌఖ్య మైనచో
నామది కించు కైన నరనాథతనూజ ప్రియంబు సేయునే. 86

క. ఈకాననమున వివిధానోకహములఁ జూడు మతిమనోహరభంగి
న్నాకుం జిత్తభ్రమణం, బీకరణి నొనర్చుచున్న విపుడు కుమారా. 87

తే. అనఘ రమ్యాద్రిగిరిసానులందు మోహ,ములరఁ గ్రీడింపుమృగసంతతులనుజనక
కన్య నెడఁబాసిమిగులదుఃఖమునఁగుందు,చున్ననన్నువిలోకింపుముగుణాఢ్య.

క. ఈరమ్యతరులు కుసుమము, లీరాజితపల్లవంబు లీనరసులు నా
కేరీతిఁ బ్రియ మొనర్చును, నీరజదళనేత్ర నెనను నిల్పిన దాఁకన్. 89

సీ. శుకవాణిమెయితావి సోఁకినప్పుడు గదా యీమందపవమానుఁ డింపొనర్చుఁ
గలకంఠికనుదోయిఁ గాంచినప్పుడు గదా యీపద్మపత్రంబు లింపొనర్చు
సుందరిచనుదోయిఁ జూచినప్పుడు గదా యీచక్రవాకంబు లింపొనర్చు
మదిరాక్షి కెమ్మోవి గదిసినప్పుడు గదా యీజపాకుసుమంబు లింపొనర్చు

తే. జలదవేణికతోఁ గూడి వలసినట్టు, లనుదినంబును విహరించునప్పుడు గద
యిచటివస్తువు లన్నియు నింపొనర్చుఁ, గానిచో దుఃఖకరములు గావె నాకు.

వ. మఱియు నీపుష్కరిణి సుశీతలస్వాదుసలిలయై సంఫుల్లహల్లకపద్మకైరవాలంకృతయై చక్రవాకానుచరితయై కారండవనిషేవితయై క్రౌంచప్లవసంపూర్ణయై వరాహమృగసేవితయై కలస్వనంబులు సేయువివిధముదితవిహంగచయంబులచేత నభిసంవృతయై నాకుఁ గామోద్దీపనంబు సేయుచు నదృష్టపూర్వశోభావిశేషంబున నతిరమణీయంబై ప్రకాశించుచున్నది విలోకింపుము 91

తే. పద్మనేత్రయు శ్యామయు భద్రకరటి, యానయు వినీలవేణియు నగుధరిత్రి
కన్యకను బాసి మేననేకరణి నిపుడు,ప్రాణములు దాల్చి యుందు భూపాలతనయ.

చ. క్షితివరపుత్ర ముంగల విచిత్రవిశాలమహీరుహాభిశో
భితగిరిసానుదేశములఁ బ్రీతి దలిర్ప మృగంబు లంగనా

యుతముగ వేడుక ల్సలుపుచున్నవి కంటివె దుఃఖితుండనై
ధృతి చెడి యున్ననాకు వలజేని వికారము గల్గఁజేయుచున్. 93

తే. దశరథకుమార చిత్రపతత్రికలిత, మైన యీరమ్యపర్వతసానువందు
భామినీమణి నాకుఁ గన్పట్టెనేని, యవల నాచిత్తమునకు స్వాస్థ్యంబు గలుగు.

క. రవికులవర్ధన యిప్పుడు, ధవళేక్షణ నన్నుఁ గూడి తప్పక పంపా
పవనను మగంధబంధుర, పవనుని సేవించెనేని బ్రదుకుదుఁ గాదే. 95

తే. పద్మసౌగంధికయుతుండు పావనుండు, శోకనాశనుఁ డత్యంతసుఖకరుండు
నైనపంపాపవనపవమానుసేవ, దొరకొనుట యెట్టివారికి దుర్లభంబు. 96

క. అనఘుఁడు ధర్మవిచారుఁడు, జననాథుఁడు సత్యరతుఁడు జనకుఁడు కృపతో
ననజాక్షి సేమ మడిగిన, ననఘా యేమందు నమ్మహాత్మునితోడన్. 97

తే. తండ్రిపంపున రాజ్యంబు ధనము విడిచి, యడవి కరుదెంచుచున్న నన్ననుసరించి
వచ్చునే దేవి యడవికి వదలఁ గట్టి, రమణి లేకున్న నేగతి బ్రతుకువాఁడ. 98

క. జలజాతనేత్ర మవ్రణ, మలకాభివిరాజితంబు నగు తన్ముఖమున్
జెలువలరఁ జూడకుండుట, వలన న్నామనము దుఃఖభాజన మయ్యెన్. 99

క. స్మితహాస్యాంతరయుతమును, హిత మతులము మధుర మమృతహితమగు ధాత్రీ
సుతవాక్య మింక నెన్నఁడు, వితతగుణా వీను లలర విన నగు నాకున్. 100

ఉ. ఒక్కొకవేళ మన్మథశరోద్ధతి స్రుక్కెడునన్నుఁ జూచి దా
నెక్కుడు శ్రాంత యయ్యు హృదయేశ్వర యేల కృశించె దీవటం
చొక్కటఁ గౌఁగిలించి మధురోక్తుల నెవ్వగఁ దీర్చుచుండు నేఁ
డెక్కడ కేఁగె నట్టి హృదయేశ్వరి నన్నిటఁ బాసి లక్ష్మణా. 101

తే. సీత యెచ్చట నున్నది చెప్పు మనుచు, నడుగఁ గౌసల్యతోడ నేమందు నింక
దేవి పోయిన తెరువునఁ బోవువాఁడ, ననఘ భరతుని జూడ నీవరుగు మిపుడు.

చ. అని బహుభంగుల న్సముదితార్తరవంబునఁ దత్తఱించుచు
న్వననిధియందుఁ దొట్రుపడునావవిధంబున శోకపారము
న్గనుఁగొన లేక పుష్పశయనంబున దీనత వ్రాలియున్నయ
న్నను గని లక్ష్మణుం డనియె నవ్యసుధామయమంజులోక్తులన్. 103

—శ్రీరాముని లక్ష్మణుఁ డూరడించుట.—

తే. ఘనతరం బగువాయువేగంబుచేతఁ, గిన్నరిని గూర్చి విలపించుకిన్నరుండుఁ
బోలె దేవరూపంబుచేఁ బురుషవర్య, మిగుల సీత నుద్దేశించి వగచె దీవు. 104

తే. అట్టిలావణ్యవతిఁ బాసినట్టిచోట, శోకము జనించుటకు నేమిచోద్య మధిప
సర్వముఁ బరిత్యజించి నిసర్గధర్మ, మరసి సేవించు టది శాస్త్రసరణి కాదె. 105

క. అనఘాత్మ ధర్మరతుఁ డగు, జనునకు దుర్లభము లేదు జగతి నొకింతై
నను స్థిరచిత్తుని ధర్మం, బున కెన్నఁడు నొక్కహాని పుట్టదు తలఁపన్. 106

క. సూరిజనవినుత ధారుణి, ధీరుఁడు తగ వృద్ధి నొందుధీగుఁ డధికుఁ డౌ
ధీరునకు సర్వకార్యము, లారూఢిం గూడి వచ్చు ననవరతంబున్. 107

తే. అనఘ నీయట్టికాలపర్యాయకోవిదుండు ధీరుండు సంప్రాప్తదుఃఖములకుఁ
దలఁకక సహించి యుండు నుదగ్రవాత, వేగమున కద్రి తలఁకనివిధముతోఁప.

ఆ. శక్రతుల్యవీర్యసంప్రాప్తదుఃఖంబు, నవలఁ ద్రోయఁజాల కనవరతము
వంత నొందు టెల్ల స్వల్పశేముషీ. మైన, నీచుగుణము గాక నీగుణంబె. 109

చ. కరగతరాజ్య మంచితసుఖం బతిమానుషభోగవైభవో
త్కరముఁ బరిత్యజించి ఘనతాపసవేషముఁ దాల్చి కానక
ట్లరుదుగ నేఁగుదెంచినమహాత్ముఁడ వీవు నరేంద్ర నీచకా
పురుషునిమాడ్కి ధైర్యమటు పోనిడి మోహము నొందఁ జెల్లునే. 110

క. అలఘుచరిత్ర వివేకము. గలపురుషుఁడు లోభమోహకామాదిగుణం
బుల నాఁగి పట్టుఁ బ్రజ్ఞాబలమున సూతుండు హరులఁ బట్టినమాడ్కిన్. 111

తే. మానవేశ్వర నీవు సుజ్ఞాననిధివి, ధైర్యసంయుక్తుఁడవు ప్రమాద్యంబు లైన
విషయములయందు హృదభినివేశనంబుఁ, జేసి యిభ్భంగి శోకింపఁ జెల్లనయ్య.

వ. మహాత్మా నీవు మహానుభావుండవు మహనీయశుభచరిత్రుండవు దివ్యబోధప్ర
భావుండవు నాయట్టియజ్ఞానికి వివేకంబుఁ దెలుపునట్టివిచక్షణుండవు ప్రకృతి
జనంబులభంగిఁ గామాదివికారంబులం బరిభ్రమింప నర్హుండవుగావు తొల్లింటి
తాల్మి వహింపుము వనవాసంబు నిర్వర్తించి భార్యాపహారకుం డగుపగతునిం
బరిమార్చి వైదేహిం జేకొని క్రమ్మఱ నయోధ్యకుం జని యందు మహోన్నతం
బైనసామ్రాజ్యంబు పరిపాలించుచు మత్సహాయుండవై సుఖంపుము పరాక్రమ
ధుర్యుండ వైననీకు విప్రకారంబుఁ గావించినదురాత్మున కంతకాలంబు డగ్గ
ఱియె నంతె కాక బ్రతుకం గలఁడే యని పలికి లక్ష్మణుం డన్నరపతిచిత్తంబు
ధైర్యాయత్తంబు గాకునికి విచారించి వెండియు ని ట్లనియె 113

సీ. అమలాత్మ నీప్రభావము నీ వెఱుంగక శోకించె దిట్లేల సూరవసుల
కింతదైన్యము చెల్లునే సతీవిరహజనితదుఃఖమున నామతము వినవు
క్షితినమార్ద్రియు నతిస్నేహసంబంధమువలన దహింపంగఁబడును వర్తి
గావునఁ దద్వియోగజదుఃఖముఁ దలంచి విడు మతిస్నేహంబుప్రియులయందు
తే. సీతతోఁ గూడ పాతాళసీమయందు, దితిజజఠరమందు డాఁగిన నతిరయమున
దితిజు వధియించి సీతను దెచ్చి యిత్తు, వీరశేఖర దైన్యంబు విడువు మింక. 114

శ్రీరాముఁడు శోకమోహంబు లుడిగి లక్ష్మణసహితముగా సుగ్రీవునిం జేరఁబోవుట.

వ. దేవా శోకంబు సకలార్థనాశనకారణంబు గావునఁ గార్యార్థి యగువానికి శో
కంబు కొఱగాదు నీయట్టిమహాత్మున కిట్టిమందబుద్ధి దొరకొనినమముబోంట్లకెల్ల
నేమియగు నష్టకార్యహాపప్రయోజను లగుపురుషుల కర్థంబు ప్రయత్నంబునం

గాని యధిగమింపం బడ దుత్సాహంబునకంటె నొండు బలంబు లేదుత్సాహ
వంతునకు లోకంబున దుర్లభం బెద్దియు లే దుత్సాహవంతు లగుపురుషులు
కర్మంబులందు విషాదంబు నొందరు మన ముత్సాహమాత్రంబు నాశ్రయించి
జానకిం బడయుదము శిక్షితాంతఃకరణునిం గా బరమాత్మునిగా నిన్ను నీవెఱింగి
కామవృత్తత్వంబుం బరిత్యజించి శోకంబుం బిఱిందికిం ద్రోచి యుత్సాహసంప
న్నుండవై యుండు మని బోధించిన లక్ష్మణునివాక్యంబులం దేఱి రాముండు
శోకమోహంబులు పరిత్యజించి ధైర్యం బవలంబించి యచ్చోటు వాసి రమ్య
పారిప్లవవృక్షషండరుచిరయైన పంపాపుష్కరిణి నతిక్రమించి నిర్ఝరకందర సుందరం
బైన యవ్వనంబు గలయ నవలోకించుచు సీతావయవసన్నిభంబు లైన పదా
ర్థంబుల నవలోకించి నప్పుడెల్ల నద్దేవిం దలంచుకొని దుఃఖించుచు నంతలోన
ధైర్యంబు కలిమిం దద్దుఃఖంబు నపనయించుచు మత్తమాతంగవిలాసగమనం
బునం బోవుచుండె మహాత్ముం డగు లక్ష్మణుం డవ్యగ్రచిత్తుండు నప్రమత్తుండునై
ధర్మంబున బలంబున రాముని రక్షించుకొనుచు ననురూపగమనంబునం బోవు
చుండె ని త్తెఱంగున నారఘునత్తములు సుగ్రీవదర్శనలాలసులై ఋశ్యమూ
కపర్వతసమీపంబునం బోవుచుండి రాసమయంబున. 115

ఉ. ఆరమణీయశైలశిఖరాగ్రమున న్విహరించుచున్న పం
కేరుహమిత్రనందనుఁడు కీశకులేంద్రుఁడు బుద్ధిమంతుఁడుర్
ధీరుఁడు దోర్బలాధికుఁడు దివ్యవరాయుధధారుల న్మహో
దారుల రామలక్ష్మణుల దవ్వులఁ గన్గొని శంకితాత్ముఁ డై. 116

-రామలక్ష్మణులను జూచి సుగ్రీవుఁడు భయంబున మంత్రులతో నాలోచించుట.-

చ. భయమునఁ గుంది దొట్రుపడి భావమునం దపియించి దిక్కుల
న్నియుఁ బరికించి విభ్రమిత నిల్చినచోటను నిల్వఁ గార్తిజా
లయతన మూని యాత్మగుహ లాఘవముం దలపోసి వాలి ని
ర్దయుఁ డిటు పంప వచ్చి రని తద్దయుఁ గంపము మేనఁ బర్వఁగన్. 117

తే. శాపభయమున వానరేశ్వరుఁడు వాలి
పఱఁగ నద్దాని నిత్యంబు సొరఁ దలంకు
నట్టిమహనీయతరమతంగాశ్రమంబు
సొచ్చి రయమున మంత్రులఁ జూచి పలికె. 118

చ. ఇది బహుసత్త్వదుర్గవన మిందు జటాజినచీరధారులై
మదమున దంభరూపమహిమ న్గరియించుచు నున్నవారు వీ
రదటునఁ గంటిరే శతమఖాత్మజచోదితులై రయంబున
న్వదలక నాకు విప్రియ మొనర్పఁగ వచ్చుచు నున్నవారొ గిన్. 119

వ. అనిన సుగ్రీవునిసచివు లచ్చోటు విడిచి రయంబున వేఱొక్క శిఖరంబునకు
దాఁటి మహాధనుర్ధరు లగు రామలక్ష్మణుల దవ్వులం జూచి గిరిశిఖరంబులన్నియు

గలయందిరిగి భయంబువలన నేకాకియై యున్న యూథపశ్రేష్ఠుం డగు సుగ్రీవుని నధిగమించి పూర్వప్రకారంబున నందఱు నేకాయనగతు లై దుర్గసంశ్రితంబు లైన పుష్పితద్రుమంబుల భంజించి తెచ్చి యంసభాగంబుల నలవరించుకొని సింహశార్దూలవరాహాదిక్రూరమృగంబుల వెఱపించుచు సుగ్రీవునిం బరివేష్టించి సారెసారెకు నత్తు లెత్తి రామలక్ష్మణుల విలోకించుచుఁ బ్రాంజలులై కొలిచి యుండి రప్పుడు వాక్యకోవిదుం డగుహనుమంతుండు వాలికిల్బిషశంకితుం డగు సుగ్రీవు నవలోకించి యి ట్లనియె. 120

ఆ. ఋక్షకులవరేణ్య ఋశ్యమూక మిది యి, క్కొండపై వసించియుండ మనకు
వాలిభయము లేదు వట్టిశంక యిదేల, చింత విడిచి ధైర్యశీలి వగుము. 121

క. హరిపుంగవ యెవ్వనిచే, నరయంగఁ బరాజితుండ వైతివి నీవా
దురితాత్ముఁ డైనవాలిని, బరికింపుము వానిభయము వాటిల దిచటన్. 122

క. పరువడి లఘుచిత్తతచే, నరులకు మఱి నీకుఁ గల బలాబలమును నీ
వెఱుఁగనికతమున నిపుడో, హరివర శాఖామృగత్వ మది యేర్పడియెన్. 123

తే. బుద్ధివిజ్ఞానయుతుఁడ వై పొలుపుమీఱ, భావసూచకవ్యాపారభంగి సర్వ
మాచరింపుము మతిహీనుఁ డైన రాజు, సర్వభూతంబుల దమింపఁ జాలఁ డధిప.

సుగ్రీవుఁడు రామలక్ష్మణులకడకు హనుమంతునిఁ బంపుట.

వ. అనిన విని సుగ్రీవుం డాహనుమంతున కి ట్లనియె. 125

మ. జలజాతాక్షులు దీర్ఘబాహులు ధనుష్పాణుల్ కృపాణుల్ శర
ద్విలసద్రూపులు దేవతుల్యు లగుట న్వీరిం గన న్భీతి సం
ధిలదే యెవ్వరి కైన వాలి పనుప న్ధీరోద్ధతి న్భీషణో
జ్జ్వలు లై వచ్చుచు నున్నవా రని మది న్శంకించెదం బావనీ. 126

క. బహుమిత్రు లైనరాజులు, మహి విశ్వాసంబు దక్క మాయావిదులౌ
విహితు లగుసఖులచేఁ బ్రత్యహమును శాత్రవులచంద మరయుదు రెందున్.

క. పగ మనమున నిడికొని తఱి, యగునంతకు గూఢవృత్తి నరయుచు శూరుం
డగుభూపతి సులభంబుగఁ, బగతుని నిర్జించు నొంటిపాటున ననఘా. 128

క. మారుతి బహుదర్పనుఁ డగు, భూరమణుఁడు ఛన్నరూపమున విశ్వస్తుఁ
వారక పగతుఁ దుడుము నది, కారణమున నట్టివానిఁ గనుఁగొనవలయున్. 129

వ. మఱియు ననేకోపాయవిశారదు లగురాజులు ప్రాకృతవేషధరు లైనభృత్యుల చేతఁ బగతులచందం బరయ నలయు వాలి కృత్యంబులయందు మేధావి కావున నీవు ప్రాకృతవేషధారి వై వారికడకుం జని యింగితాకారప్రకారంబుల నారూపంబునను సంభాషణంబునను వారిభావం బంతయు విమర్శించి దుష్టస్వభావంబు తోఁచిన వారిం బ్రశంసించి తదీయేంగితంబున ననుసరించి సారెసారెకు విశ్వాసంబుఁ బుట్టించుచు నా కనుకూలు రగునట్లు సంఘటించి యావనంబుఁ బ్రవేశిం

చేటకుం బ్రయోజనం బేమి యని యడుగుము ధనుర్ధరులయ్యు నశుద్ధాత్ములుగా
గోచరించినఁ బూర్వప్రకారంబున నానుకూల్యంబు సంఘటిల్లం జేసి యాగ
మనం బడుగుము సర్వప్రకారంబుల వారితోడ సంభాషించి వారలదుష్టా
దుష్టస్వభావంబు పరీక్షించి రమ్మని పలికిన నమ్మనస్సంభవుండు వంచనబుద్ధితో
వానరరూపంబు విడిచి యవధ్యం బైనభిక్షువేషం బంగీకరించి రామలక్ష్మణుల
కడకుం బోవ నమకట్టి యవ్వేషంబు నమస్కారవిరోధంబనిమనంబున శంకించి
'రూపమేవాస్యైతన్మహిమానం వ్యాచష్టే' యనియెడునిగమనిగదితన్యాయం
బున వారలదర్శనమాత్రంబున సుగ్రీవవిరోధినిరసనక్షము లగుదురని యెఱింగి
గృహీతవేషాంతరుం డైనతనచారత్వంబు ప్రకటింపం జేయుటకు నై కావించెడు
నమస్కారంబు విరోధంబు కా దని నిశ్చయించి సుగ్రీవునిచేత ననుజ్ఞాతుం డై
బుశ్యమూకపర్వతశిఖరంబు డిగ్గి. 130

హనుమంతుఁడు సుగ్రీవునిపంపున శ్రీరామలక్ష్మణుల సందర్శించుట.

తే. వానరత్వంబు విడిచి యవధ్య మైన, భిక్షువేషంబుఁ గైకొని యాక్షణంబ
రాఘవులఁ డాయఁ జని వినమ్రతవహించి, తత్పదాంభోజములకువందన మొనర్చి.

తే. అర్ఘ్యపాద్యాదిపూజనం బాచరించి, వినయవినమితదేహుఁ డై యనిలసుతుఁడు
వారిఁ గన్గొని మృదువాక్యవైభవమున, నతిమనోజ్ఞంబు గాఁగ నిట్లనుచుఁబలికె.

హనుమంతుఁడు శ్రీరామలక్ష్మణులకు నమస్కరించి వారివృత్తాంతం బడుగుట.

మ. కమనీయాకృతిభూరితేజమున నిక్కానన మ్వెలింగించుచు
న్నమునంచచ్ఛరచాపఖడ్గధరు లై శార్దూలహార్యక్షవి
క్రము లై రాజిలుచున్నవారు సురలో రాజర్షులో తాపసో
త్తములో యెవ్వరు మీరు నాకుఁ దెలియ న్దాక్షిణ్యముం జూపరే. 133

ఉ. చీరజటాజినంబులు ప్రసిద్ధముగా ధరియించి సారెకుఁ
దారుణవైఖరి న్మృగకదంబములన్ వెఱపించుచు న్నదీ
తీరమహీరుహంబులకుఁ దేజ మొసంగుచు నివ్వనంబులో
శూరత సంచరించు మిముఁ జూచిన నాకుఁ బ్రమోద మయ్యెడిన్. 134

సీ. అతిసుకుమారులు హస్తిహస్తోపమభుజులు శ్రీమంతులు పుణ్యనిధులు
సింహవిప్రేక్షితుల్ సింహాతిబలవిక్రములు నృసింహులు మహాభుజులు ధీరు
లన్యోన్యసదృశు లహస్కరతేజులు తతజటామండలధరులు రమ్య
జలజలోచనులు విశాలవక్షులు శత్రుభీకరమూర్తులు లోకనుతులు

తే. మూఁడు లోకంబు లొక్కట భుజమునందు, మోవఁజాలినవారుమీరీవిధమున
విండ్లునమ్ములు ధరియించి విపినమునకు, నేల వచ్చితి రెఱిఁగింపుఁ డింత నాకు.

తే. నాకలోకంబువిడిచి భూలోకమునకు, నరుగునెంచినసురలొ యంబరమువిడిచి
[illegible]

క. వీరులు సింహస్కంధులు, దారులు సమదవృషసములు తతరాజ్యస్థా
ధీరులు శూరులు మదనా, కారులు మీ రెవ్వరయ్య ఘనగుణులారా. 137

క. విలసిత తేజంబున నీ, శిలోచ్చయము నీయరణ్యసీమను బంప
న్వెలిఁగించుచున్నవారలు, తెలుపంగ మీ రెవ్వ రింద్రధనదులొ చెప్పుఁడీ. 138

తే. విమలమతులార మీలక్షణములఁ జూడ, నఖిలరాజ్యంబు పాలింప నర్హు లనుచు
డెందమునఁ దోఁచుచున్నది పొందుపడఁగ, నీజడలువల్కలములుమీ కేలకలిగె.

తే. పరిఘనిభములు దీర్ఘము ల్కరటికరస, మములు భూషణభూషోచితములు నైన
కరము లేటికి భూషణవిరహితంబు, లగుచు నున్నవి చెప్పరే యనఘులార.

క. మేరువిభూషితయును వన, వారిధిపరివృతయు నైనవసుమతి నెల్ల
న్వారక పరిపాలించుట, కారయ మీ రిరువు రర్హు లనుచుఁ దలఁచెదన్. 141

క. చిత్రానులేపనంబులు, చిత్రము లగుకార్ముకములు చెలఁగెడుమీకు
న్వృత్రారివజ్రము లవలె, శాత్రవులకు నేత్రభీతిజనకము లగుచున్. 142

క. ఉరగములకరణి నతిభీ, కరదారుణజీవితాంతకరనిశితశరో
త్కరపూరితతూణీరము, లురుతరముగ మిగుల నొప్పి యున్నవి మీకున్. 143

క. తపనీయభూషితంబులు, చపలంబులు దీర్ఘములును సవిశేషములౌ
విపులకృపాణంబులు ఫణి, కుపమానము లగుచు నలరుచున్నవి మిగులన్. 144

క. అనఘాత్ములార మీరలు, పనివడి బహుగతుల నిట్లు భాషించెడు న
న్నని మాఱు పలుక రేటికి, వినిపింపుఁడు మీసమస్తవృత్తాంతంబున్. 145

సీ. అనఘాత్ములార మహాత్ముండు సుగ్రీవుఁ డనుకపిపుంగవుం డర్కసుతుఁడు
భ్రాతృనిరస్తుఁ డై బహుదుఃఖమున నిల నెల్లఁ జరించి ఋష్యమూక
ధరముపై నుండు నతండు మీతో సఖ్య మొనరింపఁ గోరి న న్ననుప నిచటి
కరుగుదెంచితి నేను హనుమంతుఁ డనువాఁడ నతనికి సచివుఁడ నద్రిచరుఁడఁ

తే. గామరూపుఁడ నలసదాగతికి సుతుఁడఁ
గామగమనుఁడ నధికవిఖ్యాతబలుఁడఁ
జెలఁగి సుగ్రీవునకుఁ బ్రీతి సేయఁ బూని
కోరి భిక్షురూపంబుఁ గైకొన్నవాఁడ. 146

క. నా విని మనమున మోదం, బావహిల న్విభుఁడు వికసితాననుఁ డగుచు
న్నావిరి నిట్లనియె సుమి, త్రావరనందనునితోడఁ దద్దయు నెమ్మిన్. 147

క. మనమున నెవ్వనిసఖ్యము, ఘనముగఁ గాంక్షింతు నట్టికపిపతి సుగ్రీ
వునిసచివుఁ డితఁడు నాకడ, ననఘా చనుదెంచె నద్భుతానహాభంగిన్. 148

ఆ. మందమధురవాక్యమహిమ శోభిల్లంగ, నీకపిప్రవీరహితునితోడ
నుచితభంగి హర్ష మొప్పార భాషింపు, మనఘ స్నేహయుక్త మగుచు నుండ.

తే. జనవరకుమార ఋగ్యజుస్సామవేద, పారగులు కానివారు [illegible]

జాల రీతనివాక్యంబు సకలవేద, శిక్షితం బయియున్నది చెలఁగి వింటె. 150

తే. ఎంత దడవు భాషించిన నించుకైన, బ్రమసియును నపశబ్దంబుఁ బలుకఁడితఁడు
దశరథకుమార శబ్దశాస్త్రంబు నెల్ల, వాగ్విధేయంబుఁ జేసినవాఁడు సుమ్మి 151

క. కనులందు ఫాలమందును, మునుకొని కనుబొమలయందు ముఖమందును ద
క్కిన సర్వాంగములందును, నినకుల దోషంబుఁ గాన మించుక యైనన్. 152

క. అవిలంబ మసందిగ్ధం, బవిస్తర మురస్థమును గళానుగతమునై
సువిహితవాక్యము చెలఁగెడు, రవికులవర మధ్యమస్వరంబందు రహిన్. 153

వ. మఱియు నితండు వ్యుత్పత్తిసామగ్రిసంపన్నయు నద్రుతయు నవిలంబితయుఁ గల్యాణియు మనోహారిణియు నగుసంస్కృతవాణి నుచ్చరించుచున్నవాఁడు త్రిస్థానవ్యంజనస్థయు విస్మయోత్పాదనశీలయు నగునితనివాక్కుచేత సముద్యతఖడ్గుం డగుపగతునిచిత్తం బైన నారాధింపం బడు నిట్టిబుద్ధిమంతుం డగు సచివుం డేనృపాలునకుం గలుగకుండు నట్టివానికార్యగతు లెవ్విధంబున సిద్ధించు నిట్టిసర్వగుణసంపన్నుం డైనసచివుండు కలిగె నేని యమ్మహీపతుల సర్వార్థంబులు దూతవాక్యప్రచోదితంబు లై సిద్ధించుంగాదే యని పలికిన నా రఘుపతివాక్యంబులకలరి వాక్యజ్ఞుం డగులక్ష్మణుండు వాక్యకోవిదుం డగుహనుమంతున కిట్లనియె. 154

—రామప్రేరితుం డై లక్ష్మణుఁడు హనుమంతునికిఁ దమవృత్తాంతం బెఱింగించుట—

చ. విదితము లయ్యె మాకు హరివీరకపీంద్రుగుణంబు లన్నియుఁ
వదలక మేము సర్వవిపినంబుల నాదిననాథసూతినే
వెదకుచు నున్నవారము ప్రవీణత నీవిపు డన్నమాడ్కి నా
సదమలచిత్తునిం గదిసి సఖ్య మొనర్చెద నుంచితంబుగన్. 155

వ. అని నిపుణంబుగాఁ బలికిన సుధురాక్షరయుక్తం బైనలక్ష్మణునివాక్యంబు విని మరున్నందనుం డగుహనుమంతుండు సంప్రహృష్టతనూరుహుండై జయోపపత్తియందుఁ జిత్తంబు గీల్కొల్పి వీరిసాచివ్యంబున సుగ్రీవుండు కృతార్థుండై వానరరాజ్యంబు పరిపాలింపం గలఁ డని తలంచి వీరికి నాసుగ్రీవునకు సఖ్యంబుఁ గావించెదఁ గాక యని నిశ్చయించి మృదుమధురవాక్యంబున వెండియు రామున కిట్లనియె. 156

క. విపులతరుయుతము పంపా,విపినవిరాజితము దుష్ప్రవేశం బగునీ
విపినమున కేల వచ్చితి,వి పరాక్రమధుర్య చెప్పవే దయ నాకున్. 157

ఉ. నా విని లక్ష్మణుం డట మనంబున సంతస మంకురింపఁగాఁ
బావనితోడ ని ట్లనియె భ్రాతృనియోగమునం గపీంద్ర ధా
త్రీవరమౌళిదీపితకిరీటమణీలసితాంఘ్రిపద్ముఁ డా
[illegible] 158

ఉ. అమ్మనుజేంద్రచంద్రుఁడు నిజాంచిత తేజము దిక్కులం దనూ
నమ్ముగఁ బర్వ యుక్తగతి నాలుగువర్ణములం దదీయధ
ర్మమ్ములయందు నిల్పుచు ననుత్తమఖావభృథాంబుసిక్తుఁ డై
యిమ్ముగ సర్వభూభువన మేలుచునుండె దయావిలోలతన్. 159

ఆ. తనకు నొరులవలనఁ దనదెన నొరులకు
ద్వేష మింత లేక వెరువు గలిగి
సురలయందు ధాతకరణి రాజులయందుఁ
బెంపు వడయు నతఁడు పెద్ద యగుచు. 160

క. ఆరాజవరున కగ్రకుమారుం డై రాముఁ డనఁగ మహనీయగుణో
దారుఁడు సంగరవిద్యాపారీణుం డిమ్మహానుభావుఁడు తనరున్. 161

ఉ. ఈరఘువంశవర్యుఁడు సహిష్ణుఁడు భూతశరణ్యుఁడు న్యభా
కారుఁడు ధర్మవత్సలుఁ డఖండితవీర్యుఁడు రాజలక్షణో
దారుఁడు సత్యవిక్రముఁ డతంద్రితుఁ డార్తజనార్తిహంతయుక్
సూరినుతుండు పంక్తిరథసూనులలోఁ గడు మేటి యై తగున్. 162

చ. అనఘు దినావసానమున నర్యముఁ డార్తనురీచినిం బలెక్
బనివడి యీరఘూత్తముఁడు భార్యను దోడ్కొని తండ్రిపంపునక్
ఘనశరచాపఖడ్గములఁ గైకొని రాజ్యసుఖంబుఁ బాసి తా
వనమున నున్కి సేయుటకు వచ్చె రహిక్ మునివేషధారి యై. 163

క హరివర యే నీసుగుణో, త్తరుతమ్ముఁడ లక్ష్మణాభిధానుఁడ నితని
న్గర మరుదుగ సేవించుచు, నరుదెంచితి విపినమునకు ననురూపముగన్. 164

క. గతరాజ్యుఁడు వనవాసా, శ్రితుఁ డగునీరామవిభుని ప్రియసతి రక్షో
హృత యయ్యె విపినమున నా, సతిఁ గానక మేము దుఃఖసంతాపమునన్.

వ పరితపించుచు నరణ్యంబున నన్వేషించుచు వచ్చువార మొక్కయెడ శాప
వశంబున రాక్షసత్వంబు నొంది యున్నదనుం డనువానిం గాంచి యతని నడి
గిన వాఁడు సుగ్రీవుం డనువానరశ్రేష్ఠుండు కలం డతండు మహాబలుండు తా
వున సీతాపహారి యగురాక్షసుని సాధించుటకు సమర్థుండతనిఁ గానం జనుండని
పలికి వాఁడు నాకంబునకుం జనియెఁ దద్వచనప్రకారంబున నే మిరువురము
సుగ్రీవునిసాచివ్యంబుఁ గోరి యిచ్చటికిం జనుదెంచితి మని పలికి లక్ష్మణుండు
వెండియు ని ట్లనియె.. 166

క. ధన మర్థుల కొసఁగి యశం, బనువుగ నార్జించి జనుల కధినాథుం డై
తనరారురాఘవుఁడు కా, ననచరునిం దలఁచెఁ దనకు నాథునిఁగాఁగన్ 167

క. హరివర యెవ్వఁడు ప్రజలకు, శరణ్యుఁ డై యొప్పు నట్టి జనపతిసుతుఁ డీ
పురుషర్షభుండు రాముఁడు, శరణాగతుఁ డయ్యె వృక్షచరనాథునకున్, 168

తే. ఎవ్వనిప్రసాదమున జను లెల్లఁ బరమ,సౌఖ్యమునఁ దేలియాడుచు సంతసింతు
రట్టి కరుణాకరుం డిమ్మహానుభావుండు,నగచరుననుగ్రహముఁ గోరినాఁడు నేఁడు.

తే. ఏనరేంద్రునిచేత ధాత్రీశు లెల్లఁ, గరము మానితులై మేలు గాంతు రట్టి
పంక్తిరథపుత్రుఁ డీరామభద్రుఁ డిపుడు,కీశపతితోడిమైత్రిఁ గాంక్షించినాఁడు,

వ. మఱియు మహానుభావుం డగురాముండు శోకార్తుం డై శరణంబు నొందుచుండ హరియూథపుం డగుసుగ్రీవుండు ప్రసాదం బొసంగ సమర్థుం డగు నని యివ్విధంబున లక్ష్మణుండు కన్నీరు నించుచు గద్గదస్వరంబునం బలికిన నప్పవమాననం దనుం డతని కిట్లనియె. 171

క. మిముబోఁటిపరాక్రమనిధు, లమలాత్ములు బుద్ధిమంతు లగచరుతో నె
య్యమొనర్పఁ గఁ దలఁచుట త, ద్విమలపురాకృతతపఃప్రవీణత కాదే. 172

చ. అతఁడును రాజ్యలోభజనితాగ్రహుఁ డై తగువాలిచేఁ దిర
స్కృతుఁ డయి రాజ్యము న్విడిచి దేవిని గోల్పడి వైరమెత్తి యే
కతమున నున్నవాఁ డటులు గాన నవశ్యము మీకుఁ దా సహా
యత నొనరించు భూమితనయాపరిమార్గణమందుఁ బ్రీతుఁ డై. 173

క. అని పలికి మరల మారుత, తనయుం డనుపమమృదూక్తి దశరథతనయా
చనుదెండు పద్మబాంధవ,తనయుం డున్నెడకు మైత్రి తగఁ జేయుటకున్. 174

క. నా విని సంతోషము మది, నావిర్భావంబు నొంద నాతనిఁ గడునం
భావించి గ్రక్కున సుమిత్రానందనుఁడు పలికె రామునితోడన్. 175

హనుమంతుఁడు శ్రీరామలక్ష్మణులను సుగ్రీవునియొద్దకుం దోడ్కొని వచ్చుట

వ. దేవా సమాగతుం డైన యీకపిశ్రేష్ఠుండు మద్వాక్యశ్రవణసంజాతహర్షుం డై యీసుగ్రీవుండును గృత్యవంతుం డని పలుకుటం జేసి కృతకృత్యుండ వైతి వితం డతిప్రసన్నముఖవర్ణుం డై వ్యక్తంబుగా భాషించుచున్నవాఁ డితనివాక్యం బసత్యంబు కాదు సుగ్రీవునిపాలికిం బోద మని పలికిన నారఘుపుంగవుండు ప్రీతియుక్తుం డై యట్ల సేయుద మని నీయకొనియె నిట్లు సుగ్రీవునిసాచివ్యంబున కొడంబడి గమనోన్ముఖు లై యున్న యారామలక్ష్మణుల విలోకించి పవననందనుండు భిక్షురూపంబు విడిచి వానరరూపధరుం డై యమ్మహాత్ములం దనపృష్ఠభాగంబున నిడుకొని తన్నుం గృతకృత్యునింగాఁ దలంచుకొనుచు శీఘ్రంబున ఋశ్యమూకంబునకుం జని యచ్చట రామలక్ష్మణులడించి యంతకుమున్న రామలక్ష్మణదర్శనసంజాతభయభ్రాంతుం డై ఋశ్యమూకంబువిడిచి తత్పరిసరంబున నతిఘనం బైనమలయాద్రిమీఁదికి దాఁటియున్నసుగ్రీవునిం దోడ్కొని వచ్చి యవ్వానరపుంగవునకు రామలక్ష్మణులం జూపి యి ట్లనియె. 176

హనుమంతుఁడు సుగ్రీవునికి రామలక్ష్మణులప్రభావం బెఱింగించుట.

క. అనఘుండు రాముఁ డీఘనుఁ, డనుపమదృఢవిక్రముఁడు మహాప్రాజ్ఞుండు
జ్జనవిభుఁ డనుజయుతంబుగఁ, జనుదెంచినవాఁడు సత్యసంగరుఁ డధిపా. 177

సీ. అగచరోత్తమ యీమహామహుఁ డిక్ష్వాకువంశజాతుఁడు గురువత్సలుండు
దశరథతనయుండు ధర్మసంవేదియు నమితవిక్రముఁడు రామాభిధానుఁ
డనఘాత్ముఁ డగుతండ్రి పనుపున వనమున కరుదెంచి రావణాసురునిచేత
నాలిఁ గోల్పడి శరణార్థి యై నినుఁ గాన వచ్చినాఁ డితఁ డెవ్వానిచేత
తే. వసుధ సత్యంబుచేతఁ గావంగఁబడియె, నశ్వమేధశతం బెవ్వఁ డాచరించె
నట్టిదశరథునకుఁ బుత్త్రుఁడగు నితండు, నీకు శరణాగతుం డయ్యె నెలఁతకతన.
క. నీతో సఖ్యము సేయఁగ, నాతురత నవచ్చినట్టియలఘుల వీరి
న్ఖ్యాతిగఁ జేకొని కడు సం, ప్రీతులఁగాఁ జేయు మిపుడు వివిధార్చనలన్. 179
ఉ నా విని వాయుపుత్త్రువచనంబుల కెంతయు సంతసిల్లి సు
గ్రీవుఁడు శోకము న్భయముఁ గిల్బిషశంకఁ బరిత్యజించి సు
శ్రీ విలసిల్ల మానవశరీరముఁ దాల్చి రఘుప్రవీరు సం
భావితుఁ జేసి యిట్లనియెఁ బల్కులఁ దేనియ గ్రమ్ము దేరఁగన్. 180
క. ధర్మవినీతుఁడ వనియును, నిర్మలమతి వనియు నేఁడు నీగుణములు స
త్కర్ముఁ డగువాయుసుతుచే, నర్మిలి సంబోధితంబు లయ్యె మహాత్మా. 181
క. నగచరుఁడ నైననాతో, జగతీవర నీవు సఖ్యసంబంధ మొన
ర్పఁగఁ గోరినకతమున నా, కగణితసౌభాగ్యలాభ మది యబ్బెఁ గదా. 182
క. భూమీశ నీకు సఖ్యం, బీమెయి నాతో నొనర్ప నిష్టమె యేని
జ్జే ముట్టి బాస సేయుము, నామది సంశయము విడిచి నమ్మెద నధిపా. 188
క. నా విని తనకరమున సు, గ్రీవునిహస్తంబుఁ బట్టి కీశోత్తమ నీ
తో వదలక సాచివ్యము, గావించితి ననుచు విభుఁడు గ్రక్కునఁ బలికెన్. 184

శ్రీరామసుగ్రీవులు పరస్పర మగ్నిసాక్షికంబుగా సఖ్యము సేయుట.

చ. పవనజుఁ డంత శీఘ్రమునఁ బావకునిం బ్రణయించి తెచ్చిన
న్వివిధసపర్య లిచ్చి కడు వేడ్కఁ బ్రదక్షిణ మాచరించి యా
రవితనుజుండు రాముఁడు పరస్పరవక్త్రవిలోకనంబుల
న్దవిలి కృశానుసమ్ముఖమున న్సచివత్వ మొనర్చి రిర్వురున్. 185
ఉ. అప్పుడు రాఘవుండు ప్లవగాధిపునిం గరుణార్ద్రదృష్టుల
న్దప్పక చూచి నీ విపుడు నాకు వయస్యుఁడ వైతి గాన నిం
కెప్పుడు దుఃఖము న్సుఖము నిర్వురకు న్సరిగాఁ దలంచి యి
ట్లొప్పినస్నేహభావమున నుందుద మీశిఖి సాక్షిగా నిలన్. 186
చ. అన విని సంతసిల్లి ప్లవగాధిపుఁ డొక్కవిశాలసాలశా
ఖను బెకలించి తెచ్చి యొకగండశిలాఫలకంబుమీఁద గొ
బ్బున మృదురీతిగాఁ బఱచి భూధవుతోడ సుఖోపవిష్టుఁ డై
తనమది నుబ్బుచుండె వితతంబుగ ముజ్జగ మబ్బినట్లుగన్. 187

తే. అంతఁ బవమానసంభవుం డధికభక్తి, నొక్కచందనతరుశాఖ నురుబలమున
విఱిచియాస్తరణంబుగాఁ బఱచె నందుఁ, జెలఁగి సౌమిత్రియును సుఖాసీనుఁ డయ్యె.

వ. ఇట్లు రామసుగ్రీవులు వహ్నిసమక్షంబునఁ ద్రికరణశుద్ధిగా సఖ్యంబుఁ జేసి లక్ష్మణసహితంబుగా నుచితాసనంబుల సుఖాసీనులై పరస్పరవీక్షణంబులు సేయుచుఁ దనివి దీరక యుండి రంతఁ గొంతసడికి సుగ్రీవుండు హర్షవ్యాకులిత లోచనుండై రామునిం జూచి మందమధురాలాపంబుల నిట్లనియె. 189

సీ. అవనీశ దుష్టాత్ముఁ డగు వాలిచేఁ దిరస్కృతుఁడనై రాజ్యంబు విత్తసుఖము
విడిచి పత్నిని గోలుపడి మనంబున ఘనంబగు భయంబున వనంబున రయంబు
తోఁ జరించుచు వచ్చి తుది నీమహాదుర్గ మాశ్రయించి విషాద మగ్గలింప
దిక్కులేక యున్నాఁడ నిక్కడ నలవాలి వలనిభయం బెట్లు తలఁగు నట్లు

ఆ. కరుణఁ జేసి నన్నుఁ గాచి రక్షింపు మ,నాథనాథ యనఁగ నానరేంద్రుఁ
డిట్టు లనియె మరల హిత ముచితజ్ఞత, సొంపు మెఱయ సూర్యసుతునితోడ.

శ్రీరాముఁడు వాలిం జంపెదనని శపథము సేయుట.

క. ఉపకారశీలి వగు నీ, కుపకారము సేయు టిది సముచితము గాదే
కపినాయక నీపత్నిని, జపలతఁ గైకొన్న వాలిఁ జంపెదఁ గడిమిన్. 191

చ. అనుపమవజ్రసన్నిభము లర్కనిభంబులు తీక్ష్ణపర్వముల్
ఘనతరసర్పతుల్యములు కాలకటాక్షసమంబు లైన మ
త్తునిశితసాయకంబు లివె చూడుము క్రుక్కన నీశరంబులం
దునిమెద వాలి నబ్బలవిదూరుఁడు వజ్రముచే గిరిం బలెన్. 192

చ. అని శపథంబుఁ జేసిన నినాత్మజుఁ డారఘుభర్త మాటకు
న్మనమున సంతసించి జననాయక మీ రిపు డానతిచ్చిన
ట్లనె నయమారఁ జేయుఁ డభయంబునఁ బత్నిని రాజ్యము న్సుఖం
బును సకలార్థము ల్వడసి పొల్పు వహించెద నేను మీదయన్. 193

క. కరుణ దలిర్పఁగఁ బగతునిఁ, బరిమార్చెద ననుచు మీరు పలికినమాత్ర
న్నరవర సకలార్థము లి, త్తఱిఁ జేకూడె నని చాలఁ దలఁచెద బుద్ధిన్. 194

వ. అని యిత్తెఱంగున సుగ్రీవుండును రాముండును శపథపూర్వకంబుగాఁ బరస్పర కార్యసాధనోచితంబు లగు వాక్యంబులు ప్రసంగించుచుండఁ దత్ప్రణయప్రసంగంబునందు రాజీవహేమజ్వలనోపమంబు లగు సీతావాలిరావణుల వామనేత్రంబు లదరె నప్పుడు సదంపడి సుగ్రీవుండు ప్రీతచేతస్కుండై రఘునందనున కిట్లనియె. 195

సుగ్రీవుఁడు రామునకు సీతను దెచ్చి యిచ్చెద నని శపథము సేయుట.

సీ. దశరథసుత నీవు తండ్రి పంపునఁ బ్రోలు వెడలి ప్రియానుజుల్ వెంటఁ గొలువ
నడవికి వచ్చుట యందొక్కచో మీర లిరువురు దవ్వుల కేఁగి యున్న

తఱి రావణుండు సీతను మ్రుచ్చిలించుట యంతయు నీబుద్ధిమంతుఁ డైన
హనుమంతుఁ డెఱిఁగించె నది పదంపడి మిమ్ము నడుగంగ నేల మహాత్మ యింక

తే. నల్పకాలంబునందె భార్యావియోగ, జనితశోకంబు విడిచెదు సత్వరముగ
వెదకి సాధించి తెచ్చి పృథ్వీకుమారి, నిక్కువముగ నర్పించెద నీకు నేను. 196

ఉ. విశ్రుతకీర్తి యైనపృథివీసుత దేవనరాహిరాజిలో
కాశ్రిత యయ్యె నేని రయ మారఁగఁ జేకొని నష్ట యైనవే
దశ్రుతియట్ల తెచ్చి వితతంబుగఁ దప్పక నీకు నిత్తు దీ
నాశ్రయ నాదుమాట హృదయంబున నమ్మి త్యజింపు శోకమున్. 197

తే. అధిప విషకృత మైనభక్ష్యమును బోలె, నీదుపత్నిని శక్రజంభాదినిఖిల
దేవదానవు లైనను దెల్లముగను, దక్కఁ గొనఁ జాల రిది యంత నిక్కువంబు.

వ. అదియునుం గాక. 199

శా. ఆకాశంబున రావణాంకగత యై హా రామ హా లక్ష్మణా
హా కల్యాణగుణోత్తరా యనుచు శోకాక్రాంత యై చీరుచుం
బ్రాకంపించుచుఁ బోవుజానకిని శైలాగ్రంబుపై నుండి నే
నేకాకుత్స్థకులప్రదీప వినుమా యేపార వీక్షించితిన్. 200

శా. ఆవైదేహియు మమ్ముఁ గన్గొని స్వకీయానర్ఘరత్నోల్లస
త్సౌవర్ణాభరణంబు లన్నియును భాస్వత్కాంతు లొప్పార నా
త్రోవం బైఁటచెఱంగున న్ముడిచి యెంతో భీతి మాముందటం
బ్రావీణ్యంబునఁ బాఱ వైచి చనియెఁ రక్షోవరాధీన యై. 201

ఉ. ఆరమణీయభూషణము లన్నియుఁ గైకొని మేము డాఁచి యు
న్నారము తెచ్చి చూపెద ఘనంబుగఁ దన్మహనీయవైఖరుల్
సూరిజనస్తుతా గుఱుతు చూచికొనం దగు నంచుఁ బల్కఁగా
నారఘుభర్త తెమ్ము ప్లవగాధిపతీ తడ వేల నావుడున్. 202

సుగ్రీవుఁడు సీతాదేవి తమవద్ద వైచిన భూషణంబుల రామునకుఁ జూపుట

చ. హరివరుఁ డంత శీఘ్రమున నద్రిగుహాంతరసీమఁ జొచ్చి యుం
దరువుగ డాఁచి యున్న వివిధాభరణంబులమూటఁ దెచ్చి దా
శరథికి నిచ్చి చూపుటయుఁ జయ్యన నారఘునేత తద్వరా
భరణములం దదీయమృదుపావనచేలముఁ జూచి దీనుఁడై. 208

శా. ఈహారంబులు సీత హారములె సుమ్మీ యంచు లక్షించుచు
న్నీహారంబునఁ బంకజారిక్రియ నెంతే బాష్పసంరుద్ధుఁడై
మోహం బగ్గల మందఁ బైకొనినమూర్ఛ న్విశేషించి హా
నీహారాంశుముఖీ యటంచు నొరగె న్నిల్వోపలే కుర్విపై. 204

రాముఁడు సీతాదేవియాభరణంబుల లక్ష్మణునికిఁ జూపుట.

వ. ఇట్లు ప్రియాభరణసందర్శనసంజాతశోకమూర్ఛాపారవశ్యంబునఁ బుడమిం బడి కొండొకసేపునకు లబ్ధసంజ్ఞుం డై బిలస్థం బగుపన్నగంబుచందంబున రోఁజుచుఁ బాష్పపూరితముఖుం డై దుఃఖించుచున్నసౌమిత్రి నవలోకించి. 205

మ. జననాథాత్మజ కంటె భూమిసుత చే సంత్యక్త మైనట్టినా
తనదివ్యాభరణంబుల న్విమలచిత్రక్షౌమచేలంబు న
ద్దనుజుండే కొనిపోవుచో గుఱుతుగాఁ దన్వంగి మైసొమ్ము లీ
ఘనశైలంబునఁ బాఱ వైచి చనె నిక్కం బింత చింతింపఁగన్. 206

వ. మఱియు నీయనర్ఘరత్నాభరణంబులు హరితతృణవంతం బైన మృదుమహీస్థలంబున నుత్సృష్టంబు లగుటం జేసి యవికలరూపంబు లై యున్నవి విలోకింపుము.

క. నరవరసుత యీసొమ్ములు, గుఱు తెఱుఁగు దె యనిన నతఁడు గూరినశోక
స్ఫురణము మీఱఁగ నద్దిన, కరవంశాంభోధిచంద్రుఁ గని యిట్లనియెన్. 208

తే. అధిప యీకమనీయరత్నాంగదములు, నీరుచిరకుండలంబులు నే నెఱుంగ
ననరతము బాదాభివందనమువలనఁ, బదకటకనూపురము లెఱుంగుదు మహాత్మ.

ఉ. నా విని రాఘవుండును మనంబున మోహము నివ్వటిల్ల సు
గ్రీవునిఁ జూచి నీ వెచటఁ బృథ్వీసుతం గనుఁగొంటి వప్పుడా
రావణుఁ డెందుఁబోయెఁ గపిరాజ తదీయనివాస మెద్ది వాఁ
డేవిధి సంచరించుఁ జల మెంత బలం బది యెంతొ చెప్పుమా. 210

ఉ. దోష మటంచు నెంచుకయుఁ దోఁపక దైత్యుఁ డపాంసులాశిరో
భూషణ మైనజానకిని మ్రుచ్చిలి చేకొని యేఁగె వాఁడు మ
ద్రోషమున న్సమస్తజనదూషితుఁ డై త్రుటిలోన నింక ని
శ్శేషముగా నశించు హరిశేఖర యెంత బలంబు గల్గినన్. 211

తే. అనఘచరిత మద్భార్యాపహారి యైన, రిపునిఁ బేర్కొను మిప్పుడె విపులవిశిఖ
దహనహేతుల వాని నిర్దగ్ధుఁ జేసి, సత్వరంబుగఁ బంపెద శమనపురికి. 212

సుగ్రీవుఁడు రామునితో రావణునివాసాదికంబు తా నెఱుంగ నని చెప్పుట.

వ. వానరేంద్రా యేను దన్నిమిత్తంబున సర్వరాక్షసనాశంబుఁ గావించెద నద్దురాత్ముండు సీతను మ్రుచ్చిలి నాకును మహారోషంబు గలిగించి తనజీవితాంతంబు కొఱకుఁ దానే మృత్యుద్వారంబుఁ దెఱచికొనియె నని యిట్లు పరమార్తుం డై పలికిన రామునివచనంబు విని సుగ్రీవుం డొక్కింతసేపు తనలోన విచారించి యీరాముండు మిక్కిలి వ్యసని యై యున్నవాఁ డేను రావణునినివాసంబును దత్పరాక్రమాదికంబు నెఱుంగుదు నని యంటి నేని యిప్పుడే రావణవధార్థంబు ప్రయత్నంబు గావింపుద మని పలుకు వానరబలంబులం గూర్చి గాని సీతాన్వేషణరావణవధాదికంబు గావించుట శక్యం బై యుండదు వాలి రాజై

యుండుటవలన వానరు లందఱుఁ దద్వశంగతులై యున్నవారు వారందఱు
మదధీను లగుటది మిక్కిలి దుర్లభం బందుఁ గొందఱినుపాయబలంబున స్వాధీ
నులం గావించికొని కార్యయత్నంబుఁ గావింపుదు నంటినేని వానికి రావణు
నకుం గలసఖ్యసంబంధంబువలన వాలి నుస్మన్మనోరథంబు సిద్ధింపకుండునట్టి
తెఱం గాలోచించి ప్రవర్తించు దానం జేసి యుభయకార్యభంగం బగుఁ
గావున మొదల రామునివలన వాలివధపూర్వకంబుగా వానరరాజ్యంబు నధి
గమించి పదంపడి వానరబలంబులం గూర్చి సీతాన్వేషణాదికార్యంబుఁ గావిం
పుదుఁ గాక యని నిశ్చయించి కేలుదోయి ఫాలంబునం గీలించి గద్గదకంఠుండై
యి ట్లనియె. 213

సీ. అనఘాత్మ దురితాత్ముఁ డగురావణునిభుజవిక్రమంబును వానివిపులబలము
వాని నివాసంబు వాని శౌర్యంబును వాని రూప మెఱుంగ వాని కేమి
మునుకొని ముల్లోకముల నెందు డాఁగిన శోధించి రావణాసురునిఁ బుత్ర
మిత్రయుతంబుగా మెయికొని చంపి సీతను దెచ్చి యిచ్చెద దానికైన

తే. యత్న మొనరించెదను మది నడలు దక్కి
ధైర్య మలవడ సుస్థిరోత్సాహపరుఁడ
వగుము నీయంతవారల కర్హ మగునె
రాఘవాన్వయ యీబుద్ధి లాఘవంబు. 214

చ. అరయఁగ నేను బ్రాకృతుఁడ నయ్యు వనాటుఁడ నయ్యు దేనదు
స్తర మగుగేహినీవిరహజవ్యసనం బది యెంత వేఁచిన
న్దరలక తాల్మి వీడక మనంబున ధైర్యము నూఁది యుండఁగా
నిరవుగ ధైర్యశాలి వగు నీ విటు లాడుట కేమి చెప్పుదున్. 215

వ. దేవా నీవు మహాత్ముండవు వినీతుండవు సమాహితం బైనబాష్పంబును ధైర్యం
బువలన నిగ్రహించుట కర్హుండవు మఱియు నర్థకృచ్ఛ్రంబులయందును వ్యస
నంబునందునుజీవితాంతకరం బైనభయంబునందును ధృతిమంతుం డగువాఁడు
తనబుద్ధిచేత విమర్శించి నశింపకుం డేనగుం గాని బాలిశుం డై నిత్యంబును
వైక్లబ్యంబు నవలంబించు నట్టివాఁడు సలిలంబునందు భారాక్రాంతం బైనతరణి
కరణి శోకాంబుధియందు నిమగ్నుం డగు నెవ్వాండు శోకంబు ననుసరించి
వర్తించు నట్టివాని కెన్నటికి సుఖంబు లేదు వాని తేజంబు దినదినంబునకు
నశియించుచు వచ్చు నతండు జీవించుటయె దుష్కరం బై యుండుఁ గావున
భృత్యుండ నై ననాయంజలిం బ్రతిగ్రహించిపౌరుషంబు నాశ్రయించిశోకంబు
విడిచి ధైర్యంబు నవలంబించి సుస్థిరోత్సాహసంపన్నుండ వగు మేను నయన్య
భావంబున హితంబుఁ బలికితిఁ గాని యుపదేశించినవాఁడను గాను మదీయ
వయస్యత్వంబును సమ్మానించి శోకంబు విడువు మని పలికిన మధురంబు లగు
సుగ్రీవునివచనంబులం దేఱి బాష్పపరిక్లిన్నం బైనవదనంబు వస్త్రాంతంబునం

దుడిచికొని వేదండశుండాదండమండితంబు లగుబాహాదండంబులు సాఁచి
సుగ్రీవునిం గౌఁగిలించుకొని రామభద్రుండు భద్రవాక్యంబుల నిట్లనియె.216

రాముఁడు సీతాదేవి నన్వేషింపుమని సుగ్రీవునితోఁ జెప్పుట.

సీ. చండాంశుతనయమిత్రుండవు హితుఁడవు స్నిగ్ధుండ వైననీచేత నెద్ది
కర్తవ్యమదియు యుక్తంబుగా ననురూపముగ ననుష్ఠితమయ్యెఁదగవుమెఱయఁ
బలికిన నీమాట పరమశోకాక్రాంత హృదయుండ నగునన్ను ముదితుఁ జేసె
నిట్టికాలమున నీయట్టిచుట్టము నాకు దొరకొను టెంతయు దుర్లభంబు
తే. గాదె యిఁక జాగు సేయుట గాదు వేగ, యవనిజాపరిమార్గణ మందు నీవు
యత్న మొనరింపుమనిని గీటపఁచునట్టి, తెఱఁగు చింతించి చెప్పుము తెల్లముగను.
క. హరివర శిఖిసాక్షికముగ, నిరువుర మన్యోన్య మిప్పు డిచ్చినబాసల్
దిరుగక యనృతము లాడక, నెఱవేర్చినమీఁదఁ గాదె నెగడు శుభంబుల్.
వ. కపీంద్రా యిప్పుడు నాచేత ననుష్ఠింపం దగినకార్యం బెయ్యది గలదు దాని
నెఱింగింపుము వర్షాకాలంబునందు సుక్షేత్రంబునందుం బోలె నాయందు సమ
స్తంబును సంపన్నంబై యుండు నిప్పుడు నాచేత నభిమానంబునఁ బలుకం
బడినవాక్యంబు యథార్థం బని యెఱుంగుము మున్నెన్నండు నాచేత ననృ
తంబు సమీరితం బైనయది గా దిప్పుడు సుకృతపుణ్యంబు సాక్షిగా సత్యంబుఁ
బలికితి నని యిట్లు సుగ్రీవవిశ్వాసార్థంబు శపథపూర్వకంబుగాఁ బలికిన నన్నరేం
ద్రుని ప్రతిజ్ఞావచనంబు విని సుగ్రీవుండు సచివసమన్వితంబుగాఁ బరమప్రీతుండై
స్వకార్యం బంతయుఁ గృతం బయ్యె నని తలంచి రామభద్రు నభినందించె ని
ట్లు రామసుగ్రీవు లన్యోన్యసదృశులై యేకాంతంబునం గూడుకొని యఱమరలే
నిచిత్తంబున నొండొరులసుఖదుఃఖములఁ దలపోయుచుండి రంతఁ గొంతసేపు
నకుఁ బద్మినీకాంతసంభవుండు సౌమిత్రి వినుచుండ సీతాకాంతున కిట్లనియె.
మ. అమరేంద్రాదులకైన దుర్లభము గోత్రాధీశ నీతోడి స
ఖ్యము నాభాగ్యవశంబునం గలిగె నిక్కం బింత యుష్మత్కటా
క్షమునం గోరికలే లభించు నిఖిలస్వారాజ్య మైనన్ స్వరా
జ్యము చేకూడుట కెంత యింత విమతక్ష్మానాథవిధ్వంసకా. 220
చ. అకలుషచిత్త నీగుణము లైన నుతింపఁగఁ జాల నట్టిన
న్నొకసరివానిఁగాఁ దలఁచి యుత్తమవత్సలతం గృశానుసా
క్షికముగ వేడ్కతోఁ జెలిమిఁ జేసితి వేమన వచ్చు నీగుణం
బిఁక సకలార్థము ల్వడసి యేను సుఖించెద నీదుసత్కృపన్. 221
తే. అధిపవిక్రమమున నితఁడు మాకర్హసచివుఁ
డనుచు నను మీ రెఱింగెద రాత్మలోనఁ
బరఁగ నిప్పుడు నే నిట్టివాఁడ ననుచు
భానుకులవర్య నీమ్రోలఁ బలుకఁజాల. 222

తే. ఆత్మవంతుల భూరిధైర్యంబు కరణి, ననఘ మీయట్టిశుద్ధాత్ములైనవారి
ప్రీతి నిశ్చలమై యుండుభూతలమున, శిష్టధర్మంబు లని నీకుఁ జెప్పవలెనె. 228
తే. రజతమైనను మఱి మహారజతమైన, నిరుపమానవిభూషణాంబరములైన
సాధుజను లవి యెల్లను సాధుజనులు, తమవియట్ల భావింతురు విమలచరిత.
తే. దోషియైనను మఱియు నిర్దోషియైన, నాఢ్యుఁడైనను గడుఁ బేదయైనసుఖితుఁ
డైన దుఃఖితుఁడైనమహానుభావ, పరమగతి మిత్త్రుఁ డొక్కండె ధరణియందు.

—— సుగ్రీవుఁడు వాలిం జంపి తనదుఃఖంబుఁ బాపుమని రాముఁ బ్రార్థించుట. ——

ఆ. సుఖము విడిచియైన సురుచిరభోగంబు, విడిచియైన ధనము విడిచియైన
మేను విడిచియైన మిత్త్రునికార్యంబు, చక్కఁ జేయు టగియు సఖ్యవిధము 226
వ. అని యిట్లు బహుప్రకారంబుల వాసవసన్నిభుండైనలక్ష్మణుండు వినుచుండ సాచివ్యసామరస్యంబు వక్కాణించుచుఁ దొల్లింటియట్ల వేఁటకాఁడు చోటఁ బర్ణ బహులంబైనసాలవిటపంబు విఱిచి తెచ్చి యాస్తరణంబుఁ గావించి దాని యందు రామసహితంబుగా నాసీనుండయ్యె హనుమద్విరచితంబైనపర్ణమయా స్తరణంబునందు లక్ష్మణుండు సుఖోపవిష్టుండయ్యె నిట్లు యథాసుఖంబుగా నాసీనులై యున్నసమయంబున నాసుగ్రీవుండు రామభద్రు నవలోకించి దేవా యేను వాలిచేత నిరాకృతుండనై హృతదారుండనై భయంబుఁ గొని యీ ఋశ్యమూకపర్వతంబు నాశ్రయించి యున్నవాఁడ నీవు సర్వలోకాభయంక రుండవు వాలివలన భయార్తుండనై దిక్కఱియున్ననాకుఁ బ్రసాదంబు సేయంగు మని మధురాక్షరవ్యక్తంబుగాఁ బలికినఁ దేజస్వియు ధర్మజ్ఞుండును ధర్మవత్స లుండు నగురాముండు సుగ్రీవునివచనంబు విని స్మితపూర్వకంబుగా నిట్లనియె.
తే. జగతి నుపకృతి మిత్త్రలక్షణ మపకృతి, శత్రులక్షణ మటు గాన సాధుచరిత
చెలఁగి నీపత్ని నపహరించిన దురాత్ము, వాలిని వధింతు నిక్కంబు వలదుశంక.
వ. అని పలికిన రామునివచనంబు విని సుగ్రీవుండు వెండియు నిట్లనియె. 229
సీ. అవనీశ యేను శోకాభిభూతుఁడనైతి దీనుల కెల్లను దిక్కు నీవ
పావకు గుఱిఁ జేసి పాణిప్రదానంబుచే వయస్యుఁడవైతి వీ వటంచుఁ
బలికితి వేనును బదపడి నీయట్ల బాస యిచ్చితి నది పట్టి తాల్మిఁ
బూని యుండక చిచ్చుఁబోలినగేహినీవిరహతాపము నన్ను నేతలఁ బెట్ట
ఆ. నైపు లేక సారెసారెకు భ్రమ గొని, పలుకుచున్నవాఁడఁ బరమకృపను
నెగులుఁ బాపి నన్ను నిత్యసుఖాత్ముని, గా నొనర్చి యశముఁ గాంచు మధిప.
వ అని నిజాభిప్రాయంబు విన్నవించి యంతకంత కగ్గలంబైనశోకంబున గద్గద కంఠుండై పలుక నేరక నదీవేగంబుచందంబునం బఱతెంచుబాష్పవేగంబును వదనంబునం బ్రమార్జించుచు నిట్టూర్పులు పుచ్చుచుఁ గొండొకధైర్యంబున నది యడంచుకొని వెండియు రఘువల్లభున కిట్లనియె. 231

సుగ్రీవుఁడు తనమంత్రుల రామునికిఁ జూపుట.

సీ. మున్ను నిష్కారణంబుగ వాలి నాతోడ వైరంబుఁ గొని పాపవర్తనమునఁ
గదిసి ప్రాణంబులకంటె గరీయసి యైనమద్దేహిని నపహరించి
మిత్రుల సంగతి మెయికొని బంధించి కడునడిఁ నను బ్రోలువెడల ననిచె
బలవంతుఁ డగువాని బలమున కోర్వక యే నిందుఁ దగవసియించియుండు.
తే. సంతతము పూని కపిఁడు బలాఢ్యులైన, వారి నను జంపఁ బంపినవారినెల్ల
నామనమునఁ దచుచు నెప్పటికేమొ యనుచు, భీతిఁగొనియుండుమదిలోనఁ బ్రీతిదక్కి.
క. అనఘాత్మ యేను నినుఁ గని, పెనుపుగ నీశంకచేత భీతుఁడ నగుచుం
గనుకనిఁ బఱచితి దన మీఁ, బసినది భయహేతువందు భయపడుఁగాదే. 233
క. అతఁ డెంత కీడుఁ జేసిన, క్షితినాయకవీర నన్నుఁ జేకొని నిత్యం
బతులితగతి రక్షింపఁగ, బ్రతికితి నిన్నాళ్లు వగకుఁ బాల్పడకుండన్. 234
వ. అని పలికి మంత్రులం జూపి వారిలో విశేషం బెఱింగించువాఁడై వెండియు నిట్లనియె. 235
ఉ. మానుగ నీతిశాలి ధృతిమంతుఁడు నీహనుమంతుఁ డుండఁగా
నేను భయంబునుం బొరయ కింతయు సుస్థితి నున్నవాఁడ నో
మానవనాథ యీతఁడు సముచితభక్తి నహర్నిశంబులుం
బూనిక నిత్య మేమఱక ప్రోచుచు నుండు ననేకభంగులన్. 236
వ. మఱియు వీర లేను నిలిచినచోట నిలుచుచు నన్నెడఁబాయక వెంట వచ్చుచు నయ్యైసమయంబుల నన్ను రక్షించుటకుం జేసినసదుపాయంబులు పెక్కు గల వవి యన్నియుం జేర్కొనుటకుం జాల నిప్పుడు సంక్షేపంబుగా నెఱింగించితి నింక మదభిప్రాయంబు వినుము. 237
ఉ. నాకుఁ బత్నిఁ దక్కఁగొని నన్నుఁ బరాజితుఁ జేసి యంతటం
బోక యటు జీవితం బపహఁ బూనిన నాపగవాని వాలి న
స్తోకశిలీముఖప్రహతిఁ ద్రుంచి రయంబునఁ గూలవైచినం
గాక మదీయచిత్తమునఁ గల్గినతాపము తీఱిపోవునే. 238
వ. నరేంద్రా నాసుఖంబును జీవితంబును వాలివినాశనిబంధనం బని తలంచెదఁ దద్వధంబె శోకార్తుండనైన నాశోకంబునకు దరి యని యెఱుంగు మేను శోకార్తుండనై నివేదించితి నని పలికి వెండియు నిట్లనియె. 239

రాముఁడు సుగ్రీవుని వాలికిని నీకును విరోధమునకుఁ గారణం బడుగుట.

క. కర మాపదఁ జిచ్చినతఱి, నరనాయక ధాత్రి సచివునకు సచివుండే
శరణం బటు గావున నా, కరయఁగ నీవె గతి గాక యన్యులు గలరే. 240
ఉ. నా విని రాఘవుండు కపినాయకుఁ గన్గొని నీకు వాలికి
న్వావిరిఁ జెల్మిపోయి పగవచ్చినకారణ మేమి చెప్పు నా

కావిధ మంతయు న్గని బలాబలము న్నుఖ మాచరించెద
న్నీవిటు గుందుచుండి మది నెవ్వగ నాకును నివ్వటిల్లెడిన్. 241

చ. చతురత సాయకాసనము సజ్యము సేసినయంతలో గుణ
చ్యుతయమరాట్కటాక్షతులితోగ్రశరంబు సురేంద్రసూతి ను
ద్ధితబలశాలి వాలిని వధించు నిజంబు ననాటవచ్చ నీ
కతనికిఁ దీర్పరానిపగ యైనవిధం బది యింకఁ జెప్పుమా. 242

వ. కపీంద్రా భవద్భార్యాపహారి యగువాలి నిప్పుడ వధించెద నీకు విప్రకారంబుఁ గావించిన శాత్రవునిమీఁదఁ బొడమినయమర్షంబు బలవంతంబై ప్రావృట్కాలసలిలవేగంబుకరణి మచ్చిత్తంబున నంతకంతకు నగ్గలంబగుచున్నది మదీయతూణీరగతంబు లైనసాయకంబు లివె చూడుము స్నిగ్ధతేజంబులై ప్రశస్తంబులై కుమారోత్పత్తిస్థానశరవణోత్పన్నంబులై హేమవిభూషితంబులై కంకపత్రప్రతిచ్ఛన్నంబులై మహేంద్రాశనిసన్నిభంబులై నిశితాగ్రంబులై సరోషంబులగు పన్నగంబులలీలం గ్రాలుచున్న యీశరంబులఁ గృతకిల్బిషుండైన వాలిని శైలంబునుంబోలె మొదలం గూల నేసెద నని పలికిన నవ్వానరోత్తముండు రాముని వచనంబులు విని మంత్రిచతుష్టయసమన్వితంబుగాఁ బరమానందంబు నొంది వదనంబున నభూతపూర్వ తేజోవిశేషంబు పల్లవింప నమ్మహాత్మునవలోకించి దేవా వాలికి నాకును వైరంబు గలిగినవిధం బంతయు విస్పష్టంబుగా విన్నవించెద విను మని యిట్లనియె. 243

సుగ్రీవుఁడు రామునకు వాలికిం దనకును విరోధము నయినఁ గారణము నెఱింగించుట

సీ. అనఘాత్మ మాయన్నయగు వాలి మునుతండ్రి కభిమతుం డగుచు నాయందుఁ జాల
వత్సలత్వము గల్గి వర్తించుచుండ మా యయ్య దీక్షిన వెనుక నఖిలమంత్రు
లతని వానరరాజ్యమం దభిషిక్తునిఁ జేసిన నతిధర్మశీలి యగుచు
నేను బ్రేష్యుని మాడ్కి నెప్పుడుఁ దనుఁగొల్వ లీలతో నాసామ్రాజ్య మేలుచుండ
తే. నంత నొకనాఁడు దుందుభియన్న మయుని
కొడుకు మాయావి యనువాఁడు కడిమి గలుగు
వాఁడు స్త్రీకారణంబున వైరమెత్తి
నత్వరంబుగ నొకనిశాసమయమందు. 244

శా. కంధుల్ మ్రోసినభంగి భీమరవ మాకాశంబు భేదింప గ
ర్వాంధుం డాయసురుండు రౌద్రమున ఘోరాకారుఁడై పేర్చి కి
ష్కింధాద్వారముఁ జేరి వాలిని జయశ్రీలోలుఁ దారామనో
బంధుం గ్రొవ్వున నాజికిం బిలిచె శుంభద్వీర్యసంరంభి యై. 245

ఉ. ఆనినదంబు కర్ణపుట మంటిన దిగ్గన మేలుకాంచి య
వ్వానరవంశదీపకుఁడు వాలి రయంబున లేచి కాంతలున్

చిహ్నోత్కృతి మండి క్రూరముగ నాక్షేపించి తర్జించుచున్. 253

మ. అలుకన్ మంత్రివిచారదక్షుల మదీయామాత్యులం బట్టి బ
ద్ధులఁ గావించి కడంగి నన్నును వెసం దోర్ద్రోడఁ జంపంగ న
బ్బలియుం డుద్ధతి రాఁగ నేను నపు డప్పాపాత్ముని న్ద్రుంపఁగా
బలముం గల్గియు భ్రాతృసౌహృద మెదం బాటించి సైరించుచున్. 254

ఉ. అంజలి ఫాలభాగమున నర్థి ఘటించి తదంఘ్రిధూళికా
పుంజము సారెసారెకు సమున్నతి తెప్పలఁ నప్పళించి గా
లిం జలియించు భూరుహము లీల శరీరము కంప మొందఁగా
మంజుగతి న్నయుం బెనఁగుమాటల నిట్లని పల్కితిం దగన్. 255

సీ. వానరోత్తమ దైవవశమునఁ బగతునిఁ బరిమార్చి కుశలివై పట్టణమున
కరుగుదెంచితివి దిక్కటి యున్న మాకింక నేకనాథుండవై యేలు మిపుడు
తుహినాంశునిభమును బహుశలాకము సముద్యత్తమైన [illegible] రాజ్యఛత్ర
మీమణీమయదండచామరంబులు ప్రీతి వీక్షింపు మొక యేఁడు బిలముఖంబు

తే. గాచికొని యుండి యంత రక్తమును జూచి
యలికి శోకంబు పెంపున బిలమువాత
నచలశృంగంబుఁ బడవైచి యచటు వాసి
శీఘ్రమున వచ్చి కిష్కింధఁ జేరినాఁడ. 256

వ. ఇట్లు పురంబునకుం జనుదెంచిన నన్నుం గాంచి నావలన భవద్వృత్తాంతంబు
విని. 257

క. ఏ నెంత వలవ దన్నను, మానక కపిరాజ్యమందు మంత్రులు నాకుం
బూనికఁ బట్టము గట్టిరి, దీనజనశరణ్య శౌనన్య దేశజిగీషన్. 258

ఉ. నీకు భరింపఁగాఁ దగిన నిత్యసుఖప్రద మైనరాజ్యము
న్నాకు కెటు దాల్ప వచ్చుఁ గపినాయక మంత్రులచేత లింతె కా
కీకరణి న్ననుం దెగడ నేటికి నీ దగుకీశరాజ్యముం
గైకొని నన్ను రాష్ట్రమును గావుము సర్వసుఖోన్నతుండవై. 259

వ. మహాత్మా మంత్రులచేత దత్తం బైనయీరాజ్యంబును మంత్రిపౌరనగరవహితం
బుగాఁ గ్రమ్మఱ నీకు సమర్పించెద మత్కృతాంజలిఁ గైకొనినాయందు రోషం
బుఁ బరిత్యజించి నిహతకంటకంబుగా దీనిం బరిపాలింపు మని యనేకవిధంబు
లం బ్రార్థించిన నతండు తెగువకుంజొరక కోపంబు డింపక మనంబున రోయు
చు సారెసారెకుఁ దిరస్కారవాక్యంబులఁ దర్జించుచు నప్పుడు పౌరులను మం
త్రులను రావించి వారలు వినుచుండ న న్నుద్దేశించి పరమగర్హితం బగువా
క్యంబున నిట్లనియె. 260

సీ. ఒకనాఁడు నడిరేయి నుద్ధతి మాయావి యనునిశాచరుఁ డొక్క దాజికాంక్షఁ
జనుదెంచి నన్నుబిల్చిన నేను శౌర్యంబు ప్రకటించి రక్కసుపైకిఁ బోవ

నావెంట బోనటయై వచ్చె నీతండు నిరువురఁ గని వాఁడు శరము భీతిఁ
బరువెత్తి యొకకొండబొఱియలోనికిఁ బోవఁ గని యేను వీనితో దనుజుఁ జంపి
తే. కాని రాఁ జాల నందాఁకఁ గడఁకనిచటఁ, గాచికొని యుండు మీ వనికఱపి వేగ
బిలములోనఁ బ్రవేశించి కలయ వెదకి, యసురుఁ గంటినొక్కఁడ నొక్క యబ్దమునకు.
క. కనుఁగొని రోషంబడర ర,జనీచరుని బలయుతముగఁ జంపుటయుఁ దదా
ననమువలన రుధిరము గ్రొ,బ్బున వెడలి గుహాముఖంబు పూర్ణం బయ్యెన్. 262
వ. ఇట్లు రాక్షసునిం జంపి బిలంబు నిర్గమించుటకు మార్గంబు గానక వీనిం బెక్కు తెఱంగులం జీరి ప్రతిశబ్దంబు వినంబడ కున్కి దుఃఖితుండనై పాదప్రహారంబున బిలద్వారంబు గప్పి యున్న శైలశృంగంబుఁ బగులం దన్ని యతిప్రయత్నంబున బహిర్గతుండనై పురంబునకుం జనుదెంచితి నిట్లు రాజ్యలోభంబున భ్రాతృసౌహృదంబు విడిచి విప్రకారంబుఁ జేసినదుర్వినీతుం డగునీసుగ్రీవుండు మన్నించుట కర్హుండే యని పలికి సంక్రందననందనుం డేకవస్త్రంబున నన్నుఁ బురంబు వెడల ననిచె నివ్విధంబున నద్దురాత్మునిచేతఁ బరిత్యక్తుండను హృతదారుండనునై యతనిభయంబువలన శైలకాననసరిత్సహిత యైనమహి యెల్లఁ గలయందిరిగి.
తే. ధారుణీనాథ విను మొకకారణమున, వానికి దురాసదం బైన యీనగంబు
నాశ్రయించి మదిని మనోహారిణీవి,యోగజనితార్తిఁ దపియించుచున్నవాఁడ.
క. వీరోత్తమ నాచే నిపు, డారయ నీకొఱకుఁ దెలియ నతిహితముగ నీ
వైరానుకథన మంతయు, నారూఢిం జేయఁ బడియె నాద్యంతంబున్. 265
వ. మహాత్మా యింతకాలంబునకు సకలలోకాభయంకరుండ వైనని న్నాశ్రయించితి దీనుండ నగునన్నుఁ గరుణార్ద్రదృష్టి నవలోకించి దురాత్ముం డగువాలిం బరిమార్చి రక్షింపవే యని యార్తుండై ప్రార్థించిన సుగ్రీవునివాక్యంబులు విని ధర్మజ్ఞుం డగురాముండు ధర్మసంహితం బగువాక్యంబున నిట్లనియె. 266
తే అగచరోత్తమ విను మదీయంబు లైన, యీరవిమరీచిసన్నిభాహీనశరము
లతిరయంబున దుర్వృత్తుఁడైనవాలి, ఘనశరీరంబుపై వ్రాలఁగలవు నేఁడు. 267

సుగ్రీవుఁడు రామునికి వాలిపరాక్రమంబుఁ దెల్పుట.

తే. నీదుపత్నిని గైకొన్ననీచచరితుఁ, డార్యచారిత్రదూషకుం డైనవాలి
పరఁగ నాదృష్టిపథముసబడినదాఁక, బ్రతికియుండు నవ్వల వాఁడు బ్రతుకలేఁడు.
తే. 'ఆత్మవత్సర్వభూతాని' యనెడున్యాయ, మార్గమున నిన్ను దుఃఖాబ్ధిమగ్నుఁ గాఁగ
నెఱుఁగుదుఁ దరింపఁ జేసెద నింక మీఁదఁ, బుష్కలంబైన కామంబుఁ బొందఁగ
క. అనవుడు ఘనపౌరుషవ,ర్ధనము మధుర మాత్మసద్ధితం బగు రఘువ [లవు.
ర్యునివాక్యము విని రవినం,దనుఁ డిట్లని పలికె వినయతాత్పర్యమునన్. 270
చ. అఱమర లేదు నిక్కము యుగాంతదివాకరుఁ డీజగంబులన్
దరికొని యేర్చునట్లు నిశితప్రదరంబుల వాలి నాజిలో

సురగతి వ్రేల్మిడిం దునుమనోపుదు వైనను వానిశౌర్యముం
గురుభుజశక్తియుం ధృతియుఁ గోరి వినం దగు నీకుఁ దెల్పెదన్. 271

వ. మహాత్మా నావలనఁ దత్పరాక్రమాదికంబు విని యవ్వలఁ గర్తవ్యకార్యంబు నిశ్చయింపు మని పలికి యిట్లనియె. 272

చ. పడమటివార్ధి నుండి నరపాలమణీ యలప్రాక్పయోధి క
ట్టడుగక దక్షిణాంబునిధి నుండి రయంబున నుత్తరాబ్ధికిం
గడువడి నశ్రమంబున జగన్నయనుం డుదయించు నంత కిం
పడర నతిక్రమించి విమలార్ఘ్యవి మొసంగును దజ్జలంబులన్. 278

చ. ధరముమీఁది కెక్కి వడిఁ దచ్ఛిఖరంబులు దోర్బలంబునం
బెఱికి నభంబుమీఁది కెగమీటుచుఁ గ్రమ్మఱఁ జేతఁ బట్టుచుం
సురగిరిధీరుఁ డానముచిసూదనపుత్త్రుఁడు క్రీడ సల్పుఁ దాఁ
గర మనురక్తి బాలకుఁడు కందుకకేళి యొనర్చుకైవడిన్. 274

ఆ. మఱియు నతనికతనచరణఘట్టనమునఁ, బిండి యగు సమస్తగండశిలలు
భూరిసార మైనయూరువేగంబున, విఱిగి కూలు భూరితరువు లెల్ల. 275.

—సుగ్రీవుఁడు రామునికి వాలి దుందుభిని వధించినవృత్తాంతంబుఁ జెప్పుట.—

సీ. సమదనాగసహస్రసత్త్వుఁడు కైలాసశిఖరతుల్యుఁడు నరోత్సేకపరుఁడు
దుందుభి యనునొక్కదుష్టదైత్యుఁడు లులాయాకృతిఁ గైకొని యబ్ధిఁ గదిసి
తనతోడసంగరంబునకు రమ్మని పిల్వ నతఁడు సముత్థితుం డగుచు నాకు
నీతోడఁ బోరాడ నేర్పులే దట్టి బలాఢ్యునిఁ జెప్పెద సభవుమామ |పెరుగు
తే. యచలనాథుఁడు హిమవంతుఁ డనఁగఁ దనరు, నతఁడు నీతోడఁ బోరాడ నర్హుఁ
డనిన శరధి భీతుండయ్యె నని తలంచి, రాక్షసుం డేగెఁ బర్వతరాజుకడకు. 276

వ. ఇత్తెఱంగునఁ జాపచ్యుతం బైనశరంబుపగిది భీషణరభసాతిరేకంబుగా హిమవంతుని డాయం జని తదీయవిపులశిఖరంబులు కొమ్ములం జిమ్ముచు గిరినిర్ఝరకందరంబులు ఖురాగ్రంబులం గోరాడుచు భైరవస్వనపూర్వకంబుగా నట్టహాసంబుఁ జేసిన నగ్గిరిరాజు శ్వేతాంబుదాకారుండును సౌమ్యరూపుండును బ్రీతికరాకృతియు నై నిజశిఖరాగ్రంబునం గూర్చుండి యారక్కసుం జూచి యేను గల మునులకు నాశ్రయుండ రణకర్మంబులయం దసమర్థుండ నన్నుం దొడరుట నీకుఁ గర్జంబు గాదనిన వాఁడు క్రోధసంరక్తలోచనుండై యట్లైన నాకుఁ గయ్యం బొసంగు ననంతబలంబు గలవాని నొక్కనిం జేర్పు మని పలికిన ననుక్తపూర్వం బైనవానివచనంబు విని క్రోధంబున నతం డిట్లనియె. 277

చ. అలఘుపరాక్రముండు దివిజాధిపపుత్త్రుఁడు వానరుండు దో
ర్బలవిభవాధికుండు రిపుభంజనుఁ డాహవశీలి వాలి నాఁ
గలఁ డొకఁ డమ్మహాబలునిఁ గానఁగ నేగు మతండు దక్క న
న్యులకుఁ దరంబె రాక్షసకులోత్తమ నిన్నెదిరించి పోరఁగన్. 278

క. రాక్షసనాయక రణమున, దక్షత గల దేని నీకుఁ దరుచరుకడ కీ
వీక్షణమునఁ గిష్కింధకు, నక్షీణజవప్రతాప మడరఁగ జనుమా. 279

క. అని హిమవంతుఁడు పలికిన, విని రక్షోధిపుఁడు క్రోధవివశుండై గ్ర
క్కునఁ గిష్కింధకు వాలిని, గన వచ్చెం జన్యకాంక్ష గడలుకొనంగన్. 280

వ. ఇత్తెఱంగునఁ గిష్కింధకుం జనుదెంచి ప్రావృట్కాలంబునందుఁ దోయపూర్ణం
బైనమహామేఘంబుకరణి మేనుఁ బెంచి ఘోరం బగుమహిషరూపంబుఁ దాల్చి
తత్పురద్వారంబు నాక్రమించి పాదఘట్టనంబునం బుడమి వడంక సమీపస్థం
బు లగువృక్షంబుల నూరువేగంబున బడలుపడం జేయుచు ఖురప్రహతులధరణి
విదారించుచు మదోద్దండశుండాలంబులీల విషాణాగ్రంబులఁ బ్రాకారగోపురం
బులు విఱుగం ద్రోయుచు నాదుందుభి దుందుభియట్ల గర్జించుచునట్టహాసంబు
జేసినఁ దదీయభైరవస్వనంబు విని యంతఃపురగతుం డగువాలియమర్షణుండై
తారాసహితుం డైనచంద్రుండుం బోలెఁ దారాప్రభృతికాంతాసహితుండై
శీఘ్రంబున లేచి యంతఃపురంబు వెలువడి రయంబునం బఱతెంచి యారక్కసుం
గాంచి వ్యక్తాక్షరపదం బగుమితవాక్యంబున నిట్లనియె. 281

ఉ. ఓరి నిశాట వానరకులోత్తముఁ డంచితశౌర్యశాలి జం
భారిసమానవీర్యుఁడు మహాబలవంతుఁడు వాలి తత్పుర
ద్వారము నడ్డగించి భయదక్రియ ఘోష మొనర్చె దేల నీ
కీరస జీవితాశ గలదేని తొలంగి యథేచ్ఛ నేగుమీ. 282

ఉ. నా విని దానవుండు నయనంబుల నెఱ్ఱఁదనంబు దోఁపఁగా
దైవతరాజనందనునిఁ దప్పక చూచి వనాటశేఖరా
నీవొకపోటుబంటుకరణిన్ గఱితల్వినఁ బ్రేలెదేల నా
లావును నీదులావును బలంబునఁ బోరినఁ దెల్లమయ్యెడిన్. 283

సీ. హరివర నిన్నెప్పు డాజిఁ ద్రుంపఁగఁ గల్గునో యని తమకించుచున్నవాఁడ
నైనను మదమోహితాత్ముండ వై యున్నకతమునఁ దునుమ యుక్తంబు గాదు
మత్తుని సుప్తుఁ బ్రమత్తు నాయుధహీను నాజిఁ జంపిన భ్రూణహత్య యండ్రు
గాన నీనిశ నెట్లైనఁ దాల్మి వహించి యుండెద రణధర్మ మూఁది నీవు

తే. ప్రియలతోఁ గూడి మదనసంక్రీడ సలిపి, రిక్థ మర్థుల కొసఁగి సుహృదులకునుప
దార్థము లొసంగి సుతు వీటి కధిపుఁ జేసి, వేగునంతకుఁ బోరికి వెడలి రమ్ము.

వాలి దుందుభికాయము మతంగాశ్రమమునం బడునట్లు పాదాంగుష్ఠముచేఁ జిమ్ముట.

వ. అని పరిహాసంబుగాఁ బలికిన నారక్కసునివచనంబులకుం గనలి తారాప్రభృతి
కాంతలం బరిత్యజించి నన్ను మత్తుండ వని ప్రహసించితివి గదా నీకు
రణంబున ధైర్యంబు గలదేని యొక్కింతసేపు దలఁకక నిలిచి మదీయపాణి
ప్రహారంబు గొను మీమదంబు యుద్ధోపక్రమంబునం దుత్సాహవర్ధ
నార్థంబు గావించిన వీరపానంబున నైనయది గా నెఱుంగు మని పలికి సంరంభ

విజృంభితుం డై జంభాంతకసుతుండు పితృదత్తం బైన కాంచనమాల యంస
భాగంబున నిడికొని భీషణరభసాతిశయంబుగాఁ గవిసి వానివిషాణంబులు
కరంబుల నొడిసి పట్టి వెనుకకుం బడఁ ద్రోచి కరతలంబునఁ దదీయమస్తకంబుఁ
జఱచి భూనభోంతరంబు నిండ సింహనాదంబుఁ జేసిన వాఁడు బెండుపడక
గండుమిగిలి ఖండనంబునకుం దలపడిన నయ్యిరువురకు వాసవవృత్రులకుం బోలె
ఘోరం బగుసంగ్రామం బయ్యె నప్పుడు తరుపాషాణప్రహారంబులజానుకూర్పర
ముష్టిఘాతంబులం బరస్పరజయకాంక్షలం బోరుచుండఁ గొండొకసేపునకు
రాక్షసుని సత్త్వంబు నశించెఁ బురందరనందనునిబలోత్సాహంబు లంతకంత
కినుమడించుచు వచ్చె నిట్లు ద్విగుణీకృతవిక్రముండై వ్యాపారవీర్యధైర్యపరాక్ర
మంబులం బరిక్షీణుం డైనయారక్షఃపతినిఁ గ్రిందంబడఁ ద్రోచి తాను మీఁదై
కాలం గేల మర్దించి ముఖనాసావివరంబుల రక్తధారలు స్రవింపఁ బంచత్వంబు
నొందించి వానికళేబరంబు యోజనప్రమాణంబు దవ్వులం బడునట్లుగా విసరి
వైచిన నది మతంగాశ్రమసమీపంబునం బడుటయు నందు నియతాహారుండై
తపంబు సేయుచున్న మతంగమునీంద్రుండు తద్వదనద్వారవినిస్సృతశోణితబిం
దువులు వాయువశంబునం దనమీఁదం బడినం గోపించి. 285

ఆ. ఎచట నుండి వచ్చె నీరక్తబిందువు, లెవ్వఁ డింత కార్యమొఱఁగి చేసె
నట్టివాని దుష్టుఁడని బాలిశుం డని, ధర్మహీనుఁ డనియుఁ దలఁప రాదె. 286

తే. అని విచారించి రయమున నడవి దిక్కు
లన్నిపరికించి తనయాశ్రమాంతికమునఁ
గొండపగిది గతాసుఁ డై కూలి యున్న
మహిషరూపాసురునిఁ జూచి మానివరుఁడు. 287

క. తనవిజ్ఞానంబున నది, యనిమిషపతిసుతునికృత్య మని యెఱిఁగి మనం
బునఁ గనలి శాంతినిధి యయ్యును వానికి శాప మొసఁగ నుద్యుక్తుండై. 288

మతంగమహాముని వాలిని శపించుట.

సీ. ఏదురాత్మునిచేత నీయాశ్రమము దైత్యఘనకళేబరముచేఁ గప్పఁ బడియె
నేమందబుద్ధిచే నీవనంబునఁ గలతరులు భగ్నంబులై విఱిగి కూలె
నేమదోన్మత్తుచే నామేను మహిషవదనవినిస్సృతరక్తధారఁ దడిసె
నేపాపచిత్తుచే నీపావనం బైనవిపినంబు నేఁ డపవిత్రమయ్యె
తే నట్టిదుర్బుద్ధి వాలి నేఁ డాదిగాఁగ, నిమ్మహావనమున కీమహీధ్రమునకు
నెన్నఁ డేనియు సచివసంపన్నుఁ డగుచు, వచ్చె నేనియు నప్పుడే చచ్చుఁగాక.

తే. మఱియు నిమ్మహానీయాశ్రమంబునందు
నెపుడు విహరింత్రు వాలి సుహృదులెందఱ
అంద ఱొండొకదిక్కున కరుగ వలయుఁ
జచ్చునట్లుగ శపియింతుఁ జనకయున్న. 290

ఆ. వసుధ నెవ్వఁ డేని వాలితోఁ గలహించి, చేరి యిచట నునికిఁ జేసె నేని
యతని కెన్నటికిని నాదుర్మదాంధుని, వలనిసాధ్వసంబు గలుగకుండు. 291

వ. మఱియుఁ బుత్త్రనిర్విశేషంబుగా నాచేత సురక్షితంబైన యీతపోవనంబునందుఁ బత్త్రాంకురంబులు విదళించుచు ఫలమూలంబులు నశింపఁ జేయుచు నివసించియున్న వాలిసచివు లెవ్వరు గల రట్టివా రంద ఱీదివసంబునం దక్క నెల్లి మదీయ దృష్టిపథంబునం బడి రేని తత్క్షణంబ పాషాణత్వంబు నొంది బహుసహస్ర వర్షంబులు జడులై యుండురు గాక. 292

క. అని శపియించిన విని య, వ్వనమునఁ గలప్లవగు లెల్ల వారనిభీతి
న్వనము విడిచి పఱతెంచినఁ, గని వారల కనియె వాలి కడుశంకితుఁడై. 293

క. కడుపడి మతంగవిపినము, కడచి భయభ్రాంతు లగుచుఁ గపులందఱు నా
కడ కేటికి వచ్చితి ర, క్కడ మీ కెందఱకు స్వస్తి గలదే యనినన్. 294

క. మనమునఁ గుందుచు వా రా, ముని యిచ్చినశాప మెల్ల మునుకొని సంక్రం
దననందనుతోఁ జెప్పిన, విని యాతఁడు చాల భీతివిహ్వలమతియై. 295

సుగ్రీవుఁడు రామునికి దుందుభికాయంబును సప్తసాలంబులును జూపుట.

వ. శీఘ్రంబున నమ్మునిపాలికిం బోయి తదీయచరణంబులకుఁ బ్రణతుండై యంజలిఁ గీలించి ప్రసాదంబు వేఁడిన నమ్మహర్షిశ్రేష్ఠుం డాదరింపక నిజాశ్రమంబుఁ బ్రవేశించుటయు నతండు శాపభయంబున నాఁటంగోలె నీఋశ్యమూకంబు ప్రవేశింప నోడియుండు నక్కారణం బెఱింగి యున్నవాఁడ నగుటం జేసి యేను విషాదంబు దక్కి మంత్రిసహితుండనై ధైర్యంబున నిన్నగంబునం జరియించుచున్నవాఁడ వీర్యోత్సేకంబున వాలిచేత నిరస్తంబైన యాదుందుభియస్థినిచయం బిదె పర్వతోపమంబై పడియున్నది విలోకింపు మఱియునుం గాక శాఖావృతత్వంబున దుర్జ్ఞేయలక్ష్యంబులై యతిస్థూలంబులై మ్రోలఁ జూపట్టుచున్న సప్తసాలంబు లవె విలోకింపు మాసంక్రందననందనుం డిందొక్కసాలంబు లక్ష్యంబుఁ జేసి భుజాబలంబున నిర్గతశరపత్త్రంబుఁ గావించుటకు సమర్థుండై యుండు.

క. క్షితిపతి యతులితముగఁ గపి, పతివిక్రమ మెల్లఁ దేటపడ నీకుం జె
ప్పితి నతని సమరమున నే, గతిఁ జంపెదొ నీవు శంక గదిరెడి నాకున్. 297

వ. అనిన లక్ష్మణుండు ప్రహసించుచు సుగ్రీవు నవలోకించి యెట్టికర్మంబున రాముండు వాలిని వధింపఁ గలం డని నమ్మెద వని యడిగిన నాసుగ్రీవుం డాసౌమిత్రిం జూచి మహాత్మా తొల్లి వాలి యీసప్తసాలంబులందు నొక్కదాని భేదించి దానియందు ఖానితంబైన శరంబును బెఱికి యీసంధియందుఁ గ్రమ్మఱ వేఱొక్కశరంబును గీలించి దానిం బెఱికి యీవిధంబున నొండొకదాని విదారించుచు నిట్లు పెక్కుమార్లు సాలంబుల నన్నింటిని ఛిద్రంబులఁ గావించెం గావున.

క. వెస విభుఁ డీతరువులలో, నసమున నొకతరువు నొక్కయంబకమున నీ
రసఁ గూలఁగ నేసిన ను, గ్రసమరమున వాలిఁ జంపఁగలఁ డని తెలఁతున్. 299

వ. అదియునుంగాక. 300

క. మసలక దుందుభిగాత్రము, ద్విశతధనుర్మాత్రదూరదేశమునకుఁ బ్రే
న్వెస రాముఁడు పదమున నిం, పెసఁగఁగ వడి మీటెనేని యేనతనిఁ దగున్.

వ. అని పలికి యమ్మార్తాండనందనుం డొక్కముహూర్తంబు మౌనంబుఁ బూని యుండి వెండియు రక్తాంతలోచనుం డగు రామచంద్రు వనలోకించి యిట్లనియె.

సుగ్రీవుఁడు శ్రీరామపరాక్రమవిషయంబై సంశయించుట.

సీ. శూరఘాతియు మహాశూరుండు ప్రఖ్యాతబలపౌరుషుండు దోర్బలధనుండు
రణములయం దపరాజితుం డప్రధృష్యుం డమర్షణుఁ డజయ్యుఁడు సురేంద్ర
తనయుండు నిర్జరదైత్యులకైన దుష్కరము లౌనానిదుష్కర్మములను
జింతించి సాధ్వసచిత్తుండనై హనుమంతుఁ డాదిగఁ గల్గుమంత్రినరుల

తే. గూడి పఱతెంచి యీగిరికూట మెక్కి, రేయి పవలును నిద్దుర లేక యిటనె
యుండుచోటికిఁ గదలకయున్నవాఁడ, వాని సాధించునంతనత్త్వంబు లేక.

వ. మహాత్మా యింతకాలంబునకు శ్లాఘ్యుండవు మిత్రవత్సలుండవు మహాధనుర్ధరుండ వైననిన్ను హిమవంతునిం బోలె నాశ్రయించితి నైనను బలశాలి యగు వాలిపరాక్రమప్రకారంబు చిరకాలంబున నుండి యెఱింగి యున్నవాఁడఁ గావున భవదీయవిక్రమం బెఱుంగనికతంబున నతనికి నీకును బలాబలతారతమ్యం బెట్లొకో యని యతనితోడి చివ్వకుం జొరుటకు సంశయించుచున్నవాఁడ నీ వతనికన్న దుర్బలుండ వనుటగాని నీకు భయంబుఁ బుట్టించుటకాని నాయభిప్రాయంబు గాదు భవదీయవాక్యంబును బుద్ధియు నచంచలత్వంబును నాకారంబును భస్మచ్ఛన్నుం డగు వైశ్వానరునియట్ల యనావిష్కృతంబైయున్నభవదీయతేజంబు సూచింపం జేయుచున్నవి భృత్యుండ నైననన్నుఁ గరుణించి మహిషాసురకళేబరోత్క్షేపణాద్యభిజ్ఞానంబుల నామనంబునం బాదుకొనియున్న సంశయంబుఁ బాపవే యని ప్రార్థించిన నతనివాక్యంబులకు సంతసిల్లి ముఖారవిందంబునకు మందహాసంబు చెలువొనంగఁ గౌసల్యానందనుం డరవిందబాంధవనందనున కిట్లనియె. 304

చ. జలజహితామిత్రపుత్త్ర మదిసంశయ మూఁగొని నాకు వాలికిం
గలబలతారతమ్య మెఱుఁగ న్మదిఁ గోరితి వత్తలంపు ని
శ్చలధృతి నిచ్చు నీ వనినచందమునన్ మహిషాస్థి మీటెదం
గలయఁగ జూడు నా దగు నఖండపరాక్రమవిక్రమోద్ధతిన్. 305

వ. అని విక్రమంబు ప్రకటంబుగా నిరూపించి, 306

శ్రీరాముఁడు దుందుభికాయమును పాదాంగుష్ఠముచేత దశయోజనదూరంబునకుఁ జిమ్ముట.

శా. మోదం బావహిలంగ రాఘవుఁడు సొంపుం బెంపు దీపింప న
య్యాదిత్యాత్మజుఁ డద్భుతంబు మది నిండార న్విలోకింపఁగాఁ
బాదాంగుష్ఠముచేత మీఱి విలస త్ప్రాలేయశైలాభ మాం
సాదాస్థిప్రచయంబు యోజనదశప్రాంతంబునం గూలఁగన్. 307

క. ఆయనఘుఁ డిట్లు దుందుభి,కాయము మీటుటయుఁ జూచి కపిపతి మదిలోఁ
బాయనిసంశయమున భ,ద్రాయతమృదుసూక్తి విభున కనియె న్నరలన్. 308

క. మున్నిది మాంసార్ద్రంబై, యున్నది నేఁ డెండ కెంతయును శుష్కంబై
యున్నది వాసవి యలసియుఁ, దన్నెను బిట్టెగయ కీవు తన్నితి వధిపా. 309

వ. అట్లగుటం జేసి. 310

క. అతఁ డెక్కుడో నీ వెక్కుడో, చతురత మీయిరువురందు సత్త్వాంతరము
న్మతి నిశ్చయించుటకు రఘు, పతి నాకు నశక్య మయ్యెఁ బరికింపంగన్. 311

వ. కావున. 312

ఉ. ఓజ దలిర్ప నీ వొకమహోగ్రశరంబున నేఁడు సాలపృ
థ్వీజము నొక్కటి న్వనుముఱిం బడఁ గూల్చిననీకు వాలికి
న్రాజిలున త్త్వసంపదతరంబు నెఱింగి భయంబు దక్కి యో
రాజవరేణ్య నమ్మెదఁ జిరంబుగ నట్లొనరింపఁగాఁ దగున్. 313

తే. హస్తిహస్తంబుకరణి నొప్పారుచున్నట్టి, యిమ్మహాకార్ముకంబు సజ్య మ్మొనర్చి
కడఁగి యాకర్ణపూర్ణంబుగాఁగఁ దిగిచి, విపులసాయక మొక్కటి విడువుమధిప.

వ. అట్లైన నమ్మహానీయశరంబు నిస్సంశయంబుగా సాలంబు భంజించు నాకు సంది
యంబు వాపుట కదియె చాలు నవ్విధం బాచరింపుము. 315

క. మృగములలోఁ గేసరి పన్నుగఁ దేజోవంతులం దినుండు గిరులలోఁ
దగ హిమవంతుఁడు నరులం, దగణితగుణ నీవు ఘనుఁడవై తివి కడిమిన్ 316

రాముఁడు సప్తసాలంబుల నొకబాణంబున ఖండించుట

వ. అని పలికిన సుగ్రీవునిపలుకుల కలరి రఘుపుంగవుండు ప్రత్యయార్థంబు మహా
నీయశరాసనంబు లీలం గేల నందుకొని. 317

చ. ఒకనిశితోగ్రకాండమున నుద్ధతి నెక్కిడి నారిమ్రోఁత ది
క్ప్రకరము నిండ సాలముఁ దగన్ గుఱిగాఁ గొని వేనిగుడ్పఁ గొం
చక యది సాలసప్తకము శైలము నగల్చి ధరిత్రిఁ జొచ్చి వా
రక యొకయింతలో మరల రామునితూణముఁ జొచ్చె లీలతోన్. 318

వ. అప్పు డవ్వానరపుంగవుండు నిర్భిన్నంబైనసాలసప్తకంబువిలోకించిరామునిశౌర్య
వేగంబునకు మనంబున విస్మయంబు నొందుచుఁ బ్రలంబీకృతభూషణుండై
తదీయచరణంబులు తనకిరీటంబుసోఁకం బ్రణమిల్లి కన్నుల నానందబాష్పంబులు

గ్రమ్ముదేఱ మొగంబునం దెలివి దొరకొన నిటలతటఘటితాంజలిపుటుండై
మందమధురవాక్యంబున నిట్లనియె. 319

సీ. ఏమహామహునిచే నీసాలసప్తకం బొకబాణమునఁ దెగి యుర్విఁ గూలె
నట్టినీ వధిప సర్వాస్త్రకోవిదులలో నధికుఁడ వుగ్రవిక్రమాన్వితుఁడవు
నీవు కోపించిన నిర్జరులైనను బోలియుదు రొకవాలి పాలియు నెంత
యమరేంద్రతుల్యుఁడ వగునిన్ను సఖునిగాఁ బడసి యిప్పుడు గతవ్యథుఁడనైతి
తే. నింకఁ దడవేల కరుణార్ద్రదృష్టి మామ, కాంజలిఁ బ్రతిగ్రహించిన నుచితముగ
భ్రాతృరూపకరిపుని విఖ్యాతబలుని, వాలిని వధించి యుపకారశీలి వగుము. 320

వ. అని యివ్విధంబున నభ్యర్థించినఁ బ్రియదర్శనుం డగుసుగ్రీవునిఁ బరమానందంబునం బరిష్వజించి మహాప్రాజ్ఞుం డగురాముండు లక్ష్మణునియనుమతి వడసి శుభవాక్యంబున నిట్లనియె. 321

రామునను మతిని సుగ్రీవుఁడు వాలితోఁ బోరం బోవుట.

ఉ. బంధురవిక్రమస్ఫురణ భానుజ మున్నుగ నీవు వేగ కి
ష్కింధకుఁ బోయి వాలిని బ్రసిద్ధభుజాబలశాలి వీర్యగ
ర్వాంధునిఁ బోరికిం బిలువు మవ్వల మేమును నీవిఱుంద ని
ర్మంథరవృత్తి వచ్చెద మమానుషసాహసరేఖ తోఁపఁగన్. 322

క. హరిపతి కిటు రఘుపతి వెను, వెఱఁగించి కడంగి వానరేశ్వరహనునా
భిరతిం జని తా నొకచో, గురుతరువులు మాటు చేసికొని యుండె రహిన్.

క. సుగ్రీవుఁ డంత రాము న, నుగ్రహ మది నచ్చి గతమనోవ్యాకులుఁడై
విగ్రహరతిఁ గిష్కింధకు, నాగ్రహమునఁ జనియె శీఘ్రయానప్రౌఢిన్. 324

క. ఈగతిఁ గిష్కింధాపురి, కేగి గగన మగలున ట్లహీనధ్వానో
ద్యోగంబు సలిపి ఘనబా, హాగర్వ మెలర్ప వాలి నాజికిఁ బిలిచెన్. 325

ఉ. ఆరవ మాలకించి హృదయంబునఁ గోపము చెంగలింపఁ బా
కారిసుతుండు శీఘ్రమున నస్తతటంబున నుండి వచ్చునం
భోరుహమిత్రు చందమునఁ బూని జవంబున వచ్చి తాఁకె వి
స్ఫారకఠోరబాహుబల సాహసవిక్రమదుర్నివారుఁడై. 326

క. ఈరీతిం దలపడుటయు, శూరోత్తము లైనవాలి సుగ్రీవులకున్
ఘోరముగఁ జెల్లె మింటం, బోరు బుధాంగారకులకుఁ బోలె దుములమై. 327

క. పిడుగులకు సాటి రాఁదగు, పిడికిటిపోటులను ఘోర భిదురముగం బె
న్బెడిదము లగుతలహతులను, వడిఁ బోరిరి మింట వృత్రవాసవుల క్రియన్.

రాముఁడు వాలిసుగ్రీవులతారతమ్యం బెఱుంగక వితర్కించుట

వ. ఇట్లు తారొండొరుని యవక్రపరాక్రమంబునం బోరుచుండ. 329

ఉ. అప్పుడు రాఘవుండు వడి నార్చి పెనంగెడువారి నిద్దఱిం
దప్పక చూచి రూపవదనంబులు మాటలు నొక్కరీతిగా
నొప్పుచు నుండ నందుఁ బురుహూతజు నేర్పఱుపంగ లేక తా
దెప్పర మైనసాయకము దీరత నేయక యుండె శంకచేన్. 330

ఉ. అంత దినేంద్రసూతి ప్లవగాధిపుచేఁ గడు నొచ్చి డస్సి మే
నంతయు రక్తధారఁ దడియ న్రఘువీరునిఁ గాన కార్తుఁడై
చింతిలి ఋశ్యమూకగిరిచేరువ నున్నవనంబులోని క
త్యంతరయంబునం బఱచె సంగము లాతురత న్వడంకఁగన్. 331

క. పఱచిన సుగ్రీవుఁ గని, సురపతిసుతుఁ డవ్వనంబు సొరరామికి ప్రే
ల్లఱచుచు బ్రతికితి పోపో, హరితనయా యనుచుఁ బలికి యరిగెం బురికిన్. 332

మ. జననాథుం డగురాముఁ డంత హనుమ త్సౌమిత్రులం గూడి చ
య్యన సూర్యాత్మజుఁ డున్నకానకు రయం బారంగ విచ్చేసినం
గని యాతం డొకయింత లజ్జయును శోకంబు న్విషాదంబు మో
మునఁ గన్పట్టఁగ దీనవృత్తిఁ బలికె న్స్వామి న్విలోకించుచున్. 333

క. విక్రమముఁ జూపి వాలిన, వక్రగతిం బిలువు మనుచు వాకొని తుది నీ
విక్రియఁ జేయుట తగవే, చక్రేశ్వర హాని గాదె సత్యంబునకున్. 334

క. ఏ నిపుడు వానిఁ దునుమఁగ, రా నని నాతోడఁ గడుఁదిరంబుగ నపుడే
మానుగ నెఱిఁగించిన నట్లూని కడంగుటకుఁ బోకయుండనె యేనున్. 335

క. నా విని రఘునాథుఁడు సుగ్రీవుని వీక్షించి పలికెఁ గీశాధీశా
నీవిటు నిష్ఠుర మాడం, గా వలవదు వినుము దానికారణ మెల్లన్. 336

రాముఁడు వాలిచే నొచ్చిన సుగ్రీవుని ననునయించుట.

వ. నీవును బురందరనందనుండును సమానవిక్రమంబునం బన్ని పోరునెడ నలంకారవేషభాషాప్రమాణగతిస్వరప్రేక్షణంబు లిరువురకు సరియై యున్నకతంబున రూపసాదృశ్యంబువలన మోహితుండనై యందు వాలి నేర్పరింపం జాలక యధిజ్యధన్వుండ నయ్యును జీవితాంతకరంబును ఘోరంబును శత్రునిబర్హణంబును మహావేగంబు నగుశరంబుఁ బ్రయోగించుటకు నుద్యుక్తుండ నయ్యును బ్రాణమిత్రుండవై ననిన్నుం దాఁకునో యనుభయంబున శరంబు విడువ నైతి దీనం దప్పు గాఁగొనకుము మదజ్ఞానలాఘవంబులవలన వీరుండ వైననీవు మద్బాణంబుచే విపన్నుండ వగుదేని మద్బాల్యంబును మాఢ్యంబును జగంబులందుఁ గథితంబు గాదె దత్తాభయవధపాతకంబునకు నిష్కృతి లేదు వినుము. 337

ఉ. ఇంత తన నేల నన్నుఁ బ్లవగేశ్వర నాదగుబుద్ధికౌశలం
బింతియె కాని వేఱొకటి యే విను లక్ష్మణుఁ డేను సీతయుం
బంతముతో భవత్కృపకుఁ బాత్రుల మైతిమి గాదె నీకు మా
కింతయు భేదముం గలుగునే సచివత్వము రిత్తవోవునే. 338

— రాముఁడు గుర్తునకుఁగా సుగ్రీవుని మెడను గజపుష్పి యనులతను ధరింపఁజేయుట. —

వ. కడచనినకార్యంబునకు వగవం బని లేదు వినుము. 339

ఉ. క్రమ్మఱ ధైర్య మూఁది కపిరాజ భవద్రిపుమీఁది కీవు శీ
ఘ్రమ్మున నేగు మేను వెనుకం బటుకార్ముకబాణపాణినై
నమ్మతి నేగుదెంచి బలుచందముల న్వడిఁ బోరుచుండ నా
క్రమ్మునఁ గూలనేసెద మహాబలశాలిని వాలి నుర్వరన్. 340

ఉ. నీవును వాలియుం దొడరి నేర్పునఁ బోరుచు నుండ వీఁడు సు
గ్రీవుఁ డటంచు నిన్నుఁ బరికించుట కే నొకగుర్తు నర్చెదన్
ధీరత దానిఁ గైకొని మదిన్ భయ ముందక వైరి మీఁది క
చ్ఛావిధిఁ బొమ్ము నావలని సంశయముం దొలఁగించి గ్రక్కునన్. 341

వ. అని సుగ్రీవు నోడంబఱిచి రాముండు సౌమిత్రి నవలోకించి. 342

చ. సలలితభంగి నీశిఖరిసానువుల న్శుభలక్షణాకృతిం
బొలిచినయాప్రఫుల్లగజపుష్పిని వే కొని తెచ్చి చాల మే
ల్తలకొన నీకపీంద్రునిగళంబున నిల్పు మటంచుఁ బల్క నే
ర్పలరఁగ నాదినాథిపకులాభరణం బటు సంఘటించినన్. 343

వ. ఇట్లు లక్ష్మణదత్తకుసుమాకులగజపుష్పినామకలతాశోభితకంఠుండై. 344

క. తపనసుతుం డాలతచే, నపు డద్భుతభంగి నొప్పె నంబరవీథి
న్విపులోడుమాలచేతను, విపరీతుం డైనసూర్యువిధమున నంతన్. 345

— సుగ్రీవుఁడు రామలక్ష్మణసహితుఁడై కిష్కింధకుఁ బోవుట —

వ. మఱియు నాసుగ్రీవుండు బలాకామాలచేతం బొల్చుసంధ్యాభ్రంబుచందం
బున నిజదేహప్రభాపటలవిరాజమానుండై రామునియనుమతంబున వాలిపాలి
తం బైనకిష్కింధాపురంబునకుం జనియె రాముండు కాంచనభూషితం బైనదివ్య
చాపంబు సజ్యంబుఁ జేసి సూర్యసంకాశం బైనశరంబును బరిగ్రహించి ఋశ్య
మూకంబు నిర్గమించి యతనివెనుకం జనియె నప్పు డారామునియగ్రభాగం
బున సంహతగ్రీవుం డగుసుగ్రీవుండును శుభలక్షణుం డగులక్ష్మణుండును
జనుచుండిరి బుద్ధిమంతుం డగుహనుమంతుండును బరాక్రమశీలుం డగునీలుం
డును బ్రశస్తబలుం డగునలుండును కీర్తివిజితతారుం డగుతారుండును బృష్ఠ
భాగంబునం జను చుండి రిత్తెఱంగునం గూడుకొని. 346

సీ. ఫలభారసన్నతోజ్జ్వలమహీరుహపుంజరంజితకుసుమితారామములను
సానునిర్ఝరగండశైలదరీఝరీ బహుధాతుశోభితపర్వతములు
శీతలసలిలవీచీమాలికావృత సైకతభూషిత సానువులును
వంజులకారండవమరాళసారసకోకసంఘుష్టతటాకములను

తే. సలలితసుగంధికైరవోత్పలసరోజ, షండమండితరమ్యకాసారములును
మఱియుఁ దక్కనవన్యసమాజములును, వరుస నందంద చూచుచు నరిగి రవుడు.

క. పెన మృదుఘాసాంకురములు, మెసవుచు నిర్భయత స్థలులమెలఁగెడుహరిణా
దినముదయంబులఁ జూచుచు, ననమానప్రౌఢి నంద అరిగిరి వరుసన్. 348

ఉ. తుంగతటాగ్రము ల్వ్రీలుగఁద్రోయుచు ధాతుపరాగసిక్తస
ర్వాంగములై మదోత్కటకటాభిహతద్రుమమండలంబులై
జంగమపర్వతంబులకు సాటి యిడం దగుశుక్లదంతమా
తంగములం గనుంగొనుచుఁ దద్దయు వేడుక నేగి రత్తఱిన్. 349

వ. మఱియు నితరంబులగు వనచరంబులను నానావిధవిహంగమంబులను విలోకించుచు సుగ్రీవవశవర్తులై పోవుచుండ నందొక్కయెడ ద్రుమషండరూపం బగువనంబు నవలోకించి రాముండు సుగ్రీవునిం జూచి గగనంబున మేఘమండలంబుం బోలె నీవృక్షమండంబు పర్యంతకదళీవృతంబై యొప్పుచున్నది దీనితెఱం గంతయు వినఁగోరెదఁ దెల్లంబుగా నెఱింగింపు మనుటయు నతండు పరమాహ్లాదంబునఁ దత్ప్రకారంబు విను మని యిట్లనియె. 350

సుగ్రీవుండు రామునికి సప్తజనాశ్రమవృత్తాంతముఁ దెల్పుట.

సీ. చటులతరోద్యానసంపన్నమును స్వాదుమూలఫలోదకంబును విశాల
మగునాశ్రమం బిది జగతీశ యిచ్చట మును సప్తజను లనుమునులు సంశి
తవ్రతు లేడ్వు రధశ్శీర్షులై జలశాయులై తపములు సలిపి సప్త
రాత్రంబునకు సమీరము నాహరించుచుఁ దతదివ్యవర్షశతంబు లుండి

తే. యేడుతనువులతోఁ గూడ నింద్రపురికిఁ, జనిరి దీనితెఱం గిట్టి దనవరతము
సురగణసుసేవ్యమైన యీదిక్కుఁ జూడ వెఱతు, రమ్మహాత్ములసత్ప్రభావమ్మువలన.

వ. మఱియు వనగోచరంబులగు ఖగమృగంబులును వర్జించియుండు మున్నుప్రవేశించిన ఖగమృగంబులు మోహవశంబునం బరిభ్రమించుచు నేఁటికిం గ్రమ్మఱ రాఁజాలకయున్న వదియునుంగాక. 352

తే. నాజశేఖర సకలాక్షరంబులైన, భూషణారవంబులును మఱి భూరితూర్య
గీతనినదంబులు జెలంగెడు మనోజ్ఞ, దివ్యగంధంబు వీచెడి భవ్యసరణి. 353

క. వారక త్రేతాగ్నులు సొం, పార వెలింగెడుఁ బరాక్రమాఢ్యకపోతాం
గారుణ మగుధూమం బల, రారెడిఁ జూచితె మహీరుహాగ్రంబులపై. 354

తే. సాంద్రధూమసంసక్తమస్తకము లగుచు, నిన్నగంబులు పొలుపారుచున్నవధిప
కంటె ఘనజాలములచేతఁ గప్పఁబడిన, నిరుపమవిశాలవైడూర్యగిరులకరణి. 355

వ. మహాత్ములు భావితాత్ములైన యమ్మహర్షిశ్రేష్ఠులకు నమస్కరించువారి కెన్నటికి నశుభంబు లొందవ నేరవు గావున నీవు లక్ష్మణసహితంబుగా నంజలి ఘటించి యుత్తపోధనుల నుద్దేశించి నమస్కరింపు మని పలికిన నారఘువల్లభుండు భక్తియుక్తంబుగా నవ్విధం బాచరించె నంత నాసప్తజనాశ్రమం బతిక్రమించి హృదయారవిందంబుల నమందానందంబు పొందుచు నిజతేజోజాలంబు దిఙ్ముఖంబులకుఁ దెలివొసంగ నరాత్రుశిత్రుపాణులై శీఘ్రంబునఁ గొండొకదూరం

బరిగి సురేంద్రనందనబాహుపాలితం బైనకిష్కింధాపురంబు నవలోకించి శ
త్రువధార్థంబు లతావితానరంజితనికుంజపుంజంబులమాటున బొంచి యుండి
రి సుగ్రీవుండు విపులగ్రీవుండై కాననంబున నలుదెసలు పరికించి కేవలం బగు
క్రోధం బంగీకరించి పరివారపరివృతుం డై వాయువేగప్రసరం బగుమహామే
ఘంబుకరణి నంబరంబు పగుల గర్జించి బాలార్కసదృశుండును దృప్తసింహ
గమనుండునై క్రియాదక్షుం డగురఘుహార్యక్షు నవలోకించి యిట్లనియె. 356

మ. జయయంత్రాఢ్యయుఁ గీశవాగురయు భాస్వత్స్వర్ణసాలాఢ్యదా
రయు దేవేంద్రజబాహుపాలితయు నై రాణించుకిష్కింధకు
న్నయ మారం జనుదెంచి తీవు ప్రతిన స్సాఫల్య మొందింప వే
దయతో నాగత మైనకాలము మహాత్మా నూత్నపల్లింబలెన్. 357

రాముఁడు సుగ్రీవునితో వాలిని యుద్ధమునకుం బిలువు మనుట.

వ. అనిన విని శత్రుసూదనుం డగురాముండు సుగ్రీవు నవలోకించి యిట్లనియె. 358

సీ. ఈగజపుష్పిచే నిటు కృతాభిజ్ఞానచిహ్నుండ వైతివి చింతయేల
పగతునిదెసఁ బుట్టు పగయు భయంబును రణమున బాణమోక్షణముచేతఁ
బాయఁ జేసెద నాకు భ్రాతృరూపకుఁ డైనశత్రునిఁ జూపుము సంభ్రమమునఁ
బలుకులు వేయేలపగతుఁడు నాదృష్టిపథమునఁ బడి వెండి బ్రతికి పోఁడు
తే. నేని యప్పల నాకడ కేగుదెంచి, తివిరి దోషిఁగా నెంచి నిం దింపు మపుడు
సప్తసాలంబులును ఘోరసాయకమున, నపనిఁ గూలుట దీనికి సాక్షిగాదె. 3:9

తే. హరివరేణ్య నాచేత నేకాంబకమున, విఱిగి యాసప్తసాలము ల్వసధరిత్రిఁ
బడుట వీక్షించితివి గదాబలవిరోధి,తనయుఁ డాదంవమున నేఁడుధరణిఁగూలు.

తే. వృక్షచరనాథ యేను మున్నెన్నఁ డైన, నెట్టియాపదలం దైననించుకైన [గు.
బ్రమసి యైనను బొంకులఁబలికియెఱుఁగ,నిపుడు నామాట కసృతత్వ మేల కలు

క. అమరపతి వృష్టిచే స,స్యమునుం బలె నుత్ప్రతిజ్ఞ ననఘ ఫలోపే
తముగాఁ జేసెద నీకఁ సం,భ్రమమును సంశయము భయము మానుము సుదితోఁ.

క. ఏనినదము విని చెచ్చెర, నానగచరుఁ డనికి వచ్చునట్టియుహీన
ధ్వానం బొనర్చు మిపు డా, హ్వానార్థము భయము దక్కి వానరవర్యా. 368

ఉ. ఆనినదంబు కర్ణపుటమంటినయంతనె లేచి తప్తజాం
బూనదమాలి వాలి వెసఁ బోరికి వచ్చు నతండు మున్ను నీ
చే నవిధర్షితుండు జయశీలుఁడు బాహుబలాధికుండు తే
జోనిధి సంగరప్రియుఁడు శూరుఁ డరిందముఁడౌని గావునన్. 864

సుగ్రీవుఁడు వాలి వచ్చుటకై సింహనాదము సేయుట

తే. వినుము సంగరశూరులు వినుతజనుల, ధర్షణంబు సహింపరు తపనతనయ
మతి విశేషించి సతులసమక్షమందు నున్నచో బీరమెక్కుడై యుండుఁ గాదె.

క. తడ వేల శక్రతనయుని, బెడిదంబుగ సమరమునకుఁ బిలువుము శౌర్యం
బడరఁగఁ దాఁకుము దొల్లిటి, వడువునఁ బాఱంగ వలదు వనచరనాథా. 366

వ. అని బోధించి మనంబుఁ గట్టి పలికిన నారఘువల్లభునివచనంబులు విని హేమపింగళాంగుఁ డగుసుగ్రీవుండు క్రూరంబుగా నాకాశంబు పగుల సింహనాదంబుఁ జేసిన.

క. రోషోత్థిత మగు నా నిర్ఘోషము విని కాంతిఁ దొలఁగి గోవులు భీతి
ఘోషించుచుఁ బఱచె నృపతి, దోషపరామృష్ట లైన తొయ్యలులక్రియన్.

క. మృగములు రణమున శ్రాంతము, లగుహయములమాడ్కి వికలతాప్తి వహించెన్
ఖగము లటు పక్షీణము, లగుగ్రహములకరణి నప్పు డవనిం గూలెన్. 369

ఆ. అనిలచంచలోర్మి యగుసరిత్పతిభంగిఁ, బొంగి యాప్లవంగపుంగవుండు
నింగి నగుల నార్చి నిర్దయుఁడై శక్రసుతునిరాక కెదురు సూచుచుండె. 370

వాలి సుగ్రీవసింహనాదము విని రోషముతో యుద్ధమునకు వెడలుట.

వ. అప్పు డంతఃపురగతుం డగువాలి సర్వభూతప్రకంపనం బైన సుగ్రీవునికంఠనాదంబు విని యమర్షణుం డై తత్క్షణంబ మదంబు పరిత్యజించి క్రోధం బంగీకరించి నేత్రంబులం గెంజాయ రంజిల్ల సంధ్యాతపప్రభుం డయ్యె నప్పుడు రోషపరీతాంగుం డగుటవలన నుపరక్తుం డగుమార్తాండునివడువున నిష్ప్రభత్వంబు నొందినవదంబడి క్రోధంబు పెంపున దీప్తాగ్నియుంబోలెఁ దేజరిల్లుచు దంష్ట్రాకరాళం బై సముత్పతితపద్మంబును సమృణాళంబు నగుహ్రదంబుచందంబునం జూపట్టుచు శయనస్థానంబున నుండి లేచి యంతఃపురంబు వెలువడి చరణఘట్టనంబునం బుడమి యద్రువ శీఘ్రంబునం బఱతెంచుచున్నతనిం గౌఁగిలించుకొని భయంబున మనంబుదిలగొన స్నేహదర్శితసౌమనస్యయగు తార హితోదర్కంబగు వాక్యంబున నిట్లనియె. 371

తే. ఉదయవేళఁ దల్పంబున నుండి లేచి, పురుషుఁ డనుభూత మైనట్టిపుష్పమాల
నట్ల నీవు నదీవేగ మట్ల యడఁగు, మెంచు నీకోపముఁ బరిత్యజింపు మధిప. 372

తే. అనఘచరిత ప్రాతఃకాలమందు నీవు, పోరొనర్పఁగా వచ్చును దారుణముగ
వినుతవిషయబలాబల విషయశంక, నీమనంబున వల దింత నిక్కువంబు. 373

క. సమయముఁ జూచినపగతుని, సమయోచిత మైనకంఠశబ్దము విని సం
భ్రమము జనియించుచున్నది, సమరంబున కిపుడు పోవఁ జనదు మహాత్మా. 374

ఆ. విక్రమమున కిపుడు వేళ గాదు హర్యధీశ, సంగరమునఁ గీడు సంభవించు
వలవ దనుచు నేల వారించె దనిన న, త్తెఱఁగు విన్నవింతుఁ దెలియ వినుము.

ఉ. ఇంతకు మున్ను వచ్చి హృదయేశ్వర పోరికి నిన్నుఁ బిల్చి తాఁ
గొంత రణం బొనర్చి తుది ఘోరతరం బగునీబలంబుచే
నెంతయు నొచ్చి పాఱె దివసేశ్వరనందనుఁ డట్టివాఁడు నేఁ
డింతకు నత్తి వచ్చుటకు నేమియొకో యని శంక తోఁచెడిన్. 376

-ఃః- తార వాలికి హితోపదేశముఁ జేయుట. -ఃః-

చ. రవిజుని బెట్టిదంబును తరంబును యత్నము కంఠనాదము
న్వివిధవిధంబుల న్మనము విన్నవి కన్నవి గావె తొల్లి నేఁ
డవి సవిశేషభంగి విజయస్ఫురణంబు నెఱుంగఁ జేయు చు
న్నవి యది యేమి హేతువొ మనంబునఁ జూచి కడంగు టొప్పగున్. 377

చ. పలుమఱు నీబలంబును బ్రభావ మెఱింగియు నింతకన్న ము
న్బల మఱి యోడి పాఱియును భానుజుఁ డీగతి వెండి వచ్చుట
ల్దలఁపఁగ శౌర్యవీర్యబలదర్పపరాక్రమశాలి యెవ్వఁడో
కలసి సహాయుఁడై యనికిఁ గా వెడలించినభంగి తోఁచెడిన్. 378

క. ప్రకృతివినీతుఁడు నిపుణుఁడు, సకలజ్ఞుఁడు దేశకాలసంవేది యతం
డొకవీరుసహాయతఁ బడ,యక వచ్చునె సత్త్వ మధిక మయ్యెనె నేఁడున్. 379

చ. వినుము కపీంద్ర యాప్తు లగు వేగులవా రొకనాఁడు చెప్పఁగా
విని మనయంగదుండు మది విస్మయ మందుచు సత్వరంబుగ
న్వనమున నుండి వచ్చి యొకవార్తయు నాకు సవిస్తరంబుగా
మునుకొని చెప్పె దాని విధము న్విహితంబుగ విన్నవించెదన్. 380

సీ. వసుధేశు లిక్ష్వాకువంశసంభవు లయోధ్యాధిపసుతులు మహానుభావు
లాజి దుర్జయులు దివ్యాస్త్రవేదులు రాములక్ష్మణు లనువారు లలి రవిసుత
హిత మొనర్పఁగఁ బూనిఋశ్యమూకమునకునరుదెంచియున్నవారందురాముఁ
డనిలోన సాహాయ్య మొనరింప నున్నవాఁడఁటయతం డురువిక్రమాన్వితుండు
తే. రణపటిష్ఠుఁ డాపన్నసంరక్షకుండు,కీర్తినిధి సాధుసంశ్రయుఁ డార్తిహరుఁడు
జ్ఞానవిజ్ఞానఘనుఁ డరిక్షయకరుండు, దివ్యతేజోధనుండు సుధీవరుండు. 381

క. పితృవాక్యపాలకుం డు,ద్ధతవైరివినాశకరుఁడు ధాతువులకుఁ బ
ర్వతముకరణి సుగుణంబుల, కతులితగతి నమ్మహాత్ముఁ డాకర మధిపా. 382

తే. అట్టిరఘుపతితోడ మహాత్ముతోడ, రాజవరుతోడ సమరకర్కశునితోడ
నప్రమేయునితోడఁ గీశాధినాథ, పగగొనుట నీకు తలపోయఁ బాడి గాదు. 383

క. తరుచరవర నీకెయ్యది, పరమహితం బట్టి దాని భర్తృస్నేహా
భిరతిం జెప్పెద నీవ,త్తెఱఁగు విని ఘటింపు మధికధీయుక్తిమెయిన్. 384

చ. పగఁ దొలఁగంగఁ బెట్టి మదిఁ బట్టుగఁ దాలిమి గీలుకొల్పి యీ
వగిది రణస్పృహం జనక భానుసుతుఁ యువరాజ్యమందుఁ బ్రాం
దుగ నభిషిక్తుఁ జేసి రణదుర్జయుఁడై నరఘుప్రవీరుతోఁ
దగ సచివత్వముఁ నెఱపి తత్పరత న్సుఖియించు టొప్పగున్. 385

ఉ. ఎక్కడ నున్న నేమి హృదయేశ్వర సోదరుఁడై నభానుజుం
డొక్కఁడె బాంధవుండు మఱి యొక్కనిఁ దత్సము నీధరిత్రిలో

నెక్కుడఁ గాన మాతనిపయిం దెగు టొప్పునె నీకు జెల్లునే
చక్కఁగ దాసమానసముఖసత్కృతుల న్వెలయింపు మింపుగన్. 386

క. నీవివు డనుగ్రహించిన, భావంబునఁ బొంగి వైరభావ ముడిగి సు
గ్రీవుఁడు ముదమున విపుల, గ్రీవుండై కొలిచి యుండుఁ గేవలభక్తిన్. 387

వ. దేవా వానికిప్పు డొండు శరణంబు లేదు గావున హితైషిణి నగునామతం బంగీకరించి ప్రసన్నుండవై భ్రాతృసౌమనస్యం బవలంబించి రోషంబు పరిత్యజించి శాంతి వహించి శక్రసమానతేజుం డగురామునితోడివిగ్రహంబునకుం జొరక సుగ్రీవునియౌవరాజ్యంబున కభిషిక్తుం జేసి యతండును నీవును బరస్పరబద్ధానురాగంబులం గలసి మెలసి సుఖం బుండుం డని పలికిన. 388

వాలి రోషమునఁ దారను దర్జించుట.

క. తారాధిపనిభముఖ యగు, తారహితోక్తులకుఁ జాలఁ దర్జించుచు వృ
త్రారిసుతుఁ డంతకాలము, చేరువయై యుంటఁ జేసి చిడిముడిపడుచున్. 389

ఉ. తా నొకపోటుబంటువలె దర్ప మెలర్పఁగ వచ్చి పిల్వఁగా
నే నటు పోక తద్వికృతి నెట్లు సహించి రణానివర్తికి
న్వానితశౌర్యశాలి కభిమానికి వైరికృతావమాన స
జ్ఞానన చావుకంటె ధర నక్కట యెక్కుడు కాదె చూడఁగన్. 390

క. అని సేయుకౌతుకంబునఁ, జనుదెంచి మదస్వనంబు సలిపెడుభాస్వ
త్తనయునిపటుసంరంభము, వనితా యే నెట్లు సైఁచువాఁడం జెపుమా. 391

తే. కాంత మత్కృతమందు రాఘవునిఁ గూర్చి
యుమ్మలింపఁగ నీకుఁ గార్యమ్ము గాదు
ధర్మవిదుఁడు కృతజ్ఞుఁడు నిర్మలాత్ముఁ
డమ్మహామహుఁ డేల పాప మ్మొనర్చు. 392

చ. ఎఱుఁగక యిట్లు పల్కఁ దగవే మగువా సతిసౌహృదంబుచేఁ
గఱపితి దాని కేమి బలఘస్మరుఁ డైనఁ గొఱంత లేదు నా
తెఱఁగును సత్త్వసంపదయు ధీరతయు న్మను నీ వెఱుంగవే
మరలుము మాఱుమా టనక మానవతీ వనితాయుతంబుగన్. 393

వాలి సుగ్రీవుని కడకేగుట.

వ. ఏను రయంబునం జని సుగ్రీవుని డాసి ప్రాణంబులఁ గొనుటకుం దెగక కాష్ఠముష్టిప్రహారంబుల నేర్పున దర్పం బుపసంహరించి వచ్చెద నతండు మదీయపాణిప్రహారపీడితుండై తొల్లింటివడువునఁ బాఱుంగలండు నీవంతఃపురంబునకుం జనుమింక మాఱు పలికితి వేని మదీయప్రాణంబులచేత శాపిత వయ్యెద వనిన నద్దేవి యతని గాఁగిలించుకొని మందంబుగా రోదనంబు సేయుచుఁ బ్రదక్షిణంబుఁ జేసి విజయంబు దొరకొనుటకు మంత్రపూర్వకంబుగా స్వస్త్యయనం బొనంగి శోకమోహితయైమరలిమరలి చూచుచు నంతఃపురంబునకుం జనియె నిత్తెఱం

గునఁ దారం బనిచి సంక్రందననందనుండు పరమరోషణుండై మహాసర్పంబు
కరణి నూర్పులు పుచ్చుచు నతిత్వరితగమనంబునఁ బురంబు నిర్గమించి నలు
దిక్కులుం బరికించి. 394

చ. అటఁ జని కాంచె శక్రసుతుఁ డాహవదీక్షితు నుగ్రదర్శనుం
బటుతరబాహువిక్రముని భాసురతేజుని హేమపింగళుం
గుటిలునిఁ బర్యవస్థితుని ఘోరరవు న్వికటాట్టహాసు ను
త్కటమదరోషవిస్ఫురితదారుణనేత్రుని భానుపుత్రునిన్. 395

క. కని యగ్గల మగుకోపం, బున వచ్చితి వటర మరలఁ బోరికి భాస్వ
త్తనయా యని తత్సంద, ర్శనజాతభుజావలేపసంరంభుం డై. 396

వ. కటితటంబునఁ జేలంబు బిగియించి. 397

మ. వికటభ్రూకుటిదుర్నిరీక్షుఁ డగుచు న్విస్రబ్ధుఁ డై శ్లిష్టము
ష్టి కఠోరంబుగఁ దాల్చి భీషణరవస్ఫీతాస్యుఁ డై వేగ డా
సి కడంకం దనయట్ల గాఢమున ముష్టిం బూన్చి యే తెంచుసూ
ర్యకుమారుం గని పల్కెఁ గాలపవనవ్యాలోలమేఘార్భటిన్. 398

క. సునిహిత మగునాముష్టిని, గనుఁగొంటివె యిది మహోగ్రకఠినాశనితో
నెనయై నీజీవితములఁ, గొను సంగ్రామమునఁ బాఱకుము నా మ్రోలన్. 399

క. నా విని రోషంబున సు, గ్రీవుఁడు నాముష్టిఁ జూడు కీశోత్తమ నీ
జీవితముఁ గొనుచు వజ్రము, కై వడి మస్తకముమీఁదఁ గడువడి వ్రాలున్.

వ. అని పలికిన సంక్రుద్ధుం డై శక్రనందనుండు పిడుగునకంటె బెడిదం బగుపిడికిటం
బొడిచిన. 401

వాలిసుగ్రీవులు ద్వంద్వయుద్ధముఁ జేయుట.

క. తాడితుఁ డై సుగ్రీవుఁడు, గాఢోద్ధతి శోణితార్ద్రకాయుం డగుచుం
బీడిత మగుగిరికై వడి, వోఁడిమి సెడ కపుడు భూరిభుజబలయుక్తిన్. 402

శా. సాలం బొక్కటి పెల్లగించి పృథుదోస్సత్త్వంబు దీపింపఁగా
వాలి న్వైచిన విహ్వలుం డగుచు దుర్వారోగ్రవజ్రాహతిన్
శైలప్రక్రియ నేల వ్రాలి మిగులన్ గంపించె మున్నీటిలో
నాలోలద్ఘనవీచికోచ్చలితభారాక్రాంతపోతాకృతిన్. 403

ఆ. అంతఁ గొంతవడికి నమ్మహేంద్రసుతుండు, సేద దీర్చికొని విశేషబాహు
బలసమగ్రుఁ డగుచుఁ బదపడి సుగ్రీవు, నంటఁ దాఁకె నాతఁ డతనిఁ దాఁకె.

వ. ఇత్తెఱంగునం దలపడి సుపర్ణసమవేగులును భీమబలవిక్రాంతులును బ్రవృద్ధఘోర
శరీరులును నై యవ్వానరపుంగవు లంబరంబునం జంద్రసూర్యులచందంబున
నన్యోన్యచ్ఛిద్రాన్వేషణంబు సేయుచుఁ బోరుసమయంబున. 405

ఆ. శక్రనందనునకు శౌర్యవీర్యపరాక్ర, మాదికంబు లధిక మగుచు వచ్చె
నర్కనందనునకు నంతకంతకు నవి, యన్నియును విహీన మగుచు వచ్చె. 406

ఉ. అప్పుడు వాలిచేత జలజాప్తకుమారుఁడు భగ్నదర్పుఁడై
చొప్పఱియుండి యగ్గలిక సొంపునఁ గొండొకధైర్య మూఁది సే
ర్పొప్పఁగ ముష్టిజానుచరణోరుభుజాద్రుశిలానఖంబులన్
దెప్పర మైనచందమునఁ దెంపునఁ బోరుచు నుండె నుద్ధతిన్. 407

క. ఇత్తెఱఁగునఁ దార్కొనుటయు, నత్తరుచరవీరులకు భయావహగతిఁ బో
రత్తఱి బలువై చెల్లెని, యత్తలమున వృత్రునకు బలారికిఁ బోలెన్. 408

ఉ. ఒండొరుమీఁద సాలముల నుద్ధతి వైచుచు రక్తధార లొం
డొండఁ దొరంగ మేఘములు యొప్పిన మింట రవం బెలర్పఁగాఁ
జండగతిం దిరస్కరణశబ్దము లేర్పడ బెట్టు దాఁకుచుం
జండమహోగ్రభానునందనుఁడు శక్రసుతుండును బోరి రుద్ధతిన్. 409

రాముఁడు వాలిపై దారుణబాణమును బ్రయోగించుట.

వ. ఆసమయంబున. 410

చ. నగములపొంతఁ బొంచి రఘునాథుఁడు మాటికిఁ జూచుచున్నవాఁ
డగుట రయంబునన్ ఘనభుజాంచితసత్త్వము దక్కి దీనుఁడై
సొగసి భయార్తి నల్దెసలు చూచుచు నున్నదినేశపుత్రునిం
దగఁ బరికించి వాలిభుజదర్పము సైఁపక తత్క్షణంబునన్. 411

ఉ. కొంచక క్రూరసర్పనిభఘోరశరం బరిఁబోసి కాలుఁడుం
బొంచిక గాలచక్రమును బోలెఁ బ్రచండశరాసనంబు పూ
రించి మృగద్విజంబు లోకరీతి భయంబునఁ బాఱ నారి మ్రో
యించి సురేంద్రపుత్రునిపయిం బరఁగించె జగంబు లార్వఁగన్. 412

క. ఇమ్మెయి రామధనుష్మ, త్క్షమ్మగు మహనీయశరము దారుణపవిఘో
షమ్మునఁ జని వాసవిప, క్షమ్మున వెస నాఁటెఁ బిడుగు కైవడిఁ బెలుచన్. 413

క. నాటుటయు వాలి గ్రక్కునఁ, బాటిల్లిన వేదనాతిభారముకతనం
బోటఱి నేలం బడె శత, కోటిహతం బైనభూరి కుధరము మాడ్కిన్. 414

వ. మఱియుఁ గాంచనాచలసన్నిభంబును గాంచనరూప్యభూషితంబును నగునద్దివ్య
సాయకంబు సధూమంబు నగుభర్గనేత్రాగ్నియుం బోలెఁ బ్రజ్వలజ్జ్వాలాజాలభీష
ణం బై రయంబునం బఱతెంచి వాలివక్షంబున నాటినఁ దత్క్షణంబ పుష్పితా
శోకంబుచందంబున క్షతజోక్షితశరీరుండై పరశునికృత్తం బగుపాదపంబుకైవడి
గాఢదేశంబునం దశ్వయుక్పూర్ణమాసియందు శక్రోత్సవార్థంబు సంస్థాపించి
యుత్సవానంతరంబునం బడఁద్రోచినయింద్రధ్వజంబుపోలికధరణిపయిం బడియె
నప్పుడు. 415

క. బలసూనసాంశతేజః, కలితుం డగువాలిపడినకతమున ధాత్రీ
తల మిందువు లేనినభః, స్థలముపగిదిఁ గడు నశోభితం బయ్యె రహిన్. 416

-ఇ- వాలి రామబాణపీడితుఁడై నేలం బడుట. -ఇ-

చ. గురుతరసాయకాభిహతిఁ గొండవిధంబున నేలఁ గూలియుం
దరుచరశేఖరుండు పితృదత్తమణీమయహేమమాలచేఁ
దరణికరంబులం గలసి తద్దయు సంధ్యలయందుఁ బొల్చు భా
నురజలదంబుచందమున శోభిలె శోణితసిక్తగాత్రుఁడై. 417

వ. మఱియును. 418

చ. సురవరదత్తవజ్రరుచిశోభితకాంచనమాల వక్షమం
దురుతరభంగి శోభిలుచు నున్నకతంబున జీవితంబులున్
గురుతరవిక్రమంబును మనోహరతేజము భూరికాంతియుం
బరువడి వాలిగాత్రమును బాయక యుండె మహాద్భుతంబుగాన్. 419

క. ధరఁ బడినవాలిమాలయు, శరము శరీరంబు మిగుల సంశోభించెన్
గురుతర మగుతత్తేజం, బరుదారఁగ మూఁడువిధము లాయెనొ యనఁగన్. 420

-ఇ- రాముఁడు వాలి సమీపమునకు వచ్చుట. -ఇ-

క. రామధనుర్ముక్తం బగు, భీమాస్త్రం బవుడు జంభభేదిసుతునకున్
ద్యోమార్గభావనంబై, కామితపరమగతిదాయకంబై చెల్లెన్. 421

వ. అప్పుడు. 422

సీ. విగతతేజుం డగువీతిహోత్రునిమాడ్కిఁ బుణ్యాంతమున సురపురము నుండి
యవనిపైఁ బడినయయాతిరీతి యుగాంతమందుఁ గాలునిచేత నచలమీఁదఁ
బాతితుం డగురవిభంగి సొం పఱి నేలఁ బడియున్నవాని గోపతియుఁ బోలె
దుర్ధర్షుఁ డగువాని ధూర్తసర్పముఁబోలెఁ బొరిఁబొరి యూర్పులు వుచ్చువాని

తే. సింహవక్షంబువాని బ్రసిద్ధదీర్ఘ, బాహువులవాని దీప్తలపనమువాని
కనకమాలిని వాలిని గదియ వచ్చె, జానకీజాని సౌమిత్రిసహితుఁ డగుచు. 423

క. చను దెంచినరఘురామునిఁ, గనుఁగొని హరివరుఁడు హేతుగర్భితముగ ని
ట్లనియెం బలుకుల ధర్మం,బును బౌరుష్యంబు న్యాయబోధము గలుగన్. 424

క. అంచితధర్మం బరయక, కొంచక సంగరపరాఙ్ముఖుఁడ నగునన్నున్
వంచించి యేమి గుణ మా, ర్జించుటకు వధించి తీవు పృథివీశసుతా. 425

మ. నయయజ్ఞుండు దృఢవ్రతుండును బ్రజాసంరక్షణోద్యోగి యు
త్తమవంశుండును ధర్మవేదియు దయాదాక్షిణ్యసత్త్వాన్వితుం
డు మదక్రోధవియుక్తుఁడున్ రఘుకులేంద్రుం డంచు నీకీర్తి ని
త్యముఁ గీర్తించు సమస్తభూతనివహం బత్యంతయోగ్యంబుగన్. 426

క. దమమును ధృతియును దేజము, శమమును సత్యంబు క్షమయు సాహసంబు పరా
క్రమ మపకారులయెడ దం,డము దానము నృపుల కివి ప్రధానగుణంబుల్.

తే. అట్టి గుణములు గలవాఁడ వని తలంచి, యంగనాప్రతిషిద్ధుండ నయ్యు నేను

ననికిఁ బిలిచినఁ బోకుండుటనుచితంబు, గాన వచ్చితిఁ బగతునికడిమిఁ జెఱుప.

క. వీరునితో మార్కొని ప్రతి, వీరుఁడ వై పోరుచుండ వెనుక నొదిఁగి ని
ష్కారణముగ వంచించి వి, దారింపఁగ నీకు రాజధర్మం బగునే. 429

ఉ. లావును జేవయుం గలయిలాపతి రాముఁడు తోడు గల్గు సు
గ్రీవుని కీవు పోవలదు కృత్రిమభంగి వధించు నంచు నా
దేవి యెఱుంగఁ జెప్పినను ధీరతఁ గైకొన కమ్మహాత్ముఁ డే
లా వధియించు ధర్మపరుఁ డంచుఁ దలంచితిఁ గాదె యత్తఱిన్. 430

క. నిర్మలమతి వనియును నృప, ధర్మవిశారదుఁడ వనియుఁ దలఁచితి నిటు దు
ష్కర్మమునకు బోయలక్రియ, నర్మిలి బాల్పడుటఁ దలఁపనైతి నృపాలా. 431

వాలి రాముని నానావిధంబుల నిందించుట.

క. నీపాటిధర్మపరునకు, భూపాలకుమార యిట్టికల్మషకార్యం
బేపాటి తృణసమావృత, కూపము వని నిన్నెఱింగికొన లేనైతిన్. 432

క. మనమునఁ గిల్బిష మిడుకొని, మునివేషముఁ బూని నెయ్యిఁబూసినయసి సొం
పున భస్మచ్ఛన్నం బగు, ననలుని క్రియ నుండు టెఱుఁగనైతి నృపాలా. 433

క. విను మెంత సత్కులంబున, జనియించిన నేమి కపటచరితుఁడు మదిలోఁ
దనగుణము విడువనేర్చునె, జనవర నీయందు నట్టిచందము దోఁచెన్. 434

క. మున్నెచ్చట నైనను నీ, కెన్నఁడు విప్రియ మొనర్చి యెఱుఁగనినన్నుం
గ్రన్నన నీవగుదాష్ట్యం, బెన్నిక కెక్కంగఁ జంపి తేల నృశంసా. 435

క. సదయుఁడు రాఘవుఁ డేలా, యదయతఁ బాపంబు సేయు నని యేమఱి యి
ప్పు డనికి వచ్చిననన్ను, న్వధియింపఁగఁ జెల్లె నీకు వంచనచేతన్. 436

క. ఫలమూలంబులు మెసవుచు, నలయక నిత్యంబు దారుణారణ్యములం
గలయ విహరించు చుండెడు, బలీముఖుని నన్నుఁ జంపఁ బాడియె నీకున్ 437

క. కులమును సత్యము తేజము, చెలువము విక్రమము ధృతియు శీలము యశము
న్బల మెచ్చు కలిగి యుండఁగ, నిల నీమనమునకు హైన్యమేటికిఁ గలిగెన్. 438

తే. రాజకులమునఁ బుట్టి విశ్రాంతిఁ గాంచి, నట్టివాఁ డెవ్వఁ డవని నీయట్లు కపట
ధర్మలింగప్రతిచ్ఛన్నతావిశేష, ములముకొని క్రూరకర్మంబు నాచరించు. 439

తే. అపని నిట్టియభవ్యుండ వైననీవు, పావనం బైన మానిరూపంబుఁ దాల్చి
యేల విహరించెదవు ధర్మశీలుఁ డనఁగ, లోకవిఖ్యాతి యెబ్బంగి నీకుఁ గలిగె.

తే. మానవేంద్ర పాపాత్ముండ వైననీకు, భవ్యతర మైనమానిరూపం బిదేల
సమరధర్మప్రకారవిశారదులకుఁ, దాల్పఁ దగినయీదివ్యకోదండ మేల. 441

వ. రఘువరా యేము వనచరులము మీరు మనుష్యుల రేము మూలఫలోపజీవు
లము మీరు రాజాన్నభోజనులరు గావున మీకు మాకు నించుకయైన వైరప్ర
వత్తి గలుగ దదియునుం గాక. 442

తే. వసుధయును గాంచనంబును వైరమునకు, నైనమూలంబు లివి మదీయంబు లైన
వనఫలములందు దేనిని బడయఁగోరి, మిహిరకులజ వంచించి చంపితివి చెపుమ.

వ. మఱియు నయంబు ననుగ్రహంబు నీ రెండును సద్రాజధర్మంబులు విపరీతనయం
బును నిగ్రహంబు నీరెండును గుత్సితరాజధర్మంబు లగు నిట్లు రాజవృత్తిపృథ
గ్విధంబై గ్రహింపం దగియుండు నైనను రాజులు తమయిచ్ఛకొలంది నయా
నుగ్రహంబులును వినయనిగ్రహంబులును గావింపరు నీవు కామప్రధానుండవు
కోపనుండవు మర్యాదారహితుండవు సంకీర్ణరాజచరితుండవు వధ్యావధ్యవిచా
రంబు దక్కి సాధుల హింసించెడునట్టిక్రూరుండ వదియునుం గాక. 444

తే. మనుజవర్య నీ వర్థధర్మములచంద, మించుకైన నెఱుంగ లేవింద్రియాను
షంగమునఁ జేసి కామసంసక్తిఁ దగిలి, నిత్యముఁ జరించెదవు బుద్ధినియతి లేమి.

ఆ. అనపరాధి నైన ననుఁ జంపి నిందిత, మైనక్రూరకర్మ మాచరించి
నరవరేణ్య సాధుపురుషమధ్యంబునఁ, దలఁక కేమి నీతిఁ బలికె దింక. 446

చ. పతితుఁడు ప్రాణిహింసకుఁడు బ్రాహ్మణహంతయు రాజహంత గ
ర్వితుఁడును నాస్తికుండు పరివేత్త కదర్యుఁడు గోఘ్నసూచకు
లిప్తజనహంత చోరుఁ డజితేంద్రియుఁ డుగ్రుఁ డురుతల్పగుండు దు
ర్గతి కిహముం బరంబుఁ జెడి గ్రక్కునఁ బోదురు నిక్క మింతయున్. 447

తే. పంచపంచనఖంబులు భక్ష్యములు మ, హీసురోత్తములకు మానవేశ్వరులకు
శశము కూర్మంబు గోధయుఁ శల్యకంబు, శ్వావిధంబును ధరలోన జనవరేణ్య.

వ. ఏ నభక్ష్యం బైనపంచనఖజంతువనను. 449

తే. దశరథకుమార మీయట్టిధార్మికులకు, నాదు చర్మంబు మెయిఁదాల్పరాదు నెమ్ము
లంటఁగారాదు మాంసంబు నాహరింప రాదు ననుఁజంప నీకేమి ప్రోదియయ్యె.

తే. మానవేశ్వర సర్వజ్ఞ మైనతార, యెఱిఁగి యెంత బోధించిన నరకుఁగానక
నంతకాలంబు డగ్గఱినందువలన, మోహవశమున నచ్చితి మోసపోయి. 451

క. వాలాయము నీచేఁ బరి, పాలిత యగుభూతధాత్రి భద్రము నడయం
జాలదు ధూర్తవిభునిచే, శీలాలంకార మైనచెలువయుఁ బోలెన్. 452

తే. నికృతిజీవివి శఠుఁడవు నీచమతివ, ధార్మికుండవు మఱియు మిథ్యాప్రశాంత
మానసుఁడవీవు నృపలోకమాన్యుఁడైవ, పంక్తిరథుఁ డెట్లునుతునీఁ గఁబడసెనిన్ను.

తే. త్యక్తధర్మాంకుశంబు మదాన్వితంబు, భిన్నచారిత్రకక్ష్యంబు భీషణంబు
సాధుహింసోత్థితం బగుసమదరామ, హస్తిచే నేఁడు నిహతుండ నైతి నకట.

క. అనుచిత మమంగళము లో, కనిందితము నైనదీనిఁ గావించి మహా
జనమధ్యంబున భూవర, తనయా యిఁక నేమి పలుకఁదలఁచితి బుద్ధిన్. 455

తే. రామ యే నీదురంతవిక్రమము ధాత్రి, ననపరాధుల మైనమాయందుఁ గడువి
రాజితం బయ్యె నట్టిపరాక్రమంబు, కడఁగి యపకారులం దేమిగానము గద.

క. వంచించి కానఁబడక వధించితి గా కెదుట నిల్చి ధీరత ననిఁ గా
వించిన నిను యమపురికి నొ, కించుకమాత్రమునఁ బుచ్చనే యవలీలన్. 457

తే. అవనినాథ దుర్ధర్షుఁడ నైన యేను, మొనసి నీచేతఁ జచ్చితి మోసపోయి
కాలసంయోగమునఁ జేసి గాఢనిద్రఁ, జెందిన నరుండు సర్పంబుచేతఁ బోలె.

క. నాతో నీదగు కార్యము, చేతోముద మలర మున్నె చెప్పితి వేనిన్
ఖ్యాతిగ నొకగడెలో ధర, ణీతనయను దెచ్చి యొసఁగనే యవలీలన్. 459

ఉ. భూనరవర్య యెవ్వనిసముద్ధతిఁ జంపుటకై గడంగి సు
గ్రీవునితోడ నెయ్య మొనరించి తదీప్సితసిద్ధిఁ గోరి న
న్నీవిధిఁ జంపి తట్టిదనుజేంద్రుని రావణు గీటడంచి నీ
దేవిని నెందు డాఁచినను దెచ్చి యొసంగనె యొక్కవ్రేల్మిడిన్. 460

క. జలధిజలమునందు డాఁచిన, నలయక పాతాళజగమునందు నిడిన మై
థిలిని గొని తెచ్చి యొసఁగనె, పొలుపుగ శ్వేతాశ్వతరినిబోలె నరేంద్రా. 461

వ. రాజనందనా సుగ్రీవుండు నాకు జ్ఞాతి గావున నన్ను వధించి వానరరాజ్యంబుఁ గైకొను టది యతనికి యుక్తధర్మం బగుం గాని వంచించి రణంబున నన్ను వధించు టది నీకు యుక్తధర్మంబు గాదు లోకంబునందు మర్త్యుల కెల్ల మరణంబు గలుగు టది నిసర్గంబు నీచేతఁ గావింపం బడినయిట్టికృత్రిమవధరూప కార్యంబు యుక్తం బగునేని సమాధాయకం బైనయుత్తరంబు యోచించి చెప్పు మని పలికి. 462

క. ఘనుఁ డైన పాకశాసన, తనయుఁడు నోరెండఁ దీవ్రతరశరకృతవే
దన కోర్వక దశరథతన, యునిఁ జూచుచు మాట లుడిగి యూరక యుండెన్.

తే. సాధువినుతంబు ధర్మార్థసంహితంబు, పరమముహితంబు యోగ్యంబు ప్రశ్రితంబు
నగు పురందరసుతువాక్య మాలకించి, వాక్యకోవిదుఁ డారఘువర్యుఁ డపుడు.

రాముఁడు వాలికిఁ బ్రత్యుత్తరములు చెప్పుట.

మ. హతభానుం డనుభానుభంగి గతతోయాభ్రంబుచందాన సం
హతతేజుం డగువహ్నిరీతి వికలుం డై యున్నవాని న్నము
న్నతసత్త్వాఢ్యుని వ్యక్తవాక్యుని రణన్యాయైకశీలు న్నమి
జ్జితశూరాలిని వాలిఁ గాంచి నయముం జెల్వొందఁగా నిట్లనున్. 465

తే. అగచరకులాగ్రగణ్య ధర్మార్థకామ, ములును లౌకికసమయంబు దెలియ కిపుడు
బాలిశత్వంబువలన నీపగిది నన్ను, నిష్ఠురోక్తుల నిందింప నీకుఁ దగునె. 466

క. గురుసమ్మతు లతిసుగుణో, త్తరు లగు పెద్దలవిధంబుఁ దలఁప కిపుడు వా
నరచాపల్యమువలనను, దర మెఱుఁగక నన్ను దూఱఁ దగవే నీకున్. 467

క. జలధిగిరిసహిత యగు నీ, యిల యిక్ష్వాకులది వారు మృగపక్షిమను
ష్యుల నమయ మరసి కావను, జలమున దండింప నధికశక్తులు ధాత్రిన్. 468

ఉ. అట్టిధరిత్రి సద్భృతదయాకలితాత్ముఁడు రాజనీతికిం
బుట్టినయిల్లు ధర్మముల ప్రోవు శమాదికసద్గుణాలికిం
బెట్టియ యర్థధర్మములపేరిటి వృక్షము నెమ్మనంబునం
దొట్టినసత్యయుక్తి భరతుం డిపు డేలుచు నున్నవాఁ డొగిన్. 469

క. వినయంబు నయము సత్యము, ఘనతరవిక్రమము దేశకాలజ్ఞత్వం
బును నిగ్రహం బనుగ్రహ, మనుపమగతి నొప్పుచుండు నాతనియందున్. 470

తే. ఇతరనృపులును మేము సొంపెసఁగ నతని, సత్యధర్మకృతాదేశసరణి నొంది
పరఁగ ధర్మపరంపరాప్రాప్తికొఱకు, వసుధ నెల్లఁ ద్రిమ్మరుచున్నవార మిపుడు.

మ. దురితధ్వాంతసహస్రరశ్మి నృపశార్దూలుండు ధర్మజ్ఞుఁ డా
భరతుం డేలిక యైచు నుండ నయసంపన్నుండు గా కెవ్వఁడు
ర్వర వర్తించు నొకానొకండు జడత నవ్వర్తించిన న్వాని బం
ధురశౌర్యంబున నిగ్రహింతుము నడి స్దురావరరాజాజ్ఞ చేన్. 472

క. కర్మవిగర్హితుఁడవు నృప, ధర్మవిహీనుఁడవు కామతత్పరుఁడవు స
త్కర్ము లగుసాధు లూఁదిన, నిర్మలమార్గమున నిలిచి నెగడవు ధాత్రిన్. 473

క. నీతిజ్ఞుఁ డైనవానికి, త్మాతలమున నెఱుఁగవలయుఁ గపివర జ్యేష్ఠ
భ్రాతను దాతను విద్యా,దాతను మువ్వురను దనకు దండ్రులు గాఁగన్. 474

క. అనఘచరిత్రుం డగుతమ్ముని శిష్యుని మఱియుఁ దనకుఁ బుట్టినవాని
న్వీను మీామువ్వర నంక్రం, దనతనయా పుత్రు లనుచుఁ దలఁపఁగ వలయున్.

వ. కపీంద్రా సర్వభూతహృదయస్థుం డైనపరమాత్మ శుభాశుభకారణం బైనధర్మా
ధర్మం బెఱుంగు సూక్ష్మం బైనధర్మంబు సాధువులకైనను బరమదుర్జ్ఞేయంబు
భవాదృశులకుం జెప్పనేల నీవు జాత్యంధులం గూడినజాత్యంధునిభంగి నకృ
తాత్ము లైనచపలవానరులం గూడి యతిచపలుండవై ధర్మాధర్మప్రకారం బేమి
యు నెఱుంగవే నీపూర్వోక్తవాక్యార్థంబువ్యక్తంబుగా నీకెఱింగించెద నన్నుఁ
గేవలరోషంబువలన నిందింపకుము. 476

సీ. సురనాథతనయ శిష్యునిభంగి నతిభక్తిఁ బాయక శుశ్రూష సేయునట్టి
యనుజునిపత్నియం దతికామమున నధర్మస్థితి నాతండు బ్రతికి యుండఁ
జరియించితివి గానఁ గరము నీయందు దండంబు ప్రయుక్తమై తనరె నిపుడు
ధర్మవిద్వేషి కీదండంబు దక్క వేఱొకటి నిగ్రహవిధ మూర్వి లేదు

తే. భగినిఁ గూఁతును దమ్మునిభార్య నెవ్వఁ, డధిగమించు నతఁడు వధ్యుఁడనిరిమాను
లెఱిఁగి దండించినను బావ మేల గల్గు, నుర్వివిభునకు దండింపకున్నఁ గాక. 477

వ. వానరేంద్రా భ్రాతృభార్యావమర్శనంబు సుగ్రీవునకును సమానం బని యంటి
వేని సుగ్రీవుండు మాయావిబిలాంతర్గతయుద్ధంబున నీమరణంబు నిశ్చయించి
తారయందు వర్తించె నీవు సుగ్రీవుండు సప్రాణుం డగుట యెఱింగియు నతనిపత్ని

యగు రుమయందు వర్తించితివి గావున నీదోషంబునకును సుగ్రీవుని దోషంబు
నకును వైషమ్యంబు గల దట్లగుటం జేసి నిన్ను వధించితి దీన దుష్టనిగ్రహశిష్టపరి
పాలనధురంధరసార్వభౌముభరతమహీపాలకాజ్ఞాకారి నగునాకు దోషంబు లేదు.

ఆ. పరమధర్మవిదుండు భరతుం డధీశుం డే, మతనియాజ్ఞం బూని యలరువార
మీవు సాధుధర్మహీనవర్తనుండ, వుపేక్ష సేయ నచ్చు నెట్లు మాకు. 479

తే. ధర్మసంస్థాపనంబు నధర్మనిగ్రహంబు భరతున కివి పను లతనియాజ్ఞం
బూని చరియించెదము మిముబోంటిదుష్టవర్తనులం బట్టి తునిమెదు వాంఛం జేసి.

వ. అదియునుం గాక లక్ష్మణునితోడం బోలె సుగ్రీవునితోడ వహ్నిసాక్షికంబుగా
దారరాజ్యనిమిత్తంబు సఖ్యంబుం జేసి వాలిం బరిమార్చెద నని వానరమధ్యం
బున బాస యిచ్చియున్నవాండ నా సుగ్రీవుండు నాకు నిశ్శ్రేయసకరుండు గా
వున మిత్రశత్రుండ వైన నిన్ను వధించి ప్రతిజ్ఞ నెఱపుట ధర్మవిరోధంబు గాదు
ప్రాణసమానమిత్రుం డైన సుగ్రీవునకు శత్రుండ వైన నీవు నాకు శత్రుండ వగుట
కేమి సందియంబు నిన్ను వధింపనినాండు నాకు మిత్రద్రోహదోషంబు వాటిల్లు
నిష్కారణంబుగా నిన్ను వధించినవాండం గాను భ్రాతృభార్యాపహరణభరతా
జ్ఞాకరణసుగ్రీవసఖ్యకరణప్రతిజ్ఞాకరణాదిధర్మసంహితసమస్తకారణంబులచేత భ్రా
తృభార్యాపహారకుండ వైన నిన్ను శాసించితి నిది శాస్త్రవిహితం బని నీవు నూ
హింపవచ్చు సర్వప్రకారంబుల భవన్నిగ్రహంబు సాధుసమ్మతం బగుం గాని నిం
దితంబు గాదు ధర్మవిశారదుం డగువాండు వయస్యుని కేనియు నేతాదృశపాపం
బొనర్చినవానికి నేతాదృశదండంబు విధింపవలయు ధర్మవిశారదుండ వగు నీవును
మద్విహితం బగు దండం బంగీకరింపవలయుం గాని నిందింపం జనదు మదీయదం
డంబున నీవు దురితంబులం బాసి పుణ్యగతికిం జనియెద వీయర్థంబునందుం
గొన్ని మనువచనంబులు గల వవి చారిత్రవత్సలంబులై ధర్మకుశలు లగువారల
చేత గృహీతంబులై యుండుం దత్ప్రకారంబు వినుము. 481

క. జను లఘము లాచరించియు, జనవరకృతదండు లగుచు సన్నుతయశులై
యనిమిషలోకపదమునకు, సునిశితగతిం జనుదు రధికసుకృతులమాడ్కిన్. 482

క. జననిందిత మగువృత్తము, గొనకొని కావించు నట్టికుజనుల దండిం
పనినాండు రాజు వారల, ఘనతరదోషముల నొందం గలండు నిజముగాన్.

వ. అని మనువు చెప్పె నదియునుం గాక తొల్లి నీచేతం బోలె నొక్కక్షపణకునిచేతం
బాపం బాచరితం బగుచు నుండ మద్వంశశ్రేష్ఠుం డైన మాంధాతచేత నా శ్రమ
ణునియందు ఘోరం బగు దండంబు ప్రయుక్తం బయ్యె మఱియు రాజులు
ప్రమత్తు లగుచు నుండం గొందఱు జనులు నీయట్ల పాపం బాచరించి రావసుధా
ధిపులు పిమ్మట ధర్మపరామర్శవేళయందు గతప్రమాదులై నియమపద్ధతి నప్పా
పాత్ములకు వధబంధనాదిప్రాయశ్చిత్తంబు గావించిరి దండకర్మంబున నమ్మహీ
పతులకు దుష్కృతం బాదవలేదు గావున. 484

ఆ. ఏను దత్ప్రకార మెఱింగి నీ వగుపాప, మవనివిభునిఁ జెందు నని తలంచి
ఘోరసాయకమునఁ గూలవైచితి దీనఁ, దప్పు లేదు రాజధర్మవిధికి. 485

క. నీవు మదగ్రజ ప్రాదు,ర్భావంబున ఘాతకఘోరపాపుఁడ వైతే
వావాసమునకుఁ జనియెద, వీవిధమునఁ బరితపింప నేటికి నింకన్. 486

క. వనచర దుష్టుఁడ వగుని, న్ననిఁ జంపుటవలన నేఁ గృతార్థుఁడ నైతి
న్నేను నీవును నాచేఁ జచ్చినకతమున స్వర్గపదముఁ జెందితి విపుడున్. 487

వ. ఇక్కార్యంబు మన కిరువురకు నధికోదయం బైనయది దీనికి వగచుట కార్యంబు గా దేము శాస్త్రవశ్యులము గాని స్వతంత్రులము గా మివ్విధంబు ధర్మంబు దప్పకుండఁ బరికల్పితం బయ్యె నట్లని తస్కరకృత్యంబునం బొంచి వంచించి నన్నేల ద్రుంచితి వని యాక్షేపించితి వేని దానికిం గల కారణంబు దెలిపెద హేతుమంతం బైనదాని వినినఁ గోపంబును మనస్తాపంబునుం బాయుఁ దత్ప్రకారంబు వినుమని యిట్లనియె. 488

సీ. మహిలోన మనుజులు మాంసార్థులై పొంచియైన ముంగల నిల్చియైన నేమి
బహువిధవాగురాపాశకూటములచేఁ బరువెత్తుచున్నను బడలియున్నఁ
దెలివితో నున్న నిద్రించుచు నున్న నేమఱియున్న సంక్రీడ మరఁగి యున్న
సౌముఖ్యమున నున్న వైముఖ్యమున నున్న నెటులున్న హింసింత్రు మృగగణంబు
ఆ. నధికధర్మవేత్త లైనరాజర్షులు, ధర్మ మనుచు వేఁటఁ దగులుపడరె
నృపుల కెల్లగతుల మృగములఁ జంపుట, వలనఁ గల్మషంబు గలుగ దెందు. 489

క. నీవును శాఖామృగమవు, గావున వంచించి తీవ్రకాండమున హతుం
గావించితిఁ గిల్బిష మే,లా వచ్చు న్ధర్మ మగ్గలం బగుచుండన్. 490

క. సతతము శుభమునకు స్జీ,వితమునకును నీతికిని వివేకంబునకు
న్క్షితినాథులు దాతలు జన, హితులు పరమధర్మనిరతు లెంతయు ధాత్రిన్. 491

క. అట్టినృపుల నవినీతిఁ, దిట్టుటయును దెగడుటయును నిందించుటయు
న్నెట్టలుగుట నేరము పైఁ, బెట్టుట దగ దెవ్వరికిని విపినాటవరా. 492

ఉ. వేల్పులు ధాత్రియందు నృపవేషముఁ బూని చరింతు రిప్పు డీ
వల్పమనీష ధర్మమహిమాతిశయం బెఱుఁగంగ లేక నం
కల్పితముఖ్యరోషమునఁ గామమునం గలుషానుభూతికిం
బాల్పడి వంశధర్మపరిపాలుని నన్నిటు దూఱఁ జెల్లునే. 493

వాలి రాముని స్తుతియించుట.

మ. అని రామావనినాథుఁ డాడుటయుఁ గీశాధీశుఁ డవ్వాక్యము
ల్విని ధర్మంబు తెఱంగెఱింగి మది జాలిం జెంది దోషంబు రా
మునిపై లేదని నిశ్చయించి గతకోపుం డై నిటాలంబునం
దనచేదోయి ఘటించి యిట్లనియె వాగ్వైచిత్ర్య మేపారఁగన్. 494

మ. అనఘా మీ రిపు డానతిచ్చినటులే యా సర్వధర్మప్రభా
వనియాథస్థితిఁ జెల్లె నీకు మరల న్వాక్రుచ్చి మాటాడువాఁ
డన మాహాత్మ్యంబున నింతకుం జెడగుమాట ల్పల్కితి న్దప్పుగాఁ
గొన కన్నింటి సహించి కావఁగదవే ఘోరాఘసంతానునిన్. 495

తే. అనఘచారిత్ర నీవు సృష్టార్థసత్య, నిదుఁడవు జగద్ధితుండవు విమలబోధ
చిత్తుఁడవు కార్యకారణసిద్ధి యుందు, నీదుబుద్ధి ప్రసన్నమై నెగడుచుండు. 496

వ. మహాత్మా యేను గృతాపరాధుండనై యుండియుఁ బురస్కృతవ్యతిక్రాంతుండ నన్నుఁ
బ్రియవాక్యంబుచేత నాశ్వాసింపుము 497

సీ. మనుజేంద్ర నాకు సామ్రాజ్యంబుపై మేనిపైఁ దారపై మిత్రబంధువితతి
పై నాకించుకయును భ్రాంతి లేదు గుణాకరుండు సువర్ణాంగదుండు నంగ
దుండు చిన్నటనాఁటనుండి పెంచినవాఁడు గావున నాపాటుఁ గాంచి వీత
కమలతటాకంబు కైవడి శోషించునో యని చింతించుచున్నవాఁడ
తే. వాఁడు బాలుండు నేరనివాఁడు ప్రియుఁడు, నేకపుత్త్రుండు బలవంతుఁడినసుతుండు
గోలె నీచేత సతతంబుఁ బ్రోవఁ దగిన, వాఁడు నీపంపుఁ గావించువాఁడు సుమ్మి.

వాలి యంగదుని రక్షింపుమని రాముని వేఁడుట.

చ. అనఘచరిత్ర నీవును నియంతవు శాస్తవు రక్షకుండవు నా
జనపతి చనఁ బిమ్మటఁ బ్రసన్నకృపాప్తి సుమిత్రపట్టి యం
దనిశముఁ గైకేయీతనయునందును భానుజునందుఁ గల్గు పా
యని యనురక్తి యంగదునియందును జేయుము నాదుపిమ్మటన్. 499

తే. బహుళతపస్విని సర్వజ్ఞ పరమసాధ్వి, యయ్యు మద్దోషకృతదోష యయ్యె నట్టి
తార నిఁకఁ జిన్నతప్పు గలిగినను దేవ, ప్రోచుచల్లఁగ నియమింపఁబోలు నీకు.

చ. వనలగ నీకు భృత్యుఁ డగువాఁడు సుఖాస్పదమైన ధారుణీ
సకలము నాకయిట్టు లిఁకయుం జాల నెఱింగియు కాదె తార వ
ల్వదనుచుఁ జెప్పినన్ వినక వచ్చితి భానుకుమారుతోడ నె
ల్లిదముగ ద్వంద్వయుద్ధమునకై గతసర్వగ నవ్వర్గకాంక్షినై. 501

క. అని పలికి సన్నుతుండై, వనచరపతి యూరకున్న వసుధేశుం డా
తనిఁ గాంచి ధర్మశాస్త్రార్థవిదుం డాస్యమృదూక్తిఁ బలికెఁ దద్దయు నెమ్మిన్. 502

వ. వానరేంద్రా నీవిట్టి కార్యంబునకు వగసంబని లేదు భవదకృత్యవిశేషంబునఁ
బ్రాయశ్చిత్తకృతార్థధర్మంబునందు మేము కృతనిశ్చయుల మైతిమి కావున నకృ
త్యంబుఁ గావించితి నని దుఃఖము విచారింప వలదు నీకుఁ బరలోకప్రతిబంధకంబు
గల దని నిన్ను విచారింప వలదు పూర్వోక్తమనువచనప్రకారంబున నీ
కిలుపురకును దోషంబు లేదు దండార్హునియందు దండంబు ప్రయోగించిన
వాఁడును దండితుండై సదండార్హుండు నయ్యుభయులును. గార్యంబైన

నంబువలనను గారణంబైనయపరాధంబువలనను నిష్పన్నప్రయోజనులైనవారిం బరుగావున నీవు మదీయదండసంయోగంబువలన విగతకల్మషుండవై ధర్మసృష్ట మార్గంబున స్వకీయంబైనపరిశుద్ధత్వస్వభావంబునొందితి వింక శోకమోహంబులు విడువుము నీచేత నియోగింపంబడినదానిం గావన వచ్చునె భవన్నందనుండైనయంగదుండు నీయందు నెట్లు వర్తించు నట్లు సుగ్రీవునియందును నాయందును వర్తింపం గలండు నేనును భరతలక్ష్మణులయందుం బోలె నతనియందు వాత్సల్యంబు నెఱపెద నని మధురంబుగాఁ బలికిన ధర్మపథానువర్తి యగు రాముని వాక్యంబులు విని శక్రనందనుండు బాణక్షతవేదన సహింపం జాలక మైమఱచి యజ్ఞానంబున శక్రసమానపరాక్రముండవైన నిన్ను దూషించితి దానిం దప్పుఁగాఁ గొనక నన్నుం గరుణింపు మని యుక్తంబుగాఁ బలికి తరుపాషాణబాణప్రహారంబులఁ గ్లాంతుండై యుండుటం జేసి యంతకంతకుఁ గంఠగతప్రాణుండై పలుక నొల్లక యూరకుండె నప్పుడు రామదత్తంబైనబాణమోక్షంబువలన నిహతుండైనవాలివృత్తాంతంబుఁ జారులవలన విని తార హృదయంబు ఝల్లన నంగదసహితంబుగా నొల్లంబోయి మెల్లనఁ దెలిసి పురంబు వెలువడి. 503

తార వాలివధంబు విని విలపించుట.

సీ. హతుఁడైనవాసవసుతునిఁ గార్ముకపాణియైనరామునిఁ జూచి యంగదాను
చరు లగుకపులు దిక్కఱి యూథపుఁడు లేనిమృగములక్రియఁ జాల నగచి భీతిఁ
బఱచుచుఁ దనకడ కరుగుదెంచినవారిఁ గనుఁగొని దుఃఖశోకమున నీరా
లెవ్వానికరుణచే నెసఁగుదు రెప్పుడా వానరనాథుండు వాలి రాజ్య
తే. కారణంబున భ్రాతతోఁ బోరొనర్చి, నృపునిశరపాతనంబున నిహతుఁ డయ్యె
నింక నెవ్వనిఁ గొల్చెద రిప్పురమున, నేగుఁ డెచ్చోటి కైనను నెల్లకపులు. 504
క. అని పలికినఁ గపిపత్ని, వచనము విని కామరూపచరు లగుకపు లి
ట్లని రద్దేవికిఁ గాలం, బునకుం దగుభంగిఁ గార్యము న్దలియంగన్. 505
ఉ. కాలము దెచ్చు నెవ్వగలు గానఁగ వచ్చునె యేరికైన న
వ్వాలి యశక్తుఁడే కడుజవంబునఁ బోరుచు నుండి పొంచి భూ
పాలకుఁ డేయు తీవ్రపటుబాణహతిన్ బరిహీనసత్త్వుఁడై
యాలమునందుఁ గూలు టదియంతయు దైవకృతంబు గాదొకో. 506
తే. అంతకుఁడు రాఘవాకృతి నరుగుదెంచి, వాలి నవలీల నిలఁ గూలవైచె నింక
వగచినందున ఫల మేమి వగపుచేత, గాసిపడకుండ నంగదుఁ గాచికొనుము.
క. తరుపాషాణప్రహతుల, దురము సలిపి తుది శతారతులితోగ్రసుహీ
వరశరమునఁ గూలెఁ బురం,దరతనయుఁడు వజ్రనిహతధరమువిధమునన్. 508
క. నగచరనాథుఁడు నిహతుం, డగుచుండ ననాటసైన్య మటు కిష్కింధా
నగరద్వారము వెసడా, యఁగ నచ్చెను గాచికొనుము యంగదునిఁ బురిన్.

తే. జలజలోచన చింతింపవలవ దంగ,దునకుఁ బట్టంబు గట్టుమా ఘనభుజుండు
వాలినందనుఁ డగుటచే వాలినట్ల, నతని భజియింతు రగచరు లనుదినంబు.

వ. మఱియు నొక్కవిశేషం బెఱింగించెదమాకర్ణింపుముశక్రసమప్రభుండగు వాలి
హతుం డగుచునుండ మన కహితు లగుకొండఱు వానరులు కళత్రవంతులును
గళత్రరహితులు నై సమీపకాననంబుల నుండి చనుదెంచికిష్కింధాదుష్ప్రవే
శస్థానంబులు నన్యస్థలంబులు బలాత్కారంబున నాక్రమింప నున్నవారనియూ
పు లెఱింగించిరి గావున నట్టివిప్రయుక్తలుబ్ధసుగ్రీవాదిజ్ఞాతులవలన మనకుఁ
గిష్కింధావస్థానంబునందుఁ దుములంబుగా భయంబు వాటిల్లు నట్లు గాక
మున్నె యంగదునిఁ బదస్థునిఁ జేయు మని యల్పాంతరగతు లగువారు పలికిన.

చ. అన విని తార యి ట్లనియె నక్కట రామశిలీముఖాహతి
న్వనచరవంశశేఖరుఁడు వాలి హతుం డగు చుండ నాకు నెం
దును గలఁప న్మనోహరుని తోడిదె లోకము గాక యిందు నం
దనుఁడును జీవితంబును బదంబును రాజ్యము వేడ్క సేయునే. 512

తార వాలి పడియున్నప్రదేశమునకు వచ్చుట

వ. ఏ నమ్మహాత్మునిపాదమూలంబునకుం జనియెద నని పలికి శోకవిశేషంబున రోద
నంబు సేయుచు 513

క. మరుదాందోళితవనలత, కరణి వడిం దల్లడిలుచుఁ గరముల నురము
న్శిరము న్మోదికొనుచు దుర్భరగతిఁ జనుదెంచె విభుఁడు పడి యున్నెడకున్. 514

వ. ఇత్తెఱంగునం జనుదెంచి. 515

శా. ఆర్తిం దూలుచు రామబాణపతితుం డై యున్నవాని న్సమి
త్కర్త న్దుర్లభసర్వకీశవిలసత్సామ్రాజ్యసింహాసనో
ద్ధర్త న్దుందుభిదానవాదికసమస్తారాతిసంతానసం
హర్త న్భర్తను గాంచెఁ దార ఘనశోకాకల్పితస్వాంత యై. 516

వ. మఱియు నామిషార్థంబు శార్దూలంబుచేత నిహతుం డైనమృగరాజుమాడ్కి
నిర్వృష్టోపరతమేఘంబుకైవడి సర్వలోకార్చితంబయ్యు సవేదికం బయ్యు
గాళియప్రహారణవేళయందు నిగూఢనాగగ్రహణంబుకొఱకు గరుడునిచేతనున్మ
థితం బైనచైత్యంబుపగిది రామశరాభిహతుం డై తరణికిరణసమ్మిశ్రితం బైన
సంధ్యాభ్రంబుభంగి రక్తసిక్తగాత్రుం డై ముకవారణంబులాగున రణమేదినిం
బడి యున్నవాని మహావాతసమావిష్టమహామేఘఘోషస్వనసన్నిభనిస్వనుం డగు
వాని శక్రసమానవిక్రముం డగువానిఁ గ్రీడాసమయకరకందుకీకృతకులాచలుం
డగువాని శూరనిపాతితుం డగువాని హేమమాలిని వాలిం బోల నాలోకించి
తత్పరిసరంబునఁ బ్రచండకోదండపాణు లై యున్నరామలక్ష్మణులం జూచి. 517

క. ఆలోలనయన మిక్కిలి, జాలిం బడి పరశునిహతసాలముమాడ్కిం
గీ లెడపినజంత్రముక్రియ, నేలం గడు నవశ యగుచు నిలువున వ్రాలెన్. 518

తే. ఇత్తెఱంగున వ్రాలి యొక్కింత వడికి, మరల నిద్రమేల్కాంచినమాడ్కిఁ దెలివి
నొంది కన్నుల శోకబాష్పనికరంబు, లరుగు దేరఁగ హానాథ యనుచు నేడ్చె.

తే. కురరికరణిదుఃఖించెడుకువలయాక్షిఁ, దూలగతిఁదూలుసుతునంగదునిగుమారుఁ
గాంచి రవిజుఁడు శోకంబు గప్పికొనఁగ, జాలిఁబడి దైన్య మెసఁగ విషణ్ణుఁ డయ్యె.

ఉ. అప్పుడు తార రామవిశిఖాసనము క్తశరాభిసంహతిన్
దెప్పర మైనబాధఁ బడి దీనతఁ జింతిలు చున్నవల్లభున్
దప్పక చూచి చేరఁ జని తత్తను వంటుచు వ్రాలి శోకమున్
గప్పికొనంగ భూరిభయకంపిత యై విలపించె దీనతన్. 521

తార వాలినిం గూర్చి విలపించుట.

చ. తరుచరవీర యిట్లు రణధారుణిపైఁ బడి దీన నైనన
న్నరసి వచింప వేటి కిపు డక్కట లెమ్ము భజింపుమా మనో
హరశయనోత్తమంబును మహాత్ములు రాజులు నీదుభంగిఁ బెం
పఱి గతభోగయుక్తిఁ గఠినావనిపైఁ బడి యుండ రే కదా. 522

తే. నిర్గతాసుండ వయ్యు న న్విడిచి యిట్లు, రమణ నెద్దాని నీవు గాత్రములచేతఁ
గౌఁగిలించితి వట్టిసంగ్రామభూమి, యధిప నీకు మిక్కిలికాంత యయ్యె గాన.

సీ. మర్కటనాథ ధర్మము దప్పకుండ యుద్ధము సేయు నీచేత సముచితముగ
రమణీయభంగి వీరస్వర్గసాధనభూతనుహాహవభూమియందుఁ
గోరి కిష్కింధలాగున వేఱొకపురంబు గరిమ నిర్మిత మయ్యెఁ గాక యున్న
నిచ్చోట నేటికి నిటు శయనించితి చెలఁగి నాతోడ భాషింపవేల

తే. యొకర నినుఁ గూడి మధుగంధివనములందు
ఘనత నెయ్యవి మాచేతఁ గాలమందు
నపహృతము లయ్యె నట్టిపదార్థములకుఁ
దలఁప నేఁడు విరామంబు గలిగెఁ గాదె. 524

ఉ. అక్కట నీవు రామవసుధాధిపము క్తశరాహతుండ వై
చిక్కుచు నుండ వైభవవిశేష మడంగె సుఖంబు పోయెఁ బెం
పెక్కినసమ్మదంబు నశియించె నపారవిపత్పయోనిధిన్
దక్కక మగ్న నైతి నిఁక నాకిల నెక్కడిజన్మ మారయన్. 525

ఆ. శక్రతనయ నీవు శరనిహతుండ వై, దండిశోక మొందుచుండఁ గాంచి
పరఁగ నాదుగుండె బ్రద్దలై పోవదు, ఱాతఁ జేసినదియొకో తలంప. 526

క. అనుజుం డగురవిజునిభా, ర్యను రుమ న ట్లపహరించి యాతని వెతలం
బనిచితి వాపాపము నేఁ, డనుపమభంగిఁ బరిపక్వమై చేకూడెన్. 527

చ. అనుజునితోడ నీవు కలహంబునకుం జనువేళఁ గాదు వ
ల్దని హితమాడిన న్వినక యక్కట గాలము త్రాటఁ బట్టి గొ
బ్బునఁ గొని తెచ్చిన ట్లడరు పుట్టఁగ వచ్చితి వచ్చినంత నీ
కనుభవమయ్యెనే చెడుగనై వచియించితి నే హరీశ్వరా. 528

క. పుట్టువు దొట్టియు శోకం, బెట్టిదొ యొక్కింతయైన నెఱుఁగని నే నిం
కెట్టు విధవనై దీనత, నట్టి పుత్రశోకమునఁ గుందుదాన మహాత్మా. 529

తే. నగచరోత్తమ యిచ్చట నన్నుఁ బాసి, స్వర్గపురమందు రూపయౌవనవిశేష
దృష్టలై నట్టి యప్సరస్త్రీలఁ గూడి, ప్రీతి వారిచిత్తంబు హరింతు గాదె. 530

క. జితకాశియు నుపలాలితుఁ, డతిసుకుమారుఁడు సుఖార్హుఁ డగు నంగదుఁ డే
గతి వర్తింపఁ గనం డిఁకఁ, బితృవ్యుఁడు కరుణ విడిచి కుపితుఁ డగుచుండన్. 531

వ. అని పలికి యంగదకుమారు నవలోకించి. 532

క. తనయా యీ కపిపతిదర్శన మిఁక దొరకొనుట దుష్కరము నీ కెందు
న్దనివొంద నిపుడె ప్రోలం, గనుఁగొనుమా తండ్రి వదనకమలము వత్సా. 533

వ. అని పలికి యంతకంత కగ్గలం బగుశోకంబున నద్దేవి వెండియు భర్తనుద్దేశించి.

చ. వితతగుణాఢ్యుఁ డంగదుఁడు వీఁడె భవత్ప్రియనందనుండు నీ
మృతిఁ గని శోకముం గదుర నేమియుఁ దోఁపక పొక్కుచున్న వాఁ
డితని ననూనదుఃఖమున కెంతయుఁ బాల్పడకుండ మంజువా
క్ప్రతతుల గారవించుచు శిరం బటు మూర్కొని బుజ్జగింపవే. 535

క. ఎటులైన నేమి రాముఁడు, కుటిలత వంచించి నిన్ను ఘోరాస్త్రమునం
దటుకునఁ జంపి వనజినీ, విటతనయుని ఋణమువలన విడివడియెఁ గదా. 536

వ. అని పలికి యలుక వొడమిన చిత్తంబున నత్తలోదరి యుత్తపనసుతు నవలోకించి.

క. తెంపున నొగుచే నన్నను, జంపించితి కామితంబు సమకూడెఁ గదా
పెంపుగ నిఁక రుమతో భో, గింపుము రాజ్యము గ్రహించి కృతకాముఁడవై.

వ. అని సోపాలంభంబుగాఁ బలికి వెండియు భర్త నుద్దేశించి. 539

క. బలరిపునందన యీగతి, విలపించెడు నన్నుఁ బ్రేమ వీక్షించి తగం
బలుక వది యేల నీభా,ర్యల సందడి వీరిఁ జూడుమా కృప తెలియన్. 540

వ. అనిన నత్తారావిలాపంబు విని యంతకు మున్న చనుదెంచి యచ్చోట నున్న
వారగుటం జేసి తక్కిన వాలిభార్య లగు వానరకాంతలు భర్తృమరణశోకా
క్రాంతలై యంగదుం బట్టుకొని పెక్కుతెఱంగుల నాక్రందనంబు గావించిరి
పదంపడి తార జీవితేశ్వరుం గౌఁగిలించుకొని. 541

ఉ. సాంగదవీరబాహుయుగళా ప్రియపుత్త్రుఁడవైన నీకు నీ
మంగళవిగ్రహుం బ్రియకుమారుని సద్గుణసన్నివిష్టు నీ
యంగదుఁ బాసి పోవు టిది యర్హము గాదితఁ డెన్నఁ డేనియుఁ

సంగతి దక్కి విప్రియ మొనర్చెనె బాలుఁడు భక్తిశీలుఁడున్. 542

ఉ. అక్కట నీకు వానరకులాధిప విప్రియ మించు కేనియుం
నెక్కొని చేసి యే నెఱుఁగ నీమృదుకంజసమాంఘ్రిమూలముల్
దిక్కని యున్నదాన నను ధీరత నొంటిగ డించి పోవఁగా
నెక్కడె వేగ తోడుకొని యేగుము వెంబడిఁ గూడ వచ్చెదన్. 543

వ. అని యనేకప్రకారంబుల భర్తసమీపంబున వానరస్త్రీసమన్వితంబుగా దుఃఖించుచు నతనితోడిదె లోకం బని తలంచి ప్రాయోపవేశంబు సేయ సమకట్టి యంబరంబు నుండి జాఱిన తార పగిది నేలంబడి యున్నతార నవలోకించి మందమందవాక్యంబుల నాశ్వాసించుచు హనుమంతుం డిట్లనియె. 544

హనుమంతుఁడు తార నాశ్వాసించుట.

క. విను గుణదోషకృతం బగు, తనకర్మఫలంబు దేహి తప్పక పొందుం
జననీ యీలోకంబున, ననిశము శుభ మైన నశుభ మైనం బెలుచన్. 545

ఉ. పూనికి దేహికిం బుడమిఁ బుట్టినయప్పుడె చావు నిక్కమా
మానిని వారిబుద్బుదసమం బగుఁ గాయము నందుఁ జూడ నె
వ్వానికి నేమి శోక మగువర్ణితతత్త్వవివేకు లైనను
జ్ఞానకు లొష్టజన్మమరణంబులకుం దలఁకొంద రెంతయున్. 546

ఉ. ఈకపిచక్రవర్తి మనుజేశ్వరదివ్యపృషత్కవిద్ధత
నీఁక నఘౌఘముల్ దొలఁగి నిర్మలుఁడై సురరాజపుర్యసం
ఖ్యాకమనీయభూరివిభవాప్తి వహించె సరోజనేత్ర నీ
వాకులపాటు దప్పి హృదయంబున ధైర్యముఁ గూర్పు మిత్తఱిన్. 547

చ. అడలెదు నిన్నుఁ జూచి హృదయంబున శోకము విస్తరిల్లఁగా
నడలుచు నున్నవాఁడు సుగుణాకరుఁ డంచితవిక్రముండు నీ
కొడు కితఁ డంగదుం డితనిఁ గుందకయుండ ననూనయింపు మి
వ్వడువున నేడ్చినన్ మరల వత్తురె చచ్చినవార లుర్వరన్. 548

తే. మానినీమణి జంతుసంతానమునకుఁ
గాల మొకరీతి వచ్చునే కర్మయుక్త
సరణి యొకవేళ సౌఖ్యంబు సంఘటించుఁ
గడఁగి యొకవేళ దుఃఖంబు గలుగఁజేయు. 549

తే. భూతకోటికి నిజకర్మజాతఫలము
అనుభవింపక రిత్తవో దట్లు గాన
ధరణిఁ బండితుఁ డగువాఁడు తత్క్రియం బె
ఱింగి శుభకర్మములె యాచరింపవలయు. 550

క. విను మర్త్యనసంఖ్యలు గనం, జనచను లెవ్వానియందు వర్తింపుదు రా
యనిమేషలోకనాయక, తనయుఁడు విస్తాంత మొందె దైవనియుక్తిన్. 551

తే. సామదానశమదమాచరణుఁడగుచు, న్యాయనృష్టార్థుఁడై పెక్కుహాయనములు
ధర్మజిత దైవధాత్రిని దవిలి యేలె, వాని గూర్చి దుఃఖించుట హితమె నీకు.

తే. ఎల్లవానరపుంగవు లెల్లమిం గొలువ, నీకుమారకుఁ డంగదుఁ డీసమస్త
కీశరాజ్యంబు నీదుసంకేత ముగు, నట్లు పాలించు ధర్మవిహారపరత. 553

క. జనకుని పరోక్షమునం దన, తనయుఁడు తదుపార్జితప్రధానధనంబుల్
గొను టది ధర్మోచిత మం, గన యంగదుఁ డేలుఁ గాక కపిరాజ్యంబున్. 554

ఉ. వాలిని సంస్కరించి పరివారము లంగదు నెల్లి ప్రీతితోఁ
బ్రోలికి నాజ్ఞఁ జేసెదరు పొల్పుగ గద్దియ నెక్కి రాజ్యల
క్ష్మీలసితాస్యుఁ డై యధివసించినపుత్త్రునిఁ గాంచి చిత్తసం
క్లిలితశోకము న్విడిచి కేవలశాంతి వహించె దెంతయున్. 555

వ. అని యనునయాలాపంబులం దేర్చుచున్న హనుమంతునివాక్యంబులు విని
భర్తృవ్యసనపీడిత యగునయ్యంగన యిట్లనియె. 556

క. అంగదునిం బోలుకొనయుఁడు, సంగతిగా నూర్వ దున్న శ్వసనాత్మజ యీ
మంగళవిగ్రహుఁ డగుహరి, పుంగవుఁ డున్నట్లు మదికి ముదము గలుగునే. 557

క. పవనసుత యంగదున కీ, ప్లవగాధిపతిత్వ మేల పతిపిమ్మట నీ
రవిసుతుఁడు రాజ్యతంత్ర, వ్యవహారములందు యోగ్యుఁ డగుఁ గాక రహిన్.

క. కని యుత్తిపించి గుడువం, బనిచెడుజనకుండె నేఁడు బలరిపుపురికిం
జనియె నఁట యంగదునకుం, బనిసేయునె తుచ్ఛరాజ్యపద మనిలసుతా. 559

వ. మఱియు మహానుభావుం డగునీకపిరాజుసంశ్రయంబుకంటె నాకుభయలోకం
బుల నొండొక్కదిక్కు లేదు గావున నభిముఖహతవీరసేవితం బగునీశయనంబు
సేవించుదాన నని పత్యనుగమనవాంఛం జేసి మెత్తవడనిచిత్తంబున నత్తారకపి
సత్తమునికిఁ బ్రత్యుత్తరం బిచ్చి యతని నిరుత్తరునిం జేసి యనేకవిధంబుల విల
పించుచుండఁ దదీయార్తనాదంబు విని సంక్రందననందనుండు నేత్రంబులువిచ్చి
చూచి మెల్లన నాశ్వాసించుచు నంగదునిం జూచి తదీయాగ్రభాగంబున సం
ప్రాప్తవిజయుండై యున్నసుగ్రీవు నవలోకించి సస్నేహంబును సగౌరవంబునుం
గా వ్యక్తవాక్యంబున నిట్లనియె. 560

వాలి సుగ్రీవునకు హితము గఱపి కాంచనమాల యొసంగుట.

సీ. తామరసాప్తనందన పురి వెడలంగ ననిచి పత్నిని దక్కఁ గొనియె ననుచు
నను దోషయుతునిఁగా మనమునఁ జూడకు మవితథంబుగ భావియగునియతిని
బుట్టినయవిరళబుద్ధిమోహంబునఁ గృష్యమాణునిఁగా నెఱింగికొనుము
భ్రాతృసౌహార్దంబు రాజ్యసుఖంబును మన కిద్దఱకు నొక్కమాటు దైవి

తే. కమున నవిహితమయ్యె లోకంబునందుఁ, బరఁగ నాదైవకృతయుగపదవిధాన
మరయ నన్యవిధంబుగా దెఱిఁగియున్న,ఘనులకిలఁ గోపతాపము ల్గలుగ వెపుడు.

వ. అది యంతయు గతజలసేతుబంధంబు తలంచినం బ్రయోజనంబు లే దింకఁ
గార్యంబు తెఱంగు వినుము. 562

సీ. భానుజ కన్నులు గానరా వయ్యెఁ బ్రాణము నంతగత మయ్యె నమరపురికిఁ
దడయ కేగెదను జెప్పెడిదేమి నీ కిఁక మహనీయకీశసామ్రాజ్యపదవి
సిరుల నంతఃపురస్త్రీలను గైకొమ్ము బాష్పపూర్ణాస్యుఁ డై పరఁగ వ్రాలి
దీనుఁ డై శోకించువానిఁ బ్రియుం డగువానిఁ బ్రాణసమానుఁ డైనవానిఁ

తే. దనయు నంగదుఁ జూడు మీతనికి నభయ
మొసఁగి దుఃఖంబునకుఁ జొరకుండ దాత
వై పరిత్రాత వగుచు నాయట్ల నీవు
కడఁగి నిత్యంబుఁ గావుము కరుణ మెఱసి. 563

వ. మఱియు నీతారేయుండు నీతోడఁ దుల్యపరాక్రముండును శ్రీమంతుండు నను
రూపకర్ముండును దరుణుండును మహాబలుండును కావున నీకు బానటయై నీవు
చూడ రణంబున నవక్రపరాక్రమంబున నాక్రమించి క్రవ్యాదలోకంబు నెల్ల
నశ్రమంబున నిర్జింపఁగలం డదియునుం గాక. 564

తే. తపనజ సుషేణపుత్త్రి యీతార సాధ్వి: యర్థసూక్ష్మవినిశ్చయమందుఁ జాల
నేర్పు గలది కార్యాకార్యనిర్ణయజ్ఞ, తగవు ధర్మంబు నడపెడుతన్వి సుమ్మి. 565

క. ఈనెలఁతభావ మొక్కం, తైనను విఫలత్వ మొంద దటుగావున నో
భానుసుత యెద్ది పనిచిన, దానిం గాదనక సేయఁదగు నీకెపుడున్. 566

వ. మఱియు నొక్కహితంబుఁ జెప్పెద వినుము 567

క. అవిశంకచేత నీరా, ఘవకార్యము నీ కవశ్యకర్తవ్య మగు
న్దవిలి యొనర్పకయుండిన, రవిసుత ననుఁ బోలె నిను శరంబున ద్రుంచున్. 568

క. ప్రాకటముగ నినునందన, కైకొను మీదివ్యహేమకంజాతసమా
ప్రాకీర్ణమాల యిది య,స్తోకబలారోగ్యవిజయశుభముల నొసఁగున్. 569

వ. అని భ్రాతృసౌహార్దంబునం బలికిన వాలిపలుకు లాకర్ణించి హర్షంబుఁ బరిత్య
జించి క్రమ్మఱ దీనుం డై గ్రహగ్రస్తుం డైనచంద్రునిమాడ్కి నిష్ప్రభత్వంబు
నొంది కొండొకసేపునకుఁ దదీయమృదుమధురాలాపంబులం దేఱి యతనిచేత
ననుజ్ఞాతుం డై యక్కాంచనమాలఁ బ్రతిగ్రహించె నిట్లు సుగ్రీవునకు హేమ
మాల యొసంగి పురందరపుత్త్రుండు నిజపుత్త్రు నవలోకించి పుత్త్రస్నేహంబున
వాత్సల్యంబు నెఱపి యనునయాలాపంబుల ని ట్లనియె. 570

వాలి యంగదునకు హితముఁ గఱపుట.

తే. దేశకాలంబు లెఱిఁగి సుధీవరేణ్య
సుఖము దుఃఖంబు సమముగాఁ జూచికొనుచుఁ

ప్రియమునం దప్రియమునందు బెగడు పడక
క్షమ గలిగి సూర్యసుతవశగతుఁడ వగుము. 571

ఆ. వత్స యేన పోలె వాత్సల్యమున దివా,కరసుతుండు నిన్ను గారవించు
నతనిరిపుల రిపుల కయ్యెడువారల, విడిచి విహితవృత్తి వెలయు మింక. 572

క. అనిశం బప్రణయా మతి, ప్రణయం బీరెం డొసంగు బహుదోషముల
న్వీను మటు గావునఁ బ్రియునం, దన మధ్యమభావ మొంది తనరుము నీవున్.

వ. అని బోధించి శక్రపుత్త్రుండు శరసంపీడితుం డగుటం జేసి వివృత్తనేత్త్రుండును వికృ
తవదనుండును నై జీవితంబులు విడిచె నిట్లు సంప్రాప్తమరణుం డైన వాలి నాలో
కించి ప్లవంగపుంగవు లెల్ల హాహాకారంబులు సేయుచు వెలవెలం బోయి బహు
పరాక్రమంబులఁ దుఃఖించుచుండిరి కిష్కింధాపురంబు శూన్యచత్వరవేశ్మాంతం
బై యుండె నుద్యానంబులును బర్వతంబులును గాననంబులును దక్కిన వాలి
విహారప్రదేశంబు లన్నియుఁ బాడఱినట్లు చూపట్టె నప్పుడు వానరు లందఱుం
గూడుకొని శోకావేశంబున. 574

మృతుం డైనవాలిం గూర్చి వానరు లందఱు విలపించుట.

తే. కడిమి నెవ్వాని భూరివేగమునఁ గాన
నములు వనములు మృదులతాంతములతోడ
ననిశ మనుబద్ధములుగఁ జేయంగఁ బడియె
నవ్విధం బింక నివు డెవ్వఁ డాచరించు. 575

సీ. సత్త్వసంపన్నుండు చతురుండు గోలభుం డని యెడుగంధర్వుఁ డాజికాంక్షఁ
బై నెత్తి వచ్చినఁ బదఁగ నెవ్వఁడు పదియేనువర్షము లసమానలీలఁ
బవలు రేయును ఘోరభంగిఁ గయ్య మొనర్చి యంత షోడశవత్సరాంతమందు
దుర్వారభుజవీర్యగర్వంబు పెంపున గోలభు నవలీలఁ గూల నేసి
తే. కడఁగి మాకందఱకు వేడ్కఁ గలుగఁ జేసె, నట్టి జితకాళిబలరాశి యమితబాహు
బలవినిర్జితదైతేయపాళి వాలి, యిత్తెఱంగున హతుఁ డయ్యె నృపునిచేత.

వ. అని యద్భుతశోకంబులు మనంబునం బెనంగొన నందఱు దీనవదనులై సింహ
యుతం బైనమహాకాననంబున వృషభంబు పడినం దలంకుధేనువులచందం
బున సుఖంబు విడిచియుండి రంతఁ దార మృతుం డైనపతి నవలోకించి శోకా
ర్ణవపరిప్లుత యై పరశుచ్ఛిన్నం బైనమహాద్రుమంబు నాశ్రయించిన వనలత
కై వడి నతనిం బరిరంభించి శోకబాష్పజలంబులు తదీయముఖంబున సాంద్రం
బుగాఁ గురియ నేడ్చుచు నిట్లని విలపించె. 577

ఉ. హా హృదయేశ యెంత హిత మాడినఁ గైకొన కీవు వైరిసం
దోహవినాశకారిరణదుర్జయరామశరాహతుండవై
యూహ గలంగి కర్కశశిలోపచితం బగుదుష్ప్రవేశమో

రాహవభూతలంబుపయి నక్కట చేడ్పడి నేఁడు గూలితే. 578

క. కరయుగమున నిన్మేదినిఁ, బరిరంభించుచు మహాత్మ పలుకవు నాతో
హరివర యిది నాకంటెను, గర మెక్కుడు నెయ్య మేమి గావించె నొగిన్. 579

క. కాలానుసారి యై నేఁ, డీలాగునఁ బక్షపాత మెసఁగ విధి యహో
మేలించు కైనఁ దెలియక, వాలాయము సూర్యపుత్రవశగతుఁ డయ్యెన్. 580

క. కృప మాలి దైవ మిటు నీ, కపకారముఁ జేసె నింక నర్కకుమారు
న్విపులయశోనిధిఁ బతిఁగాఁ, గపివంశజు లెల్ల భక్తిఁ గావింతు రొగిన్. 581

క. ఈవిధమున విలపించెదు, నావాక్యము దీనుఁ డగుతనయువాక్యము సం
భావించి కరుణ మెఱయఁగ, దేవేంద్రతనూజ యేల దేర్పవు మమ్మున్. 582

సీ. జీవితనాథ నీచే మున్ను నిహతులై రక్కసు లెక్కడ దిక్కుమాలి
పడి యుండి రక్కడఁ బగతునిచేతఁ జేటొంది నీ విటు పడియుండ వలసెఁ
దగవౌనె నన్నానాథను జేసి యొంటిగ విడిచి పోవఁగ నీకు వీరునకును
గన్య నొసంగుట గా దటులైన నాపగిది ననాథయై నగలఁ బొగులు

తే. టంతియె ఫలంబు నామానమదియడంగె, సుఖమునశియించె వైభవస్ఫూర్తిపోయె
బరమగతి భగ్నయయ్యె నపారదుఃఖ, వార్ధిలోన మునింగితి వానరాభ. 583

క. వినిహతుఁడ వైననిన్ను, న్వని కనియును నాదుగుండె వేయిపఱియ లై
చన దకట యేమి వగచెద, మనోహరా వజ్రసారమయ మగుఁ దలఁపన్. 584

క. పరమప్రియుఁడవు శూరుఁడ, వరయఁగ బంధుఁడవు భర్త వగునీ విటు సం
గరమునఁ బరనిహతుఁడ వై, యనువిక్రమధుర్య నిధనమొందితె యకటా. 585

క. సుతశతకము గల్గిన మఱి, సతతము ధనధాన్యవస్తుసమితి కలిగినన్
బతిహీన యైనసతి కా, యతవిక్రమ పోదు విధవ యనుమాట భువిన్. 586

వ. మఱియుఁ గ్రిమిరాగపరిస్తోమం బైనశయనంబునందుం బోలె స్వగాత్రప్రభవ
రుధిరమండలంబునం దెట్లు శయనించితివి రేణుశోణితసంవీతం బైనభవదీయ
గాత్రంబు నెత్తెఱంగున బాహువులఁ బరిరంభింప నేర్తునని వగచి వెండియు.

ఉ. పూనిక రామకార్ముకవిముక్తవరైకశరంబుచేత నె
వ్వానిభయంబు వృక్షచరవంశపతీ హత మయ్యె నేఁటి కా
భానుసుతుండు ఘోర మగు బంధువైరమునందు నెవ్వగ
ల్లాని కృతార్థుఁ డయ్యెఁ గద రాజ్యసతీబలకోశయుక్తుఁ డై. 588

వ. మహాత్మా నీవు పంచత్వంబు నొందుచుండ నిన్ను విలోకించి యేను భవదాలిం
గనవిషయంబునందు హృదయలగ్నం బైనశరంబుచేతనివారిత నైతి ననియనేక
ప్రకారంబుల విలపించుచు నుండ నప్పుడు వాలిగాత్రగతం బైనశరంబు నవలో
కించి నీలుండు గిరిగహ్వరసంలీనం బైనదీప్తాశీవిషంబునుం బోలె దాని నుత్పా
టించివైచె నిట్లునిష్కృష్యమాణం బైనయబ్బాణచ్ఛవియు నగిరిమస్తకసంరుద్ధ

దినకరవినిస్సృతరశ్మియుం బోలెఁ జూడ్కికి వ్రేఁగగుచుండె నప్పుడు శరపాదప
శిలాజనితంబు లైనతచ్ఛరీరవ్రణంబుల నుండి శోణితధారలు ధరాధరంబున
నుండి తామ్రగైరికసంపృక్తజలధారలుంబోలె సాంద్రంబుగా స్రవించుచునుం
డె వెండియు నద్దేవి రామాస్త్రసమాహతుండై రణరేణుపరికీర్ణుండై రుధిరోక్షిత
సర్వాంగుండై నేలఁ గూలి యున్నభర్త నవలోకించి లోచనప్రభవంబు లగు
శోకబాష్పంబుల నతనిం బ్రమార్జించుచు నుచ్చైస్స్వనంబున రోదనంబు
సేయుచుఁ బింగాక్షుం డగునంగదకుమారు నుద్దేశించి. 589

సీ. తనయ నీజనకుని దారుణపశ్చిమావస్థను జూడుము వైర మెల్లఁ
గడచనె జముని నికాయంబునకుఁ బోవు చున్నవాఁ డీనవార్కోదయాంగుఁ
బూనినభక్తిఁ దన్మాననీయాంఘ్రియుగ్మంబున కభివాదనం బొనర్పు
మనవుడు భక్తితో నతివేగమున లేచి పీనవృత్తము లగుపృథుభుజముల
తే. నంగదుఁడ నేననినిజాహ్వయంబునొడివి, యతనిచరణాబ్జములుసమున్నతిఁబరిగ్ర
హించి విడువనిశోకంబు హృదయసీమ, దట్టమై పర్వ మిగుల సంతాప మొందె.

వ. ఇట్లు దుఃఖించుచున్నకుమారుం జూచి తార వెండియు భర్త నుద్దేశించి. 591

చ. అనుపమభంగి నీకు వినయంబున మున్నభివందనంబుఁ జే
సిన సుతు గారవించి చిరజీవి సుఖీభవ పుత్త్ర యంచు మిం
చినయనురక్తి తేటపడఁ జేయుచు దీవన లిత్తు వేటికో
యనఘచరిత్ర పల్క విపు డక్కట తొల్లిటిప్రేమ దప్పెనే. 592

తే. అధిప యేను బుత్త్రసహాయనై వినిహత, చేతనుఁడ వైనని న్నుపాసింతు నిపుడు
ఘోరకంఠీరవాలీఢగోవృషమును, గూర్చి వత్ససహిత యైనగోవుకరణి. 593

తే. హా మనోనాథ నీవు సంగ్రామయజ్ఞ, మద్భుతంబుగఁ జేసి రామాస్త్రసలిల
మందు నతినగుననుఁబాసి యవభృథంబు,నందు నెట్లుసుస్నాతుండవై తివిపుడు.

తే. కపికులోత్తమ తొల్లిసంగ్రామమందు, మెచ్చి పరితుష్టుఁడై యనిమిషవిభుండు
కరుణతో నీకొసంగినకనకమాల, యేల గనుపట్ట దక్కట నేఁ డెందుఁ బోయె.

తే. శైలరాజంబులకుఁ బ్రదక్షిణముసేయు, భానురుచియమ్మహాత్మునిఁ బాయనిక్రియ
వానరేంద్ర గతాసుండ వైననిన్ను, రమ్యముగఁ బాయకున్న దీరాజ్యలక్ష్మి.

వ. మహాత్మా పథ్యం బగుమదీయవాక్యం బంగీకరింపక త్రోచిపుచ్చి వచ్చితి వేను
భవదీయమతనివారణంబునం దసమర్థనై యుపేక్షించినందువలన నిట్టియ
వస్థ దొరకొనియె నీయట్ల యేనును బుత్త్రసహితంబుగా నిహత నైతి రణహతుం
డ వైననీతోఁ గూడ రాజలక్ష్మి నన్నుఁ బాసి చనియె నని పెక్కుతెఱంగుల విల
పించుచు శోకార్ణవపరిప్లుతయై కన్నీరు మున్నీరుగా రోదనంబుసేయుచున్న తార
నవలోకించి తరస్వి యగుసుగ్రీవుండు భ్రాతృవధజనితశోకాక్రాంతుండై మొగం
బున దైన్యంబు దోఁపఁ గన్నుల బాష్పజలంబు గ్రమ్ముదేర మనం బుదిలకొన

భృత్యపరివృతుండై మెల్లన రామునిసమీపంబునకుం జని గృహీతచాపుండును గాలవ్యాళతుల్యబాణుండును రాజలక్షణలక్షితాంగుండును మహోదాత్తుం డును యశస్వియు నగునమ్మహానుభావున కిట్లనియె. 597

సుగ్రీవుఁడు వాలివధంబును గుఱించి పరితపించుట.

సీ. జననాథ నీ వొసంగినబాస తప్పక బలభేదిసుతుఁ జంపి ప్లవగరాజ్య
మొనఁగితి వైన నీయుత్తమవీరుండు పడుటయుఁ దార బిట్టడలుటయును
నంగదుఁ డధికశోకార్తిఁ దూలుటయును వీక్షించి నామనం బిపుడు రాజ్య
సుఖభోగములయందు జొప్పడ కున్నది ఘోరదుఃఖమునఁ గుందుచున్నవాఁడ
తే. సిరికిఁగా నింత పాపంబుఁ జేసినాఁడ, నన్న లేకున్న సురపదంబైన నేల
తుచ్ఛరాజ్యంబు విడిచి నేఁదొంటిపగిది,ఋశ్యమూకంబునందుఁ జరించువాఁడ.

వ. మహాత్మా మహానుభావుం డగుసుదగ్రజుండు నిహతుం డయ్యె నంగదుండు పితృమరణదుఃఖంబున జీవించునో జీవింపఁడో యని సంశయవిషయభూతుం డయ్యె మచ్చిత్తంబు మిక్కిలి శోకాయత్తంబై యున్నది క్రోధంబున నమర్షం బున నధర్మంబున నన్నుం జంపించితి నాయట్టిపాపాత్మున కిహపరంబు లెక్కడివి భ్రాతృవధంబువలన లభించిన త్రైలోక్యసామ్రాజ్యం బైన నామనంబునకు సమ్మదం బొసంగ నేరదు వానరరాజ్యం బెంతగర్హితకృత్యంబువలనం జేకూడిన తుచ్ఛసుఖం బనుభవించుటకంటెఁ గపిజాతి కుచితం బైనజీవనంబు సాశ్రయిం చి శైలకాననంబులం జరియించుట యుక్తంబు గాదే యని పలికి వెండియు నిట్లనియె. 599

తే. ఇపుడు నిన్నేను హింసింప నిచ్చకొలఁది
దిరుగు మని యెద్ది పలికె నాధీరవర్యుఁ
డతని కామాట యనురూప మయ్యె నట్టి
యనఘుఁ జంపించు టనురూప మయ్యె నాకు. 600

చ. పొలుపఱి యేను బెక్కెడలఁ బోరులఁ జిక్కిన మున్ను కోపముం
గలిగియు భ్రాతృసౌహృదమునం గృపతో విడిపించుఁ గాని యె
గ్గులు దలపోసి ప్రాణమునకుం దెగఁ డట్టిదయాళు నీగతిం
జలమున నెంత దుర్మతినొ చంపుట కోర్చితి రాజ్యకామతన్. 601

తే. భ్రాతృవధమునఁగలుగుసామ్రాజ్యలాభ,మెక్కుడో భ్రాతృవధమున నెసఁగుదుఃఖ
మెక్కుడో యని చింతింప కింతపనికిఁ,బూనునే యెవ్వఁ డైన దుర్బుద్ధి యగుచు.

వ. మహాత్మా మద్వధంబు స్వమాహాత్మ్యానుల్లంఘనంబువలన వాలికి సమ్మతంబుగా దయ్యె నాకు బుద్ధిదౌరాత్మ్యంబువలన భ్రాతృవధరూపవ్యతిక్రమంబు సమ్మతం బయ్యె నేను ద్రుమశాఖావభగ్నుండనై యొక్క ముహూర్తం బార్తనాదం బు సేయుచు వెండియు నిట్లుగావించుట కర్హుండవుగావని యెవ్వనిచేత నాశ్వాసిం పంబడితి నట్టివాలిచేత భ్రాతృత్వంబును నార్యభావంబును ధర్మంబును నురక్షితం

బయ్యె నాచేతఁ గ్రోధంబును గామంబును గపిత్వంబును బ్రదర్శితంబయ్యె వాలిని
వంచించి చంపించినకారణంబున విశ్వరూపవధంబువలన నింద్రునకుం బోలె
నాకును బాపచింతకులచేత నైన నచింతనీయంబును బాపకృత్యులచేనైనం బరి
వర్జనీయంబును బాపాభిరుచిచేత నైన ననీప్సనీయంబును బాపదర్శులచే నైన
ననవేక్షణీయంబు నగుమహాపాతకంబు సంప్రాప్తం బయ్యె నింద్రునిపాపంబు
భూమియు జలంబును వృక్షంబులును యువతులును బంచికొని కుడిచిరి శాఖా
మృగంబునైన నాపాపం బెవ్వరు పంచి కుడుచువారు కులనాశయుక్తంబు నధ
ర్మయుక్తంబు నగునిట్టిదుష్కృతకర్మం బాచరించియున్న యేను బ్రజాసమ్మానం
బునకును యౌవరాజ్యంబునకును యోగ్యుండఁ గాను మహారాజ్యంబున కెట్లు
యోగ్యుండ నగుదు లోకావమతం బైనగర్హితక్షుద్రపాపంబునకుఁ బ్రవర్త
కుండ నైతి వృష్టిసలిలవేగంబు నిమ్నంబునుం బలె నీదురంతశోకంబు నన్ను నస
రించుచున్న దని పలికి వెండియు నిట్లనియె. 603

క. తను భ్రాతృవధాపరకా, యము సంతాపోర్ధ్వకాయ మగుపాపము యే
భము పీడించుచు నున్నది, క్రమమున నగ్గదిసి యేటిగట్టును బోలెన్. 604

వ. రాజేంద్రా నాహృదయంబునం గలవివేకధైర్యరూపం బైన యీసాధువృత్తంబు
తనతోఁ గూడ వర్తించుచున్న భ్రాతృవధజనితపాపంబును సహింపక వివర్ణం
బైనజాతరూపంబు వహ్నియందుఁ బరితప్యమానం బగుచుఁ దనతోఁ గూడి
యున్న ఋజీషాంశమలంబును సహింపక తాను వేఱైనచందంబునఁ బృథగ్విధం
బగుచున్నది. 605

సీ. నరనాథ నాదుదుర్నయ మీకుమారుని శోకతాపముఁ జూచి శోక మడర
నురుబలవానరయూథపయూథంబు పరఁగ నర్ధస్థితప్రాణముక్రియ
నయ్యెడు నని హృదయంబునఁ దలఁచెద సుతుఁడు సులభ్యుండు సువ్రతుండు
సుమతి సువశ్యుండు సుజనుఁ డంగదునకు సరియైనతనయుండు జగతిఁ గలఁడె
తే. యనఘచారిత్ర యే దేశమందు భ్రాతృ, సన్నిధానంబు మిక్కిలి సంఘటిల్లు
నట్టిదేశంబు లే దింతయఘముఁ జేసి, శిష్టజనపార్శ్వ మేమని చేరువాఁడ. 606

క. హితకరుఁ డీతారేయుఁడు, బ్రతికిన నత్తార వీనిఁ బాలించుటకుం
బ్రతుకు నటుగాక తక్కిన, బ్రతుకునె యొకనిమిష మైన భానుకులేశా. 607

మ. భువనస్తుత్య భవన్నిదేశగతులై పోల్పొంద నీవర్తమా
నవనాటోత్తము లంద ఱాజనకభూనాథాత్మజన్ సద్గుణ
స్తవనీయం దిలకించి వచ్చెదరు తథ్యం బేను దారేయ వా
నవిసఖ్యం బెడఁ గోరి మేను దహనజ్వాలాలి కర్పించెదన్. 608

వ. దేవా యేను మృతుండ నగుచుండ సర్వకార్యంబులు సమర్థించుకొనుటకు
మీరె చాలుదు రజీవనార్హుండను గృతాపరాధుండను గులహంతృకుండ నైన
నా కనుజ్ఞ యొసంగుఁడు. 609

తే. దురితచిత్తుండఁ గులనాశకరుఁడ నైన, యేను లేకున్న రామ నీ కేమిగాదవ
వాయుపుత్త్రాదివానరవరులె నీదు, కార్య మంతయు సాధింపఁగల రధీశ. 610

—తారను వానరులు రామసమ్ముఖమునకుఁ దోడితెచ్చుట.—

వ. అని దుఃఖావేశంబునం బలికి కన్నీరు నించినసుగ్రీవునిపరిదేవనంబు విని రాముండు కించి దశ్రుపూరితముఖుండై కొండొకసే పూరకుండి వెండియు భువనరక్షకుండును క్షితిక్షమావంతుండు నగురాముండు శోకాపనయనసముత్సుకుండై వాలిం గౌఁగిలించుకొని రోదనంబు సేయుచు నతనితోడిదె లోకం బని పడియున్నతార నవలోకించి తదీయసంతాపం బుడుపుటకుఁ దగినమాట లాడంగలవాఁడై యున్నసమయంబున గొందఱు మంత్రు లమ్మహాత్మునియనుమతి వడసి యనునయాలాపంబుల నద్దేవి నూరార్చి రామునిసమీపంబునకుం దోడ్కొని వచ్చిన నత్తార నిజతేజంబున భాస్కరునిభంగి వెలుంగుచున్నవానిఁ గరధృతశరచాపుం డగువాని జారులక్షణలక్షితుం డగువాని మహేంద్రకల్పుం డగువాని దురాసదుం డగువాని రాజీవతామ్రలోచనుం డగువాని నదృష్టపూర్వుం డగువానిఁ బురుషప్రధానుం డగువాని రాము నవలోకించియున్నం గదుం డెఱింగి వచ్చినలక్షణంబు లుపలక్షించి యతని రామునిఁగా నెఱింగి వ్యసనాభిపన్నయై విహ్వలించుచు శోకసంభ్రాంతశరీరభావ యగుచు విశుద్ధసత్త్వుండును రణోత్కర్షణలబ్ధలక్షుండు నగునమ్మహానుభావున కిట్లనియె. 611

సీ. అవనీశతిలక నీ వప్రమేయుండవు విజితేంద్రియుండవు వీరవరుఁడ
వంచితసత్కీర్తి వతిధార్మికుండవు క్షితజోపమానుండ వతులితుండ
వనుపమబాణబాణాసనపాణివి సత్యసంధుఁడవు విచక్షణుఁడవు
నుదురాసదుఁడవు వసుమతీక్షమావంతుఁడవు శూరజనముఖ్యుఁడవు మృదుండవ
తే. వధికరూపోపపన్నుండ వచలధృతివి, తలఁపఁగ మనుష్యదేహోదయంబు విడిచి
దివ్యదేహోదయంబున దేవమర్త్య, చక్రిజగములఁ బాలింపఁజాలు దీవు. 612

—తార తన్నును వాలినట్ల చంపు మని రామునిఁ బ్రార్థించుట.—

చ. నను నిమిషంబుఁ జూడక మనంగ సమర్థుఁడు గాఁడు వాలి యే
నునిశితబాణరాజమునఁ జొప్పడ వాలిని జంపి తా శరం
బునను నను న్వధింపు మిఁక భూమివరా యటు లైన నిప్పుడే
చనియెద నమ్మహామహునిఁ జారుపదంబులు గూడ ముట్టఁగన్. 618

చ. అరుదుగ నాదిలోకగతుఁ డయ్యును మత్ప్రియవల్లభుండు బంధురనిరపాయయౌవనమనోహరతామ్రసుమావతంసకాప్సరసలపొందు మాని యనిశంబును మద్విరహప్రభూతభీకరపరితాపపావకశిఖానిచయంబులఁ గ్రాఁగి కుందఁడే. 614

ఉ. ఈవర నాకమం దయిన దేవపతిప్రియనందనుండు నా

నావనసానుకందరపినద్ధనగేంద్రతటావకాశమం
దావసుధానుత న్విడిచి యార్తిఁ దపించు[illegible]
భావమునం దపింపఁ దొఁకొ నుద్విరహాంబుధిమగ్నచిత్తుఁడై. ,15

తే. అనఘ పత్నీవిహీనుఁడై నట్టితరుణ
పురుషునకుఁ గలసంతాప మరయ నింత
యనుచు నీవె యెఱుంగుదు పతినిఁ గూడఁ
బనుపు మతఁ డుండ లేఁడు నన్బాసి యచట.

వ. మహాత్మా మద్వధంబున నీకు స్త్రీఘాతదోషంబు గలుగు నని [illegible] పురుషున కర్ధశరీరంబు పత్ని యని నానాశాస్త్రంబులు వేదంబులు పలుకుచుండం జేసి మద్వధంబు వాలివధంబె యగు నీకు స్త్రీవధదోషంబు లేదు మఱియు జ్ఞానవంతు లగువారికి లోకంబునందు దారప్రదానంబుకంటె నొండుదానంబు లేదు గావున నీవు ధర్మప్రకారంబు విచారించి నన్నాప్రియభార్యం డగువాలి కొసంగుము దీన నీకుఁ బుణ్యంబు గలుగు నధర్మసంయోగంబు గలుగనేర దెల్ల భంగుల ననాథనై విలపించుచున్న నన్ను వధింపు మే నానుత్తమాతంగవిలాస గమనుండును ధీమంతుండును బ్లవంగలోకవల్లభుండును వరాహ్వోత్తమహేమ మాలియు నగువాలిం బాసి యొక్కనిమిషం బైన జీవింపం జాల నదియునుం గాక. 617

చ. అనుపమబాహువిక్రమవిహారుఁడు ధీరుఁడు శూరుఁడు న్యశో
ధనుఁ డగువాలి కిందు నిటు తప్పక యెగ్గొనరించి తీవు నక
ఘునతరవజ్రతుల్యవిశిఖంబునఁ బంచత నొందఁజేసి య
య్యనఘునిఁ గూడఁ బుచ్చి నృప యచ్చట నైన హితంబు సేయవే. 618

శ్రీరాముఁడు తార నూఱడించుట.

వ. అనిన నారఘువల్లభుండు తారావాక్యంబులు విని యద్దేవి నూరార్చి హితంబుగా నిట్లనియె. 619

సీ. వీరపత్నిరొ యింత వికృతి సేయఁగ నేల జగము విరించుఁడు నెగడఁజేసె
నతనికృతంబున నగు సుఖదుఃఖంబు జగము లన్నియు వానిశాసనమునఁ
దప్పక వర్తించుఁ దత్క్రమంబున నీవు భూరిసంతోషంబుఁ బొందఁగలవు
సంగతి నీపుత్త్రుఁ డంగదుఁ డిఁకమీఁద యౌవరాజ్యాధిపత్యంబు నొందు
ఆ. వీరపత్ను లింతవెట్టులై పరివేదనంబు సేయఁ దగవె యంబుజాక్షి
యనిన నవ్విలంది జనపతిమాటలఁ, దేఱి కొంతకాల మూరకుండె. 620

రాముఁడు వాలికిం బ్రేతసంస్కారముఁ గావింపుఁడని సుగ్రీవాదులతోఁ జెప్పుట.

వ. వెండియు నామహీవల్లభుండు లక్ష్మణునియనుమతి వడసి సుగ్రీవాంగదతారల నవలోకించి మీ రింక శోకించినం బ్రయోజనంబు లే దనంతరకార్యం బెయ్యది

దానిం గావింపుఁడు బాష్పమోక్షణంబు చాలింపుఁడు పారలౌకికకర్మం బెల్ల వారి కనుష్ఠేయంబు విహితకాలంబునకం టె నుత్తరకాలంబునం దించుకయైనఁ గర్మం బుపాసించుటకు శక్యంబు గాదు లోకంబునందుఁ గాలంబు కారణం బై సమస్తకర్మసాధనం బై సర్వభూతనియమనంబునందునిదానం బై యుండుఁ గాలం బు దక్క నెవ్వని కెవ్వండును బ్రవర్తకుండు లేఁడు నియోగంబునం దెవ్వండును స్వతంత్రుండుఁ గాఁడు స్వభావంబున వర్తించులోకంబు కాలపరాయణం బై ప్రవర్తిల్లుఁ గావున నాలోకంబునకుఁ గాలం బిష్టప్రాపకత్వంబునఁ బరమప్రాప్యం బై యుండు మహాకాలంబు సర్వప్రాణులకు సుఖదుఃఖప్రాపకత్వంబున దివసపక్షమాసఋత్వాదిరూపకోపాధికకాలంబునతిక్రమింపంజాల దట్లగుటం జేసి కాలంబు న్యూనత్వంబు నొందదు స్వతంత్రం బైనకాలం బె స్వకృతవ్యవస్థనతిక్రమింపం జాల దనఁ బరతంత్రుం డై నయాన్యున కేమి చెప్ప వచ్చుఁ గాలంబునకుఁ బురుషునితోఁ గూడ వశీకరణహేతుభూతమిత్రజ్ఞాతిసంబంధంబు లేదు వశీకరణహేతుభూతం బైనబంధుత్వంబును లేదు వశీకరణోపాయభూతపురుషకృతోపకారాదికంబు లేదు వశీకరణోపాయభూతపురుషకృతపరాక్రమంబును లేదు గావున సర్వకారణభూతం బైనకాలంబు పురుషునకు వశ్యంబు గా దింక నేమన్నను హితంబుగోరువానిచేత స్వాపేక్షితహేతుభూతకాలపరిణామంబు ద్రష్టవ్యం బై యుండు ధర్మార్థకామంబులు కాలక్రమాయత్తంబు లగుటం జేసి యే కాలంబున నెయ్యది కర్తవ్యం బగు నక్కాలం బలంఘనీయం బై యుండు నిప్పుడు భవద్వల్లభుం డగు వాలి మద్బాణకృతప్రాయశ్చిత్తత్వంబున స్వకీయపరిశుద్ధభావంబు నధిగమించియీలోకంబునుండివిహితకాలానుష్ఠితధర్మార్థకామసంబంధంబులచేతఁ బవిత్రం బైనక్రియాఫలంబు నొందె నమ్మహాత్మునిచేత స్వవిహితధర్మానుష్ఠానంబువలన జితం బై వశీకృతం బైనస్వర్గం బిప్పుడు పరిగృహీతంబయ్యె నితం డద్దాని నధిగమించె నట్టి యీనియతి శ్రేష్ఠతర మైనది గావున పరితాపంబు దక్కి వాలికి సంస్కారాదిక్రియలు నిర్వర్తింపుం డని రాముండు బహుప్రకారంబులం బ్రబోధించునెడ రామునివాక్యంబుల కనురూపంబుగా లక్ష్మణుండును దత్కాలసదృశం బగువాక్యంబున సుగ్రీవున కి ట్లనియె. 621

లక్ష్మణుఁడు సుగ్రీవునితో వాలికిఁ బ్రేతసంస్కారంబు గావింపు మని చెప్పుట.

ఆ. అనఘ నీవు బ్రీతి నంగదతారాన, మన్వితుండ వయి సమంత్రకము గ
నర్హవిధుల వాలి కగ్నిసంస్కారంబుఁ, జేసి ప్రేతవిధులు సేయు మవల. 622

చ. చందనముఖ్యదివ్యరససంయుతనూతనశుష్కకాష్ఠముల్
పొందుగఁ దేఁ బంపు మిఁకఁ బుత్త్రు ననన్యశరణ్యు నంగదుం
గ్రందుగ దుఃఖశోకమునఁ గార్శ్యము నొందక యుండ నంశుమ
త్స్ఫురదన మందమంజుకలనా మధురోక్తుల బుజ్జగింపుచున్. 623

తే. వివిధమాల్యవస్త్రంబులు వివిధగంధ
ములును దైలంబు ఘృతమును వలయునట్టి
పరికరంబులు దేరంగఁ బనుపు మజ్జ
మిత్రనందన యంగదుఁ బుత్త్రు నిపుడు. 624

తే. తార నిప్పుడు శిబికను దేరఁ బనుపు, వానరకుమారు వాలిని వానరేంద్రు
మోవఁ జాలినవారి నమోఘరయులఁ,గీశులబలాఢ్యులనుని యోగింపుమిపుడు.

వ. భానునందనా యీవాలిశత్వంబు విడువుమీపురంబు భవదధీనంబు శీఘ్రంబుగ సర్వకార్యంబులు నిర్వర్తింపు మని పలికి సుమిత్రానందవర్ధనుం డగులక్ష్మణుండు రామునిసమీపస్థుం డై కొల్చియుండె నతనివాక్యంబులు విని తారుండు మి క్కిలి సంభ్రాంతచిత్తుం డై శీఘ్రంబుగ గిరిగహ్వరంబుకడకుం జని యందుడాఁచి యున్నదాని నతిరమణీయ యైనశిబిక ననేకవానరులచేతం దెప్పించిన రాజానన సంయుక్తయు దివ్యయు మహనీయస్యందనోపమయుఁ బక్షిప్రతికృతికర్మవిభూ షితయుఁ జిత్రరూపపదాతిసమాచితయు శోభనస్వరూపసన్నివేశయు సిద్ధ విమానసమానయుఁ గుడ్యోపరిభాగతిర్యగవస్థితఫలకనిర్మితనానావిధసన్నివేశ రంధ్రవాయుప్రవేశనిమిత్తగవాక్షాకారరంధ్రయుక్తయు సునియుక్తయు విశా లయు సుకృతయు విశ్వకర్మవిరచితయు దారునిర్మితక్రీడాచలయుతయుఁ జారు కర్మపరిష్కృతయు వరాభరణహారవిచిత్రమాల్యోపశోభితయుఁ గ్రీడార్థనిర్మిత గుహాగహనసంఛన్నయు రక్తచందనరూషితయుఁ బుష్పౌఘసమభిచ్ఛన్నయుఁ బద్మమాలాలంకృతయు విభ్రాజమానతరుణాదిత్యవర్ణోపేతయు నగుశిబిక నవ లోకించి రాముండు సుగ్రీవునిం జూచి. 626

ఉ. అన్నకుఁ బ్రేతకార్యము రయంబునఁ జేయు మటంచుఁ బల్కఁగా
నన్నలినప్రియాత్మభవుఁ డంగదసంయుతుఁ డై మహాధ్వనిం
గన్నుల శోకబాష్పములు గాఱఁగ నేడ్చుచు దీనుఁ డై నుమే
రూన్నతవాలిగాత్ర మిడె నొయ్యనఁ దచ్ఛిబికాంతరస్థలిన్. 627

—అంగదాదు లగువానరులు వాలి కుత్తరక్రియలు గావించుట.—

తే. ఇత్తెఱంగున శిబికయం దింద్రసుతుని, తనువు సేర్చి నానావిధధవళమాల్య
వివిధనూత్నచేలా ద్యలంకృతులచేత,నొప్పఁబూజించి మంత్రసంయుక్తముగను.

తే. ఆర్యులకు నౌర్ధ్వదైహిక మాచరింపుఁ
డనుచు నానతి యీఁ గొంద ఱమితసత్త్వ
లాశిబిక నెత్తుకొని పోయి రందుఁ గొంద
ఱర్థులకు ధన మిచ్చుచు నరిగి రపుడు. 629

వ. మఱియుఁ దక్కిన తారాప్రభృతివానరకాంత లంగదుం బట్టుకొని వీరవీరేశ్వా ర్తనాదంబుల భర్త నుద్దేశించి రోదనంబు సేయుచు వెనుకొని చనిరి తదీయ

రోదనశబ్దంబుచేత వనాంతరంబునందు గిరిగుహాముఖంబులతోడ వనంబులు దుఃఖించినట్లుండె నిత్తెఱంగునం జని వివిక్తజనసంకులం బగు నొక్క నదీపులిన తటంబునం జేర్చియున్న చితిసమీపంబున శిబిక నునిచి రప్పుడు తార శిబికాంతర శాయి యగుపతి నాలోకించి తచ్ఛిరంబు నిజాంకంబునం జేర్చుకొని దుఃఖితయై యి ట్లనియె. 630

శా. హా కీశోత్తమ హా కృపాజలనిధీ హా గోత్రభిన్నందనా
హా కల్యాణగుణోత్తరా సుజనవర్యా హా మనోనాయకా
శోకవ్యాకులచిత్తనై మిగుల సంక్షోభించున న్నిప్పు డే
లా కారుణ్య మెలర్పఁ జూడవ యకార్యం బేమి గావించితిన్. 631

క. వనచరవర చుట్లం బడి, ఘనతరశోకమునఁ జాల గాసిల్లెడునీ
జనమును గరుణ దలిర్పఁగఁ, గనుఁగొని భాషింప వింత కఠినత దగునే. 632

చ. అనిమిషనాథనందన గతాసుఁడ వైనను నీముఖంబు నూ
తనజలజాభమై యుదిత తామరసప్రియవర్ణతుల్యమై
యనుపమభూరిసమ్మదరసాప్లుత మై మని యున్న నాఁటిచా
డ్పున రమణీయకాంతిఁ గడుఁ బొల్పుగ నొప్పుచు నున్న దిప్పుడున్. 633

సీ. ప్లవగేంద్ర రామరూపంబునఁ గాలుండు నినుఁ బొలివుచ్చెనే నీతి మాలి
దిక్కఱి విధవలై దీనత నేడ్చుచు నీపత్ను లందఱు నిన్నుఁ గొలువ
నొక్కటఁ జనుదెంచి యున్నవా రేటికిఁ బలుకవు మఱి సర్వపౌరజాన, పదులు
భృత్యులు చమూపతులుమంత్రులు ప్రీతిఁ జనుదెంచియున్నారు సముచితముగ
తే. వారినెల్ల సంభావించి వరుసతోడ, నీడుకొలుపుము పిమ్మట వేడు కలర
నీవు మేమును గలసి మహావనముల, సంతతంబును గ్రీడఁ గావింత మధిప. 634

వ. అని బహుప్రకారంబుల దుఃఖించుచుండి రంత నంగదుండు సుగ్రీవసహితంబు గారోదనంబు సేయుచుఁ బిత్రుకళేబరంబు చితామధ్యంబునం బెట్టి విధిప్రకారం బునననలుఁ దరికొల్పిన నప్పావకుం డాత్మశిఖాపరంపరల వాలికళేబరంబు భస్మం బుఁ జేసె నంత సంచయనాదికృత్యంబులు నిర్వర్తించి పదంపడి నదీజలంబుల వాలి కుదకక్రియలు గావించెఁ దక్కినబంధుమిత్రజ్ఞాతులు వేర్వేఱ యుదకదా నంబు గావించి రంతఁ బ్రేతకార్యంబు లన్నియు నిర్వర్తించి కృతకృత్యు లైరి తదనంతరంబ సుగ్రీవుండు సలక్ష్మణుం డగురాము నుపాసించి యుండె సమస్త వానరులు మంత్రిసహితంబుగా సుగ్రీవునిం బరివేష్టించి కొల్చియుండి రిత్తెఱం గున నందఱుఁ గృతాంజలిపుటులై సుహర్షులు పితామహునింబలె నక్లిష్టకర్మం డగురామచంద్రునిం గొల్చి యుండ నప్పుడు సుమేరుసమానశరీరుండును దరు ణాదిత్యసన్నిభముఖమండలుండు నగుహనుమంతుడు ఫాలకీలితాంజలిపుటుం డై రఘువల్లభున కి ట్లనియె. 635

హనుమంతుఁడు రామునిఁ గిష్కింధకు విచ్చేయఁ బ్రార్థించుట.

మ. దురితోద్వృత్తను లైనవానరులకున్ దుష్ప్రాప మైనట్టి యీ
హరిరాజ్యంబు భవత్ప్రసాదమున నీయాదిత్యపుత్రుండు సు
స్థిరతం జేకొని మంత్రియుక్తముగఁ గిష్కింధం బ్రవేశించి భూ
వర మీయానతి సర్వకార్యములు నిర్వర్తించువాఁ డెంతయున్. 636

చ. స్ఫురదురుదివ్యమాల్యమణిపుంజసుగంధిమహౌషధంబులన్
గురుమతి నీ కొసంగి కడుఁగోరికతో భజియించుచుండు నీ
తరణిసుతుండు కీశసముదాయము సంతస మంది చూడ స
త్వరముగ మీరు రా వలయుఁ దద్దయుఁ బ్రీతిఁ బురంబులోనికిన్. 637

చ. అన విని రాఘవుండు ముదితాత్మకుఁడై హనుమంతుఁ జూచి పా
యనియనురక్తి పెంపుమెయి నాడితి గా దనఁ గూడ దైన మ
జ్జనకునియాజ్ఞఁ బ్రోల్చొరక సంయమి నై పదునాల్గువర్షముల్
వనమున నుండువాఁడ నని వాకొని యొక్కవ్రతంబుఁ బూనితిన్. 638

క. పూనినవ్రతంబు నిండినఁ, గాని పురంబుఁ జొర రాదు గావున మీరల్
మానుగఁ బురి కేగుఁ డిపుడు, భానుజునకుఁ బ్లవగరాజ్యపట్టము గట్టన్. 639

రాముఁడు సుగ్రీవుని వీడుకొల్పుట.

సీ. అని పల్కి సుగ్రీవుఁ గనుఁగొని రాముఁ డి ట్లనియె నీయంగదుఁ డధికసత్త్వుఁ
డన్నకుఁ దనయుండు యౌవరాజ్యమునకుఁ బాత్రంబు గానఁ దత్పదమునందు
నిలుపు మీతని నిది సలిలాగమం బైనశ్రావణమాసంబు జగతి కెల్ల
నిమ్మాస మాదిగా నిఁక నాల్గు నెలలు వార్షికసంజ్ఞకంబు లై చెలఁగు నిట్టి

తే. కాల ముద్యోగకాలంబు గాదు కార్తి
కంబు సంప్రాప్త మగుచుండఁ గడిమి రిపువ
ధార్థ మరుగంగ వలయు నీ వంతదనుక
నూర నత్యంతసుఖలీల నుండి రమ్ము. 640

వానరులు సుగ్రీవునకు రాజ్యాభిషేకముఁ గావించుట.

వ. ఏ నీపర్వతగహ్వరంబున లక్ష్మణసహితుండనై నీవచ్చునందాఁక నుండెదననిదిరమ
ణీయం బై విశాలం బై యుక్తమారుతం బై ప్రభూతసలిలకమలోత్పలం బై యు
న్న దని పలికిన నట్ల కాక యని సుగ్రీవుండు రామునిచేత ననుజ్ఞాతుం డై యనే
కవానరసమన్వితంబు గా వాలిపాలితం బైనకిష్కింధాపురంబు ప్రవేశించి రాజ
మార్గంబునం జనుచు నెడనెడ నచ్చట వానరు లందఱుఁ దన్నుదర్శించి యభి
వందనంబులు గావించిన నయ్యైతెఱంగుల సంభావించుచు నంతఃపురంబున
కుం జనియె నప్పుడు బంధుమిత్రామాత్యులు సుగ్రీవునకభిషేకంబు సేయుసమక
ట్టిరందుఁ గొందఱు హేమపరిష్కృతం బైనపాండరాతపత్రంబును సువర్ణదండ
మండితంబు లై నశుక్లవాలవ్యజనంబులును గరంబుల ధరించిరి కొందఱు సర్వర

త్నంబులును సర్వబీజంబులును సర్వౌషధులును క్షీరవంతంబులైనతరువులకుసు
మంబులును శ్వేతమాల్యానులేపనంబులును స్థలజలజంబులునుసుగంధిమాల్యం
బులును దివ్యంబు లగుచందనంబులును జాతరూపంబును హరిద్రాక్షతంబులును
బ్రియం బగుమధుసర్పిర్దధిప్రముఖనిఖిలమంగళద్రవ్యంబులునువైయాఘ్రంబగు
చర్మంబును గోరోచనయును మనశ్శిలయునుం దక్కువ సర్వోపకరణసంభారంబు
లన్నియు సమకూర్చిరి పదియాఱ్గురుకన్యకలు సర్వాలంకారశోభితలై యభిషేకా
ర్థంబు పూర్వోక్తమంగళద్రవ్యంబులు కరంబులం గొని చనుదెంచి రంత యథా
కాలంబున నన్నవస్త్రసువర్ణమణిప్రదానంబుల విప్రులం బూజించి మంత్రకో
విదు లగువారు కుశపరిస్తీర్ణ యగువేదికయందు ననలుం బ్రతిష్ఠించి మంగళా
భ్యుదయార్థంబు మంత్రపూతంబులైనహవిరాజ్యహోమంబులుగావించి వరా
స్తరణచిత్రమాల్యోపశోభిత సువర్ణప్రాసాదశిఖరోపరివిరచితమణిమయసింహాస
నంబునఁ బ్రాఙ్ముఖంబుగా సుగ్రీవు నాసీనుంగావించిసువర్ణకలశవృషభశృంగం
బులం బట్టి తెచ్చినసకలనదీనదసముద్రసరోవరపుణ్యతీర్థంబులచే మహర్షివిహి
తశాస్త్రదృష్టివిధానంబున గజగవయగవాక్షగంధమాదనశరభమైందద్వివిద
జాంబవదాంజనేయప్రభృతినిఖిలవానరులు వసువులు వాసవునింబోలె సుగ్రీవు
నభిషేకించి రప్పుడు. 641

తే. అనఘుఁ డినపుత్త్రుఁ డభిషిక్తుఁ డగుచు నుండ
నఖిలవానరపుంగవు లమితహర్ష
కలితచిత్తులై గుంపులు గట్టి భద్ర
వాక్యముల జయపెట్టి రవార్యసరణి. 642

క. జనవిభుఁ డగురామునిశా,సనమున సుగ్రీవుఁ డాత్మసమునంగదుని
ఘనముగ సంభావించుచుఁ, బనివడి తగ యౌవరాజ్యపదమున నిలిపెన్. 643

ఉ. అంగదుఁ డర్కవర్ణకనకాంగదుఁ డిట్లు కృతాభిషేకుఁడై
సంగతి మీఱ దివ్యవిలసన్మృదు తేజమునన్ వెలంగుచుం
డం గని సర్వవానరు లెడందల సంతస మంది కౌశలో
క్తిం గడు సన్నుతించి రలకీశపతిన్ రఘువంశవర్యులన్. 644

క. నిరుపమహర్షోత్కర్షిత, గురుకపిహర్షప్రభూత కోలాహలసం
భరితం బై కిష్కింధా, పుర మప్పుడు సలిలరాశిఁ బోలెఁ జెలంగెన్. 645

రామలక్ష్మణులు ఋశ్యమూకముఁ జేరుట.

ఉ. అంత నిజాభిషేకకథ యంతయు సూర్యసుతుండు రామభూ
కాంతునితోడఁ జెప్పి తన కాంతను నారుమఁ గూడి సన్మద
స్వాంతముతో మనోజసుఖవారిధిఁ దేలుచు ధర్మయుక్తిచే
నెంతయుఁ గీశరాజ్యపదమేలుచు నుండెఁ గుమారయుక్తుఁడై. 646

తే. అర్కనందనుఁ డభిషిక్తుఁ డగుచు నుండ
రామభద్రుండు తేజోభిరాముఁ డగుచు
నపుడు లక్ష్మణసహితుండై యచటు వాసి
శీఘ్రమున ఋశ్యమూకంబుఁ జేరఁ జనియె. 647

వ. మఱియును. 648

సీ. శార్దూలగోపుచ్ఛచమరవరాహపంచాననసేవితం బైనదాని
నానామనోజ్ఞవల్లీనికుంజమహీరుహావళిసంకులం బైనదానిఁ
గమనీయశీతలవిమలోదకవిరాజమానజలాశయం బైనదాని
రమణీయకుసుమసౌరభసంగ్రహణపవమానమానితతలం బైనదాని

తే. నచలశిఖరంబు నెక్కి యం దతివిశాల, రమ్యతర మైనయొకగహ్వరంబు సొచ్చి
మిత్రకులవర్ధనుండు సౌమిత్రిఁ జూచి, యింపు దళుకొత్త మెల్లన నిట్టు లనియె.

క. అనఘా యీపర్వతగుహ, యనుపమ మై యుక్తవాత మై యున్నది గా
వున మనము వర్షకాలము, చనునంతకు నిచట వసతి సల్పుదము రహిన్. 650

వ. మఱియు నిప్పర్వతశిఖరంబు శ్వేతకృష్ణతామ్రశిలోపశోభితంబును నానాధాతు
సమాకీర్ణంబును దరీనిర్ఝరవిరాజితంబును నిరంతరకుసుమితమాలతీకుందగుల్మసిం
ధువారశిరీషకదంబార్జునసర్జప్రముఖవివిధఫలతరుషండమండితంబును
శుకపికశారికామయూరసారసప్రముఖనిఖిలపతత్త్రిరవనాదితంబును నై యొప్పు
చున్నది. యిచ్చటికి సమీపంబున మనోహరసంఫుల్లకమలకల్హారకైరవమండితం
బైనయొక్కసరోవరంబు రమ్యంబుగాఁ బ్రకాశించుచున్నది మఱియు నీగుహానై
రృతిద్వారయుక్త యగుటం జేసి వర్షప్రవేశాభావంబువలన మిక్కిలి లెస్సయై
యుండుఁ బశ్చాద్భాగోన్నత యగుటం జేసి పురోవాతనిరోధకత్వంబువలన నివా
తయై యుండు నీగుహాద్వారంబునందు సమతలంబై దీర్ఘంబై భిన్నాంజనచ
యోపమంబై స్నిగ్ధంబై యొక్కపాషాణం బున్నది యిచ్చటికి నుత్తరంబున నీల
జీమూతంబుకరణి సముత్థితం బై భిన్నాంజనచయాకారం బై యొక్కనీలశిఖరం
బును దక్షిణంబునఁ గైలాసశిఖరప్రఖ్యం బై నానాధాతువిభూషితం బై యొక్క
శ్వేతశిఖరంబును బ్రకాశించుచున్నయవి యిచ్చటికిం దూర్పునఁ బ్రాచీనవాహి
ని యగునొక్కనది యకర్దమ మై త్రికూటంబునందు జాహ్నవియుంబోలె దేజ
రిల్లుచున్న దదియు న్యగాలలామంబు మఱియును. 651

చ. పులిననితంబయుక్తయుఁ బ్రఫుల్లసరోరుహపత్త్రనేత్రయుక్
లలితమృణాళదోర్యుతయు రాజితశైవలకేశపాశయుక్
విలసితవీచికావళియు విశ్రుతచక్రపయోధరాఢ్య యై
చెలువయుఁ బోలె నొప్పెడుఁ బ్రసిద్ధచరిత్రకఁ గంటె నిమ్నగన్. 653

మ. తటినీతీరములందుఁ బొల్చెడి మహాతర్లుం జూచితే శింశుపా
వటహింతాలరసాలసాలధవనింబప్లక్షజంబీరక

స్ఫుటభల్లాతకమాధవీకురవకాశోకావళీపాటలీ
కుటజాశ్వత్థకురంటకాదివివిధక్ష్మోణీరుహవ్రాతమున్. 653

చ. అలఘుచరిత్ర కంటె హృదయంబులఁ గూరినరాగపూరముల్
వెలి కుఱుకం బతత్త్రములు విప్పుచుఁ గప్పుచు జోడు గూడి యా
పులినములందుఁ బెక్కెడలఁ బుష్పశరోద్ధతిఁ గేళి సల్పెడుం
గళరవమాధురీమహిమ గ్రాలఁగఁ జక్రమరాళదంపతుల్. 654

ఉ. ఒక్కెడ మందమారుతరయోద్ధతనూతనపుండరీక మై
యొక్కెడ శీతలోదకకణోక్షితకోకనదప్రకాండ మై
యొక్కెడ గంధలుబ్ధమధుపోదరనీలపయోజషండ మై
యొక్కెడ హృద్యసంపదల నొప్పుచు నున్నది కంటె నిమ్నగన్. 655

క. పారిప్లవశతశోభిత, మై రమణీయాండజారవానాదిత మై
సూరిజననిషేవిత మై, యాగాఢిం బొల్పుచున్న దాపగ కంటే. 656

క. చందనతరుబృందంబు ల,మందమనోహరసుగంధిమహనీయము లై
కందళితవిద్రుమము లై, యందంద చెలంగుచున్న వంతటఁ గంటే. 657

తే. అనఘ యీ దేశ మతిరమ్యమగుచుఁ బొల్చెఁ, బర్వతోద్భూతసకలసంపదలచేత
వర్ష రాత్రంబుచనుదాఁకహర్ష మెసఁగ,నిచట వసియింతమఖిలార్థహితముపొంటె.

వ. మఱియు సుగ్రీవపాలితం బైనకిష్కింధాపురం బిచ్చటికి సమీపం బై యుండు మృదంగాడంబరంబుతోఁ గూడి గీతవాదిత్రనిర్ఘోషంబును వానరులకోలాహల శబ్దంబును వినఁబడుచున్న దని పలికి వెండియు రాముం డిట్లనియె. 659

క. హరిరాజ్యంబును భార్యను, నిరుపమగతి నధిగమించి నిత్యశ్రీవి
స్ఫురణ నినునందనుం డ, త్యురుతరసుఖగోష్ఠి నలరుచుండుం గాదే. 660

వ. అని పలికి యారఘుకుంజరుండు బహుదృశ్యదరీకుంజపుంజరంజితం బైనయన్నగంబునం బొల్పుగుహయందు నధివసించె నప్పుడు. 661

క. నిరుపమధాతుసముజ్జ్వల, సురుచిరమణికటకసానుశోభిత మయ్యు
న్గిరి సీతావిరహితుఁ డగు, నరవిభునకు సమ్మదం బొనర్పక యుండెన్. 662

### రాముఁడు సీతం దలంచుకొని దుఃఖించుట.

వ. ఇత్తెఱంగున నారఘుసత్తముండు లక్ష్మణసహితంబుగా గిరిగుహ నాశ్రయించి.

ఉ. అచ్చటిపద్మకుట్మలము లచ్చటిమత్తమధువ్రతవ్రజం
బచ్చటినూతనోత్పలము లచ్చటిదాడిమబీజసంచయం
బచ్చుగ జానకీకుచకచాక్షిరదద్యుతిఁ దెల్ప నాత్మలో
హెచ్చినశోకతాపమున నెంతయుఁ దత్పరతన్ గృశించుచున్. 664

చ. చిలుకలు మ్రోయఁ గోయిలలు చెంగటఁ గూయఁగఁ బిన్నతెమ్మెర

ల్గలయఁగ వీవఁ బ్రాణములకంటె గరీయసి యైనజానకి
న్దలఁచుచు రాత్రులందు హిమధాముని రాకకు బెగ్గలించుచుం
గళవళ మందుచు న్నిగులఁ గంటికిఁ గూరుకు రాక వేఁగుచున్. 665

ఉ. ఎప్పుడు రావణుం గదిసి యేపున గీటడఁగింతు నెప్పుడా
కప్పురగంధి నొక్కట సుఖం బగునట్లుగఁ గౌఁగిలింతు నీ
దెప్పర మైనశోకజలధిం దగ నెప్పుడు దాఁటువాఁడ హా
యొప్పులకుప్ప యంచు విభుఁ డొయ్యన దుఃఖితుఁడయ్యె నెంతయున్. 666

వ. ఇట్లు ప్రియావిరహసంజాతశోకపారవశ్యంబున మైమఱచి యున్నయన్నం జూచి
సమానదుఃఖుం డయ్యును లక్ష్మణుండు కొండొకధైర్యంబున బహువిధమంద
మధురాలాపంబులం దేర్చుచు నిట్లనియె. 667

చ. అనుపమధైర్యశాలివి జితారివి దేవపరాయణుండ వీ
యనువున నీవు ప్రాకృతునియట్ల కృశింపఁగఁ జెల్ల దయ్య పా
వనగుణ మీకుఁ జెప్పఁ గలవాఁడనె శోకము సర్వకార్యనా
శన మది యంచుఁ బెక్కడల సాధులు చెప్పరె మీ రెఱుంగరే. 668

లక్ష్మణుఁడు శ్రీరాము నూఱడించుట.

తే. అనఘ మీకంటె ధర్మజ్ఞుఁ డధికధైర్యుఁ
డమితశౌర్యుఁడు వేఱొకఁ డవనిఁ గలఁడె
ఘోరసంగ్రామమున దైత్యుఁ గూలనేయ
దక్షుఁడవు దివ్యకోదండదీక్షితుఁడవు. 669

ఉ. అంబుధినిమ్నగాగిరివనాకుల యైనధరిత్రి నొక్కవా
లంబునఁ గూల్పఁ జాలిన మహాబలశాలికి నీకు నొక్కదై
త్యుం బరిమార్పు టెంత మది నుమ్మలికంబు దొలంగఁ బెట్టి రౌ
ద్రంబున రావణుం గదిసి తప్పక చంపుము సంగరంబునన్. 670

వ. మహాత్మా యిప్పుడు ప్రావృట్కాలంబు సమాగతం బై యున్నయది యింక మీఁద
శరత్కాలంబు చనుదెంచునప్పుడు ప్రాతఃకాలంబునందు దీప్తాహుతులచేత భస్మ
చ్ఛన్నుం డగు వైశ్వానరుం బోలె నేను విక్రమోచితవాక్యంబులఁ బ్రసుప్తం
బైనభవదీయవీర్యంబుం బ్రబోధించెద మద్వాక్యచోదితుండవై పురరాష్ట్రపరి
వారసహితంబుగా రావణుం బరిమార్పు మని పలికిన స్నిగ్ధంబు లగులక్ష్మణునివచ
నంబులు విని రాముండు లక్ష్మణుం జూచి యనురాగయుక్తంబును గాలోచిత
ప్రియపదంబును హితోదర్కంబును నమోఘవిక్రమయుక్తంబు నగువాక్యంబు
నీచేత సముదీరితం బయ్యె నీచెప్పినట్ల సర్వకార్యావసాదకం బైనశోకంబు పరి
త్యజించి యప్రతిహతం బగు తేజంబంగీకరించి శత్రువధంబునకుత్సహించి సుగ్రీ
వసమాగమనంబుఁ గోరుచు శరత్కాలంబుఁ బ్రతీక్షించుచుండెద నుపకార

యుక్తుం డగుపురుషుండు ప్రతికారంబు గావించుకృతజ్ఞుండు గాక యకృతప్రతికారుం డయ్యెనేని యతండు పరమసాత్త్వికులమనంబును క్షోభింపం జేయు నని పలికిన నన్నమాటలు విని సౌమిత్రి కృతాంజలిపుటుండై తద్వాక్యకౌశలంబు బహువారంబులు కైవారంబు చేసి యభిరామదర్శనుం డగురాముని విలోకించి యతనిప్రసాదంబు వడసి స్వకీయం బైనశుభమతంబు ప్రకటింపం జేయుచు దేవా సుగ్రీవుండు కృతజ్ఞుండు ప్రవర్తకుండు భవదీప్సితంబు సిద్ధింపం జేయుటకు సమర్థుండు శరత్కాలంబు వచ్చునంతకుం జను దేఱఁ గలండు కోపం బుపసంహరించి శరత్కాలంబు ప్రతీక్షించుచు నిన్నాల్గుమాసంబులు సహించి మృగరాజసేవితం బైనయీపర్వతంబునందు మత్సమేతంబుగా వసింపు మనిన నతనివాక్యంబులచేత నుపశమితకోపతాపుం డయ్యె నిట్లు వాలిం బరిమార్చి సుగ్రీవు నభిషిక్తుం జేసి మాల్యవత్పర్వతపృష్ఠభాగంబున నధివసించి రాముండు లక్ష్మణున కిట్లనియె. 671

### శ్రీరాముఁడు లక్ష్మణునితో వర్షాకాలము నభివర్ణించి చెప్పుట

క. విరహులకు మదనవర్ధన, కరమై తనరారువృష్టికాలం బిది యం
బర మచలసన్నిభాంభో, ధరసంవృత మగుచుఁ బొల్చెఁ దమ్ముఁడ కంటే. 672

క. వనధిరసము నినకరముల, ఘనముగఁ దిగిచికొని క్రోలి గగనాంగన మె
ల్లన నవమాసభృతరసా, యనగర్భముఁ గన్నచంద మయ్యెడిఁ గంటే. 673

తే. మేఘసోపానపంక్తుల మిన్ను ప్రాఁకి, నవమనోహరకుటజార్జునప్రసూన
మాలికలచేతఁ దగ నంశుమాలి నిపుడు, జననుత యలంకరింపఁగ శక్య మయ్యె.

క. అలసానిలనిశ్శ్వాసము, లలితాపాండరలసజ్జలధరము సంధ్యా
మలయజలిప్తము నై నభ, మలరెడుఁ గామాతురునిక్రియం గనుఁగొంటే. 675

వ. మఱియు నీగగనం బంతరాంతరాసముద్భిన్నసంధ్యారాగంబు లగుటవలనఁ దామ్రంబు లై పర్యంతంబులం దధికపాండరంబు లై కించిజ్జలరసనసంబంధంబు లై యొప్పుమేఘపటోచ్ఛదంబులచేత బద్ధవ్రణం బైనదానియట్లు చూపట్టుచున్నది విలోకింపుము. 676

తే. దశరథకుమార ఘర్మసంతప్త యైన, ధర నవోదకసిక్త యై విరహతాప
తప్త యైనట్టిమేదినీతనయభంగి, బాష్పములు నించుచున్నది వరఁగఁ గంటె.

తే. అంబుదోదరముక్తంబు లై వినూత్న, లలితకహ్లారసుఖశీతలంబు లై సు
కేతకీసౌరభంబు లై వాతములు క,రాంజలులఁ బట్టి విడుచుట కర్హ మయ్యె.

క. వికసితమకుటార్జునకే, తకీభరిత మైనయీకుధర మారవివు
త్రకుని విధంబున వర్షో,దకముల నభిషిక్త మయ్యెఁ దమ్ముఁడ కంటే. 679

క. ధారాధరాజినంబులు, ధారాయజ్ఞోపవీతధరములును మరు
త్పూరితగుహాములు నగగిరు, లార్యయ శ్రుతి చదువుచున్నయట్ల యలరెడున్.

వ. మఱియు నంబరంబు కాంచనకశలచేతం బోలెఁ జంచలలచేతఁ దాడితం బై యంత స్స్వనితనిర్ఘోషం బై వేదనాసహితం బై నదానిపోలిక నొప్పుచున్నది విలోకింపుము. 681

మ. నరసాగ్రేసరరమ్యచంద్రకరసంస్పర్శప్రభూతప్రమో
దరసోన్మీలితతార లై మిగుల సంధ్యాలక్ష్మి యాత్మీయభా
సురచేతోహరరోహితప్రభలచే సొంపొందఁగా నిప్పుడం
బరముం జాల వెలుంగఁ జేసెడి మహాత్మా వేడ్క వీక్షించితే. 682

తే. అనఘ మేచకమేఘంబు నాశ్రయించి
శంపఁ జూచితె చాలఁ జలించుచున్న
దకట దుష్టాత్ముఁ డైన దశాస్యునంక
తలమునఁ గృశించుచున్న భూతనయఁ బోలి. 683

తే. అభ్రలిప్తలై నష్టగ్రహోడ్డు లగుట, వలన నజ్ఞాతభాగ లై యలరు దిశలు
మీఱి మదనోత్సవము సేయువారి కెల్ల, హితమొనర్చుచు నున్నవి నృపకుమార.

చ. అకలుషచిత్త కంటె విపినాచలసానువులన్ ఘనోదయో
త్సుకకుటజావనీజములు శోకపరీతుఁడ నైననాకుఁ బా
యక మదనప్రదీపనము లై సముదంచితపల్లవంబు లై
వికచసుమంబు లై మదికి వేఁక మొనర్చుచు నున్న వెంతయున్. 685

చ. రవికులవర్య చూచితివె రమ్యపయోధరకాలసంగతిం
బవనుఁడు శైత్య మొందె నలభానుఁడు మందగభస్తి యయ్యె న
య్యవని రజం బడంగె నదు లన్నియు నిండెఁ బ్రవాసు లైనమా
నవులు స్వదేశభూమికి ఘనంబుగఁ బోవుచునుండు రిత్తఱిన్. 686

క. ఎడతెగక కురియుచున్నవు, జడివానల మిఱ్ఱుపల్లు సమతలమై కా
లిడ రాక రొంపి గొని యొ,ప్పెడు వనమార్గములు కంటె పృథివీశసుతా. 687

తే. కంటివె మరాళములు నిజాంగనలఁగూడి, పరఁగ మానసవాసతత్పరము లగుచు
బహుళవర్షాంబువిక్షతపథములందుఁ, గాలిడక పోవుచున్నవి గగనమందు. 688

తే. చక్రహంసబకక్రౌంచసారసములు, నష్టకుముదాంబురుహకోకనదము లైన
సరసులం దుండఁజాలక సంభ్రమమున, సొలయుచున్నవి కంటివే జోడువాసి.

ఉ. తక్కక వారివాహసముదంచిత మైనసుపర్వమార్గముఁ
దక్కువ లేకఁ జూచితివె మానద యొక్కెడ సత్ప్రకాశమై
యొక్కెడ నప్రకాశ మయి యొప్పుచు నున్నది యక్కడక్కడం
జక్కఁగ శైలరుద్ధ మగుశాంతమహార్ణవరూపమై ఖరిన్. 690

వ. మఱియు సర్జకదంబపుష్పవ్యామిశ్రితం బై పర్వతకూటంబులు డిగ్గి తదీయధాతు రాగతామ్రం బై మయూరకేకారవానుయాతం బై జలజలనంబఱి తెంచునవో

దకంబు వహించి ఘుమఘుమారావంబులతో శైలాపగలు ప్రవహించుచున్నవి తదీయశీకరపరంపరాసంవర్ధితజంబూతరుశాఖాగ్రషట్పదాయమానపరిపక్వపరిపతితజంబూఫలంబులును బవనాధూతంబులై పుడమిం బడు నానావర్ణవిపక్వచూతఫలంబులును జనులచేత భక్షింపంబడుచున్నవి శంపాపతాకంబులై బలాకామాలాసమన్వితంబులై మహీధరశిఖరసంస్థానసంకాశంబులై మహానాదంబులై మేఘంబులు సంగ్రామస్థంబులగు మహోన్మదగజేంద్రంబులవడువున గర్జించుచున్నయవి వర్షసలిలసంపృక్తశాడ్వలంబులై నృత్యోత్సవక్రీడాభిరతమయూరంబులై నిర్వృష్టమేఘంబులై వనంబు లపరాహ్ణకాలంబున నతిరమణీయంబుగాఁ బ్రకాశించుచున్నవి మఱియు జీమూతంబులు సలిలాతిభారంబు వహించి సబలాకంబులై మహానాదంబులు గావించుచు సమున్నతమహీధరశిఖరంబులమీఁద విశ్రమించుచుం బోవుచున్నయవి గర్భధారణార్థంబు మేఘంబు కడకుం జను సంజాతసమ్మోద యైన బలాకారేఖ నింగికిం గట్టినవాతావధూతలంబమానసితాంభోరుహరేఖ వోప్పున నొప్పుచున్నది బాలేంద్రకోపాంతరచిత్రితనూతనశాడ్వలంబుచేత వసుంధర గాత్రానుషక్తశుకప్రభలాక్షోక్షితకంబళంబుచేతఁ గాంతయుం బోలె నభిరామ యై యున్నది మఱియు వర్షాగమసంహృష్టంబులగు వనగజంబులు కేతకీగంధాస్వాదసంజాతసంతోషవిశేషంబు నధిగమించి వననిర్ఝరంబులయందుఁ బతనకృతశబ్దాకులితంబులై మదవిశేషంబున మయూరంబులం గూడి నాదంబు గావించుచున్నవి మఱియుఁ జంచరీకంబులు వర్షధారానిపాతహన్యమానంబు లగుటవలనఁ గదంబశాఖ లవలంబించి తత్క్షణసంపాదితంబైన కుసుమరసోత్పన్నమదంబు పరిత్యజించుచున్నవి మఱియు సంగారచూర్ణోత్కరసన్నికాశసరససమృద్ధఫలంబులచేత జంబూతరుశాఖాకదంబంబులు నిలీయమానషట్పదసమూహంబులచేతం బోలె మనోహరంబులై యొప్పుచున్నవి తటిత్పతాకాలంకృతంబులును సముదీర్ణగంభీరమహాఘోషంబులును నగు నీలజీమూతస్వరూపంబులు రణోద్యతవారణస్వరూపంబుల భంగిఁ జూపట్టుచున్నయవి. ఒక్క మదగజేంద్రంబు స్వనివాసస్థానంబైన శైలవనంబునకు సుపథంబునం బోవుచుఁ బృష్ఠభాగంబున మేఘనాదంబు విని ప్రతినాగం బని శంకించి యుద్ధార్థంబు మరలుచున్నయది మఱియు వనమధ్యంబు లొక్కయెడ మధువ్రతంబుచేతఁ బ్రగీతంబులైన మాడ్కి నొక్కయెడ నీలకంఠంబులచేతఁ బ్రవృత్తంబులైన కరణి నొక్కయెడ నాగేంద్రంబులచేతఁ బ్రమత్తంబులైన భంగి ననేకాశ్రయంబులు గలవియై యలరుచున్నవి మఱియు వనాంతభూమి కదంబబంధూకార్జునశిలీంధ్రపుష్పోపేతయై నూతనసలిలసంపూర్ణయై మత్తమయూరనాదనృత్తంబులచేతఁ బానభూమియుం బోలెఁ గనుపట్టుచున్నది మఱియు ముక్తాసకాశంబును వినిర్మలంబును బత్రపుటలగ్నంబును సురేంద్రదత్తంబు నైన పతజ్జలంబును నానావర్ణపక్షంబులైన చాతకంబులు తృష్ణావిశేషంబునం

గ్రోలుచున్నవి మఱియు మత్తభ్రమరతంత్రీమధురనాదంబును మండూకసముదీరితకంఠతాళంబు నగుసంగీతంబు జలధరమృదంగనాదంబులచేత నావిష్కృతంబై మహారణ్యంబులయందు విన నగుచున్నది మఱియు నీసంగీతంబునకు నృత్యంబు గావించుచున్నకొన్నిమయూరంబులు నర్తకస్థానీయంబులై కేకారవంబులు గావించుచున్నకొన్నిమయూరంబులు మృదంగవాదకస్థానీయంబులై మహీరుహాగ్రనిషణ్ణగాత్రంబులైనకొన్నిమయూరంబు లనుభవితృస్థానీయంబులై మెచ్చుచున్నవి ఘనస్వనంబులచేతఁ జిరకాలసన్నిరుద్ధయైననిద్రం బరిత్యజించి మేల్కాంచి నానావిధవర్ణరూపనాదంబులైనమండూకంబులు నూతనసలిలధారాభిహతంబులై ఘోషించుచున్నవి మఱియు నద్యంగనలు వారిపూరోన్నమితచక్రవాకంబులై శీర్ణంబులైనతీరంబులనతిక్రమించి యతిదృప్తలై నూతనఫలాద్యుపహారచందనకర్పూరకుసుమతాంబూలాదికసమన్వితలై నిజభర్తయగుసముద్రునిం గలయుటకు నతివేగంబునం బోవుచున్నయవి దవాగ్నిదగ్ధంబులైనపర్వతంబులయందు బద్ధమూలంబు లగుదవాగ్నిదగ్ధపర్వతంబులకరణి నీలమేఘంబులయందు సంసక్తంబులైననూతనవారిపూర్ణనీలమేఘంబులు గగనంబునం బ్రకాశించుచున్నవి మఱియు మదోద్దండవేదండంబులు సంప్రహృష్టమయూరనాదముఖరితంబులును శక్రగోపనామకకీటవిశేషప్రచురశాడ్వలంబులును నీపార్జునవాసితంబులునైన వనమధ్యంబులయందుఁ జరించుచున్నయవి చంచరీకంబులు నవవారిధారాహతకింజల్కంబులైనసరోరుహంబులం బరిత్యజించి సకేసరంబులైనకదంబపుష్పంబులయందు రయంబునం బ్రవేశించి యానందించుచున్నవి మఱియు గజేంద్రంబులు మదోన్మత్తంబులై గవేంద్రంబులు సంప్రహృష్టంబులై మృగేంద్రంబులు మహారణ్యంబులయందు విశ్రాంతతరంబులై పర్వతేంద్రంబులు పల్లవపుష్పాంకురాదులచేత నతిరమ్యంబులై నరేంద్రులు నివృత్తదండయాత్రులై యున్నవారు సురేంద్రుండు వారిధరంబులతోడం గ్రీడించుచున్నవాఁడు మఱియు మహామేఘంబులు గగనంబు నాశ్రయించి సముద్భూతసముద్రనాదంబులై మహాజలౌఘంబులచేత వాపీకూపతటాకసరోవరనదీసంఘంబులఁ బూరింపం జేయుచున్నవి మేఘంబులు మహావేగంబులై నిరంతరంబుగా వర్షించుచున్నయవి వృష్టివాయువులు సముదీర్ణఘోషంబులై వీచుచున్నయవి మహానదులు నష్టకూలంబులై విప్రతిపన్నమార్గంబులై ప్రవహించుచున్నయవి మఱియు నరేంద్రులు నరులచేత నభిషిచ్యమానులై యాత్మీయసంపద నవలోకింపం జేసినకైవడిఁ బర్వతేంద్రంబులు సురేంద్రదత్తపవనోపనీతఘనాంబుకుంభంబులచేత నభిషిచ్యమానంబులై నిర్మలవివిధధాతుభూషితనానావిధకుసుమితతరులతాద్యలంకృతంబులైననిజాకారంబు దర్శింపం జేయుచున్నయవి జలదోపపన్నం బగుటవలన నక్షత్రగ్రహభూషితం బైననభంబును సూర్యమండలంబునుం గనుపట్టకున్నయది

గాఢసంతమససంవృతంబు లగుటం జేసి దిక్కులును నిరంతరవారిపూర
పరిచ్ఛన్నం బగుటం జేసి మహీతలంబునుం బ్రకాశింప కున్నయది మఱియు
మహోన్నతంబు లైన శైలశిఖరంబులు నవవారిధారాధౌతంబు లై మహాప్ర
మాణవిపులనిర్ఝరంబులచేత నుపలక్షితంబు లై లంబమానముక్తాకలాపం
బులచేతం బోలె మిక్కిలి యభిరామంబు లై యున్నయవి మఱియు
శైలేంద్రోపరిసంజాతవిపులప్రవాహంబులు పర్వతోపల విశీర్యమాణవేగంబు
లై మత్తమయూరరుతముఖరితంబు లైనగుహాముఖంబునందు విశీర్యమాణ
హారంబులభంగిఁ జూపట్టుచున్నవి మఱియు మహావేగంబు లైనకొన్ని
విపులప్రపాతంబులు నిర్మలీకృతశిఖరిసమీపతలంబు లై ముక్తాకలాపప్రతిమంబు
లై డిగ్గుచు శైలగుహామధ్యప్రదేశంబులచేత ధరింపంబడుచున్నవి సురత
క్రీడాసంఘర్షణవిచ్ఛిన్నంబు లైనదేవతాంగనాహారముక్తికంబులవడువునఁ
దోయధారలు నిరంతరంబుగా దిక్కులయందుఁ గురియుచున్నవి నదులకు శీఘ్ర
ప్రవాహంబును ఘనంబులకు నీలిమయు మత్తగజంబులకు ఘీంకారంబులును
వనాంతరంబులకు రామణీయకంబును విరహిణీజనంబులకు రతిధ్యానంబును
మయూరంబులకు నృత్యంబును ప్లవంగంబులకు సమాశ్వాసనంబునుం గలిగె
కులాయలీయమానవిహంగమంబులచేతను ముకుళితంబు లగుపంకజంబులచే
తను వికసితంబు లగుమాలతీకుసుమంబులచేతను నిరూప్యమాణసూర్యాస్తమ
యం బై యొప్పునిక్కాలంబునందు. 691

క. ముదమున బలాకలును వా, రిదసంగతి నొందెఁ గాంత ప్రియునిం జెందెన్
నదు లంభోనిధి నొందెను, బదపడి హరి నిద్రఁ జెందెఁ బార్థివతనయా. 692

క. జననాథపుత్ర భూసుర, జనముల కిది వేదపాఠసమయము ధరలో
ఘనసామవేదఘోషము, వినవచ్చెన్ మధురఫణితి విప్రులయిండ్లన్. 693

క. సలిలసమీకృతపథములు, గలుగుటచే వైర ముడిగి క్ష్మాపతులు బలం
బుల నిలిపి దండయాత్రకు, నిల నెవ్వరు చనక యుందు రిక్కాలమునన్. 694

తే. అనఘ సంచితసంచయుఁ డై భరతుఁడు
రమణ నాషాఢశుక్లపూర్ణిమ మొదలుగ
మునుకొని నివృత్తకర్మాయతనుఁడు నగుచు
నూర వ్రత మూని నియతుఁ డై యుండుఁ గాదె. 695

క. అనఘ సమాయాతుఁడ నగు, ననుఁ గని సాకేతనిస్వనముకై వడి నూ
తనజలపూరితసరయూ, ధునీరయము సాంద్ర మగుచుఁ దోఁచుం గాదే. 696

క. తమ్ముఁడ యీవర్షాకా, లమ్మున రవిసుతుఁడు రాజ్యలక్ష్మీయుతుఁ డై
యిమ్ముల నాత్మసతీయు, క్రమ్ముగఁ గ్రీడించు చుండుఁ గద గతరిపుఁ డై. 697

క. ఏ నెంత యభాగ్యుఁడనో, జానకి నెడఁబాసి విగతసామ్రాజ్యుఁడ నై
నానుచు చున్నాఁడ మదిన్, దీనత లోఁగొన్న ఘనధునీతటముక్రియన్. 698

క. అని బహుభంగుల రాఘవుఁ, డనుజునితో వగలఁ బొగిలి యంతట మరల న్
తనమది శోకము తాలిమిఁ, దనరఁగ నిట్లనియెఁ గార్యదశ దెలియంగన్. 699

చ. కుధరము లప్రధృష్యములు ఘోరవనంబులు దుష్ప్రవేశముల్
పథములు దుర్గమంబులు నపారము కంధి దశాస్యుఁ డంటిమా
ప్రథనములం దవారితపరాక్రముఁ డిన్నియు నిస్తరించి శౌ
ర్యధనుఁడ నైననా కెటు ధరాతనయం బడయంగఁ జొప్పడున్. 700

క. ఒక్కమ్మునఁ బురుహూతజుఁ, దక్కక కూలంగ వైచి పవనసుతునితో
నొక్కట శిఖిసాక్షికముగ, నిక్కపు సఖ్యంబు సేయు టింతకుఁ గాదే. 701

సీ. జనకజాన్వేషణ మనుజేంద్ర హింసనోద్యోగ మిప్పుడె మన కుచిత మనుచు
నినతనందనుండు బ్రహ్వీభూతుఁ డగుచుండఁ గడుదుర్గమము లైనఘనపథములు
నవనీంద్ర దండయాత్రాభావమును జూచి మాఱుమాటాడక యూరకుంటిఁ
బెక్కుబాధలఁ బడి పెద్దకాలమునకుఁ దనపత్నిఁ గూడి యగచరేంద్రుఁ
తే. డతనుపరతంత్రుఁ డై సౌఖ్య మనుభవించు
చున్నవాఁ డావిధంబున నుండనిమ్ము
తృప్తి నొందక మున్నె యాధీరవరునిఁ
బిలువనంపిన దోషంబు గలుగు మనకు. 702

మ. తని వొందన్ సుఖియించి యవ్వలఁ దనంతం దానె కాలం బెఱిం
గి నిజానీకముతోడ రావణవధక్రీడాకళాలోలత న్
జనుదేఱంగలఁ డేను దన్ముఖనిరీక్షాకాంక్ష నందాఁక నీ
ఘనశైలాగ్రమున న్వసించెద శరత్కాలోదయాపేక్షి నై. 703

క. ఉపకారికిఁ బ్రతికారము, నిపుణతఁ గావించు నతఁడు నిజముగ నటుగా
కపకారి యయ్యె నేనియుఁ, గపిపతి యగువాలియట్ల కట్టి కుడువఁడే. 704

చ. అనవుడు లక్ష్మణుండు ఘటితాంజలి యై రఘుభర్తఁ గాంచి యి
ట్లను జగదేకవీర యిటు లానతి యీఁ దగ దార్తబంధుఁ డా
యినసుతుఁ డట్టివాఁడె భవదీప్సితమందుఁ బ్రసన్నచిత్తుఁ డై
పనివడి వచ్చు నిక్కముగఁ బ్రావృడపాయమున న్ససైన్యుఁ డై. 705

వ. అని రాముండును లక్ష్మణుండును బరస్పరాలాపంబులఁ గార్యచింతాతత్పరు లై
యుండి రిటఁ గిష్కింధాపురంబునందు గతవిద్యుద్బలాహకంబును సారసారవ
సంఘుష్టంబును రమ్యజ్యోత్స్నానులేపనంబును విమలంబు నగుగగనంబు నవ
లోకించి హనుమంతుండు. 706

హనుమంతుఁడు సుగ్రీవుని ప్రమాదమును గుఱించి చింతించుట.

క. జడి వెలసె శరత్కాలము, కడువడిఁ బఱతెంచె నింకఁ గమలాప్తకుమా
రుఁడు స్వామికార్యయత్నము, జడతం గావింపఁ డయ్యె సంభ్రమపరుఁ డై.

చ. తన దగురాజ్యభారము ప్రధానులపై నిడి కామలోలుఁడై
జనపతివిక్రమం బెఱుఁగఁ జాల కహర్నిశము న్నిజాంగనా
ఘనసురతానుభూతి మెయిఁ గానక చేప్పడి యున్నవాఁడు మే
దిని మదనాభిపన్నునకుఁ దెల్వియు బోధము పుట్టనేర్చునే. 708

వ. అని యాలోచించి యెత్తెఱంగున నైన నితనిచిత్తంబు కార్యాయత్తంబు సేయుదు నని తలంచి నిశ్చితార్థతత్త్వజ్ఞుండును దేశకాలవిశేషధర్మవిదుండును నీతిమంతుండు నగుహనుమంతుండు సమృద్ధార్థుండును మందధర్మార్థసంగ్రహుండు నసన్మార్గప్రవర్తకుండును నేకాంతగతమానసుండును నివృత్తకార్యసిద్ధార్థుండును నిరంతరప్రమదాభిరతుండును సర్వమనోరథసిద్ధుండును దారాసక్తమనస్కుండును మంత్రిన్యస్తసమస్తకార్యుండును మంత్ర్యనవేక్షకుండు నుత్పన్నరాజ్యసందేశుండును గామవృత్తానస్థితుండును గృతార్థుండును విగతజ్వరుండు నై నందనోద్యానంబున నప్సరసలం గూడి క్రీడించుచున్నపురందరునివడువున వానరకాంతలం గూడి దివారాత్రంబు లెఱుంగక యంతఃపురంబునఁ గ్రీడించుచున్న సుగ్రీవుని విలోకించి కొండొకసేపు మనోరమంబులును హేతుమంతంబులు నగుప్రసాదజనకవాక్యంబులచేత నతనిచిత్తంబు ప్రసాదాయత్తంబు గావించుకొని హితంబును సామధర్మార్థనీతిమంతంబును బ్రణయప్రీతిసంయుక్తంబును విశ్వాసకృతనిశ్చయంబు నగువినయవాక్యంబున నిట్లనియె. 709

హనుమంతుఁడు సుగ్రీవునికిఁ గర్తవ్యాంశమును బోధించుట.

ఉ. రామునిసత్కృపం బ్లవగరాజ్యపదస్థుఁడ వైతి వీవు నీ
కామితము ల్ఫలించె నధికంబుగ సౌఖ్యము కీర్తి గల్గె నా
ధీనుహితుండు కానల సతీవిరహార్తిఁ దపించుచుండఁ ద
త్కామిత మీవు దీర్ప కిటు కాల మెఱుంగక యుండఁ జెల్లునే. 710

ఉ. కాల మెఱింగి యెవ్వఁ డనుకంప దలిర్పఁగ మిత్రులందు న
క్కాల మనన్యభావమునఁ గర్జ మెఱింగి చరించు నట్టిభూ
పాలునిరాజ్యము న్యశము భాగ్యము తేజము నాఁటినాఁటికి
న్బోలఁగఁ బూర్వపక్షశశిపోలిక వృద్ధి వహించు నెంతయున్. 711

మ. క్షమ నెవ్వాఁడు కృతజ్ఞశేముషి సుహృత్కార్యావనోద్యోగి యై
విమతోత్పాటనయత్నతం బరఁగు నావిశ్వాసికిం గాక రా
జ్యము చేకూడునె కీర్తి హెచ్చునె సమస్తైశ్వర్యము ల్భూరిసౌ
ఖ్యము వర్ధిల్లునె మిత్రకార్యఘటనవ్యాపాది యౌవానికిన్. 712

వ. మహాత్మా నీవు వృత్తసంపన్నుండవు సాధుమార్గసంస్థితుండవు గావునఁ బరమమిత్రుం డగురామునకుం బ్రియంబుగా సీతాన్వేషణయత్నంబు గావింపుము.

ఉ. కార్యము లన్నియుఁ విడిచి తా దన కెవ్వఁడు ధాత్రిలో సుహృ

త్కార్యమునందు నేమఱక తద్దయుఁ బ్రీతిఁ జరించునట్టివాఁ
డార్యపథానువర్తి యయి యాపదలం జెడిపోక సంతతై
శ్వర్యమునం జెలంగు ననివారణచాతురి గల్గునట్లుగన్. 714

సీ. వినుము కాలంబు పోయిన వెన్క మిత్రకార్యములందు నెవ్వఁ డూరక చరించు
నతనిచే దుష్కరం బైనకార్య మొనర్పఁబడియును వ్యర్థ మై పరఁగుచుండు
నటుగాన నీవు ధరాధీశునకుఁ బ్రియ మొనరఁగా జానకి వెదకఁ బంపు
మిఁక జాగు సేయుట హితము గాదు వనాటరాజ నీచేతఁ గర్తవ్య మైన

ఆ. మిత్రకార్య మెద్ది మెఱుకొని వర్తించు,నట్టిరామకార్య మరయ నీకుఁ
గర మతీతయుక్తకాల మై వర్తించు, చున్న దెఱుఁగ కిట్టు లుండఁ దగునె 715

వ. కపీంద్రా నీవు కాలజ్ఞునిచేత నప్రబోధితుండ వగుటం జేసి కాలం బెఱుంగకున్న
వాఁడవు మహాప్రాజ్ఞుండును గులదీపకుండును దీర్ఘబంధుండును నప్రమేయ
స్వభావుండును నసమానగుణగరిష్ఠుండు నగురాముండుత్వరమాణుం డయ్యును
భవద్వశానుగుం డగుటం జేసి నిన్నుఁ బ్రేరేపింప కున్నవాఁ డమ్మహాత్మునిచేత
యుష్మత్కార్యంబు కృతం బయ్యె నీ వామహాత్మునికార్యంబు సేయుము హరి
శ్రేష్ఠు లగువారి నెల్లదిక్కులకుం బనుపుము కాలాత్యయం బగుచుండఁ జోద
నానంతరంబునఁ గృతం బైనకార్యంబునకుఁ గాలాతిక్రమణదోషంబు గలుగుం
గాని ప్రేరేపింపక మున్నె క్రియమాణం బైనకార్యంబునకుఁ గాలాతిక్రమణ
దోషంబు గలుగ నేరదు గావున నీ కిప్పుడు వానరానయనోద్యోగం బవశ్యకర్త
వ్యంబు నీ వనుపకారికార్యంబున కైనను బ్రవర్తకుండవు మహోపకారి యగు
రామునకు రాజ్యధనంబులచేత నైనఁ బ్రతికారంబు గావించుట కేమి సంది
యంబు శక్తిమంతుండ వయ్యును విక్రాంతుండ వయ్యును వానరఋక్షగణేశ్వరుండ
వయ్యును దాశరథికిఁ బ్రియంబు సేయుట కుపేక్షించుట తగవు గాదు వినుము.

ఉ. ఆనరనాథమౌళి దివిజాసురయక్షమహోరగాదుల
న్దానుగ నమ్ములం దనవశంబుగఁ జేసికొనంగఁజాలువాఁ
డైనను నీప్రతిజ్ఞ దెలియం దలపోయుచు నున్నవాఁడు త
న్మానిని గ్రక్కున న్వెదకఁ బంపుము దిక్కులకు న్వనాటులన్. 717

క. సురగరుడోరగనరఖేచరకిన్నరసిద్ధసాధ్యచారణు లతని
న్వెఱపింపఁ జాల రెంతయు, హరితనయా తుచ్ఛదైత్యు లన నెంత రహిన్.

ఉ. అట్టిమహానుభావునకు నట్టిపరాక్రమశాలికిం గరం
బట్టిమహోపకారికి సమంచితకీర్తికి రామమూర్తికి
న్గట్టిగ నీవు సత్ప్రియ మొనర్పుము నీవగుపంపు సేయఁగా
నిట్టల మేటివానరు లనేకులు నేర్పరు లున్నవా రిలన్. 719

సీ. భాస్కరనందన భవదాజ్ఞచే నభ్రమునందు భోగిజగంబునందు జలము

లందుఁ గాంతారంబులందుఁ జరింపంగ నసమర్థుఁడై నవాఁడద్రిచరుల
లో నొకఁడైనవిలోకింపఁగా లేఁడు ఘను లప్రధృష్యులు కామచరులు
కపులు కోట్యధికులు గలరు నీ కందులో నెవ్వాసిఁ బంచిన నేమి సేయ
తే. రఖిలదిక్కుల నున్న వనాటవరుల, నలఘుసత్త్వుల నందఱఁ బిలువఁబంపి
రామపత్ని నన్వేషింప రయముతోడ, నెల్లచోట్లకుఁబనుపుముహితము మెఱయ.

—ఇ— సుగ్రీవుఁడు సేనల నెల్ల రావింపు మని నీలున కాజ్ఞాపించుట. —ఇ—

క. అని హనుమంతుఁడు కాలం,బునఁ గార్యవిచారబుద్ధి మునుకొని బోధిం
చిన విని సుగ్రీవుఁడు తన, మనమునఁ దెలివొంది వేగ మతిమంతుండై. 721

క. తనసేనాపతి యగు నీ,లుని విక్రమశీలుని న్విలోకించి రయం
బున ని ట్లని యాజ్ఞాపిం,చె నిజస్వామిత్వమహిమ చెలువారంగన్. 722

ఉ. వారిధివాసుల న్వనినివాసులఁ బర్వతవాసుల న్బలో
దారుల సింహవిక్రముల దారుణవేగుల శీఘ్రగాములన్
ధీరుల శూరులం దపనతేజుల వానరవర్యులన్ రయం
బారఁగఁ బిల్వ నంపుము మదాజ్ఞ రఘుప్రభుకార్యసిద్ధికిన్. 723

వ. మఱియు వ్యవసాయు లగు సేనాపర్యంతపాలకులును వేగవంతు లగుయూథపు
లును సైన్యసమేతంబుగాఁ బంచదశరాత్రంబులోన నిచ్చటికి వచ్చువారుగా
సంఘటింపు మంతకు నెవ్వండు మత్తుండై రాక మసలు నతండు ప్రాణాంతికకరం
బగుమదీయదండంబునకుఁ బాత్రం బగు నని చాటం బంపు మిక్కార్యం
బంగదుండును నీవును మదీయశాసనంబునఁ గావింపుఁ డని యాజ్ఞాపించి సుగ్రీ
వుండు నిజగృహంబు ప్రవేశించె నంత నిక్కడ రాముండు హేమధాతువిచిత్రం
బగుపర్వతాగ్రంబున నధివసించి. 724

చ. నిరుపమకాంతిశోభితవినిర్మలశీతకరాస్యమండల
స్ఫురుతరపక్షలక్షితచకోరవిలోచనరమ్యచంద్రికా
స్ఫురదనులేపన న్విమలసుందరతారనఖ న్శరన్నిశా
తరుణిని జూచి రాఘవుఁడు తద్దయు శోకపరీతచిత్తుఁడై. 725

—ఇ— రాముఁడు శరదృతువునందు సీతం దలంచుకొని దుఃఖించుట. —ఇ—

మ. ధరణీపుత్త్రి నెదం దలంచుకొని హృత్సంతాప మంతంతకు
న్బరుఁగం జెక్కుతలంపు లూరఁగఁ గడు న్బీతిల్లి కామవ్యథా
తురత న్హా తరుణీమణీ యనుచు నెంతో పారవశ్యంబు నొం
ది రయం బార ముహూర్తకాలమునకుం దెల్వొంది తాఁ గ్రమ్మఱన్. 726

తే. సీత దైత్యాధమునిచేతఁ జిక్కుటయును
మత్తుఁడై భానుజుఁడు రాక మసలుటయును
గడఁగ యుద్యోగసమయంబు గడచుటయును
దలఁచి భూరిసంతాపసంతప్తుఁ డగుచు. 727

వ. ఇట్లని విలపించె. 723

సీ. ఏరామ విమలకాసారతీరవిహారి కలహంసిపద్ధతిఁ గలసి యాడు
నేతన్వి చూతభూజాతపల్లవఖాది కలకంఠిపద్ధతిఁ గలయ మ్రోయు
నేతలోదరి దాడిమీతరువ్యాలంబి రాజకీరప్రౌఢి రద్దు సేయు
నేరాజవదన శృంగారశాద్వలచరత్పృషదంగనాస్ఫూర్తి బెదరి చూచు

తే. నట్టిజానకి నాయుల్లమధికవార్ష, కలిత మగునట్టు లెప్పుడు గానవచ్చు
నెట్లు పరిరంభణస్ఫూర్తి నైనఁ గలుగు, నీవియోగాబ్ధి తరియింప నెపుడువచ్చు.

తే. సారసారవముదితస్వనము చేత, నాశ్రమంబున విహరించునట్టిబాల
జనకనందని దుష్టరాక్షసునిచేతఁ, జిక్కి యెబ్బంగిఁ జరియించుఁ జెపుము నాకు.

క. కుసుమితకాంచనమయులన, దసనరసాల ద్రుమముల నటు చూచుచు నా
బిసరుహముఖి నన్నుఁగానక, ననువుల నేక్రియ ధరించు నక్కట చెపుమా. 731

క. కలహంసరవంబుల మే, ల్కొలుపం బడునట్టిసీత క్రూరక్రవ్యా
దులరవములచే నెటు మేల్కొలుపం బడు నెట్లు సైఁపఁగూడు న్నాకున్. 732

తే. సంతతంబును సహచరచక్రవాక, కలరవంబులు విని యెదుకలువకంటి
దారుణాకారదుర్మదక్రూరదనుజ, వికృతహుంకృతు లెబ్బంగి వినఁగ నేర్చు.

ఉ. ఒంటిగ నాశ్రమంబున సముత్సుకత న్జరియించువేళలన్
గొంటరిటంటకోతెలలు కూయఁగ మేను చెమర్ప నాత్మలో
నంటినభీతి వచ్చి బిగియ న్నను గౌఁగిటఁ జేర్చునట్టివా
ల్గంటి మహీజ నెమ్మనము గందదె శారదకాలసంగతిన్. 734

ఉ. అక్కట సీత దైత్యహృత యై వెతలం బడి కుందుచుండ నా
కెక్కడిరమ్యకందరము లెక్కడినవ్యసరోవరోత్కరం
బెక్కడికాననప్రచయ మెక్కడినూతనశీతసైకతం
బెక్కడివల్లికాగృహము లించుక చూడ్కికి వేడ్కసేయునే. 735

ఉ. మక్కువతోడ న న్గలసి మాటికి నిచ్చ సుఖించునట్టి యా
చక్కనిగోల యొంటి మృగశాబముకైవడిఁ జిక్కియుండఁగా
నక్కట తచ్ఛరద్గుణనిరంతరుఁడై కుసుమాంబకుండు తా
మిక్కుట మైనగర్వమున మిన్నక పీడ యొనర్పకుండునే. 736

వ. అని యివ్విధంబున నమ్మహీరమణుండు పురందరునివలన సలిలంబు నుద్దేశించి విలపించుచాతకంబుభంగి సతిదీనుం డై విలపించుచు వెండియు లక్షణవంతుం డైన లక్ష్మణాగ్రజుండు పుష్పితమహీరుహలతావితానరంజితధరాధరసానుకందరంబులు విలోకించి ముద్గియుం దలపోసి తద్దయు మోహాతురుం డై. 737

రాముఁడు శరదృతువునందు సీతం దలంచుకొని దుఃఖించుట.

చ. కనుఁగవ మోడ్చు విచ్చుఁ దమకంబున నాకస మెట్టె చూచు నె

క్కానినవిరాళి నూర్పులు నిగుడ్చు దిశ ల్వరికించు హా మహీ
తనయ యటంచు రమ్యకుశతల్పముపై వెస వ్రాలు లేచు నా
జనపతి తీవ్రపంచశరశాతశిలీముఖదూయమానుఁడై. 738

లక్ష్మణుఁడు రాముని నూఱడించుట.

క. ఇత్తెఱఁగునఁ దలఁకెడు రఘుసత్తముఁ గని లక్ష్మణుండు సామోక్తులఁ ద
చ్చిత్తపరితాప ముడుపుచు, నుత్తమబుద్ధిప్రయుక్తి నొయ్యనఁ బలికెన్. 739

వ. మహాత్మా యేకాలంబునందుఁ జిత్తసమాధానంబు సంపాదనీయం బగు నట్టి
కాలంబునం దది యేల యుపగతం బయ్యెఁ గామవశంగతత్వంబున నాత్మపౌ
రుషపరాభవంబున నుత్సాహనివర్తనంబున నేమి యగుఁ గార్యోద్యోగంబును
మనఃప్రసాదంబును ధైర్యోపాయంబులచేత ననుబద్ధం బైనకాలంబును సుగ్రీ
వాదిసహాయసామర్థ్యంబును స్వదేవతోపాసనాత్మకం బైనహేతువును గార్య
సిద్ధియందుఁ గారణంబుగా నొనరింపుము పతివ్రతాశిరోమణి యైనజానకి పరుని
చేత సులభ యై యుండదు సముజ్జ్వలిత యైనవహ్నిశిఖ నంటి యెవ్వండు
దహింపం బడకుండు మహానుభావుండ వైన నీ విట్లు వైక్లబ్యంబు నవలంబింపం
దగ దని పలికిన యుక్తియుక్తంబును స్వభావసిద్ధంబును శుభోదర్కంబును సుఖ
కరంబును నీతిమార్గయుక్తంబును బథ్యంబును సామవాదసహితంబును ధర్మార్థ
సహితంబు నగువాక్యంబునం బ్రబోధించునట్టిసలక్షణుం డైనలక్ష్మణు నవ
లోకించి రాముండు కుమారా నీ చెప్పినట్లు సంప్రవృత్తంబును దురాసదంబు
నగుసీతాప్రాప్తిరూపకార్యఫలం బవశ్యచింతనీయం బై యుండు నుత్సాహాది
కంబు ననువర్తితవ్యం బై యుండు సీతాన్వేషణాదికార్యంబు నిస్సంశయంబుగాఁ
గర్తవ్యంబై యుండు నని వెండియు నారఘువల్లభుండు జానకిం దలంచుకొని
వదనంబున విన్నఁదనంబు గదుర లక్ష్మణు నవలోకించి యిట్లనియె. 740

రాముఁడు లక్ష్మణునితో శరదృతువు నభివర్ణించి చెప్పుట

క. శరములచే విశ్వంభరఁ, బరితుష్టిం జెందఁ జేసి బహుసస్యములం
గరము ఫలియింపఁ జేసి యమరపతి కృతకృత్యుఁ డయ్యె మానదకంతే 741

మ. ఘననీలోత్పలకృష్ణమేఘము మృదంగస్నిగ్ధగంభీరని
స్వనమై దిక్కులఁ జీఁకటు ల్గవియఁ జంచచ్చంచలాస్ఫూర్తిఁ బం
బినతోయంబులు పాఱఁ జల్లి లఘుతాప్తి న్వేగముం దక్కె యి
దును జూపట్టెడుఁ గంటె వత్స విమదోత్తుంగద్విపేంద్రాకృతిన్. 742

చ. శరసహితంబు లై సువిలసత్కుటజార్జునసౌరభంబు లై
తరువులు బల్లతాటకములు తమ్మికొలంకులు తల్లడిల్లఁగాఁ
బరువడి భూరివేగమున బంధురవై ఖరి వీచి వీచిభా
స్వరతరవృష్టివాతములు శాంతవిహారము లయ్యెఁ గంటివే. 743

క. ఘననాదము ప్రస్రవణ, ధ్వని బర్హిగళస్వనంబు వారణనినదం

బు నదీప్రవాహశబ్దము, వినుతగుణా చెవుల కిపుడు విన రావయ్యెన్. 744

క. ఘనము లనభివృష్టంబులు, సునిర్మలంబులు విచిత్రసుందరతటముల్
వనచిత్రదీప్తులవలన, నను లిప్తము లైనయట్టు లలరెడి నగముల్. 745

క. ధరణీవరనందన శశి, కిరణవ్యాప్తంబు లగుచు గిరిశిఖరంబు
ల్వరచందనలిప్తము లగు, తరుణులపాలిండ్లపగిదిఁ దనరెడుఁ గంటే. 746

క. కనుఁగొంటె శరన్నదు లల్లనఁ దమతమసైకతంబులం జూపెడు నూ
తనసంగమలజ్జిత లగు, తనుమధ్యలు చారుజఘనతలములమాడ్కిన్. 747

చ. హరిరుచులందుఁ జంద్రకలలందు మదావళలీలలందు భా
స్వరతరసప్తపర్ణతరుశాఖలయం దుడుకాంతులందు సు
స్థిరముగ భూరికాంతి విభజించి శరన్నవలక్ష్మి నేఁడు భా
సురవరయౌవనప్రమదచొప్పున నొప్పుచు నున్న దెంతయున్. 748

వ. మఱియు శరత్కాలగుణోపనీత యగులక్ష్మి యిప్పు డనేకాశ్రయచిత్రశోభ
యై ప్రథమప్రసృతసూర్యకిరణంబులచేత వికసితంబు లైనపద్మాకరంబులయందు
మిక్కిలి ప్రకాశించుచున్నయది విలోకింపుము. 749

చ. నిరుపమసప్తపర్ణధరణీరుహపుష్పసుగంధి యై మనో
హరమకరందపానసమదాకులషట్పదగీయమాన మై
కరము వనాంతరంబులఁ దగం జరియించెడుగాడ్పు బల్విడిం
దఱుచుగ మత్తదంతులకు దర్ప మొసంగుచు నున్న దెంతయున్. 750

చ. జలజరజఃప్రకీర్ణములు చారువిశాలపత్త్రము లుస్నిశీ
తలపులినోపయాతము లుదగ్రతరస్వనము లసరఃప్రియం
బులు నగుచక్రవాకముల పొత్తున హత్తి మరాళదంపతు
ల్గలయఁ జరించుచున్నయవి కంటె మనోభవకేళిలోలతన్. 751

ఉ. భూరిమదప్రగల్భకరిపుంజములందును గోగణంబులం
దారయ నిర్మలాంబుకలితాపగలందు లసన్మరాళకా
సారములందు హృద్యముగ సాంద్రగతిం బ్రవిభక్త యై రహిన్
న్నారదలక్ష్మి కంటె బలుచందములం దనరారు నెంతయున్. 752

చ. ముదిరవిముక్త మైన నభము న్వరికించి మయూరసంఘము
ల్మునము దొలంగఁ బెట్టుకొని ముక్తకలాపవిభూషణంబు లై
పొదలు ననూనదుఃఖములఁ బొందుచు సొంపఱి జోడువీడి దై
న్యవశ చెలంగఁ గట్టెదుట ధ్యానము సేయుచు నున్న వెంతయున్. 753

ఉ. కేవలహృద్యగంధపరికీర్ణము లంచితనవ్యపుష్పభా
రావనతాగ్రశాఖము లనల్పములుం దపనీయగౌరరే
ఖావిభవంబు లైనప్రియకంబులచే నయనాభిరామశో

భావహాభంగి నొప్పెడు నృపాత్మజ కంటె వనాంతరంబులన్. 754

చ. విమలసరఃప్రియంబు లటవీరతముల్ కుసుమోద్ధతంబు లు
త్తమమదగంధలుబ్ధవితతభ్రమరప్రకరాభిరమ్యగం
ధములు ప్రియాన్వితంబులు ఘనాఘనతుల్యము లైనదంతిసం
ఘము లవె మందమందగతిఁ గ్రాలఁగ నేగెడుఁ గంటె లక్ష్మణా. 755

వ. మఱియు నిక్కాలంబు వీతమేఘం బగుటవలన ధౌతశస్త్రవర్ణం బైననభంబును గృశప్రవాహంబు లైననదీజలంబులును గల్హారశీతంబు లైనమారుతంబులును దమోవిముక్తంబు లైనదిశాముఖంబులునుం గలిగి యొప్పుచున్నదదియునుం గాక.

ఉ. కోమలవాతపోతపరిఘూర్ణితధూళియు భాస్కరాతప
క్రామణశష్కకర్దమయు రమ్యజలోత్కరనిమ్నగాఢ్య యై
భూమి చెలంగుచున్నయది భూవరనందన యిప్పు డెంతయున్
భూమివరుల్ రణంబులకుఁ బోవుటకుం దఱి యయ్యె నుర్వరన్. 757

ఉ. ఆయతపాండుదిగ్ధసముదంచితకాయములున్ శరద్గుణా
ప్యాయితరూపకాంతులు ప్రహర్షితముల్ సముదగ్రశృంగరే
ఖాయుతశీర్షముల్ సమరకాంతులు నైన లసన్మహోక్షము
ల్రాయుచు గోగణంబులను అంకెలు వైచెడుఁ గంటె ముంగలన్. 758

మ. అనఘా చూచితివే కరేణువులు సయ్యాటంబునం జిత్తసం
దనురాగంబులు నిండి పర్వ సలిలవ్యాయామమోదంబున
న్జనుభర్త న్వెడిఁ జుట్టు ముట్టుకొని చంచన్మందయానంబుల
న్వనమధ్యంబునఁ బోవుచున్నయవి దుర్వారప్రకారంబునన్. 759

చ. సుమహితరూప యల్లదిగొ చూచితె మ్రోల మయూరజాల ము
త్యములనదీతటోపగత మై తన కాభరణంబు లైనబ
ర్హములు పరిత్యజించి ప్రముదాకులసారసతర్క్యమాన మై
భ్రమఁగొని దీనభావ మడర న్నిజగర్వము తక్కి పాఱెడిన్. 760

ఉ. చండతరప్రణాదముల సారసభృంగమయూరహంసకా
రండవటిట్టిభంబులు కరంబు భయంబునఁ బాఱ నుత్తవే
దండచయంబు బద్ధకమలాభరణప్రాదపంక్తిఁ జొచ్చి త
త్కాండములం దెరల్చుచు ముదంబునఁ ద్రావెడుఁ గంటె లక్ష్మణా. 761

తే. పంకరహితములు సుందరవాలుకములు, స్వచ్ఛతోయంబులును గోకులాన్వితములు
సారసారావయుతము లౌ తీరవతుల, హర్షయుక్తతఁ దేలెడు హంసలిపుడు. 762

తే. తమ్మితూండ్లు భుజించి కెందమ్మివిరుల, జోడు గూడి మనోజసంక్రీడ సలిపి
రాజహంసలు తద్రతిశ్రమము వాయ, ఘనధునీవారిఁ బడియాడుఁ గంటె వత్స.

చ. అడవి నవోదితంబు లగునంబుధరంబులనుండి ధాత్రిపైఁ
బడుజడివానకుం దలఁకి పాములు పుట్టల డాఁగి యుండి యి

బులు నగువధూముఖంబులుం బోలె నొప్పుచున్న నదియునుం గాక ప్రఫుల్ల బాణాసనచిత్రితంబులును సంప్రహృష్టమధువ్రతనికూజితంబులు నగువనంబు లందుఁ బంచశరుండు గృహీతచాపోద్యతచండదండుండై వియోగుల నేఁచుటకు విహరించుచున్నవాఁడు సువృష్టిచేత లోకంబు పరితుష్టి నొందించి నదీతటాకం బులు పూరించి వసుంధర నిష్పన్నసస్యఁ గావించి మేఘంబులు నభంబును బరిత్య జించి తమ కిష్టమగు నెలవుల డాఁగి యున్నవి పుష్పితంబు లగుమహాసనకోవి దారసప్తపర్ణబంధుజీవశ్యామలతావిశేషంబులు రమ్యంబు లగుగిరిసానువులందు సొంపు వహించు చున్నయవి నదీపులినంబులు హంససారసచక్రవాకకురర సమూహంబులచేత సమాకీర్ణంబులై శోభించుచున్నయవి మఱియుఁ బ్రసన్న సలిలంబు లగుజలాశయంబులు క్రౌంచనినాదితంబు లై చక్రవాకోపశోభితం బులై మిక్కిలి ప్రకాశించుచున్నయవి విలోకింపుము. 773

తే. పార్థివాత్మజ యన్యోన్యబద్ధవైరు,లును జిగీషులు నగునృపాలురకు నిది ద
లంప నుద్యోగసమయంబు రవికుమారుఁ, గాన మట్టు లుద్యోగంబు గానమిపుడు.

చ. ఘనగుణశీల ప్రాణములకంటె గరీయసి యైనధారుణీ
తనయను బాసి శోకమునఁ దగ్దయు మ్రాన్పడి యున్ననాకు ని
ద్వనమున దుఃఖహేతు వగువార్షికమాసచతుష్టయంబు నె
మ్మనమునఁ దోఁచె నేఁటి కిటు మానక వర్షశతోపమానమై. 775

రాముఁడు లక్ష్మణునితో సుగ్రీవుని దుర్నయమును జెప్పుట.

ఆ. అనఘచరిత భర్త నైననా వెనువెంటఁ, జక్రవాకిపోలె జనకపుత్రి
ఘోరవనమునకు గృహారామవాటికిఁ, బోలె వచ్చెఁ గాదె పోలుపు మీఱ. 776

తే. ఏను జానకి నెడఁబాసి యీనగేంద్ర, కూటతటమున శోకార్తిఁ గుందు చుండ
మిహిరనందనుఁ డిపుడు నామీఁదఁ గరుణ, సేయకున్నాఁడు దుర్నీతిచేతఁ బట్టి.

వ. ఈరాముఁ డనాథుండు హృతరాజ్యుండు రావణునిచే ధర్షితుండు దీనుండు వివా సితుండు కాముకుండు మఱియు నన్ను శరణుచొచ్చినవాఁ డని తలంచి యీకా రణంబులచే దురాత్ముం డగుసుగ్రీవుండు నన్నవమానించుచున్నాఁడు. 778

సీ. భ్రాతచేఁ గీశసామ్రాజ్యంబు గోల్పడి దిక్కుఱి దైన్యంబు నెక్కొనంగఁ
బురము వెల్వడి భీతిఁ బఱచి యొంటిగ నలుదిక్కులు వెన దిమ్మఁదిరిగి తుదిని
నను శరణంబు వేఁడిన వచ్చి కపిరాజ్య మిచ్చినఁ గైకొని యింపు మెఱయ
జలధరకాలంబు చనినపిమ్మట సీత వెదక మీకడకు వచ్చెద నటంచు

తే. సత్యముగఁ బల్కి పోయి భాస్కరసుతుండు
మత్తుఁడై గ్రామ్యసుఖముల మరగి కృతము
మఱచి కడు బుద్ధిహీనుఁడై తిరిగి రాక
నమయభంగంబు గావించె విమలచరిత. 779

క. నీ విప్పుడు కిష్కింధకుఁ, బ్రావీణ్యము మీఱ నేఁగి వాలిశుఁ డగును

గ్రీవునితో నామాటలు, గా వెఱపు జనించునట్లు గా ని ట్లనుమీ. 780

క. ధర నెవ్వాఁ డుపపన్నులు, నరయంగ నుపకారు లైనయర్థులకామం
బెఱింగి యొనరింపఁ డాతఁడు, పురుషాధముఁ డండ్రు ప్లవగపుంగవ పెద్దల్. 781

రాముఁడు సుగ్రీవుంతోఁ జెప్పుమనినమాటలు లక్ష్మణునకుఁ జెప్పుట.

తే. పరఁగ నెవ్వఁడు శుభ మైనఁ బాప మైనఁ
దాను బలికినవాక్యంబు దప్పకెపుడు
విమలమతి దానిఁ గడు సార్థకముగఁ జేయు
నతఁడు మఱి పురుషోత్తముఁ డండ్రు బుధులు. 782

వ. మఱియు నెవ్వండు కృతార్థుం డై కృతార్థుండు గానిమిత్రునకుం గాక చరించు నట్టికృతఘ్నుండు మృతుం డైనఁ దదీయకళేబరమాంసంబు శునకకాకజంబుకాదు లైన భక్షింప వదియునుం గాక నాచేత వికృష్టం బైనకాంచనపృష్ఠకార్ముకస్వరూపంబు చూచును వజ్రనిర్ఘోషంబుం బోలె భీషణం బైనతదీయజ్యాతలనిర్ఘోషంబుఁ గ్రమ్మఱ వినునుం గోరెదె వని యూహించెద నట్లు గా దేని మదీయపరాక్రమం బెఱింగియును మత్సాహాయ్యంబునఁ గృతార్థుండ వయ్యును బ్రియావియోగసంజనితశోకపావకశ్యంబునం బరిభ్రమించుచున్నవానిఁ గా నన్నెఱింగియును నాకుంగలకార్యంబంతయువినియును వార్షికమాసచతుష్టయంబుగడచునంతకు బలోపేతుండ నై సీతాన్వేషణతత్పరత్వంబున మిమ్ముం గలయవచ్చెద నని సమయంబుఁ జేసియు నివి యన్నియు మఱచి దీనుండ నగునాయం దనుగ్రహంబు సేయక మదిరాపానమత్తుండ వై కామినీసాంగత్యంబునం దగిలి గ్రామ్యసుఖంబు లనుభవించుచుండుదువె యట్లైనఁ గొఱంత యేమి వినుము. 783

క. వంచకుఁడ వని యెఱుంగక, వంచించి బలాఢ్యుఁ డైనవాలి నొకని వే
ద్రుంచితి నీకై నిను రణమునఁ, బంచత నొందింతు వేగ బంధుయుతముగాన్.

చ. అనుపమసత్త్వశాలిప్లవగాధిపుజీవముఁ గొన్నసాయకం
బునకు శితత్వ మించుకయుఁ బోవదు చేతుల లావు దప్ప లే
దనిశము విక్రమంబునకు హాని జనింప దెఱింగి యింక నై
నను మదభీప్సితంబును ఘనంబుగఁ దీర్పుము నీతి చొప్పడన్. 785

చ. మఱచితె నీవు చూడ నసమానభుజాబలశాలి వాలినిన్
బరువడి నొక్కసాయకమునం బడవైచి తదీయసంపదల్
సరసత నీ కొసంగిన తెఱం గిఁక నాతనితోడ నేమి య
క్కఱ యని చూచితో యిపుడె కట్టి భుజింపవె తత్ఫలంబులన్. 786

వ. కపీంద్రా లక్ష్మణసహాయుండ నై ననాయొక్కసాలశైలభూమివాలివిదళనాద్యప్రతిహతపరాక్రమంబు మిక్కిలి పరిజ్ఞాతం బగుచుండ నీకుఁ జింతామయబుద్ధి వొడమకుండుటవలన విస్మయం బగుచున్నది సఖ్యకరణవాలినిరసనరూపం బైనయీసమారంభం జేసీతాన్వేషణప్రయోజనంబు కొఱకుఁ గృతం బయ్యెఁ

దద్విషయసంకేతం బెఱుంగకుండుట లగ్గు గాదు వర్షాకాలంబు సంకేతకాలం
బని యెఱింగియు మాసచతుష్టయంబు కడచుననంతకుఁ బ్రబోధంబు లేకున్న
వాఁడవు మత్సాయకంబున నిహతుండై వాలి యేమార్గంబునం జనియెఁ దన్మా
ర్గంబు సంకుచితంబు గాదు నీవతనిమార్గంబు ననుసరింపక సమయంబునందు
నిలువుము భవద్వాక్యంబు సార్థకంబు సేయుము శాశ్వతంబైనధర్మంబు నవలం
బించి మచ్ఛరమహత్త్వం బెఱింగికొని భవద్వాక్యంబు సార్థకంబు సేయు మని
పలికి వెండియు లక్ష్మణు నుద్దేశించి వత్సా నాచేత సముదీరితంబైనకార్యప్ర
కారం బంతయు విస్పష్టంబుగా వింటివి గదా యింక హితం బెయ్యది దాని
సుగ్రీవునకుం జెప్పి శీఘ్రంబునం జనుదె మ్మని యిట్లు కామవశంగతుండును
దీనుండును సదీనసత్త్వుండును శోకాభిపన్నుండును దీవ్రవివృద్ధకోపుండును లాల
ప్యమానుండు నగురాముండు పలికిన విని మహోగ్రతేజుం డగురామానుజుండు
హరీశ్వరుం డగుసుగ్రీవునియందుఁ దీవ్రబుద్ధి గావించి వివృద్ధకోపతాపుం డై
యున్నయన్న కి ట్లనియె. 787

లక్ష్మణుఁడు క్రుద్ధుండై రామునితో సుగ్రీవునిఁ జంపెద ననుట.

సీ. జననాథవర మిత్ర సముదుఃఖు లగుసుహృత్తు లవృత్తమందుఁ దానిలువఁడెపుడు
వహ్నిసాక్షికసచివత్వరూపకకర్మసంప్రాప్తరిపునిరసనఫలాను
బంధంబువలన విపన్నులమై యున్నమనలఁ దలంపఁ డా యినసుతుండు
క్షితిలోనఁ గోఁతికిఁ జేసినయుపకార మింతియె కాక మే లంత యగునె

తే. యర్కకులవర్య బుద్ధిక్షయంబువలన
గ్రామ్యసుఖయుక్తుఁ డై యుపకార మెఱిఁగి
ప్రతికృతి యొనర్ప కున్నాఁడు రాజ్య మొసఁగ
నగునె యలవాలితోఁ గూడ ననుపవలయు. 788

తే. అధిప సముదీర్ణవేగ మైనట్టికోప
మును ధరింపఁగఁ జాల దుర్బుద్ధి యైన
రవికుమారునిఁ జంపెద రాజపుత్రి
విచయ మావాలిసుతుఁడె కావించుఁ గాక. 789

తే ఉగ్రతేజ భవన్మహానుగ్రహమున
నెగడినవిభుత్వ మిపుడు నీ నిగ్రహమునఁ
బొలియు టన నెంతపని నాకు సెల వొసంగు
మిపుడె కడ తేర్చి వచ్చెదఁ దపనసుతుని. 790

వ. అని రోషభీషణంబుగాఁ బలికి రణచండకోపుం డై కోదండకాండంబులు లీలం
గేల నందుకొని సుగ్రీవనిగ్రహార్థంబు గమనోన్ముఖుం డైన నతనికోపంబుఁ జూచి
పరవీరహంత యగురాముండు మెత్తనిమాటలఁ దచ్చిత్తం బొక్కింత శాంతి
నొందించుచు ని ట్లనియె. 791

రాముఁడు లక్ష్మణుని శాంతి నొందించి సుగ్రీవునికడకుఁ బంపుట.

తే. సచివసంహాననాధ్యవసాయరూప
వృజిన మొనరింప రెండుఁ ద్వద్విధజనములు
ఘనవివేకంబుచేఁ బాతకము నణంచు
నతని మఱి పురుషోత్తముఁ డండ్రు బుధులు. 792

క. కడువడిఁ జేతోమోహం, బడరఁగ నే నన్నమాట లాలింపక యి
ప్పుడు రవిజునిపై మును నే, ర్చెడుసౌహార్దగౌరవంబుఁ జేర్పుము ప్రీతిన్. 793

క. రవిసుతునిఁ గానఁ జను మిపు, డవనుతి గావించి పరుష మాడక పాప
వ్యవసాయ ముడిగి కడు సాం, త్వవచనముల పలుకు కార్యదశ దెలియంగన్.

ఆ. అనిన నట్ల కాక యని సుమిత్రాపుత్త్రుఁ, డన్నచరణములకు నధికభక్తిఁ
బ్రణతుఁ డై తదాజ్ఞ పాటించి వానర, నేతపాలి కరుగ నిశ్చయించి. 795

సీ. కాలదండాభీలకార్ముకదండంబు తపనీయరుచుల హస్తమునఁ గ్రాలఁ
గ్రూరసర్పాభీలఘోరనారాచము ల్కడు దీర్ఘ మగునిషంగమునఁ దనర
పవిసన్నిభస్పర్శపాదఘట్టనమునఁ గొండలజా లెల్ల పిండి గాఁగ
నూరువేగసముత్థితోరువాతస్ఫూర్తి వివిధవృక్షంబులు విఱిఁగి కూల

తే. బొమలు ముడివడఁ గనుల రక్తిమ చెలంగ
నధరము చలింప రౌద్ర మంతంత కెదుగ
నిడుదజంగలు వేయుచుఁ బుడమి వడఁకఁ
గడురయంబున సౌమిత్రి తడయ కరిగె. 796

వ. మఱియు మహాప్రాజ్ఞుండును భ్రాతృప్రియహితరతుండును శుభబుద్ధియు నగు లక్ష్మణుండు ప్రతినివృత్తహననాధ్యవసాయుండై బృహస్పతిసమబుద్ధి యగుటం జేసి సుగ్రీవు నుద్దేశించి తనచేతఁ బలుకం దగినరామోపదిష్టవచనంబును దన మాటకు సుగ్రీవునిచేతఁ బలుకం బడియెడునుత్తరంబును దానికిఁ దనచేత వక్ష్యమాణం బైనయుత్తరంబును విచారించి జంతుపారణకశాలోలుం డైన కాలునిపోలిక విచిత్రధాతురాగ సముద్దీపిత సానుసుందరం బైనమందరంబు చందంబున వాతప్రేరితం బైనవహ్నిరీతినంబరమధ్యగతుండగుపుండరీకవనబంధునిమాడ్కిఁ జూడ్కికి వ్రేఁగగుచు నిజదేహప్రభాజాలంబున నక్కానన వెలిం గించుచు నమోఘరయంబునం జని చని ముందఱ ననతిదూరంబున. 797

క. నరవరసూనుఁడు దుర్గము, గిరిసంకటమందు ఘోరకీశచమూసం
భరితం బగుకిష్కింధా, పురమును విభవజితనాకపురముం గాంచెన్. 798

లక్ష్మణుఁడు కిష్కింధఁ జేరుట.

క. కని దానిమహిమ కెంతయు, మనమున నచ్చెరువు గదుర మఱిమఱి డాయం
జని పురి బాహ్యవనంబులఁ, గనుఁగొని యొ[illegible] గుధరభీమకాయులఁ గపులన్.

ఉ. వారును దన్నుఁ గాంచి బలవైభవ మొప్ప విశాలసాలగో
త్రారుహశైలశృంగములు దాలిచి మత్తకరీంద్రసన్నిభో
దారశరీరులై యెదుటఁ దప్పక నిల్చినఁ జూచి భీషణా
కారుఁడు లక్ష్మణుండు శిఖికైవడిఁ గోపము హెచ్చఁ బొల్చినన్. 800

ఉ. ఆరవివంశవర్యుభయదాకృతిఁ జూచి కపుల్పురారి యో.
దారుణమృత్యువో విలయదండధరుండో యటంచు నాత్మలోఁ
గూరిన భీతిచేఁ బురము గొబ్బునఁ జొచ్చి కపీంద్రమందిర
ద్వారముఁ జేరి లక్ష్మణునిదారుణకోపముఁ దెల్పి రయ్యెడన్. 801

క. ఆసూర్యజుఁ డేకాంతా, వాసంబునఁ దారఁ గూడి వారక రతికే
లీసక్తుఁ డౌటకతమున, మోసంబునఁ గీశవరులమొఱ వినఁ డయ్యెన్. 802

వ. అంత నవ్వానరులు సచివసందిష్టులై శీఘ్రంబున నగరంబు వెలువడి గిరికుంజర
మేఘాభులును నఖదంష్ట్రాయుధులును ఘోరాకారులును వికృతదర్శనులును
శార్దూలదర్పులును వికృతవదనులును దశశతసహస్రాయుతనాగబలులును
వాయువేగులునుసింహపరాక్రములును భానుప్రతాపులును గామచారులు నగు
హరిపుంగవులు నభోంతరంబునిండసింహనాదంబులు సేయుచునగరద్వారంబుల
నాక్రమించి యుదంచితవిక్రమాటోపంబునం బొలిచియుండి రందుఁగొందఱు
బహిర్ద్వారంబున యువరాజగునంగదుని నక్షత్రంబులు చంద్రునింబోలెఁబరివే
ష్టించి యుండి రిత్తెఱంగునం గూడికొనినయవ్వానరసైన్యంబుచేతనమ్మహాగు
హామేఘసమూహంబుచేత గగనంబుంబోలెఁ బరిపూర్ణమైయొప్పెనిట్లు గూడు
కొనిన మహాద్రుమహస్తంబైనకపిసైన్యంబును దురాసదమైనకిష్కింధను
బ్రాకారపరిఘాంతరంబువలన నిర్గమించి సాలతాలపాణులై యుదగ్రవిక్రమం
బున గుంపులు గట్టి పఱతెంచువీరవానరులనుం జూచి సుగ్రీవునిప్రమాదం
బును రామునివిరహశోకంబును దలంచుకొని దీర్ఘోష్ణమహోచ్ఛ్వాసవదనుం
డగుచు నేత్రంబులం దామ్రదీధితులు నిగుడ సధూముం డగుపావకునిచందం
బున వెలుంగుచు మహావీరుం డగులక్ష్మణుండు శంకింపక సందడిం ద్రోచి
కొని సుగ్రీవపాలితమైనకిష్కింధఁ బ్రవేశించి రాజమార్గంబునం బోవుచు
ముండట. 803

క. శ్యామాభ్రసన్నిభంబును, జామీకరవేదికంబు సముదితమణిమా
లామండితంబు దివ్యర, మానుహితము నైనయొకవిమానము గాంచెన్. 804

క. కని యందు గీతవాది, త్రనినాదము వానరీచరణనూపురని
స్వనము పరస్పరహాసిత, ధ్వనులును మణిహారకలరవంబులు వినియెన్. 805

వ. ఇత్తెఱంగున నాకర్ణించుచు. 806

క. తేజోవిషసంఘాతుఁడు, రాజితశరశల్యవిస్ఫురజ్జిహ్వుఁడు నై
రాజసుతుఁ డొప్పెను ధను,ర్భ్రాజితఫణుఁ డగుచుఁ బంచవదనాహిక్రియన్.

వ. అప్పుడు. 808

లక్ష్మణుఁ డంగదునితోఁ దనరాకను సుగ్రీవునికిం దెల్పుమని చెప్పుట.

క. ఘనదీప్తవహ్నిచందం,బునఁ దేజం బెసఁగ వచ్చు భూమీశసుతుం
గని యంగదుండు భయమున, ననుపమవినయంబు దోఁప నటు పొడసూపెన్.

క. వచ్చినతారేయునిఁ గని, చెచ్చెర లక్ష్మణుఁడు చాలఁ జిడిముడిపడుచున్
మెచ్చక ప్రళయాభ్రముక్రియ, నుచ్చైర్నాదమునఁ బలికె నుగ్రుం డగుచున్.

చ. అనుపమతేజుఁ డారఘుకులాగ్రణి రామువిభుండు పంప గ్ర
ద్దనఁ బనిఁ బూని తద్వ్యసనతప్తుఁడ నయ్యుఁ దదుక్తికౌశలం
బినసుతుతోడఁ జెప్పుటకు నిచ్చటికిం జనుదెంచినాఁడ న
య్యనఘునిపాలికిం జని మదాగమనం బెఱిఁగింపు నావుడున్. 811

శా. తారేయుండు విషణ్ణుఁడై మొగమున న్దైన్యంబు వాటిల్లగా
ధీరత్వంబు దొలంగఁ బెట్టి భయ ముద్రేకింపఁగా నార్తుఁడై
యారామానుజశాసనంబున రయం బారంగ నంతఃపుర
ద్వారంబుద్ధతిఁ బాసి యంతిపురిచెంతం బోయె దుర్వారుఁడై. 812

వ. ఇత్తెఱంగునం జని సుగ్రీవుని డాసి యతనిచరణంబులకుం బ్రణమిల్లి పదంపడి తార కభివందనంబు గావించి రుమాపదంబులకు మ్రొక్కి యంజలిఘటియించి యిట్లనియె. 813

అంగదుఁడు సుగ్రీవునికి లక్ష్మణునిరాక యెఱింగించుట.

ఉ. సచ్చరితుండు రామనృపచంద్రుఁడు పంపఁగ లక్ష్మణుండు తా
వచ్చి మహోగ్రకోప మొదవం దలవాఁకిట నిల్చి యున్నవాఁ
డచ్చతురుండు లోకముల నన్నిటిఁ గాల్పఁగఁ జాలువాఁడు నీ
విచ్చటఁ గామినీసుఖసమృద్ధి వహించుచు నుండఁ జెల్లునే. 814

వ. అని ప్రబోధించిన నతండు మదమత్తుండును మదనమోహితుండును నిద్రాగ్లాని సంవీతుండును గావున మైమఱచి మేల్కొనకున్న నత్తెఱం గాలోకించి సౌమిత్రి చిత్తం బధికరోషాయత్తంబు గాకుండునట్లుగా వినయవాక్యంబులం బ్రార్థించుచుఁ దత్సమీపంబునం గూడుకొనివానరులు ప్రళయకాలధారాధరంబులనుండి యెడతెగక కడువడిఁ బుడమిం బడు పెడిదంపుఁబిడుగులమ్రోఁతకు దీటగునట్లుగా బెట్టఱచుచు నట్టహాసంబుఁ జేసిన నమ్మహాశబ్దంబు విని సుగ్రీవుండు మేల్కాని మదవిహ్వలతామ్రాక్షుండును వ్యాకులస్రగ్విభూషణుండు నై లేచి పర్యంకంబునం గూర్చుండె నప్పు డంతఃపురప్రవేశయోగ్యులును రాజసమ్మతులును మంత్రకుశలులును ధర్మార్థనిపుణులు నగుప్లక్షప్రభావు లనుమంత్రు లిరువు రంగదవాక్యచోదితు లై యతండును దామును సుగ్రీవుని డాయం జని సౌమిత్రి రాకయుఁ దదీయరోషవిశేషంబు నెఱింగించిరి పదంపడి సామనిశ్చితంబు లగు

వాక్యంబులచేతఁ జిత్తంబు ప్రసాదాయత్తంబుగా నొనరించుకొని శక్రుం
డునుం బోలె సుఖాసీనుం డై నయతనిం బరివేష్టించి యిట్లనిరి. 815

చ. అతులితబాహుశౌర్యులు మహాత్ములు మిత్రులు రాజ్యదాయకుల్
చతురులు సత్యసంధులు ప్రసన్నయశోధను లన్నదమ్ము ల
ద్భుతగుణధార్మికు ల్నిఖిలభూభరణార్హులు రామలక్ష్మణుల్
క్షితిధరకందరంబున వసించుట యెంత యెఱుంగుదే కదా. 816

ఉ. అందొకరుండు లక్ష్మణసమాఖ్యుఁడు తమ్ముఁడు జ్యేష్ఠునానతిం
బొందుగఁ జాపబాణములు పూని రయంబున వచ్చి కీశులం
గ్రందుగ వేఁడి చూపులనె కాల్పఁగఁ జాలి హజారమందు మ
ధ్యందినభానుకైవడిఁ బ్రతాప మెలర్పఁగ నున్నవాఁ డొగిన్. 817

చ. అతనిమహోగ్రకోపము సమంచితతేజము గాంచి వానరుల్
వితతభయంబున న్మిగుల విహ్వలులై బహుళార్తి మ్రొయుచుం
గతి సెడి పాఱఁ జొచ్చిరిదె కంజవనాప్తకుమార యాలకిం
చితె జితకాలవారిధరసింహగపం బగుతన్మహాధ్వనిన్. 818

క. ఆతనిచేఁ బ్రేషితుఁడై, నీతనయుం డంగదుండు నీకడ కెంతో
భీతిఁ జనుదెంచి యున్నాఁ, డోతపనజ తత్ప్రవృత్తి నొగిఁ దెల్పుటకున్. 819

ఉ. రాజవరేణ్యుఁడై నరఘురామునితమ్ముఁడు నీహజారమున్
దోజ దలిర్పఁ గాచికొని యుండఁగ నస్తుఁడె వేగ లేచి నీ
నాజగదేకవీరుని రయంబునఁ దోడ్కొని వచ్చి ప్రీతితోఁ
బూజ లొనర్చి చిత్తమునఁ బుట్టినకోపము దీర్పు మిత్తఱిన్. 820

క. అనుపమశేముషిఁ దత్పద, వనజములకుఁ బుత్త్రబంధువర్గయుతముగా
వినతి యొనరించి రోషము, చను నట్లారాధనంబు సలుపుము భక్తిన్. 821

శా. నీకై కాదె యసాధ్యవిక్రమయుతు న్నిర్దోషమానాంగు నా
పాకారాతికుమారు నొక్కవిలసద్బాణంబునం గూల్చె సీ
తాకాంతుండు తదీయకార్యము సమర్థత్వంబునం దీర్చినన్
గా కిట్లుండినఁ బ్రాభవంబు యశము న్ప్రాణంబులుం దక్కునే. 822

క. మతి గలిగి యింకనైనను, క్షితిపతితో నన్నమాటఁ జెల్లించి వెసన్
గృతకృత్యుండవు సత్య, ప్రతిశ్రవుఁడ వగుము చండభానుతనూజా. 823

సుగ్రీవుఁడు భయముచే మంత్రులతో నాలోచించుట.

వ. అని పలికిననంగదునివచనంబు విని లక్ష్మణుండు కుపితుండై వచ్చియున్నవాఁడను
మాట కదరిపడి దిగ్గన నిజాసనంబు డిగ్గ నుఱికి మంత్రజ్ఞుండును మంత్రప్రయో
గకుశలుండు నగుసుగ్రీవుండు గౌరవలాఘవంబులు నిశ్చయించి మంత్రంబులం
దుఁ బరినిష్ఠితులైనమంత్రుల నవలోకించి యిట్లనియె. 824

తే. రఘుకులాగ్రణి కేనపరాధ మించుకైనఁ గావింపఁ బరుసంబు లాడియేఁగ
నూరకేలకొ నామీఁది గారవంబు, వీడి సౌమిత్రి కలుషించినాఁడు నేఁడు. 825

తే. వృజినచిత్తుఁడై రంధ్రంబు వెదకునట్టి, శాత్రవునిచేత లేని దోషంబు లెవ్వి
యైన నామీఁద వినియెనో కానిచో నృపాత్మజుం డేల కోపించెనకట నేఁడు.

క. తలపోయఁగ మును నాపైఁ, గలసౌహృద మెల్ల మాని కలుషించుటకుం
గలహేతు వేమొ తెలియదు, విలసద్గుణులార మీరు వివరింపుఁడీకన్. 827

ఆ. నన్నుఁ బ్రీతిఁ జాల మన్నించి సామ్రాజ్య, మిచ్చినట్టిచంద మెల్ల నాత్మ
దలఁచుకొనిన నాకు దశరథపుత్త్రుల, వలని సాధ్వసంబు గలుగ దిపుడు. 828

వ. ఇన నకాలంబునందుఁ గుపితుం డైనమిత్త్రుండు సంభ్రమంబుఁ బుట్టించుచున్న వాఁడు సర్వప్రకారంబుల మిత్త్రుండు సుకరుండై ననుదన మిత్త్రపరిపాలనంబుదుష్కరం బై యుండుఁ జిత్తంబుల కనిత్యత్వంబు గల్గుటవలన స్వల్పాపరాధంబునం డైనను బ్రీతి భేదింపంబడు మహాత్ముం డగు రామునిచేత మహోపకారంబు గావింపం బడియె దానికి సదృశం బైనప్రత్యుపకారంబు నేను గావింప సమర్థుండు గా నందువలన మిక్కిలి విత్రస్తుండ నైతి నని పలికిన సుగ్రీవునివచనంబు విని వానరపుంగవుం డైనహనుమంతుండు వానరమంత్రు లందఱు వినుచుండ నిజ తర్కంబున ని ట్లనియె. 829

హనుమంతుఁడు సుగ్రీవునికి లక్ష్మణాగమనకారణముఁ జెప్పుట.

సీ. రవికుమార నరేశ్వరకృతోపకారంబు మానసంబున నీవు మఱవ కునికి
సర్వవిధంబులఁ జర్చింపఁ గడు విచిత్రము గాదు ధీరుఁ డా రామవిభుఁడు
కాంతావియోగశోకపరీతచిత్తుఁడై నీయట్లు తాలిమి నిలుపలేక
సమయకాలము కడచనినంత కీవు రాకున్న మత్తుఁడ వని ని న్నెఱింగి
తే. ప్రణయకోపంబుచే మీఁ దెఱుఁ గెఱింగి,రమ్మనుచుఁ బంపఁ గ్రుద్ధుఁడై లక్ష్మణుండు
వాఁడిదీపింపఁ జనుదెంచినాఁడు నేఁడు, తెలియ నీయర్థమందు సందియము లేదు.

క. శూరుఁ డగురఘుకుమారుఁడు,సారబలోదారుఁ డైనశక్రతనూజుం
డారయ భవత్ప్రియార్థము, ఘోరరణోర్వీతలమున గూల్చెం గాదే. 831

క. వానలు వెలిసినపిమ్మట, భూనాథునిసతిని వెదకఁబుచ్చెద ననుచుం
బూని మును పలికి తిప్పుడు, వానలు వెలిసెను శరత్తు వ్రాలఁగఁ జొచ్చెన్. 832

చ. సరసులు దేఱెఁ దుమ్మెదలు సారసపంక్తులఁ జేరె దిక్కులం
దఱుచుగఁ దెల్పు లూరె హిమధాముని తేజము మీఱె మబ్బు లం
బరమున నుండి జాఱెఁ గలభంబులమోహము తీఱె జక్కవల్
సురతముఁ గోరె సూర్యసుత చూచితె శారదకాలసంగతిన్. 833

క. తతి యెఱుఁగక రతిసుఖత, త్పరత న్నీ వునికిఁ బ్రణయపరకోపమునన్
ధరణీశుఁ డనుప లక్ష్మణుఁ, డురువిక్రమశాలి వచ్చె నుగ్రుం డగుచున్ 834

క. గతరాజ్యుఁడు దీనుం డప, కృతిశీలుఁడు మానధనుఁడు హృతదారుఁడు నౌ
క్షితినాథునకు రయంబున, హిత మొనరించు టది నీకు హిత మగుఁగాదే. 835

క. ఉపకారి యైనలక్ష్మణు, కృప వెలయుటకంటె నొండు కీశాధీశా
యపరాధివి కృపణుండవు, చపలాత్ముఁడ వై ననీకు శరణము గలదే. 836

క. పతికిఁ బ్రధానులు కాలో, చితగతి భీతిలక కీడుచెందక యుండ
న్హితమాడవలయు నే నా, గతి నీకు భయంబు దక్కఁ గఱపెద బుద్ధిన్. 837

క. సకలామరరక్షోగణ, హ్యాకభరితం బైనజగము నాత్మవశముఁ జే
సికొనంగఁ జాలు రాముఁడు, ప్రకటితముగ విల్లు చేతఁబట్టినయంతన్. 838

తే. అట్టిజగదేకవీరున కలుక వొడమ, కుండునట్లుగ నీవు పూర్వోపకార
మెఱిఁగి మునుచేసినప్రతిజ్ఞ నెఱపి భూరి,కీశసామ్రాజ్యపదము దక్కించుకొనుము.

తే. మఱియు బాంధవమంత్రిసమన్వితముగ
రామునిపదాంబుజములు శిరంబు సోఁకఁ
బ్రణతిఁ జేసి తదృశుఁడవై బ్రతుకు మధిప
భర్తృవశగత యై పొల్చు భార్యపగిది 840

లక్ష్మణుఁ డంగదాదివానరగృహంబులఁ జూచుట

వ. కపీంద్రా సురేంద్రతేజు లైనదానులక్ష్మణులదివ్యాస్త్రాదిబలంబు సాలగిరిచ్ఛేద
నాదికార్యంబులందు దృష్టచరత్వంబువలన నీకు విదితం బైనయదియె కదా
యమ్మహానుభావులశాసనంబు నుల్లంఘించుట యుక్తంబు గా దని పవననంద
నుండు సుగ్రీవునకు హితోపదేశంబు సేయుచుండె నంత లక్ష్మణుండు మొగసాల
విడిచి దావారికులు సంక్రుద్ధం బైనతనరూపంబుఁ జూచి భయభ్రాంతులై డాయ
నోడి కృతాంజలిపుటు లై యంత నంతఁ బరివేష్టించి వచ్చుచుండ వారినందఱ
నిరాకరించి వెచ్చ నూర్చుచు శీఘ్రంబునం జని వింధ్యమేరుమహీధరసంకాశ
నానావిచిత్రమణిసమాకీర్ణరమ్యహర్మ్యప్రాసాదసంబాధ యైనదాని ననంతవస్తు
సంచయసమంచితనానాపణ్యోపశోభిత యగుదాని నతిరమణీయపుష్పితసర్వ
కామప్రదదివ్యఫలరంజితమహీరుహవ్రాతసంశోభితమహోద్యానసంకుల యగు
దాని నతిసురభిచందనాగరుపద్మమై రేయమధుసమ్మోదితమహాపథ యగుదాని
నమేయబలసంపన్న దేవగంధర్వాంశసంభూత దివ్యాంబరస్రగ్విభూషిత కామ
రూపసంచారవీరవానరపరిపూర్ణ యగుదాని నొక్కమహాగుహ ప్రవేశించి
యందుఁ గ్రమంబున నంగదునిగృహంబును మైందద్వివిదనివాసంబులును గజగ
వయగవాక్షగంధమాదనశరభులనికేతసంబును సంపాతిభవనంబును విద్యు
న్మాలినివేశనంబును సూర్యాక్షునిమందిరంబును హనుమంతునిసదనంబును వీర
బాహుసుబాహుల వేశ్మంబులును నలనీలులసద్మంబులును గుముదసుషేణుల
యాలయంబులును దారునియగారంబును జాంబవంతునినిలయంబును దధివ
క్త్రునినిశాంతంబును సుపాటలసునేత్రులవస్త్వంబులును మఱియు మహాసారం

బులును బాండరాభ్రప్రకాశంబులును దివ్యమాల్యయుతంబులును ... ధాన్యంబులును స్త్రీరత్నోపశోభితంబులు నగుతక్కిన వా... లోకించుచు రాజమార్గంబునం జని చని యన్నల. 841

—లక్ష్మణుఁడు సుగ్రీవునిగృహమును బ్రవేశించుట.—

సీ. రజతాద్రినిభశుచిప్రాసాదశిఖరరేఖాలేఖితాంబరం బైనదాని
వరశస్త్రపాణివానరవీరపరిపాలితాత్యున్నతద్వారమైనదానిఁ
దివ్యమాల్యావృతనవ్యచామీకరమానితతోరణం బైనదానిఁ
జక్రవాళగిరీంద్రసంకాశపాండరప్రాకారశోభితం బైనదాని
తే. రమ్య మగుదాని నిర్జరేంద్రక్షయోప
మైనదాని దురాసదం బైనదాని
రవిజుగృహము ప్రవేశించె లక్ష్మణుండు
సూర్యుఁడు మహాభ్రపటలంబుఁ జొచ్చినట్లు. 842

వ. మఱియు మహేంద్రదత్తనీలజీమూతసంకాశకుసుమపరిమళ ఘుమంఘుమితశీత
చ్ఛాయమనోరమదివ్యపుష్పఫలోపేత సర్వకామఫలమహీరుహషండమండితం
బైనసుగ్రీవునిభవనం బనివార్యగమనంబునం బ్రవేశించి నానాజనసమాకులం
బు లైనసప్తకక్ష్యాంతరంబు లతిక్రమించి హైమరాజతపర్యంకవరాసనమహా
స్తాస్తరణోపేతమహావానరగుప్తం బైనయంతఃపురంబు గనుంగొని డాయం
బోవునప్పుడు. 843

క. సమగీతపదాక్షరయు, క్తము తంత్రీగీతనాదకలితము నై యు
త్తమమధురగాననిస్వన, మమృతరసము చిందినట్టు లటు విన నయ్యెన్. 844

వ. మఱియును. 845

క. మణిమయకలనూపురకం, కణవిలసత్తారహారకాంచనగుణని
క్వణనంబు లెసఁగ నాడెడు,గణికలఁ బెక్కండ్ర నచటఁ గనుఁగొనియెన్.

క. వేణుస్వనములు చెంచ, ద్వీణారవములు మృదంగ దివ్యపటహాని
స్వనఘనంధణరవములు, క్షోణీశ్వరతనయుఁ డచట సొంపుగ వినియెన్. 847

శా. ఆలోకించెను రాజకుమారుండు కన్గొనియె దివ్యామోదపుష్పోల్లస
న్మాలాజాలవిరాజితాంసతటవిన్యస్తోరుహైమోజ్జ్వల
చ్చేలాలంకృత లై వినూత్నమణికాంచీబద్ధఘంటారవ
శ్రీవ్యాలోదగ్రనితంబ లై పొలుచు నాకీశాంగనాశ్రేణులన్. 848

వ. మఱియు సంతుష్టులును జాగరూకులును వస్త్రాభరణాద్యలంకారోపేతులు నగు
సుగ్రీవునిసచివుల నందఱ విలోకించుచుఁ గామినీజనచరణనూపురకాంచికా
ఘంటికానినదంబు విని లజ్జించుచు నాభరణస్వనశ్రవణసంజాతరోషవేగ
ప్రకుపితుం డై, 849

తే. రామభద్రుని దుఃఖసంప్రాప్తియును బ్ల
వంగనాథుని రాజ్యాప్తివైభవంబు
తగ మనస్తాప మొనరింప వగలఁ బొగిలి
క్రుద్ధుఁడై నేత్రములఁ దామ్రరుచులు నిగుడ. 850

శా. ఆ రామానుజుఁ డుగ్రుఁడై ఖరి సమస్తాశాంతము ల్నిండ గం
భీరజ్యానినదం బొనర్చి జగము ల్భీతిల్లఁ గాలాంతకా
కారుం డై శిఖిమాడ్కిఁ గ్రాలుచు శిరఃకంపంబు గావించుచు
న్గోత్రాహీంద్రముమాడ్కి రోఁజుచుఁ గపిక్షోభంబు గావించుచున్. 851

వ. మఱియు సచ్చరిత్రయుక్తుం డగుటం జేసి పరస్త్రీదర్శనంబున స్త్రీనూపురశబ్దశ్రవ
ణంబున నుదాసీనుం డగుచుఁ గాంతాజనప్రసంగరహితప్రదేశంబు నాశ్రయించి
కోపసమన్వితుం డై యుండె నప్పుడు. 852

ఉ. ఆనినదంబు కర్ణపుట మంటినయంత నెత్రస్తచిత్తుఁ డై
భానుతనూజుఁ డంగదుఁడు పల్కిన కైవడి రౌద్రభంగి రా
మానుజుఁ డేగుదెంచెఁ జపలాత్ముఁడ నై తెలియంగ నైతి నం
చాననమందు విన్నఁదన మంటఁగఁ దారను గాంచి యిట్లనెన్. 853

సుగ్రీవుఁడు తారను లక్ష్మణునియొద్దకుఁ బంపుట.

క. తరుణీ రామునితమ్ముఁడు, నిరుపమమృదుమానసుండు నేఁ డేలకొ యి
ప్పురుసున రోషయుతుం డై, యరుదెంచినవాఁడు లయహుతాశనుమాడ్కిన్.

క. నాయందును నీయందును, బాయక యంగదునియందు బంధుగణమునం
దేయపరాధముఁ గనుఁగొని, తోయజముఖి కోప మెత్తి తోఁచినవాఁడో. 855

క. మనచే నెయ్యది యైనను, బనివడి యప్రియ మొనర్పఁబడియెనె దాని
న్మనమున నెఱింగి చంద్రాననన తడయక కల తెఱంగు నాకుం జెపుమా. 856

చ. రయమున నీవు మున్నరిగి రాసుతుఁ గాంచి తదీయకోపము
న్నయముదలిర్ప సాంత్వవచనంబులఁ దీర్పుము పెద్ద లుర్వి నెం
తయు సతులందు దారుణ మొనర్పరు గావున నమ్మహాత్ముఁడు
న్నియమము దప్పి క్రౌర్యమున నీ కవమానము సేయ కుండెడిన్. 857

క. మానిని సునయోక్తుల నీ,చే నెంతయు శమితకోపచేతస్తాపుం
డై నపిదప నాలక్ష్మణుఁ, గానఁగ వచ్చెదను వినయగౌరవ మెసఁగన్. 858

ఉ. నా విని యావెలంది కపినాథునియానతి నుల్లసన్మితం
బావృతమేఖలాగుణసమంచితనూతనహేమసూత్ర యై
తావులు గ్రుమ్మరించు విరిదండలు చెంతల జీరువాఱఁగా
భూవరిపుత్రుసన్నిధికిఁ బోయె బ్రియోక్తి ననూనయింపఁగన్. 859

వ. మఱియు స్వభావరమణీయగమనసౌందర్య యైనయత్తారకాంత సంశ్లేషకృతా
యాసంబున నడుగులో నడు గిడుచు బో[illegible]

యై శయనస్థానంబునం బవ్వళించి యున్నయది రయంబున లేచి చనుదెంచు
చున్న దగుటం జేసి ప్రలంబకాంచీగుణహేమసూత్రయై వ్యక్తసంభోగలక్షణ
యై స్తనభారంబునఁ గించిన్నమితాంగయష్టితోఁ జని లక్ష్మణుని సందర్శించి
డాయం జనిన నవ్వానరపత్ని నవలోకించి మహాత్ముం డగు లక్ష్మణుం డుదాసీనుం
డై యొక్కింత మొగంబు వాంచి స్త్రీసన్నికర్షంబువలన నివృత్తకోపుండై
యుండె నప్పు డత్తార పానయోగంబువలన నివృత్తలజ్జయై సౌమిత్రి నవలోకించి
యతనిదృష్టిప్రసాదంబువలన భయంబు విడిచి ప్రణయప్రగల్భంబును బరిసాం
త్వనయుక్తంబును నర్థవంతంబును నగువాక్యంబున నిట్లనియె. 860

మ. కృప పోఁబెట్టి దురంతకోపమున నిర్వేదించె దిక్లేలకో
నృపవంశోత్తమ యెవ్వఁ డీకపులలో నీయాజ్ఞకుం గాక దు
ర్నృపలుం డై చరియించె నెవ్వఁ డిట శుష్కత్క్షాజకాంతారభా
గపతద్వహ్నిని నిర్విశంకతఁ జొరం గాఙ్క్షించె దుర్బుద్ధియై 861

లక్ష్మణుఁడు తారతో సుగ్రీవునియందలిదోషంబు లుగ్గడించుట.

వ. అని సాంత్వపూర్వకంబుగాఁ బలికిన నయ్యంగనవచనంబు విని లక్ష్మణుండు ప్రణ
యదృష్టప్రయోజనం బగువాక్యంబున నద్దేవి కిట్లనియె. 862

తే. అతివ నీపతి లుప్తధర్మార్థసంగ్ర,హుండు కామపరీతచిత్తుం డటంచు
నెఱుఁగ వేటికి భర్తకు హితముఁ గోరు కాంత పతిచందమును మదిఁగానవలదె.

క. తలపోయఁడు రాజ్యార్థము, తలపోయఁడు శోకవేగదళితుల మమ్ముం
దలపోయఁడు పరమద్విధిఁ, జెలియా నీమగఁడు పానసేవారతుఁ డై 864

తే. మాసములు నాల్గు చనినపిమ్మట మహీజ, వెదకఁ బంపెద నని సత్యమొదవఁబలికి
పానసేవామదంబున మేను మఱచి, తఱి యరుగుసంతకును దానిఁదలఁపఁడయ్యె.

క. పానమె పురుషార్థమునకుఁ, దానక మని నెమ్మనమునఁ దలఁచినవాఁ డా
భానుజుఁడు పానసేవను, బూనిన ధర్మార్థకామములు సెడి పోవున్ 866

తే. అతివ యుపకృతివిషయంబునందు నీతిఁ, బట్టి ప్రత్యుపకృతి సేయనట్టివాని
కనఘ నుతికైన మిత్రనాశనమునందుఁ, బరఁగ ధర్మార్థకామలోపంబు గలుగు.

తే. సత్యధర్మార్థకామైక సదన మైన, మిత్రుని బరిత్యజించిన మిహిరసుతుని
చేత నిన్నాళ్లును బరిత్యజింపఁబడియెఁ, గాదె యేమన్న నిఁక వివేకంబు గలుగు.

వ. హరీశ్వరుం డగుసుగ్రీవుం డిట్లు వివేకహీనుం డయ్యె నింక నే మనిన నేమి
కార్యంబు లేదు గావున ధర్మార్థకామవిలోపహేతుభూతమిత్రపరిత్యాగలక్షణ
కార్యం బిట్లు ప్రస్తుతం బగుచుండ నుత్తరకార్యం బెయ్యది మాచేతఁ గర్త
వ్యంబు నీవు కార్యతత్త్వజ్ఞవు గదా దానిం బేర్కొను మని పలికిన ధర్మార్థనిశ్చ
యయుక్తంబును మధురస్వభావంబు నగులక్ష్మణునివాక్యంబు విని యత్తార
రామకార్యంబునం దవగతప్రయోజనయై స్నిగ్ధవిశ్వాసయుక్తంబగు వాక్యం
బున నన్నరేంద్రపుత్రున కిట్లనియె.

తార లక్ష్మణు ననునయించుట.

సీ. భూపాలసుత యిది కోపకాలము గాదు స్వజనంబునందు దోషంబు సేయఁ
జనదు భవత్ప్రియోజనపరుం డగుకపివరుప్రమాదము సైఁపవలయు సత్త్వ
గుణయుక్తుఁ డగువాఁడు గుణహీనుఁ డగువానియందుఁ గోపము సేయనర్హమగునె
సత్త్వవసుద్ధుండవు శాంతిదాంతిక్షమాచతురుండవు నీయట్టి సాధుజనుఁడు
తే. జగతి నెవ్వాఁడు కోపవశంబు నొందుఁ
బరఁగఁ గోపంబువలనఁ దాపంబు గలుగుఁ
దాపమునఁ బాపము ఘటిల్లుఁ దద్విధునకుఁ
బాప మార్జించు టది ధర్మఫణితి గాదు. 870

వ. మహాత్మా హరివీరబంధుం డగురాముని యమోఘరోషంబును నుద్యోగకార్య
మునకుఁ గాలవిలంబనం బగుటయును సుగ్రీవునకు మీరు చేసినయుపకారం
బును సుగ్రీవునివైభవంబు భవదధీనం బగుటయును సుగ్రీవునకు సీతాన్వేష
ణాదికార్యంబు కర్తవ్యంబగుటయును శరీరజకానుబలం బవిషహ్యం బనియును
రాముండు విరహవేదనాలంపటుండై యునికియుఁ గామంబుచేత సుగ్రీవుండిప్పు
డనవరతం బవబద్ధుం డై యుండుటయు నట్టిసుగ్రీవుం డేజనంబునం దవబద్ధుం
డయ్యె నట్టికాంతాజనంబును నెఱింగి యున్నదాన వినుము 871

తే. ఇనకులోత్తమ నేఁడు నీ విట్టికోప
వశము నొందుటఁ దలఁతు దుర్వారకాను
తంత్రములయందు నీబుద్ధి తగులుపడదు
తగిలి యున్నఁ దాదృశు నిట్లు దెగడ విభుడు. 872

క. కానురతులైనమనుజులు, భూమీశ్వర దేశకాలములు ధర్మార్థ
ప్రామాణ్యంబులు దెలియక, వ్యామోహితు లగుచుఁ జాల వర్తింతు రిలన్

చ. పనివడి పానయోగమున భానుసుతుండు నివృత్తలజ్జుఁడై
యనిశము మమ్ముఁ గూడి పొలుపారఁగ మన్మథకేళిఁ దేలుచున్
దనియక మత్తుఁడై యునికిఁ దప్పు సహింపఁగఁ బోలు భ్రాతపైఁ
గనలఁగఁ జెల్లునే విభునికార్యము దీర్పఁగ రాఁగలం డిఁకన్. 874

చ. అతిచపలస్వభావుఁడు వనాటుఁడు నైనదినేంద్రపుత్త్రుఁ డు
ద్ధతి ధృతి మాలి పుష్పశరధాటికి లోఁబడి యుండు నెంత పో
యతులతపోవిభూతి మహిమాప్తిజితేంద్రియులైన తాపసు
ల్మతి చెడి కామినీసుఖసమన్వితులై వెసఁ జిక్కియుండరే. 875

వ. అని యిట్లు మహార్థయుక్తం బగువచనంబు పలికి వెండియు నత్తార నఖేలంబును
మదవిహ్వలంబును భర్తృహితయుక్తంబు నగువాక్యంబున నిట్లనియె. 876

సీ. క్షితినాథసుత భానుసుతుఁడు రామునకు విధేయుఁడై కార్యంబు దీర్చుకొఱకు

మునుకొని యుద్యోగ మొనరించి యున్నవాఁ డెల్లుండి రేపట నేపు మీఱి
నఖిలదిక్కులనుండి యంబరసంచారచతురులు దుర్వాంత సత్త్వయుతులు
కామరూపులు వీర్యఘనులు కోట్యర్బుద సంఖ్యాతు లగచరసైన్యపతులు
తే. వచ్చెదరు వారి నందఱ వరుసతోడఁ, దోడుకొని రాముకడ కతితూర్ణభంగి
రాఁగలఁడు మీర లింతలో వేగిరపడి, పరుషవాక్యంబు లిబ్భంగిఁ బలుకఁదగునె.

తార లక్ష్మణుని సుగ్రీవునికడకుఁ దోడుకొని పోవుట.

వ. రాజనందన నీవు పరిజనాభ్యంతరమందిరప్రవేశం బనుచితం బని యిచ్చటనె యుండుటం జేసి నీచేత సదాచారంబు రక్షితం బయ్యె మిత్రభవనంబునందు మిత్రదారావలోకనంబు సేయుటవలన సత్పురుషులకు ధర్మలోపంబు గలుగదు గావున నీ వంతఃపురంబులోనికి విచ్చేయవలయు నని ప్రార్థించిన నద్దేవివాక్యం బులచేతఁ గించి దుపశమితక్రోధుం డై తారోపదిష్టమార్గంబున నంతఃపురంబు ప్రవేశించి యందు. 878

సీ. ఉదయాద్రిపై నొప్పు నుష్ణాంశుక్రియఁ గాంచ నానర్ఘపీఠిపై నలరువాని
దివ్యాభరణమాల్య దివ్యగంధాంబర హారశోభితగాత్రుఁ డైనవానిఁ
గమనీయవారుణీ గంధఘుమంఘుమితాధరకిసలయుం డైనవాని
ననమానమధుపాన లసితాతిమదఘూర్ణ మానశోణితనేత్రుఁ డైనవాని
తే. వానరీహస్తచామర వ్యజనమంజు, లానిలాందోళితాలకుం డైనవాని
భూరిపరిమళవాసిత పుష్పదామ, కిరణసంభృతగ్రీవు సుగ్రీవుఁ గనియె. 879

వ. మఱియు నాదిత్యసన్నిభుం డగువాని దివ్యరూపుం డగువాని మహేంద్రుండుం బోలె దుర్జయుం డగువాని దివ్యాభరణమాల్యోపేతప్రమదాజనపరివేష్టితుం డగువానిఁ దప్తకాంచనవర్ణుం డగువాని విశాలాక్షుం డగువాని రుమాపరిరం భసంభావనాసంభ్రముం డగువాని సుగ్రీవు నవలోకించి. 880

క. ఘనశరతద్విభవాలో, కనజాతదురంతరోషకలుషారుణితా
ననలోచనుఁ డై కాలుని, యనువున శోభిల్లె నతిభయావహభంగిన్. 881

ఉ. అంత దినేంద్రపుత్రుఁడు దురంతనితాంతమహోగ్రకోపకా
లాంతకుమాడ్కిఁ గ్రాలుచు రయంబున వచ్చుమహీశపుత్రు న
ల్లంతన చూచి దిగ్గన నిజాసన ముద్ధతి డిగ్గి యాత్మలో
నెంతయు భీతి పర్వఁ జలియించె సుహీధరభిద్ధ్వజాకృతిన్. 882

తే. అప్పుడు రుమాప్రభృతికాంత లతిరయమున
భర్తతోఁ గూడ లేచి సంభ్రమ మెలర్ప
గగనమునఁ దారకలు నిశాకరునిఁబోలె
సురుచిరంబుగ నాతనిఁ జుట్టుకొనిరి. 883

క. ఇక్కైవడి రవినందనుఁ, డక్కనకాసనము డిగ్గి యంజలియుతుఁ డై
మిక్కిలి భయభక్తులతోఁ, గ్రక్కున సౌమిత్రియంతికంబున నిలిచెన్. 884

వ. ఇట్లు కాంతాజనపరివృతుం డై కల్పవృక్షంబుచందంబున నంజలియుతుండై తనమ్రోల నిలువం బడియున్నసుగ్రీవు నవలోకించి లక్ష్మణుండు దారుణవాక్యంబున ని ట్లనియె. 885

లక్ష్మణుండు సుగ్రీవుని దూఱుట.

తే. సత్యనిష్ఠయు నింద్రియజయము కృపయు
సత్త్వసంపన్నతయుఁ గృతజ్ఞత్వ మార్త
రక్షణాసక్తి ధాత్రి నేరాజు కొప్పు
నతఁడు సంపూజ్యుఁ డగుచు నేపారు సిరిని. 886

క. ఉపకారు లైనమిత్రుల, కుపకారము సేయఁ బ్రతిన యొనరించి తుదిం
గృప మాలి తప్పి నడిచిన, చపలాత్మునికంటె శఠుఁడు జగతిం గలఁడే. 887

తే. మొదలఁ దాను గృతార్థుఁడై పిదపసఖుల, కవని నెవ్వఁడు ప్రతికార మాచరింపఁ
డాకృతఘ్నుఁడు సర్వభూతావలులకు, నిక్కముగ వధ్యుఁ డనిరి వినీతివిదులు.

సీ. అశ్వానృతుండు శతాశ్వహంతయు మఱిగోనృతుండు సహస్రగోఘ్నుఁడనియుఁ
బురుషానృతుం డగుపురుషాధముం డాత్మహంతయు నిజబంధుహంత యనియు
మొదవును జంపిన మూఢాత్మునకుఁ జోరునకును భగ్నవ్రతునకును బాన
నిరతున కిల నొక్కనిష్కృతి గలదు గా కరయఁ గృతఘ్నున కదియు లేదు

తే. మఱియు నట్టికృతఘ్నుండు సిరికి నాయు, వునకుఁ గాక నిరస్తుఁ డౌననియు నిట్లు
మును కృతఘ్నునిఁ గూర్చి సమ్మోదమెసఁగ, నబ్జగర్భుండు గాథలయందుఁ దెలిపె

క. మొదలఁ గృతార్థుఁడవై పెం, పొదవఁ బతికి హితము సేయ కున్నకతన నీ
వదయుఁడ వనార్యుఁడవు దుర్మదుఁడవును గృతఘ్నుఁడవు ప్రమాదివి తలఁపన్.

తే. భానుతనయ కృతార్థుండ వైననీకుఁ, గరుణ నకృతార్థుఁ డైనరాఘవుని దేవి
వెదకఁ బుచ్చుట కర్తవ్యమది యెకాక, గ్రామ్యసుఖవృత్తి నిట్లుంట కార్యమగునె.

క. ఘనుఁ డారాముఁడు మిత్రుఁడ, వని నీకై పూని వాలి నతిబలశాలిం
దునిమెం గడు మండూక, స్వనఘణి వని ని న్నెఱుంగఁజాలక యకటా. 892

క. జనపతికరుణనకాదే, యనుపమసంపదలు గలిగె నటు కాకున్నన్
మునుపటివలె గిరికంధర, ఘనదుర్గములందుఁ జాల గాసిం బడవే. 893

క. క్షితినాథునికార్యము దుర్మతి వై కావింప వేని మచ్ఛితవిశిఖా
హతిఁ గూల వైచి యిప్పుడె, యచిరయమున వాలిఁ గూడ ననిచెద నిన్నున్.

తే. అతిబలుం డైనవాసవసుతుని ఱొమ్ము, ప్రక్కలించినవిశిఖంబు మొక్కవోయె
నని తలంచితొ యవ్వాఁడిమిని గడంగి, నేఁడు నినుఁ ద్రుంపఁగాఁ జాలు నీచచరిత.

తే. రామబాణాభిహతుఁడై పురందరాత్మ, సంభవుఁడుపోయినపథంబు సంకుచితము
గాదు నీకును దత్ప్రతిగ్రహణబుద్ధి, గల్గినను రామవిప్రియకారి వగుమ. 896

క. క్షితిపతికి హితము గావిం,చితి వేనియుఁ దన్మహావిచిత్రశరాస
చ్యుతవజ్రసన్నిభాశుగ, వితతులఁ గనుఁగొనక సుఖితవెలసెద విచటన్. 897

—తార లక్ష్మణుని ననునయించుట.—

క. అని పెక్కుగతుల లక్ష్మణుఁ, డనుపమకోపంబు రోహితాకృతిఁ గనులం
గనుపట్టఁగఁ బల్కిన న,య్యినవంశజుఁ జూచి తార యిట్లని పలికెన్. 898

చ. అనఘ భవన్ముఖేరితమహాశనిసన్నిభదారుణోక్తులన్
వినఁ జతురుండు గాక కడు వెల్వెలఁ బోవుచు నున్నయాతఁ డీ
యినజుఁ డొకింత నేరమున కింత తిరస్కరణంబు సేయఁగాఁ
జనునె వయస్యునిం దొడరి చంపిన దోషము గాదె యారయన్. 899

చ. తరణితనూజుఁ డక్కట కృతఘ్నుఁడు గాఁడు శఠుండు గాఁడు దు
శ్చరితుఁడు గాఁడు కేవలనృశంసుఁడు గాఁడు కృతోపకారవి
స్మరణయుతుండు గాఁడు నృపసత్తమ నాజ్ఞయుఁ దప్పఁ డేటి కి
ప్పురుషున మాట లాడెదవు భానుకులోత్తమ యన్యునిన్ బలెన్. 900

ఉ. రామునిసత్కృపం బ్లవగరాజ్యము శాశ్వతకీర్తియున్ మహో
ద్దామయశంబు గల్గెఁ గడుధన్యుఁడ నైతిఁ దదిష్టసిద్ధికై
భూమిజ నింక వే వెదకఁ బుచ్చెఁగఁ బోలు నటంచు మాకుఁ దా
వేమఱు నొంటిమై దిరుగు వేళలఁ జెప్పు నితండు నిత్యమున్. 901

చ. మఱచినవాఁడు గాఁడు గుణమండన యీతఁడు రామకార్యమున్
గుఱుతుగఁ బెద్దకాలమునకుం దగ మీకృప భూరిసౌఖ్యముల్
దిరముగ నబ్బెఁ గానఁ దమి దీఱక యిన్నిదినంబు లిచ్చటన్
వెరవున జాగు చేసె నిది నేరముగాఁ గొన నీకుఁ బాడియే. 902

చ. క్షితివరపుత్ర మేనకకుఁ జిక్కి మనోభవరాగమత్తుఁడై
యతులతపోవిశేషమహిమాదికముల్ విడనాడి కానలో
యతి యగుగాధిపుత్త్రుఁడు దశాబ్దము లెన్నఁడె యొక్కపూఁట గా
నతిచపలాత్ముఁడై నతపనాత్మజుఁ డిట్లగు టెంత చెప్పుమా. 903

ఆ. కాయధర్మగతుఁ డకామసంతృప్తుఁడు, వివిధకష్టములను వేఁగి కామ
నిరతుఁడై నరవిజునేరంబు సైరించి, యవనివిభుఁడు గావ నర్హుఁ డధిప. 904

తే. నిశ్చితార్థంబుఁ దెలియక నృపకుమార
ప్రాకృతునిమాడ్కి నీయట్టి భవ్యమతులు
పాప మెంచక భృత్యునిపై నకార
ణముగఁ గోపింతు రయ్య యన్యాయముగను. 905

క. వివిధధనధాన్యవసువులు, ప్లవంగరాజ్యమును రుమను బదపడి నన్నుం
దవిలి నృపతిప్రియార్థము, రవిసుతుఁడు త్యజించు నని తిరంబుగఁ దలఁతున్. 906

తే. అనఘచరిత సుగ్రీవార్థమందు నీవు, సాహసంబును రోషంబు సంభ్రమమును
వేగ విడిచి ప్రసాదంబు వెలయఁ జేయు, మనవి సర్వజ్ఞునకు నీతులాడ వలెనె.
తే. ఇనతనూజుఁడు దశకంఠు నని వధించి, సీతతోఁ గూడ రాఘవుఁ జేర్పఁగలఁడు
పరఁగ రోహిణితోఁ గూడఁ బరమధృతిని, జెలఁగి ప్రాలేయధాముని జేర్చినట్లు.
వ. మఱియు లంకాపురంబునందుఁ గ్రూరకర్ములును గామరూపులు నగు రాక్షసులు లక్షకోటులమూఁడులక్షలయిరువది వేవురు ముఖ్యనాయకు లుండుటయ కాక మఱియుఁ బెక్కులక్షలవారు గలరు వారినందఱ నిర్జింపక దురాత్ముం డగు రావణుం జంప నలవి గాదు గావున సహాయరహితుం డగు సుగ్రీవుచేతఁ గ్రూరకర్ముం డగు రావణుండు రణంబున వధించుటకు శక్యుండు గాఁ డివ్విధంబు నీకెట్లు విదితం బయ్యె నంటివేని యంగదోక్తరామసుగ్రీవసఖ్యకరణవృత్తాంతశ్రవణానంతరంబున మద్వల్లభుం డైన వాలి రావణునిబలాధికత్వం బుగ్గడించి మహాబలపరాక్రమరావణనిరసనవిషయంబునందు నన్ను విడిచి దుర్బలుం డైన సుగ్రీవు నెవ్విధంబున నవలంబించె రాఘవుం డని నాతోడం జెప్పెఁ దత్ప్రకారంబు నీతోడ విన్నవించుచున్నదానఁ దత్సహాయనిమిత్తంబు సమస్తదిక్కులం గల వానరయూథపులం దోడ్తెచ్చుటకు వేగవంతు లగు వానరులు చని యున్నవారు సుగ్రీవుం డుద్గ్రీవుం డై వారిరాక కెదురుసూచుచున్నవాఁడు మున్ను పల్కిన చందంబునఁ బ్రతిజ్ఞాతత్పరుం డగు నితండు బలంబులం గూర్చుకొని రాముని యర్థసిద్ధికొఱకు సముత్సాహసమేతుం డై యిప్పుడ నీతోడం జనుదెంచు నతనిం బరివేష్టించి భల్లూకకోటిసహస్రంబులును గోలాంగూలశతంబులును మఱియు ననేకకోటివానరులును బఱతెంచెద రిప్పుడు కోపం బుపసంహరించి ప్రసన్నముఖుండవు గమ్ము కోపసంరక్తలోచనప్రభావీచీసమీచీనం బైన భవన్ముఖంబు నవలోకించి హరివరకాంత లెల్ల వాలివధజనితభయశంకితు లై శాంతినొందక యున్నవా రని పలికిన నత్తారవచనంబు విని లక్ష్మణుండు మృదుస్వభావుం డై కోపంబుఁ బరిత్యజించె నప్పుడు శాంతుం డైన సౌమిత్రి నవలోకించి సుగ్రీవుండు శిథిలవస్త్రంబుం బోలె నతనివలనిభయంబు విడిచి కంఠలగ్నం బైన బహుగుణవిచిత్రదివ్యమాల్యంబు పరిత్యజించి పానమదంబునం దేఱి పరమానందకందాయమానమానసుం డై ప్రశ్రితం బగు వాక్యంబున ని ట్లనియె. 909

—సుగ్రీవుఁడు లక్ష్మణుని ననునయించుట.—

క. అనఘా రాముని కృప నీ, యనుపమరాజ్యంబు శాశ్వతైశ్వర్యంబుల్
ఘనరత్నవస్తువాహన, ధనవసువులు మరలఁ గలిగె ధన్యుఁడ నైతిన్. 910
క. పన్నగ రాముఁడు నాకు సమున్నతిఁ గావించినట్టి యుపకృతికి మహీ
భృన్నందన ప్రత్యుపకృతి, యెన్నిక కెక్కంగఁ జేయ నే శక్తుఁడనే. 911
తే. మనుజశేఖరుఁ డాత్మకర్మములచేత, నధికవిఖ్యాతుఁ డగునట్టి యవ్విభునకు

ధాత్రిఁ బ్రతికార మొనరింపఁదగినయట్టి,నిపుణుఁ డెవ్వఁడు లేఁడింతనిక్కువంబు.

సీ. అనఘాత్మ యొకబాణమున నేమహాత్ముండు సప్తమహామహీజముల గిరిని
ధరణిని భేదించె నుతియు నెవ్వని ధనుర్జ్యానిస్వనంబున జగతి యెల్లఁ
గంపించె నట్టిరాఘవునకు నొకనిసాహాయ్య మేల నిమిత్త మంతె కాక
తోడరి సహాయమాత్రుఁడ నైన ననుఁ గూడి నిజతేజమున వైరినేర్పిఁ జంపి

తే.జనకపుత్రిని జేకొను సత్యముగను
బంధుయుతముగ రావణుఁ బరిభవించు
టకుఁ జమూసంయుతుండ నై ప్రకటభంగి
రాఘవునివెంట వచ్చెదఁ బ్రాభవమున. 913

వ. ప్రేష్యుండ నైన యేను బ్రణయవిశ్వాసంబులవలన నొక్కింత యపరాధంబు గావించిన నది యంతయు రఘువల్లభుండు సహింప నర్హుం డగు నని పలికిన మహాత్ముం డగుసుగ్రీవునివచనంబులు విని లక్ష్మణుండు ప్రీతచేతస్కుం డై ప్రేమాతిరేకంబున ని ట్లనియె. 914

క. నాథుఁడ వగునీచే రఘు, నాథుండు సనాథుఁ డయ్యె నగచరవర్యా
సాధారణముగ రాజ్య, శ్రీధనభోగములు గుడువఁ జెల్లు న్నీకున్. 915

లక్ష్మణుఁడు శాంతుం డై సుగ్రీవునిఁ బొగడుట.

ఆ. శౌర్యవంతుఁ డైనజనపతి నీదుసా,యమును బొంది దారుణాజిభూమి
నిఖిలదనుజవరుల నిర్జించి నిజముగఁ, బుడమిక న్నె నింకఁ బడయఁ గలఁడు. 916

వ. మహాత్మా ధర్మజ్ఞుండవు కృతజ్ఞుండవు నమరానివర్తి వగునీవాక్యం బుపపన్నం బై యున్నది రాముండును నీవునుం దక్క నన్యుఁ డెవ్వం డిట్టియుక్తియుక్తం బైన వచనంబుఁ బలుక నేర్చు బలపరాక్రమంబులచేత నీవు రామునకు సరి వచ్చు వాఁడవు రఘుపుంగవునకు నీసాహాయ్యంబు పెద్దకాలంబునకు దైవసంఘటితం బై చేకూడిన యది శీఘ్రంబున నింక నాతోడం జనుదెంచి భార్యాహరణకర్శితుం డై యున్నరామునిం బ్రణయసల్లాపంబులం దేర్పుము. 917

క. జనవిభునికోపతాపముఁ, గనుఁగొని మదిఁ దాల్మి నిల్పఁ గా లేక నినుం
గనలి పరుషోక్తు లాడితి, నినతనయా కరుణచే సహింపుము దానిన్. 918

వ. అని యన్యోన్యప్రణయవచనంబుల మైత్రిం బ్రకటించుచు సరి లేనిసౌహృదం బులం బొల్చి యుండిరి పదంపడి కార్యవిచారతత్పరుం డై సుగ్రీవుండు నిజపార్శ్వవర్తి యగుహనుమంతు నవలోకించి. 919

సుగ్రీవుఁడు నానాదేశములనుండు వానరులరావింపుమని హనుమంతున కాజ్ఞాపించుట.

సీ. వింధ్యాచలమునందు వృషభపర్వతమందు మందరగిరియందు మలయమందు
మేరుశైలమునందుఁ బారియాత్రమునందు శంకరగిరియందు సహ్యమందు
హిమశైలమందు సింహమహీధరమునందు హరిశైలమందు నీలాద్రియందుఁ

బ్రాకపర్వతమునందుఁ బశ్చిమగిరియందు ధూమ్రాద్రియందు దుర్దురమునందు

తే. మఱియు నానాటవీద్వీపశరధిసీమ, గానరానరకటకసంకటములందు
వసతిఁ గావించి యున్నదుర్వారబలుల, వృక్షచరులను వేగ రావింపు మనఘ.

శా. ధీరోదాత్తుల సింహవిక్రముల నుద్దీప్తప్రతాపాఢ్యులన్
వీరోత్తంసుల మేఘవర్ణుల జగద్విఖ్యాతశౌర్యోల్లస
ద్ఘోరాకారుల వానరప్రవరుల న్దోడ్తేరఁగా మున్నె సొం
పారం జారులఁ బుచ్చినాఁడను సమస్తాశావకాశంబులన్. 921

క. నావచనంబున నీవును, భూవల్లభుకార్యసిద్ధి పొందెడుఁ బ్లవగులన్
ధీవిలసితులను దొల్లిఁటి, త్రోవల నెసఁ బుచ్చు మిటకుఁ దోడ్తెచ్చుటకున్. 922

వ. మఱియుఁ దరుణాదిత్యవర్ణులును గాంచనాచలసంకాశులును నీలజీమూతసన్నిభులును భీమకాయులును బద్ధతాళవనవాసులును గుంజరప్రతిమాజులును మనశ్శిలాగుహావాసులును గనకప్రభులును దాపసాశ్రమనిలయులును దీర్ఘసూత్రులును మధుమైరేయాసవగంధసంవాసితముఖులు నగువీరవానరుల సామదానాద్యుపాయంబులచేతఁ దోడి తెచ్చుటకు నేర్పరు లగుగతిజ్ఞుల మదీయశాసనంబునం బుచ్చుము వా రామున్న పంపఁబడిన దూతలు వేగరపఱిచి కామప్రసక్తులై దీర్ఘసూత్రు లగువనచరుల నందఱను శీఘ్రంబునఁ దోడ్కొనివచ్చువారుగా నాజ్ఞాపింపుము 923

క. పదిరాత్రములకు నెవ్వఁడు, మనయుతోఁ డై రాక యచట మసలు నతఁడు పె
ట్టిదముగ నాచే మిక్కిలి, పదపడి హంతవ్యుఁ డనుచుఁ బలుకుము వీటన్. 924

క. పొలివోవ కుండ జగతిం, గల వానరు లెల్ల రామకార్యార్థముగా
బలదర్పములు సెలంగఁగఁ, గలసి మెలసి వచ్చువారుగాఁ జేయు మొగిన్. 925

క. నా విని మరుత్తనూజుఁడు, భూవరుకార్యంబుపొంటె భూరిబలుల ను
శ్రీవిభవయుతులఁ గీశుల, ధీవరులను వేగ నెల్లదిక్కుల కనిచెన్. 926

ఉ. పంపిన వారు తీవ్ర యగుభానుకుమారునియాజ్ఞ నుర్వి కం
పింపఁగ నప్పుడే కదలి భీషణభంగి నభోంతరంబునన్
గుంపులు గట్టి పోయి వనగోత్రపయోధినివాసుల న్నమి
ల్లంపటుల న్వనాటుల విలంబము లేక నృపాజ్ఞ దెల్పినన్. 927

ఉ. వారును మృత్యుతుల్యుఁ డగువారిజమిత్రకుమారునానతి
న్మీఱఁగ లేక బంధుసుతమిత్రసహోదరయుక్తులై రయం
బారఁగఁ దక్షణంబ భయబార్భటు లొప్ప నభగప్రచారులై
భూరిజవంబునం గదలిపోవఁ దొడంగిరి రాజువీటికిన్. 928

సమస్తదేశముల నుండువానరులు కిష్కింధకు వచ్చుట.

చ. ఉడుగక యంజనాచలము నుండి నవాంజనసన్నిభాకృతుల్

దృఢతరబాహువీర్యు లతిధీరులు కాంచనశైలసన్నిభుల్
కడువడి మూఁడుకోట్ల ప్లవగప్రవరుల్ రవిపుత్త్రువీటి కిం
పడరఁగ నేగుదెంచి రపు డద్భుతభంగి దివంబు ఘూర్ణిలన్. 929

చ. ప్రతిదివసాంతమందును బ్రభాకరుఁ డచ్చట నస్తమించు నా
క్షితిధరకోటిపై నునికిఁ జేయుచు నున్న సువర్ణవర్ణు ల
ప్రతిమపరాక్రము ల్గిరివరప్రతిభు ల్దశకోటివానరుల్
ధృతి సెలఁగంగ వేగ చనుదెంచిరి సూర్యజురాజధానికిన్. :30

తే. సింహకేసరవర్ణులు సింహబలులు, సింహవిక్రాంతగమనులు సింహసములు
కీశు లొకవేయికోట్లు కిష్కింధ కపుడు, రజతగిరినుండివచ్చిరి రయముమెఱయ.

చ. చలినుల నాశ్రయించి వరుస న్ఫలమూలము లాహరించుచు
న్నొలుపుగఁ దద్గుహాగహనభూములఁ ద్రిమ్మరువారు సంచల
త్కులగిరిసన్నికాశు లొకకోటిసహస్రసహస్రవానరుల్
చలమున నేగుదెంచిరి దళంబుగ భానుజుఁ డేలువీటికిన్. 932

క. ఘోరాంగారకతుల్యులు, దారుణవిక్రములు కపివతంసులు వేగం
బారఁగ సహస్రకోటులు, వారక వింధ్యమున నుండి వచ్చిరి వరుసన్. 938

వ. మఱియు నానావనోపవనగిరిగహ్వరసరిత్సరోవరనివాసులును క్షీరోదవేలానిల
యులును దమాలవనవాసులును నారికేళాశనులును నగువానరు లసంఖ్యేయులు
మార్తాండమండలంబు నిరోధించుచు శీఘ్రంబుగఁ గిష్కింధకుం జనుదెంచి
తత్పట్టణబాహ్యాంతరదేశంబులు నిండి చెలంగి రంత. 934

క. ధరణిఁ గల కపుల నందఱ, వరుసం దోడ్తేరఁ జనినవానరవరు లా
గిరిచరుల కందఱకుఁ గపివరునానతిఁ దెల్పి మరల వచ్చుచుఁ ద్రోవన్. 935

సీ. ఎచ్చట మున్ను మాహేశ్వరం బగుయజ్ఞ మఖిలదేవస్తుత్యమై తనర్చె
నట్టిహిమాచలం బల్లన వీక్షించి యందు దివ్యాన్ననిష్యందజాత
ఫలమూలములు గాంచి యిల నెవ్వఁడెద్దాని నొకమాటు భుజియించి యొక్కమాస
మాఁకటఁ బడకుండు నట్టి దివ్యామృతస్వాదుకల్పము లగుసరసదివ్య

తే. మూలఫలములు నోషధిజాలములును
సురభిపుష్పంబులును గొంచు సురుచిరముగ
యూథపులు శీఘ్రజవమున నుష్ణకరుని
సుతునివీటికి వచ్చిరి సొంపు మీఱ. 936

తే. వచ్చి సుగ్రీవుఁ గనుఁగొని వరుసతోడఁ
దాము దెచ్చినబహుపదార్థంబు లన్ని
కాన్క లర్పించి యంజలికలితు లగుచు
విన్నవించిరి మెల్లన వినయ మెసఁగ. 937

ఉ. దేవరవారియానతి నతిప్రముదంబున నేగి మేము నా
నావిధదుర్గకందరవనక్షితిభృత్సరిదబ్ధిముద్రిత
క్ష్మావలయంబునం గలసమస్తవనాటుల నీదువీటి కేం
తేవడిఁ గార్యముం దెలిపి తోడ్కొని వచ్చినవార మెంతయున్. 938

ఉ. నా విని సంతసంబు వదనంబునఁ గన్పడ నాత్మ కౌతుకం
బావహిలంగఁ దత్కరము లన్నియుఁ గైకొని వారి నెల్ల సం
భావనఁ జేసి వేగ గరిమంబున నిండ్లకు వీడుకొల్పి సు
గ్రీవుఁడు తన్నుఁ జాలఁ గృతకృత్యునిఁగాఁ దలపోయుచున్నెడన్. 939

ఉ. అప్పుడు లక్ష్మణుండు ముద మంది సముత్థితహర్షబాష్పముల్
ఱెప్పల మీటుచు న్శుభచరిత్రుని భానుజుఁ జూచి కౌతుకం
బుప్పతిలంగ రాఘవునియొద్దకుఁ బోదమె యన్న నాతఁ డా
చొప్పున కంత నీయకొని సొంపలరారఁగఁ దత్క్షణంబునన్. 940

తే. ప్రేమఁ దారాప్రభృతికపిస్త్రీలఁ జూచి,యిండ్లకడనుండుఁడని వారినియ్యకొల్పి
కడురయంబునఁ బయనంబుగం డటంచు,నెల్లవానరులకుఁ జెప్పె నింపుమీఱ.

క. చెప్పిన వారు రయంబున, నప్పుడె తమయిండ్ల కరిగి యాండ్రకు మోదం
బుప్పతిల వేగ పయనముఁ, జెప్పి మరల వచ్చి రినజు చెంతకుఁ బెలుచన్. 942

క. వచ్చినవారలఁ గనుఁగొని, మచ్చిక నర్కజుఁడు చాల మన్నించుచు మీ
రచ్చుపడ నింక దివిజు, ల్మెచ్చఁగఁ బ్రస్థానభేరి మొఱయింపుఁ డనన్. 943

సుగ్రీవుఁడు లక్ష్మణసహితుఁడై రామునికడకుఁ బోవుట.

సీ. మేరుమందరవింధ్యదారుణీధరగుహాద్వారంబులను బ్రతిధ్వనులు సెలఁగ
భూరిచండాగ్రవిస్ఫోటితకుంభంబుపగిది బ్రహ్మాండకర్పరము పగుల
వెస నిండఁ గ్రాఁగిన యొసరులచందానఁ బొంగి పయోనిధు ల్నింగి ముట్ట
భూనభోదిగ్వాసిభూతసంతానము ల్వినలేక చెవులలో వ్రేళ్లు చొనుప

తే. దిక్కరులకర్ణరంధ్రము ల్వ్రక్కవాఱ, ధాత్రి కంపింపఁ గాంచనదండములను
వీరవానరపుంగవు ల్వేయిగతుల, మించి ప్రస్థానభేరి వాయించి రపుడు. 944

చ. ఇనసుతుఁ డంతఁ గీశుల నహీనబలాఢ్యులఁ జూచి మీరు మ
ద్ఘనతరదివ్యరత్నశిబికం గొని తెం డని పల్కఁ బోరు గ్ర
ద్దనఁ గొని తెచ్చినం గని ముదంబున లక్ష్మణుఁ గాంచి మీర లీ
యనుపమదివ్యయానము రయంబున నెక్కుఁ డటంచుఁ బల్కనన్. 945

క. ఆసౌమిత్రియుఁ బ్రమదో, ల్లాసంబున దాని నెక్కె నలి రవిజుఁడుఁ బ్ర
త్యాసత్తి మెఱయ లక్ష్మణు, శాసనమునఁ బిదప నెక్కె సముచితభంగిన్. 946

వ. ఇట్లిరువు రేకయానస్థులై. 947

సీ. కనుసీయకోటీరఘటితరత్నప్రభాకాండదీధితులు నీరెండ గాయ
నిరుపమానవిశాలహరిణాతపత్రరోచులు నింగిఁ బండువెన్నెలలు నెఱప
మణిదండచారుచామరరుచు ల్దిక్సతీవసనంబులకు వింతవన్నెఁ బెట్టఁ
బటహాకాహళశంఖపణవవీణావేణుభేరీధ్వనులు మింట బోరుకలఁగ
తే. వందిమాగధజనము లంనంద పొగడ, బలసి చుట్టును వానరబలము గొలువ
రామవిభుఁడున్నచోటికిరయముమెఱయ,జనియెరవిజుఁడుసౌమిత్రిసహితుఁడగుచు
వ. ఇత్తెఱంగునం జని మాల్యవంతంబుసమీపం బగుటయు నాకపిసత్తముండు రఘుసత్తముని దవ్వులం గాంచి తత్తరంబున లక్ష్మణసహితంబుగా నిజయానంబు డిగ్గ నుఱికి. 949
చ. కరములు మోడ్చి ఫాలఫలకంబునఁ జేర్చి సమగ్రభక్తివి
స్ఫురణ దలిర్ప హస్తములు మోడ్చి రయంబున డాయఁ బోయి భా
స్వరతరరత్నదీపితసువర్ణకిరీటనితాంతకాంతిత
త్సురుచిరపాదమూలములు సోఁక ధరం బడి లేవ కుండినన్. 950

— రాముఁడు ప్రణయకోపంబున సుగ్రీవుని దూఱుట. —

క. అప్పుడు రఘుపతి రవిజునిఁ, దప్పక వీక్షించి హస్తతలమున మోదం
బుప్పతిల నెత్తి కనులం, గప్పుకొని దయాసమృద్ధిఁ గౌఁగిటఁ జేర్చెన్. 951
వ. ఇట్లు గారవించి కృతాంజలిపుటులై తనమ్రోల నిలువం బడి యున్నహనుమదాదుల నయ్యైతెఱంగుల సంభావించి యంతఱం గూర్చుండ నియోగించి సుఖాసీనుం డై యున్నసుగ్రీవు నవలోకించి కించిదుదంచితప్రణయకోపంబున ని ట్లనియె. 952
క. ధర్మార్థకామములు మది, నర్మిలి విభజించి కాలమం దనిశంబు
న్నిర్మలమతి సేవించెడు, ధార్మికుఁ డిల రాజనంగఁ దగు నినతనయా. 953
తే. పురమి నెవ్వాఁడు ధర్మార్థముల తెఱంగు, విడిచి కామంబు నెపుడు సేవించు నతఁడు
దీర్ఘవృక్షాగ్రమందు నిద్రించి పుడమి, బడియెడునరాధమునియట్ల చెడుఁ గపీంద్ర.
క. శత్రుల జంపఁగఁ బూనుట, మిత్రులకు హితం బొనర్ప మెయికొనుటయు వ
ర్గత్రయఫలభోక్త యగుట, ధాత్రీపతి కొప్పు నతఁడు ధర్మాత్ముఁ డగున్. 955
తే. అనఘ యుద్యోగవేళ సంప్రాప్తమయ్యెఁ, బుడమి కన్నన న్వేషింపఁబుచ్చుటుడిగి
నాయవస్థఁ దలంపక పాయ కింట, గ్రామ్యసుఖవృత్తి నిట్లుంట కార్య మగునె.
క. నా విని భయభక్తులు మది, నావిర్భవ మందఁగాఁ గృతాంజలి యైసు
గ్రీవుఁడు వినయంబున నర, దేవుని వీక్షించి యులుక దీర్చుచుఁ బలికెన్. 957

— సుగ్రీవుఁడు రాముని వనుయించుట. —

క. క్షితినాయక మీకృపచే, గతలక్ష్మియు గతయశంబు గతరాజ్యము శా
శ్వతసౌఖ్యము గ్రమ్మఱ నా, కతులితముగఁ గలిగె నేఁ గృతార్థుఁడ నైతిన్.

తే. అధిప మీ రానతిచ్చినయట్లు తనకు, మైత్రి నుపకృతిఁ జేసిన మిత్త్రవరులఁ
బూని ప్రతికృతి వెలయింపఁ జేనివాఁడు, అవనిలోఁ బురుషాధముఁ డనఁగఁ బరఁగు.

వ. మహాత్మా మహోపకారి వైననీకుఁ బ్రతికారంబు గావింపనినాఁ డే నట్టివాఁడ నగుటకు సందియంబే మని పలికి తన కెలంకుల నలంకృతులై యున్నకొండఱ వానరులం జూపి వెండియు నిట్లనియె. 960

చ. నరవర నాదుశాసనమునం జని మీకు భవత్ప్రియార్థ మి
ద్ధరఁ గలసర్వదావవసుధాధరసాగరనిమ్నగాదులం
దిరవుగ నున్నకీశుల ననేకసహస్రసహస్రకోట్ల బం
ధురగతి నాదుసన్నిధికిఁ దోడ్కొని వచ్చినవార లెంతయున్. 961

క. కొండఱు వానరు లిప్పుడు, గ్రందుగఁ జనుదెంచినారు రావలసినవా
రంద ఱేఁకఁ బుడమి దిక్కులు, కొండల నుండంగఁ గూడి కొనియొద రిచటన్.

వ. మఱియుఁ గాంతారదుర్గనివాసులును వింధ్యమేరుకృతాలయులును మేరు మందరసంకాశులును మహేంద్రసమవిక్రములును ఘోరదర్శనులును గామరూపులును దేవగంధర్వాంశసంభూతులు నగుయూథపులు కొండఱు శతసహస్ర వానరోపేతులై కొండఱు దశలక్షవనచరసహితులై కొండఱు దశకోటికీశసమన్వితులై కొండఱు శతకోటివలీముఖయుతులై కొండఱు లక్షకోటిప్లవంగసంగతులై కొండఱు శంఖసహస్రశాఖామృగసహాయులై కొండఱు దశార్బుదగిరిచర సంయుతులై కొండఱు దశమధ్యవనచరపరివేష్టితులై కొండఱనంతవింశతికపిసంయుక్తులై కొండఱు త్రింశత్పరార్థహరివీరులం గూడి వచ్చుచున్నవా రొక్క ముహూర్తంబునకు భవత్సాన్నిధ్యంబునుం గూడికొనియెదరు వారు బలపరాక్రమ శౌర్యవీర్యధైర్యసాహసోత్సాహంబుల చేత ముల్లోకంబులనైన నొక్కయెత్తున నోర్చువారు దురాత్ముండైన రావణుని బంధుమిత్త్రపుత్త్రయుతంబుగా రణంబునం బరిమార్చి కల్యాణగుణసమేత యైనసీతం దోడ్తెచ్చి నీకు సమర్పించెద రని పలికిన నిజనిదేశవర్తి యగుసుగ్రీవునివచనంబులకలరి రఘువల్లభుండు వికసితనీలోత్పలంబుపగిది దర్శనీయవర్ణుండై యతనిఁ గరంబుల గాఢంబుగాఁ బరిరంభించి హర్షపులక లెసఁగ మందమధురవాక్యంబుల నిట్లనియె. 963

రాముఁడు సుగ్రీవునిఁ బొగడుట.

సీ. వాసవుఁ డుర్విపై వానలు గురియుట యర్కుండు తిమిరాపహారి యగుట
విధుఁడు శీతద్యుతి వెన్నెల గాయుట జగదుపకారార్థ మగుటఁ జేసి
కడు విచిత్రము గాని కరుణ భవాదృశు లీప్రీతి మిత్త్రుల కుపకృతి యొనర్చు
టది వింత గాదు పద్మాప్తనందన నీవె నాకు మిత్త్రుండవు నాయకుఁడవు
తే. దాతవు వయస్యుఁడవు పరిత్రాత వరయ
నీదుసాయముచే నింక నిఖిలరిపుల

నాలమున నోర్వ దక్షుండ నైతి నిపుడు
ఘనునితోడి సాచివ్యం బకార్య మగు నె. 964

క. ప్రియవాది వైననీ విఁక, రయ మారఁగ నాకు దైత్యరణమునఁ బ్రీతి
న్నయ మొప్పఁగ సాహాయ్యము, దయతోఁ గావింపవలయు దక్షత వెలయన్.

క. సురరిపుఁ డాత్మవినాశము, గోఱక్రై వంచించి సీతఁ గొనిపోయె విభా
కరపుత్ర యనుహ్లాదుఁడు, గుఱుతుగ ము న్నింద్రసతిని గొని చనినక్రియన్. 966

క. ఏ నా రావణు ననిలో, మానుగ నానావిధోగ్రమార్గణతతులం
బూని వధించెద శక్రుఁడు, జానుగ ము న్ననిఁ బులోముఁ జంపినమాడ్కిన్. 967

వ. అని బహుప్రకారంబుల రఘువల్లభుండు సుగ్రీవునితోఁ బగతునిం బరిమార్చు
టకు దగిన తెఱంగున మాటలాడు చున్నసమయంబున. 968

సుగ్రీవుని సైనికు లందఱు రాముని కడ కేతెంచుట.

సీ. ఘనసింహనాదము ల్విని భయంబునఁ బాఱు ఖచరులు డాఁగఁ జీఁకటులఁ జేసి
భూరిభేరీస్వనస్ఫోటితాశాంతముల్ పూయఁగా మిన్నెఱుబురదఁ జేసి
మితి లేని కాందిశీకతఁ జూచునిర్జరకునుమగంధులకు మేల్మునుఁగుఁ జేసి
కడదీవులందుండి నడతెంచుకపులకు జలధులెల్లను గాలినడలు చేసి

తే. లలితకాష్ఠాంగనానముల్లనదురోజ, ములకుఁ బూయఁగ గందవుఁబూఁతచేసి
నిరుపమానోరువీరవానరమహోగ్ర, సైన్యధుతసాంద్రధూళికాజాల మడరె.

వ. అనంతరంబ. 970

చ. ఒకనిమిషాంతరంబునకు నుగ్రకరాళముఖుల్ మహాబలుల్
ప్రకటితబాహువిక్రములు పర్వతతుల్యులు మేఘసన్నిభుల్
క్రకచసమానదంష్ట్రు లతికర్కశదేహులు వానరు ల్దిశా
ప్రకరము భూమియుఁ గగనభాగము నిండి రనేకు లయ్యెడన్. 971

వ. తదనంతరంబ నాదేయపార్వతేయసాముద్రంబు లైనభల్లూకవానరగోలాంగూ
లబలంబు లసంఖ్యాతంబులు చనుదెంచెఁ బదంపడి యూథపులు రాఁదొడంగి
రందు ముందఱఁ బద్మకేసరవర్ణులును దరుణార్కప్రతాపులును మేఘనిర్హ్రాదు
లును శిలీగౌరులును గామరూపులును గామసంచారులును నై. 972

క. మేరుమహీధరనిలయులు, క్రూరమతులు దశసహస్రకోటిప్లవగుల్
ఘోరాకారులు గొలువఁగ, సారబలోదారుఁ డైనశతవలి వచ్చెన్. 973

ఉ. భూరిమహీధ్రశృంగములు భూరుహము ల్కఠినోపలంబు లిం
పారఁగఁ గేలఁ బూని రయమార ననేకసహస్రకోట్లు దు
ర్వారఘరాక్రమక్రములు వానరవీరులు గొల్వ వచ్చె ఖ
ర్జూరవిశంగవర్ణుఁ డినసూనునిమామ సుషేణుఁ డయ్యెడన్. 974

క. అంతం దారుండు రుమా, కాంతాజనకుఁడు సహస్రఘనవానరకో
ట్లెంతయుఁ గొలువఁగ సుగ్రీ, వాంతికభువి కరుగుదెంచె నంతకనిభుఁడై. 975

మ. తరుణాదిత్యనిభాననుండు సుగుణోదారుండు నీరేజకే
సరవర్ణుండు మహాభుజుం డఖిలకీశశ్రేష్ఠుఁ డుద్యత్ప్రభా
కరుఁడున్ పావనిఁ గన్నవాఁడు భయదాకారుండు ధీరుండు కే
సరి వచ్చెన్ బహుకోటివానరు లుదంచద్భక్తిఁ దన్ గొల్వఁగన్. 976

శా. కాలాంభోధరసన్నిభుండు విలసత్కల్పాంతకాకాసుఁడున్
శైలేంద్రప్రతిమానగాత్రుఁడు భుజాసంరంభవిస్ఫారుఁడున్
గోలాంగూలవిభుండు వీరుఁడు గవాక్షుం డప్పు డేతెంచె శౌ
ర్యాలంకారుఁడు వేయికోట్లు కపు లుద్యత్ప్రీతి సేవింపఁగన్. 977

క. తారిరుకోటిసహస్రము, లారయ భల్లూకబలము లర్మిలిఁ గొలువన్
ధీరోదారుఁడు ఘోరా, కారుఁడు ధూమ్రుండు వచ్చెఁ గడురభసమునన్. 978

క. గిరినిభులు ఘోరరూపులు, వరవర్ణులు మూఁడుకోట్లు వానరముఖ్యుల్
కర మనురాగంబునఁ దనుఁ, బరివేష్టింపంగ వచ్చెఁ బనసుఁడు ప్రీతిన్. 979

క. శూరోత్తము లగువానర, వీరులు పదికోట్లు తన్ను విడువక కొలువన్
ధీరుఁడు నీలాద్రిచయా, కారుఁడు నీలుండు వేడుకం జనుదెంచెన్. 980

క. కనకాద్రినిభుఁడు హావ్యా, శనచయసంకాశుఁ డమితసత్త్వుఁడు శూరుం
డనఘాత్ముఁ డైదుకోటులు, తనుఁ గొల్వఁగ గవయుఁ డటకుఁ దడయకవచ్చెన్.

చ. వరుస సహస్రకోట్లు బలవంతులు కీశులు తన్నుఁ గొల్వఁగా
గురుతరవిక్రమక్రముఁ డకుంఠితశౌర్యుఁడు శైలసన్నిభుం
డురుబలశాలి మేచకపయోధరవర్ణుఁడు ఘోరసంగర
స్థిరుఁడు దరీముఖుండు చనుదెంచె దినేశకుమారుపాలికిన్. 982

మత్తకోకిల. కోటికోటిసహస్రసంఖ్యలు ఘోరకీశులు గొల్వఁగా
హాటకాచలసన్నిభాకృతు లశ్విపుత్త్రులు పర్వతో
త్పాటనక్షము లుగ్రరూపులు బంధురార్భటి నద్దెసల్
దూఁటు గట్టఁగ మైందుఁడుం ద్వివిదుండు వచ్చిరి లీలతోన్. 983

క. బలవంతు లైనకీశులు, దళితారులు మూఁడుకోట్లు తను సేవింపం
గులకుధరతుల్యరూపుఁడు, బలవంతుఁడు గజుఁడు వచ్చె భానుజుకడకున్. 984

క. దశకోటిభల్లుకంబులు, విశదంబుగఁ దన్నుఁ గొలువ వీర్యోత్సేకా
వశుఁడు చిరజీవి భానుజ, వశవర్తియు నైనజాంబవంతుఁడు దోఁచెన్. 985

ఉ. అంతకసన్నిభాకృతి యహస్కరతేజుఁడు భూరిశౌర్యవి
క్రాంతుఁడు ఘోరవిక్రమధురంధరుఁ డద్రినిభాంగుఁడుం బ్రభా

వంతుఁడు నూఱుకోట్లకపివర్యులు వే తనుఁ గొల్వఁగా రుమ
ణ్వంతుఁడు వచ్చె మారుతజవంబున భానుకుమారుఁ డుబ్బఁగన్. 986

చ. అలయక యేగుదెంచెఁ గరినాశనితుల్యుఁడు ఘోరవిక్రమో
జ్జ్వలుఁడు సమీరవేగుఁడు నవారితశౌర్యుఁ డుదారవర్ణుఁడుం
గులకుధరాభుఁ డొక్కశతకోటిసహస్రసహస్రవానరుల్
గొలువఁగ గంధమాదనుఁ డకుంఠితసత్త్వుఁడు తత్క్షణంబ[illegible] 987

ఆ. పరఁగ శంఖశతము పద్మసహస్రంబు, ప్లవగబలము తన్ను [illegible] గొలువ
నుగ్రదర్శనుండు యువరాజుపితృతుల్య, వీర్యుఁ డంగదుండు వేగ వచ్చె. 988

క. ఘోరాకారుఁడు ధీరో,దారుఁడు కపులైదుకోట్లు తను సేవింపం
దారాద్యుతితోఁ దారుఁడు, దూరంబున భానుజునకుఁ దోఁచె న్నిగులన్. 989

ఆ. పదునొకండుకోట్లు ప్లవగులు తనుగొల్వ, ఘోరదర్శనుండు కులగిరీంద్ర
సన్నిభుండు నింద్రసంకాశవీరుఁడౌ, నింద్రజాను వచటి కేగుదెంచె. 990

ఆ. కాలమేఘనిభులు కామరూపులు వజ్ర
కల్పు లద్రినిభు లఖర్వబలులు
స్వామికార్యరతులు శతసహస్రాయుత
కపులు గొలువ రంభుఁ డపుడు దోఁచె. 991

క. ధీరుఁడు మహనీయభుజా, సారుఁడు దుర్ముఖుఁడు దోఁచె సరభసభంగిన్
దారుణవీర్యులు కీశులు, ఘోరాకృతు లపుడు రెండుకోట్లు గొలువఁగన్. 992

సీ. పవిసన్నిభస్పర్శపాదఘట్టనమునఁ గొండల శిలలెల్లఁ బిండి గాఁగ
వాలవిక్షేపదుర్వారవాతాహతి ఘోరమేఘము లద్రిగుహల నడఁగ
నూరువేగసముత్థితోరువాతస్ఫూర్తిఁ జెట్టు లన్నియుఁ జాఁప కట్టుపడఁగఁ
బ్రబలవానరవీరభయదకోలాహలార్భటుల బ్రహ్మాండకర్పరము పగుల

తే. వాయువేగులు కీశులు వేయికోట్లు, బలసి తనుఁ గొల్వ నిజముఖజలజమిత్ర
కిరణసందోహవికసితనరవరాస్య, వనజుఁడై తోఁచె పవమానతనయుఁ డపుడు.

తే. చటులగతి సహస్రంబును శతము నూఱు,కోట్లు కీశులతో వచ్చెఁ గొలువ రవిజు
వానరచమూసముద్రజైవాత్మకుండు, కలితరిపువంశవనదవానలుఁడు నలుఁడు.

క. పదికోట్లవానరులు తను, ముదమున సేవింప వచ్చె మున్నాడి జగ
ద్విదితబలుఁ డద్రితుల్యుఁడు, దధిముఖుఁడు విశాలభుజుఁడు తపనజుఁ డలరన్.

వ. మఱియు మహాసత్త్వ లగువినతుండును శరభుండును గుముదుండును వేగ
దర్శియు దుందుభియు విజయుండును సంపాతియు మొదలుగాఁ గలయనేకయూ
థాధిపతు లగణితవీరవానరవాహినీసందోహపరివృతులై చనుదెంచి మాల్యవ
త్పర్వతప్రాంతకాంతారంబులును గిరిసానుగహ్వరంబులును బ్రత్యంతపర్వతం
బులును నధిత్యకోపత్యకాప్రదేశంబులును బలుదెఱంగుల నాచ్ఛాదించి పుడమి

యీనిన తెఱంగున నెక్కడఁ జూచినం దెలిపి యీక లెక్కకు వెక్కసం బై
కోలాహలబహులంబుగా నిండి యుండి రప్పుడు. 996

చ. పసగులు పాఱుచు౯ దగులఁ బ్రాఁకుచుఁ దోఁకలు ద్రిప్పి యాడుచు
న్గఱియలఁ గ్రేళ్లుదాఁటుచు వనంబున డాఁగుచు వల్లికాగృహో
త్కరములఁ జూఱుచు న్ఘనముకై వడి గర్జలు బిట్టొనర్చుచు
న్సురుచిరభంగి నర్కజుని సూరెల నిల్చిరి కీశయూథపుల్. 997

వ. మఱియుఁ గొందఱు యథోచితంబుగా వస్త్రాదికంబు సంకుచితంబు చేసి బద్ధాంజలు లై సుగ్రీవునిం బరివేష్టించి యుండిరి సుగ్రీవుండు త్వరితుం డై యాసమస్తవానరశ్రేష్ఠుల నయ్యై తెఱంగులఁ బ్రణామాలింగనవచోగౌరవాదివిశేషంబులఁ బ్రీతచేతస్కులం జేసి రామునకు సమర్పించి పదంపడి ధర్మజ్ఞుండు గావున బలంబుల నెల్లఁబర్వతనిర్ఝరంబులయందును సమస్తవనంబులయందును యథాసుఖంబుగా విడియ నియమించి మీమీబలంబుల విభజించుకొని తద్రక్షణంబునం దేమఱక యుండుం డని సేనాపతుల కెల్ల నాజ్ఞాపించి ఫాలంబునం గేలు గీలించి రాము నవలోకించి వినయవాక్యంబున ని ట్లనియె. 998

సుగ్రీవుఁడు తనసైనికుల రామునకు నొప్పగించుట.

సీ. నృపవర మద్దేశనిలయు లైనసమస్తకపులు దిక్కుల నుండి గడురయమున
వచ్చిరి వీరు దుర్వారబలాఢ్యులు కామరూపులు భయంకరశరీరు
లమితసంఖ్యాతులు ఖ్యాతకర్మాపదానులు మహాభుజవీర్యకలితు లభయు
లుత్తమవ్యవసాయు లురువిక్రములు దేవదైత్యసన్నిభులు కాంతారచరులు
తే. వీరి నీకింకరులు గాఁగ విశదబుద్ధిఁ
జేకొని బలాబలంబు లస్తోకయుక్తి
నెఱిఁగి తగుభంగి మన్నించి హితము నెఱపి
ప్రాభవంబున నీ వింకఁ బనులు గొనుము. 999

ఉ. అందఱు స్వామికార్యరతు లందఱు భూరివివేకయుక్తు లిం
దందఱుఁ గాలకింకరనిభాకృతు లంద ఱరిందము లక్కరం
బందఱు శత్రులోచనభయంకరమూర్తులు వీరిలోన వీఁ
కం దగువారి సీత వెదకం దగఁ బుచ్చుము రాజశేఖరా. 1000

క. నా విని సంతోషము మది, నావిర్భావంబు నొంద నర్కకులుఁడు సం
భావించి మధురముగ సు,గ్రీవునితో నిట్టు లనియెఁ బ్రియ మలరారన్. 1001

ఉ. ఎచ్చటఁ బంక్తికంఠుఁడు విశృంఖలవృత్తి వసించి యున్నవాఁ
డచ్చటి కేఁగి సీతవిధ మంత యెఱింగి ముదంబు మీఱ వే
వచ్చెదునంతశక్తి గలవానరు లెవ్వరొ నే నెఱుంగ నీ
వచ్చుపడంగ నట్టివిపినాటుల నారసి పంపఁగాఁ దగున్. 1002

క. ఘను లగుకీశులు ముందుగఁ, జని జానకి డాఁచి యున్నచంద మెఱిఁగి వ
చ్చినపిదప బలయుతులమై, మన మరుగుద మధికశక్తి మార్తునిపైకిన్. 1003

ఉ. నీవె సమస్తకార్యములు నేర్పునఁ దీర్పఁగఁ జాలువాఁడవు
న్నీవె నఖండ వాప్తుఁడవు నిర్మలకర్మవిధాయకుండవు
న్నీవె మహీసుత న్వెదకి నిక్కము దేఁ గలవాఁడ వార్యసం
భావిత వేయి యేటి కిఁక భారము నీయది గాదె చూడఁగన్. 1004

ఉ. నా విని సూర్యజుండు వదనంబున మోద మెలర్ప ని ట్లను
న్దేవరవారికార్య మిటు దీర్చుట యే కద నాకుఁ గార్య మీ
రీవిధి నాన తీవలవ దేఁ గడవాఁడను గాను జానకి
న్వే వెదకంగఁ బుచ్చెదఁ బ్రవీణత వానరుల న్రఘూత్తమా. 1005

క. అని పలికి సూర్యతనయుఁడు, తనమనమున ముదము గదుర దశరథతనయు
ల్వినుచుండ ఘనరవార్భటి, వినతుం డనుయూథపునకు వెస ని ట్లనియెన్.

సుగ్రీవుఁడు వినతునిఁ దూర్పుదిక్కునకు సీతను వెదకఁ బొమ్మనుట.

వ. కపివర్యా నీవు దేశకాలనయజ్ఞుండవు కార్యాకార్యవినిశ్చయంబునందునిపుణుం
డవు గమనాగమనవిచారతత్పరుండవు శైలసంకాశుండవు బలవంతుండవు గావున
సోమసూర్యాంశసంభవు లగువారి శతసహస్రవానరులం గూడి హిమాచల
వింధ్యమధ్యగతం బైనయార్యావర్తదేశంబు మొదలుకొని సరిద్గిరివనాకులంబైన
తూర్పుదిక్కునకుం జని యందు జాహ్నవియు సరయువుఁ గౌశికియుఁ గాళిందియు
సరస్వతియు సింధునదంబును శోణనదంబును బరిశోధించి తత్తీరవనంబులును
యామునాదిపర్వతంబులును వెదకి మహిని గాలమహి నిందిలకించి విదేహమాళవ
కాశికోసలమగధపుండ్రవంగదేశంబులు పరీక్షించి యవ్వలఁ గోశకారులపట్టణం
బును రజతాకరభూమియు శోధించి యచ్చటిగిరిశృంగంబులందును వనంబులం
దును నదులయందును వైదేహిని రావణునినిలయంబును విమర్శించి యవ్వల
సముద్రాంతగతంబు లైనపర్వతంబులును వనంబులును బట్టణంబులునుం జూచి
యటమీఁద మందరకోటిసంశ్రితులును గర్ణప్రావరణులు నోష్ఠకర్ణులును లోహ
ముఖులు నేకపాదులును బలవంతులు నక్షయ్యులును గర్ణచూడులును బురుషా
దకులును హేమాంగులు నగుకిరాతులు కాఁపున్నస్థలంబులు విలోకించి యవ్వల
నంతర్జలచరులును ద్వీపవాసులు నామమీనాశనులును ఘోరరూపులును
నరరూపవ్యాఘ్రరూపులు నగుమతికొందఱు కిరాతులు కాఁపున్న దేశంబు
లన్నియుఁ గామరూపు లై వెదకి యవ్వల గిరులచేత లంఘనంబుచేత నుడుపం
బులచేత నధిగమింపం దగినద్వీపాంతరంబు లతిక్రమించి యవ్వల యవద్వీపం
బన నొక్కయుపద్వీపంబు గల దది రత్నవంతంబై సప్తరాజ్యోపశోభితం బై
యుండు దానిని సువర్ణాకరమండితం బగుసువర్ణరూప్యకం బనుద్వీపంబు నతిక్ర
మింపుఁ డవ్వల. 1006

చ. హరిపదచుంబిదీర్ఘశిఖరాన్విత మై సురదైత్యసేవ్య మై
సురుచిరరత్నకందరసుశోభిత మై శిశిరాఖ్యమేదినీ
ధర మలరారుఁ దద్గిరినితంబగుహాగహనప్రపాతగ
హ్వరములయందు వే వెదకుఁ డంచితభంగి మహీకుమారికన్. 1008

వ. అమ్మహాపర్వతం బతిక్రమించి యవ్వల లవణసముద్రంబు దాఁటి తత్తీర దేశంబున సిద్ధచారణసేవితం బై యగాధం బై రక్తజలంబై శీఘ్రగామియై శోభిల్లుశోణాఖ్యనదంబుఁ జేరి రమ్యంబు లైనతదవతరణప్రదేశంబులందును విచిత్రంబు లైన వనంబులందును వైదేహీసహితంబుగా రావణు నన్వేషించి యవ్వలఁ బర్వత సంభూత లైననదులను రమ్యంబు లైనబహునిష్కుటంబులనుదరీమంతంబు లైన పర్వతంబులను వనంబులను వైదేహి వెదకి యవ్వలఁ బ్లక్షద్వీపంబును నుప ద్వీపంబులునుం బరిశోధించి యటమీఁదనూర్మిమంతంబునుమహారౌద్రంబును వాతోద్ధతతరంగమాలాసంకులంబునుగాలమేఘప్రతిమంబునుమహోరగనిషేవి తంబును మహానాదంబు నగునిక్షుసముద్రంబు గనుంగొని దాని నుపాయంబున నధిగమించి యిక్షుసముద్రమధ్యద్వీపంబు లన్నియుఁ బరిశోధింపుఁడమ్మహోదధి యందుఁ గమలాసనశాసనంబున మహాకాయు లగురాక్షసులు దీర్ఘకాల బుభుక్షితు లై నిత్యంబును ఛాయాగ్రాహు లై యుందురు తత్ప్రదేశంబు నుపా యంబున దాఁటియవ్వలఁ గుశద్వీపంబు వెదకి యవ్వల మహాభీమంబును రక్త జలంబు నగులోహితనామసాగరంబును సుధుసముద్రంబు నవలోకించి యవ్వల శాల్మలీద్వీపంబు విలోకింపు డందుఁగైలాసశిఖరసంకాశంబును నానారత్నవిభూ షితంబును విశ్వకర్మనిర్మితం బగునైనతేయునిదివ్యమందిరంబు గలదచ్చట శైల సంకాశులును భీమదర్శనులును నానారూపభయావహులు నగుమందేహనామ రాక్షసులు గాయత్రీప్రభావహతు లై పవలెల్ల మార్తాండకిరణంబుల వేఁడిమికిం గాక సముద్రజలంబులం బడి మునింగి యుండి రాత్రికాలంబున జలంబులు వెడలి వచ్చి గిరిశిఖరంబులందు వ్రేలుచుండుదురు వారినవలోకించుచు నవ్వలసర్పిస్సము ద్రంబును దధిసముద్రంబునుం బరీక్షింపుఁ డటమీఁదఁ బాండురమేఘసంకా శం బై క్షీరసముద్రంబు శోభిల్లు నది మహోర్మిలచేత ముక్తాహారంబు కై వడి నొప్పుచుండుఁ దన్మధ్యభాగంబున దివ్యతరకుసుమవిసరవిరాజితనానాతరువ్రాత సంకులం బై వృషభనామకం బైనయొక్క శ్వేతపర్వతంబు విలసిల్లుఁ దదుపరి భాగంబున విలసితరజతహేమకింజల్కపుంజరంజితశతపత్రవిలీయమానచక్రమ రాళసారసం బై సుదర్శననామసరోవరంబు శోభిల్లు నమ్మహానళినికి సిద్ధచారణ యక్షకిన్నరగరుడగంధర్వోరగసాధ్యాదులు జలక్రీడాతత్పరు లై నిత్యంబు నే తెం తురు తద్విహారకౌశలంబు నిరీక్షించుచు క్షీరసాగరంబు గడచియవ్వలసకలభూత భయావహం బై నశుద్ధోదకసముద్రంబు శోధింపుఁడు తన్మధ్యదేశంబున నౌర్వ కోపసంభూతం బైనహయముఖం బగుతేజంబు నిక్షిప్తం బై వర్తించుచుండు

నమ్మహాతేజంబునకు సంహారవేళయందు సచరాచరం బైనతజ్జలం బింధనంబని
చెప్పుదురు తత్ప్రదేశంబునఁ దద్బడబాముఖంబు గని తదీయవేదన సహింపం
జాలక యాక్రోశించుజలచరభూతంబులయాక్రందనంబు వినఁబడుచుండు నమ్మ
హోదధియుత్తరతీరంబున పదుమూఁడుయోజనంబులపొడవు నంతియవెడల్పు
నుం గలిగి జాతరూపశిలానామకం బైనయొక్కకనకపర్వతంబుగలదాశైలశిఖరా
గ్రంబునబూర్ణచంద్రప్రతీకారుండును సర్వభూతనమస్కృతుండునుబద్మపత్రవి
శాలాక్షుండును నీలాంబరుండును సహస్రశిరుండు ధరణీధరుండు నగునంతదే
వుండనంతమహిమవిశేషంబుననాసీనుండై యుండునమ్మహానుభావునకుఁద్రిశిరం
బైసువర్ణమయంబై నవేదికంబై తత్పర్వతాగ్రసంస్థాపితంబై తాలరూపకేతువు
విలసిల్లు నదిపూర్వదిశావధిత్వంబునఁ ద్రిదశేశ్వరులచేతఁ గల్పితంబయ్యె దాని
విలోకింపుఁ డవ్వలఁ బుష్కరద్వీపమధ్యభాగంబున నఖండప్రభాపటలజటిలం
బై యుదయపర్వతంబొప్పు గగనంబుతో రాయుచు శతయోజనంబులపొడవుగ
లిగి ప్రతప్తకాంచనమయంబై వేదికాసహితంబై యప్పర్వతశిఖరంబొప్పు జాం
బూనదమయంబులును సుపుష్పితంబులును రవిసన్నిభంబులు నగుసాలతాలత
మాలరసాలకర్ణికారంబులు తదుపరిభాగంబున నలరారుచుండు నచ్చటయోజ
నవిస్తారంబును దశయోజనోత్సేధంబును గలిగి జాతరూపమయంబై సౌమనసం
బను వేఱొక్కశిఖరంబు గల దందుఁ దొల్లి దామోదరుండు త్రివిక్రమప్రస్తావం
బునందుఁ బూర్వపదంబుఁ బెట్టి రెండవపదంబు పశ్చిమదిగవధిభూతంబైనసావ
ర్ణినివాసమేరుశిఖరంబునఁ బెట్టె దివాకరుం డస్తమయానంతరంబున జంబూద్వీ
పంబునుత్తరంబునఁ బరిక్రమించి మహోచ్ఛ్రయం బైనతత్సౌమనసశిఖరంబుఁ
బ్రాపించి మేరుదక్షిణభాగవర్తులకెల్ల భూయిష్ఠంబుగాఁగానంబడుచుండు మఱి
యునప్పర్వతశిఖరంబునందు వైఖానసులును వాలఖిల్యులును సూర్యకిరణంబు
లాహారంబుగాఁ గొని సూర్యతేజంబునదిశలువెలుంగం జేయుచుఁదపంబు సేయు
చుండుదురు తన్మహాతేజంబువ్రోల శోభనంబై సుదర్శనాఖ్యం బగుద్వీపంబు
ప్రకాశించుచుండును మేరుశిఖరప్రదక్షిణదక్షుఁ డగుజగచ్చక్షుఁ డెద్దానిం బ్రాపిం
చినమస్తప్రాణులకుఁ గన్నులకు వెలుంగై యుండునప్పర్వతప్రాంతకాంతారకుంజ
పుంజసుందరకందరంబుల వైదేహీసహితంబుగా రావణు నన్వేషింపుఁడు మఱి
యునకాంచనశైలతేజంబునసూర్యతేజంబునసమావిష్టయైపూర్వసంధ్యరక్త
చ్ఛాయం దేజరిల్లు నేకారణంబున నీపృథివికి భువనంబునకుఁ బ్రథమద్వారంబు
గా బ్రహ్మచేత సృష్ట్యాదియందుఁ గల్పితం బయ్యె మఱియు సూర్యపరిభ్రమ
ణంబుకొఱకు మొదల నిది యుదయస్థానంబుగాఁ గల్పితంబయ్యె నకారణం
బుననిదిపూర్వదిక్కనంబరఁగుఁ దత్పర్వతపృష్ఠంబులందు నిర్ఝరంబులయందు
గుహలయందు వైదేహీసహితంబుగా రావణు నన్వేషింపుఁడు తత్పూర్వభాగం
బెల్ల చంద్రసూర్యరహితంబై తిమిరావృతంబై యదృశ్యంబై యింద్రాదిదేవా

వృతంబై యగమ్యంబై యుండు నది తుదిగా నిది మొదలుగా నీనందునం గల
కందువ లెల్ల నరసి సీతారావణులచొప్పెఱింగి యొక్కమాసంబులోనఁ గ్రమ్మఱ
మత్సమీపంబునకుం జనుదెం డంతకు రాక మసలితిరేని తీవ్రం బగుమదీయ
దండంబునకుఁ బాత్రంబు లగుదు రని పలికి వెండియు మార్తాండనందనుం
డి ట్లనియె. 1009

చ. వనచరులార మీ రతిజవంబున నా యెఱిఁగించినట్లు చ
య్యనఁ జని జానకి న్వెదకి యయ్యమఁ గన్గొని రండు వేగ య
త్యనుపమబుద్ధితోడ జనకాత్మజఁ గాంచితి నంచుఁ బల్కువాఁ
డనిశము రాఘవేంద్రకృప కర్హుఁ డగు న్భువనప్రసిద్ధుఁడై. 1010

ఆ. మఱియు నట్టిమేలుమాట చెప్పినవాని, రాజుఁ జేయుదు నగరాజ్య మిచ్చి
యతఁడు పుడమియుండునంతకాలము లోక,పూజ్యుఁడగుచు సిరులఁ బొల్చియుండు.

చ. అని యినజుండు పల్కినఁ దదాజ్ఞ శిరంబునఁ దాల్చి మ్రొక్కి కాం
చనగిరిసన్నిభుండు విలసద్భుజవిక్రమశాలి కాలదే
శనయవిదుండు గంధవహసన్నిభవేగుఁడు సూర్యతేజుఁడు
న్వినతుఁడు వోయెఁ దూర్పునకు వీరవలీముఖసైన్యయుక్తుఁడై. 1012

క. వెండియుఁ దనమనమున మా,ర్తాండసుతుఁడు యామ్యదిశకు నగిగి మహీజ
న్నిండారఁ గాంచి మరల న, ఖండగతి న్వచ్చునట్టికపు లెవ్వరొకో. 1013

సుగ్రీవుఁడు హనుమదాదుల దక్షిణదిక్కునకుఁ బొమ్మనుట.

చ. అని తలపోసి నీలుఁ బవనాత్మజు నంగదునిం గృశానునం
దనుల సుషేణుని న్గజునిఁ దారుని రంభు గవాక్షు గంధమా
దనుని సుహోత్రునిన్ గవయు ధాతృకుమారుని నన్నపుత్రులం
గనుఁగొని చేరఁ బిల్చి తగఁ గంజవనప్రియపుత్రుఁ డిట్లనున్ 1014

చ. కపికులవర్యులార పతికార్యధురంధరులార మీరు బ
ల్నిపుణులు దేశకాలనయనిర్ణయశీలురు గావునం బరే
తపతి వసించు దిక్కునకుఁ దద్దయు వేగముతోడ వీరులం
గపులను గూడి సీత వెదకం జనుఁ డీరఘుభర్త మెచ్చఁగన్. 1015

వ. తన్మార్గక్రమం బెట్టి దనిన నార్యావర్తదేశదక్షిణభాగంబును సహస్రశిరంబును
నానాద్రుమలతాయుతంబు నగువింధ్యపర్వతంబుఁ జేరి యందు సర్వస్థలంబు
నన్వేషించి తత్పర్వతపశ్చిమభాగంబున మహోరగనిషేవితంబు లైన నర్మదా
భోగవతీవరదా మేఖలోత్కలా ప్రభృతినదీనదంబులును దశార్ణనగరంబులును
దక్షిణభాగంబునఁ గృష్ణవేణీమహానదియును ఋషికవిదర్భమాహిషికవంగ
కళింగకాశికవిషయంబులును బరిశోధించి తత్పూర్వభాగంబున సపర్వతనదీ
గుహంబైన దండకారణ్యంబు నెమకి తదంతర్వర్తిగోదావరీఖండంబును విలోకించి

యటమీఁద నంధ్రపుండ్రచోళపాండ్యకేరళదేశంబుల వెదకుచు నయోము ఖం బైనసహ్యాశైలంబు నెమకుఁడ యవ్వల. 1016

చ. సుమితవిచిత్రకాననము సుందరకందరసానుశృంగయు క్తము ఘనధాతుమండితము కమ్రప్రయోజనముల్లసత్సర స్కమలవిహారిమత్తకరికాండము నై మలయాభిధానశై లము తనరారు నచ్చట నిలాతనయుం దిలకింపుఁ డింపుగన్. 1017

ఉ. అమ్మహనీయశైలశిఖరాగ్రమునందు మనోజ్ఞగంధభృ త్కోమలచందనాటవులఁ దోయరుహాసనసన్నిభుండు ని ష్కాముఁడు కుంభసంభవుఁడు సంతతము న్వసియించి యుండు మీ రాముని దివ్యకోపలశుభాంషుళిలకుం బ్రణమిల్లి యంతటన్. 1018

వ. సముచితంబుగా నమ్మహాత్ముని చేత ననుజ్ఞాతు లై యగ్గిరినరంబు డిగ్గి. 1019

ఉ. అమ్మలయాద్రిఁ జుట్టి సముదంచితనూతనపుష్పమాలచం దమ్మున నొప్పుదాని సురతాపససేవిత యైనదానిఁ గెం దమ్మికొలంకులం దనరుదాని ననోదక యైనదానిఁ దీ రమ్ములవృక్షషండములఁ గ్రాలెడుదానిఁ గవేరకన్యకన్. 1020

క. కని తత్తీరవనంబుల, ఘనతరపులినముల నవ్యకాసారములన్ జనకజను బంక్తికంఠుని, వినుతబలోదారులార వెదకుఁడు ప్రీతిన్. 1021

క. అటఁ జని మనోజ్ఞగంధో, త్కటచందనమాలతీలతావిసరసము త్కట యైనతామ్రపర్ణీ, తటినిం గని యాస్రవంతి తరియించి వెసన్. 1022

ఆ. కాంత యైనయువతి కాంతునిఁ బోలె న చ్చోటఁ దామ్రపర్ణి సురుచిరముగఁ దవిలి సాగరంబుఁ గవుఁగిటఁ గదియించు నట్టిదేశ మెల్ల నరసికొనుచు. 1023

వ. అచ్చోటు వాసి హేమమయంబును దివ్యంబును యుక్తంబును ముక్తామణి విభూషితంబు నగు పాండ్యులనగరద్వారకవాటంబు నిరీక్షించుచు నవ్వల సము ద్రంబు దరిసి తత్తీరంబునఁ బున్నాగచందనకేతకీతాలవనంబులు విలోకింపుఁడు తొల్లి మహాత్ముం డగునగస్త్యుండు దేవపూజార్థంబు సంగ్రహించినపుష్పోపహా రంబును వీచికాసందోహంబుల చేత వితథంబుఁ జేసిన నయ్యగస్త్యుండు కోపించి నిస్తరంగుండవు గమ్మని శపించుటయుఁ దచ్ఛాపకారణంబున నాఁటంగోలె సముద్రుండు నిస్తరంగుం డయ్యె నచ్చటి దేశం బంతరంగాభిధానం బనందనరు నట్టిదేశంబున సీత నన్వేషించి యటమీఁద. 1024

సీ. భర్మవిచిత్రంబు ప్రత్యంతపర్వతసంవేష్టితంబు విశాలఫుల్ల వృక్షలతాగుల్మవిసరశోభితము కిన్నరయక్షచారణగరుడసిద్ధ

సాధ్యదివ్యాప్సరోజనతాపసోరగ దేవగంధర్వనిషేవితంబు
నగుము హేమాస్రం బనునగమొప్పు నది బలహరునకుఁ గ్రీడాద్రియగుచువెలయు
తే. నచటి కాదేవవల్లభుం డనుదినంబు, నప్సరోగణపరివృతుఁ డై గడంగి
వేడ్కఁ గ్రీడింప వచ్చుఁ దద్విపులశిఖర,సానువుల నీశ నెరకుఁడుసంభ్రమమున.
వ. అమ్మహాపర్వతం బతిక్రమించి చనుం డవ్వల దక్షిణసము ద్రమధ్యంబున నొక్క యాంతరాళికద్వీపంబు గల దది శతయోజనాయతం బై యుండు నది లంకా ద్వీపం బనాఁ బరఁగు మఱియు నాద్వీపంబు మనుష్యుల కగమ్యం బై యుండు నాదేశంబు దురాత్ముండును వధ్యుండు సహస్రాక్షునకుద్యుతియు రాక్షసేశ్వరుండు నగురావణునకు నివాసం బై యుండుఁగావుననీరువిశేషించి బహుప్రయత్నం బున నచ్చట జానకి నన్వేషింపం దగు మఱియు దక్షిణసముద్రమధ్యంబున నంగారక యన నొక్కరాక్షసి జలంబులలో నుండి నభంబునం జనువారి కాయచ్ఛాయ నొడిసిపట్టి వారిందిగిచికొని మ్రింగుచుండునారాక్షసికిం జిక్కక యవ్వలంజని లంకాద్వీపంబునం గలసర్వస్థలంబులు పరిశోధించి సంశయనీయం బుల నెల్ల నిస్సంశయంబులఁ జేసి నష్టసంశయు లై నరేంద్రపత్ని నన్వేషించి లంకాద్వీపంబు నతిక్రమింపు డవ్వల శతయోజనంబుల దవ్వుల సముద్రమధ్యం బునఁ బుష్పితకనామకం బైనయొక్కపర్వతంబు గల దది సిద్ధచారణసేవితంబై చంద్రసూర్యాంశునకాశంబైసాగరాంబుసమావృతంబై గగనచుంబిశిరస్సహ స్రకలితం బై యొప్పునన్నగంబున నొక్కహేమశిఖరంబున సూర్యుండును వేఱొక్కరజతశిఖరంబునం జంద్రుండును బ్రకాశించుచుందురుదు కృతఘ్ను లకు నృశంసులకు నాస్తికుల కన్నగం బగోచరంబై యుండునగ్గిరికి నమస్కరించి యందు జానకి నన్వేషించి యచ్చోటు వాసి. 1026
సీ. సురవరులకు నైనఁ జొరరాని క్రోవల నరిగి యవ్వలఁ బొంద నలవి గాని దాని నొప్పుగఁ జతుర్దశయోజనాయతం బగుదాని సూర్యవదాఖ్య మైన ధరణీధరముఁ గాంచి దాని మెల్లన దాఁటి వైద్యుతం బనుగిరివరముఁ జేరి యందెప్పుడును మనోహరములై బహుకామఫలవృక్షములుచాలనలరుచుండు
తే. నచటిమధువులు వెసఁ గ్రోలి యమృతకల్ప
మూలఫలములు భుజియించి ముదముతోడఁ
దద్గుహాసానువులఁ గొంతదడవు విశ్ర
మించి యప్పర్వత మతిక్రమించి చనుఁడు. 1027
వ. కొండొకదూరంబున శక్రధ్వజాకారం బైనకుంజరపర్వతంబు గల దకొండ చూపరుల కతివిస్మయకరంబై యుండు నందు విశ్వకర్మనిర్మితం బైనయగస్త్య భవనంబు విలసిల్లు నది యోజనవిస్తారంబును దశయోజనోచ్ఛ్రితంబును గాం చనమయంబును నానారత్నవిభూషితంబును దివ్యంబు నై శోభిల్లు మఱియునందు విశాలకక్ష్యంబును దుర్ధర్షంబును దీక్ష్ణదంష్ట్రమహావిషఘోరపన్నగసురక్షితం

బును రమ్యంబును భోగవతీనామకం బైనసర్పాలయం బున్నది యందు మహాప్రాజ్ఞుం డగువాసుకి యనుసర్పరాజు నివసించి యుండు నప్పట్టణంబున సర్వస్థలంబుల వైదేహి నన్వేషించి యాపురి నతిక్రమించి యవ్వల విచిత్రంబు లగు పర్వతారణ్యంబులు విలోకించుచుం జను డవ్వల రత్నమయంబును శ్రీమంతంబును దేవగంధర్వనిషేవితంబును వృషభాకారసంస్థితంబునగువృషభనామపర్వతంబు గల దందు గోరోచనాసదృశవర్ణంబును బద్మదళసమానవర్ణంబును గుంకుమతుల్యవర్ణంబును దమాలపత్రనిభవర్ణంబును వహ్నిసంకాశవర్ణంబును దివ్యంబు నగుచందనవనంబు శోభిల్లు నది యెవ్వరికిం దేటిచూడ నలవిగాక యుండు దాని స్పృశింపవలదు రోహితనామకు లైనగంధర్వులు నిత్యంబు నవ్వనంబును రక్షించు చుండుదురు మఱియు శైలూషగ్రామణీశిగ్రుశుభ్రబభ్రులనంగా నేవురు గంధర్వపతులు సూర్యసమప్రభు లై నిత్యంబునుం గ్రీడించు చుండుదురు రవిసూర్యాగ్నిశరీరు లగుపుణ్యకర్ముల కది నివాసం బై యుండుమఱియుఁ బృథివి కవధి యై యుండు నవ్వల సుదారుణం బైనపితృలోకంబును గష్టతమశ్ఛన్న యైనదై వస్వతునిరాజధానియు శోభిల్లుం గావున నచ్చోటు మీకు దుష్ప్రవేశం బై యుండు నాచెప్పిన సర్వస్థలంబులను నాచెప్పని చోట్లను జానకి నన్వేషించి శీఘ్రంబునం జనుదెం డెవ్వండు మాసంబులోన సీతం జూచి వచ్చితి నని పలుకు నతండు మత్తుల్యవిభవుం డై భోగంబు లనుభవించుచు సుఖి యై విహరింపఁ గలం డతనికంటె నన్యుండు నాకుఁ బ్రియుండు లేఁ డతండు ప్రాణంబులకంటె గరీయుం డై యుండు నతం డెంతయపరాధంబు చేసిన వధ్యుండు గాక యుండు మీరు బలపరాక్రమయుతులును గులశీలంబులం బ్రసిద్ధి కెక్కినవారును గావున నేయుపాయంబున నైన సీతం గనుంగొని కృతార్థు లై నన్నుఁ గృతార్థునిం జేసి పురుషార్థంబు దక్కించు కొనుండు. 1028

—సుగ్రీవుఁడు సుషేణమారీచుల పశ్చిమదిక్కునకుఁ బో నియమించుట.—

క. అని హనుమదంగదాదిక, వనచరవీరులను వేగ వైవస్వతుది
క్కునకుఁ జానకి వెదకఁగ, జనుఁ డని నియమించి తపనసంభవుఁ డంతన్.

ఆ. తారతండ్రి ఘనునిఁ దనమామ భీమవిక్రముని మేఘనిభుని విమలయశుని
వీరు నింద్రతేజు వినతాసుతసమాన, శీఘ్రవేగు నలసుషేణుఁ గాంచి. 1030

వ. నమస్కరించి పదంపడి మహేంద్రతుల్యవిక్రముండు నర్చిష్మంతుండును ఘోరవానరపరివృతుండును మహాబలుండు నగుమరీచిపుత్రుం డైనమారీచుం డను వాని నవలోకించి మీ రిరువురు మహాబలు లై నమరీచిపుత్రు లగుమారీచుల రెండులక్షలఁ బ్లవంగవీరులంగూడి యార్యావర్తదేశంబు మొదలుకొని పశ్చిమదిగ్భాగంబునకుం జని సురాష్ట్రబాహ్లీకశూరసేన దేశంబులు వెదకి తత్తద్విషయసంస్థితంబు లైననానావిధపట్టణంబులునుం బరిశోధించి వకుళోద్దాలకాకులంబును బున్నాగగహనంబు నగుకుక్షి యనుదేశవిశేషంబు పరీక్షించి యచ్చటఁ

కేతకీషండంబుల నారికేళవనంబులం దిలకించి మఱియుఁ బశ్చిమవాహిను లగు శీతసలిలపూర్ణ నదీనదంబులఁ దాపసారణ్యంబులఁ గాంతారదుర్గంబుల గిరిసాను కందరంబులఁ జానకి నన్వేషించి దుర్గంబు లగు పర్వతంబుల శోధించి యచ్చట మరుప్రాయంబు లగు స్థలంబు లన్నియు వీక్షించి యవ్వలఁ దిమినక్రఝషాకులం బైన పశ్చిమసముద్రంబుఁ జేరి యచ్చటఁ గేతకీషండంబులఁ దమాలగహనంబుల నారికేళవిపినంబుల మఱియు వేలాతటనివిష్టంబు లగు పర్వతకాననంబుల నైదేహి నన్వేషించి పశ్చిమసముద్రమధ్యంబున మురచీపట్టణంబును జటీపురంబు నవంతియు నంగలోపయు మొదలుగాఁ గల విశాలంబు లగు పట్టణంబులును రాష్ట్రంబులు నలక్షితం బను వనంబును సింధుసాగరసంగమంబును నిరీక్షింపుఁడా సింధుసాగరసంగమప్రదేశంబున నూఱుశిరంబులు గలిగి మహోన్నతతరుప్రాంతంబుల కాకరం బై మహోన్నతం బైన హేమగిరి యను నొక్కపర్వతం బొప్పు రమ్యంబు లైన తత్పర్వతప్రస్థంబులందు సపక్షంబు లగు సింహంబులు తిమిమత్స్యగజంబుల స్వనివాసస్థానభూతస్ఫుటాగ్రకులాయంబులకుం దోడ్కొని చని కలసి మెలసి విహరించుచుండు విశాలం బగు తోయపూర్ణస్థలంబునం దున్న గజంబులు గిరిశృంగగతంబు లగు గజంబులును సింహనీడాశ్రయసానువులయందు విహరించుచుండు నప్పర్వతశృంగంబు గగనంబుతో రాయుచుఁ జిత్రపాదపం బై కాంచనమయం బై యొప్పు నందుఁ గామరూపు లై సీత నన్వేషింపుఁ డవ్వల సముద్రమధ్యంబున శతయోజనప్రమాణంబు గలిగి సువర్ణచ్ఛాయలం దేజరిల్లుచు నెవ్వరికిం జొరరాక పారియాత్రపర్వతకోటి విలసిల్లు నందు బలవంతులును ఘోరాకారులును గామరూపులును వహ్నిసంకాశులు నగు చతుర్వింశతికోటి గంధర్వులు తదీయదివ్యామృతకల్పస్వాదుమూలఫలంబులం గాచికొని యుందురు వారందఱు దురావాసులును దుష్ప్రసహులును దురాసదులు నై యుందు రవ్వనంబులోనుండి యొక్క ఫలం బైనఁ దెచ్చుటకు మీకు శక్యంబు గాదు వారిచెంతఁ జేరక యచ్చోట సీత నతిప్రయత్నమున నన్వేషింపుఁడు వారివలని భయంబు మిమ్ముఁ జెందకుండు మఱియు నా పశ్చిమసముద్రమధ్యంబున వైడూర్యవర్ణసంకాశం బై వజ్రసంస్థానసంస్థితం బై నానాద్రుమలతాకీర్ణం బై శ్రీమంతం బై శతయోజనప్రమాణం బై వజ్రం బను పర్వతం బొక్కటి చంద్రమండలసంకాశం బై యొప్పుఁ దద్గుహాగహనదేశంబుల నప్రమత్తులై యతిప్రయత్నంబున జానకి నన్వేషింపుఁ డటమీఁద. 1081

క. హరిచందనకల్పతరూ,త్కరశోభితరత్నసానుకటకశిఖర మై
శరనిధి నాలవపాలై, వఱలు నొకనగంబు చక్రవంతం బనఁగన్. 1082

క. అట ఘోరవహ్నికీలా,చటుల మగు సహస్రకోటిచక్రము రక్షో
భటనాశనార్థము సము,త్కటముగ మును విశ్వకర్మ గావించె రహిన్. 1083

క. దానిం గొని పంచజనుఁ డను, దానవు హయముఖునిఁ జంపి తత్కుక్షిగతం

బైనఘనపాంచజన్యము, మానుగ విష్ణుండు గొనియె మహిమ దలిర్పన్. 1034

క. ఆనగకందరముల నా, నానిర్ఝరరత్నసానునళినీకటకో
ద్యానంబుల వైదేహిని, దానవునిలయంబు వెదకఁదగు మీ కచటన్. 1035

వ. మఱియు నగాధం బగువరుణాలయంబునందు సువర్ణశిఖరం బై చతుష్షష్టి యోజనంబుల తనర్పు గలిగి వరాహనామకం బైనపర్వతంబు గల దందు జాతరూపమయం బై ప్రాగ్జ్యోతిషం బనుపురంబు శోభిల్లు నందు దుష్టాత్ముండగు నరకుం డనురాక్షసుండు నివసించి యుండు నచ్చటివిచిత్రసానువులును విశాల కందరంబులును బరిశోధింపుఁ డప్పర్వతంబు గడచిననవ్వలఁ గాంచనాంతరనిర్ఝరంబును నానాప్రస్రవణయుతంబును సర్వసౌవర్ణంబును సహస్రధారాపరివృత శిఖరంబును నభ్రంకషంబును నై మేఘవంతం బనుపర్వతంబు గల దందు గజవరాహసింహవ్యాఘ్రంబులు స్వకీయనాదోత్పన్నప్రతిధ్వనిచేతదర్పితంబులై యప్పర్వతకందరంబులయందు గర్జించు చుండు మఱియు శుకపికశారికామయూరసంఘంబులు శ్రవణసుఖంబుగా మధురధ్వనులు సేయుచుండు నన్నగోపరి భాగంబునఁ దొల్లి పాకశాసనుం డగుమహేంద్రుండు సురగణంబులచేత నభిషిక్తుండయ్యె నట్టిశైలంబు దాఁటిననవ్వలఁ దరుణాదిత్యవర్ణంబులును భ్రాజమానంబులును జాతరూపమయతరులతాశోభితంబులును గాంచనమయంబులు నగు నఱువదివేల కొండలు విలసిల్లు నప్పర్వతంబులనడుమ సర్వపర్వతోత్తమం బైన మేరుపర్వతంబు శోభిల్లు నది ప్రసన్నుం డగుదివాకరునివరప్రసాదమహిమం జేసి సన్నిహితసమస్తవస్తువుల నెల్ల నిజవర్ణదీప్తులచేత దివారాత్రంబును సువర్ణమయంబులుగాఁ జేయుచుండు నగ్గిరియందు వసియించు దేవగంధర్వదానవులు తత్ప్రభామహిమం జేసి నిత్యంబును గాంచనప్రభులై వెలుంగుచుండుదురు దేవతలును విశ్వదేవులును వసువులును మరుత్తులును బశ్చిమసంధ్యోపాసనాపేక్షులై శైలోత్తమం బైన మేరువుం బ్రాపించి విన్నతమానుం డగుసూర్యునిం బూజించుచుండుదురు వారిచేత పూజితుం డై ముహూర్తార్ధంబునకు ద్విశతసహస్రయోజనంబు లప్పర్వతం బతిక్రమించి యాదిత్యుండు సర్వభూతంబుల కదృశ్యుండై యస్తమించు నప్పర్వతశిఖరంబునందు సూర్యసంకాశం బై మహోన్నతం బై ప్రాసాదగణసంబాధం బై నానాపక్షిసమాకులవిచిత్రతరుశోభితం బై విశ్వకర్మనిర్మితం బై వరుణుని దివ్యభవనంబు శోభిల్లు నమ్మేరుశైలాస్తశైలంబులనడుమ విచిత్రవేదికం బై సువర్ణమయం బై దశశిరం బై యొక్కతాలంబు శోభిల్లు నచ్చటి సమస్తదుర్గంబులయందు నదులయందు సరస్సులయందు వైదేహీసహితంబుగా రావణు నన్వేషింపం దగు సావర్ణిమేరుపర్వతంబుమీఁద విశ్వకర్మనిర్మితం బైనయొక్కకాంచనమందిరం బున్నది యందు ధర్మజ్ఞుండును దపస్సంభావితుండును ద్రిలోకవిఖ్యాతుండును బ్రహ్మసముండును సూర్యసన్నిభుండును మహర్షిశ్రేష్ఠుండు నగు మేరుసావర్ణి తేజరిల్లుచుండు నమ్మహాత్ముని

సందర్శించి తచ్చరణంబులకుం బ్రణమిల్లి సీతావృత్తాంతంబడిగి యప్పారంబునం
గలసర్వస్థలంబుల సీత నన్వేషింపుఁడు భాస్కరుండు రజనీక్షయంబునం దుద
యాస్తమయాద్రిమధ్యగతం బై సజీవలోకంబును సర్వంబునుదిమిరహీనంబుగాఁ
జేసి యప్పర్వతంబున నస్తమించు నప్పర్వతంబు గనుక నరుగుటకు మీకు శ
క్యంబై యుండు నవ్వల నభాస్కరం బమర్యాదంబు గావున మీ కగమ్యం బై
యుండు నయ్యస్తాద్రిపర్యంతం బరిగి నాచెప్పినసర్వస్థలంబున జానకి నన్వేషించి
యొక్కమాసంబులోనఁ గ్రమ్మఱ మత్సమీపంబునకుఁ జనుదెం డని పలికి
సుగ్రీవుండు వెండియు వనచరుల నవలోకించి యి ట్లనియె. 1086

క. భూసుతను వెదకి యెవ్వఁడు, మాసములోపలను రాక మసలు నతఁడు మ
ద్భాసురదండమున కనా,యాసంబుగఁ జాలఁ బాత్రమగు నిక్కముగన్. 1087

క. మీకు న్నాయకుఁడై య,స్తోకపరాక్రమధనుండు శూరుం డతిఘో
రాకారుఁ డీసుషేణుఁడు, వీఁకం జనుదెంచు నధికవేగోద్ధతుఁ డై. 1088

ఆ. ఇతఁడు నాకు గురుఁడు హితుఁడు మామయుఁ గాన
నిమ్మహాత్ముతోడ నెల్ల పనులు
తడయ కప్పగించి తద్వశవర్తు లై
యపరదేశ మెల్ల నరసి రండు. 1089

చ. ఘనమతి నెవ్వఁ డుర్విజను గన్గొని గ్రక్కున వచ్చి రామభ
ద్రుని వెత మాన్చి మమ్ముఁ గడు రూఢిఁ గృతార్థులఁ గా నొనర్చు న
వ్వనచరవంశవర్యునకు వారక నే నగరాజ్య మిత్తు న
త్యనుపమభోగభాగ్యయుతుఁ డై సుఖియించు సహర్నిశంబులున్. 1040

ఆ. వినుతబలము కులము వేగంబు తేజంబు, బాహువిక్రమంబు పరహితంబు
గొఱకుఁ గాదె ధాత్రి గుణవంతుఁ డగువాని, కవి విహీన మైన నవియు మేలె.

క. అని పలికి వీడుకొల్పిన, వినుతబలోదారు లమితవీర్యులు త్రిజగ
ద్వినుతు లగుసుషేణాదులు, చనిరి వరుణుఁ డేలు దిశకు జవయుతు లగుచున్.

వ. ఇత్తెఱంగున. 1048

సుగ్రీవుఁడు శతవలి నుత్తరదిక్కున కనుచుట.

క. ఇనజుఁడు సుషేణుఁ బడమట, కనిచి వలీముఖకులాఢ్యుఁ డై శతవలిం
గనుఁగొని యి ట్లని పలికెను, దనకు న్రామునకుఁ గడు హితం బగుభంగిన్. 1044

చ. వనచరవీర నీవు బలవంతుల లక్షవనాటవీరులం
గొని సచివాన్వితుండ వయి కోరి హిమాద్రివతంస మైనయా
ధనదునిదిక్తటంబున కుదగ్రత నేగి సమాహితుండ వై
జనకకుమారి నందు వరుసం బరికింపుము నేర్పు మీఱఁగన్. 1045

ఆ. పుణ్యసాధ్వి యైనభూమికుమారిక, నెట్టు లైన వెదకి యెచట నైనఁ

జూచి వచ్చి విభుని శోకంబు మాన్చుట, తలఁపఁ బుట్టువునకు ఫలము గాదె.

క. సీతను వెదకుట పిదప న,రాతిని సమరమునఁ జంపి రామవిభునకుఁ
బ్రీతి సమర్పించుట వి,ఖ్యాతిగ నివి మన కవశ్యకర్తవ్యంబుల్. 1047

క. తగవు మెఱయ నీకార్యము, నగచరవర సార్థకం బొనర్చితి వేనిన్
జగతి ఋణవిముక్తుల మై, యగణితసౌభాగ్యగరిమ లందెదము రహిన్. 1048

క. ఇనకులవర్యుఁడు రాముఁడు, మన కుపకారంబు చేసె మానుగ మఱియున్
మన మతనికిఁ బ్రతికారం, బొనరింపక యున్న సుకృత మొదవునె చెపుమా.

క. ఉపకారశీలునకు బ్ర,త్యుపకారము ప్రీతితోడ నొనరించిన యా
విపులయశోనిధి మిక్కిలి, విపులం గృతకృత్యుఁ డగుచు వినుతికి నెక్కున్.

క. కావున నాకుఁ బ్రియంబుగ, నీ వాధనదాశ కేగి నేర్పలరంగా
నేవిధమున నైనను రఘు, భూవరుసతి వెదకి రమ్ము పొమ్ము కపీంద్రా 1051

క. ఈనరనాథశిరోమణి, మానుగ లోకముల కెల్ల మాన్యుం డస్మ
న్మానితపుణ్యఫలంబునఁ, దా నిచ్చట దొరకె భూమిధరచరవర్యా. 1052

క. ఈవిపినదుర్గముల నా,నావాహినులం దటాకనళినీనగర
గ్రావసముద్రములందును, వేవేగ మహీకుమారి వెదకుఁడు ప్రీతిన్. 1053

వ. తన్మార్గక్రమం బెట్టిదనిన నార్యావర్తదేశంబు మొదలుగ నుత్తరదిశకుం జనిమ్లేచ్ఛపుళిందశూరసేనవిషయంబులు నిద్రప్రస్థహస్తిపురమద్రదేశంబులును గురుక్షేత్రజనపదంబులును గాంభోజయవనశకారట్టకచీనపరమచీనబాహ్లీకఋషికపారదటంకణవిహారదరదాదిదేశంబులును సారెసారెకునిరీక్షింపుచుఁ దత్తద్దేశసంస్థితపురీదుర్గసరిత్సరోవరగిరిబిలవనస్థలంబులునుం గలయ వెదకుచు హిమవంతంబుఁ జేరి యందు లోధ్రపద్మకమండంబుల దేవదారువనంబుల వైదేహి నన్వేషించి యటమీఁద సోమాశ్రమంబుఁ జేరి యందు జానకిం దిలకించి యవ్వల సానుమంతం బైనకాళం బనుశైలంబుఁ బ్రవేశించి యచ్చటిదరీఝరీగుహాగహనంబుల మహాభాగ యగురామపత్ని నన్వేషించి యప్పర్వతంబు గడచి యటమీఁద సుదర్శననామకం బైనపర్వతంబుఁ జేరి దాని నతిక్రమించి యవ్వల నానాపక్షిగణాకీర్ణంబును వివిధద్రుమభూషితంబును బతగాలయంబు నగు దేవసఖం బనుపర్వతంబున కేగి యచ్చట నిర్ఝరంబుల గుహామధ్యంబుల వైదేహిసహితంబుగా రావణు నన్వేషించి దాని నతిక్రమింపుఁడటమీఁదఁ బర్వతనదీవృక్షహీనంబును సర్వసత్త్వవివర్జితంబున గుశూన్యారణ్యస్థలంబు శతయోజనాయతం బై యుండు నచ్చటం దడయక శీఘ్రంబున దాఁటి పొం డవ్వల. 1054

క. భాసురపాండురశిఖరో,ల్లాసము సురసిద్ధసాధ్యలలనాగణసం
వాసము సువిభాసము కై,లాసము శివపార్వతీవిలాసం బలరున్. 1055

తే. అందుఁ బాండరమేఘాభ మభ్రచుంబి, శృంగయుతము సువర్ణపరిష్కృతంబు

శర్మదము విశ్వకర్మవినిర్మితంబు, నగుకుబేరునిమణినిలయంబు దనరు. 1056

ఆ. అచటఁ గ్రౌంచచక్రహంసకారండవా, కీర్ణయును సువర్ణవర్ణపద్మ
కుముదయును సుపర్వరమణీయుతయు నైన, నళిని యొప్పు స్వాదుసలిలయగుచు.

క. ఆదివ్యభవనరాజం, బాదిత్యులు కిన్నరులును యక్షులు సిద్ధుల్
మోదంబున సేవింపఁగ, శ్రీదుఁడు పాలించు చుండుఁ జిరశుభలీలన్. 1058

క. ఆశైలంబునఁ జంద్రని,కాశము లగుమందిరముల ఘనగుహల వనో
ద్దేశంబుల గిరిబిలముల, దాశరథిప్రియను వెదకఁదగు మీకు రహిన్. 1059

వ. అటమీఁదఁ గ్రౌంచపర్వతంబునకుం జనుఁ డందుఁ దుష్ప్రవేశంబై సుదుర్గమంబై
కుమారశక్తికృతబిలంబు విలసిల్లు నది యెవ్వరికిం జొరుట కశక్యంబై యుండు
నప్రమత్తులై యమ్మహాబిలంబు ప్రవేశింపుఁ డచ్చట సూర్యసంకాశులును దేవ
రూపులును మహాత్ములు నగుమహర్షులు దేవతలచేతం బూజితులై యొప్పుచుం
దురు వారి సందర్శించి నమస్కరించి క్రౌంచపర్వతగుహాగహనసానుశిఖర
నిర్దరనితంబంబులయందు జానకి నన్వేషింపుఁడు తదీయప్రధానశృంగంబున
వృక్షంబను కామశైలంబును విహగాలయం బగుమానసపర్వతంబును శోధిం
పుఁ డవి దేవదానవరక్షోయక్షగుహ్యకాదుల కైన నగమ్యంబులై యుండు
నచ్చటి సర్వస్థలంబులు శోధించి యప్పర్వతం బతిక్రమించి యవ్వల మైనాక
పర్వతంబునకుం జను డందు స్వనిర్మితం బగుమయునిభవనంబు విలసిల్లు నయ్యె
యెడలఁ గిన్నరస్త్రీనికేతనంబులు శోభిల్లుచుండుఁ దత్ప్రదేశంబులను దద్గిరిసాను
కందరంబులను జానకి నన్వేషింపుఁ డటమీఁద సిద్ధసేవితం బగువైఖానసవాల
ఖిల్యుల యాశ్రమంబు గల దందు. 1060

తే. పలువురు తపఃప్రభావసంపన్ను లనఘు, లుత్తములు తాపసశ్రేష్ఠు లున్నవారు
వినయమున వారిఁ జేరి భూతనయవార్త, నడిగి యామంత్రణముఁ గొనుఁ డంతమీఁద.

వ. హేమపుష్కరసంఛన్నంబును దరుణాదిత్యసంకాశహంసకారండవసారసవిచరితం
బు నగువైఖానసం బనుకమలాకరంబు గల దందుఁ గుబేరున కౌపవాహ్యం
బైనసార్వభౌమం బనుదిగ్గజంబు కరేణుసంఘంబులతోఁ గూడి నిత్యంబును
గ్రీడించుచుండు నచ్చట శోధించి దాని నతిక్రమింపుఁడ యవ్వల వ్యోమంబు
నష్టచంద్రదివాకరంబును నక్షత్రగ్రహశూన్యంబును బయోధరవిహీనంబు నిశ్శ
బ్దంబునై యుండు దానినిజతేజోజాలంబున సూర్యప్రభలచేతంబోలె వెలుంగం
జేయుచు నతిశాంత దేవకల్పస్వయంప్రభతపస్సిద్ధమహాత్ము లొప్పుచుందు రా
దేశం బతిక్రమించి యవ్వల శైలోద యనునది గలదు తత్తీరంబునఁ గీచకంబు
లను వేణువులు గలవవి యొండొంటిం బెనచుకొని యుండు నవ్వేణువు లాధా
రంబుగా సిద్ధు లమ్మహానది నుత్తరింపుదురు మీకు తదుత్తరతీరంబుఁ జేరి కృతపు
ణ్యప్రతిశ్రయంబు లగునుత్తరకురుదేశంబులుఁ బ్రవేశింపుఁ డందుఁ గాంచనమయ
నీలవైడూర్యవర్ణపద్మపద్మినీకృతోదక లగునదులు గలవు మఱియు హిరణ్మయ

రక్తోత్పలవనమండితంబులును దరుణాదిత్యసంకాశరక్తాంభోజ వి రా జి త ం బు లును గాంచనమయకింజల్కపుంజరంజితమహార్హమణిపత్త్రచిత్రనీలోత్పలవనసేవితంబులును జాతరూపమయసైకతవిభ్రాజితంబులును నిజాంతర్గుప్తనిస్తులనిస్తలముక్తామణిపూర్ణశుక్తిసంపుటసమలంకృతంబులు నగుకమనీయ క మ లా క రం బులుం గలిగి యుండు మఱియు సర్వరత్నమయవిచిత్రంబులును జాతరూపమయంబులును హుతాశనసమప్రభంబులు నగుపర్వతంబులు శోభిల్లుచుండు నందు నిత్యపుష్పఫలోపేతంబులును సువర్ణపత్త్రవిహంగమశోభితంబులును దివ్యగంధరసస్పర్శంబులును సర్వకామఫలప్రదంబులు నగువృక్షంబులు విలసిల్లుచుండు నచ్చటిభూమి నిస్తృణకంటకయుఁ బాండువర్ణయు నదమలయు విగతబాధయు నారోగ్యవతియు శాద్వలవతియు సర్వకామప్రదఫలవృక్షశోభితయుఁ జారుచామీకరమణిమండితయు సువర్ణమణిగణవిరాజితయు నై యలరు మఱియు బ్రహ్మనిర్మితకల్పవృక్షంబులు శోభిల్లుచుండు నందుఁ గొన్ని కుజంబులు నానావర్ణమృదులాంబరంబులను గొన్ని తరువులు నారీపురుషుల కనురూపంబులై నముక్తావైడూర్యవిచిత్రభూషణంబులును గొన్ని పాదపంబులు సర్వర్తుసుఖసేవ్యంబులను గొన్నినగంబులు చిత్రాస్తరణవంతంబులై నమహార్హవిచిత్రహేమాయతశయనీయంబులను గొన్ని వృక్షంబులు మనఃకాంతంబు లగుమాల్యంబులను గొన్ని ద్రుమంబులు మహార్హవివిధపానభక్ష్యంబులను గొన్ని భూరుహంబులు రూపయౌవనగుణసంపన్న లగుయువతులను నిత్యంబును గురియుచుండు గంధర్వకిన్నరసిద్ధవిద్యాధరులు నిజసుందరీయుక్తులై క్రీడించుచుండుదు రందున్నవా రందఱు సుకృతకర్ములును రతిపరాయణులును ధర్మకామార్థసహితులు నై యాత్మీయకాంతలం గూడి జ్వలద్భాస్కరతేజంబున వెలుంగుచుండుదురు గీతవాదిత్రశబ్దంబును బరస్పరహాసితస్వనంబును సర్వభూతమనోహరం బై సంతతంబును వీతెంచుచుండు నందు సంతోషరహితులు నసత్ప్రియులు లే రచ్చట నహరహంబును మనోహరంబులై గుణంబులు వృద్ధి నొందుచుండు నాదేశంబులయందు సర్వస్థలంబుల సీత నన్వేషించుచు నవ్వలం జను డంత నగాధం బగును త్తరలవణసముద్రంబుమధ్యదేశంబున హేమమయవిచిత్రగుహాసానునిర్ఝరశోభితం బై నసోమశైలం బొప్పునది గగనచుంబిశిరస్సహస్రకం బై యుండు నింద్రలోకంబునకుం జనువారలు బ్రహ్మలోకంబున కరుగువారలు దేవర్షిగణంబు లాగిరి నవలోకించుచుం బోవుచుండుదురు తత్సమీపదేశంబు విగతసూర్యకిరణం బయ్యును నగ్గిరిప్రభచేత సూర్యప్రభచేతంబోలె వెలుంగుచుండు నందు భగవంతుం డగు విష్ణుండు నేకాదశాత్మకుం డై నరుద్రుండును దేవేశుం డగుబ్రహ్మయు బ్రహ్మర్షిపరివారితులై నివసించి యుండుదురు తదద్రిగుహాగహనసానునిర్ఝరకటకగంధర్వభవనంబుల సీత నన్వేషింపుఁ డటమీఁద రవికిరణసంచారంబు లేమిం జేసి

మోఘునిహృదయంబుకరణిఁ దమశ్ఛన్నంబై యజ్ఞాతమర్యాదంబై యుండుఁ
గావున నవ్విలంబు లోక సోమాద్రినుండి గ్రహ్మిలం జనుదెంచు. 1062

క. నాయెఱిఁగించినచోటుల, మీయెఱిఁగినచోటులందు మెయికొని వివిధో
పాయముల సీత నారసి, పాయక నెలలోన రండు ప్లవగప్రవరుల్. 1063

చ. ఘనముగ జానకి న్వెదకి కాంచి రయంబున వచ్చి నాకు రా
మునకుఁ బ్రియం బొనర్చి కడు మోదమున న్సుతగేహినీసుహృ
జ్జనయుతులై ప్రశాంతరిపుసంతతులై భువనప్రసిద్ధులై
యనిశము భోగభాగ్యమహిమాప్తి సుఖించుచు నుండుఁ డెంతయున్. 1064

క. అని పలికిన శతవలి రవితనయునకును రాఘవునకుఁ దద్దయు భక్తి
న్వినతి యొనరించి గ్రక్కున ధనదునిదెస కరిగెఁ గపివితానము గొలువన్. 1065

—సుగ్రీవుఁడు హనుమంతునియందుఁ గార్యసాధనము నిరూపించుట.—

వ. ఇత్తెఱంగున నత్తపననందనుండు రామకార్యార్థసిద్ధికొఱకు బలవంతులైన
వానరశ్రేష్ఠుల నాల్గుదిక్కులకుం బొమ్మని నియమించి మరునందనుం డగుహను
మంతునందుఁ గార్యసాధకత్వంబు నిరూపించి యమ్మహాత్ము నవలోకించి ప్రీతిసం
హృష్టసర్వాంగుం డై యిట్లనియె. 1066

క. తగవును ధర్మము నెఱయఁగ, జగతీనాయకునిపనులు సాధించి ననుం
దగుభంగి నిలిపి నీకు, న్జగములచేఁ బొగడు వడయుసమయము వచ్చెన్. 1067

తే. అనిలనందన ధరణియం దంతరిక్ష, మందు నంబరనందు సురాలయంబు
నందు సలిలంబునందు నీ వరిగి వెదక, దక్షుఁడవు సర్వకార్యవిచక్షణుఁడవు.

క. సురగరుడయక్షకిన్నర, నరవరగంధర్వసిద్ధ నగసాగరసం
భరిత మగుజగత్త్రయమును, హరిశేఖర నీకు విదితమై యుండుఁ గదా. 1069

క. సువిహిత తేజోబలగతి, జవవీర్యములందు నీకు సాటి యొనర్పం
బవమానుఁ డొక్కరుఁడె గా, కనని న్వేఱొకఁడు గలఁడె యగచరవర్యా. 1070

ఉ. సాహసముం బరాక్రమము శక్తియు యుక్తియు సద్వివేక ము
త్సాహము దేశకాలవిహితక్రమము న్వినయంబు నీతియు
న్బాహుబలంబు నీకె తగు మైథిలి నేగతినైనఁ జూచి ర
మ్మోహనుమంత నీవు మది నుంచినకార్యము గాక పోవునే. 1071

—రాముఁడు తనయంగుళీయకమును హనుమంతునిచేతి కిచ్చుట.—

వ. అని సుగ్రీవుండు పలికినయనంతరంబ రాఘవుం డాసుగ్రీవునివచనంబువలన
హనుమంతునియందు సుగ్రీవునిచేతఁ గార్యభారంబు నివేశితం బయ్యె నని
యెఱింగి తానును హనుమంతునిఁ గార్యసాధకునిఁగా నిరూపించి యావానరవల్ల
భుండు మారుతియందు సర్వప్రకారంబుల నిశ్చితార్థుం డయ్యె నాకుం జూడ

నితండు కార్యసాధనంబునందు నిశ్చితార్థకరుం డని తోఁచుచున్నవాఁడు భర్త
చేతఁ బరిగృహీతుండై కర్మంబులచేతఁ బరిజ్ఞాతుండై యొప్పు నితనికిఁ గార్య
ఫలోదయంబు ధ్రువం బగు నని విచారించి వ్యవసాయోత్తరుం డైనయాహను
మంతు నవలోకించి ప్రహృష్టేంద్రియమానసుండై తన్నుఁ గృతార్థునింగాఁ
దలంచుకొనియఖండసంధ్యారాగమండలాంతర్గతమార్తాండమండలంబుం బోలె
ననర్ఘమణిప్రభాపటలజటిలంబై నస్వనామాంకోపశోభితరమణీయాంగుళీయకం
బభిజ్ఞానార్థం బాహనుమంతునకుం జూపి యిది మన్నామాంకిత మైనరత్నము
ద్రిక దీనిం గని జనకనందని మత్సమీపంబున నుండి చనుదెంచినవానిఁ గా
నిన్నెఱింగి నిరుద్వేగయై వివిధసత్కారంబుల నిన్ను సంప్రీతుం జేయు భవదీ
యవ్యవసాయంబును దేజంబును బరాక్రమంబును బలంబును సుగ్రీవుసందేశం
బును గార్యసిద్ధిని సూచింపం జేయుచున్న వని పలికి యద్దివ్యమణిగణకమ్రకిరణ
సముజ్జ్వలం బైనయంగుళీయకం బాహనుమంతునిచేతి కిచ్చి బహుప్రకారం
బుల నాశీర్వదించి కార్యసిద్ధి యయ్యెడు నరుగుమని పంచిన నప్పవనతనయుం
డారత్నముద్రిక శిరంబుననిడికొని యభూతపూర్వశోభావిశేషంబునం బొల్చుచు
ద్విగుణీకృతవీర్యధైర్యశౌర్యసాహసోత్సాహబలవేగతేజోవిశేషుం డై రాముని
చరణంబుల కభివందనంబు గావించి కృతాంజలి యై యనుజ్ఞఁ గొని యంగదా
దులంగూడి దక్షిణదిక్కునకుం జనియె నిట్లు సుగ్రీవుని యుగ్రశాసనంబు శిరం
బులం దాల్చి పూర్వోక్తప్రకారంబున వినతుండు పూర్వదిక్కునకునుదారాం
గదాదిసహితుం డై విగతమేఘం బైనగగనమండలంబునందు విశుద్ధమండ
లుం డై నక్షత్రగణంబులం గూడినచంద్రునిభంగి వెలుంగుచు హనుమం
తుండు దక్షిణదిక్కునకును సుషేణుండు పశ్చిమదిక్కునకును శతవలి యుత్తర
దిక్కునకును ననేకవీరవానరపరివృతులై శలభంబులకరణి భూమి నాచ్ఛాదించు
చు సుగ్రీవోపదిష్టమార్గంబులం జని రప్పు డం దొక్కకపివీరుండు గర్జించుచు
ని ట్లనియె. 1072

క. ఏ నొక్కరుండ కర మభి,మానం బేపారఁ జని యమర్త్యవిరోధిన్
బూని వధియించి గ్రక్కున, జానకిఁ గొని వత్తు రామచంద్రున కిత్తున్. 1073

వ. మఱియు నొక్కవానరపుంగవుండు గంతులు వైచుచు ని ట్లనియె. 1074

క. తడయక యే నొకరుండనె, కడు రయమున నేగి పంక్తికంఠుని ననిలోఁ
గడతేర్చి బాహుదర్పం, బడరఁగ నెచ్చోట నున్న నవనిజఁ దెత్తున్. 1075

వ. వేఱొక్క కీశోత్తముండు సింహనాదంబు సేయుచు ని ట్లనియె. 1076

క. ఇందఱు వానరు లేటికి, మందగతి న్నే నొకండ మానుగఁ జని దై
త్యుం దునిమి రామవిభుఁ డా,నందంబునఁ జూడ జనకనందనిఁ దెత్తున్. 1077

వ. మఱియొక్కవలీముఖశేఖరుం డి ట్లనియె. 1078

క. భూతలనభస్స్థలంబులఁ, బాతాళజగంబునందుఁ బరికించి మహా

ఖ్యాతిగ నెచ్చట నున్నను, భూతనయను దెత్తు మృత్యుముఖమునఁ దక్కన్. 1080

వ. అంత నొక్కమర్కటవీరుం డిట్లనియె.

క. భువి నెవ్వియు నాజవమున, కవరోధము సేయఁ జాల వటుగావున నీ
జవమున శతయోజనములు, ఘనముగఁ జని నెనకి రాముతొయ్యలిఁ దెత్తున్. 1082

వ. మఱియు నొక్కవనచరుండు దర్పావేశంబున ని ట్లనియె.

మ. తరులుం గూల్చెద నాకసంబు పగులన్ దాఁటించెదన్ మేదినీ
ధరము ల్చూర్ణము చేసెద న్భుజగుల న్దండించెద న్వీఁక తో
శరధివ్రాతము నింకఁ జేసెద మహీచక్రంబు ఛేదించెదన్
ధరణీపుత్త్రిని దెచ్చెద న్విభునకు న్భక్తి న్సమర్పించెదన్. 1083

వ. ఇవ్విధంబున మఱియు ననేకు లనేకప్రకారంబుల సుగ్రీవునిసన్నిధియందుఁ
బంతంబు లాడుచు దర్పోద్రేకంబున. 1084

లయగ్రాహి. పేరెములు పాఱుచు విహారములు సల్పుచుఁ గ
రీరములు డాయుచు సమీరచలితక్షో
ణీరుహము లెక్కుచు ఘనారవము సేయుచు శ
రీరములఁ బెంచి పువుటీరముల నందు
ల్దూఱుచు వనంబులకుఁ దారుచు ఘనంబులకు
మీఱుచు నదంబులకుఁ జేరుచు వధీ త్సాం
కారములు సేయుచు విచారములు మాని కపి
వీరులు చెలంగిరి మహీరమణుఁ డబ్బన్ 1085

వ. ఇట్లు బహుగతులం దిరుగుచుఁ గపివీరులు సీతాన్వేషణతత్పరులై తమతమ
దిక్కులకుం జని రంత రఘుపుంగవుండు కపిపుంగవు నవలోకించి విస్మితుండై
యి మ్మహీమండలం బెల్ల నెన్నఁడు సందర్శించితి వని యడిగిన వానరేంద్రునకు
వానరేంద్రుం డిట్లనియె. 1086

సుగ్రీవుఁడు రామునకుఁ దాను భూమండలం బెల్ల సందర్శించినప్రకారం బెఱింగించుట.

సీ. మునువాలి మాయావి యనుదానవునిఁ జంపఁ దలఁకొనిపను రేయిఁ దఱుమవాఁడు
పఱచి శైలబిలంబు భయమునఁ జొచ్చిన బిలమువాకిట నన్ను నిలిపి వాని
తోడనె గుహఁ జొచ్చి యేఁడాది యుండుండె నంత శోణితపూర మాబిలంబు
నిండిన నేఁ జూచి నివ్వెఱపడి వాలి హతుఁ డయ్యె నని కఠినాశ్మ మొకటి

ఆ. బిలముఁ ద్వాత వైచి బిఱబిఱఁ బురి కేగి, విపినచరుల కెల్ల విభుఁడ నగుచు
రుమను దారఁ గూడి సముచితవైభవ, స్ఫూర్తి నెల్లి సిరులఁ బొంగి యుంటి.

ఆ. అంతఁ గొంతకాల మరిగిన నవ్వాలి, పోర దైత్యుఁ జంపి పురికి వచ్చి
ప్లవగరాజ్యభోగభాగ్యోన్నతుండ నై, యున్న నన్నుఁ గాంచి యుగ్రుఁ డగుచు.

క. దానవుఁ ద్రుంచినకై వడి, మానక నినుఁ ద్రుంతు ననుచుమందుచుఁ గవియర్
దీనుఁడనై యే నెంతయు, మానుము మాను మని వేఁడి మానక యున్నన్.

క. బలవంతుఁ డైనవాలికిఁ, దలఁకుచుఁ గిష్కింధ వెడలి త్వరతో మంత్రుల్
గలసి చనుదేఱ విడివడి, నిలుపక దిరిగితిని మేదినీతల మెల్లన్. 1090

వ. ఇత్తెఱంగునం బఱచి వివిధారణ్యనదీనదంబు లన్నియు విలోకించుచు నాదర్శతలసంకాశంబు నలాతచక్రప్రతిమంబు నగుమహీమండలం బెల్ల గోష్పదమాత్రంబుగాఁ గలయం దిరిగి యటమీఁదఁ బూర్వదిక్కునకుం జని యచ్చటివనంబులును నదులును బర్వతంబులును సరోవరంబులును సముద్రద్వీపంబులును విలోకించుచు సముద్రంబు లన్నియు నతిక్రమించి యుదయపర్వతపర్యంతంబుచని యచ్చటనుండి తిరిగి వచ్చి క్రమ్మఱ వాలిచేత నభిద్రుతుండనై యగస్త్యచరితంబైనదక్షిణదిగ్భాగంబునకుం జని వివిధద్రుమభూషితం బైనవింధ్యపర్వతం బాదిగాఁ గల పర్వతంబులును దండకారణ్యాదిమహారణ్యంబులును విలోకించుచు సముద్రద్వీపంబులు గడచి పితృలోకంబుదనుక నరిగి యచ్చటనుండి తిరిగివచ్చి వెండియు వాలిచేత సమభిద్రుతుండ నై పశ్చిమదిక్కునకుంజని యందలినానాదేశంబులు విలోకించుచు నస్తగిరి డాయం జని యచ్చట నుండి మరలివచ్చి పదంపడి వాలిచేత నిరస్తుండనై యుత్తరదిక్కునకుం జని హిమవంతంబు మొదలుకొని మేరుపర్వతంబు దాఁక నరిగి యచ్చటనుండి తిరిగి వచ్చి వాలికిం బ్రవేశింపరాని చోటెందునుం గానక విచారించుచున్ననన్నుంజూచి బుద్ధిమంతుండైన హనుమంతుం డి ట్లనియె. 1091

సీ. కపినాథ మున్నొక్క కారణంబున మతంగుం డనుమునినాయకుండు గినిసి
యిదిమొద లెపుడు సురేంద్రపుత్త్రుఁడు వాలి యీమలయాచలం బెక్కెనేని
కులగిరికైవడిఁ దల నూఱువ్రయ్యలై చచ్చుఁ గాకని ఘోరశాప మిచ్చె
నాశాపభయమున నదిమొద లాకొండ సురనాథసుతుఁ డెక్క వెఱచియుండు

తే. నధిప మన మిప్పు డాకొండనాశ్రయించి,యుంద మచ్చట నొకకీడుఁ జెందదనిన
విని మనంబున హర్షించి జనవరేణ్య, పన్నుగా నాఁటఁగోలె నిం దున్నవాఁడ.

క. నరవర మతంగమునిపతి, పరమకృప న్రిపులవలనిభయము విడిచి యీ
గిరిమీఁద నుండఁ గంటిని, వరమతిఁ గనినాఁడ నాఁడు వసుమతి యెల్లన్. 1093

క. అని చెప్పిన విని దశరథ, తనయుఁడు సంతోష మంది తమ్ముఁడు దానున్
జనకసుత యున్నవార్తను, వినఁ గోరుచు నుండె దినము వేయేఁడులుగన్. 1094

క. జానకిని వెదకుతలఁపున, భానుకుమారోపదిష్టపథసంశ్రితులై
వానరులు నాల్గు దెసలకు, మానసవేగమునఁ జని సమంచితబుద్ధిన్. 1095

చ. కులకుధరంబు లాపగలు ఘోరవనంబులు పట్టణంబులున్
జలధులు ద్వీపముల్ గుహలు సానువు లూళ్లు లసజ్జలాశయం

జేసి యందలిగుహాగహనసరిత్సరోవరవిపులద్రుమశిఖరదుర్గకటకనితంబాధిత్య
కోపత్యకలయందుఁ దిలకించుచు. 1108

క. జనకజను వెదకి కానక, ఘనఫలమూలములు మెసవి కడువేగమునం
జని యచట నొండుదేశముఁ, గనుఁగొని రఘువిభునిసతిని గలయ వెదకుచున్.

వ. ఆదేశంబు దురన్వేషంబై గుహాగహనవంతంబై నిర్జనంబై జలరహితంబై గగ
నంబుపగిది శూన్యంబై రోమహర్షణంబై యుండుట కచ్చెరు వొందుచు నా
దేశం బతిక్రమించి తాదృశంబు లగువనదుర్గంబు లనేకంబులు విలోకించుచుఁ జని
చని యవ్వలఁ బుష్పఫలపర్ణరహితవృక్షంబులును నిస్తోయంబు లగుసరిత్సరోవ
రతటాకంబులును భ్రమరపరివర్జితప్రేక్షణీయసుగంధిస్థలపద్మంబులును గుసుమహీ
నలతావితానంబులును సంఫుల్లకమలోత్పలకైరవవిహీనంబులైన ప్రసన్నసలిలా
శయంబులును విహంగమశూన్యంబులైన నీడంబులును మృగపరిత్యక్తకుంజపుం
జంబులును గలిగి దురాధర్షంబై దుష్ప్రవేశంబై సర్వౌషధీరహితంబై యున్న
వేఱొక్కదేశంబు విలోకించి రది తొల్లి మహాభాగుండును సత్యవాదియుఁ దపో
ధనుండును నియమంబులచేత దుష్ప్రధర్షుండును బరమామర్షియు నగుకండు
వనుమహర్షి షోడశవార్షికబాలకుండైన తనపుత్త్రుం డవ్వనంబునం బ్రణష్టుండైనం
గోపించి యీవనంబు సర్వసత్త్వవివర్జితంబై యగణ్యంబై దురాధర్షంబై యుం
డుఁ గాక యని శపించినకారణంబున నట్టిదయ్యె నవ్విపినంబు ప్రవేశించి యచ్చటి
పర్వతారణ్యనదీనదంబులు విలోకించి యెందును జానకిం గానక వెండియు
సర్వస్థలంబులు శోధించి. 1110

ఉ. రావణు రామభూవిభుని రామను గానక వేగ యమ్మహా
దావము దాఁటి యొండు వసుధాధర ముద్ధతిఁ గాంచి యందు గు
ల్మావృత మైనదారుణగుహం గని యాగుహలోన భీషణ
గ్రావముఖంగిఁ గ్రాలుఘనకాయుని దైత్యునిఁ గాంచి క్రొక్కనిన్. 1111

క. కని వాని డాయఁ బోయిన, ఘనతరకోపమున వాఁడు కన్నుల నిప్పు
ల్చినుకఁగ వానరవీరులఁ, దునిమెదుతమి ముష్టిఁ బూన్చి దోతెంచుటయున్.

ఉ. వచ్చెడురాక్షసాధముని వారక కన్గొని వాలినందనుం
డచ్చుపడంగఁ బంక్తిముఖుఁ డంచుఁ దలంచి మహోగ్రహంబునం
జెచ్చెర హస్తతాడితునిఁ జేసిన నెత్తురు వాతఁ గ్రక్కుచుం
జచ్చి ధరత్రిపైఁ బడె నిశాచరుఁ డొక్కనగంబుచాడ్పునన్. 1113

వ. ఇత్తెఱంగున మారీచతనయుం బరిమార్చి జితకాశు లగునంగదాదులు హను
మత్పురోగములై తద్గుహాభ్యంతరంబు సర్వంబునుం గలయ శోధించి యందు
జానకిం గానక దాని నిర్గమించి క్రమ్మఱ భయావహంబైన వేఱొక్కగిరిగహ్వ
రంబుఁ జొచ్చి యచ్చట బహుప్రకారంబుల వెదకి సీతం గానక వెడలి వెండియు
వనం బంతయుఁ బరిశోధించి యెందునుం గానక. 1114

దప్పి గొని సోలినహనుమదాదుల కంగదుఁ డుత్సాహము కలుగఁజేయుట.

క. సోలుచు దుఃఖభరంబునఁ, దూలుచు వదనములు వాడ దోరపుటూర్పుల్
వ్రాలుచుఁ గపివరు లొకతరు,మూలంబునఁ జేరి చింత మునుఁగుచు నుండన్.

వ. అప్పు డంగదుండు వానరుల నందఱఁ గలయ వీక్షించి మృదువాక్యంబుల మెల్ల
న నాశ్వాసించుచు నిట్లనియె. 1116

చ. నదులును బర్వతంబులు వనంబులు దుర్గములు న్దరీగుహా
హ్రదములు పట్టణంబులు కొలంకులు పల్లెలు తీరదేశముల్
వెదకితి మిందు నెందుఁ బృథివీసుత గన్పడ దయ్యె రావణుం
డదయత నిమ్మహాగిరిగుహాంతరసీమల నెందు డాఁచెనో. 1117

ఉ. మాసము నిండ వచ్చె రుచిమాలితనూభవుఁ డుగ్రశాసనుం
డీసునఁ ద్రుంచి వైచుఁ దడవేటికిఁ దోఁచినయంతపట్టు ధా
త్రీసుత నీగుహాగహనదేశములందు గిరీంద్రకందరా
భ్యాసములందు వేవెదకుఁ డార్తియు శోకముఁ దక్కి ధీరతన్. 1118

తే. వినుఁడు ధైర్యంబు దాక్ష్యంబు మనసుబలిమి
కర మనిర్వేదమును ధాత్రిఁ గార్యసిద్ధి
కరము లని చెప్పుచుందురు గాన నేను
దడయ కిప్పుడు చెప్పెద దాని మీకు. 1119

చ. వదలక తా నొనర్చినయవారితకర్మఫలంబు దేహికి
న్నిదిరము గాక తోడుతనె చేకుఱు దానికిఁ జింత యేల మీ
రిది బహుదుర్గఘోరవన మిందు సమస్తదరీముఖంబుల
న్వెదకుఁడు భూమిపుత్రికను వెండియు ఖేదము దక్కి ధీరతన్. 1120

చ. సమధికశౌర్యు లింద ఱతిసాహసు లద్భుతకర్మశీలు ర
త్యమితబలాఢ్యు లొక్కపనికై రయ మారఁగఁ బూని వచ్చి యే
క్రమమున నైన నప్పని తిరంబుగఁ దీర్పక వెండి పోవ భూ
రమణుఁడు భాజనుండు తనర న్మనలం గృప విశ్వసింతురే. 1121

చ. అన విని గంధమాదనుఁడు నంగదుఁ డాడినమాట్ల నిక్క మా
మన మిటులుండ నేటికి రుమాపతి చెప్పినయట్ల భూమిభృ
ద్వనగిరిదుర్గతాపసనివాససరిత్కటకాపగాదులం
దనుపమభంగి భూమితనయం బరికింతము లెండు చెచ్చెరన్. 1122

వ. అనినవిని యవ్వానరపుంగవు లందఱు లేచి శీఘ్రంబున వింధ్యకాననసంపూర్ణం
బైనదక్షిణదిగ్భాగం బంతయు వెండియుఁ గలయ వెదకుచుఁ దత్సమీపంబున
నున్నశారదాభ్రప్రతిమంబును శృంగవంతంబును దరీమంతంబును శ్రీమంతంబు
నగురజతపర్వతంబు పొడగని రయంబున నన్నగం బెక్కి యందు రమ్యంబులగు

కోద్రవనంబును సప్తపర్ణవనంబులు నన్వేషించి పరిశ్రాంతులై తదీయశిఖరాగ్రంబునం గూర్చుండి దృష్టిమార్గంబునం బడిన సర్వస్థలంబులు వీక్షించుచు రామపత్ని నెందుం గానక వెండియు. 1123

క. చొచ్చిన చోటులె చొచ్చుచు, విచ్చలవిడి తిరిగి తిరిగి వేసరి ధరణీ
భృచ్చరు లచ్చట మెచ్చుగ, నెచ్చట జానకిని గాన కెంతయు వగలన్. 1124

క. బిట్టలసి గట్టు డిగి యొక, చెట్టుకడం జేరి చాలఁ జింతించుచు నఁ
పట్టున ముహూర్తమాత్రము, నిట్ట నిలిచి సేద దేఱి నెమ్మది నంతన్. 1125

ఉ. వెండియు నంగదాదికపివీరులు వృక్షము వీడి వీఁకతో
నొండొరుఁ జేరఁ బిల్చుకొని యొక్కపథంబును దప్పకుండఁగాఁ
గొండలు కాననంబులు నికుంజము లద్రినితంబభూములుఁ
మెండుగ మూఁకలై వెదకి మేదినిపుత్త్రిని గాన కెంతయున్. 1126

ఉ. అందఱు వింధ్యశైలశిఖరాంచితనైరృతకోటిపై నిరా
నందతతోడఁ జేరి విపినంబులఁ బర్వతకూటకోటులం
గ్రందుగ జానకి న్వెదకి కానక వెండియు శోకము న్భయం
బొందఁగ నందఱుఁ ద్రిమ్మరుచు నుండఁగ మానసము నిండె వారికిన్. 1127

వ. అంత హనుమంతుండు తనమనంబున. 1128

ఉ. శైలము లాపగ ల్విషయసంఘము లన్నియుఁ బోలఁ జూచితిం
గాల మతిక్రమించె నృపకన్యక నెందును గాన నైతి నీ
వాలితనూభవాదికపివర్యులు చేడ్పడి యున్నవార లే
లీలఁ జరింతు వీరి నుఱలింతునొ జానకి జాడఁ గాంతునో. 1129

చ. కళవళ మేటి కీసనుయకాలము పోయినఁ బోవ నిమ్ము మ
త్కులపతి యైనసూర్యజుఁడు కోపము చేసినఁ జేయ నిమ్ము పో
సొలయక మేదినీసుతను జూడక పోవుట గాదు యుక్తమ
గ్గలిక సమస్తము న్వెదకి కాంచెదఁ గా కని నిశ్చితాత్ముఁడై. 1130

వ తారాంగదప్రముఖకపివీరులం గూడి దురన్వేషంబును గుహాగహనవంతంబు నగు నప్పర్వతం బెక్కి సింహశార్దూలజుష్టంబు లైనవిషమస్థలంబులం దలిశిలాసంకటంబులును మహాప్రస్రవణంబులం దలినదులును శోధించుచుండె నప్పు డంగదగజగవయగవాక్షగంధమాదనశరభకుముదమైందద్వివిదసుషేణతారనలజాంబవత్ప్రముఖవానరవీరులు ప్రత్యేకంబుగా నరిగి గిరిజాలావృతంబు లైనదేశంబు లన్నియుఁ బరిశోధించి యెందును మహీనందనిం గానక యలసి యధికక్షుత్పిపాసాపరవశులై వెండియు నందఱు హనుమత్సమేతంబుగా నొక్కయెడం గూడికొని సలిలార్థులై యరుగుచు ముందఱ నతిదుర్గంబును వివృతంబును మాయదానవాభిరక్షితంబును లతాపాదపసంఛన్నంబును మహాద్భుతదర్శనంబును

ఋక్షబిలనామకంబు నగునొక్కబిలంబుఁ జూచి తత్సమీపంబునకుం జని రప్పుడు. 1131

-ooo- హనుమదాదులు ఋక్షబిల మనునొక్కబిలముఁ జొచ్చుట. -ooo-

క. కమలార్ద్రపక్షములతోఁ, గమలరజస్సిక్తరక్తగాత్రంబులతో
నమరుచు జలవిహగంబులు, విమలంబుగ నబ్బిలంబు వెలువడి వచ్చెన్. 1132

వ. వాని నవలోకించి యబ్బిలంబు డాయం జని. 1133

చ అలఘుపరాక్రము ల్గనిరి యంతఁ దమోవృత మై యగాధ మై
విలసితభూరిభూజపరివేష్టిత మై కడు దుష్ప్రవేశ మై
సలలితపుష్పగంధి యయి సర్వమృగద్విజకాండయుక్త మై
యలరెడుదాని సర్పనిలయంబును బోలుబిలంబు నయ్యెడన్. 1134

వ. ఇ ట్లతిదుర్గమం బైనబిలంబుఁ గనుంగొని బలవంతు లగువానరపుంగవులుదాని యనావిష్కృతరామణీయకంబున కచ్చెరువు నొందు చుండి రప్పుడు సుమేరుసమానశరీరుండునుగిరికాంతారవనకోవిదుండునగుహనుమంతుండుప్లవంగపుంగవుల నెల్లఁ గలయ నవలోకించి యి ట్లనియె. 1135

చ. ఇలఁ గలసర్వదేశము లహీనగిరీంద్రగుహాదరీఝరుల్
విలసితకాననంబులు తలీపులినంబులు పట్టణంబులున్
గలయఁగఁ జూచియున్ జనకనందని నెందును గాన లేక బి
ట్టలసితి మెండతాఁకునకు నార్తుల మైతిమి క్షుత్పిపాసలన్. 1136

మ. నలు వొప్ప న్సలిలార్ద్రపక్షములతో నాళీకపాంసుచ్ఛటా
కలితాంగంబులతో బలాకబకచక్రక్రౌంచహంసంబు లీ
బిలము న్వెల్వడి వచ్చుచున్న వగముల్ స్నిగ్ధంబు లై యొప్పెడిం
గల దిప్పట్టున నిక్క మొక్కహ్రదమో కాసారమో కూపమో. 1137

ఆ. ఈబిలంబుఁ జొచ్చి యిచ్చటఁ గడు పార, నీరు త్రావి మనము నేర్పు మెఱసి
జనకపుత్త్రి వెదకి సాధింత మనవుడు, నట్ల కాక యనుచు నద్రిచరులు. 1138

వ. పావనిం బురస్కరించుకొని శీఘ్రంబున నబ్బిలంబు ప్రవేశించి యచ్చట నున్న యదృష్టపూర్వసింహశార్దూలవరాహభల్లూకాదిక్రూరమృగంబులనదలించుచుఁ బక్షిసంఘంబుల నెగయంజోపుచు నంధకారబంధురం బై దృష్టికింజొరవయినతేజంబునకు గమ్యంబు గాక విక్రమంబున కుపక్రమింప రాక నానాపాదపలతాసంకులం బై రోమహర్షణం బై యచంద్రసూర్యకిరణం బై సుదుర్గమం బై యున్నయబ్బిలమార్గంబున నొండొరులం గౌఁగిలించుకొని యతిసాహసంబున నొక్క యోజనం బరిగి యంత కంతకుఁ దిమిరం బగ్గలం బగుటయు వినష్టమార్గు లై. 1139

తే. అలసి సలిలార్థులై బ్రతుకాస విడిచి
వదనములు వాడ దైన్యంబు గదుర సంభ్ర
మమున నొక్కింతవడి బిల మధ్యమందుఁ
బరితపించుచు నాఁకట బడలి యుండి. 1140

వ. వెండియు నొక్కింత ధైర్యంబున నబ్బలీముఖపుంగవు లొండొరులం బట్టుకొని
యబ్బిలంబులోన మఱి కొంతదూరం బతిప్రయత్నంబున నరిగి యవ్వల. 1141

క. అరుదార మృగాంకదివా,కరనక్షత్రగ్రహప్రకాండద్యుతు ల
త్తఱిఁ గుప్ప గూర్చినట్లుగఁ, గర మొప్పెడు నొక్క వెలుఁగుఁ గాంచిరి ప్రోలన్.

వ. కని డాయం జని యందు వైశ్వానరసమప్రభసువర్ణమయకుసుమకిసలయఫలస్త
బకలతావిలసితశాఖాశిఖోల్లసితంబులును గాంచనమయవిచిత్రపత్రలక్షితకలరవ
కలకంఠకీరశారికాభ్రమరసంకులంబులును నగురుచిరవిభూషణభూషితహేమాభి
రామసాలతాలతమాలతక్కోలరసాలహింతాల నారికేళపున్నాగవకుళచంపకకర్ణి
కారజంబీరజంబూనింబకదంబఖర్జూరకకుభాదిదివ్యతరునికరంబులును హిరణ్మయ
కమలోత్పలకైరవమత్స్యకచ్ఛపహంసక్రౌంచచక్రవాకసారసబకకారండవసంకు
లంబు లగునీలవైడూర్యవర్ణసరోవరంబులును దరుణాదిత్యసంకాశంబు లగు
వైడూర్యమణివేదికాతలంబులును బ్రవాళమణిసన్నిభంబు లగునానావిధపుష్ప
లతావితానంబులును బురుషోపలగారుత్మతవైడూర్యముక్తాజాలవిరచితగవాక్ష
కుడ్యకవాటద్వారతోరణస్తంభాలంకృతసువర్ణగృహముఖ్యంబులును మణికాం
చనవిచిత్రమహార్హశయనాసనయానంబులును హైమరాజతకాంస్యంబు లగు
భాజనంబులును దివ్యంబు లగుచందనాగరునిచయంబులును మనోజ్ఞంబు లగు
మూలఫలంబులును రసవంతంబు లగుమధుమైరేయాదిపానద్రవ్యంబులును
గాంచనమయంబు లగుదివ్యాంబరస్రగ్విభూషణచిత్రకంబళాజినంబులునుసుగం
ధబంధురంబు లగుదివ్యగంధంబులును సమంతతోన్యస్తదీప్తవైశ్వానరోపమ
సువర్ణరత్నసంచయంబులునుం గలిగి యమరావతీపట్టణంబు నాక్షేపించుచున్న
యొక్కదివ్యపట్టణంబు పొడగని సువర్ణవైడూర్యచంద్రకాంతమణిస్థగితంబు లగు
తత్పురీబాహ్యాభ్యంతరప్రదేశంబులు వీక్షించుచుం జని. 1143

హనుమదాదులు స్వయంప్రభ యనుతపస్వినిం గాంచుట.

ఉ. ప్రేలుమృగాజినంబు సవరించి యినాంశులసజ్జటాచ్ఛటల్
గ్రాలఁగ ఘోరనిష్ఠ నచలస్థితిఁ బూర్ణసమాధియుక్తయై
చాలఁ దపంబు సేయుచు నిజప్రభలం బుర మెల్ల వీచికో
ద్వేలము సేయుచున్న యొకదివ్యతపస్విని గాంచి రప్పురిన్. 1144

క. కని దానిమహిమ కెంతయు, మనమున నచ్చెరువు గదుర మఱిమఱి డాయం
జని మర్కటవీరులు చ,య్యనఁ బరివేష్టించి యుండి రధికప్రీతిన్. 1145

వ. అప్పుడు హనుమంతుం డత్తపస్విని కభివందనంబు చేసి యిట్లనియె. 1146

చ. నిరుపమపుణ్య వెవ్వతెవు నీ విట నొంటి చరించె దోటలే
కరయఁగ నీమహాబిల మసహ్యమణీతపనీయరాసు లీ
సురుచిరదివ్యరత్నపరిశోభితమందిరపంక్తు లేమహా
పురుషుని వాత్మ కచ్చెరువుఁ బుట్టఁగఁ జేయుచు నున్న వెంతయున్. 1147

ఉ. ఆఁకట దప్పిచే బడలి యందఱ మీతిమిరాప్రకాశితా
స్తోకబిలంబు సొచ్చి యొకచొప్పున వచ్చి సమగ్రకాంచనా
నోకహపంక్తు లద్భుతమనోజ్ఞసువర్ణవిశాలసౌధప
ద్మాకరముల్ గనుంగొని భయవ్యథితాత్ముల మైతి మెంతయున్. 1138

సీ. ఏమహాపురుషుని దీదివ్యపట్టణం బీమూలఫలజాత మీవిశాల
హైమకవాటగవాక్షకుడ్యస్తంభ సుమహనీయసుందరమందిరములు
నీవృక్షషండంబు లేమహాత్మునితపోమహిమచేఁ గాంచనమయము లయ్యె
నీసరోవరపంక్తు లెవ్వానితపమునఁ గాంచనమయదివ్యకమలకుముద

తే. మత్స్యకచ్ఛపకర్కటమకరచక్ర, సారసక్రౌంచవిమలహంసములఁ బడసె
నీసురభిపుష్పసంచయ మెట్లు గలిగె, మఱియు నీభర్మరాసు లేకరణి నొప్పె.

స్వయంప్రభ హనుమదాదులకు ఋక్షబిలోత్పత్తి ప్రకారం బెఱింగించుట

క. ఈవిమలదివ్యగంధం, బీవిధమునఁ గలిగెఁ దాపసీ మఱి యేలా
గీవిధము తేటపడఁ జెపు,మా వినియెద మనిన నతని కది యి ట్లనియెన్. 1150

చ. చతురుఁడు శిల్పనైపుణవిశారదుఁ డద్భుతతేజుఁ డార్యస
మ్మతుఁడు మయుం డనాఁ బరఁగు భవ్యుఁడు దానవవిశ్వకర్మ యీ
వితతబిలంబునందుఁ గడువేడ్క సమస్తపదార్థముల్ గరం
బతులితరత్నకాంచనమయంబులుగా నొనరించె నెంతయున్. 1151

వ. మఱియు నమ్మయుండు తొల్లి దివ్యవర్షసహస్రంబులు విరించి గుఱించి తపంబు గావించి యద్దేవుని ప్రసాదంబువలన విచిత్రనిర్మాణప్రతిపాదకశిల్పశాస్త్రజ్ఞానంబు వడసి మాయావి యై విచిత్రశక్తిచేత నీదివ్యజాతరూపమయభవనరాజంబు నీమహనీయకాంచనవనంబు నీమనోజ్ఞసువర్ణకమలాకరంబులు నిర్మించి యాశననంబైనధనం బంతయుఁ బడసి యిమ్మహావనంబున హేమ యనునప్సరసం గూడి కొంతకాలంబు లీలావినోదంబులం దగిలి కామోపభోగంబు లనుభవించుచుండ దానికి సహింపక పురందరుండు మయుని వజ్రధారావినిపాతితుం జేసె నంతఁ బరమేష్ఠి యీకాంచనవనంబు నీదివ్యభవనంబును శాశ్వతంబు లగు కామభోగంబులును హేమ కొసంగె నే నాహేమకు వయస్య నగుటం జేసి తత్ప్రసాదంబు వడసి యీపురంబు గాచికొని యున్నదాన నేను మేరుసావర్ణికూఁతుర స్వయంప్రభ యనుదాన నని పలికి వెండియు నత్తాపసి యి ట్లనియె. 1152

క. మీ రెవ్వ రిటకు నేగతిఁ, జేరఁగ వచ్చితిరి యప్రసిద్ధ మగుబిలం

జేరితిఁ జొచ్చితిరి మీరు, ధీరత్వము పొగడఁ జెల్లదే నా కిచటన్. 1153

క. వలసినఫలమూలాదులు, నలువుగఁ జిత్తములు దనియ నమలుఁడు మధురా
మలజలముం గ్రోలుఁడు సేదలు వాయఁగ ననుచుఁ బ్రీతిఁ దరుచరవీరుల్. 1154

క. మెప్పుగ మూలఫలంబులు, తప్పక భక్షించి ఘనసుధాసమసలిలం
బప్పు డటు గ్రోలి యాఁకలి, దప్పియుఁ దీర్చికొని వెస గతశ్రము లగుచున్.

వ. అలరుచున్నవారలం గనుంగొని యత్తపస్విని వెండియు. 1156

క. అనుకంప గదుర నిట్లను, ఘనముగ నీబిలము నెట్లు గంటిరి మీరే
యనువునఁ జొచ్చితి రెక్కడి, వనచరు లేమిటికి నిటకు వచ్చినవారల్. 1157

హనుమంతుఁడు స్వయంప్రభకుఁ దాము బుక్షబిలముఁ బ్రవేశించినవిధంబు దెల్పుట.

క. మీరు తెఱఁ గంతయు నేర్పడ, నాతో వివరింపుఁ డనిన నగచరవరుఁ డా
వాతాత్మజుండు దానికిఁ, జేతోముద మలర నిట్లు చెప్పఁ దొడంగెన్. 1158

సీ. వసుధేశుఁ డిక్ష్వాకువంశజుండు సుపర్వరాజతుల్యుఁడు దశరథతనూజుఁ
డనఘాత్ముకుఁడు రాముఁ డనుజుఁడు భార్యయుఁగొలువఁగాంతారసీమలకు వచ్చి
నెఱిఁ బంచవటమున నివసించి యుండ నన్నరసతినతిని జానకిని బంక్తి
వదనుండు బలిమిచే వంచించి కొనిపోయె రామునిసఖుఁడు మర్కటవిభుండు

తే. ఘనుఁడు సుగ్రీవుఁ డమ్మహీతనయ వెదకి, ర మ్మనుచు దక్షిణాశకుమమ్ముఁబనుప
నంగదాదులఁ గూడి రయంబు మెఱయ, మానినీమణి వెదకంగఁ బూనివచ్చి.

చ. పొలయక యెల్లదేశములఁ జూచుచు వచ్చి యగస్త్యదిక్కునం
గలతటినీసరఃపులినకాననపర్వతకందరంబులం
గలయఁగఁ జూచి యందు నృపకన్యను గానఁగ లేక తుత్పిపా
సలఁ గడు డస్సి యందఱము త్మారుహమూలముఁ జేరి దీనతన్. 1160

ఉ. నాలుక లెండ దండి వదనంబుల వెల్లదనంబు దోఁపఁగాఁ
జాలఁ దపించుచు న్ధృతియు జాఱ నపారవిపత్పయోనిధిం
దేలుచు దిక్కు లారయుచు నీ రెచటం గలదో యటంచు నే
లీలఁ జరింత మెట్లు నృపులేమను గాంచెద మంచు నున్నెడన్. 1161

వ. లతాపాదపసంఛన్నంబై సాంద్రతిమిరసంవృతంబై యొక్క మహాబిలంబు మా
లంజూపట్టెఁ బదంపడి సలిలక్లిన్నపక్షంబులతోఁగమలరజస్సిక్తరక్తాంగంబులతో
హంసచక్రక్రౌంచసారసకారండవాదిజలపతత్త్రిప్రకరంబు లాబిలంబు వెల్వడి
మింటి కెగసినఁ దత్ప్రకారంబు గని యబ్బిలంబులోన నొక్కజలాశయం
బుండు నని యూహించి సలిలార్థులమై యున్నవార మగుటను శీఘ్రంబున నేమం
దఱముచ్చటికిం జని యతిసాహసంబున నబ్బిలంబుఁజొచ్చి యొండొరులం గౌఁగి
లించుకొని యతిప్రయత్నంబున వచ్చి యిచ్చోట నిన్ను సందర్శించి భవత్ప్ర
సాదంబునఁ బ్రాప్తించినయీరుచిరఫలమూలంబు లుపయోగించి యమృత

కల్పంబు లగువిమలజలంబులు గ్రోలి యాఁకలి నీరువట్టునుం బాపికొని యుపగత
వ్యాయామఖేదుల మైతి మని పలికిన నత్తపస్విని మహాత్ము లగుమిమ్ముఁ బూజిం
చుటవలన నేను కృతార్థ నైతి మీయట్టిపుణ్యాత్ములసందర్శనంబు దొరకొ
నుట బహుజన్మకృతసుకృతపరిపాకంబు గదా యని బహూకరించె నంత
హనుమంతుండు వెండియు నత్తాపసి కిట్లనియె. 1162

క. జనకసుతను మాసములోఁ, గనుఁగొని చనుదెం డటంచుఁ గపిపతి యనుపం
జనుదెంచి కాల మంతయుఁ, జనఁజెడి యున్నార మెందుఁ జన లేకిచటన్. 1163

చ. జనకజఁ గాన మైతి మిటఁ జయ్యనఁ గాలము పోయె భానుమ
త్తనయుఁడు తీవ్రశాసనుఁడు తప్పక నీక్షణ మేమి సేయునో
యని మదిలోనఁ గూరినభయంబునఁ జేడ్పడి యున్నమమ్ము నీ
ఘనగుహ వెల్వరించి యనుకంప దలిర్పఁగఁ బ్రోవఁగాఁ దగున్. 1164

క. నరపతి పుణ్యచరిత్రుం, డరయఁగఁ దత్సతిని వెదక నరుగఁగ వలయుం
గరుణ దళుకొత్త మము నీ, నిరుపమగుహ వెల్వరింప నీకుం జెల్లున్. 1165

వ. అనిన నత్తాపసి యిట్లనియె. 1166

ఉ. ఈవివరంబుఁ జొచ్చి ధర నెవ్వఁడుఁ గ్రమ్మఱఁ బ్రాణయుక్తుఁడై
పోవఁగఁ జాలఁడే నిపుడు భూరిసమగ్రతపోబలంబునన్
వే వెడలింతుఁ గన్ను లటు వేగమె మూయుఁడు మూయ కున్న నీ
త్రోవఁ దొడంగి యే వెలువరింపఁగఁ జాలను మిమ్ము నిమ్మెయిన్. 1167

స్వయంప్రభ తపోబలంబున ఋక్షబిలంబునుండి వానరుల వెల్వరించుట.

వ. అనిన విని యబ్బలీముఖపుంగవు లట్లు గాక యని శీఘ్రంబున బిలంబు నిర్గ
మించునాసం జేసి. 1168

మ. సుకుమారాంగుళిహస్తరుద్ధముఖులై చూపట్టినం జూచి త
ప్పక యత్తాపసిసంతతార్జితతపఃప్రాప్తప్రభావంబుచే
నాకకాష్ఠం దగ నబ్బిలంబును రయం బొప్పార దాఁటించె సూ
ర్యకుమారాగతభావిశిక్షణభయభ్రాంతాత్ములం గీశులన్. 1169

వ. ఇత్తెఱంగున నబ్బిలంబు వెల్వరించి యత్తాపసి వానరుల నందఱ నాశ్వాసించి
యిట్లనియె. 1170

మ. ఇది నానాద్రుమగుల్మవల్లికలచే నేపారు వింధ్యాచలం
బదె యుత్తుంగతరంగఘట్టనసముద్యద్భూరినిర్ఘోషణా
స్పదమై యొప్పెడుఁ గంధి మీకు నలువొప్ప న్స్వస్తి యౌఁ గాక వే
డ్క దలిర్పంగ బిలంబులోని కిఁక శీఘ్రం బొప్ప నేఁ బోయెదన్. 1171

క. అని పలికి యాస్వయంప్రభ, వినయంబున విపినచరుల నీడ్కొని శీఘ్రం
బున శైలబిలములోనికిఁ, జనియెఁ దపోమహిమఁ జేసి సంతస మలరన్. 1172

ఉ. అంత బలీముఖప్రవరు లగ్గిరికూటము డిగ్గి క్రేవఁ బ్ర
త్యంతనగంబుమీఁద రయమారఁగఁ జేరి మహోర్మిమాలికా
క్రాంతనభోంత మైనజలరాశిని బల్లవరాగతామ్రవా
సంతికవల్లికాతరువిశాలవనంబులఁ గాంచి యందఱున్. 1173

తే. ఘనవసంతము చనుదెంచె నని యెఱింగి
మనమున భయంబు శోకంబు మల్లడిగొన
నపుడు నష్టసందేశకాలార్థు లగుచుఁ
గడు రయంబునఁ గిశులు పుడమిఁ బడిరి. 1174

వ. ఇత్తెఱంగున సుగ్రీవభయశంకితులై మై మఱచి నేల వ్రాలి యున్నవనచరులం జూచి సింహవృషభస్కంధుండును బీనాయతమహాభుజుండును మహాప్రాజ్ఞుండును యువరాజు నగునంగదుండు మందమధురాలాపంబులం దేర్చి వారి కిట్లనియె.

ఉ. అక్కపినాథునాజ్ఞ మనమందఱముం బనిఁ బూని వచ్చి యీ
దిక్కునఁ బోలఁ జూచి నృపుదేవిని గానక యీబిలంబులోఁ
జిక్కితి మిచ్చట న్మనకుఁ జెచ్చెర మాస మతిక్రమించె నిం
దొక్కర మత్తెఱం గెఱుఁగ ముష్ణకరాత్మజుఁ డుగ్రుఁ డారయన్. 1176

-అంగదుఁడు హనుమదాదులకు మాఘమాసప్రవేశం బెఱిఁగించుట.-

వ. మఱియుఁ బుష్పాతిభారాగ్రంబు లైనచూతాదివాసంతికద్రుమంబుల విలోకింపుఁ డయ్యవి వసంతకాలంబున ఫలించునట్టివృక్షంబులు శిశిరాదియందుఁ బుష్పించి యుండునట్లు పుష్పవంతంబు లగుటం జేసి వసంతకాలంబు ప్రత్యాసన్నం బయ్యె నిప్పుడు శిశిరకాలంబు ప్రవర్తించుచున్నది సుగ్రీవుండు మార్గశీర్ష మాసంబునందు సేనలం గూర్చి పౌషమాసం బవధి యొసంగి సీతాన్వేషణార్థంబు వానరుల నెల్ల దిక్కులకుం బనిచె నిప్పుడు పౌషం బతిక్రమించె మాఘమాసంబు వర్తించుచున్నది గావున వసంతకాలంబు ప్రత్యాసన్నం బగుటకు సందియంబు లేదు బిలపరివర్తుల మైనమనకు సుగ్రీవపరికల్పితమాసం బతిక్రమించె నవ్విధం బెఱుంగ మైతిమి శిశిరకాలచిహ్నభూతపుష్పసందర్శనంబున వసంతకాలసమాగమం బెఱింగినవారము మన మాశ్వయుజమాసంబున హనుమత్ప్రేరితుండై సుగ్రీవునిచేతఁ ద్రిపంచరాత్రసంఖ్యచేత నియమింపఁబడినసమాహూతుల మైతిమి పదంపడి మార్గశీర్షంబునందు లక్ష్మణచోదితుం డైనసుగ్రీవునిచేత దశరాత్రసంఖ్యచేత సమాహుతుల మై యతనివలనఁ బౌషమాసం బవధి వడసి సీతాన్వేషణార్థం బరుగుదెంచితిమి గావున నాశ్వయుజమాసంబు మొదలుకొని కాలసంఖ్యచేత వ్యవస్థితుల మైనమనకుఁ గాలవిస్మరణంబు సంయుక్తం బయ్యె నింక నెయ్యది కర్తవ్యం బని పలికి యంగదుండు వెండియు నిట్లనియె.

—అంగదుఁడు సుగ్రీవభయంబున దుఃఖించుట—

ఉ. మీరు దినేశపుత్త్రునకు మిక్కిలి మాన్యులు ఖ్యాతపౌరుషుల్
ధీరులు సాత్త్వికుల్ నయగరిష్ఠులు శూరులు నన్నుఁ గౌతుకం
బారఁ బురస్కరించుకొని యందఱుఁ గార్యభరంబుఁ బూని త
త్పేరితులై గడంగి చనుదెంచితి రప్రతిమానశూరతన్. 1178

క. ఇనతనయుఁడు మితి చేసిన, దినము లివు డతిక్రమించెఁ దిరుగఁగ మన మా
జనకజఁ గానక యచటికిఁ, జనినన్ రవిజుండు మనల శాసింపఁ డొకో. 1179

క. ఇనతనయుని సందేశం, బొనరింపక ధాత్రి సౌఖ్య మొందఁగ రా దె
వ్వని కైనఁ గాన మన కాఁ, వనచరపతివలన మృతి యవశ్యము గలుగున్. 1180

వ. మఱియు సుగ్రీవుండు తీక్ష్ణస్వభావుండును స్వామిభావవ్యవస్థితుండును గావున నపరాధుల మైనమనలం జూచి యనుకంపఁ దలంపక చంపం జూచు నదియునుం గాక నతండు మత్పితృకారణంబునఁ బూర్వవైరంబు దలంచి నన్నుఁ బరిభవించుటకు సమయం బన్వేషించుచుండు మహాత్ముం డగురాముని శాసనంబు నిరాకరించినఁ దనకు హైన్యంబు వాటిల్లుననుభయంబునయావరాజ్యపదంబునందు నన్నభిషిక్తునిం జేసెం గాని తనంతం దాను గృపావిశేషంబునం బూన్చినవాఁడు గాఁ డిప్పుడు కృతాపరాధుండ నైననన్ను నిస్సంశయంబుగా వధించు నతనిచేతం జచ్చుటకంటెం బుత్త్రదారధనధాన్యగృహక్షేత్రాదులు పరిత్యజించి పుణ్యం బైనయీసాగరానూపంబునందుఁ బ్రాయోపవేశనంబుఁ జేసి ప్రాణంబులు విడుచుట మహోదయం బని తోఁచుచున్నదిగావున నట్లుగావించెద నని పరిదేవనంబుగాఁ బలికిన నంగదునిమాటలకు నిర్వేదించి యక్కపిపుంగవులు కరుణంబుగా ని ట్లనిరి. 1181

ఉ. భానుజుఁ డట్టివాఁ డగునృపాలుఁడు చాలఁ బ్రియానురక్తుఁ డా
జానకిఁ గాన కిప్పుడు వెస న్మన మేగినఁ గాంచి క్రుద్ధుఁ డై
మానుగ విశ్వసింప కభిమానముతోఁ బతికిం బ్రియంబుగాఁ
బూని వధించు నిక్కముగఁ బోవఁగఁ జాలము వానిపాలికిన్. 1182

—తారుఁ డంగదునకు సుగ్రీవభయంబు తొలఁగుట కుపాయము చెప్పుట—

క. జనకజఁ గానక యచటికిఁ, జని వానరవిభునిచేతఁ జచ్చుటకంటెన్
ఘనముగ నిందఱ ముపవేశనముం గావించి యిచటఁ జచ్చుట యొప్పున్.

తే. మృత్యుముఖమున కైనఁ బోయెదము గాని, తరణిపుత్త్రునిసన్నిధి కరుగఁ జాల
మనవుడు భయాకులాత్ముఁ డై యల్లతారుఁ, డెల్లవారలు వినుచుండ నిట్టు లనియె.

చ. వనచరులార యింత వగవం బనిలేదు బిలంబుఁ జొచ్చి యం
దనువుగ డాఁగి యుంద మది యన్యులకుం జొరరాదు దుర్గమం
బనుపమదివ్యభూరుహాలతామలపుష్కరభోజ్యపేయకాం
చనమణిమందిరప్రచయసంభృతమై తనరారు నెంతయున్. 1185

క. అందున్న మనల నలసం, క్రందనుఁ డైనఁ బరికింపఁగాఁ జాలఁ డసం
బొందుగ నరవానరసం, క్రందను లటు దేఁటి చూడఁగాఁ జాలుదురే. 1186

వ. అనినఁ దారాంగదులవచనంబులు విని ప్లవంగపుంగవు లత్తెఱంగు కర్జంబుగాఁ
గొని యుండి రప్పుడు నీతిమంతుండగుహనుమంతుండు తనమనంబున నంగదుని
యందు రాజ్యపాలనసామర్థ్యంబు గల దని తలంచి గ్రహణధారణస్మరణ
ప్రతిపాదనోహాపోహార్థవిజ్ఞానతత్త్వజ్ఞానాఖ్యాష్టగుణసంయుక్తుండును బాహుబ
లమనోబలోపాయబలబంధుబలసమన్వితుండును సామాదిచతురుపాయకుశలుం
డును దేశకాలజ్ఞత్వదృఢత్వసర్వక్లేశసహిష్ణుత్వసర్వవిజ్ఞానసంపన్నత్వదక్షత్వో
ర్జసంవృతమంత్రత్వావిసంవాదిత్వశూరత్వశక్తిజ్ఞత్వకృతజ్ఞత్వశరణాగతవత్సల
త్వామర్షిత్వాచపలత్వనామకచతుర్దశగుణయుక్తుండును దేజోబలపరాక్రమాధి
కుండును దినదినప్రవర్ధమానశుక్లశశిప్రతీకాశుండును బితృతుల్యపరాక్రముండు
ను బృహస్పతితుల్యమనీషుండును సర్వశాస్త్రవిశారదుండును బృహస్పతివా
క్యానుసారి యగుశక్రుండుం బోలెఁ దారవాక్యానుసారియు నగువాలిపుత్త్రుం
గనుంగొని యితండు వానరరాజ్యంబు ధరింపఁ జాలినవాఁ డితనికి మనస్స
మాధానంబు గావింతుఁ గాక యని నిశ్చయించి. 1187

తే. క్షితిని గలయుపాయముల నాల్గింటిలోన
నధిక మగుమూఁడవయుపాయ మాశ్రయించి
వాక్యసంపద వానరవరులలోనఁ
గడఁకి యన్యోన్యభేదంబు గలుగఁ జేసి. 1188

హనుమంతుఁ డంగదునితోఁ దాఁగి యుండ వలదని చెప్పుట.

క. ఆయింద్రనందనాత్మజుఁ, బాయక వీక్షించి పలికె బహువిధకోపో
పాయసమన్వితవాక్కుల, వాయుకుమారుండు మతనివారకబుద్ధిన్. 1189

తే. అనఘ యుత్సాహవంతుఁడ వాలమందుఁ
బగతుల నడంచునట్టిదోర్బలయుతుఁడవు
భవ్యుఁడవు వాలిభంగి నీప్లవగరాజ్య
భూరిభారంబు దాల్ప నోపుదువు నీవు. 1190

తే. సంతతము వానరులు కడుఁ జపలచిత్తు, లగుట వీరలు పుత్త్రదారాదికమును
విడిచినీపంపుఁ గైకొనియడవులందు, వెతలఁబడుచుందురనుమాటవిడువుమిపుడు.

క. పవనుఁడు తారుఁడు పావక, తనయుం డేనును విరించితనయుఁడు భాస్వ
త్తనయునివార మగుటచే, నినుఁ గైకొని యతని విడువనేరము కడఁకన్. 1192

తే. ఎంత సామంబుఁ జేసిన నెంత దాన, మిచ్చినను వేఱువుచ్చిన నచ్చుపడఁగ
దండ మొసఁగక మార్తాండతనయుఁ బాసి, నూరినుత నీకు వశ్యులుఁ గారు వీరు.

తే. తోడరి వగ యైనదుర్బలుతోడ, బలయుతునకుఁగాక బలాఢ్యుతోఁ దుర్బలునకు
నగున స్వక్షేమకారి యైనట్టియబలుఁ, డిల బలీయునితో విగ్రహింపఁ డెందు.

క. క్షమ నెవ్వరైన దేశ, క్రమమును గాలము నెఱింగి ప్రబలునితో నె
య్యమొనర్తురు గాక వివేకమున దుర్బలునిపొందుఁ గాంక్షింపుదురే. 1195
క. బిలమున డాఁగిన నెవ్వా, రలయక భేదింపఁ జాలరని తలఁచితె యా
బిలదళనము సౌమిత్రి, జ్వలదంబకముల కయత్నసాధ్యము తలఁపన్. 1196
ఉ. వాసవుఁ డల్గి తొల్లి యొకవజ్రముచే వివరం బొనర్చె ను
ల్లాసము మీఱఁగా గలవు లక్ష్మణదేవున కెన్నియేని ఘో
రాశనితుల్యసాయకము లావిశిఖంబులచేత నీగుహన్
వాసిగఁ బ్రక్కలించుఁ గపివర్యపలాశపుటంబునుం బలెన్. 1197
తే. పుత్రదారాదికంబుల పొందు విడిచి, యాఁకటను నీరువట్టున నవియ లేక
యేటిదొర మన కితఁ డని యెల్లకపులు, విషమకాలంబునందు నిన్వేఁడుదు రనఘ.
క. హితకాములైనచుట్టల, హితులను బెడఁబాసి యొంటి నీ వీగుహ నే
గతి నుండెద వటులైనను, స్తుతికిం బాత్రమవు గాక చుల్కన గావే. 1199
తే. కార్యవైఫల్యమొనరించి కపటవృత్తి, మూఁదియిచ్చుట డాఁగిన నుగ్రుఁ డగుచు
నిను వధింపఁడె సౌమిత్రి నిరుపమాన, సాయకము లేసి యొకనిమిషంబులోన.

అంగదుఁడు హనుమంతునితో సుగ్రీవునిదుర్గుణంబులు చెప్పుట.

వ. మఱియు సుగ్రీవుండు ధర్మకాముండును నీకుఁ బితృవ్యుండును సత్యప్రతిజ్ఞుండు
ను దృఢవ్రతుండును శుచియును బ్రీతికాముండును విశేషించి తారకుం గూర్చు
వాఁడును గావున నద్దేవికిఁ బుత్రుండ వైననిన్ను హింసింపం దలంపం డీవలవని
భయంబు విడిచి మమ్ముం బురస్కరించుకొని సుగ్రీవునిపాలికిం జనుదె మ్మట్లైన
నతండు క్రమంబుగా నిన్నుఁ గపిరాజ్యంబున కభిషిక్తునిం జేయు నని పలికినఁ
బ్రశ్రితంబును ధర్మసంహితంబును స్వామిసత్కారసంయుక్తంబు నగుహను
మంతునివచనంబు విని యంగదుం డిట్లనియె. 1201
తే. అకట సుగ్రీవునందు స్థైర్యంబు శౌచ
మార్జవము ధైర్యమును సత్త్వ మానృశంస్య
మరసి చూచిన నించుకయైన లేదు
తద్గుణం బెంతయును విదితంబు గాదె. 1202
సీ. ధర్మంబు దలఁపక తల్లితో సరియైన యన్నభార్యను గామియై వరించె
నరయ జ్యేష్ఠభ్రాత యనక వాలిని శంక విడిచి చంపించె భూవిభునిచేత
రాక్షసుఁ జంప రంధ్రంబుఁజొచ్చిన వెండి రాకుండ గుహవాత రాయివైచెఁ
దనకు మేల్చేసిన ధరణీశుకార్యంబు మఱచి యింట సుఖంబు మరగి యుండె
తే. నతని కెయ్యెవి సుగుణంబు లరసి చూడఁ
జపలచిత్తుండు క్రూరుండు శఠుఁడు మత్తు

కాముఁ డగుబుద్ధిహీనుండె కాక జీవి
తాశ గలవాఁడు గోరునె యతనిపొత్తు. 1203

చ. తన కుపకారి యైనసృపుతనూజుని వే వెదకంగఁ బుత్తుఁ గా
కని సమయంబుఁ జేసి యది యాత్మఁ దలంపక కామసక్తుఁ డై
తనియక యున్నలక్ష్మణుఁ డుదగ్రతఁ గోప మెలర్పఁ బిల్వఁ బో
యిన మఱి వచ్చెఁ గాని కృత మెంచి తనంతన తాను వచ్చెనే. 1204

ఆ. అవనిబుద్ధిసుంతుఁ డై నరాజు కుమారు, రాజు సేయఁ బూజ్యరాజ్యమునకు
నిట్టిచపలచిత్తుఁ డేవగింపక తానె, యేలుఁ గాక పుత్త్రు నేల దలఁచు. 1205

తే. ఏను బుత్త్రుండ నై యున్న నినసుతుండు
పరఁగ గుణదోషములు గణింపక వనాట
రాజ్యమందుఁ బ్రతిష్ఠించు రమణతోడ
వినుతపుత్త్రుని నన్నేల విశ్వసించు. 1206

తే. దుర్బలుండను భిన్నమంత్రుండ శక్తి, హీనుఁడఁ గృతాపరాధుండ నైన యేను
గీశశేఖర యిపుడు కిష్కింధ కేగి, యనదచందాన నేరీతి మనఁగ నేర్తు. 1207

ఆ. ఇప్పు డేను బోవ నినసందనుఁడు రాజ్య, కారణమున నంటఁగట్టి వైచు
నతని చేతఁ జిక్కి యచటఁ జచ్చుటకంటె, నిచట నుపవసించు టిది యె మేలు.

ఉ. ఏను గడంకతోఁ బురికి నిప్పుడు వచ్చి దురాత్ముఁ డైన యా
భానుసుతుం డొనర్చుపటుబాధల కోర్వఁగఁ జాల నిచ్చటన్
మానక మౌని నై నిరశనవ్రతముం దగఁ బూని యోగవి
ద్యానిరతుండ నై తగువిధంబున మేను పరిత్యజించెదన్. 1209

వానరులు ప్రాయోపవిష్టు లగుట.

ఉ. మీ రిపు డూరి కేగి యల మిత్త్రకుమారుని రాజవంశవి
స్తారుల రామలక్ష్మణులఁ దక్కినబంధుజనంబుల న్సుమా
తారల మిత్త్రవర్గములఁ దప్పక కాంచి నమస్కరించి యిం
పారఁగ నాదుచంద మిది యంతయుఁ దెల్లము గాఁగఁ జెప్పుఁడీ. 1210

వ. విశేషించి మజ్జనని యగుతార యేకపుత్త్రయు సానుక్రోశయుఁ దపస్వినియుఁ
గావున మృతుండ నైననన్ను విని పుత్త్రమరణశోకంబు సహింపంజాలక నిశ్చ
యంబుగాఁ బ్రాణంబులు పరిత్యజించు నట్లు గాకుండ నద్దేవిం దగినయనున
యాలాపంబులం దేర్పుఁ డని పలికి యంగదుండు వృద్ధు లగుజాంబవదాదులకు
నమస్కరించి ప్రాణత్యాగంబునందుఁ గృతనిశ్చయుండై రోదనంబు సేయుచు
దర్భాస్తరణసంవృత యైనమేదినియందుఁ బ్రాయోపవిష్టుం డయ్యె నంతఁ
దక్కినవానరు లందఱు బాష్పధారాపూరితముఖు లై దీర్ఘస్వరంబున రోద
నంబు సేయుచు సుగ్రీవుని నిందించుచు వాలిం బ్రశంసించుచు నంగదునిమతం

బెఱింగి యతనియట్ల ప్రాయోపవేశంబు సేయ సమకట్టి నిర్మలజలంబు లుప
స్పృశించి దక్షిణాగ్రంబు లగుదర్భాస్తరణంబులయందుఁ బ్రాఙ్ముఖంబుగా
నాసీనులై యంత నేకవాక్యంబున రామునివనవాసంబును దశరథునిమరణం
బును జనస్థానవధంబును జటాయువుయొక్క పంచత్వంబును వైదేహీహరణం
బును వాలివధంబును రామునికోపంబును సారెసారెకుం దలపోయుచు నాక్రంద
నంబుఁ జేసిన. 1211

క. గిరినిభు లగుప్లవగులచే, ధరణీధర మపుడు ఘోషితవిశాలగుహాం
తర మయ్యె నదద్భయద, స్ఫురదురుమేఘములచేతఁబోలె న్మిగులన్. 1212

సంపాతి వానరుల భక్షింప వచ్చుట.

సీ. అప్పుడు సంపాతి యను గృధ్రనాయకుం డతివృద్ధుఁ డమితసత్త్వాన్వితుండు
ఘనవీర్యుఁడు జటాయువునకు జ్యేష్ఠభ్రాత భూరివిక్రముఁడు బుభుక్షితుండు
హరివరుల్ గావించు నాక్రందనధ్వని విని యద్రిగుహనుండి వెడలి వచ్చి
ప్రాయోపవిష్టులై పడి యున్న కీశులఁ గనుఁగొని సమ్మోద కలితుఁ డగుచు
తే. నహహ లోకంబు విధివశంబగుటఁ జేసి, యతఁడు భూతంబులకు విహితాశనంబు
నిత్యమొనగూర్చు నాకట్లు నేఁడు కరుణఁ, దినుమటంచుచు నీభక్ష్యంబు దెచ్చి పెట్టె.

క. చిరకాలం బాహారం, బిరవుకొనం దిరుగలేనియే నింకను జె
చ్చెర ముందట మరణేచ్ఛా, పరులై యీల్గువనచరుల భక్షింతు వెసన్. 1214

వ. అని పలికిన భక్ష్యలుబ్ధుండగు సంపాతివచనంబు విని పరమాయస్తుండై యంగ
దుండు హనుమంతున కిట్లనియె. 1215

క. దక్షాయ్యవ్యాజంబున, సాక్షాద్వైవస్వతుండు శమనుఁ డిచటికి
న్వృక్షచరవిపత్తికిఁ బ్ర,త్యక్షముగా వచ్చెఁ గంటె యనిలతనూజా. 1216

క. ఇనజుని వాక్యము రఘునం,దనుకార్యము ప్రీతితో నొనర్పనిదోషం
బున మన కాకస్మికముగఁ, బనివడి యీగతి విపత్తి ప్రాపించె వెసన్. 1217

అంగదుఁడు సంపాతిం జూచి జటాయుర్మరణాదుల నుగ్గడించి దుఃఖించుట.

క. ధరణిజకొఱ కాఖగశే,ఖరుఁడు జటాయువు గడంగి కావించిన దు
ష్కర మగుకర్మంబును ని,వ్వెఱపడి మన మెల్ల దొల్లి వింటిమి గాదే. 1218

క. ఇలఁ దిర్యగ్యోనిగతం,బులైన భూతంబు లెల్లఁ బోలుపుగఁ బ్రాణం
బులు విడిచియైన నృపతికి, నలువొప్పఁగఁ దొల్లి ప్రియ మొనర్చినా రేదో.

క. మనుజేంద్రునకుఁ బ్రియంబుగ, జననుతుఁడు జటాయు వీల్గి సద్గతి వడసె
న్మన మానగపతికై వడి, మనుజపతికిఁ బ్రియముగాఁగ మడియుద మిచటన్. 1220

క. కారుణ్యనియంత్రితులై, వారక రామునకు నెల్లవారలు ప్రియ మిం
పారఁగ నొనర్చుచుండఁగ, భూరుహచరులార మనకుఁ బోలదె సేయన్. 1221

క. గిరివనదుర్గంబులయందు, దరసి ధరానుతను గానమైతిమి మన మిం
క రయంబునఁ బురి కరుగుట, నరవరునకు శోకభయము మొనర్పుట కె కదా.

క. జనకజను వెదకి కనుఁగొని, జనవిభునకు ముదము గూర్పఁజాలమయితి మె
ల్లనఁ బ్రాణములు విడిచి యైనను మన మిచ్చటఁ బ్రియం బొనర్పుద మింకన్.

క. రామహితంబుగ మాకొని, రామునిసతికొఱకుఁ బేర్చి రావణుచే సం
గ్రామమునఁ జచ్చి నిర్జర, ధామంబు జటాయు వొందె ధన్యుం డగుచున్. 1224

చ. వరగుణశాలిరామవనవాసము రాజవరేణ్యుఁడైనప
ఙ్క్తిరథునిచావు రాఘవసతీహరణంబును గృధ్రవంశరా
ణ్మరణము వాలిపోక నిధనం బిచటన్ మన కిట్లు డాయుటల్
పరువడిఁ గల్గె నిన్నియును బాపపుఁగైకయికారణంబునన్. 1225

క. చెడు తెవులు ముదిమియును లే, కడలుక హితపుత్రమందిరారామముల
న్విడిచి మన మకారణముగఁ, గడువడి నిటఁ జావ వలసెఁ గైకకతమునన్. 1226

వ. మఱియు జటాయుర్మరణంబున దశరథవినాశనంబున వైదేహీహరణంబున మన
కుఁ బ్రాణసంశయంబు సమాగతం బయ్యెఁ జటాయు వీల్గకున్న రావణునిచేత
జానకి యపహృత గాక యుండు దశరథుండు గెడయ కున్న సీతారామలక్ష్మణుల
నెవ్విధంబున నైనఁ గ్రమ్మఱఁ బురంబునకుం దోడ్కొనియరుగు వైదేహి రాక్ష
సునిచేత నపహరింపఁబడ కున్న రామునకు సుగ్రీవునితోడి సఖ్యసంబంధంబు
గలుగమిం జేసి మనకు మరణంబు గలుగకుండుఁ గైకేయీవరదానకారణంబున
రామవనవాసంబు మొదలుగఁ బ్రాయోపవేశనపర్యంతం బయ్యెది గల దది
సర్వంబుఁ బ్రాప్తించె నని బహుప్రకారంబుల నిర్వేదించుచున్నయంగదాదుల
వచనంబులు విని మరణేచ్ఛాపరులై పడియున్నవానరుల నందఱ నవలోకించి
తనయనుజుం డగుజటాయువువృత్తాంతంబు శ్రవణతాడితం బగుటకు శోకమో
హంబులు మనంబునం బెనంగొన సంపాతి యంగదున కిట్లనియె. 1227

—సంపాతి జటాయువుమరణంబు విని దుఃఖితుఁడై యంగదునిఁ దద్వృత్తం బడుగుట.—

చ. ఘనగుణశాలి ప్రాణములకంటెఁ బ్రియుండు మహాబలుండు నా
యనుజుఁడు భీమకాయుఁడు మదాసురహంత జటాయు వాఖగేం
ద్రునిమరణంబు నామనము దుఃఖవశంబుగఁ జేయు చిట్లు వా
కొనియెదు పెక్కుమార్లు నయకోవిద యెవ్వఁడ వీవు చెప్పుమా. 1228

మ. చల మొప్పన్వడిఁ జేర్చి దారుణజనస్థానంబునన్ గృధ్రదై
త్యుల కెబ్బంగి రణంబు వాటిలె జటాయుం బట్టి దైతేయుఁ డె
ట్లలుకం ద్రుంచెను బెద్దకాలమున కత్యానందసంపాదియై
చెలు వుప్పొంగ రహిన్వినంబడియె నాచే భ్రాతృనామం బిటన్. 1229

క. పెనుపొందఁ బెద్దకాలం,బునకు న్మహనీయవిక్రముం డగునాత

మ్మునికీర్తనంబుచే నేఁ, దనఘాత్మక యేను సమ్మదాత్ముఁడ నైతిన్. 1280

క. వానరకులవర్య జన, స్థాననివాసి యగునాదుతమ్ముం డనిలో
దానవునిచేత నిహతుం, డైన తెఱంగెల్లఁ జెప్పు మది విన వలతున్. 1281

క. వనచరవర యెవ్వానికిఁ, బెను పొంకఁగ రామవిభుఁడు ప్రియపుత్రుం డై
జనియించె నట్టిదశరథ, జనవిభుఁడు జటాయువునకు సఖుఁ డె ట్లయ్యెన్. 1282

క. వృక్షచరవీర నాకును, బక్షంబులు లేవు గానఁ బదముల నడ లే
కక్షముఁడ నైతి నీదుస, మక్షంబునకుఁ గొని పొమ్ము మానుగ నన్నున్. 1283

వ. అని శోకగద్గదకంఠుండై పలికిన సంపాతివచనంబు విని భక్షణకర్మప్రతిపాదకవాక్యంబున భీతులై యంగదాదికపివీరు లీపక్షీంద్రుండు రౌద్రదర్శనుం డై యున్నవాఁడు మనల నందఱ వరుసంబట్టుకొని మ్రింగునో యని శంకించి సర్వప్రకారంబులఁ బ్రాయోపవేశనంబుఁ జేసి మరణకాములమై పడి యున్నమనల మ్రింగిన మ్రింగ నిమ్ము పరమసిద్ధి నొంది కృతకృత్యుల మయ్యెద మని నిశ్చయించి పర్వతశృంగంబుమీఁద నుండి సంపాతిం దిగిచి కొని తెచ్చి తమముంగల నిడికొనిరప్పు డంగదుండు సంపాతి నవలోకించి యి ట్లనియె. 1234

అంగదుఁడు సంపాతికి జటాయుర్మరణప్రకారం బెఱింగించుట.

ఉ. ఆవిధికిం దనూజుఁడు మహాత్ముఁడు ఋక్షరజుండు లోకసం
భావితుఁ డొప్పు నాతనికి మానుగఁ బుట్టిరి ధాత్రి వాలిసు
గ్రీవు లసంగ నం దలహరిప్రజనాయకుఁ డైన వాలికి
స్థీవర యేను నందనుఁడ ధీరుఁడ నంగదనామధేయుఁడన్. 1235

మ. ఇనవంశోత్తముఁ డాజి కగ్రతనయుం డిక్ష్వాకునాథుండు రా
మనరేంద్రుండు మహారథుండు త్రిజగన్మాన్యుండు తమ్ముండు గే
హినియుం గొల్వఁగఁ దండ్రిపంపున నయుం బేపారఁగా ధర్మమా
ర్గనిరూఢస్థితి దండకాటవికి వేగం బొప్ప నచ్చె న్రహిన్. 1236

ఉ. ఆనరనాథపత్ని సుగుణాకరచిత్తను జానకి న్జన
స్థానమునందు రామరహితంబుగ నుండెడువేళ వంచన
న్దానవభర్త రావణుఁ డుదగ్రగతిం గొని పోవఁ జూచి త
త్కాననవాసి రాదశరథప్రియకారి జటాయు వయ్యెడన్. 1237

శా. వీఁకం దాఁకి దశాస్యుతోఁ దొడరి యుద్వృత్తి న్బలోదగ్రుఁ డై
లోకం బంతయు మెచ్చఁ గొంతవడి బల్క్రోధంబుతోఁ బోరి య
స్తోకప్రౌఢిమఁ దద్రథం బడచి సంధుల్ వ్రచ్చి బాహాబలో
త్సేకంబు న్బెడఁబాపి బిట్టలసి చచ్చె న్దానిచేతం దుదిన్. 1238

తే. అంత రఘుపుంగవుఁడు తనకాంత యైన, సీత వెదకుచు నచ్చోటుఁ జేర వచ్చి
యసురఖడ్గధారాహతుండై ధరిత్రిఁ, గూలి యున్నజటాయువుఁ బోలఁజూచి.

వ. మిక్కిలి శోకించి తనతండ్రి యగుదశరథునకుం బోలె నతనికి సంస్కారంబు గా
వించి శాశ్వత మైన సద్గతికిం బుచ్చి యచ్చోటు వాసి. 1239

ఉ. ఆవల ఋశ్యమూకమున కర్థి రయంబున నేగి యందు సు
గ్రీవునితోడ నెయ్య మొనరించి రఘుప్రవరుండు లోకసం
భావితసత్త్వయుక్తుఁ డగుమజ్జనకు న్బలశాలి వాలి నెం
తే వడిఁ ద్రుంచి భానుసుతునిం బతిఁ జేసె వనాటకోటికిన్. 1240

### అంగదుఁడు జటాయువునకుఁ దాము ప్రాయోపవిష్టులగుటకుఁ గారణము చెప్పుట.

వ. ఇట్లు రామునిచేత నభిషిక్తుండై సుగ్రీవుండు. 1241

ఉ. రామునిగేహిని న్వెదకి రమ్మని యాతఁడు మమ్ముఁ బంపఁగా
నేము గడంగి యామ్యదిశ కిందఱముం జనుదెంచి యందు నా
నామహనీయశైలవిపినంబుల నారసి యందు జానకి
స్వామినియందు భానురుచి నట్లు కనుంగొనలేక దీనతన్. 1242

మ. రయ మారం దగ వింధ్యశైలకటకప్రాంతంబులం జూచుచున్
మయమాయామయ మైనయొక్కబిల మజ్ఞానంబునం జొచ్చి వెం
డియు రాఁజాలక రామభూమివిభుపత్నిం గాన కచ్చోటఁ ద
న్మయతం ద్రిమ్మరుచుండ మాస మరిగెన్ మాకు న్విహంగోత్తమా. 1243

వ. అంత నొక్కవెరవున నబ్బిలంబు నిర్గమించి. 1244

మ. విమలాత్ముం డగురామభూవిభుని దేవిం గాన కి ట్లేగ ను
గ్రమనస్కుం డగుభానుజుండు మనలన్ ఖండించునో యంచుఁ జి
త్తమునం గూరినభీతి నిందఱ మసుత్యాగేచ్ఛఁ బ్రాయోపవే
శము గావించుచు నున్నవార మిచట న్సంజాతఖేదంబునన్. 1245

వ. అని తమవృత్తాంతంబు సవిస్తరంబుగాఁ జెప్పిన విని బాష్పవ్యాకులలోచనుం
డై సంపాతి యవ్వానరులం జూచి యిట్లనియె. 1246

మ. ఇనచండాంశులఁ బక్షముల్ గమలి యే నెచ్చోటికిం బోవ లే
కునికిన్ వార్ధక మొందుటన్ ఘనబలం బొప్పారఁగా లేమి నా
యనుజుం జంపిననీచదానవుని మాయం జేయ లేనైతిఁ గా
కనఘా పక్షము లున్నఁ బాపనె తదీయప్రాణముల్ మేనికిన్. 1247

వ. మున్ను వృత్రవధకాలంబునందు నేనును నాతమ్ముం డగుజటాయువును జయా
ర్థులమై యొక్కనాఁడు సప్తమారుతజవంబున మింటి కెగసి యాకాశంబునావ
రించి సప్తాశ్వమండలంబుదాఁక నరిగి యంబరమధ్యగతుండై నచండకరునికిరణం
బుల వేఁడిమికిం గాక జటాయువు సొలసిన నేను సూర్యకిరణార్దితుండై నయతనిఁ
బక్షంబులం గప్పిన నాపక్షంబులు దగ్ధంబు లగుటయు సంచారంబు దక్కి
విహ్వలుండనై వింధ్యాద్రిపయిం బడితి నాఁటంగోలె నజ్జటాయువు వసించిన

చో టెఱుంగకున్న వాఁడ నని పలికిన నాసంపాతివచనంబులు విని యంగదుండు వెండియు ని ట్లనియె. 1248

చ. అనుజునిఁ జంపి చన్నదివిజారి వధించెద నంచుఁ బల్కితీ
వనఘ వయోధికుండవు సమస్తము గానఁగ నేర్తు దైత్యుఁ డిం
పెనయఁగ మేదినీతనయ నెచ్చట డాఁచిన వాఁడు తన్నికే
తన మది యేడ నిచ్చటికి దవ్వొ సమీపమొ నాకుఁ జెప్పుమా. 1249

క. నా విని సంపాతి ముదం, బావిర్భావంబు నొంద నందఱ హర్ష
ప్రావృతచిత్తులఁ జేయుచు, నావాలితనూజుతోడ నవు డి ట్లనియెన్. 1250

చ. ఖరకరురశ్మిఁ బక్షములు గాలి బలం బఱి యున్కిఁ జేసి భా
స్కరకులుఁ డైనరామునకుఁ గర్మముచే నుపకార మేమియున్
బరువడి చేయఁ జాలఁ గపినాథతనూభవ మాటమాత్ర నే
నరుదుగ నాజితారికి సహాయుఁడ నయ్యెద నాలకింపుమీ 1251

వ. మఱియు దశరథసఖుండ నైననాచేత రామసాహాయ్యం బవశ్యకర్తవ్యం బై యుండు నతలాద్యధోలోకంబులును భూమ్యాద్యూర్ధ్వలోకంబులు నెఱుంగుదు నదియునుం గాక. 1252

### సంపాతి యంగదునకు సీత యున్నస్థలం బెఱింగించుట.

మ. మును విష్ణుండు త్రివిక్రమాకృతి జగంబుల్ నిండి వ్యాపించుటల్
దనుజుల్ వేల్పులు వార్ధిఁ ద్రచ్చి సుధ నందం బొప్పఁ బుట్టించుటల్
విను మే నంత యెఱుంగుదున్ మఱి జరావిస్ఫూర్తిఁ దేజంబు మా
సెను గాత్రంబు వడంకఁ జొచ్చె నసువుల్ జీర్ణంబు లయ్యెన్ గడున్. 1253

మ. ఒకనాఁ డే నిట నొంటిమైఁ గడఁకతో నుండంగ వ్యోమంబునన్
వికటాకారుఁడు పఙ్క్తికంఠుఁ డొకతన్వి న్రూపసంపన్న న
త్యకలంకోజ్జ్వలదివ్యరత్నమయహారాలంకృతాంగిం దుషా
రకరాస్యన్ జలజాతనేత్రఁ గొని శౌర్యప్రౌఢి నేగె న్వడిన్. 1254

మ. అపు డాభామిని రావణాంకగత యై హా రామ హా రామ హా
నృపవంశోత్తమ లక్ష్మణా యని రహిన్ బేర్కొంచు బిట్టేడ్చుచున్
విపులోత్తంసము లూడ్చి వైచుచుఁ గడున్ విభ్రాంత యై శోకబా
ష్పపరీతేక్షణ యై వెసం జనె నభోభాగంబు కంపింపఁగన్. 1255

క. ఆసతి నవీనకోమల, కౌసుంభపటంబు నీలకాయుం డగుదు
ష్టాసురునికడ నలరెఁ దా,రాసుత నీలాబ్దమందు ప్రొదినిఁ బోలెన్. 1256

క. మానుగఁ గీశోత్తమ విను, మే నిపు డాపద్మనేత్ర నెంతయు రామ
క్ష్మానాథుకీర్తనంబున, జానకిఁగా నెఱిఁగికొంటి సంభ్రమ మెసఁగన్. 1257

వ. ఇంక దురాత్ముం డగురావణునిచందంబు వినుము. 1258

చ. ప్లవగవరేణ్య వాఁడల పులస్త్యునిపౌత్త్రుఁడు పుణ్యుఁ డైనవి
శ్రవుతనయుండు శ్రీదు ననుజన్ముఁడు వానిపురంబు లంక నా
లవణపయోధిమధ్యమున లాయును దొల్లి సురోత్తముండు శి
ల్పివరుఁడు విశ్వకర్మ సుపవిత్త్రుఁడు దాని రచించె నేర్పునన్. 1259

క. అది మఱియుఁ దప్తజాంబూ, నదచిత్రద్వారతోరణావరణ యై శ
ర్మద యై రమ్యవిలాసా,స్పద యై తనరారు నతివిశాలవిభూతిన్. 1260

వ. అప్పురం బిచ్చటికి నూఱుయోజనంబుల నవ్వలం బ్రకాశించుచుండు. 1261

క. అందు దశాస్యాంతఃపుర, మందు నిశాటీనిరుద్ధ యై జానకి చిం
తం దలఁకుచు సంతాపము,నొందుచుఁ బెనువగలఁ బొగులుచున్నది యనఘా.

చ. అరుదుగ నూఱుయోజనము లంబుధి నశ్రమలీల మీఱు న
త్వరముగ దాఁటి రమ్యమగుదక్షిణపారముఁ జేరి యందు సా
గరపరిఖాపరీత యయి గ్రాలెడులంకను జొచ్చి యచ్చటన్
గుఱుతుగ జానకిన్ దశముఖుం గనుఁ డెంతయు సంతసంబునన్. 1263

వ. ఏను జ్ఞానదృష్టిం జూచి చెప్పెద మీ రశ్రమంబున సముద్రంబుదాఁటి జానకిం
జూచి శీఘ్రంబునం బఱతెంచెదరు నీకిట్టి దివ్యజ్ఞానం బెట్లు గలిగె నంటివేని
మహీసమీపగగనచారిధాన్యజీవికుళింగాదిపక్షివిశేషంబులకుఁ బ్రథమగతియు
వృక్షఫలాశనంబు లైనవాయసాదులకు ద్వితీయగతియు భాసక్రౌంచకురరంబు
లకుఁ దృతీయగతియు శ్యేనంబులకుఁ జతుర్థగతియు గృధ్రంబులకుఁ బంచమగతి
యు బలవీర్యరూపయౌవనవంతంబు లైనహంసలకు నాఱవగతియు వైనతేయు
నకు సప్తమగతియుఁ గలిగియుండు నే మావైనతేయవంశసంభవుల మగుటం
జేసి మాకానష్టమగతి గలిగియుండు నందువలన మాకు దివ్యజ్ఞానంబు గలిగి
యుండు దానం జేసియే యిచ్చటనుండియు లంకాపురంబున నున్నరావణుని జాన
కిని విలోకించుచున్నవాఁడ నదియునుంగాక మాకు దివ్యజ్ఞానమాత్రంబె గాదు
బహుదూరదర్శి యైనదివ్యచక్షుర్బలంబునుం గలిగియుండుఁ గావున నాహార
వీర్యంబుచేతను సౌపర్ణత్వనిబంధనస్వభావంబుచేతను నిత్యంబును శతయోజన
పరిమితదూరంబునం గలసమస్తవస్తువుల విలోకించుచుండుదుము మాకు దూర
దేశస్థితభక్ష్యగ్రహణంబు స్వభావంబున విహితం బై యుండుఁ గుక్కుటాదు
లకుఁ బాదవికీర్ణప్రదేశంబునందు జీవనంబు విహితం బై యుండు నెవ్వనిచేత
నిందితకర్మంబు కృతంబయ్యె నట్టిరావణునకు మద్భ్రాతృకారణంబున మీచేతఁ
బ్రతీకారంబు కృతంబు గాఁగలదు గావున మీరు శీఘ్రంబున సముద్రలంఘ
నంబునం దుపాయంబు చింతింపుఁడు నిక్కంబుగా జానకిని సందర్శించి కిష్కిం
ధకుం జనియెదరు స్వర్గతుం డైనమద్భ్రాత యగుజటాయువున కుదకదానంబు

జనుదెంచి న న్నాశ్వాసించి ఖగేంద్రా నీవు దైవికంబున జీవించితి వింక నీకు నిస్సంశయంబుగాస్వ స్తి యగునని పలికిన నదియేమి యని యడిగిన నమ్మహాత్ము లు నా కి ట్లనిరి. 1270

చ. అనుపమశక్తియు క్తుఁడు దశాస్యుఁడు రాక్షసభ ర్త వాఁడు రా
మునిసతి బల్మిఁ గైకొని సముద్ధతి నేగెడువానికడ్డ మై
యనిమిషు లైననిల్వఁగ సమర్థులు గా రిపు డీవు వానికి
న్గనఁబడి గ్రమ్మఱ న్బ్రతుకుఁ గంటివి నేఁ డిటు దైవికంబునన్. 1271

మ. అనఘా యాదివిబారి యంకగత యై 'హారామ హాలక్ష్మణా'
యని వాపోవుచు దివ్యకాంచనమణీహారావళు ల్ద్రుచ్చుచుం
గనుల న్బాష్పజలంబు గాఱ నొడ లాకంపింప నాక్రందన
స్వనముం జేయుచుఁ జన్న కాంతను మదిన్ క్ష్మాపుత్త్రిఁగాఁ జూడుమీ. 1272

వ. అని పలికి యమ్మహర్షి శ్రేష్ఠులు నన్నుం బంచిన. 1273

క. ఆకారణమున నే నిపు, డాఁకలి గొని యున్న నీకు నాహారంబున్
దే కూరక వచ్చితి నని, ప్రాకటముగ నంతయును సుపార్శ్వుఁడు చెప్పెన్. 1274

ఉ. చెప్పిననాఁట నుండియును జిత్తమునం గడుఁ గోప మూఁది నే
నెప్పుడు పం క్తికంఠు వధియింపుదు సీతను రామభ ర్త కే
నెప్పుడు భ క్తి నిత్తు నని యంతయుఁ జింతిలు చుందుఁ జెప్పిన
ట్లొప్పుగఁ జేయ లేనయితి నొక్కట ఱెక్కలు లేమి నారయన్. 1275

వ. నాకును మీకుం బోలె రామకార్యం బవశ్యక ర్తవ్యంబై యుండు వాగ్బుద్ధిగుణ వ ర్తియైన నాచేత నెయ్యది యాచరింప శక్యంబగు నట్టిసాహాయ్యంబుఁ జేసెద నేను వాక్కుచేతను బుద్ధిచేతను మీ కందఱకు హితం బాచరించెద మీరు బలవంతులరు బుద్ధిమంతులరు రామలక్ష్మణులదివ్యాస్త్రంబు లమోఘంబులు ముల్లోకంబుల నైన రక్షింపను శిక్షింపను సమర్థంబులు సుగ్రీవుండు తేజోబలస మన్వితుండు మీరింద ఱేకోద్యోగు లై గడంగినదురాత్ముం డగురావణుండు హా లియుట కెంత యశ్రమంబున వానిం బరిమార్చి కల్యాణగుణసమేత యైనసీతం జేకొని రామునకు సమర్పించెదరు గావునఁ గాలవిలంబనంబు సేయక భవిష్య దర్థంబునందు బుద్ధినిశ్చయంబు గావింపుఁడు భవాదృశు లైనబుద్ధిమంతులు కార్యంబులందుఁ జిక్కుపడ రని పలికి వెండియు జనితవిశ్వాసుం డై సంపాతి సంతోషవిశేషంబున నంగదు నవలోకించి నావృత్తాంతంబును సీతావృత్తాంతం బును విస్పష్టంబుగా వినిపించెద నేకాగ్రచిత్తు లై వినుం డని యి ట్లనియె.

సంపాతి వానరులకుఁ దనపూర్వవృత్తాంతము సెప్పుట.

క. మును చండకరునికరముల, ఘనముగ నాపక్షయుగము గాలి మహీధ్రం
బునఁ బడితి నన్నవా ర్తను, వినిపింపఁగ మీర లెల్ల వింటిరి గాదే. 1277

వ. ఇట్లు శిఖరిశిఖరంబునం బడి యుండి యాఱు రాత్రులకు మూర్ఛదేఱి దిక్కులు
పరికించి సాగరశైలనదీనదసరోవరంబు లన్నియు వీక్షించి సముద్రవేలావనం
బులు విలోకించి కొంతవడవునకుఁ దరుకందరసానునిర్ఝరాద్యభిజ్ఞానంబులవలన
నిది దక్షిణసముద్రతీరంబునం బొల్చువింధ్యపర్వతంబు గదా యని యెఱింగితి
నచ్చట నప్పుడు నిశాకరుం డనుమహర్షిశ్రేష్ఠుండు బ్రహ్మాసనముం డొక్కమహా
నీయాశ్రమంబు నిర్మించుకొని యందు నేనును జటాయువు నిత్యంబు సేవించు
చుండఁ బెద్దకాలం బత్యుగ్రతపంబు గావించు చుండె నతం డిప్పటికి నెనిమిది
వేలేండ్లు ముందఱ యథేచ్ఛ నాకంబునకుం జనియె నే నాపర్వతాగ్రంబు డిగ్గి
దర్భకంటకపరివృత యైనవిషమభూమి నతిప్రయాసంబున సంచరించి క్రమ్మఱ
నతివిశాలరమణీయ నిరంతర కుసుమఫలభరిత వివిధతరులతావిసర విభ్రాజిత మ
హోద్యానసంకులం బైన యమ్మునియాశ్రమసమీపంబునకుం జని యొక్కవృ
క్షమూలంబున నాసీనుండ నై మందమారుతానీతపరిపక్వ ఫలకుసుమవిసరదివ్య
గంధం బాఘ్రాణించి యరు దందుచు భగవంతుం డైననిశాకరమునిరాకఁ
గోరుచుండ ననతిదూరంబున భానుప్రభాభాసమానుండును గృతాభిషేకుం
డును దుర్ధర్షుండు నుదఙ్ముఖుండు నై వచ్చుచున్న నిశాకరమునీంద్రు నవలోకించి
సంతసించి తద్గతవీక్షణుండ నై యుండ నప్పుడు. 1278

చ. పరువడి ధాతవెంటఁ జనుప్రాణులకై వడి మానివెంబడిం
గరిహరిముఖ్యదారుణమృగంబులు పోయి మునీంద్రుఁ డాత్మమం
దిరము సొరంగ వెన్క కరుదెంచె నృపుండు గృహంబు సేర సు
స్థిరముగ మంత్రులుఁ హితులు సేనలు వెన్కకుఁ బోవునట్లుగన్. 1279

వ. అట్టివిచిత్రంబుఁ జూచి యేను నమ్మహర్షిశ్రేష్ఠునివెంటం జని యాశ్రమద్వారం
బున నుంటి. 1280

క. మునివరుఁడు నన్నుఁ గనుఁగొని, మనమున గుఱు తిడఁగ లేకమానుగ నుటజం
బున కేగి నిమిషకాలము, చనునంతకు మరల వచ్చి సంభ్రమ మెసఁగన్. 1281

వ. నన్ను విలోకించి. 1282

తే. ఎవ్వఁడవు నీవు పక్షంబు లేటి కిట్లు
గమలె నీచర్మ మేటికిఁ గందె నిపుడు
రోమవైకల్యమునఁ జేసి నామనమున
గుఱు తిడఁగ లేకయున్నాఁడ నెఱుఁగఁ జెపుమ. 1283

క. ఖ్యాతిగ నచ్చట మును సంపాతి జటాయువు లనంగఁ బక్షిప్రవరు
ల్భ్రాతలు విశ్రుతపౌరుషు, లాతతబలు లిద్ద ఱుందు రధికప్రీతిన్. 1284

తే. అందు సంపాతి పెద్దవాఁ డతనితమ్ముఁ, డాజటాయువు వారిద్ద ఱరయ కామ
రూపులాటలచేయునుమహూవులగుచు, నొప్పిదంబుగ నన్నుఁ గొల్చుచుందు రెపుడు.

క. శూరులు సమీరవేగులు, సారబలోదారు లనిలసమవేగులు నీ
వారయ సంపాతివి గద, యీరూపము నీకు వచ్చె నెట్టులు చెపుమా. 1286

వ. అనిన నమ్మునీంద్రు పలుకులు విని యేను వ్రీడానమ్రవదనుండ నై భక్తితాత్ప
ర్యంబున నంజలి గీలించి నావృత్తాంతం బంతయు సవిస్తరంబుగా నెఱింగించు
వాఁడ నై యే నిట్లంటి. 1287

సీ. అనఘాత్మ యేను జటాయువు దర్పమోహితుల మై జవసత్త్వ మెఱుఁగఁ గోరి
మనలోన నెవ్వఁడు దినములోపల సూర్యు మునుముట్టు వానికి ముట్టనట్టి
వాఁ డర్ధరాజ్యంబు వసుతోడ నొసంగునట్లుగా మునులసముక్షమందుఁ
బన్నిదం బిడి శంభుపర్వతంబున నుండి యేకకాలంబున నిరువురమును

ఆ. మింటి కెగసి గాడ్పుకంటె ఖగేంద్రున,కంటె మానసమునకంటె నధిక
జవముతోడ గగనచరభూతసంతతి, నంత నంతఁ గనుచు నరిగి యరిగి. 1288

మ. గరిమన్ దివ్యులభవ్యవాద్యరవముల్ గంధర్వగానస్వరో
త్కరము ల్దేవసతీవిభూషణకలధ్వానంబులు న్సామగా
నరవంబుం దగ వించు నిర్జరవిమానశ్రేణులం జూచుచు
న్స్వైర మొప్పు న్సురసిద్ధసాధ్యతతుల న్వీక్షించుచు న్బోవుచున్. 1289

సీ. మరలి చూడఁగఁ దోఁచె మాకు శతాంగరథాంగప్రమాణంబులై పురములు
శిఖరిసంఛన్న యై చిదుపఱా ల్పఱచిన చేనికై వడి భూమి గాన నయ్యె
మడుగులోఁ జిక్కినమాతంగములమాడ్కి వింధ్యాదికులశైలవితతు లొప్పెఁ
జంపకారణ్యాదిసకలకాంతారము ల్పచ్చికతిన్నెలపగిదిఁ దోఁచెఁ

తే. బేరు గల నదు లన్నియు వేఱువేఱ,ముత్తియపుఁ బేర్లచందాన మొనయుచుండె
శరధు లద్దపుబిళ్లలకరణి నలరెఁ, బాదపము లెవ్వియును గనుపట్ట వయ్యె. 1290

తే. అంత మఱికొంతదూర మట్లరిగి యరిగి, యేమి దోఁపక మదిఖేద మినుమడింప
నేల వచ్చితి మిటకు నిం కెట్లటంచు, మోహవశమున నెంతయుమూర్ఛఁ దగిలి.

క. ఇది దక్షిణ మిది యుత్తర, మిది తూర్పిది పశ్చిమాశ యిది మూల లటం
చది యేర్పరింపఁ జాలక, మది సంకటపాటు సంభ్రమం బిగురింపన్. 1292

క. సుడివడి కన్నులు దెఱవక, కడు రయమునఁ బుడమి కుఱకఁగా లేక వడి
న్బొదు వెగయుటకుం జాలక, జడత న్గొంతవడి భీతిసంత్రస్తుల మై. 1293

వ. ఉండి వెండియు నొక్కింతధైర్యంబునఁ గన్నులు విచ్చి కొండొకపోడు వెగయ
ననతిదూరంబునఁ బ్రళయకాలాగ్నిచండంబున వెలుంగుచు రక్తవర్ణంబై
భూమండలప్రమాణం బై దేదీప్యమానం బై మార్తాండమండలంబు గానం
బడియె నప్పుడు తత్తేజోమూర్తితిగ్మకిరణసంజాతగాఢమూర్ఛాతమంబు
గవయ వివశుం డై జటాయువు తలక్రిందుగాఁ గడువడిఁ బుడమిం బడుచుండ

నతనిం జూచి యేను బూర్వాధిష్ఠితాకాశప్రదేశమునసుండి జటాయూరక్షణా
ర్థంబు ప్రసారితపక్షుండ నై తదుపరిభాగంబున దిగంబడుచుండ నాజటాయువు
మత్పక్షరక్షితుండై దహింపం బడకుండె నేను బ్రమాదంబున దగ్ధపక్షుండనై
వాయుపథంబుననుండి వింధ్యపర్వతంబునం బడితి జటాయువు జనస్థానంబునం
బడియె నని తలంచెద నిట్లు వింధ్యాద్రిపయింబడి యేను దగ్ధపక్షుండనై రాజ్య
హీనుండ నై విక్రమరహితుండనై జటాయువునుం బాసి దుఃఖింపుచుఁ బక్షం
బులు లేనినాకు నిం కెక్కడిజీవనం బని తలంచుచు శైలశిఖరంబుననుండి
విఱుగం బడి యైనఁ జచ్చెదఁ గాక యని మరణకాముండ నై యిట్లున్నవాఁడ.

క. అని పలికి బాష్పధారలు, కనుఁగొనలం గ్రమ్ము దేరఁ ఘనతరదుఃఖం
బున నున్న నన్నుఁ గనుఁగొని, తనమదిఁ దలపోసి మౌని తగ నిట్లనియెన్. 1295

ఉ. పక్షివరేణ్య ప్రాకృతునిభంగిఁ గృశింపఁగ నేల నీకు నీ
పక్షములుం బరాక్రమము ప్రాయము సత్త్వము మున్నపోలె నీ
కక్షయమై ఖరి న్మొలుచు నారసి దానికి హేతు వేను బ్ర
త్యక్షముగాఁగఁ గంటి విను మాకథ యంతయు నీకుఁ జెప్పెదన్. 1296

సీ. దశరథాఖ్యం డగుధరణీశునకు రాముఁ డనఁగ నందనుఁ డొక్కఁ డవతరించు
నమ్మహామహుఁడు ప్రియానుజయుక్తుఁడై జనకుపంపున వనంబునకు వచ్చు
రావణుం డనుదుష్టరాక్షసుం డొక్కఁ డాయవనీశ్వరుని దేవి నపహరించు
నద్దేవి రాక్షసాహారంబు గొనకున్న నమరేంద్రుఁ డమృతదివ్యాన్న మొసఁగు

తే. రమణ దేవత్వ మొందిన బ్రతికి యున్న
బరఁగ నీయన్న మారఘువరుల కనుచు
నగ్రభాగంబు గైకొని యమ్మహీజ
ప్రియము మెఱయంగఁ బెట్టు ధరిత్రిమీఁద. 1297

క. ఆరమణిని వెదకుచు సొం,పారఁగ రఘురామదూత లగుకపు లిటకుం
గోరిక రాఁగల రప్పుడు, వారికి నీ వామహీజవార్తం జెపుమా. 1298

క. ఆకపులతోడ నీవును, జేకొని సంభాషణంబు జేసితివేని
న్నీకెప్పటివలె ఱెక్కలు, ప్రాకటముగ జవము బలము ప్రాయము వచ్చున్. 1299

క. మరణేచ్ఛ విడిచి యండజ, వర యిచ్చట దేశకాలవర్తనములలా
గరయుచుఁ గీశాగమనము, నురవడి నెప్పుడును గోరుచుండుము ప్రీతిన్. 1300

క. ఏ నిపుడు నీకు రెక్కలు, మానుగ నీయఁగల నైన మానక నీ వి
చ్చో నుండవలయు జగతికిఁ, బూనికఁ గడుహితము సేయుపొంటె ఖగేంద్రా.

క. నీకును విప్రోత్తములకుఁ, బ్రాకటముగ లోకములకుఁ బరమమునులకున్
నాకాధిపునకు సురలకుఁ, గాకుత్స్థుం కార్య మదియుఁ గర్తవ్య మగున్. 1302

వ. నాకును రామలక్ష్మణులం జూడ వాంఛ గలదైనను జిరకాలంబున నుండి జీర్ణం

బైనయీశరీరంబునందుఁ బ్రాణంబులు నిలుపుకొనుటకు భరంబై యున్నది గావునఁ గళేబరత్యాగంబుఁ జేసి దివంబునకుం జనియెదనని పలికి యమ్మునీంద్రుం డు నిజాశ్రమంబు ప్రవేశించె నంత నేను గిరికందరంబువలన నిర్గమించి మెల్లన వింధ్యపర్వతాగ్రంబు నారోహించి మునివచనప్రకారంబున భవత్పరిపాలన కర్మంబునందు సమాహితుండనై దేశకాలంబులు ప్రతీక్షించుచు శీతవాతాత పంబులకుం జావక ప్రాణంబులు చిక్కఁబట్టుకొని యుంటి నంత నూఱుసంవత్స రంబులు కడచిన నమ్మునీంద్రుండు మహాప్రస్థానంబుఁ జేసి దివంబునకుం జనియె నాఁటంగోలె నేను బరమదుఃఖంబునం బొగులుచు మరణంబునందు సముత్థిత మైనబుద్ధిని మునివాక్యంబులచేత నివర్తించుచుఁ బ్రాణసంరక్షణంబుకొఱకు మునీంద్రునిచేత నెయ్యది దత్తం బయ్యె నట్టివివేకంబుచేత దీప్తాగ్నిశిఖచేతఁ దమంబుం బోలె దుఃఖంబు నపనయించుచు మీరాక కెదురు సూచుచు నిన్న గంబునం దున్నవాఁడ నేను రావణువీర్యంబు నెఱింగియు రావణువధించి సీతను రక్షింపవైతి వని నాపుత్త్రుం దూలనాడితి నాతండు జానకీవిలాపంబులు వినియు రామలక్ష్మణులకుం బాటిల్లిన సీతావిరహవ్యసనం బెఱింగియు నాకుఁ బ్రియంబు సేయఁ డయ్యె నని పలికి సంపాతి వెండియు నిట్లనియె. 1303

### సంపాతికిఁ బక్షములు మొలుచుట.

ఉ. ఏను జవాతిరేకమున నెంతయు వారిధి దాఁటి లంకలో
జానకిఁ గాంచి మీకడకుఁ జయ్యన రాఁగలనైన నిప్పుడో
వానరవీరులార కడువార్ధక మొందుటఁ జేసి దుర్మదుం
డైనదశాస్యునిం దొడరి యాలమొనర్పఁగఁ జాల బల్విడిన్. 1304

క. అని యుచితోక్తుల మోదము
జనియింపఁగ మాటలాడుసంపాతికి జ
య్యనఁ గపులు చూచుచుండఁగ
ఘనముగఁ బక్షములు రెండు గ్రక్కున మొలిచెన్. 1305

క. శౌర్యము సత్త్వము తేజము, ధైర్యము విక్రమము జవము దర్పము బాహా
వీర్యము మునుపటి పోల్కి న, వార్యగతిం దోడుతోడ వరుస న్బొడమెన్. 1306

వ. అభినవరూపయౌవనపక్షోపలక్షితుం డై యప్పక్షీంద్రుండు పరమానందభరి తాంతఃకరణుం డై వానరుల నవలోకించి యిట్లనియె. 1307

చ. అమర నిశాకరుండు దయ నాడినకైవడి సూర్యరశ్మిచేఁ
గమలిననాదుపక్షములు గ్రక్కున నిప్పుడు వచ్చె భూరితే
జము జవసంపదల్ గలిగె సత్త్వము చేకుఱె విస్ఫురత్పరా
చ. క్రమ మలరారె శౌర్యమును బ్రాయము శోభిలెఁ బూర్వవైఖరిన్. 1308
జనకజవార్త మీకు వరుస న్వినిపించితిఁ బుణ్యుఁ డైనరా

మునకు హితంబుఁ జేసితి సమున్నతి ధన్యుఁడ నైతి మీరు చ
య్యన జలరాశి దాఁటఁగఁ బ్రయత్నము సేయుఁడు కార్యసిద్ధిఁ గై
కొనుఁ డిఁక వేడ్క నేను నయకోవిదులార యథేచ్ఛ నేగెదన్. 1809

క. అని పలికి వానరుల వీడ్కొని వాయుసమానజవుఁ డకుంఠితశౌర్యం
డనఘుఁడు సంపాతి రయంబున నంబరవీథి కెగసిపోయె న్గడిమిన్. 1810

వానరు లందఱు సముద్రతీరముఁ జేరుట.

వ. అంతఁ దారేయాదివానరవీరులు సంపాతివచనంబులు విని ప్రీతిసంహృష్టమాన సులై ప్రాయోపవేశంబు చాలించి విక్రమబలసాహసంబు లాశ్రయించి సీతా దర్శనలాలసులై యచ్చోటు వాసి యందఱు నతిమానుషమార్గవేగంబున నాకా శంబున కెగసి దిక్కు లద్రువ సింహనాదంబులు సేయుచు మహోత్సాహసమేతులై రావణనిలయభూతలంకాద్వీపంబు నుద్దేశించి గమ్యాగమ్యభూతం బైనసాగరంబు డాయ నరుగుట్టి యొక్కింతదూరం బరిగి నను స్వర్గోపమ మిబింబాధారభూతము కురతలంబుం బోలె నొప్పు మహోన్నతినమహేంద్రగిరిశిఖరంబుఁ జేరి యచ్చట సన్నివేశంబు గావించి. 1811

చ. అనఘులు వానరప్రవరు లంబునిధుం బరికించి రంతఁ జే
ఘనబలినక్రవాసిభుజగంబులచే నిజవీచమాలిచే
ననుపమమీనకూర్మమకరాదిమహోరగసత్త్వకోటిచే
దనరెడుదాని ఘోర మగుదానిఁ బయోనిధిఁ గాంచి గరుద్యడన్. 1812

వ. మఱియు రోమహర్షణకరంబును గగనంబుభంగి దుష్పారంబు నగుమున్నీరు కన్నా రం జూచి 1813

చ. అతిభయదాకృతి న్దగము లన్నియు నొక్కట ముంచఁ జాలి యూ
తితఘనవీచికావళులఁ దద్దయు నొప్పుమహోదధి యే
గతిఁ దరియింత మయ్య యిఁకఁ గార్య మటంచు విషణ్ణమూర్తులై
ధృతి చెడి యుండి రప్పుడు నదీశవిలోకనజాతభీతులై. 1814

వ. ఇట్లు సాగరనిరీక్షణంబువలన విషణ్ణులై యున్నవానరుల నవలోకించి వీరందఱు భయార్తులై విషాదంబు నొంది యున్నవారు విషాదంబువలనఁ బురుషార్థంబు సిద్ధింప దని విచారించి మహాబలుండును సాహసబలుండు నగువాలినూనుండు వారి నందఱ నాశ్వాసించుచు నిట్లనియె. 1815

అంగదుఁడు వానరుల విషాదము వీడునట్లు బోధించుట.

ఉ. ఏల విషాద మొందఁ బ్లవగేశ్వరులార విషాద మున్నగో
జాలఁగ దోష మందురు విషాద ము దెంతవిశేషమైన నా
బాలునిఁ గ్రూరపన్నగముభంగి వధింపఁగఁ జేయు విక్రమో
ద్వేలత నాయుధ ద్ధృతిని దేజము నష్టము సేయు నంతయున్. 1816

క. శోకంబు నొందఁ జనదు వి,వేకము గలనరుఁడు కార్యవిఘ్న మొనర్చు
న్శోకంబు మఱియు శోకముఁ, బోకార్చును ధాత్రిఁ బురుషపురుషార్థంబుల్.

వ. కావున మీరు శోకవిషాదంబులు దక్కి యుత్సాహవంతులరుగం డని బోధించిన నంగదువచనంబులం దేఱి యావానరపుంగవులు దేవతలు వాసవునిం బోలె నతనిం బరివేష్టించి యారాత్రి గొల్చి యుండిరి. 1318

క. జలనిధి కెన యగువానర, బలమును వడి నిల్వరింపఁ బావనికి మహా
బలుఁ డగునంగదునకుఁ గా, కిల వేఱొక్కనికి శక్యమే తలపోయన్. 1319

వ. అంత నమ్మఱునాఁ డంగదుండు పెద్ద లగుజాంబవదాదులతో నాలోచనంబుఁ జేసి వారి యనుమతి వడసి యెల్లవానరులు వినుచుండ నిట్లనియె. 1320

ఉ. ఎవ్వఁడు నూఱుయోజనము లిప్పుడు నీరధి దాఁటఁ జాలువాఁ
డెవ్వఁడు భానుమత్తనయు నెంతయు సత్యముచేతఁ బ్రోచువాఁ
డెవ్వఁడు నీబలీముఖుల నెల్లఁ గృపామతి నుద్ధరించువాఁ
డెవ్వఁడు లంకఁ జొచ్చి పృథివీశసుతం గని రాఁగలం డొగిన్. 1321

ఉ. ఏహరివీరుసత్కరుణ నింకఱ మిక్కడఁ బోక జానకి
న్సాహస మొప్పఁ గాంచి రఘునాథున కాసతివార్తఁ జెప్పి యు
త్సాహ మెలర్ప వీటికి వెసం జని మిత్రకళత్రపుత్రక
వ్యూహముతోడఁ గూడి సుఖయుక్తిఁ జరించెద మింక్లపట్టునన్. 1322

క. ఏపుణ్యాత్ముఁడు మన కిపు, డీపట్టున నభయ మొసఁగి యిందఱఁ గృపచే
నేపారఁ బ్రోచు నెవ్వఁడు, భూపాలకమోదకారి పొలుపుగఁ జెపుఁడీ. 1323

క. అని యంగదుండు పలికిన, విని కపివరు లెల్లఁ జాల వెఱఁ గందుచు నా
ననములు వాంచి మరల నే,మన కుండిన వారి కనియె నాతఁడు మరలన్. 1324

ఉ. మీరు భుజాబలాధికు లమేయపరాక్రమశీలు రిందఱి
ట్లూరక యుండఁ జెల్లునె పయోనిధి నెవ్వఁడు యొంతదవ్వు సొం
పారఁగ దాఁట నోపును బలాబలము ల్దలపోసి చెప్పుఁ డే
పారఁగ రామకార్య మెటులైన నొనర్చు టవశ్యమే కదా. 1325

క. ఏలోకంబున డాఁచిన, వాలాయము సీతఁ గాంచి వచ్చెద మని స
త్యాలాపములు పలికి తుది, నీలాగున వెఱఁగు నొందు టిది ఘన మగునే. 1326

వానరులు తమతమజవసత్త్వంబుల నంగదునికిఁ జెప్పుట.

వ. అనిన నయ్యంగదువచనంబులు విని గజగవాక్షగవయశరభగంధమాదన మైంద ద్వివిదసుషేణజాంబవంతులు తమతమబలంబులకొలంది తలపోసి యత్యంతశక్తియుక్తుం డైనరావణుం డధిష్ఠించి యున్నలంకఁ బ్రవేశింపను జానకి నన్వేషింపను సుదుష్కరం బని తలంచి తాదృశకార్యసాధకుం డైనవీరుండు హనుమంతుం డని యెఱింగి తత్ప్రోత్సాహనార్థంబు మన మందఱ మల్పంబుగా స్వస్వప్లవనశక్తి నిరూపించి చెప్పవలయు నని నిశ్చయించి యంగదు నవలోకించి.

సీ. నలువొప్పఁ బదియోజనంబులంబుధిదాఁటఁగలవాఁడ నని వేడ్కఁ గజుఁడు పలికె
నమర నిర్వదియోజనము లుత్తరించెద నని సంభ్రమమున గవాక్షుఁ డనియె
ముప్పదియోజనంబులు వార్ధి దాఁటంగఁ గలవాఁడ నని పల్కెఁ గవయుఁ డప్పు
డురువడి నలువదియోజనంబులు దాఁటఁ జాలుదు నే నని శరభుఁ డనియె

తే. మొనసి యేఁబదియోజనములు పయోధి
దాఁటఁ గల నని గంధమాదనుఁడు పలికె
నురుజవంబున నఱువది యోజనములు
దాఁటెద నటంచు మైందుండు చాటి చెప్పె. 1828

క. పొలుపుగ డెబ్బదియోజన, ములు నెనుబదియోజనములు మునుకొని దాఁటం
గలవార మనుచు ద్వివిదుం, డెలమి సుషేణుండు పలికె రెండవయుఁ బ్రీతిన్.

వ. ఇట్లందఱుఁ దమతమసత్త్వంబులకొలంది పలికిన వానరులం జూచి యతివృద్ధుం
డును బలవంతుండు నగుజాంబవంతుం డిట్లనియె. 1830

ఆ. వయసునాఁడు నాకు వైనతేయునకంటె
శ్వసనుకంటె నధికజవము గలదు
కపివరేణ్యులార కడువృద్ధుఁ డగుటచే
నిప్పు డదియుఁ జాల హీన మయ్యె. 1831

చ. అయినను రామభూవిభున కయ్యనసూతికిఁ గూర్చువాఁడ నై
ప్రియమునఁ దోఁచినంత యొనరింపక ప్రాణము దాఁచి కొందు నే
నియను మెలర్ప నే నిపుడు నీరధిఁ దొంబదియోజనంబులు
న్లయవిడి దాఁటువాఁడ నవలం జనఁజాలను వృద్ధుఁ డౌటచేన్. 1832

―జాంబవంతుం డంగదునకు మున్ను తాఁ జేసిన సాహసంబులఁ జెప్పుట―

క. అని యిట్లు నవ్విరించన, తనయుండు నచించి మురలఁ దరుచరవరులం
గనుఁగొని యుత్సాహముతోఁ, దనపూర్వవిధంబుఁ జెప్పఁ దగ నిట్లనియెన్.

క. మును నేను బలిమిఁ గావించిన కార్యము లెల్ల నిపుడు చెప్పితి నేని
ఘనులార విన్నవారల, కనిశముఁ బరిహాసకరము లై యుండు గదా. 1834

వ. అయిననుం జెప్పెద వినుండు. 1835

మ. కని యున్నాఁడను దొల్లి శైలములు త్రొక్కఁ గ్రల్లి వర్తించుట
ల్దనుజు ల్వేల్పులు వార్ధిఁ ద్రచ్చి సుధ నందం బొప్పఁ బుట్టించుట
ల్ఘనుఁ డాతార్క్ష్యవిభుండు పుట్టుటయు వీఁకన్ నాకనాథుండు లో
చనయుగ్మంబున నొప్పి యుండుటయు విస్పష్టంబుగా నెంతయున్. 1836

మ. బలభేదిం గృపఁజూచి విష్ణుఁడు బలి న్బంధించి సాటోపుఁ డై
పొలుపారంగఁ ద్రివిక్రమాకృతి జగంబు ల్నిండ వ్యాపింప ని

మ్ముల నమ్మేనికిఁ దొల్లి యేను వరుస న్మయ్యేడుమాఱు లుర్వర
ల్గిలకింపంగఁ బ్రదక్షిణంబు ఘనభ క్తిన్జేసితి న్వేల్పుల్మెడిన్. 1337

ఆ. పొడువుఁగొండ మీఁదఁ బొడచుట మొదలుగా
నినుఁడు గ్రుంకు నంత కెంత దవ్వు
పోవునంత దవ్వు పొలుపారఁగా నేను
జాములోనఁ బోదు జవము మెఱయ. 1338

వ. ఇప్పుడు నేను విశేషించి వృద్ధుండ నైతి బలపరాక్రమజవంబులు నానాఁటికి నశి యించుచు వచ్చెఁ గావున దూరగమనంబు భరంబై తోఁచుచుండు మహాను భావుం డగురామునికార్యం బనుపేక్షణీయం బగుటం జేసి యగ్గలిక సొంపున దొంబదియోజనంబులు దాఁటం గల వాఁడ నని పలికితిఁ దొల్లి నాచేసిన దు ష్కరంబు లగుకర్మంబులు తలంచుకొనిన నిప్పుడు పులకలు పొడముచున్న వని పలికిన విస్మయకరంబు లగుజాంబవంతునిపలుకుల కలరి యనుగ్రాపవాక్యంబుల నమ్మహాత్మునిం బ్రస్తుతించి యంగదుం డిట్లనియె. 1339

క. అలఘుజవంబున నిప్పుడు, జలనిధి శతయోజనములు చయ్యన దాఁటం
గల నిచటికిఁ గ్రమ్మఱ రాఁ, గల యంతవిశేషశక్తి గలదో లేదో. 1340

జాంబవంతుఁ డంగదునిం బొగడుట.

వ. అనిన విని వాక్యకోవిదుం డగుజాంబవంతుండు హరిశ్రేష్ఠుం డైనయంగదున కిట్లనియె. 1341

చ. వనచరవీర నీకు నలవాలికిఁబోలె జవంబు తేజముఙ
ఘనతరవిక్రమంబు బలగర్వము నిస్తులశక్తి గ్రాలు న
ట్లనుపమలీల యోజనసహస్రము లైనఁ దరింపఁ జాలు దీ
యనువున నూఱు యోజనము లంబుధి దాఁటుట కెంత యారయన్. 1342

క. వేగబలంబుల నీవు స, దాగతి కిల సాటి వత్తు వబ్ధిఁ గడచి వేఁ
బోఁ గలవు సీతఁ గనుఁగొని, రాఁగలవు సమగ్రదోర్గపరాక్రమము మెయిన్.

ఉ. పొందుగ వాలి పోలెఁ గపిపుంగవ నీవు ననారతంబు మా
కందఱకుఙ విభుండవు త్వదాజ్ఞఁ జరించెడువార మేము వే
డ్కం దగుభంగి సీత వెదక న్మముఁ బంపుము మేము గల్గ నీ
కుం దగ దయ్య లంకకు నకుంఠితవైఖరి నొంటిఁ బోవఁగన్. 1344

క. ని న్నీకీశులు మతిసం, పన్నత సేవించి భృత్యభావంబులతో
నున్నారు నీవు విభుతం, బన్నగ వెస వీరిఁ బంచి పనులం గొనుమా. 1345

చ. ఇనసమతేజ సైన్యమున కెంతయు స్వామి కళత్ర మంద్రు నీ
వనిశము నట్ల మా కహరహంబు కళత్రము దిక్కు గావునఙ

ప్రణుతగతిఁ గళత్రము తెలుఁగునఁ బాల్యుఁడ వీవు మాకు ని
ట్లనుచిత మైనకార్యమున కర్థిఁ గడంగుట గూడ దిత్తఱిన్. 1346

వ. మహాత్మా నీ విక్కార్యంబునకు మూలం బర్థమూలంబు చేసికొని రక్షించుకొ
నుట కార్యవిదులకు ధర్మంబు మూలంబు నశింపకున్న గుణంబు లైనపుష్పఫ
లాదులు సిద్ధించుఁ గావున నెల్లభంగుల మూలమాత్రుండ వైన నీవు మాకు
మిక్కిలి రక్షణీయుండ వదియునుం గాక. 1347

క. అరయఁగ మాకుఁ గురుఁడవు, గురుపుత్త్రుఁడ వీవు నిన్నుఁ గొని దగ నేమం
దఱ మర్థసాధనమునం, దిరవుగ సామర్థ్యసిద్ధి నెసఁగెద మనఘా. 1348

వ. కపీంద్రా బుద్ధివిక్రమసంపన్నుండ వైననిన్ను విడువం జాలము నీపంపున నెల్ల
పనులు నేమె సాధించెద మని పలికిన మహాప్రాజ్ఞుం డైనజాంబవంతునిపలుకులు
విని యంగదుండు వెండియు ని ట్లనియె. 1349

ఆంగదుఁడు జాంబవంతునితోఁ దానె లంకకుఁ బోయివచ్చెద ననుట.

సీ. దిననాథసుతుని సందేశంబు సేయక కడఁకతోఁ బ్రాణముల్ గాచికొనఁగ
నలవిగా దెవ్వరి కతనికోపప్రసాదము లెన్నఁడు నిరర్థకములు గావు
జలనిధి దాఁటక జానకిఁ జూడక మరలిపోయినఁ గిన్క మనలఁ జంపుఁ
గావున మిథిలేశకన్యవార్త నిజంబు గా నెఱుంగక పోవఁ గాదు మనకు

తే. సాహసంబున నెట్టు లైన జలధి దాఁటి
వసుమతీపుత్త్రిఁ గనుఁగొని వచ్చు టొండె
నొనరఁ బ్రాయోపవేశంబు నొందు టొండె
వలయు మఱి యొండుకార్యంబు వలను గాదు. 1350

చ. వననిధి దాఁటి పోయి నృపవల్లభఁ గానక యేను గ్రమ్మఱన్
జనపతితోడ నే మనుచు సమ్మతిఁ జెప్పుచు నూరకేగి యా
దినకరపుత్త్రు దండముల దిక్కఱి చావఁగఁ జాల వేగ నే
యనువున నైన నేగి వసుధాధిపుదేవిని జూచి వచ్చెదన్. 1351

జాంబవంతుఁడు లంకకుఁ బోయి రాఁదగినవాని నంగదున కెఱింగించుట.

వ. అని పలికిన నంగదునివచనంబు విని బలవంతుం డగుజాంబవంతుండు మరల
నతనిం జూచి సముద్రంబు దాఁటను సీతం జూచి క్రమ్మఱ వచ్చుటకుం జాలిన
వీరునిం జెప్పెద వినుము. 1352

చ. నరపతికోర్కి దీర్ప నలినప్రియపుత్త్రునివం పొనర్ప స
త్వరముగ వార్ధి దాఁట నల దైత్యునిప్రోలు సొరంగ జానకిం
గర మనురక్తిఁ గాంచి వెనఁ గ్రమ్మఱ రాఁగలయట్టివీరుఁ డ
త్యురుబలుఁ డీసమీరసుతుఁ డుండఁగ నింత విచార మేటికిన్. 1353

వ. అని పలికి యవ్విరించననందనుండు ప్రఖ్యాతబలపౌరుషుం డగువానిఁ బ్లవనశీలురలో వరిష్ఠుం డగువాని నేకాంతంబు నాశ్రయించి సుఖోపవిష్టుం డై యున్నవానిఁ గపివంశప్రదీపకుం డైనహనుమంతు నవలోకించి యెల్లవారును వినుచుండ మృదుపూర్వకంబుగా ని ట్లనియె. 1354

ఉ. సారగుణోత్తరుండవు ప్రసన్నబలుండవు కీశవంశవి
స్తారుఁడ వర్థధర్మనయశాస్త్రవిదుండవు శౌర్యశాలి వో
మారుతపుత్ర నీపనులు మాపయిఁ బెట్టఁ దొలంగి పల్కకి
ట్టూరక యున్నవాఁడవు పయోనిధి దాఁటఁగ మాకు శక్యమే. 1355

క. జవతేజోవిక్రమముల, రవిసుతునకు లక్ష్మణునకు రామునకును గం
ధవహునకు సాటి వత్తువు, పవమానతనూజ నీవు పరికింపంగన్. 1356

చ. ఖగపతి వైనతేయుఁ డలకశ్యపపుత్త్రుఁడు శౌర్యశాలి ప
న్నగకులవైరి ము న్నురగనాథులఁ జేకొని పెక్కుమాఱు ల
త్యగణితసత్త్వసంపదల నంబుధి దాఁటఁగఁ గంటి దాని ప
క్షగతబలంబు నీఘనభుజంబులకుం గల దెన్ని చూడఁగన్. 1357

తే. బలము తేజంబు బుద్ధియుఁ బ్రౌఢవంబు
విక్రమము శౌర్యసంపద వేగ మఖిల
భూతములకంటె నీకు విఖ్యాతభంగి
నెక్కు డై యుండు నింతయు నిక్కువంబు. 1358

జాంబవంతుఁడు హనుమంతునిం బొగడుట.

సీ. అమరవేశ్యలలోన నతికీర్తనీయ యై యలరారుఁ బుంజికస్థల యనంగ
నది శాపవశమున నగచరపతి యైన కుంజరునకు ముద్దుకూఁతు రగుచు
జనియించి యంజన యనుపేర లోకవిశ్రుతిఁ గాంచి యసమానరూపమహిమఁ
దనరారి కేసరి యనుబలీముఖవీరునకు బత్ని యై యొక్కనాఁడు వేడ్కఁ

తే. గామరూపిణి గావునఁ గాంతితోడ
వలుఁదచన్నులు వాలుచూపులు విశాల
జఘనము వినీలకచములు చారుముఖము
గ్రాల శృంగారముగ మర్త్యకాంత యగుచు. 1358

సీ. తనముద్దుమోముఁ గన్గొని నవాంభోజాత మని తేఁటిగమి కొంత చెనకఁదివురఁ
దనమోవి మురువుఁ గన్గొని బింబఫల మని రాజకీరంబులు రద్దుసేయఁ
దనపాదములయంద మనువుగాఁ బరికించి విద్రుమభ్రాంతిఁ గోవెలలు గలియఁ
దనబాహువులుగాంచి ఘనమృణాళములంచు నెంచియంచలు వేడ్కమించియలర

తే. గటకనూపురమేఖలాఘటితరత్న, ఘంటికానాదములు ఘల్లుఘల్లు మనఁగ
శైలకటకాంతరస్థవిశాలరమ్య, చందనోద్యానమున నాడునమయమందు 1360

చ. విడువక పద్మకుందకరవీరసుగంధము సంగ్రహించి సొం
పడరఁగ వృక్షషండముల నల్లనఁ బొంచి రసాలవల్లిపై
సుడియుచు భృంగసంఘముల ఝుమ్మని రేఁపుచు గాడ్పు లీలతోఁ
గడువడిఁ వచ్చి కాంత మొలఁ గట్టినచీరఁ దొలంగఁ బెట్టుచున్. 1361

సీ. కరికరంబులు మెచ్చి కదళితో సరివచ్చురమణీయమృదూరుకాండములఁ జూచి
స్యందనాంగము నెంచి సైకతంబు హసించు పద్మలోచననితంబంబుఁ జూచి
యావర్తముల మీఱి యరిది పొన్నలఁగేరు నాళీకముఖి నతనాభిఁ జూచి
కరికుంభములఁ బోలి కలశంబు లనఁ జాలు నలికచ వక్షోరుహములఁ జూచి
తే. విమలదర్పణతుల్యకక్షములఁ జూచి
వారివీచుల కెన యగువళులఁ జూచి
యహివిభునిఁ బోలు మొలకనూఁగారుఁ జూచి
యనిలుఁడు ప్రసూనశరమోహితాత్ముఁ డగుచు. 1362

క. తనమదిఁ దమకం బడరఁగ, ఘనభుజముల నవ్వెలందిఁ గౌఁగిటఁ గదియిం
చిన సంభ్రమమున నయ్యం, జన యిట్లనె భూరికోపసంయుత యగుచున్.

క. చాపల్యంబున నెవ్వఁడు, నాపాతివ్రత్యనాశనం బొనరింపం
జేపట్టె నిప్పు డనవుడు, నాపవనుం డుచితభంగి నంగన కనియెన్. 1364

క. అంగన నీతో మానస, సంగతిఁ జేసితిని దీన పతితము నీకున్
మంగళము లొదవు వ్రత మది, వింగడమై చనదు మదిని వెఱువకు మింకన్.

మ. జలజాతేక్షణ నీకుఁ బుణ్యుఁడు మహాసత్త్వుండు దుర్వారదో
ర్బలయుక్తుండు మహాభుజుండు త్రిజగత్ప్రఖ్యాతశౌర్యుండు కీ
శలలాముండు సుపర్ణవేగుఁడు సుధీసంపన్నుఁ డబ్జప్రియో
జ్జ్వలతేజుండు జగద్ధితుం డొకఁడు వే జన్మించు మత్తుల్యుఁడై. 1366

క. అని పలికి యనిలుఁ డరిగిన, మనమున సంతోష మంది మానుగ నయ్యం
జన నిను గిరిగహ్వరమునఁ, గనియె న్పూర్వాశ రవిని గన్నవిధమునన్. 1367

సీ. భూరుహాచరవీర పుట్టినప్పుడు నీవు బాలాబ్జమిత్రబింబంబుఁ గాంచి
ఫల మని కాంక్షచే బంధురజవమున నురువడి మున్నూఱుయోజనములు
గగనంబునకుఁ బ్రీతి నెగసి భానునికరంబుల వేఁడిమికి వీఁక సొలయ కంత
నింద్రవజ్రాహతి నెంతయు మూర్ఛిల్లి వ్యోమమార్గంబున నుండి వామ
తే. హనువు భగ్నంబుగాఁగ మహాద్రిమీఁదఁ
గడురయంబునఁ బడి తదికారణమున
నీకు హనుమంతుఁ డను పేరు నెగడె నంత
నిన్నుఁ గనుఁగొని పవనుండు నెఱయఁ గినిసి. 1368

వ. త్రైలోక్యవ్యాపకం బైనతనశ్వాసంబు సంకుచితంబు చేసినముల్లోకంబులు సం
క్షోభితంబు లయ్యె సురాసురాదులు [illegible]

పరమేష్ఠిం బురస్కరించుకొని బహుప్రయత్నంబున నవ్వాయుదేవునిం బ్రార్థించిన
నద్దేవుండు సురమునిగణప్రార్థితుండై రోషంబు విడిచి ప్రసన్నుం డగుటయు లో
కంబు లెల్ల నెప్పటియట్ల తేజరిల్లె నప్పు డప్పరమేష్ఠి నీకు సమరంబునందుఁ జావు
లేకుండ వరం బొసంగెఁ బురందరుండు వజ్రాయుధంబుచేత హాని లేకుండ నను
గ్రహించెఁ దక్కినదిక్పాలకు లెల్లఁ దమతమయాయుధంబులచేత మరణంబు
లేకుండ బ్రసాదించిరి సకలదేవతలు జరారోగభూతోపద్రవంబులు నిన్నుం
జెందకుండునట్లుగా దీవించిరి మహర్షి బ్రహ్మర్షి దేవర్షులు స్వచ్ఛందమరణం
బయ్యెడుఁ గాక యని పలికిరి. 1369

క. అనిలున కౌరసపుత్త్రుఁడ, వనఘాత్మ క్షేత్రజుండ వా కేసరికిన్
ఘనలంఘనలాఘవముల, ననవరతము సాటివత్తు ననిలునితోడన్. 1370

క. తేజంబున రెండవఖగ,రాజవు నీ వబ్ధి దాఁటి లంకాపురిలో
నా జానకిఁ గని మము ని, చ్చోఁ జావక యుండఁ బ్రోవు సురుచిరలీలన్. 1371

వ. ఏను తొల్లి త్రివిక్రమావతారంబునం దిరువదియొక్కమాఱు ధరణికిం బ్రదక్షి
ణంబు చేసితి మఱియు దేవశాసనంబున మథనార్థంబు సర్వౌషధీజాలంబులు
పయోనిధిం బడవైచితి నయ్యోషధులచే సముద్రమథనంబువలన నమృతంబుత్ప
న్నం బయ్యె నప్పు డేను మహాబలవిక్రమసంపన్నుండనై యుంటి నిప్పుడు మహా
వృద్ధుండ నగుటం జేసి పరాక్రమహీనుండనై యున్నవాఁడ నీవు సర్వగుణో
పేతుండవు బలపరాక్రమసంపన్నుండవు గావున. 1372

క. నీవిక్రమంబుఁ జూడఁగ, నీవానరు లెల్ల వేడ్క నెసఁగుచు నున్నా
రో వాయుతనయ చూపుము, నీవీర్యమహత్త్వ మెల్ల నివ్వెఱపడఁగన్. 1373

ఉ. ఈవనరాశి దాఁటి జనకేశసుతం గని వచ్చి మమ్ము సు
గ్రీవునిఁ గావ నోపిన హరిప్రభుఁ డెవ్వఁడొ యంచు వీరు చిం
తావిలచిత్తులై కడుభయంబున గాసిలుచున్నవార లో
పావని వీరి సంకటిఁ గృపామతిఁ గావుము చావకుండఁగన్. 1374

ఉ. లెమ్ము పయోధి నీవు నవలీలఁగ దాఁటి సురారిపీటికిం
బొమ్ము మహీసుత న్వెదకి పొల్పుగఁ గాంచి మహాజవంబుతో
రమ్ము మహాత్ముఁడైన రఘురామునకు న్ప్రీతి లేనిసంతసం
బిమ్ము వనాటవంశమున కెంతయు మేటివి గమ్ము మారుతీ. 1375

ఉ. దింపుము వీర్యగర్వమున దేవుఁ ద్రివిక్రము నద్భుతంబుగాఁ
బెంపుము మేను నిర్జరులు మేలన నద్భుతమైన ఖరి న్విజృం
భింపుము క్రూరరాక్షసులకుం భీకరదైత్యుల కెల్ల భీతిఁ బు
ట్టింపుము తార్క్ష్యలాఘవ మటింపుము నింపుము కీర్తి దిక్కులన్. 1376

వ. అని జాంబవంతుండు బోధించిన నాహనుమంతుండు పర్వకాలంబునం బొంగు
సముద్రంబుభంగి నుప్పొంగి యభంగతరంగమాలి [illegible]

జాలంబు లంబరంబునం బర్వఁ దదీయభీషణనిర్ఘోషంబుభంగి మహానాదంబు
సేయుచు నవక్రపరాక్రమంబున జగత్త్రయంబును బాదత్రయంబున నాక్రమింప
నుపక్రమించు త్రివిక్రమదేవుపోలిక సుధాహరణదీక్షాదుర్నిరీక్షుం డగునండజ
మండలాఖండలునికై వడిఁదనశరీరంబుఁ బెంచి విజృంభించి బంగరుగట్టుమాడ్కి
దిట్టయై చూపట్టె నప్పు డప్పీవరశిఖామణిరూపంబు తేజఃపూర్యమాణం బై
యదృష్టపూర్వశోభావిశేషంబునం బొలిచెనంబరీషోపమం బైనతదీయవదనంబు
ప్రదీప్తం బై విధూమపావకునిమాడ్కి శోభిల్లె నానమయంబున. 1377

సీ. తోడరి దైత్యులపాలి ధూమకేతువుఁ బోలె లక్షింపఁ దగినవాలంబువాని
బాలార్కబింబంబుపగిది సముజ్జ్వలస్ఫూర్తి నొప్పఁ గనుపట్టుముఖమువాని
మేరుమందరమహామేదినీధరతుల్యకమనీయదివ్యవిగ్రహమువానిఁ
బ్రళయకాలమునాఁటి భయదమేఘముభంగి నురువడి గర్జించుచున్నవాని
తే. సకలదిక్కులు భూరితేజంబుచేత, నుజ్జ్వలంబుగ వెలిఁగించుచున్నవాని
దండిమెయి ముజ్జగంబులు నిండి నట్టి,ఘనుఁడగు త్రివిక్రమునిభంగిఁ గ్రాలువాని.

చ. అనిలతనూజుఁ గాంచి కపులందఱు శోకము వీడి మానసం
బునఁ గడు విస్మయంబును సమున్నతహర్షము పిక్కటిల్లఁగా
ఘనములకై వడి న్మిగుల గర్జలు సల్పుచు వేడ్కతోడ న
య్యనఘునిఁ గొల్చి యుండిరి జయధ్వనులం గడు సన్నుతించుచున్. 1379

హనుమంతుఁడు వర్ధమానబలుం డై వీరాలాపంబు లాడుట.

వ. ఇట్లు విజృంభమాణశరీరుం డై యప్పవమాననందనుండు స్తోత్రవాక్యంబులచేత
నంత కంత కుత్సాహంబు రెట్టింప సింహంబు గిరిగహ్వరంబునందు విజృంభిం
చినమాడ్కి విజృంభించి రోమాంచకంచుకితదేహుం డై కపుల నందఱ నానం
దసముద్రవీచికాసందోహంబులం దేల్చుచు రయంబున నాహరిమధ్యంబున నుం
డి వెల్వడి హరివృద్ధు లగుజాంబవదాదుల కభివందనంబులు చేసి మేఘగంభీర
భాషణంబుల ని ట్లనియె. 1380

ఉ. ఎవ్వఁడు ప్రాణ మిజ్జగతి కెవ్వఁడు నిర్జరమార్గగోచరుం
డెవ్వఁడు హవ్యవాహసఖుఁ డెవ్వఁ డమోఘరయుండు శీఘ్రగుం
డెవ్వఁడు తత్సదాగతికి నేను గుమారుఁడఁ గాన నుత్సముం
డెవ్వఁడు లేఁడు ధారుణి నహీనపరాక్రమసత్త్వసంపదన్. 1381

సీ. వాలవిక్షేపదుర్వారవాతాహతి జలధరంబులు దూలి సులల డాఁగ
నతులభుజోరువాఁతాతి వేగమున నంభోనిధి గ్రాహము ల్బార్చ నొందఁ
గమనీయవక్షోవిఘట్టనంబున శైలవృక్షషండంబులు విఱిగి కూల
దారుణాశనిసన్నిభోరుఘట్టనమునఁ బృథివీధరంబులు పిండిగాఁగ

తే. వీఁక జలరాశి నవలీల వేగ దాఁటి, శంక లేక ముదంబున లంక సొచ్చి
సీతఁ గనుఁగొని కృతకార్యసిద్ధినగుచు, నేగుదెంచెద ముదమందుఁ డెల్లకపులు.

క. పరువడిఁ గమలవనప్రియుఁ, డరుదుగ నొకమాటు దిరుగు నంతటిలో బం
గరుగట్టు వేయిమాఱులు, తిరముగ నయ్యినునిఁ గడచి తిరిగెదఁ గడిమిన్. 1383

క. దివినుండి వైనతేయుం, డవిరళగతిఁ బుడమి దిరుగునంతటిలోనే
జవమున వేమఱు దివికిన్, భువికి న్దాఁటెద సమగ్రభుజబలయుక్తిన్. 1384

తే. అర్కుఁ డుదయాద్రిపయినుండి యస్తగిరికి,బోవునంతటిలో నేను భూరిజవము
మెఱయనుదయాద్రినుండి యాచరమగిరికి, వేయిమాఱులు పోవుదువితతసరణి.

క. జలనిధు లన్ని కడచి యా, వలిపారముఁ జేరి యచట వ్రాలక మరలన్
బలువిడి మగిడి కడచి యీ, వలిపారముఁ జేరుదున్ జవస్ఫూర్తిమెయిన్. 1386

క. ఏపున ముల్లోకముల ది, శాపాలకపట్టణముల సరభసవృత్తిన్
భూపుత్రి వెదకి కనుఁగొని, భూపతికిం దెచ్చి యిత్తు భుజబల మలరన్. 1387

చ. పరువడి మూఁడులోకములు భస్మము చేసెద శైలశృంగముల్
పఱియలు వాపెదన్ బుడమి వ్రచ్చెద మృత్యువుఁ బట్టి తున్మెదన్
దురుసున మేఘముల్ విరియఁదోలెద దాఁపెద నేడుదీవులున్
శరధి గలంచెదన్ వెదకి జానకిఁ దెచ్చెద భర్తకిచ్చెదన్. 1388

క. ఉరుగతి నాకాశంబున, కరిగెడుతఱి నన్నుఁజూచి హర్షంబున నం
బరచరభూతములు సుధా, హారణార్థం బరుగుగరుడుఁ డని దలఁచు వడిన్. 1389

క. దివి నావరించి హేమా, ద్రివిధంబునఁ గాయ మలర ధృతి నభ్రము మ్రిం
గ వడిం బోయెడుకైవడి, దవులం జను నన్నుఁ గాంచెదరు కపివర్యుల్. 1390

క. పరువడి నంబుధి దాఁటెడు, తఱిఁ బవమానుండు మఱియుఁ దార్క్ష్యుఁడు దక్కన్
ధరలో వే ఱొక్కఁడు దు,ష్కరగతి నన్ననుసరింపఁగాఁ జాలఁ డోగిన్. 1391

క. వినుఁ డొకనిమిషాంతరమున, ననుపమగతి మెఱుఁగు మెఱసినట్లు నిరాలం
బన మగుగగనమునకుఁ జ,య్యన నెగసెద మీరు చూచి హర్షము నొందన్.

క. ప్రమదమున నబ్ధిదాఁటెడు, సమయంబున నస్మదీయచటులాద్భుతరూ
పమును రమానాథుత్రివి,క్రమరూపము నట్ల మీరు గాంచెద రిచటన్. 1393

క. సురనాథు నోర్చి గరుడుఁడు, తిరముగ నమృతంబు మున్ను దెచ్చినభంగిన్
సురవైరి నోర్చి యిచటికి, ధరణీపుత్రికను నేను దడయకఁ దెత్తున్. 1394

చ. అమర ననేకయోజనము లశ్రమలీలఁ గడంగి దాఁటెదన్
క్షమయును నింగియున్ ఫణిజగంబు చరించెద రెండుచేతులన్
గ్రమమున నాత్రికూటనగరాజమునున్ దగ ఋష్యమూకశై
లముఁ గొని తెచ్చి యిచ్చుటనె రాముని రాజకుమారిఁ గూర్చెదన్. 1395

వ. అని బహుప్రకారంబుల విజృంభమాణశరీరుండై యమితబలపరాక్రమశాలియగు హనుమంతుండు నిక్కంబుగా సోత్సేకవిశేషణవిశిష్టుం డయ్యెను దుఃఖసాగరమగ్నవానరవాహినీసంతోషార్థ మేతాదృశవీరాలాపంబులు పలికి వనచరులకు వేడ్కఁబుట్టించిన నమ్మారుతనందను నవలోకించి పరమానందభరితాంతఃకరణుండై జాంబవంతుం డిట్లనియె. 1396

క. మారుతనందన నీ కెవ్వా రుర్విర బాటిగలరు వారక నీచే
ధీరోద్ధతిఁ గపివీరుల, దారుణశోకము వినాశితం బయ్యె నహీన్. 1397

క. ఈహరిముఖ్యులు నీకు స, మాహితులై కార్యసిద్ధి యయ్యెడుఁ గోలన్కై
మాహాత్మ్యం బలరఁగ ను, త్సాహంబున నుంగళిం బొసంగెద రనఘా. 1398

క. గురులప్రసాదంబున ముని, వరులప్రసాదమునఁ గీశవరులప్రసాదో
త్కరమున నీ విప్పుడు స,త్వరముగ నీయంబురాశి దాఁటుము లీలన్. 1399

క. నీ వరుగుదెంచునంతకు, జీవితములు త్వత్కృతములు చేసి యిచట సొం
పావహిలఁగ నిందఱమును, బావని యిటనుండు మేకపాదస్థుల మై. 1400

వ. అనిన నప్పవమానసూనుండు వానరవీరుల నందఱఁ గలయ నవలోకించి యేనతిజవంబున నాకాశంబున కెగయుటకుఁ బాదంబులూఁదిన నిమ్మహి భరింపంజాలక దిగంబడుఁ గావున నిమ్మహేంద్రనగంబెక్కి తదీయశృంగశృంగాటకంబుమీఁద నుండి యవలీల దాఁటెద నని పలికి మహేంద్రసమవిక్రముఁడగు మహాబలనందనుండు నానావిధతరులతావిసరవిభ్రాజితంబులు నమృగసేవితశాద్వలంబును లతాకుసుమసంబాధంబును నిత్యపుష్పఫలద్రుమంబును సింహశార్దూలచరితంబును మత్తమాతంగనిషేవితంబును మత్తద్విజగణసంఘుష్టంబును సమంతతో విస్సృతనిర్ఝరసలిలసంకులంబును శిలాతుంగప్రదేశభూయిష్ఠంబును మహోన్నతశృంగసంగతంబును నగు మహేంద్రపర్వతం బెక్కి యన్నగోపరిభాగంబున. 1401

హనుమంతుండు మహేంద్రపర్వతం బెక్కుట

క. ఆతతపద్మాకరమున, మాతంగముఁ బోలె రుచిరమరకతమణిసం
స్ఫీత మగుశాద్వలంబున, వాతసుతుఁడు సంచరించె వనచరు లలరన్. 1402

వ. అప్పుడు. 1403

క. ఆభూమిభృచ్ఛిఖామణి, బీభత్సకపీంద్రపాదపీడిత మై సిం
హాభిహతకుంభ మగుమ,త్తేభముచందాన నొప్పె నెంతయుఁ గడఁకన్. 1404

క. హరివరునివజ్రసన్నిభ, చరణాహతి కోర్వలేక శైలంబు వొరిం
బొరి విడుచు బాష్పజలముల, కరణిఁ గిరినిర్ఝరములు గానఁగ నయ్యెన్. 1405

సీ. మానితమణిచిత్రసానుగోచరు లగు సురసిద్ధసాధ్యులు వెఱచి పాఱ
నిరుపమరత్నకందరములఁ గ్రీడించు భీకరమృగములు భీతిఁ బఱవ

భూరుహశాఖాగ్రముల మీఁదనివసించు పక్షిసంఘములు విశ్రాంతి నొంద
గమనీయసైకతాగ్రములపై విహరించు కిన్నరమిథునముల్ కృశతఁ గుందఁ

తే. జటులమరకతమణిరుచిశాద్వలములఁ
బ్రీతిమెయి నాఁడు హరిణముల్ బెదరిపఱవఁ
గఠినహరివీరఘనపదాఘాతమునకు
భీతిఁ గొని గోత్రవరము కంపించె నపుడు. 1406

వ. మఱియు నమ్మహాశిలోచ్చయం బర్ధవినిస్సృతంబులైన భుజంగంబులచేతనుద్ధీపిత కేతనంబులచేతం బోలె నభిరామంబై యొప్పె మఱియుఁ ద్రాసనంభ్రాంతులైనమహర్షులచేతఁ బరిత్యజ్యమానంబై యన్నగోత్తమంబు స్వార్థహీనుం డైన పథికునికై వడిఁ జూడ నొప్పె నప్పుడు మహావేగుండును బరవీరహంతయు నగు హనుమంతుండు వేగంబునందు సమ్యక్సమర్పితచిత్తుం డై లంకాపురంబునకుం జనుటకు మనస్సమాధానంబు గావించె నని యిట్లు కిష్కింధాకాండకథాప్రపంచం బంతయు సమగ్రంబుగా వినుపించిన విని సంప్రహృష్టచిత్తుం డై రామభద్రుండు భద్రవాక్యంబుల వారలం బ్రశంసించి యటమీఁది కథావృత్తాంతంబు వినిపింపుఁ డని యడుగుటయు. 1407

కందగీతద్రుతవిలంబితస్వాగతాగర్భచంపకము.—
కరివరకామదా దనుజ ఘస్మర ధన్యకథా జితారిమా
వరవిభ వామనా వినుతవాసవ విశ్వప విక్రమాఢ్య భూ
ధర హరి ధామదా కనకదాస్థిరకార్య జగన్నుతాఖ్య శ్రీ
కర జనకామకా ప్రణుతకార్ముకబాణ విపన్నపాలకా. 1408

ఖడ్గబంధము.—
రాజరాజ రాజసేవ్యరాజపూజకా జరా
రాజితామలోరుకీర్తిరమ్యసద్గుణాకరా
రాజవంశవర్య దైత్యరాజవైరి యిందిరా
రాజసన్నిభాననాభిరాజితాబ్జభాస్కరా. 1409

చతుర్విధకందము.—
సురవర సర్వశరణ్యా, సరమా మురహర సరసిజచరణా కరిపా
హరసఖ శశిరవినయనా, సరసా యదువర ధరధరసరసాత్మ హరీ. 1410

గద్యము. ఇది శ్రీరామచంద్రచరణారవిందమకరందరసాస్వాదనతుందిలేందిందిరాయమాణమానసకులపవిత్రకౌండిన్యసగోత్రపద్మనాభసూరిపుత్రవిద్యాసాంద్రవేంకటకవీంద్రప్రణీతం బైన శ్రీమద్రామాయణం బనుమహాకావ్యంబునందు రామవిరహశోకంబును హనుమత్సమాగమంబును ఋశ్యమూకగమనంబును సుగ్రీవసఖ్యంబును సీతాభరణప్రదానంబును వాలిసుగ్రీవులవైరానుకథనంబును

సాలభేదనాదికంబుచేత సుగ్రీవునకు విశ్వాసంబు పుట్టించుటయు వాలిసుగ్రీవుల యుద్ధంబును వాలిమథనంబును సుగ్రీవరాజ్యస్థాపనంబును దారావిలాపంబును రామసుగ్రీవులసంకేతంబును వర్షరాత్రనివాసంబునుఋతువర్ణనంబునురాముని కోపంబును వానరులపరస్పరమేళనంబును హరిత్ప్రస్థాపనంబును మహీసంస్థాన కథనంబును నంగుళీయకప్రదానంబును సీతాన్వేషణంబును బిలప్రవేశంబును స్వయంప్రభావృత్తాంతంబును ప్రాయోపవేశంబును సంపాతిసంవాదంబును బర్వతారోహణంబు ననుకథలుగల కిష్కింధాకాండము సమాప్తము.

---

శా. ఈకావ్యప్రతిపాదితుం డయినసీతేశుండు రామప్రభుం
డీకల్యాణకృతీశ్వరుం డయినశ్రీకృష్ణుండు సంప్రీతితో
సాకల్యంబుగ నిష్టసిద్ధికరులై చంచత్కృపాపూర్ణదృ
గ్లోకస్తుత్యకుమారయాచధరణీంద్రుం బ్రోతు రెల్లప్పుడున్.

---

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# లఘుటీకాసహితము

# రామాయణము

## సుందరకాండము.

---



వాణీశ్వరశంకర
దేవేంద్రప్రముఖనిఖిలదేవోత్తమసం
సేవితపాదాంబుజ లీ
లావిఖ్యాతావతార హరి శ్రీకృష్ణా. 1

వ. శ్రీదేవా విన్నవించెద నవధరింపుము కుశీలవులగు కుశలవు లవ్వాలికథ యిట్లని చదువం దొడంగి రిత్తెఱంగున శత్రుకర్శనుం డగుహనుమంతుండు రావణనీత యైనసీత యున్నపదం బన్వేషించుటకు గగనమార్గంబునం బోవ సమకట్టి. 2

తే. నిష్ప్రతిద్వంద్వమును గడుదుష్ప్రధర్ష, మైనకార్యంబు సాధింప నాత్మఁదలఁచి పావని యుదగ్రమస్తకగ్రీవుఁ డగుచు, సుందరవృషంబుచందానఁ జూడనొప్పె.

హనుమంతుఁడు మహేంద్రపర్వతంబున విహరించుట.

వ. తదనంతరంబ. 4

క. విలసితజలకల్పము లగు, సలలితవైడూర్యవర్ణశాద్వలములయం
దల మారుతి ధైర్యం బగ్గల మంద యథాసుఖంబుగా విహరించెన్. 5

క. మృగపతికైవడి మృగముల, బెగడం దోలుచు మహీజబృందంబులపై
ఖగముల నెగయం జోపుచు, నగచరవీరుండు ప్రియవిహారము సలిపెన్. 6

ను. ఘనమాంజిష్ఠపలాశవర్ణసితరక్తశ్యామపీతాభిరం
జననానావిధధాతుయుక్తసముదంచత్సానుసంచారయు

క్తనిశాటామరభోగిరాడ్గరుడగంధర్వాంగనాగానని
స్వనవిభ్రాజిత మైన శైలమునఁ జంచత్ప్రీతిఁ గ్రీడించుచున్. 7

క. వినుతజలాశయమధ్యం, బున నొప్పెడుమత్తదంతిపోలికి నప్పా
వని నాగవరాయుత మగు, ఘనగిరితలమందు నిలిచి కడు భక్తి మెయిన్. 8

క. మునుకొని తూర్పుమొగం బై, యనువుగ నిజజన్మహేతు వగుపవనునకు
న్వనజాసనునకు శక్రున, కినునకు భూతముల కెఱఁగి యింపు దలిర్పన్. 9

ఉ. నీరధి నుత్తరింపఁ గృతనిశ్చయుఁ డై పవమాననందనుం
డారయ నిండుపర్వముల నంబుధి పొంగినభంగిఁ బొంగి పొం
పారఁగ నప్రమాణతనుఁ డై చరణంబుల బాహుశాఖలం
దోరపుబల్మిచే నడఁగఁ ద్రొక్కె నగేంద్రము నమ్మహేంద్రమున్. 10

చ. నలలితపుష్పితాగ్రతరుశాఖలనుండి ప్రసూనమంజరు
ల్గలజల రాల దారుణశిలాప్రచయంబులు వ్రస్సి కూల ని
స్తులఘనవప్రసంఘము వసుంధర వ్రాల ఖగంబు లార్వ న
క్కులగిరి సంచలించెఁ గపికుంజరపాదవిఘట్టితాగ్రమై. 11

క. ఆతరుముక్తసుగంధిన, మాతతపుష్పములచేత నభిసంవృత మై
ఖ్యాతిగ నగ్గిరి యతులవి, భూతిం బుష్పమయ మైనపోలికి నలరెన్. 12

క. ఉత్తమవర్యుం డగుకపి
సత్తముచేఁ బీడ్యమానసానుకమై శై
లోత్తమము జలము గురిసెను
మత్తేభము జలము గురియుమాడ్కిఁ బెలుచన్. 13

వ. మఱియు నమ్మహేంద్రపర్వతంబుబలవంతుండగుమరున్నందనునిపదాఘాతంబున
నిపీడ్యమానం బై కాంచనాంజనరాజతరేఖలం జూపుచుఁ గాళీకరాళీవిష్ఫు
లింగినీధూమ్రవర్ణావిశ్వరుచిరోహితామనోజవాభిధానంబులు గల సప్తార్చుల
లోన మధ్యమార్చిర్విశిష్టుం డైన వైశ్వానరుండు ధూమనిచయంబులం బోలె
మనశ్శిలాయుక్తంబు లగుశిలాచయంబులం దొరఁగించె నప్పుడు. 14

క. బహుపీడ్యమానమగు నమ్మహేంద్రగిరిచే నిపీడ్యమానము లై త
ద్గుహల వసించినభూతని,వహములు వికృతగతి మొఱసె వారనిభీతిన్. 15

తే. శైలపీడానిమిత్తజ సత్త్వనాద, మపుడు విలయాబ్ధినిర్ఘోష మనుకరించి
యఖిలభూతభయంకరమై ధరిత్రి, నాకసంబును దిక్కులు నాక్రమించె. 16

క. వ్యక్తస్వస్తికలక్షణ, యుక్తము లగుపృథుశిరంబు లొప్పారుమరు
ద్భుక్తతులు విషముఁ గ్రక్కుచు, రక్తాస్యము లలర శిలలు గ్రక్కునఁ గఱచెన్.

క. ఇటు కుపిత క్రూరవిషో, త్కటకాకోదరనికాయదష్టము లై న
మ్మెటవాటులఁ బగిలినక్రియఁ, బటపట ఱా లెల్ల వేయిభంగులఁ బగిలెన్. 18

తే. ఆనగంబున నెయ్యవి యహివిషంబు, నణఁప జన్మించె నట్టిదివ్యౌషధములు
సర్పసందష్టదలితవిశాలగండ, శైలవిషమును వారింపఁజాల వయ్యె. 19

తే. ఘోరకాయంబు లగుమఱి కొన్నిఫణులు, ప్లవగపదపీడితంబు లై పట్టుచాల
కవుడు నిజతేజమునభీషణాగ్నిశిఖలఁ, గ్రక్కుచుగుహాముఖంబులుకలఁకవెడలె

తే. మర్కటేంద్రపదాక్రమ్యమాణ మైన, గిరివరమునందు నూతనాంకురములైన
తరులు వికసితకైరవోత్పలసుగంధి, కుసుమవర్షంబు లెల్లెడఁ గురిసె నపుడు.

క. హరితాళసంవృతంబులు, సురుచిరగైరికవినీలజుష్టము లగుప్ర
స్తరములు మనశ్శిలాసం,భరితము లై యపుడు పుడమిఁ బడఁ దొడఁగెరహిన్.

వ. మఱియుఁ జిత్రకాననసానుసంశోభితంబును హరిచందనవనవిభ్రాజితంబుఖదీప్త
గైరికధాతుపరిక్షిప్తంబు నగుమహేంద్రపర్వతంబుపావనిపదాఘాతంబున విఱిగి
కూలునో యనుభయంబున నందున్నసిద్ధవిద్యాధరకిన్నరకింపురుషాదులుపాన
భూమిగతం బైనహైమాసవభాజనంబులును మహార్హంబు లగుపాత్రంబులును
హిరణ్మయంబు లగుకరకంబులును నుచ్చావచంబు లగులేహ్యభక్ష్యంబులును
వివిధంబు లగుమాంసంబులును నార్షభంబు లగుచర్మంబులును గనకత్సరుయు
క్తంబు లగుఖడ్గంబులునుం బరిత్యజించి విచిత్రదివ్యాంబరమాల్యానులేపన
హారాలంకృతశరీరు లై రక్తపుష్కరపత్రంబులభంగి మదఘూర్ణమాననేత్రం
బులు గ్రాల హారనూపురకేయూరపారిహార్యధర లగునిజసుందరులం గూడి
శీఘ్రంబున నగ్గిరికందరంబులు నిర్గమించి సుమేరుసమానశరీరుం డగుహనుమం
తుండు నరవానరనాయకార్థంబుగా మహావేగంబున మకరాలయం బగుసము
ద్రంబు లంఘించి దుష్ప్రాపం బైనతదీయదక్షిణతీరంబు సేరననిశ్చయించినవాఁ
డిట్టిదుష్కరకర్మంబు సేయ నెవ్వరికైన శక్యం బగునే యని యగ్గించుచు నణి
మాదిసిద్ధులం జూపుచు విస్మితులై సస్మితంబు లగుముఖారవిందంబు లందంబు
లైయలర నంతరిక్షంబున నిలిచి యప్రమేయుం డగుహనుమంతు నవలోకించు
చుండఁ దదీయస్తోత్రనాదంబు లాకాశంబు నిండి చెలంగె నప్పుడు 23

క. రోమముల గగుర్పొడవఁగ, భూమిధరోపముఁడు పవనపుత్త్రుఁడు మేను
ద్ధామగతిఁ బెంచి ఘోరము,గా మేఘముభంగి నార్చి గమనోన్ముఖుఁ డై. 24

క. రోమచితం బగువాలము, భీమంబుగ మిన్నుదాఁకఁ బెంచి పతత్త్రి
స్వామి ఫణినాథునిఁ బలె, నామారుతసుతుఁడు విప్పి యల్లార్చి వడిన్. 25

హనుమంతుఁడు వానరుల ముందఱఁ బ్రతిజ్ఞ సేయుట.

సీ. పరిఘసన్నిభదీర్ఘబాహాదండంబుల సంస్తంభ మొనరించి సముచితముగఁ
బదములు జోడించి పదిలంబుగాఁ గటితటి మెయి నడఁగించి తగువిధమున
భుజములు శిరమును బొందుగాఁ గుదియించి తలఁగకుండంగఁ బాదంబులూఁది
కర్ణము ల్నిక్కించి కడువేడ్కతో హృదయంబునఁ బ్రాణంబు నాఁగి పట్టి

తే. ధైర్యముబలంబు తేజంబుశౌర్యమూని, సొంపెనంగదూరపథమునఁజూపునిలిపి
పొంచితమకించి పులకించిపొలుపుగాంచి,యెంచి దాటించిచివ్వనమిన్నుదాఁటె

వ. ఇత్తెఱంగునం గ్రీడాగతి గగనంబునకుం దాఁటుచున్నవాఁడై యవ్వానరపుంగవుం డంగదాదుల నిరీక్షించి ప్రస్ఫూర్త్యాలవలాహకగర్జాసముజ్జృంభణగంభీరభాషణంబుల నిట్లనియె. 27

చ. తడయక యింక నీరధిఁ బ్రసుతం బిగుడించఁగ నబ్ధి దాఁటి పెం
పడరఁగ లంక సొచ్చి రిపు లక్ష్మము వచ్చిన సాహసంబునం
గడచి మహీసుత న్వెదకి కాంచి రఘూత్తమువార్తఁ జెప్పి యీ
కడ కరుదెంచెదన్ ముదము గ్రాలఁ గృతార్థుఁడనై నిజంబునన్. 28

ఉ. చప్పున లంకలో వెదకి క్ష్మాసుత గాంచెదఁ గానకున్న నా
చొప్పున నాకము న్వెదకి చూచెద నందును గానకున్న నే
ర్పొప్ప దశాస్యుఁ బట్టుకొని యుద్ధతిఁ దెచ్చెద నొండెఁ గానిచోఁ
దప్పక లంక నేఁ బెఱికి దక్షతఁ దెచ్చెద రామునొద్దకున్. 29

వ. అని సర్వప్రకారంబులఁ గృతకార్యుండనై సీతం జూచి వచ్చెద నని పలికి మహోత్సాహంబున నాహరిశ్రేష్ఠుండు విక్రమోద్దీప్తం బగునుపన్నని తెఱంగున నద్భుతజవంబున నంబరంబున కెగసె నప్పుడు. 30

క. దాఁటెడురయమునఁ బదముల, మేటునకుం గాక పాదు విఱిగి మహీభృ
త్కూటములు భూరిభూరుహ, కోటియుతంబుగఁ బయోధిఁ గూలెం బెలుచన్.

హనుమంతుఁ డాకాశమున కెగయుట.

క. సముదమనోహరకోయష్టికము లగుపుష్పశాలిశాఖితతుల్
రమణీయోరుభుజావేగమున న్వెంటఁ గొని యింటఁ గదుపవెఁ జనియెన్. 32

శా. ఓజన్ దూరపథంబు పోవుటకు నుద్యోగించునక్కుంభిను
వ్యాజప్రీతి దలిర్ప నంపఁ జనుహృష్యత్కుంభువర్గంబునాఁ
దేజశ్శాలిమరుత్తనూజవిలసద్దీర్ఘోరువాతోత్థిత
క్ష్మాజవ్రాతము కొంత దవ్వతనివెన్కన్ బోయె నత్యుద్ధతిన్. 33

ఆ. మఱియు నూరువేగమథితంబు లగుసాల
తరులు కొన్ని పవనతనయు వెంట
నరిగె దండయాత్ర కరుగు భూపతివెంటఁ
జనెడుసైన్యములకు సాటి యగుచు. 34

తే. పుష్పితాగ్రమహోన్నత భూరిభూజ, మండమండితుఁడై వృక్షచరవరుండు
వాయుపథమున మేరుపర్వతముకరణి, నప్పు డద్భుతవర్ణనుండై వెలింగె. 35

తే. సారవంతంబులగుమహీజములుకొన్ని, పరఁగలవణాంబునిధియందుఁబడిమునింగె
ననిమిషాధిపుభయమున నబ్ధియందుఁ, బడిమునింగెడుకొండలవగిది దోఁప. 36

క. వికచసుమాన్వితుఁ డై వా, యుకుమారుఁడు చూడ నొప్పె నొగి సాంకురకో
రకములచే ఘనఖద్యో,తకములచే నొప్పు భూమిధరమో యనఁగన్. 37

వ. మఱియుఁ గొన్ని మహామహీరుహంబులు పావనిభుజావేగోత్థితంబులై యొక్కింత
దూరం బమ్మహావీరుని వెంటం జని తద్వేగవిముక్తంబులై పుష్పంబులు విడిచి
బంధుప్రస్థాపనార్థంబు సమాగతులైన చుట్టంబులు బంధులం బనిచి మగిడిన
తెఱంగున మగిడి సలిలంబునం బడియె మఱియు. 38

క. వానరవాయుప్రేరిత, మై నానావిధవిచిత్రమగు మృదుసుమసం
తానము తరునికరంబుల, పై నుండి పయోధియందు బడియె లఘుగతిన్. 39

క. ఆసూనసమూహంబుల, చే సాగర మప్పు డొప్పెఁ జెలువుగ ఘనతా
రాసముదయములచేఁ గడు, భాసురముగ నొప్పు గగనభాగము మాడ్కిన్. 40

క. నానావర్ణవినూతన, సూనసమూహములచేతఁ జూడఁగ నొప్పె
న్వానరుఁ డచిరద్యుతిసం, తానంబుల నొప్పు వారిధరము విధమునన్. 41

వ. అప్పుడు. 42

తే. సుప్రసారితములును భాసురము లగ్ర, భాగగతములు నైనతద్బాహు లొప్పె
శైలశిఖరంబువలననిష్క్రాంతములగు, పంచముఖశోభితములైన ఫణులకరణి.

క. ఆకసముమ్రింగఁ జను గతిఁ, బ్రాకటముగ నబ్ధిజలముఁ ద్రావుటకో యనఁ
దేఁకువ నేగెడుకై వడి, నాకపివీరుండు పొల్చె నంబరవీథిన్. 44

తే. చటులగతి వాయుమార్గానుసారి యైన
కపివరుని చంచలాప్రభాకారము లగు
చక్షువులు పొల్చెఁ బర్వతస్థంబు లైన
సనుధికానలదీప్తకుండములకరణి. 45

తే. మఱియు నుద్దీప్తము లుపరిమండలములు
పింగములు విస్తృతము లగుపింగనేత్ర
కులవిభూషణుదివ్యచక్షువులు దనరె
నుదితు లగుసోమసూర్యుల యొప్పు గలిగి. 46

క. భాసురతామ్రద్యుతి గల, నాసికచేతఁ దరుణాననము శోభిలె సం
ధ్యాసమభిస్పృష్టం బగు, నాసూర్యునిబింబమట్టు లద్భుతభంగిన్. 47

క. ప్లవమానుం డగుపవమా, నవరాత్మజువాల మపుడు నభమున నొప్పెన్
దివిపై నుచ్ఛ్రితమగువా, సవునిమణిధ్వజముక్రియ విశాలస్ఫూర్తిన్. 48

వ. మఱియును. 49

క. అతివేగుం డగుమారుత, సుతులాంగూలంబు వెనుకఁ జూడఁగ నొప్పెన్
ధృతి మీఱ సుపర్ణునిచే, నతులితముగ కృష్యమాణ మగుఫణిమాడ్కిన్. 50

క. అరుణాస్యుఁడు సితదంష్ట్రుఁడు, సరసుఁడు నగునతఁడు వాలచక్రవృతుం డై

పరివేషపరివృతుం డగు, ఖరకిరణునిచందమునఁ బ్రకాశించె దివిన్. 51

క. అరుణస్నిగ్ధశముచేఁ, గర మరుదుగ నప్పు డొప్పెఁ గపివీరుఁడు భా
స్వరగైరికాదిధాతూ,త్కరమున శోభిల్లుపర్వతము చందమునన్. 52

క. శరనిధి దాఁటెడు తటిన, త్తరుచరసింహుఁ డగుపవనతనయుని కక్షాం
తరగతుఁ డై యనిలుఁడు భీ,కరముగ గర్జింపఁ దొడఁగెఁ గాంచదముక్రియన్.

క. అతులితగతిఁ గపిపతి య,ద్భుతమై ఖరి నుత్తరాంతమున నుండి పరి
చ్యుత యగుమహోల్క పడియెడు, గతి నంబరవీథి నపుడు గానఁగ నయ్యెన్.

వ. మఱియుఁ బతత్పతంగసంకాశుండును దీర్ఘాకారుండు నగుమరున్నందనుండు మధ్యబంధనరజ్జుబంధనసమయంబున దీర్ఘీభూతం బైనమాతంగంబుచందంబున నందం బగుచు సాగరోపరిగతం బైనశరీరంబుచేత సాగరాంతః ప్రవిష్ట యైన తనుచ్ఛాయచేత నేకాకారుండై యంబుధినడుమ వాయుప్రేరిత యైననావ పగిదిఁ జూపట్టె మఱియును. 55

క. ఏయేదేశమునకుఁ జనె, నాయాదేశంబు చూడ నంబుధినడుమ
న్వాయుసుతాంగరయంబునఁ, బాయకసోన్మాదమైనపగిదిం దోఁచెన్. 56

క. శరనిధికల్లోలంబుల, వరగిరివర్ష్ములగతినవక్షోనిలుచే
బఱియలు వాయఁగఁదట్టుచు, నురువడి నభ్రమున వానరోత్తముఁ డరిగెన్. 57

క. దారుణబలవత్ప్లవగస,మీరము దుర్వారఘనసమీర మొకటి యై
ఘోరతరనిస్వనంబునఁ, బారావారమును దొట్రునడ నుడి వెట్టెన్. 58

వ. మఱియు మనోవేగజనితవాయువేగంబున మహోన్నతంబు లగులవణోదధిసంజాతకల్లోలమాలికాజాలంబులు రోదసీకుహరంబు నిండ నెగయం జిమ్ముచు. 59

తే. ఉబ్బి గగనంబుముట్టి పయోధియందు, మేరుమందరసంకాశభూరిభంగ
సంఘములలెక్కపెట్టంగఁజనువిధమున,ఘనశరీరుఁడు పవమానతనయుఁ డరిగె.

వ. అప్పుడు సముద్రజలంబు తదీయభుజావేగోత్కీర్ణం బై గగనంబున కెగసి యందున్నజలధరంబుతోడ సహచరత్వంబు పాటించి తానును జలదవిశేషంబువిధంబున నొప్పె నాసమయంబున. 61

క. తిమినక్రమీనకర్కట,కము లవి వివృతంబు లగుచుఁ గానఁగ నయ్యె
న్విమలపటాకర్షణమునఁ, గ్రమమునఁ జూపట్టుదేహిగాత్రములక్రియన్. 62

క. అనిలజవంబున మింటం, జనుకపివరుఁ గాంచి యబ్ధిచరనాగంబు
ల్వినుతబలాఢ్యుం డగున,వ్వినతాసుతుఁ డనుచుఁ జాల వెఱఁగందె మదిన్. 63

వ. అప్పు డప్పవమాననందనుం డగువానరసింహునిశరీరచ్ఛాయపదియోజనంబుల వెడల్పును ముప్పదియోజనంబుల నిడుపునుం గలిగి నిర్మలాభ్రసాంద్రపంక్తి చందంబున జలంబునందుఁ జారుతరంబుగాఁ బ్రకాశించె మఱియును. 64

తే. దీర్ఘదేహుండు సంపూర్ణతేజుఁ డైన, ప్లవగకులశేఖరుఁడు నిరాలంబ మైన

వాయుమార్గంబునఁ బతత్రవంతమైన, సురుచిరనగంబుచందానఁజూడ నొప్పె.

క. ప్రాకటముగ నే తెరువున, నాకపికులవర్యుఁ డరిగె నా తెరువున శ్రో
ణీకృత మైనవిధంబున, నాకంధియుఁ జూడ నొప్పె నద్భుతభంగిన్. 66

క. గగనమున ఖగకులములకు, ఖగపతిచందమునఁ దనరి కపిశేఖరుఁ డా
శుగముక్రియ నభ్రపంక్తులఁ, దగువిధమున లాగికొనుచుఁ దడయక యరిగెన్.

క. వడి నభ్రంబులఁ దూఱుచు, వెడలుచు నొక్కొక్కచోట వెలుఁగుచు నొకచోఁ
గడుఁ బ్రచ్ఛన్నుఁ డగుచు న,ప్పుడు వాయుకుమారుఁ డొప్పెఁ బూర్ణశశిక్రియన్.

తే. అమితబలుఁ డైన ప్లవగనాయకునిచేత, నప్పు డాకృష్యమాణంబు లై వినీల
పాండురారుణకాంతులఁ బరిఢవిల్లు, మేఘములు చిత్రవైఖరి మింట నలరె. 69

సముద్రుఁడు మైనాకపర్వతముతో హనుమంతునకు సాహాయ్యంబు సేయుమని చెప్పుట.

వ. ఇట్లు రాముని బాణంబుచందంబున నమోఘరయంబున సంబరంబునం జను సమీరకుమారునింగని దేవతలుకుసుమవర్షంబు గురియించిరి దేవర్షులుకృతకార్యసిద్ధి వగుమని యాశీర్వదించిరి యప్సరస లాడిరి గంధర్వులుపాడిరి సూర్యుండు చంద్రుండుం బోలె సుఖశీతలస్పర్శుం డయ్యె సమీరుండు దేవతాతరుపుష్పసుగంధియై విసరె నాగయక్షరక్షస్సిద్ధవిద్యాధరులు పరమానందంబున నంబరంబునం బన్ని తదీయవిక్రమవిశేషంబు గనుంగొనుచుబహుభంగులం బ్రశంసించి రాసమయంబున నిక్ష్వాకుకులపూజార్థియగునాగరుండు తనమనంబుననే నిక్ష్వాకునాథుం డగుసగరునిచేత వివర్ధితుండ నైనవాఁడ నీహనుమంతుం డాయిక్ష్వాకుసచివుం డితండు ఖేదంబు నొందక నస్థాండుగాఁడిమ్మహాత్మునకుసాహాయ్యంబు గావింపనేని వాగింద్రియవంతులకు సర్వనిందావాగ్విషయీభూతుండ నగుదు నవ్వీరోత్తముండు మత్సాహాయ్యంబున నొక్కింతసేద దీర్చికొని యవ్వల సముద్రశేషంబు యథాసుఖంబుగాసంతరించెడుఁగాక యని తలంచి తనచేతసురక్షితం బైనహిరణ్యప్రధానం బగుమైనాకం బనుపర్వతశ్రేష్ఠంబు నవలోకించి నగేంద్రా నీవు నిలింపపతిభయంబున నాలోన డాఁగి పదంపడి యతనిపంపునఁ బాతాళతలవాసు లగురాక్షసులు వెడలి రాకుండ నప్రమేయం బైనపాతాళద్వారంబు నాక్రమించి పరిఘప్రాయుండ వై చిరకాలంబుననుండి నాచేత రక్షితుండ వై యున్నవాఁడవు నీవు సర్వతోముఖుండవు గావున నీకుఁ గ్రిందికి మీఁదికి నడ్డంబుగాఁ బెరుఁగశక్తిగలదిప్పుడు రామకార్యార్థంబుగాఁ గపిశార్దూలుం డగుహనుమంతుండుగగనమార్గంబుఁబట్టి భవదుపరిభాగంబునంజనుచున్నవాఁ డితనికి సాహాయ్యంబు నాచేత నవశ్యకర్తవ్యంబై యుండునితం డిక్ష్వాకుసచివుండిక్ష్వాకులు నాకుఁబూజ్యులగుటంజేసి నీకునుం బరమపూజ్యులిమ్మహాత్మునకు సాచివ్యంబుగావింపు మీసాచివ్యకరణంబువలన నస్మత్ప్రయోజనంబులోపింపకుండుఁ గర్తవ్యకార్యంబు గావింపకుండు టది సత్పురుషులకుఁ గోపంబుపుట్టిం

చుఁ గావున నీవు శీఘ్రంబున జలంబులనుండి పయికి నిర్గమించి చను దెమ్ము రమ
ణీయం బైన భవదీయశిఖరంబుమీఁద నొక్కింతసేపు విశ్రమించి యవ్వల సము
ద్రమార్గశేషంబు లంఘింపఁగలండు రామునివివాసనంబును సీతాహరణంబును
హనుమంతుని పరిశ్రమంబును విలోకించి శీఘ్రంబున నిర్గమింపు మని పలికిన.

### మైనాకపర్వతము సముద్రమునుండి పైకెగసి వచ్చుట.

ఉ. అంబుధిమాటఁ గైకొని మహాద్రుమశోభిత మై నగంబు వై
శంబనుసాంద్రనీరదముల న్విరియించుచు వచ్చు హేళిచం
దంబున సాగరాంబువు లుదగ్రత వాయపడంగఁ ద్రోచి కొం
చంబుధిలోన నుండి మునమారఁగఁ బైకెగసెన్ జవోద్ధతిన్. 71

వ. ఇత్తెఱంగున నిర్గమించి యొక్కముహూర్తంబునకు శాతకుంభమయంబులు
గిన్నరోరగసేవితంబులును సూర్యోదయసన్నిభంబులును గగనోల్లిఖితంబులును
స్వయంప్రభంబులు నగుమహోన్నతశిఖరంబులచేత నుపలక్షితుం డై యాత్మీయ
శృంగంబులు దర్శింపం జేయుచుఁ దదీయకాంతివిశేషంబుచేత శస్త్రసంకాశం
బైన యాకాశంబును గాంచనప్రభంబు గావించుచు నాదిత్యశతసంకాశుం డై
వాయునందను మ్రోలం జూపట్టిన. 72

మ. కని వీఁ డొక్క నిశాచరుం డగుట నిక్కం బిక్కడన్ నాకుఁ జ
య్యన విఘ్నం బొనరింప వచ్చె నిటు లాహా వీని భంజింతుఁ గా
కని యమ్మారుతి క్రోధరక్తనయనుం డై మారుతం బల్కతో
ఘనముం దాఁకినభంగి వక్షమున వీఁకన్ దాఁకె మైనాకమున్. 73

క. తాఁకిన నగ్గిరి వజ్రము, సోఁకిన యట్లైనఁ జాల సుడివడి మరలన్
బ్రాకటముగ ధృతిఁ గైకొని, యాకపివరు వేగమునకు హర్షించి తగన్. 74

### మైనాకపర్వతము హనుమంతునిఁ దనశిఖరములపై విశ్రమించి పొమ్మని ప్రార్థించుట

క. మానుషరూపధరుం డై, పూనిక నాత్మీయశిఖరమున నుడుపీథిన్
గానం బడి గగనగతుం, డైన మరుత్సుతునితోడ నర్మిలిఁ బలికెన్. 75

క. తరుచరవర నీ వీదుష్కరకర్మ మొనర్చి తింపుగా మచ్ఛిఖరో
త్కరములపై వ్రాలి సుఖం, బిరవందఁగ విశ్రమించి యేగుము ప్రీతిన్ 76

వ. మహాత్మా యీసముద్రుం డిక్ష్వాకువంశసంభవు లగుసగరపుత్రులచేఁ బరివర్ధి
తుం డగుటవలన రామహితయుక్తుండ వైన నీకుఁ బ్రతిపూజనంబు గావింపం
దలంచినవాఁ డుపకారంబునకుఁ బ్రత్యుపకారంబు గావించు టది సనాతనం బైన
ధర్మంబు గావునఁ బ్రతీకారార్థి యైన యీసముద్రుని ప్రార్థనంబు నీవు సమ్మానింప
వలయు నీకపిశ్రేష్ఠుండు యోజనశతదూరంబు లంఘించుటకు నుపక్రమించి వచ్చు
చున్నవాఁడు భవదీయశిఖరంబులమీఁద నొక్కింత విశ్రమించి యవ్వల మార్గ

క్షేమంబుసంతరింపం గలవాఁడని భవన్నిమిత్తంబుసాగరుండు బహుమానపురస్స
రంబుగా నన్నుఁ బుత్తెంచినంజనుదెంచితి నీవు మదీయశిఖరంబులమీఁద నించు
కసేపు విశ్రమించి గంధవంతంబును స్వాదువు నగుకందమూలఫలాదికం బుప
యోగించి సముద్రశేషంబుతరింపుము మాకు నీతోడఁ ద్రిలోకవిఖ్యాతంబును
మహాగుణపరిగ్రహంబు లగుసంబంధంబు గలదు నీవు వేగవంతు లగువానరు
లలో నతిశ్రేష్ఠుండవు ధర్మవిచక్షణుం డగువాని కతిథి యగువాఁడు ప్రాకృతుం
డైనను బూజార్హుం డగుచుండ నీయట్టిమహాత్ముండు పూజార్హుం డగుట కేమి
సందియంబు నీవు దేవశ్రేష్ఠుం డగు వాయువునకుఁ బుత్రుండవు బలపరాక్రమ
వేగంబులనతనికి సమానుండవు పూజితుండ వైననమ్మహాత్ముండును బూజనొం
దినవాఁ డగు గావున నీవు నాకు నిక్కిలి పూజనీయుండ విందుకు నొక్క కార
ణంబు గలదు దాని నెఱింగించెద వినుము. 77

ఉ. మోదము వీడి దేవమునిముఖ్యు లహర్నిశము ల్విపాతశం
కాదృతచిత్తులై బహుముఖంబులఁ బొఱుచుఁ దల్లడిల్లఁగా
నాదియుగంబునందు గిరులన్నియు ఱెక్కలు గల్గి మర్త్యలో
కాదిసమస్తలోకము లుదంచితవేగమునం జరింపఁగన్. 78

చ. అలిగి సుపర్వనాథుఁడు శతారముచేఁ గులశైలపక్షముల్
చలమునఁ ద్రుంచుచున్నను వెసం గని డాసిన నేను భీతిమైఁ
గళవళ మందుచుండ ననుకంప ననుం గొనిపోయి కంధిలోఁ
పలఁ బడవైచె గాడ్పచలభంజనహేతికిఁ జిక్కకుండఁగన్. 79

క. నను రక్షించిన కతమున, ననిలుఁడు పూజార్హుఁ డయ్యె నతనికి జన్మిం
చినకతమున నీవును మా, కనఘా మాన్యుండ వైతి వతిశయభంగిన్. 80

క. నావిన్నపంబుఁ గైకొని, యీవనధికి నాకు హర్ష మింపారంగా
నీవస్మచ్ఛిఖరముపై, భూవరసఖ విశ్రమించి పొమ్ము యథేచ్ఛన్. 81

క. నే నిచ్చుపూజనంబులు, మానుగ నందికొని నన్ను మన్నింపు కపీం
ద్రా నీసందర్శనమున, నేను గృతార్థుండ నైతి నెంతయుఁ బ్రీతిన్. 82

వ. అనిన నాశైలగ్రామణి యి ట్లనియె. 83

హనుమంతుఁడు మైనాకపర్వతమును వీడ్కొనుట.

చ. అగకులవర్య నీవొసఁగు నట్టి సపర్యలు వచ్చె నుండఁగాఁ
దగ దిట మాకు భాస్కరుఁ డుదగ్రతఁ గ్రుంకక మున్నె సంద్రమిం
పుగఁ దరియించువాఁడ నని పూని ప్రతిజ్ఞ యొనర్చి వచ్చితిన్
ముగటమి పోదె యేను గుణమండన నేఁ డిటు చేరకుండినన్. 84

తే. చటులజవమున నంబుధి సంతరించి, మించి సీతను లంకలోఁ గాంచి మరల
సంచితంబుగ నిట కరుదెంచి నపుడు, కూర్మి నెఱపెద నీతోడ గోత్రతిలక.

వ. అని పలికి మహాబలనందనుం డాశైలంబుపైఁ గేలూది ప్రసన్నవదనుం డై యచటు వాసి సముద్రపర్వతంబులు జాతకౌతూహలంబు లై తన్ను విలోకించి యనేకవిధంబుల నాశీర్వదింప నిరాలంబం బగుగగనంబున కెగసి యమ్మహాగిరి నవలోకించుచు వాయుమార్గంబున నమోఘరయంబునం జనియె నప్పుడు రెండవదియైన తదీయదుష్కరకర్మంబుఁ జూచి దేవర్షిగంధర్వసిద్ధవిద్యాధరులు పరమానందభరితాంతఃకరణులై సాధువాక్యంబులం బ్రశంసించి రంత సహస్రాక్షుండు హిరణ్యనాభం బగుమైనాకంబు కడకుం జనుదెంచి మైత్రి నెఱపుచుఁ బ్రమోదవిశేషంబున ని ట్లనియె. 86

ఇంద్రుఁడు మైనాకపర్వతమునకు వర మొసంగుట.

చ. ధరణిధరేంద్ర నిర్జరహితంబుగఁ బుట్టిన రామభర్త కి
ట్లిరవుగ దౌత్యము న్నెఱప నేగెడు నీవిపినాట మాళికిం
గరము సఖుండ వైతి వటుగావున బంధుఁడ వీవు నాకు స
త్వ్యరుతరపక్షయుగ్మమున నుర్విఁ జరించుచు నుండు మెప్పుడున్. 87

క. నా కులిశము వలని భయము, నీకెన్నఁడుఁ గలుగ దింక నీవు ముదముతో
లోకములకు ముద మొసఁగుచుఁ, జేకొని చరియింపుమయ్య శీతాద్రిసుతా. 88

క. అనిపలికి పాకశాసనుఁ, డనిమిషపురి కరుగ నమ్మహాశైలము చ
య్యన నింద్రువరముఁ గైకొని, తనమనమున భయమువిడిచెఁ దద్దయుఁ బ్రీతిన్.

వ. ఆసమయంబున. 90

క. సురమును లాహనుమంతుని, గురువీర్యము బలము నెఱుఁగఁగోరి రయమునన్
సురస యనునాగమాతను, బరికించి యుదంచితోక్తిఁ బలికిరి నెమ్మిన్. 91

ఉ. ఇక్కపివీరుఁ డొక్కరుఁడె యేగెడు లంకకు నం దసంఖ్యులై
రక్కసు లున్నవా రితనిరంగును వారిబలంబు లెట్లొకో
యెక్కువ తక్కువల్ దెలియ నెంతయు లెస్సయి యుండుఁ గాన నీ
వొక్కముహూర్తమాత్రము సముద్ధతి విఘ్న మొనర్పు త్రోవకున్. 92

వ. మఱియుఁ బర్వతోపమం బైనఘోరరాక్షసశరీరంబు గైకొని గగనసమంబును దంష్ట్రాకరాళపింగాక్షంబు నగువదనంబుతో నక్షంబు చను మతండు నిన్నుపాయంబుననిర్జించి చనునో విషాదంబు నొందునో యెఱుంగ నలయు నని పలికిన నాసురస యౌఁగా కని రయంబున. 93

ఉ. లోకభయావహంబు నతిలోకము నైననిశాటిరూపముం
గైకొని యంజనాచలముకై వడి మే నమరంగఁ గిన్కతో
నాకసమందు మారుతరయంబున మబ్బులఁ దూలఁ దోలుచున్
వీఁక దలిర్ప నేగు కపివీరున కడ్డము నిల్చి యి ట్లనున్. 94

దేవతల వచనంబున సురస హనుమంతున కడ్డము వచ్చుట.

క. ఓరివనాటుఁడ నీవిపు, డారయఁగా నాకు భక్ష్య మైతివి నిన్నుం
న్నారక వడి మ్రింగెద మ,ద్ఘోరాననగహ్వరంబు గొబ్బునఁ జొరుమా. 95

క. నా విని శ్రీమంతుం డగు, పావని చేదోయి ఫాలఫలకంబున సొం
పావహిలఁ జేర్చి సురసా,దేవిం గని యిట్టు లనియె ధీరత్వమునన్. 96

చ. ఇనకులభర్త రామవిభుఁ డింతియుఁ దమ్ముఁడు గొల్వ దండకా
వనమున సంచరించు నెడ వంచన నవ్విభుదేవి జానకిం
గొని చనె పంక్తికంధరుఁడు గొబ్బున నయ్యమఁ జూడ లంక కొ
య్యనఁ జనుచున్నవాఁడ విమలాత్ముఁడు రాముఁడు పంప దూతనై. 97

ఉ. కావున నీకు నోగిరము గా దగ దిప్పుడు లంకలోన న
ద్దేవిని జూచి రాఘవునిఁ దేర్చి త్వదాస్యము వచ్చి చొచ్చెద
న్బోవఁగ నిమ్ము నన్ను రఘుపుంగవు కార్యము భక్తియుక్తితో
నీవును జేయఁగా వలయు నెమ్మిగ రాఘవరాజ్యవాసినీ 98

వ. అని పలికిన. 99

ఉ. అక్కపిఁ జూచి పల్కె నురగాంబ మహాక్రుధ నాకు నిచ్చటం
జిక్కితి వెందుఁ బోఁగలవు చెల్లదు నాకడ నీబలంబు నే
నిక్కము నిన్నుఁ బట్టుకొని నేర్పున మ్రింగక పోవనిత్తునే
తక్కక నాకు నిట్లు మును ధాతవరంబు కరంబు గల్గఁగన్. 100

ఉ. నా విని క్రుద్ధుఁడై పవననందనుఁ డి ట్లను నెల్లభంగులం
బోవలె నన్న నడ్డమయి పోవఁగ నీక మహాత్ముఁడైన యా
భూవరుకార్యముం జెఱుపఁ బూనితి వీవెటు నన్ను మ్రింగెదో
నీవిధ మంతఁ జూతు నిఁక నీవదనం బటు విచ్చి చూపుమా. 101

హనుమంతుఁడు సురసను జయించుట.

ఉ. అన విని నాగమాత జగమంతయు నద్భుత మంది చూడఁ జ
క్కన దశయోజనాయతము గాఁ దనవక్త్రబిలంబుఁ బెంచినం
గనుఁగొని వాయుపుత్త్రుఁ డలుక న్దశయోజనవిస్తృతంబుగా
ఘనముగ మేనుఁ బెంప నది గన్గొని వెండియుఁ బన్నగాంబయున్. 102

సీ. ఉరవడి నిరువది యోజనంబులు నోరు పెంచినఁ జూచి విపినచరుండు
ముప్పదియోజనంబులు మేను బెంచిన నురగాంబ నలువది యోజనములు
యాననం బెత్తిన నాతఁ డేఁబది యోజనములంతవాఁడైన నాగమాత
వెస షష్టియోజనవిక్కృతాస్యగాఁగ వానరుఁడు డెబ్బదియోజనములయంత

తే. యొప్పుటయుఁ జూచి యెనుబదియోజనములు
నోరు పెంచిన సురకాంత మారుతియును

బూని నవతియోజనములు మేను పెంప
నాతి శతయోజనంబు లాననముఁ బెంచె. 103

తే. అంత శతయోజనాయతం బైనసురస
వదన మీక్షించి పవమాన వరసుతుండు
కరము మతిమంతుఁ డౌటఁ దత్కాల మెఱిఁగి
పెరుఁగు టుడిగి శరీరంబు కుఱుచ పఱిచె. 104

తే. చిత్రతరభంగి నంగుష్ఠమాత్రుఁ డగుచు, సురసదారుణవక్త్రంబుఁ జొచ్చి వేగ
వదనమార్గంబు వెలువడివచ్చి నగుచు, నంబరంబున నుండి యి ట్లనుచుఁ బలికె.

క. నీకడుపుఁ జొచ్చి వచ్చితి, నాఁకలి దీఱెఁ గద యింక నవనీతనయం
దేఁకువ వెదకఁగ నేగెద, నీకు న్మ్రొక్కెదను గరుణ నెఱపుము తల్లీ. 106

తే. అనిన సురకాంత నిజరూప మాశ్రయించి, వదననిర్గతుఁ డగుకపివరుని రాహు
వదననిర్గతుఁ డగుపద్మవైరివట్టు, లింపు సొంపార వీక్షించి యిట్టు లనియె. 107

ఆ. కార్యసిద్ధి పొందెఁ గడురయంబున నేగు, మనఘచరిత లంక కరిగి యందు
రాజపుత్త్రిఁ గాంచి రామునకు హితంబు, గూర్పు మదియె నీకు గుణము వత్స.

తే. అనిహితము దెల్పిదీవించియరిగె సురస, యపుడు వేల్పులు హనుమంతుఁ డాచరించి
నట్టిమూఁడవ దగుకర్మ మరసిచూచి, హర్షమిగురొత్తఁ గొనియాడి రాకసమున.

వ. అంత హనుమంతుండు గరుత్మంతుండుం బోలె జవాతిరేకంబున నంబరంబున
కెగసి వారిధారాసేవితంబును బతంగనిషేవితంబును దుంబురుప్రముఖనిఖిలకైశి
కాచార్యచరితంబును నైరావతపరిష్కృతంబునుసింహవ్యాఘ్రకుంజరపతగోరగ
వాహనసముహ్యమానసంపతద్విమలవిమానాలంకృతంబును వజ్రాశనిసమా
ఘాతపావకోపశోభితంబును గృతపుణ్యమహాభాగస్వర్గజిద్విరాజితంబును జిత్రభా
నునిషేవితంబును గ్రహచంద్రార్కనక్షత్రతారాగణవిభూషితంబునుమహర్షిసిద్ధ
గంధర్వనాగయక్షసమాకులంబును వివిక్తంబునువిమలంబును విశ్వంబును విశ్వా
వసునిషేవితంబును దేవరాజగజాక్రాంతంబును జంద్రసూర్యపథంబును జప
లోకవితానంబును శివంబును వితతంబును బ్రహ్మనిర్మితంబు నగువాయుమార్గం
బున లంబపక్షం బగుపర్వతంబు కరణి నొప్పుచుఁ గాలాగరుసవర్ణంబు లగు
మేఘంబులఁ బవనుని భంగి విరియం దోలుచు సారెసారెకు మేఘంబుల
దూఱుచుఁ గ్రమ్మఱ వెడలుచుఁ బ్రావృట్కాలచంద్రుండుంబోలె శోభిల్లుచు
రక్తపీతసితాసితవర్ణంబు లగుమహాభ్రంబుల నూరువేగంబున నాకర్షించుకొని
యమోఘరయంబునం బోవు నప్పుడు. 110

సింహిక హనుమంతున కడ్డపడుట.

చ. ప్రకటజవంబునం జనెడు పావనిఁ గన్గొని నీటిలోన సిం
హిక యను నొక్క రక్కసి యహీనకృపం దినుమంచు నాకఁ బా

యక విధి పెద్దకాలమున కాఁకలి దీఱఁగఁ దెచ్చి పెట్టెని
మ్మైకమును దీనిఁ బట్టుకొని మ్రింగెదఁ గా కని నిశ్చితాత్మయై. 111

శా. ఛాయాగ్రాహిణి యాటచే నది మహాసంరంభ మేపారఁగా
నాయంభోనిధినుండి మీఁదికి రయం బారంగ లంఘించి త
త్తోయాగ్రంబున దీర్ఘమై భయదమై దుర్వారమై పొల్చు త
త్కాయచ్ఛాయను బట్టి వేగ దిగిచెం గట్టల్క దీపింపఁగన్. 112

క. సింహిక ఛాయం దిగిచిన, రంహ ముడిగి సాహసము పరాక్రమ మెడల
న్సింహపరాక్రముఁ డగుకపి, సింహుఁడు వెఱఁగంది చాలఁ జింతించె మదిన్.

క. ప్రతిలోమమారుతముచేఁ, బ్రతిహత మగునోడభంగిఁ బ్రతిష్టుఁడ నై
గతవేగుఁడ నై పంగూ, కృతవీర్యుఁడ నైతి నేల యెద్ది తెఱఁ గిఁకన్. 114

తే. అనుచుఁ జింతించి నలుదెస లరసి చూచి
దివి పరీక్షించి క్రిందుగా దృష్టిఁ జొనిపి
తోయమున నున్నఘోరజంతువును గాంచి
మది వివేకించి యాహనుమంతుఁ డపుడు. 115

క. ఉగ్రప్రేక్షణుఁ డై యా, సుగ్రీవుఁడు చెప్పినట్లు చూడఁగ నిది ఛా
యాగ్రాహిణి యౌ నిజముగ, నాగ్రహమున దీనిఁ జంప నగు నా కిచటన్. 116

ఉ. అంచుఁ దలంచి వృష్టిసమయంబున మేఘముఁ బోలెఁ దా విజృం
భించి లయోగ్రమూర్తి గతిమించి సమంచితరౌద్రభంగిఁ గా
న్పించినఁ గాంచి రాక్షసియుఁ బెద్దబిలంబుక్రియ న్నిజాస్యముం
బెంచి ఘనంబుమాడ్కి నతిభీషణనై ఖరి నార్చి పేర్చినన్. 117

హనుమంతుఁడు సింహికం జంపుట.

చ. అనుపమఘోరనారకగుహాసదృశం బగు దానివక్త్రము
న్గనుఁగొని వజ్రతుల్యఘనకాయుఁడు పావని బుద్ధిశాలి గా
వునఁ బరికించి చూచి తనువుం దగఁ గొంచెముఁ జేసి దారుణా
శనిగతి మింటనుండి పెలుచ న్దుమికె న్వెసఁ దన్ముఖంబునన్. 118

వ. అప్పుడు. 119

క. దానవవనితావక్త్రగు, వానరపరివృఢుని రాహువదనగతుం డౌ
భానునిఁ బోలెఁ గనుంగొని, దీనత్వముఁ బొంది రపుడు దేవతలు మునుల్.

ఆ. అంతఁ గొంత వడికి నాహనూమంతుండు, కఱకు గోళ్ల దాని కడుపు సించి
రక్తసిక్తుఁ డగుచు రవిచందమున నొప్పి, వేగ తన్ముఖంబు వెడలి వచ్చె. 121

వ. ఇట్లు నిర్గమించి దానిం గొండొక పొడువు గొని చని సముద్రోదకంబునం బడ
వైచె నంత నాలవది యైనతన్మహాద్భుతకర్మంబుఁ జూచి యాకాశచరంబు లగు
భూతంబు లప్పవననందనుకడకుం జనుదెంచి మహాత్మా ఘోరం బైనయీసత్త్వం

బు నీచేత నిహతం బయ్యె నీకు శుభం బగు నింక నెయ్యదియు నసాధ్యంబు లే
దెట్టికర్మంబులయందైన నీకు ధృతియు దృష్టియు మఱియు దాక్ష్యంబును నశి
యింపకుండు నింక యథాసుఖంబుగాఁ జని రామునికార్యంబు సాధించి కీర్తి
వడయు మని పలికి యంతర్ధానంబు నొందె నంత హనుమంతుండు ప్రతిపన్న
ప్రయోజనుం డై శీఘ్రంబున గరుడునిభంగి నాకాశంబున కెగసి శతయోజనా
యతం బగుసముద్రంబు నవలీల దాఁటి వేలాతటంబుఁ జేరి నానావిధవనరాజి
విరాజితంబును వివిధద్రుమభూషితంబును మలయోపవనమండితంబును సాగ
రానూపసంభూతవివిధగుల్మలతావృతంబును సాగరపత్నీముఖోపలక్షితంబు నగు
లంకాద్వీపంబు గనుంగొని. 122

ఉ. ప్రాకట భూరివారిదము వైఖరి నభ్రము నిండి యున్నయా
త్మాకృతిఁ జూచి లాఘవరయంబును దేజముఁ గాయవృద్ధి న
న్నాకరిపు ల్గనుంగొనిన నా కవరోధము గల్గుఁ గావునం
జేకొని గాత్రముం గుఱుచసేయుదుఁ గాక యని నిశ్చితాత్ముఁ డై. 123

చ. అనిలజుఁ డద్రితుల్య మగునంగము గొంచెము చేసి వెండి చ
య్యనఁ బ్రకృతిస్థుఁ డయ్యె బలి నాఁగి జగంబులు గొన్నవెన్క వా
మనుఁడు త్రివిక్రమాకృతిని మాటి యథాస్థితి నొందినట్లు మం
తనమున యోగి మోహము నణంచి నిజస్థితి గొన్నకైవడిన్. 124

హనుమంతుఁడు లంబపర్వతముపై వ్రాలుట.

వ. ఇట్లు నానావిధరూపధారి యగుహనుమంతుండు నిజశరీరబాహుళ్యంబు కుఱుచ
పఱచి ప్రకృతిమాత్రుం డై సకేతకోద్దాలకనారికేళంబును నానావర్ణవిచిత్ర
ధాతుమండితంబును గగనచుంబిమహోన్నతశిఖరవిరాజితంబును బహువిధవిచి
త్రవనరాజివిభ్రాజితసానుతలంబు నగులంబాఖ్యపర్వతశిఖరాగ్రంబున వ్రాలె
నప్పుడు. 125

క. తరుచరవీరునిపదహతి, నురవడి గిరి దరలఁ దరువు లూఁగఁగఁ బుష్పో
త్కరములు రాలెఁ ఖచరులు, పరనుతిఁ గురియించుపుష్పవర్షము పోలెన్.

క. సురసకుఁ జిక్కక సింహిక, కఱవక మైనాకమునకు నబ్బక యూర్పు
ల్నెఱపక శతయోజనముల, చిరగతి దాఁటియును గ్లానిఁ జెందం డయ్యెన్. 127

క. నడుమ నడు గిడక వ్రేల్మిడి, నుడుగక బహుశతసహస్రయోజనములు దాఁ
టెడుకపివరునకు నూఱా,మడ దాఁటుట యనఁగ నెంత మదిఁ బరికింపన్. 128

వ. అంత నక్కొండమీఁదఁ గొండొకదడవు విశ్రమించి సమీరకుమారుండు
కట్టెదుట. 129

క. రంగచ్చంపకకురవక, లుంగవకుళకుందమాతులుంగపనసనా
రంగకరవీరతిలకల, వంగక్రముకతరురమ్యవనవాటికలన్, 130

క. జంబీరతాలవికసిత, జంబూహింతాలబిల్వసరళతమాలో
దుంబరనింబకపిత్థక,దంబవిరాజితవిశాలతగువిపినములన్. 131

క. లలితసకలర్తుపల్లవ, ఫలకుసుమోల్లసితవృక్షపటలరణత్కో
కిలకీరశారికారవ, కలితమహోద్యానవాటికలఁ గనుఁగొనియెన్. 132

వ. మఱియుఁ బవనసంచలితశాఖాశిఖాగ్రంబులును బుష్పభారనిబద్ధంబులునువిహా
గాకీర్ణంబులు నగుసరళకర్ణికారఖర్జూరప్రియాళుముచికుందకుటజకేతకీప్రియం
గుగంధపూర్ణనీపసప్తచ్ఛదాసనకోవిదార ప్రముఖ నిఖిలతరువ్రాతంబుల నవ
లోకించుచు. 133

క. వికసితపుష్కరరక్తో,త్పల, మకరందరసోపభోగమత్తమధుపసం
ఘకలరవనినాదితహ, ల్లకరమ్యసరోవరంబులం గనుఁగొనుచున్. 134

—హనుమంతుఁడు లంకాపురమును జూచుట.—

సీ. పుండరీకోత్పలకాండాభిరంజితాయతపరిఖావృతం బైనదాని
శారదాంబుదతుల్యజాతరూపమహోన్నతాకారమండితం బైనదాని
గాంచనధ్వజపతాకామహాట్టాలకప్రాకారశోభితం బైనదానిఁ
గైలాసశిఖరసంకాశపాండురరత్నహర్మ్యవినిర్మితం బైనదాని

తే. ఘనలతాపంక్తిచిత్రితకనకరత్న, తోరణకవాటచిత్రప్రతోళికాగ్ర్య
చత్వరవిశాలగోపురసౌధవిపణి, మానితస్తంభసంవృతం బైనదాని. 135

తే. సంతతాట్టాలకావతంసకయు వప్ర,జఘనయు నవాంబుధౌతవస్త్రయు శతఘ్ని
కాత్రిశూలకేశాంతయుఁ జిత్రరత్న,నయనయై కాంతకైవడి ననుచుదాని. 136

వ. మఱియు శూలముసలముద్గరభిండివాలకరవాజపటిసహస్తులును దంష్ట్రాకరాళ
ముఖులును భయంకరాకారులు నగురక్షోవీరులచేతసంరక్షితకక్ష్యాంతరంబగు
దాని నతిరమణీయగగనోల్లిఖితశిఖరిశిఖరసంకాశం బగుదాని ననంతబలసమేత
క్రూరమృగోరగసంకీర్ణం బగుదాని నాశీవిషసేవితం బైనమహాబిలంబుం బోలె
భయంకరరాక్షసకింకరసంకులం బైనదానినతివిచిత్రశిల్పకౌశలవిశ్వకర్మనిర్మితం
బైనదాని ననంతబలసంపన్నరాక్షసరాజపాలితం బగుదాని మఱియును. 137

సీ. రమణీయకాంచనప్రాకారవిజితాలకాపురం బైనలంకాపురంబుఁ
దపనీయమణిగణస్థగితపుష్కరచుంబిగోపురం బైనలంకాపురంబు
సంతానతరులతాజాలనిర్జితదేవతాపురం బైనలంకాపురంబు
జీవరత్నప్రభాజితరమ్యభోగవతీపురం బైనలంకాపురంబు

తే. భీమనిర్ఘోషరాక్షసస్తోమములకుఁ, గాఁపురం బైనఘోరలంకాపురంబు
సమరనిర్జితత్రైలోక్యసంపదలకు, దాఁపురం బైనయట్టిలంకాపురంబు. 138

చ. కని యరుదందుచుఁ మిగులఁ గమ్రసుగంధిలతాశతంబులం
బెనఁగొని మింటితో నొరయు పేరగు మ్రాకుల నొప్పు గట్లసం

దన సమృదుశాద్వలంబులఁ గనుంగొనుచుం దనరూప మేరికిం
గనఁబడకుండ సత్వరముగం జనియె న్వడి లంక డాయఁగన్. 139

హనుమంతుఁడు లంకాసన్నివేశమును జూచి వితర్కించుట.

వ. ఇత్తెఱంగునం జని లంకయుత్తరద్వారంబునం జేరి దానిగుప్తికర్మంబును సాగరంబును ఘోరశత్రుం డైన రావణునిమనంబునం దలపోసి హనుమంతుం డిట్లని వితర్కించె. 140

తే. అరసి చూచిన నీలంక సురనరులకు, నైన రణమున సాధింప నలవిగాక
చెలఁగుచున్నది కపు లెట్లు చేరఁ గలరు, చేరి రాక్షసవిభు నేమి చేయఁ గలరు.

క. రావణపరిపాలిత మగు, నీవిషమమహాపురమున కెటు రాఁ గలఁడా
భూవిభుఁడు వచ్చియును రక్షోవిభు నెటు చంపఁ గలఁడు ఘోరరణమునన్. 142

ఆ. సామయుక్తి దీని సాధింపఁగా రాదు, దానయుక్తి దీనిఁ దలఁపరాదు
భేదమునకు నిది యభేద్యంబు నాలవ, సాధనమున కిది యసాధ్య మరయ. 143

ఆ. వాలినందనునకు వనచరవిభునకు, నాకు నీలునకును నయ మెలర్ప
సత్వరముగ గతియు సంభావితం బగు, నలఘుభంగి నధికబలుల మగుట. 144

ఆ. ఇప్పు డేటి చింత యిది నాకుఁ దగుభంగిఁ, బురముఁ జొచ్చి మనుజవరునిపత్నిఁ
గాంచి యవల రిపునికడిమి మాయింపంగ, హేతు వరసి నిశ్చయింతుఁ గాక.

క. అని పవమానతనూజుఁడు, తనమనమున నిశ్చయించి దశరథభూభృ
త్తనయాభ్యుదయరతుం డై, యనుపమమతి మరల నిట్టు లని చింతించెన్.

ఉ. పాయక క్రూరకర్ము లతిబంధురసత్త్వులు తిగ్మతేజు ల
త్యాయతవిక్రము ల్రణవిహారులు దైత్యులు గాచి యున్నవా
రీయురుమూర్తితోడ నిపు డీపురముం జొరరాదు భూమిభృ
త్కార్యములు రాక్షసాధములు గానక యుండ మొఱంగి చొచ్చెదన్. 147

వ. మఱియు రాత్రిసమయంబున నిష్పురంబు సొచ్చి లక్ష్యాలక్ష్యం బగురూపంబున జానకిం బరిశోధించెదఁ గాక యని నిశ్చయించి వెండియు దుస్సాధ్యమైనలంక నవలోకించి తనమనంబున. 148

క. క్రూరవిచారుఁడు ఘోరాకారుఁడు రావణుఁడు వాఁడు గనకుండఁగ నే
నేరీతి లంక సొత్తునో, యేరీతి మహీకుమారి నీక్షించెదనో. 149

క. జనకజ చందం బెట్లానో, జననాథునికార్య మెట్లు సాధింతునో య
వ్వనితామణి నేకాంతంబునఁ జూచెద సందియంబు పొందఁగ నేలా. 150

క. వనరుహమిత్రోదయమునఁ, బనివడి చీఁకటులుఁ బోలె బాలిశుఁ డగుదూ
తను గొని భూతార్థము ల, ట్లనిశంబు వినష్టఫలము లై చెడు ధాత్రిన్. 151

క. దురహంకృతు లగుచారకు, లరయఁగఁ గార్యములఁ జెఱుతు రర్థానర్థాం

తరమున నిశ్చిత యయ్యెను, సురుచిరముగ మంత్రబుద్ధి శోభింప దిలన్. 152

ఉ. ఏగతి నబ్ధిసంతరణ మిప్పుడు వ్యర్థము గాక చెల్లు నిం
కేగతిఁ బుణ్యుఁ డై నమనుజేంద్రునికార్యము పాటి కెక్కు నే
నేగతి లంక సొత్తు దనుజేంద్రుఁడు గానక యుండునట్లు లం
కేగతి సంచరింపుదు మహీసుత నేగతిఁ గాంతు నిత్తఱిన్. 153

క. లెక్కకు వెక్కస మైనలు, దిక్కుల రక్కసులు గ్రమ్మి ద్రిమ్మరుచున్నా
రిక్కడ ననుఁ జూచినఁ బని, చిక్కును దడ వుండ నిచటఁ జెల్లదు నాకున్. 154

క. దానవు లెఱుంగ కుండఁగ, జానుగ నా కిచట మెలఁగఁ జన దిక నెవ్వా
రైన నిచటఁ జరియింపం, గా నేర్తురె రాక్షసులకుఁ గన రాకుండన్. 155

క. దనుజాకృతిఁ గైకొని బో,రనఁ జొచ్చెద నంటినేని రాక్షసవీరుల్
గనుఁగొనుచుండఁగ నిప్పురి, ననిలుం డైనను జొరంగ నలుకు నురవడిన్. 156

—హనుమంతుఁడు వానరరూపంబుతో రాత్రియందు లంకఁజొచ్చెదనని నిశ్చయించుట.—

క. దానవు లెఱుఁగని యర్థము, మానుగ నించుకయు లేదు మఱి యేరూపం
బే నిపుడు దాల్చి భూపతి, మానినిఁ గనుఁగొందు విభుని మన్ననఁ గందున్.

ఉ. ఇంత విచార మేల నను నెవ్వరుఁ గన్గొన కుండఁ బద్మినీ
కాంతుఁడు గ్రుంకు నంత కిటఁ గాతుక మొప్పఁగ నుండి రాత్రియం
దెంతయుఁ గీశరూపమున నీనగరం బటు సొచ్చి రామభూ
కాంతునిభామిని న్వెదకి కాంచెదఁ గా కని నిశ్చితాత్ముఁ డై. 158

వ. సూర్యాస్తమయంబుఁ గోరుచు వై దేహీదర్శనోత్సుకుండై యుండఁ గొండొక దడవునకు సూర్యుం డస్తశిఖరిశిఖరాంతర్గతుం డయ్యె నంత హనుమంతుండు మహోన్నతం బైనతనశరీరంబు కుఱుచఁ జేసి వృషదంశకమాత్రగాత్రుం డై ప్రదోషకాలంబునఁ దత్పురగోపురప్రాకారాధిరోహణంబుఁ జేసి రమ్యంబును సువిభక్తమహాపథంబును బ్రాసాదమాలావితతంబును గంధర్వనగరాకారంబును శాతకుంభస్తంభవిరాజితంబును జారుచామీకరగవాక్షశోభితంబును స్ఫటికోపలసంకీర్ణకార్తస్వరవిభూషితసప్తభౌమాష్టభౌమప్రాసాదోపలక్షితంబును వైడూర్యమణివిచిత్రముక్తాజాలవిభూషితకాంచనతోరణరాక్షసాలయశోభితంబునుహార్యక్షువిక్రమరణదక్షరక్షోభటవనసంకులంబును బాండురోద్విద్ధవిమానమాలాసమాకులంబును మహార్హజాంబూనదజాలతోరణంబునుభీమరాక్షసబలోపేతంబును నచింత్యంబును నద్భుతాకారంబును రావణబాహుపాలితంబు నైనలంకాపురంబు గలయంగనుంగొని విషాదహర్షంబులు మనంబునం బెనంగొన వైదేహీదర్శనోత్సుకుం డై వెండియు నిరీక్షింప నప్పుడు. 159

—హనుమంతుఁడు లంకాపురం బంతయుఁ గలయం జూచుట.—

ఉ. హారపటీరహీరరుచి యై యుడుపంక్తులు చుట్టుఁ బర్వఁగా
ధారుణి నెల్లఁ గౌముదివితానముచే వెలుగంగఁ జేయుచు

న్మారుతితోడ సఖ్యము నొనర్పఁగ వచ్చినవాఁడు పోలె నా
సారసశాత్రవుం డపుడు చల్లనయై కనుపట్టెఁ దూర్పునన్. 160

శా. శంఖక్షీరమృణాళవర్ణుఁ డగుచు న్సంభూతచంచన్మరు
త్కాంఖాణద్యుతిమండలాంతరమునన్ గన్పట్టి చీఁకట్లనె
ల్లన్ ఖండించుచు నభ్రసుధ్యగతుఁడై రాణించుచంద్రు న్సరః
ప్రేంఖద్రాజమరాళమున్ బలెఁ గపిశ్రేష్ఠుండు గాంచె న్రహిన్. 161

వ. ఇట్లు చంద్రోదయంబు నీక్షించి తన్మయూఖప్రకాశితసమస్తవిస్తార యగు దాని రమ్యకాననతోయాఢ్య యగుదాని శారదాంబుధరసంకాశదివ్యభవనోపశోభిత యగుదాని సాగరోపమనిర్ఘోష యగుదాని సాగరానిలసేవిత యగుదాని సుపోషితబలసంగుప్తయైవిటపావతిచందంబున నందం బగుదానిఁ జారుతోరణనిర్యూహమైపాండురద్వారతోరణయైశుభంబగుభోగవతీపురంబుకై వడిఁగరం బలరుదాని శాతకుంభమయమహోన్నతప్రాకారాభిసంవృతయగుదాని మందమారుతసంచార యగుదాని జ్యోతిర్మార్గనిషేవిత యగుదాని గింకిణీజాలనిర్ఘోషపతాకాలంకృత యగుదానిలలితవైడూర్యవజ్రతలంబులఁజారుచామీకరనూతనకేతనంబులఁబురందరచాపానురూపవివిధవిచిత్రతోరణంబులనగణితమణిప్రభాపటలజటిలజాతరూపవితర్దికలఁ ప్రహాటకనిర్యూహంబులమణిస్ఫటికముక్తాఫలవిరచితకుట్టిమంబుల స్ఫాటికాంతరపాంసురూషితరాజతామలపాండురవైడూర్యతలసోపానంబులఁ జారుసంజననంబునరుచిరవితానంబులఁగ్రౌంచబర్హిణరాజహంససంఘంబుల నలరుమహనీయద్వారంబులు గలుగుదాని ననల్పశిల్పికల్పితమణిమందిర యగుదానిఁ దూర్యాభరణనిర్ఘోషప్రతినాదిత యగుదాని దిగంతక్రాంత యగుదాని స్వర్గలోకంబుభంగినింగివెలుంగుదాని ననుత్తమ యగుదాని రత్నవసనోపేతయుఁ గోష్ఠాగారావతంసకయు యంత్రాగారస్తనియు నై విలాసవతిపోలికి మెప్పుదాని నచింత్య యై యప్రమేయ యై యసాధ్య యై యద్భుతదర్శనయై యున్నదాని లంకాపురిఁ గలయ నవలోకించి విస్మయావిష్టహృదయుండును సీతాదర్శనలాలసుండు నై తనమనంబున. 162

ఉ. ఈనగరంబు బల్మిమెయి నెవ్వరికిం జొరఁ గూడ దైన నా
భానుతనూజుఁ డంగదుఁడు పావకపుత్రుఁడు కేతుమాలకుం
డేనును మైందుఁడున్ ద్వివిదుఁ డెంతయు సాహస మొప్పవచ్చి యీ
దానవు వీఁడు సొచ్చి యలధాత్రిసుతన్ గొనిపోవఁ జాలమే. 163

ఉ. రాముఁ డమోఘసాయకుఁడు లక్ష్మణుఁ డంతకుభంగిఁ బొల్పునీ
భూమికి వచ్చు టెంత నరభోజనులం బొలివుచ్చు టెంత యీ
భూమిసుతం గడంగి గొనిపోవుట యెంత విచారమేల నా
కీమెయి శంక లేక పుర మిప్పుడు సొచ్చెద సీతఁ గాంచెదన్. 164

### హనుమంతునకు లంక రాక్షసీరూపముతో నడ్డపడుట.

చ. అని తలపోసి రాత్రిసమయంబున నప్పురిఁ జొచ్చి ప్రీతితోఁ
జనునెడ నిమ్మహాపురి నిశాచరిరూపముతోడ వాయుపు
త్రునిఁ గని భీకరాస్య యయి త్రోవకు నడ్డము వచ్చి నిల్చి క
న్గొనల మిణుంగుఱుల్ సెదర ఘోరఘనధ్వని మీఱ నిట్లనున్. 165

ఉ. ఎచ్చటనుండి యెచ్చటికి నేగుచు నిచ్చటి కద్భుతంబుగా
వచ్చితి మర్కటాధమ యవార్యభుజాబలశాలి రావణుం
డచ్చుపడంగ నేలెడు మహానగరం బిది నీ తెఱంగు నా
కొచ్చెము లేక దెల్పుము సముద్ధతిఁ బ్రాణము గల్గి యుండఁగన్. 166

ఉ. నావిని లంకతోఁ బవననందనుఁ డీనగరంబువాకిటం
గావలి యుండి క్రూరవచనంబుల నన్నెఱపించె దేల నా
త్రోవకు నడ్డమై యడుగు ద్రొక్కెద వెవ్వతె వీవు మున్నుగా
నీవిధ మంత దెల్పు మట నిక్కము నావిధ మంతఁ దెల్పెదన్. 167

చ. అన విని యానిశాటి పవనాత్మజుఁ గన్గొని యేను లంక నీ
యనిమిషకంటకుం డగు దశాస్యుని పంపున నీపురంబు నే
ననిశముఁ గాచి యుండుదు దురాసదనై ననుఁ గానకుండ నె
వ్వరికిఁ జొరంగ రాదు నిను వారక యిప్పుడె దీర్చి పుచ్చెదన్. 168

వ. అనిన నప్పవమాననందనుండు లంకావచనంబులు విని వృష్టిమేఘంబుభంగి విజృంభమాణశరీరుం డై రెండవ శైలంబుకరణి సుస్థిరత్వంబు వహించి స్త్రీరూపవికృత యగుదాని నవలోకించి యిట్లనియె. 169

ఉ. ఈపురిఁ గల్గు వప్రము లహీనవనోపవనప్రకాండముల్
గోపురముల్ విశాలగృహకూటములున్ మణిహర్మ్యసౌధము
ల్వాపులు కూపముల్ దరులు భ్రాజితమందిరచత్వరంబులుం
జూపుల విందుగా నిపుడు చూడఁగ వచ్చినవాఁడ రాక్షసీ. 170

క. అన విని రాక్షసి మారుత, తనయునితో నిట్టు లనియెఁ దప్పక యనిలో
నను గెల్వక యీనగరము, సునిశితగతి నిపుడు నీకుఁ జొరరా దిచటన్. 171

క. నా విని యారాక్షసితోఁ, బావని యిట్లనియె నడిచిపడ నేటికి నే
నీవీడుఁ జూచి వెస నీ, త్రోవ న్జనుదెంతు మరల దుర్దమలీలన్. 172

### హనుమంతుఁడు లంకను జయించుట.

క. అని పవనసుతుఁడు పలికిన, విని రాక్షసవనిత క్రోధవికృతానన యై
ఘననాదంబున నార్చుచు, మునుకొని వెస నతని నొమ్ము ముష్టిం బొడిచెన్.

క. పొడిచిన లావు చెడక యప్పుడు వాయుసుతుండు క్రోధమూర్ఛితుఁ డై వే
పడఁతి యని చంప నొల్లక, పిడు గడచిన భంగి దానిఁ బిడికిటఁ బొడిచెన్.

వ. ఇట్లు హనుమంతునిచేత వ్రేటుపడి వజ్రప్రహారంబున ఱెక్కలు దెగి కూలుపర్వ
తంబు కరణి గాఢమూర్ఛాపారవశ్యంబునఁ బుడమిం ద్రెళ్లి కొండొకసేపునకు
లబ్ధసంజ్ఞ యై వికలంబు లైనయంగంబులు నవరించుకొని యన్నిశాచరి గద్గద
కంఠ యై సమీరకుమారు నవలోకించి యి ట్లనియె. 175

సీ. కపివర్య కృప నన్నుఁ గావుము చంపకు మిలలోన నిది వధ్య మిది యవధ్య
మని యెఱింగి చరింతు రార్యులు నీచేత నేను నిర్జిత నైతి నిక్కువముగ
నెప్పుడు నినుఁ గీశుఁ డేతెంచి నిర్జించు నప్పు డిప్పురికిఁ జే టగు నటంచు
మును నాకు వర మిచ్చె వనజాసనుం డమ్మహాత్మునిపలు కసత్యంబు గాదు
తే. తత్సమయ మిదె నీదు సందర్శనమునఁ, గదిసి వచ్చె మహీసుతా కారణమునఁ
గ్రూరరాక్షసులందఱుఁ గూలఁగలరు, సమరమునఁ బంక్తికంఠుఁడు చావఁగలఁడు.

క. అనిలజ నీ విపు డీపురిఁ, గని చొచ్చి యథాసుఖంబు గా నెల్లెడలన్
జనకజను వెదకి వచ్చిన, పను లన్నియుఁ దీర్చికొనుము భద్రాత్ముఁడ వై. 177

వ. అని పలికిన. 178

క. సముదిత తేజుం డగునా, సమీరతనయుండు కామచారిణి లంక
న్సముదంచిత విక్రమమున, నిమేషమాత్రంబులోన నిర్జించి వడిన్. 179

క. ఆవాకిటఁ బోవక లం, కావరణము కడులఘుత్వగతి దాఁటి రహి
న్నావని పురి సొచ్చి రఘు, క్ష్మావల్లభుసతిని వెదకఁ గౌతూహలి యై. 180

హనుమంతుఁడు లంకాపురముఁ బ్రవేశించుట.

క. పడఁతుక నెపమునఁ బతిచేఁ, జెడఁ గల దీలంక యింక సిద్ధం బనుచున్
ఎడమయడుగు మును పెట్టుచుఁ, గడురయమున రాజమార్గగతుఁడై యరిగెన్.

వ. ఇట్లు లంకాపురంబు ప్రవేశించి ముక్తాపుష్పవిరాజితం బైనరాజమార్గంబు దఱి
సిచిత్రమాల్యాభరణంబులును వివిధాకృతిరూపంబులును దూర్యఘోషపురస్స
రహాసితోత్కృష్టనినదనినాదితంబులును వజ్రాంకుశనీకాశంబులును వజ్రజాల
విభూషితంబులును దీప్తకాంచనస్తంభనిర్మితంబులును శాతకుంభశిఖరంబులు
నగురాక్షసగృహంబులచేత నంబుదంబులచే నాకాశంబుభంగి వెలుంగుచునికి
నచ్చెరువందుచుఁ గైలాసశిఖరాకారంబు లగుసర్వతోభద్రపద్మస్వస్తికవర్ధమా
నాఖ్యప్రభుగృహభేదంబుల నెడనెడగనుంగొనుచు నానందించుచు నురగకంఠ
శిరస్థానోత్పన్నమంద్రమధ్యమతారకస్వరభూషితం బైనమదనమత్తరాక్షసాం
గనామధురగీతంబు నంబరంబున నప్సరఃకాంతలగీతంబుంబోలె మనోజ్ఞంబుగా
నాలకించుచు సోపానచరత్కాంతాజనమంజుమంజీరకాంచీనూపురనినదంబును
హేమదండతాడితభేరీమృదంగపటహాదిదివ్యవాద్యనిర్ఘోషంబును హర్షోత్పన్న
క్రియావిశేషజనితశబ్దంబులును రాక్షసులసింహనాదంబులు నాకర్ణించుచు జపత
త్పరు లగుయాతుధానులమంత్రనాదంబులును స్వాధ్యాయనిరతు లగువారివేద

వేదఘోషంబులును రావణస్తవసంయుక్తు లగురాక్షసులగర్జారవంబులను వినుచు రాజమార్గగతుండై విహరించురక్షోభటుల నిరీక్షించుచుండ నిచవిమధ్యమగుల్మంబున నగరవృత్తాంతవేదకు లగుగూఢచారుల దీక్షితుల జటిలుల ముండితశిరస్కుల వృషభచర్మధారుల స్వాధ్యాయనిరతుల దర్భలు కరంబుల గొని యనిష్టనివారకానుష్ఠానంబు సేయుదర్భముష్టిప్రహరణులఁ గృత్యావహులం బుట్టించి వానిచేత శత్రుమారణంబు సేయుటకు నాభిచారికహోమంబు గావించునట్టి వహ్నికుండాయుధుల నేకాక్షుల నేకకర్ణుల లంబోదరపయోధరుల గరాళభుగ్నవక్త్రుల విషమాచారుల వామనాకృతులఁ బుష్పమాలికాధరుల గంధానులిప్తగాత్రుల విచిత్రకవచోజ్జ్వలుల నాతిస్థూలుల నాతికృశుల నాతికుబ్జుల నాతివామనుల విరూపుల బహురూపుల సురూపుల సువస్త్రుల వరాభరణభూషితుల నానావేషసమాయుక్తుల స్వేచ్ఛావిహారకుశలులఁ గూటముద్గరదండాయుధఖడ్గచాపశతఘ్నీముసలపరిఘశూలవజ్రశక్తివృక్షపట్టిసాశనిక్షేపణీపాశధరుల మహాబలుల శతసహస్రసంఖ్యాతుల రక్షోధిపతినిర్దిష్టులై పురంబు సర్వంబు రక్షించుచున్నరాక్షసవీరుల నవలోకించుచు గిరిమూర్ధప్రతిష్ఠితంబును మహాతోరణంబును బుండరీకావతంసపరిఖాభిసంవృతంబును హేమప్రాకారసుందరంబును ద్రివిష్టపసన్నిభంబును దివ్యంబును దివ్యనాదనినాదితంబును వాజిహేషితసంఘుష్టంబును భూషణస్వనసంకులంబును శ్వేతాభ్రనిచయోపమచతుర్దంతదంతావళదానధారాపంకిలగృహాంగణంబును రథయానవిమానవిరాజితంబును ననల్పశిల్పికల్పితరత్నపారావతప్రముఖపతత్రివిచిత్రితద్వారంబును ననేకసహస్రవీరరాక్షససురక్షితంబును స్వర్ణప్రాకారమండలయుక్తంబును మహాస్థూలముక్తామణివిభూషితాంతరంబును బరార్ధ్యకాలాగరుచందనాక్తంబు నగురావణుని యంతఃపురద్వారంబు సేరం జని యప్పుడు. 182

చ. గురుతరపూర్ణచంద్రికలఁ గుంభిని నెల్ల వెలుంగఁ జేయుచు
న్సురవరు లెత్తుబల్దివియనం బొంపున గోష్ఠమున న్భ్రమించుచుం
దరవృషభంబు లీల వితతద్యుతి నంబరమధ్యవర్తియై
కర మలరారుచందురునిఁ గాంచె సమీరకుమారుఁ డయ్యెడన్. 183

వ. మఱియును. 184

క. జలధి కడ లెత్తి మ్రోయఁగఁ, గలువలు వికసింప లోకగతదుఃఖంబుల్
దొలఁగఁగ భూతవ్రాతము, బలరఁగఁ జంద్రుండు పొల్చె నంబరపీథిన్. 185

తే. అవనిలో మందరాద్రిస్థ యైనలక్ష్మి
యంబువులయందుఁ గమలస్థ యైనశోభ
లలిఁ బ్రదోషములం దర్థిఁ జెలఁగుకాంతి
శీతకరునందుఁ దగఁ బ్రకాశించె నపుడు. 186

చ. సురుచిరపుష్కరస్థరుచిసొంపుగ నప్పులయందుఁ బోలె భా
సురతరసాగరస్థ యగుశోభ ప్రదోషములందుమాడ్కి మం
దరకుధరస్థలక్ష్మి వితతంబుగ ధారుణియందునుం బలెం
గరము నిశాకరస్థ యగుకాంతి నభంబున నొప్పె నయ్యెడన్. 187

ఉ. మందరకందరస్థ మగుమత్తగజేంద్రవిరోధిభంగి సొం
పొందఁగ పంజరస్థ మగునున్నతరాజమరాళము న్బలెం
బొందుగఁ గుంజరస్థుఁ డగుభూరిపరాక్రమశాలికైవడిం
జందురుఁ డొప్పె నప్పుడు విశాలతరద్యుతి నంబరస్థుఁడై. 188

ఉ. మానుగఁ దిగ్మశృంగ మగుమానితమత్తమహోవృషంబుచం
దాన మహోచ్చశృంగ మగునవ్యతుషారనగంబుభంగి జాం
బూనదబద్ధశృంగ మగుభూరిమదేభములీలఁ బాండుర
శ్రీనిధియైనచందురుఁడు చెన్నలరె న్బరిపూర్ణశృంగుఁడై. 189

ఉ. మోహనమూర్తియుం జలధిమోహనసందనుఁడు న్మహోగ్రహ
గ్రాహవినష్టపంకుఁడు ప్రకాశరమాశ్రయనిర్మలాంకుఁ డ
వ్యాహతరోచి నష్టశిశిరామృతపూరతుషారపంకుఁ డు
త్సాహము మీఱఁగా నలరెఁ జారుశశాంకుఁడు పుష్కరంబునన్. 190

క. సమరస్థం బగుకరిచందమున శిలాతలము నొందినమృగేంద్రముమా
డ్కి మనోజ్ఞపూజ్యసామ్రాజ్యము నొందిననృపతిభంగిఁ జంద్రుం డలరెన్.

మ. ధవళాంశూదయనష్టదోషము ప్రవృత్తక్రూరరాత్రించర
ప్రవరోద్యత్పిశితాశదోషము లసద్రామాభిరామేరితా
ప్రవిషహ్యాత్మగతైకదోషము ఘనస్వర్గప్రకాశంబునై
స్తవనీయంబుగ నేగె నప్పుడు ప్రదోషం బుర్వి రాగిల్లఁగన్. 192

వ. ఇట్లు వెలుంగుచంద్రుం గనుంగొని యలరుచు నాహనుమంతుండు వెండియు.

చ సురుచిరతంత్రినిస్వనము శ్రోత్రసుఖంబుగ నాలకించుచుం
బురుషులఁ గూడి తల్పములఁ బొంది సుఖంబుగ నిద్రవోవుసుం
దరుల లసద్విహారము నుదంచితభంగి నొనర్పఁ బూనుని
ర్భరతరరౌద్రవృత్తు లగురాక్షసవీరులఁ గాంచె నయ్యెడన్. 194

హనుమంతుఁడు లంకాపురం బంతయుఁ గలయం దిరుగుట.

తే. స్యందనాశ్వభద్రాసనసంకులంబు, లనవరతవీరలక్ష్మీసమాశ్రయంబు
లుత్తమంబులు మత్తప్రమత్తతరము,లగుకులంబులఁ జూచె నయ్యనిలసుతుఁడు.

చ బిఱబిఱ డాసి యొండొరులఁ బిల్చుచు బాహువుల న్విదుర్చుచుం
ఉరములు దట్టుచు న్దనువు లొయ్యనఁ గాంతలమీఁద వైచుచు
న్బరువమదప్రలాపములు పల్కుచు మేనులు పానమత్తులై
మఱచుచుఁ జిత్రచాపములు మాటికి సూటిగ నెక్కు పెట్టుచున్. 196

వ. మఱియు ననేకప్రకారంబుల దేహవికారంబులు నెఱపురాక్షసులఁ గలయ నవ
లోకించుచు వెండియు. 197

చ. పురుషులఁ గౌఁగిలించుకొని పొందుగ నిద్దురవోవువారి భా
స్వరతరగంధలేపనము సల్పెడువారి సురూపవక్త్రలై
సరసత నవ్వువారి నెకసక్కెము లాడెడువారిఁ గ్రుద్ధలై
పరుసము లాడువారిని నిశాచరకాంతలఁ జూచె నయ్యెడన్. 198

క. పరఁగ బుసకొట్టుకాకో,దరములచే మడువుఁ బోలె దంతావళభీ
కరవీరదానవులచేఁ, గర మొప్పెడునప్పురంబు గనుఁగొనియె రహిన్. 199

చ. వితతజగత్ప్రధానులు వివేకధురీణులు శ్రద్ధధాను లం
చితరుచిరాభిధానులు విశేషబలు ల్వివిధాభిధాను లా
తతధిషణాప్రధానులు సదాసురభీతికరాభిధాను లు
న్నతపురి యాతుధానులు మనం బలర న్గనుపట్టి రయ్యెడన్. 200

చ. వివిధగుణాభిరాములఁ బ్రవృద్ధుల నాత్మగుణానురూపులం
బ్రవిమలతేజుల న్విశతబంధురవిక్రమదుర్నివారుల
న్సువిహితబాహుసత్త్వుల మనోజ్ఞసురూపవిరూపధారులన్
దివిజవిరోధులం గనియె ధీరుఁడు వాయుకుమారుఁ డయ్యెడన్. 201

చ. అరయ విశుద్ధభావల వరార్హల వల్లభసక్తభావల
న్మఱియు మహానుభావల సమంచితరూపల రమ్యరూపసుం
దరరమణోపగూఢల నదభ్రసద్వృత్తిగుణప్రభావలం
దరుణులఁ గాంచె గంధవహనందనుఁ డంచితసౌధవీథులన్. 202

చ. నిరుపమజాతరూపమణినిర్మితహర్మ్యతలంబులందుఁ బు
ష్కరశరదైవతోత్సవము సల్పి ప్రియాంకసుఖోపవిష్టలై
సురుచిరరత్నహారపరిశోభితఘర్మజలార్ద్రగాత్రలై
వరతనుకాంతి నొప్పు సురవైరినివిష్టలఁ గాంచెఁ గొందఱన్. 203

చ. అనుపమరత్నహారరుచు లంగముల న్వెలుఁగంగఁ జేయ సి
గ్గునఁ దల వాంచి కాంతుల నకుంఠితలీలఁ గవుంగిలించుచున్
ఘనకుసుమోపగూఢవిహగంబులభంగి ముదం బెలర్ప మె
ల్లనసురతంబు సల్పెడునెలంతులఁ గొందఱఁ గాంచె నచ్చటన్. 204

చ. అరుదుగ నుత్తరీయరహితాంగులఁ గాంచనరాజవర్ణల
న్సురుచిరహేమవర్ణల మనోజ్ఞశశాంకకళంకవర్ణల
న్వరరుచిరాంగవర్ణల ధనంజయవర్ణలఁ జంద్రవర్ణలం
దరుణులఁ గొందఱం గనియె నాథవియుక్తల నప్పురంబునన్. 205

క. అతులితమనోభిరాములఁ, బతులం గని ప్రీతియుక్తభావంబులతో

రతికిన్ స్మయింగొనుదానవ, సతులం గలయంగఁ జూచె సామీరి యటన్. 206

తే. జలజసంకాశనేత్రపంక్తులను జంద్రతుల్యముఖపంక్తులను దటిత్తులితరత్న
హారపంక్తుల దీప్తహేమాభవస్త్రపంక్తులను జూచె నచ్చటఁ బ్లవగవరుఁడు.

వ. ఇత్తెఱంగున నచ్చటివారి నెల్లఁ గలయ నవలోకించి యప్పవమాననందనుండు
పద్మాభిజాత యగుదాని రాజకులప్రజాత యగుదాని నయోనిజాత యగు
దాని సాధుజాత యగు ప్రఫుల్లవల్లికైవడి నొప్పుదాని సంతతావిచ్ఛేదపాతివ్రత్య
మహాపధర్మమార్గసన్నివిష్ట యగుదాని భర్తృచిత్తానుసారిణి యగుదాని రామునిం
జేరఁ గాని విలపించుదాని రామాలోకననిశ్చయ యగుదానిఁ ద్రిజగన్నుతపతివ్ర
తాశిరోమణి యగుదాని విరహతాపపీడిత యగుదాని సానుస్రుతాస్త్రకంఠియగు
దాని వరార్హోత్తమనిష్కకంఠి యగుదాని స్నిగ్ధకంఠియగుదాని వనప్రనృత్తయగు
నీలకంఠిపగిది నలరుదాని నస్ఫుటప్రకాశ యగుచంద్రరేఖలాగునఁ బాంసు
ధూషితయైన హేమరేఖకైవడిఁ క్షతప్రరూఢ యగుబాణరేఖకరణి వాయు
ప్రభిన్న యగుమేఘరేఖచొప్పునఁ గృశాంగియై యనావిష్కృతతేజోవిశేషయై
యంతర్వేదనాసహితయై సమాధేయశైథిల్యయై యుండుదాని ననంతకల్యాణ
గుణసమేతయైనసీతం గానక దుఃఖాభిహతచిత్తుండై కొండొకసేపు విచారించి
వెండియు లంకాపురంబు గలయ వెదకి. 208

సీ. వరవజ్రగర్భిత వైడూర్యతలములు భాసురస్ఫటికసోపానములును
మణిహారచారుహేమస్తంభపంక్తులు చిత్రకాంచనరత్నశిఖరములును
విలసితనవరత్నవేదికాతలములు ద్వారచిత్రితరత్నతోరణములు
మహితముక్తాజాలమయవితానంబులు బహుచిత్రశోభితభద్రవలభి

తే. దనరి వీరరాక్షసరక్షితంబు వార
యువతిసేవితమును మంత్రియుతము వివిధ
చిత్రమృగచర్మవర్మరాజితము నగుచు
వలరునాస్థానసదనంబు గలయ వెదకి. 209

హనుమంతుఁడు ప్రహస్తాదులగృహములయందు సీతను వెదకుట.

వ. మఱియు రూప్యకోపహితహేమభూషితవిచిత్రతోరణంబును విశాలరుచిరకక్ష్యా
ద్వారసంవృతంబును గజహయస్యందనస్థవిగతశ్రమానంహార్యమహామాత్ర
శూరసంసేవితంబును సింహవ్యాఘ్రచర్మనిర్మితతనుత్రాణోపేతంబును దాంతకాం
చనరాజతఘోషవద్విచిత్రరథచరితంబును బహురత్నసమాకీర్ణంబును బరార్ధ్యాస
నభాజనంబును మహారథసమావాసంబును మహారథదర్శనీయపరమోదారవివిధ
బహుసాహస్రమృగపక్షిపరిపూర్ణంబును వినీతాంతపాలరక్షోగణసురక్షితంబు
ను ముఖ్యవరనారీపరికీర్ణంబును ముదితప్రమదారత్నంబును వరాభరణనిర్హ్రాద
సముద్రస్వననిస్వనంబును వరార్హచందనలిప్తంబును రాజగుణసంపన్నంబును

మహాజనసమాకీర్ణంబునుసింహాభిగుప్తవనప్రతీకాశంబునుభేరీమృదంగశంఖపట
హాపణవాదివాద్యస్వనసంకులంబునుజందనాదినిత్యార్చితంబును దర్శపౌర్ణమా
సపర్వహుతంబును రాక్షసపూజితంబును సముద్రసమగంభీరంబును మహారత్న
పరిచ్ఛదంబును జందనాగరుధూపవాసితంబును మహాజనసమాకీర్ణంబును గజా
శ్వరథసంకులంబును మహనీయవపుర్విరాజమానంబును సింహాభిగుప్తగుహాస
దృశంబును నగురావణునిదివ్యమందిరంబుఁ గనుంగొని. 210

క. అది లంకాభరణం బై, నదమలబహురత్నకాంతిసంభరితం బై
మదరాక్షససంకులమై, త్రిదశపతిగృహంబుభంగిఁ దేజిలు చునికిన్. 211

వ. మనంబున నచ్చెరు వందుచు. 212

క. వనములఁ జూచుచు మేడలు, ఘనముగ నెక్కుచును గేళికాగృహముల చె
వ్వనికిం గన రాకుండఁగ, మునుకొని ప్రచ్ఛన్నరూపమునఁ గనుఁగొనుచున్.

వ. మఱియుఁ గ్రమంబునఁ బ్రహస్తునినివేశనంబును వెదకి మహాపార్శ్వునినివా
సంబు నెమకి మేఘప్రతీకాశం బగుకుంభకర్ణునినికేతనంబు శోధించి విభీషణుని
మందిరంబు విమర్శించి మహోదరవిరూపాక్షవిద్యుజ్జిహ్వవిద్యున్మాలివజ్రదంష్ట్రుల
సదనంబులు పరామర్శించి ధూమ్రాక్షునిసద్మంబు వీక్షించి ఘనవిఘనసంపాతి
విద్యుద్రూపశుకసారణులగృహంబులు గనుంగొని యింద్రజిన్నిశాంతంబు
విలోకించి జంబుమాలిరశ్మికేతుసూర్యశత్రువజ్రకాయధూమ్రాక్షశుకనాసవ
క్రశఠవికటులనివాసంబు లాలోకించి హ స్తికర్ణునిలయంబు పరీక్షించి యుద్ధో
న్మత్తమత్తదంష్ట్రరోమశధ్వజగ్రీవహస్తిముఖేంద్రజిహ్వకరాళపిశాచశోణితాక్ష
యూపాక్షభీమాక్షవిద్యుత్కర్ణాశ్వకర్ణనాగేంద్రజిహ్వ కుంభ నికుంభాగ్నికేతు
రశ్మికేతు దేవాంతకనరాంతకాతికాయ మహాకాయ త్రిశిరఃప్రముఖయాతుధా
నులభవనంబులు కలయం దిరుగుచు లీలోద్యానంబులు వెదకుచు నెందును జా
నకిం గానక యన్నియు నతిక్రమించి పురోభాగంబున. 214

క. నిర్మలవినూత్నమణిగణ, నిర్మిత మై రత్నజాలనికరావృత మై
శర్మద మై యలరారెడు, భర్మప్రాసాద మొకటి పరికించి తగన్. 215

వ. అందు. 216

క. శూలములు ముద్గరంబులు, వాలంబులు శక్తిభిండివాలపరశువుల్
గేల ధరియించి శౌర్యము, గ్రాలఁగఁ గాపున్నదనుజకాంతలఁ గాంచెన్. 217

వ. మఱియును. 218

క. వివిధమహోద్యానంబుల, వివిధలతాగుల్మములను వివిధతరువుల
న్వివిధనికుంజంబుల నప్లవమానసుతుండు గలయఁ బరికించె రహిన్. 219

క. నానాప్రహరణపాణుల, నానారూపులను భయదనానార్భటుల
న్నానావర్ణశరీరుల, నానాఖ్యులఁ గనియెఁ బవననందనుఁ డచటన్. 220

వ. మఱియు మహాజవంబు లగురక్తశ్వేతపీతసితవర్ణంబులును జాంబూనదపరిష్కృతంబులు నగుహయసహస్రంబులను మహామేఘంబుకరణి భీమనిర్ఘోషంబులు సలుపుచుఁ బర్వతంబులపగిది మదంబు గురియుచున్నరూపసంపన్నంబులును బరగజారుజంబులును నైరావతసమానంబులును గులీనంబులును గజవిద్యాభ్యాసంబునందు శిక్షితంబులును బరసైన్యవిదారణంబులు నగుగజంబులను మేఘస్తనితనిర్ఘోషంబులును సురాసురదుర్ధర్షంబులును హేమజాలపరిచ్ఛన్నంబులును దరుణార్కప్రతీకాశంబులు నగు రథంబులను జామీకరవిభూషితంబులగు వాహినీశతంబులను మణినిర్మితవివిధాకారంబులగుశిబికాసందోహంబులను విచిత్రంబు లగులతాగృహచిత్రశాలాయుక్తగృహక్రీడాగృహంబులను దారుమయక్రీడాపర్వతంబులను గామోద్దీపకగృహంబులను దివావిహారోచితగృహంబులను గలయ నవలోకించుచు నగ్రభాగంబున మందరాచలసంకాశంబును గ్రీడామయూరస్థానసంకులంబును ధీరనిష్ఠితమహాతపఃఫలంబును గైలాసగిరిసన్నిభంబును ననంతరత్ననిచయంబును ధ్వజయష్టిసమాకీర్ణంబును నిధిజాలసమన్వితంబును జాంబూనదమయశయనాసనమణిభాజనసంకులంబును క్షౌద్రవికారమద్యకృతద్రవంబును గుబేరభవనంబుపగిది మనోజ్ఞంబును నసంబాధంబును నాదవిశేషయుక్తకాంచీనూపురమృదంగతలనిర్ఘోషనినాదితంబును బ్రాసాదసంఘాతయుతంబునుబద్మస్వస్తికరచనావిశేషప్రకోష్ఠంబు నగురావణునియంతఃపురంబు గనుంగొని. 221

హనుమంతుఁడు రావణునియంతఃపురముఁ బ్రవేశించుట

క. దనుజపతి తేజమున నూతనరత్నవిశాలరుచులఁ దద్వేశ్మము సాం
ద్రనిశితసహస్రరశ్ముల, నినునిపగిది వెలుఁగు చునికి నిచ్చ నలరుచున్. 222
తే. చారువైడూర్యమణిగణస్థగితహేమ, జాలమై చంచలాశక్రచాపపత్త్రి
జాలయుత మైనమేఘంబుసరణి నీగృహం బలరుచున్న దేమందుననుచుఁ బొగడి.
వ. అద్దివ్యమందిరంబు ప్రవేశించి. 224
చ. కరిరథవాజిశాలలు ప్రకాశశిలీముఖచాపశాలలు
న్గురుతరవాద్యశాలలు మనోహరనూతనచంద్రశాల లం
బరతలచుంబిదివ్యమణిమండితకాంచననాట్యశాలలు
న్సురుచిరచిత్రశాలలును జూచె సమీరకుమారుఁ డయ్యెడన్. 225
చ. అనిమిషదైత్యపూజితము లంచితచిత్రపత్త్రిసంలస
ద్వనములు సర్వదోషపరివర్జితము ల్మయనిర్మితంబులు
న్ఘనవసురాజితంబులు ప్రకాశమనోజ్ఞగుణోత్తరంబులు
న్దనుజవరేణ్యుసద్మములు తప్పక చూచెఁ గపీంద్రుఁ డయ్యెడన్. 226
వ. ఇత్తెఱంగున నవలోకించి తన్మధ్యభాగంబున. 227

సీ. రుచిరకాంచనచారురూపంబు నుచ్ఛ్రిత మేఘసన్నిభము సమిద్ధరత్న
సంకీర్ణ మసురవంశశ్రేష్ఠకబలానురూప మప్రతిరూపరూప మలర
లోకతుల్యము సర్వలోకసంపత్సమాకీర్ణంబు కైలాసగిరి నిభంబు
రమణీయ హేమవిరాజమానము హృద్యవసురాశిశోభా ప్రవర్ధమాన
తే. మఖిలకిన్నరయక్షవిద్యాధరేంద్ర, గరుడగంధర్వచారణ సురవరేణ్య
దివ్యసదనాగ్రగణ్యంబు దేవదైత్య, చారణవరాంగనాశతసంకులంబు. 228

వ. మఱియు నానాతరుకుసుమరజోవకీర్ణ పర్వతాగ్రసదృశంబును సంచలితచంచలా సమంచిత మగుపయోదముం బోలె నారీప్రవేకదీప్యమానంబును హంసప్రవేక సముహ్యమానగగనగామిసుకృతివిమానసంకాశంబును నభోమణీనిభాగణిత మణిగణప్రభాధగద్ధగాయమానంబునుబహుధాతుచిత్రనగాగ్రప్రతీకాశంబును గ్రహచంద్రచిత్రవిష్ణుపథనికాశంబునుసమూహీకృతనానావర్ణ మేఘవద్విచిత్రంబును బహురత్నచిత్రంబు నగునొక్కవిమానంబు గాంచి యందు. 229

ఉ. ధరణిధరాళిపూర్ణ యగుధాత్రిని వృక్షవితానపూర్ణభూ
ధరముల నాత్తపుష్పపరిధానము లైనమహాద్రుమంబుల
న్గురుతరపద్మకేసరమనోజ్ఞము లైననునువ్రజంబులం
దరుచరవీరుఁ డచ్చట ముదం బలర న్సరికించె నత్తఱిన్. 230

చ. అతులితపాండుపద్మముల నంచితనవ్యసరోవరంబుల
న్వితతసకేసరప్రచురనీరజసంఘముల న్మనోజ్ఞపు
ష్పితఫలితప్రపల్లవితశీతలవృక్షులసద్వనంబులం
గృతకవిచిత్రశైలములఁ గీశచమూపతి గాంచె నయ్యెడన్. 231

చ. కృతకవిచిత్రపత్రమణికేసర హేమపతత్రిజాలము
న్దతవసుచిత్రపన్నగవితానముల న్ఘనజాతిఘోటక
ప్రతిమమహాతురంగముల గాజతహైమమృగప్రకాండము
న్వితతసరోజహస్తకరిణీగణము న్సరికించె నెంతయున్. 232

తే. భూరివిద్రుమకాంచనపుష్పపక్ష, చిత్రితంబు లాకుంచితజిహ్మపత్ర
లసితములునునన్యోన్యాభిలపనములగు, కాంచనవిహంగమంబులఁగాంచెనచట. 

చ. కమలపలాశహస్తములు కాంచనకేసరయుక్తము లుసహ
స్తములు నియుజ్యమానము లుదగ్రతరంబులు నైనచిత్రహే
మమయమహాగజంబుల సమంచితనూతనపద్మహస్త యై
ప్రమద మెలర్పఁ గ్రాలు నవలక్ష్మిని గాంచెఁ గపీంద్రుఁ డత్తఱిన్. 234

—హనుమంతుఁడు పుష్పకవిమానమును జూచుట.—

వ. ఇట్లభినవవిచిత్రచిత్రకల్పితంబును శోభనాకారరచనావిశేషంబును బరమను గంధబంధురంబునువసంతకాలచారుకందరమందరసంకాశంబు నగువిమానంబు

శోధించి శ్రీయరుదందుచు దశముఖబాహుపాలిత యగునప్పురిం జరించుచుఁ
బతిగుణోత్కర్ష వశీకృత యగుదానిఁ బరమపతివ్రతాశిరోమణి యగుదాని సన
త్కులప్రసూత యగుసీతం గానక శోభనసీతిమార్గవర్తియుఁ గృతప్రయత్నుం
డును దూరసాహసోత్కారసమర్థుండు నగుపవననందనుండు సుదుఃఖితుండును
బహువిధచింతాన్వితచిత్తుండు నై కొంతకసేపు ఆచ్చవడి యుండి వెండియు
నక్కాంచనమందిరమధ్యంబునమణివజ్రచిత్రితం బగుదానిఁ దప్తహేమగవాక్ష
నిర్మాణం బగుదాని నప్రమేయాప్రతికారకృత్రిమంబగుదాని నిర్మాణకాలంబున
విశ్వకర్మచేతఁ బ్రశంసాపూర్వకంబుగా విరచితం బైనదాని నాకాశగతం బగు
దాని వాయుపథప్రతిష్ఠితం బైనదాని మార్తాండమార్గచిహ్నంబుకరణి నలరు
దాని నతిప్రయత్ననిర్మితసర్వస్థలం బగుదాని మహార్హరత్ననిచితం బగుదాని
సుప్రతిష్ఠితరచనావిశేషతిరస్కృతసురవిమానం బగుదాని మహావిశేషయుక్తం
బగుదానిఁ దపోనుష్ఠానపరాక్రమార్జితం బగుదాని మనోభిలషితసర్వదేశ
గమనశీలం బగుదాని ననేకసంస్థానవిశేషనిర్మితం బగుదాని నితస్తతస్తుల్య
విశేషదర్శనం బగుదాని స్వామిచిత్తం బెఱింగి వలసినచోటికిం జనుదాని
మహాత్ములును బుణ్యవంతులును మహర్ధులును మహానందులు నగుశక్రాది
దిగీశులసదనంబులచందంబున నందం బగుదాని విశిష్టదివ్యరత్నాదివస్తుజాతంబు
నవలంబించి దివ్యసంస్థాన విశేషణావస్థితంబుగా నిర్మితం బైనదాని విచిత్ర
కూటం బగుదాని ననేకావాంతరకూటాలంకృతం బైనదాని మనోభిరామం
బగుదాని శరదిందునిర్మలం బగుదాని విచిత్రకూటం బగు మేరుశిఖరంబు
చందంబున నందం బగుదానిఁ గుండలశోభితవదనులును విఘూర్ణితవిపర్యస్త
విశాలవిలోచనులును మహాశనులు నగునునిర్మితప్రతిమాకారనిశాకరులచేత
నుహ్యమానం బగుదాని వసంతకాలికపుష్పసమూహచారుదర్శనం బగుదానిఁ
బుష్పకనామదివ్యవిమానంబుఁ గనుంగొని తన్మధ్యదేశంబున బహుప్రాసాద
సంకులంబును విపులంబును నర్ధయోజనవిస్తీర్ణంబును సార్ధయోజనాయ
తంబును జతుర్విషాణత్రివిషాణద్విరదపరివేష్టితంబును నసంబాధంబును నుద్య
తాయుధరక్షోభటరక్ష్యమాణంబును రాక్షసపత్నీసేవితంబును బలాత్కారాక్ర
మ్యమాణరాజకన్యాసంకులంబును నక్రమకరతిమింగిలఝషపన్నగకమఠాకుల
వాయువేగసమాధూతసాగరోపమంబు నగునొక్కమహనీయహర్మ్యంబువిలో
కించి తన్మధ్యంబున. 235

చ. ధనదుగృహంబుకంటె బలదానవభంజనువీటికంటె ధ
ర్మునిసదనంబుకంటె నలరుద్రునిగేహముకంటె గంధవా
హునిసదనంబుకంటెను బయోధిపుసద్మముకంటె హవ్యభు
గ్దనుజులయిండ్లకంటె నధికద్యుతి నొప్పెడుదాని నెంతయున్. 236

క. వారిజగర్భునకుం దప, మారయఁ గావించి ధనదుఁ డర్థిం గొన దు

ర్వారగతి నతని గెలిచి యు, దారత రావణుఁడు గొన్నదాని న్నిగులన్. 237

చ. ఉరుతరభర్మనిర్మితము లుజ్జ్వలరత్నమయంబు ప్రస్ఫుర
ద్వరణసమావృతంబు సముదగ్రగృహప్రకరంబు లోకసుం
దరమును విశ్వకర్మరచితంబును బుష్పసుగంధదీపస
త్పరిమిళితంబు కామగసుభద్రవితానవిరాజితాంగమున్. 238

వ. మఱియు మత్తవారణసంకీర్ణంబును సర్వరత్నవిభూషితంబును గృత్రిమమృగ
సమాయుక్తకార్తస్వరహిరణ్మయసుకృతస్తంభసంవృతంబును గగనోల్లిఖితమేరు
మందరసంకాశశుభాకారకూటాగారాలంకృతంబును జ్వలనార్కప్రతీకాశహే
మసోపానసంయుక్తంబును బద్మరాగమణిస్థగితచారువితర్దికాశతవిరాజితంబును
గాంచనస్ఫాటికజాలవాతాయనయుక్తంబును నింద్రనీలమహానీలమణిప్రవరవే
దికంబును మహాధనవిద్రుమవిచిత్రనిస్తులముక్తామణిస్యూతకుట్టిమవిరాజితంబు
ను దపనీయనిభసుగంధిరక్తచందనానులిప్తంబును దరుణాదిత్యసంకాశంబును
నానావిధవరాకారకూటాగారపరిష్కృతంబు నగుదివ్యవిమానరత్నంబుఁ గాంచి
తన్మందిరమధ్యంబున శోభనస్వరూప యగుదాని రూపవతి యైనకాంతయుం
బోలె రావణునకు మనఃకాంత యగుదాని సువర్ణగవాక్షవిరాజిత యగుదాని
స్ఫాటికావృతకుట్టిమ యగుదాని మధ్యమధ్యదంతాంతరితనిర్మితరూపంబులు
గలదాని ముక్తాప్రవాళరూప్యచామీకరవిభూషితమణిస్తంభభూషిత యగుదా
నిఁబక్షంబులచేతంబోలె మణిభూషితసమావక్రకాంచనస్తంభంబులచేత నాకా
శంబున కుద్గమింప గమకించుచున్నదానిచందంబునం జూపట్టుదాని సరిత్సముద్ర
గిరిరాష్ట్రాదిపృథివీలక్షణాంకితమహావిశాలచిత్రరత్నకంబళాస్తీర్ణ యై సరాష్ట్రగృ
హమాలిని యగుపృథివిభంగి నొప్పుదాని మత్తవిహంగసన్నాదిత యగుదాని
దివ్యగంధాధివాసిత యగుదానిఁ బరార్థ్యాస్తరణోపేత యగుదానిఁ జంద
నాగరుధూపవాసిత యగుదాని హంసచ్ఛదచ్ఛాయపగిది నతిపాండర యగు
దానిఁ బుష్పోపహారవిచిత్రసుప్రభాకలిత యై కల్మాషియుంబోలె సర్వానందదా
యిని యగుదాని మనస్సంహ్లాదజనని యగుదాని వర్ణప్రసాదిని యగుదాని శోక
నాశని యగుదాని సమస్తశోభాజన్మసీమ యగుదాని నొక్కవిశాలశాల నవలో
కించి తదీయసుషమావిశేషంబున కిచ్చ మెచ్చుచు గంధవాహుండు రూపవం
తుండై రావణుం డిచ్చోట వసియించి యున్నవాఁడని యెఱింగించుటకు బం
ధుం డుత్తమబంధునింబోలె మహాసత్త్వుం డగుహనుమంతు నెదుర్కొనియెనో
యన్నచందంబున గుబాళించు పానభక్ష్యాన్నసంభవం బైనసముచ్ఛ్రితదివ్య
గంధం బాఘ్రాణించి యరుదందుచుఁ దల్లియుంబోలె నింద్రియపంచకంబు
నింద్రియార్థపంచకంబునఁ దృప్తినొందించు చునికి నానందించుచు. 239

క. సురజగమొ బ్రహ్మలోకమొ, పురహరలోకంబొ స్వర్గపురమో దేవే
శ్వరులోకమొ యిది యని య, త్తరుచరవీరుండు మదినిదలఁచుచు మఱియున్.

క. తలఁగొని జూదంబున ధూ, ర్తులచే నిర్జింపఁ బడినధూర్తులక్రియ మి
క్కిలి ధ్యాన మలమి యున్న, ట్లలరుకఫకదీపకళికలటు గనుఁగొనియెన్. 241

క. వరరూపరుచుల దశకం, ధరు తేజంబున విభూషణవ్రాతమనో
హరకాంతులఁ దన్మందిర, మురుదార వెలుంగు చునికి నతివిస్మితుఁడై. 242

క. వితతమణిమయకవాట, ప్రతతులచే రుచుల వెలికిఁ గ్రక్కుచు నున్న
ట్లతులితగతి నొప్పుతద, ప్రతిమానగృహంబు సొచ్చి బరమలఘుగతిన్. 243

హనుమంతుఁడు పుష్పకాంతర్గతంబుల సీతను వెదకుట

వ. ఇట్లమ్మరున్నందనుండు దూరప్రణిహితేక్షణుండై పాదన్యాసంబునం జప్పుడు
కాకుండ మెల్లనఁ జొచ్చి యందు నానావర్ణాంబరపుష్పదామంబును నానా వేష
విభూషితంబును బాననిద్రావశంగతంబును మదనక్రీడావ్యాయామపరిశ్రాంతం
బును నిశ్శబ్దాంతరభూషణంబునై నిశ్శబ్దహంసభ్రమరంబైన పద్మవనంబుమాడ్కి
రత్నకంబళాస్తరంబుపై నిద్రించుచున్నవరనారీసహస్రంబు నవలోకించి. 244

క. ముకుళితనయనంబులతోఁ, బ్రకటితదంతములతోడ భాసురనీలా
లకములతో నొప్పెడుత,ద్వికచాబ్జులయాననములు వీక్షించి రహిన్. 245

మ. పవ లెల్ల న్వికసించి రాత్రులు తమఃప్రవ్యక్తిచే మోడ్చుచు,
న్కి వధూవక్త్రము లంబుజంబు లని యెంతే ప్రీతిఁ దద్గంధముం
బవమానుం డొసఁగంగ మూర్కొని యళు ల్సంగీతసన్నాదవై
భవయుక్తిం గడు మ్రోయు చున్కి గుణసంపన్నుండు సానందుఁడై. 246

తే. మఱియు మాధుర్యసౌరభ్య మాంద్యశైత్య
మార్దవాదికగుణముల మలయు చునికి
నీవెలందులముఖములు హృద్యపద్మ
సమములై యుండుటకు నేమి సందియంబు. 247

క. దేవాంగనాసమావృత, మై నలరెడువైజయంతహర్మ్యముక్రియ నేఁ
డీవరగృహము నిశాటీ, వ్యావృతమై యొప్పుచున్న దద్భుతభంగిన్. 248

తే. మఱియు నీరత్నమయదివ్యమందిరంబు, దనుజకాంతాపరీతమై తారకాభి
రాజితంబైనశారదాభ్రంబుమాడ్కిఁ,గన్నులకువింతయై యొప్పుచున్నదహహ.

ఆ. మఱియుఁ బుణ్యశేష పరివృతలై యాక, సమున నుండి పుడమి జాఱిపడిన
తార లగుట నిక్క మీరాజముఖులు లే, కున్నవీరి కింతయొప్పు గలదె. 250

క. ఈయెలనాగలదేహ, చ్ఛాయలచే నివ్విచిత్ర సదన మలరెడిఁ
బాయక వినూత్నతారా, చ్ఛాయలచే నలరు నాకసముచందమునన్. 251

వ. అని బహుప్రకారంబులఁ దదీయప్రభావంబు వక్కాణించుచు నక్కాంతలలో
నఁ గొందఱు పానానంతరగీతనృత్యాదివ్యాపారకాలంబునందు నిద్రాపరవశలై
తిలకంబులు మాసియుఁ గొంద ఱందియ లూడ్చియుఁ గొందఱు వలువలు వీడి

యుఁ గొందఱు కుసుమమాలికలు కొప్పులం జాఱియుఁ గొందఱు కెలంకుల ముక్తాహారంబులు రాల మేఖలలు వదలఁ బరస్పరాంగంబులఁ బతులంబలెఁ గౌఁగిలించియుభూషణంబులు నెఱయమెఱయుతమతమవదనంబులు కమలంబు లని తావులకుఁ దేంట్లు ముసర వివృతవదనలును వికీర్ణకేశపాశలునై వాహిత బాలాశ్వంబులపగిది నేలం బడి పొరలుచు ముఖపద్మంబులు వేణీభుజంగంబులు నాభీసరోవరంబులు జఘనపులినంబులు బాహుబిసంబులు కూర్మపద్మంబులు జంఘికామకరంబులు నేత్రమీనంబులు వక్షోజచక్రంబులు గలిగి సుప్తవాహి నులచందంబున నందంబగు వారి విలోకించుచు. 252

మ. తతమాణిక్యవిభూషణంబులు లసద్వైడూర్యహారంబు లా
తతముక్తామణిదామముల్ మరకతోత్తంసంబులుం బోల్చె ని
ద్రితదైతేయకులాంగనాళికుచనీరేజాతమధ్యంబునం
దతులశ్రీకనకచక్రవాకబకహంసాళిప్రతానోన్నతిన్. 253

క. లలనాంగంబులయందును, విలసితకుచతటములందు విమలమణిగణో
జ్జ్వలభూషణ రేఖలు చె, న్నలవడ భూషణములట్టు లలరారె రహిన్. 254

క. మానితనవాంబరాంతము, లాననపవమానవిచలితాగ్రములై య
య్యాననములపై మాటికి, మానుగ నొప్పారెఁ జిత్ర మంజులకాంతిన్. 255

సీ. కమనీయమరకతగ్రైవేయకాంతులు రమణీయవక్త్రమూలముల వెలయఁ
దపనీయమణిజాలతాటంకరోచులు గండపాండిమపొత్తు గలసి మెఱయ
రుచిరవజ్రోపల విచికలద్యుతులు నీలాలకంబులతోడ నొఘళింపఁ
గనకకాంచీరణద్ఘంటికాదుచులు మానితనితంబములపై నృత్యమాడ
తే. భూరిమాణిక్యరుచిర కేయూరరుచులు
బాహుమూలజద్యుతులతోఁ బలిసి కలయ
లీలమైఁ జాలు గొని పవ్వళించి యున్న
రాక్షసాధిపుప్రాణవల్లభలఁ గనియె. 256

క. ఆసతులసురభిముఖని, శ్వాసము మైరేయకుసుమశర్కరఫలమ
ధ్వాసవసుగంధభరితం, బై సుఖముగ నుడిసె నలదశాస్యనిమీఁదన్. 257

క. కొందఱు రావణువనితలు, నందునఁ జాలు గొనియున్నసవతులముఖము
ల్పొందుగ సారెకు మూర్కొని, రందంబునఁ బంక్తికంధరాననశంకన్. 258

వ. మఱియు నయ్యింతులు రాగాంధలై రావణునియందు మిక్కిలి నంసక్తచిత్త లగుటం జేసి సపత్నులచేత నుపాఘ్రాతవదనలై తదాఘ్రాణనంబు పతికిం బ్రియం బని తలంచి సపత్నులకుం బ్రియంబు గావించి రదియునుం గాక. 259

తే. మఱియుఁ గొందఱు వనితలు మంతనమునఁ
బారిహార్యవిభూషితబాహువులను

దలగడలఁ జేసి లలితవస్త్రములమీఁదఁ
బవ్వళించి నిద్రించిరి భాసురముగ. 260

ఉ. ఒక్కతె యొక్కదానికుచయుగ్మమునం దిడి హస్త మొక్కతె
న్నొక్కతె దానియంకమున నొక్కతె దానినితంబమందు నొం
డొక్కతె దానిపార్శ్వమున నొక్కతె దానివెడందవీపుపై
నొక్కతె గాఁగ నిట్లనుపమోహములొంగి నిద్దురించి రయ్యెడన్. 261

వ. మఱియుఁ గొందఱు యువతులు మదనస్నేహవశానుగలై యూరుపార్శ్వకటిపృ
ష్ఠంబు లితరేతరంబు గలయునట్లు చేసి పరస్పరనివిష్టాంగులై యన్యోన్యగాత్ర
సంస్పర్శంబువలన నలరుచు నేకీకృతభుజలై సుషుప్తి నొంది రిట్లనోన్యసూ
త్రగ్రథితయైయువ్వనితామాల సూత్రగ్రథితయైనమత్తమధుకరకలితపుష్పమా
లచందంబున నందం బగుచుండె మఱియు నయ్యువతీవనంబు పరస్పరమాలాగ్ర
థితంబై సంసక్తకుసుమోచ్చయంబై వ్యతివేష్టితసుస్కంధంబై యన్యోన్యభ్ర
మరాకులంబై మధుమాసంబునందు వాయుసేవనంబునలన వికసించినలతా
వనంబుభంగి నయ్యె నప్పు డుచితస్థానసంస్థితంబులైనయుత్తమంబులు భూషణాం
గాంబరపుష్పదామంబుల వివేకంబు సువ్యక్తంబుగాఁ జేయుట కశక్యంబై
యుండె రావణుండు సుఖసంవిష్టుం డగుచుండఁ గాంచనస్తంభగతదీపంబులు వివిధ
ప్రభాభాసిత లగునయ్యువతులస్వైరవిహారకర్మంబు ననిమిషత్వంబు నొందిన
వాని తెఱంగున విలోకించుచుండె నయ్యవసరంబున నాహనుమంతుండు మెల్లన
నప్పల్లవాధరలమధ్యంబునం జొచ్చి యంతనంతఁ గలయ నవలోకించుచు. 262

మ. ఒకవంకం దెలిచందురా జగతిపై నొప్పారుపూసెజ్జపై
సకలంకోజ్జ్వలహారపంక్తు లెద నవ్యక్తంబులై క్రాలఁ ద
ర్పకకేళిం గడు డస్సి మైమఱచి సాంద్రప్రీతి నిద్రించుచు
న్నకృతామోదలఁ గామరూపిణుల మాన్యస్త్రీల వీక్షించుచున్. 263

సీ. రాజర్షిభామల రాక్షసకాంతల దైత్యాబ్జముఖుల నాదిత్యసతుల
గంధర్వకిన్నరగరుడవిద్యాధరప్రమదల మఱి భోగిభామినులను
గొందఱు రణమునఁ గొన్నవారలును గొందఱు మదయుత లౌచుఁ దారు కామ
వశగలై వచ్చినవారలు నందఱు రావణేశ్వరునందు భావబద్ధ
తే. రాగలై భోగతృప్తలై రమణ మీఱి, యొప్పుచును మద్యకృతమోహ ముప్పతిల్ల
మూలమూలల వేర్వేఱ చాలు దీరి, కన్నుఁగూర్కెడు వారలఁ గాంచె నపుడు.

వ. మఱియు నచ్చట నున్నవనితలలోన నొకతె యైనవీర్యబలంబున నిర్జించి బలా
త్కారంబునం గొని తెచ్చినయది గా దన్యకామయు నన్యపూర్వయు నకులీనయు
హీనరూపయు నసమర్థయు ననుపచారయుక్తయు నకామనీయయు నొకతె యైన
లే దట్లందఱ విలోకించి హనుమంతుండు తనమనంబున. 265

—హనుమంతుఁడు దేవనాగరాక్షసకాంతలం జూచి వితర్కించుట.—

ఉ. అందఱు దైత్యసక్తమతు లందఱు చారుమనోహరాంగు ల
ట్లందఱు గంధలిప్తతను లంద అమానుషభోగయుక్త లిం
దందఱు దైత్యరాజహృదయార్పితచిత్తలు జాతకౌతుకల్
పొందుగ వీరిలోన నృపపుత్త్రిక యేల వసించు నారయన్. 266

మ. తనభాగ్యంబు యశంబు పోవుటకు నీదైత్యేంద్రుఁ డాధారుణీ
తనయన్ ముచ్చిలి తెచ్చెఁ గాక సుగుణుం ద్రైలోక్యనాథున్ జగ
ద్వినుతున్ రాముని బాసి యవ్వనిత దుర్వృత్తున్ దురాధర్షు నీ
దనుజున్ గోరి భజించునే యిచట సంతాపంబు లేకుండునే. 267

ఉ. ఎచ్చట డాఁచినాఁడొ దనుజేశ్వరుఁ డమ్మనుజేంద్రనందని
స్సచ్చరిత న్త్రిలోకనుతచారుగుణ న్నుజనాభిజాత నే
నిచ్చటఁ జూచిన న్దారకునే ఖలుఁ డాయమ కెగ్గు చేసి సం
పచ్చిరభోగభాగ్యమహిమంబులు గోల్పడె నాఁటినాఁటికిన్. 268

—హనుమంతుండు రావణునిం జూచుట.—

వ. మఱియు నీరాక్షసరాజభార్య లెట్లు స్వభర్తృవిశిష్టలై రట్లు రాఘవధర్మపత్ని రావణునిచేతఁ బ్రత్యర్పితయై స్వభర్తృవిశిష్టయయ్యె నేనియు నీరావణునిజన్మంబు శోభనం బగుఁ గదా యనియు నీరాక్షసరాజభార్య లెట్లు రావణునిచేత హృతలై రట్లు రాఘవధర్మపత్ని హృత యయ్యె నికారణంబున రామునిచేత నిహతుం డై రావణుండు కృతార్థుం డగుఁ గదా యనియు నీరాఘవధర్మపత్ని రావణునిచేత నెట్లు హృత యయ్యె నట్లీరాక్షసరాజభార్యలు హరీశ్వరుం డగు సుగ్రీవునిచేత బలాత్కారంబున నపహృతలై రేని యాసుగ్రీవునిజన్మంబు సాఫల్యంబు నొందుఁగదా యనియు నీరాక్షసరాజభార్య లెట్లు నాచేత సందృష్టలై రట్లు రాఘవధర్మపత్ని నాచేత సందృష్ట యయ్యె నేని మదీయసుకృతంబు పరిపాకంబు నొందుఁ గదా యనియు నీరాక్షసరాజభార్య లెట్లు నాచేత సందృష్టలై రట్లు రాఘవధర్మపత్ని సంస్పృష్టయయ్యె నేని జానకీసందర్శనంబు గలుగమి రామసుగ్రీవులవలనిభయంబునఁ బ్రాయోపవేశంబు గావింప నుద్యుక్తం బైనయంగదాదివానరసమూహంబునకు సుజాతం బగుఁ గదా యనియు నీరాక్షసరాజభార్య లెట్లు జీవించి యున్నవా రట్లు రాఘవధర్మపత్ని జీవించియుండె నేనియు సీతాప్రాణసంశయవ్యథితాత్ముండై యున్నయారామునకు స్వజీవలాభసుజాతం బుగలుగుఁ గదా యనియు రాక్షసేంద్రా యీవెలందులు నిన్నుంగూడి సుఖించినట్లు రాఘవధర్మపత్ని రామునిం గూడి సుఖించె నేని సర్వసంపత్సమృద్ధియుక్తపుత్త్రపౌత్త్రమిత్త్రాదిసహితుండ వై సనీకు సుజాతం బని రావణునకు హితం బుపదేష్టవ్యం బనియు నీరాక్షసరాజభార్య లందఱు సామాన్యరూపలక్షణయుక్తలు రాఘవధర్మపత్ని త్రిలోకసుందరి గావున వీరిలోన నద్దేవి లే దనియు నిట్లు

బహుప్రకారంబుల వితర్కించుచునమ్మహీనందని పాతివ్రత్యాదిగుణంబులవలన నిశ్చయంబుగా విశిష్టయై యుండునట్టిపతివ్రతాశిరోమణియందు రావణుం డపహరణరూపదుష్కర్మం బాచరించె నెంత కష్టం బని రావణునిదౌర్జన్యంబునకు గర్హించుచుసాధుబుద్ధి యగుహనుమంతుండు తత్పరిసరంబున మహేంద్రశయనోపమంబును ముఖ్యంబును స్ఫాటికాంతరకుట్టిమంబును రత్నభూషితంబును దాంతకాంచనవిచిత్రాంగవైడూర్యవరాసన మహార్హాస్తరణసుహాధనోపపన్నంబునగునొక్కపర్యంకంబుఁ జూచియందొక్క దేశంబునఁ బుష్పమాల్యవిభూషితంబును జాతరూపపరిక్షిప్తంబును దారాధిపసన్నిభంబు నగుపాండరచ్ఛత్త్రంబు విలోకించి తన్మధ్యభాగంబునఁ జిత్రభానుసమప్రభంబును నశోకమాలావితతంబును వాలవ్యజనహస్తరాక్షసకన్యావీజ్యమానంబును వివిధగంధజుష్టంబును వరధూపవాసితంబును బరమాస్తరణాస్తీర్ణంబునునావికాజినసంవృతంబునువరమాల్యదామోపశోభితంబు నగుశయనాసనంబు గనుంగొనితన్మధ్యభాగంబున నీలజీమూతసంకాశుండును బ్రదీప్తోత్తమకుండలుండునుమదఘూర్ణితరక్తాక్షుండును మహాబాహుండును మహారజతవాసుండును దివ్యాభరణభూషితుండును రతిశ్రాంతుండును రాక్షసకన్యాప్రియుండును రాక్షససుఖావహుండును మహావీరుండు నై తటిద్గణసంవృతం బైనసంధ్యారక్తతోయదంబు చందంబున సుగంధిరక్తచందనానులిప్తశరీరంబు రత్నహారాలంకృతం బై గ్రాల సవృక్షవనగుల్మాఢ్యం బైనమందరంబుకరణి శయనించి మహానాగంబుభంగి నూర్పులు నిగిడించుచు నిద్రించుచున్న రావణు నవలోకించి పరమోద్విగ్నుం డై యప్పవననందనుండు భీతుండుంబోలె నొదిగి చప్పుడు గాకుండ మెల్లన నొక్కింత వెనుకకుం జని సోపానమార్గంబున వేఱొక్క వేదికామధ్యంబున నుండి దశగ్రీవుండు కామరూపి గావున నక్కాలంబున నేకముఖుం డై ద్విబాహుం డై యుండుట కచ్చెరువు నొందుచు మఱియు వానిచందం బంతయుఁ గలయవిలోకింపసనప్పుడు. 269

క. నిదురించి యున్నదైత్యుని, సదమలశయనోత్తమంబు చాలఁగ నొప్పె
న్మదహస్తి పవ్వళింపఁగ, విదితం బగుప్రస్రవణము విధమున నచటన్. 270

వ. మఱియు గాంచనాంగదనద్ధంబులును మహేంద్రధ్వజోపమంబులును నైరావతవిషాణాగ్రసంపీడితకృతవ్రణంబులును వజ్రోల్లిఖితపీనాంసంబులును విష్ణుచక్రపరిక్షతంబులును బీనంబులును సమసుజాతాంసంబులును సంహతంబులును బలసంయుతంబులును సులక్షణనఖాంగుష్ఠంబులును స్వంగుళీతలలక్షితంబులును బరిఘాకారంబులును గరికరోపమవృత్తంబులును శశక్షతజపర్ణసుశీతలసుగంధిపరార్ధ్యచందనానులిప్తంబులును స్వలంకృతంబులును నుత్తమస్త్రీవిమృదితంబులును గంధోత్తమనిషేవితంబులును యక్షపన్నగగంధర్వదేవదానవదర్పదళనంబులును మందరాంతరసుప్తరుషితమహాహిసన్నిభంబులు నగురావ

ణునికరంబులు విక్షిప్తంబులై పంచశీర్షంబు లగు మహానాగంబులపగిదినొప్పు చుండె మఱియును. 271

క. గిరినిభుఁ డగుదశముఖుఁ డయ్యురుభుజములచేతఁ జూడ నొప్పె నపుడు భాసురతరశృంగంబులచే, నరుదార వెలుంగు మందరాద్రివిధమునన్. 272

తే. చూతపున్నాగకురవకసురభియుతము
కలితమృష్టాన్నరసపానగంధసహిత
మగుచు రావణనిశ్శ్వాస మాననంబు
వలన వెలువడె గృహ మెల్లఁ గలయ బెరసి. 273

చ. సలలితపద్మరాగమణి చారుకిరీటముచే విచిత్రకుం
డలములచే నిరంతరకనద్వరసౌరభపుష్పమాలచే
సొలయక చుట్టు రాఁ దిరుగఁ జుట్టినమౌక్తికదామపంక్తి చే
నలువయి యొప్పుఘోరవదనం బది గల్గినవాని ధీరునిన్. 274

వ. మఱియును. 275

తే. రక్తచందనదిగ్ధంబు రమ్యహార, తతియుతంబును భూషణీకృతసుపర్వహస్తిదంతాగ్రమును గవాటాయతంబు, నగువిశాలవక్షంబుచే నలరువాని.

క. మదఘూర్ణితరక్తాక్షుని, సదమలపాండురసుహార్హచారుస్మృదుగుణాస్పదనూత్నచేలధారిని, త్రిదశభయంకరునిఁ బూర్వదేవప్రవరున్. 277

తే. భుజగపతిభంగి నూర్పులు పుచ్చువాని, గంగగట్టున నిదురించుగజముమాడ్కిఁ
జెలఁగువానిని మాషరాశియును బోలె, భూరిమేచకదీప్తి యొప్పారువాని. 278

క. మించులచే మేఘముబలెఁ, గాంచనదీపములచేఁ బ్రకాశీకృతసర్వాంచితగాత్రుండై నిదురించెడురావణునిఁ గాంచి ప్రీతి దలిర్పన్. 279

వ. తత్పాదమూలంబులను భుజోత్సంగంబులు నాశ్రయించి రతిశ్రాంతలై నిద్రించుచున్ననృత్తవాదిత్రకుశల లగురాక్షసాంగనల నవలోకించి తదీయశ్రవణాంతంబులం గ్రాలువజ్రవైడూర్యగర్భంబు లగుకుండలంబులును భుజాగ్రంబులం బొల్చుతాపనీయంబు లగుమణికేయూరంబులునుం గనుంగొనియె నప్పుడు శశిప్రకాశంబులును లలితకుండలమండితంబులు నగునయ్యంగనలశుభవక్త్రంబులచే నవ్విమానరత్నంబు తారాగణంబులచే నభంబుంబోలె నభిరామం బగుచుండె వెండియు నక్కపిశ్రేష్ఠుండుమదవ్యాయామఖిన్నలై తత్తదవకాశంబులం బడి నిద్రించు చున్నరాక్షసాంగనలమధ్యంబుఁ జొచ్చి కలయ వెదకుచునందు.

—హనుమంతుఁడు మదవివశలై నిదురించెడునంతఃపురస్త్రీలం జూచుట.—

తే. నేర్పు మీఱంగ లఘుగతి నృత్య మాడి
యులకవిన్యస్తసర్వాంగి యగుచు నంగ

హారఁ మొనరించుచు సుషుప్తి నలమి యున్న
నృత్తశాలిని యగునొక్క నెలఁతఁ గనియె. 281

ఆ. వరుసఁ బెక్కుగతుల వాయించి వాయించి, కక్షకలితమడ్డుకంబుచేత
బాలపుత్త్రయైనభామినిక్రియ నిద్ర, వోవుచున్న యొండుబోటిఁ గనియె. 282

తే. అందముగ నిమ్నగానుషఙ్గమందుఁ జను మృ
గాక్షి దగ నళినీపోత మాశ్రయించి
నట్లు కాంచనవల్లకి నాశ్రయించి
కన్ను గూర్కెడు వేఱొక్కగఱితఁ గాంచె. 283

తే. పెద్దకాలంబునకుఁ దనప్రియునిఁ జెంది
కౌఁగిలించి నిద్రించెడు గఱితనట్లు
పటహ మొక్కటి పీడించి పాన్పుమీఁద
సుప్తి నొందెడుమఱియొక్కసుదతిఁ గనియె. 284

క. ముద మలరఁ బ్రియునిఁ గౌఁగిట, గదియించినభంగి దోఁప గనకవిపంచిన్
వదలక యక్కున నిడికొని, నిదురించెడుదాని నొక్కనెలతం గనియెన్. 285

క. వరునిన్ బలె మురళిం దగఁ, బరిరంభించుచు మనోజ్ఞ భర్మమయువరా
స్తరణముపై నిద్రించెడు, సరసీరుహనేత్ర నొక్కచానం గాంచెన్. 286

వ. అప్పుడు. 287

చ. మొనసి మృదంగముల్ బణవము న్బహుళైఖరు లొప్ప ధింధిమి
ధ్వనులు చెలంగ నాద మొదవ న్మొఱయించి మురారిచిత్తముం
దనియఁగఁ జేసి ప్రొద్దు పనిన న్మదవిస్మృతిఁ గాంత లిద్ద ఱొ
య్యన నవి యూఁతగాఁ గొని పదానతలై నిదురించి రెంతయున్. 288

తే. బాలు నక్కునఁ గదియించి భర్తమీఁదఁ
బవ్వళించిన జవ్వనిపగిది నొక్క
డిండిమముఁ దాల్చి వేఱొక్కడిండిమంబు
మీఁద నొరగి సుషుప్తిచే మించె నొకతె. 289

క. విపులంబుగ భుజసంయో,గపీడితాడంబరంబు గలదై రహిఁ జేఁ
జపలాక్షి యొకతె ప్రణయము, నెపమున మదవివశ యగుచు నిద్రించెఁ దగన్.

వ. మఱియు నొక్కయువతి విపర్యస్తసర్వకీయకలశోదకార్ద్రీకృతశరీరయై వసంత
సమయంబున గ్లానిపరిహారంబుకొఱకు సలిలసిక్త యగుటం జేసి శబళవుష్పయై
యొప్పుమాలపగిదిం జూపట్టె మఱియును. 291

క. కనకకలశతుల్యము లగు, స్తనములు నిజకరతలములఁ దగువిధమున మ
ర్దన మొనరించుచు నొక్కతె, పనివడి పతిపదతలమునఁ బడి నిద్రించెన్. 292

క. మదవిహ్వల యై యొక్కతె, ముదమున విభుఁ డనుచు నొక్కముదితను సతతం
బెదఁ గౌఁగిలించుకొని తత్పదతలమున నిద్ర నొందెఁ బయ్యెద జాఱన్. 293

తే. కాంత లొకకొంద ఱానక కాంస్యసుషిర
తతచతుర్విధహృద్యవాద్యముల నలమి
కామినులు కాముకులనట్లు కౌఁగిలించు
కొని సుఖంబుగ శయ్యపైఁ గూర్కి రపుడు. 294

వ. ఇట్లనేకప్రకారంబుల నిద్రాబలపరాజిత లై శయనించి యున్న రావణునిపత్ను
లం గలయ నవలోకించి యొక్కయెకాంతవిన్యస్తశయనంబునందు. 295

చ. సురుచిరరత్నహారపరిశోభిత యై ఘనహేమవర్ణ యై
వరతనుకాంతులన్ గృహము స్వర్ణమయంబుగఁ జేయుదాని భా
సురగతిఁ గూర్కుదాని నతిసుందరరూపముదాని రాక్షసే
శ్వరి యగుదాని రావణునిపత్నిని గౌరిని గాంచె నత్తఱిన్. 296

వ ఇట్లు మండోదరి నవలోకించి. 297

ఆ. ఆవెలందిరూపయౌవనసంపద, లరసి చూచి సీత యని తలంచి
కపికులోత్తముండు కడువేడ్క సీతను, గంటి నంటి ననుచుఁ గడురయమున.

క. మానుగ వాలముఁ ద్రిప్పుచు, గానము సేయుచును మిగుల గంతులిడుచు నా
స్థాన స్తంభము లెక్కుచు, నానగచరవిభుఁడు ప్రియవిహారము సలిపెన్. 299

వ. ఇట్లు కొండొకసేపు కాపేయజాతిచేష్టావిశేషంబులు చూపి వెండియుఁ దనమ
నంబున వివేకించి. 300

చ. చలువలుగట్టి హారములు చక్కగఁ దాల్చి సుగంధిచందనం
బలది ప్రసూనము ల్కబరియందు ఘటించి ముదంబుఁ గ్రోలి త
మ్ముల మొసరించి కన్నుఁగవమోడ్చి రతిశ్రమజాతఘర్మవా
ర్కలితశరీర యై యలసి క్రక్కున నీసతి నిద్రవోయెడిన్. 301

క. కాన నది రాక్షసేంద్రుని, మానిని గా నోపు నకట మతిహీనుఁడనై
యే నొండుగాఁ దలంచితి, భూనాయకుపుణ్యసాధ్విఁ బూతచరిత్రన్. 302

చ. ధరణిజ పుణ్యసాధ్వి వినుతవ్రత పావనశీల లోకసుం
దరి త్రిదశేంద్రవంద్య గుణధాముని రామునిఁ బాసి యన్యకా
పురుషులశయ్యపై నిదురబోవునె పుష్పసుగంధభూషణో
త్కరములు దాల్చునే మధువు ద్రావునె భోగము లిచ్చగించునే. 303

క. నరపతి రామునిఁ బాసి య,మరలోకాధీశుఁ డైన మదిఁ గోరునె యా
తరణికులవల్లభునితో, సరి సేయం దగినవాఁడు జగమునఁ గలఁడే. 304

తే. అరయ నిది రామపత్నిగా దన్యకాంత, యనుచు మదినిశ్చయించివనాటవర్యుఁ
డవ్విమానాధిరాజంబునందు నిద్ర, వోవువనితల నందఱఁ బోలఁ జూచి. 305

క. ఎందును జానకిఁ గానక, డెందంబునఁ జింత నివ్వటిల్లఁ నభస్వ

స్యందనుఁడు మరల నచ్చటి, కందువ లన్నియును జూచి కడువేగమునన్. 306

చ. అరుదు జనింపఁ గొంతవడి నాటలు పాటలు వాద్యఘోషముల్
సురతము లుద్ధతి న్నలిపి సొక్కుచు సోలుచుఁ బానమత్తలై
మురజమృదంగవీణికల ముఖ్యవరాస్తరణంబులందు వి
స్ఫురదురుశయ్యల న్నిదురవోయెడుకాంతల నెల్లఁ జూచుచున్. 307

వ. మఱియుఁ జతుర్విధాలంకారాలంకృతలును స్వభర్తృసౌందర్యవర్ణనస్వభావలును భరతశాస్త్రార్థవ్యాఖ్యానచతురలును దేశకాలాభియుక్తలును సమయోచితభాషిణులు నగువరాంగనలు పరివేష్టింపఁ దన్మధ్యంబున గోష్ఠస్థితధేనుమధ్యంబునం గ్రాలుమహోక్షంబుకైవడి మహారణ్యమధ్యస్థితకరేణుమధ్యంబున నొప్పుదంతావళరాజుభంగి నలరువాని రతాభిరతసంసుప్తుండైనరావణుని విలోకించుచు నచ్చటు వాసి బహువిధసుగంధబంధురసమస్తవస్తువిస్తారపరిపూర్ణమైనపానశాలకుం జని యచ్చోట నిర్మలప్రదేశంబునం జందనమృగమదపంకంబున నలికి ఘనసారరేణువులు కలయం జల్లి పలుదెసల నూత్నముక్తాఫలంబుల రంగవల్లికలు దీర్చి తన్మధ్యదేశంబున రౌక్మవిశాలభాజనంబుల నిడిన నర్ధభక్షితంబులైనమృగమహిషవరాహమయూరకుక్కుటమాంసంబులును దధిసౌవర్చలాఖ్యలవణసంస్కృతంబులైనవార్ధ్రీణసాఖ్యచ్ఛాగవిశేషపక్షివిశేషమృగవిశేషపిశితంబులును శల్యమృగమయూరంబులును గృతహింగుమరీచ్యాదినిష్పన్నంబులైనక్రకరాఖ్యపక్షివిశేషంబులును జకోరంబులును ముద్గాదిమిశ్రితౌదనంబులును నేకశల్యాఖ్యమత్స్యవిశేషంబులును ఛాగంబులును నుచ్చావచంబులైనభక్ష్యభోజ్యలేహ్యపేయంబులును గనుంగొనుచు మణిమయపానభాజనంబుల నిడినశర్కరాక్షౌద్రద్రాక్షాదాడిమమధురద్రవ్యవికారవిరళరసంబులఁ దత్సాంద్రరసంబుల నపవిద్ధమహాధనహారనూపురకేయూరంబుల వివిధస్థలంబులఁ గృతపుష్పోపహారమై యచ్చటివసుంధరవిశేషకాంతియుక్తమైయునికినచ్చెరువొందుచుఁ దత్తదంతికవిన్యస్తప్రదీప్తసంశ్లిష్టశయనాసనంబుల సువర్ణకలశంబులనిడి వేర్వేఱవిభజించి పెట్టినపరసంస్కారసంస్కృతంబులైన వివిధమాంసంబుల నప్పానభూమి చిచ్చు లేక మండినట్లు చూపట్టుచునికి నానందించుచు సముద్రమథనోత్పన్నసురాపూర్ణశాతకుంభకుంభంబులును గృత్రిమసురాపూరితఘటంబులును శర్కరాకృతమధుకృతద్రాక్షాఫలకృతపుష్పమకరందకృతసర్వఫలరసకృతసుగంధిచూర్ణసంయుక్తవాసితాసవకలశంబులునిక్షురసమైరేయరసపూర్ణంబులైనస్ఫటికపాత్రికలును గనుంగొనియలరుచుఁ జందనాగరుప్రముఖధూపపాత్రికలును సుగంధబంధురపుష్పమాలికాపరివేష్టితహిరణ్మయజాంబూనదమయకరకస్ఫటికభాజనంబులును మణిమయవిచిత్రపూర్ణభాజనంబులును రత్నఖచితశీధుకలశంబులును రాజతజాంబూనదమయకుంభంబుల నిండారఁబోసినపానశ్రేష్ఠంబులును విలోకించుచు నొక్కయెడనర్ధావశేషపాన

కుంభంబుల నొక్కయెడ నల్పావశేషఘటంబుల నొక్కయెడ ననంతయుం ద్రావి
నరిక్తఘటంబుల నొక్కయెడ సగంబు మెసవిన నన్నరాసుల నొక్కయెడ నర్ధభక్షి
తంబులైన భక్ష్యభోజ్యాదిపదార్థంబుల నొక్కయెడఁ బ్రభిన్నకరకంబుల నొక్క
యెడ నాలోళితఘటంబుల నొక్కయెడ సంపృక్తమాల్యంబుల నొక్కయెడ
సుశీతలస్వాదుజలంబుల నొక్కయెడ మధురసుగంధిఫలంబుల నొక్కయెడ
శూన్యంబులైన నారీశయనంబుల వీక్షించుచుఁ గస్తూరికాగంధసారఘనసారా
గరుచందనప్రముఖధూపకుసుమవిలసితాసవవాసనాపరిమిళితపవనాఘ్రాణంబుఁ
జేసి యరుదందుచు బహుప్రకారంబులఁ బానక్రీడ సలిపి మదావేశంబున
సొలసి నృత్యగీతవాద్యవిహారపరిశ్రాంతలై నానావిధమణిభూషణశోభావిశే
షంబు కార్శ్యానవధామంబునీన నొండొరులం గౌఁగిలించుకొని యితరేతరవస్త్రం
బులు పైఁ దిగిచికొని నిద్రాపరవశత్వంబువలనను మదనహేతుకరతివలనను
గ్లాంతంబైనరూపంబు పద్మినీరూపంబు భంగి నతిరమణీయం బగుచుండ మేచక
లోహితపాండురసువర్ణవర్ణాంగంబులతో నిద్రించుచున్న నారీసహస్రంబుల నిరీ
క్షించుచు నిత్తెఱంగున రావణునియంతఃపురంబునుం బరిశోధించి యందును
జానకిం గానక ధర్మసాధ్వసశంకితుండై యంతర్గతంబున. 308

హనుమంతుఁడు పరస్త్రీ గోప్యస్థానదర్శనమును గుఱించి చింతించుట.

క. వదలక నిదురించెడు పర, మదవతులసమస్తగోప్యమర్మంబులు నే
విదితంబుగఁ జూచితి భయ, మొదవెడు నిది ధర్మలోప మొనరించుఁ గదా.

క. పరకాంతలపై నెన్నఁడుఁ, దిరముగ నాదృష్టి సొరదు తెలియ కిచట నీ
పరదారపరిగ్రహ మిత్తఱి నాచే దృష్ట మయ్యెఁ దప్పక యకటా. 310

తే. అనుచు మనమునఁ జింతింప నంతలోన, నిశ్చితైకాంతమతి కావనేచరునకు
నర్థనిశ్చయదర్శిని యైనబుద్ధి, యటు జనించిన మరల నిట్లని తలంచె. 311

తే. మనము సర్వేంద్రియప్రవర్తనము నందుఁ, గారణంబగు దానిచేఁ గలుగుఁ బుణ్య
పాపములు నది పదిలమై పరఁగె నేని, జనుల కేటికి దోషంబు సంభవించు.

క. ఏ నీయువతుల నందఱి, మానసమున వలచి చూడ మన్మథవశతం
బూనిక నాకిట ధర్మవి, హీనత్వం బేల కలుగు నిది దలఁ పగునే. 313

తే. ఒనర నేసత్వమున కెద్దియోని యచటఁ
బరఁగ నాసత్వ మరయంగఁ బడు నిజంబు
నష్టయైన భామినిఁ గానసమున మృగము
లందు వెదకంగ మఱి శక్యమగునె యెందు. 314

వ. ఏ నిక్కాంతల మదనవికృతమానసుండనై చూడనంతియె కాదు పుణ్యశ్లోకుం
డగు రాముని పనుపున వచ్చిన నాకు నెల్ల పనులు శుభంబు లగు నింత చింత
యేల యని నిశ్చయించి వెండియు రావణునియంతఃపురంబుం బరిశోధించి దేవ

గంధర్వనాగయక్షసిద్ధవిద్యాధరాంగనలఁ గలయ శోధించి యందును జానకిం
గానక వెండియు నమ్మందిరం బంతయుఁ గలయ వెదకి లతాగృహచిత్రగృహక్రీడా
గృహనిశానివాసయోగ్యగృహంబు లెల్లఁ బరిశోధించి సీతం గానక చింతాకుల
మానసుండై తనమనంబున. 315

క. అలయక సొలయక యొకచో, నిలువక కనుఱెప్ప లిడక నేర్పున లంకం
గలసద్మము లన్నియు నిటు, గలయ న్వెదకితి మహీజఁ గానను నెచటన్. 316

హనుమంతుఁడు సీతం గానక దుఃఖించుట.

క. సురగరుడోరగరజనీ, చరశేఖరసిద్ధసాధ్య చారణవిద్యా
ధరకిన్నరనరయువతుల, సురకాంతలఁ గంటిఁ గాని క్షోణిజఁ గానన్. 317

తే. సతియు బాలయు సత్పథస్థితయు స్వవశ, శీలసంరక్షణాసక్తచిత్తయు నగు
సీత బలవంతుఁడును దుష్టచిత్తుఁ డైన, పంక్తిముఖునిచే వధియింపఁబడియెనేమొ.

చ. అరయ విరూపరూపలు మహాస్యలు దీర్ఘవిరూపదర్శనల్
గురుతర మేఘనాదనిభ ఘోరనినాదలు రాక్షసాంగన
ల్పరుషనుదప్రలాపములు పల్కుచు బల్విడిఁ జుట్టుముట్టఁగా
నరుదుగ వారిఁ జూచి భయమంది రయంబున మేనుఁ బాసెనో. 319

మ. బలవంతుండును దీక్ష్ణదండుఁ డతిదర్పస్ఫూర్తిదోస్సారుఁ డు
జ్జ్వలతేజుం డనివార్యశౌర్యుఁడు వినస్వత్పుత్రుఁ డే జానకీ
లలనం గానక పౌరుషం బెడలి కాలం బేగ నచ్చోటికై
లైలమిం బోవుదు నేను బోయిన నతం డేలాగు మన్నించెడున్. 320

క. అంతఃపురంబు సర్వముఁ, బంతంబున దైత్యసతులఁ బరికించితి భూ
కాంతునికాంతను గానమి, నింతకు నాయత్న మెల్ల వృథ యయ్యెఁగదా. 321

చ. జానకిఁ గానకే నిపుడు సాగరము న్వడిఁ దాఁటిపోయినం
గానరచారు లెల్ల ననుఁ గన్గొని సీతను జూచి వచ్చితే
వానర యంచు నన్నడుగ వారికి నేమని చెప్పుదున్ సతిం
గానక వచ్చినాఁడ ననఁ గన్నులు గానక చత్తురే కదా. 322

క. తారుండు జాంబవంతుఁడు, తారేయుఁడు నలుఁడు సమ్మదము మీఱఁగ సీ
తారమణీవృత్తాంతముఁ, జేరి యడుగ వారి కేమి చెప్పుదు నకటా. 323

సీ. వికృతాననంబులు వివిధరూపంబులు గలిగిన రాక్షసాంగనలఁ గంటి
ననుపమరూపయౌవనకళాకలితలై చెలఁగువిద్యాధరస్త్రీలఁ గంటిఁ
బూర్ణచంద్రునిమాడ్కిఁ బొలుపైనమోముల నలరారునాగకన్యకలఁ గంటి
మెఱుఁగుదీఁగెలభంగి మెఱయుమేనులు గల చారణగంధర్వసతులఁ గంటి
తే. వన్నె మీఱినవేల్పుజవ్వనులఁ గంటి, వినుతి కెక్కిన మర్త్యభామినులఁ గంటి
మఱియు నందంద పెక్కండ్ర మానవతులఁ, గంటిఁ గాని మహీసుతఁ గాన నైతి.

వ. అని యిట్లు క్షణమాత్రంబు చింతించి క్రమ్మఱ నుత్సాహం బవలంబించి. 325

—హనుమంతుఁ డుత్సాహం బవలంబించి మరల సీతను వెదక నారంభించుట.—

క. పరికింప ననిర్వేదము, పరమసుఖము సర్వకార్యఫలదము సంప
త్కర మటు గావున నేనును, గరము ననిర్వేద మింకఁ గాంచెద బుద్ధిన్. 326

ఉ. ఇంతకు మున్ను చూడఁబడ కిక్కడఁ దప్పిననందుగొందులం
గ్రంతల రచ్చచావిడుల రాజపథంబులఁ జిత్రమందిరా
భ్యంతరసీమలం గనకహర్మ్యతలంబుల రామమేదినీ
కాంతునిభామిని న్వెదకి కాంచెదఁ గా కిటు చింత యేటికిన్. 327

వ. అని నిశ్చయించి యచ్చోటు వాసి వెండియు నాపానశాలలును బుష్పగృహం
బులును జిత్రశాలలును క్రీడాగృహంబులును గృహారామమధ్యగతవీథులును
విమానంబులును భూబిలగృహంబులును జైత్యగృహంబులును గృహంబులకనతి
దూరంబున విహారార్థంబు నిర్మితం బైనచతుష్పథగృహంబులును దేవతాయత
నంబులును బ్రాకారాంతరమధ్యవర్తిమంత్రికుమారాదిగృహవీథులును బతు
ష్పథవర్తివృక్షాధారభూతవితర్దికలును మొదలుగాఁ గలసర్వప్రదేశంబులు
వెదకి కవాటంబు లుత్పాటించి భూబిలగృహంబులలోనికి డిగ్గుచుఁ గ్రమ్మఱ
నిర్గమించుచు మేడలమీఁది కెక్కుచుఁ గ్రమ్మఱ డిగ్గుచు వనోపవనంబులశోధిం
చుచు విమలసరోవరంబుల నెమకుచు నిట్లెఱింగునఁ జతురంగుళమాత్రం బైన
నవకాశంబు లేకుండ రావణాంతఃపురంబంతయు వెదకి జానకిం గానక వానరుల
యుద్యోగంబును సముద్రలంఘనంబును వ్యర్థం బని తలంచి యవ్విమానంబు
డిగ్గి ఘనమధ్యంబునందలిమెఱుంగుచందంబున వేగవంతుం డై తదీయప్రాకా
రాధిరోహణంబుఁ జేసి దీనవదనుండును శోకోపహతచిత్తుండు నై తనమనంబున.

సీ. కంటి నూతనసౌధకాంచనప్రాకారహీరకృతద్వారతోరణములు
చూచితిఁ దపనీయశోభావిశేషాభిరామరామాలయస్తోమములును
బరికించితి విశాలభర్మమాణిక్యసంకలితవిచిత్రసంజననములును
శోధించితిఁ దమాలసురభిచందననీప దాడిమతరుకృతోద్యానములును

తే. గలయ వెదకితిఁ గేళికానిలయములును, నెమకితి సమస్తవీథికానికరములును
రమ్యగుణమండనుం డైన రామవిభుని, గఱిత నెందును బరికించి గాంచ నైతి.

తే. అనఘచరితుండు సంపాతి యనెడుపక్షి, నాయకుఁడు మున్ను రావణునగరిచెంత
వనములో రాజసుత యున్నదనుచుఁ జెప్పె,నట్లెఱింగున లేదు నేఁడరసిచూడ.

క. జనకసుత యనఁగ మైథిలి, యని వైదేహి యనఁ దనరు నాసీత దురా
త్ముని దశకంఠునిఁ బొందునె, తనకులధర్మక్రమంబు తప్పి నడచునే. 331

—హనుమంతుఁడు సీతం గానక వితర్కించుట.—

సీ. రామాప్రభీతుఁడై రావణుం డుఱుకుచు వనమధ్యమునఁ బాఱవైచె నేమొ
ఆకాశపథమున నరిగెడుతఱి వార్ధిఁ దగఁ జూచి హృదయంబు పగిలె నేమొ

విబుధకంటకబాహుపీడితయై చాల బెగడి ప్రాణంబులు విడిచె నేమొ
రయమునఁ జను వేళ రాక్షసాంకమున నూల్కొనలేక జలధిలోఁ గూలెనేమొ

తే. తనకులోచితధర్మంబు దప్పకుండ, నరసి రక్షించుకొను చున్నదగుటఁ జూచి
కెరలి పంక్తిముఖుండు భక్షించె నేమొ,పదఁటి యటుగాక యున్నఁ గన్పట్టకున్నె.

తే. అకట దుష్టస్వభావలైనట్టిదైత్య, నాథుపత్నులు మ్రింగిరో నలిననేత్ర
నిందుసన్నిభమైన నిజేశుముఖము, చాలఁ జింతించి దీనయై సమసెనొక్కొ.

మ. అనిశం బాయను దైత్యమధ్యగతయై 'హా రామ హా లక్ష్మణా'
యని వాపోవుచుఁ బ్రాణము ల్విడిచెనో యాదిత్యశత్రుండు నే
ర్పున దర్పం బుపసంహరించి నిరనుక్రోశంబునం బట్టి బ
ద్ధను గావించెనొ పంజరస్థశుకిచందానన్ విలాపింపఁగన్. 334

క. అనిశము సామంబున భేదనమున దానమున మిగులఁ దచ్చిత్తము నే
ర్పున మెత్తఁ జేసి దైత్యుఁడు, తనవశముగఁ జేసికొనెనొ ధరణీపుత్రిన్. 335

క. అపగిది నేల చొప్పడు, భూపుత్త్రిక పుణ్యసాధ్వి పూతచరిత ధా
త్రీపాలుఁ బాసి వేఱొక, కాపురుషునితోడిపొత్తు గావలె ననునే. 336

క. దానవుఁడు మ్రింగుటొండెను,మానక భంజించుటొండెనుమఱియొండొకచోఁ
బూనిక దాఁచుట యొండెను, జానకి తలపోయ నొండు జాడం గలదే 337

తే. అవనిపుత్త్రికమృతయయ్యె ననియుఁ గాని,యసురనాథుఁడువడిదాఁచె ననియుఁగాని
గానననికాని ప్రియభార్యఁ డైనరాను, విభునితో నెట్లు చెప్పుదు వెరవుమాలి.

వ. సీత నెందునుం గాననైతి నని చెప్పితినేని రామప్రాణహానిరూపదోషంబు గలుగుఁ జెప్పనైతినేని స్వామివంచనకరణరూపదోషంబు సంభవించు నిది పరస్పరవిరుద్ధంబుగాఁ దోఁచుచున్న దింక నెయ్యది కర్తవ్యం బని కొండొకసేపు విచారించి వెండియు నిజాంతర్గతంబున. 339

క. జానకిని వెదకి యిచ్చుటఁ, గానక కిష్కింధకేను గ్రమ్మఱఁ జనినన్
మానిత మగుపురుషార్థము, త్ర్వానాథునికరుణ యెట్లు గలుగు న్నాకున్. 340

క. హరివీరులయుద్యోగము, శరనిధిలంఘనము మఱియు సదమలలంకా
పురపరిశోధన మంతయుఁ, గర మిది వృథ గాదె సీతఁ గానక చనినన్. 341

ఉ. సీతను గాననే ననుచుఁ జెప్పినయంతనె దీనచిత్తుఁడై
యాతతదుఃఖశోకమున నప్పుడు రామవిభుండు చచ్చు నా
భూతలనాథుపాటు గని పొక్కుచుఁ బ్రాణసమానుఁ డాసుమి
త్రాతనయుండు తత్క్షణమ తప్పక జీవితముం ద్యజించెడిన్. 342

వ. రామలక్ష్మణులచందం బెఱింగి భ్రాతృశోకాతురక్తుం డగు భరతుండు తత్క్షణంబసంప్రాప్తమరణుం డగు నమ్మువ్వురతెఱం గెఱింగి మేధావి యగుశత్రుఘ్నుండుపంచ

త్వంబు నొందు నంతఁ బుత్రవ్యసనకర్శితలై ప్రియపుత్త్రలగు కౌసల్యయుఁ గైకేయియు సుమిత్త్రయు జీవితంబులు విడిచెదరు రామునివిధంబుఁ జూచి ధర్మజ్ఞుండును సత్యసంధుండును కృతజ్ఞుండు నగుసుగ్రీవుండు గతతేజు నతనిపాటుఁ జూచి యును భర్తృశోకంబున నిరానందయై మరణంబు నొందు వాలిదుఃఖంబు ననె పీడితయై శోకకర్శిత యైనతార సుగ్రీవుండు పంచత్వము నొందినం దప్పక నశించుఁబిత్రుమాతృవినాశవ్యసనంబునఁ గుమారుం డంగదుండు మృతుం డగు నంత భర్తృవ్యసనకర్శితలై వానరకాంత లెల్లఁ గాఢముష్టిప్రహారంబుల శిరంబులు పగుల మోఁదుకొని మడిసెదరు తదనంతరంబ సుగ్రీవునిచేత సంరక్షితు లగువానరు లందఱుఁ గెడసెదరు తద్వృత్తాంతంబు విని వనశైలనివాసు లగు కపులెల్ల వనశైలగృహాదిసంవృతప్రదేశంబులయందు విహారంబు సల్పు టుడిగి పుత్త్రదారమాతృసహితంబుగా శైలశృంగంబుల నుండి విఱుగంబడి యైన విషంబుఁ గ్రోలియైనఁ బావకునం దుఱికియైన నురిగొనియైన నుపవాసంబు సల్పి యైన శస్త్రపతనంబు గావించియైనఁ బ్రాణంబులు విడువం గల రేను గిష్కింధకుం జనినయంతనె యింతయుం బాటిల్లు నిక్ష్వాకువంశంబును వానరవంశంబును నాశంబు నొందించుట కేను బోవం జాల సీతం గానక సుగ్రీవునివదనంబు విలోకింపం జాల. 343

క. ఏ నిపుడు పోవకుండిన, జానకి వెదకి కని వచ్చు సామీరి యటం
వానరనాయకుఁ డాశను, బ్రాణము నిలిపికొని యుండుఁ బటుధైర్యమునన్. 344

క. కావున నేనిపు డూరక, భూవిభుఁ డగురామకడకుఁ బోనం దగ ది
చ్చో వానప్రస్థుఁడనై, కేవల మునివృత్తి నడవికిం జను టొప్పున్. 345

ఆ. వదనపాణిపతితఫలపర్ణభోజినై, పరఁగ వృక్షమూలవాసి నగుచు
నియతిఁ గాననమున నివసించి యుండెదఁ, గాన పోదు సీత గాన కెట్లు. 346

తే. వివిధబహుమూలఫలజలోపేత మైన, విమలతరసాగరానూపవిషయమందు
వితతశుష్కకాష్ఠంబులఁ జితి యొనర్చి, పరఁగ మండెడుచిచ్చులో నుఱుకువాఁడ.

తే. మిగులఁ బ్రాయోపవిష్టుండ నగుచు నాత్మ, సంగమునకుఁ దొలగించునట్టి నన్ను
వాయసంబులు వ్యాఘ్రాదివన్యసత్త్వ, సంచయంబులు గడఁగి భక్షించుఁగాక.

క. ధరలో మునిదృష్టం బగు, మరణం బిది రామవిభుని మానవతిని నే
నరయక గ్రస్తుఁడఁ జనుదునె, పరువడి మున్నీటినీటఁబడియెద నిచటన్. 349

వ. మఱియు మొదల లంకాధిదేవతాజయంబుచేత శోభనప్రారంభయుఁ బదంపడి సీతాన్వేషణసౌకర్యాపాదకచంద్రచంద్రికామనోహరయు సీతాన్వేషణసహకారికీర్తిమాలయు యశస్వినియు నగు నీరాత్రి రామకార్యసహాయేచ్ఛచేత దీర్ఘభూతయయ్యును సీతాసందర్శనరహితుండ నైన నాకు నిష్ఫలయై తోఁచుచున్నది.

ఉ. జానకిఁ గానకే నిపుడు సమ్మతి నేగినఁ జూచి రాఘవు
ల్వానరు లార్తి మేను విడువం గల రిచ్చటఁ జత్తు నంటినా
మానినివార్తఁ గానక క్రమంబునఁ జత్తురు రెంట దోషము
న్గానక గల్గు నిచ్చటనె మానివిధంబున నుండు టొప్పగున్. 351

క. కావున నేనటు పోవక, పావకశిఖలందు మేనుఁ బోయక యిచటన్
జీవంబు నిలిపికొని ముని, నై వనమున నియతి నుండ నస్వాఁడ నైతిన్. 352

వ. మఱియు వినాశంబునందుఁ బూర్వోక్తబహువిధదోషంబులు సంభవించు బ్రతికి యున్న శుభంబులు పడయవచ్చుఁ గావునఁ బ్రాణంబులు ధరించియుండెద జీవిత సంగమంబున మంగళంబు ధ్రువంబు గదా యని యిట్లు బహుప్రకారంబులఁ జింతించి సారెసారెకు దుఃఖంబు మనంబున ధరించుచు శోకంబునకుఁ బదఁ గానక సీతాదర్శనాభావసంజాతశోకజనితదురంతక్రోధవివశాత్మకుం డై వెండియు నిట్లని వితర్కించు. 353

క. మచ్చరమున వైదేహిని, ముచ్చిలి కొని తెచ్చినట్టి మూఢు దశముఖున్
వ్రచ్చి వధియించి పుచ్చెద, నచ్చుపడ నది ప్రతికార మగు దాని కొగిన్. 354

క. దశముఖుదైత్యాధిపుఁ గొని, విసువక జలరాశి దాఁటి వెస రామునకు
న్నిశితోపహార మిచ్చెదఁ, బశుపతికిం బశువుఁ బట్టి బలి యిచ్చుక్రియన్. 355

వ. ఏను సీతం జూడక యే సంపాతివచనంబు విశ్వసించి రాముని గొని తెచ్చితి నేని న మ్మహాత్ముం డద్దేవి నిచ్చటం గానక కోపవిశేషంబున వానరుల నెల్ల దహించుఁ గదా యని యిట్లనేకప్రకారంబుల వితర్కించి నాకిప్పుడు వేగిరపడ నేల జనకనందనిఁ గనుఁగొనునందాఁక నీలంక నిశ్శంకముగా నుండి గ్రస్మిల వెదకెద నుత్కృతంబున సర్వవానరులు నశింపకుందురు గాక ముందట నొక్క మహోన్నతంబై సమహోద్యానంబు నయనాభిరామంబై పరసంస్కారసంస్కృతంబై యొప్పుచు నొప్పారెడు నింతకుము స్నానవనంబు పరికింప వనపాలకు లగురాక్షసు లచ్చటనుండి పాదపంబుల రక్షించుచున్నవారు గంధవహుండు తత్పరిసరంబున నురవడి మెలంగ వెఱచి మెల్లనం బొరయుచున్నవాఁ డందు జానకి యుండ నోపు వసురుద్రాదిత్యమరుదశ్విలకు నమస్కరించి రాక్షసులకు శోకవర్ధనకరుం డనై యివ్వనంబుఁ జొచ్చి యడ్డంబు వచ్చినరాక్షసుల జయించి సీతం గాంచి తపస్వికిఁ దపఃఫలం బుం బోలె రామచంద్రున కద్దేవి సమర్పించెదఁ గాక యని నిశ్చయించి పరిశుద్ధం బగుతనమనంబున. 356

ఉ. దండము రాఘవేంద్రులకు దండము మైథిలరాజపుత్రికిన్
దండము చంద్రసూర్యులకు దండము ధాతకు శేషశాయికిన్
దండము వాయుకాలురకు దండము వజ్రికి శూలపాణికిన్
దండ మటంచు భక్తిమెయి దక్షత వారికి మ్రొక్కి వెండియున్. 357

చ. వరుణునకున్ ధనేశునకు వహ్నికి సర్వసుపర్వపాళికి
న్వరుస ధరాచరాభ్రచరవార్ధిచరాఖిలభూతకోటికిం
బరమమునీంద్రసంతతికి భాస్వరచారణసిద్ధసాధ్యకి
న్నరగరుడోరగాదులకు సమ్మతితోఁ బ్రణమిల్లి క్రమ్మఱన్. 358

క. దినకరసుతునకుఁ జతురా, ననతనయాద్యఖిలవృద్ధనగచరతతికి
న్వినతి యొనరించి క్రమ్మఱ, వినయం బలరార రామవిభునకు నతుఁడై. 359

వ. మీరందఱు మదీయాభిమతంబు సిద్ధింపఁ జేయుం డని ప్రార్థించుచు. 360

ఉ. పాండురదంత మవ్రణము భాసురకుండలగండభాగము
న్మండితపల్లవాధరము మంజులలాటము పూర్ణచంద్రికా
కాండశుచిస్మితంబు నవకంజపలాశవిలోచనంబు నై
యుండెడుజానకీవదన మొప్పుగ నెప్పుడు చూడఁ గల్గెడిన్. 361

ఉ. క్రూరుఁడు పాపచింతనుఁడు క్షుద్రుఁడు రౌద్రుఁడు లోకకంటకుం
డారయ నీచకర్ముఁడు దురాత్ముఁడు డాదశకంఠుచే భుజో
దారబలాభిభూత యయి తక్కక దిక్కఱి కుందుచున్నయా
ధారుణిపుత్త్రి నా కెపుడు దైన్యము వాయఁగఁ గాన నయ్యెడిన్. 362

వ. అని యొక్కముహూర్తంబు ధ్యానంబు చేసి యమ్మహోద్యానప్రాకారంబునకు లంఘించి ముందట వసంతసమయసంపదంకురితపల్లవితకుసుమితఫలితలలితవిటపిపటలవిభ్రాజితసాలరసాలతమాలతక్కోలచంపకాశోకనాగపున్నాగపూగకురవకోద్దాలకాదివివిధతరువ్రాతసంకులంబును మయూరశుకశారికామధుకరమధురశబ్దాయమానంబును జిత్రకాననశోభితంబును విచిత్రాంతంబును రజతకాంచనపాదపాలంకృతంబును గాంచనలతాశతసమాకీర్ణంబును సువర్ణవర్ణమృగసంచారితంబునగు నశోకవనంబుఁ గనుంగొని మఱియు మహోత్తుంగప్రాకారమండలమండితంబును శారదనీరదావృతంబు నా ధవలసౌధవలయవలయితంబును నీలజలధరమాలికాపరివేష్టితంబు నాఁ దమాలపరివృతంబు నై విలసిల్లు నమ్మహావనంబు దఱిసి గదాహస్తక్రూరరాక్షసరక్షితం బైన యయ్యుపవనద్వారంబు మౌర్వీముక్తం బైననారాచంబుకరణి సొచ్చి యంత నంత జానకి నన్వేషించుచు నిద్రానిమీలితలోచనంబు లగువిహంగమంబుల నెగయం జోపుచు నికుంజపుంజంబుల నిదురించుచున్నమృగంబుల బెగడం దోలుచుఁ బక్షిపక్షవిక్షేపణజాతవాతసమాఘాతశాఖావ్రాతవికీర్ణకుసుమవిసరపరికీర్ణుం డై పుష్పమయం బగుపర్వతంబు చందంబునం దనరుచు వృక్షషండగతుం డై నతన్ను విలోకించి వనగోచరభూతవ్రాతంబు వసంతుం డని తలంప నెల్లదిక్కులం జరించుచుఁ గంపితతరుపతితకుసుమవిసరపరికీర్ణ యై విభూషిత యైనవిలాసినిపగిది నొప్పుచున్నవసుధ నవలోకించుచు నిజపదాఘాతకంపితపతితలలితవిచిత్రనానావర్ణఫలకుసుమపత్త్రంబు లైన వృక్షంబులు నిక్షిప్తవస్త్రాభరణు లైనద్యూతపరాజితపురుషులమాడ్కి నొప్ప

చుండం గనుంగొనుచుఁ బుష్పపత్రఫలరహితంబులై విహంగమహీనంబులై స్కంధమాత్రాశ్రయంబులై యగమ్యంబులైనవృక్షంబుల నవలోకించుచు విధూతకేశియు మృదితాంగరాగయు నిష్పీతశుభదంతోష్ఠయు నఖదంతవిక్షతయు నైన యువతి పోలికి వాలహస్తచరణవిమర్దితప్రభగ్నవరపాదపయై మ్రోడువడి యున్నయశోకవని నాలోకించుచుఁ బ్రావృట్కాలంబునఁ బవనుండు వింధ్యశైలోపాంతసముద్భూతమేఘజాలంబుం బోలె లతాజాలం బులం దట్టుచు మణిరజతకాంచనమయమనోహరభూముల నిరీక్షించుచు సుశీతల స్వాదుజలంబుల మహార్హమణిసోపానంబుల ముక్తాప్రవాళసైకతంబుల స్ఫాటికాంతరకుట్టిమంబులఁ దీరసంభూతకాంచనవిచిత్రవృక్షంబులఁ బ్రబుద్ధపద్మోత్పలవనంబులఁ జక్రవాకదాత్యూహహంససారసనాదంబుల నమృతోపమానతోయసంవర్ధితదీర్ఘద్రుమయుక్తరమ్యసరిత్సమూహంబుల సంతానకలతాశతంబుల నానాగుల్మావృతఘనంబులఁ గరవీరకృతాంతరంబుల నలరువివిధాకారవాపీకూపంబులవిలోకించుచు విమలకలధౌతమణిమయస్తంభంబుల విచిత్రకూటంబులఁ బ్రవృద్ధశిఖరంబుల రమ్యవనంబుల శిలాగృహంబుల నొప్పు నొక్కజగతీవిహారపర్వతంబు పొడగని నగనియంకతలంబు విడిచి వచ్చినకాంతపగిది నొక్క నది యన్నగంబుననుండి దిగం బాఱి ప్రియునిం బాసి యలిగి చనం జుట్టంబు లడ్డంబువచ్చి మరల్చినక్రియ జలనిపతితతరుశాఖాగ్రంబు లడ్డగించిన మగలం దొంటికోపం బడంచుకొని ప్రసన్నయై ప్రియునిరొమ్ముద్దకుం జను ప్రియురాలిచందంబునఁ గ్రమ్మఱ నెదురేగుదాని నవలోకించి యలరుచు నయ్యచలంబు దాఁటి యవ్వల. 363

ఉ. తీరజభర్మవృక్షముల దీపితమౌక్తికసైకతంబులం
బూరితశీతనీరములఁ బుష్పసుగంధిలతాశతంబుల
న్నారసకైరవంబుల విశాలమణీకటకాంతరంబులం
దీరగువిశ్వకర్మకృత దివ్యతరంగిణిఁ జేరఁ బోవుచున్. 364

చ. వితతసువర్ణవేదికల విస్తృతనవ్యలతాంతపల్లవ
ప్రతతులఁ జిత్రపత్త్రుల నభఃస్పురదుల్లిఖితాగ్రశాఖలం
గృతనవమల్లికాతతుల నిర్మలవర్ణఫలోత్కరంబులం
జతురత నొప్పు కాంచనవిశాలమహీరుహపంక్తిఁ జూచుచున్. 365

వ. మఱియు నచ్చటివృక్షంబు లన్నియుఁ బుష్పోపగఫలోపగంబులై సవితానంబులై సశయనాసనంబులై సవితర్దికంబులై సువర్ణసోపానవేదికాయుక్తంబులై యలరు చునికి నచ్చెరు వొందుచు. 366

క. అంచితముగఁ దత్తటమునఁ, గాంచనమయరమ్యవేదికల నావృతయై
మించుకరణి నొప్పారెడు, కాంచనశింశుపను వేడుకం గనుఁగొనియెన్. 367

క. మఱియుం దత్పరిసరమున, మఱికొన్నిశిఖిప్రకాశ మంజులచామీ

కరతరువులు గర్తంబులు, వరభూభాగములు ప్రస్రవణములు చూచెన్. 368

క. అనుపమకాంతుల నీనెడు కనకమహీజములనడుమఁ గపివర్యుం డే
గనకమ నైతి నటంచును, గనకనగంబుక్రియ నొప్పెఁ గడుఁ దేజమునన్. 369

క. ఘనమారుతకంపితతత, త్కనకమహీజవిటపాగ్రకలితోజ్జ్వలకాం
చనఘంటికాసహస్ర,ధ్వని విని మది విస్మయంబు దైవాఱంగన్. 370

క. నిరుపమతరుణాంకురభా, సురపల్లవపుష్పితాగ్రసుందరశాఖా
భరిత మగుశింశుపాహ్వయ, తరుమహిమకు నాత్మ సమ్మదం బిగిరింపన్. 371

వ. అమ్మహామహీరుహాధిరోహణంబుఁ జేసి నలుదెసలు కలయ నవలోకించి. 372

చ. తలఁపఁగ రామభూరమణదర్శనలాలస యై కడిందివం
తలఁ బడి తాప మీఁగుటకు నవ్యసుగంధిలతాశతంబులం
గలయఁ జరించుసీతను జగన్నుతరాజకులాభిజాత న
త్యలఘుసమస్తసద్గుణగణాంచిత నిచ్చట నేఁడు చూచెదన్. 373

చ. ఇది రమణీయకాంచనమహీరుహ మైనయశోకకాననం
బిది కమనీయకోకనదహేమమయాబ్జసుగంధికైరవా
స్పద మగుకేళికాసరసి చయ్యన నిచ్చటి కానరాధిదే
వదయిత నిచ్చ రాఁగలదు వచ్చినయంత నె చూడఁగల్గెడిన్. 374

క. తలఁపఁగ వనసంచారకు, శల గావున నిచటి కిపుడు జనకక్ష్మాధీ
శలలామతనయ వెస రాఁ,గలదు ముదం బలర నాకుఁ గనుఁగొనఁ గల్గున్. 375

చ. నలువుగఁ దొల్లి కాననమునం జరియించెడు వేళ నాశ్రమ
స్థలమునఁ దాను బ్రత్యహముఁ దాపసకన్యలఁ గూడి సంధ్యలం
దలయక తీర్థసేవకు రయంబున నేగెడి దాట నేఁడు న
య్యలవున వచ్చు నిక్కముగ నయ్యమ తమ్మిగొలంకుచెంతకున్. 376

క. జీవించి యుండెనేనియు, క్ష్మావల్లభుదేవి నేఁడు సందేహముగా
నీవలనికి రాఁగల ద,వ్పావనగుణశీల నిచటఁ బరికింప నగున్. 377

వ. అని యనేకప్రకారంబుల సీతాదర్శనోత్సుకుం డై విచారించుచు సుపుష్పితంబు
లై నసాంద్రపర్ణంబుల విలీనుం డై యుండి దివ్యగంధరసోపేతసంతానకలతాపా
దపశోభితంబగు దానిఁ గాంచనోత్పలపద్మకైరవలక్ష్మీవిరాజమానసరోవరభాసితం
బగుదాని బహ్వాసనకుథోపేతనానామణిభవనయుతం బగుదానిఁ బ్రమదాకుల
కోకిలకీరశారికామధుకరమధురశబ్దాయమానం బగుదాని సర్వర్తుఫలకుసుమవిస
రవిభ్రాజితనానాపాదపసంకులం బగుదాని విచిత్రమృగపూగవిరాజితం బగుదాని
ననేకభూబిలగృహాయుతం బగుదాని సుపుష్పితాశోకప్రభాతిరస్కృతసూర్యో
దయప్రభం బగుదాని యుగపద్వినిమ్నతద్విచిత్రపుష్పావతంసకబహుపక్షిపక్ష
పిహితపర్ణత్వంబు గలుగుటవలనఁ బత్రరహితశాఖం బైనదానిపగిదిం దోఁచు
దానిఁ బుష్పభారాతిభారంబుల నవనీతలంబు స్పృశించుచున్నదానిపగిదిం జూ

పట్టుచు నామూలపుష్పోపచితశోకనాశనాశోకకర్ణికారకింశుకమహీరుహప్రభా
ప్రదీప్తప్రదేశం బైనదాని వివృద్ధమూలసుపుష్పితపున్నాగసప్తపర్ణచంపకోద్దా
లకవిరాజితం బగుదానిఁ బ్రతప్తజాంబూనదశలాకలమాడ్కిఁ బ్రజ్వలితజ్వలన
జ్వాలికలభంగి నీలాంజనచయంబులకై వడి వెలుంగుపుష్పితాశోకసహస్రంబుల
సాంద్రం బగుదాని నానావిధావాంతరవనవిచిత్రంబు లైననందనచైత్రరథం
బులం దృణీకరించినట్లున్నదానిఁ బుష్పతారాగణయుక్తం బై రెండవగగనంబు
భంగి నొప్పుదానిఁ బుష్పరత్నశతచిత్రం బై పంచమసాగరంబుకరణి నలరుదాని
ననేకగంధప్రవాహం బై పుణ్యగంధమనోహరం బై ద్వితీయగంధాఢ్యం బై ద్వి
తీయగంధమాదనంబుకైవడిఁ దనరుదాని రమణీయశోభాభిరామం బగుదాని
నచింత్యాద్భుతదర్శనం బగుదాని నశోకవనంబు గలయ నవలోకించి తన్మధ్యదే
శంబున ననేకతప్తకాంచనవితర్దికాశోభితంబును బ్రవాళవిరచితసోపానంబును
గాంచనస్తంభసహస్రనిర్మితంబును వివిధప్రాకారసౌధావృతంబును గైలాసగిరి
పాండురంబు నగుచైత్యప్రాసాదంబు పొడగని యరుదందుచుఁ దన్మూలవిరచిత
మణిమయవేదికాతలంబున. 378

హనుమంతుఁడు సీతం జూచుట.

తే. శుక్లపక్షాదియం దొప్పు సోమరేఖ, భంగి ధూమజాలావృతపావకశిఖ
కైవడి విపన్నపద్మినిగతి సపంక, కాంచనశలాకచందానఁ గ్రాలుదాని 379

చ. మలినముఁ గట్టి పాంసుపరిమార్జితసల్లలితాంగయష్టితోఁ
గళవళ మందుచు న్వదనకంజము నూర్పులు వాడఁ జేయఁ గే
వలపరితాప మెచ్చ నుపవాసములం గడు డస్సి చాల సం
తలఁ బడి దిక్కుమాలి నయనంబుల నశ్రులు గాఱ నేడ్చుచున్. 380

చ. చెలు వఱి శ్వానమధ్యమునఁ జిక్కిన లేడియుఁ బోలె దైత్యకాం
తలనడుమన్ గృశించుచు వితాకుప నూటికి నొచ్చనూర్చుచు
నొఱయుచు లజ్జయు న్భయము శోకము దైన్యము పారవశ్య మ
గ్గల మయి సర్వమానమునఁ గన్నులు మూయుచు వెండి విప్పుచున్. 381

చ. చతురత దక్కి భీషణకుజగ్రహపీడిత యైనరోహిణీ
సతిక్రియఁ బొల్పు దక్కి యనిశం బెదఁ గుందుచు నేకవస్త్ర యై
హితులను బంధువర్గముల నెప్పుడుఁ గానక ఘోరరాక్షసీ
ప్రతతులఁ జూచుచుం గలఁకఁ బాఱుచుఁ జాల విచార మొందుచున్. 382

తే. నీలనాగాభ యై యొప్పు నెఱయ మెఱయు, జఘనగతదీర్ఘకోమలశ్యామ లైక
వేణిచే నీరదాపాయవేళ విపిన, రాజిచే నొప్పుమహిభంగిఁ గ్రాలుదాని. 383

తే. చిత్రమణిభూషణములు గై సేయ కుడిగి, యొడలఁ గలసినమలపంక మొప్పుచుండ
వాడు వాఱినమల్లికావల్లిపగిదిఁ, దీవ్రదుఃఖాభితప్త యై దిగులు గొనుచు. 384

క. వ్యసనము లెఱుఁగనిదానిని, వ్యసనంబునఁ గుందుదాని వరవర్ణిని ను
ల్లసితాబ్జపత్రనేత్రను, నసితాలకకలితనిటల నంబుజపాణిన్. 385

మ. ఘనవృత్తస్తనమండలి న్విమలరాకాచంద్రవక్త్ర న్రథాం
గనితంబన్ మృగరాజమధ్యను దలత్కంజాతపత్రేక్షణ
న్ఘనకేశి న్నవపల్లవోష్ఠిని జగన్మాత న్ననాన న్నతిం
దనుశోభాప్రకటీకృతాఖిలదిగంతం గంతుకాంతోపమన్. 386

తే. పూర్ణచంద్రునిదీధితిపోలె జగతి, కమితసంతోషకారిణి యైనదాని
ననిలహతవల్లికైవడి నడలుదాని, భుజగసతిభంగి నూర్పులు పుచ్చుదాని. 387

వ. మఱియు సందిగ్ధార్థంబైన యామ్నాయస్మృతివాక్యంబు కరణిఁ బరిక్షీణ యైనసమృద్ధి చందంబున నవిశ్వాసబహుళ యైనశ్రద్ధమాడ్కి నలబ్ధకార్య యైనయాశపగిది సాంతరాయ యైనసిద్ధికైవడి సకలుష యైనబుద్ధిమాడ్కి మిథ్యాపవాదంబున నశించినకీర్తిరీతిఁ గాలమేఘపరివృత యైనసనక్షత్రరాజప్రభభంగి నభ్యాసాభావంబునం బ్రశిథిల యైనవిద్యపోలికి సంస్కారాభావంబున విపరీతార్థంబు బోధించు వాక్కుపగిదిన స్ఫుటప్రకాశ యై రామప్రాప్తినిరోధనంబున దుఃఖించుచున్నదాని మఱియును. 388

తే. చంద్రవిరహిత యగు రాత్రిచందమునను
జంటఁ బాసినజక్కవపెంటిరీతి
భాస్కరుఁడు లేనిదినలక్ష్మిభంగిఁ జాల
నొప్పు దూలి యొంటిఁ గృశించుచున్నదాని. 389

మ. అనిశధ్యానపరీతచిత్త యగుచున్ హా రామ హా లక్ష్మణా
యని వాపోవుచు వృక్షమూలమున నధ్యాసీన యై మౌనముం
దనరం దాపసిభంగి నొప్పెడు జగన్మాన్యన్ మహీనందని
న్వనజాతాయతనేత్ర సీతఁ గనియె న్వాతాత్మజుం డయ్యెడన్. 390

హనుమంతుఁడు రామోక్తసీతాలక్షణంబులఁ గని సంతోషించుట.

వ. ఇత్తెఱంగున నప్పవననందనుం డనిందిత యగుసతిం గాంచి బహుప్రకారంబుల విచారించి కొండొకసేపు కార్శ్యమాలిన్యతిరోహితరూపత్వంబువలన సీత గాదని సందేహించి పదంపడి యుపపాదనశీలకారణంబులచేత సీత యని నిశ్చయించి పరమానందభరితాంతఃకరణుండై. 391

క. జనవిభుఁ డేయేసొమ్ములు, జనకజ కున్న వని చెప్పె నమ్మతి నట్టి
వనితకు నాయాసొమ్ములు, గన నగుచున్నయవి విటపకలితము లగుచున్. 392

తే. రాఘవుఁడు చెప్పినట్లు శ్రీరాజముఖికిఁ, జారుమణినిర్మితశ్వదంష్ట్రప్రసూన
రూపరచనాభిశోభిత తాపనీయ, కర్ణవేష్టనయుగళంబు గాన నయ్యె. 393

తే. చారుమణిచిత్రహస్తభూషణము లొప్పు, చున్నవి వియోగజనితతాపోష్ణతావి
శేషమున నసితంబులై చిరనియుక్త, తావశమున సంస్థానవంతంబు లగుచు. 394

తే. భూమిపైఁ బాఱవైచిన రామపత్ని, భూషణంబు లేకన కాంగిభూషణములు
పొలుపు మీఱంగ నొకమేనిభూషణంబు, లరయ రెంటికిభేద మింతైన లేదు.
తే. భూమిపుత్త్రిక యేయేవిభూషణములు, పుడమిపై వైచెనాయావిభూషణములు
తత్తదుచితాంగములయందుఁదక్కువయ్యె, నరసిచూడంగ నిప్పుడీయబ్జముఖికి.
చ. అరయఁగ నేను సూర్యతనయాదులు మున్నలఋశ్యమూకమం
దిరవుగ నున్నవేళ మణిహేమసముజ్జ్వలమండనంబు లం
బరమున మూటఁ గట్టి పడవైచినయాకనకోత్తరీయ మీ
హరివరమధ్యపై వలువ యౌట నిజం బౌకవన్నె గావునన్. 397
మ. అనిశధ్యాతరఘూత్తమావయవయై హారామ హారామ హా
జననాథోత్తమ యొంటిఁ జిక్కితిని రక్షస్త్రీవ్రాతమధ్యంబున
న్ననుఁ గావ న్వెస రాఁగదే దనుజునిన్ దండించి గొంపోఁగదే
యని వాపోవుచు నున్న దీసతి నిజం బాసీత యౌరా నారయన్. 398
తే. కనకవర్ణాంగి యైన యీకాంతనిక్క,మగు ననారాముప్రియపత్నియగును బ్రేమ
గరిమ నేసాధ్వి నష్టయై కానకున్న, నష్ట గాకుండు రాముమనంబునందు. 399
చ. అతివ యటంచు భూరికృప నాలని శోకముచే నజస్ర మా
శ్రిత యని యానృశంస్యమునఁ బ్రేయసి యౌట ననంగుచేత నే
యతివకృతంబునన్ రఘుకులాధిపుఁ డార్తిఁ దపించునట్టిభూ
సుత యగు నిక్క మీభువనసుందరి సుందరవేషసంపదన్ 400
క. రంగుగ నారఘుపుంగవు, నంగప్రత్యంగసౌష్ఠవాతిశయం బీ
యంగనరూపవిశేషము, సంగతిగా నొక్కభంగి జతనం బయ్యెన్. 401
క. ఈవనితచిత్త మెప్పుడు, నావిభుపై నుండు మిగుల నావిభుచిత్తం
బీవనితమీఁద నుండును, గావున నిరువురును మనిరి క్షణ మైన నిలన్. 402

హనుమంతుఁడు సీతకు సంభవించినపాటు చూచి దుఃఖించుట.

క. ఈకాంతఁ బాసినప్పుడె, పోక విభుఁడు మేనఁ బ్రాణములు నింతకు న
స్తోకగతిఁ దాల్చి యున్నాఁ, డాకరణి న్మను టశక్యమై యుండుఁ గదా. 403
వ. అని యిత్తెఱంగున నప్పవననందనుండు సీతం జూచి సంహృష్టచిత్తుండై మనంబున రామునిం దలంచి ప్రశంసించుచు జానకిం గొనియాడుచు నొక్కముహూర్తంబు చింతించి బాష్పపర్యాకులేక్షణుం డై యిట్లని విలపించె. 404
ఉ. ఈసతిఁ బాసి రామవిభుఁ డించుకసేపు మనంగఁ జాలఁ డ
ట్లీసతి రాముఁ బాసి తను వించుక దాల్పఁగఁ జాల దక్కటా
యీసతి రాముఁ డిర్వు రితరేతరవీక్షణ మాచరించు పీ
ఠాన ధరిత్రి నింపనుకఁ బ్రాణయుతంబుగ నున్నవా రొగిన్. 405
తే. లలితగుణమండనుం డైనలక్ష్మణునకు
మాన్యయును రామునకు బ్రియమహిషియు నగు

భూతనయ యిట్టిదుఃఖంబుఁ బొందవలసెఁ
గాలము దురత్యయం బెంతఘనున కైన. 406

ఆ. రామువిక్రమంబు సౌమిత్రి తేజంబు, నెఱిఁగి యున్న దగుట నీమృగాక్షి
జలదకాలగంగచాడ్పున క్షోభింప, కున్న దిపుడు ధైర్య మూఁతఁ జేసి. 407

క. సమశీలవయోవృత్తయు, సమాభిజనలక్షణ యగుజానకికి రఘూ
త్తముఁడు దగు నవ్విభున కీ,యమ దగు దాంపత్య మింతయర్హం బగునే. 408

వ. అని పెక్కుతెఱంగులం దలపోసి మలినసంవీతత్వోపవాసకృశత్వశోకధ్యాన
పరాయణత్వాదిపతివ్రతాదిధర్మయుక్తయై లోకకాంత యగురమాదేవియుం
బోలె నొప్పుచున్నసీత నవలోకించి శోకహర్షకలితుండై యాత్రిలోకసుందరి
రామునిభాగ్యంబున జీవించి యున్నదని రాముని బ్రశంసించి వెండియుఁ దన
మనంబున. 409

సీ. ఈకాంతకై కాదె యినకులాధీశుండు ఘనరూపుఁ డగువిరాధుని వధించె
నీయింతికై కాదె కోయించె రాక్షసి కర్ణనాసికము లక్ష్మణునిచేత
నీకాంతకై కాదె వీఁకతో రావణప్రతిముఁ గబంధునిఁ బట్టి చంపె
నీలేమకై కాదె లీలతోఁ బదునాల్గువేల రక్కసుల వావిరి వధించె

తే. నీజలజనేత్రకై కాదె యోజ మెఱసి, ఖరుని ద్రిశిరుని దూషణుఁ గలనఁ ద్రుంచె
మఱియు నీరామకై కాదె హరివరేణ్యు, ఘోరరూపుని వాలిని గూల వైచె.

తే. భానుజుఁడుదుర్లభంబైనప్లవగరాజ్య, మొందుటయు నేను గడిమి మైనుదధి దాఁటి
వచ్చుటయు వేగ యీలంకఁ జొచ్చుటయును, బరఁగ నీపంకజేక్షణకొఱకుఁగాదె.

తే. ఈచకోరాక్షికొఱకునై యినకులుండు, జలధిపర్యంత మైనధాత్రీతలము గాదు
కెరలి ముల్లోకములు తలక్రిందుగాఁగఁ, జేసినను యుక్తమని యెంతుఁజిత్తమందు.

తే. అఖిలలోకైకసామ్రాజ్య మది యధికమొ
జనకనందని యధికమో యని తలంప
నఖిలవిష్టపసామ్రాజ్య మాధరిత్రి
పుత్రికకలాంశ మైనను బోల దరయ 413

మ. ధర భేదించి సరోజరేణునిభకేదారస్ఫురద్ధూళిచే
సిరి యొప్పారు హలాననక్షతమఖక్షేత్రంబునం బుట్టి శ్రీ
కరసంస్తుత్యగుణాఢ్యుఁడైనజనకక్ష్మాభర్తకుం బుత్రియై
స్థిరలో వన్నియఁ గన్న దీసుదతి పాతివ్రత్యధర్మంబునన్. 414

వ. అదియునుం గాక. 415

చ. అరిజయశీలుఁ డాదశరథావనిభర్తకు ముద్దుఁగోడలై
వరనృపమౌళిరత్నరుచిభాసితపాదకుఁడైన రామభూ
వరునకుఁ బత్నియై జగతి వాసికి వన్నెకు నెక్కె నేఁటికి

ప్పురమున దైత్యబాధలకుఁ బాల్పడి సొక్కుచు నున్న దక్కటా. 416

సీ. వితతసుఖంబులు విడిచి భర్త్రుస్నేహబలమున నిడుములు దలఁప కట్లు
జనశూన్యమగుఘోరవనమున కేతెంచి ఫలమూలముల క్షుత్తుఁ బాసికొనుచు
వేడ్కతో విభుని సేవించుచు సింటిలో నున్నకై వడిఁ బ్రీతి నొందియుండు
నట్టియూకనకాంగి యన్మహాత్మునిఁ బాసి యొంటి దుఃఖించుచు నున్న దకట

తే. పూని తృష్ణాతురుం డైనమానవుండు,సంభ్రమంబునఁ బానీయశాలనట్లుఁ
శీలసంపన్న యైనయూసీతఁ జూడఁ,గోరి యున్నవాఁ డానృపకుంజరుండు. 417

ఆ. రాజ్యహీనుఁ డైన రాజు గ్రమ్మఱ ధాత్రి,నొంది సమ్మదంబు నొందినట్లు
రాముఁ డీనృగాక్షిఁ గ్రమ్మఱఁ జేకొని, యనుపమానసౌఖ్య మందఁగలఁడు. 418

తే. బాంధవులఁ బాసి భోగసంపదలఁ బాసి
రాముఁ డరుదెంచి తన్ను దుర్వారశౌర్య
గరిమఁ గొని పోవుననునాస గలిగి మేనఁ
బ్రాణములు దాల్చి యున్న దీపద్మనేత్ర. 419

ఉ. చూడదు పుష్పభూజములఁ జూడదు రమ్యవిచిత్రశాలలం
జూడదు నిష్కుటావలులఁ జూడదు రమ్యసరోవరంబులం
జూడదు రాక్షసాంగనలఁ జూపుల రామునిదివ్యరూపము
న్వ్రేఁడిమితోడ నెప్పుడుఁ గనుంగొనుచుం బదదీనచిత్తయై. 420

తే. రమణికి సమస్తమణిభూషణములకంటె
నెక్కు డగుభూషణము విభుఁ డీలతాంగి
ధవునిఁ బాసినకతన నిద్దంపుసొమ్ము
లెన్ని గలిగిన శోభింపకున్న దిపుడు. 421

క. అనుపమసుఖభోగములకు, ననువుగఁ బాత్ర మగునీనృపాంగన దుఃఖం
బునఁ గుందుచుండఁ గని నా,మనమును గడు దుఃఖశోకమగ్నం బయ్యెన్. 422

ఆ. రామలక్ష్మణాభిరక్షిత యై సుఖ,లీలఁ జెలఁగునట్టి యీలతాంగి
వికృతరూపదానవీజనాంతరమున, నొప్పుదూలి కుందుచున్న దకట. 423

తే. హిమకణపరీతనళినిచందమున నష్ట,శోభ యై యప్రభృష్యదుఃఖాభిపీడ్య
మానయై యొంటి సహచరహీనచక్ర,వాకిగతిఁ గుందుచున్నది వనజనేత్ర. 424

తే. కాంతు నెడఁ బాసి యిట్లున్నకారణమున,నీసురభికాలహారిణాంకుఁ డీవిశాల
కుసుమితాశోకతరువు లీకువలయాక్షి,కొనర శోకంబుఁ బుట్టించుచున్నవిపుడు.

వ. అని పెక్కుతెఱంగుల విచారించుచు సీత యని నిశ్చయించి యల్పగాత్రుండై
యత్తరుశాఖాపర్ణంబులనడుమ నుండి సూచుచుండ నప్పుడు. 426

—చంద్రాభివర్ణనము—

చ. కలువలపాలిమేలు శితికంఠునియాదలఁపువ్వు మేలిత
మ్ములపగవాఁడు పాల్కడలిముద్దులపాపఁడు జింకదాల్పు రి
క్కలదొర రేవెలుంగు విరికైదువుదాలుపు మేనమామ మ్రొ
క్కులదొరయుద్ది చీఁకటుల గొంగ విధుం డలరెన్ నభంబునన్. 427

వ. మఱియును. 428

క. విమలప్రభచేఁ జంద్రుఁడు, ప్రమదంబున మైత్రి నెఱపఁ బఱతెంచినచం
దమున సుశీతలకరములఁ, గొమరొప్పఁగ వాయుపుత్త్రకుని సేవించెన్. 429

తే. గగన మొప్పారె నీలోదకంబుకరణిఁ, దారకాప్రకరంబులు కైరవముల
పగిది విలసిల్లెఁ జంద్రుండు భాసమానుఁ,డగుచు హంసవిధంబున నలరెనపుడు.

—హనుమంతుఁడు సీతయున్నవిధమంతయు విమర్శించుట.—

వ. ఇట్లు గగనమధ్యభాగంబున వెలుంగుచందురుని చల్లనికిరణంబులు తనశరీరంబు నకు సుఖస్పర్శంబులై సోఁక నాహ్లాదించుచు నమ్మరున్నందనుండు వెండియు వస్తుభారవిశేషంబున నుదకమధ్యంబున నాందోళించు చున్ననావచందంబున శోకభారాక్రాంతయై తరుమూలంబున నాకంపించుచున్నజానకి నవలోకించుచుఁ దత్పరిసరంబున నమ్మహావనస్పతిం జుట్టుకొని యున్నయేకాక్షుల నేకకర్ణలఁ గర్ణ ప్రావరణల నకర్ణలశంకుకర్ణలమస్తకోచ్ఛ్వాసనాసికల నతిస్థూలోత్తమాంగుల నస్థూలదీర్ఘశిరోధరల స్వల్పకేశుల ననుత్పన్నకేశులఁగంబళరూపకేశధారిణుల లంబకర్ణలలాటల లంబోదరపయోధరల లంబోష్ఠులఁ జుబుకోష్ఠుల లంబాన్యల లంబజానుకల హ్రస్వదీర్ఘకుబ్జవికటవామనాంగులఁ గరాళభుగ్నవక్త్రలఁ బింగాక్షుల వికృతాననల వికృతాకారలఁ బింగవర్ణల నతిక్రోధనలఁ గలహప్రియలఁ గాలాయసమహాశూలకూటముద్గరధారిణుల సూకరహరిణవ్యాఘ్రులులాయమే షజంబుకముఖుల మాతంగతురంగోష్ట్రపాదల గాత్రాంతరవర్తిశీర్షల నేకహస్తల నేకపాదల ఖరకర్ణల గోకర్ణల హయకర్ణల హస్తికర్ణల హరికర్ణల ననాసల నతినాసలఁ దిర్యఙ్నాసల వికతనాసికల గజసన్నిభనాసికల లలాటోచ్ఛ్వాస నాసికల హస్తిపాదల మహాపాదలఁ గోపాదలఁ బాదచూళికల నతిమాత్రశిరో గ్రీవల నతిమాత్రకుచోదరుల నతిమాత్రముఖలోచనల దీర్ఘజిహ్వల దీర్ఘా ననల ధూమ్రకేశల మదిరాపానపరవశల సదామాంససురాప్రియల మాంస శోణితభోజనల రోమహర్షణదర్శనల రాక్షసాంగనల నవలోకించి యమ్మహా వృక్షంబుక్రింద మలినవస్త్రంబునం గట్టినమానికంబుచందంబున నవిష్కృత తేజోవిశేషయై పంకదిగ్ధయైనమృణాళికతెఱంగున మాసి ప్రచండాతపపరి మ్లానననూతనవల్లికై వడి వాడి వ్యాఘ్రీమధ్యంబునం జిక్కినలేడివైఖరి నా కంపించుచు బుణ్యాంతంబునందుదివంబున నుండి పుడమింబడినతారపగిదిఁ బరి

క్షీణకాంతి యై మోదంబునం జిక్కి నగజాంగనభంగి దైన్యంబు నొంది పంజర మధ్యగత యైనశారికవిధంబున రాక్షసీమధ్యంబునం జిక్కి ధూమజాలావృత పావకశిఖలాగునఁ దనుచ్ఛాయ నడంగి పాంసుపరిచ్ఛన్న యైన హేమశలాకకై వడి నొప్పుమాలి ప్రభంజనరయోద్ధూత యై మ్రోటువడి యున్నకదంబశాఖలాగున మండనంబులు డుల్చి జంటఁ బాసినజక్కవపెంటిక్రియఁ బొలుపుదక్కి పయో దాంతంబునందు శారదాభ్రపరివృత యైనచంద్రరేఖగతి మలినాంగచ్ఛాయ తోఁ దూలుచుఁ బాండురపరాగపటలపరిచ్ఛన్న యైనపుష్పమంజరిసొంపున ధూళి బ్రుంగి పంకనిమగ్న యైనగోవుసాబగునఁ జేష్టలు మాని మంత్రౌషధరుద్ధవీర్య యైనభుజంగికరణి నూర్పులు పుచ్చుచు ననారోపితతంత్రి యైనవల్లకియట్లు రామణీయకంబు విడిచి యుద్వర్తనాదిసంస్కారాభావంబువలన నతిక్లిష్టరూప యై భర్తృదర్శనహీన యై చారిత్రవ్యపదేశాఢ్య యై భర్తృవాత్సల్యభూషిత యై భర్తృహితయుక్త యై తనదురవస్థకుం గుందుచుఁ గ్రూరరాక్షసులతర్జనోక్తులకు దలంకుచు రావణుదౌరాత్మ్యంబునకు నిందించుచు రామునిం బేర్కొని కావ రావే యని చీరుచు దైవంబును దూఱుచు ధరాసక్తవీక్ష యై కన్నీరు నించుచు నిశ్శ్వాసమారుతంబులఁ బల్లవధారివృక్షంబుల దహించుచు స్వభావతనుచ్ఛాయ నవ్వనంబు నెల్ల వెలింగించుచు నేకవేణియు మలినాంగియు మలసంకులశిరోజ యు నై శోకరసాధిదేవతయుంబోలెఁ జూపట్టుచు బహుప్రకారంబుల దుఃఖించు చున్నసీత నవలోకించి తదీయదివ్యమహిమంబులు వక్కాణించుచు హర్షబాష్ప పరిప్లుతుండై మనంబున నద్దేవికి రామలక్ష్మణులకు నమస్కరించి యమ్మహీపుత్రి తోడ రామునిసందేశంబుఁ జెప్పుటకు నవసరం బరయుచుండ రాత్రి యామ త్రయం బయ్యె నప్పుడు షడంగసహితం బయినబ్రహ్మరాక్షసుల వేదఘో షంబు మధురంబుగా వినవచ్చె నంత నక్కాలంబున శ్రోత్రమనోహరంబులగు మంగళవాదిత్రగీతశబ్దంబుల మహాబలుం డగు రావణుండు మేల్కని. 431

రావణుఁడు సీతయున్నస్థలమునకు వచ్చుట.

చ. అవనిసుతం దలంచుకొని యాత్మవివర్ధిత మైన కామము
న్దవిలి సహింప లేక మదనప్రహారాహతి కోహటించి త
త్ప్రవిమలమానసంబు బహుభంగుల మంజువచోనిరూఢి నా
త్మవశము చేసి కొందు నని తద్దయు వేడుక దుర్విచారుఁడై. 432

చ. సదమలచంద్రికాధవళచారుదుకూలముఁ గట్టి మోదము
న్గదురఁగ రక్తచందనము కస్తురియుం గలపంబు మెత్తి సొం
పొదవఁ బ్రసూనదామచయ మొప్పఁగఁ జుట్టి విచిత్రకాంచనాం
గదమకుటాదిభూషణనికాయములం గయిసేసి గ్రక్కునన్. 433

సీ. విఱిగినచొక్కపు వేల్పుటేనుఁగుకొమ్ము వక్షస్థలమునకు వన్నెఁ బెట్టఁ
గనకీయకోటీరఘటితవజ్రోపల కాంతిదీధితులు నీరెండ గాయ
వాసితాసవపానవశమున నెఱ్ఱవాఱినవృత్తపింగలోచనము లలరఁ
గాలజీమూతసంకాశమేచకదీప్తి గిరితుల్యమగు మేన గిఱికొనంగ
తే. సెలవిఁ బాఱంగ నవ్విన వెలికిఁ బర్వు, దీర్ఘదారుణదంతదీధితులు నిగుడ
రావణుఁడు సర్వలోకవిద్రావణుండు, రాజసము మీఱ నంతఃపురంబు వెడలె.

వ. ఇత్తెఱంగున వెలువడి చనునప్పుడు. 435

తే. దేవగంధర్వయువతులు దివిజలోక, పాలు వెనుకొని చనుదెంచుపగిది దోఁప
నంగనాజనశతమాత్ర మానిశాట, నాథు వెనుకొని చనియె నందం బెలర్ప. 436

సీ. తరుణులు కొందఱు తపనీయదండాగ్ర సందీప్తదీపికాశతము గొనుచు
మగువలు కొందఱు మణిదండచామరోత్తమములు తాలవృంతములు గొనుచు
నిందీవరాక్షులు కొందఱు దుత్తూరసుమతుల్యసలిలపాత్రములు గొనుచు
గఱితలు కొందఱు కాలాహిసంకాశ రమణీయమండలాగ్రములు గొనుచుఁ
తే. బడఁతియొక్కతె మణిపానపాత్ర గొనుచుఁ, జానయొక్కతె రాజహంసప్రకాశ
ధవళరశ్మినిభాతపత్రంబు గొనుచు, రావణునివెంట నడిచి రారమణు లపుడు.

వ. మఱియును 438

సీ. నిద్రానిమీలితనేత్రలై తూఁగుచు వెలఁదులు కొందఱు వెనుక నడువ
నరుదార మదపరీతాస్యలై కొందఱు గఱితలు పార్శ్వభాగమున నడువ
శ్రమజలాభివ్యక్తసాంకవామోదలై ముదితలు కొందఱు మ్రోల నడువ
సూనాస్త్రకేళిచే సొటసొటవోవుచుఁ జెలులు కొందఱు చుట్టు బలసి నడువ
తే. మరునిసేఁతలు మిక్కిలి మరులుకొల్పఁ
దనువు లొరయుచుఁ గొంద ఱంగనలు నడువ
దశముఖుఁడు వారినడుమన తనరె హస్తి
నీగణాంతరగతమత్తనాగమువలె. 439

వ. మఱియుఁ గొందఱు మత్తకాశినులు తత్తఱంబున. 440

ఉ. చిక్కులు వడ్డహారములు చిందఱవందఱలైనమాల్యము
ల్ప్రక్కలు వడ్డచన్నుమొనలు న్వలునొక్కులఁ గందువాఱెఱ
ల్చక్కెరవింటిసామి నెఱిచందము దెల్పఁగ నీలమేఘముల్
మిక్కిలి వేడ్క వెన్కొనిన మించులకైవడి నేగు దేరఁగన్. 441

వ. ఇట్లు కాంతాజనపరివృతుండును నచింత్యబలపౌరుషుండును ననేకగంధతైలావ
సిక్తకరదీపికావభాసితుండును వరమాల్యవిభూషితుండును మదఘూర్ణితరక్తాక్షుం
డును విరజోంబరధరుండును మథితామృతఫేనాభం బైనదానివిరజం బైనదాని
నంగదసక్తం బై విస్రస్తం బైన యుత్తమవస్త్రమును సలీలంబుగా సవరించుచున్న

వాఁడును నానావిచిత్రభూషణభూషితుండును గాలజీమూతసంకాశుండును సింహవిక్రాంతపరాక్రముండును గింకిణీఘోషసంఘుష్టుండును బరిత్యక్తేక్షుచాపకందర్పసమానుండును శంకుకర్ణుండునుగామపరాధీనుండునుసీతాసక్తమనస్కుండునై మదాంచితగమనంబున నశోకారామవాటికాద్వారంబు దఱిసి యనుత్తమకాంతియుక్తంబునుసర్వజమ్యఫలోపగనగజుష్టంబునునానాపుష్పోపశోభితపుష్కరిణీవృతంబునుదృష్టిమనోహరవిచిత్రవివిధవిహంగమయుక్తంబును మణికాంచనతోరణంబును నానామృగగణాకీర్ణంబును బరిపతితఫలసమాయుక్తంబును బహుపాదపశోభితంబు నగునమ్మహావనంబు సొచ్చి వచ్చుచున్న రావణుని దర్పవిలం జూచి పవననందనుండు తనమనంబున. 442

—హనుమంతుఁ డశోకవనమునకు వచ్చురావణుని దర్పవిలం జూచుట.—

ఉ. కంకణకింకిణీధ్వనులు గ్రందుకొనన్ మదిరాయతేక్షణ
ల్జంకెలు సేయుచున్ గడువిలాసమునం దనవెంట రాఁగ ని
శ్శంకత నెవ్వఁడో కనకచారువిభూషణపంక్తిఁ దాల్చి యీ
వంకకు దుర్విచార మొదవం జనుదెంచుచు నున్నవాఁ డొకో. 443

చ. తలఁపఁగ వీఁడు రాక్షసవతంసకుఁ డౌ దశకంధరుండు గా
వలయు మనోజశాతశరవంచితుఁ డై యిటు వచ్చుచున్నవాఁ
డలయక యీదురాత్ముఁడు నృపాత్మజ నేమి దురుక్తులాడునో
సొలయక యిందె యుండి యటు చూచెద నీతనిచంద మంతయున్. 444

క. అని నిశ్చయించి వేఱొక, ఘనశాఖకు దాఁటి యల్పగాత్రుం డగుచున్
దనుజునిచందము గనుఁగొను, మనమున వెసఁ బర్ణఘనము మాటుననుండెన్.

ఉ. అంత మహీకుమారి రభసాతిరయంబున వచ్చుదైత్యు న
ల్లంతనె చూచి శోకము భయంబును గోపము దీనభావము
న్వింతయుఁ బెన్గొనన్ మొగము వంచి ప్రవాతరయంబుచే వనా
భ్యంతరసీమయందు వడఁకాడెడుతీఁగెక్రియ న్వడంకుచున్. 446

క. విడివడనకచముల వెన్నును, గడువడి జఘనంబు మాటు గావించి రయం
బడరఁగ నూరుల నుదరం, బడంచుకొని యశ్రుపూరితానన యగుచున్. 447

క. కరములఁ బయోధరంబులఁ, బరువడిఁగప్పుకొని రామభద్రునిపాదాం
బురుహంబులు మదిఁ దలఁచుచుఁ, దరుణీరత్నంబు చాలఁ దలఁకుచునుండెన్.

—రావణుఁడు సీతాదేవిచెంతకు వచ్చుట.—

అంత దురాత్మం డగురావణుం డవ్వనవిలాసంబు లంత నంతఁ గనుంగొనుచు వరనారీసహస్రపరివృతుండై మందగమనంబునఁ గల్యాణగుణసమేతయైనసీతం జేర నరుగుదెంచి సముద్రమధ్యంబున విభిన్నయైననావపగిదిఁ బరశుఛిన్నయై భూతలపతిత యైనవనస్పతిశాఖలాగున ధూమకేతుగ్రహంబుచేతధూష్యమాన

యైనరోహిణీకరణి మంత్రాద్యభిభూతయై చుట్టుఁ జుట్టుకొని పడియున్నపన్నగాంగనకైవడి శీలవృత్తసంపన్నం బైనసత్కులంబునం బుట్టి విహితకర్మానుష్ఠానవతియై దుష్కులంబునం బాణిగ్రహణలక్షణసంస్కారంబు నొందుటం జేసి దుష్కులజాత యగుమానవతిపోలికిఁ బరిక్షీణ యైనమహాకీర్తిచాడ్పున విహతశ్రద్ధమాడ్కిఁ బరిక్షీణ యైనపూజవిధంబునఁ బ్రతిహత యైనయాశ తెఱంగున విధ్వస్తం బైనయాగామిఫలంబు సొబగునఁ బ్రతిహత యైనయాజ్ఞ చందంబున నుత్పాతకాలంబున దహ్యమాన యైనదిక్కులాగున నపహృత యైనపూజరీతి విధ్వస్త యైనపద్మినియట్లు హతశూర యైనసేనభంగిఁ దమోధ్వస్త యైనప్రభ యనువున నింకిననదిమాడ్కి నపవిత్రాభిహత యైనవేదిపద్ధతి శాంతి నొందిన పావకశిఖవడువున రాహుగ్రస్తేందుమండల యైనరాకానిశవైఖరి హస్తిహస్తపరామృష్టయై సముద్ధృతపత్రపద్మయై విత్రాసితవిహంగమయై కాలుష్యంబు నొందినపద్మినిసరణి రోధోభంగాదులచే నిర్జలీకృత యైననిమ్నగచొప్పునఁ గృష్ణపక్షరాత్రిక్రియఁ గరికరోద్ధృతయై సూర్యకిరణంబులం గమలినమృణాలికభాతి యూథపునిం బాసి స్తంభప్రతిబద్ధయై యూర్పులు పుచ్చుగజాంగనం బలెఁ జూపట్టుచు రామునిం బేర్కొని రోదనంబు సేయుచు మలమండనచిత్రాంగియై దుఃఖించుచు శోకంబునకుఁ దుదగానక నివ్వెఱపాటు నొందుచు ధ్యానశోకపరాయణ యై యొంటిఁ జిక్కి పరితపించుచుఁ బతిశోకాతురయై శుష్కించుచు నుద్వర్తనాదిసంస్కారహీనయై సౌకుమార్యంబు విడుచుచు నుపవాసకృశాంగియై తూలుచు శోకధ్యానభయంబుల నడలుచుఁ జింతావిశేషంబుల నిట్టూర్పులు పుచ్చుచు నిరానందయై చింతించుచు రామునియభ్యుదయార్థంబు తపంబు సేయుచు మదీయేప్సితంబు ఫలింపఁ జేయుండని దేవతలం బ్రార్థించుచు స్వశీలవృత్తంబులు రక్షించుకొనుచు రామునిసమాగమంబు గోరుచు రావణునిపరాభవంబు గాంక్షించుచు నేకవేణీధర యై యసంవృతమేదినిపయిం గూర్చుండి సంకల్పహయయుక్తంబు లగుమనోరథంబులచేత రాజకంఠీరవుం డగురామునియొద్దకుం జనుచున్నదానియట్లు గానంబడుచు రక్షకు నన్వేషించుచున్నదాని సుపక్ష్మతామ్రాయతశుక్లలోచన యగుదాని రామున కనువ్రత యగుదాని ననిందిత యగుదాని జానకి నవలోకించి దశకంఠుం డాత్మవధార్థం బద్దేవియందుఁ జిత్తంబు సేర్చి సాభిప్రాయంబు లగుమధురవాక్యంబుల నిజాభిప్రాయంబు తేటపడ నిట్లనియె. 449

రావణుఁడు సీతం జూచి దుర్వాక్యంబు లాడుట.

చ. వనరుహనేత్ర నన్నుఁ గని వారని భీతిఁ గుచోదరంబు నీ
యనువున దాఁప నేల ప్రియ మారఁగ నానన మెత్తి నన్నుఁ గ
న్గొని వెలయింప వేటికి మనోహరరూపిణి వైననిన్ను నె
మ్మనమునఁ గోరినాఁడ బహుమానపురస్సరదృష్టిఁ జూడుమా. 450

ఉ. మానవులైనఁ గాని యసమానభుజాబలయుక్తులైనయా
దానవులైనఁ గాని మఱి తప్పక నిర్జరులైనఁ గాని త
న్వీ నెఱి నీకు భీతి యొదవింపఁగ లేఁ డొకఁడైన నిచ్చటన్
జానుగ నీవు నావలనిసాధ్వసముం దొలఁగింపు మిత్తఱిన్. 451

చ. పనివడి బల్మిఁ బట్టి పరభామలఁ గూడి సుఖంచు టుర్విలో
దనుజులకు న్స్వధర్మ మది దప్పనరా దటులైన నేమి నీ
యనుమతి లేక పొందనది యంతయుఁ గన్గొని నీదుకామము
న్ననివడి మచ్ఛరీరమున బాగుగఁ జేర్పుము చింత యేటికిన్. 452

తే. ఈకరణి శోక మొందంగ నేల నీకు, మానినీమణి నీవు నామాట నమ్మి
భయముచింతయుమదిలోన బాయ బెట్టి, చెలగినాతోడ నెయ్యంబు సేయుమిపుడు.

క. హరిణాయతాక్షి మలినాం, బర ముపవాసంబు దీనభావము శోకం
బఱిమఱియు నేకవేణియు, ధరణీతల్పంబు నీకుఁ దగదు మృగాక్షీ. 454

చ. నళినదళాక్షి వేడ్క మెయి నన్ను వరించి విచిత్రభూషణం
బులును దుకూలచేలములు భూరిసుగంధిసుపుష్పచందనం
బులు శయనాసనంబు లతిభోగము లంచితనృత్యవాద్యము
ల్వొలుపుగ గానపానములు పొంది సుఖింపుము చింత యేటికిన్. 455

తే. అతివ స్త్రీరత్నమైతి వీ వంచితముగ, నింపుసొమ్ములు మేన ధరింపు మింక
నన్నుఁ బొందియు దివ్యమండనసుగంధ, ధారణ మొనర్పు కుండుటతగునె నీకు.

క. వినుము సుఖాస్పదమగు యౌ, వన మది కడచనిన వెనుక వలసిన మరలం
జను దేర నేర దెంతయు, వనజేక్షణ నిమ్నగాప్రవాహముభంగిన్. 457

క. మగువా నీసరి నెలఁతుక, జగములలో లేదు గాన స్రష్టయు నిన్నున్
జగతి సృజియించి పిమ్మటఁ, దగ నుపరతుఁ డయ్యెననుచుఁ దలఁచెద బుద్ధిన్.

క. ఘనసౌందర్యవయశ్శా, లిని వగునిను జూచి సంచలింపక యొవ్వాఁ
డను వందఁ గలఁడు సాత్త్వి, ద్వనజాసనుఁడైన వంతఁ దగులక యున్నే. 459

చ. లలనరో నీతనూగతవిలాసములం దగ నాటియున్నచూ
పులు మరలింప లేక వెతఁ బొందుచుఁ జేడ్పడి యున్నవాఁడ నీ
చలము పరిత్యజించి నను సమ్మతి నేలుము మామకోగ్రదో
ర్బలవిజితాహృతత్రిదశభామలలోపల నగ్రభార్యవై. 460

తే. ఏనుదోర్బలిభుజాబలం బెసఁగ నాజి, గెలిచి కైకొన్నముజ్జగంబులును మఱియు
నస్మదార్జితదివ్యరత్నాన్వితముగ, నీకొసంగెదఁ జేకొమ్ము నీరజాక్షి. 461

క. అతివా యుష్మజ్జనకునిఁ, జతురబ్ధిపరీతభూమిచక్రంబునకుం
బతిఁ జేసి లోకపాల, ప్రతిమునిఁ గావింతు నన్నుఁ బాలింపు మిఁకన్. 642

చ. మగువరో శౌర్యవీర్యమహిమంబుల నా కెన యైనవీరునిన్
జగముల నెందుఁ గాన నని సాహసవిక్రమరేఖ దోఁప నా

మొగమున నిల్వ లేగ సురముఖ్యధనేశయమాదులైన నా
యగణితదోర్విలాసవిధ మప్రతిమం బని చూడు మాత్మలోన్. 463

చ. అలికులవేణి నీ వరసినట్లుగ మూతనదీప్తకాంచనో
జ్జ్వలమణిహారపంక్తులును జారుదుకూలమున సుగంధిశీ
తలమృదుచందనంబు నెఱతావుల నీనెడుపుష్పమాలికల్
దొలఁగక దాల్చి నీవు కృపతో ననుఁ జేకొని ప్రోవు మంగనా. 464

చ. నిరుపమశక్తి నాయొనఁగు నిత్యసుఖంబులు పొందు మింక నీ
గురుతరవాసితాసవముఁ గ్రోలి రమింపుము నన్ను గూర్చి భా
సురముగ గంధమాల్యములు సొమ్ములు దాల్పు మలంకృతాంగివై
వఱలెదునిన్నుఁ జూడఁ గడు వాంఛ మనంబునఁ బుట్టె నంగనా. 465

తే. పుడమి యైనను ధనమైనఁ బువ్వుఁబోఁణి,వలయువారల కొసగు మవ్వారిగాఁగఁ
బ్రీతి నాయందుఁ జేగ్నము విశ్వసించి, యడుగ వలసినవస్తువు లానతిమ్ము. 466

చ. ఘనతరసుప్రసాదమునఁ గ్రక్కున నీవు సుఖించుచుండ నీ
జనకుఁడు నీదుబాంధవులు సమ్మతితోడ సుఖింతు రుర్వరా
వనితరొ నన్ను నాకుఁ గలవైభవము న్సిరియు న్సమృద్ధియు
న్వినుతయశంబు బాహుబలవిక్రమ మంతయుఁ జూడు మెంతయున్. 467

చ. అనుపమభోగభాగ్యమహిమాప్తిసమర్థుఁడ నైన నన్నుఁ గై
కొనక సమస్తసంపదలు గోల్పడి తాపసవేషధారియై
వనమున నాకలమ్ము దిని వంతల నొందుచు నున్నవాని రా
ముని నతిదీనమానవుని భూతనయా మదిఁ గోర నేటికిన్. 468

చ. జనకజ నీ హృదీశుఁ డనుజన్మయుతంబుగ నింత కెన్నఁడో
వనమునఁ జచ్చియుండుఁ బలువంత లిఁ కేటికిఁ గాక యుండిన
న్వననిధి దాఁటి రాఁగలఁడె వాఁడిట వచ్చిన నన్ను నేగతిన్
జెనకి జయించు నాజి ననుఁ జేరఁగ నోపునె ముజ్జగంబులున్. 469

క. అనువుగ నిచ్చట డాఁచిన, నిను నేర్పునఁ జూడలేఁడు నీవల్లభుఁ డో
వనిత సబలాకమేచక, ఘనపటలపరీత యైన కౌముదిని బలెన్. 470

క. సురపతికరగతభార్యను, నెఱిఁ గాంచనకశిపుఁ డొందనేర్చినక్రియ న
త్కరగత వగునిను రాఘవ, ధరణీవిభుఁ డొందలేఁడు తథ్యము తన్వీ. 471

తే. చారునేత్ర విలాసిని చారువేణి, చారుజఘన చారుస్మిత చారుకేళి
పక్షినాథుఁడు సర్పంబుపగిది నాదు, చిత్తము హరించితివి వేయి చెప్ప నేల.

తే. అతివ కృశవయ్యు ననలంకృతాంగి వయ్యు,మలినసంవీత వయ్యు నామదికి వేడ్క
గడలుకొనఁ జేసెదీవు ని న్గని స్వభార్య, లందు ననురక్తి విడిచితి నిందువదన.

క. అంతఃపురగత లగుమ,త్కాంతల కందఱ కభీష్టదాయిని వైన

న్నంతయు రతులం దేల్పుము, కంతునిచెద్దుముల నింకఁ గందక యుండన్.
క. మనమున నొండు దలంపక, ననుఁ బ్రీతి భజించి తేని నాసుందరు తే
పున భక్తి నిను భజించెద, రనిశము నచ్చరలు లక్ష్మి నట్లు మృగాక్షీ. 475
క. బాలామణి ననుఁ గైకొని, హాలాయము సకలసౌఖ్య వైభవయుతవై
యీలంకను నీసంపద, లీలోకము లీసమస్త మీవేలు మికన్. 476
క. ధనమున బలమున విక్రమ,మునఁ దపమున మఱియుఁ దేజమున భూరియశం
బున సౌభాగ్యంబున నా,కెనయే నీవిభుఁడు నొల్ల వేటికి నన్నున్. 477
క. ధర నేలుము విహరింపుము, పొరిఁబొరి భోగముల నెల్ల భుజియింపుము భా
సురధనము లిచ్చగింపుము,సురఁ గ్రోలుము నన్నుఁగూడి సుఖియింపు మికన్.
వ. మఱియుఁ గుసుమితతరుజాలసంతతంబులును భ్రమరగీతసన్నాదితంబులును రమ ణీయలతాతతసంకులంబులు నగుసముద్రప్రాంతకాంతారంబుల నన్నుం గూడి లీలావినోదంబుల విహరింపు మని యిట్లు కర్ణకఠోరంబుగాఁ బలికిన రాక్షసుం డగురావణునివచనంబులువిని దీనవదనయు దుఃఖార్తయు వేపమానయు నార్త స్వరయుఁ దపస్వినియు నగుజనకనందని పరిశుద్ధం బగుతనమనంబున రాముని దలంచుచు రావణునితోడ సాక్షాత్సంభాషణం బనర్హం బని యొక్కతృణ ఖండంబు తన కడ్డంబుగాఁ బట్టుకొని మెల్లన రావణున కిట్లనియె. 479

## సీత రావణుని దూఱుట.

తే. దనుజపాంసన నామీఁదిమనసు విడువు
మెలమిఁ జిత్తంబు స్వజనమం దిడుము ఖలుఁడు
మోక్షసంసిద్ధినిం బలె మొనసి నన్నుఁ
గవియఁ గోర నర్హుండవు గావు నీవు. 480
తే. పుడమిలో సత్కులంబునఁ బుట్టి సత్కు
లంబు సొచ్చి రామునకుఁ గరంబు ధర్మ
పత్నినై సాధ్వి యనఁ బెంపుఁ బడసి యిట్టి
నీచకార్యంబు గావింప నేర్తు నటర. 481
వ. అని పలికి యద్దేవి పరాఙ్ముఖియై వెండియు రావణున కిట్లనియె. 482
క. దురితాత్మక పరసతినై, వఱలెదు నే నీకు యుక్తభార్యను గా నీ
దురితోక్తు లాడ నలవదు, చరియింపుము బుద్ధి గలిగి సాధువ్రతమున్. 483
సీ. సాధువృత్తి మెఱింగి చాపల్యమున నన్యరమణుల పొందుగోరకుము నీవు
నీసతి నీ కెట్లు నెఱి రక్ష్యయౌ నట్లు నన్యులకును రక్ష్య లట్లు గాన
నిను నీవెయుపమగాఁగొని స్వదారలయందుఁ బరితుష్టి నొందుము ప్రాభవమునఁ
దన గేహినులయందుఁ దనియనిచపలునిఁ జలితేంద్రియుని దుర్విచారపరుని

తే. గాంచి సతులు వాని పంచతఁ గాంక్షింతు, రింత దుర్విచారమేల గలిగెఁ
గులము బంధుజనులుగూలు టింతియె కాక, చేకొనంగ నీకుఁ జెల్లు నటర. 484

సీ. ఓరి దురాత్మ యిందు బుధు లుండరొ యుండిన నీవు వారలం
జేరవొ సాధువాక్యములు చేకొన నొల్లవొ శిక్ష లేమి నా
చారవిహీన మై సకలసజ్జనగర్హిత మయ్యె నీమతం
బారయ నీకతంబున నిశాటకులంబు చెడు న్నిజంబుగన్. 485

ఉ. అకృతాత్ముం డనయజ్ఞుఁ డైన నృపుచే నర్థంబు లీరాష్ట్రముల్
సుకృతంబుల్ హితబంధువర్గము నశించు న్గాన నిన్బొంది త
క్కక నీబుద్ధి కృతాపరాధమున లంకాపట్టణంబు న్సహా
న్నికరంబుం దనయు ల్నశింపుదురు పో నిక్కంబు శీఘ్రంబుగన్. 486

ఆ. అవని స్వకృతదోషహాన్యమానుఁడు నన్య, కాముకుండుఁ బాపకర్ముఁ డైన
నృపతిసురణమందు నేర్పుతో నిఖిలభూ,తోత్కరంబు మోద మొందుచుండు.

క. విను మట్లుగాన దైవిక, మున రౌద్రం బైన సంక్రిముఖుఁ డీవ్యసనం
బునఁ జిక్కినటులె కావలె,నని విమతులు నిన్నుఁగూర్చిహర్షింతు రొగిన్. 488

క. సిరిఁ జూపి నన్ను లోఁబడఁ, బఱచెద నని చూచె దేమొ భానుకులునిపైఁ
దిరముగ నామది పాయదు,తరణిం బాయనితదంచితప్రభభంగిన్. 489

ఆ. లోకనాథుఁ డైన కాకుత్స్థవిభునిస,త్కృతభుజంబు నాశ్రయించి బ్రతుకు
నట్టియేను నీచుఁ డైనయన్యనిభుజ, మసుర యెవ్విధమున నాశ్రయింతు. 490

తే. సువ్రతస్నాతుఁ డతిపరిశుద్ధుఁ డైన
విప్రు నెడఁబాయఁ జాలనివిద్యకరణి
ననిశ మెడఁబాయ కే నామహానుభావునకు
నాపయికభార్య నగుదు దుష్టాసురేంద్ర. 491

క. వశబద్ధ యైనకరిణిని, గొనకొని యూథపునితోడఁ గూర్చినభంగి
న్దనుజాధమ దుఃఖిత నగు, నను గూర్పుము బుద్ధి గలిగి నాథునితోడన్. 492

క ఘోరవధ మిచ్ఛగింపక, వారక రాక్షసవిభుత్వ వైభవ మాత్మన్
గోరిన మద్విభుతో నయ,మారఁగ మైత్రి యొనరించుటది యుక్తమగున్. 493

క. శరణాగతరక్షకుఁడును, బరమదయాళుండు భక్తవత్సలుఁ డాభూ
వరుని శరణంబు నొందుము, ధరలోపల నీవు బ్రతుకఁదలఁచితి వేనిన్. 494

క. మతి గల్గి వినమ్రుఁడవై, చతురుం డగుపతికి నన్నొసఁగి వెస శరణా
గతుఁడ వగు మా ర్తరక్షా,వ్రతుఁ డగునవ్విభుఁడు నిన్ను రక్షించుఁ దగన్. 495

చ. బ్రతుకు దలంచితేని నను రామున కిచ్చి వినమ్రబుద్ధివై
బ్రతుకుము గాక దక్కినఁ దిరంబుగ నమ్మహనీయకార్ముక
చ్యుతయమరాట్కటాక్షతులితోగ్రనిశాతశిలీముఖంబు లు

ద్ధతి భవదుత్తమాంగములఁ దప్పక వే పడఁ గూల్చు నుర్వరన్. 496
క. వర్జించు నింద్రవజ్రము, వర్జించు జముండుఁ జిరము వసుధాపతి యా
దుర్జయుఁడు రాఘవుం డని వర్జింపఁడు నిన్నుఁ బోటివాని నలిగినన్. 497
క. బలవైరివిసృష్టం బగు, కులిశనినాదమునుబోలె గుండె లవియ ను
జ్జ్వలరామధనుశ్శబ్దము, పలలాశన వినియె దీవు పటుయుద్ధమునన్. 498
తే. రామలక్ష్మణలక్షణభీమవేగ, కంకపత్త్రశరంబు లీలంకమీఁదఁ
గాలపన్నగములలీల వాలి రాత్రి, చరులఁ దునుమాడి నిరవకాశముగఁ జేయు.
తే. ప్రబలుఁ డగురామగరుడుండు రాక్షసేంద్ర
దారుణాహుల నిర్జించి తడయక నను
వేగ గొనిపోవుఁ దార్క్ష్యుండు విషధరములఁ
బొనఁగ నిర్జించి సుధఁ గొనిపోయినట్లు. 500
క. మును హరి త్రివిక్రమంబుల, దనుజుల నందఱ వధించి తప్పక లక్ష్మిం
గొనినక్రియ రాఘవుఁడు నిను, గొనకొని మర్దించి నన్నుఁ గొనిపోవు వడిన్.
తే. దానవాధమ యలజనస్థానవాసు, లైనరాక్షసు లంద ఱట్లాజి మడియ
శక్తిఁ జాలక నీ విట్లుచౌర్యవృత్తిఁ, బట్టి ననుఁ దెచ్చి తిది నీకు బంటుఁదనమె.
సీ. రామలక్ష్మణులు దూరమున కేగినవేళ మ్రుచ్చిలి నను నీవు దెచ్చి తిట్లు
శార్దూలములమ్రోల శ్వానంబు కడిమిమై నిలువనేరనిమాడ్కి నృపకులావ
తంసకు లైనయా దాశరథులమ్రోల నీవు ధైర్యంబున నిలువ లేవు
పొసఁగ వృత్రునియేకభుజము దేవేంద్రుని భుజయుగళంబుతోఁ బోరి గెలువ
తే. లేనిచందాన నీవామహానుభావు, లైనరఘుకుంజరులతోడఁ బూని ఘోర
సంగర మొనర్చి గెలువంగఁజాల వరయఁ, గర్బురాధమ యీవృథాగర్వ మేల.
క. దనుజాధమ మన్నాథుం, డనుజన్మసహాయుఁ డగుచు నంబకములచే
నినుఁ షల్వసలిలమున్బలె, ననిలో నీజీవితంబు హరియించు రహిన్. 504
క. అనిమిషజగమున కేగిన, మునుకొని పాతాళలోకమునకుఁ జనిన రా
మనరేంద్రుఁడు నిను విడువఁడు, విను మశనియుఁ గాలనిహితవృక్షమునుబలెన్.
వ. అని పలికినఁ బరుషంబు లగుసీతావచనంబులు విని రాక్షసాధిపుండగురావణుం
డి ట్లనియె. 506
ఉ. వారిజగంధు లెంత మగవారల దూఱిన ముఖ్యకామతం
గోరిక లొందువార లయి కోపముఁ బూనరు గాన నట్లు నీ
వీరస మెత్తి మ్రోల ననునెంత దురుక్తులఁ దూల నాడిన
న్నారసనేత్ర నే నలుగ సమ్మతితో నినుఁ గూడువాఁడ నై. 507

రావణుఁడు సీతాదేవిని బుజ్జగించుట.

వ. అదియునుం గాక. 508

చ. నరవరపుత్రి ఘోరమదనవ్యసనంబునఁ గుందుచుండియు
న్బురుషులు వేఁడ వచ్చిన సముద్ధతిఁ గా దనుమాట లాడుట
ల్తరుణులకు న్స్వభావ మది తప్పనఁగూడ దెఱింగి కాదె నీ
పరుసఁదనంపుమాటలకుఁ బల్కక యోర్చినవాఁడ జానకీ. 509

తే. కాంత నీమీఁదఁ బొడమినకామ మిపుడు
తెగువమైఁ గ్రోధమును బట్టి తిగుచుచున్న
దరయ సూతుండు వెరువునఁ దెరువుఁబట్టి
తీవ్రగతి నేగుహయములఁ దిగిచినట్లు. 510

ఉ. ఏ మని చెప్పవచ్చు నది నెంచక నీ విపు డన్నమాటకుం
గామిని జంతుసంతతికిఁ గామ మొగిం బ్రతిబంధకంబు త
త్కామముఁ జేరినట్టి ప్రియకాంతలపై ననుకంప మోహము
న్బ్రేమయు మార్దవంబును జనించు జనింపదు గిన్క గావునన్. 511

—— రావణుఁడు తన్ను రెండుమాసములలో వరింపవలయునని సీతకుఁ గట్టడ సేయుట. ——

తే. కపటమునివృత్తిఁ గైకొని కాననమున, కరుగుదెంచినమనుజపై నాశ గిలిగి
యున్ననిన్ను వధోచిత నొడిసి పట్టి, సాహసంబున వధియింపఁ జాలనైతి. 512

క. కావరమున నిట్లాడం, గావచ్చునె యెంత వాఁడిగలిగిన నీకు
న్నీవన్నమాటలకు నిపు, డోవనితా ఘోరవధము యుక్త మగు నిటన్. 513

వ. అని పలికి రాక్షసాధిపుం డగు రావణుండు వెండియుఁ గ్రోధసంరంభసంయుక్తుం
డై సీత నవలోకించి యి ట్లనియె. 514

చ. పడఁతిరొ యెంత న న్నిగిలిపల్కిన నిప్పుడు నిన్నుఁ జంప కేఁ
గడువడి రెండుమాసములు కట్టడ చేసితి నంతలోన నీ
వడుగక మున్న నన్గలసి యర్థి సుఖించిన నుంచి దంత కీ
వొడఁబడ వేని ని న్గలిదియోగిరమయ్యెడున ట్లొనర్చెదన్. 515

వ. అని తర్జించి పలికిన నతిభీత యగుసీతం జూచి చుట్టు నున్న దేవగంధర్వకన్యలు
విషాదించుచు రావణునిభయంబునఁ దత్ప్రకారంబు బయలుపడకుండ నోష్ఠ
ప్రకారంబుల ముఖనేత్రసంజ్ఞల నాశ్వాసింప నద్దేవి రావణుంగనుంగొనివృత్త
శౌండీర్యగర్వితం బగువాక్యంబున ని ట్లనియె. 516

క. ఇం దెవ్వాఁడును నిన్నీ, నిందితకర్మంబువలన నెఱిఁ ద్రిప్పఁగ లే
నందున నీశ్రేయమును మ, దిం దలఁచెడువాఁడు లేఁడు దివిజవిరోధీ. 517

—— సీత రావణునిఁ దర్జించుట. ——

క. బలరిపుసన్నిభుఁ డుర్వీ, వలయాధిపుఁ డైనరామవల్లభ నగున
న్నిల నెవ్వఁ డైనఁ గోరునె, కలుషాత్ముఁడ వైననీ వొకండవు దక్కన్. 518

తే. దానవాధమ యమితప్రతాపుఁ డైన, యలరఘూత్తముప్రియసతి నైననన్ను
శాపములు పల్కి తింక నా భానువంశ, తిలకుచేఁ జావ కెందుఁబోఁగలవు నీవు.
తే. జనవిభుఁడు సామజము నీవు శశక మిరువు, రాజిఁ గావింపఁ దలపడు టది దలంపఁ
దొడరి వనమున గంధసింధురము శశక, మని యొనర్పంగఁ దలకొనినట్లు గాదె.
ఉ. అచ్చుగ నావిభుండు మృగయారతి దవ్వుల కేగఁ జూచి న
న్ముచ్చిలి తెచ్చి నాయెదుట నోటికి వచ్చినయట్లు బంటవై
చెచ్చెర రాము నుగ్రరణసీమ రయంబునఁ ద్రుంతు నంచు నీ
విచ్చట సిగ్గుమాలి వచియించుట కెంతయుఁ జిత్ర మయ్యెడిన్. 521
తే. దానవాధమ మద్విభుం డైన రామ, భద్రుచక్షుష్పథంబునఁ బడితివేని
యపుడె నీకుఁ దద్విక్రమ మంత దెలియుఁ, దప్పి వచ్చితి వీఁక నైనం దలఁగ లేవు.
క. మానవపతిపై నిత్యము, జానుగ నత్యంతభక్తి సలిపెడు నన్నో
దానవ పాపము లాడెను, నీనాలుక దునిసిపడదె నిజముగ నింకన్. 523
తే. ఉత్తమస్త్రీల వీక్షింపనోడ వీవు, భీకరాకారములు కృష్ణపింగళములు
నీచములు నైన నీఘోరలోచనంబు, లోరి దుష్టాత్మ పుడమిపై నూడి పడవె.
తే. ధవుని యానతి లేకున్కి ధర్మమునకు, హానివాటిల్లునో యని యాత్మ వెఱచి
నిన్ను శపియింప నైతిఁ గాకున్న భూరి, తేజమున నీఱు సేయనే దివిజవైరి. 525
క. నీవధము కొఱకు నీవిధి, దైవముచే విహిత మయ్యెఁ దగ నింతియె గా
కో విమత నన్నుఁ గైకొన, నీవశమా తప్పదింక నీవధ ముర్విన్. 526
క. ధనదున కనుజుఁడ వై బల, మున నధికుఁడవై ప్రవీరముఖ్యుఁడవై రా
ముని డాఁగురించి ముచ్చిలి, గొని తెచ్చితి వేల నన్నుఁ గ్రూరచరిత్రా. 527
సీ. పంక్తికంధర రామబాణపాథోరాశి నిను దీవికై వడి నేఁడు ముంచు
దశకంఠ రామాభిధానపంచాస్యంబు నిను గజేంద్రము భంగిఁ దునిమివైచు
రాక్షసాధమ రఘురామసుత్రాముండు కొండవై ఖరి నిన్నుఁ గూలవైచు
రావణ రామాఖ్యరాజీవబంధుండు మంచుకై వడి నిన్ను మాయఁ జేయు
తే. దైవతవిరోధి రాఘవతార్క్ష్యవిభుఁడు, సర్పమును బోలె నిన్నాజిఁ జంపివైచు
నెదిరిఁ దన్ను నెఱుంగక యింతలోన, వడిచిపడ నేల నీకు దుష్టాసురేంద్ర.

రావణుఁడు సీతతోఁ బరుషంబు లాడుట.

వ. అని పలికినఁ గ్రూరంబు లగు సీతావాక్యంబులు విని రావణుండు వికటభ్రూకు
టిదుర్నిరీక్షుండును నీలజీమూతసంకాశుండును మహాభుజశిరోధరుండును సింహ
సత్త్వగమనుండును దీర్ఘజిహ్వాగ్రలోచనుండును జలాగ్రమకుటప్రాంశుండును
చిత్రమాల్యానులేపనుండును రక్తమాల్యాంబరధరుండును దప్తాంగదవిభూష
ణుండును గల్పవృక్షసంకాశుండును వసంతసమానుండును శ్మశానచైత్యప్రతి
ముండు నై యున్మత్తోత్పాటితసద్ధభుజంగం బైన మందరాచలంబుం బోలె నతిరమ

ణీయ మేచకశ్రోణిసూత్రపరివృతుండై యలరుచుఁ గాంచనకేయూరవిరాజితభుజయుక్తుండై సువర్ణశృంగసంగతం బైననీలాచలంబు కరణిఁ జూపట్టుచు మణిస్యూతతరుణాదిత్యవర్ణకుండలమండితుండై సంఫుల్లరక్తపల్లవపుష్పవిరాజతాశోకతరుషండమండితం బైనసుమహానగంబుపగిదిం బొల్చుచు మహాసర్పంబుపగిది నూర్పులు పుచ్చుచుఁ గోపసంరక్తనయనంబుల వై దేహి నిరీక్షించి యుపగతసామ్రాజ్యం డై యన్యాయంబున వనంబునకుం జనుదెంచి దారిద్ర్యంబున నవియుచున్నహీనమానవునిం బెండ్లిజేసికొని సర్వసంపత్సమృద్ధియుక్తుం డైననన్నవమానించితివి సూర్యుండు నిజతేజంబున సంధ్యం బోలె నిన్ను నాశంబు నొందించెదఁ జూడు మని తర్జించుచు సీతకుం గావలి యున్నరాక్షసస్త్రీల నవలోకించి. 529

ఆ. భేద మాడి యైన బెదరించి యైనను, సామదానయుక్తి నలిపి యైన
బుజ్జగించి యైన బోధించి యైనను, మంచి నైనఁ గోపగించి యైన. 530

క. మీరందఱ జేకయతులై, వారక యీతరుణి నాకు వశగత యగు టె
ట్లారీతిఁ జేయుఁ డెంతయు, మాఱాడిన నత్తెఱంగు మాకుం జెప్పుఁడీ. 531

ధాన్యమాలిని రావణు ననునయించుట.

వ. అని పలికి వెండియుఁ బ్రచండకోపంబున జడీనుఁడై వడుచుఁ గామమన్యుపరీతాత్ముండై రావణుం డాసీతఁ గదియు నెడ ధాన్యమాలిని యడ్డంబుపచ్చి రావణుం బరిష్వజించి యి ట్లనియె. 532

క. మనుజాంగనయు వివర్ణయు, ననుకూలత లేక పెనఁగు నతిదీనయు నీ
వనితయెడ మోహ మేటికి, ననుఁ గూడి సుఖంపు మసురనాయక చెలిమిన్.

తే. చిత్త ముబ్బఁగ నినుఁ బొంది యుత్తమంబు
లైనధనదివ్యభోగంబు లనుభవించు
నంత భాగ్యంబు దయ సేయఁ డయ్యెఁ బద్మ
గర్భుఁ డీమర్త్యకాంతకుఁ గర్బురేంద్ర. 534

క. ప్రతికూల యైనయువతిని, మతిఁ గోరినవాని కగు శ్రమం బనిశంబు
న్బ్రతికూల గానియువతిని, మతిఁ గోరినవాని కబ్బు మహితసుఖంబున్. 535

వ. అని బోధించిన నద్దానవివచనంబులఁ గోపం బడంచుకొని యల్లన నవ్వుచుఁ బాదవిన్యాసంబున మహీతలంబు కంపింప రాక్షసస్త్రీపరివృతుండై మరలి జ్వలద్భాస్కరవర్ణం బయినని జగృహంబునకుం జనియె నతనిఁ బరివేష్టించి దేవగంధర్వనాగకన్యలు వానిదౌరాత్మ్యంబునకు మనంబునం గలుషించుచు నంతఃపురంబునకుం జని రంత నద్దశకంఠనియుక్త లైననక్తంచరభామినులు లందఱు జనకనందనిం జేర నేతెంచి వదనంబులం గోపంబు చెంగలింపఁ బరుషవాక్యంబు లాడుచు ని ట్లనిరి. 536

రాక్షసస్త్రీలు సీతను రావణు వరింపు మని బోధించుట.

క. తలలు పది గలుగువాఁ డల, పులస్త్యమనుమండు దనుజముఖ్యుఁడు విభవో
జ్జ్వలుఁ డీరావణుఁ డితనికి, లలనామణి భార్యగాఁ దలంప వదేలా. 537

వ. అని పలుక నం దేకజట యనురాక్షసి క్రోధతామ్రాక్షి యై కరతలోదరి యగు సీత కి ట్లనియె 538

చ. తడయక సృష్టికర్త యగుధాతకు నాలవపుత్రుఁ డై పుల
స్త్యుఁడు జనియించె నాతనికి సొంపుగ విశ్రవుఁ డబ్జగర్భతు
ల్యుఁడు దగఁ బుట్టె నమ్మునికులోదధిచంద్రునకుం గుమారుఁ డై
పొడమె సమస్తరాత్రిచరపూజ్యుఁడు పంక్తిముఖుం డుదగ్రుఁ డై. 539

క. నాలవబ్రహ్మ దలంపఁగఁ, బౌలస్త్యుఁడు గాన నీకుఁ బతిగాఁ దగఁడే
చాలఁగ నామాటలు విని, పౌలస్త్య వరించి భోగభాగిని వగుమా. 540

వ. అనినఁ గ్రోధంబు పెంపున మార్జాలనేత్రసదృశంబు లగుతననేత్రంబులు విచ్చి హారిజట యనురాక్షసి యి ట్లనియె. 541

క. ఎవ్వఁడు నిజభుజబలమునఁ, జివ్వకు రాఁ దిగిచి యముని జిష్ణుని నురలం
గ్రొవ్వణఁచె నట్టిరావణు, జవ్వని వరియించి మేటిసౌఖ్యముఁ గనుమా. 542

వ. అనిన రూక్షేక్షణంబుల నిరీక్షించి భీషణోక్తులఁ దర్జించుచుఁ బ్రఘస యను రక్కసి యి ట్లనియె. 543

సీ. జర లేనియౌవనసౌకర్యమున నొప్పు బృందారకస్త్రీల పొందు రోసి
తేటమాటల ముద్దుపాటలఁ గరఁగించు గంధర్వసతులసాంగత్య ముడిగి
సౌకుమార్యము బంధచాతుర్య మొప్పారు పన్నగాంగనలసంబంధ మెడలి
కఠినరతుల మదిగరఁగించి మరగించు దైత్యభామలపొందు దలఁగఁ బెట్టి

తే. జనకసుత మర్త్యభామిని వసక నిన్ను, గఱిత లంవఱకన్నఁ జక్కని వెలంది
వనుచు దశకంధరుఁడు ప్రీతి నాశ్రయించె, నతని వెలయింప కిట్లుండఁ దగు నెనీకు.

వ. అనిన వికటభ్రూకుటిదుర్నిరీక్ష యై వికట యనురాక్షసి యి ట్లనియె. 546

చ. అనిమొన శ్రీదశక్రవరుణాదికు లెవ్వని కోడి భృత్యులై
యనవరతంబు నూడిగము లర్థి నొనర్చుచు నుందు రాసహ
స్రనయనవైరి రావణుఁడు సమ్మతి నంజలిఁ జేసి వేఁడఁ గై
కొని వెలయింప కిట్లు ప్రతికూలము లాఁడగ నీకుఁ జెల్లునే. 547

వ. అనిన దుర్ముఖ యనురాక్షసి యి ట్లనియె. 548

సీ. ఎవ్వానిభయమున నినుఁ డెండ గాయఁడు వేడ్కతోఁ బవనుండు వీవ నోడు
జలదంబు లెవ్వాని కులికి యింపారంగ సురుచిరతోయముల్ గురియుచుండుఁ
బటుగతి నెవ్వానిభయమునఁ జుక్కలరాయఁడు వెన్నెలకాయ వెఱచు
నెవ్వానిదెస భీతి నింపారఁ బావకుం డేపుతోఁ దనవేఁడిఁ జూపఁజాలఁ

క. జెవ్వనికి బెగ్గలం బంది యెల్లతరులు, సురభిపుష్పవర్షంబులు గురియుచుండు
నిట్టిరావణు వరియింపనేల యొల్ల, వేము నీకుఁ జెప్పినబుద్ధు లేల వినవు. 549
అనియె నంత రాక్షసభామ లందఱుఁ గోపాటోపంబున సీత నవలోకించి నీవు
సర్వభూతమనోహరంబును మహార్హశయనోత్తమంబు నగునంతఃపురంబున వసి
యింప నేల యొల్లవు బలహీనుం డైనమర్త్యునకుం బత్నివై న నేమి సుఖం బను
భవించెదవు రాముని మీఁదిచిత్తంబు విడువు మతనికి నీకును సమాగమం బెన్నటి
కిని గలుగదు త్రైలోక్యవసుభోక్తయైనరావణుం జేకొని యథాసుఖంబుగ విహ
రింపుము రాజ్యభ్రష్టుండును ధనహీనుండును నసిద్ధార్థుండును విక్లబుండు నగు
రామునిం గోరనేల నీయట్టిరూపవతికిం దగినపురుషుండు దొరకొనుట భాగ్య
వశంబునం గాదె యని పలికిన విని బాష్పాకులలోచన యగుచు వైదేహి వారల
కిట్లనియె. 550

సీతాదేవి రాక్షసస్త్రీలవచనంబులఁ దిరస్కరించుట.

మీ రెంత వెరవుఁ గఱపిన, దారుణమును లోకనిందితం బగుకార్యం
బారయ నాచిత్తంబునఁ, దూఱునె పతి విడిచి పరునితోఁ గూడుదునే. 551
క. రనలో మనుజాంగన రాక్షసునిం బతిగా వరింపఁగాఁ దగ దింక
న్వెన నన్నుఁ బట్టి మెసవిన, మెసవుఁడు నే వినఁగ నొల్ల మీవచనంబున్. 552
సీ. నాని జేశుఁడు రాజ్యవిహీనుఁ డైన, మానవుం డైన ముని యైన దీనుఁ డైన
నెట్టివాఁ డైనఁ గాని నా కేమి యెగ్గు, సతత మనురక్త నైతి నా సత్యధృతికి.
ఇంద్రుఁ బులోమజ యినుని సువర్చల నగరుఁ గేశినియు నైషధుని భైమి
తగ వసిష్ఠుని నరుంధతి భార్గవుం డైన చ్యవను సుకన్యక సత్యవంతు
సావిత్రియును మఱి చంద్రుని రోహిణి సౌదాసు మదయంతి శంభు గౌరి
కపిలుని శ్రీమతి కలశసంభవుని లోపాముద్ర కంజాతభవుని వాణి
తే. పగిది నేను నిరంతరభక్తితోడ, రఘుకులాబ్ధిరాకాచంద్రు రామచంద్రు
వేడ్క నెడఁబాయ కెపుడు సేవించుదాన, నరయఁ కిటు నన్నుఁ బాపంబు లాడనగునె.
వ. అని పలుక నత్తలోదరిచిత్తంబు నిజమతాయత్తంబు గాకునికి నతిక్రోధగూఢేక్ష
ణలై రాక్షసభామలు బొమలు ముడివడఁ గటము లదర సందష్టదశన లగుచు
సర్వలోకవిద్రావణుం డైనరావణు నేల యొల్లవని పరుషోక్తుల భర్జించుచు ఖడ్గ
పరశుపట్టిసప్రాసాదు లంకించి శింశుపాతరుమూలంబున కరుగుదెంచి విటపిపర్ణం
బులనడుమ నొదిఁగియున్న హనుమంతుం డేమియుఁ బలుకక వినుచుండ నుగ్రాకా
రలై కదియ నమ్మహీనందన గడగడ వడంకుచుఁ గన్నుల బాష్పజలంబులు
గ్రమ్ముదేర నేడ్చుచు నాశింశుపాతరుమూలంబుఁ జేర నేతెంచి యుండె వెండి
యు రాక్షసాంగన లందఱుఁ దర్జనభర్జనోక్తుల గర్జించుచుండ నప్పుడు విషణ్ణ
వదనయై నివ్వెఱపడి యున్నసీతం జూచి భీమదర్శనయుఁ గరాళయు నున్నతో
దరియు నగువినత యనురాక్షసి యతి కుపితయై యి ట్లనియె. 555

### రాక్షసస్త్రీలు సీతను దర్జనోక్తుల బెదరించుట.

తే. అరయ నీచేఁ బతిస్నేహ మంత మాకుఁ
గాంత యిచట దర్శిత మయ్యె నింతె చాలుఁ
గడఁగి యతిమాత్రకృతము దుఃఖంబుకొఱకుఁ
గల్పితం బగు నింత నిక్కంబు జువ్వె. 556

క. జనకజ నీమాటలు విని, మనమునఁ బరితుష్టనైతి మనుజేశునిపై
మన సుడిగి పథ్య మగుమ,ద్ఘనతరవాక్యం బొనర్పఁ గడఁగుము ప్రీతిన్. 557

చ. కృపణు నధీరు మర్త్యు ధనహీనుని రాముఁ బరిత్యజించి దే
వపతినిభు న్శ్లాఘ్య ధనవంతు సమర్థునిఁ ద్యాగశీలునిం
దపనసమాన తేజుఁ బ్రియదర్శను నుత్తమరూపవంతు దై
త్యపతిని బంక్తికంధరునిఁ దద్దయు వేడ్క భజింపు మిత్తఱిన్. 558

క. లీలం బ్రసూనమాలా, చేలాభరణాంగరాగశృంగారిణివై
బాలామణి యిది మొదలుగ, నీలోకంబులకు నెల్ల నీశ్వరి వగుమా. 559

క. వనమున జీవము విడిచిన, మనుజునిపై మమత యేల మానిని దేవేం
ద్రునకు శచి హరికి రమ శం,భున కుమ యనిలునకు స్వాహాపోలికి నీవున్. 560

క. రాక్షసవంశాధిపునకు,దక్షుత సతి వగుము గాక తక్కిన నిన్నున్
రక్షోవనితలు వ్రేల్మిడి, భక్షించెద రీక్షణంబ పటురోషమునన్. 561

వ. అనియె నంత లంబమానపయోధర యగువికట యనురక్కసి ముష్టిం బూన్చి గర్జించుచుఁ గోపాటోపంబున నిట్లనియె. 562

తే. ఇందువదన దశాననుఁ డింతదనుక, నప్రియము లైననీమాట లాలకించి
కరుణ పెంపున మార్దవగరిమఁ జేసి, యుదిసహించినవాఁ డింకఁ బదర వలదు.

క. పరులకు దుర్గాసదం బగు,శరనిధిమధ్యమునఁ బొల్చు చటులనిశాటా
కరఘోరరావణాంతః,పురమునఁ జిక్కితివి యెందుఁ బోయెద వింకన్. 564

క. రావణమందిరమున నెం,తే వలనుగఁ జిక్కియున్నని న్నిఁక నాకా
ద్దేవాధీశ్వరుఁ డైనను,గానఁగ శక్తుండె మేము కావలి యుండన్. 565

ఉ. కన్నుల శోకబాష్పములు కాల్వలు గట్టఁగ నేల యేడ్చెదో
సన్నుతగాత్రి శోకము విషాదము దైన్యము వీడి వేడ్కతోఁ
బన్నుగ నస్థిరం బయిన ప్రాయ మతీతము గాక మున్నె నం
పన్ను దశాస్యుఁ గూడి మగువా విహరింపు యథాసుఖంబుగన్. 566

క. తరుణీసప్తసహస్రము, లొఱవుగ నినుఁ గొల్వ మంజులోద్యానమున
న్నిరుపమభోగము లందుము, స్థిరసత్త్వనిఁ బంక్తిముఖునిఁ జేకొని ప్రీతిన్. 567

క. హిత ముపదేశించెదునా, మతము వినక నీవు మాఱుమాటఁ బలికిన
న్నతురత నీశాత్రించర,సతు లందఱు నిన్నుఁ బట్టి చంపెద రబలా. 568

వ. అనియె నంతఁ జండోదరి యనురాక్షసి క్రోధమూర్ఛితయై కాలాయసమయం
బగుశూలంబు కేల నంకించి లీలం ద్రిప్పుచుఁ ద్రాసోత్కంపితకుచ యగునీసీ
తను రావణుండు గొని తెచ్చిననాఁటనుండి నామనంబున దీని భక్షింపఁగోరు
చుండుదు నిప్పుడు యకృత్సంజ్ఞకం బైనహృదయదక్షిణభాగస్థమాంసవిశేషం
బును బ్లీహసంజ్ఞకం బైనహృదయవామభాగస్థమాంసవిశేషంబును క్రోడసం
జ్ఞకం బైనవక్షోగతగోముఖాకృతిమాంసయుక్తశల్యంబును హృదయోపరిస్థిత
మాంసంబును బంధనసహితముకుళాకారహృత్పద్మాఖ్యమాంసవిశేషంబును
నాంత్రంబులును శీర్షంబును భక్షించెద ననిపలికె నంతఁ బ్రఘస యనురాక్షసి
యి ట్లనియె. 569

ఉ. తెంపునఁ బట్టి దీని తలద్రెవ్వఁగ నేసి నిశాటభర్తతో
నింపుగ సీత చచ్చె నని యిందఱముం దగ విన్నవించి నె
య్యంపుఁదనంబుతో నతనియానతిఁ గైకొని వేగ వచ్చి భ
క్షింపుద మీవినీలఘనకేశితనూగతమాంసఖండముల్. 570

వ. అనియె నంత నజాముఖి యనురాక్షసి యి ట్లనియె. 571

ఉ. చండనిశాతఖడ్గమునఁ జారుతరంబుగ దీనిమేనిలోఁ
గండలు గోయుఁ డేను మన కందఱకు న్విభజించి పెట్టెదం
దెండు పగార్థ్యలేహ్యము వినిర్మలపేయము హృద్యఖాద్యముం
మెండుగ ముద్ద చేసికొని మ్రింగెద మాఁకలి దీఱునట్లుగన్. 572

వ. అనునెడ నయోముఖి యనురాక్షసి యి ట్లనియె. 573

ఉ. చండతరంబుగా మనయజాముఖి చెప్పినయట్లు వేగ గో
యుం డసిధార దీనియొడ లుద్ధతి నే విభజించి పెట్టెదం
దెండు పరార్థ్యలేహ్యము వినిర్మలపేయము హృద్యఖాద్యముం
మెండుగ ముద్ద చేసికొని మ్రింగెద మల్లనికుంభిలాస్థలిన్. 574

వ. అని యిట్లనేకప్రకారంబుల భయంకరాకారలై రాక్షసాంగనలు పరుషవాక్యం
బులఁ దర్జించిన విని యమ్మహీపుత్త్రి ధైర్యంబు విడిచి రోదనంబు సేయుచు
బాష్పగద్గదకంఠియై యి ట్లనియె. 575

క. రసలో మనుజాంగన రాక్షసునిం బతిగా వరింపఁ గాఁ దగ దింక
న్వెస నన్ను బట్టిమెసవిన, మెసవుఁడు నేవినఁగ నొల్ల మీవచనంబుల్. 576

— సీత యశోకవృక్షమును బట్టుకొని యేడ్చుట —

వ. అని పలికి యద్దేవి రాక్షసమధ్యగతయై రావణునివాక్యంబులును రాక్షసాంగ
నలవచనంబులునుం దలంచి యంత కంత కగ్గలం బైనశోకంబుననించుకయైన
సుఖంబు గానక శరీరంబు సంకోచింపం జేసి మిక్కిలి వడంకుచు వనమధ్యంబున
[illegible] నరితయై యూథపరిభ్రష్ట యైనమృగాంగనచందంబున దిగులు

గొనుచు దిగ్గున లేచి హనుమదధిష్ఠితశింశుపాతరుసమీపగతం బైనపుష్పితా
శోకవిటపంబు నవలంబించి శోకబాష్పజలంబులచేతం బయోధరంబులం దడు
పుచు శోకంబునకుం దుది గానక చింతించుచు ఝంఝూవాతసముద్ధూతకదళి
యుం బోలె నాకంపించుచు రాక్షసీభయవిత్రస్తయగుటం జేసి వివర్ణవదనయై
వినీలవేణి కృష్ణభుజగియుం బోలెం బృష్ఠభాగంబునం జలింప నిట్టూర్పులు
పుచ్చుచు శోకోపహతచేతనయై దుఃఖార్తయై యిట్లని విలపించె. 577

తే. హా రఘూత్తమ హా కరుణాలవాల, హా సుమిత్రాతనూజ పుణ్యాత్మ హా మ
హానుభావ హా కౌసల్య హా సుమిత్ర, పాపిని నిమ్ముఁ శోకాభిపన్న నైతి. 578

ఉ. రామునిఁ బాసి యీనగరి రాక్షసు లిట్లు దురుక్తు లాడఁగా
వేనలి నాలకించుచుఁ బ్రవేపిత నై యని యుంటిఁ గావున
న్నీభువి నకాలమందు మృతిఁ బొందరు మర్త్యు లటంచు బ్రస్తుతో
భాగ్యమహాత్ములాడెడు ప్రవాదము సత్య మటంచు నెంచెదన్. 579

తే. విపధి నడుమ మహావాతవేగనిహత, యైన యోడ కైవడి నాథనాంబునిహత
మైన పెన్నేటిగట్టుచందాన శోక, వేగహత నై నశించెద వేయియేల. 580

క. కమలదళపత్రనేత్రుని, విమలేందుసమానముఖుని వీరోత్తముని
న్నుదిత తేజుని మద్విభు, నమరం జూచెదరు ధన్యు లయోధ్యావాసుల్. 581

ఉ. ఇచ్చట రాముని న్రఘుకులేంద్రునిఁ బాసి నిమేష మైన నే
నచ్చుగ నుండఁ జాల గరళాదుల వెంటను జత్తు నంటినా
దెచ్చెడువారు లేరు మఱి తెంపునఁ బావకుఁ జొత్తు నంటినా
పొచ్చెము లేక రాక్షసులు పోవఁగనీ రిఁక నేమి సేయుదున్. 582

తే. ప్రాణవల్లభుఁ డైన శ్రీరాముఁ బాసి, యకట దుష్టరాక్షసులమధ్యమునఁ జిక్కి
యిట్టిదుఃఖంబు నొందుట కేమి కిల్బిషంబుఁ జేసితినో పూర్వజన్మమందు. 583

తే. రాక్షసస్త్రీలచేత సంరక్షితనగు, నేను రాముని వీక్షింపనేని యిచట
నొకనిమిష మైన జీవించి యుండఁజాల, వితతదుఃఖంబుచే మేను విడుతు నింక.

క. ధరలోనఁ బ్రాణికోటికి, మరుదుగఁ దనయిచ్ఛ దలఁచినప్పుడె మృతియుఁ
దొరకొనమి మానుషత్వము, నెఱిఁ బరతంత్రత్వ మెంతనీచం బకటా. 585

వ. అని బహుప్రకారంబుల దుఃఖించుచు భూతావిష్టయైనదానితెఱంగున మద
కరద్రవ్యసేవనంబున మైమఱచి యున్నదానిపోలిక శ్రమాపనోదనార్థంబు వివే
ష్టిత యైనకిశోరిచందంబున వ్యామూఢచిత్తమూర్ఛిక్కి మహీతలంబునం బడి
యడలుచుఁ గన్నీరు నించుచు నధోముఖియై వెండియు నిట్లని విలపించె. 586

ఉ. ఎక్కడ దండకాగహన మెక్కడ పావనగౌతమీతటం
బెక్కడ లంక నన్ను నిటు లేపున ముచ్చిలి తెచ్చు టెక్క డే
నెక్కడ నాథుఁ బాసి దనుజాంగన లుద్ధతిఁ గాఱులాడఁగా

నిక్కడ దిక్కు మాలి నను నెక్కడ హా విధి నేమి సేయుదున్. 587

సీ. అక్కడ మన్నాథుఁ డనవహితుం డగుచుండ నీచాత్ముఁ డీయుగ్రదైత్యుఁ
డీరసమున బలాత్కారంబుగా నన్ను ముచ్చిలి చేకొని తెచ్చె నిటకు
దనుజకాంతామధ్యమునఁ జిక్కి తత్క్రూరవచనము లీవినుచు నెవ్వగలఁ బొగిలి
బ్రతికి యుండఁగఁ జాల రామునిఁ బాసి దైత్యాంగనావశగత నైననాకు

తే. ధనము ప్రాణంబు భూషణోత్తమము లేల, పరఁగ నీదుఃఖమున వ్రయ్యవాఱకునికి
నశ్మసారం బగుట నిక్కము మదీయ, హృదయ మజరామరం బగు నింకమీఁద.

తే. భర్త నెడఁ బాసి యిట్లుండవలసె నాకుఁ, బాపజీవిత నై యింక బ్రతుకఁ జాల
నకట యసతి ననార్య నై నట్టి యేను, బుడమిలో నింద కిటు పాత్రభూత నైతి.

క. జలనిధిపరివేష్టితభూ, వలయాధీశ్వరుని మంజువాదిని బతి న
త్యలఘుగుణుఁ బాసి యేగతి, నిల బ్రతికెదఁ బ్రాణసుఖము లివి యేమిటికిన్.

ఉ. కావలి యున్న రాత్రిచరకాంతలు మ్రింగిన మ్రింగని మ్మిటన్
రావణుఁ డల్గి దారుణశసంబునఁ జంపినఁ జంప నిమ్ము నా
జీవితనాథుఁ బాసి పలుచింతలఁ గుందుచు నుంటకంటె నా
కేవిధి నైనఁ జావమరు టిప్పటికి న్సుఖ మంచుఁ దోఁచెడిన్. 591

మ. ప్రియముల్ పల్కిన నిష్ఠురోక్తు లనిన న్శుభమాకృతిం దోఁచినన్
జయశీలుండ నటంచు నెంచుకొనినం బ్రాబల్య మూహించిన
న్నయదూరుం డగుపంక్తికంఠు నమరేంద్రద్వేషి వామాంఘ్రిచే
నయినం దాఁక స్వధర్మము న్విడిచి యత్యాసక్తిఁ గాంక్షింతునే. 592

వ. మఱియు నీరావణుండు నాచేత బహుప్రకారంబులఁ దిరస్కరింపఁబడినవాఁ
డయ్యు నత్తెఱం గెఱుంగక నృశంసస్వభావంబునఁ దన్నుం దనకులంబును
జేర్కొనుచు సారెసారెకు నన్నుం బ్రార్థించుటకు నిశ్చయించుచున్నవాఁ డీరా
క్షసాంగన లెన్నిప్రలాపంబు లాడిన దీప్తాగ్నిలోనం బడవైచిన నవయవంబులు
ఖండించిన హృదయంబు విదారించిన నేమి గావించినం గావింపనిమ్ము రావ
ణునిచెంత నిల్చుట కైన నొల్లనని పలికి వెండియు నిట్లనియె. 593

తే. ప్రాజ్ఞుఁడు కృతజ్ఞుఁడును దయాపరుఁడు సాధు
వృత్తుఁ డని ఖ్యాతిఁ గన్నరఘూత్తముండు
కడఁగి నేఁడు మద్భాగ్యసంక్షయమువలన
నిర్దయుం డయ్యె నని మది నేఁ దలంతు. 594

క. నయవిదుఁడు సదయుఁడు నిరా, మయుఁ డగురఘువల్లభుండు మద్భాగ్యపరి
క్షయమువలన నేఁ డింతకు, దయ దప్పెనొ దైవ మేమి దలఁచెనొ యకటా.

సీ. నాకొఱకై కాదె లోకకంటకుఁ డైన ఘనరూపుఁ డగు విరాధుని వధించె
నాకొఱకై కాదె భీకరారణ్యమునఁ గపటకాకాసురుగర్వ మడఁచె

నాకొఱకై కాదె యేకాస్త్రమునఁ జతుర్దశసహస్రనిశాటరాజిఁద్రుంచె
నాకొఱకై కాదె వీఁకతోఁ ఖరదూషణాదిరాక్షసుల ఘోరాజిఁ దునిమె

తే. నట్టిరఘుకులనేత దివ్యాస్త్రవిదుఁడు, రాముఁ డుగ్రాజి రావణునాము మణఁచి
సంతసంబున నన్నుఁ బ్రసన్నదృష్టి, నెలమిఁ గొనిపోక యేల యుపేక్ష సేయు.

మ. గురుశౌర్యుండు కృపాలుఁ డస్త్రవిదుఁడుగ్ర గోదండదీక్షాగురుం
డురుతేజుండు సురేంద్రకల్పుఁడు రణోద్యుక్తుండు మన్నాథుఁ డ
స్ఫురమోదారతఁ దల్పవీర్యుఁ డగుసీపౌలస్త్య ఘోరాజిలో
వరశౌర్యంబునఁ ద్రుంచి నన్నుఁ గొని పోవం జాలఁడే దక్షతన్. 597

క. ఁరనిధిమధ్యంబున నెవ్వరికిఁ బ్రవేశింపరాక వఱలెడులంకా
పుర మిది యైనను రఘుశేఖరుశరగతి కడ్డ మిచటఁ గలదే తలఁపన్. 598

ఉ. వేల్పులు దైత్యులోక్కటమొగి వీఁక నెదిర్చిన బాణవహ్నిచేఁ
గాల్పఁగఁ జాలునంతటిచుఖండపరాక్రమశాలి నుద్విభుం
డల్పపరాక్రముం డగుదశాస్యుని వ్రేల్మిడిఁ ద్రుంచి యేలకో
పొల్పుగ నన్నుఁ దోడుకొనిపోక యుపేక్ష యొనర్చె నక్కటా. 599

ఉ. మ్రుచ్చిలి నీచదైత్యుఁడు సముద్ధతి నన్గొని తెచ్చి లంకలో
నిచ్చట డాఁచినట్టివిధ మింతయు రాముఁ డెఱుంగ కున్నవాఁ
డచ్చుపడంగ దాని వినినప్పుడె తక్కక భ్రాతృయుక్తుఁడై
వచ్చి దశాస్యునిం దునిమి వారక నన్గొనిపోవ కుండునే. 600

ఉ. అక్కట రావణాపహృత యై పలవించుచు సీత లంకలో
డిక్కఱి కుందుచున్నయది తీవ్రతఁ గైకొని ప్రోవు మంచుఁ దా
మక్కువతోడ రామునకు మానుగఁ జెప్పెడునట్టియాప్తుఁ డిం
దొక్కఁడుఁ జిక్కఁ డెట్లు వినునో నను నేగతి నుద్ధరించునో. 601

చ. వనమున నుద్విధంబు దెలుపం దగునట్టిపతంగపుంగవుం
డనఘుఁడు నాఁడు నాకొఱకు నడ్డము వచ్చి దశాస్యుఁ దాఁకి నే
ర్పున వడిఁ బోరి తన్నిశితభూరితరాసివిలూనపక్షుఁడై
చనె నిఁకఁ దెల్పఁగాఁ దగిన సజ్జనుఁ డెవ్వఁడు లేఁడు చూడఁగన్. 602

క. నన్నిచట నున్నదానిఁగఁ, బన్నుగ నేపగిది నైనఁ బతి విని నేనిం
గ్రన్నన శరముల లోకము, గన్నార నరాక్షసంబు గావింపఁ డొకో. 603

ఉ. తెంపునఁ గ్రుద్ధుఁడై విభుఁడు దివ్యశరంబుల నీపయోధి శో
షింపఁగఁ జేసి లంక నతిశీఘ్రతఁ జొచ్చి దశాస్యు నాజిలోఁ
జంపి తదాప్తమంత్రిసుతసంతతిఁ ద్రుంచి తదీయకీర్తి మా
యింపఁగఁ జేసి దోర్బలసమృద్ధి ననుం గొనిపోవు నుద్ధతిన్. 604

తే. పాపవర్తనుఁ డయిన యీపంక్తిముఖుఁడు
పార్థివులదృష్టిపథమునఁ బడియె నేని

పరఁగ నొక్కింత త్రుటి యైనఁ బ్రతుకఁ జాలఁ
డెన్నఁ డాగతి నాజి సందృష్టుఁ డగునొ. 605

క. గతి సెడి దుఃఖించెడి నా, గతి నీకఁ బ్రతిసుందిరముగఁ గాకుత్స్థశరా
హతనాథలై నిశాచర,సతులు లంకను నేడ్వఁగలరు సత్యం బరయన్. 606

వ. మఱియు నీలంకాపురంబు శీఘ్రకాలంబునఁ జితాధూమాకులపథయు గృధ్రసం
ఘసంకులయు నై శ్మశానంబుపగిదిఁ జూపట్టం గలయది రాక్షసులదురాచా
రంబె వారికి విపర్యయంబు ప్రకటింపం జేయుచున్నది గావున శీఘ్రంబ య
నిష్టంబుగా నేను మనోరథంబు నధిగమింపం గలదాన మఱియు నశోభంబు
లనేకంబులు దోఁచుచున్నవి గావున దురాత్ముం డగునీరావణుండు నిహతుం
డగుచుండెఁ బుణ్యోత్సవసమృద్ధం బైనయిప్పురంబు నిస్సంశయంబుగా విధవాం
గనపగిది హతప్రభ గాఁగలదు మఱియు నింటింట దుఃఖార్తలై విలపించు
రాక్షసకన్యల రోదనశబ్దంబు నాలకింతు మఱియు నీనగరంబు రామసాయక
నిర్దగ్ధం బై నిబిడాంధకారహతద్యుతి యై పాడెక్కి యుండఁ గలదని యిట్లు ప్రమా
ణంబుగాఁ బలికి వెండియు దుష్టాత్ముం డగు రావణునిదురాలాపంబులు దలంచి
దుఃఖావేశంబున నమ్మహీనందని వెండియు నిట్లని విలపించె. 607

ఉ. చేరువ రావణుండు మితిఁ జేసినకాలము డాయ వచ్చె నా
కారులు ధర్మహీనులు దురాత్ములు కాపథవర్తు లద్భుతా
కారులు గాన నన్ను ననుకంపఁ దలంపక చంపఁ జూతు ర
ట్లీరస మెత్తి యేది గతి యేమి యొనర్చెద భర్తృహీననై. 608

ఆ. తివిరి నాకు విషము దెచ్చి పెట్టెడుపుణ్యుఁ
డెవ్వఁ డైన దొరకెనేని యిపుడె
తనువు విడిచి యమునిఁ గనఁ జనవచ్చును
ఘనుని విభునిఁ బాసి మనిన మేలె. 609

వ. అని తెంపునం బలికి వెండియు నమ్మహీనందని మహావీరుండును మహానురక్తుండు
నగురాముండు తన్ను వెదకక యుపేక్షించి యున్నవాఁ డని శంకించి యిట్లుండు
టకు స్వజీవనాపరిజ్ఞానంబును దద్విపత్తియుఁ దాత్త్వికవైరాగ్యంబును బ్రవాస
దోషంబువలన నీప్రేమనాశంబును స్వగుణహీనత్వంబును స్వభాగ్యవిపర్యయం
బు నివి యాఱును గారణంబులుగా నుత్ప్రేక్షించుచు నిట్లని వితర్కించె. 610

క. మానవనాయకుఁ డించుక, యే నిట మని యున్నచంద మెఱుఁగఁ డెఱిఁగినన్
మానుగ ననుఁ దిలకింపక, తా నేఁటి కుపేక్ష సేయు ధార్మికుఁ డరయన్. 611

క. ఘనతర మగుమద్దుఃఖం,బున నిక్కము మేను విడిచి భూపతి వగతోఁ
ననుజయుతంబుగ నాకం,బున కాగతి నరిగి యుండఁబోలుఁ దలంపన్. 612

క. ధవళాబ్జనయనుఁ డగు రా,ఘవుని విలోకించి యఱు గరుడోరగదా
నవసిద్ధసాధ్యకిన్నరు, లవితథముగఁ జాల ధన్యు లయ్యెద రచటన్. 613

మ. జనకోర్వీపతిపుత్త్రి నై దశరథక్ష్మానాథవంశాబ్ధిచం
ద్రునకుం గోడలినై యమేయగుణయుక్తున్ రామునిం బ్రాణనా
థునిఁగాఁ జేకొని పుణ్యసాధ్వి యన నెంతో ఖ్యాతి నాటించి యా
ఘనుని న్రామునిఁ బాసి దిక్కఱి మనంగా నేర్తునే యిచ్చటన్. 614

ఉ. శ్యామలకోమలాంగుని సుమాస్త్రసమానతనూవిలాసు సు
త్రామసమానవైభవు దరస్మితనిర్జితశీతధాముని
న్రామునిఁ బాసి యొంటిమెయి రాక్షసుచేఁ బడి చావు నందు నా
క్కాముఁడు వ్రాసియుండె నదిఁ గందిన నేమిటఁ దీఱు నీసగన్. 615

ఉ. నెట్టన రామభూపతికి నే సతి నై జనియించినందు కి
ప్పట్టున నించుకైన ననపాయసుఖం బొనగూర్ప లేక యీ
పట్టుగ దుఃఖపుంజములపాలుగఁ జేసితి కాననలోన నా
పుట్టుక యేల ధాత్రి ననుబోఁటి యభాగ్యలు గల్గ నేర్తురే. 616

క. రాముఁడు ధీమంతుఁడు ని,ష్కాముఁడు రాజర్షి ధర్మకాముఁడు నాత్మా
రాముం డాసుజ్ఞానికి, నీమెయి నామీఁదఁ గాంక్ష యేల జనించున్. 617

చ. చనువుగ నొద్ద నున్నయెడ సౌహృద ముంచుట యొద్ద లేనిచోఁ
దనహృదయంబులో నెనరునప్పుట రాజులకు న్స్వధర్మమై
నను ధరలోఁ గృతఘ్నునిగుణం బది గాని కృతజ్ఞుఁ డైనరా
మునిగుణమే జగంబు లవి మూఁడు మునింగిన నన్ను వీడునే. 618

తే. శత్రుసూదను నద్భుత చరితు నమిత, వీర్యు నక్లిష్టకర్ము మద్విభునిఁ బాసి
బ్రతికి యుండుటకంటె నెబ్బంగి నైన, మేనుఁ బాయుట నా కది మేలు గాదె.

తే. ధరణి నెంత యభాగ్యనో మఱియుఁ బాప
మేమి చేసితినో తొల్లి యినకులేంద్రు
విమలగుణుఁ బాసి దైత్యమధ్యమునఁ జిక్కి
యునదమాడ్కిఁ గృశింపఁ బాలైతి నకట. 620

తే. అకటనన్న య్యస్త్రశస్త్రులై యడవిలోన, మూలఫలములు మెసవుచు మునులఁ గూడి
తవిలి పుణ్యాశ్రమంబులఁ దపము సల్పు,చున్నవారలో యుపరతిఁ గన్నవారొ.

క. అటు గాక యున్న వనమునఁ,గుటిలుం డగుపంక్తిముఖుఁడు గురుకపటమునం
దటుకున వంచించి విశం,కటముగ వధియించె నొక్కొ కలుషాత్మకుఁడై. 622

ఆ. అట్టియేను గాల మరుగుచు నుండ నే, కరణిఁ దాళుదాన గాఢశోక
మిట్లు పెక్కుగతుల నేర్చును నుండ నా, కలఘుభంగి మృతియుఁ గలుగ దేల.

శా. రామక్ష్మావిభుఁ డబ్ధి దాఁటి రయ మారఁ వచ్చునో రాఁడొ స్వా
సామర్థ్యంబున దైత్యు నాజి నుర లెంచం ద్రుంచునో ద్రుంపఁడో
వామాంకంబునఁ జేరి నన్నుఁ గొనిపోవం జూచునో చూడఁడో
నామీఁదం గృప గల్గునో గలుగదో నాభాగ్య మెట్లున్నదో. 624

శా. వారక దండకావననివాసి మునీశ్వరరక్షణార్థమై
వీరవరేణ్యుఁ డుగ్రరణవీథి విరాధుని దూషణు న్మహో
దారు ఖరుఁ జతుర్దశసహస్రనిశాటసమన్వితంబుగా
ధారుణిఁ గూల్చె నమ్మునివితానశరణ్యున కేను మ్రొక్కెదన్. 625

క. తలఁకొని ప్రియాప్రియంబులు, గలుగక యశోకరతు లగుచు గతకల్మషులై
యలరారు నట్టి తాపసులు, తలపోయఁగ బుడమిలోన ధన్యులు గారే. 626

ఉ. రాముఁడు ఘోరరాక్షసవిరాముఁడు రాక్షసనాథుని న్సమి
ద్భూమి వధించి నన్నుఁ గొనిపోయిన మే లటు గానిచోఁ నదీ
యామలవిగ్రహంబు హృదయంబున నెంచుచుఁ జత్తుఁ గాని దు
ష్టాత్మునిఁ దైనరాక్షసు వశంగతనై మనఁజాల నెంతయున్. 627

క. ప్రియమువలన నగు సుఖ మ, ప్రియమువలనఁ గలుగు నధికభీతి విడిచి ని
ర్భయులై చరించుపుణ్యో, దయులకు వందన మొనర్చెద న్గడుభక్తిన్. 628

మ. అని యి ట్లాయమ బాష్పపూర్ణముఖియై హా రామ హా లక్ష్మణా
యని దుఃఖంబునఁ జీరి యేడ్వ విని క్రోధారక్తనేత్రాంతలై
దనుజస్త్రీలు రయంబునం జని తమంతం దాము దేవారితో
వినయం బొప్పఁగ విన్నవించిరి సతీవృత్తాంత మాద్యంతమున్. 629

చ. అటు దివిజారితోడ జనకాత్మజ యున్నవిధంబు దెల్పి సం
చటులకరాళవహ్నికణసంక్షయమక్షుల నుప్పతిల్లఁగాఁ
గుటిలతరాస్యము ల్దెఱచి కొంచు ఘనార్భటి మ్రోయుచుఁ విశం
కటగతి నేగుదెంచి సతిఁ గ్రమ్మఱఁ గాంచి భయంకరాంగులై. 630

రాక్షసస్త్రీలు సీతను బట్టి మ్రింగెద మని తర్జించుట.

క. సామమున నెంతఁ జెప్పిన, నోముగువా దానవేంద్రు నొల్లవు గద యిం
కేమనిన నేమి యగు నిను, మే మందఱ మిపుడు పట్టి మ్రింగెద మింకన్. 631

వ. అని బహుప్రకారంబుల భయంకరాకారలై తర్జించుచున్నసమయంబున నచ్చే
రువ నిద్రించుచున్న విభీషణపుత్త్రి యగు త్రిజట యనురాక్షసి రయంబున. 632

క. జనకునికూఁతును దశరథ, జనపతికోడలును రామచంద్రునిసతి నీ
వనజాక్షి మ్రింగ వలవదు, నను మ్రింగిన మ్రింగుఁ డింక నరభుగ్వనితల్.

క. దశరథసుతునకు విజయము, దశముఖునకుఁ జేటు గలుగుఁ దప్పదు నే నీ
నిశ దీని తెలియఁగఁ గాంచితి, విశదంబుగ స్వప్నమందు వింటిరె మీరల్. 633

త్రిజట తనకుఁ గలిగిన స్వప్నమును రాక్షసస్త్రీల కెఱింగించుట.

క. నా విని నివ్వెరపడి కడుఁ, దీవరమున దైత్యసతులు త్రిజటా యేలా
గీవిధము తేటపడఁ జెపు, మా వినియెద మనిన వారి కది యి ట్లనియెన్. 634

చ. సలలితశుక్లమాల్యములు చారుదుకూలము మేనఁ దాల్చి సొం

పలరఁగ నంతరిక్షగతహంససహస్రసమేతదాంత ని
ర్మలశిబికాధిరూఢుఁ డయి రాముఁడు లక్ష్మణుతోడఁ గూడి య
త్యలఘుజవంబుతో నిచటి కద్భుతశైలము లాగఁ జూచితిన్. 635

క. హరిణాంబరధారిణి యై, ధరణిజ విమలప్రభాభ్యుదార యగుచు సా
గరపరివేష్టితపాండుర, గిరిపై వసియించి యున్నక్రియఁ గనుఁగొంటిన్. 636

సీ. మఱియు రాముఁడు శుక్లమాల్యాంబరంబులు దాల్చి చతుర్దంతదంతి నెక్కి
తమ్మునితోఁ గూడి తన తేజమున దిశల్ వెలుఁగంగఁ జేయుచు జలజనేత్ర
వెదకుచుఁ జనుదెంచి వేడ్కతో సీతనుఁ గనుఁగొనె నంత నా జనకపుత్రి
యా శ్వేతశిఖరిపై నధిపుచేత గృహీత యైన గజస్కంధ మాశ్రయించి

తే. విభుని యొడిమీఁద నుండి యా విధుని శశాంకుఁ
గరముచే సంస్పృశింపంగఁ గంటి. మఱియు
వారి మువ్వుర ధరియించి వాసన నాగ
జోత్తమం బీపురంబుపై నుండఁ గంటి. 637

తే. మఱియు నా రామభద్రుండు కరము వేడ్కఁ
దమ్ముని మహీజఁ గూడి యా దంతి డిగ్గి
పాండువృషభాష్టకోపేతభవ్యరథము
నెక్కి రయమున నీలంక కేగుదెంచి. 638

క. దనుజుల వధించి పదపడి, యనుజుని జానకిని గూడి యనుపమహర్షం
బునఁ బుష్పక మెక్కి రయం,బున నుత్తరదిశకు నేగఁ జూడఁగంటి రహిన్. 639

వ. ఇవ్విధంబున రాముండు సీతాలక్ష్మణసహితుండై కలలోనం గనుపట్టెఁ గావున
నమ్మహాత్మునకు గెలుపవశ్యంబు సంభవించు మఱియు మహాతేజుండగు రాముండు
స్వర్గంబు పాపాత్ములకుం బోలె సురాసురాదుల కజయ్యుండై యుండు నది
యునుం గాక రావణుండు తైలసముక్షితుండును రక్తాంబరధరుండును పానమ
త్తుండునై కరవీరకృతమాల్యోపశోభితుం డై పుష్పకవిమానంబున నుండి నేలం
బడినయట్లు మఱియుఁ గృష్ణాంబరధరుండును రక్తమాల్యానులేపనుండును ముం
డితశిరస్కుండు నై యొక్కవనితచేత నాకర్షింపంబడినయట్లు వెండియు ఖర
యుక్తం బైనరథం బారోహించి వికలంబుగా నవ్వుచు నృత్యంబు సేయుచుఁ
దైలపానంబు గావించుచు భ్రాంతచిత్తాకులేంద్రియుండై పరిభ్రమించినట్లు
మఱియు రాసభంబు నెక్కి దక్షిణాభిముఖంబుగాఁ జనినయట్లు మఱియు నాగ
ర్దభంబుమీఁద నుండి తలక్రిందుగాఁ బుడమిం ద్రెళ్లి భయమోహితుండై
శీఘ్రంబున లేచి సంభ్రాంతుండై భయార్తుండై మదవిహ్వలుండై యున్మ
త్తుండుం బోలె దిగంబరుండై దుర్వాక్యంబులు ప్రలపించుచు దుర్గంధదుస్సహ
ఘోరతిమిరసంవృతనరకోపమం బైన మలపంకంబునందుఁ బడి మునింగినట్లు
మఱియుఁ గాళియుఁ గర్దమలిప్తాంగియు రక్తాంబరధరయు నైన యొక్కవనిత

రావణునికంఠంబునఁ బాశంబు దగిలించి దక్షిణాభిముఖంబుగా నీడ్చుకొని యరిగినట్లు మఱియుఁ గుంభకర్ణుండును రావణునట్లు ఖరారోహణమలపంకపతనాదిక్రూరనిమిత్తయుక్తుండై దక్షిణాభిముఖంబుగాఁ జనినయట్లు మఱియు రావణునందనులందఱుఁ దైలసముక్షితాంగులైనయట్లు మఱియురావణకుంభకర్ణేంద్రజిత్తులు వరాహోష్ట్రశింశుమారంబులెక్కి దక్షిణాభిముఖులై యరిగినట్లు మఱియుఁ గుంభకర్ణాదిరాక్షసులు రక్తమాల్యాంబరధరులై తైలపానంబు సేయుచు గోమయహ్రదంబునం గూలినట్లు సవాజిరథకుంజరయు భగ్నగోపురతోరణయునై లంక సముద్రంబునం గూలి మునింగినట్లు మఱియు నీలంక రామకింకరుండగు నొక్క వానరునిచే భస్మీభూతయై కూలినట్లు లంకాపురంబు భస్మరూపంబగుచుండ రాక్షసాంగనలు విధవలై యింటింట గుంపులుగట్టియుచ్చైశ్శబ్దంబుల రోదనంబు సేయుచుఁ దైలపానంబు గావించుచు వికృతంబుగా నవ్వుచు నృత్యంబు సేయుచున్నట్లు విభీషణుండొక్కరుండు శుక్లమాల్యాంబరధరుండును శుక్లగంధానులేపనుండును శ్వేతచ్ఛత్రుండును శంఖదుందుభినిర్ఘోషనృత్తగీతాలంకృతుండునై శైలసంకాశంబును మేఘస్తనితనిస్వనంబు నగు చతుర్దంతదంతి నెక్కినట్లు మఱియు మంత్రిచతుష్టయసమన్వితంబుగా విమానం బారోహించి నృత్తవాదిత్రనిస్వనభాసురంబైనసభామధ్యంబునం బ్రకాశించినట్టు లిట్లనేక ప్రకారంబుల రామునకు విజయంబును రాక్షసులకు వినాశంబును దెల్పు నొక్కకల గంటి నాకల నిక్కంబు గావున 640

త్రిజట రాక్షసస్త్రీలకుఁ దనస్వప్నముయొక్క ప్రభావమును దెల్పుట.

ఉ. రాముఁడు వారిరాశిని గరం బవలీలగ దాటి వచ్చి సు
త్రామవిరోధి యైనయలరావణు దైత్యయుతంబుగాఁగ సం
గ్రామమున న్నితస్ఫుటశరంబులఁ ద్రుంచి ముదంబుతో జయ
శ్రీమహితాత్ముఁడై కడిమి సీతను గైకొని పోవు వ్రేల్మిడిన్. 641

చ. అతిసుకుమారయయ్యు జనకాత్మజ మందిరసౌఖ్యమేమియుఁ గ
మతిఁ దలపోయ కెంతయు సమంచితనైఖరి భర్తృభక్తిచే
నతులితఘోరసత్త్వనికరావృతయై తగు కాననోర్వి కా
గతిఁ జనుదెంచె నట్టిప్రియకాంతను దా నెడబాయ నేర్చునే. 642

క. నానావిధదుఃఖంబుల, చే నీశశిముఖి విముక్తయై బాగుగఁ జే
తోనాథుఁ గూడి తగఁ బర,మానందముతోడఁ జాలనలరుచు నుండున్. 643

క. దురితాత్ము లయిన రజనీ,చరులకు సురవినుతశౌర్యసాహసుఁ డగునీ
తరుణీమణివల్లభుచే, నరుదారగఁ దీర్పరానియాపద గలుగున్. 644

వ. కావున. 645

క. మీరలు పరుషోక్తుల గదు, వేఱుగ నీచారునేత్ర వెఱపింపక సాం
పారఁగ వినయవచనములఁ, గోరి ప్రసాదంబు వేఁడుకొనుఁ డీకమీఁదన్. 646

క. పడఁతికి దుఃఖము గలయ, ప్పుడు పరులకు నిట్టిస్వప్నముం దోఁచిన న
ప్పడఁతుక యాదుఃఖముచే, విడివడి సౌఖ్యంబు నొంది వెలయు ధరిత్రిన్. 647

క. ఈవనితకు మ్రొక్కుఁడు కృప, యావహిలంగ సుప్రసన్నయై మనలఁ దగన్
హావిరి భయంబువలనం, గావ సమర్థ యగుఁ దగవుగా దిటు లాడన్. 648

త్రిజట రాక్షసస్త్రీలకు సీతాశుభలక్షణంబులను శుభనిమిత్తంబులను దెల్పుట.

వ. అదియునుం గాక యీవిశాలాక్షియంగంబులయందు దుఃఖహేతువైనవిరూప లక్షణం బొక్కింతయైనఁ గానఁబడ దదుఃఖార్హయు దివ్యభోగార్హయు నగు నీదేవికిఁ గాంతిపై కల్యమాత్రంబున నీదుఃఖం బుపస్థితం బయ్యెనని యూహించెద నీసీతకు రాక్షసరాజనాశనరామవిజయరూపకార్యసిద్ధి యగుటకు సందియంబు లేదు మఱియును. 649

ఉ. దాఁచఁగ నేల స్వప్నమునఁ దప్పక నేఁ గనినంత కాదు దో
షాచరులార యీసుదతి సవ్యభుజోదుకుచేక్షణంబు లెం
తే చలియించుచున్ మనుజనేతృజయాసురనాథనాశనం
సూఁచనఁ జేయుచున్నయవి చూచితిరే యవి సారెసారెకున్. 650

వ. మఱియుఁ బింగళకాఖ్యఖగంబు తరుశాఖాగ్రంబుమీఁద నుండి యుత్తమ సాంత్వవాదియై శోభనబంధుసమాగమసూచకంబైననదర్వంబు నుచ్చరించుచు సంతోషవిశేషంబున సారెసారెకు సమాగతశుభంబు నెదుర్కొను మని సీత నుద్దేశించి ప్రేరేపించుచున్నదానియట్లు చూపట్టుచున్నది గావున నెల్లభంగుల రామునకు విజయంబును రావణునకు వినాశంబును నిక్కంబుగా సంభవించుం గావున మీ రిమ్మహీకుమారిఁ దర్జనభర్జనోక్తులం దూలనాడక మృదుమధుర వాక్యంబుల ననూనయించుచు వినయభక్తిస్నేహంబులం గొలిచి బ్రతుకుం డనిన నాత్రిజటపలుకులు విని వెఱఁగుపడి యద్దానవాంగనలు తత్ప్రకారంబున జానకి నాశ్వాసించుచుఁ బ్రియవాదినులై కొలిచియుండి రంత నద్దేవి దురాత్ముం డగురావణుండు తన్నుమాసద్వయంబునకు హింసించెద నన్నపలుకులు తలపోసి రాక్షసీమధ్యంబునం జిక్కి భయకంపితాంగియై వనాంతంబున సింహాభిపన్నయైనగజరాజకన్యయుంబోలె నడలుచుఁ గాంతారమధ్యంబున విసృష్టయైన బాలికతెఱంగున నిట్లని విలపించె. 651

సీత రావణునికట్టడం దలంచి దుఃఖించుట.

ఉ. అక్కట పాపజాతి చతురాస్యుఁడు గానలె నన్నయప్పుడే
చక్కఁగఁ బ్రాణికోటి కిలఁ జావొనగూర్పనికారణంబునం
దక్కక నాథుఁ బాసియును దైత్యసతుల్పరుషోక్తు లాడఁగా
నిక్కడ దైత్యబాధఁ బడి యే బ్రతుక న్వలసె న్విపన్ననై. 652

తే. అకట వజ్రాహతంబైన యచలశిరము,కరణి నాహృదయంబు శోకంబుచేత

వేయిప్రయ్యలై పోవదు వితతవజ్ర, సారమయముగాc బోలు నిస్సంశయముగ.

మ. కర ముద్వృత్తి దశాననుండు నను వీcకం జంపిన న్మేలె గా
కరయం బాఱుcడు వేద మంత్యజున కత్యాస క్తి నీలేని వై
ఖరి నాచి త్తము పాపచిత్తుc డగురక్షఃపాలుపా ల్సేయ నే
ర రఘుశ్రేష్ఠుc దలంచుచుం దనువునం బ్రాణంబులం బాపెదన్. 654

ఆ. ఆత్మహననకార్య మధికదోషం బని, వేదవిదులు చెప్ప వింటి మైన
వజ్రధరరిపునకువధ్యనై యున్ననా, కాత్మహననదోష మరయ లేదు. 655

ఉ. ఆడినయంతవట్టు చల మారcగc జేసెడువాcడు రావణుం
డోడక శల్యకృంతుcడు సముద్ధతి గర్భగతార్భకాంగము
ల్వాcడిమిc ద్రుంచినట్టు లిcక బార్థివుc డీడకు రాకయున్ననా
జాడనె తీక్ష్ణశస్త్రములc జక్కలువాపcడె మామకాంగముల్. 656

వ. మఱియు రాజాపచారంబున బద్ధుండై ప్రాతఃకాలంబునందు వధ్యుం డగుతస్కరునకుంబోలె రావణనిరుద్ధనై దుఃఖంచుచున్ననాకు మాసద్వయంబు రయంబున నరుగుచుండ నత్యంతదుఃఖంబు వాటిల్లు నేమి సేయంగలదాన నని యంతకంత కగ్గలం బగుశోకావేశంబున. 657

శా. ఆకంజేక్షణ యశ్రుపూర్ణముఖియై హా రామ హా లక్ష్మణా
హా కౌసల్య సుమిత్ర హా జనక గోత్రాధీశ మి మ్మందఱ
న్వీcకం బాసి దురాత్మకుం డగుమరుద్విద్వేషిచేc జిక్కి య
స్తోకా ర్తి న్బడరానిబాధc బడితిన్ దుఃఖాబ్ధినిర్మగ్న నై. 658

చ. హరిణమువెంటc బైcడిమొకమంచు రఘూ త్తము నేల పంచితిం
బరుసము లాడి వెంటనె కృపాళుని లక్ష్మణు నేల పుచ్చితిన్
గురుతరదుఃఖవేగమున ఘోరవనంబున నన్నుc గాన కె
త్తెఱcగునc గుందిరో యెటులు ద్రిమ్మరిరో యెటు లా ర్తిc దూలిరో. 659

తే. అకట మత్కారణమున మహాత్ములైన, నృపజులు మృగరూపంబు ధరెంచినట్టి
చటులఘోరజంతువుచే విశస్తు లైరి, యశనిచే సింహవృషభంబులణcగినట్లు.

ఉ. అక్కట పాపకాలుcడు మృగాకృతితోc జనుదెంచి క్రూరత
న్దక్కక మందభాగ్య నగునన్నటు మోహితc జేసినందున
న్మిక్కిలి రామలక్ష్మణుల మిన్నక పాసితిc గానలోన నీ
దృక్కలెనాత్ముc డెందుc గలcడేమని దూఱెనc దీఱు నీవగల్. 661

శా. హా రాజో త్తమ హా కృపాజలనిధీ హా పూర్ణచంద్రాననా
హా రాజీవదళాక్ష హా గుణమణీ హా రామ హా సత్కృపా
దారా నన్ జెఱc దెచ్చి పాపరతు డీడై త్యేంద్రుc డీలంకలో
ఘోరప్రక్రియ జంపcబూనె నను వే గొంపోcగదే సత్కృపన్. 662

వ. మఱియు మదీయధర్మనియమంబును క్షమయు ననన్యదేవతత్వంబును శీలంబును
పాతివ్రత్యంబును గృతఘ్నునందుఁ బ్రయోగించినకృతంబుం బోలె నిరర్థకం
బయ్యె మఱియు నిన్నుం గానక దుఃఖించుచు దైన్యంబు నొంది సంగమంబు
నందు నిరాశనై యున్నకతంబున నాచే ననుష్ఠితం బైనధర్మంబు నేకపత్నీ
త్వంబును వితథంబై చనియె నని పగచి వెండియు. 663

ఉ. తప్పక తండ్రి పంచినవిధంబున నీవు వివాస మింక నే
రొప్పుగఁ దీర్చి క్రమ్మఱ నయోధ్యకు నేగి సమగ్రవైభవం
బుప్పతిలంగ మేచకపయోధరవేణులఁ గూడి నిత్యముం
మెప్పుగ సర్వభోగములు మీఁదట నొందెదు నిర్భయుండవై. 664

—సీత యురిగొని ప్రాణములు విడువ యత్నించుట.—

ఉ. నే నిచ్చోట భవత్పదాంబుజము లెంతే భక్తిఁ జింతించుచు
న్నీ నామంబు పఠించుచు న్నిను మది న్నిత్యంబు భావించుచుం
దానవ్యంతరమందుఁ ద్వద్విరహసంతాపాగ్నిసంతప్తనై
నానాభంగుల నల్పకాలమునఁ బ్రాణత్యాగముం జేసెదన్. 665

చ. గరళము గ్రోలి యైనఁ బటుఖడ్గమునం దల ద్రుంచి యైనన
త్వరముగఁ జత్తు నన్న విషదాతయు దారుణఖడ్గదాతయు
న్నరకఁ డొకానొకం డయిన దుష్టనిశాచరు నాజ్ఞ వేఁడిచే
నురిగొని చత్తు నిప్పటికి నొండు సుయుక్తియు లేదు చూడఁగన్. 666

వ. అని యనేకప్రకారంబుల విలపించుచు సమాహితం బగుచిత్తంబున రామునిం
దలంచుచు శోకంబున నడలుచు మొగంబున దైన్యంబు దోఁప దిగ్గున లేచి
వేణిం బ్రతిగ్రహించి పుష్పితాశోకశాఖావలంబనంబుఁ జేసి మరణవ్యవసా
యంబునందుఁ గృతనిశ్చయ యై తనకులంబును రామలక్ష్మణులం జింతించు
చుండ నప్పుడ ద్దేవికి శుభంబు దెలుపుచు ధైర్యసంపాదకంబులును బూర్వదృష్టం
బులును సుప్రసిద్ధంబులును శుభసూచకంబులు నగుకొన్నినిమిత్తంబులు
శ్రీమంతుం డైనమానవుని భృత్యులుంబోలె నమ్మహానందని భజించెఁ బక్ష్మ
రాజిన్వృతంబును గృష్ణవిశాలశుక్లంబును శుభదర్శనంబు నగు వామనయనంబు
మీనాహతం బైనరక్తపద్మంబుభంగిఁ జలించెఁ బరార్థ్యకాలాగరుచందనా
ర్హంబును జార్వంచితపీనవృత్తంబును నుత్తమప్రియాధ్యుషితంబు నగువామ
భుజంబు రయంబున నదరె గజేంద్రహస్తప్రతిమంబును బీనంబును సుందరంబు
నగుడాపలితొడ ప్రస్పందమానంబై రామునిం గట్టెదుట నున్నవానిఁ గా
నెఱింగించెఁ దోడనె యత్యంతరాగసూచితం బయ్యెను హేమసమానవర్ణం
బగుట నీషద్రజోధ్వస్తం బైన తెఱంగున నున్న తదీయచేలం బొక్కింత
జాఱె మఱియు ననేకశుభనిమిత్తంబులు దోఁచె వాతాతపపరిక్లాంతం బై
ప్రణష్టం బైనబీజంబు వర్షంబుచేతంబోలె నేతాదృశశుభనిమిత్తంబుల

చేత నష్టహీనందని సంప్రబోధితయై యానందించె మఱియు బింబఫలాయమానా ధరోష్ఠంబును శోభననేత్రయుక్తంబును ధనుస్సంకాశభ్రూలతోపేతంబును నీల చికురసంయుతంబును వక్రపక్ష్మంబును స్మితశుక్లదంతంబు నగుజానకీవదనంబు రాహుముఖప్రముక్తం బైనచంద్రునికైవడిం దేజరిల్లెఁ బదంపడి యమ్మహీజకు మారి వీతశోకయై నిరస్తజాడ్యయై హర్షవికసితచిత్తయై శాంతజ్వరయై సముది తుం డగుచంద్రునిచేత శుక్లపక్షరాత్రియుంబోలె నిజవదనంబుచే నభిరామయై ప్రకాశించె నాసమయంబున సీతావృత్తాంతంబును త్రిజటావాక్యంబును రాక్ష సాంగనలదుర్వాక్యంబులును విని వృక్షశాఖాంతరస్థితుం డగుహనుమంతుండు.

ఆ. ఏమృగాక్షి వెదక నెల్లబలీముఖు, లఖిలదిశల కరిగి రామృగాక్షిఁ
బుణ్యసాధ్వి నాదుపుణ్యవశంబున, సురుచిరముగ నిచటఁ జూడఁ గంటి. 668

తే. యుక్తచారుఁడ నై వైరిశక్తిఁ దెలియఁ
గోరి పరు లెఱుంగక యుండ గూఢవృత్తిఁ
దిరుగు నాచేత నీలంక దితిజపతివి
శేష మసురులవిధము వీక్షింపఁ బడియె 669

హనుమంతుఁడు సీత నాశ్వాసింపఁ గోరి యుపాయము నాలోచించుట

క. అరి తన్నెఱుఁగక మునుపే, వరమతిఁ జాగుండు తాను వచ్చినకార్యం
బిరవందఁ దీర్చుకొనుటి, ద్ధర నుత్తముఁ డాత్మ మగుఁ గదా తలపోయన్. 670

క. అతులితమహనీయగుణా, ప్రతిముం డగురామవిభునిపత్నిని సీతం
బతిదర్శనకాంక్షిణి సువ్రత నాశ్వాసింపఁ బోలు వరమతితోడన్. 671

క. పుట్టినమొదలుగ దుఃఖం, బెట్టిదో దా నెఱుఁగ దీమహీసుత నేఁ డి
ప్పట్టున శోకమునకుఁ దుది, నెట్టును గనలేక యున్న దెంతయు భీతిన్. 672

మ. పతిసందర్శనమాత్రఁ గోరుచు భయభ్రాంతాత్మయై తూలుచుం
గతమోదంబునఁ జాల గాసిలెడు నీకళ్యాణి నీపుణ్య నీ
సతి నభ్యంచితసాంత్వవాక్యముల నాశ్వాసింప కే నేగినం
హితముం దెల్పెడువాఁడు లేక వగఁ దా నెంతే వడిం జచ్చెడిన్. 673

ఉ. కావున మిన్నకేఁ జనుట కార్యము గా దిపు డీమహీజతో
భూవిభువార్తఁ జెప్పి మదిఁబుట్టినశోకము కొంత పాపి యీ
దేవి తెఱంగు రామునకుఁ దెల్లముగా వివరించి చెప్పి త
ద్భావమునందుఁ గల్గుపరితాప మొకించుక దీర్పఁగాఁ దగున్. 674

ఉ. హేమసమానవర్ణ యగు నీసతితోఁ దగ మాటలాడకే
రామునితోడఁ గంటి రఘురామ భవత్సతి నన్న యంతఁ దా
నేమని పల్కెఁ దెల్పు మన నేమని చెప్పుదుఁ జెప్పకున్న నా
భూమివిభుండు సూర్యజుఁడు భూరికృప న్నను విశ్వసింతురే. 675

ఉ. జీవితనాథుకౌశలముఁ జెప్పెదుమిత్రుని గాన కార్తయై
చాఁగ నున్న దీమగువ చయ్యన నీనిశ వేగునంతలో
త్ప్లావిభుసేనముం దెలుపఁగా నగు నట్లిటఁగింతు నంటినా
కావలియున్నవా రసురకామిను లెద్ది యుపాయ మారయన్. 676

వ. ఏ నిప్పు డిద్దేవి నాశ్వాసింపక రయంబున నేగి సీత యున్నచందం బెఱింగించి యుద్ధంబుకొఱకు సైన్యసమేతంబుగా నతనిం దోడి తెచ్చెద నంటినేని మావచ్చు నందాఁక నిద్దేవి ప్రాణంబులు ధరించి యుండనోప దట్లగుటం జేసి సుగ్రీవునిప్రయత్నం బంతయు వ్యర్థంబై చను నదియునుంగాక. 677

ఉ. దోస మటంచు నించుకయుఁ దోఁపక మ్రుచ్చిలి తెచ్చినట్టిదు
ష్టాసురుఁ జంపి యీసతి రయం బలరం గొనిపోదు నంటినా
వాసిగఁ గీశసేనల నవార్యగతిం దగఁ గూర్చి పోరు పే
రాస నొనర్పు నున్నమనుజాధిపుయత్నము వ్యర్థమై చనున్. 678

వ. ఏను వానరుండ నై యతిసూక్ష్మరూపంబున నీవృక్షంబుమీఁద నె యుండి ప్రయోగసాధువలక్షణసంస్కారయుక్తం బైనకోశలదేశస్థితమనుష్యసంబంధిభాష చేత నిద్దేవి నాశ్వాసించెద నిది దక్క నొండువిధంబు యుక్తంబు గా దిట్లు గావింపక బ్రాహ్మణునియట్లు సంస్కృతవాణి నుచ్చరించితి నేని వానరునకు సంస్కృతభాషోచ్చారణశక్తిగలుగమి రావణుండని శంకించి యద్దేవి మిక్కిలి భయభ్రాంతయగుఁ గావున నవశ్యంబు మానుషభాషచేత నాశ్వాసింపందగినయది వృక్షావతరణంబుఁ జేసికట్టెదుటనిలిచి యాకస్మికంబుగా వానరమూర్తి నై మానుషభాష నుచ్చరించితి నేని తొల్లి రాక్షసులచేత విత్రాసితయై యున్నదగుట నీదేవి రావణుండను శంకచేత విశేషత్రాసంబు నొంది యార్తధ్వనిఁ గావించు నంత.

క. ఆనాదము విని దిగ్గున, దానవసతు లెల్ల లేచి తద్దయుఁ గినుక
న్నానాప్రహరణములు దగఁ, బూనిచి ననుఁ జుట్టుముట్టి భుజబలయుక్తిన్. 680

క. దారుణరూపంబులఁ బొలు,పారఁగ ననుఁ జంప జూతు రటు గాకున్నన్
మీఱి యుపాయబలంబున, నారయఁబట్టుకొనఁ జూతు రద్భుతభంగిన్. 681

క. ఏ నిప్పు డీశరీరము, మాని మహాధర్షవైరిమర్దనయోగ్యం
బైనసమున్నతదేహము, జానుగఁ దాల్పంగ వలయుఁ జతురత మెఱయన్.

వ. అట్లేను మహోన్నతంబై శరీరంబుఁ దాల్చి చూపట్టితి నేని యద్భుతదర్శనం బైన నారూపంబుఁ జూచి భయశంకిత లైన రాక్షసస్త్రీలు రయంబునం బఱతెంచి రాక్షసేశ్వరనియుక్తు లగు రాక్షసులకుం జెప్పుదు రంత వారు శూలనిస్త్రింశాదినానావిధసాధనంబులు గైకొని యొండొరులం బురికొల్పుకొని రయంబునం బఱతెంచి చుట్టుముట్టి యట్టహాసంబుఁ జేసి రౌద్రంబునం గవియుదు రే నప్పు డూరకున్న నన్నుం బట్టుకొని యెదురు దానం జేసి యీజనకనందని యపరిజ్ఞాతరామసందేశ. యోజన యగు నంతియె కాక క్షసులు హింసాభికాంక్షులు గావున

సీతం బట్టి వధింతురు దానం జేసి రామసుగ్రీవుల కార్యం బంతయు విపన్నంబగు నట్లు సీతను వధింపకున్నను రావణాభిగుప్తంబును సముద్రపరివేష్టితంబును బ్రణష్టమార్గంబును రాక్షసపరివారితంబు నైనయీదేశంబునం జిక్కి యుండు నేను రణంబున రాక్షసులకుం బట్టువడినను వధింపంబడినను శతయోజనంబులు సముద్రంబు దాఁటి వచ్చి రామకార్యంబు సాధించునట్టిబలవంతుండు వానరులలో నొక్కం డైన లేఁ డేను సంగ్రామంబున రాక్షససహస్రంబుల నైన వధింప సమర్థుండ నైనను దదనంతరంబ యుద్ధపరిశ్రాంతుం డగుటవలన మరల సముద్రంబు దాఁటుటకు సమర్థుండ నగుదునో కానో యెఱుంగరాదు యుద్ధంబు లనిశ్చితజయాపజయంబులు గావున సంశయితం బయినయుద్ధంబు నాకు యుక్తంబుగాదు సంశయం బైనకార్యంబు ప్రాజ్ఞుం డగువాఁ డెవ్వండు నిస్సంశయంబు గావించు నే నిప్పు డింతయుం దలపోసి సీతతోడ సంభాషింపక యూరక యరిగితి నేని యీజనకపుత్త్రి నిస్సంశయంబుగాఁ బ్రాణత్యాగంబు సేయు సంభాషించితి నేని పూర్వోక్తసీతాసంత్రాసనాదిదోషంబు సంభవించు భూతార్థంబు లవివేకి యైనదూతకతంబున దేశకాలవిరోధితంబు లై సూర్యోదయంబునందుఁ దమంబు నశించునట్లు నశియించుఁ గార్యాకార్యవిషయంబునందు సునిశ్చిత యయ్యును విక్లబుం డగుదూతకతంబున బుద్ధి శోభింపదు పండితమాను లగు దూతలు కార్యంబులు చెఱతు రెవ్వండు బహుప్రకారంబులఁ గార్యంబు తెఱంగు విచారించు నతం డర్థసాధనంబునందు సమర్థుం డగుఁ గావున నిప్పుడు కార్యంబు నశింపకుండ నాకు వైక్లబ్యంబు గలుగకుండ సముద్రలంఘనంబు వ్యర్థంబు గాకుండ సీతారామలక్ష్మణులకు హాని గలుగకుండ నెవ్విధంబునఁ గార్యంబు నమృపుదునో యని కొండొకసేపు విచారించి బుద్ధిమంతుం డగుహనుమంతుం డెట్టకేలకు రాక్షసస్త్రీలు వినకుండ మధురంబుగా నక్లిష్టకర్ముం డగు రాముని మెల్లనం బ్రశంసించి రామగతమానస యైనయీదేవిని నిరుద్వేగఁ గావించి పనంపడి పొడసూపి ధర్మయుక్తంబు లగు రామునిశుభవచనంబులు సమర్పించి యద్దేవిచిత్తంబునం గలశోకంబు నివారించి యనుజ్ఞఁ గొని యవ్వలం దోఁచినకొలంది నూచికొనియెదం గాక యని నిశ్చయించి ద్రుమవిటపాంతరస్థుం డై మధురవాక్యంబున ని ట్లనియె. 683

-౦ఖఖ హనుమంతుఁడు సీతకుమాత్రము వినునట్లు రామకథ ననువదించుట. ఖఖ౦-

సీ. దశరథుం డనునొక్కధరణీశతిలకుండు గలఁ డమ్మహాత్ముఁ డకల్మషుండు
వరరథకుంజరవాజిమంతుఁడు పుణ్యశీలుండు ఋజుఁడు విశాలయశుఁడు
తపము పెంపున మహాతాపసతుల్యుండు రాజర్షిముఖ్యుఁడు రాజనుతుఁడు
చక్రవర్త్యన్వయజాతుండు పార్థివవ్యంజనోపేతుఁ డవార్యశౌర్యుఁ

తే. డలఘుఁ డక్షుద్రుఁ డిక్ష్వాకుకులవరుండు, లక్ష్మివర్ధనుఁ డాదిత్యరాజసముఁడు
భువనవిశ్రుతైశ్వర్యసంపూర్ణుఁ డఖిల, భూతహితకరుఁ డాశ్రితపోషణుండు.

ఉ. ఆమనుజేంద్రచంద్రునకు నగ్రసుతుం డలరారు రాజసు
త్రాముఁడు రూపసంపదభిరాముఁడు సంగరనిర్జితాహిత
స్తోముఁడు పుణ్యనాముఁ డతి సువ్రతకాముఁడు నీలనీరద
శ్యాముఁడు రాముఁ డంచితవిశాలమహోన్నతగుణైకధాముఁడై. 685

ఆ. సత్యసంధుఁ డయిన జనకునివాక్యంబు, వలన రాముఁ డఖిలవైభవములు
మాని లక్ష్మణుండు జానకి తనవెంట, నేగుదేర నడవి కేగుదెంచె. 686

క. ఆనృపసుతుచే దారుణ, కాననమున శైలతుల్యకాయు లనేకుల్
దానవులు మడిసిరి జన,స్థాననివాసులు ఖరాన్వితంబుగ నాజిన్. 687

క. అంత జనస్థానవధం, బంతయు విని రాక్షసేంద్రుఁ డగు దశకంఠుం
డెంతయు రోషపరీత, స్వాంతుండై యచటి కర్థిఁ జనుదెంచి వెసన్. 688

తే. అధికమాయావిశారదుం డగుటవలనఁ
బంక్తిముఖుఁడు మృగస్వరూపంబుచేత
నరవరేణ్యుని వంచించి దురిత మనక
యమ్మహాత్మునిసతి సీత నపహరించె. 689

సీ. అంత రఘూత్తముఁ డద్దేవి వెదకుచుఁ బఱతెంచి వనమున హరివరేణ్యుఁ
డైనసుగ్రీవునితో నెయ్య మొనరించి వాలిని జంపి తద్వైభవంబు
సుగ్రీవున కొసంగె సుగ్రీవసందిష్టులై యనేకులు కపు లఖిలదిశల
కద్దేవి వెదకంగ నరిగి రేను గడంగి సంపాతి చెప్పినసరణి నూటి

తే. యోజనము లంబునిధి దాఁటి యోజతోడ, నీపురంబు ప్రవేశించి యెల్లకడలు
గలయ శోధించి దశకంఠు నిలయ మరసి, కాంక్ష మీఱంగ నీయశోకంబుక్రింద.

తే. భానుకులుఁ డగురామునివలన వినిన, వర్ణమును గాంతియును రూపవైభవంబు
గలిగినట్టిపతివ్రతాతిలక మైన, యమ్మహాదేవిఁ గనుఁగొంటి యత్న మలర. 691

క. అని పలికి యూరకుండిన, వనచరశేఖరునిమధురవాక్యంబులు దా
విని పతినామశ్రవణం,బున మనమున విస్మయంబు ముదము జనింపన్. 692

క. ఏపుణ్యాత్ముఁడొ కనులకుఁ, జూపట్టక నేఁడు శ్రవణసుఖముగ నాహా
నాపతివృత్తాంతము కడుఁ, దీపుగ మృదుఫణితి వగపుదీఱఁ బలికెడిన్. 693

క. అని కేశసంవృతం బగు, తనవదనసరోజ మెత్తి తత్పర దిక్కు
ల్గనుఁగొని మీఁద నశోకా, వనరుహవిటపాంతరమున వఱలెడువానిన్. 694

తే. ఉదయగిరిమీఁద రవిభంగి నొప్పువాని, ఫుల్లకింశుకసుమకాంతిఁ బోలుచువాని
వేష్టితార్ద్రచేలుని నవిద్రుమాభ, వదనుఁ దీప్తచామీకరవర్ణ నయను. 695

క. సుగ్రీవసఖునిఁ గపివం, శాగ్రేసరు నలసమీరణాత్మజుఁ గుతుక
వ్యగ్రమనస్కుని రఘువం,శగ్రామణిదూత ననిలజవు హనుమంతున్. 696

క. పరికించి ఘోర మగువా,నరరూప మిదేటి కిపుడు నాకుం దోఁచె
నర మద్భుత మకటా యని, ధరణీసుత [illegible]

క. పాయనిదుఃఖభరంబున, నాయవనిజ హా రఘూత్తమా హా సామి
త్రీ యని పరిదేవన మొగిఁ, జేయుచు నేడ్చుచును జాలఁ జింతిలుచు వెసన్.
వ. శోకమూర్ఛాపారవశ్యంబునఁ గొండొకసేపు విసంజ్ఞయై యుండి వెండియుఁ దెలివొంది 699
తే. అకట శాస్త్రనిషిద్ధమైనట్టిఘోర, వానరాకృతి కలలోనఁ గానఁబడియె
రమణలక్ష్మణాన్వితుఁడు శ్రీరామునకును, జనకునకున్వస్తియగుఁ గాక సంతతంబు.
ఉ. క్రూరనిశాచరుండు నను మ్రుచ్చిలి తెచ్చిననాఁటనుండియు
న్ధారుణినాథుఁ బాసినకతంబున శోకము నొంది కంటికి
న్నీరుకు గాన కిప్పగిదిఁ గుందెడునా కెటు స్వప్న మయ్యెఁ బో
వారిక నిద్ర లేనికల వచ్చునె యెవ్వరి కైన నుర్వరన్. 701
మ. కలయో దైత్యునిమాయయో హృదయవైకల్యోత్థమో నిక్కమో
తెలియ న్నేరక యున్నదాననొ ధరిత్రీపుత్రినో కానొ కే
వలభక్తిం బ్లవగుండు నాదువిభుని న్వర్ణించుచు న్దీనము
జ్జ్వలుఁడై యుండుట కేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపఁగన్. 702
సీ. డెందాన నెప్పుడు సౌందర్యనిధి యైన కువలయేశునిపొందు గోరుచుండఁ
బలుకుల నెప్పుడు భానువంశాంభోధిచంద్రునినామంబు సంస్మరింతుఁ
గన్నుల నెప్పుడు కాకుత్స్థతిలకుని సుందరరూపంబుఁ జూడఁ దలఁతు
వీనుల నెప్పుడు వీరసమ్మతుఁడైన విభునిమంగళకథ ల్వినఁ దలంతు
తే. నన్య మేమి యెఱుంగక యనవరతము, తత్సమర్పితచిత్తనై తనరునాకుఁ
గాంతునిశుభస్వరూపంబుగానఁబడక, భయదకపిరూప మేల చూపట్టె నకట.
తే. పవన పావక భాస్కర భారతీంద్ర, పాకహర మీకు మ్రొక్కెద నీకపీంద్రుఁ
డధిపతికిఁ బ్రాణమిత్త్రుఁడైయలరుఁగాక, యితనివాక్యంబునిక్కమైయెసఁగుఁగాక.

హనుమంతుఁడు సీతకుఁ బొడసూపుట.

వ. అని బహుప్రకారంబుల వితర్కించుచున్నసమయంబున. 705
చ. ఇది పొడసూపఁగా సమయ మీసతితో రఘునాథువార్త నిం
పొదవఁగఁ జెప్పి మంజుమధురోక్తుల నెవ్వగ మాన్చి భూరిస
మ్మద మొనగూర్తుఁగాక యని మారుతి గ్రక్కున మ్రాను డిగ్గి క
ట్టెదుట వినీతుఁడై నిలిచి యింపుగ నంజలిఁ జేసి యిట్లనున్. 706
ఉ. నీరజనేత్ర యెవతెవి నీ విటు మాసినచీర దాల్చి నేఁ
ఉూరక పద్మపత్త్రములనుండి దొరంగు జలంబులట్లు శో
కారుణితాక్షులం దొరఁగు నశ్రులు కాల్వలు గట్టి పాఱఁగా
ధీరత దక్కి దైన్యమున దిక్కఱి యేడ్చెద వేల చెప్పుమా. 707
ఉ. పన్నగ నాకుఁ జూడ హరిభామిని కైవడి దోఁచె దెంతయు
న్బన్నగకాంతవో గరుడభామినివో సురసిద్ధకన్యవో

కిన్నరకామినీమణివొ ఖేచరతన్వివొ సాధ్యయోషవో
యెన్నఁగ యక్షబాలికవొ యేర్పడ నంతయుఁ దెల్పుమా దయన్. 708

తే. చంద్రుఁ నెడఁబాసిదివినుండిసాహసమునఁ,బృథివికరుదెంచినట్టిరోహిణివొ గాక
ప్రణయకోపంబుననసిష్ఠుభర్తవిడిచి,తలఁగివచ్చిన యలయరుంధతివొ చెపుమ.

శా. లోలంబాలక పుణ్యశేషమున నేలోకంబునం దుండి నేఁ
డీలోకంబున కేగుదెంచితివి నీవేలాగు నీలా గయో
బాలా నీతలిదండ్రు లెవ్వరు భవత్ప్రాణేశుఁ డేపుణ్యుఁ డీ
క్లేలా యశ్రులు గాఱ నేడ్చెదవు నీ వెంతేకృపం జెప్పుమా. 710

చ. జనవిభునిం దలంచుటయు సారెకుఁ గన్నుల దెప్ప వేయుటల్
ఘనముగ నూర్పుపుచ్చుటయు ఘర్మజలంబులు మేనఁబుట్టుట
ల్పనివడి భూమి నంటుటయుఁ బల్మఱు నశ్రులు గాఱ నేడ్చుట
ల్గనుఁగొన దేవతాసతివిగా దని నిన్ను మదిం దలంచెదన్. 711

ఉ. మానిని నీదుచిహ్నముల మంగళరూపముఁ జూచి యాత్మలో
మానవనాథశేఖరునిమానిని నంచుఁ దలంచెద న్జన
స్థానమునందు రావణుఁడు తస్కరుఁ డై గొనిపోయినట్టి యా
జానకి వేమొ నీవిధము సర్వము నాకెఱిగింపు మిత్తఱిన్. 712

క. అతిమానుష మగురూపము, వితతఘనతపోనురూపవేషము కడు దీ
నతయుఁ జూడఁగఁ గమలా,యతనేత్రా రామమహిషి వగుదు నిజముగాన్.

సీత హనుమంతునకుఁ దనవృత్తాంతమును జెప్పుట.

క. అన విని జానకి పతికీ, ర్తనహృష్టిత యై తదంఘ్రి తామరసంబుల్
మనమునఁ దలఁచుచు మారుత, తనయునితో నిట్టు లనియెఁ దద్దయు నెమ్మిన్.

చ. అనుపమకీర్తి యాదశరథావనిభర్తకు ముద్దుకోడలన్
జనకునికూఁతుర న్విపుల సర్వమహీశకిరీటబద్ధశో
భనమణిమాలికారుచివిభాసితపాదసరోజుఁ డైన రా
మనృపతి కేను భార్య నిల మైథిలి యందురు నన్ను సద్ద్విజుల్. 715

క. పదిరెండువత్సరంబులు, ముద నుండఁగ సత్తయింట ముదుకొని భోగా
స్పదము లగుసకలసుఖములు, కోదనపడక యుండ నేను గుడిచితి నెమ్మిన్. 716

ఉ. అంతఁ ద్రయోదశాబ్దమున నమ్మహికాంతుఁడు రాముని న్ధరా
కాంతునిఁ జేయఁ బూని కుతుకంబున మంత్రులఁ గూడి సమ్మన
న్వాంతమునుత్కఁ గార్యమువిచారముఁ జేసి సునిశ్చితార్థుఁ డై
చింత దొలంగి యున్న యెడఁ జెచ్చెరఁ గైకయి దుష్టచిత్త యై. 717

సీ. తనమనోహరునిచిత్తము కఠినోక్తుల నొప్పించి జనులకు నొప్పిదములు
గానివరంబులు గాంక్షించి సుతునకు భూపతిత్వంబు రాముసకు వనవి

నునికియుఁ గోరి యిట్లొనగూర్చునంత కాహారనిద్రావిహారాదు లొల్ల
నటు సేయ వేని రామాభిషేకమువార్త నుండె తప్పక మృతినొందుదాన

తే. ననిన విని సత్యవాది గావున నృపుండు, నాతిపరదానసంస్మరణంబువలనఁ
జాల మోహితుండై ద్రిప్పఁజాల కపుడు,చింతనొందుచు రామునిఁ జేరఁ బిలిచి.

ఉ. కన్నుల శోకబాష్పములు గాఱఁగ నేడ్చుచు రామరాజ్యము
న్నన్నుగఁ గైకకిమ్మనుచుఁ బల్కిన నట్లగు నంచు బుద్ధిసం
పన్నుఁడు గాన వేఱొకటిపల్కక నేగ సమస్తసంపదల్
గ్రన్నన పాసి వల్కలముఖంబులఁ దాపసవేషధారియై. 719

వ. వనంబునకుం జనుదెంచె నమ్మహాత్ముం డొరుల కిచ్చువాఁడుం గాని యొరుల
చేతఁ గొనువాఁడు గాఁడు జీవితనిమిత్తంబువలననైన నసత్యంబుపలుకఁడు సత్య
ప్రతిజ్ఞుండు గావున మృదువస్త్రంబులు విడిచి నారచీరలు ధరించి రాజ్యంబుఁ
బరిత్యజించి నిజజనని యగుకౌసల్యయొద్ద నన్ను వసింపు మని నియోగించిన నా
కమ్మహాత్ముని విడిచి యుండుచోటది స్వర్గంబైనను సమ్మతంబు గాదు గావున నే
నమ్మహాత్మునిం బాసి యుండ నొల్లక యనురూపం బగువ్రతం బంగీకరించి వన
గమనంబున కభిముఖనైతి నంతకు మున్న భ్రాతృవత్సలుం డగుసుమిత్రాపు
త్త్రుండు ద్రుమచీరాజినాలంకృతుండై రామునితోడ నరుగుదెంచుట కుద్యుక్తుం
డయ్యె నిత్తెఱంగున మేము మువ్వురము భర్తృసమాదేశంబున దృఢవ్రతు
లమై పురంబు నిర్గమించి మునిశరణ్యంబైనదండకారణ్యంబుఁ బ్రవేశించి
యందు గౌతమీతీరంబునఁ బంచవటియందుఁ బర్ణశాల నిర్మించుకొని యందు
నివసించి యుండ దురాత్ముం డగురావణుండు కపటమృగస్వరూపంబున రామ
లక్ష్మణుల వంచించి బలాత్కారంబున నన్నుం గొని తెచ్చి యిచ్చోటం బెట్టి
తనదురాలాపంబులకే నొడంబడకున్న మాసద్వయంబునకు హింసించెద నని
సమయంబుఁ జేసె నసమయకాలం బతీతంబుగాక మున్నె రాముండు చనుదెంచి
రావణుం బరిమార్చి నన్నుం దోడ్కొని పోక యుపేక్షించె నేని మాసద్వయా
నంతరంబునఁ బ్రాణంబులు విడువం గలదాన నని దుఃఖపూర్వకంబుగాఁ దనవృ
త్తాంతం బెఱింగించిన నద్దేవివచనంబులు విని హనుమంతుండు దుఃఖితుండై
సాంత్వవచనంబుల ననూనయించుచు ని ట్లనియె. 720

హనుమంతుఁడు సీతకు రామలక్ష్మణుల కుశలము చెప్పుట

ఉ. తల్లిరో సాంగవేదసముదాయవిదుత్తముఁ డెవ్వఁ డట్టినీ
వల్లభుఁడైనరాముఁడు ధ్రువంబుగ సేమము నొంది యున్నవాఁ
డల్లన నన్ను నీకుశలమారసి రమ్మని పంప దూతనై
తెల్లము గాఁగ నీకడకు ధీరత వారిధి దాఁటి వచ్చితిన్. 721

క. అనఘుఁడు రాముఁడు సీతకుఁ, దన కుశలముఁ జెప్పు మనియె దద్దయు భక్తిన్
[illegible] కుశలంబున్.

వ. అని విన్నవించిన నద్దేవి పురుషసింహు లగు రామలక్ష్మణులకుశలంబు విని ప్రీతి సంహృష్టసర్వాంగి యై వెండియు హనుమంతు నవలోకించి. 723

తే. పరగ నూఱేండ్లలోపల బ్రతికి యున్న
నరునకు నొకప్పు డైన నానంద మొదవు
ననుచు జను లాడుకొనువాక్య మవితథముగ
నహహా నా కిల నేఁడు సత్యార్థ మయ్యె. 724

తే. అనుచుఁ గొనియాడె నప్పు డయ్యవనిసుతకు
హనుమదాగమనంబున నధికముదము
సంభవించె నొండొరులు విశ్వస్తు లగుచుఁ
గడు శుభాలాప మొనరింపఁ దొడఁగి రపుడు. 725

క. హనుమంతుఁ డంతరాముని, వినుతించుచు సీతఁ జూచి వెఱఁగందుచు మె
ల్లన శోకదీన యగున, వ్వనజాక్షిసమీపమునకు వచ్చె న్వెలుచన్. 726

— సీత తనసమీపమునకు వచ్చు హనుమంతుని రావణుఁగా శంకించి చింతించుట. —

క. ఈరీతి నమ్ముఁ డగుచు న, మీరకుమారుండు తనసమీపంబునకుం
జేర నరుదెంచునపు డా, ధారుణిసుత యతనిఁ గాంచి తద్దయు భీతిన్. 727

వ. రామకుశలకథనంబున సంజాతవిశ్వాస యయ్యును రావణుమాయాబాహుల్యంబు దలంచి క్రమ్మఱ విశ్వాసంబు దొలంగఁ బెట్టి రావణుం డని శంకించి.

క. తక్కక నమ్ముచ్చిలి యెవ్వాఁ, డక్కట నన్నిటకుఁ దెచ్చినట్టిదశాస్యుం
డుక్కఱి రూపాంతరమున, గ్రక్కున వంచింప వచ్చెఁ గానలయు రహిన్. 729

ఆ. అకట వీనిమ్రోల నరయక నాచేత, నయ్యె నెద్ది కథిత మది యనుచిత
మాత్మలోన నమ్మి యాడితి నిందాఁక, నెంతవెఱ్ఱి నైతి నేమొనర్తు. 730

క. అని చింతించుచు శోకం, బున భూరుహశాఖ విడిచి భూపాలకనం
దని వెసఁ దరుమూలంబున, ననువుగ నాసీన యయ్యె నంగము వణఁకన్. 731

తే. అప్పు డద్దేవి భయకంపితాంగి యగుట
కడలుచు సమీరసుతుఁడు డాయంగ నేగి
యభయదానంబు సేయుచు నధికభక్తిఁ
దత్పదాంభోజములకు వందన మొనర్చె. 732

క. ఇత్తెఱఁగున వినయాన్విత, చిత్తంబునఁ దనకుఁ బ్రణతిఁ జేసినకపివం
శోత్తమునిఁ జూచి శంకా, యుత్తం బగుమానసమున నయ్యమ పలికెన్. 733

తే. అకట రావణ మాయావి యగుట మాయ
నాశ్రయించి తపింపఁ జేయంగ నిటకు
వచ్చితివి నీవు క్రమ్మఱఁ బంక్తిముఖుఁడ
వేని శుభకారి గాదు నీ కిది నిజంబు. 734

ఉ. ఓజ వలిర్ప నెవ్వఁడు నిజోగ్రశరీరము మాని సత్వరి
వ్రాజకరూపధారి యయి వంచనఁ గాననమందు నాకతి
వ్యాజముతోడఁ గన్పడియె నట్టిదశాస్యుఁడ వీవు భూరిమా
యాజనితప్రభావమున నన్నిఁకను దైత్యులు నేర్తురే కదా. 735

క. అనిశ ముపవాసకృశనై, ఘనతరశోకాగ్ని చేతఁ గ్రాఁగెడు నన్నో
దనుజాధమ క్రమ్మఱ నీ,యనువున నేఁచెదవు దీన నశుభము గల్గున్ 736

వ. అని పలికి యద్దేవి రావణదౌరాత్మ్యంబువలన హనుమంతుని రావణునిఁగా శంకించి తద్దర్శనజనితమనఃప్రసాద మాలోచించి దాని నిరాకరించుచు హేత్వర్థసంహితం బగువాక్యంబున నిట్లనియె. 737

ఉ. అక్కట నిన్ను రాక్షసుఁడ వంచుఁ దలంచితి నిన్నుఁ జూచినఁ
జక్కఁగ నాదుడెందమునఁ జాల ముదం బిగిరించుచున్న దీ
విక్కడి క్రూరదైత్యుఁడవొ వృక్షచరుండవొ నాకుఁ దెల్పు పెం
పెక్కఁగ రామదూత వగు దేని శుభంబులు నీకుఁ గల్గెడిన్. 738

చ. పనివడి నీవు రాఘవుఁడు పంపఁగ వచ్చినదూత వేని యో
వనచరవర్య యమ్మనుజవర్యుగుణాతిశయంబులుఁ జగ
ద్వినుతకథావిధానములు వేగమె దెల్పుము నామనంబు బో
రన హరియించి తీవు జలరంహము నిమ్నగ గట్టునుం బలెన్. 739

వ. అని పలికి వెండియు రామదూతాగమనం బత్యంతాసంభావితం బని తలంచి బహుప్రకారంబుల నిట్లని వితర్కించె. 740

ఉ. ఎక్కడ వానరుండు మనుజేశ్వరుఁ డెక్కడ వీని నేఁడు నా
చక్కటి కంపు టెక్కడ విశాలపయోనిధి నుత్తరించి యీ
రక్కసుచేతిలోఁ బడక ప్రాణముతోడుత వచ్చు టెక్క డే
నెక్కడ నిట్టివింత గలదే నిజ మింతయు స్వప్న మారయన్. 741

వ. మఱియుఁ జిరకాలాపహృత నైన యేను స్వప్నంబునందు రామప్రేషితుం డైన వానరుని వీక్షించితి నీస్వప్నంబునం దైనను వీరాగ్రేసరుం డగురాముని లక్ష్మణసహితంబుగా నవలోకించితి నేని యొక్కింత దుఃఖోపశమనంబు గలుగు నీస్వప్నంబును మాత్సర్యంబు సేయుచున్న దని పలికి వెండియు మనంబున: 742

తే. స్వప్నమున వానరునిఁ గాంచి జనులు శుభము
వడయఁ జాలరు నిజము నా కుడుగ కిపుడు
[illegible]ఁగి శుభచిహ్నములు దోఁచు కారణమునఁ
[illegible] నిది నిద్ర గాదు స్వప్నంబు గాదు. 743

వ. [illegible] యిట్లు యథార్థస్వప్నపక్షంబు నిరసించి క్రమ్మఱఁ జతుర్విధవిభ్రమపక్షం బుల నుత్ప్రేక్షించుచు నిట్లనియె 744

తే. వగవ నిది చిత్తమోహమో వాతగతియొ
దాహజోన్మాదజనితవికార మొక్కొ
మఱియు మృగతృష్ణికయొ దీని తెఱఁ గెఱుంగ
రాదు కడు వింతయై దోఁచె నాదుమదికి. 745

క. ఇది గా దున్మాదము గా, దిది యున్మాదపవనమైన స్వప్నోహంబుల్
వదలక నన్నును వానరు, సుసంచితముగ మది నెఱిఁగి యున్నకతమునన్. 746

వ. అని బహుప్రకారంబుల బలాబలంబులు వితర్కించి దనుజులకుఁ గామరూపంబు గలుగుటఁ దలపోసి యవ్వానరపుంగవుని రావణుం డని నిశ్చయించి యేమియుం బలుక కూరకున్న నాహనుమంతుం డద్దేవియభిప్రాయం బెఱింగి శ్రోత్రానుకూలంబు లగుమధురవాక్యంబుల హర్షంబుఁ బుట్టించుచు సందియంబు వాయ ని ట్లనియె. 747

హనుమంతుఁడు సీతకు విశ్వాసజననార్థము రామకథావృత్తాంతము చెప్పుట.

సీ. ఆదిత్యుఁడునుబోలె నధిక తేజస్వియు రాకాబ్జుకైవడి లోకకాంతుఁ
డలకుబేరునిమాడ్కి నధికసంపన్నుండు సమవర్తిచందాన సత్యరతుఁడు
జలజనేత్రునిభంగి శౌర్యసంపన్నుండు కందర్పుఁడునుబోలె సుందరుండు
వాచస్పతియుఁబోలె వాగ్విలాసుఁడు దివస్పతిలీల నధికవైభవయుతుండు

తే. అఖిలసుగుణోత్తరుండు మహారథుండు, శాస్త్రకోవిదుఁ డఖిలదివ్యాస్త్రవిదుఁడు
వేదవిదుఁడు మహాధనుర్వేదవిదుఁడు, రమణి నీవల్లభుం డగురాఘవుండు. 748

తే. అనిమిషేంద్రుబాహుచ్ఛాయ నాశ్రయించి
వీతఖేదులై మోదించు వేల్పులక్రియ
నమ్మహాత్ముబాహుచ్ఛాయ నాశ్రయించి
జనులు హర్షించుచుందురు సంతతంబు. 749

క. ఆకాకుత్స్థునిఁ గపటమృగాకృతి వంచించి నిర్జరారాతి నిను
న్వీఁకఁ గొని తెచ్చె నికఁ దాఁ, డాకర్మఫలంబు నొందు నతిశీఘ్రమునన్ 750

ఉ. అచ్చుగ నేమహాత్ముఁడు మహాటవిలోఁ దను డాఁగురించి నిన్
మ్రుచ్చిలి తెచ్చినట్టి కడుమూర్ఖుని బాణహతి న్వధింపఁగా
నిచ్చఁ దలంచె నట్టిమనుజేంద్రుఁడు రాముఁడు పంప దూతనై
వచ్చినవాఁడ నీకడకు వారక తత్కుశలంబు దెల్పఁగన్. 751

చ. శశివదనా భవద్విరహసంభవదుఃఖముచే విభుండు దాఁ
గుశలముఁ జెప్పె లక్ష్మణుఁ డకుంఠితభక్తి నమస్కరించి తాఁ
గుశలముఁ జెప్పె రామునకుఁ గూర్మిసఖుండు దినేశజుండు దాఁ
గుశలముఁ జెప్పెఁ గీశకులకుంజరుఁ డెంతయు భక్తియుక్తుఁడై. 752

శా. తల్లీ రాముఁడు నిత్యసత్యపరుఁ డా సౌమిత్రియున్ సాగరం
బుల్లంఘించి ఖలుండు నిన్ను గొని పోవుట్లు నీ జాడయున్
నల్లంబంధు వినంగఁ జెప్ప నిదె నీ యాలోకనంబుల్ మాని నీ
సల్లాపంబులు నీవిలాసములు నీచారిత్రముల్ నీదుభా
స్వల్లావణ్యము నీసునోజ్జ్వలగుణము ల్వర్ణించి వర్ణించుచున్ 753

చ. క్షితిసుత దైత్యమధ్యమునఁ జిక్కియుఁ జానకి దైనికంబులన్
బ్రతికితి వింక నాపద దొలంగెడుకాలము చేరువచ్చె సు
వ్రతుఁ డగునీదువల్లభుఁడు భానుజలక్ష్మణయుక్తుఁ డై కపి
ప్రతతులమధ్యదేశమున భాసిలుచుండఁగఁ గాంచె దెంతయున్. 754

ఉ. భూవరపుత్త్రి యేను గపిముఖ్యుల కెల్ల నధీశుఁ డైనసు
గ్రీవసఖుండ వాయుజుఁడఁ గేసరినందనుఁడన్ హనూమదాఖ్యుఁడన్
ఈవనరాశి దాఁటి దనుజేంద్రశిరంబులు దన్ని లోకసం
భావితవీర్యగర్వమున వచ్చితి రామునివార్తఁ దెల్పఁగన్. 755

ఉ. అంకిలిఁ జెప్పలేదు జనకాత్మజ నే ననుమానించఁ గాను మీ
నాంకసమానసుందరున కంచితకీర్తికి రామమూర్తికిన్
గింకరుఁడం దదాజ్ఞ నిను నేర్పునఁ దేర్పఁగ వచ్చినాఁడ నీ
శంక పరిత్యజింపుము విచారము వల్వదు నమ్ము నెమ్మదిన్. 456

సీత హనుమంతుని రామలక్ష్మణుల గుణవిశేషప్రకారం బడుగుట.

వ. అని విన్నవించిన రామునికథావృత్తాంతంబు విని యద్దేవి హనుమంతు నవలో
కించి మృదుమధురవాక్యంబుల వెండియు నిట్లనియె. 757

చ. హరివర యెంత నీవు నిజమాడిన నే మది నమ్మఁ జాల నీ
వటకు వనంబులోన నరవానరనాథులకు న్సఖిత్వ మె
ట్లెఱుఁగునఁ గల్గె రాఘవుల దివ్యకళామహిమంబు లెల్ల నే
కరణి నెఱింగి తీవు వినఁగావలతు న్వివరింపు మింపుగన్. 758

వ. అదియునుం గాక. 759

చ. అరయఁగ రామలక్ష్మణుల యందము చందము తత్ప్రభావముల్
గురుతరవిక్రమక్రమ మకుంఠితతేజము రూపసంపద
ల్వరుసఁగ శరీరవర్ణములు బాహుపదోరుగతిప్రమాణముల్
గుఱుతుగఁ జెప్పితేని కపికుంజర నామది నిన్ను నమ్మెదన్ 760

వ. అనిన విని యమ్మహనీయతనుండు రామలక్ష్మణుల రూపగుణవిశేషంబు లెఱిం
గింపం దలంచి సీత నవలోకించి దేవి మత్కృపాగౌరవంబునందు మనంబునఁ బొడమిన
సందియంబు వాయుటకు మద్భాగ్యవిశేషంబున రామలక్ష్మణులసర్వావయవ
సన్నివేశప్రకారం బెఱింగింపు మని యడిగితివి దీనం గొంత యేమియు దెలియ
నవిస్తరంబుగా వినిపించెద దత్తావధానవై వినుమని యిట్లనియె. 761

హనుమంతుఁడు సీతకు రామలక్ష్మణుల రూపగుణవిశేషంబు లెఱింగించుట.

శా. తల్లీ రాముఁడు రూపవంతుఁడు సమస్తప్రాణసంరక్షణో
ద్యల్లీలాచతురుండు దానకరుణాదాక్షిణ్యసంపన్నుఁ డు
త్ఫుల్లాంభోరుహపత్రనేత్రుఁడు జగత్పూజ్యుండు త్రైలోక్యసం
పల్లాభానుభవైకదక్షుఁడు జగత్ప్రఖ్యాతశౌర్యుం డిలన్. 762

చ. అతులితభూరితేజమున నర్కనిభుండు మనీషచే బృహ
స్పతిసముఁ డోర్పుచే నవనిసన్నిభుఁ డున్నతకీర్తిచే దివ
స్పతి కిల సాటి సేయఁ దగుశౌర్యముచే భుజగేంద్రశాయికిం
బ్రతి యగు భూసుఖత్వమునఁ బంకజవైరికి జోడు రాఁదగున్. 763

ఉ. ఆశ్రితపోషణుండు సుగుణాభిరతుండు జితేంద్రియుండు వ
ర్ణాశ్రమధర్మరక్షణమహామహిముండు జగన్నుతుండు సాం
గశ్రుతిపారగుం డమరకల్పుఁడు దానరతుండు సర్వలో
కాశ్రయుఁ డుత్తమద్విజగణావనతత్పరుఁ డెన్ని చూడఁగన్. 764

తే. రాజవిద్యావినీతుండు రాజధర్మ, నుస్థిరుఁడు బ్రహ్మచర్యవ్రతస్థితుండు
వితతగుణమండనుఁడు బహుశ్రుతుఁడు సత్య,శీలవంతుఁడురఘువంశశేఖరుండు.

ఉ. వేదచతుష్టయజ్ఞపృథివీసురపూజ్యుఁడు సర్వలోకమ
ర్యాద లెఱింగి తత్సరణి నందఱ నేలునియంతయుర్ యజు
ర్వేదవినీతుఁడుం గడువివేకియుఁ గర్మవిధిజ్ఞుఁడు న్ధను
ర్వేదరహస్యకోవిదుఁడు వీరుఁడు సాధుజనోపకారియున్. 766

మ. ఘనపద్మారుణలోచనుం డమలశంఖగ్రీవుఁడుర్ దుందుభి
స్వననిర్ఘోషుఁడు సంభృతాంసుఁడు ఘనశ్యాముండు త్రైలోక్యమో
హనరూపుండు సునాసుఁడు న్సమవిభక్తాంగుండు స్నిగ్ధుండు వీ
రనయైకజ్ఞుఁడు గూఢజత్రుఁడు మహోరస్కుండు రాముం డిలన్. 767

తే. పూర్ణచంద్రాననుండు సంపూర్ణతేజుఁ, డనఘుఁ డాజానులంబిబాహార్గళుండు
మానశరకోటిసంకాశసుందరుండు, మత్తమాతంగగమనుండు, మానధనుఁడు.

వ. మఱియును. 769

క. గురుమణిబంధము ముష్టియు, నురముస్థిరత్వంబు నొందియుండుటవలనన్
దరుణీమణి రఘువిభుఁ డు,ర్వరలోఁ ద్రిస్థిరుఁ డనంగ వర్ణితుఁ డయ్యెన్. 770

క. క్రమమున ముష్కంబులు కను,బొమలును బాహుద్వయంబు పొసఁగ బ్రలంబ
త్వము నొంది యుంటచే న,క్లముండు నుతి కెక్కెఁ ద్రిప్రలంబుం డనఁగన్. 771

క. సమకేశాగ్రుండును దగ, సముజానుతలుండు మఱియు సముష్కుఁడునై
కొమరొందుఁ గాన సీపతి, క్షమలోఁ ద్రిసముం డనంగ సన్నుతి కెక్కెన్. 772

క. కుక్షియు నాభ్యంతరమును, వక్షం బున్నతము లగుచు వఱలెడుఁ గానన్
దక్షుం డగు సీపతి మీ,నాక్షి త్రిసమున్నతుండనా నుతి కెక్కెన్. 773

తే. పంకజేక్షణ నేత్రాంతపాణిపాద
తలనఖములందు రక్తిమ గలిగి యునికి
వాసవసమానుఁ డైననీవల్లభుండు
పొందుగఁ ద్రిరక్తుఁ డన ధాత్రిఁ బొగడు వడసె. 774

తే. తుహినకరముఖి ఘనశిరోరుహవరాంగ
ములను మఱియును బాదరేఖలను దనరు
చారుసుస్నిగ్ధతావిశేషంబు గలిగి
యునికిఁ ద్రిస్నిగ్ధుఁ డనఁ జాల వినుతి గాంచె. 775

క. స్వరమును సత్త్వము నాభియు, నురుతరగాంభీర్య మొందియుండుటవలనన్
సరసిజముఖి నీవల్లభుఁ, డరయఁ ద్రిగంభీరుఁ డనఁగ నభినుతి కెక్కెన్. 776

క. ధ్రువముగ నుదరతలంబున, యువతీ కంఠమునఁ ద్రివళు లుండుటవలనన్
దివిజేంద్రనిభుఁడు రాముఁడు, త్రివళీమంతుఁ డన నభినుతిం గాంచె నిలన్. 777

క. వనజాక్షి పాదరేఖలు, ననువుగ స్తనచూచుకంబు లవనతములు నై
దనరారుఁ గాన నీవిభుఁ, డనఘుఁడు త్ర్యవనతుఁ డనంగ నభినుతి కెక్కెన్.

తే. పద్మలోచనకంఠంబు ప్రజననంబు
జంఘికలు పృష్ఠ మరయ హ్రస్వంబు లగుట
వలన రఘువల్లభుఁడు చతుర్హ్రస్వుఁ డనఁగ
జగతి లక్షణవిదులచేఁ బొగడు వడయు. 779

క. అరయఁగ నావర్తత్రయు, పరివేష్టితశీర్షుఁ డగుటఁ బార్థివపుత్రీ
ధర లక్షలజ్ఞు లారఘు,వరుని నుతింతురు త్రిశీర్షవంతుం డనుచున్. 780

తే. పుణ్యసాధ్వి తదంగుష్ఠ మూలమందు
శ్రుతిచతుష్టయసంప్రాప్తి సూచకాభి
లలితరేఖాచతుష్టయం బలరు చున్కి
నన్నుతింతురు దగఁ జతుష్కలుఁ డటంచు. 781

తే తామరసనేత్ర తత్పాణితలములందుఁ
దగ లలాటంబునందుఁ బాదంబునందుఁ
బరఁగ రేఖలు నాలుగు వఱలు చునికి
క్షితిఁ జతుర్లేఖుఁ డనఁగ విశ్రుతి వహించు. 782

వ. మఱియుఁజతుర్వింశత్యంగుష్ఠాత్మకంబై నహస్తంబు కిష్కువనం దగునట్టికిష్కు
చతుష్టయప్రమాణదేహంబు గలవాఁడు గావునఁ జతుష్కిష్కుం డతం డగు
నదియునుం గాక. 783

తే. తొడలు మోఁకాళ్లు మఱియు జేతులును బిక్క
లరయ నీనాలుగు సమంబు లగుటవలనఁ

దల్లి నీవల్లభుం డైన దాశరథుఁడు
క్షితిఁ జతుస్సముఁ డనఁగఁ బ్రసిద్ధి గాంచె. 784

మ. కరముల్ గన్బొమలుం గటోష్ఠపదదృక్కర్ణంబులుం జూచుకో
త్కరనాసాపుటముష్కపృష్ఠమణిబంధంబు ల్రహిం జానుకూ
ర్పరముల్ తుల్యములై మనోజ్ఞరుచిచే రాజిల్లుటం జేసి యు
ర్వర విఖ్యాతి గనెం జతుర్దశసమద్వంద్వుం డనా నెంతయున్. 785

తే. అబ్జముఖి దంతపంక్తిద్వయంబునందుఁ
జాలు గొని పార్శ్వపదముల నాలుగేసి
లలితదంతవిశేషముల్ గలిగి యునికిఁ
దనరు నారఘుపతి చతుర్దంష్ట్రుఁ డనఁగ. 786

క. హరివిధమున శార్దూలము, కరణి మహోక్షంబుపగిది గంధగజము వై
ఖరి నడుచువాఁడు గావున, వఱలుఁ జతుర్గతి యనంగ వనరుహనేత్రా. 787

వ. మఱియు బంధుజీవకుసుమబింబఫలారుణమాంసలాధరంబును బరిపూర్ణమాంస
లోన్నతహనువును దీర్ఘోన్నతరుచిరపుటనాసికయుఁ గలవాఁడు గావున మహోష్ఠ
హనునాసుం డనం బొగడు వడసె నదియునుం గాక. 788

క. అంచితతనూరుహాస్యన, ఖాంచలవాక్చర్మములు మహామృదులములై
మించుం గావున నీపతి, పంచస్నిగ్ధుం డనంగఁ బాటికి నెక్కెన్. 789

తే. పరఁగ నూరులు జంఘికల్ బాహువులు వ
రాంగుళులు కడు దీర్ఘంబు లగుటఁ జేసి
యష్టవంశవంతుం డన నవనిలోన
నధికవిఖ్యాతి వడసె నీయధివిభుండు. 790

క. స్తననఖకరపదజిహ్వా, ననతాలుముఖోష్ఠలోచనము లీపదియుఁ
వనజాకృతి నొప్పుటచేఁ, దనరు భవద్వల్లభుండు దశపద్ముఁ డనన్. 791

క. శిరమును గంఠము కర్ణము, లురము హృదంఘ్రులును బృష్ఠ ముదరము ఫాలం
బురువులయి శోభించుఁ గావున, సరసిజముఖి యలరు దశవిశాలుం డనఁగన్.

క. అనుపమసంపద్వైభవ, మున యశమున భూరితేజమున సంతతముం
దనరారుచుండుఁ గావున, జననీ త్రివ్యాప్తుఁ డనఁగ సన్నుతి వడయున్. 793

క. క్షితి మాతృపితృకులంబులు, నతిపరిశుద్ధంబు లగుట నార్యులచే న
న్నుతి వడయు విభుఁడు కమలా, యతనేత్ర ద్విశుక్లవంతుఁ డనఁగా నొప్పున్.

తే. స్కంధమును ఫాలతలము వక్షస్థలంబు
కుక్షియును ఘ్రాణమును మఱి కక్షియుగ్మ
మున్నతము లై ప్రకాశించుచునికి జనక
సుతు షడున్నతుఁ డనఁగ విశ్రుతి సహించు. 795

తే. మఱియు నంగుళీపర్వంబు లరయఁ గేశ
రోమనఖచర్మములును శ్మశ్రులును మఱియు
దర్శనము శేఫమును జాలఁ దనువు లగుట
సవతనుం డన వఱలు నా నరవరుండు. 796

వ. మఱియు నిత్యంబులు బూర్వాహ్ణమధ్యాహ్నపరాహ్ణకాలంబులచేఁ గ్రమంబున ధర్మార్థకామంబుల నుపార్జించుఁగావునఁ ద్రివ్యాప్తుం డన నొప్పు నిట్టిసకలశాస్త్రోక్తమహాపురుషలక్షణంబులు సకలసుగుణాభిరాముం డగు రామునకొక్కనికిఁ దక్క నన్యుల కెవ్వరికి లే వదియునుంగాక. 797

తే. సంగ్రహానుగ్రహారతుండు సత్యధర్మ, పరుఁడు సర్వలోకప్రియుఁ డురుగుణుండు
దేశకాలవిభాగవిధిజ్ఞుఁ డమర, భావితుఁడు పురుషాంతరకోవిదుండు. 798

క. ఆమనుజేంద్రునితమ్ముఁడు, సౌమిత్రి కృపానురాగసౌహార్దగుణ
శ్రీమహితరూపయౌవన, కోమలశౌర్యమున నన్నకు న్సరి వచ్చున్. 799

క. ఆనృపనందను లిరువురు, కాననమార్గమున నిన్నుఁ గనుఁగొను కాంక్షన్
మానక వెదకుచు నెక్కడఁ, గానక సంతాప మాత్మఁ గడలుకొనంగన్. 800

హనుమంతుఁడు సీతకు రామసుగ్రీవసఖ్యసంఘటనప్రకారం బెఱింగించుట.

క. చనుదెంచి ఋశ్యమూకం, బను శైలముచెంతఁ బంపయను సరసిని జ
య్యన దాఁటి నినుఁ బదంతిక, వనమున వెదకుచు విరాళి వచ్చుచు నుండన్.

వ. అంతకు మున్ను సుగ్రీవుం డనువానరుండు భ్రాతృనిరస్తుండై మంత్రిచతుష్టయసమేతంబుగా బహుపాదసంకులం బయినయగ్గిరికూటంబున నివసించి యున్నవాఁ డగుటం జేసి యాసమయంబున మహాధనుర్ధరులై తనకడకు వచ్చుచున్నవారి రామలక్ష్మణుల దవ్వులం జూచి వాలిపంపునఁ దన్ను హింసింపవచ్చుచున్నవారిఁగా శంకించి భయమోహితుండై వేఱొక్క శిఖరంబుమీఁదికి రయంబున దాఁటి వారివృత్తాంతం బెఱింగి రమ్మని నన్నుం బంచిన నే నమ్మహాత్ములకడ కతిత్వరితగమనంబునం జని తదీయరూపలక్షణసుషమావిశేషంబులు వీక్షించి మహాపురుషు లని నిశ్చయించి కృతాంజలిపుటుండ నై నారాక యెఱింగించి తదాగమనప్రయోజనం బెఱింగినవాఁడ నై వారి నిద్దఱ వీఁపున నిడుకొని సుగ్రీవునికడకుం దోడ్కొని యరిగితి నంత నానరేశ్వరహరీశ్వరు లన్యోన్యమధురసల్లాపంబుల మైత్రిం బ్రకటించి ప్రీతిసంహృష్టసర్వాంగు లై యిరువురకుం బాటిల్లినయాపదల తెఱంగు దలపోసి యొండొరులకు సాహాయ్యం బాచరించువారై వాలిం జంపి వానరరాజ్యంబు నీకొసంగెద నని రాముండు సుగ్రీవునితో శపథంబుఁ జేసె వానరుల నెల్లదిక్కులకుం బనిచి సీత యున్నచోటెఱింగివచ్చి పదంపడి వైరివధార్థం బరుగునప్పుడు బలసమేతుండ నై బాసటగాఁ

జనుదెంచువాఁడ వని సుగ్రీవుం డొడంబడియె ని ట్లిరువురు కృతప్రతిజ్ఞులై తత్కాలోచితప్రసంగంబు నలుపుచుండ నప్పుడు. 802

చ. దనుజుఁడు నిన్నుఁ బుష్కరపథంబున వే గొనిపోవునప్పు డీ
వనుపమదుఃఖశోకజనితార్తిఁ దపించుచు సంబరంబునం
బనివడి మూట గట్టి గిరిపైఁ బడవైచినసొమ్ము లన్నియుం
దినకరపుత్త్రునాజ్ఞఁ గొని తెచ్చి నరేంద్రున కే నొసంగితిన్. 803

వ. ఇ ట్లొసంగినం జూచి 804

ఉ. స్రుక్కుచు రామభూవిభుఁడు సొమ్ములు నీయవిగా నెఱింగి తా
నక్కునఁ జేర్చి మోహమున నట్టె భవద్విరహాబ్ధిమగ్నుఁడై
యక్కట జానకీ నను మహాగహనంబునఁ బాసి యెంటి నీ
వెక్కడి కేగితే యనుచు నెంతయు మూర్ఛితుఁ డయ్యె నయ్యెడన్. 805

తే. ఇటుల మూర్ఛితుఁ డగుచు మహీవరేణ్యుఁ
డపుడు బహువిధసాంత్వవాక్యములకలిమి
నేను సౌమిత్రియును వానరేశ్వరుండు
ధీరతాయుక్తి బోధింపఁ దెలివి నొంది. 806

ఉ. సారెకు నాసువర్ణమణిచారువిభూషణపంక్తిఁ జూచుచుం
ఘోరపుటార్తిఁ దూలగతిఁ దూలుచుఁ గన్నుల బాష్పతోయముల్
గాఱఁగ నేడ్చు దుఃఖమున గ్రక్కున మూర్ఛిలుఁ దెల్వి దాల్చు హా
వారిజగంధి యంచు నిను వాకొను నూర్పులు పుచ్చు మాటికిన్. 807

వ. ఇ ట్లనేకప్రకారంబుల శోకవికారంబుల నెఱపుచు. 808

ఆ. వినుము నీవిభుండు విరహశోకంబున, మారుతమునఁ గుజముమాడ్కి నంకు
శమున గజముపగిది జ్వలదగ్నిచే వహ్ని,ధరముభంగి వడఁకుదలకు నుమకు. 809

క. మునుకొని ధరణీకంపం,బునఁ దలకెడుపర్వతంబుపోలికి రాముం
డనఘుఁడు భవద్విరహసం,జనితార్తిఁ దఃఁకుచుండు సతతము జననీ. 810

తే. తల్లి యే మని చెప్పుదుఁ ద్వత్కృతంబు
నం దనిద్రయుఁ బరితాప మధికకార్శ్య
చింత రామునిఁ దపియింపఁజేయుచున్న
వరయఁ బ్రేతాగ్ను లగ్నిమందిరము నట్లు. 811

క. గిరిదుర్గంబులు వనములు, సరసులు వాహినులు శైలసానువులు గుహల్
దిరుగుచు నీవిభుఁ డెవ్వియుఁ, బరికింపఁడు భూరిశోకభారానతుఁడై. 812

క. కావున నీవార్తయు నా, చే విని రాఘువుఁడు వచ్చి చెచ్చెర ననిలో
దేవత లగ్గింపఁగ రక్షోవిభుఁ దునుమాడి నిన్నుఁ గొనిపోవు రహిన్. 813

వ. ఈయర్థంబునందు సందియంబు వలవదు శోకంబు విడువు మని పలికి వెండియు రామునివృత్తాంతంబు విను మని యి ట్లనియె. 814

తే. రాముఁ డీభంగి వానరరాజుతోడ, నెయ్య మొనరించి తనబాస నెఱపఁ దలఁచి
మిహిరనందనసౌమిత్రిసహితుఁ డగుచు, శీఘ్రజవమునఁ గిష్కింధఁ జేర నరిగె.

హనుమంతుఁడు సీతకుఁ దాను లంకకు వచ్చినతెఱం గెఱింగించుట

ఉ. ఆవసుధేశ్వరుండు నిశితాస్త్రమున న్వెస వాలిఁ జంపి సు
గ్రీవుని వానరప్రతతికి న్పతిగా నొనరించె నంత సు
గ్రీవుఁడు రామభద్రునకుఁ బ్రీతి జనింప ననేకకీశుల
న్భూవరపుత్త్రి ని న్వెదకఁ బుచ్చె సమస్తదిగంతరంబులన్. 516

వ. ఇట్లు సుగ్రీవసందిష్టులై శైలరాజప్రతీకాశులగుమర్కటులనేకులు పూర్వపశ్చిమోత్తరదిగ్భాగంబులకుం జని రేనును జాంబవంతుండును నలనీలసుషేణాదులును ద్రిభాగబలసంవృతుం డైనవాలిపుత్త్రు నంగదుం బురస్కరించుకొని దక్షిణదిక్కునకుం జనుదెంచి సహస్రశిరం బైనవింధ్యపర్వతంబు ప్రవేశించి యందు వనదుర్గంబులును గిరిప్రస్రవణంబులునుం బరిశోధించి నిన్నెందునుం గానక శోకించుచు నుండ మాకు సమయకాలం బతిక్రమించె నంత నేము సుగ్రీవకల్పితమాసరూపకాలాతిక్రమణంబునఁ గార్యనైరాశ్యంబున సుగ్రీవునివలనిభయంబునఁ బ్రాణంబులు పరిత్యజింప సమకట్టి యొక్కవివిక్తప్రదేశంబున నందఱముఁ బ్రాయోపవిష్టుల మై యుండునప్పు డంగదుండు నీయగపడమియును వాలివధంబును వానరులప్రాయోపవేశంబును జటాయువుమరణంబును సారెసారెకుం జెక్కుఁదెఱంగులం బేర్కొని శోకార్ణవమగ్నుండై విలపింప నప్పు డప్పర్వతకందరంబున నివసించి యున్నజటాయువునన్న సంపాతి యనుగృధ్రనాథుండు భ్రాతృవధంబు విని శీఘ్రంబున మాయొద్దకుం జనుదెంచి కోపంబున మద్భ్రాతయగుజటాయు వెవ్వనిచేత నెచ్చట నిహతుం డయ్యె నని యడిగి యంగదునివలన జనస్థానంబున రాక్షసునిచే భవదర్థంబుగా నిహతుం డగుట యెఱింగి కొండొకసేపు భ్రాతృమరణంబునకు దుఃఖించి నిన్ను రావణాలయంబున నున్నదానిఁగా నెఱింగించిన నే మందఱము సంహృష్టచిత్తుల మై ప్రాయోపవేశంబు చాలించి శీఘ్రంబున లేచి భవత్సందర్శనకృతోత్సాహుల మై సముద్రవేలోపాంతంబునకుం జని సముద్రలంఘనంబునం దసమర్థులై శంకించుచున్నవానరుల నందఱ నాశ్వాసించి యే నొక్కరుండ శతయోజనాయతం బైనసముద్రంబు దాఁటి రాత్రికాలంబున రాక్షసాకులం బయినలంకాపురంబుఁ బ్రవేశించి రావణాలయంబు సర్వంబునుం బరిశోధించి మత్పురాకృతసుకృతపరిపాకవిశేషంబున నిచ్చటం బొడగంటి నిది మద్వృత్తాంతంబు సర్వంబు నీకు విస్పష్టంబుగా విన్నవించితి నింక సుగ్రీవుపనుపున భవత్సకాశంబునకుం జనుదెంచిన రామకింకరునిఁగా నన్నెఱింగి సందియంబు విడిచి పుత్త్రభృత్యతుల్యుండనైన నాతో సంభాషింపు మని పలికి వెండియు హనుమంతుం డి ట్లనియె. 517

ఉ. క్షితి విలుకాండ్రలోఁ గడుఁ బ్రసిద్ధికి నెక్కినసీవిభుండు సు

వ్రతుఁడు మహానుభావుఁ డగురాముఁడు సేమము నొందియున్న వాఁ
డతనికిఁ దమ్ము డంచితగుణాకరుఁడై గురువత్సలుండు ధీ
చతురుఁడు లక్ష్మణుం డవనిజా కుశలంబున నున్న వాఁ డొగిన్. 818

ఉ. జానుగ దైవయోగమున స్మృతి నిచ్చట నిన్నుఁ గంటి నం
భోనిధిలంఘనం బిపుడు పొల్పుగ వ్యర్థము గాక చెల్లె ని
న్గానక దుఃఖశోకమున గాసిలుచున్నవనాటవీరులన్
మానుగఁ దేర్పఁ గంటి ననమానవిశాలయశంబుఁ గాంచితిన్. 819

క. దేవీ వెఱవకు మింక నీ,జీవితవిభుఁ డేగుదెంచి చెచ్చెర ననిలో
రావణుని బంధుయుతముగ,వావిరి నధియించి నిన్ను వడిఁ గొనిపోవున్. 820

ఉ. అంబుజనేత్ర రాముఁడు నిజానుజ భానుజుఁ గూడి మాల్యవం
తం బను శైలమందు సతతంబు భవద్విరహప్రభూతశో
కంబున నున్నవాఁ డిపు డికం జని నీవిధ మేను జెప్ప శీ
ఘ్రంబున వచ్చుఁ గీశనికరంబులఁ గూడి దశాస్యుఁ జంపఁగన్. 821

తే. అంబుజేక్షణ మాల్యవదాఖ్యశైల, మఖిలగిరులలో నుత్తమ మగుచుఁ దనరుఁ
గడిమి నచ్చట నుండి గోకర్ణనామ,పుణ్యదేశంబుఁ జేరంగఁ బోయి యందు.

చ. జనకతనూజ యెవ్వఁ డట సంయమిచోదితుఁ డై బలోద్ధతి
స్వనవిధిపుణ్యతీర్థమున వారక గుమ్మురువాని శంబసా
దనుని వధించె నట్టి కపితల్లజు కేసరిపత్నియందు నే
ననిలునకున్ జనించినవనాటుఁడ వాయుసమప్రభావుఁడన్. 823

క. జననీ నిజకర్మంబున, హనుమంతుం డనెడిపేర నలరినవాఁడ
న్వినుతజవసత్వయుక్తుఁడ, నినజునిసచివుండ రాఘవేంద్రునిదూతన్. 824

క. మునుకొని విశ్వాసార్థము, జనకజ నీవిభునినుగుణజాలము లెల్ల
న్వినిపించితి నింక రాముఁడు, జననాయకమౌళి నిను వెసం గొనిపోవున్. 825

క. అన్ని తనవృత్తాంతము రా,మునివృత్తాంతంబు సర్వము న్గడు భక్తి
న్వినిపించిన విని జానకి, మనమునఁ గల దిగులు గొంత మట్టుపడంగన్. 826

క. నానావిధరూపాభి, జ్ఞానంబులఁ గారణముల సల్లాపముల
న్వానరవర్యుని నిక్కము, మానవపతిదూతఁ గాఁగ మది నెఱిఁగి వెసన్. 827

క. మునుకొని యానందాశ్రులు, కనుఁగొనలం గ్రమ్ము దేరఁగమలాయతలో
చన మగువదనము రాహువ,దనముక్తుం డై నశశివిధంబున నలరన్. 828

ఆ. ఏమి నోము చేసి యీవేళఁ బతివార్త, వింటి మంటి ముదము గంటి ననుచుఁ
జాల విస్మయంబు జనియింప సమ్మోద,కలితచిత్త యగుచు నలరు చుండె. 829

—— హనుమంతుఁడు సీతకు రామదత్తం బగునంగుళీయకము నిచ్చుట. ——

వ. అపుడా హనుమంతుండు వెండియు సీత నవలోకించి [illegible] 830

క. వనచరకులజుఁడ ననియు, ననిలున కౌరససుతుఁడ ననియును నన్ను
న్మనుకులునిదూత ననియును, నినవందనుసఖుఁడ ననియు నెఱిఁగితివి గదా. 831

వ. ఇంకను సందియంబు గల దేనిం దీర్చెద నిదె రామనామాంకితం బైనయంగుళీ
యకంబు ప్రత్యయార్థం బమ్మహాత్ముం డొసంగం దెచ్చినవాఁడ దీనిం జూచితివే
ని నీమనంబునం బొడమిన సందియంబును దుస్సహసంతాపంబునుదుఃఖంబునుం
బాయు దీనిం గొను మని యఖండసంధ్యారాగమండలాంతర్గతం బైనమార్తాం
డమండలంబుపగిది నొప్పుదాని ననర్ఘమణిప్రభాపటలజటిలం బైనకాంచనాం
గుళీయకంబు నొసంగినం బ్రతిగ్రహించి భర్తృకరవిభూషణం బైనదానిం బో
లెం జూచి రామునిం జూచినట్ల కామనంబులసంతసిల్లి నిజవదనంబు శరత్కాల
రాకానిశాకరమండలంబుం బోలెనఖండకళాపరిపూర్ణం బై యొప్పునప్పుడా హను
మంతుని నిక్కంబుగా రామదూత యని నిశ్చయించి సందియంబు వదలి యవ
నిజ బహుప్రకారంబులం బ్రశంసించుచు నిట్లనియె. 832

## సీత పరమసంతుష్టయై హనుమంతునిం బ్రశంసించుట.

సీ. శతయోజనాయతజలనిధి నెవ్వాఁడు గోష్పదంబును బోలెఁ గోరి దాఁటెఁ
గపివీరుఁ డెవ్వఁ డొక్కఁడు సాహసంబునఁ బొలుపార నీదైత్యపురము సొచ్చె
నసురేశువలనిభయం బించుకయు లేక ఘనత నెవ్వఁ డశోకవనముఁ జేరె
నెవ్వాఁడు రాముని హేమరత్నప్రభా దీప్తముద్రిక నాకుఁ దెచ్చి యిచ్చె

తే. నట్టినీవు విక్రాంతుండ వతిహితుండ, వతిసమర్థుండ వధికశౌర్యాన్వితుఁడవు
విపులయశుఁడవు సామాన్యకపివి గావు, మిగుల నాతోడ భాషింపఁదగుదువీవు.

వ. అని బహూకరించి వెండియు నిట్లనియె. 834

ఉ. ఓహరివంశశేఖర రఘూత్తముఁ డెంతయు నీప్రభావము
న్సాహసముం బరాక్రమము శౌర్యము దాక్ష్యము నార్జవంబు న
ర్థాహితనీతియుం ధృతియు నాతతతేజ మెఱింగి కాదె యు
త్సాహ మెలర్ప నాకడకు సమ్మతి నిన్బనిచెన్ గృపామతిన్. 835

తే. రాజధర్మవిదుం డగురాముఁడు శుభ, లక్షణోపేతుఁ డైనయా లక్ష్మణుండు
కరము నాపుణ్యవశమునఁ గానలో వి,పన్నులై పోక కుశలులై యున్నవారు.

వ. అని రాఘవులకుశలంబునకు స్వభాగ్యంబు నుగ్గడించి క్రమ్మఱ నమ్మహీపుత్రి
యి ట్లనియె. 837

తే. అగచరోత్తమ మన్నాథుఁ డారఘుపతి, కుశలి యగుట నిక్కంబేని కోపమెత్తి
ప్రళయశిఖిభంగి జలనిధి రశనయైన, యుర్వి యేల దహింపక యున్నవాఁడు.

వ. అని ప్రణయకోపంబునం బలికి వెండియునిట్లనియె. 839

తే. ఆరఘూత్తము లసురుల నైన నిగ్రహింప శక్తులు మఱి వారి కేమి కొదవ
పరఁగ మద్దుఃఖమునకు విపర్యయంబు, లేదటంచు మనంబున నేఁ దలంతు.

### సీతాదేవి హనుమంతుని రామునియొక్క స్థితి నడుగుట

శా. అన్నా రాముఁడు భక్తవత్సలుఁడు సువ్యక్తప్రతాపుండు తా
నన్నుం గానక దుఃఖశోకముల సంతాపించుచున్ డస్సి యా
పన్నుండై రవినందనుండు ధృతిఁ దెల్పన్ మాల్యవంతంబుపై
నున్నాఁడా కుశలంబుతోడ ననుజన్మోపేతుఁడై మారుతీ 841

శా. నామీఁదన్ గృప గల్గునే దశముఖు న్మర్దింపఁగాఁ జూచునే
ప్రేమ న్నన్నెపుడైనఁ బేర్కొనునె సంప్రీతిం బ్రశంసించునే
సామీరీ యిట నాసమీపమున కాసక్తి న్నిను న్బంపుచో
నే మన్నాఁడు రఘూత్తముండు కుతుకం బేపారఁగాఁ జెప్పుమా. 842

తే. ఉత్తమక్షత్రధర్మసంయోగ మాత్మ
నరయునే భ్రాంతుఁడగుచుఁ గార్యములయందు
మోహితుఁడు గాక యుండునే మొనసి పురుష
కార్యములు సేయఁ దలఁచునే కపివరేణ్య. 843

తే. మఱియు మిత్రులయందు సామంబు దాన
మును బ్రయోగించునే రాజముఖ్యుఁడైన
విభుఁడు పరిపంథిజనులందు భేదదండ
ములు ప్రయోగించునే కీశకులవరేణ్య. 844

క. మిత్రులఁ బడయునె ప్రతికృతి,మిత్రులచే నధిగమించి మెఱయునె మఱియున్
ధాత్రి శుభమిత్రుఁ డగునే,మిత్రపురస్కృతుఁడు నగుచు మెలఁగునె చెపుమా.

క సురలప్రసాదము వడయునె, ధరలోపల నాత్మబలము దైవబలంబున్
దిరముగఁ గల్గి చరించునె, యరు దారగవై రిహంత యగునే చెపుమా. 846

క. మనుజాధిపునకు నాపై,మునుపటివలెఁ గరుణ గలదె మునుకొని నన్నీ
ఘనదుఃఖంబువలనఁ గృప, తనరారఁగ నుద్ధరింపఁ దలఁచునె బుద్ధిన్. 847

ఉ. ఎన్నఁడు దుఃఖ మెట్టిదొ యొకింత యెఱుంగక భూరిభోగసం
పన్నత నొప్పు రాముఁ డసమానసుఖార్హుఁడ యొంటిఁ జిక్కి యా
పన్నతనొంది మద్విరహబంధురబాధకు నోర్చి కానలో
నిన్నిదినంబు లెట్లు వసియించె సమీరకుమార చెప్పుమా. 848

క. కౌసల్యకుశలము సుమి,త్రాసతిసేమంబు భరతు ప్రమదంబు సుమి
త్రాసుతుభద్రము జనకుని,కౌశలము వినంగఁబడెనె కాకుత్స్థునిచేన్. 849

తే. మారుతాత్మజ రాముఁడు మన్నిమిత్త,శోకమున నన్యచిత్తుఁడు గాక చాలఁ
బరితపించునె యీదుఃఖవారిరాశి, వలన నన్నుద్ధరింపంగఁ దలచు నయ్య. 850

సీ. అక్షోహిణీపూర్ణ మగుబలంబును రాముపాలికి భరతుండు పంపు నయ్య
దంతనఖాయుధానంతవానరచమూపాళితోఁ గపిరాజు వచ్చు నయ్య
శౌర్యధుర్యుండైనసౌమిత్రి శరములఁ దొడరి దైత్యుల నెల్లద్రుంచు నయ్య

రౌద్రాస్త్రదగ్ధుఁడై రణమునఁ బడినర,క్షగపతి నీక్షింపఁ గలుగు నయ్య
తే. నలినగంధియుఁ గనకవర్ణంబు నైన, పతిముఖము నన్నుఁ బాసినకతన ఘర్మ
కాలతీవ్రాతపమ్లానకమలముక్రియ, నుదితదుఃఖముచేఁ గందకున్నదయ్య. 851
సీ. ధర్మ ముద్దేశించి ధరణి రాజ్యత్యాగమున నెవ్వనికి వ్యథ పుట్ట దయ్యె
నసురమృగాకీర్ణ మగుకాన వర్తింప నిల నెవ్వనికి భీతి గలుగ దయ్యె
మానక యడవిలో మత్పాదసంచారమున నెవ్వరికి వగపొడమ దయ్యె
నట్టిసాహస మైనయధిపతి యాత్మలోఁ బన్నుగ ధృతిఁ బూని యున్నవాఁడె
తే అకట నాకంటెఁ బతికి స్నేహంబునలనఁ, దల్లిదండ్రులు చుట్టలు తగ నధికులు
సములుగారు గావునఁదదాగమనవార్త, నొగివినినదాఁక జీవించి యున్నదాన.
ఉ. ఎప్పుడు వచ్చు రామవిభుఁ డెప్పుడు తద్దశకంఠుఁ ద్రుంచు న
న్నెప్పుడు కోర్కి దీరఁ బురి కెప్పుడు దోడ్కొని వేడ్కఁ బోవు న
న్నెప్పుడు గారవించుఁ దుది యెప్పుడు మద్వ్యసనాంబురాశికిన్
జెప్పఁ గదయ్య కీశకులశేఖర యుల్లము తల్లడిల్లెడిన్. 853
వ. అని యిట్లు మహీనందని మధురంబును మధురార్థయుక్తంబు నగువాక్యంబు పలికి క్రమ్మఱ నమ్మారుతపుత్త్రుఁ డిచ్చురామార్థయుక్తంబును మనోభిరామంబు నగు నదుత్తరంబు వినుకోర్కిం జేసి యూరకున్న నద్దేవిపలుకులు విని యవ్వానరశ్రేష్ఠుండు శిరంబున నంజలి గీలించి వినయంబున నిట్లనియె. 854

హనుమంతుఁడు సీతకు రాముని యప్పటిస్థితిని దెల్పుట.

ఉ. ఒచ్చెము గల్గి రామవిభుఁ డొండు దలంచినవాఁడు గాఁడు నీ
విచ్చట నున్కిఁ దా నెఱుఁగ కిన్నిదినంబులు జాగొనర్చె నే
నచ్చుగ నేగి నీదువిధ మంతయుఁ జెప్పినఁ దక్షణంబ దా
వచ్చు ననేకవీరపరివారితవానరసైన్యయుక్తుఁడై. 855
క. వచ్చి నిశాతశరంబులఁ జెచ్చెర సంభోధి నింకఁ జేసి రణములో
మచ్చరమున దశకంఠుని, ద్రచ్చి వధించి నిను నిక్కువము గొనిపోవున్. 856
క. నినుఁ గొని చనుటకు రాముఁడు, చనుదెంచెడునపుడు సురనిశాచరులైనన్
ఘనమృత్యులైన నడ్డము, చనుదెంచినఁ దునిమి వైచు శాతశరములన్. 857
చ. తరుణి భవద్వియోగపరితాపపరిప్లుతుఁ డై రఘూద్వహుం
డరయ వనంబులో మృగవరార్దిత మైనమహాద్విపంబువై
ఖరిఁ దగ శర్మ మెంతయును గానక గాసిలుచుండు నిత్య మే
నరిగి భవద్విధంబు దెలియ న్వినిపించెద నంత వచ్చెడున్. 858
ఉ ఇమ్ముగ దేవదంతిపయి నింద్రుఁడుఁ బోలె మహీధరాగ్రదే
శమ్మునఁ గూరుచున్న రఘుసత్తము పంకజపత్త్రనేత్రయు
కమును జారుకుండలయుతంబును బింబఫలారుణాధరో

ష్ఠ మ్మగుతన్ముఖంబు నల చందురునిం బలెఁ జూచె దెంతయున్. 859

తే. జగతి మజ్జీవనావకాశంబు లైన, వింధ్యమందరదర్దురవిబుధనిలయ
మలయపర్వతములు మూలఫలము లిపుడు,సాక్షిగా సత్య మాడితి జనకపుత్రి.

సీ. మనువంశవర్యుండు మాంసంబు మెసవఁడు కోర్కితో మధువున్గ్రోలఁ డెపుడు
ధరణి వాన ప్రస్థ ధర్మోచితం బైనకందమూలఫలాదికంబు దెచ్చి
చేనతలకుఁ బితృదేవతలకు భూతములకును దగ నతిథులకుఁ బెట్టి
మైనవపాలు తా నైదవ కాలంబు నందుఁ గొంచెముగ నిత్యము భుజించు

తే. సంతతంబు భవద్గత స్వాంతుఁ డగుచు, మానవేంద్రుఁడు దంశక మశకకీట
పన్నగపిపీలికాదులబాధ యెఱుఁగ, డేమి చెప్పుదు నవ్వేత లిందువదన. 861

క. జనకసుత కామవశమునఁ, దనమది నన్నియును మఱచి దశరథతనయుం
డనిశము శోకపరాయణుఁ, డనిశము త్వద్ధ్యాననిరతుఁ డై యుండు రహిన్.

క. మానుగ నిద్దుర యెట్టిదొ, కానఁడు నీవిభుఁ డొకింత కనుమూసినచోఁ
దా నంతలోన మేల్కను, హాసీరజనేత్ర సీత యని పేర్కొనుచున్. 863

సీ. కమనీయనవమల్లికావల్లికలఁ జూచి వనిత నీమృదుగాత్ర మని తలంచు
సహమానకోమలబిసకాండములఁ జూచి యువతిజ నీబాహువులని తలంచు
రమణీయపల్లవసముదయంబునుఁ జూచి జనకజ నీయంఘ్రు లని తలంచు
లలితరాకేందుమండలము విలోకించి వనజాక్షి నీయాస్య మని తలంచు

తే. నిత్య మే మని చెప్పుదు నీవిభుండు, గాఢవిరహాబ్ధివీచికల్ గప్పుకొనఁగ
భ్రమసి వనజాతవస్తుసంపదలఁ జూచి, జానకీ యని విలపించు సంభ్రమించు. 864

వ. ఇట్లనేకప్రకారంబుల నమ్మహానుభావుండు త్వత్సమర్పితచేతనుండై నిత్యంబును
నిన్నె తలంచుచుఁ బరిపంథివధంబునందుఁ గృతప్రయత్నుండై యున్నవాఁ డమ్మ
హాత్ముని శీఘ్రకాలంబున దర్శించెద వీయర్థంబునందు సందియంబు లేదని పలి
కిన నమ్మరున్నందనునిపలుకులు విని యద్దేవి రామసంకీర్తనవీతశోక యయ్యును
దద్విరహసంతాపాదిశ్రవణంబున వెండియు రామశోకసమానశోక యై శరన్ము
ఖంబునందు సాంబుదశేషచంద్ర యగుటవలనఁ బ్రకాశాప్రకాశయుక్త యైన
రాత్రియుం బోలెఁ జూపట్టుచు వెండియు ధర్మార్థసహితం బగువాక్యంబున
ని ట్లనియె. 865

తే. నరవరేణ్యుఁ డనన్యమనస్కుఁ డగుచు
నున్నవాఁ డని నీ విప్పు డన్నమాట
యమృత మయ్యె శోకంబున నడలుచున్న
వాఁ డనినమాట విష మయ్యెఁ బవనతనయ. 866

—సీత రావణునిసమయమును హనుమంతునితోఁ జెప్పి దుఃఖించుట.—

తే. అరసి చూడ నైశ్వర్యమం దైన ఘోర, దుఃఖమునం దైనఁ బురుషుని దొలఁగనీక

త్రాడుచేఁబోలె బంధించిదైవ మెపుడు,తిగుచు నిక్క మీవచనంబునగచరేంద్ర.

క. వనచరశేఖర దైవం,బనివార్యము ప్రాణికోటి కనవరతంబు
న్నను రామలక్ష్మణుల నీ,యనువున దుఃఖితులఁ జేసె నక్కట కంటే. 868

తే. వాతహతవస్తుసంపూర్ణ భారవాహి, తరణిచందాన రఘువంశపరివృఢుండు
దుస్తరం బైనయీవిపత్తోయరాశి, దాఁటి తత్పార మేనాఁడుదఱియఁగలఁడు.

చ. పదినెల లాయె నీదనుజపాలుఁడు నన్ జెఱ దెచ్చి యింకఁ దాఁ
గొదుకక రెండుమాసములకు న్వధియించెద నంచుఁ బల్కె భీ
తి దొలఁగ రామభద్రుఁ డరుదెంచుట యెన్నఁడు పంక్తికంధరు
న్వదలక ద్రుంచు టెన్నఁ డిఁక నన్నుఁ గనుంగొను టెన్నఁ డొప్పుగన్. 870

వ. వనచరోత్తమా యీసంవత్సరకాలంబు పరిపూర్ణం బగునంతకు నిన్ను హిం
సింప నొల్ల నవ్వల హింసించెద నని దురాత్ముం డగురావణుండు సమయంబుఁ
జేసె నిప్పుడు దశమమాసంబు ప్రవర్తించుచున్నది తక్కిన రెండుమాసంబులు
కడచనిన నప్పాపాత్ముండు నన్నుహింసించు నీయర్థంబు రామునకుఁజెప్పి యమ్మ
హాత్మునిం దోర సేయుము. 871

చ. ఖలుఁ డగుపంక్తికంధరుఁడు కాలవశంబున దుర్వివేకియై
యెలమిగ నన్ను రాఘవున కిమ్మని యొద్దికతో విభీషణుం
డలయక యెంత చెప్పిన దురాత్ముఁడు దా వినఁ డయ్యె నింక న
త్యలఘుశరంబుల న్రఘుకులాగ్రణి వాని వధించు టెన్నఁడో. 872

వ. మఱియు మత్కృతంబునందు దురాత్ముం డగురావణుండు నిత్యంబుఁ జేయు
దుర్మంత్రంబు నెల్ల నిమ్ముగా నెఱింగి వచ్చి విభీషణునిపుత్త్రిక యనల యనునది
మాతృనియోగంబున నాకు రహస్యంబుగా నెఱింగించుచు రాముండు వచ్చి
రావణుం బరిమార్చి నిన్నుం దోడ్కొని పోవు వెఱవ కుండు మని ధైర్యంబు
దెలుపుచుండు నయ్యర్థంబు పరిశుద్ధం బగుమదీయచిత్తంబున దృఢంబై ప్రకా
శించు చుండు నెవ్వండు జనస్థానంబున నసహాయుం డై ముహూర్తార్ధమాత్రం
బున ఖరదూషణసమేతంబుగాఁ జతుర్దశసహస్రరక్షోవీరుల నశ్రమంబునం బరి
మార్చె నట్టిరామున కెట్టిశత్రుం డైనఁ దలంకకుండునె యమ్మహానుభావు
యందుఁ బౌరుషంబు నుత్సాహంబును సత్త్వంబు నానృశంస్యంబును గృతజ్ఞ
తయు విక్రమంబును బ్రభావంబును సుస్థిరంబులై యుండు నాధీరోత్తముండు
వ్యసనంబులచేతఁ జలింపంజేయుటకు శక్యుండు గాఁ డేను శక్రుని ప్రభావంబు
పులోమజ యెఱింగు నట్లు రాముని ప్రభావం బెఱింగియున్నదాన నా
వల్లభుం డనుదివాకరుండు శరంబు లనుకరంబులరాక్షసకులం బనుజలాశయంబు
శోషింపం జేయు నీదశాననుం డెవ్వ రెంతఁ జెప్పిన వానిమేనిలోఁ బ్రాణంబు
లుండ నన్ను విడువండు కాలవశంగతుం డైనయద్దురాత్మునిరణంబునమృత్యువన్వే
షించుచున్న దని య శ్లీలతాదృశంబు లగుబహువిధాలాపంబులరామార్థంబు

నందుఁ గృతనిశ్చయ యై పలుకుచున్న యద్దేవిపలుకులు విని వెండియు హను
మంతుం డి ట్లనియె. 873

-హనుమంతుఁడు సీతను దనవీఁపుపై నుంచికొని సముద్రమును దాఁటెద ననుట.-

సరసిజనేత్ర రాఘవుఁడు చయ్యన వచ్చి దశాస్యు నాజిలోఁ
బోరిగొని నిన్నుఁ దోఁడుకొని పోవు నిజం బది నమ్మ వేని సు
స్థిరముగ నాదువీఁపున వసింపుము వేగొని యబ్ధిదాటి భూ
వరునకు ని న్నొసంగెదను వహ్ని బలారికి హవ్యమున్బలెన్. 874

ఉ. వీఁ డొకకీశమాత్రకుఁడు వీఁపున నన్ను వహించి వార్ధి నె
ట్లోడక దాఁటువాఁ డనుచు నుల్లమునందుఁ దలంచితేమొ యా
జాడన చూడు మిప్పుడు నిశాచరసంయుత యైనలంకతోఁ
గూడఁ ద్రికూటము న్బెఱికి కొంచు వడిం జన నేర్తు జానకీ. 875

వ. కావున సంశయంబు విడిచి మదీయపృష్ఠభాగంబు నధివసింపుము మున్ను చను
దెంచినతెఱంగున నశ్రమంబున నిన్ను మోచికొని యరిగెదనట్లు గావించితివేని
వ్యవసాయసమాయుక్తుండును స్వదర్శనసత్కృతోత్సాహుండు నై యైరావతగజా
రూఢుం డైనపురందరునిచందంబునఁ బర్వతాగ్రంబున నాసీనుం డైనసాను
జుం డగురాముని దైత్యవధంబునందు విష్ణునింబోలె నీక్షణంబున నీక్షించెదవు
చంద్రునితోడిసంయోగంబు గోరు రోహిణీదేవికై వడి రామునితోడి సంయో
గంబు కాంక్షించి మత్పృష్ఠభాగంబు నారోహించి యింద్రచంద్రాదిత్యులతో
సంభాషించుచున్నదానియట్లు గగనార్ణవంబులు తరింపుము వియన్మార్గంబునం
జనునప్పుడు నన్ననుసరించుటకు లంకానివాసు లగురాక్షసులు సమర్థులుగా రని
పలికిన నద్భుతం బైనయతనివాక్యంబు విని హర్షవిస్మితసర్వాంగి యై యద్దేవి
వెండియు హనుమంతున కిట్లనియె. 876

చ. హరివర నన్ను మోచికొని యంబుధి నశ్రమలీల దాఁటి స
త్వరముగ రామునొద్దకు ధ్రువంబుగ నేగెద నంచుఁ బల్కె దీ
వరయఁగ నేగతిం జనెద వల్పశరీరుఁడ వింత వవ్వు సు
స్థిరముగ నెంచి చూడ భవదీయకపిత్వ మటంచుఁ దోఁచెడిన్. 877

-హనుమంతుఁడు సీతకు నిజరూపమును జూపుట.-

ఉ. నా విని యమ్మరుత్సుతుఁడు నాభుజసత్త్వము నాప్రభావ మీ
దేవి యెఱుంగకున్కి నతిధీరుని నల్పునిఁ గాఁగ నెంచె మ
ద్దేవగిరీంద్రతుల్యఘనదేహముఁ జూపుదుఁ గాక యంచుఁ దా
భావమునం దలంచి నరపాలునిగేహినిఁ గాంచి యి ట్లనున్. 878

క. అరుదార నాప్రభావం, బెఱుఁగక నన్నల్పుఁ గాఁగ నెంచితి వింక నా
గురుతరరూపముఁ జూపెద, సుచిరముగ భయము దక్కి చూడుము తల్లీ. 879

వ. అని పలికి యమ్మారుతనందనుండు శరీరవర్ధనవేగకృతశాఖాభంగధ్వని విని రాక్షసులు తన్నెఱుంగుదు రని తలంచి తత్ప్రదేశంబు నతిక్రమించి సీతాప్రత్యయకారణంబునఁ ద్రివిక్రమదేవునిభంగి మేనఁ బెంచి మేరుమందరసంకాశదివ్యదేహుండును దీప్తానలసమప్రభుండును మహనీయతామ్రవదనుండును వజ్రదంష్ట్రనఖుండును భీషణసందర్శనుండు నై యమ్మహీనందనికట్టెదుట నిలిచి మేఘగంభీరభాషణంబుల నిట్లనియె. ౮౮౦

క. గిరిగహనదుర్గగోపుర, పరిఖాప్రాసాదసౌధపరివృతి యగునీ
పురిని బెకలించి కడు సత్వరముగఁ గొనిపోవ నేను దక్షుఁడ సరిమున్. ౮౮౧

క. కాపేయమున నశక్తుఁడ, నై పలికినవాఁడఁ గాను నగుబాఱఁగ నా
రూపముఁ జూచితివి గదా, యేపున నాశక్తి కొలఁది యెఱుఁగుము తల్లీ. ౮౮౨

క. జననీ మఱిఁ జలియింపకు, మనుమానము వలదు పేక్ష యవ్వల నిదె మొ
య్యన రామలక్ష్మణులకై, మనమున శోకంబు విడువు మన్నింపు ననున్. ౮౮౩

సీ. అన విని సీత మహాద్రిసన్నిభుఁ డైన హనుమంతుఁ గనుఁగొని హరివరేణ్య
నీదుసత్త్వంబును నీదుధైర్యంబును బెల్లంబుగా నేను దెలిసికొంటిఁ
బవనునివేగంబు పావకుతేజంబు నీయందు నిక్కంబు నెగడుచుండుఁ
బ్రకృతి వానరుఁ డెట్లు పాథోధి లంఘించి గురుశక్తి నీలంకఁ జొరఁగ నోపు
తే. శరధిముద్రిత యైనయీజగతి నెల్ల, భూరిభుజశక్తిఁ దాల్ప నోపుదువు నీవు
వంతమున నన్నుఁ గొనిపోవు టెంత నీకు, లలితగుణధామ వానరకులలలామ.

వ. అని బహూకరించి వెండియు నిట్లనియె. ౮౮౫

సీత తాను హనుమంతుని వీఁపుపై నెక్కి సముద్రము దాఁటుట కనుపపత్తులు సెప్పుట.

సీ. వనచరోత్తమ నన్నుఁ గొనిపోవ దక్షుండ వైనను నీతోడ నరుగు టెంచు
టిది నాకు హితము గా దెట్లన్న వడి నీవు పుష్కరపథమునఁ బోవునపుడు
వేగభయంబున వీఁపున నిలు పోపఁ జాలక వనరాశిసలిలమందుఁ
బడుదాన నవశనై పడిన నన్ను సముద్రచరజంతువులు పట్టి సంభ్రమమునఁ
తే. దనివి దీరంగ భక్షించు దానఁ జేసి, దాశరథికార్య మెల్ల వ్యర్థ మగుఁ గాన
నగచరోత్తమ నీతోడ నాకు వచ్చు, టెంతయు హితంబు గా దిప్పు డెంచి చూడ.

వ. అదియునుం గాక కళత్రవంతుండ వైన నీయందును నిస్సంశయంబుగాఁ బ్రాణసందేహం బగు నది యెట్లనిన భవదీయపృష్ఠదేశంబున నధివసించి చనియెడు నన్ను విలోకించి భీమవిక్రములైన రాక్షసులు రావణసందిష్టులై శూలముసలముద్గరాదిసాధనంబులుఁ గొని శీఘ్రంబునం బఱతెంచి చుట్టుముట్టుకొని యట్టహాసంబు గావింపుదు రప్పుడు నాచేత రక్ష్యభారవంతుండ వైన నీవు ప్రాణసందేహంబు నొందినవాఁడ వగుదువు గావున సాహసకరణంబు కర్తవ్యంబు గాదు వినుము ౮౮౭

తే. అమరవైరులు ఘోరశస్త్రాస్త్రపాణు, లగచరోత్తమ నీవు నిరాయుధుఁడవు
వారితో నెట్లు వినువీధిఁ బోరఁ గలవు, చిక్కకుండ నన్నెట్లు రక్షింపఁ గలవు.

క. దానవుల కభిముఖుఁడవై, పూనిక నీ వతిభరమునఁ బోరుచు నుండన్
మానక యేను భయంబున, వానరకులవర్య జాతి వనధిం బడనే. 889

క. పడినంత దానవులు నను, గడువడిఁ గొని లంక కేగి క్రౌర్యంబునఁ దెం
పడరఁగ భక్షింపుదురో, గెడపుదురో యొండుచోటికిం బాపుదురో. 890

క. పావని జయాపజయములు, దైవాధీనములు గానఁ దడయక నిన్నా
దేవద్వేషులు గెలిచెదరో వారల నీవె గెలిచెదో తెలియ దాగిన్. 891

క. న న్నొండువిధము చేసిన, నిన్నాజిం బట్టుకొనిన నేఁ డంత నభ
స్వన్నందన మనకార్యము, లన్నియును నిరర్థకంబు లై చెడిపోవున్. 892

వ. కపీంద్రా మహాసత్త్వుండవు పరాక్రమవంతులలోన నతివిశ్రుతుండవు వాయు
సమానవేగుండవు బలపరాక్రమవిశేషంబున రాక్షసులన శ్రమంబున జయించి
న న్నపాయంబు నొందకుండ నతిప్రయత్నంబున రక్షించుకొని పోయెద నంటి
వేని వానరసైన్యంబులం గూర్చి యవక్రపరాక్రమంబున రావణుని బాంధవ
సహితంబుగా రణంబునవధించి పౌరుషంబున నన్నుం గొనిపోవ నుపక్రమించిన
రఘువర్యునిప్రయత్నం బంతయు వైఫల్యంబు నొందు నట్లుగాకుండ రాక్షసుల
వంచించి శీఘ్రంబునం గొనిపోయెద నంటి వేని మున్ను జనస్థానంబున రాముని
వంచించి రావణుండు కపటపరివ్రాజకరూపంబున మ్రుచ్చిలించి సీతం దెచ్చె నద్దు
రాత్ముని సంగ్రామంబున వధింపం జాలక రాముండు తత్ప్రతీకారంబునం గ్రమ్మఱ
జానకిం గొనిపోయె నెంత పరాక్రమహీనుం డని శూరులు నిందింతురు దానం
జేసి మానధనుం డగురామునిపౌరుషంబునకు హాని సిద్ధించుం గావున నెల్ల
భంగుల నన్నుం గొనిపోవుట నీకుఁగర్జంబుగాదు రాముండుభవత్సహితంబుగా
యుద్ధార్థియై చనుదెంచిన నది మిక్కిలి గుణం బగు నదియునుం గాక యుద్ధపరి
శ్రాంతుండ వై యుండ నప్పుడు రాక్షసులు నన్నుం గొని చని రామలక్ష్మణులు
వానరు లెఱుంగ కుండునట్టిరహస్యప్రదేశంబున నన్ను దాఁచెదరు దానం జేసి
భవదారంభం బంతయు వ్యర్థం బగు రామునిజీవితంబును లక్ష్మణభరతశత్రు
ఘ్నులజీవితంబులును భవజ్జీవితంబులునుసుగ్రీవకులజీవితంబునుమజ్జీవితాధీనం బై
యుండుఁ గావున నారామలక్ష్మణులు నాయందునిరాశులై శోకసంతాపకర్శితు
లై సర్వవానరభల్లూకసహితంబుగాఁ బ్రాణంబులు విడువం గలవారదియునుం
గాక. 893

సీ. అనఘుచరిత్రుఁ డారఘుకులాగ్రణి రాముఁ డొకండు దక్క నా
తనువును ధాత్రి వేఱొకఁడు దాఁకఁగ నర్హుఁడు గాడు నీచవ
ర్తనుఁ డగునీనిశాచరుఁడు తస్కరుఁడై ననుఁదాఁకినందు కే
మనసునఁ జాలఁ జింతిలుచు మాటికి వానివధంబుఁ గోరుదున్. 894

తే. మానవేంద్రుఁడు నాయొద్ద లేనివేళ, గడిమి దుష్టాసురుండు మద్గాత్ర మంటి
మ్రుచ్చిలించి ననుం గొని తెచ్చె నపుడు, సేయునది లేక వివశతఁ జెందియుంటి.

చ. దనుజుఁడు నన్ను ముచ్చిలి మదం బడరం గొని తెచ్చినందు కా
జనపతి రామచంద్రుఁడు నిశాతశరంబుల వానిచేతు లా
ననములు ఘోరసంగరమునం బడఁ గూలిచి పౌరుషంబునం
గొని చనె నేని కీశకులకుంజర తత్ప్రతికారమై చనున్. 896

చ. హరివర మూఁడులోకములయందు రఘూత్తముఁ బోలువీరుఁ డొ
క్కరుఁడును లేఁడు మద్విభుఁడు గంధవహాన్వితుఁ డైనవహ్నియై
ఖరి దనుజన్మయుక్తుఁ డయి కార్ముకకాండములన్ ధరించి సం
గరమునఁ బొల్చి యుండ బలఘన్మరుఁ డైనను జూడ శక్తుఁడే. 897

తే. అమ్మహాత్మునిభుజవీర్య మధికశౌర్య
మలఘుతేజంబు సమరకౌశలము మున్ను
పెక్కుమాఱులు కనియును విని యెఱుఁగుదు
నవ్విభునితోడ సములు గా రమరులైన. 898

ఆ. మత్తదిగ్గజంబుమాడ్కి మార్మసలుచు, నంబకములు దాల్చి యని యొనర్చు
నున్నవాని లక్ష్మణోపేతుఁ దేజోబ్జ, హితుని విభునిఁ జూడ నెవ్వఁ డోపు. 899

చ. ప్రవిమలుఁ డైనభాస్కరుని భానువు లల్పజలంబునట్లు రా
ఘవునినిశాతవజ్రనిభకాంచనకార్ముకముక్తకాండముల్
దివిజవిరోధిజీవితము తెల్లముగా హరియించు నింతలోఁ
బవనతనూజ యవ్విభుని పౌరుషభంగము సేయ నేటికిన్. 900

చ హితమతివై కపిప్రవర యిచ్చటికిన్ రవిపుత్రలక్ష్మణా
న్వితముగ రామభూవిభుని వేగమె దోడ్కొని రమ్ము దీనతం
బతి నెడఁబాసి యీదనుజపట్టణమందుఁ గృశించుచున్న నా
కతులితహర్ష మిమ్ము సముదంచితకీర్తివి గమ్ము మారుతీ. 901

వ. అనిన విని హనుమంతుండు సంతసిల్లి సీత నవలోకించి దేవీ నీవచనంబు స్త్రీ
స్వభావంబునకుయుక్తంబై పరమపతివ్రతావినయంబునకు సదృశంబై లోక
సమ్మతంబై యనన్యసాధ్వీసులభంబై పతిపౌరుషప్రవర్ధనంబై యున్నది యబల
వగునీవు మదీయపృష్ఠభాగంబున నధివసించి శతయోజనాయతం బైనసము
ద్రంబు తరింపంజాలవు పరమకల్యాణగుణాభిరాముం డగురామునిం దక్క
నన్యుని సంస్పృశించుట యుక్తంబై యుండ దని నీ వాడినవాక్యంబు మహా
త్ముం డగురామునిపత్ని వగునీ కనురూపంబై యున్నది నీవుదక్క నొండుయువతి
యీదృశంబైనవాక్యంబు పలుకం జాల దేను భవద్దుఃఖహేతువు లన్నియు
వీక్షించి లంకాదుష్ప్రవేశత్వంబును మహోదధిదుస్తరత్వంబును విచారించి
రామునకుం బ్రియంబుగా నమ్మహాత్మునితోడ నిన్నుం గూర్చుతలంపున గురు
స్నేహంబును భక్తియుఁ దేటపడ నిట్లంటి నంతియె కాని వేఱొక్కండు గాదింక
నేను భవద్వచనప్రకారంబున రామునిసమీపమునకుం జని సముచితంబుగా

సందర్శించి యమ్మహాత్మునితో నీవుదక్షిణసముద్రమధ్యంబున రావణపాలితంబైన లంకాపురంబున రాక్షసీమధ్యంబునం జిక్కి యున్నచందంబును భవద్దుఃఖంబు నుద్బంధనాదిచేష్టితంబును నేనువినుచుండ రావణుండిరస్కరించుటయు నన్నియు నేర్పడ విన్నవించి శీఘ్రంబున లక్ష్మణసుగ్రీవసహితంబుగానిచ్చటికిం దోడ్కొని నచ్చెద రాముండు నమ్మునట్లుగా నొక్కయభిజ్ఞానం బొసంగు మని పలికిన నతని పలుకుల కలరి యద్దేవి రామప్రత్యయార్థంబు గా నొక్కసందేశంబుఁ జెప్పెద దాని నావచనంబులు గా నమ్మహానుభావున కెఱింగింపు మని యి ట్లనియె.

సీత హనుమంతునకు రామకృతకాకసంహారక్రమం బెఱింగించుట.

సీ. మిత్రవంశోత్తమ చిత్రకూటాచలప్రాంతపూర్వోత్తరపాదమందుఁ
దనరుమందాకిని కనతిదూరంబున రమణీయఫలమూలకమల మైన
సిద్ధాశ్రిత మగుప్రసిద్ధాశ్రమంబును బహుపుష్పసౌరభబంధురోప
వనషండములయందు ఘనవిహారము సల్పి జలపరిక్లిన్నవై శ్రమము వాయఁ
తే. బరఁగ నీయంకతలమునఁ బవ్వళించి,యుండ వాయస మొక్కటి గండుమీఱి
యస్మదీయ స్తనాంతర మందు నిశిత,తుండమునఁజీరె భయమదిదొలఁగఁబెట్టి.
తే. ఏను గరమల్గియొకలోష్టమెత్తి వేగ,వాయసముమీఁద వైచినఁబాయకదియు
నందెయుండినిశాతనఖాగ్రతుండ,ములవిదారించె నెంతయుఁ జలము మెఱయ.

వ. ఇట్లు భక్ష్యలోలుపవాయసంబుచే విదారితనై నీవీబంధంబు వదల వసనంబు జాఱ రణత్కాంచికాకలితరశనాదామంబు నాకర్షించుచు వాయసంబుమీఁదం బొడమినకోపంబు దిగ్గన లేచి వాయసోత్సారణార్థం బొక్కింత దూరంబరిగి మరలి వచ్చి నీచేత నవహసితనై సిగ్గునం దలవాంచి క్రమ్మఱ సుఖాసీనుండవైన నీ యుత్సంగంబున నాసీననై వాయసోత్సారణంబునం దసమర్థనై దుఃఖించుచు నప్పుడేను సంప్రహృష్టచిత్తుండవైననీచేతఁ బరిసాంత్వితనగుచు బాష్పపూర్ణ ముఖనై కన్నీరు మార్జించుచుఁ బరిశ్రమంబువలనఁ గొండొకసేపు భవదంక తలంబున నిద్రించి మేల్కొనినపిమ్మటఁ గ్రమంబున నీవుమదంకంబున నిద్రించి యుండ వెండియు నక్కాకంబు సుప్తప్రబుద్ధనైననన్ను డాసి సారెసారెకు మదీయస్తనాంతరంబునంజీఱినఁ దద్వ్రణసంజాతరక్తబిందుసందోహసముక్షిత శరీరుండవై లేచి కాకతుండాఘాతవ్రణీకృతస్తనాంతరనైనన న్నవలోకించి సంక్రుద్ధం బైనమహాపన్నగంబుకరణి నూర్పులు నిగిడించుచు. 905

క. వనజాతనేత్ర యెవ్వఁడు, మునుకొని ని న్నిట్లు చేసె మూఢతఁ బంచా
నన భుజగముతో నెవ్వాఁ డను,వుగఁ గ్రీడింపఁ దలఁచె నని రోషమునన్. 906

క. నలుదెసలు చూచి నాముం,గల శోణితసిక్తపటునఖంబై మిగులం
దలఁకక నా కభిముఖముగఁ, జలమున వర్తించువాయసముఁ గని యలుకన్.

చ. మనమున దాని నింద్రునికుమారునిఁ గా నతిసత్త్వశాలిఁ గా
ననలసమాన వేగునిఁ గనద్రిగుహాంతరవాసిఁ గా నెఱిం

గి నృపవరేణ్యకన్నుగవ కెంపు దలిర్పఁగ దర్భఖండముం
గొని ద్రుహిణాస్త్రమంత్రమునఁ గూర్చి ఖగంబుపయి న్రయంబునన్. 908

క. నిగిడించిన యయ్యస్త్రము, యుగాంతకాలాగ్నిభంగి నుద్దీపితమై
భగభగ మండుచుఁ గీలలు, గగనము నిండంగ నడరెఁ గాకముమీఁదన్. 909

వ. ఇట్లరిగినఁ జూచి యవ్వాయసంబు వెఱచి యమ్మహాస్త్రంబు వెంటరానతిత్వరితగతి దివంబునకుం బఱచి పరిత్రాణకాముండై యింద్రునిం బ్రార్థించియితనిచేతఁ బరిత్యక్తుండై ముల్లోకంబులు తిరిగి తనకు రక్షకు నెందునుం గానక క్రమ్మఱ నీయొద్దకుం బఱతెంచి రక్షరక్షేతియార్తస్వనంబు సేయుచు దైన్యంబునొంది భవదీయచరణంబులకుం బ్రణమిల్లినం గరుణించి మదీయదివ్యాస్త్రం బమోఘం బేమియొసంగెద ననిన నవ్వాయసం బట్లేనినాదక్షిణనేత్రంబీమహనీయబాణంబు పరిగ్రహించుఁ గాక యని పలికె నంత నమ్మహాస్త్రంబు దానిదక్షిణనేత్రంబుగొనియె నిట్లు కాకంబు తననేత్రం బయ్యస్త్రరాజంబున కిచ్చి ప్రాణంబులు రక్షించుకొని నీకును దశరథునకును సారెసారెకు నమస్కరించుచు ననుజ్ఞఁగొని నిజాలయంబునకుం జనియె నిదిభవదీయచిత్తంబునసంస్మరింపుమని యమ్మహానుభావున కభిజ్ఞానంబుగా నిట్లు సీత హనుమంతునితో రామైకసంవేద్యంబైనయభిజ్ఞానంబుఁ జెప్పి దుఃఖావేశంబున నారఘుసత్తముని బుద్ధిస్థునిఁగా సంబోధించి వెండియు. 910

సీత తన్ను రాముం డుపేక్షించె నని యెంచి దుఃఖించుట.

సీ. అక్కట మత్కృతమందుఁ బ్రాణేశ కోపంబునఁ గాకమాత్రంబుమీఁదఁ
గడువడి బ్రహ్మాస్త్ర మఁదరించితివి రయం బడర నేఁడేల న న్నపహరించి
పట్టినదైత్యునిఁ ద్రుంపక ట్లుపేక్షించితి వధినాథ తొల్లిటియట్లు కరుణ
నామీఁదఁ జేసుము నయముతో నీచేత నిల నాథవతి నైన నే ననాథ

తే. సరఁశే నెట్లుందు నానృశంస్యంబు మఱియుఁ, బరమధర్మంబు నీవెచెప్పంగమున్ను
వింటి నేఁడేల యవి యన్యవిధములయ్యె, మఱచితివె తొల్లి నీవన్నమాటలెల్ల.

మ. వితతోదాత్తగుణోత్తరుండవు జగద్విఖ్యాతవీర్యుండ వా
తతసత్త్వుండవు పుణ్యమూర్తివి మహోత్సాహుండ వంభోధిము
ద్రితధాత్రీపరిపాలనక్షముఁడ వాదిత్యేంద్రతుల్యుండ వ
ద్భుతతేజుండ వపారపారుఁడవు సంపూర్ణుండ వీ వన్నిటన్. 912

తే. మిహిరకులవర్య నీమహామహిమ లెఱిఁగి
యున్నదానఁ గావున వైరి నుక్కడంచి
నన్నుఁ దోడ్కొని పోయెదవన్నతృష్ణ
నొడలఁ బ్రాణంబులు ధరియించి యున్నదాన. 913

వ. అని రఘువల్లభు నుద్దేశించి సాభిప్రాయంబుగాఁ బలికి వెండియు హనుమంతున
కి ట్లనియె. 914

చ. నరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకి
న్నరగరుడాదు లెవ్విభురణంబునఁ దాఁకిన నిల్వఁజాల రా
గురుతరబాహువిక్రముఁ డకుంఠితతేజుఁడు రాముఁ డీనిశా
చరుల వధింప కేల కపిచంద్ర యుపేక్ష యొనర్చెఁ జెప్పుమా. 915

తే. విపినచరవర్య నామీఁద వీర్యవంతుఁ, డనఘచారిత్రుఁ డైనరామునకుఁ బ్రీతి
గలుగు నేని యిట్లేల రాక్షసులమీఁద, వాఁడిశరములేయ కూరకున్నాఁడు చెపుమ.

ఉ. అమ్మనుజేంద్రుతమ్ముఁడు మహామహవనఘుఁడు లక్ష్మణుండు బా
ణమ్ముల నొక్కమాత్ర భువనంబులు మూఁటిని గూల్చ నోపువాఁ
డమ్మహనీయమూర్తి భయదాస్త్రపరంపరల న్నిశాటసం
ఘమ్మును ద్రుంప కేల హరిసత్తమ యూరక యున్నవాఁ డొగిన్. 917

చ. గురుతరశౌర్యు లయ్యు రణకోవిదు లయ్యు సమర్థు లయ్యు ని
ర్జరుల కజయ్యు లయ్యు రఘుసత్తము లాజి నిశాటకోటులం
బొరిగొని నన్ను వేగ గొని పోవక చాల నుపేక్ష సేయు టో
హరివర నాయభాగ్య మని యాత్మఁ దలంచెద సారెసారెకున్. 918

వ. అని కరుణంబుగాఁ బలికి కన్నీరు నించిన నమ్మహీపుత్రివచనంబు విని మహాతేజుఁ
డగుహనుమంతుం డి ట్లనియె. 919

హనుమంతుఁడు సీతాదేవి నూఱడించుట.

ఉ. తల్లి భవద్వియోగజనితం బగుదారుణశోకవహ్నిచే
నుల్లము తల్లడిల్లఁగ రఘూత్తముఁ డెప్పుడు నీదుచింతచే
నొల్లఁడు పానమజ్జనము లొల్లఁడు మూలఫలాదిజీవనం
బొల్లఁడు కంటికి న్నిదుర యొల్లఁడు రమ్యవనీవిహారముల్. 920

ఉ. రామసమానశోకుఁ డగురామునితమ్ముఁడు నన్ను జూచి తా
నేమియుఁ దోఁప కార్తిమెయి నెప్పుడు శోకముఁ బట్టలేక యా
హా మము దైవ మిట్లు విపదంబుధిమగ్నులఁ జేసె నెట్లు నే
నీమహనీయుఁ దేర్తు నని యెంతయుఁ జింతిలు చుండు నిత్యమున్. 921

క. హనుమంతుఁ డెపుడు వచ్చును, జనకజవిధ మెపుడు దెలియు సమరమున రిపుఁ
దునుమాడు టెపుడు జానకిఁ, గనుఁగొను టెప్పు డని కుతుకకలితాత్మకు లై.

వ. ఉన్నవారు గావున నన్నరకంఠీరవులు నావలన నీయున్నచందం బెఱింగి వానర
చమూసమేతంబుగా శీఘ్రంబునం జనుదెంచి యఖండకాండప్రకాండవహ్ని
జ్వాలాపరంపరల లంకాపురంబు భస్మీభూతంబు గావించి బంధుయుక్తంబుగా
రావణుని రణంబునం బరిమార్చి విజయలక్ష్మీవిరాజమానులై నిన్నుం దోడ్కొని

యయోధ్యాపురంబునకుం జనియెద రీయర్థంబునందు సందియంబు లేదు సత్యంబుఁ బలికితి రామలక్ష్మణసుగ్రీవులకుం జెప్పఁ గలసందేశం బానతి మ్మనిన నద్దేవి హనుమంతున కి ట్లనియె. 923

—సీత హనుమంతునితో రామలక్ష్మణులకు సందేశము సెప్పుట.—

సీ. ప్రాచీదిశాంగన పద్మాప్తుఁ గన్నచందానఁ గౌసల్య యెవ్వానిఁ గనియెఁ
బరఁగ నేపుణ్యాత్ము పాదపరాగంబు గౌతమగేహినికలుష మడఁచె
శివధనుర్భంగ ముంకువ గాఁగ మిథిలాధినాథుఁ డెవ్వానికి న న్నొసంగె
నేజగన్నుతునిచే రాజవంశారాతి పరశురాముఁడు పరాభవము నొందె
తే. నట్టిరాముని కఖిలలోకైకభర్త, కార్తజనసాధుగతికి మహాద్రిధృతికి
శిరముచే వందనముఁ జేసి సీత కుశల, మడిగె నని చెప్పవయ్య వనాటవర్య.

సీ. ననుఁ దల్లినట్లు రామునిఁ దండ్రినట్లు సంభావించి యెవ్వాఁడు భక్తి సలుపుఁ
బతికి నెవ్వఁడు సమీపమున లేనిముహూర్తమరయఁ గల్పసమానమగుచుఁ దోఁచు
సంత్యక్తసంపదైశ్వర్యుఁ డై ప్రీతి నేఘనుఁ డన్నతోఁ గూడ వనికి వచ్చె
నాఁకట దప్పిచే నవియకుండఁగ మమ్ము వనమున నిత్య మెవ్వాఁడు ప్రోచె
తే. నదితి బలసూదనునిఁ గన్నయట్లు లోకపూజ్య యైనసుమిత్ర యేపుణ్యుఁ గనియె
నట్టినయశాలి లక్ష్మణుఁ డనఘ నన్నుఁ, బ్రీతిఁ గడ తేర్చునట్లుగా నీతిఁ జెపుమ.
తే. అతఁడు ప్రియదర్శనుండు మహాభుజుండు, వృద్ధసేవి మనస్వియు వీరవర్యుఁ
డన్నమాటకు మాఱాడఁ డనవరతము, నైశ్రవణతుల్యుఁడు ప్రతాపవంతుఁ డనఘ.
తే. సర్వగుణముల దశరథసన్నిభుండు, రాజవినుతుండు నాకంటె రాఘవునకుఁ
బ్రియతరుండు విక్రాంతుండు శ్రీయుతుండు, దండితారాతి ధీరుండు పండితుండు.
తే. రాముఁ డెవ్వానిఁ గార్యభారంబునందుఁ
దగ నియోగించియును దానె దానిఁ దాల్చు
గరిమ నెవ్వానిఁ గాంచి రాఘవుఁ డతీతుఁ
డైనతండ్రిని దలపోయఁ డనుదినంబు. 928
తే. అట్టిసౌమిత్రి కధికశౌర్యాన్వితునకు, శుచికి మృదుచిత్తునకుఁ బరిశుద్ధమతికి
వనచరోత్తమ నాదురవస్థఁ దెల్పి, సేమ మడిగె జానకి యని చెప్పవయ్య. 929

చ. అతఁడు పరాక్రమాఢ్యుఁడు మహాగుణశీలుఁడు భ్రాతృవత్సలుం
డతిహితకారి పుణ్యుఁడు దయాళుఁడు గావున నీవు చెప్పఁగాఁ
జతురత నా తెఱంగు విని చయ్యన వచ్చి నిశాతమార్గణ
ప్రతతుల రావణుం దునిమి రామునకు న్వెస న న్నొసంగఁడే. 930

—సీత రామప్రత్యయార్థము హనుమంతునకు శిరోరత్నం బొసంగుట.—

వ. కపీంద్రా నీ విక్కార్యసంఘటనంబునందు వ్యవస్థాపకుండవు భవత్సమారంభం బువలన రాఘవుండు నాయందు యత్నపరుండు గాఁగలఁడు విశేషించి శూరుం

డగు. రామునితో నావచనంబుగా నింక నొక్కమాసంబు జీవంబు ధరించి
యుండెద నంతకు నీవు శత్రునిం బరిమార్చి నన్నుం గొనిపోక యుపేక్షించితి వేని
ప్రాణంబులు విడిచెద నిది నిక్కంబు గావున నీవు రయంబునం బఱతెంచి రావణుం
బొరిగొని తదుపరుద్ధ నైన నన్నుం బాతాళగత యైన శక్రలక్ష్మినిం బలె నుద్ధరింపు
మని నా రెసారెకుం జెప్పు మని చెప్పి యద్దేవి చెఱంగున ముడిచియున్న దివ్యం
బైన చూడామణి విడిచి రామున కొసంగు మని హనుమంతుని చేతి కొసంగిన నా
హరివరుం డమ్మణిశ్రేష్ఠంబును బ్రతిగ్రహించి దాని కధిష్ఠానం బైన సువర్ణపు
ష్పంబునందుఁ గేశప్రవేశార్థంబు నిర్మితం బైన వివరంబునం దంగుళిఁ బ్రవేశిం
పఁజేసె నంతకుమున్ను సీతకుఁ జూపఁ బ్రదర్శితం బైన విశాలరూపంబు విడిచి క్రమ్మ
ఱ సూక్ష్మరూపంబు నొందియున్నవాఁ డగుటం జేసి యసూక్ష్మం బైనను దద్భు
జం బా వివరంబునందుఁ బ్రవేశింప దయ్యె నిట్లు మణిరత్నంబు కేలం బూని
యద్దేవికిం బ్రదక్షిణంబునుం బ్రణామంబునుం గావించి హర్షపులకితగాత్రుం డై
మనంబున రామునిం దలంచి నమస్కరించి యభూతపూర్వశోభావిశేషంబున
నలరుచు వినయవినమితోత్తమాంగుం డై కేలుదోయి ఫాలంబునం జేర్చి పవ
నావధూతవిముక్తం బైన గిరిపోలికిఁ జూపట్టుచు సుఖచిత్తుం డై ప్రతిప్రయాణం
బున కభిముఖుం డై పార్శ్వభాగంబునం గొలిచియుండె నివ్విధంబున శిరోర
త్నం బొసంగి యద్దేవి వెండియు హనుమంతున కిట్లనియె. 931

చ. వదలక ప్రత్యయార్థము ధ్రువంబుగ నిమ్మణి నీ కొసంగితిం
బదిలము గాఁగ దీని రఘుభర్త కొసంగుము జూచినంతనే
హృదయమునందు నన్ను జనయిత్రిని దండ్రిని సంస్మరించి తా
ముదము వహించు నెంతయు సముత్సుకతం బరవీతఖేదుఁ డై. 932

ఉ. పావనమూర్తి యైన నరపాలునితోడ సవిస్తరంబుగా
నావిధ మంత దెల్పి కరుణానిధిఁ దోడ్కొని వచ్చి యాజిలో
రావణుఁ గీటణంచి నను రామునితోఁ బగఁ గూర్పు మింక నో
పావని వేయి యేటి కింక భారము నీయది గాదె చూడఁగన్. 933

సీత దుఃఖంబున రామునిం దోడ్కొని రమ్మని హనుమంతుని వేఁడుట.

ఉ. వీఁక సమీరునంతబలవిక్రమశాలికిఁ బుట్టినందు కి
ట్లోకపివీర వారాజలధి నుక్కున నొక్కట దాఁటి వచ్చు ట
స్తోకము గాదు నీకు మము దుఃఖపయోధి మునుంగ కుండఁగాఁ
జేకొని నానమూడ్కి దరిఁ జేర్చినఁ గాక యశంబు గల్గునే. 934

వ. వానరోత్తమా యీ కార్యసమారంభంబునం దుత్తరకార్యం బెయ్యది దానిఁ
జింతింపు మీ కార్యసంఘటనంబునందు వ్యవస్థాపకుండవు గావున నీవు ప్రయ
త్నంబు గావించి నాకు దుఃఖక్షయకరుండ వగుము భవదీయయత్నంబు దుఃఖ
క్షయకారియగు నని హనుమంతుం డట్లు కాక యని ప్రతిజ్ఞఁ జేసి యద్దేవి

చరణంబులు శిరంబులు సోఁకం బ్రణమిల్లి గమనోన్ముఖుం డగుటయుఁ దత్ప్ర
కారం బెఱింగి యవ్వైదేహి బాష్పగద్గదకంఠి యై యి ట్లనియె 935

సీ. వనచరశ్రేష్ఠ రామునకు లక్ష్మణునకు హరివల్లభున కంగదాదికీశ
పరులకు నాయున్కి వరుసతోడ నెఱింగించి వానరోపముఁడు మద్వరుఁడు నన్ను
పేక్షింపక నుద్ధ క్తి రక్షించునట్లుగా బోధించి దుఃఖపయోధివలన
నుద్ధరింపుము సంతతోత్సాహయుక్తంబు లైనసీవాక్యంబు లాలకించి
ఆ. ధర్మవిదుఁడు విభుఁడు దయతోడఁ బౌరుష, మాశ్రయించి క్షత్రియార్హమైన
వీరవిధిని జాలవి స్తరింపఁగఁ జేయు, మఱవఁ గలఁడె పూర్వమహిమ లెల్ల. 936

ఆ. ఏను బ్రతికి యుండ నినకులవరుఁడు న, న్నంచితముగ గారవించు టెట్లు
గలుగునట్లు నీవు కడువడి ధర్మంబు, విక్రమంబు దెలియ విన్నవింపు 937

హనుమంతుఁడు సీత నూఱడించుట

సీ. అన విని హనుమంతుఁ డంజలి ఘటియించి యవనిజతోడ ని ట్లనియె దల్లి
వానరపరివృతుం డై నీదువల్లభుఁ డతిరయంబున వచ్చి యరులఁ దునిమి
నిను వేడ్కఁ గొనిపోవు నిక్క మమ్మహనీయవీర్యున కెన యైనవీరుఁ డెందు
లేఁడు చారణయక్షలేఖకిన్నరసాధ్యసిద్ధాదు లైనఁ దచ్ఛితశరముల
తే. వాఁడిమి సహింపలేరు భవన్నిమిత్త, మఖిలదివిజుల నైన శితాస్త్రవహ్ని
గాల్పఁగా నోపు నొక్కఁడై త్ర్యక్షవ్వీర్యుఁ,జంపు టన నెంత యమ్మహాశౌర్యనిధికి.

క. జనకాత్మజ వీరోత్తముఁ, డనఘుఁడు నీవిభుఁడు సాగరావృత యగుమే
దిని నంతయు శాసింపఁగ, ముదు నీకొనుకొఱకె విజయముం బొందుననిన్.939

సీత రామలక్ష్మణులు వానరసమేతులై సముద్రము నెట్లుదాఁటుదురని చింతించుట.

వ. అని పలికిన సత్యస్వరూపం బైనహనుమంతునివచనంబు విని సంతసిల్లి బహుప్ర
కారంబుల మన్నించి ప్రస్థితుం డై నయతనినారెసారెకు నిరీక్షించుచున్నవిషయ
పతిస్నేహప్రకాశకం బైనతద్వాక్యకౌశలంబు సమ్మానించుచు నప్పవననంద
నునితో మహాత్మా యిచ్చట నొక్కదినంబు నివసించి గూఢప్రదేశంబునవిశ్రాం
తుండవై యెల్లి యరుగు మల్లైన భవత్సాన్నిధ్యంబువలన మందభాగ్య నైనన
న్నధిగమించి పరితపింపఁజేయు చున్నయీదురంతదుఃఖంబునకు నొక్కముహూ
ర్తం బైన మోక్షణంబు గలుగు నీవు గ్రమ్మఱం జనిన భవదదర్శనసంభూతం
బైనశోకంబు దుఃఖపరాభూతృష్ట నైననన్నుఁ బూర్వదుఃఖముఁ బ్రజ్వలింపఁజేయు
చున్నదానియట్లు మిక్కిలి పరితపింపం జేయునీవు పునరాగమనార్థం బరుగు
చుండ బత్ప్రాణంబులకు సంశయంబు లే దదియునుంగాక భవత్సహాయు లైన
వానరులవిషయంబునం దొక్కమహాసందేహంబు నాయుల్ల మూర్తీభవించి
యున్నదానియట్లు చూపట్టుచున్నది హరిసైన్యంబులును రామలక్ష్మణులు దుష్పా
రం బైనసముద్రంబు నెట్లొఱంగున దాఁటి రాఁగలరు నైన తేయునకును వాయ

వునకును నీకు నీమువ్వురకుం దక్కఁ దక్కినవారికి సముద్రలంఘనంబునందు సామర్థ్యంబు లేదు దురతిక్రమం బైనయేతత్కార్యసంఘటనంబునం దుపాయం బేమి తడవి చెప్పెదవు నీవు రావణాదివధపూర్వకమన్మోక్షణరూపం బైన యీకార్యసాధనంబునందుఁ బర్యాప్తుండవై తివేని శక్తిసమృద్ధియుయశంబును నీకె గాక నాకుం గలుగ నేరదు రాముండు ససైన్యుండై సముద్రంబు దాఁటి వచ్చి లంకాపురంబు శరంబుల శోషింపంజేసి రణంబున రావణుం బరిమార్చి విజయియై నన్నుం గొని పోయె నేని యది నాకు యశస్కరం బగు నంతియె గాక యదియె రామునకును సదృశంబై యుండుఁ గావున నారఘువల్లభున కట్టి విక్రమం బనురూపం బెట్లగు నట్లుగా బోధింపు మని పలికిన నర్థోపహితంబును బరస్పరసంగతంబును హేతుసంగతంబును బ్రాగనుక్తంబు నగుసీతావాక్యంబు విని వెండియు హనుమంతుం డిట్లనియె. 940

హనుమంతుఁడు సీతకు వానరులబలవిశేషం బభివర్ణించి చెప్పుట.

సీ. వైదేహి వినుము సర్వవనాటసేనకు నాథుండు పద్మినీనాథసుతుఁడు
శూరుండు ధీరుండు సుగ్రీవుఁడు కృతప్రయత్నుఁడై యున్నవాఁడతఁడు వేగ
ఘోరకీశసహస్రకోటిసమేతుఁడై వైరవధార్థంబు వచ్చునతని
కమితసత్త్వులు విక్రమాఢ్యులు చిత్తసంకల్పసంపాతుల నల్పబలులు

తే. వానరు లనేకు లున్నారు వారిలోన, నల్పభుజవీర్యుఁ డొక్కరుండైన లేఁడు
మహితవిక్రము లెట్టికర్మముల వెంట, నైన నెన్నఁడు హీనత లేనివారు. 941

క. పరమోత్సాహయుతులు పుష్కరచారులు పెక్కుమార్లు సాగరధరణీ
ధరగహనజంతుయుత యగు, స్థిర కర్థిఁ బ్రదక్షిణమ్ము చేసినవారల్. 942

క. శౌర్యనిధు లజస్రము పరి, పర్యటనమునం దధఃప్రపాతమునందుం
దిర్యగ్గమనమునందు న,వార్యులు భుజసత్త్వయుతు లుపాయజ్ఞు లిలన్. 913

తే. అచట నున్నవానరవీరు లందఱును స
మానబలులు మత్తుల్యులు మద్విశిష్టు
లరయ నాకంటెఁ దక్కువ యైనవాఁడు
వారిలో నొక్కఁడును నిక్కువముగ లేఁడు. 244

క. అచ్చుపడఁగ నంభోనిధి, చెచ్చెర లంఘించి యేను చెలువుగ నిటకు
న్వచ్చితిఁ దక్కినవారలు, వచ్చుట కనుమాన మేమి వారిజనేత్రా. 215

క. క్రమమున దౌత్యము సేయఁగ, బ్రమసియు ఘను లైనవారిఁ బంపరు రాజో
త్తములు జఘన్యులఁ బనుతురు, క్షమలోన న్నట్టివానిఁగాఁ గనుఁగొనుమా.

క. చాలు గొని ప్లవగులందఱు, వాలాయము నొక్కపెట్ట వచ్చెద రిటకుం
జాలింపుము పరితాపము, గీలింపుము చిత్తమందుఁ గేవలముదమున్. 947

వ. మఱియు నరకంఠీరవు లగురామలక్ష్మణులు సముదితులై సచంద్రసూర్యులభంగి వెలుంగుచు మదీయపృష్ఠభాగంబున వసించి సముద్రంబు దాఁటి వచ్చి లంక

నిశ్శంకంబుగాఁ జొచ్చి దివ్యాస్త్రసందోహంబుల బాంధవసహితంబుగా రావ
ణుని రణంబునం బరిమార్చి నిన్నుం దోడ్కొని యయోధ్యకుం జనియెదరు
నీవు సందియంబు వదలి భర్తృసమాగమనంబు గోరుచుఁ బరమానందంబున
నుండు మల్లైన శీఘ్రకాలంబున రావణునిఁ బుత్త్రామాత్యబాంధవసమేతంబుగా
సంగ్రామంబున నాశంబు నొందించి విజయలక్ష్మీవిరాజమానుండై హేతిమం
తుండైనపావకునికరణిం దేజరిల్లుచున్న రాముని శీఘ్రంబునం గనుంగొని
శశాంకునిం గూడినరోహిణిపగిది నమ్మహాత్మునిం గూడి సుఖించెదవు శోకంబు
కడచనుకాలంబు దగ్గఱియె నని యనేకవిధంబుల నద్దేవి నాశ్వాసించి ప్రయా
ణోన్ముఖుండై వెండియు నిట్లనియె 948

హనుమంతుఁడు ప్రయాణోన్ముఖుఁడై సీత నాశ్వాసించుట.

సీ. అవనిజ ధర్మాత్ముఁడైనరాముని ధనుష్పాణియై యున్నలక్ష్మణుని లంక
వాకిళ్ల నరికట్టి వీక బ్రహ్మాండంబు పగుల నార్పుచు ఘోరభంగి సాల
గోపురంబులు ధాత్రిఁ గూలఁ ద్రోయుచు నున్న కీశుల వేగ వీక్షించె దింక
రామునిఁ బోలువిక్రమశాలి యున్యుండు లేఁడు సౌమిత్రితోఁ గూడి వహ్ని
ఆ. సహితుఁడైనగాడ్పుచందానఁ గడు విజృం
భించి దానవుల వధించి సురల
నాజిఁ దోలి తార్క్ష్యుఁ డమృతంబుఁ జేకొన్న
మాడ్కి నిన్నుఁ గొను సముచితముగ. 949

ఉ. భీషణకామబాణపరిపీడితుఁడై రఘువల్లభుండు నం
తోషము గాన కార్తిమెయిఁ దూలుచు గాసిలు చున్నవాఁడు తా
రోషమునన్ దురాత్ము నసురున్ దశకంఠుని జన్మభూమి ఘో
రేషుపరంపరం దునిమి యింపుగ నిన్ గొనిపోవు వ్రేల్మిడిన్. 950

శా. ధీరోదాత్తగుణోత్తరుండు విజయస్థేమాభిరాముండు దు
ర్వారోదగ్రపటుప్రతాపుఁడు రిపుప్రాణాంతకాపాదిదో
స్సారోదారుఁడు భూరిశౌర్యుఁడు రఘుక్ష్మానాథుఁ డాధీవరుం
డీరక్షఃపతి నాజి గీటణఁచు దేవీ చింత నీ కేటికిన్. 951

వ. దేవీ నీవు పురందరునిచేఁ బులోమజయుం బోలె రఘువల్లభునిచే నాథవతి వైతి
వింక నీరాక్షసపరిపాలితం బైనలంకాపురంబునం బెద్దకాలంబు నివసించి యుం
డవు మనోహరుం డైనరామునివదనంబు శీఘ్రంబున విలోకించెద వేను రాముని
యొద్దకుం జనునంత కెంత కాలం బగు నంతకాలంబు సహించి యుండు
మని పలికిన మహాత్ముం డగువాయునందనునివచనంబు విని యమ్మహీనందని పర
మానందభరితాంతఃకరణ యై హనుమంతు నవలోకించి యిట్లనియె. 952

సీత హనుమంతునితో రామునకు సందేశము సెప్పుట.

సీ. అనఘాత్మ ప్రియవాది వైనని న్గని వృష్టి సంప్రాప్తి సర్గసంజాతసస్య
యైనవసుంధరయట్లు సంతసమున వెలసితి నీ వింక విభునితోడ
లంకను రాక్షసలలనానిరుద్ధనై యున్న దానిఁగ నన్ను విన్నవించి
సందియపడకుండ సమదవాయసగర్వ మడఁచినచంద మేర్పడఁగఁ జెప్పి
తే. రవికిరణతుల్య మైనయీరత్నమొసఁగి, విభునిఁ దోడ్తెచ్చి రాక్షసవిభుని ఘోర
కదనతలమునఁ జంపించి కరుణ నాకు, జనపతితనూసస్వయంగ్రాహసౌఖ్య మిమ్ము.
వ. అని పలికి వెండియు రాము నుద్దేశించి యి ట్లనియె. 954
క. మనుకుల నాతిలకము మూ,సిన నీవు ముదంబున మణిసిలతిలకంబుగ
దనరార గండపార్శ్వం,బున దిద్దినచంద మెల్ల బుద్ధిఁ దలఁపుఁడీ. 955
వ. మహాత్మా దివ్యం బైనయీచూడారత్నంబు నాచేతసుపరిరక్షితం బైనయదిదీనిం
జూచి నిన్నుం జూచినట్లుగా వ్యసనంబునందు నొక్కింతసంతోషించుచుండుదుఁ
బ్రత్యయార్థంబు దీని నీకిచ్చి పుచ్చితి నిట్టికష్టంబులం బడియును హృదయసంతా
పకరంబు లైనరాక్షసీజనక్రూరవచనంబులు వినియును గరుణానిధి వగునీవు పగ
తునిం జంపి నన్నుం గొనిపోమొక ననునాశం జేసియును హనుమంతుండు చను
దెంచి భవత్సందేశంబు నెఱింగించుటం జేసియును బ్రాణంబులు చిక్కఁబట్టుకొని
యున్నదాన నింక నొక్కమాసంబు జీవించి యుండెద నంతకు భవత్సమాగ
మనంబు దొరకొనదేని జీవితంబులు విడిచెద భవద్విహీననై దురాత్ముం డగు
రావణునకుం జిక్కి జీవింప నేర్తునే యని యశ్రుపూర్ణముఖ యై పలికిన నద్దేవి
పరిదేవనంబు విని వెండియు హనుమంతుం డిట్లనియె. 956
సీ. వైదేహి రాముఁడు త్వద్వియోగాగ్నిచే నుడుకుచు దీనుఁడై యున్నవాఁడు
అన్నచందముఁ జూచి యనఘుఁడు సౌమిత్రి యధికదుఃఖంబున నడలుచుండు
నీవిధ మంత నాచే విని యమ్మహావీరులు వానరవితతిఁ గూడి
రయమున నరుదెంచి రక్షోయుతంబుగా లక్షించి యరిఁ జంపి లంకఁ గాల్చి
తే. నిన్న యోధ్యకుఁ గొనిపోదు రన్నితముగ, నీకు నెగ్గొనరించిన నీచసతులు
విధవలై యేడ్చుచుండంగ వినిప్రమోద,కలితవై చొక్కు కాలంబు గదియవచ్చె.
క. వనజాతనేత్ర యింక నీ, మనమున శోకంబు దక్కి మానుగ రఘువ
ర్యునిశుభసందర్శనము, ట్లనిశముఁ గాక్షించు చుండు మతిమోదమునన్. 958
వ. దేవి మహానుభావుం డగురాముండు సంతోషించునట్లుగా నింక నొక్కయభిజ్ఞా
నంబుగలదేని యానతిమ్మనవుడు నమ్మహీపుత్రి ప్రాణసమం బైనశిరోభూషణంబు
నీకిచ్చితి రామునకు మనఃప్రియంబు సేయ నిది యెచాలుదీని నవలోకించి రాముం
డు నిక్కంబుగా నన్నుఁ జూచి వచ్చినవాఁడవని నిన్ను మన్నించు సందియంబు
వల దని పలికిన నద్దేవివచనంబు విని హనుమంతుండు సంతుష్టాంతరంగుండై

తచ్చరణంబులు శిరంబు సోఁకఁ బునఃపునఃప్రణామంబులుచేసి గమనోన్ముఖుం
డైన నతనిం జూచి వైదేహి యశ్రుపూర్ణముఖి యై బాష్పగద్గదస్వరంబున
నిట్లనియె. 959

### సీత హనుమంతుని వీడుకొల్పుట.

చ. అనిలతనూజ సింహనిభు లద్భుతవీర్యులు రామలక్ష్మణుల్
ఘనుఁడు దినేశనందనుఁ డకల్మషచిత్తులు కీశపుంగవుల్
మనమున నుబ్బ నాదుకుశలం బెఱిఁగింపుము రామమూర్తితో
ననుఁ గడ తేర్చునట్లు కరుణంబుగ నావచనంబు చెప్పుమా. 960

శా. ఈరక్షఃపతిపీట నిష్కుటములో నే నున్నచందంబునుం
ఘోరం బైనమదీయశోకమును రక్షోభామినీతర్జన
క్రూరోక్తు ల్సకలం బెఱింగితి గదా క్షోణీశుతోఁ జెప్పు మే
పార న్నా తెఱఁ గెల్ల మార్గమునఁ గళ్యాణంబు నీ కయ్యెడిన్. 961

క. అని పలికి వీడుకొల్పిన, మనమున హర్షించి తన్ను మానుగఁ జరితా
ర్థునిఁగాఁ దలఁచుచు మారుత,తనయుం డచ్చోటు వాసి తనచిత్తమునన్. 962

వ. కార్యశేషం బెట్లని వితర్కించె. 963

### హనుమంతుఁడు సీతం బాసి కార్యశేషం బాలోచించుట.

క. జనకజను గంటి మానుగ, నినవంశజుకుశలవార్త యెఱిఁగించితి రా
మునిసత్కృప నావచ్చిన, పనియంతయు నేఁటికిటు సఫల మయ్యెఁ గదా. 964

తే. ఇంక రావణుతోడ నరేంద్రుమహిమ, లభినుతించి సంభాషించి యతనిచంద
మంతయు సవిస్తరంబుగా నరయఁబోలు, నిపుడు దీనికిసదుపాయ మెద్దియొక్కొ.

చ. దనుజు లధర్మచిత్తు లతిదర్పితు లుద్ధతు లుగ్రపాపవ
ర్తను లటు గాన వీరియెడ దానము సామము భేద మేమియుం
బనిగొన దేను విక్రమము పాటిగఁ గైకొని దైత్యవీరులం
దునిమితి నేని యవ్వల మృదుత్వము పుట్టు నిశాటభర్తకున్. 966

క. పాయక సుజనుల కపస్కృతి, సేయుచు వర్తించు వానిచిత్తము దండో
పాయమునఁ గాక యితరో,పాయంబులఁ జక్కఁబడునె పరికింపఁగన్. 967

తే. పృథివి నెవ్వాఁడు కార్యనిర్దిష్టుఁ డగుచుఁ, బూర్వకార్యవిరోధంబుపుట్టకుండఁ
దివిరిబహుకార్యములనుసాధించునాతఁ, డఖిలకార్యనిర్వాహకుండనఁగఁబరఁగు.

తే. పరగఁ గార్యంబు మిక్కిలి స్వల్ప మైన, దాని కేకకారణము సాధనముగాదు
బహువిధంబుల నర్థమెవ్వాఁ డెఱుంగు, ధర నతఁడు శక్తుఁ డర్థసాధనమునందు.

### హనుమంతుఁ డశోకవనమును భంజింప నిశ్చయించుట.

సీ. ఏ నిపు డూరక యేఁగి దశాననుం డెట్టివాఁ డేచంద మెంత సత్త్వ
మెఱిఁగింపు మని మానవేశ్వరుం డడిగిన నే మని చెప్పుదు నతనిచంద

మెఱుఁగి పోవుట కర్జ మింతకు నారాక యెఱిఁగించి విక్రమవృత్తి దాల్చి
దనుజులతోడ యుద్ధముఁ జేసి శౌర్యంబు ధీరత్వమును లావు తేటపఱచి
తే. సమరమునఁ బంక్తికంఠుని శౌర్యధైర్య, సత్త్వబలగర్వములు వానిసాహసంబు
నాజినిపుణత హృదయస్థమైనమతము, సర్వము నెఱుంగనగు నాకుసంతసమున.
ఉ. ఆరజనీచరేశు ప్రియమైనవనం బిది నేత్రహారియై
చారులతానికుంజతరు సంయుతమై యమనందనోపమం
బై రమణీయ కాంతిఁ జెలువారుచు నున్నది చిచ్చు శుష్కకాం
తారమునట్లు దీనిఁ బరిణాశము నొందఁగఁ జేసెద న్వడిన్. 971
చ ఇటుల వనంబు భగ్న మగు టెంతయుఁ దా విని పంక్తికంఠుఁ డు
త్కట మగు కోపవేగమున దైత్యబలంబులఁ బంపు నాజికిం
జటులత నేగుదెంచి రథసంబునఁ దాఁకుదు రట్లు దాఁకినం
దటుకున వారిఁ జంపి సుపథంబున నేగెద రామునొద్దకున్. 972

హనుమంతుఁ డశోకవనము నంతయు విఱిచి వైచుట.

వ. అని చింతించి యదియె కర్జంబుగా నిశ్చయించి యప్పురున్నందనుండు శైలో
త్పాటనచాతురీధురీణుం డై ననమీరణునిభంగి వేగంబు వహించి ప్రావృట్కాల
వలాహకంబుకరణి మేనుఁ బెంచికాలహుతాశనునిచాడ్పునఁ గ్రోధంబంగీకరించి
ప్రళయకాలమార్తాండమండలంబు పగిది ముఖమండలంబు గ్రాల రాక్షసక్షయ
నిమిత్తం బైనధూమకేతువుంబోలె లాంగూలంబు దనర ననంతబలసంపన్నుం
డై విజృంభించివృక్షషండంబుల నుత్పాటింపనారంభించియంబరోల్లిఖితశాఖా
శిఖాగ్రంబు లైనభూరుహంబులు బడలుపడం ద్రోయుచు లతావితానంబులం
ద్రెంచుచు నికుంజంబులు భంజించుచు సింహశార్దూలవరాహాదిక్రూరమృగం
బులఁ బాఱందోలుచుఁబర్వతాగ్రంబులుచూర్ణంబుసేయుచు వాపీకూపంబులు
పూడ్చుచు గంధసింధురంబులీలజలాశయంబులుచొచ్చికలంచుచుఁ దాన్రుకినల
యక్లాంతంబు లైనకొమ్మలు విఱుచుచులతాగృహచిత్రగృహశిలాగృహంబులు
విఱుగంద్రోయుచు ఫలంబులు రాల్చుచుఁ బుష్పంబు లున్మూలించుచు నిట్లనేక
ప్రకారంబుల సీత యున్నశింశుపావృక్షం బొక్కటిదక్కఁదక్కినవనంబంతయు
విధ్వస్తంబు గావించిన నవ్వనం బూరువేగసమున్మథితవృక్షంబును గ్లాంతద్రుమ
లతాయుతంబును బ్రభిన్నసలిలాశయంబును జూర్ణితపర్వతాగ్రంబును వినాశిత
క్రీడాగృహచిత్రగృహలతాగృహశిలాగృహంబునువ్యాకులితమహోరగవ్యాళ
మృగంబును సముత్పాటితలతాసమూహంబునై దావానలహతం బైనశుష్కా
రణ్యంబుపగిదిఁ బ్రణష్టరూపం బైయొప్పె మఱియుమృగపక్షిగణంబులుభయ
విత్రస్తంబు లై రాక్షసులకుఁ గ్రూరనిమిత్తంబులుదెలుపుచు వికృతస్వరంబున
విరావంబులు సేయుచుఁ బఱచందొడంగె మఱియుఁ బ్రమదావనం బైనదశవదన
ప్రమదావనంబు వికసితాశోకలతాప్రతానం బయ్యును హనుమద్బలంబువలన

శోకలతాప్రతానం బై యుండె వృక్షభంగస్వనంబున లంకానివాసులగురాక్షసు
లందఱుఁ ద్రాససంభ్రాంతులై రి త్తెఱంగున మహాతేజుండును మహాసత్త్వుం
డును మహాబాహుండును మహాబలుండు నగుమహాబలనందనుండు ప్రమ
దావనంబు నిస్సాలంబు చేసి రావణున కత్యంతవ్యళీకంబు సంపాదించి రాక్ష
సులకు భయావహం బైనశరీరంబు వహించి నిజతేజోజాలంబు గగనలక్ష్మికిం
బీతాంబరత్వంబు సంపాదింపఁ దోరణారూఢుం డై శంకింపక మహాబలు లైన
పెక్కండ్ర రక్కసులతోడ నుక్కున నొక్కండె రణంబు సేయ సమకట్టి
యద్భుతప్రతాపంబునం దేజరిల్లుచు రాక్షసులరాక కెదురు సూచు చుండె
నప్పుడు. 973

రాక్షసాంగనలు మేల్కొని సీతను వనము విఱిచిన వాఁ డెవ్వఁ డని యడుగుట

మ. తరుభంగస్వనము ల్భయంకరఖగధ్వానంబు లాలించి ము
ష్కరదైత్యాంగన లెల్ల మేల్కొని వినష్టం బైనయుద్యానముం
గిరితుల్యుం హరివీరు ఘోరబలుఁ బంకేజాప్తసంకాశు వా
నరవీరుం హనుమంతుఁ గాంచి భయసంత్రస్తాత్మ లై యుండఱున్. 974

చ. జనకజ డాయ నేగి కడుసంబర మొందుచు సీత యెవ్వఁ డీ
వనచరుఁ డేటి కిచ్చటికి వచ్చెను నీ విపు డేల వీనితోఁ
బనివడి మాట లాడితివి బాగుగ నేమి శుభంబు దెల్పె మం
తనముల నెవ్వఁ డంపె నిది దాఁచక మా కెఱిఁగింపు మెంతయున్. 975

వ. అనిన విని వైదేహి వారి కిట్లనియె. 976

చ. తఱుచుగఁ గామరూపు లగుదైత్యులమాయలు మీకె గాక నా
తరమె యెఱుంగఁ బాములపదంబులు పాములె గా కెఱుంగ నొం
డొరులకు శక్యమే యితని నొక్కనిశాటునిఁ గాఁ దలంచి ని
వ్వెఱపడి యున్నదాన నను వెండియు మీ రిటు లేఁచ నేటికిన్. 977

వ. అనిన నద్దానవాంగనలు భయంబున సీతం గాచికొని యుండిరి కొందఱు భీమ
రూపుం డగుహనుమంతునిపరాక్రమప్రకారంబు రావణున కెఱింగించువారై
యతిత్వరితగమనంబున రావణునొద్దకుం బఱచి వికృతాననలై యి ట్లనిరి. 978

రాక్షసాంగన లశోకవనభంగప్రకారమును రావణున కెఱింగించుట.

సీ. దనుజేంద్ర యెవ్వఁడో వనచరుఁ డొక్కఁడు మనయశోకారామమధ్యమందు
జనకజతోఁ గృతసంవాదుఁ డై భూరిభుజబలంబున భవద్ద్విజగణాయు
తం బైనవనము విధ్వస్తంబు గావించె నరయ నొక్కమహీజ మైన లేదు
భయదరూపమునఁ జూపరులకు విస్మయం బురుభీతి పుట్టించు చున్నవాఁడు
తే. అనిమిషాధిపుఁ డంపెనో యముఁడు పంపె
నో కుబేరుఁడు పంపెనో లేక రాముఁ

డవనిసుతవార్త యరసి రమ్మనుచుఁ బంప
నిటకు వచ్చినదూత యో యెఱుఁగరాదు. 979

చ. తరువులు గూల్చియు న్విపులతామరసాకరముల్ గలంచియు
న్సురుచిరహేమశైలములు చూర్ణము చేసియుఁ గూపవాపిక
ల్దెరువులు పూడ్చియున్ లతలు ద్రెంచియు జానకి యున్నశింశుపా
తరు వది ద్రుంపఁ డయ్యె నలఁతం బడియో పనితావనార్థమో. 980

క. ఏ మాసీతకడకుఁ జని, యా మర్కటవీరుఁ డెవ్వఁ డిచ్చటికిని రా
నేమికతం బని యడిగినఁ, గోమలి మా కిట్టు లనియెఁ గోపం బెసఁగన్. 981

చ. తఱుచుగఁ గామరూపు లగుదైత్యులమాయలు మీకె గాక మా
తరమె యెఱుంగఁ బాములపదంబులు పాములె గా కెఱుంగ నొం
డొరులకు శక్యమే యితని నొక్కని శాటునిఁ గాఁ దలంచి ని
వ్వెఱపడి యున్నదాన నను వెండియు మీ రిటు లేఁచ నేటికిన్. 982

వ. అని తా నెఱుంగనియట్లు పలికిన విని మే మందఱము భయంబునం దూలుచు
భీమరూపుం డగుకపివృత్తాంతంబు నీకు విన్నవింపం జనుదెంచితిమి. 983

ఉ. ఓదనుజాన్వయోత్తమ సముద్ధతి నెవ్వఁడు సీతతోడ సం
వాదముఁ జేసి నీవనము భగ్న మొనర్చి మహోగ్రభంగిఁ గ్ర
వ్యాదుల కెల్ల భీతి యొనర్చి జరియించెడు నట్టినిష్కుట
చ్ఛేదిని వానరున్ దునిమి శీఘ్రమున న్మముఁ గావు మిత్తఱిన్. 984

-రావణుఁడు హనుమంతునిమీఁదికి నెనుబదివేలరాక్షసులఁ బంపుట.-

వ. దేవా భవన్మనగపరిగృహీతయైనజానకితోడ నెవ్వండును సంభాషింప సమర్థుండు గాఁ డక్కార్యంబుఁ జేసినవానరుని వధింపు మనిన విని రాక్షసేశ్వరుండై నరావణుండు కోపసంవర్తితేక్షణుం డై చితాగ్నిచందంబున మండి దీపంబులవలనం దొరఁగుసార్చిస్స్నేహబిందువులుం బోలె రోషవిశేషంబున నేత్రంబులవలన నశ్రుబిందువులు రాల నతిరౌద్రదర్శనుం డై హనూమన్నిగ్రహార్థంబు లోకభయంకరు లైనయమకింకరులం బోలినమహాశూరులఁ గింకరనామధేయుల నాత్మసమానుల నశీతిసహస్రంబుల నియోగించిన మహాబలులును మహోదరులును మహాదంష్ట్రులును ఘోరరూపులును మహాసత్త్వులు నగునయ్యెనుబదివేలరక్కసు లుక్కుమిగిలి దిక్కరటికర్ణపుటంబులు బ్రద్దలువాఱఁ బెనుమొగుళ్లవడువున నుచ్చైర్నాదంబులు సేయుచు గదాముసలముద్గరభిండివాల కరవాల శూలపరిఘపట్టిసప్రాసకుంతతోమరాది వివిధసాధనంబులం గై సేసి భీషణరభసాతిశయంబున నగరంబు వెలువడి హనూమద్గ్రహణోన్ముఖు లై యుద్ధాభిమానంబున దావాగ్నిలో నుఱుక గమకించు శలభంబులచాడ్పునఁ దోరణారూఢుం డై త్రిలోకంబుల నాక్రమింప నుపక్రమించిన త్రివిక్రమదేవుభంగి నవక్రపరాక్రమంబునం గ్రాలుచున్నసమీర

కుమారుఁడా యంజని యమ్మహావీరునిం బరివేష్టించి యగ్రభాగంబున సంగ్రామ లంపటులై పొల్చి నిల్చి రిత్తెఱంగునఁ దనముందటఁ దోఁచిన రాక్షసకింకరుల నిరీక్షించి సమరసన్నాహసంరంభవిజృంభితుండై మరున్నందనుం డమందపరా క్రమంబున లేళ్లం గన్నసింగంబుభంగి నుప్పొంగి. 985

ఉ. కాలునిమాడ్కి శూలధరుఁ కై వడిఁ గ్రాలుచు మేరుభూమిభృ
ల్లీల శరీర మొప్పెనఁగ లేఖపతిధ్వజతుల్య దీర్ఘలాం
గూలము ద్రిప్పుచుం దెసలు ఘూర్ణిల బెట్టుగ నార్చుచు న్భుజా
స్ఫాలన మాచరించెఁ గులశైలగుహా ల్ప్రతిశబ్ద మిచ్చుఁగన్. 986

శా. ఆరావంబు నఖండచండతరమై యాశావకాశస్థగం
భీరోదారకరీంద్రకర్ణపుటనిర్భేదంబు గావింప దే
వారు ల్చేష్టలు దక్కి మూర్ఛిలిరి దీనారావము ల్సేయుచుం
ఘోరప్రక్రియ మింటనుండి ధరపైఁ గూలెం ఖగవ్రాతముల్. 987

వ. ఇట్లు భువనక్షోభంబుగా భుజాస్ఫాలనంబుఁ జేసి నిర్మలం బగుతనమనంబున.

చ. అనిమొన దేవదానవుల కైన నెదుర్పఁగ రానిరాఘవుం
డనిమిషలోకసన్నుతమహాభుజవిక్రముఁ డైనలక్ష్మణుం
డనఘుఁడు గంధవాహుఁడు సముంచితశౌర్యధనుండు సూర్యనం
దనుఁడును నాకు సంగరమున న్జయ మిత్తురు గాక సత్కృపన్. 989

హనుమంతుఁ డెనుబదివేలరాక్షసుల నందఱం జంపుట.

ఉ. కోసలనేత యైనరఘుకుంజరుదాసుఁడ భూధరంబులం
గాసిలఁ జేయునంతటియఖండబలుండ దగుగాడ్పుపుత్త్రుఁడ
న్వాసవపద్మగర్భయమువై శ్రవణాదులచే వరంబుల
న్వాసిగఁ గాంచి శౌర్యమున వ్రాలినవాఁడిసుగండ నెంతయున్. 990

చ. అనిమొన నాకు రావణసహస్రము లైనఁ గొఱంత యేమి రా
మునికరుణావిశేషమున భూరిశిలాతరుసాధనంబులం
దనుజుల నందఱం దునిమి తప్పక లంకను బాడు చేసి భూ
తనయకు భక్తి మ్రొక్కి సుపథంబున నేగెద రామునొద్దకున్. 991

వ. అని నిశ్చయించి నభస్వన్నందనుండు సమరోన్ముఖుం డయ్యె నంతకు మున్న రణంబునకుం జనుదెంచి తదీయాస్ఫోటితశబ్దంబున భయశంకితు లై యున్నరా క్షసకింకరులు కొండొకనడపునకు స్వామిసందేశనిశ్శంకులై సమున్నతంబైనసం ధ్యాకాలమేఘంబుచందంబునఁదోరణారూఢుండై యున్నయమ్మహావీరుం జూచి కదియనరిగి భీషణంబు లగునిశాతశస్త్రంబులం బ్రహరించిన నవ్వానరసింహంబు కడు నలిగి వైన తేయుండు మహోరగంబుంబోలెఁ దోరణాశ్రితంబైనకాలాయ సమయం బగుపరిఘంబులీలం గేల నందుకొని రయంబున నాకాశంబున కెగసి

విచిత్రగతులం దిరుగుచు మహావేగంబునం బఱతెంచి శత్రుండు శతారంబున దైత్యులం బోలె నప్పరిఘాయుధంబున నొక్కొక్కవ్రేటునకు దశశతసహస్రసంఖ్యాతంబులుగా నద్దనుజకింకరుల నిశ్శేషంబుగా రూపుమాపి వెండియు సంగ్రామకాంక్షి యై తోరణంబుమీఁదికిం జనియె నంత హతశేషు లగురాక్షసులు భయభ్రాంతులై శీఘ్రంబునం బఱతెంచి యశీతిసహస్రసంఖ్య లగురాక్షసకింకరులందఱు వానరునిచే నిహతులై రని రావణుని కెఱిఁగించిన. 992

రావణుఁడు హనుమంతునిపైకి జంబుమాలిని బంపుట

ఉ. వృక్షచరాగ్రగణ్యభుజవీర్యము తా విని భూరిరోషరూ
క్షేక్షణుఁ డై కడంగి దనుజేంద్రుఁడు సంగరదుర్జయు న్బలా
ధ్యక్షునిఁ గార్యదక్షునిఁ బ్రహస్తకుమారుని జంబుమాలి యన్
రాక్షసవీరు నుత్తమపరాక్రమశీలునిఁ బంపె నాజికిన్. 993

చ. అతఁ డరుదెంచునంతకు మహాబలశాలి మరుత్తనూజుఁ డు
ద్ధతు లగుదైత్యకింకరులఁ దప్పక గీటణఁగించి యంతఁ జం
డతరనిజోగ్రదోర్బలవినాశిత మైనవనంబుఁ జూచి యం
దతులితభంగి నొప్పునొకహాటకసౌధముఁ గాంచి యాత్మలోన్. 994

క. ఈవన మంతయు భగ్నము, గావించితి నింక నొక్కకాంచనసౌధం
బీవంకఁ దప్పియున్నది, ప్రావీణ్య మెలర్ప దీనిఁ బడఁగూల్చెద నగున్. 995

వ. అని చింతించి యచింత్యబలపౌరుషుం డగునవ్వానరశ్రేష్ఠుండు నిజభుజావిక్రమంబు ప్రకటింపం జేయుచు నతిజవంబున మహోన్నతం బైనమేరుశిఖరంబుక్రియ నొప్పుచున్నచైత్యప్రాసాదంబుమీఁదికిలంఘించి నిజతేజోజాలంబున రెండవమార్తాండునిమాడ్కి దుర్నిరీక్షుం డై ప్రభావవిశేషంబున మేనుఁ బెంచి విజృంభించి సమున్నతం బైనపారియాత్రపర్వతంబుకరణిఁ జూపట్టుచుఁ బ్రళయకాలధారాధరంబుకరణి గర్జిల్లుచు సింహనాదంబు చేసిన. 996

హనుమంతుఁడు చైత్యప్రాసాదమును భగ్నము సేయుట

ఉ. ఆనినదంబుచే జగములన్నియు ఘూర్ణిలె ధారుణీధ్రము
ల్లానుగ సంచలించెఁ బొరల న్బడియెన్ జలరాసు లన్నియున్
దీనత నొందె భూతములు దిక్కులు బీటలువాఱెఁ బక్షిసం
తానము మింట నుండి వసుధం బడియె న్బహుళార్తి మ్రొయుచున్. 997

ఉ. అంత మరుత్సుతుండు ఘటితాంజలి యై కడునిష్ఠ రామునిం
బంతముతోడ లక్ష్మణుని భానుకుమారు సమీరునిన్ శచీ
కాంతునిఁ జంద్రజూటు జనకక్షితినాథ తనూజ నాత్మలో
నెంతయు భక్తి నాకు జయ మిత్తురు గా కని సన్నుతించుచున్. 998

క. ఇనవంశజునకు దాసుఁడ, ననిలున కౌరససుతుండ నాదిత్యకుమా
రున కాప్తుఁడ రిపుసేనల, కనిశము నంతకుఁ డనంగ నలరినవాఁడన్. 999

చ. అని మొన నాకు రావణసహస్రము లైనఁ గొఱంత యేమి రా
ముని కరుణావిశేషమున భూరిశిలాతరుసాధనంబులన్
దనుజుల నందఱన్ దునిమి తప్పక లంకను బాడు చేసి భూ
తనయకు భక్తి మ్రొక్కి సుపథంబున నేగెద రామునొద్దకున్. 1000

తే. అనుచుఁ దలపోసియవ్విమానాధిరూఢుఁ, డగుచుమారుతిచైత్యస్థుఁడై నఘోర
దైత్యవీరుల కెల్లఁ గ్రోధంబు వుట్ట, గగనభాగంబు దిక్కులుపగుల నార్చె. 1001

హనుమంతుఁడు చైత్యప్రాసాదరక్షకు లగురాక్షసులం జంపుట

వ. అమ్మహాధ్వని విని చైత్యపాలశతం బదరిపడి లేచి శీఘ్రంబున నానావిధసాయకంబులును ప్రాసనిస్త్రింశపరశ్వధాదిసాధనంబులును ధరించి రయంబునం బఱతెంచి మారుతిం జుట్టుముట్టి యట్టహాసంబు చేసి భాగీరథీజలావర్తంబులపగిది మండలప్రచారంబుల నపసవ్యసవ్యంబుగాఁ బరిభ్రమించుచు నదభ్రమహాభ్రనిభంబు లగుపరిఘంబులును రవికిరణసంకాశంబు లగునిశాతసాయకంబులును గుప్పించి నొప్పించినం గినిసి 1002

శా. అంభోజాప్తసమానతేజుఁ డగుకీశాగ్రేసరుం డప్డు కా
లాంభోభృన్నిచయంబుమాడ్కిఁ దను నత్యంతంబుగాఁ బెంచి స
ర్వాంభోధుల్ గలఁగంగ నార్చుచు విమానాగ్రస్థదీర్ఘధ్వజ
స్తంభం బొక్కటి పెల్లగించె సుభుజా సంరంభ మేపారఁగన్. 1003

వ. ఇట్లు జాంబూనదపరిష్కృతం బైనవిశాలసౌధస్తంభంబు నశ్రమంబుననుత్పాటించి జిఱజిఱం ద్రిప్పుచు. 1004

మ. ఘనుఁ డామారుతి చైత్యసౌధమును వీఁకం గాంచనస్తంభఘ
ట్టన సంభూతమహోగ్రవహ్నిశిఖలన్ దగ్ధంబు గావించి పె
ల్చన నింద్రుండు శతారధార నసురవ్రాతంబునుం బోలె గ్ర
ద్దన నద్దైత్యశతంబునుం దునిమె నుద్దండప్రతాపోన్నతిన్. 1005

వ. ఇత్తెఱంగునఁ జైత్యప్రాసాదరక్షకులఁ దత్క్షణంబ జముప్రోలికిం బుచ్చి యంతరిక్షగతుండై నిజతేజంబున నింగి వెలుంగం జేయుచు రాక్షసు లందఱు విన మేఘగంభీరభాషణంబుల ని ట్లనియె 1006

సీ. రాక్షసవంశనీరదమారుతం బగురామునిపత్నిని రావణుండు
పంచవటమునందు వంచించి కొనితెచ్చె నమ్మహాత్మునిమిత్త్రుఁ డగచరేంద్రుఁ
డనఘుఁడు సుగ్రీవుఁ డాసీత వెదకంగ నాత్మసమానుల నధికబలుల
వశవర్తు లగువారి వానరశ్రేష్ఠులఁ బెక్కండ్రఁ బంచిన నుక్కుమిగిలి

తే. యక్కజంబుగఁ జెలరేఁగి దిక్కులందు, సంచరించుచు నున్నారు సమదవృత్తి
వారిలోపల నే నొక్క వానరుండ, నిచ్చటికి సీత వెదకంగ వచ్చినాఁడ. 1007

వ. మఱియు నాసుగ్రీవునకు దశనాగబలులును దశశతనాగబలులును దశసహస్రనాగ
బలులును మహౌఘనాగబలులును వాయుసమానవేగులును సింహవిక్రాంతగమ
నులును నప్రమేయపరాక్రములును వైనతేయప్రభావులును దంతనఖాయుధులు
నగుహరియూథపు లనేకశతసహస్రాయుతకోట్యర్బుదసంఖ్యాతు లున్నవా రట్టి
సైన్యంబులం గూడి రాక్షసవధార్థంబు లంకమీఁదికి నిశ్శంకంబుగాఁ జనుదెంచు
నదియునుంగాక రావణుండు మహానుభావుం డగురామునితోడ నిష్కారణం
బుగా వైరంబు గొనియె నింక నెక్కడిలంక యెక్కడిమీ రెక్కడిరావణుండు
పరాక్రమధుర్యుం డగురఘువర్యునిశరపరంపరల నిశ్శేషంబుగా మడిసెదరు సంది
యంబు లేదని పల్కి హనుమంతుం డెప్పటియట్లు తోరణారూఢుం డై వైరి
సమాగమంబున కెదురుచూచు చుండె నంత రావణునిచేత ననుజ్ఞాతుండై.

— జంబుమాలి హనుమంతునికడకు వచ్చుట. —

సీ. లలితసువర్ణకుండలతారహారకేయూరకోటీరాదు లొప్పఁ దాల్చి
యసమానదివ్యరక్తాంబరమాలికాచందనంబులు మేనఁ బొందుపఱిచి
కమనీయలోహితాంగప్రభావీచీవికాసితం బైనకంకటము దొడిగి
జంభశాసనశరాసనసమానోదగ్రతరచిత్రమణియుక్తధనువుఁ బూని
తే. రాసభంబులఁ బూన్చినరథము నెక్కి
చండకోదండటంకారశబ్ద మశని
నిస్వనముభంగి దశదిశల్నిండి చెలఁగ
నాలమున కుగ్రగతి జంబుమాలి వెడలె. 1009

వ. ఇత్తెఱంగున నతిరౌద్రదర్శనుండును మహాదంష్ట్రుండును వివృత్తనయనుండును
బ్రచండవిక్రముండును మహాకాయుండు నై కరవాలభిండివాలశూలాదినానా
సాధనంబులు ధరించి నిజకవచప్రభావిశేషంబున వైశ్వానరునిభంగి వెలుం
గుచు నుచ్చైర్నాదంబున నిలునిలు మని యదల్చుచు రథనేమిచక్రక్షుణ్ణసము
ద్ధూతమహీపరాగంబు గగనంబునకుఁ బీతాంబరత్వంబు సంపాదింప నతివేగం
బునం బఱతెంచిన. 1010

ఉ. అంతకుభంగి ఘోరరభసాతిశయంబున రౌద్రవృత్తి న
త్యంతమహోగ్రకోపవివశాత్మకుఁ డై చనుదెంచుదైత్యు న
ల్లంతనె చూచి వాయుసుతుఁ డల్లన వాలము ద్రిప్పుచుఁ దా మది
నంతన మంకురింప ఘననాద మెలర్పఁగ నుండె నత్తఱిన్. 1011

— జంబుమాలి హనుమంతునితో యుద్ధముచేసి చచ్చుట. —

ఉ. ఆహరివీరువిక్రమవిహారముఁ జూచి సహింప కుగ్రుఁ డై
సాహస మొప్ప దానవుఁడు శక్రునిఁ దాఁకెడువృత్రులీల ను
త్సాహ మెలర్పఁ దాఁకి పటుదారుణకాలకటాక్షసన్నిభా
వ్యాహతహేమపుంఖనిశితాశుగము ల్నిగిడించి వెండియున్. 1012

### జంబుమాలి హనుమంతునితో యుద్ధము చేసి చచ్చుట.

క. వదనమున నర్ధచంద్ర, ప్రదరంబును గర్ణిదృఢశరంబు శిరమునం
బదినారసములు భుజముల, నన రంటఁగ నేసి యార్చె నతిరభసమునన్. 1013

వ. అప్పుడు. 1014

క. గురువిశిఖాభిహతం బై, హరివీరునితామ్రవదన మలరారె విభా
కరకరపరివిద్ధం బగు, శరత్సమయఫుల్లరక్తజలజముమాడ్కిన్. 1015

తే. మఱియు మారుతిరక్తాస్యమండలంబు, శోణితకణాభిషిక్తమై చూడ నొప్పె
రక్తచందనబిందుసంసిక్తమైన, భంబున వెలుంగునననుహోపద్మమట్లు. 1016

చ. అనిలతనూజుఁ డిట్లు దనుజాశుగపీడితుఁ డై మనంబునం
గనలుచుఁ బార్శ్వభాగమునఁ గ్రాలెడునొక్కమహోపలంబు ను
క్కునఁ బెకలించి తెచ్చి వడి ఘోరతరంబుగ జంబుమాలిపై
ననఘుఁడు వీచి వైచె ముద మారఁగ మింట సుపర్వు లుబ్బఁగాన్. 1017

క. కడు నలిగి దానవాధముఁ, డుడుగక పఱతెంచునమ్మహోపలమును దాఁ
గడువడిఁ బదిబాణంబుల, నడుమనె చూర్ణంబు చేసె నాకులు బెదరన్. 1018

ఉ. ఆవిధ మంతఁ జూచి హృదయంబున సైఁపక చండశౌర్యుఁ డా
పావని తత్సమీపమున భాసిలునొక్కవిశాలసాల మెం
తే వడిఁ బెల్లగించి కడుఁ దెంపున నంబరవీథిఁ ద్రిప్పి బా
హావిభవం బెలర్ప దివిజారిపయిం బడ నేయ నంతలోన్. 1019

శా. ఆరాత్రించరుఁ డుగ్రకార్ముకవిముక్తానేకకాండంబులన్
ఘోరప్రక్రియ సాల ముద్ధతి నిలం గూలంగ ఖండించి యే
పారం దూపులు నాల్గు మస్తకమునం దైదమ్ము లంసంబులం
దాఱున్నాలుగు బాణముల్ హృదయమం దత్యుగ్రుఁ డై యేసినన్. 1020

క. సాయకపరిపూరితతనుఁ, డై యనిలసుతుండు కోప మగ్గలముగఁ గా
లాయసమయ మగుఘనపరి,ఘాయుధముం బూర్వమట్టులందుకొని వెసన్. 1021

చ. చదల మిడుంగుఱు ల్వెదరఁ జయ్యన లావుకొలంది వీచి బె
ట్టిదముగ వైవఁ గొండపయిఁ దీవ్రగతిం బడుదారుణోల్లస
ద్భిదురముమాడ్కి నంతకునిభీకరదండములీల వీఁకతో
నది పఱతెంచి దైత్యునురమందు వడిం బడియె న్మహోద్ధతిన్. 1022

వ. ఇత్తెఱంగునం బడుటయుఁ దత్క్షణంబ. 1023

క. కరచరణమస్తకంబులు, సురుచిరమణిభూషణములు చూర్ణము లై ని
ర్జరవైరి తత్క్షణము యు,ర్వరపైఁ బడె సూతరథ్యరథసహితముగన్. 1024

వ. అంత. 1025

ఉ. అచ్చుగ వాయుపుత్త్రపరిఘాభిహతి న్వికలీకృతాంగుఁ డై
చచ్చినజంబుమాలిఁ గని సంభ్రము లై పరువెత్తి రాక్షసుల్

చెచ్చెరఁ బం క్తికంఠునకుఁ జెప్పిన నాతఁడు జంబుమాలియుఁ
జచ్చుట దైత్యకింకరులు చచ్చుటయు న్దలపోసి వెండియున్. 1026

రావణుఁడు హనుమంతునిమీఁదికి మంత్రినందనుల నేడ్వురం బంపుట.

చ. ఘనతరకోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నెవ్వఁడా
వనచరుఁ డంత లావు గలవాఁడె బలంబులఁ గూడి మీరు గ్ర
క్కునఁ జని వానిఁ బట్టుకొని క్రొవ్వణఁగింపుఁ డటంచు మంత్రినం
దనులను నేడ్వురం బనిచె దారుణవిక్రముల న్మహోద్ధతిన్. 1027

ఉ. పంచిన మంచి దంచు లయపావకతేజము లుల్లసిల్ల న
క్తంచరసప్తకం బలసదాగతిసప్తకలీల నల్కతో
మించి ప్రచండవీర్యుని సమీరకుమారుని వానరోత్తముం
గాంచనశైలతుల్యఘనకాయునిఁ దాఁకఁ దలంచి యుద్ధతిన్. 1028

మ. ప్రధనార్హంబులు కాంచనధ్వజకలాపంబు ల్నిశాతాశుగా
యుధయుక్తంబులు కింకిణీశతపతాకోపేతము ల్కాలతో
యుధరారావసమస్వనంబులు తురంగాఢ్యంబులై యొప్పు సా
రథిసన్నద్ధరథంబు లెక్కి పటుశౌర్యస్ఫూర్తి శోభిల్లఁగన్. 1029

చ. ఘనతరరత్నభూషణనికాయములం గయిసేసి రక్తచం
దనములు రక్తమాల్యపరిధానములుం ధరియించి చిత్రకాం
చనదృఢవర్మముల్ దొడిగి శక్రశరాసనసన్నిభోజ్జ్వల
ధనువులు దాల్చి దారుణవిధంబున శింజిని మ్రోయఁ జేయుచున్. 1030

చ సమరమునందుఁ గింకరులు చచ్చుటయు న్విని శోకతప్తులై
తనుతమయాండ్రు బిడ్డలును దల్లులు దండ్రులు మిత్రవర్గము
ల్బనిగొని సంచలింపఁగ బలంబులఁ గూడి చలం బెలర్పఁ గ
య్యమునకు నుద్ధతి న్వెడలి రప్పుడు ధారుణి కంప మొందఁగన్. 1031

వ. ఇట్లు సర్వాస్త్రకుశలులగు నద్దైత్యవీరు లొండొరులం బలకడచి పరస్పరజయకాంక్షులై వెడలి తురగరింఖాసముద్ధూతమహీపరాగంబు దిశాముఖంబులకు నంధకారంబు సంపాదింప ససుందరయంబునం జను దెంచి తోరణారూఢుండై యున్న పవననందనుం జుట్టుముట్టి యట్టహాసంబున. 1032

చ. ధనువులు శక్రచాపరుచి దాల్పఁగ రాక్షసనీలమేఘముల్
ఘనతరసింహనాదరథగర్జితనిస్వనము ల్చెలంగ న
య్యనిలకుమారరూపకసురాలయశైలము నాక్రమించి చ
య్యన మణికాంతిచంచలములై గురిసెం బటుబాణవర్షమున్. 1033

హనుమంతుఁడు మంత్రినందనుల నేడ్వురం జంపుట

వ. ఇత్తెఱంగున వృష్టిమంతంబు లగుబలాహకంబులు గురియువర్షధారలకుం జలింపనిమహాశైలంబుపోలికి నప్పవమాననందనుండు తదీయశరవృష్టిచేత మునుంగు

వడియును జలింపక సుస్థిరుండై యుండి కొండొకసేపునకుఁ దుపారసంహతి దోలంగం ద్రోచికొని గగనంబున కెగయుమార్తాండునివడువున నకాండ ప్రకాండంబులలాంగూలంబున విరియందట్టుచు నఖండవేగంబుననంబరంబున కెగసి తద్దానవులేడ్వురును గామచారులగుటంజేసి రథయుక్తులై తోడనె యెగయుటయుఁ దటిత్వంతంబులైనమేఘంబులతోడఁ బ్రభంజనునకుంబోలె ధనుష్మంతు లగునద్దానవులతోడ నేకవీరుం డగుహనుమంతునకు ఘోరం బగు సంగ్రామం బయ్యె నప్పుడు. 1034

సీ. హరివీరుఁ డంబరచరభూతసంతానములకు సంతాపంబు గలుగ నార్చి
వాలవిక్షేపదుర్వారహాతాహతిఁ ద్రిదశయానశ్రేణి చదలఁ జెదర
వినతాసుతునిమాడ్కి వేగంబు గైకొని యసమానభుజబలం బెసఁగ దారు
ణారావమున గుండె లవియించి పదములఁ దన్ని నఖంబులఁ దనువు సించి

తే. యురముచేఁ దట్టి యూరులనుఱుముచేసి,కరతలంబునఁ బ్రహరించి కఠినముష్టి
హతులనొప్పించి క్రమముననసురసుతుల, నేడ్వుర వధించెసామీరియేపుమీఱి.

వ. ఇవ్విధంబున మంత్రినందనుల నేడ్వురఁ గాలుప్రోలికిం బుచ్చి చెచ్చెరఁ బుడమికి లంఘించి యుదంచితవిక్రమంబున పరిఘాఘాతంబున మదవారణయూథంబుల కుంభవిదళనంబు సేయుచు లాంగూలంబునంజుట్టిరథ్యసారథికేతనచ్ఛత్రచామరసహితంబుగా రథంబులు విసరివైచుచుఁ గరతలంబున హయంబులశిరంబులు పగుల మోదుచుఁ బాదతలంబునఁ బదాతుల బడలుపడం ద్రోయుచు నిట్లు చతురంగబలంబుల నిశ్శేషంబుగారూపుమాపి తదీయమేదోమాంసమస్తిష్కంబులు భూతసృగాలంబుల కాహారంబు చేసి సంగ్రామతలంబున కనేకరుధిరప్రవాహంబులు సంపాదించి లంకాపురనివాసుల కెల్ల నత్యంతసాధ్వసంబు పుట్టించి సురగణాభినందితుండై యెప్పటియట్లు తోరణం బెక్కి తక్కినరక్కసులతోడ నుక్కున నెక్కటి కయ్యంబు సేయుతలంపున లాంగూలంబు ద్రిప్పుచుఁ దదాగమనంబు ప్రతీక్షించు చుండె నంత. 1036

చ. అతిబలుఁడైనవానరకులాగ్రణిచేఁ దనమంత్రినందనుల్
హతు లగుటాలకించి దనుజాధిపుఁ డద్భుతశోకరోషము
ల్మతి నభివృద్ధి నొంద నొకమర్కటుఁ డింతకు వచ్చెనే సము
న్నతగతి వీని నింకఁ గదనంబున నోర్చువీరుఁ డెవ్వఁడో. 1037

రావణుఁడు హనుమంతుమీఁదికి విరూపాక్షప్రఘసయూపాక్షదుర్ధరభాసకర్ణులం బంపుట

తే. అని వితర్కించి తగ విరూపాక్షుఁ డనఁగఁ
బ్రఘసయూపాక్షదుర్ధరభాసకర్ణు
లనఁగ నాఖ్యలు గలవారి నమితబలులఁ
బంచసేనాగ్రపతుల వీక్షించి పలికె 1038

ఉ. మీరు ప్రచండవీర్యమున మించి సురేశధనేశ్వరాదిబృం
దారకముఖ్యులం దొడరి దారుణవైఖరిఁ బెక్కుమార్గము
ల్ఘోరరణంబులన్ జయము గొన్నజితారులు వీరలున్ సుదు
ర్వారబలాఢ్యు లెన్నఁడుఁ బరాభవ మొందనివారు గావునన్. 1039

వ. మనబలంబులలోన మేలైనదానిం జూచుకొని తగువిధంబునఁ జతురంగబలం
బులం గూర్చికొని నానావిధసాధనంబులఁ గైసేసి వివిధాయుధపరిష్కృతంబు
లైనసాంగ్రామికంబు లగురథంబు లెక్కి సమరసన్నాహసంరంభవిజృంభితులై
వెడలి దేశకాలంబుల తెఱంగువిచారించి యాత్మరక్షణంబునందేమఱక యనేక
శస్త్రాస్త్రప్రయోగరహస్యనిపుణత్వంబునం జేసి యవ్వానరుని నతిప్రయత్నం
బున నిర్జించి రండని నియోగించి వెండియు నిట్లనియె. 1040

శా. బాహాశౌర్యము ఘోరసంగరకళాప్రాబల్య ముద్యద్బలం
బూహింపం గపి గాఁ డతండు మఘవుం డొప్పార నుద్యత్తపో
మాహాత్మ్యంబున మన్నిమిత్తముగ సంభావించి కల్పించి యు
త్సాహం బొప్పఁగఁ బంపినట్టి పెనుభూతం బౌట నిక్కం బొగిన్. 1041

చ. అలయక సిద్ధసాధ్యగరుడామరకిన్నరయక్షచారణా
దులు మును పెక్కుమార్గ్ల మనతో ననిఁ జేసి శితాస్త్రవిద్ధులై
పొలుపఱి యోడి పాఱి మదిఁ బుట్టినయీసునఁ గ్రుద్ధులై తపో
బలమున నీక్రియన్ మన కపాయము సేయఁగఁ బూని రిత్తఱిన్. 1042

సీ. అతిబలవంతులు నత్యంతశూరులు నధికవేగులు వానరాధిపతులు
వాలిసుగ్రీవులు నీలద్వివిదనలజాంబవచ్ఛతవలిశరభవినత
మైందతారాదులు మన మెఱింగినవారు గారె వారల కిట్టిగతియు విక్ర
మంబు తేజంబు దాక్ష్యంబు బలోత్సాహ మతికల్పనంబును మఱియుఁ గలదె

తే. అరయ నిది యొక్కకపిరూప మైనఘోర
సత్వ మటు గాన మీరు ప్రసన్నబుద్ధి
నలఁతిగాఁ జూడక మహాప్రయత్న మలర
నిగ్రహింపుఁడు దీని నత్యాగ్రహమున. 1043

ఉ. మానుగ మీరు సర్వరిపుమర్దనదక్షులు దారుణాస్త్రవి
ద్యానిధు లౌట లోకముల నన్నిటి నొక్కటఁ గాల్ప నోపువా
రైనను సంగరంబున జయాపజయంబులు చంచలంబు లౌ
గాన జయంబె గోరుచును గార్యము దీర్పుఁడు నేర్పు లేర్పడన్. 1044

వ. అని నియోగించి వీడ్కొల్పిన నయ్యమరవైరులు స్వామివచనంబులు ప్రతిగ్ర
హించి హనూమన్నిగ్రహణవ్యగ్రమానసులై లయకాలహుతాశనునిభంగి వెలుం
గుచుఁ దనుత్రాణతూణీరశరాసనంబులును గదాముసలముద్గరభిండివాలకర
వాలాదిబహువిధసాధనంబులు ధరించి వాయుజవంబు లగుహయంబులం

బూన్చినయరదంబు లెక్కి శతాంగ మాతంగ తురంగ భటాంగంబులతోc
గూడి మహావేగంబున నాజిరంగంబునకుం జనుదెంచి. 1045

సీ. ప్రాగ్గిరిపైc బొల్చు బాలభానునిభంగి సుకుతోరణం బెక్కి యున్నవాని
నఖిలలోకంబుల కాధారమై యున్నకనకాచలముభంగిc గ్రాలువాని
మొనసి ముజ్జగములు మోవc జాలినశేషు డంబునc దెగడువాలంబువానిc
బ్రళయావసరబృహద్భానురాశియుc బోలెc గడు నొప్పుతామ్రవక్త్రంబువాని
తే. నమితభుజసత్త్వు నతిశౌర్యు నధికవీర్యు
నతిజవోత్సాహు నసమానమతి ననంత
బలునిc దప్తచామీకరాభాసినయను
మర్కటాగ్రేశ్వరుని హనూమంతుc జూచి. 1046

తే. అంబుధరములు శైలంబు నాక్రమించి
నట్లు దానవు లవ్వీరు నాక్రమించి
జడి గురియుభంగి ఘోరశస్త్రాస్త్రచయము
లొక్కమొగి మీదc దొరcగించి రుక్కుమిగిలి. 1047

-- హనుమంతుcడు విరూపాక్ష ప్రఘసయూపాక్షదుర్ధరభాసకర్ణులం జంపుట. --

వ. అప్పుడు. 1048

క. తల మిగిలి దుర్ధరుం డను, బలసూదనరిపుcడు ఘోరబాహాగర్వం
బలరార విలు గుణధ్వనిc, జెలcగించుచుc దాcకె నసురసేన నుతింపన్. 1049

వ. ఇత్తెఱంగునం దలపడి. 1050

మ. ఘనకృష్ణోరగతుల్యపీతముఖతిగ్మక్రూరకాండంబు లై
దను వొందం బవమానసూనుశిరమం దత్యుద్ధతిc దాcక నే
సిన నయ్యంబకపంచకం బచట రాజిల్లెc సముత్ఫుల్లనూ
తననీలోత్పలపత్త్రపంచకముచందాన న్సుఖస్పర్శమై. 1051

వ. ఇట్లు దుర్ధరునిచేత వ్రేటువడి కడు నలిగి యవ్వానరసింహంబు రోదసీకుహ
రంబునిండ సింహనాదంబుc జేసి యమందరయంబున నాకాశంబున కెగసిన
వాcడును రథసహితంబుగాc దోడ నెగసి మండలీకృతకోదండుండై తండోప
తండంబులుగాc గాండప్రకాండంబులc బరcగించి యాకాశంబు నిరవకాశంబు
గావించిన నమ్మహాబలనందనుండు తన్నుం దాcకకుండ వాలమ్మున నమ్ములు
విరియందట్టుచుc బయోదాంతంబునందుc బవనుండు వృష్టిమంతం బగు మేఘం
బునుం బోలె నూరు వేగంబున నద్దానవుని దూలం దోలినవాcడును బొలివోని
శౌర్యంబున నాక్రమించి యనేకశస్త్రాస్త్రపరంపరలం బొదివిన నవ్వీరుండు గినిసి
యతిలాఘవంబునc గొండొకపొదు వెగసి శరీరంబు పెంచి పర్వతంబుపయిం
బడువిద్యుద్రాసియుం బోలె మహావేగంబునం బఱతెంచి దుర్ధరునిరథంబుపైc
బడుటయు నయ్యరదంబుమథితాష్టతురంగముంబై భగ్నాక్షకూబరంబై విశకలిత

కేతనాతపత్త్రుండై పుడమిం దొరఁగె దుర్ధరుండును వ్యక్తజీవితుండై రథంబు
తోడ నేలం గూలె నిట్లు పడినదుర్ధరుం జూచి యూపాక్షవిరూపాక్షులు
సంజాతరోషులై కడు రయంబున నుప్పరంబున కెగసి. 1052

ఉ. తద్దయు నక్క వజ్రధరుఁ దాఁకెడుకొండలమాడ్కి వేగ స
య్యిద్దఱు దైత్యు లొక్కమొగి నేపున మారుతిఁ దాఁకి పేఁకతో
గ్రద్దన ఘోరసాయకపరంపరలన్ వివిధాయుధంబులం
బెద్దయుఁ బ్రొద్దు చూపఱకు భీతి జనింపఁగఁ బోరి రత్తఱిన్. 1053

ఉ. దారుణముష్టిపాతముల దైత్యులవేగము విక్రమంబు దో
స్సార మడంచి వాయుసమసత్త్వుఁడు మారుతి ధాత్త్రికిన్ రయం
బారఁగ వచ్చి దీర్ఘకుజ మగ్గలికన్ బెకలించి దానిచే
ధారుణిఁ గూల వైచె వసుధాధరతుల్యుల వారి నిద్దఱన్. 1054

వ. ఇట్లు మహాబలుం డగువానరశ్రేష్ఠునిచేతం గూలినయూపాక్షవిరూపాక్షదుర్ధరు
లం జూచి కోపాటోపంబున. 1055

చ. కనుల హుతాశకీల లొలుకన్ బ్రఘసుండును భాసకర్ణుఁడున్
సునిశితమైనపట్టిసము శూలముఁ జేకొని పేఁకతో సురు
త్తనయునిఁ దాఁకి బాహుబలదర్పము లేర్పడ విక్రమించి త
త్తను వదరంటఁ గాఁ బొడిచి దారుణవైఖరి నార్చి రిద్దఱున్. 1056

వ. అప్పుడు. 1057

చ. శ్వసనకుమారుఁ డిట్లు దనుజద్వయముక్తనిశాతపట్టిసా
యసమయశూలపాతముల సంగము నొవ్వఁగ శోణితోక్షితో
ల్లసితతనూరుహుం డయి వెలంతి నవార్కనిలీలఁ గ్రాలుచున్
విసువక పన్నగారిక్రియ వేగము గైకొని కోపయుక్తుఁడై. 1058

చ. గురుతరపక్షిపాదపనికుంజశిలాపరిపూర్ణమైనభూ
ధరశిఖరంబు ఘోరభుజదర్పమునం బెకలించి తెచ్చి ని
ర్జరులు నుతింప రాక్షసులు రాటున భీతిఁ దొలంగి పాఱఁ బె
ల్కుఱి సురవైరు లిద్దఱును గూల వడిం బడవైచె నుద్ధతిన్. 1059

వ. ఇట్లు యూపాక్షవిరూపాక్షదుర్ధరప్రఘసభాసకర్ణు లనువారిఁ బంచసేనాగ్రనా
యకుల నశ్రమంబునఁ బంచత్వంబు నొందించి బలంబుల కుఱికి. 1060

చ. గజములచే గజంబులను గాల్బరచేఁ దగఁ గాల్బరన్ రథ
ధ్వజములచే రథంబుల నుదగ్రహయప్రకరంబుచే హయ
వ్రజముల వ్రేసి వ్రేసి యనివార్యగతిం జతురంగసేనలన్
గజిబిజి చేసి చంపెఁ బ్లవగప్రవరుండు భయానకంబుగన్. 1061

క. కరువలితనయుని వ్రేటున, మరణము నొందినతురంగమాతంగకళే
బరములచే సమరావని, పరికింపఁగ సన్నిరుద్ధపథమై యొప్పెన్. 1062

వ. ఇవ్విధంబున నప్పవమానసూనుండు పంచసేనాగ్రనాయకసహితంబుగా రాక్షస సైన్యంబుల నిశ్శేషంబుగాఁ రూపుమాపి పూర్వప్రకారంబునఁ దోరణం బెక్కి యుగాంతకాలరుద్రుండుం బోలె రౌద్రరసోల్లాసమూర్తి యై రణంబునకు నింక నెవ్వండు చనుదెంచునో యని నైరిరాక కెదురుసూచుచుండె నంత రావణుండు సేనాపతిపంచకంబు చతురంగబలసమేతంబుగాఁ బొలియుట విని కోపసంవర్తితేక్షణుం డై తన కెలంకున నలంకృతుం డై యున్నయక్షకుమారు వీక్షించి. 1063

—రావణుండు హనుమంతునిమీఁదికిఁ బోవ నక్షున కాజ్ఞాపించుట.—

చ. అనుపమబాహుశౌర్య వినుమా మననిష్కుటసీమ కెవ్వఁడో
వనచరుఁ డేగుదెంచి మనవారలఁ గొందఱ దుర్ధరాదులన్
దనుజుల గీటణంచి బలదర్పమునం జరియించుచున్నవాఁ
డని కిఁక నీవు పోయి చలమారఁగ వాని వధించి రమ్మొగిన్. 1064

వ. అని నియోగించిన నవ్వీరశేఖరుండు పితృవీక్షణవిన్యాసమాత్రంబున నతని మనోభిలషితం బెఱింగి. 1065

శా. అక్షీణోగ్రతపోవినిర్జితవిరూపాక్షుండు డై తేయహా
ర్యక్షుం డుద్ధతిజన్యనిర్జితసహస్రాక్షుండు బాణాననా
ధ్యక్షుం డక్షుఁడు రాక్షసప్రవరవాక్యప్రేరితుం డై ద్విజ
ప్రత్యక్షప్రాజ్యముచే హుతాశనుని తేజం బ్రజ్వలన్మూర్తియై. 1066

చ. అనిమిషసిద్ధసాధ్యగరుడాదుల నెల్ల నఖండసాయకా
సనగుణముక్తతీక్ష్ణశరజాలములన్ ఘనసంగరంబులోఁ
దునుముఁగఁ జాలునంతపటుదోర్బలశాలికి నొక్కయల్పకీ
శునిఁ బరిమార్చు టెంత యిదె చూడుఁడి యిప్పుడె కూల్చి వచ్చెదన్. 1067

వ. అని పలికి సంరంభవిజృంభవిజృంభితుండై సంగ్రామోచితంబు లగువస్త్రమాల్యానులేపనంబులు ధరియించి మణికుండలకోటీరకేయూరాదులం గై సేసి తూణీరంబులు బిగియించి తనుత్రాణంబు దొడిగి బద్ధగోధాంగుళిత్రాణుండై కాంచనచిత్రకార్ముకంబులీలం గేల నందుకొని బాలదివాకరప్రభంబును మణితప్తజాంబూనదజాలకృత్రిమంబును సముచ్ఛ్రితరత్నవిభూషితధ్వజంబునుమణిపతాకాలంకృతంబును మనోజవాష్టతురంగశోభితంబును యథాక్రమావేశితశక్తితోమరపరిఘపట్టిసప్రాసశూలబాణకృపాణతూణీరంబు నష్టాసినిబద్ధబంధురంబును గామగమనంబును తపస్సంచయసంగ్రహార్జితంబును సురాసురాప్రధృష్యంబును సమస్తవస్తువిస్తారపరిపూర్ణంబును గింకిణీసహస్రపరివృతంబు నగు సుందరస్యందనంబునుపరిభాగంబు నధివసించి భీమపరాక్రమాతిరేకంబున సంగ్రామంబునకు సన్నద్ధుం డై. 106

అక్షుఁడు యుద్ధసన్నద్ధుండై హనుమంతునిమీఁదికిఁ బోవుట.

సీ. తప్తచామీకరధ్వజశోభితము లైన మందరాచలనిభస్యందనములు
ప్రబలహస్తావలేపములచే గిరులతో నైన మార్కొనఁ జాలు నేనుఁగులును
మనమునకంటె గాడ్పునకంటె ముంగలఁ జన నోపువాహనసంచయములు
కరఁగి పోసినయుక్కుగట్లచందంబునఁ గఠినాంగములు గలకాల్బలములు
తే. వితతనేమీస్వనములు బృంహితరవములు
కఠినహేషారవములు హుంకారములును
దశదిశ ల్నిండఁ జేయుచుఁ దన్నుఁ గొలువ
నరిమథనదక్షుఁ డయ్యక్షుఁ డనికి వెడలె. 1069

వ. అప్పుడు. 1070

సీ. చక్రసంఘట్టనజాతభారంబునఁ జిలువలఱేఁడు వేడలలు వంపఁ
గమనీయకేతనాగ్రపటానిలంబునఁ జెదరి మేఘంబులు చదలఁ దూలఁ
గనకఘంటాఘణంఘణనినాదంబులు నింగియు దిక్కులు నిండి సెలఁగఁ
దురగరింఖాసముద్ధూతపరాగంబు కడలకు గాఢాంధకార మొసఁగ
తే. నంబరంబునఁ జనుపంకజాప్తరథము
కరణి నతిదుర్నిరీక్ష్య మై నిరుపమాన
సూతసామర్థ్యనైపుణస్ఫూర్తి మెఱయ
మొనసి యక్షునిరథ మాలమునకు నడిచె. 1071

వ. ఇట్లు చతురంగబలసమేతుండై యతిరభసంబుగాఁ గదియ నడిచి. 1072

సీ. చూపులు నాటినచొప్పులయం దెల్ల విలయాగ్నికణములు మొలక లెత్త
గగనంబుతో రాయుఘనతరలాంగూలచాలనంబుల మేఘచయము దూలఁ
జటులకోపాటోపసంరక్తవదనంబు ప్రళయార్కమండలభ్రాంతిఁ దోఁప
శోణితసిక్తభాసురతనూరుహములు పావకజ్వాలలపగిదిఁ దనర
తే. రుద్రమూర్తి తెఱంగున రౌద్రరేఖ
రూఢి మెఱయంగఁ దోరణారూఢుఁ డగుచు
బ్రళయకాలాంతకునిభంగిఁ గ్రాలుచున్న
వానరశ్రేష్ఠుఁ బవమానసూనుఁ గనియె. 1073

చ. కనుఁగొని తద్విచిత్రతనుకాంతికి శత్రుపరాజయోచిత
ప్రణుతభుజాసముత్థితజపస్థితికి న్సముదగ్రవిక్రమం
బునకు మహాహవోల్లసితబుద్ధికి విస్మయజాతసంభ్రమం
బును బటుకోపమీర్ష్యయును బుట్టఁగ నక్షుఁడు తత్క్షణంబునన్. 1074

వ. సారథి నవలోకించి రథంబు వానరున కభిముఖంబుగా రయంబునం దోలు మనిన
వాఁడు తద్వచనానురూపంబుగా యుగ్యంబులపగ్గంబులు వదలి యతిరయం
బునం దేరు పోవనిచ్చిన నది కింకిణీసహస్రనిర్ఘోషభీషణంబుగాఁ జనుచుండ

నప్పుడు రావణకుమారుండు వీర్యదర్పితుండును ప్రవృద్ధసత్త్వుండును సుతప్తజాంబ
మేఖలుండును చారుకుండలమండితగండభాగుండును సుదగ్రచిత్రాయుధచిత్ర
కార్ముకుండును నై గజంబు తృణసంవృతంబైన కూపంబునుం బోలె ననమాన
వీర్యుం డగు వానరవర్యునిం గదియ నడిచె నిత్తెఱంగున నరుదెంచు నక్షకుమా
రునిం జూచి వృక్షచరశ్రేష్ఠుండు మత్తమాతంగంబుఁ గన్న సింగంబుభంగి
నుప్పొంగి భూనభోంతరంబు నిండ గర్జించుచు సమరంబున కభిముఖుం డయ్యె
న ట్లొండొరులతోడ పోరాడనం బూని యున్నయన్నిశాచరవనచరశ్రేష్ఠుల
సమాగమంబు సురాసురసంభ్రమప్రదంబై చెల్లె మఱియును. 1075

అక్షుఁడు హనుమంతునితో యుద్ధము సేయుట.

సీ. నిండార దిననాథుఁ డెండ గాయక యుండె వేడ్కతోఁ బవనుండు వీవకుండె
వీతిహోత్రుఁడు తన వేఁడి సూపక యుండె నింపుగా జలధి ఘోషింపకుండె
ఖేచరవితతి సంక్రీడ సల్పక యుండె సురవిమానశ్రేణి దిరుగకుండె
ననములకల్లోలనదులు పాఱక యుండె గ్రహగణంబులు మింటఁ గదలకుండె
తే. భూమి కంపించెఁ బర్వతంబులు వడంకె
నభము ఘూర్ణిల్లె దిక్కులప్రభ దొలంగె
వీఁకతో నక్షుఁ డక్కపివీరవరుఁడు
దారుణంబుగ నొండొరుఁ దాఁకునపుడు. 1076

క. ఇత్తెఱఁగున పోరాడుటయు, నత్తఱి దశకంఠసుతున కటవీచరవం
శోత్తమునకుఁ గయ్యంబు వి,యత్తలమున నద్భుతావహంబై చెల్లెన్. 1077

క. మున్నెన్నఁ డిట్టి కయ్యము, గన్నది లే దనుచు దేవగంధర్వాదుల్
మిన్నున నతివిస్మితులై, యున్నతమతి సన్నుతించుచుండిరి మిగులన్. 1078

వ. ఇట్లు భువనభయంకరంబుగాఁ దలపడి పోరాడు నప్పుడు. 1079

చ. అతిరథవర్యుఁ డైన దనుజాధిపసూనుఁడు చిత్రకాంచనో
న్నతపృథుకార్ముకంబు వితతంబుగ సజ్యము చేసి మేఘము
ద్ధతిఁ గుధరంబుమీఁద జలధారలు వే దొరఁగించునట్లు మా
రుతిపయిఁ దీవ్రబాణములు రోషమునం దొరఁగించి వెండియున్. 1080

క. తనవంటినేర్పు లోకులు, వినుతింపఁగఁ గూర్పుటయును వెస సేయుటయున్
గన తాకుంకఁగ గగనము, ఘనతరనారాచమయము గావించి తగన్. 1081

వ. మఱియుఁ గాలవ్యాళసన్నిభంబు లగుమున్నాఱు బాణంబులు లలాటం
బునఁ గాంచనపుంఖంబు లగు నాలుగుశరంబు లురంబున దీక్ష్ణాగ్రంబు లగు నేఁబది
సాయకంబులు భుజంబుల నేనూఱు వెసం దవాతియమ్ములు తనువునం గీలించి
తనచేతిబలువు చూపిన నప్పావనసింహుండు రక్తధారాసారోక్షితశరీరుండై
నవార్కుని తెఱంగున వెలుఁగుచు సమీరణునిమాడ్కి శరమధ్యంబున మెలం

గుచు బలుమానిసి చీమలంజమరు తెఱంగున నక్షప్రయుక్తశరపరంపరలఁగాలం
గేల నులిమి వైచి నభోభాగంబు నిండ సింహనాదంబుఁ జేసి వైనతేయుం
డుం బోలె నతిజవంబున వాయునిషేవితం బగుగగనంబున కెగసి భిన్నభుజాం
తరుండును భుజోరువిక్షేపణఘోరదర్శనుండును బ్రచండవిక్రముండును మహా
హవోల్లాసభాసురుండును నైనయక్షునిపరాక్రమంబును జాపవిద్యాపాండిత్యం
బునుం జూచి బహుమానపురస్సరంబుగా మెచ్చుచుఁ బవమానసూనుండు తన
మనంబున. 1082

అక్షుని పరాక్రమంబునకు హనుమంతుఁడు మెచ్చుకొనుట

ఉ. వీనిభుజావిజృంభణము వీనిసమున్నతశౌర్యసంపదల్
వీనిశరాసనైపుణము వీనిమహాద్భుతజన్యకర్మముల్
దానవసిద్ధసాధ్యసురదైత్యమహోరగులందు నెందునుం
గానము చూచినంత బలఘస్మరుఁడైన నుతింప వల్వదే. 1083

చ. ఇతఁ డతిబాలుఁ డయ్యుఁ దగ నెంతయుఁ బ్రౌఢునియట్లు బాలసూ
ర్యతులితతేజుఁడై దొడరి యద్భుతభంగి రణం బొనర్చెడున్
వితతబలోన్నతుం డయినవీని వధించెడునంత తెంపు నా
మదికి జనింప దిప్పు డసమానపరాక్రముఁ డీతఁ డెన్నఁగన్. 1084

సీ. విక్రమోత్సాహవివృద్ధప్రతాపుఁడై గురుశక్తి నాలావు సరకుగొనక
మధ్యందినాదిత్యుమాడ్కి వెలుంగుచు మదికి నివ్వెఱపాటు నొదవఁ జేయు
చున్నాఁడు భుజసత్త్వ మొగి నంత కంతకు నగ్గలం బగుచున్న దగ్నియట్లు
కడువడి లోకంబు గాల్ప నోపెడువాఁడు తడవు సేయుట యింకఁ దగవుగాదు

తే. అంజనాధిపుత్రక్రియ వీర్య మాశ్రయించి, వీని వధియించి పుచ్చెద వేగ కాలు
పురికి నని నిశ్చయించి వానరవరుండు, చండభుజవీర్యసాహసోద్దండుఁ డగుచు.

చ. తరుచుగ వృష్టిధారలకుఁ దాల్మి సహించి నలంకనట్టినుం
దరమృగరాజులీల క్షణదాచరశేఖరచాపవిచ్యుతా
త్యురుతరబాణవర్షమున కోర్చి రయంబున వాని తేరిపై
కుటికి విసగ్రహాగ్రహసమున్నతభూరిభుజావలేపుఁడై. 1086

చ. అడరి మనోజవంబు లగునశ్వములం బరిమార్చి సారథిం
దడయక చంపి కేతనము దన్ని పతాక ధరిత్రిఁ గూల్చి యె
క్కుడువడితో రథాంగయుగకూబరము ల్వివిధాయుధంబులుం
బొడిపొడి చేసి విల్విఱిచి భూషణపంక్తులు రాల్చె నుగ్రతన్. 1087

వ. ఇట్లు మరున్నందనపాణితలప్రహారంబున రథంబు భగ్నంబై కూలినఁ దత్క్షణంబ
యక్షుం డారథంబు విడిచి కార్ముకఖడ్గంబులు గొని తపోభియోగంబున
దేహంబు విడిచి స్వర్గంబునకుం జనుమహర్షి పోలికి నంబరంబున కెగసి వివిధ
భంగులం జరించు చున్న నలిగి హనుమంతుండు. 1088

చ. కర మురుశక్తి వానికడకాళ్ళను రెండును బట్టి వీఁకతో
గరుడుఁ డమోఘలీల నురగంబును వీచినమాడ్కి ఘోరబం
ధురమహనీయదోర్బలము తోరముగా వడి వేయిమాఱు లం
బరమునఁ ద్రిప్పి ధాత్రిఁ బడ వైచె సుర ల్వెఱఁగంది చూడఁగన్. 1089

వ. ఇట్లు విసరి వైచిన నయ్యక్షకుమారుండు తత్క్షణంబ భగ్నబాహూరుశిరోధరుండును వికీర్ణబంధనుండును వివృత్తనయనుండును జూర్ణితాస్థిసందోహుండు నై పంచత్వంబునొందె నిట్లక్షుని సమవర్తిసమీపవర్తిం జేసి హనుమంతుండు తక్కిన చతురంగబలంబులఁ గాలం గేల మర్దించి తనమహాద్భుతపరాక్రమప్రకారంబుఁ జూచి సిద్ధసాధ్యరక్షోయక్షగరుడగంధర్వాదులు దిక్పాలసహితంబుగా మిన్నునం జన్ని బహుప్రకారంబుల వినుతించుచుండ మరలి యెప్పటియట్ల తోరణం బెక్కి ప్రజాక్షయంబునందుఁ గృతక్షణుం డైనకాలునిపోలికి నతిరౌద్రదర్శనుం డై శత్రువధంబున కుత్సహించుచు నుండె నంత నక్షకుమారుండు మారుతిచేతఁ జచ్చుట విని దశకంఠుండు శోకరోషవిషాదంబులుమనంబున ముప్పిరిగొన నింద్రకల్పుం డగునింద్రజిత్తు నవలోకించి యిట్లనియె. 1090

రావణుఁడు హనుమంతునిమీఁదికిఁ బోవ నింద్రజిత్తున కాజ్ఞాపించుట.

సీ. నీ వస్త్రవిదుఁడవు నిఖిలాస్త్రవిదులలో నగ్రగణ్యుఁడవు సురాసురులకు
శోకదాతవు జన్యశూరుండ వంబుజాసనసమారాధనసంచితాస్త్రుఁ
డవు పరాక్రమధనుండవు దేశకాలవిభాగజ్ఞుఁడవు రణపండితుఁడవు
భుజవిక్రమాభిగుప్తుఁడవు తపోబలరక్షితుండవు చాపదీక్షితుఁడవు
తే. కడఁగి సంగ్రామతలమునఁ గాలవరుణ, దివిజవరు లాదిగాఁ గల్గు దేవసిద్ధ
చారణాదిత్యవసురుద్రసాధ్యు లైన, నీదుబాణోద్ధతి సహించి నిలువలేరు. 1091

ఉ. ఆహవనైపుణంబున సమంచితమంత్రవినిశ్చయంబున
న్బాహుబలంబునం జతురుపాయబలంబుల ఘోరశాత్రవ
వ్యూహవిభేదనంబున సమున్నతవిక్రమశౌర్యసాహసో
త్సాహములన్ భవత్సముఁడు ధారుణి నెవ్వఁడు లేఁడు చూడఁగన్ 1092

వ. పుత్రా నీకు యుద్ధంబులందుఁ బురుషకారంబుచేత శక్యంబు గానిది లేదు వివేకపూర్వవిచారంబునందు నీ కవిదితం బైనకార్యం బెద్దియు లేదు భవదీయాస్త్రబలశారీరంబు లెఱుంగనివాఁడు ముల్లోకంబులయం దొక్కండైన లేఁడు నీకుం గలతపోబలంబును బరాక్రమంబును దివ్యాస్త్రబలంబు నెవ్వరికిం గానము రణసంకటంబులందు మదీయచిత్తంబు నిన్నుం దలంచి నిశ్చితవిజయరూపప్రయోజనం బై విషాదంబు నొందదు వినుము. 1093

ఉ. అచ్చుగఁ గింకరుల్ నిహతు లైరి బలాఢ్యుఁడు జంబుమాలియుం
జచ్చె నమాత్యనందనులు చచ్చిరి పంచబలాధినాయకు

ల్చబ్బి రనేకమత్తగజసప్తిశతాంగభటప్రతానముల్
చచ్చెను నీసహోదరుఁ డసాధ్యుఁడు నక్షుఁడు చచ్చె ప్రేల్మిడిన్. 1094

క. అరిభంజన నీకుం గల, పరశౌర్యం బస్త్రబలము వారికి లేమిం
దురమునఁ జచ్చిరి గాక, వరిగిన ముజ్జగము లయిన నడ్డము గలదే. 1095

సీ. పవనుని వేగంబు పావకు వేఁడిమి తపనుని తేజంబు దానవారి
శౌర్యంబు నీయం దవార్యమై వర్తిల్లు నత్తెఱం గెఱిఁగి దివ్యాస్త్రబలము
గనుఁగొని కార్ముకకౌశలంబు దలంచి కపిసమర్థతయు విక్రమము బలము
మహిమ విచారించి సహజబలంబున కనుగుణ మైనశౌర్యంబు దాల్చి

తే. రాజధర్మంబు సమరధర్మము నెఱింగి
దేశకాలప్రవృత్తుల తెఱఁగుఁ దెలిసి
జయము గోరుచు నాత్మరక్షణమునందు
నేమఱక వైరి నిర్జింపు మేపు మీఱ. 1096

ఇంద్రజిత్తు హనుమంతునిమీఁదికిఁ బోవుట.

వ. మఱియు నీవు రణంబునకుం జని స్వపరబలతారతమ్యం బిమ్ముగా విచారించి బలక్షయంబు గాక మున్న వైరిం బరిమార్పు మయ్యనగచరుండు కాలాగ్నికల్పుండు గావునఁ బాణితలముష్టిప్రహారణాదుల చేత నెదిరించుటకు శక్యుండు గాఁడు వానికి వాయువునకంటె నధికజవంబు గలదు గావున వానియందు సైన్యంబులు పనిగొన వలసారం బైనవజ్రంబు గొని ప్రవేశింపకుము నాచెప్పినయర్థం బంతయు మనంబునం దలపోసి స్వకార్యసిద్ధికొఱకు నేకాగ్రచిత్తుండ వై దివ్యాస్త్రబలంబు సంస్మరించుచు నిజవైరివధం బాపాదింపు మెను బాలుండ వగునిన్ను రణంబునకుం బంపు టది యుక్తంబుగా దైన నిది రాజనీతిజ్ఞుం డైనక్షత్రియునకు సమ్మతం బగుటం జేసి నిన్నుఁ బుత్తెంచు చున్నవాఁడ సంగ్రామంబున నీకు నానాస్త్రంబులయందు వైశారద్యంబు గలదు గావున నవశ్యంబు రణంబు గావింపుము సంగరంబునందు విజయంబు ప్రార్థనీయంబు గదా యని పలికిన నయ్యింద్రజిత్తుం డిష్టంబు లగుస్వగుణంబుల చేతం బ్రతిపూజితుండై యతనికిం బ్రదక్షిణంబును బ్రణామంబునుం గావించి వీడ్కొని యుద్ధోద్ధతకృతోత్సాహుండై పర్వకాలంబునందు సముద్రంబుభంగి నుప్పొంగి నిజతేజోవిశేషంబునఁ జూపఱవిలోకనంబులకు మిఱుమిట్లు గొలుపుచుఁ గెంజాయ రంజిల్లునేత్రంబు లెఱ్ఱనివిరిదాసురలం దెగడ నుదీర్ణవిక్రముండై గరుడానిలతుల్యవేగంబు లగుహయంబులం బూన్చినయరదం బెక్కి కాంచనవలయమండితం బగు చాపంబును శితశల్యంబు లగుసాయకంబులును ధరించి మండలీకృతకోదండుండై పరివేషపరివృతుం డగుసూర్యునిచందంబునం దేజరిల్లుచు గోదండపాండిత్యంబు మెఱయ నారి మొఱయించుచు శంఖభేరీమృదంగపటహకాహళాది వాద్యనిర్ఘోషంబులు బోరుకలంగఁ జతురంగసేనాపరివృతుండై శతాంగరథాంగ

సంఘుష్టనంబునం బుడమి గ్రక్కదల నతిరభసంబుగా రణంబునకు వెలువడి
శీఘ్రవేగంబునం బఱతెంచుచుండె నప్పు డతనియాటోపంబుం జూచి మిన్నునం
బన్నిదియున్న మహర్షి దేవర్షి సిద్ధసాధ్యమరుద్యక్షచారణాదులు విస్మితులై నసుర
ప్రకారం బెట్లగునో యని వితర్కించుచుండిరి పక్షిసంఘంబులు ప్రహృష్టాంత
రంగంబులై యుచ్చైస్స్వనంబుల విరావంబులు సేయుచుండె మృగంబులు
భయవిత్రస్తంబులై పఱవం దొడంగె దిగ్విభాసంబులు కలుషంబులై ఘూర్ణి
ల్లుచుండె నిట్టిఱంగున సంగ్రామునకుటుండై తనకభిముఖంబుగాఁ జనుదెంచు
చున్న యింద్రజిత్తు నవలోకించి తదీయరథనిర్ఘోషంబును గార్ముకగుణప్రణా
నంబును విని సంప్రహృష్టచిత్తుండై హనుమంతుండు. 1097

ఉ. భీకరసృష్టివారిదము పెంపున గాత్రముఁ బెంచి పేఁక స
స్తోకతదీయగర్జితము సొంపున దిక్కులు వ్రయ్య నార్చుచున్
శాకవిరోధిముఖ్యనుతసత్కులు మెల్కని సన్నుతింపఁ ద
న్నాకవిరోధినందనునిఁ దాఁకె సఖర్వభుజావలేపుఁడై. 1098

హనుమదింద్రజిత్తులయుద్ధము.

సీ. ఈగతి నతితీక్ష్ణవేగులు రణనిర్విశంకులు మారుతసత్త్వులైన
వానరదానవవరులు సురాసురవరులకైనఁ బద్ధవైరులగుచుఁ
దలపడి పోరాడుతఱి మహారథుఁడు వీరుఁడు ధనుర్విద్యావిదుఁడు మహాత్ముఁ
డగుదానవకంటి ఘోరాకారుఁడై చిత్రకోదండశింజనీఘోష మడరఁ
తే. గఠినవజ్రనిపాతవేగములు తీక్ష్ణశల్యములు కంకపత్రసంఘాదితములు
కనకపుంఖంబులైనయఖండసాయకములు పవమానసుతుమీఁదఁ గడఁగి యేసె. 1100

వ. అప్పుడు.

సీ. హనుమంతుఁ డతనిశరాంగనిర్ఘోషంబు పటహభేరీశంఖపణవనిస్స్వ
నంబు విక్షిప్యమాణశరాసనధ్వని మహారథవాజిహేషారవంబు
విని చెవి చీఁదఱఁ ద్రొక్కఁ దదంబకములు కదుఁదుకుల్ గఱచినకరణి దేహ
తాపము గావింపఁ దగ నేడుపెరిఁగిన ట్లొనర మేను విదిర్చికొనుచు వేగ
తే. యంబరంబున కెగసి శరాంతరమున, గాలితెఱఁగున మెలఁగుచు వాలనిహతిఁ
దాఁక ద్రుంచంగ నమ్ములు దట్టిగొనుచుఁ, జిత్రగతులఁ జరించె నచ్చెరువుగాఁగ.

వ. ఇట్లు మహోగ్రరయంబున నంబరంబునఁ దిరుగుచున్న మారుతి నవలోకించి యింద్ర
జిత్తుండు సహింపక తోడనె యెగసి ధారాధరంబు సలిలధారలచేత ధరాధరం
బునుం బోలె నఖండసాయకపరంపరలం గప్పుచుం-దలపడిన దేవసమానపరాక్ర
ములును రణకర్మవిశారదులును వేగసంపన్నులును నగునయ్యిద్దఱకు సర్వభూత
మనోగ్రాహియై ఘోరంబగు సంగ్రామం బయ్యె నివ్విధంబునం దార్కొని
యొండొరులతారతమ్యంబు తెల్పెడకుండఁ బరస్పరజయకాంక్షలం గొండొక
సేపు పోరునెడ నయ్యింద్రజిత్తుండు హనుమంతునియవధ్యత్వంబును లక్ష్య

గోచరుండు గాక చిత్రగతులం బరిభ్రమించుటయునుం దలపోసి సమాధి
సంయోగసమాహితాత్ముం డై తనమనంబున. 1102

ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రముచే బద్ధునిఁ గావించుట.

ఉ. వీనిభుజావిజృంభణము వీనివిచిత్రగతిప్రమాణముల్
వీనిపరాక్రమక్రమము వీనిజయోచితజన్యదాక్ష్య మె
వ్వానికి లేదు ముజ్జగమువారలలోపల వీఁ డవధ్యుఁ డె
ట్లే నితనిఁ రణంబున జయింపుదు నెద్ది యుపాయ మారయన్. 1103

మ. అని చింతించి నిశాటరాజతనయుం డత్యంతసంరంభి యై
యనువందం ద్రిజగద్భయానకకరం బైనట్టిపైతామహం
బనుదివ్యాస్త్రము మౌర్వితో నియమమంత్రావృత్తి సంధించి పా
వనిపై నేసె సుపర్వు లార్వఁగ నిలింపద్వేషు లగ్గింపఁగన్. 1104

వ. ఇట్లేసిన నయ్యమోఘాస్త్రం బనంతవిస్ఫులింగపటలీసంచారఘోరంబుగాఁ బఱ
తెంచి బ్రహ్మవచనంబు దలంచి మారుతిం జంప నొల్లక బద్ధుం గావించిన
నవ్వానరసింహుండు త్రిలోకపూజ్యబ్రహ్మాస్త్రపాశబద్ధుండై చేష్టలు దక్కి ధరణీ
తలంబునం బడి తనమనంబున నది బ్రహ్మాస్త్రప్రభావంబున నైనకృత్యంబుగా
నెఱింగి తొల్లి లోకపితామహుం డైనపరమేష్ఠి తనకు మెచ్చి యిచ్చినవరంబు
తెఱంగు విచారించి యమ్మహాత్మునియనుగ్రహంబువలనఁ దనకు బ్రహ్మాస్త్రంబు
వలనిభయంబు లేకుండుట తలపోసి సుస్థిరోత్సాహుండై యయ్యస్త్రబంధంబు
వలన విడివడ సమర్థుం డయ్యును లోకగురుం డగుపరమేష్ఠి నవమానించుట
యుచితంబు గా దని నిశ్చయించి స్వాయంభువంబు లగుమంత్రంబులచేత నభి
మంత్రితం బగునమ్మహాస్త్రంబునకు లోనై యింక విక్రమంబున నుపక్రమింప
నుచితంబు గాదు బద్ధుండ నై యుండి రాక్షసులప్రభావంబును సర్వంబు నెఱింగి
రావణునితోడ సంవాదంబుఁ జేసి రామునిపరాక్రమశౌర్యసాహసోత్సాహంబు
తేటపఱతుఁ గాక యని నిశ్చయించి కపటదైన్యం బంగీకరించి రాక్షసులతర్జన
భర్జనోక్తులకు గర్జించుచు వినివృత్తచేష్టుండై యుండె నంత నవ్వానరోత్తము
రాక్షసులు శాణముష్టిప్రహారంబులఁ బీడించుచు భూనభోంతరంబు నిండ నా
ర్చుచు దృఢంబులగుద్రుమచీరరజ్జులచేత నంటఁగట్టిన హనుమంతుండును బ్రహ్మా
స్త్రవిముక్తుం డయ్యె నది యెఱింగి దశాననతనయుండు తనమనంబున నిమ్మహా
స్త్రబంధం బన్యబంధము ననువర్తింపదు రాక్షసులు మంత్రగతి విమర్శింపక
యితనిబంధించిరి గాన నితం డస్త్రవిముక్తుం డయ్యె. 1105

ఇంద్రజిత్తు హనుమంతునిఁ దీనికొనిపోయి రావణునకు సమర్పించుట.

సీ. అకట యీదివ్యాస్త్ర మన్యభేద్యము గానియది సురాసురముఖ్యు లైనఁ గడువఁ
జాలరు వీఁ డింత శక్తిసంపన్నుఁడో చటులబ్రహ్మాస్త్రపాశములవలన
విడివడి కుశలి యై విలసిల్లుచున్నాఁడు వీనిప్రభావంబు వీనిలావు

వీనిమహత్త్వంబు వీనిసామర్థ్యంబు వసుధలో నింక నెవ్వరికిఁ గాన
తే. మరయ నాయత్న మంతయు వ్యర్థ మయ్యె
నొనర నీయస్త్రము పునఃప్రయోగమునకుఁ
బనిగొనదు వేఱువిధమునఁ బట్టువడఁడ
యితని సాధించుట కుపాయ మెద్దియొక్కొ. 1106

వ. అని కొండొకసేపు వితర్కించియివ్వానరుండుతనయస్త్రబంధమోక్షంబెఱుంగ కున్నవాఁడు బద్ధుం డగునితని నుపాయంబునం గొనిపోయెదఁ గాక యని నిశ్చయించి మేఘనాదుండు దీర్ఘశృంఖలంబుచేత మత్తమాతంగంబుం గొనిపోవు కరణి నతిప్రయత్నంబున హనుమంతు నాకర్షించుకొని కోలాహలబహుళంబుగా నరిగి మంత్రిబాంధవపరివారపరివృతుం డైన రావణునకు సమర్పించె నప్పుడు మరున్నందనుండు. 1107

-హనుమంతుఁడు రావణునిఁ జూచి వితర్కించుట.-

సీ. తపనీయరుచిరముక్తాజాలసంవృతాయతకిరీటముచేత నలరువాని
వరవజ్రగర్భితస్వర్ణకుంతలవిభాకలితకపోలభాగంబువాని
హాటకరత్నచిత్రామలసుమహార్హహారశోభితగాత్రుఁ డైనవానిఁ
గాంచనమయమంజుకౌశేయశోభితమహనీయపృథునితంబంబువాని
తే. హరితచందనదిగ్ధాంగుఁ డైనవానిఁ, నమితమాల్యోపశోభితుం డైనవాని
మద్యసేవాసముద్భూతమదవిఘూర్ణ, మానశోణితనేత్రాంతుఁ డైనవాని.

మత్తకోకిల. దీప్తవక్త్రుని ఘోరసంస్ఫూర్తి నతిప్రసన్నబలుం బయో
జాప్తతేజు నుదగ్రపౌరుషు నంజనాచలతుల్యు సం
తప్తకాంచనమండనాఢ్యు నుదారశౌర్యు సమగ్రసం
ప్రాప్తరాక్షసరాజ్యవైభవు నత్యుదాత్తు యశోనిధిన్. 1109

వ. మఱియు నానావ్యాళసమాకీర్ణంబు లైనశిఖరంబులచేతనలరుమందరంబుకరణి ననర్ఘమణిగణప్రభావీచీసమీచీనకోటీరసమలంకృతంబు లైనపదిశిరంబులచేత విరాజమానుం డగువాని నమరేంద్రవారణవిషాణాగ్రపరిపీడనకృతవ్రణవక్షస్స్థలుం డగువాని శరత్కాలరాకానిశాకరమండలమండితం బైన వదనంబుచేత విశాలోరస్స్థలవిరాజమానం బగుహారంబుచేతను సబలాకం బగుతోయదంబుచందంబున నందం బగువానిఁ బంచశీర్షంబు లగుపన్నగంబులలీలం గ్రాలునర్ఘకేయూరకనకాంగదచందనోత్తమభూషితంబు లగుపీనాయతబాహువులచేత నొప్పువాని మఱియును 1110

సీ. ఇరుగెలంకుల నలంకృత లై సురాంగన ల్రమణీయమృదుచామరములు వీవఁ
దతబుద్ధిఁ గార్యమంత్రవినిశ్చయమునందు నతిదక్షు లై మంత్రు లనుసరింప
నందడి జడియఁ గాంచనవేత్రపాణు లై సారణశుకులు జోహారు సేయ
గుణదోషముల తెఱంగులు గణించుచు నమాత్యులు విభీషణాదులు భజింప

తే. రత్నసంయోగసంస్కృతరాజపీఠమున సుఖాసీనుఁ డై శుభబుద్ధు లైన
యాప్తులు భజింప సురయుతుం డై ననిర్జరోత్తమునిభంగి నిండుకొలువున్నవాని.

వ. మఱియు మేరుశిఖరంబునందు సునిష్ఠితం బైనసజలం బగుజలదంబుమాడ్కి ననంతరత్నప్రభాభాసురం బైనయాస్థానసదనమునంటపోపరిభాగంబున నుపవిష్టుం డైనదశగ్రీవు నవలోకించి తత్తేజంబున మోహితుం డగుచు రాక్షసులచేతఁ బీడ్యమానుం డయ్యును నరకుగొనక పరమవిస్మయవ్యగ్రమానసుం డై తనమనంబున. 1112

శా. ఆహా వీనియుదగ్రరూపవిభవం బాహా భుజావిక్రమం
బాహా వీనియనంతసత్త్వము సముజ్జ్వలద్భూరితేజోజయో
త్సాహంబు ల్సకలాంకయుక్తతయు దాక్ష్యంబుఁ బ్రతిస్థైర్యము
న్నాహా గర్వము ధాత్రియందుఁ బరికింపం గాన మెవ్వారికిన్. 1113

చ. ఒనరఁగ వీనియందు గుణ మొక్కటి తక్కువ యయ్యెఁ గాక క
ల్గిన బలసూదనప్రముఖలేఖనికాయము నైన నేలఁ జా
లినబలశాలి వీఁ డలుక లేచి చరించిన భూతధాత్రి నం
బునిధితరంగమాలికలు ముంపఁగ నోపఁడె యొక్కచేల్మిడిన్. 1114

చ. ఇతనినృశంసకర్మమున కింతయు నిర్జరయక్షపన్నగ
ప్రగతులు మర్త్యలోకులు నృపాలురు సౌఖ్యము గాన శాస్త్రవి
ధృతి చెడి యున్నవా రధికధీరుఁడు రాఘవుఁ డెన్నఁ డాజిలో
నితని వధించి లోకముల కిచ్చు ననామయసౌఖ్యసంపదల్. 1115

క. అని బహువిధంగుల మారుతి, తనయుఁ డమితసత్త్వుఁ డై దనుజాన్వయవ
ర్ధనునిప్రభావముఁ గనుఁగొని, తనమది విస్మయమునొందఁ దలఁచుచునుండెన్.

వ. అప్పుడు దురాత్ముం డగురాక్షసేశ్వరుండు తేజోన్వితుం డై తనముంగల నున్న పింగాక్షుం డగువృక్షచరశ్రేష్ఠుని రోషారుణితలోచనంబుల నిరీక్షించి యేను దొల్లి కైలాసనగంబు భుజాబలగర్వంబునఁ బలఁబు మొఱయఁ బెకలించునాఁ డెవ్వనిచేత శప్తుండ నైతి నట్టిభగవంతుం డైనశంకరకింకరుం డగుసాక్షాన్నందికేశ్వరుండు నేఁ డిట్లు కపిరూపధరుం డై చనుదెంచెనో యనియును బలిపుత్రుం డగుబాణాసురుం డరుగుదెంచెనో యనియును జింతించి తంత్రాహతాత్ముం డై మంత్రిసత్తముం డగుప్రహస్తు నవలోకించి కాలయుక్తంబును విపులార్థవంతంబు నగువాక్యంబున నిట్లనియె. 1117

రావణనియోగంబునఁ బ్రహస్తుఁడు హనుమంతుని [illegible]

ఉ. ఎవ్వఁడ వీవు మర్త్యునకు నెవ్వఁడవు పంపఁగ వచ్చి లంక కా
సెవ్విధిఁ జొచ్చి నాదువన మేటికి భగ్నము సేసి దైత్యులం
గ్రొవ్వున నేల చంపె నరకుం గొన కేల రణంబుఁ జేసె మా

రవ్విధమంతయుఁ దెలియున ట్లడుగుండు సమస్త మేర్పడన్. 1118

వ. అనిన రావణునివచనంబు విని ప్రహస్తుండు హనుమంతున కభిముఖుండై యి ట్లనియె. 1119

సీ. ఎవ్వాఁడ వీవు మహీరుహచర యోల వచ్చితి విటకు నెవ్వాఁడు పంపె
సురకిన్నరుల కైనఁ జొరరానిమత్పురం బెట్లు చొచ్చితి వోట యింతలేక
ధనదుఁడు పంప వచ్చినవాఁడవో శక్రుఁ డంప వచ్చితో పాశి యంపె నొక్కొ
యముఁడు పంపెనొ విజయార్థివై విష్ణుండు పంపఁగా వచ్చితో భయముదక్కి

తే. కలతెఱం గెల్లఁ జెప్పుము కపటవృత్తిఁ, జెప్పవేనియు బ్రతికి పోఁ జెల్ల దిచట
నిక్కము వనాటుఁడవు గావు నీవిధంబు, వింతయై తోఁచుచున్న దొక్కింతయును.

వ. అనినఁ బవననందనుండు రావణున కభిముఖుండై యి ట్లనియె. 1121

హనుమంతుఁడు రావణునకుఁ దాను లంకకు వచ్చినతెఱం గెఱింగించుట.

ఉ. అచ్చుగఁ గాలపాశిధనదాచ్యుతశక్రులు పంప దూతనై
వచ్చినవాఁడఁ గాను బలవైరిసమాననమగ్రభోగసం
పచ్చతురుండవైననిను మక్కువతోఁ దమి దీరఁ జూడఁగా
వచ్చితిఁ గీశవంశమున వాసిగఁ బుట్టినవాఁడ నెంతయున్. 1122

చ. అమరవిరోధి వైన నిను నర్థిఁ గనుంగొనుకాంక్షఁ జేసి సం
భ్రమమున నీదునిష్కుటము భగ్న మొనర్చితి దాని కల్గి యు
గ్రమునకు భూరిసత్త్వులగుదైత్యులు డాసిన దేహరక్షణా
ర్థము వడిఁ బోరొనర్చి సుకరంబుగఁ ద్రుంచితి వారి నందఱన్. 1123

చ. అలయక దేవదైత్యవరులైన ననుం జటులాస్త్రబంధనం
బుల వడి నంటఁ గట్టుటకుఁ బూనఁగఁ జాలరు పద్మయోని ని
స్తులవర మట్లు నా కొసఁగె స్రుక్కక నిన్నిటు గాంచి నీకు నా
కలతెఱఁ గెల్లఁ జెప్పుటకుఁ గా శరబద్ధుఁడనైతి నెంతయున్. 1124

వ. ఇప్పు డిమ్మహనీయాస్త్రబంధనవిముక్తుండనై యున్నవాఁడ. 1125

ఉ. భూవరమౌళిరత్నరుచిభూషితపాదసరోజుఁ డైన రా
మావనినేత నేను దనుజాధిప నమ్మినబంట నర్థి నెం
తే వడి రాజకార్యములు దీర్పఁగ నీకడ కేగుదెంచితిన్
నావచనంబు నిక్కము వినం దగు నీకు నిశాచరోత్తమా. 1126

వ. అని పలికి బలవంతుం డగుహనుమంతుని సవ్యగ్రుండై మహాసత్త్వుం డగుదశగ్రీవుం డవలోకించి క్రన్నన సార్థవంతం బైనవాక్యంబున ని ట్లనియె. 1127

ఉ. రావణ కీశవంశజలరాశినిశాకరుఁ డైనయట్టి సు
గ్రీవుఁడు నీదుభ్రాత నను బ్రీతిగ నేమముఁ జెప్పి పంప ర
క్షోవర నీసకాశమునకుం జనుదెంచితి భ్రాతృవాచికం

బీవు వినంగ నర్హుండ వహీనసుఖంబుల నిచ్చు నెంతయున్. 1128

వ. అది మఱియు ధర్మార్థసహితంబు నుభయలోకసుఖావహంబై యుండు దానిం జెప్పెద వినుము. 1129

తే. బలరిపున కుద్ది యగువాఁడు ప్రజల నెల్లఁ
బుత్త్రులను బోలె ననిశంబుఁ బ్రోచువాఁడు
కరితురంగశతాంగముల్ గలుగువాఁడు
దశరథుఁ డనంగ నొకరాజు ధరణి నొప్పు. 1130

ఉ. ఆన్నృపవంశశేఖరుని కగ్రసుతుండు జగద్ధితుండు తే
జోనిధి రామభద్రుఁ డన శోభిలు నమ్మహనీయమూర్తి భా
ర్యానుజయుక్తుఁడై మునులయట్లు జటాజినముల్ ధరించి తాఁ
గానకు వచ్చె ధర్మపథకౌశల మేర్పడఁ దండ్రిపంపునన్ 1131

వ. ఇట్లు నరుగుదెంచి దండకారణ్యంబు ప్రవేశించి జనస్థానసమీపంబున నివసించి యుండ నమ్మహాత్మునిభార్య యగుసీతనతిసత్కులజాతననంతకల్యాణగుణసమేత నఖిలలోకైకమాతను మ్రుచ్చిలించి కొనితెచ్చిన నద్దేవిని గానక యారఘువల్లభుండనుజసహాయుండై మహారణ్యమార్గంబున వెదకుచు ఋశ్యమూకంబునకుం జనుదెంచి సుగ్రీవునితో సఖ్యముఁజేసి యతనిపగతుం డగువాలి నతిబలశాలి నవలీల నొక్కకోల నేలం గూలనేసి తదీయం బగువానరరాజ్యంబు సుగ్రీవున కొసంగి సమస్తవానరగణంబుల కధినాథునిం జేసె వాలిపరాక్రమప్రకారంబు తొల్లి నీవుం గొంత యెఱుంగుదే కదా యట్టివాలిం బరిమార్చి విజయలక్ష్మీవిరాజమానుండై యున్నరామునకుఁ బ్రతికారం బొనరించుతలంపున సత్యసంధుం డగుసుగ్రీవుండు సీత నన్వేషించి యున్నచో నెఱింగి రమ్మనుచు వానరుల నెల్లదిక్కులకుం బనిచిన నాహరిపుంగవులు శతసహస్రాయుతసంఖ్యలం గలవారు పెచ్చుపెరిఁగి విచ్చలవిడి దశదిశల నన్వేషించుచున్నవారందుఁ గొందఱు వైనతేయసమానవేగులు కొందఱు వాయుతుల్యరంహులు కొందఱు మనోజవంబునం బఱచువా రట్టివానరకదంబంబులోన. 1132

ఉ. ఏ నొకవానరుండ దనుజేంద్ర సమీరున కౌరసుండ స
న్మానితవీర్యుఁడ న్నిరుపమానబలుండ హనూమదాఖ్యుఁడన్
జానకి నిచ్చట న్వెదక సాగరముం దరియించి వచ్చి య
మ్మానిని నీయశోకవనమధ్యమునం గనుఁగొంటి నొంటిగన్. 1133

—హనుమంతుఁడు రావణునిఁ దర్జించుట.—

తే. అరయ సందృష్టనిఖిలధర్మార్థుఁడవు త
పంబు పెంపునఁ దేజంబుఁ బడసి తీవు
పుణ్యుఁ డగుబ్రహ్మకులమునఁ బుట్టినాఁడ
వన్యదారలఁ జెఱఁబెట్ట నగునె నీకు. 1134

క. నిర్మలమతులు భవాదృశు, లర్మిలిఁ గులనాశకరము లతినిందితముల్
ధర్మవిరుద్ధము లగుదు, ష్కర్మము లొనరింప రెందుఁ గర్బురతిలకా. 1135

తే. రామకోపానువర్తి సంగ్రామభీమ, లక్ష్మణవిముక్తనిశితకలంబకోటి
మ్రోల నిలువంగ నెవ్వాఁడుఁ జాలఁ డసుర,నాథ పరికింప నీభువనత్రయమున.

ఉ. వీరవరేణ్యుఁ డైనరఘువీరున కెగ్గొనరించి దేవదే
వారులలోన నెవ్వరును బ్రాణముతోడ సుఖంబు నొందఁగా
నేరరు గాన నాపలుకు నిక్కముగా మది నమ్మి సీత నా
ధారుణినేత కిచ్చి పురదారసుతాదులఁ గాచికొ మ్మొగిన్. 1137

చ. నలువుగ సీతఁ గాంచుట వనం బది భగ్న మొనర్చు టాజిలోఁ
బలువుర దైత్యులం దొడరి పట్టి వధించుట యిన్ని నేఁడు నా
వలననె యయ్యె నింక రఘువర్యుఁడు నీతల లాజిఁ ద్రుంచి మై
థిలిఁ గొనిపోవు నన్నునుజదేవున కంతియె కార్య మారయన్. 1138

ఉ. భావమునందుఁ బంచముఖపన్నగి యంచుఁ దలంప కీవు నే
దేవిని మ్రుచ్చిలించి కొని తెచ్చితి వా మిథిలేంద్రకన్య ర
క్షోవర నీవనాంతమున శోకము నొందుచు నుండఁ గంటి న
ప్పావనశీలశోకశిఖి భస్మము సేయదె నిన్ను నీపురిన్. 1139

తే. పూర్వగీర్వాణశేఖరభుక్త మైన, గరళసమ్మిశ్రితాన్నంబుకరణి నరయ
సీత దనుజాదితేయులచేత నైనఁ, జాల నఱిగించుకొనుటకు శక్య గాదు. 1140

వ. మున్ను తపోబలవిశేషంబునఁ బరమేష్ఠి మెప్పించి యమ్మహాత్మునివలన సురాసురయక్షకిన్నరగరుడోరగాదులవలనం జావు లేకుండ వరంబు గొంటి నని యంటి వేని. 1141

చ. అరుణసుతుండు కిన్నరసురాసురచారణసిద్ధులందు నొ
క్కరుఁడును గాఁడు నిన్నని నఖండబలంబున గీటణంపఁగా
హరికులమందుఁ బుట్టినమహాబలుఁ డింక నిశాచరేంద్ర సం
గరమున నెట్లు ప్రాణములు గాచికొనం గల వెన్ని చూడఁగన్. 1142

తే. ధాతను గుఱించి పెక్కేండ్లు తప మొనర్చి
కడఁగి తదనుగ్రహంబునఁ బడసినట్టి
సంపదకు నాయువునకు నైశ్వర్యమునకు
హాని యొనరింపఁ దలపోయ నగునె నీకు. 1143

వ. పూర్వసంచితమహనీయధర్మవిశేషంబు నాకు రక్షణం బగు నంటివేని ధర్మఫలం బైనసుఖం బది యధర్మఫలంబుతోఁ గూడ భోగ్యంబు గానేరదు గావునఁ దేజస్తిమిరంబులకుం బోలె బూర్వధర్మాద్యతనధర్మంబులకు సహావస్థానవిరోధంబు గలుగుటవలన రోగరాజ్యంబుల కెట్లు సహావస్థానంబు గలుగు నటు

సహావస్థానంబు గలుగనేరదు ధర్మఫలంబు ధర్మఫలంబుతోఁ గూడి యుండు నీపూర్వకృతధర్మం బధర్మకృతాధర్మనాశనంబు గావింపం జాలదు నీవు నేటావత్కాలపర్యంతంబు తీవ్రతపోరూపధర్మఫలం బనుభవించితి వింకఁ బరదారాపహారణరూపాధర్మఫలంబు శీఘ్రంబున ననుభవించెదవు సందియంబు లేదు మానుషుం డగురాముండు నన్నేమి సేయుం గలఁ డని శంకింప వలవదు. 1144

క. వినుము జనస్థానవధం,బును వాలివధంబు ప్లవగపుంగవఖరభం
జనులనఖిలవు నెఱిఁగికొని, దనుజోత్తమ నీకు హితము తలపోయు మిఁకన్.

ఉ. పోర దశాస్యుఁ ద్రుంతు నని భూపతి సర్వవనాటసన్నిధిఁ
దీఱనియుల్కతోఁ దగఁ బ్రతిజ్ఞ యొనర్చినవాఁడు గాన నా
కూరక యుండఁగా వలసె నుక్కఱి సాధ్వియనుజ్ఞ యున్న నీ
వారిని నిన్ను నీపురిని ద్రచ్చి వధింపఁగ నేన చాలనే. 1146

తే. వీరవరుఁ డైన రామభూవిభుని కిట్లు, చేసి సాడాదసురగణేశితయు నైన
బ్రతుకఁ జాలఁ దనంగ ఘుపాచరేంద్ర, సృష్టి మిముఁబోఁటివారలఁ జెప్ప నేల.

ఉ. కేవల మర్త్యకాంత యని కృత్రిమరూపముతోడ వచ్చి యీ
దేవిని ద్రుచ్చిలించి కొని తెచ్చితి వామిథిలేంద్రకన్య ర
క్షోవర నిన్ను నీకులముఁ గూల్పఁగఁ బుట్టినకాళరాత్రి గా
భావమునం దెలుంగు మనపాయసుఖస్థితి నొందలే దిఁకన్. 1148

వ. మఱియు సీతావిగ్రహరూపం బగుకాలపాశంబునం గట్టుపడితి వింక నేతెఱంగున జీవించెద వదియునుం గాక మహానుభావుం డగురాముండు కోపారుణిత వీక్షణంబుల నిరీక్షించిన నీలంక దగ్ధనాలాటప్రలోళిక యైకూలు నది యట్లుండ నిమ్ము పతివ్రతాశిరోమణి యైనయీ దేవీశోకానలంబున నిప్పురం బిప్పుడ భస్మంబు గాఁగలదు రామునకు దాసుండను జాడుండను విశేషించి హాసరుండ నైన నావచనంబు సత్యం బని విచారింపుము బంధుమిత్రజ్ఞాతిసుతహితకళత్రభాతృమంత్రిభోగరాజ్యంబులం గోలుపోవుటకుఁ గా నజ్ఞానంబున జానకిం దెచ్చితివి విష్ణుతుల్యపరాక్రముండును సర్వలోకేశ్వరుండు నగురామునికరం బొక్కటి త్రుటిలోన సచరాచరంబు లగులోకంబు లన్నియు సంస్పృశించి బ్రహ్మఁ దూరంబు వచ్చి చొచ్చు మఱియు నమ్మహాత్ముండు సచరాచరభూతంబు లై లోకంబుల నన్నింటి సంహరించి బ్రహ్మ సృజించుటకు సమర్థుం డమ్మహాత్మునితోడ విగ్రహించుటకు సురాసురరక్షోయక్షగరుడగంధర్వసిద్ధసాధ్యచారణ విద్యాధరగుహ్యకపతత్రిప్రముఖనిఖిలభూతంబులందు నెవ్వండును సమర్థుండు గాఁ డట్టిరాజసింహునకు విప్రకారంబుఁ జేసితి వింక నేతెఱంగున జీవించెదవు రామబాణంబులపాలిం బడినవధ్యుండవు నైననిన్నుఁ ద్రైలోక్యనియంతృత్వకృతత్రహాంతృత్వసర్వసురసంవృతకాద్వడధన్వవిశిష్టుం డైనవజ్రపాణియునానావిధభక్తత్వత్రియుక్తకుద్రత్వనైరిభస్మీకరణసమర్థఫాలలోచనయుక్తత్వత్రిపు

రాంతకత్వాదిధర్మవిశిష్టుం డైనమహేశ్వరుండును బృంహత్త్వనిత్యత్వస్వతం
త్రత్వబహుముఖత్వకార్యనిర్వాహకత్వాదిధర్మవిశిష్టుం డైనవిరించియు రక్షిం
ప శక్తులు గా రని యివ్విధంబున శంకింపక జంకించి పలికినసౌష్ఠవోపేతంబు
లగుహనుమంతునివచనంబులు విని దశగ్రీవుండు క్రోధమూర్ఛితుం డై నేత్రం
బులం దామ్రదీధితులు నిగుడ రాక్షసులం జూచి దర్పంబున వీనిం బరిమార్పుఁ
డని యాజ్ఞాపించిన దురాత్ముం డగువానిపలుకుల కులికిపడి దూతను వధించుట
ధర్మంబు గా దని తలంచి కార్యంబు తెఱంగు విచారించి మంత్రవినిశ్చయంబు
గావించి దానవకులభూషణుండును మేఘగంభీరనిర్ఘోషణుండును నీతివిద్యా
విశేషజ్ఞుండు నగువిభీషణుండు సామనిశ్చితంబు లగువాక్యంబుల నన్నకుఁ
గోపోపశమనంబు సేయుచు ని ట్లనియె. 1149

విభీషణుండు హనుమంతుని వధింప నాజ్ఞాపించు రావణునకు నీతి బోధించుట.

చ. అరయఁ బరావరజ్ఞు లని యార్యులు సన్నుతి సేయ ధాత్రిలోఁ
బరఁగెడునట్టిసాధునరపాలురు దూతలఁ జంప రెంతయు
న్నరసత నాదువాక్యము ప్రసన్నమతిం గొని నీమనంబులోఁ
దఱిసినరోసము న్విడిచి తాల్మి వహింపుము రాక్షసేశ్వరా. 1150

తే. ఈవనాటునిఁ జంపుట హితము గాదు
తగినరీతియె నినుబోఁటిధార్మికులకు
నిది సుజనవృత్తగర్హితం బింతె కాదు
రాజధర్మవిరుద్ధంబు రాక్షసేంద్ర. 1151

సీ. దానవేశ్వర నీవు ధర్మజ్ఞుఁడవు కృతజ్ఞుఁడవు పరావరజ్ఞుఁడవు రాజ
నీతిజ్ఞుఁడవు భూతనివహంబులోఁ బరమార్థవిదుండ వత్యంతఘనుఁడ
వరయ భవాదృశుం డగుపండితుం డిట్లు రోషంబు గైకొన్న లోకమందు
సకలశాస్త్రార్థవైశారద్య మంతయుఁ జర్చింపఁ గేవలశ్రమమె కాదె

తే. కాన రోషంబు నణఁపుము క్షమ యొనర్పు
మోజ మెఱసి సనాతనరాజనీతి
నిగుడ యుక్త మయుక్తంబు నిశ్చయించి
దండము విధింపు మెంతయుఁ దగవు మెఱయ. 1152

చ. అనుచు విభీషణుండు వినయంబున నీతి యెఱుంగఁ బల్కినన్
దనమది దేశకాలవిహితం బగుతమ్మునిమాటచొప్పు గై
కొనక దశాననుండు పటుకోపరసోత్కటఘూర్ణమానలో
చనములఁ దామ్రదీధితులు సాంద్రతరంబుగఁ బర్వ ని ట్లనున్. 1158

క. అరిసూదన పాపాత్ములఁ, బొరిగొనినం బాప మింత పుట్టదు వెస నీ
దురితాత్ముం డగువానరుఁ, బొరిగొనియెద నిఖిలకోణపులకు హితముగాన్.

వ. అని పలికిన నధర్మమూలంబును బహుదోషయుక్తంబు ననార్యజుష్టంబు నగు రావణునివచనంబు విని బుద్ధిమద్వరిష్ఠుండగు విభీషణుండు పరమార్థతత్త్వం బగువాక్యంబున నిట్లనియె. 1155

సీ. దనుజేంద్ర ధర్మార్థతత్త్వ మైనట్టి నావచనంబు వత్సలత్వమున వినుము
ఈవానరుండు నీ కెగ్గొనరించె వీఁ డరివరుఁ డగు నిక్క మైన నేమి
తెగువమై దూతలఁ దెగటార్పరా దని యార్యులు వచియింతు రన్నియెడలఁ
గాన వీని వధింపఁ గారాదు దూతకుం దలపోయఁ బెక్కుదండములు గలవు

తే. అంగవైరూప్య మొనరింప నగుఁ గశాభి
ఘాత మొనరింపఁ గా వచ్చుఁ గడఁగి చిహ్న
సన్నిపాతం బొనర్పఁగాఁ జను వధింప
వచ్చు ననుమాట వినలేదు వసుధలోన. 1156

ఉ. సత్యవచోవిచారు లగుసాధులు కోపముఁ బూన రార్యసం
స్తుత్యగుణోత్తరుండ వజితుండవు సంతతము న్పరావర
ప్రత్యయనిశ్చితాత్ముఁడవు పార్థివధర్మవిదుండ వీవు నో
దైత్యకులేంద్ర చిత్తమునఁ దాల్మి వహింపక యల్గఁ జెల్లునే. 1157

చ. చతురత ధర్మవాదమున శాస్త్రమతిగ్రహణంబునందు సం
తతమును లోకవృత్తమున దాక్ష్యమునం దొకఁ డైన నీ కిలం
బ్రతి యగువాఁడు గానము క్షపాచరశేఖర దేవదానవ
క్షితిపతికోటిలోఁ గడుఁ బ్రసిద్ధికి నెక్కినవాఁడ వెంతయున్. 1158

క. ఈకపిని దునిమినందున, నీ కేమియు గుణము లేదు నిక్కము వీనిం
దేఁకువ నిచటికిఁ బంపిన, భీకరశత్రువులమీఁదఁ బెంపుము కినుకన్ 1159

చ. అసురవరేణ్య దూతలు నిజాధిపుఁ డాడినచంద మంతయుఁ
రసనకుఁ దోఁచినట్లు పరరాజుల ముంగల నోట లేక ని
ర్వ్యసనముతోడఁ బల్కుదురు వారలఁ జంపుట పాడి గాదు నీఁ
డసమున వైరిచే నియతుఁడై చనుదెంచినచారుఁ డారయన్. 1160

వ. రాక్షసేంద్రా యీవనచరుండు నిహతుం డైన నీపయోనిధి నుత్తరించి క్రమ్మఱ నిచ్చటికి రాఁగలఖేచరుం డొక్కరుం డైన రామునిసమీపంబున లేఁడు సతీవృత్తాంతనివేదకాభావంబువలన రామలక్ష్మణులిచ్చటికి యుద్ధార్థం బరుగుదేరరు దానంజేసి నీకు శత్రుక్షయంబు సమకూడదు వీనివలన సీతావృత్తాంతం బెఱింగిరేని రామలక్ష్మణులు తత్క్షణంబ రణార్థులై నీకడ కరుగుదెంచెదరు దానం జేసి నీ కయత్నంబున శత్రుక్షయంబు వాటిల్లుం గావున నెల్లభంగుల వీనిం జంపుట కార్యంబు గాదు వీఁడు నీచేత విడువంబడినవాఁడై రయంబునం జని దీర్ఘపథావరుద్ధులై నరామలక్ష్మణుల యుద్ధంబునకుం దోడ్కొని వచ్చు నందు వలన యుద పియుండ వగునీకు మే లగుఁ బరా క మోతాంపహవంతు తెవగుగా

సురులకు దుర్జయుండ వైననీచేత నుపలాలితు లైనయీరాక్షసయోధు లం
దఱుఁ గరకంటకాతినివారణార్థంబుగా రణంబుఁ గోరి యున్నవారు వీరిమనో
రథంబు వైఫల్యంబు నొందించుట యుక్తంబు గాదు నీమిత్రుల హితవాదు
లును శూరులును సత్కులజాతులును మహాగుణపరిగ్రహులును సంతతో
పలాలితులును శస్త్రభృద్వరిష్ఠులు నగుయోధులు దానమానవశీకృతు లై
యనేకు లున్నవారు వీ రందఱు భవదర్థంబునందుఁ బ్రాణంబుల నైన విడువం
గలవారు వీరిలోఁ గొందఱు భవదాదేశంబున బలైకదేశసహితు లై మహౌఘు
లగురాజపుత్రులం బట్టి తెచ్చి భవదీయప్రభావంబు ప్రకాశింపఁజేయుటకు
నరుగం గలవారు నావచనంబుఁ బట్టి వీనిపై నలుగక విడిచి పుచ్చుము. 1161

చ. అనుచు విభీషణుండు వినయంబున నీతి యెఱుంగఁ బల్కినన్
దనమది దేశకాలవిహితం బగుతమ్మునిమాటచొప్పు గై
కొని హృదయస్థమైనపటుకోపము సారెకుఁ గ్రమ్మఱించుచున్
దనుజవరేణ్యుఁ డిట్లనియెఁ దద్ధితబుద్ధికిఁ జాల మెచ్చుచున్. 1162

ఉ. తమ్ముఁడ నీవు పల్కినవిధంబు సముచితరాజనీతియు
క్తమ్ముగ నున్న దెంతయు జగంబుల దూత లవధ్యు లౌట ని
క్కమ్మిది వీని కింక స్మృతి గల్గక యుండ వినిగ్రహం బవ
శ్యమ్మును జేయఁగా వలయు నంపినవానికి సిగ్గు పుట్టఁగన్. 1163

చ. వనచరజాతికి న్మిగుల వాలము భూషణ మట్లు గావునన్
ఘనుఁ డగువీనితోఁక వెస గాల్పుఁడు నంతట దగ్ధవాలుఁ డై
తనమది లజ్జయున్ బొడమ దైన్యము నొందుచు నున్నవీనిఁ గ
న్గొని మది సంతసించెదరు కూరిమితో మనవార లందఱున్. 1164

రావణుండు హనుమంతునితోఁకం గాల్ప రాక్షసుల కాజ్ఞాపించుట.

వ. అని నిశ్చయించి రాక్షసుల నిరీక్షించి యీవనాటునిలాంగూలంబునందు
హుతాశను దరికొల్పి ప్రదీప్తం బగులాంగూలంబుతోఁ బురంబునల్లెడలం
ద్రిప్పికొని రండని యాజ్ఞాపించిన నన్నిశాచరులు రావణవాక్యప్రేరితు లై
మొగంబులం జిడిముడిపాటు గదురఁ దైలావసిక్తంబు లైనయనేకజీర్ణపటకా
ర్పాసకంబు లవ్వీరవరునివాలాగ్రంబునం జుట్టి యనలుం బ్రతిష్ఠించిన నత్తె
ఱంగు విలోకించి లంకాపురంబునం గలనిశాచరు లందఱు బాలవృద్ధనారీ
సహితంబుగా ముదంబు నొంది రంత నక్కపిశ్రేష్ఠుండు శుష్కేంధనంబులచేత
నభివృద్ధి వహించినవనహుతాశనునిమాడ్కి నెదిగి వదనంబు బాలసూర్యుని
లీలం గ్రాల మనంబునం గ్రోధంబు చెంగలింప నత్యున్నతశరీరుం డై ప్రదీ
ప్తం బగులాంగూలంబుచేత నచ్చటిదానవులం జదియ నడిచి వెండియుఁ
గ్రూరు లగుకొందఱు రాక్షసులు దృఢపాశంబులఁ దన్ను బద్ధుం జేసిన నప్పు

శంబులవలన విడివడ సమర్థుం డయ్యును దత్కాలసదృశియగుబుద్ధిం జేసి యిట్లని వితర్కించె. 1165

చ. హరివరుఁ డైనసూర్యసుతుఁ డంపఁగ రామహితార్థ మబ్ధి స
త్వరముగ దాఁటి వచ్చి ఘనతం జరియించెద నన్నుఁ బట్టి ము
ష్కరముగ బద్ధుఁ జేసిరి నిశాచరు లిప్పుడు మత్కృతోగ్రసు
స్థిరతరకర్మయుక్తికిఁ బ్రతిక్రియ గాదు తలంచి చూడఁగన్. 1166

తే. ఏను బద్ధుండ నై యున్న నేమి నన్ను
నిగ్రహింపంగఁ జాల రీయుగ్రదనుజు
లనువుమీఱఁ బాశములఁ ద్రెంచికొని కడంగి
యింతఱ వధింపఁ జాలుదు నేఁడు మీఱ. 1167

క. ఐనను వేగిరపడ నేలా నరపతికార్యసిద్ధికై యీదనుజుల్
పూని యొనరించునవమతి, కే నించుక సేపు మది సహించెదఁ దాల్మిన్. 1168

వ. అదియునుం గాక ముప్పు రాత్రిసమయం బగుటవలన నీలంకాపురంబునం గల సర్వస్థలంబులు విలోకింపరా దయ్యె నిప్పుడు దుర్గకర్మకౌశలం బంతయుం బరిశోధించెద నీరాక్షసులు సేయుశరీరపీడనంబును బుచ్ఛాగ్రంబున వెలుంగువహ్ని దేవువేఁడిమియు మచ్చిత్తంబున కించుక యైన శ్రమంబు గావింపం జాలదు పురీపరిశోధనానంతరంబున బంధంబులం ద్రెంచికొని విజృంభించి రాక్షసులం బొలియించి విక్రమంబు ప్రకటించెదఁ గాక యని నిశ్చయించి రజ్జువులం గట్టువడి యున్నవాఁడుపోలె నొదిగి యున్న నమ్మహాబలనందనుని మహానుభావంబు నెఱుంగక బలవంతు లగురాక్షసులు దీర్ఘపాశంబులం బ్రతిగ్రహించి. 1169

రాక్షసులు తోఁకలో నిప్పంటించి హనుమంతుని రాజవీథులం ద్రిప్పుట.

చ. చటులమృదంగతూర్యమురజస్వనముల్ ఘనశంఖభేరికా
పటహనినాదముల్ మిగుల బంధురభీషణసింహనాదము
ల్పటుతరభంగి నాకసము బ్రద్దలువాఱఁగ మ్రోయ రాక్షసుల్
దుటుములు గట్టి వాయుసుతుఁ దోడ్కొని యేగిరి రాజవీథులన్. 1170

ఉ. ఆహనుమంతుఁ డప్పుడు మదాసురకోటి యొనర్చుభూరికో
లాహలశబ్దము ల్వినుచు రాజగృహంబుల రమ్యచత్వర
వ్యూహముల న్విమానముల నుత్తమభూములఁ బణ్యవీథుల
న్వాహనశాలల న్బలవారణశాలలఁ జిత్రశాలలన్. 1171

క. శృంగాటకములఁ బర్వత, శృంగంబుల బహువిచిత్రశిల్పిగృహంబు
ల్బంగరుమేడల దేవగృహాంగణములఁ జూచుచు న్రయంబున నరిగెన్. 1172

ఉ. అత్తఱి లంకలోఁ గలసురారిమృగాక్షులు బాలవృద్ధులుం
జిత్తములం ముదం బెదుగఁ జిత్రసువర్ణవిమానరాజిపైఁ

దత్తఱపాటుతో నిలిచి తద్దయు దీపితవాలుఁడై నకీ
శోత్తముఁ గాంచి రొప్పుచు సముద్ధతి గేలి యొనర్చి రందఱున్. 1173

ఉ. అప్పుడు దైత్యు లొక్కమొగి సాగ్రహులై భయదాట్టహాసము
ల్చొప్పడ వింతకోఁతి యిదె చూడుఁ డటంచును వారివారికిం
జెప్పుచుఁ జుట్టు ముట్టుకొని శీఘ్రజవంబున వీథివీథియు
ద్రిప్పిరి త్రాటఁ బట్టుకొని ధీరుని వాయుకుమారు నయ్యెడన్. 1174

క. డెందమునఁ గుతుక మలరఁగఁ, గొందఱు దైతేయసతులు గురుతరబుద్ధి
న్పొందుగ జనకమహీభృన్నందనికడ కేగి ఘోరనాదముతోడన్. 1175

ఉ. ఇంతకు మున్ను నీకడ కహీనజవంబున వచ్చి రామవృ
త్తాంతముఁ జెప్పిపోయినవనాటుని నుద్ధతిఁ బట్టి వానివా
లాంతమునందు దారుణహుతాశనుని న్దరికొల్పి దైత్యు లా
త్యంతముదంబుతోడఁ బుర మంతయుఁ ద్రిప్పుచు నున్నవా రొగిన్. 1176

—సీత హనుమంతునికి శీతలుండవు గమ్మని యగ్నిదేవునిఁ బ్రార్థించుట.—

వ. అని పలికిన నాత్మహరణోపమం బైన క్రూరవాక్యంబు వినిశోకసంతప్తచిత్తయై యక్కపిశ్రేష్ఠున కగ్నిదేవునివలని బాధ గలుగకుండ మంగళం బొసంగుట కభిముఖయై నిర్మలం బగుతనమనంబున హుతాశను నుద్దేశించి. 1177

మ. పతిశుశ్రూషయు సత్తపశ్చరిత మభ్యస్తైకపత్నీత్వ మా
తతసౌశీల్యము నాకుఁ గల్గుట యథార్థం బేని నామీఁద మ
త్పతికి న్నిత్యముఁ బ్రేమ గల్గుటది తథ్యం బేని మద్వాక్యప
ద్ధతి శీతుండవు గమ్ము వాయుజున కుద్యత్ప్రీతితోఁ బావకా. 1178

ఉ. క్రన్ననఁ దత్సమాగమనకాంక్షిణిఁ గాఁ గమనీయవృత్తసం
పన్నునిగా ననుం హరిసమానుఁడు రాముఁ డెఱుంగు నేని శౌ
ర్యోన్నతుఁ డాకపీంద్రుఁడు మదుగ్రవిపజ్జలరాశి కోడయా
యెన్నఁగ నిక్క మేని పతిభృత్యునిఁ బ్రోవుము హవ్యవాహనా. 1179

వ. అనుచు సీత ప్రార్థించిన నద్దేవిమహిమవలన హనుమత్పుచ్ఛానలుండు ప్రదక్షిణార్చిశిఖుండై కపితల్లజుకుశలంబు తెలుపుచు వెలింగె హనుమజ్జనకుండగుసమీరణుండు పుచ్ఛానలయుతుండయ్యునుసీతాప్రభావంబువలనఁ బ్రాలేయాచలశీతలుండగుచు నద్దేవికి సుఖకరుండై విసరె నంత నక్కడ నప్పవమాననందనుండు లాంగూలంబు దహ్యమానం బగుచుండ ని ట్లని వితర్కించె. 1180

—హనుమంతుఁడు తనకు నిప్పువేఁడిమి గానరాకుండుట కచ్చెరువందుట.—

ఉ. క్రందుగ నొక్కపెట్టిడి జగంబుల నన్నిఁటిఁ గాల్పనోపువాఁ
డందము గాఁగ వాలగతుఁ డయ్యును బావకుఁ డేమి చోద్యమో
పొందుగ నించుకైనఁ దనభూరితరోష్ణతఁ జూప కెంతయుం

జందనశీతలుం డగుచుఁ జాల వెలుంగుచు నున్నవాఁ డొగిన్. 1181

వ. ఏ నిచ్చటికిం జనుదెంచునప్పుడు రామప్రభావంబువలన సముద్రమధ్యంబునఁ బర్వతరూపం బైనపరమాద్భుతవస్తు వెట్లు దృష్టం బయ్యె నట్లీవహ్నిశైత్యంబు రామప్రభావంబువలన సంజాతం బయ్యె నిది నిక్కంబు రామార్థంబు సముద్రమైనాకంబుల కుదయించినసంభ్రమంబు పావకున కేల యుదయింపకుండు.

క. మాయయ్య యైనగాలికిఁ, బాయనిప్రాణసఖుఁ డగుట బాటించి ననున్
ధీయుతుఁడు పరితపింపఁగఁ, జేయు టుడిగి పావకుండు శీతలుఁ డయ్యెన్. 1183

ఉ. ఏసతి నేఁడు భూరికృప నిచ్చినస్వస్త్యయనంబుచే మరు
ద్వాసవకాలముఖ్యసురవర్యుల కాజి నజయ్యు లైనఘో
రాసురుల న్రణంబున రయంబునఁ ద్రుంపఁగఁ గంటి నట్టిధా
త్రీసుతసత్కృపన్ దహనదేవుఁడు శీతలుఁ డౌట చోద్యమే. 1184

క. జనకజ యాశీర్వాదం,బున రామనరేంద్ర తేజమునఁ బదపడి సు
జ్జనకునిసాచివ్యంబున, ననలుఁడు ననుఁ గాల్ప నోపఁ డయ్యె నిజముగాన్.

హనుమంతుఁడు బంధనములవలన విడిపడి కావలివారి నందఱం జంపుట.

వ అని యొక్కముహూర్తంబు చింతించి యమ్మరున్నందనుండు మనంబున రామలక్ష్మణసీతార్కతనయానిలవాతసఖులకు నమస్కరించి తనశరీరంబుకుఱుచపఱిచి యంగుష్ఠమాత్రగాత్రుండై బంధనంబులవలన విడివడి రాక్షసులు నిరీక్షించుచుండఁ దత్క్షణంబ వెండియు మేరుమందరసంకాశదివ్యదేహుండై విభక్తరక్షస్సంబాధంబై మహోన్నతం బైనశైలశృంగంబుమాడ్కిఁ జూడ్కికి వ్రేఁగగుచున్న పురద్వారంబుమీఁది కతివేగంబున దాఁటి తోరణాశ్రితం బైనకాలాయసపరిష్కృతం బగుపరిఘంబు విలోకించి దానిం బుచ్చుకొని తన్నుం గాచికొనిపరివేష్టించి వచ్చువారిఁ గ్రూరరాక్షసుల నిశ్శేషంబుగా రూపుమాపి లంకాపురంబు నల్గడలు వీక్షించుచుఁ బ్రదీప్తలాంగూలకృతార్చిర్మాలియై యంశుమాలియగు సూర్యుని తెఱంగున వెలుంగుచుఁ గృతమనోరథుండును బ్రవర్ధమానశరీరుండును సముత్సాహసంపన్నుండు నై రణచండవిక్రముం డగువాయునందనుండు తన మనంబున వెండియుఁ గార్యశేషం బెట్లని వితర్కించె. 1186

క. గురుశక్తి నింకమీఁదట, నరయఁగ నిష్ఠురమువారి కందఱకును గ్ర
మ్మఱ దారుణసంతాపము, కరము గలుగఁ జేయు టిదియ కర్తవ్య మగున్.

క. వనభంగము గావించితి, దనుజులఁ బెక్కండ్ర నాజి దారుణభంగిం
దునిమితి నిఁక దుర్గవినా,శన మొక్కటి కొదవ యయ్యె సలుపఁగ వలయున్.

ఉ. వంచన లేక నే నిపుడు వారక దుర్గవినాశనంబు గా
వించితి నేని మీఁద రఘువీరునకున్ సులభంబు గాఁగ న
క్తంచరవంశవర్యు దశకంఠునిఁ జంపఁగ వచ్చు నాకునున్
మించుగ నల్పకార్యమున మిన్నును ముట్టినకీర్తి చేకుఱున్. 1189

## హనుమంతుఁడు లంకాదహనము సేయుట.

వ. అదియునుం గాక. 1190

తే. కోరి యెవ్వాఁడు నాదులాంగూలమందు
సుప్రతిష్ఠితుఁ డై బహుశ్రుతి వెలుంగు
చున్నవాఁ డట్టిశిఖికిగృహోత్తమముల
చేత సంతర్పణంబును జేయవలదె. 1191

వ. కావున మదీయపుచ్ఛాగ్రగతుండైన వైశ్వానరునిచేత నిప్పురంబంతయు దగ్ధంబు గావించెదఁ గాక యని నిశ్చయించి సౌదామినీసమన్వితం బైన తోయదంబు లీల లంకాభవనశృంగశృంగాటకంబులయందుఁ జరించుచు నొక్కగృహంబున నుండి వేఱొక్కగృహంబుమీఁదికి నెగయుచు మహోద్యానపంక్తులు విలోకించుచు నసంత్రస్తుండై సమీరసమానవేగంబునఁ బ్రాసాదంబులమీఁదికి దాఁటుచు బలవంతుం డగుహనుమంతుండు క్రమంబున. 1192

తే. అలప్రహస్తునిభర్మహర్మ్యంబుమీఁది
కుఱికి యందు హుతాశను నిరవు కొల్పి
నుఱి మహాపార్శ్వునిమహార్హ మందిరమున
కెగసి యందుఁ గృశానుని నిగుడఁ జేసి. 1193

సీ. జంబుమాలి సుమాలి సారణశుకరశ్మికేతులగృహము లగ్నికి నొసంగ
దంష్ట్రరోమశవజ్రదంష్ట్రధ్వజగ్రీవసుప్తపిశాచసద్మములు గాల్చి
మకరాక్షశోణితాక్షకరాళయూపాక్షభాసకర్ణులయిండ్లు పాడుచేసి
కుంభకర్ణనికుంభకుంభదేవాంతకనిలయంబు లొక్కట నీఱుచేసి

తే. బ్రహ్మరిపుయజ్ఞపరిపంథిభానుశత్రు, శక్రజిన్మందిరములు భస్మంబుచేసి
లంకఁ గలవారిగృహములెల్లను దహించె, నొగి విభీషణుమందిర మొకటి దక్క.

క. ఈరీతి లంకఁ గలదే, వారాతులదివ్యమణిగృహంబులచేతన్
దారుణగతి దహనునకు సమారాధన మాచరించి యనిలజుఁ డంతన్. 1195

చ. కనకమహీధరంబు క్రియఁ గ్రాలెడుదాని ననర్ఘదివ్యనూ
తనమణికాంతులం దనరుదాని నమేయవిచిత్రశిల్పభా
జన మగుదాని హేమమణిజాలవిరాజిత మైనదాని శో
భన మగుదాని రావణుని భవ్యవిమానముఁ జేరి వేడుకన్. 1196

మ. ఘనవాలాగ్రగతాగ్ని నమ్మణిమయాగారంబుపై నుంచి పా
వని నీరంధ్రయుగాంతనీరదముతేవన్ బెట్టు గర్జించె నం
త నిమేషంబున కాకృశానుఁడు చలద్వాతప్రయోగంబుచేఁ
బెను పొందెన్ వలమానదారుణశిఖాభీలజ్వలన్మూర్తి యై. 1197

వ. ఇత్తెఱంగున దరికొని హుతాశనుం డంబరచుంబిశిఖాపరంపరుం డై ఛటచ్ఛట

శబ్దంబులతో విస్ఫులింగంబు లెగయఁ బ్రళయకాలాగ్నియుంబోలె నేర్చి
పేర్చు నెడ. 1198

చ. అడరి సమీరణుం డతిరయం బడరం జెలరేఁగి వీచుచోఁ
గడువడి వీతిహోత్రకణకాండము లొక్కట నుగ్రభంగి న
ల్గడలఁ బడం దొడంగె ఖలరాక్షసనాశము దెల్ప లంకపై
నుడుగక మింట నుండి రభసోద్ధతి వ్రాలుమహోల్కలో యనన్. 1199

శా. పెంపారం బొగ లంబరంబునకు నాభీలాంబుదత్వం బొగిన్
సంపాదింప విమానదీర్ఘహుతభుగ్జ్వాలావళీజాలము
ల్సంపాజాలము లయ్యెఁ జారణమరుత్సాధ్యోరగుల్ దిక్కులన్
గుంపుల్గట్టి యొనర్చుస్తోత్రరవముల్ ఘోషంబు లయ్యె న్రహిన్. 1200

ఉ. హేమగవాక్షశోభితము లిందుమణీమయకుట్టిమంబులు
న్గోమలరత్నభిత్తులు మనోహరవేదులు నైనక్రవ్యభు
గ్ధామములున్ విమానములు గాలి ధరం బడెఁ గాలమందు నెం
తే మినువీటనుండి పడుదివ్యుల మందిరపంక్తులో యనన్. 1201

చ. అడరి హుతాశనుం డొగి గృహంబులఁ జుట్టును ముట్టి గాల్పఁగాఁ
దడఁబడి దానికిన్ బ్రతివిధానము గానక యాండ్రబిడ్డలన్
గడువడిఁ బాసి ప్రాణములు గాచికొనం బరువెత్తఁ బాదముల్
తడఁబడువారియార్తనినదంబులు వీటఁ జెలంగె నయ్యెడన్. 1202

మ. అకటా యెక్కడివానరుం డితఁడు సత్యం బీకృశానుండు నేఁ
డకలంకస్థితి లంకఁ గాల్చుటకు నాహా కీశరూపంబుతో
సకళుండై చనుదెంచె నెట్లని శిఖాసంతప్తలై దీపితా
లకలై గూలి రిలన్ స్తనంధయధరక్రవ్యాదయోషిన్మణుల్. 1203

ఉ. కొప్పులు వీడఁగా మఱియుఁ గొందఱు కామిను లుప్పరంబుతో
నొప్పుగ రాయుహర్మ్యముల నుండి హుతాశశిఖాపరంపరల్
గప్పిన నోర్వఁజాల కచలం బడ సాగిరి మేఘవీథికిన్
దప్పి విచిత్రభంగి వసుధం బడుకాఱుమెఱుంగులో యనన్. 1204

మ. నెలవుల్ కాంచనరౌప్యసంచయములున్ మిన్నందుధాన్యంపుఁది
ప్పలు నానావిధరత్నరాసులును శుంభద్వస్తుసందోహము
ల్నలుపొప్పం గణఁజంబు లంటుకొని నానాకాంతుల న్వీట భా
సిలు వైశ్వానరుఁ డర్థవంతముగఁ జేసెన్ జిత్రభానుత్వమున్. 1205

మ. నియతిన్ దారుణరూపులన్ దనుజులన్ బెక్కండ్ర సంగ్రామని
శ్చయుఁడై చంపియుఁ దృప్తినొందనినభస్వత్పుత్త్రుచండాసన
గ్నియు లంకాపురమధ్యమందిరములం గ్రీడాగతి స్నిఖు చే
సియు సంతృప్తి వహింపదయ్యెఁ గ్రతుభుక్చేతోముదాపాది యై. 1206

క. ఒక్కెడఁ గింశుకములగతి, నొక్కెడ శాల్మలులమాడ్కి నొప్పారఁగ వే
ఱొక్కెడ నశోకములక్రియఁ, బెక్కెడల హుతాశశిఖలు పెద్దయు నొప్పెన్.

క. అతివేగవంతుఁ డగుమా,రుతిచే లంకాపురంబు రుద్రునిచే ను
ద్ధతిఁ గాలి కూలుత్రిపురము, గతి నప్పుడు దగ్ధ మగుచు గడ్డరిఁ గూలెన్.

వ. మఱియు నవ్వైశ్వానరుండు హనుమద్విసృష్టుండై తొల్లి రావణునివలనిభయం
బున స్వరూపప్రకటనంబు సేయనోడి యుండి తత్కాలంబునరాక్షసబలక్షయం
బును దైవబలోదయంబును బ్రత్యాసన్నం బగుట యెఱింగి నిశ్శంకితుండై లం
కాపురాధారత్రికూటశిఖరంబునం బొడమి వాయుసహాయంబునం జేసిభీమపరా
క్రమంబున లంకాపురంబు సర్వంబు నాక్రమించి జ్వాలాసమూహంబు ప్రసరిం
పం జేసి గగనంబు దాఁకం బెరిఁగి యుగాంతకాలానలతుల్యవేగుండును గగన
చుంబిశిఖాపరంపరుండు నాదిత్యకోటిసమాన తేజుండును రక్షోరాజమందిరో
పరిభాగసంచారుండును విధూమురశ్మియు రక్షశ్శరీరాజ్యసమర్పితశిఖుండును
నతిప్రవృద్ధుండును గింశుకపుష్పచూడుండును నూత్నప్రభుండునై లంకాపురంబు
సర్వంబు నావరించి యశనిప్రకాశంబు లగుబహువిధదారుణశబ్దంబులచేతఁ
బంకజాతభవాండకుంభంబు పగులంజేయుచుఁ బ్రళయకాలాగ్నిచందాన
నతిభీకరదర్శనుండై వెలుంగుచుండె నప్పుడు పూర్వదగ్ధభవనాగ్నినిర్వాణ
సముత్థితధూమవ్యాప్తపంక్తులై మేఘంబులు నీలోత్పలచ్ఛాయ గలిగి
గగనంబునం బ్రకాశించె నాసమయంబున. 1209

క. మెండుగ మిడుఁగుఱులు పొగ, లొండొకవడిఁ జుట్టు ముట్టుకొని బాధింపం
దుండంబు లెత్తుకొని వే,దండంబులు పాఱె బృంహితధ్వను లెసఁగన్. 1210

మ. హనుమత్క్రోధబలాభిభూతయయి స్వాహానాథతీవ్రార్చులన్
దనుజస్యందనదంతివాజిమృగరాడ్ధాత్రీజసాలాండజా
తనివాసంబులతోడ దగ్ధయయి సంతాపంబుచే లంక బో
రున శోకానలహేతిఁ గాలినటు లాలోకింపఁగా నయ్యెడిన్. 1211

శా. హా కాంతామణి హా మనోహర సఖా హా తాత హా సోదరా
హా కాంతా జనయిత్రి హా ప్రియసుతా హా మిత్ర హా పుత్రకా
వీఁకన్ దారుణవహ్ని గాల్పఁ దొణఁగెన్ వీక్షింపరే యంచు న
స్తోకార్తి న్విలపించువారికృపణోక్తుల్ నిండ మ్రోసెం బురిన్. 1212

క. అప్పుడు కృశానుబాధకుఁ, దప్పినగీర్వాణరిపుకదంబము వెలుచన్
నిప్పులఁ గాలినలంకను, దప్పక వీక్షించి మదిని దహాతహ వొందమన్. 1213

ఉ. ఈతఁడు కోఁతి గాఁడు నిజ మింతయు శక్రుఁడో కంధినాయకుం
డో తపనుండో గంధవహుఁడో యముఁడో హరుఁడో కృశానుఁడో
శీతకరుండో రాత్రిచరశేఖరుఁడో ధనదుండో మృత్యువీ
రీతి వనాటరూపము ధరించి నిశాటులఁ ద్రుంప వచ్చెనో. 1214

చ. వనజభవప్రకోప మిటు వానరరూపముఁ దాల్చి వీఁకతో
దనుజులఁ ద్రుంప వచ్చెనో యతంద్రిత మాద్య మనంత మవ్యయం
బనుపమ మప్రమేయ మభయం బగువైష్ణవతేజ మీక్రియన్
వనచరరాజరూపమున వచ్చెనొ దైత్యవినాశనార్థమై. 1215

వ. అని యిట్లు పెక్కండ్రు పెక్కుతెఱంగులఁ బరమశోకాక్రాంతులై యార్తనాదంబుల విలపించుచుండి రిట్లు హనుమంతుండు గృహరత్నమాలినియగులంకాపురంబు సమస్తంబును భస్మంబు గావించి ప్రదీప్తలాంగూలకృతార్చిర్మాలియై యంశుమాలి యగుసూర్యుని తెఱంగున దేజరిల్లుచు విచిత్రం బగుత్రికూటశిఖరాగ్రంబులఁ గొండొకసేపు విశ్రమించి యుండె నప్పుడు మహాబలుండును మారుతతుల్యవేగుండును మహామతియు నగువానరవీరముఖ్యునిమహాద్భుతకర్మంబు విలోకించి దేవర్షి బ్రహ్మర్షి సిద్ధ సాధ్య గంధర్వ విద్యాధర కిన్నర రక్షోయక్షచారణాదులుపరమానందభరితాంతఃకరణులై సాధువాక్యంబుల నభినందించిరి మఱియు సమస్తభూతంబులు దుర్నిరీక్ష్యం బైనతదాకారంబుపలక్షించి సాక్షాద్వైశ్వానరుండనుశంకచేత భయవిత్రస్తంబులై పఱవందొడంగెని త్తెఱంగున వనభంగంబుగావించి రణంబుననేకరాక్షసులం బొలియించి లంకాపురంబంతయు హుతాశనున కర్పించి సముద్రోదకంబున వాలానలంబు చల్లార్చి కృతార్థుండై వెండియు సంభ్రమత్రస్తవిషణ్ణరాక్షసయు సముజ్జ్వలజ్వాలహుతాశనాంకితయునై పితామహకోపహతయై పాడఱి యున్నమేదినిభంగిఁ జూపట్టుచున్నలంక నవలోకించి తనమనంబున. 1216

హనుమంతుఁడు లంకాదహనంబున సీతకును భయంబు గలిగియుండునని దుఃఖించుట

చ. విడివడి యేను లంక నవివేకతఁ గిన్కకొలంది వహ్నిచే
నుడుగక కాల్చి నిందలకు నుర్విఁ బాత్రమ నైతి నక్కటా
కడువడి మందుచిచ్చు నుదకంబున నార్చినమాడ్కి నాత్మలోఁ
బొడమినక్రోధముం జెఱుత వుచ్చెడువా రతిధన్యులే కదా. 1217

క. కుపితుఁడు పాప మొనర్చును, గుపితుఁడు హింసింపఁ జూచు గురువుల నైనం
గుపితుఁ డతిశస్త్రసన్నిభ, లపితంబుల సాధుజనములం దెగడు వడిన్. 1218

చ. ఒనరఁగ నెవ్వఁ డేనియు సముత్పతితం బగుక్రోధ ముద్ధతిం
బనివడి జీర్ణమైనఘనపన్నగచర్మమునట్లు తాల్మిచే
తను నిరసించువాఁడు వసుధం బురుషుం డన ఖ్యాతిఁ గాంచు మం
దునకు నొకించుకేని గుణదోషవిచారము గల్గ దెన్నఁడున్. 1219

క. ధరలో వాచ్యావాచ్యం, బెఱుఁగునె కుపితుండు వాని కెన్నఁ డకార్యం
బరయ నవాచ్యము లేదా, పురుషునిచే సర్వకార్యములు చెడిపోవున్. 1220

సీ. అక్కట యే నెంత యవివేకినో మహీతనయచొప్పరయక తాల్మివీడి
చటులఘోరానలజ్వాలల నీలంక నంతయుఁ గాల్చితి నవ్వెలంది

కడునిక్కువంబుగాఁ గ్రాఁగి యుండఁగఁ బోలు నెంతదురాత్ముఁడ నెంతజడుఁడ
నెంతదుర్మేధుఁడ నెంత మూర్ఖుఁడ నెంత పాపస్వభావుఁడఁ బతిహితంబు

తే. దీర్పలేనైతి స్వామిఘాతిని నైతిఁ
బూని వచ్చినకార్యంబు పొందుపఱచు
కొనుట గద యుక్త మెందు నప్పనియె చెఱచి
కొనెడు నాయట్టికష్టదుర్జనుఁడు గలఁడె. 1221

ఆ. అరయ లంకయందు నగ్నిచే భస్మంబు, గానిదెశ మొక్క టైన లేదు
సీత వహ్నిశిఖలఁ జిక్కక మని యున్న, దంచు నిశ్చయింప నగునె యింక.

క. కుపితాత్ముఁడ నై ప్రజ్ఞా, విపర్యయంబున నొకింత వెఱవక మనుజా
ధిపుకార్యముఁ జెఱచితి నిఁకఁ, గపు లందఱు నన్ను స్వామిఘాతుకుఁ డనరే.

వ. మఱియు నన్వేషణపూర్వకరావణనిలయపరిజ్ఞానసీతాదర్శనసన్నివేదనరూప మహాకార్యంబు రాముని వేదనమాత్రావశిష్టం బగునట్లు గావింపంబడియెఁ గావున నిప్పుడు క్రోధాభిభూతుండ నైన నాచేతఁ దత్కార్యమూలక్షయంబు నిస్సంశయంబుగాఁ గావింపంబడియె రోషంబువలన దోషంబుఁ జేసితి నింక నేమనిన నేమియగు ముల్లోకంబులయందు మదీయం బైన కపిత్వంబు ప్రథితం బయ్యె రక్షణసమర్థుండ నైన నాచేత నాగ్రహంబువలన జానకి రక్షింపంబడకుండుటం జేసి స్వతంత్రంబు ననవస్థితంబు నగురజోగుణనిబంధనచేష్టావిశేషంబు నుగర్హించెద రావణుండు సీతం జంపక మ్రుచ్చిలించికొని పోయె నేన దేవి నజ్ఞానంబునం జంపితి రామునకు నాకంటె రావణుండె యొక్కింత మేలువాఁ డయ్యె నింక నెత్తెఱంగున హరీశ్వరుఁ డగుసుగ్రీవుని సందర్శింపం బోదు నరేశ్వరు లగురామలక్ష్మణులతో నేమని సంభాషింపుదు నకృతార్థుండ నై యమ్మహాత్ములసమ్ముఖంబునకుం జనుకంటె నా కిచ్చట జలంబులం బడి యైనఁ జిచ్చులో నుఱికి యైనఁ బాశంబులచే నుఱిగొని యైన విషంబు గ్రోలి యైన సముద్రచరంబులగు మహాసత్వంబులకు మదీయశరీరమాంసఖండంబులు సమర్పించి యైనఁ బ్రాణత్యాగంబు సేయు టధికోదయం బై తోఁచుచున్నది యిచ్చటికిం బోయిన సీతావృత్తాంతంబు విని రామలక్ష్మణులు నిక్కంబుగా శరీరత్యాగంబు సేయుదురు తద్వినాశంబుఁ జూచి సుగ్రీవుండు బంధుసహితంబుగా నశించు నంతఁ దద్వృత్తాంతంబు విని భ్రాతృవత్సలుం డగుభరతుండు శత్రుఘ్నసహితంబుగా మరణంబు నొందు ధర్మిష్ఠం బగునిక్ష్వాకుకులంబు దీఱినపిదప సమస్తజనంబులు శోకసంతాపపీడితు లై యంతంబు నొందెదరు భాగ్యరహితుండ లుప్తధర్మార్థసంగ్రహుండ రోషదోషపరీతాత్ముండ నగునే నింతకుం గారణంబ నైతి నని యనేకప్రకారంబుల దీనుండై చింతించుచుండ నప్పు డయ్యనిలనందనునకు వైదేహి కుశలంబు దెల్పుచుఁ గొన్నిశుభనిమిత్తంబులు దోఁచిన వెండియుఁ దనమనంబున. 1224

-ఈశం హనుమంతుఁడు సీతాదేవికి భయంబు గలుగదని నిశ్చయించుట. ఈశం-

తే. అకట తప్పుఁ దలంచితి నాత్మ తేజ
ముని సురక్షిత యగుమహీపుత్త్రి వీతి
హోత్రుఁడు తపింపఁ జేయంగ నోపఁ డుర్వి
నగ్నియం దగ్ని యేమిసేయంగనోపు. 1225

తే. అమిత తేజుఁడు ధర్మాత్ముఁ డైనరాము
పత్ని యగుసీత జనకభూపాలపుత్త్రి
యాత్మచారిత్రసంగుప్త యగుచు నుండ
సంస్పృశింపంగ నెట్లోర్చు శ్వసనసఖుఁడు. 1226

ఉ. ఏజలజాక్షిపుణ్యమున నించుక యైనఁ బ్రచండకీలకీ
లాజనితోగ్రబాధకుఁ దలంకక నాశము నొంద కేను దే
జోజయశాలినై సుఖము సొంపు వహింపఁగఁ గంటి నట్టియు
ర్వీజ వినాశ మొందె నని రిత్త దలంచితి నెంత వెఱ్ఱినో. 1227

చ. గురుమతిచే సుమిత్త్రకొడుకు ల్భరతుండును బ్రీతి నేనతీ
దిరముగ నాత్మలోఁ దమకు దేవత యంచుఁ దలంచి భక్తివి
స్ఫురణ దలిర్ప నిత్యమును బూజలు సేయుడు రట్టిరామభూ
వరమణిచిత్తహారిణికి వహ్నిశిఖాకృతబాధ గల్గునే. 1228

చ. అరయఁగ నెవ్వఁ డిజ్జగము లన్నియు నొక్కటఁ గాల్పఁ జాలియుఁ
ధరణిజ వేఁడుకొంటకు నతంద్రితుఁ డై కడు శైత్య మొందె మ
ద్గురుతరదీర్ఘవాలమునకుం దనవేఁడిమి సూపఁ డయ్యె న
క్కరుపలిచుట్ట మయ్యమనె గాసిలఁ జేయఁగ నెట్లు లోపెడున్. 1229

చ. సుకృతమున న్సుశీలమున సూనృతవాక్యమునన్ మనంబులో
నకలుషభక్తి సంతత మనన్యమతిం బతి గొల్చు చున్కిఁ బా
వకుని దహింపఁ జాలు రఘువల్లభవల్లభ యైనసీతకుం
జకితుఁడు గాక యేక్రియఁ గృశానుఁడు వేఁడిమిఁ జూప నోపెడున్. 1230

వ. అని బహుప్రకారంబుల వైదేహీధర్మప్రభావంబు దలంచి సముద్రమధ్యంబున మైనాకసందర్శనంబు చింతించుచుండ నప్పుడు. 1231

సీ. హనుమంతుఁ డెంతమహాత్ముఁ డొక్కఁడె యబ్ధి దాఁటి లంకకువచ్చి ధరణిసుతకు
విభునిసందేశంబు వినిపించి దనుజులఁ బెక్కండ్ర నాజిలో నుక్కడంచి
లాంగూలవహ్నిచే లంకాపురము గాల్చె నయ్యగ్ని దైత్యగేహంబు లన్ని
భస్మంబు చేసియుఁ బతిమనోహారిణి యగుసీతను దహింపఁడయ్యె నహహ

ఆ. యెంత చిత్ర మనుచు నంతంత వినువీది, మ్రోయుఖచరసిద్ధమునిపతంగ
మరుదహీంద్రయక్షమధురవాక్యంబులు, వినఁగ వచ్చె నతని వీను లలర. 1232

హనుమంతుఁడు సీతాదేవిం జూచుట.

వ. ఇట్లు వితెంచిన నాఋషివాక్యంబులచేతను దక్షిణాక్షిస్పందనాదిశుభనిమిత్తంబులచేతను సీతాపాతివ్రత్యరామప్రభావాదికారణంబులచేతను దృష్టార్థంబులచేతను వైదేహి వహ్నిబాధకుం జిక్కక కుశలంబున నున్న దని నిశ్చయించి కలంకదేఱి సంప్రాప్తమనోరథుండును బ్రీతిసంహృష్టసర్వాంగుండును నై వెండియునద్దేవి ప్రత్యక్షంబుగా సందర్శించి యనుజ్ఞగొని రామునియొద్దకుం జనియెదఁ గాక యని తలంచి నిజభుజాబలవిధ్వంసితమహీరుహషండమండలం బైనయశోకవనంబునకుం జని. 1233

ఉ. మారుతి గాంచె మారుతనుమారుసిపై ననుకంపఁ జేర్చి చె
న్నారఁగ శీతలుండ వగుమా యని సారెకు మారుతాప్తునిం
జీరుచుఁ జెక్కిటం గరము సేర్చి సువర్ణవికీర్ణశింశుపా
భూరుహమూలమందుఁ గడుఁ బొక్కుచు నున్నవిదేహపుత్త్రికన్. 1234

క. కని సంభ్రమమున వందన, మొనరించి మహీజ వైదయోగంబున స
య్యనలాప్తులఁ గ్రాఁగక శుభ,మున నొప్పెడునిన్ను గురుఁ బొడగంటి నిటన్.

చ. అన విని భూమిపుత్త్రి హృదయంబున నిండిన రాగపూర మొ
య్యన వెలి కుబ్బి పాఱినటు లాడటఁ గన్నుల హర్షబాష్పముల్
చినుకఁగ సారెసారెకు బలీముఖవర్యునిఁ గాంచి రామభ
ర్తను మదిలోఁ దలంచి యనురాగము తేటపడంగ నిట్లనున్. 1236

చ. పవనతనూజ నిక్కముగ భారము నీయది యాల నీ వొకం
డవె రఘుభర్తకార్యము ఘనంబుగ దీర్పఁగఁ జాలు పుణ్యసా
రవుఁడవు నీదుకీర్తికిఁ గరంబు ఫలం బిది యెట్లు చేసెదో
రవికులవార్ధిసోముఁ డగురాముని నన్నిఁక నెట్లు గూర్చెదో. 1237

ఉ. తా నెడఁ బాసి యున్నయెడ దైత్యుఁడు మ్రుచ్చిలి తెచ్చినందు కా
మానవనాథచంద్రుఁడు సమంచితమానధనుండు సైన్యసం
తానముతోడ వచ్చి ప్రధనంబున వీని బలాన్వితంబుగాఁ
బూని వధించి నన్నుఁ గొనిపోయినఁ దత్ప్రతికారమై చనున్. 1238

క. సంగరశూరుం డగురఘు, పుంగవునకు నిట్టిసేత పోలుపుగ యుక్తం
బుం గీర్తికి ననురూపం,బుం గావున నర్తిఁ బంగు బోధింపు మొగిన్. 1239

చ. అనవుడుఁ బ్రశ్రితంబును మహార్థయుతంబును హేతుసంహితం
బును నగుసీతమాట విని పుణ్యరతుండు మరుత్కుమారుఁ డి
ట్లను రఘునేత వానరబలాన్వితుఁడై వడి నేగుదెంచి రా
వణుని వధించి తల్లిరొ ధ్రువంబుగ నిన్గొనిపోవుఁ జెచ్చెరన్. 1240

చ. మనమున నీవు సందియము మాని సుఖస్థితి నుండు మేను నే
చని పతితోడ నీవిధము సర్వము సొంపుగ విన్నవించి తో

డ్కొని చనుదెంతు నంచుఁ గపికుంజరుఁ డుత్తమభక్తితోడ వం
దన మొనరించి వేగ పయనంబున కున్ముఖుఁ డయ్యె నయ్యెడన్. 1241

హనుమంతుఁడు సముద్రలంఘనంబుకొఱ కరిష్టపర్వతం బెక్కుట.

వ. ఇత్తెఱంగున వైదేహి నాశ్వాసించి సముచితంబుగా వీడ్కొని స్వామిసందర్శ
నోత్సుకుండై యక్కపిశార్దూలుండు సముద్రప్రాంతకాంతారమండితం బైన
యరిష్టం బను నొక్కకొండ యెక్కె నది మఱియు నీలాంబరీకృతతుంగపద్మకజు
ష్టవినీలకాంతారంబును ధాతూత్తరీకృతశృంగాంతరవిళంబిశారదాభ్రంబును బోధ
కీకృతమార్తాండకిరణసందోహంబును లోచనీకృతసముద్ధూతధాతువిశేషంబును
జందనీకృతనానావిధకుసుమపరాగవిసరంబును వేదధ్వనీకృతతోయౌఘమంద్ర
నిస్వనంబును గీతీకృతవిస్పష్టనానాప్రస్రవణనినదంబును నూర్ధ్వభుజీకృతసము
చ్ఛ్రితదేవదారుకదంబంబు నాక్రోశసన్నాదీకృతప్రపాతతలనిర్ఘోషంబును జలజ్జ
రాపాండుశిరోజీకృతశరత్పుష్పితసప్తచ్ఛదవృక్షంబును వేణునాదీకృతమారు
తోద్ధూతకీచకకదంబనాదంబును నిశ్శ్వాసీకృతఘోరాశీవిషసముచ్ఛ్వాసమా
రుతంబును ముఖరంధ్రీకృతనీహారపూర్ణగంభీరగహ్వరంబును జరణీకృతప్రత్యం
తపర్వతంబును గాత్రభంగీకృతగగనచుంబిశిఖరంబును బుష్పవద్వితతలతా
ప్రతానావృతసాలతాలతమాలరసాలాశ్వకర్ణపరివేష్టిత నానావిధకూటకోటిద
రీఝరీవిరాజితంబును నానామృగగణాకీర్ణశిలాసంచయసంకటంబును మహర్షియ
క్షగంధర్వకిన్నరోరగసేవితసానుతలంబును ధాతునిర్గమవిభూషితంబును బహు
ప్రస్రవణోపేతంబును సింహశార్దూలాధ్యుషితకందరంబును స్వాదుమూలఫలో
దకంబు నగు నప్పర్వతోత్తమం బారోహించి రామదర్శనశీఘ్రహర్షప్రచోదితుం
డై మహోదధియుత్తరతీరంబు సేరంగోరి ప్రావృట్కాలవలాహకంబుకరణి మేనుఁ
బెంచి మీనోరగనిషేవితంబగు సముద్రమార్గమునం జూడ్కి నాటించి మారుతజ
వంబున నెగయ సమకట్టి పాదద్వయంబు పర్వతాగ్రంబుపై మోపుటయుఁ దత్క్షణంబ.

హనుమంతునిపాదఘట్టనంబున నరిష్టపర్వతము నుగ్గునూచ మగుట.

క. పావనిపాదాక్రాంతము, లై విఱిగి మహోపలంబు లతిగంభీరా
రావంబులతోఁ జూర్ణము, లై వడి గిరిసానుతలములందుం గూలెన్. 1243

చ. హరివరుపాదఘాతమున నట్టిటు శైలము కంప మొంద జం
భరిపుని హేతిచేఁ దెగినభంగి మహోన్నతశృంగసంఘము
ల్పరువడి వ్రస్సి కూలె ఘనపాదపకోటికుఠారధారచే
నఱికినకై వడి న్విరులు నల్గడలం బడ వ్రాలె నేలకున్. 1244

చ. అతులితసత్త్వుఁ డయ్యనఘుఁ డంఘ్రులు మోపినయంతమాత్రఁ బ
ర్వతవరకందరాంతరనివాసిమహోగ్రమృగేంద్రసంఘముల్
గతి సెడి పీడితంబు లయి కాతరతన్ మదగంధవారణ

ప్రతతులు పాఱి నాకసము బ్రద్దలుగా వడి మ్రోసె నయ్యెడన్. 1245

సీ. భుగభుగ వాసించు మృగనాభితిలకంబు ఘర్మోదకంబుచేఁ గరఁగి జాఱ
నవలగ్నదేశబద్ధానర్ఘనవరత్నఘంటికారమ్యమేఖలలు వదల
మహనీయవక్షోజమండలోపరిబద్ధసులలితహారపంక్తులు చలింప
నెఱిఁ గప్పుకొప్పున నిండారఁ జుట్టినవిరిమల్లెపువ్వులు విరిసి రాలఁ

తే. కిన్నరవిహంగగంధర్వపన్నగేంద్ర, సాధ్యవిద్యాధరస్త్రీలు సంభ్రమమున
శైలములనుండి నిజనాథసహిత లగుచు, మించులవితాన నెగసిరి మింటి కపుడు.

చ. అడరి గుహాశయంబులు మహాకపిపాదనిపీడితంబులై
జడత సహించి నాలుకలు సాఁచుచు దుర్విషవహ్నిజాలము
ల్వెడవెడ గ్రక్కుచుం గరము వ్రేఁగున భోగము లెత్త లేక పెం
పెడలఁగఁ జుట్టుఁ జుట్టుకొని హీనత రోఁజుచు నుండె నయ్యెడన్. 1247

చ. అనిలజుఁ డబ్ధి దాఁటుటకు నయ్యెడఁ బాదము లూఁది మోపఁ గ్ర
న్ననఁ బదియోజనంబులతనర్పను ముప్పదియోజనంబు లె
త్తునుగల కొండ వృక్షములతో శిఖరంబులతోడఁ గ్రుంగి యొం
దును బరికింప భూతలముతోడ సమత్వము నొందె నత్తఱిన్. 1248

హనుమంతుఁడు సముద్రమును దాఁటుట.

మ. అనిలోద్ధూతచలన్మహోన్నతతరంగాస్ఫాలవేలాంతమై
ఘనమీనోరగమత్స్యకచ్ఛపమహోగ్రగ్రాహసంచారమై
వినదద్దారుణబాడబానలశిఖావిస్తారమై యున్నయ
వ్వనధిన్ దాఁటఁగఁ గోరి మింటి కెగసెన్ వాతాత్మజుం డయ్యెడన్. 1249

వ. ఇత్తెఱంగున నత్తరుచరశ్రేష్ఠుండు మారుతజవంబున నాకాశంబున కెగసి.

సీ. కమనీయహరిణాంకకుముదవికాసంబు సూర్యకారండవశోభితంబు
రమణీయగీష్పతిశ్రవణకాదంబంబు చటులాభ్రశైవలశాద్వలంబు
అసమానసవపునర్వసుమహామీనంబు భౌమమహాగ్రాహభాసితంబు
అభ్రమాతంగమహాద్వీపకలితంబు స్వాతీమదమరాళసంకులంబు

తే. ఉరగగంధర్వయక్షపద్మోత్పలంబు, పూర్ణచంద్రాంశుశిశిరాంబుపూరితంబు
నగుదురంతమహాగగనార్ణవంబు, నందుఁ గపి నావచందాన నరిగె నపుడు.

శా. చంచద్భాస్కరమండలం బొరయుచున్ సామీరి భాస్వన్నభ
స్సంచారక్షమభూతముల్ సలుపునాశ్చర్యస్తుతిధ్వానముల్
మించన్ జేతులు సాఁచి సగ్రహమదున్మిత్రర్క్షతారాధిపో
దంచద్వ్యోమము మ్రింగఁ బోయెడిక్రియన్ దాఁటించి యేగె న్వడిన్. 1252

చ. హరితతినీలపింగళసితారుణవర్ణమహాభ్రపంక్తులన్
దొరయుచు సారెసారెకును దూఱుచుఁ గ్రమ్మఱ నిర్గమించుచున్

గర ముఱుకాయ మొక్కయెడఁ గన్పడ నొక్కెడ మాటుఁ జెంద నా
హరివరుఁ డభ్రవీధి హరిణాంకుక్రియన్ గన నయ్యె నయ్యెడన్. 1253

తే. బహువిధాభ్రసంఘాతసంప్రాప్తమార్గుఁ, డై వళక్షనవాంబరుఁ డై యదృశ్య
దృశ్యతనుఁడై సమీరణప్రియసుతుండు, మింట జాబిల్లిచందాన మెఱసె నపుడు.

ఆ. మఱియుఁ దోయదంబుమాడ్కి గర్జించుచు, లంబపక్షపర్వతంబుకరణి
భూరిసత్త్వుఁ డైన భుజగాశనునిభంగి, నభ్రపథమునందు నరిగె నపుడు. 1255

వ. ఇవ్విధంబున నవ్వానరశ్రేష్ఠుండు రాక్షసప్రవరులం బరిమార్చి లంకాపురం
బాకులంబు చేసి రావణునకు సాధ్వసంబుఁ బుట్టించి ఘోరంబగు రాక్షసబలంబు
రూపుమాపి తనమహోద్భుతప్రభావం బెల్లవారికిఁ దెల్లంబు చేసి వైదేహీకభివం
దనంబు గావించి కృతార్థుండై నాగరోపరిభాగంబునం బోవుచు సముద్రమధ్యం
బున హిరణ్యనాభం బగుపర్వతశ్రేష్ఠంబు పొడగని దానిఁ గరంబున సంస్పృ
శించి గుణవిముక్తం బగునారాచంబుకరణి నతివేగంబునం జనిమహోదధి యు
త్తరతీరంబున నున్న మేఘసంకాశం బగుమహేంద్రశైలంబు విలోకించి యంగ
దాదికపులకు నిజవిజయం బెఱుకపడునట్లుగా వాలంబు వినువీథిం ద్రిప్పుచు
బ్రళయకాలధారాధరంబుపగిది సింహనాదంబుఁ జేసిన నమ్మహారవంబు దశదిశలు
నిండి గ్రహనక్షత్రశోభితం బైనగగనంబును బరిస్ఫోటితంబు గావించె నాసమ
యంబున. 1256

సీ. నీరధియుత్తరతీరంబునందు సమీరపుత్రునిరాక గోరుచున్న
బలవంతు లైనజాంబవదంగదసుషేణనలనీలముఖ్యవానరులు గగన
వీథి మేఘధ్వనివిధమున వీతెంచునృపదశ్వసుతునిగంభీరనినద
మాలించి తద్దర్శనాకాంక్షు లై మోద మువ్పొంగ విహరించు చుండి రందు

తే. బ్రహ్మపుత్రుండు చిరజీవి పరమవృద్ధుఁ
డంబుదోపమకాయుండు జాంబవంతుఁ
డధికసంతుష్టహృదయాంతరంగుఁ డగుచు
నంగదాదులఁ జూచి యిట్లనుచుఁ బలికె. 1257

తే. ఎల్లభంగుల నూహింప నిక్కపీంద్రుఁ
డౌనవఁ గృతకృత్యుఁ డై వచ్చుచున్నవాఁడు
సందియము లేదు తన్మహాస్వనము నమ్మ
దోత్కరంబును సూచించుచున్న దిపుడు. 1258

చ. అనవుడు వానరప్రవరు లాహరివీరుభుజోరువేగముం
ఘనతరనిస్వనంబు విని కౌతుక మొప్పఁగ హృష్టచిత్తు లై
మనమున నమ్మహాబలకుమారునిఁ జూచెడువేడ్క మీఱ గ్ర
క్కున ధరణీధరేంద్రపృథుకూటము లెక్కుచు నిక్కి చూచుచున్. 1259

హనుమంతుఁడు సముద్రోత్తరతీరంబున మహేంద్రపర్వతముపై వ్రాలుట.

సీ. ఒకవ్రానిపై నుండి యొకవ్రానిమీఁదికి వేడ్కతో జంగలు వేయువారు
గగనంబుతో రాయు ఘనశైలశృంగశృంగాటకంబులపైకి దాఁటువారు
లలితంపుఁజివురుకొమ్మలు చీరలుగఁ గట్టి చెలరేఁగి అంతులు సేయువారు
హనుమంతుఁ డదిగో వచ్చెనుజూడుఁడనిచెప్పికొంచుమార్గము విలోకించువారు
తే. నగుచు వానరులందఱు సకలభక్తి
సమ్మదంబులు మనమున సందడింప
హస్తములు మోడ్చికొని కుతూహలము మీఱ
వినుతి సేయుచు నుండి రవీ్వరవరులు. 1260

వ. అపుడు. 1261

ఉ. మేరుగుహాగతుం డగుసమీరునికై వడి బెట్టుమ్రోయుచుం
మారుతతుల్యవేగమున మారుతి మారుతవీథి నుండి సొం
పారఁగ నేగుదెంచి సకలాగమధాతుపరాగశోభిత
ద్వారమహేంద్రకూటమున వ్రాలె బిలేశయవైరికై వడిన్. 1262

వ. ఇట్లు హర్షోత్కర్షంబునం జనుదెంచిన వృక్షచరశ్రేష్ఠుం డగుహనుమంతుని వీక్షించి యతనిముఖలక్షణం బుపలక్షించి సీతం జూచి వచ్చుట నిక్కం బని నిశ్చయించి ప్రాణంబులు వచ్చిననింద్రియంబులుంబోలెఁబరమానందంబున నుప్పొంగుచు నమ్మహాత్మునిఁ బరివేష్టించి నానావిధంబు లగుఫలమూలంబు లుపాయనంబులు సమర్పించి వివిధంబు లగువాక్కుసుమంబులం బూజించి సీతావృత్తాంతసమాకర్ణనోత్కంఠులై కొలిచి యుండి రంత నమ్మరున్నందనుండుగురువృద్ధులకు జాంబవదాదులకు నమస్కరించి యువరాజగునంగదునకు నభివాదనంబు గావించి తక్కినవానరుల నయ్యైతెఱంగుల సంభావించి. 1263

హనుమంతుఁడు సీతం జూచితి నని వానరులకుఁ జెప్పుట

మ. చెలువొప్పం గనుఁగొంటి సీత నని సంక్షేపంబుగాఁ బల్కి సొం
పలరం వాలిజుచేయిఁ బట్టుకొని దివ్యచ్ఛందనానోకహో
జ్జ్వలదుద్యానవృతాచలాగ్రమునఁ జంచత్ప్రీతి నాసీనుఁడై
యలఘుప్రీతి దలిర్ప నిట్లనియెఁ గీశాగ్రేసరుం డత్తఱిన్. 1264

సీ. తనదురవస్థకు దైవంబు దూఱుచు నుపవాసముల డస్సియున్నదానిఁ
గావలి యున్నరక్షస్త్రీలు తర్జింప నుడుగక శోకించుచున్నదానిఁ
జెక్కిటఁ జెయిఁ జేర్చి చింతాభరంబునఁ బొగిలి నిట్టూర్పులు వుచ్చుదాని
మాటిమాటికిని రామా రామ యని పేరుకొంచుఁ గన్నుల నీరు నించుదాని
ఆ. మైలవలువతోడ మాసినజడతోడ, చెన్నుదఱిగి గుందుచున్నదానిఁ
గంటి రామభద్రుకాంతను దశకంఠు, నంతిపురముకడ వనాంతరమున. 1265

చ. అని విని వానరప్రవరు లాహరివీరువచోమృతంబు గ్ర
  క్కున( దమకర్ణరంధ్రములఁ గ్రోలి ముదంబున నుబ్బి యాడుచుఁ
  ఘనములమాడ్కి గర్జిలుచు గంతులు వైచుచుఁ దోఁక లంబరం
  బున వడిఁ ద్రిప్పుచుం బవనపుత్త్రుని బాహులఁ గౌఁగిలించుచున్. 1266

క. తరువులఁ బ్రాఁకుచు గిరికం, దరముల డాఁగుచు నుసగ్రతరశిఖరసము
  త్కరములపై కెగురుచు ని, ట్లతిముదిత విహరించి రపుడు హరికులముఖ్యుల్.

—అంగదుఁడు హనుమంతునిఁ బొగడుట.—

వ. అప్పు డంగదుండు పరమానందభరితాంతఃకరణుం డై వానరు లందఱు విను
  చుండ హనుమంతు నవలోకించి బహుమానపురస్సరంబుగా ని ట్లనియె. 1268

చ. తరుచరవీర సాగరము దాఁటఁగ లంక సొరంగ సీత న
  ల్లనఁ బరికించి చూడ మరలం జనుదేరఁగ నీకె చెల్లెఁగా
  కరయఁగ ధాత్రి వేఱొకని కయ్యెడుకార్యమె క్రవ్యభుజ్మరు
  ద్గరుడులయందు నీసమునిఁ గానఁ దదన్యులఁ జెప్ప నేటికిన్. 1269

తే. స్వామిభక్తియుఁ దేజంబు సాహసంబు
  దాక్ష్యము పరాక్రమంబు దుర్దాంతబలము
  వేగ సంపద ధైర్యంబు విజయశీల
  మహహ నీయందు నింత యొ ప్పగు నె యనఘ. 1270

మ. మనభాగ్యంబున సీత గన్పడియె రామస్వామి భార్యావియో
  గనిమిత్తం బగుశోకము న్విడిచె లోకఖ్యాతి చేకూడె నీ
  కనఘాత్ముం డగుభానునందనునివాక్యం బర్థసంయుక్త మై
  తనరెం బాత్రుల మైతి మిందఱము గోత్రాభృత్కృపాదృష్టికిన్. 1271

వ. అని యంగదుండు వాయుపుత్త్రు నగ్గించె నప్పుడు వానరు లందఱు సముద్రలంఘ
  నంబును సీతాదర్శనంబును లంకావిశేషంబును వినఁ గుతూహలంబున హనుమ
  ద్వదనోన్ముఖు లై కొందఱు తాలసాలంబులు ధరించియుఁ గొందఱు కరంబులు
  మోడ్చి ఫాలంబులం జేర్చియు హనుమదంగదజాంబవంతులం బరివేష్టించి కొల్చి
  యుండ రంగదుండు వానరపరివృతుండై విబుధులచేత నుపాస్యమానుం డైన
  దేవేంద్రునిచందంబున దేజరిల్లు చుండె నమ్మహేంద్రమహీధరాగ్రంబు కనకాం
  గదబద్ధబాహుం డగునంగదునిచేతను గీర్తిమంతుం డగుహనుమంతునిచేత
  నధ్యాసితం బై యద్భుతకాంతివిశేషంబునం బ్రకాశించు చుండె ని త్తెఱంగున
  నవ్వానరోత్తములు తత్పర్వతశిఖరంబున సుఖాసీను లై ముదంబునం బొదలు
  చున్నసమయంబున జాంబవంతుండు కార్యవృత్తాంతంబు విస్పష్టంబుగా విను
  వాఁడై హనుమంతు నవలోకించి యి ట్లనియె. 1272

జాంబవంతుఁడు లంకఁజేరి సీతం జూచిన తెఱం గంతయు హనుమంతు నడుగుట.

శా. ఏరీతిన్ జలరాశి దాఁటితివి నీ వేరీతి నప్పేటిలో
నారామాధిపుపత్నిఁ గాంచితివి దుష్టాత్ముండు దైత్యేశ్వరుం
డేరీతిం జరియించు నంతయును మా కింపారఁగాఁ జెప్పు మో
వీరాగ్రేసర పోయి వచ్చినకథావృత్తాంత మాద్యంతమున్. 1273

క. చెప్పిన విని పిమ్మట మన, మిప్పని సేయంగ వలయు నిఁక మన కనుచుం
దప్పక కార్యవిధానం, బిప్పుడ చింతించి నిశ్చయింతము బుద్ధిన్. 1274

క. రామావనిపతితో మన, మేమాట వచింప వలయు నిం పలరంగా
నేమాట దాఁచఁగా దగు, నామాటలు నిశ్చయింత మంతయుఁ జెపుమా.

హనుమంతుఁడు తాను లంకఁజేరి సీతం జూచినవిధమును వానరుల కెఱింగించుట.

క. నా విని సంతోషము మది, నావిర్భవ మంద సీత కభివందనమున్
గావించి సర్వ మేర్పడఁ, బావని యిట్లనుచుఁ బలికెఁ బ్లవగులు వినఁగన్. 1276

వ. ఏను మీచేత ననుజ్ఞాతుండనై మీ రందఱు విలోకించుచుండ మహోదధిదక్షిణ తీరంబు సేరం గోరి సమాహితుండనై మహేంద్రమహీధరాగ్రంబున నుండి గగనంబున కెగయుట మీ రెఱుంగుదు రేకదా యట్లెగసి వాయుజవంబున సాగరోపరిభాగంబునం బోవునప్పుడు సముద్రమధ్యంబున. 1277

మ. వరజాంబూనదదివ్యశృంగములతో వ్యాకీర్ణచంచన్మనో
హరనానావిధధాతుసంతతులతో నభ్రంకషోదగ్రభా
స్వరచామీకరవృక్షవాటికలతో శైలోత్తమం బొక్కఁ డే
నరుగన్ ద్రోవకు నడ్డమై నిలిచెఁ దిర్యగ్వ్యాప్తపక్షోర్ధ్వమై. 1278

మ. వివిధానేకహషంశమండితసమావిర్భూతశృంగావళిన్
దివితో రాయుగిరిం గనుంగొని మదోద్రేకంబుతోఁ ద్రోవకి
ట్లవరోధం బొనరింప వచ్చెఁ దడ వేలా దీనిఁ జూర్ణంబుఁ జే
సి వడిం బోయెదఁ గాక యంచు మదిలోఁ జింతించి యే నుద్ధతిన్. 1279

ఉ. వీఁక సహాంకరించి పవివేగమునం జని బెట్టు దాఁకితిన్
దాఁకినయంతలో విఱిగి తన్మహనీయసువర్ణశృంగ మ
స్తోకజవంబుతో జలధితోయములం బడె వేయి వ్రయ్యలై
యాకుల మొందె నగ్గిరిగుహాగతదారుణజంతుసంతతుల్. 1280

తే. గట్టు మద్ఘోరవక్షోవిఘట్టనమున, బ్రమసి జిఱ జిఱఁ దిరిగి ధైర్యమునఁ గొంత
వడికి నూల్కొని సౌహార్దమడరఁ బుత్ర, యని మధురభంగిఁ బేర్కొని యని యెనవుడు.

ఉ. ఆతతతేజ యేను తుహినాద్రిసుతుండ హిరణ్యనాభవి
ఖ్యాతిని గన్నవాఁడ లవణాంబుధిలో వసియించి యుందు సం
ప్రీతి భవద్గురుం డగు సమీరున కిష్టసఖుండఁ గావున
న్నీతివివేకశీల నను నీకుఁ బితృవ్యునిఁ గా నెఱుంగుమీ. 1282

ఉ. ఆదియుగంబునందు గిరులన్నియు ఱెక్కలు గల్గి యాత్మమ
ర్యాదలు దప్పి లోకముల కన్నిటికిం గడు బాధ సేయుచున్
మేదిని సంచరింప ననిమేషవిభుం డది చూచి యల్కతో
ప్రోదనిధారచే నఱికె నద్రులపక్షము లొక్కవ్రేల్మిడిన్. 1283

క. ననమునఁ గరుణించి భవ, జ్జనకుం డగుపవనుఁ డపుడు చతురత నన్నుం
గొని తెచ్చి సాగరములో, మునుకొని వెస డాఁచి పక్షములు రక్షించెన్.

ఆ. నాఁటనుండి యేను నయ మొప్ప ననధిలో, డాఁగి యున్నవాఁడఁ దరుచరేంద్ర
యనిలనందనుండ వగునీకు సాహాయ్య, మిపుడు సేయు టిదియ హితము నాకు.

వ. అదియునుం గాక. 1286

ఉ. రాముఁడు పుణ్యమూర్తి సురరాజసమానుఁడు రాఘవాన్వయ
గ్రామణి గాన నవ్విభునికార్యము దీర్పఁగఁ బోవునీకు నేఁ
బ్రేమ దలిర్ప నెయ్య మొనరింపఁగ వచ్చితి మన్మహోల్లస
ద్ధామ మనోజ్ఞశృంగముల నించుక సేపు వసించి యేగుమీ. 1287

వ. అని పలికినమహాత్ముం డగుమైనాకునిపలుకుల కలరి యేను గరంబున నప్పర్వత
శిఖరంబు సంస్పృశించి యతనిచేత ననుజ్ఞాతుండనై యవ్వల నరిగితి నంతనమ్మ
హీధరంబు పురుషరూపంబు విడిచి కేవలశైలరూపంబున సముద్రజలంబులనంత
ర్ధానంబు నొందెనిత్తెఱంగున నేను మైనాకంబు నతిక్రమించి శీఘ్రజవంబున
నంబరంబునం బోవునెడ. 1288

చ. అరుదుగ నాగమాత సురసాఖ్య రయంబున నేగుదెంచి నా
తెరువున కడ్డమై నిలిచి ధీరత నిట్లను నీవు నాకు ని
ర్జరులవరప్రసాదమునఁ జాలఁగ భక్ష్యమ వైతి గావునం
దిరముగ నిన్నుఁ బట్టుకొని ధీరత నాఁకలి దీఱ మ్రింగెదన్. 1289

క. నా విని యేను మొగంబున, వైవర్ణ్యము దోఁప భక్తి వఱలఁగ వినయం
బావిర్భవింప నప్పుడు, సేవాంజలి చేసి నేర్పుచే నిట్లంటిన్. 1290

సీ. దశరథరాజనందనుఁడు రాముఁడు తండ్రి యానతి మునివేష మూని దాల్చి
జానకీలక్ష్మణసహితుఁడై దండకావనము ప్రవేశించి ఘనత మీఱ
గౌతమీనదిప్రాంతఁ గాంతారసీమలో వసియించి యుండ రావణుఁడు వచ్చి
మ్రుచ్చిలి యద్దేవి దెచ్చె నే నచటికిఁ బొలుపారఁ బతియాజ్ఞఁ బోవుచున్న

తే. వాఁడఁ గరుణించి నిర్జరవైరిపురికి, నన్నుఁ బోవ నిమ్మట్లు గాదన్న సీతఁ
జూచి రామునితోడ నాచొప్పుఁ జెప్పి, నిక్కముగ వచ్చి చొచ్చెదనీముఖంబు.

తే. అనిన నద్దేవి యట్లు గా దడుగు దాఁటి
పోవ నీ నిట్టి దయ్య వేల్పులవరంబు
మ్రింగి పుచ్చెద ననుచుఁ దా నింగిముట్టి
యాననముఁ బెంచె దశయోజనాయతముగ. 1292

క. ఏనత్తెఱంగునఁ గనుఁగొని, మానుగ దశయోజనప్రమాణంబుగ నె
మ్మేనటు పెంచితి వదనము, తా నిరువదియోజనములు తప్పక పెంచెన్. 1293

వ. ఇట్లు ఱండొరులము నుచ్చరించి క్రమంబున నంతకంతకు వృద్ధి నొందుచు నేను నవతియోజనప్రమాణదేహుండ నైన నది శతయోజనంబులంత వదనంబు విచ్చె నంత నవ్విధం బాలోకించి యేనుదీనితోడి మచ్చరంబేటికిఁ గాలయాపనం బయ్యెడు నని యాలోకించి శరీరంబు సంకోచించి యంగుష్ఠమాత్రుండ నై దానిముఖంబు సొచ్చి క్రమ్మఱ నొక్కక్షణంబులోన నిర్గమించి యెప్పటియట్ల దోఁచినం జూచి యద్దేవి విస్మిత యై నిజరూపంబున నా కిట్లనియె. 1294

చ. అనఘచరిత్ర నీమహిమ కద్భుతముం ముద మంకురించె నీ
కనువుగ నర్థసిద్ధి యగు నచ్చట వేగ యథాసుఖంబుగాఁ
జనుము సతీశిరోమణిని జానకి న్నిజవంశధర్మవ
ర్ధనుఁ డగు రామభద్రునిఁ దిరంబుగఁ గూర్పుము పెంపెలర్పఁగన్. 1295

క. అని దీవించి సురస చయ్యన నంతర్ధాన మొందె నటుపిమ్మట నం
తనమున సురకిన్నరమునిజనములు ముద మంది నన్నుఁ బ్రశంసించి రొగిన్.

ఆ. అంత విపులమైన యంతరిక్షంబున, సర్పవైరిపగిది జవము మెఱసి
లీలతో మహాభ్రజాలంబు దొరయుచుఁ, బోలుపు మిగుల నేను బోవునపుడు.

క. ఛాయాగ్రాహిణి యన నొక, మాయపురక్కసి సముద్రమధ్యంబున మ
త్కాయచ్ఛాయను బట్టిన, నాయెడ గతసత్త్వుఁడనై యేను మదిన్. 1293

ఉ. ఏల రయంబు దప్పె నిపు డేక్రియ విఘ్నము గల్గె నాకు ని
ట్లేల పరాక్రమం బుడిగె నెక్కడ నెవ్వనిఁ గాన మంచు నేఁ
జాల విచార మొంది వరుసన్ దిశ లన్నియుఁ బాఱఁ జూచి యా
లీల విలోలదృష్టి నటఁ గ్రింద సముద్రము ద్రోవఁ జూచితిన్. 1299

ఉ. చూచిన నొక్కదైత్యసతి చూపులకుం గడుఘోరభంగి యై
లోచనవక్త్రరంధ్రములు లోఁతగునూతులమాడ్కిఁ గ్రాలఁగా
వీచులఁ దేలుసత్త్వముల వ్రేఁగున నుబ్బుపయోధినీటిలో
గోచర యయ్యె దానిఁ గని గొబ్బున నేను మనంబులోపలన్. 1300

క. ఆయినజుఁడు చెప్పినక్రియ, ఛాయాగ్రాహిణియు నగుట సత్యం బిది మ
చ్ఛాయ నొడిసి పట్టిన దీ, మాయపురక్కసిని వేగ మర్దింప నగున్. 1301

వ. అని విచారించునప్పుడు రక్కసి మహామేఘంబుభంగి నార్చి పేర్చి యట్టహాసంబున నపహసించుచు నా కిట్లనియె. 1302

ఉ. హెచ్చుగ నాదుబారిఁ బడి యిచ్చకు వచ్చినభంగి నీవుఁ బో
వచ్చునె దైవయోగమున వచ్చితి విచ్చటి కోరి యింక నీ
వచ్చుపడంగ నాదుజఠరాంతరముం జొరు మూస మూని నే
మెచ్చుగ నిన్నుఁ బట్టుకొని మ్రింగెద నాఁకలి దీఱునట్లుగన్. 1303

చ. అనుచు నిశాటి పల్కిన వనాటకులోత్తములార యేను నె
మ్మనమున నాగ్రహం బెదుగ మాయపురక్కసిఁ జంపఁ బూని మే
ననువుగ బెంచితిన్ హిమవదద్రియొ మందరమో సుమేరువో
యని కడుసంభ్రమంబున వియచ్చరపంక్తులు సన్నుతింపఁగన్. 1304

ఆ. ఇట్లు నేను బర్వతేంద్రసంకాశుఁడ, నైనఁ జూచి దానవాంగనయును
భువన మెల్ల నొక్క ముద్దగాఁ గొని మ్రింగ, నోపినంత వదన మొనర విచ్చె.

క. అది చూచి యేను మనమున, నిది కర్జము గా దటంచు నెంచి శరీరం
బది కుఱుచపఱిచి దానిం, గడిసితి నంగుష్ఠమాత్రగాత్రుఁడ నగుచున్. 1306

వ. ఇట్లు గదిసి దానియుదరంబు సొచ్చి ప్రావృట్కాలమేఘంబుకరణి మేను బెంచి తీక్ష్ణనఖంబుల దానియుదరగతంబు లగుప్రేవులం ద్రెంచి నిమిషాంతరంబునకుఁ గ్రమ్మఱ వదనంబు వెలువడి దీర్ఘభుజంబుల నద్దానవి నాకాశంబునకుం గొనిచని కొండొకపొడువున నుండి సముద్రజలంబులం బడవైచితి నది తత్క్షణంబ విగతప్రాణ యై జములోకంబునకుం జనియె నంత నేను దేవగంధర్వకిన్నరాదులచేత సంస్తూయమానుండనై వాయుమార్గంబున సముద్రశేషంబు దాఁటి సూర్యుం డస్తమింపక మున్నె నగమండితం బైనమహోదధిదక్షిణతీరంబుం జేరి రాక్షసులకుం గానరాకుండం బ్రదోషకాలంబున లంకాపురంబు ప్రవేశించునప్పు డప్పురద్వారంబునం గావలి యున్నలంక యనునొక్క రక్కసి నన్ను విలోకించి యట్టహాసంబు సేయుచుఁ గ్రోవ కడ్డంబు నిల్చిన జ్వలదగ్నిశిరోరుహ యైనదాని సవ్యముష్టిప్రహారంబున నిర్జించిన నది మత్పరాక్రమంబునకు మెచ్చి నన్ను నిర్జించితివి గావున నింక నీ కడ్డం బెయ్యది లేదు సర్వరాక్షసుల నశ్రమంబున నిర్జింపఁ గలవు లంక ప్రవేశింపు మని పలికిన నేనప్పట్టణంబు ప్రవేశించి రాత్రికాలంబున లంకాపురం బంతయు శోధించి రావణునియంతఃపురంబు సర్వంబునుం బరామర్శించి యద్దేవి నెందునుం గానక శోకసంతప్తచిత్తుండనై దుఃఖించుచుముందట నొక్క విశాలసుగంధికుసుమవిసరభాసురకాంచనానోకహవిభ్రాజితం బైనవిచిత్రగృహోపవనోత్తమంబు విలోకించి తత్ప్రాకారంబు దాఁటి వనంబు సొచ్చి తన్మధ్యంబున స్వర్ణపర్ణవికీర్ణం బైనయొక్క కదళీవనంబు ప్రవేశించి యచ్చట నొక్క మహోన్నతసువర్ణశింశుపావృక్షం బెక్కి దాని కనతిదూరంబున. 1307

చ. కమలదళంబులం దెగడుకన్నుల బాష్పకణంబు లొల్క శో
కమున మొగంబు గంద నలికంబునఁ జెమ్మట లూర నెండచేఁ
గమలిన తీవె నాఁ దనువు కార్శ్యము నొందఁ గరంబు మోహసం
భ్రమమున రామ రామ యని మాటికిఁ జీరెడుదాని వెండియున్. 1308

చ. చెలు వఱి వ్యాఘ్రమధ్యమునఁ జిక్కినలేడిక్రియన్ బిడాలకం
బులనడుమం గలంతఁ బడి పొక్కెడుకీరముమాడ్కి నల్కతోఁ

బలుమఱుఁ గంఠహుంకృతుల భర్జన సేయుని శాటికాజనం
బుల నడిచక్కిఁ జిక్కి కడు బోరన నేడ్చెడుదాని నంతయున్. 1309

సీ. పొరగప్పుకొని యున్నభుజగరాజముఁ బోలు రేణురూషితదీర్ఘవేణితోడ
హిమజలక్లిన్నపద్మముఁ బోలుశోకాశ్రుకాండసంప్లుతవక్త్రంబుతోడఁ
గసటు చుట్టినహేమకణికఁ బోలుమహోపరాగసంభృతశరీరంబుతోడ
లలితరక్తోత్పలంబులఁ బోలురోమరోదనతామ్రరుచిరనేత్రములతోడ

ఆ. మైలవలువతోడ మహితచింతాజ్వర, జ్వలితమైనమానసంబుతోడ
వికృతరూపదానవీజనాంతరమునఁ, జెన్ను దఱిగి కుందు చున్నదాని. 1310

ఆ. ప్రాణవిభునిఁ బాసి యనదనై జీవింప, నేల నాథ్వి కిది విహితము గాదు
చత్తు ననుచుఁ జాల సంకటపడుదాని, సీత నమలగుణసమేతఁ గంటి. 1311

క. కనుఁగొని రాఘవుఁ డెఱిఁగిం,చినచిహ్నము లన్ని చూచి సీతాసతి యా
ట నిజం బని దలఁచుచుఁ ద,ఘ్ననతరపర్ణాంతరమున దాఁగొని యుంటిన్. 1312

వ. ఆసమయంబున రావణునియంతఃపురంబునందుఁ గాంచీనూపురమిశ్రితం బైన కాంతాజనహలహలాశబ్దంబు బహుళంబుగా వీతెంచిన నేను బరమోద్విగ్నుం డనై వేఱొక్క శాఖకు దాఁటి గగనంబునందుఁ బత్త్రియుంబోలె నెవ్వరికిం గానరాకుండఁ బర్ణసంహతిగూఢప్రదేశంబునం బొంచియుంటిఁ బదంపడి రావణుండు నిజదారపరివృతుండై సీత యున్నదేశంబునం జనుదెంచె వానిరాక యెఱింగి యద్దేవి పీనంబులగుకుచంబు లూరువులం గప్పికొని తనకుఁబరిత్రాణం బెద్దియు లేమికి వగచుచు భయాక్రాంతయై ప్రవాతంబునందుఁ గదళియుంబోలె వడవడ వడంకుచు నంత నంత విలోకించుచుఁ దదాననంబుఁ జూడ రోసి యధోముఖియై యుండె నట్లు రావణుండు చనుదెంచి దుఃఖించు చున్న సీత నవలోకించి యిట్లనియె. 1313

ఉ. నీరజనేత్ర కేల్మోగిచి నీకు నమస్కృతిఁ జేసి వేఁడెదన్
సారసబాణుబారిఁ బడి చావక యుండఁగఁ బ్రోవు మట్లు గా
కీరన మెత్తి యుయ్యకొన వేనియు రెన్నల లోర్చి మీఁదటన్
దీఱనియుల్కఁ గ్రోలెదఁ ద్వదీయతనూగతరక్తపూరమున్. 1314

ఉ. నా విని రాజపుత్త్రి వదనంబునఁ గోపము చెంగలింపఁగా
రావణుతోడఁ బంక్తిరథరాజవరేణ్యునికోడల న్విదే
హావనినాథమౌళితనయ న్రఘురామునిభార్య నైనన
న్నీవిధిఁ బాపము ల్పలికె దేటికి నాలుక యూడిపోవదే. 1315

ఉ. నావిభుఁ డొద్ద లేనియెడ నన్ను వనంబునఁ దస్కరుండవై
కావర మెత్తి చేటు మదిఁ గానక ముచ్చిలి దెచ్చి యిచ్చట
న్నీ వాకపోటుబంటువలె నేర్చిన బీరము లాడె దోరి యా
భూవరుఁ డొద్ద నున్న నినుఁ బూని వధింపక పోవ నిచ్చునే. 1316

ఉ. రాముఁడు సత్యవాది పరరాజభయంకరుఁ డధ్వరక్రియా
కాముఁడు సాధుపోషకుఁ డఖండయశోవిపరిపూర్ణుఁ డుగ్రసం
గ్రామవిశారదుండు కనకక్షితిభృత్సమధైర్యుఁ డారఘు
గ్రామణి కీవు దాసుఁడవు గాంచగ వోరి నిశాచరాధమా. 1317

చ. అనవుడు వాఁడు రాజతనయాపరుషోక్తులు వాఁడిబాణముల్
చొనిపినమాడ్కిఁ గర్ణములు సోఁకినయంతఁ జితాస్థహవ్యవా
హనుక్రియ మండి నేత్రముల నగ్నికణంబులు రాలఁ గ్రుద్ధుఁడై
జనకజఁ ద్రుంతు నంచు రభసం బడరగ గమకించునంతలోన్. 1318

ఉ. ఆదివిజారిపత్ని సుగుణాంచితశీల వరాంగలీల మం
డోదరి స్త్రీలమధ్యమున నుండి రయంబున వచ్చి మన్మథ
వ్యాధిఁ దపించు చున్ననిజవల్లభుఁ గౌఁగిటఁ జిక్కఁ బట్టి స
మ్మోదము పుట్ట నిట్లనియె ముచ్చట భవ్యసుధామయోక్తులన్. 1319

చ. విను మనిమేషరాజనుతవిక్రమ యిట్లనుకూల గానియీ
జనకజతోడి దేమి పని చానలఁ జంపుట పాడి గాదు నీ
కనిమిషసిద్ధచారణసురారిమృగాక్షులు వీరె వీరితోఁ
దనివి జనింపఁ గామపరతంత్రుఁడవై రమియింపు మింపుగన్. 1320

వ. అని యిత్తెఱంగునఁ దనవు మెఱసి మండోదరి వినయంబున బోధించి పిఱిందికిం దిగిచిన నతండు భార్యాప్రతిషేధితుండై పత్నీసమేతంబుగా శీఘ్రంబున నిజభవనంబునకుం జనియె నంత దశగ్రీవనియుక్తలై కావలి యున్న నక్తంచరస్త్రీలం దఱు బహుప్రకారంబులఁ దర్జనభర్జనోక్తుల భర్జించుచు రావణుం గైకొన వేని నిన్నుఁ బట్టి మ్రింగెద మని భయంబు గఱపిన నద్దేవి వారిపలుకులు తృణప్రాయంబులుచేసి ధిక్కరించిననయ్యసురాంగనలు తమపలుకు లద్దేవియందు నిరర్థకంబు లగుట యెఱింగి చేయునదిలేక రావణునియొద్దకుం జని తత్ప్రకారంబు సర్వంబునుం జెప్పి వచ్చి మరలి యెప్పటియట్లు సీతం గాచికొని చుట్టుం బడి నిద్రించి రప్పు డద్దేవి పరమదుఃఖాక్రాంతయై యార్తనాదంబున విలపించుచుండె నాసమయంబునఁ ద్రిజట యనునొక్కరక్కసి యుచ్చైరువ నిద్రించి మేల్కని రాక్షసస్త్రీల నందఱ విలోకించి యిట్లనియె. 1321

క. జనకునిపుత్రిని దశరథ, జనపతికోడలిని బరమసతి నీసీతఁగ
మునుకొని మ్రింగం బోకుఁడు, నను మ్రింగుఁడు జనకపుత్రి నశియింప దీఁకన్.

ఉ. దారుణము న్భయావహము దైత్యవినాశనసూచకంబు నీ
నారసనేత్రనాథునకు జన్యజయావహమైనస్వప్న మే
నారయఁ గంటి నాకల యథార్థము గావున నీర లీయమగ
గాఱియ పెట్ట కింక శరణం బని వేడుకొనుం డరోషలై. 1323

క. పడఁతులకు వగపు గలయప్పుడు పరులకు నిట్టిస్వప్నముగ గల్గిన న
 ప్పడఁతుక లాయాపదచే, విడినడి సౌఖ్యంబు నొంది వెలయుదు రెందున్.

ఉ. ఈవనజాతనేత్రవిభుఁ డిచ్చటికిం జనుదెంచి లోకవి
 ద్రావణుఁ డైనరావణు నుదగ్రశరంబుల గీటణంచి యీ
 భూవరపుత్రి వేడ్కఁ గొనిపోవుట నిక్కము గాన మీర లీ
 భావము మాని ప్రోవు మని ప్రార్థన సేయుఁడు భక్తియుక్తులై. 1325

తే. అనుచుఁ బలికిన నయ్యింతు లధికభీతిఁ
 గసరు టుడిగి కరంబులు నొసలఁ జేర్చి
 యరసి రక్షింపు మని వినయమున వినుతి
 సేయుచు నిరాశ లై నిద్రఁ జెంది రపుడు. 1326

వ. అంత నవ్వైదేహి రాముండు చనుదెంచి రావణుం బరిమార్చి సీతం జేకొని పోవుట నిక్కవం బని త్రిజట యాడుటకు సంతసిల్లి యవ్వాక్యంబు సత్యం బగుం గాక యని దేవతలం బ్రార్థించుచుండె నప్పు డద్దేవి తామ్రస్థారుణదశ నవలోకించి మనంబున నొక్కింతసేపు శోకించి పఠంపడి నారాక యెఱింగించుటకుఁ దగిన యుపాయంబు చింతించి భర్తృకుశలం బెఱింగించుటకుఁ దగిన తెఱంగున మాటలాడం గలవాఁడనై రామపురస్సరంబుగా నిక్ష్వాకువంశంబు గొనియాడి సముచితంబుగాఁ బాడనూపితి నంత నద్దేవి రాజర్షిగుణపూజితం బైనమదీయ మధురభాషితంబు విని బాష్పపిహితలోచన యై నా కిట్లనియె. 1327

క. కపిపుంగవ నీ వెవ్వఁడ, వివు డిచటికి నేల వచ్చి తెవ్వఁడు పనిచెఁ
 గపికులుఁ డైన నీకును, నృపుఁ డగురామునకు నెట్లు నెయ్యము గలిగెన్ 1328

ఉ. నా విని యేను గేల్మోగిచి నమ్రుఁడ నై కడు భక్తిఁ దల్లిగో
 నీవిభుఁ డైనరామునకు నెమ్మి సఖుండు హరీశ్వరుండు సు
 గ్రీవుఁ డనాఁ గలం డతనికిం దగ భృత్యుఁడ దూతవృత్తి నే
 భూవరవరమౌళి నీకడకుఁ బొమ్మని పంపఁగ వచ్చితి ప్రహీన్. 1329

క. హరికులవర్యం డగు కేసరి గేహినియందు వహ్నిసఖువీర్యమున
 న్వరపుత్త్రుఁడ నై పుట్టితి, నరయఁగ హనుమంతుఁ డందు రందఱు నన్నున్. 1330

తే. పురుషశార్దూలుఁ డైనదాశరథి నీకు
 గుఱుతుగా నిచ్చె నిదిగొ గైకొను మటంచు
 నూతనమణిప్రభాపరిస్ఫీత మైన
 రత్నముద్రిక యొసఁగితి యత్న మలర. 1331

వ. ఇట్లభిజ్ఞానంబుగా నంగుళీయకం బొసంగి. 1332

క. జననీ నా కెయ్యది పని, నినుఁ గొని చని రాఘవునకు నెమ్మి నొసఁగెదఁ
 జనుదెమ్మని పలికిన నా, జనకజ ననుఁ జూచి పలికె సమ్మద మలరన్. 1333

క. రావణునిఁ దునిమి సంగర, కోవిదుఁ డగు రాఘవుండె కొని చను నన్నున్
నీ వెంట రాఁ బొసంగదు, ధీవిలసిత ధర్మసరణి దెలియదె నీకున్. 1334

చ. అన విని యేను వెండియుఁ దదంఘ్రులకుం బ్రణమిల్లి తల్లి చ
య్యన నినుఁ జూచి వచ్చుట యథార్థ మటంచు భవద్విభుండు నె
మ్మనమున నమ్మునట్లుగఁ గృపన్ గుఱు తొక్కటి నెమ్మితోడ ని
మ్మనవుడు సీత మోద మలరారఁగ నన్బరికించి యిట్లనున్. 1335

ఉ. మారుతపుత్ర నీ వనినమాట నిజం బిదె గొమ్ము మానికం
బారఘువంశవర్యుఁడు దయానిధి రాముఁడు దీనిఁ జూచి న
న్నారసి చూచి వచ్చుట యథార్థము కా మది నమ్మి నిన్ను సొం
పార బహూకరించు నని యర్థి నొసంగె శిరోవతంసమున్. 1336

వ. ఇట్లు మణిరత్నం బొసంగి రామైకసంవేద్యం బైన కాకాసురవృత్తాంతంబును
దిలకనిర్ణయంబు నెఱింగించిన. 1337

క. ఏ నమ్మణిఁ గైకొని య, మ్మానినికిఁ బ్రదక్షిణము నమస్కారంబుల్
మానితభక్తిం జేసి య, నూనవచఃప్రౌఢి మెఱయ నుతియించి తగన్. 1338

తే. గగనమున కున్ముఖుండనై కరము వేడ్క
నాజ్ఞఁ గొనువాంఛతో నున్న నమ్మహీజ
మరల నను జూచి కార్యంబు తెఱఁగు నడపు
టెట్టులగునో యనెడుశంక నిట్టు లనియె. 1339

చ. మఱచెద వేమొ నా తెఱఁగు మానవనాథునితోడఁ జెప్పి స
త్వరముగ సూర్యనందనునిఁ దమ్మునిఁ దోడ్కొని వచ్చునట్లుగాఁ
దరబడిఁ జెప్పు మవ్విధము దప్పిన రెన్నెల లోర్చి మీఁదటన్
బొరిఁబొరి చేదు ద్రావి మృతి, బొందెద నన్నది యంచుఁ జెప్పుమా. 1340

క. అని దీన యగుచుఁ బలికిన, విని యే నల్లల రామవిభుఁ డనుజుఁడు దాఁ
జనుదెంచి వేగ రిపుఁ బొరి, గొని నినుఁ గొనిపోవు వగపు గొన కుండు మిటన్.

వ. అని యూఱడిలం బలికి యద్దేవిచేత నామంత్రణంబు వడసి యచ్చోటు వాసి.

ఉ. ఆదశకంధరుండు జనకాత్మజ నాడినక్రూరవాక్యముల్
లోఁ దలపోసి నెమ్మనము ద్రొక్కినకోపము తాల్మి క్రుంగఁగా
నాదట జన్యకాంక్షినయి యంగముఁ బెంచి సమీరవేగినై
నాద మెలర్పఁ దద్వనము నష్టముఁ జేసితి దర్ప మేర్పడన్. 1343

వ. ఇట్లు మదీయభుజాబలవిధ్వంసితతరుమండమండలం బైన వనంబు విలోకించి వన
పాలకు లగు రాక్షసులు దాని నుత్కృత్యంబుగా నెఱింగి వికృతముఖులై రయం
బున రావణునిపాలికిం జని. 1344

ఉ. దానవలోకపాల విను తావకవీర్య మెఱుంగ కెవ్వఁడో
వానరుఁ డేగుదెంచి బలనైభవ మేర్పడ నీవనంబు కా

లానలహేతిఁ గాల్చినక్రియన్ వడి నష్టమొనర్చె నక్కటా
వాని వధింప రాక్షసులఁ బంపుము గ్రమ్మఱఁ బోవు నంతలోన్. 1345

వ. అని విన్నవించిన నద్దనుజపాలకుండు కోపించి దుర్జయు లగువారి నాత్మచిత్తవర్తులఁ గింకరనామధేయుల నెనుబదివేవుర నాలంబునకు నియమించిన వారు శూలముసలముద్గరప్రముఖప్రహరణాంధకరోచులు దిశాముఖంబు లలంకరింప నాటోపంబునం జనుదెంచిన నేను దోరణాశ్రితం బైనపరిఘంబుచే వారి నందఱఁ బంచత్వంబు నొందించి లంకాపురంబునకు లలామభూతం బైనచైత్యప్రాసాదంబుమీఁదికిం జని యందుఁ గావలి యున్నరాక్షసశతంబును గాంచనస్తంభప్రహారంబునం బిలుకుమార్చి యక్కాంచనహర్మ్యంబు విఱుగం ద్రోచి పదంపడి రావణప్రేరితుండై ప్రహస్తపుత్రుండు జంబుమాలియనువాఁడు భయంకరాకారులగు పెక్కండ్ర రక్కసులం గూడి రభసాతిశయంబుగా డాసిన నేను ఘోరం బగుపరిఘంబుచేత రాక్షసుని సైన్యసమేతంబుగాఁ జూపుమాపితి జంబుమాలిమరణంబు విని రావణుండు బలవంతు లగుమంత్రిపుత్రుల నేడ్వురఁ జతురంగబలసమేతులం జేసి రణంబున కనిచిన వారి నందఱఁ బరిఘంబువ్రేటున గీటణంచితిఁ గ్రమ్మఱ దశగ్రీవుండు శూరు లగుపంచసేనాగ్రనాయకుల బలోపేతులం జేసి యనిచిన వారినెల్ల నానాప్రకారంబుల జములోకంబున కనిచితి నంతం దద్వృత్తాంతంబు విని రాక్షసేశ్వరుండు విచారమగ్నమానసుం డై యక్షకుమారు రాక్షసగణాన్వితునిం జేసి యనిచిన వాఁడు సర్వసాంగ్రామికపరికరసమేతుండై సమరంబున కడరినం జూచి. 1346

ఉ. ఏను మనంబులోన నడలించుక లేక కటిసాహసంబున
న్వానిరథంబుపై కుఱికి వానిపదంబులు రెండు పట్టి ఘో
రానిలతుల్యవేగమున నంబరవీథిని వేయిమాఱు లో
వానరులార ద్రిప్పి పడవైచితి ధారుణిమీఁద నుద్ధతిన్. 1347

వ. ఇట్లు పడవైచిన మస్తకగ్రీవాచరణజానుజంఘోరుమధ్యంబు చూర్ణం బగుటయుఁ దత్క్షణంబ గతాసుండై జములోకంబున కరిగె నంతఁ దద్వృత్తాంతంబు విని దశగ్రీవుండు శోకరోషవిషాదదూషితుం డై. 1348

క. తనప్రథమపుత్రు, దుర్జయు, ఘను నింద్రజిదాఖ్యు సమరకర్కశు నరిమ
ర్దనశీలు ననిచె యుద్ధంబునకు బలోపేతుఁ జేసి పౌలు పలరారన్. 1349

వ. ఇత్తెఱంగునం దొడరిన నయ్యింద్రజిత్తుం దాఁకి యేను బహుప్రకారంబులం బోరి హీనసత్త్వుం జేసిన నతండు రోపినంత బలంబుకొలంది పోరి మదీయతేజంబు దుస్సహం బగుటయు వీఁ డవధ్యుండు నడిసన్నలఁ బోయెడువాఁడు గాఁ డని యతివేగితుండై బ్రహ్మాస్త్రపాశబద్ధుం గావించెఁ బదంపడి రాక్షసులు దృఢపాశంబుల నంటఁ గట్టి శీఘ్రంబున రావణునొద్దకుం గొని చని రేను బ్రహ్మాస్త్రపాశంబులవలన విముక్తుండ నయ్యును రావణునితోడ మాట లాడం గల

వాఁడనై బద్ధుండై నవాని తెఱంగున నుండి వాని నవలోకించి వానిచేతనడుగం
బడినవాఁడనై యిట్లంటి. 1350

సీ. దశకంఠ యేను సదాగతి కౌరసనుతుఁడ సుగ్రీవున కతిహితుండ
హనుమంతుఁడనువాఁడ ననఘాత్ముఁడగు రాఘవునకు దాసుఁడ జగద్వినుతబలుఁడ
నమ్మహాత్ముఁడు పంప నంబుధి దాఁటి లంకకు వచ్చి సీతను గాంచి విభుని
కుశలంబు దెల్పి యెక్కుడు ప్రీతి సీతోడ వాదింపుతలఁపున వనము నేఁ

తే. పాలు చేసితి దానికిఁ జాలఁ గినిసి, ధీరులై దైత్యు లడరిన దేహరక్ష
ణార్థము వధించి తుది నీ సత్త్వమెల్ల, నెఱిఁగి పోవంగ వచ్చితి నిప్పు డిటకు.

వ. ఇది మదీయవృత్తాంతం బింక నొక్క హితోపదేశంబుఁ జేసెద వినుము. 1352

సీ. అనఘాత్ముఁ డగురాముఁ డనుజసమేతుఁడై విపులనానాజాతివృక్షశోభి
తం బైనఋశ్యమూకంబున కేతెంచి ప్రీతి నందున్నసుగ్రీవుఁ గాంచి
తనపత్ని నసురుఁ డుద్ధతి నెత్తికొనిపోవు టెఱిఁగించి తత్కృత్య మెలమి దీర్చి
సాహాయ్య మొనరింపు సఖ్యంబు వాటింపు మనిన నక్కపినాథుఁ డట్లు గాక.

తే. యని యొసంబడి జానకి నరసివచ్చి, యింపుతో వైరిపైకి దండెత్తి పోయి
పోరిలో వాని బలయుతంబుగ వధించి, సీత నీ కిత్తు ననుచు సంప్రీతుఁ జేసి.

వ. పదంపడి తనకును వాలికిని వైరంబు గలుగుటయు నతండు తనభార్య నపహ
రించి దేశంబు వెడల ననుచుటయు నెఱింగించిన నారఘూత్తముండు వాలిం
బరిమార్చి వానరరాజ్యంబు నీకొసంగెద నని పలికె నిట్లొండొరులు వహ్నిసాక్షి
కంబుగా సఖ్యంబుఁ జేసి రంత నమ్మనుజవల్లభుండు వాలి నొక్క బాణంబున వధిం
చి తదీయరాజ్యంబు సుగ్రీవున కొసంగిన నతం డధిష్ఠితరాజ్యతంత్రుం డయ్యె
నాసుగ్రీవునిచేతఁ బ్రస్థాపితుండనై యేను దౌత్యంబు వాటించి భవత్సకాశం
బునకుం జనుదెంచితి నరవానరవల్లభుల ప్రభావం బెఱుంగనివాఁడ వగుటం
జేసి యజ్ఞానంబున సీతం దెచ్చితివి వారితో నెదిరింపుట కింద్రాదులైన సమ
స్తులు గా రింక నైన వివేకంబు గలిగి వానరవీరులు భవద్బలంబు వధింపక
మున్నె యమ్మహాదేవి నమ్మహాత్మున కొసంగుము వానరులకు లంకానాశంబు
సేయునంతసామర్థ్యంబు గలదా యని శంకింప వలవదు వానరులప్రభావంబు
తొల్లి నీ వెఱుంగవు యుద్ధసాహాయ్యార్థంబు గూర్చిన వానరు లందఱు దేవ
లోకంబు నైన సాధింపఁ గల రీయర్థంబు నీకుం జెప్పుమని సుగ్రీవుండును గఱపె
నని యిట్లు శంకింపక జంకించి పలికిన నతండు కోపించి. 1354

చ. కనులఁ గృశానుకీల లొలుకఁగ దివిజారులఁ గాంచి పల్కు నీ
వనచరుఁ డస్మదీయబలవైభవ మింత యెఱుంగ కుద్ధతిఁ
మనమునఁ దోఁచినట్లు బలుమాటలు ప్రేలెడు వీనిఁ బట్టి చ
య్యన వధియింపుఁ డంపిననృపాగ్రణికిఁ గడు బ్రీడ పుట్టఁగన్. 1355

చ. అనుచు దశాననుండు తగ నాడిన వానిమతం బెఱింగి యా
తనియనుజుండు రాజనయతత్త్వవిదుండు విభీషణుండు నె
మ్మనమునఁ దొట్రుపాటు పొడమన్ నగముల్ గుఱించి యుక్తిక
ట్లనియెఁ దదీయకోపము వచోమృతధారల నుజ్జగింపఁ జేయుచున్. 1356

ఉ. దానవనాథ నీవగుణుతం బది గానఁ దూత దైనఁ బ్ర
జ్ఞానిధు లైనపెద్దలు జగంబుల దూతల వధ్యు లండ్రు మీ
రీనియమంబెఱుంగరొకొ యేలిక పల్కినచంద మంతయున్
దాను వచించుఁ జూడుఁ డది తప్పుగఁ జూడమి నీతి తేనికిన్. 1357

చ. పురుషులు దూతవాక్యములఁ బుట్టినకోపము వానిభర్తపైఁ
బరువడిఁ జేర్చి శౌర్యమును బాహుబలంబు పొగడ్త కెక్కఁగా
దురమున డాసి శత్రువులఁ ద్రుంచినఁ బౌరుష మండ్రు గాక ని
ర్జరకులవైరి దూత నిటు చంపినఁ బౌరుష మండ్రె ధార్మికుల్. 1358

చ. దనుజవరేణ్య శాస్త్రనయతత్త్వము నీనుదిఁ గీలుకొల్పి యా
వనచరుని న్వధింపకు మవధ్యునిఁ జంపిన భాగ్యకీర్తి నా
శనము ఘటిల్లుఁ గాన సువిచారుఁడ వై విడిపింపు మొండు చిం
త నెగడిన న్విరూపకరణం బొనరింపుము చావు దప్పఁగన్. 1359

వ. అనిన విని యద్దశగ్రీవుం డట్లైన వీనివాలంబు దహింపుఁ డని రాక్షసులకాజ్ఞా
పించిన వారలు ప్రచండవిక్రమంబున సిద్ధసన్నాహులై తైలావలసిక్తంబు లగు
జీర్ణపటకార్పాసకశణవల్కలంబులు తత్పుచ్ఛాగ్రంబునం జుట్టి యనలు దరి
కొల్పి దృఢంబు లగుపాశంబుల నంటఁ గట్టి కాష్ఠముష్టిప్రహారంబుల నొప్పిం
చుచు రోదసీకుహరంబు నిండ సింహనాదంబులు సేయుచు రాజమార్గంబునం
గొని చనునప్పుడు. 1360

సీ. తన మహోన్నతం బైనరూపంబు కొంచెము చేసి యల్పగాత్రము వెలుంగ
నలబంధనంబులవలన విముక్తుండ నై వెండియు సురాలయాద్రికరణిఁ
బెరిఁగి కాలాయసపరిఘంబు గైకొని దనుజుల నెల్ల నుద్దండవృత్తి
వధియించి తత్పురద్వారంబులకు దాఁటి వాలాగ్రసందీప్తవహ్నిచేతఁ

ఆ. బ్రళయకాలవహ్ని ప్రజలను బోలెన ప్పురము నాల్గుదెసలు నరయఁ గాల్చి
దగ్ధమైనపురముఁ దప్పక వీక్షించి, భయము సంభ్రమంబు ప్రబ్బికొనఁగ.

ఉ. అక్కట తెల్విమాలి పుర మంతయుఁ గాల్చితిఁ దప్పియున్నచో
టొక్కటి లేదు జానకి మహోగ్రకృశానుశిఖాపరంపర
న్నిక్కము గాలి యుండు నిఁక నే నెటు సేయుదు రామభర్తకున్
దప్పక నెగ్గు చేసి వితతంబుగ భాజన మైతి నిందకున్. 1362

మ. అని చింతించుచు నుండ నాకు నపు డవ్యాజంబు లై కొన్ని భ
వ్యనిమిత్తంబులు దోఁచెఁ దోడనె రహిన్ వైదేహి సేమంబుగో

నను వై యున్న దటంచు భావుకపదవ్యక్తంబుగాఁ జారణు
ల్వినువీదిం దగుభంగి మ్రోసిరి సముద్వేలప్రమోదంబునన్. 1363

వ. ఇట్లు పలికినఁ జారణులమధురాక్షరంబులు విని. 1364

సీ. వాలాగ్రమునఁ బొల్చు వైశ్వానరుఁడు తన వేఁడిమి చూపక వెలయు చునికి
మనము శోకార్ణవమగ్నంబు గాకున్కి మలయజగంధి యై మారుతంబు
తగ వీచుచున్కి సిద్ధమరుద్విహంగము ల్భవ్యాక్షరంబులు పలుకు చునికి
సందియ మెడలించి సంతోష మొదవించి జనకజ మని యున్న దని తలంచి

తే. శీఘ్రమున నమ్మహాదేవిఁ జేర నరిగి, భక్తి మెఱయంగఁ దత్పాదపద్మములకు
వందన మొనర్చివీడ్కొని వనధిపొంతఁ, జాలపొడవగు నొకశిలోచ్చయము నెక్కి.

ఆ. శైల మవనితోడ సరిగాఁగఁ బాదంబు, లూఁది మింటి కెగసి మోద ములర
మరలఁ గంధి దాఁటి యరుదెంచితి భవత్స, కాశమునకు గరుడగమనలీల.

వ. ఇది నాపోయివచ్చినవృత్తాంతం బానుపూర్విగా సర్వంబు నెఱింగించితి రామునిప్రసాదంబున భవత్తేజంబున నెట్టియాపదలం జిక్కక సుగ్రీవకార్యార్థంబు నాచేత సర్వంబు ననుష్ఠితం బయ్యె నింక నిక్కడఁ గర్తవ్యం బెయ్యది దానిం గావింతురు గాక యని పలికి వెండియు నప్పవననందనుం డిట్లనియె. 1367

హనుమంతుఁడు సీతాదేవిపాతివ్రత్యమును బ్రశంసించుట.

క. ఇనపుత్రునియుత్సాహము, జనపతియుద్యోగ మిపుడు సఫలత నొందెన్
జనకజశీలముఁ గనుఁగొని, పనివడి నామానసము బ్రవణం బయ్యెన్. 1368

వ. అట్లైన నద్దేవిగాత్రంబు సంస్పృశించి రావణుం డేల మృతుండు గాక జీవించి యున్నవాఁ డని యంటి రేని. 1369

చ. పెనుపుగ మున్ను బల్తపము పెంపున రావణుఁ డెల్లలోకముల్
తనదువశంబు చేసికొని తక్కినయన్నిట నత్యుదాత్తుఁ డై
యనిమిషసిద్ధసాధ్యగరుడాదుల మెచ్చక విక్రమంబుసొం
పునఁ దనవేఁడిచూపులనె పూని దహించుచు నున్నవాఁ డొగిన్. 1370

క. కావున దశకంధరుఁ డా, భూవరసుతమేను వ్రేల ముట్టియును దపః
ప్రావీణ్యావిశేషంబునఁ, జావక మనియున్నవాఁడు సంభ్రమ మెసఁగన్. 1371

వ. అట్లైన జానకీశీలంబునకు దౌర్బల్యంబు సంప్రాప్తం బయ్యె నట్టిదుర్బలశీలంబు మన కేమి యుపకరించు నని యంటి రేని. 1372

క. క్షితితనయ క్రోధకలుషీ, కృత యై కావించునట్టికృత్యము కరతా
డిత యగుశిఖిశిఖ యైనను, జతురతఁ గావింపలేదు సత్యం బరయన్. 1373

తే. అట్టి మహిమాఢ్య యైన యయ్యవనిపుత్రి
వల్లభునిచేతఁ జంపించువాంఛఁ జేసి

యలుగ కుండిన బ్రతికెం గాక నురవరుఁడు
నిక్క మలిగినఁ ద్రుటిలోన నీఱుగాఁడె. 1374

—హనుమంతుఁడు వానరులతో మనమందఱము రావణుం జంపుద మని చెప్పుట.—

క. మన మిందఱ మిప్పుడె వడిఁ, జని రావణు నని వధించి జనకకుమారిన్
గొని చని రామునియొద్దకుఁ, జను టది యుక్తంబు దాన సత్కీర్తి యగున్.

వ. మహాతపస్సంపన్నుం డైనరావణుండు మనచేత నెట్లు వధ్యుం డగు నంటి రేని.

ఉ. భూరితపోబలంబును బ్రభుత్వము విక్రమ మెంత గల్గినన్
దారుణవీతిహోత్రశిఖ దాఁకినభంగిఁ బవిత్ర యైనయా
ధారుణిపుత్రి మేను వెసఁ దాఁకుటఁ జేసి కృతాంతగోచరుం
డై రహి నున్నవాఁడు సమరావనిఁ ద్రుంపఁగవచ్చు ప్రేల్మిడిన్. 1377

వ. అ ట్లైన నీవలంతు లగుకొందఱ రక్కసుల నుక్కడంచియు రావణునే లవధింపక యరుగుదెంచితి వని యంటి రేని. 1378

మ. అవలేపంబున రాఘవుం డనఁగ మర్త్యస్వామి వాఁ డెంతవాఁ
డవలీల న్వధియింతు నంచుఁ బటుగర్వాలాపముల్ పల్కఁగా
నని యాలించి మహోగ్రకోపమున శౌర్యస్ఫూర్తిఁ ద్రుంపం గడం
గి వివేకించి నృపాజ్ఞ లేకునికి నేఁ గ్రేడించి యేతెంచితిన్. 1379

ఆ. విభునియాజ్ఞ యున్న ప్రేల్మిడిలో వాని, నుక్కడంచి సీత నక్కజముగఁ
దెచ్చి పతికి భక్తి దీపింప నొసఁగ నె, యింతకంటె నదియు నెక్కుఁ డగు నె.

మ. చతురుల్ జాంబవదంగదాదికపివంశగ్రామణుల్ సంగరో
ద్ధతు లుద్యద్ఘనబాహువిక్రములు దోర్దర్పంబునం ద్రుంచి యా
క్షితినాథోత్తముఁ డైనరామవిభునిన్ సీతం దగం గూర్చి యు
న్నతిమైఁ బెంపును గీర్తియున్ బడసి యానందింపఁగా వల్వదే. 1381

ఉ. ఆలములోన ఘోరచతురంగబలాన్విత యైనలంక యు
ద్వేలత మాన్ప రావణుని పెంపునఁ ద్రుంపఁగ నే నొకండ నే
చాలుదు వీర్యదర్పితులు శౌర్యధురీణులు ఘోరసంగరా
భీరులు మీరు తో డయినఁ బెంపొదఁ గూడుట కేమి యారయన్. 1382

శా. యోచింపం బని లేదు రావణునియుద్యోగంబు నే నొక్కఁడన్
మీచే నానతిఁ గాంచి జన్యవిమయోన్మేషం బెలర్ప న్బల
ప్రాచుర్యంబున బంధుమిత్రబలపుత్రభ్రాతృయుక్తంబుగా
నీచున్ దైత్యునిఁ జంపి రాఘవునకు న్సీత న్సమర్పించెదన్. 1383

శా. అవ్యాలీఢత దుస్సహంబు లగుబ్రాహ్మేంద్రాంబుమురౌద్రవా
యవ్యాగ్నేయకుబేరపాశుపతయామ్యాస్త్రాద్యనేకేంద్రజి

ద్దివ్యాస్త్రంబులు చీఁకిం గొనక యుద్ధవృత్తిఁ విదారించి సం
ఖ్యవ్యాపారకళాధురంధరుఁడై సాధించె లంకాపురిన్. 1384

చ. నుసలకఁ బట్టమై గుఱియు మాయకదారుణశైలవృష్టికిన్
గుసుమశరారిపాశియముగోత్రభిదాదిదిగీశులైనఁ బెం
పెసఁగ సహింపఁ జాల రతిహీనులు రాక్షసులోర్వ నెంతవా
రసదృశవిక్రమంబున సురారుల నంకఱఁ దీర్చి వచ్చెదన్. 1385

హనుమంతుఁడు జాంబవదాదివానరవీరులఁ బ్రశంసించుట

చ. ఇతఁడు బలాధికుం డని దినేశకుమారుఁడు సంతతంబు స
మ్మతిఁ గడుఁ బ్రీతివిస్ఫురణ మన్నన సేయుటయు న్నృపాలుఁడున్
సతతముఁ దా ననుగ్రహము సల్పుట యంతయు రిత్తవుత్తునే
యతులితబాహుసత్త్వమున నాలమునన్ రిపుకోటిఁ ద్రుంచెదన్. 1386

తే. శరధి నింకింప వచ్చు మందరనగంబు, వరుస నిట్టట్టు గదలింప వచ్చుఁ గాని
జాంబవంతుని దాగుణ సంగరమున, మిగాఱి చెనకంగ రాదు పురారికైన.

క. అన్నిచుఁ డొక్కఁ … లా, పన్నుగ నింద్రాదిలోకపాలుర నైనన్
గ్రన్నన నమయించుటకు బ, లోన్నతుఁ డీవాలిపుత్త్రుఁ డొక్కఁడె చాలున్.

తే. శరభనలనీలపనసుల గురుతరోరు, వేగమున మందరం బైన విఱిగి కూలు
నల్పబలులై సరాక్షసు లనఁగ నెంత, తూలగతి నాలమునఁ జాలఁ దూలిపోరె.

క. సురగరుడోరగనరఖేచరచారణయక్షసిద్ధసాధ్యులలో నె
వ్వరు మైందద్వివిదులతో, సరిపోరెడువారు లేరు చర్చింపంగన్. 1390

ఉ. ధీయుతు లశ్విపుత్త్రు లతిధీరులు నుత్తమశౌర్యయుక్తుల
త్యాయతతేజు లద్భుతబలాఢ్యులు సంగరకర్కశుల్ బృహ
త్కాయులు స్వామికార్యపరతంత్త్రులు కొండలనైనఁ బిండిగాఁ
జేయ సమర్థు లప్రతిమశీలురు వారల నెన్న నేటికిన్. 1391

క. మును లంక గాంచి వడపడి, దనుజులఁ బెక్కండ్ర నాజి దారుణభంగిం
దునుమాడి మరల వచ్చిరి, ననలజ్వాలికలఁ గాల్చి యద్భుతభంగిన్. 1392

తే అతిబలుండు రాముండు మహాబలుండు
లక్ష్మణుఁడు రామవీర్యాభిరక్షితుఁ డగు
సూర్యసుతుఁడు సుఖాత్ములై సొంపు పెంపు
గలిగి వర్ధిల్లుదురుగాక ఘనత మెఱసి. 1393

ఉ. వాసవతుల్యవిక్రముఁడ వాయుసుతుండ మహాబలుండ దు
ష్టాసురకాలుఁడన్ హనుమదాఖ్యుఁడఁ గోసలదేశభర్తకున్
దాసుఁడ నంచు లంకఁ గల దానవులెల్ల వినం గుతూహలో
ల్లాసమునన్ బురీనృపపథంబుల మాటికిఁ జాటి వచ్చితిన్. 1394

-హనుమంతుఁడు వానరులకు సీతయున్న చందమును దెల్పుట.-

వ. అని పలికి వెండియు సీత యున్నచందంబు విస్పష్టంబుగా నెఱింగించుతలంపున ని ట్లనియె 1395

మ. అతిదుష్టుం డగుపంక్తికంఠునియశోకారామమధ్యంబునం
దతజాంబూనదశింశుపాతరువుక్రిందన్ దుఃఖసంతాపక
ర్శిత యై ప్రాణవిభుండె దైవ మనుచుం జింతించుచున్ భూరిశో
కతిరోభూతమనీష యై మనమునం గార్పణ్యముం బోఁపఁగన్. 1396

తే. వీర్యదర్పితుఁ డగుదైత్యవిభునిమాట
తృణముగా నెంచి క్షణదాచరీపరీత
యగుచుఁ గాఢంబిసీవృత యైనకుముద
బాంధవుని రేఖ భంగి నిష్ప్రభత నొంది. 1397

క. అనితరభావమున సురేశునిపై రాగముఁ బులోమసుత యిడుమాడ్కిన్
దనపతి యగురామునిపై, ననురాగము సేర్చి నిశ్చయస్నేహమునన్. 1398

చ. వసన రఘూత్తమా యనుచు వాపోనుచున్ దివిజేంద్రశత్రునిన్
దురమునఁ జంపి నన్నుఁ గృపఁ దోడ్కొని పోఁగదె హా రఘూత్తమా
హరిహయతుల్యవిక్రమ మహాపురుషా యని సారెసారెకుం
బరువడిఁ జీరుచు న్వగపున న్నయనంబుల నీరు నించుచున్. 1399

తే ధీర లగుదుష్టరాక్షసస్త్రీలచేత
మాటిమాటికి సంతర్జ్యమాన యగుచు
వితతదారుణవ్యాఘ్రిహుంకృతుల కులికి
వెగడుపడియెడుమృగిమాడ్కి దిగులుగొనుచు. 1400

తే. ఏకవస్త్రసంవీతయు నేకవేణి, ధరయు ధాత్రీపరాగవిధ్వస్తయును మ
హోపవాసకృశాంగియు నై పతివ్ర, తాత్వ మేర్పడ బుడమిపైఁ దనువు సేర్చి.

క. వితతతనుత్వము నొందిన, ప్రతిపత్ప్రాకృతవిధ్యభంగి వెలవుతో
మితి లేనిదుఃఖభరమున, నతికృశ యై తూలభంగి నంగము ధూలన్. 1402

ఆ. ఘనతుషారసమయపనజినిచందాన, వాసి దఱిగి పంక్తివదనుఁ డన్న
మాట కుల్ల మెరియ మనుజేశ్వరునిఁ బాసి, యుండ నేల చచ్చు టొప్పుఁ గాదె.

క. అని చింతించుచు శోకంబునఁ గుందుచు నున్నదానిఁ బుణ్యచరిత్రన్
జనకజను రామభార్యను, గనుఁగొని యే నాత్మ నడలు గడలుకొనంగన్. 1404

క. డగ్గఱి భక్తి మనంబున, నగ్గలమై పర్వ మ్రొక్కి యతిమోదమునన్
డగ్గుత్తికతో సవినయ, వాగ్గౌరవ మెసఁగ జనకవరసుతతోడన్. 1405

-హనుమంతుఁడు వానరులకు సీత తనతో నన్నచందము దెల్పుట.-

క. తరణిజునకుఁ రాఘవునకు, దిరముగ సాచివ్య మైన తెఱఁ గేర్పడఁగా
నెఱిఁగించి రాముఁ డంపఁగ, నరుదెంచితి ననిన విని మహోహర్షమునన్. 1406

చ. హరిబలసంయుతుండయి రయంబున వచ్చి దశాస్యు నాజిలోఁ
బొరిగొని వేడ్క నన్నుఁ గొనిపోయెదు నట్లుగ రామభర్తతోఁ
దరమిడి చెప్పు మత్తఱిఁగు దప్పిన రెన్నెల లోర్చి మీఁదట
న్బరువడి మేనఁ బ్రాణములఁ బాపెద నన్నది యంచుఁ జెప్పుమా. 1407

అంగదుఁడు వానరులకుఁ దనయభిప్రాయము సెప్పుట.

వ. అని చెప్పి సముచితంబుగా నన్ను వీడ్కొనియె నద్దేవి దృఢపాతివ్రత్యంబును భర్తయందలియుత్తమభక్తియు నద్దశగ్రీవుని భస్మంబు సేయుటకుం జాలు నైనను ధర్మలోపశంకిత యై పతిచేతం జంపించెదుకోర్కిం జేసి కోపం బడంచుకొని యున్న దని సీత యున్నచందంబును దనతో నన్నచందంబును సవిస్తరంబుగా వినిపించి మనకు నింకఁ గర్తవ్యకార్యం బెద్ది విచారింపుఁ డనిన నంగదుం డెల్లవానరులు వినుచుండ జాంబవదాదుల నవలోకించి హనుమంతుండు పలికినచందం బెల్లవారికిఁ దెల్లం బయ్యెఁ గదా తత్ప్రకారంబునఁ బురుషశార్దూలుం డగురామచంద్రుని సీతతోఁ గూర్చుటకు మన కవశ్యకర్తవ్యం బగు దురాత్ముం డగుదశకంఠుని రాక్షసగణోపేతంబుగా నాలంబునం బొరిగొని సీతం దెచ్చుటకేనొక్కరుండనె చాలుదు బలపరాక్రమశక్తిసంపన్ను లయినమీరు తోడ్పడిన నసాధ్యం బెయ్యది జాంబవంతుం డాఖండలాదిబృందారకసందోహసహితంబుగా ముల్లోకంబు లొక్కయెత్తున నెత్తివచ్చిన నుత్తమబలంబున నుత్తలపడం జేయ సమర్థుండు నలనీలపనసరంభతారసుషేణాదులు మేరుమందరనగంబుల నైనఁ గందుకక్రీడ లాడ దక్షులు తొల్లి సకలలోకపితామహుం డైనపరమేష్ఠి వలన నవధ్యత్వం బనువరంబువడసి వరోత్సేకప్రమత్తులై వేల్పుల నోడించి వారలయమృతంబుఁ గ్రోలి వీర్యదర్పంబున నెవ్వరి మెచ్చక పెచ్చుపెరిఁగి విచ్చలవిడి విహరించుచున్నయశ్విపుత్త్రు లగుమైందద్వివిదులకు సాటి సేయందగినవారు ముజ్జగంబుల నొక్కం డైన లేఁ డట్టిజెట్టిజోదు లేకోద్యోగు లై గడంగిన రావణుం డెంతవాఁడు పవననందనునిబాహుబలంబున లంకాపురంబు దగ్ధం బయ్యె నని వింటిమి సీత నచ్చట నొంటి నుంచి మహాత్ముం డగురామునిపాలికిం జనుట యుక్తంబు గాదు మన మందఱము ఖ్యాతవిక్రములై యుండి సీతం జూచి వచ్చితిమి గాని తోడ్కొని రామైతి మని రామునితో నెట్లు చెప్పంగలవారము పరాక్రమవేగంబులందు మనకు సమానుండు ముల్లోకంబుల నెవ్వండు లేఁడు మారుతిచేత రాక్షసులందఱు హతవేగులై యున్నవారు మనతో నెదిరించి పోరువా రచ్చట లేరు జానకిం గొనివత్తము లెండని పలికిన నంగదుని నిశ్చయం బెఱింగి పరమప్రీతుండై యర్థవిదుం డగుజాంబవంతుం డర్థవంతం బగువాక్యంబున ని ట్లనియె. 1408

జాంబవంతుఁడు తనయభిప్రాయమును వానరులకుఁ జెప్పుట.

చ. కపికులవర్య నీమతము గాదనరా దటులైన నేమి యా
నృపమణికిన్ హితంబుగ మహీతనయన్ గనుఁగొంటి మింతయు
న్విపులము గాఁగ రామునకు నేర్పునఁ జెప్పి తగన్ దదాజ్ఞ నె
ల్లపనులఁ దీర్చికొందము వలంతిగ వేగిరపాటు చెల్లునే. 1409

సీ. అన విని కపు లంద ఱదియె కర్జంబుగాఁ గొని మది సంతోష మినుమడింప
సత్యవంతుని భూతసంపూజ్యమాను మహాబలు నతివేగు నాత్మవంతు
హనుమంతు మున్నిడికొని యమ్మహాత్మునిఁ గడు వేడ్క కన్నులఁ గప్పికొనుచుఁ
గర్మసిద్ధులచేత గర్వితచిత్తులై కార్యనిర్వృత్తి రాఘవునియందు
తే. నిశ్చయించి సామీరిని నెఱిఁ బొగడుచు, మదగజంబులచందానఁ బొదలుకొనుచు
జానకీనాథదర్శనోత్సాహు లగుచు, మేరుమందరములభంగి మేను లలర.

తే. అందఱును రామహితనిశ్చితార్థు లంద
ఱును బ్రియాఖ్యానరతు లందఱును రణాభి
కాంక్షు లందఱు భుజబలగర్వయుక్తు
లందఱును హర్షహృద్యవిహారు లగుచు. 1411

వానరు లందఱు రామసుగ్రీవులయొద్దకుఁ బోవుట.

చ. ఒనర మహేంద్రశైలమున నుండి రయంబున నభ్రవీథికి
న్వినుతజవంబుతో నెగసి నింగిఁ జెలంగెడుభూతజాలము
ల్కనుకని భీతిఁ బాఱ నెఱకల్ గలకొండలమాడ్కి నుద్ధతిన్
ఘనములభంగి నొక్కమొగి గర్జలు సేయుచు నేగి దవ్వులన్. 1412

సీ. అమరనాథునినందనముకంటె నెయ్యది గరిమతో నధికవిఖ్యాతిఁ గాంచు
నెద్దానిదెస వానరేంద్రశాసనమున సుర లైన నటు నిక్కి చూడ వెఱతు
రగచరపతిమామ యగుదధివక్త్రుఁ డెద్దాని నిత్యంబును దవిలి ప్రోచు
రాణించు నెచ్చోట ద్రోణప్రమాణంబు లై నిండుకొని యున్న తేనెపెరలు.
తే. ప్రాణపద మెద్ది కపిలోకపాలకునకు, నెద్ది సర్వభూతములకు హృద్య మెందు
లలితతరులతానంతతు ల్గలిగి యుండు, నట్టిసుగ్రీవుమధువన మట్టె చూచి.

క. వనచరు లందఱు వినయం,బున నంగదుమోముఁ జూచి ముదమున మధువుల్
దనియఁగఁ గ్రోలెద మిందఱ, మనఘా యివ్వరము కరుణ నానతి యీవే.

వానరు లంగదానుమతంబున మధువనములోనిమధువంతయుఁ ద్రావుట.

ఆ. అనిన నట్లుగాక యని మహేంద్రకుమార, సుతుఁడు జాంబవత్ప్రభృతివనాట
వరుల కాజ్ఞ యొసఁగె వలసినచందానఁ, దనివిదీర మధువు ద్రావుఁ డనుచు.
చ. అవు డొకమాట వాలిసుతుఁ డానతి యిచ్చెనొ లేదొ యంతలోఁ
గపులు ముదంబు నొంది మదిఁ గౌతుకముం జిగురొత్తఁగా మధ

ద్వీపములమాడ్కి నొండొరులు వేచి నిరంకుశవృత్తి నప్పుడా
విపినముఁ జొచ్చి తేనియలు వేడుకఁ ద్రావఁ గడంగి రంతలోన్. 1416

వ. వనపాలశేఖరుం డగు దధిముఖుండు క్రోధోద్దీపితముఖుం డై యక్కపుల నందఱ నిలునిలుఁ డని యదల్చి పోనీక యడ్డంబు నిల్చి యొగ్గారంబునఁ ద్రోచికొని పోవ నిలువరింపనేరక తత్కాలసన్మతి యగుబుద్ధిం జేసి కొందఱఁ బరుషంబు లాడియుఁ గొందఱఁ దలప్రహారంబుల భంజించియుఁ గొందఱితో సంగ్రహించియుఁ గొందఱితో సామంబు నెఱపియుఁ గొందఱితో సుగ్రీవునివలని భయంబు దెలిపియు నానాప్రకారంబుల నిలువరించిన నిలువక యవ్వనచరులు మత్తచిత్తచేష్టులై శంక విడిచి నఖదంతతలపాదప్రహారంబుల నొప్పించి సమగ్రబలంబునం ద్రోచి వడిచి యవ్వనంబు సొచ్చి నిర్గతమధుమూలాదివస్తుజాతంబు గావించి రప్పు డాహనుమంతుండు వారల కిట్లనియె. 1417

ఆ. వలదు మీకు భయము వలసినచందానఁ, దనివిదీర మధువు ద్రావుఁ డేను
నడ్డపెట్ట వచ్చినట్టిశత్రుల నెల్లఁ, గడిమి మెఱసి యంటఁ గట్టి వైతు. 1418

చ. అనుచు సమీరజుండు దయ నాడిన నంతయు నంగదుండు తాఁ
గని కపికోటితోడఁ గృతకార్యుఁడు పావని యానతిచ్చె మీ
మనమున శంక దక్కి కడు మక్కువఁ దేనియ లానుఁ డింక నా
కనిశముఁ జేయరానిపని యైన నవశ్యము సేయఁగాఁ దగున్. 1419

వ. అని ప్రసన్నవదనుం డై యంగదుండు పలికిన నతనివచనంబుల కలరి బలీముఖులందఱు వేనోళ్ల నంగదుం గొనియాడుచుఁ బరమోత్సాహులై సముద్రవేగంబుపోలికిఁ గోలాహలబహుళంబుగా మధువనంబుఁ జొచ్చి యవ్వనంబును నిర్గతమధుఫలాదిభోజ్యంబు గావింపం దొడంగి రప్పుడు. 1420

వృషభగతిరగడ. మీఱి పుష్కరవీథిఁ దఱిసెడు మేచకద్రుమపంక్తు లెక్కుచుఁ
బాదపంబులమాడ్కి బిఱబిఱఁ బాఱి శైలము లెక్కి నిక్కుచుఁ
గొమ్మకొమ్మకు దాఁటి ఫలములు కుసుమములు నిలఁబడఁ గదల్చుచుఁ
గ్రమ్ముకొని శార్దూలసింహవరాహముఖమృగముల నదల్చుచుఁ
గుసుమరసములు గ్రోలి సొక్కెడు కొదమతుమ్మెదచాలు రేఁపుచు
మునుకుకొని వెస ఝుమ్మఝుమ్మని మ్రోయుసరఘుల నెగయఁ జోపుచుఁ
గోటరములకుఁ దూఱి తావులు గురియుకమ్మనితేనె లానుచు
వ్రేటువ్రేటునఁ జివురుకొమ్మలు విఱిచి మొలచీరెలుగఁ బూనుచు
పనసభూర్జకపిత్థజంబురసాలఫలములు వేడ్క నమలుచు
విరిసికొని వాసించునెఱిఁ గ్రొవ్విరులు నఖముల గిల్లి దెములుచుఁ
దెరలి మాటికి వల్లిగృహముల తీఁగెటుయ్యెల లెక్కి యాడుచు
విరవుకొని వాసించుకప్రపు టిసుకతిన్నెలచెంత డాఁగుచు
క్షితితలంబున నుండి జవమున గిరులమీఁదికి నెగయ మీటుచు

క్షితిధరంబులనుండి కడువడిఁ గ్రిందలకుఁ జరియాఁకు దాఁటుచు
మీఁజికొందఱు తేనియలు తమమిత్రులకు సొంపార నొసఁగుచుఁ
దూఱికొందఱు యొరులచేతి మధువులు బలిమిం దిగిచి మెసఁగుచు
నెఱయఁ గొందఱు వేడ్కఁ గడుపులనిండఁ ద్రావిఁ ధరిత్రి నైసుచు
నుఱియఁ గొందఱు జతనుపడి మదమత్తులై పెరవారిఁ దాఁకుచు
జిగురుకొమ్మలు పఱచుకొని పనుచెట్లనీడల మేనుఁ జేర్చుచు
సొగటుపడి మధుపారవశ్యతఁ జొక్కి యొండొరుమీఁదఁ జేయుచుఁ
నొఱవు గల సంతోషవశమున నొండొరుల మూఁపురము లెక్కుచుఁ
గఱవు దీఱఁగ మాటిమాటికిఁ గమ్మతేనియ లాని సొక్కుచు
సురభిమధువాసనలు గైకొని సుడియు గాడ్పున కిచ్చమెచ్చుచు
నురుజవంబున మింటఁ జను విహగోత్తమంబులఁ బట్టి తెచ్చుచు
జతను పడి పూఁదేనెకాల్వలు జవము పెంపున నెగసి దాఁటుచు
వితతజవమున నొండొరుల వినువీధి ముట్టఁగ నెగయ మీటుచు
మెండుకొని పరివేషవిధమున మింటఁ దోఁకలు ద్రిప్పి యూఁచుచు
గండు మీఱి సమస్వరంబులఁ గలసి సంగీతములు పాడుచు
మధువశంబున స్రుక్కి మేనులు మఱచి యొండొరుఁ బట్టి త్రిప్పుచుఁ
బ్రథనపరిణతచిత్తులై దోర్బలము మీఱ నెదిర్చి కొప్పుచుఁ
బరవశత నొండొరులఁ గౌఁగిటఁ బట్టి మోముల మధువు లుమియుచుఁ
గరము సమ్మోదమున గుంపులు గట్టి గగ్గలు చేసి భ్రమియుచు
నొకనివీఁపునఁ జేతు లిడి వేఱొకని మెచ్చక మచ్చరించుచు
నొకనిఁ జేకొని తేనియలు వేఱొకని కిమ్మని హెచ్చరించుచుఁ
జెలఁగి కరతాళస్వనంబులు చెలఁగ వేడుక నృత్యమాడుచు
మలసికొని దుర్బలుఁడు బలియుని మధువు లిమ్మని సారె వేఁడుచు
నొకనికన్నుల నొకఁడు మూయుచు నొకఁడు దాఁగిలిమూఁత లాడుచుఁ
బ్రకటముగ నొండొరుల సందిటఁ బట్టి పరిహాసోక్తు లాడుచు
నాటలకుఁ బురికొల్పుకొని కపు లంద ఱొక్కెడ గుంపు గూడుచుఁ
బాటవంబున వెండియును మధుపానమున కొండొరుల వీడుచు
నొకని మదమున వెక్కిరించుచు నొకని ముదమునఁ జూచి నవ్వుచు
నొకఁ డొకఁడు వడి మత్తుఁడై పాలు పొందు నఖములఁ బుడమి ద్రవ్వుచు
నొకని నల్కఁ దిరస్కరించుచు నొకనిఁ బ్రీతి బహూకరించుచు
నొకనిఁ దిట్టుచు నొకనిఁ గొట్టుచు నొకనిఁ జూచి నిరాకరించుచు
నందఱును గుమిగూడి మేఘము లట్లు భయదార్భటులు సేయుచు
నందఱును గడు సమ్మదంబున నంగదునిఁ గని వినుతి సేయుచు
నెన్నఁ డింత నితాంతసౌఖ్యం బెఱుఁగ మని కడు నుబ్బి యాడుచు
సన్నుతించుచుఁ దృప్తులై సంజాతమార్గశ్రమము వీడుచు. 1421

క. ఇత్తెఱఁగున నాహరివం,శోత్తము లంగదునిఁ దేనె లుద్యత్కౌతుకా
యత్తులయి త్రావి వనమునఁ, జిత్తంబున సమ్మదంబు చిగురొత్తంగన్. 1422

వ. విహరించుచుండ నప్పుడు విధ్వంసితపత్త్రపుష్పరసం బైన వనంబు నాలోకించి మధుపాలకులు దధిముఖప్రేరితులై కోపాటోపంబున వానరులం దొడరి వారల చేత భంగపడి నొచ్చిన యంగంబులతోఁ బఱతెంచి దధిముఖుం గాంచి పర మోద్విగ్నులై యిట్లనిరి. 1423

మధువనపాలకుఁ డగు దధిముఖుఁడు వానరులవారింపం బోయి యంగదునిచే భంగపడుట.

క. అనిలసుతసత్త్వవంతులై, వనచరులందఱును బలిమి వన ముద్ధతిమైఁ
దునుమాడి యడ్డపడఁ బో,యిన నుమ్ముం దూల నడిచి రెంతయుఁ గినుకన్.

తే. అనిన దధివక్త్రుఁ డతికుపితాత్ముఁ డగుచుఁ
జేయునది లేక యూర్పులు సెలఁగ నుచిత
గతిఁ దెలిసి సాంత్వవాక్యసంగతి ననూన
యించి వారలఁ గాంచి తా నిట్టు లనియె. 1425

వ. ఏను వారించెదఁ జూడుం డని పలికి సాలపాణియై బలసహితంబుగా నతివేగంబునం జని వానరుల నందఱఁ బీడించిన నది చూచి యంగదుండు సహింపక యుద్దంబు వచ్చి బాహువులం గ్రుచ్చిపట్టి యెత్తి పుడమిం ద్రెళ్ళవైచిన నాదధిముఖుం డంగదునిచేత భంగపడి సేయునది లేక యేకాంతంబునం గూడుకొని భృత్యుల నందఱ నవలోకించి యీ వానరు లంగదునిబలంబున వచ్చి వీర్యగర్వంబున గర్వించియున్నవా రిప్పుడు వీరి నడ్డపెట్ట మనకు నలవి గాదు వానరనాథుం డగుసుగ్రీవుండు విపులగ్రీవుం డై రామలక్ష్మణసహితంబుగా ఋశ్యమూకంబున నున్నవాఁడు మన మిప్పు డతనిపాలికిం జని చిరకాలను రక్షితంబై సురాసురులకు లక్షింపరాక యున్న పితృపైతామహం బైనభవదీయమధువనంబు మనయంగదునికతంబున వినాశితం బయ్యె నని సర్వంబును విన్నవింత మట్లైన నతం డమర్షియై యాజ్ఞోల్లంఘనంబుఁ జేసినయంగదాదుల శాసించు నంతట నమర్షప్రభవం బైనమనరోషంబు సార్థకంబగు నాజ్ఞాపరిపాలనశీలుం డగుసుగ్రీవుండు మధులుబ్ధు లగు నీదురాత్ముల దండింప నేల యూరకుండు నతనిచేతం గాని మనచేతం జిక్కుపడువారు గారని పలికి యాదధిముఖుండు వనపాలకసహితుం డై శీఘ్రంబున నాకాశమార్గంబునం జని త్రేతాగ్నులం బోలెఁ బర్వతాగ్రభాగంబునం దేజరిల్లుచున్న రామలక్ష్మణసుగ్రీవులం గని నిమేషాంతరమాత్రంబున గగనంబున నుండి కొండనెత్తంబునకు డిగ్గి దీనవదనుం డై శిరంబున నంజలి గీలించి సుగ్రీవునిచరణంబులపయిం బడి లేవక యుండె నతం డతనిచందంబు విలోకించి పరమోద్విగ్నహృదయుం డై. 1426

ఉ. లెమ్మభయం బొసంగితి వలీముఖశేఖర మామకాంఘ్రిపై
నిమ్మెయి నేటికిన్ బడితి వేటికి నీకు భయంబు గల్గె నీ
యుమ్మలికంబు వీడి నరసోక్తుల నింతయు మాకు నేర్పడన్
సమ్మతితోడఁ జెప్పుము విషాదము వల్వదు నాదుసన్నిధిన్. 1427

క. అని సుగ్రీవుఁడు పలికిన, విని దధిముఖుఁ డతనిచేత విశ్వాసితుఁ డై
వినయమున లేచి వెస న, య్యినసంభవుమోముఁ జూచి యిట్లని పలికెన్.

ఆ. నీదుతండ్రినాఁడు నీనాఁడు వాలినాఁ, డించుకయిన నాశ మెఱుఁగనట్టి
మధువనంబు నేఁడు మనయంగదునిబల్మిఁ, జేసి కపులు నీఱు చేసినారు. 1429

మ. కొలఁకుల్ చొచ్చి కలంచియున్ గుధరముల్ గోరాడి మిన్నంది రా
జిలువృక్షంబులు గూల్చి తేనియలు నిశ్శేషంబుగాఁ ద్రావి త
త్ఫలముల్ రాల్చి తదీయశాఖలు వడిన్ భంజించి యక్కానను
జ్జ్వలదావానలదగ్ధ మైనక్రియ విధ్వస్తంబు గావింపఁగన్. 1430

సీ. కని యేను సైఁపక వనపాలయుతుఁడ నై యక్షంబు నని పతియాజ్ఞ మీకుఁ
గల దంచుఁ బలికినఁ గైకొన కతివీర్యగర్వితు లై వారు కడిమి ముష్టి
కరజానుజంఘోరుచరణాహతులచేత నొప్పించి పతితోడఁ జెప్పుకొమ్ము
పొమ్మని వెసఁ ద్రోచి పుచ్చిన నచ్చితి నధిప నీదెస లేశ మైన భయము
తే. గలుగ దేమని చెప్పుదు నలసితేని, పరఁగ దీనికిఁ దగినయుపాయ మొకటి
బుద్ధిఁ జింతింపు మంతకుఁ బూన వేని, విపినరక్షణమందు న న్నీడుపు మింక.

వ. వానరేంద్రా యవ్వానరులు నానావిధప్రకారంబుల నొప్పించి దేవమార్గంబు దర్శింపంజేసి యనిచి రని స్వజాత్యుచితభాషచేత విన్నవించుచుండ నప్పుడు మహాప్రాజ్ఞుం డగులక్ష్మణుండు సుగ్రీవునిం జూచి యితం డెచ్చటనుండి వచ్చె నేమినిమిత్తంబున దుఃఖితుం డయ్యె నేమియర్థంబు విన్నవించుచున్నవాఁ డని యడిగిన వాక్యవిశారదుం డగుసుగ్రీవుండు సౌమిత్రి నవలోకించి యిట్లనియె.

సుగ్రీవుఁడు సంతోషించి వానరులు సీతం జూచి వచ్చిరని లక్ష్మణునితోఁ జెప్పుట

క. అనఘా యీతఁడు దధిముఖుఁ, డనువానరవీరుఁ డంగదాదులు మధువు
ల్గొని త్రావి రనుచు నాతోఁ, బనివడి యెఱిఁగించుచున్నవాఁడు కృపణతన్.

సీ. అనఘాత్మ యకృతార్థు లైనవారల కిట్టి కార్యవిశేషంబు గలుగఁ బోదు
కపులచేఁ గార్యంబు కరము సాధిత మయ్యె నని తలంచెద వాయుతనయుచేత
నవనిజ సందృష్ట యయ్యె నిక్కంబుగా నామహాత్మునకంటె నన్యుఁ డొకఁ
డలకార్యసాధనమందు సమర్థుండు గాఁడు మారుతియందుఁ గర్మసిద్ధి
తే. మతియు ధృతియును దేజంబు శ్రుతము విక్ర
మంబు వ్యవసాయమును బౌరుషంబు చాల

సా ప్రతీక్షితమ్ము యుండు గౌరవమ్మఁ
బడసి ప్రతికదె గాక కలఁడె యన్యుఁ డొకఁడు. 1434

తే. అంగదుండు బలేశ్వరుం డట విధాతృ,నందనుఁడు నేత యమ్మరుస్నందనుండు
తగ నధిష్ఠాత యఁట రాజతనయ ధాత్రి, నెంత పనియైనఁ దీర్చుట కేమి యరిది.

సీ. యామ్యదిశాభాగ మంతయు శోధించి జానకిఁ బొడగని సంభ్రమమున
నంగదప్రముఖవనాటశేఖరు లెల్ల మానక చనుదెంచి మధువనంబుఁ
జొచ్చి విచ్చలవిడి సొరిదిఁ దేనెలు ద్రావి రది చూచి యోర్వక యడ్డపెట్టఁ
బోయిన మమ్మెల్ల ముష్టిసంహతులచే నొప్పించి రని మాకుఁ జెప్పుచున్న

తే. వాఁ డితఁడు దధిముఖుఁ డనువానరుండు
వినుతవీర్యుండు ప్రఖ్యాతవిక్రముండు
వాలినాఁడును నానాఁడు వాఁడి మెఱసి
గరిమఁ దగ వనంబును గాచుచుండు. 1436

చ. జనవరపుత్రి నిక్కముగ జానకి గన్పడె నట్లు గానిచో
వనచరవీరు లెల్ల ననివార్యగతిం జనుదెంచి వీఁకతో
ననిమిషదానవాదులకు నైనఁ గనుంగొనరానియట్టి మ
ద్వన మటు చొచ్చి తేనియలు ద్రావుదు రే కడు సాహసంబునన్. 1437

క. అని పలికిన సుగ్రీవవ, దననిర్గతమధురవాణి తప్పక విని యా
జననాథసుతులు మిక్కిలి, మనమున హర్షించి యతని మన్నించి రొగిన్. 1438

—సుగ్రీవుఁ డంగదాదులఁ దోడ్కొని రమ్మని దధిముఖున కాజ్ఞాపించుట.—

వ. ఇట్లు రామలక్ష్మణులు ప్రీతిస్ఫీతనేత్రులును సంప్రహృష్టచిత్తులును సిద్ధార్థులు
నై యభూతపూర్వశోభావిశేషంబునం బొల్చి రంత సుగ్రీవుండు కార్యసిద్ధిని గర
గత మైనదానిఁగా నిశ్చయించి ప్రీతిసంహృష్టసర్వాంగుండై దధిముఖు నవలో
కించి కృతకార్యు లైన వానరులచేత వనంబు భుక్తం బగుటకు సంతోషించితిఁ
గృతార్థు లైనహనుమత్ప్రముఖవానరవీరుల నవలోకించుటకు సీతాభిగమన
కృతప్రయత్నంబు వినుటకు నిశ్చయించి యున్నవాఁడ శీఘ్రంబున వానరులం
దోడ్కొని రమ్మని పలికిన. 1439

తే. అతఁడు దధిముఖుఁ డట్ల కా కనుచు సూర్య
నందనునకును రఘుకులనందనులకు
వందన మొనర్చి సంభృతానందుఁ డగుచు
నగచరకదంబపరివృతుం డై గడంగ. 1440

క. వినువీథి కెగసి రయమున, మును వచ్చినసరణి నేగి మోదంబున న
వ్వనపాలశేఖరుఁడు మధు, వనము ప్రవేశించెఁ దోడివారును దానున్. 1441

వ. ఇత్తెఱంగున నవ్వనంబు సొచ్చి యచ్చటఁ బీతం బగుమధువు జీర్ణత్వంబు

నొందుటవలన మేహనమార్గోత్పన్నమధూదకులై విహరించుచున్నవారల
నిరీక్షించుచు నంగదునియొద్దకుం జని యంజలి ఘటించి వినయవినమితశరీరుండై
యిట్లనియె. 1442

చ. అనిమిషనాథపౌత్ర వినుమా యువరాజవు గాన నీవు మా
కనవరతంబు గోప్తవు ప్రహర్తవు నీ కరయంగ నష్టమెం
దును గలదే వళీముఖులు దోఃప్రభ మూర్ఖత నెగ్గుచేసిరీ
జననుత నాదుచెప్పుములు సైచి కృపామతి నాదరింపవే. 1443

—— అంగదుండు దధిముఖవచనంబున వానరసహితముగా సుగ్రీవునికడకుం బోవుట ——

వ. ఏ నప్పుడు మీచేత భంగపడి వనపాలకసహితంబుగా భవత్పితృవ్యుం డగు
సుగ్రీవునిపాలికిం జని మీరాకయు వనంబుపోకయు నిరవశేషంబుగా మధువులు
ద్రావుటయు సర్వంబు విన్నవించిన నతండు రుష్టుండు గాక హృష్టుండై శీఘ్రం
బున మిమ్ముం దోడ్కొని రమ్మని పంచె రాఘవు లట్ల సేయు మని పలికి రన్నర
వానరనాయకులు భవదాలోకనకృతోత్సాహులై యున్నవారు నీవు వనచరబల
పరివృతుండవై శీఘ్రంబున నమ్మహాత్ముల పాలి కరుగు మని పలికిన నతనిపలుకుల
కలరి వాలిసుతుండు హరిశ్రేష్ఠుల నవలోకించి మదాగమనవృత్తాంతంబు
రామునిచేత శ్రుతం బయ్యె నని శంకించెదం గృతకార్యులమైనమన మిచ్చటం
దడవు సేయుట కర్తవ్యంబు గాదు మీరు యథేష్టంబుగా మధుపానంబు గా
వించి విగతవిశ్రములై తి రింక నిక్కడ నేమి కార్యంబు మద్గురుం డగుసుగ్రీవు
పాలికిం బోదము కపికుంజరు లందఱుం గూడుకొని యెద్ది పంచిన దానిం గావిం
చుట కేను గర్తనైతి నేను బరతంత్రుండ యువరాజ నయ్యును మిమ్ము నాజ్ఞా
పించుటకు సమర్థుండం గాను గృతికార్యులైనమీరు నాచేత ధర్షించుట
కశక్యులైతిరి. 1444

క. నా విని సంతోషము మది, నావిర్భవ మందం గీశు లంగదుం గని సం
భావించి యిట్టు లనిరి వచోవైభవ మలరం బవనసూనుండు వినంగన్. 1445

సీ. అమరేంద్రపౌత్ర నిజైశ్వర్యములు నచ్చి మదమత్తులై యభిమాన మూంది
మదిం బెద్దవారి సమ్మానంబు సేయక తామె యన్నిటికిం బెద్దల మటంచుం
బరులం జుల్కనం జేసి పలుకుట రాజుల కరయ నైసర్గిక మట్టిదోష
మించుక నీయందుం గాంచము నీయట్టిరాజు గలండె జగత్త్రయమునందు
తే. నగచరోత్తమ నీవినయాతిశయమె, భావిభాగ్యోదయవిశేషపటిమ దెల్పు
చున్నయది నీవు చెప్పినట్లుష్ణకరజు, పాలి కిప్పుడె పోవుట పరమహితము. 1446

—— సుగ్రీవుం డంగదసింహనాదము విని రామలక్ష్మణులకుం గార్యసిద్ధిం జెప్పుట. ——

వ. అని పలికి యవ్వనచరు లొండొరులం బురికొల్పుకొని యంగదుం బురస్కరిం
చుకొని యతివేగంబున మహీతలంబున నుండి గగనంబున కెగసి యంత్రోత్క్షి

స్తంబు లగునగంబులభంగి యాకాశంబు నిరవకాశంబుసేయుచు వాతేరితంబు లగుఘనంబులమాడ్కి గర్జించుచు హనుమదుత్సాహోయుక్తులై శీఘ్రగమనంబునం బోవునప్పు డంగదుండు రామలక్ష్మణసుగ్రీవులకుఁ గార్యసిద్ధి దెలియునట్లుగా నొక్కసింహనాదంబుఁ జేసిన శుభసూచనకృతక్షణంబైనయమ్మహాశబ్దంబువిని సుగ్రీవుండు విపులగ్రీవుండై శోకోపహతచిత్తుండైనరాము నవలోకించి మంద మధురాలాపంబున నిట్లనియె. 1447

చ. నరవర శోక మేటికి మనంబున మోహము గూర్పవమా కపు
ల్ధరణిజఁ జూచి వచ్చు టదితథ్యము వీరటు గాక యున్న నా
కలిపినమాడ్కిఁ దత్సమయకాలము పోవుట కట్టె పోక భీ
కరగతి నాదుసన్నిధికిఁ గ్రమ్మఱ నిమ్మెయి నేఁడు వత్తురే. 1448

క. కృతకృత్యు లగుచు వచ్చుట, వితతగుణా నిక్కువంబు వేఱొక్క లై నక్ష
జతురత్వము ధృతియును వి, శ్రుతదాక్ష్యము తేజ మింత సొంపగు నయ్యా.

వ. అదియునుం గాక. 1450

చ. గురుతరవిక్రముండు కపికుంజరుఁ డుత్తమశౌర్యవీర్యవి
స్ఫురణుఁడు వాలిజుం డతఁడు పూనినకార్యము గాకపోవు శే
నెఱుఁగి నమైన స్వామితకు హీనత వచ్చె నటంచు దీనుఁడై
పిఱ్ఱునవి వచ్చుఁ గాక యిటు భీషణుఁడై చనుదేర నోపునే. 1451

ఉ. దేవ కృతార్థుఁడై యరుగుదేరక యున్న నితండు నిర్భయుం
డై విబుధేశ్వరాదులకు నైనఁ గనుంగొన రాకయుండఁ దా
రావిభుఁ డేను నిత్యమును బ్రాణపదంబుగ నత్యుదాత్తభా
హావిభవంబుచే నరయు నట్టివనంబును జూఱవుచ్చునే. 1452

చ. జనవర నీదుపత్ని యగుజానకి మారుతిచేత దృష్ట యా
ట నిజము శంక వల్వదు దృఢంబుగ నెమ్మది నమ్ము మమ్మహా
ఘనునకుఁ గాక యన్యునకుఁ గా దిది యాతనియందు సిద్ధియుక్
దినకరునందుఁ బోలె ఘనతేజము వీర్యము పొల్చు నెంతయున్. 1453

తే. అంగదుండు బలేశ్వరుండఁట విధాతృ, నందనుఁడు నేతయఁట మరున్నందనుండు
తగ నధిష్ఠాతయఁట వసుధావరేంద్ర, యెంత పని యైనఁ దీర్చుట కేమియరిది.

వానరులు ఋశ్యమూకపర్వతమును జేరుట

వ. మహాత్మా విచారంబు విడిచి సముత్సాహసంపన్నుండ వగు మని పలికిన సుగ్రీవునిపలుకులు కలరి రాముండు సీతావృత్తాంతాకర్ణనోత్కంఠుండై యుండె నప్పుడు హనూమదుత్కర్షసంపూర్ణులై గర్జించుచు వచ్చువానరులకోలాహలశబ్దంబులు కార్యసిద్ధిం దెలుపుచు శ్రోత్రసుఖంబుగా నంబరంబుననుండి వినవచ్చిన నమ్మహానాదంబువిని కపిలోకగ్రామణి యగుసుగ్రీవుం డుద్గ్రీవుండై మహేంద్రధ్వజసన్నిభం

బై నలాంగూలంబు ద్రిప్పుచుఁ బరమానందంబున నుండెఁ బదంపడి జాంబవత్ప్రముఖహరిశ్రేష్ఠు లంగదాంజనేయులం బురస్కరించుకొని రామదర్శనకాంక్షులై సంతోషవిశేషంబునం బొదలుచు గగనంబున నుండి ఋశ్యమూకంబునకు డిగ్గి రామసుగ్రీవులసన్నిధిం బొడసూపి రప్పుడు హనుమంతుండు రాముని చరణంబులు శిరంబు సోఁకం బ్రణమిల్లి బద్ధాంజలిపుటుండై. 1455

హనుమంతుఁడు సీతం జూచితి నని రామునకుఁ జెప్పుట

చ. జనపతి రాముఁడుం దదనుజన్ముఁడు భానుసుతుండు బ్రీతి సొం
పెనయఁగ సీతవార్త విన నెంతయుఁ గౌతుకముం బ్రియంబు నె
మ్మనమునఁ బర్వఁ దన్ను బహుమానపురస్సరదృష్టిఁ జూడ నే
ర్పునఁ గనుఁగొంటి సీత నని పొల్పుగఁ దెల్పె సుధామయంబుగన్. 1456

తే. అపుడు సౌమిత్రి సమ్మోదితాంతరంగుఁ
డగుచు నప్పవనాత్మజునందు నిశ్చి
తార్థుఁ డగుభానుసుతునివాక్యమున కలరి
యింపు దళుకొత్త బహుమానదృష్టిఁ గనియె. 1457

క. పరమప్రీతియుతుం డై, పరవీరఘ్నుండు రామభద్రుఁడు కరుణా
పరికలితకటాక్షంబులఁ, బరికించి బహూకరించెఁ బవనతనూజున్. 1458

వ. అంత వానరులందఱుఁ జిత్రకాననశోభితం బైనఋశ్యమూకంబు నధిగమించి యువరాజపురస్సరంబుగాఁ గౌసల్యానందనుపదారవిందంబులకు వందనంబుఁ జేసి సౌమిత్రిచరణంబులు ఫాలంబు సోఁకం బ్రణతులై సుగ్రీవునకు నమస్కరించి వినయవినమితగాత్రులై సంతసంబున. 1459

సీ. అవనిజ దశకంధరాంతఃపురోచితవనములో నునికియు దనుజయువతు
లుద్వృత్తిమెయిఁ దర్జనోక్తు లాడుటయును రామునిపయి ననురాగ మర్థిఁ
దాల్చుటయును సమస్తంబును వినిపించి సమయకాలము కడసనుట కాత్మ
నలుగక మన్నింపుఁ డని నళీముఖు లెల్ల వేఁడిన జానకీవిభుఁడు మోద

తే. మంది వారలతోడ ని ట్లనియె సీత
యెచట నున్నది యెట్లున్న దేమి యన్న
దెలమి నాయందు వర్తించు నెట్టెఱంగు
తెల్లముగ నింతయును మాకుఁ దెలుపుఁ డిపుడు. 1460

వ. అని పలికిన రామనిగదితం బైనవచనంబు విని వానరు లందఱు సీతావృత్తాంతకోవిదుం డగుహనూమంతుని నియోగించిన నాహరిశ్రేష్ఠుండు పరమానందపులకితగాత్రుం డై భక్తితాత్పర్యంబున సీత యున్నదిక్కునకుం బ్రణమిల్లి రామున కభిముఖుం డై కేలు మోడ్చి ఫాలంబునం జేర్చి వినయంబున నిట్లనియె. 1461

చ. వరవర నీదుశాసనమునం బనిఁబూని యగస్త్యదిక్తటం
బరయుచు నేగి వింధ్యనగ మల్లన దాఁటి సమస్వశక్తి నే
నరుదుగ నూఱుయోజనము లంబుధి నేఁగ నతిక్రమించి దు
స్తర మగునమ్మహాజలధి దక్షిణతీరముఁ జేరి యచ్చటన్. 1462

హనుమంతుఁడు రామునకు సీతయున్న చందమును దనతో నన్న విధంబును జెప్పుట.

తే. అద్రితటముల వనముల నన్మహీజ, చొప్పు వెదకుచుఁ బోవ నచ్చోట నొక్క-
కొండపయి చిన్న మిట్టి యాఖండలునిపు,రంబు గ్రేణించు నొకనగరంబు గంటి.
క. ఆపేరు వినుము లంక యు, నా విశ్రుతిఁ గాంచు దానినాథుఁ డఖిలర
క్షోవిభుఁడు దుష్టచిత్తుఁడు, రావణుఁ డన నొకఁడు గలఁడు రాజకులేశా. 1464
తే. ఆపురము సొచ్చి యేను దశాస్యు నంతి,పురము చెంగటఁ బొల్చు విస్ఫురదశోక
వనములో నున్నయొక్క సువర్ణపత్ర, పుష్పమయశింశుపాతరుమూలమందు.
సీ. అనశనవ్రతసంభవాయాసభరమున నకలి నెమ్మేనుకార్శ్యము వహింప
నెఱ లేనిచెమటచిత్తడిఁ దోఁగి చీరధూళీకరివ్యాప్తి మాలిన్య మొంద
నిగిడించు నిట్టూర్పు సెగలచేఁ గందినవదనాంబుజమున వైవర్ణ్య మొదవఁ
ద్వద్వియోగజదుఃఖతాపరోదనమునఁ గెరలి నేత్రముల రక్తిమ చెలంగ
తే. మాటిమాటికి రామరామా యటంచుఁ
గనుల నశ్రులు నించుచుఁ గఠినభూమి
శయ్యపై మేను వైచి తుషారసమయ
నళినికైవడి నున్నజానకిని గంటి. 1466
వ. మఱియును. 1467
ఉ. తక్కక తన్ను దైత్యవనితల్ పరుషోక్తులఁ దూల నాడఁగా
నుక్కఱి యాప్తబాంధవుని నొక్కనిఁ గానక కంపితాంగి యై
యక్కట నన్ను నాపదల కగ్గము చేసెనె దైవ మంచుఁ దాఁ
జెక్కిటఁ జెయ్యి జేర్చి బలుచింతలఁ గుందెడుదాని వెండియున్. 1468
చ. బలితపురక్కసుండు తనుఁ బల్కిన యక్కొఱగానివాక్యముల్
తలఁచి తలంచి చిత్తమునఁ దద్దయు నెవ్వగ గూర రాము న
త్యలఘునిఁ బాసి యొంటి నకటా మన నేటి కటంచుఁ దెంపునన్
సొలయుచు మేనుఁ బాతు ననుచున్ దలపోసెడుదాని జానకిన్. 1469
క. పరికించి యేను మెల్లన, వెలుచుచు నిక్ష్వాకువంశవిఖ్యాతిని గ
ర్ణరసాయన మగునట్లుగ, వరమతి నొకకొంతసేపు వర్ణించి తగన్. 1470
వ. అద్దేవికి విశ్వాసంబు పుట్టఁ జేసి సముచితంబుగాఁ బొడసూపి. 1471

తే. నీకు సుగ్రీవునకు నైన నెయ్యమును మ
హాత్ముఁ డైనరాముఁడు పంప నరుగుదెంచి
నాఁడ ననియు సర్వంబు విన్నపముఁ జేసి
నీదుముద్రిక యొసఁగితి నెమ్మితోడ. 1472

క. ఇచ్చినఁ గైకొని జానకి, యిచ్చ నలరి నన్ను మీకు హితునిఁగ మదిలో
వచ్చి మదాగమనమునకు, మెచ్చి బహూకృతి యొనర్చి మెల్లనఁ బలికెన్. 1473

తే. వాయుసుత భర్తతో నాయవస్థ దెలుపు
మిచట రాక్షసరుద్ధ నై యెపుడు మదిని
దన్నుఁ దలఁచుచు నొకభంగిఁ దనువునందుఁ
బ్రాణములు దాఁచికొని యున్న దనుచుఁ జెపుమ. 1474

చ. తలఁపఁగఁ జిత్రకూటమునఁ దా నొకనాఁ డొకవాయసంబుపై
నలిగి యమోఘబాణము రయంబున నేసినరీతియు న్వనీ
విలసితకుంజపుంజములఁ వేఁటొకనాఁడు లసన్మనశ్శిలా
తిలకము గండపార్శ్వమున దిద్దినభంగియు విన్నవింపుమా. 1475

వ. అని యభిజ్ఞానంబుగాఁ బలికి వెండియు నొక్కచూడారత్నం బొసంగి యిట్లనియె.

క. వనచర యీమణిరత్నము, గొని చని రాఘవున కిమ్ము గుఱుతుగ దీనిం
గనుఁగొని యారఘువర్యుఁడు, మనమున నిను విశ్వసించి మన్నించు రహిన్.

వ. అని పలికి యమ్మహాదేవి మీతో విన్నవించుటకుం దనవచనంబులుగా నిట్లనియె.

తే. వాసవాభ నాచేత నీవారిసంభ, వంబు నిర్యాతితం బయ్యె వ్యసనమందు
గరినుతో దీనిఁ గాంచి నిన్గాంచి నట్ల, కామనంబున నలరుదుఁ గాదె యధిప.

తే. జనవరోత్తమ యొక్కమాసంబు మేన
నసువులు ధరించి యుండెద నవల నొక్క
నిమిష మైనను జీవింప నేర నసుర
వనితలకుఁ జిక్కి జీవింప వశమె నాకు. 1480

చ. అని యిటుపల్కి నయ్యచు దశాస్యగృహోపవనోపరుద్ధ యై
మనమున భీతి నొంది మృగిమాడ్కి వడంకుచు దుఃఖమగ్న యై
యనవరతోపవాసకృశ యై నినుఁ బేర్కొనుచుం మనోవిలో
కనమున నిన్నె గన్గొనుచు గాసిలుచున్నది యేమి సెప్పుదున్. 1481

తే. అవనిసుత యున్నచందంబు నన్నచంద
మంతయును నీకుఁ జెప్పితి నానుపూర్వి
తోడ నిఁక నెల్లభంగులఁ దోయనిధిని
దాఁట యత్నంబు గావింపఁ దగు మహాత్మ. 1482

వ. అని పలికి యమ్మరున్నందనుండు రాజనందనుల జాతాశ్వాసులఁ గావించి జానకి
యిచ్చినచూడారత్నంబు రాఘవున కొసంగి యద్దేవి చెప్పు మనినసందేశం

బంతయు సంపూర్ణంబుగా విన్నవించిన నద్దశరథరాజనందనుం డామణిశ్రేష్ఠంబు
నవలోకించి శోకకర్శితుండై దాని హృదయంబున నిడికొని కన్నుల బాష్ప
జలంబులు రాల లక్ష్మణసహితంబుగా నొక్కింతసేపు రోదనంబు చేసి సుగ్రీ
వుని విలోకించి యిట్లనియె. 1483

హనుమంతుఁ డిచ్చిన సీతాచూడారత్నమును జూచి రాముఁడు విలపించుట.

తే. వత్సలత గల్గు ధేనువు వత్సమునకుఁ, బ్రేమతోఁ బాలు చేఁపినరీతి యయ్యెఁ
గాదె యిప్పుడు కపివర్య నాదుహృదయ, మీకనకచిత్రమణిసమాలోకనమున.
క. జనకజ కీమణిరత్నము, జనకుఁ డొసఁగెఁ దగ వివాహసమయంబున న
వ్వనితామణి ధమ్మిల్లము, ననఘ ప్రకాశింపఁ జేయు నద్భుతకాంతిన్. 1485
తే. పవనసంతుష్టుఁడై పాకశాసనుండు, జనకున కొసంగె నిమ్మణి సమ్మదమున
నిది మణిశ్రేష్ఠపూజితం బిది కృపీట,సంభవం బిది చారుదర్శనము సుమ్మి. 1486
క. జనసుతుఁ డగుమజ్జనకుని, జనకునిఁ గనుఁగొన్న నాఁటిసంతోషము నా
మనమునకుఁ గల్గె నేఁడీ, యనుపమమణిదర్శనమున నగచరవర్యా. 1487
చ. ఇనసుత యీమణిప్రవర మెప్పుడు మత్ప్రియ యైనసీతకొ
ప్పున కొకచె లొప్పసంగుచు సమున్నతకాంతి వసించి యుండుఁగా
వున వెస దీనిఁ గన్నులను బొందుగఁ జూడఁగఁ గల్గుటం బ్రియన్
దనరఁగ జూచినట్లు మదిఁ దద్దయు హర్ష మెసంగె నిత్తఱిన్. 1488
క. ఈమణిదర్శనమున మ, ద్భామిని సంప్రాప్త యైనభంగిగఁ దోఁచెన్
గోమలి ప్రత్యక్షంబుగ, నీమెయిఁ గనుఁగొనెడుభాగ్య మెన్నఁడు గలుగున్.
వ. అని పలికి వెండియు హనుమంతు నవలోకించి. 1490
మ. వనమధ్యంబున సంచరించునపు డేవామాక్షి మద్దుఃఖమున్
దనవాక్యామృతధారచే నుడిపి యానందంబు గావించు న
వ్వనితారత్నము సీత యే మనియెఁ దద్వాక్యంబు మత్కర్ణముల్
దనియన్ జెప్పుము సారెసారెకు మహాహ్లాదంబు సంధిల్లఁగన్. 1491
తే. జనకజను గాన కాయింతి చారుకబరి
యందుఁ జెలువొందు నిమ్మణి నద్భుతముగ
నిపుడు గనుఁగొంటి నక్కటా యింతకంటె
దుఃఖకర మెద్ది నాకు వాతూలతనయ. 1492
క. ననుఁ బాసి యొక్కమాసము, మని యుండెద ననుచుఁ బల్కె మానిని యే నా
వనజాక్షిఁ బాసి క్షణ మైన, నను జీవింపంగఁ జాల నగచరవర్యా. 1493
తే. నీరజాక్షిని గానక నిమిష మయిన
విరహతాపంబు సైఁచి ప్రవృత్తి నూఁది
యుండఁ జాల మహీసుత యున్నదేశ
మునకు వెస నన్నుఁ గొని చను మనిలతనయ. 1494

చ. శుకపికనాదము ల్చెవులు సోఁకిన యంతనె భీతి నొంది త
ప్పక ననుఁ గౌఁగిటం గదియఁ బట్టి వడంకెడునట్టిగోల యా
చకితమృగాక్షి భీషణనిశాచరయోషల కంఠహుంకృతుల్
దిగులుగ నొంద నేమి పడి స్వినవోర్చెను రేపగల్ కటా. 1495

క. తిమిరోన్మత్తశరద్విధుఁ, డమితఘనపరీతుఁ డైన యప్పటిపోల్కిన్
రమణీమణిముఖ మప్పుట, రమణీయం బగుచునుండు రాక్షసవృతమై. 1496

వ. మఱియు మధురాకారయు మధురాలాపశీలయు మన్మనోహారిణియు నగు వైదేహి మద్విహీన యై దుఃఖించుచు నేమని సందేశంబు చెప్పె రోగాతురుండు దివ్యౌషధిచేతం బోలె నవ్వాక్యశ్రవణంబున జీవించెద సర్వంబునుం గ్రమ్మఱ నెఱింగింపుమని పలికిన నవ్వాయునందనుం డారఘునందనునితో జనకనందనిసంభాషితంబు సర్వంబు నిట్లని చెప్పం దొడంగె. 1497

హనుమంతుఁడు సీతోక్తసందేశమును రామునకుఁ జెప్పుట.

తే. అనఘచారిత్ర చిత్రకూటాచలంబు
నందు భవదేకసంవేద్య మైనపూర్వ
వృత్త మొక్కటి గుఱుతుగా విన్నవింపు
మనియు జానకి యది యెట్టు లనిన వినుము. 1498

సీ. జననాథ జానకి నినుఁగూడి సుఖసుప్తి గావించి మున్న మేల్కాంచియుండఁ
గాక యొక్కటి వచ్చి కడువడి నఖములఁ దదురోజయుగ్మమధ్యమున జీరెఁ
గ్రమమున నీవు ధరాపుత్రి యుత్సంగదేశంబునందు నిద్రించి యుండఁ
గ్రమ్మఱఁ బరువడిఁ గాకంబు చనుదెంచి తమిఁ గుచాంతరము తుండమునఁ బ్రచ్చి
తే. వ్రణము గావింపఁ బీడ కోర్వక మృగాక్షి
తొట్రుపడఁ గ్రొత్త నెత్తుటఁ దోఁగి యున్న
నినుఁ బ్రబోధింపఁ జయ్యన నిద్ర లేచి
సీత నీక్షించి కోపంబు చెంగలింప. 1499

మ. కలికీ యెవ్వఁడు నీకుచాంతరమునం గామాంధుఁ డై జీరె నే
కలుషాత్ముం డుసరోషపన్నగముతో గర్వించి క్రీడింపఁ గాఁ
దలఁచెన్ జెప్పు మటంచుఁ దీక్ష్ణనఖతుండం బై రహిం బొంచి ముం
గల నుగ్రాకృతి నున్నకాకమును వీక్షన్ గాంచి నీ వంతటన్. 1500

ఆ. దాని శక్రసుతునిఁగా నగాంతరచరుఁ, గాఁ బతత్రివరునిఁగా సమీర
కల్పుఁగా నెఱింగి కన్నుల రోషాగ్ని, కణము లొలుక వహ్నికరణి నలిగి.

తే. కడు రయంబున నొకదర్భఖండముగొని
దానిఁ బైతామహాస్త్రమంత్రమునఁ గూర్చి
వాయసముమీఁద వైచితి వాయమోఘ
బాణము లయాగ్ని కై వడిఁ బ్రజ్వరిల్లి. 1502

క. కడు రయమునఁ గాకము వెం,బడిఁ బడి దఱుమంగ భీతిఁ బఱచి యది సురేం
ద్రుఁడు మొదలగు సమరవరుల, యడుగులఁ బడి వారిచేతఁ ద్యక్తంబగుచున్.

క. జగములు మూఁడును ద్రిమ్మరి, ఖగము పరిత్రాత నెందు గానక వెసఁ దా
మగుడి చనుదెంచి భయమున, జగన్నుతుఁడ వైననిన్ను శరణము నొందెన్.

వ. ఇట్లు శరణాగతం బైనబలిభోజనంబు నిరీక్షించి యది వధార్హం బైనను శరణాగతరక్షణంబు మీకుఁ బ్రధానగుణంబు గావున దానిఁ గృపార్ద్రవిలోకనంబుల నవలోకించి మదీయాస్త్రంబు మోఘంబు సేయుట కశక్యంబు నీవక్షిణ నేత్రం బొసంగి ప్రాణంబులు రక్షించుకొని యథేచ్ఛం జను మని మీ రానతిచ్చిన నక్కాకం బట్లుగావించి మీకును దశరథునకును నమస్కారంబుగావించి యనుజ్ఞగొని నిజనివాసంబునకుం జనియె నని యీయభిజ్ఞానంబు మీ కెఱింగింపు మని పలికి వెండియు నద్దేవి యి ట్లనియె. 1505

సీ. ప్రాణేశ నీ విట్టి యస్త్రవిదుండవు సత్త్వవంతుఁడ వాజి సాహసుఁడవు
శీలవంతుండవు శిష్టసన్నుతుఁడవు దానవులందు నీ దారుణాస్త్ర
మేల ప్రయోగింప కిట్లుపేక్షించితి వమరవిద్యాధరయక్షసిద్ధ
గరుడగంధర్వకిన్నరచారణులలోన నని నిన్నుఁ దాఁకి పోరాడఁ జాలి

ఆ. నట్టివీరుఁ డొక్కఁ డైన లేఁ డధిప నా, మీఁద నీకుఁ బ్రేమ మిక్కుటముగఁ
గలదయేని గలనఁ గలుషాత్ముఁ డైనరా,వణునిఁ దునిమి నన్నుఁ బడయు మింక.

క. ఘనుఁ డగులక్ష్మణుఁ డయినను, దనయన్నకుఁ బ్రియము గాఁగ దశకంఠు ననిన్
సునిశితశరములఁ బొరిగొని, ననుఁ బ్రోవ కుపేక్షఁ జేసినాఁ డేమిటికిన్. 1507

తే. అరయదివ్యాస్త్రకోవిదులయ్యు వాయు,వహ్నిసను తేజులయ్యు దుర్వారశౌర్యు
లయ్యు రాఘవు లేల దశాస్యుఁ దునిమి, నన్నుఁ బ్రోవ కుపేక్షించియున్నవారు.

తే. అరయ మద్దుష్కృతంబు కొండంతగలదు,సంశయము లేదు గాని ఛోశక్తులయ్యు
సహితులయ్యును రామలక్ష్మణులు నన్ను,విడిచి యొప్పరికింతురె ప్రియము మఱచి.

వ. అని వగపు దోఁపఁ బలికి కన్నీరు నించిన నద్దేవి ననూనయించుచు నేనిట్లంటి.

—హనుమంతుఁడు రామునకుఁ దాను సీత నాశ్వాసించినప్రకారము దెల్పుట—

శా. శూరుం డైన రఘుప్రవీరుఁడు భవచ్ఛోకంబుచే వన్య మా
హారంబుల్ గొన కన్యకార్యవిముఖుం డై యున్నవాఁ డామహో
దారుం గన్గొని లక్ష్మణుండును బరిత్రస్తాత్ముఁ డై సంతతం
బారీతి న్విలపించు చుండు నిజ మీయర్థంబు సాధ్వీమణీ. 1511

క. చిరకాల మయ్యె నెపు డీ, చెఱఁ బాసెదనో యటంచుఁ జింతింపకు మీ
దురవస్థ కిపుడె యంతము, పరికించెద వింక దుఃఖపడకుము తల్లీ. 1512

తే. ఆవరోత్తము లిరువురు మానితముగ, నిన్ను వీక్షింపఁ గాఁ గోరి యున్నవారు
నిశితశరముల లంకను నీఱుఁ జేయఁ, గలరు నిక్కము శోకంబు వలవ దబల. 1513

క. జననీ నీపతి రాముఁడు, పనివడి దశకంఠు నాజి బంధుయుతముగాఁ
దునుమాడి నిన్న యోధ్యకుఁ, గొని చను నీచిత్తమందుఁ గుందకు మింకన్.

వ. అని యూఱడించి దేవి రామునియొద్దకుం జనియెద నమ్మహాత్మునకుఁ బ్రీతిఁ బుట్టింపందగినయభిజ్ఞానం బొక్కటి యొసంగుమని యడిగిన నవ్వైదేహి దిక్కు లన్నియు విలోకించి తనశిరంబుమీఁద గతిపయకేశరచితవేణ్యగ్రధితం బగుచుండిన ఇమ్మణిరత్నంబును వస్త్రాంతంబునుండి విడిచి నాకొసంగిన నేను దానిం బ్రతిగ్రహించి యద్దేవికిం బ్రణమిల్లి గమనోన్ముఖుండ నైతి నిట్లు గమనంబునందుఁ గృతోత్సాహుండ నైననన్ను విలోకించి మదుత్పతనసంభ్రాంత యై శోకభయంబులు మనంబునం బెనంగొనఁ గన్నీరు నించుచు బాష్పసందిగ్ధ వాక్యంబున నా కిట్లనియె. 1515

తే. కపికులోత్తము సింహాసంకాశు లైన, మనుకులులతోడ వారికి మంత్రి యైన
తపనసుతుతోడఁ దక్కినకపులతోడఁ, దప్పకమదీయవృత్తమంతయును జెపుమ.

తే. వానరోత్తమ యారఘువరుఁడు నన్నుఁ, దలఁప నీదుఃఖవారాశివలన నెట్టి
మాట లాడిన నుద్ధరింపంగఁ గడఁగు,నట్టి మాటలు పలుకు మయ్యధిపుతోడ.

చ. వినుతగుణాఢ్యుఁ డైనరఘువీరునిపాలికిఁ బోయి నీవు మ
ద్ఘనతరశోకవేగమును దైత్యసతీపరిభర్త్సనంబు దు
ర్జనుఁ డగుపఙ్క్తికంధరునిచందము సర్వము విన్నవింపు మో
వనచరవీర మార్గమున వారక నీకు శుభంబు గల్గెడిన్. 1518

క. అని యిట్లు పలికి వెండియు, జనకజ ననుఁ జూచి రామచంద్రుఁడు కరుణన్
ననుఁ బ్రోచునట్టిమాటలు, వినిపింపు మటంచుఁ బలికె వేయివిధములన్. 1519

వ. మహాత్మా వైదేహి యున్నచందంబును నీతో నన్నచందంబును సవిస్తరంబుగా విన్నవించితి నింక నమ్మహాదేవి నాపత్సముద్రంబువలన నుద్ధరించుటకుఁ దగిన ప్రయత్నంబు గావింపు మని పలికి వెండియు నాహనుమంతుండు రామచంద్రు నవలోకించి యిట్లనియె. 1520

తే. తరుణి యిబ్భంగి పెక్కుచందములఁ బలికి, కాంక్ష దీఱక మరల శోకంబు పేర్మి
నను విలోకించి నీమీఁదఁ దనకుఁ గలిగి,నట్టియనురక్తి రెట్టింప నిట్టు లనియె.

తే. ఇచట నేఁడెల్ల వసియించియెల్లి చనుము, నీదుసాన్నిధ్యమునఁ జేసి నేఁడుమంద
భాగ్యనగునన్ను బాధించుపరమదుఃఖ,మునకుఁ గలిగెడు నొక్కింత మోక్షణంబు.

వ. వానరోత్తమా నీవు గ్రమ్మఱం జనిన భవదదర్శనసంభూతం బైనశోకంబు దుఃఖపరామృష్ట నైన నాదుఃఖంబుఁ బ్రజ్వలింపఁ జేయుచు నన్ను మిక్కిలి పరితపింపం జేయు నీవు పునరాగమనార్థం బరుగుచుండ మత్ప్రాణంబులకును సందియంబు గలుగు సందియంబు లేదదియునుంగాక భవత్సహాయు లైనవానరులవిషయంబునం దొక్క మహాసందేహంబు నామ్రోల మూర్తిభవించి యున్నదానియట్లు చూపట్టుచున్న దది యెయ్యది యనిన. 1528

చ. తరుచరవర్య గాడ్పునకుఁ దార్క్ష్యునకున్ మఱి నీకుఁ దక్క నొం
డొరులకు లేదు బల్విడిఁ బయోనిధి దాఁటెడునంతశక్తి భూ
వరు లగురామలక్ష్మణులు వానరు లీజలరాశి నేక్రియన్
బరువడి దాఁటి రాఁగల రుపాయము నా కెఱిఁగింపు మింతయున్. 1524

వ. వాయునందనా నీవు రావణాదివధపూర్వకమన్మోక్షణరూపం బైన యేతత్కార్యసాధనంబునందుఁ బర్యాప్తుండ వైతి వేని శక్తిసమృద్ధియుఁ గుశలంబును నీకె గాక నాకుం గలుగ నేరదు రాముండు ససైన్యుం డై సముద్రంబు దాఁటి వచ్చి రణంబున రావణుం బరిమార్చి విజయి యై నన్ను నా కేతనగరంబునకుం గొనిపోయె నేని యమ్మహాత్మున కది యశస్కరం బగు రావణుండు నన్నెట్లు మ్రుచ్చిలించి తెచ్చె నట్లు గ్రమ్మఱ మ్రుచ్చిలించి గొనిపోవుట వీరోత్తముం డైన రామున కర్హంబు గాదు సబలుం డై చనుదెంచి లంకాపురంబు నాకులంబుఁ జేసి నన్నుం గొనిపోయె నేని దాని కది సదృశం బై చను రణశూరుం డగు రామున కట్టివిక్రమం బనురూపం బెట్లగు నట్లుగా బోధింపు మని పలికిన నర్థోపహితంబును బరస్పరసంగతంబును హేతుసంహితంబును బ్రాగనుక్తంబు నగు సీతావాక్యంబు విని గ్రమ్మఱ నే నిట్లంటి. 1525

హనుమంతుఁడు తాను సీతకుఁ జెప్పిన సుగ్రీవబలప్రకారము రామునకుఁ జెప్పుట.

సీ. వైదేహి వినుము సర్వవనాటసేనకు నాథుండు పద్మినీనాథసుతుఁడు
శూరుండు ధీరుండు సుగ్రీవుఁడు కృతప్రయత్నుఁ డై యున్నవాఁ డతఁడు వేగ
ఘోరకీశసహస్రకోటిసమేతుఁ డై వైరివధార్థంబు వచ్చు నతని
కమితసత్త్వులు విక్రమాఢ్యులు చిత్తసంకల్పసంపాతు లనల్పబలులు
తే. వానరు లనేకు లున్నారు వారిలోన, నల్పభుజవీర్యుఁ డొక్కరుం డైన లేఁడు
మహితవిక్రము లెట్టి కర్మములవెంట, నైన నెన్నఁడు భంగంబు లేనివారు.
క. పరమోత్సాహయుతులు పుష్కరచారులు పెక్కుమార్లు సాగరధరణీ
ధరగహనజంతుసంయుత, ధరకుఁ బ్రదక్షిణము సేసి తనరినవారల్. 1527
తే. అచట నున్నవానరవీరు లందఱు నతి, మానబలులు మత్తుల్యులు మద్విశిష్టు
లరయ నాకంటెఁ దక్కువ యైనవాఁడు, వారిలో నొక్కఁడును నిక్కువముగ లేఁడు.
క. అచ్చుపడఁగ నంభోనిధిఁ, జెచ్చెర లంఘించి యేనె చెలువుగ నిటకు
న్వచ్చితిఁ దక్కినవారలు, వచ్చుట కనుమాన మేమి వారిజనేత్రా 1529
క. క్రమమున దౌత్యము సేయఁగ, బ్రమసియు ఘను లైనవారిఁ బంపరు రాజో
త్తములు జఘన్యులఁ బనుతురు, క్షమలో నన్నట్టివానిఁగా గనుఁగొనుమా.
క. చాలు గొని ప్లవగు లందఱు, వాలాయము నొక్కపెట్ట వచ్చెద రిటకున్
జాలింపుము పరితాపము, గీలింపుము చిత్తమందుఁ గేవలముదమున్.
వ. మఱియు నరకంఠీరవు లగు రామలక్ష్మణులు సముదితు లగు చంద్రసూర్యులభంగి వెలుంగుచు మదీయపృష్ఠభాగంబున నధివసించి సముద్రంబు దాఁటివచ్చి లంక

నిశ్శంకంబుగాఁ జొచ్చి దివ్యాస్త్రంబుల బాంధవసహితంబుగా రావణుని రణంబునం బరిమార్చి నిన్నుం దోడ్కొని యయోధ్యకుం జనియెద రని పలికి మఱియు నిట్లంటి. 1532

సీ. అవనిజ ధర్మాత్ముఁ డైనరాముని ధనుష్పాణి యై యున్నలక్ష్మణుని లంక
వాకిళ్ల నరికట్టి వీఁక భ్రష్టాంశంబు పగుల నార్చుచు ఘోరభంగి నాల
[illegible] యుసు [illegible] దంక
రామునిబోలు విక్రమశాలి యన్యుండు లేఁడు సౌమిత్రితోఁ గూడి వహ్ని

ఆ. సహితమైనగాడ్పుచందానఁ గడు విజృంభించి దానవుల వధించి సురల
నాజిఁదోలి తాస్త్రసఁ జమృతంబుచేకొన్నమాడ్కి నిన్నుఁగొనుసముంచితముగ.

ఆ. వనజముఖి నివృత్తవనవాసుఁ డై నిన్నుఁ, గూడి నెమ్మనమునఁ గోర్కు లలర
సమ్మదమున మరల సాకేతపురముఁ బ్రాపించినట్టివిభునిఁ గాంచె దీవు 1534

వ. అని యిట్లు బహుప్రకారంబుల నవ్వైదేహి నాచేత నానావిధశుభవాక్యంబుల నభిప్రసాదితయై శోకంబు విడిచి సమ్మదంబు గీల్కొల్పి నన్ను బహూకరించె నని హనుమంతుండు విన్నవించె నని పలికిన విని రఘుపుంగవుండు సంతుష్టాంతరంగుండై యటమీఁది కథావృత్తాంతంబు వినిపింపుఁ డని యడుగుటయును.

చంపకమాల - పాదగోపనము.—

నిరుపమశూరసత్తమ వనీపకపా విధుగోత్రజోత్తమా
ధరధర దేవ వీతవిమతాపరమోన్నతతేజపావనా
సురవర మానరక్షభనసూక్త గుణాకర వత్సగోకులా
పరమపవిత్ర మాధవ విపన్నజనావనభక్తవత్సలా. 1536

అనులోమవిలోమకందము.—

పావనమానస వసువర, మావన నవసారసనయనాజసుతవిభా
భావితనుజనాయనసర, సావనవమారవసువ సనమానవపా. 1537

ఫణిబంధము-స్రగ్ధరావృత్తము.—

సర్వాధారప్రశస్తా జయనిధిసరస శ్యామలా సత్ప్రభావా
శర్వాబ్జశ్రీమహేంద్ర స్మరనరవరదా నామజత్రాణశ్రీమ
త్సర్వారంభా యనిద్రా జయద సదన సత్సాంద్రవైశద్యసారా
నిర్వాణస్థానగర్వా నిగమగవిశదా నిత్య యధ్యాససర్వా 1538

గద్య. ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమకరందరసాస్వాదనతుందిలేందిందిరాయమాణమానసకులపవిత్ర కౌండిన్యసగోత్ర పద్మనాభసూరిపుత్ర విద్యాసాంద్ర వేంకటకవీంద్రప్రణీతం బైన శ్రీమద్రామాయణం బనుమహాకావ్యంబునందు సముద్రలంఘనంబును మైనాకదర్శనంబును సురసాసంవాదంబును

సింహికానిధనంబు నేకాంతవిచింతనంబును లంకాపురప్రవేశంబును అంతఃపుర పరిశోధనంబును రావణదర్శనంబును బుష్పకవిమానవర్ణనంబు నవరోధదర్శనంబు నాపానభూమిగమనంబును హనుమద్విచింతనంబును నశోకవనికాప్రవేశంబును సీతాదర్శనంబును రావణసమాగమంబును సీతారావణసంవాదంబును త్రిజటాస్వప్నకథనంబును సీతాశోకవిలాపంబును సీతాసంభాషణోపాయ విచింతనంబును ఇక్ష్వాకువంశకీర్తనంబును రామసర్వావయవసంస్థాన కథనంబు నంగుళీయకదానంబును సీతాసంభాషణంబును మణిప్రదానంబును వృక్షభంగంబును రాక్షసీవిద్రవంబును గింకరనిబర్హణంబును జైత్యప్రాసాద భంజనంబును జంబుమాలివధంబును సప్తమంత్రిసుతవధంబును బంచసేనాగ్రపతులనిధనంబును నక్షవధంబు నింద్రజిద్యుద్ధంబును హనుమద్గ్రహణంబును హనుమద్రావణసంవాదంబును లంకాదహనంబును బ్రతిప్లవనంబును మధుహారణంబును రాఘవాశ్వాసనంబును మణినిర్యాతనంబును సీతావృత్తాంతనివేదనంబు ననుకథలు గలసుందరకాండము సమాప్తము.

---

శా. ఈకావ్యప్రతిపాదితుం డయిన సీతేశుండు రామప్రభుం
డీకల్యాణకృతీశ్వరుం డయినశ్రీకృష్ణుండు సంప్రీతితో
సాకల్యంబుగ నిష్టసిద్ధికరు లై చంచత్కృపాపూర్ణతన్
లోకస్తుత్యకుమారయాచధరణీంద్రుం బ్రోతు రెల్లప్పుడున్.

---

శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీ గోపీనాథ

# రామాయణము

## యుద్ధకాండము.

---




వాణీశ్వరశంకర
దేవేంద్రప్రముఖనిఖిలదేవోత్తమసం
సేవితపాదాంబుజ లీ
లావిర్భూతావతార హరి శ్రీకృష్ణా.

శ్రీరాముఁడు హనుమంతునిఁ బొగడుట.

వ. దేవా యవధరింపుము కుశీలవు లగుకుశలవు లవ్వలికథ యిట్లని చదువం దొడం
గిరి త్రేతాయుగున నారఘుసత్తముండు ప్రత్యభిజ్ఞానప్రదానపూర్వకంబుగా హను
మంతునిచేత నభిభాషితం బైనసీతావృత్తాంతంబు విని తదాకర్ణనమండిత
మనస్కుం డై ప్రియశ్రవణోత్తరకాలార్హం బైనవాక్యంబుల ని ట్లనియె. 2

తే. ధరణి దుర్లభ మగుసుహృత్కార్య మెద్ది
యనిలజునిచేతఁ గృత మయ్యె నట్టికార్య
మన్యుఁ డెవ్వాఁడు చిత్తమం దైనఁ గాని
దవిలి చింతింపఁగా లేఁడు తథ్య మరయ. 3

తే. అలసమీరునికం టె నాగారికం టె, నీవనాటోత్తమునికం టె నితరుఁ డొకఁడు
దుస్తరం బైనయిమ్మహాతోయరాశి, నిస్తరింపంగ లేఁ డిది నిక్కువంబు. 4

చ. అతులితసత్త్వుఁ డైనపవనాత్మజుఁ డొక్కఁడు దక్క కైకసీ
సుతపరిపాలనస్ఫురణ శోభిలులంకను జొచ్చి రాక్షస

ప్రతతులచేతిలోఁ బడక గ్రమ్మఱఁ బ్రాణముతోడ నెవ్వఁ డ
ద్భుతగతి రాఁ గలండు క్రతుభుగ్గరుడోరగకోటిలోపలన్. 5

క. బలవీర్యంబులఁ దేజో, విలసద్గమనమున ఘనవివేకంబున న
త్యలఘుగుణంబుల నితనికి, నిలలోపల సాటి సేయ నెవ్వఁడు గలుగున్. 6

వ. మఱియు నీహనుమంతునిచేత సుగ్రీవునకు సముద్రలంఘనలంకాప్రవేశసీతా
దర్శనరూపభృత్యకార్యంబు సమగ్రంబుగాఁగృతం బయ్యెనిట్లుక్తప్రకారంబున
భృత్యకార్యంబు గావించి విక్రమానురూపం బైనయనుక్తవనభంగరాక్షసవధ
లంకాదహనాదికంబును గృతం బయ్యె నని పలికి యారఘువల్లభుండు హను
మంతునియుత్తమభృత్యత్వంబు ప్రకటింపం దలంచి యుత్తమమధ్యమాధమ
భృత్యలక్షణంబు తేటపడ వెండియు నిట్లనియె. 7

చ కడువడి దుష్కరం బయినకార్యమునం బతిచే నియుక్తుఁ డై
తడయక దాని మేలగువిధంబునఁ దీర్చెడుభృత్యుఁ డుత్తముం
డుడుగక చెప్పినంత పని యొప్పుగఁ దీర్చెడువాఁడు మధ్యముం
డడలునఁ దీర్పలేనిఘనుఁ డైననుగుం డధముం డనంబడున్. 8

తే. ఇతఁడు నాచెప్పినంత నే ర్పెసఁగ దీర్చి
దాని కధికోదయం బగుదానిఁ జేసెఁ
దలఁప నందియు మేమి యుత్తముఁ డగుటకు
భర్తృభక్తియుఁ దేజంబు పాటి కెక్క. 9

వ. అని పలికి సుగ్రీవు నవలోకించి. 10

క. జానకిసందర్శనమున, జానుగ భరతుండు నేను సౌమిత్రియుఁ బ్ర
జ్ఞానిధి శత్రుఘ్నుండును, మానుగ బ్రతికితిమి గాదె మారుతికరుణన్. 11

చ. ముదము దలిర్ప నిట్టిప్రియముం దగఁ జెప్పినయీగుణాబ్ధికి
న్నదృశము గాఁగ సత్ప్రియము సల్పుట కేమియుఁ గానఁ బ్రీతితో
నిదె గొను మింతకంటెఁ బ్రియ మిప్పటి కెద్దియు లే దటంచు నే
నదమలబుద్ధి నిచ్చెద విశాలభుజాపరిరంభణం బొగిన్. 12

రాముఁడు సముద్రతరణమునుగుఱించి చింతించుట

వ. అని పల్కి యక్కకుత్స్థతిలకుండు సకలలోకరక్షాకరంబులును నాశ్రితజన
శ్రీకరంబులును మునిజనవశీకరంబులును రిపులోకభీకరంబులు నగుకరంబులు
సాఁచి ప్రీతిపులకితగాత్రుం డై కృతకార్యుం డై చనుదెంచినపవననందనుని
గాఢంబుగాఁ బరిరంభించి సుగ్రీవుండు విను చుండ వెండియు నతని వీక్షించి
సర్వవానరవాహినీసహితుండ నై యే నెట్లు జలనిధిం గడతునని చింతించి
యిట్లనియె. 13

సీ. కపివర్య జానకిఁ గాంచి వచ్చుటఁ జేసి మదికి నత్యంతసమ్మదము గల్గె
నైనను దుష్పార మగుమహోదధి నెట్లు దాఁటి తద్దక్షిణతటముఁ జేరు
టెట్లొకో కపులంచు నించుక మనమునఁ గ్రమ్మఱ శోకంబు గ్రమ్మకొనియెఁ
గపులయంబుధిపారగమనమం దుత్తర మెద్ది మహీజ తానేమి పలికెఁ
తే. జెప్పు మని పల్కి మోహంబు గప్పికొనఁగ
శత్రుసూదనుఁ డగురామచంద్రుఁ డపుడు
వదన మటు వాంచి దైన్యంబు గదుర నూర
కున్న నన్నరపతిశోకముడుపఁ దలఁచి. 14

సుగ్రీవుఁడు రాముని కుత్సాహము కలుగఁ జేయుట.

వ. సత్త్వసంపన్నుం డగుసుగ్రీవుం డుద్గ్రీవుం డై యి ట్లనియె. 15

చ. మనుకులసార్వభౌమ రిపుమర్దనశాలివి నేర్పు పెంపున
న్మనుజనుతప్రతాపమహిమం గడు మేటివి వీర్యసంపద
న్ఘనుఁడవు నీవు ప్రాకృతునికై వడి నేల తపించె దిట్లు చ
య్యనఁ బరితాపము న్విడువు మయ్య కృతఘ్నుఁడు నెయ్యము న్బలెన్. 16

తే. జనకసుత సేమమున నున్న దనెడువార్త
వినఁబడియె రావణుం డున్నవిధము దెలిసె
విను మిది ప్రమోదకాల మై తనరుఁగాని
లక్ష్మణాగ్రజ దుఃఖకాలంబు గాదు. 17

వ. మహాత్మా నీ వాగామిగోచరార్థజ్ఞుండ వూహాపోహకుశలుండవు పరిచ్ఛేత్త వస్తు
తత్త్వజ్ఞుండవు జ్ఞాతాత్మస్వరూపుం డైనయోగి యపవర్గదూషణి యైనబుద్ధిం
బోలెఁ బ్రయోజనహానికరియు నశుభాత్మికయు నైనయీబుద్ధి నవలంబించి
పుచ్చుము. 18

తే. అనఘచారిత్ర శోకపర్యాకులుండు
దీనుఁ డుత్సాహహీనుఁడు నైనవాని
యఖిలకార్యంబులు నశించు ననఁగ శుభము
లంద వన నాపదలు పొందు ననఁగ వినమె. 19

చ. మఱవక చూడు నాకుఁ గలమర్కటవీరులు వీరె వీర లిం
దఱును సమర్థు లిందఱు నుదగ్రబలు ల్భవదర్థమందు ని
ష్ఠురగతి వహ్నిలో నయినఁ జొచ్చెద మంచుఁ దలంచి యున్నవా
రరయఁగ వీరిఁ గన్గొనిన నాజి నవశ్యము గెల్పు దోఁచెడున్. 20

శా. ఘోరగ్రాహకుళీరమీనకమఠక్రూరోరగం బైనపా
థోరాశిం దరియించి విక్రమసముద్యోగంబున న్లంక నే
పార న్లగ్గలు పట్టి పంక్తిముఖు నుగ్రాజి న్వడిం ద్రుంచి సొం
పార న్జానకిఁ దెచ్చి యిచ్చెదము దేవా చింత నీ కేటికిన్. 21

వ. ఈ వలవనివిచారంబు విడిచి పాపకర్ముం డగురావణునివధప్రకారం బూహించి సేతుబంధనవిధానంబున సముద్రంబు దాఁటునట్లుగా సముచితప్రయత్నంబు గావించి లంకాపురప్రాంతకాంతారంబు ప్రవేశించునట్లుగా సంఘటింపుమని పలికి వెండియు నిట్లనియె. 22

చ. అరిమథనా యగాధ మగునవ్వరుణాలయమందు సేతువు
న్గురుమతిఁ గట్టినంతనె త్రికూటనగస్థిత యైనలంక సొం
పఱినది గాదె లంక చెడినప్పుడె నీరిపుండు పంచతన్
వఱిసినవాఁడు గాఁడె ఘనతావకదివ్యశరాభిసంహతిన్. 23

తే. అంబునిధియందు సేతు వింపారఁ గట్టి
మొనసి లంకాపురముచుట్టు ముట్టు టది యె
తడవు గాని మహీవరోత్తంస పంక్తి
వదనుఁ జచ్చినవానిఁగా మదిఁ దలంపు. 24

తే. ఆర్యజనులు శోకంబు శౌర్యాపకర్ష
ణం బనుచుఁ బల్కుటది నిక్కువంబు గానఁ
గార్యనాశిని యైనయీకలుషబుద్ధి
వీరసత్తమ దగ దయ్య విడువు మిపుడు. 25

తే. అనఘచారిత్ర శౌండీర్య మాశ్రయించి
యొప్పు దప్పక కార్యంబుఁ జొప్పు నడపు
నట్టివాఁ డెట్టివిషమమునం దైనఁ జెడక
ప్రబలుఁ డై మించి యిష్టార్థభాగి యగును. 26

క. అనఘ మహాత్ములు విక్రమ, ఘను లగుమిముబోఁటివారు కడుశోకము గై
కొన రెంత కష్టమందై, నను నది సర్వార్థనాశనం బను తెల్విన్. 27

తే. బుద్ధిమంతులలో నుత్తముఁడవు నీవు
సర్వశాస్త్రార్థతత్త్వవిశారదుఁడవు
విక్లబం బైనచిత్తంబు విడిచి పగఱ
నణఁపఁ బూనుము మత్సహాయత్వ మొంది 28

తే. పార్థివోత్తమ శరధనుష్పాణి వైన, నీకు నెదిరించి రణమున నిల్వ నోపి
నట్టివీరుఁడు భువనత్రయంబునందు, నరసి చూచిన లేఁ డొక్కఁ డైనఁ గాని. 29

వ. దేవా నిరుద్యోగు లగుక్షత్రియులు మందభాగ్యు లగుదురు సర్వజనంబులు నతి క్రోధశీలునకుఁ దలంకుదురు గావున నీవు శోకంబు విడిచి క్రోధం బవలంబింపుమని పలికి వెండియు నిట్లనియె. 30

తే. వృక్షచరసేనచేఁ బరివృతుఁడ వైన, నీకు దుర్లభ మెద్ది లే దో కకుత్స్థ
వంశభూషణ జలధి దుర్వారభంగి, దాఁటి జానకి నీక్షించెదవు నిజంబు. 31

సీ. భూపవరేణ్య నదీపతి యగుసముద్రుని దాఁటుటకు సూక్ష్మబుద్ధిచేత
నస్మదాదులఁ గూడి యాలోచనము సేయు మట్లైన నీకపు లధికబలులు
కామరూపులు శిలాకాండపాదపవృష్టి నరుల నిర్జించెద రాజిలోనఁ
బగతునివాస మెప్పాటఁ గన్పట్టునో యని యున్నవార మయ్యనువు మాకు
తే. దొరకొనియె నేని రిపుఁడు సంగరమునందుఁ
జచ్చుటకు లేద యొక్కింత సందియంబు
చిత్త మిగురొత్తఁ గంటె నిమిత్తములను
వేయి యేటికి నిక్కంబు విజయ మొదవు. 32

వ. కావున నీవు శోకంబు నక్కి విజయమూలం బైనక్రోధం బవలంబింపు మని పలి
కినఁ బరమార్థవిదుం డగురాముండు హేతుమంతంబు లైనసుగ్రీవునిపలుకులు
ప్రతిగ్రహించి హనుమంతు నవలోకించి కపీంద్రా తపోబలవిశేషంబున నైన సేతు
బంధంబు గావించి యైన శరంబుల శోషింపఁ జేసి యైన నెత్తెఱంగున నైన సము
ద్రలంఘనంబునందు సమర్థుండ నైతి నది యట్లుండనిమ్ము పరుల కగమ్యం బైన
లంకాపురప్రాకారం బెట్టిది యంబుజలగిరివనస్థలాత్మకంబు లైనదుర్గంబులును
బలపరిమాణంబును ద్వారంబులయందుఁ గీలఖనపరిఘయంత్రవిశేషకరణా
దికదుర్గక్రియయును బ్రాకారాట్టాలకాదినిర్మాణంబును గృహరచనావిశేషం
బులును మఱియునుం గలమహిమ లెల్ల వినం గుతూహలం బగుచున్నది నీవు
ప్రత్యక్షంబుగాఁ జూచి వచ్చి నంతయు విస్రబ్ధంబుగా నెఱింగింపుము. 33

హనుమంతుఁడు రామునకు లంకాపురసన్నివేశం బెఱింగించుట.

క. నా విని హనుమంతుఁడు రఘు, భూవల్లభుతోడ వాగ్విభూతి దలిర్పన్
రావణభుజపాలితలం, కావిభవస్ఫురణ దెలియఁగా ని ట్లనియెన్. 34

చ. దనుజవరేణ్యుచండమును దత్పృథుతేజము నాశ్రయించి దై
త్యనివర మున్నభంగియు బలౌఘవిభాగము దుర్గకౌశలం
బును మఱి గుప్తికర్మమును బోల్పుగ ద్వారవిశేషవైఖరి
న్జనుత చిత్తగింపు మిఁక సర్వము నేర్పడ విన్నవించెదన్. 35

చ. తొలుత శతాంగవేగమునఁ దోఁచినధూళి మదేభవారిదో
చ్ఛలితసుగంధిసాంద్రమదధారలచేఁ దడియం దురంగము
ల్దళముగఁ బర్వ చిత్రగతుల న్నటియింపఁ బదాతు లెల్లెడం
గలసి చరింప నప్పురము గ్రాలు సురాసురదుష్ప్రధర్ష మై. 36

వ. మఱియును. 37

చ. అచల కభేద్య మై తనరు నంబుధిదక్షిణతీరమందు సు
స్థిరముగ నాత్రికూటగిరిశృంగముమీఁద విచిత్రశిల్పవి
స్ఫురణ దలిర్ప దానిఁ గడుఁ బుణ్యచరిత్రుఁడు విశ్వకర్మ ము
ద్గరిమ సృజించె దేవపురికంటె విశేషము గల్గునట్లుగన్. 38

చ. సురుచిరభంగి నప్పురముచుట్టును మౌక్తికనీలవజ్రసం
దరుచిఁ బొల్చు హేమవరణంబులపై నలరు న్సమాగత
స్ఫురదరిసైనికాళిఁ బొరివోవఁగఁ జేయు నరాతినేత్రభీ
కరదివిషన్మతిభ్రమణకారిమహోపలబాణయంత్రముల్. 39

ఆ. జలధికంటె లోఁతు గలిగి సుశీతల, జలము లుల్లసిల్ల నమదమకర
మీనకచ్ఛపములు మెఱయు నగడ్తలు, ఘోరభంగి నలరుఁ గోటచుట్టు. 40

క. విలసితబద్ధకవాటో, జ్జ్వలితము లై ఘోరపరిఘసంతము లై య
ప్పలలాశనునగరంబునఁ, గలుగు ద్వారములు నాల్గు కడుఁ బొడవగుచున్. 41

వ. అమ్మహాద్వారప్రదేశంబులయందు భారశిలామోచనయంత్రంబులును సజ్జీకృత
కాలాయసమయచతుర్వితస్తిప్రమాణముద్గరవిశేషంబులును బహుసాహస్రం
బులు రక్షోగణరచితంబు లై భీమప్రకారంబునం బొలిచియుండు నమ్మహాద్వారం
బులయందుఁ బరిఖోపరిసంచరణార్థంబు మంచరూపంబున నిబద్ధంబు లైనమార్గ
విశేషంబులు మహోన్నతంబు లై మహాగృహాయంత్రోపేతంబులై విశాలం
బు లై దీర్ఘంబు లై పగతు లెత్తి వచ్చినప్పు డప్పురసైన్యంబుల స్వనిష్ఠయంత్రం
బులచేత నివారించుచుఁ బురంబు రక్షించుచుండు నిం దొక్కసంక్రమంబు
దృఢంబును విశాలంబును బలవంతంబును మహోన్నతంబును నకంప్యంబును
ననేకకాంచనస్తంభనిక్షిప్తంబును విశాలవితర్దికాశోభితంబు నై యుండు జాగ
రూకుండును బ్రమాదరహితుండు నై రావణుం డెప్పు డేనియు యుయుత్సుం
డగునప్పు డాసంక్రమంబునందుఁ బరసేనాదర్శనార్థంబు నివసించియుండు నప్పు
రంబు మఱియు నతిశ్లక్ష్ణసముత్తుంగత్రికూటశిఖరంబునందుఁ గ్రాలుటవలననారో
హణాలంబనరహితంబై దేవతలకైన నగమ్యంబై దూరస్థితపరతీరంబై ననము
ద్రపారంబున నుండుటవలన నౌసంచారమార్గం బైన లేకుండుటం జేసి సర్వది
గ్వార్తాసంచారరహితంబై నాదేయపార్వతవాన్యకృత్రిమాత్మకచతుర్విధదుర్గసం
రక్షితం బై యుండు నిత్తెఱంగున నగాధంబు లైనపరిఖాచయంబులును వివి
ధంబు లైనయంత్రంబులును లంకాపురినల్గడలబలసి ప్రకాశింపం జేయుచుండు
నప్పురంబు నిరంతరవీరరాక్షసకోలాహలసంకులంబై యెవ్వరికిం దేఱిచూడరాక
నిరాలంబం బగువాయుమార్గంబునం దేజరిల్లు చుండు మఱియు. 42

చ. పరశుగదాసికుంతములు ప్రాసపరశ్వథముద్గరంబులుం
గరములఁ బూన్చి బిట్టలుకఁ గాటుకకొండలలీలఁ గ్రాలుచు
న్సురవరయక్షకిన్నరులు చూచి మనంబునఁ దల్లడిల్లఁగా
వెరవునఁ గాతురొక్క పదివేవురుదైత్యులు తూర్పువాకిటన్. 43

మ. దయ మార న్దివిమత్కటంబముల సంగ్రామంబులం దోలి ము
న్నఁటుముం గొన్నజితారులు న్వికటనాక్షప్రేక్షణు ల్ఘోరకా

యయుతు ల్దానవు లొక్కలక్షచతురంగానీకము ల్గొల్వ న
క్షయులై పాయక గాచి యుందు రలలంకాదక్షిణద్వారమున్. 44

క. బలుకైదువులు కరంబుల, నలర ఖడ్గాగ్రయోధు లగుదానవయో
ధులు వేయివేలు గాతురు, సులయుచుఁ దన్నగరపశ్చిమద్వారమునన్. 45

ఆ. మఱియు రావణుండు మన్నించువారు రి,థాతిరథులు దారుణాస్త్రకుశలు
లగునిశాటు లొక్కయర్బుదసంఖ్యలు, గాతు రుత్తరంపుగవనియందు. 46

వ. మఱియు ననేకశతసహస్రసంఖ్యాతు లగుయాతుధానయోధులు పెక్కండ్రు
పదాతులు సేవింప నప్రమత్తులై మధ్యమగుల్మంబు రక్షించుచుండుదు రి
ట్లసంఖ్యబలసంరక్షితం బైనలంకాపురంబున కధ్యక్షుం డై రాక్షసవల్లభుం
డగురావణుండు సహస్రాక్షుని సైన లెక్కింపక యుక్కుఁజంపుగుసంబునఁ గయ్యం
బునకుం గాలు ద్రవ్వి యుండు సహాయసంపన్నుండు గానివాఁ డప్పురంబు
ప్రవేశింపం జాలఁ డట్టిలంకాపురం బే నొక్కవెరువునఁ బ్రవేశించి సర్వంబునుం
బరిశోధించి సీత నవలోకించి భవత్కుశలంబు దెల్పి క్రమ్మఱ ననుజ్ఞ వడసి. 47

మ. వరణంబు ల్పడఁ ద్రోచి ఖేయము ల్విధ్వంసంబు నొందించి భా
సురసౌధంబులఁ గూల్చి వేరు గలరక్షోవీరులం ద్రుంచి దు
ష్కరదైతేయబలంబులోన నొకభాగం బుద్ధతిం జంపి క్ర
మ్మఱఁ బాథోనిధి దాఁటి మీకడకు సమ్యగ్భక్తి నేతెంచితిన్. 48

తే. శరధి లంఘించుటకు నరిపురముఁ జొచ్చుట
కలఘుమతి యత్న మొనరింపవలయుఁ గాని
పగతుఁ బరిమార్చు టన నెంతపని మహాత్మ
దేఱి చూచినయంత నె దీఱిపోఁడె. 49

ఉ. ఏమి గొఱంత నీకు బల మీద్వివిదుండును మైందుఁడుం గపి
గ్రామణి యంగదుండు రిపుకాలుఁడు నీలుఁడు జాంబవన్నలు
ల్భీమజవంబుతోఁ జని లలిన్ గిరి సాలయుతంబుగా బల
శ్రీమహిమన్ బెకల్చి యొకవ్రేల్మిడి లంకను దెత్తు రుద్ధతిన్. 50

ఆ. చింత యేల నీకు క్షితినాథ సుముహూర్త
మందు శీఘ్రముగ దశాస్యుమీఁది
కెత్తిపోవుటకు నహీనబలంబుల
కానతిమ్ము యుక్త మగువిధమున. 51

—రాముఁడు సుగ్రీవునకు యుద్ధయాత్రకుఁ దగినకాలము నిరూపించి చెప్పుట.—

క. అని హనుమంతుఁడు వినయంబునఁ బల్కిన విని నరేంద్రపుంగవుఁడు ముదం
బున నిననంపనువదనముఁ గనుఁగొని యిట్లనియె విజయకౌతూహలి యై. 52

చ. అనిలసుతుండు లంకవిధమంతయు నేర్పడఁ జెప్ప వింటి న
త్యనుపమశక్తి వైరి రయమార వధించెద నిక్క మింతయు

స్తనకజ దుష్టరాక్షసనిశంగతి యై మనరాక వార్చి తాఁ
దనువునఁ బ్రాణ మొక్కగతిఁ దాలిచి యున్నది దుర్భరంబుగన్. 53

ఉ. కావున నిచ్చటం దడయఁ గార్యము గాదు కపీంద్ర యిప్పుడే
పోవలె లంకమీఁదికి నభోమణి యంబరమధ్యమందు ను
శ్రీ వెలయ న్వెలింగెడుఁ బ్రసిద్ధముగా మును పెద్ద లిత్తఱిం
బోవఁగ వారికి న్విజయము న్సమకూఱు నటంచుఁ జెప్పరే. 54

వ. మఱియు నిమ్ముహూర్తంబున మనము దండయాత్రఁ గావించితిమేని రావణుండు జానకి నెత్తుకొని యెందుచోటికిం బోవ నేరఁ డట్లు గానేని వాని నవశ్యంబు వధించెద మనదండయాత్రోద్యోగంబు విని జానకి జీవితంబునం దాశ నిడుకొని విషరోగాతురుం డైనపురుషుం డమృతంబు గ్రోలిన తెఱంగున నుండు మఱియు నిక్కాలం బభిజిత్తన నమృతసిద్ధయోగం బనం బరఁగు నదియునుం గాక నేఁ డుత్తరఫల్గునీనక్షత్రం బెల్లి శశాంకుండు హస్తావలంబనంబున నొప్పెడుఁ బునర్వసునక్షత్రజాతుండ నైన నా కుత్తరఫల్గునీనక్షత్రంబు సాధనతార గావున నిక్కాలంబు ప్రయాణంబునకు యుక్తకాలంబు మఱియు సౌమ్యంబు లగుశుభనిమిత్తంబు లనేకంబులు దోఁచుచున్నయవి దక్షిణనయనోరుభుజంబులు స్ఫురించుచున్నయవి మనంబు సముత్సాహోపేతం బై పొదలుచు విజయలక్షణంబు సూచించెడుఁ గావున రావణు నవశ్యంబు పరిమార్చి సీతం దెత్తు నిప్పుడు సర్వానీకసమన్వితంబుగాఁ బ్రయాణంబు సేయుద మనిన నయ్యనిలనందనుండును లక్ష్మణుండును బరమోత్సాహులై యత్తెఱంగున కియ్యకొనిరి రామభద్రుండు వెండియు వారల నవలోకించి. 55

సీ. రుచిరంబు లగుఫలప్రచయంబులును దేనియలు కందమూలము లలిగి స్వాదు
సలిలపూరితజలాశయములు శోభిల్లి కంటకంబులు శిలల్కర్దమంబు
పల్లంబు మిట్టును బల్లెలు పట్టణంబులు నాశ్రమంబులు గలుగకుండ
వనదుర్గములయందుఁ జనువేళ దానవబాధలచేఁ జిక్కుపడక యుండు

తే. నట్టిసుపథంబు నరయుచు నద్రిచరులు, ఘోరవిక్రము లొకలక్షగోలువస్సై న్య
తతికి ముంగలి యై చమూపతి రక్షైక, శీలి నీలుండు చనునట్లు సేయు మీవుడు. 56

రాముఁడు నీలునికి సేనాసన్నివేశప్రకారం బాజ్ఞాపించుట.

వ. అని పలికి యవ్వానరశేఖరు రావించి బలంబుల నముచితప్రకారంబుల నడిపింపను యుక్తప్రదేశంబున విడియింపను విడిచినచోట్ల దప్పిం బడకుండ రాక్షసకృత్యంబులకుం జిక్కకుండ నరసి రక్షింపను వెరువు గల్గి కతిపతియబలంబులం గూడుకొని సేనాముఖంబున నప్రమాదుండవై చనుము. 57

క. క్రూరాత్ము లైన దనుజులు, వారక ఫలకందమూలవనములయందు
న్దారుణవిష మిడుదురు నీ, వారసి రక్షింప వలయు నాత్మబలములన్. 58

తే. మఱియు యామినీచరులు నిమ్నంబు లైన
గహనములయందు బర్వతగుహలయందు
నొదిఁగి బలముల నలయఁబెట్టుదురు దానిఁ
గనుఁగొని చనంగ వలయు మార్గంబునందు. 59

తే. అసురులకు మన కతిఘోర మైనయుద్ధ
మది గలుగు బాహుబలసాధ్య మట్లు గాన
వానరులలోన దుర్బలు లైనవారి
నేర్పరించి కిష్కింధకుఁ జేర్పు మిపుడు. 60

వ. మఱియు గిరిసంకాశుం డగుగజుండును మహాబలుం డగుగవాక్షుండును సత్త్వ
సంపన్నుం డగుగవయుండును నీకు శాసకులై యాఁగదుపులముంగలం జను
దృప్తవృషభంబులచాడ్పున సాగరంబుంబోలె ఘూర్ణిలుచున్న వానరవాహిని
పురోభాగంబునం జనియెదరు మఱియు మారుతతుల్యవేగుం డగువృషభుం
డనువానరశ్రేష్ఠుండు సేనకు దక్షిణపార్శ్వంబును గంధహస్తియుంబోలె దుర్ధ
ర్షుండైనగంధమాదనుండు సవ్యపార్శ్వంబు నధిష్ఠించి రక్షించుకొనుచుం జను
దెంచెద రేను హనుమంతునియంసభాగము నారోహించి యైరావతగజారూ
ఢుం డైనదేవేంద్రు ననుకరించుచు బలంబులకుఁ గన్నులపండువుగా సేనామ
ధ్యంబునఁ జనుదెంచెదనంతకోపముం డగులక్ష్మణుండు సార్వభౌమనాగారూఢుం
డైనకుబేరుండుంబోలె నంగదు నారోహించి నాపిఱుందదెస నరుదెంచెడుఋక్ష
పుంగవుం డగుజాంబవంతుండును మహాసత్త్వుం డగు వేగదర్శియు సుషేణుం
డును నీమువ్వురు వనాటవాహినీకుక్షిప్రదేశంబురక్షించుచుంజనుదెంచెద రని
యిత్తెఱంగున నిర్దేశించినఁ దత్సమీపవర్తి యగుసుగ్రీవుండురామునివచనంబు
విని యట్ల సేయుం డని మహావీరు లగుయూథపుల కందఱ కాజ్ఞాపించినఁ
దత్క్షణంబ. 61

చ. అరుదుగ శైలసానువులయందును గహ్వరములందు వృక్షకో
టరములయందు నిర్ఝరతటంబులయందు వసించి యున్నభీ
కరహరియూథపు ల్సమరకౌతుకతన్ నిజసైన్యయుక్తు లై
గురుమతి రామసన్నిధిని గుంపులు గట్టి రనేకభంగులన్. 62

—శ్రీరాముఁడు వానరసేనాసమేతుఁడై దండువెడలుట.—

తే. ఇట్లు గూడినబలము లనేకకోటు, లర్బుదంబులు తనుఁ గొల్వ నర్కతనయ
లక్ష్మణోపేతుఁడై జయలక్షణాన్వితుండు రాముండు శుభవేళ దండు వెడలె.

వ. అప్పుడు నీలాంజనచయోపమంబులగుభల్లూకబలంబులును మదోద్దండవేదండ
కాండంబులలీలం గ్రాలుగోలాంగూలబలంబులును గాంచనాచలసంకాశంబు
లగువానరబలంబులును సుగ్రీవునిశాసనంబు శిరంబునం బూని లెక్కకు వెక్క
సం బై యుక్కుమిగిలి యక్కజంపుఁ గయ్యంపుమక్కువ మొగంబులం జెక్కు

లొత్తఁ జంద్రోదయ సమయసముద్ఘూర్ణమానమహార్ణవంబునుం గ్రేడిసేయుచు
ప్రావృట్కాలబలాహకంబులకరణిఁ గర్జించుచు పింగంపుఁగొనమలభంగి నుప్పొం
గి నింగికి దాఁటుచు వృక్షశాఖాగ్రాలంబులమాడ్కి నాగ్రహించుచు మదవార
ణంబులపోలిక మాఱుమసలుచు గరుడునిమాడ్కి దూరంబున నెగయుచు
సుగంధిమధువులు గ్రోలుచు రుచిరంబు లగుఫలమూలంబులు నమలి సొక్కుచు
మంజరీపుంజరంజితంబు లగువృక్షంబు లంసభాగంబుల నలవరించుచు గరుడా
నిలతుల్యవేగంబున గిరిశృంగంబులనిరాఁ దికుఱుకుచు సకలరాక్షససహితంబుగా
దశగ్రీవుని నేమొ మర్దించెద నని రామునిసమ్ముఖంబునఁ బంతంబులాడుచు రాఘ
వార్థంబునందు సమారోపితవిక్రము లై యొండొరులకు హర్షవీర్యబలోద్రే
కంబులుచూపుచు యోజనోత్సేకజం బగు దర్పంబేర్పడ విహరించుచు మహేం
ద్రధ్వజసన్నిభంబు లగుపుచ్ఛంబు లంబరంబునం ద్రిప్పుచు నాస్ఫోటితారా
వంబుల దిశాకుక్ష్యంబులు ప్రక్కలించుచు భుజావిక్షేపణంబున శైలద్రుమంబులు
భంజించుచు నూరువేగంబున లతావితానంబులం ద్రుంచుచుఁ బదాఘాతంబున
గండశిలాఫలకంబు లెల్ల నుగ్గునూచంబు సేయుచు శైలశిఖరంబులుత్పాటించి
కందుకక్రీడ లాడుచుఁ బరస్పరాలింగనంబుల నితరేతరస్కంధాధిరోహణం
బుల నన్యోన్యసంఘట్టనంబులఁ గాపేయజాతిచేష్టావిశేషంబులు నెఱపుచు
వెల్లివిరిసినమహాసముద్రంబుపోలిక ననివార్యం బై యనంతం బై యప్రమేయం
బై యవ్వానరసైన్యంబు సమస్తంబు లగునదీప్రవాహంబులును విమలోదకంబు
లగుసరోవరంబులును ద్రుమాకీర్ణంబు లగుపర్వతంబులును సమంబు లగుభూమి
ప్రదేశంబులును నిండి మెండుకొని ప్రచండంబు లగువిక్రమాటోపంబుల
బహుయోజనంబులనిడుపును నిడుపునకుం దగినవెడల్పునుం గలిగి మేఘజా
లంబు లంబరంబు నాచ్ఛాదించినతెఱంగున నీరంధ్రంబుగాఁ బుడమి నాచ్ఛా
దించి రామునిపిఱుందదెస జయజయధ్వనులతోడ దక్షిణాభిముఖంబుగాఁ గదలి
నడిచె నప్పుడు తదీయచరణవిఘట్టనంబునం బుట్టినమహీపరాగపటలంబు గలయ
బెరసి యవక్రగతి లోకంబు నాక్రమించి యంధకారారాతిం గప్పి దిశాము
ఖంబులకుఁ గ్రొత్తచీఁకటులు సంపాదించె నంబరచరభూతవ్రాతంబు లంధుల
భంగి నుడివడి రాసమయంబున. 64

శా. వీరోత్తంసుఁడు నీలుఁడుం గుముదుఁడు న్విఖ్యాతశైలోపమా
కారుం డా వృషభుండు మువ్వురును సంగ్రామైకదక్షత్వ మే
పార న్వానరకోటి గొల్వఁగ సముత్కృత్ప్రీతిమైఁ ద్రోవచూ
ప్పాహాఢిం దిలకించుచుం జనిరి శౌర్యాటోపు లై ముందటన్. 65

చ. అరిజయకీర్తిసాంద్రు లగు నారవినందనరామలక్ష్మణు
ల్గిరినిభఘోరకాయు లగుకీశు లనేకులు తమ్ముఁ గొల్వఁగా
హరిబలమధ్యదేశమున నద్భుతవైఖరి నేగి రవ్వడు

ర్భరపవనప్రియాబ్జవనబాంధవచంద్రసమానతేజులై. 66

చ. అతులభుజాబలంబున సమంచితవిక్రమసంపద న్నము
ద్ధతపటుధీరతం గపికదంబము తా నొకరుండె ప్రోవఁగాఁ
జతురత నొప్పి కీశులు వెస న్బదికోటులు గొల్వ నీకఁ డా
శతవలి యేగె సైన్యములచక్కటి నొక్కట దుర్నివారుఁడై. 67

క. పనసుఁడు గజుఁడును గేసరి, యును గపులోకనాథుకోటు లొగి సేవింప
న్ఘనసేనకు నిరుగెలఁకుల, న్బనుప్రాపై ప్రోచుచుం జనిరి సమదగతిన్. 68

శా. భల్లూకంబు లసంఖ్యము ల్గొలువ దర్పస్ఫూర్తి శోభిల్ల జ
నోల్లాసంబును బల్లవింప మనుజేంద్రోత్తంస మీక్షించి రా
గిల్ల న్వెన్కఁ డెస న్సుషేణుఁ డటఁ గుక్షిస్థాంబవంతుండు హృ
త్సల్లాపంబులు సేయుచుం జనిరి యుత్సాహంబు దీపింపఁగన్. 69

ఆ. అష్టదిక్కులందు నవనికిఁ గాపున్న, కరులమాడ్కి రంభ గవయవినత
దధిముఖప్రజంఘతారవలీముఖ, ఋషభను లరసి యుగచరబలములకు. 70

క. కలదెస లెనిమిదియును దో,ర్బలమున రక్షించుకొనుచు రభసోద్రేకం
బలరారఁగ నరిగిరి త, ద్బలములు నడి నడుచునట్టి పలుకు సెలంగన్. 71

క. అక్కడ సేనాముఖమున, నిక్కడ సర్వస్థలముల నెల్లకపులకు
న్దిక్కై ప్రోచుచు నీలుం, డెక్కడికిం దాన యగుచు నేగెం బెలుచన్. 72

క. బలదర్పరుదావేశో, జ్జ్వలితద్యుతు లైనవీరవానరకోలా
హలదారుణనిర్ఘోషము, జలనిధినిర్ఘోషణంబు చందము నొందెన్. 73

వ. ఇత్తెఱంగున నవ్వానరసైన్యంబు సొంపు దప్పక భీమకోపుం డగురామునిశా
సనం బెఱింగి సంఫుల్లపద్మోత్పలకైరవషండమండితంబు లైనసరోవరంబులును
హంసకారండవసేవితంబు లగుతటాకంబులును నానావిధజనసంకులంబు లైన
పురంబులును రమ్యంబు లగుజనపదంబులును స్వాహాస్వధావషట్కారాది
మంత్రఘోషసన్నాదితంబు లైనతాపసాశ్రమంబులును వర్జించి సుందరగమ
నంబునం బోవుచుండఁ దన్మధ్యభాగంబున నారఘుపుంగవులు కపిశ్రేష్ఠులచేత
నుహ్యమాను లై మహోగ్రహసంస్పృష్టు లగుచంద్రసూర్యులచందంబునం
దేజరిల్లుచుఁ జనునప్పు డంగదగతుం డగులక్ష్మణుండు స్మృతిమంతుండును బ్రతి
పూర్ణార్థుండును దత్కాలోచితవిశేషజ్ఞుండును నై హనుమద్గతుం డగురామ
భద్రు నవలోకించి యిట్లనియె. 74

లక్ష్మణుఁడు రామునికి శుభనిమిత్తంబులఁ జూపుట.

సీ. భూనాథ దివియందు భువియందు మనకు మంగళనిమిత్తము లనేకములు దోఁచె
మృదుహితుఁడై శుభప్రదుఁడై సమీరుఁడు విజయానుకూలుఁడై వీవఁ దొడఁగెఁ
బూర్ణవల్గుస్వరస్ఫురితంబు లై మృగద్విజములు పలికెడు దిశలు విమల
కాంతి నొప్పెడు రవి కవులు తేజస్ఫూర్తిఁ గ్రాలెడుఁ దారకాగ్రహగణంబు

తే. సంభృతానంద మగుఋషిస్తకంబు
ధ్రువుని వలగొని సంతతాస్తోకవిమల
తేజమున నొప్పెడి వనాటరాజియందుఁ
దోఁచెడు నరాతిభీషణద్యుతి మహాత్మ. 75

వ. మఱియు నధీతసర్వవేదుం డగుటంజేసి శుద్ధుం డైనభార్గవుండు ప్రసన్నార్చి స్సై మనపిఱుంద దెస వెలుంగుచున్నవాఁడు పితృయానమార్గస్థు లైనలోకాభివృద్ధికాము లగుమహర్షులు ప్రసన్ను లై యున్నవా రదియునుం గాక రాజర్షిశేఖరుం డగుత్రిశంకుండు విశ్వామిత్రసృష్టసప్తర్షిమండలస్థవసిష్ఠసహితుం డై వెలుంగుచున్నవాఁ డిక్ష్వాకుకులంబునం బుట్టినమున కమ్మహాత్ముండు పితామహశ్రేష్ఠుండు మఱియు నింద్రాగ్నిదేవతాకం బైనవిశాఖానక్షత్రంబు నిరుపద్రవం బై విమలకాంతిం బ్రకాశించుచుండ మహాత్ము లగునిక్ష్వాకులకు విజయంబు గలుగు నని లోకపితామహుం డైనవిరించివరంబు గలుగుటం జేసి యయ్యుదుశ్రేష్ఠం బిప్పు డప్పాటి వెలుంగుచున్నయది నిర్ఋతిదేవతాకం బైనమూలానక్షత్రంబు సమీపగతం బైనయుత్పాతగ్రహంబుచేత సంస్పృష్టం బై తపింపఁ జేయఁబడుచున్నది యంతకాలంబు సంప్రాప్తం బగుచుండ మృత్యుగృహీతు లైనవారినక్షత్రంబు ధూమకేతుగ్రహాసంతప్తం బై యుండుఁ గావున నైరృతినక్షత్రపీడనంబును నస్మత్కుల నక్షత్రవిశాఖాజాజ్వల్యమానత్వాదికంబును బూర్వోక్తసర్వంబును రాక్షసనాశనంబుకొఱకు సముపస్థితంబయ్యె నివి యన్నియు విచారించిన మనకు విజయంబును రాక్షసులకు వినాశంబును సంప్రాప్తం బగుటకు సందియంబు లేదు మఱియుఁ గమలాకరంబులు ప్రసన్నసలిలంబు లై వనంబులు పుష్పవంతంబు లై ద్రుమంబులు సర్వర్తుకుసుమగంధోపేతంబు లై యున్న వదియునుంగాక తారకామయసంగ్రామంబునందలి దేవసైన్యంబులుం బోలెఁ గపిసైన్యంబు లత్యంతకాంతివిస్తారంబునం బొలిచి యున్నవి మఱియు ననేకంబు లగుశుభనిమిత్తంబులు దోఁచుచున్నవి గావున రావణుం బరిమార్చి సీతం జేకొని సమృద్ధార్థుండ వై మత్సమేతంబుగా నయోధ్యకుం జనియెదవు విచారంబు దక్కి సముత్సాహసంపన్నుండ వగు మని పలికిన నన్నరశార్దూలుండు తమ్మునిమాటల కలరి ప్రియసల్లాపంబులు సేయుచు నొక్కముహూర్తం బైననొక్కచోట నిలువక దివారాత్రం బేకోద్యోగంబుగా సైన్యంబులు నడిపించుకొనుచు యుద్ధాభికాంక్ష మనంబునం జెంగలింప నుద్దామగమనంబునం జని చని. 76

రాముండు వానరసమేతుం డై సహ్యమలయపర్వతంబులఁ జేరుట.

ఉ. ఆరఘుకుంజరుండు చలితాబ్ధితరంగశయంబుల న్మృదం
బారఁగ బట్టియాడెడునొయారవుఁ బంతులమాడ్కి మేదినీ
సారనగంధిచన్నుగవ చందమున న్జలరాశితీరశృం

గారవనంబులం గలనగంబుల రెంటిని గాంచె ముందటన్. 77

క. అక్కొండలు మలయం బన, నొక్కటి సహ్యం బనంగ నొక్కటియును బెం
పెక్కినసానుంబులతో, నక్కజముగఁ బొల్చు నిర్ఝరావాసము లై. 78

వ. అమ్మహామహీధరంబులరెంటినడిమికాంతారంబు దఱిసి. 79

ఉ. అచ్చటిపుష్పితద్రుమము లచ్చటిచందనకాననోత్కరం
బచ్చటిశైలనిర్ఝరము లచ్చటిరమ్యలతాగృహోచ్చయం
బచ్చటిదివ్యకందరము లచ్చటిసర్వమనోజ్ఞసౌరభం
బిచ్చకు వేడ్క సేయఁగ మహీపతి చూచుచుఁ బోవు చుండఁగన్. 80

సీ. మలయచందనవృక్షములసౌరభముఁ బూని మెల్లమెల్లన వీచెఁ జల్లగాలి
గాలిరాకకుఁ గొనల్గదలఁ దావుల నీనుతరువులు గురిసె క్రొవ్విరులవాన
విరులపాటున గుల్కు వెదలుతుమ్మెదచాలు ఝమ్మని మింట గానమ్ముఁ జేసె
నళులగానములకు నడరి వెంటనె జంటకోయిల లిరువంకఁ గూయఁ దొడఁగెఁ
తే. బికరవంబులఁ జెలరేఁగి శుకకులంబు, కలరవంబునఁ గలకలపలుక సాగెఁ
జిలుకకదుపులపలుకుల కలరి కేకు, లచలశిఖరాగ్రములమీఁద నాడఁదొడఁగె.

చ. భువనమనోహరస్ఫురణఁ బొల్చుపయోధితరంగవేగసం
భవపవమానఘట్టితసమంచితధాతుపరాగజాల మా
ప్లవగచమూకదంబములపైఁ గవియం గడుఁ జిత్రవస్త్రము
ల్దవిలిచికొన్నచందమునఁ దద్దయుఁ జూడఁగ నయ్యె నయ్యెడన్. 82

శా. ఘోరం బై నవనాటసైన్యములనిర్ఘోషంబు గంభీరపాం
థోరాశిధ్వనిభంగి నైన విని యెంతో భీతిమైఁ బాఱెఁ ద
త్కాంతారవ్యాళవరాహభల్లచమరీశార్దూలమాతంగికా
సారంగర్క్షతరక్షుశల్యమహిషీసాలావృకవ్రాతముల్. 83

మ. ఇభయూథంబు తెఱంగునం గపిబలం బేగంగ వీక్షించి త
ద్రభసోద్రేకమునం గలంగి భయసంత్రస్తంబు లై మ్రోయుచు
న్నభము న్దాఁటఁగ నేగె శీతజలపూర్ణస్రోతము ల్వాసి టి
ట్టిభకారండవచక్రవాకబకఘోటీక్రౌంచసంఘాతముల్. 84

చ. విలసితగంధబంధురనవీనమనోహరపద్మకైరవో
త్పలవిగళన్మరందరసధారలఁ గమ్మనితావు లీనుశీ
తలసరసీపయఃకణకదంబము వాయువశంబున న్మహీ
స్థలములమీఁద వ్రాలి వెసఁ బాపెఁ బథిశ్రమజాతఖేదమున్. 85

సీ. రుచిగంబు లగుఫలప్రచయమూలంబులు మించు వేడుకలతో మెక్కి మెక్కి
యమృతోపమానంబు లగుస్వాదుజలములు గొని దప్పి దీఱంగఁ గ్రోలి క్రోలి
చఱులలోనికి డిగ్గి సరఘుల నెగఁ జోపి తమి దీఱ మధువులు ద్రావి ద్రావి

కుజముల కెగఁ బ్రాఁకి ఘుమ్మని వాసించుకుసుమజాలంబులు గోసి కోసి
తే. విమలసలిలతరంగిణీవేగమునకు, నెత్తముగఁ దోఁగి వెనఁ జల్లులాడి యాడి
సమదగతి వీరవానరసైన్యసమితి, సాల విహరించె రఘుపతి సంతసింప. 86

వ. మఱియును. 87

సీ. ఒకకొండపై నుండి యొకకొండమీఁదికి దాఁటువారలతల దాఁటువారు
గగనంబులో రాయుఘనతరుస్కంధంబు నెక్కువారలమొన లెక్కువారు
వాలంబు లల్లార్చి లీలతో మింటికి నెగురువారలమీఁది కెగురువారు
చరణాభిహతిమహీజములు ధారుణిఁ గూలఁ జన్నువారల వెన్నుదన్నువారు
తే. గండశిలలెల్లఁ జెపువునఁ బిండి గాఁగఁ
ద్రొక్కువారల మదములఁ ద్రొక్కువారు
నగుచు సింగంపుఁగొదముల పగిది దర్ప
మలరఁ గపు లాటపాటల నరిగి రపుడు. 88

రాముఁడు వానరసేనాసహితముగా సాగరవేలావనముఁ జేరుట.

వ. ఇత్తెఱంగున నత్తరుచరవీరులు వియత్తలం బుత్తలపడ నుత్కృష్టగర్జారవంబులు సేయుచుఁ బుడమి గ్రక్కదల నొక్కమొగిం బోవునప్పు డచ్చటిపుష్పపల్లవఫలభరితచంపకతిలకచూతాశోకసింధువారకరవీరతిమిశకరంజప్లక్షన్యగ్రోధతిందుకధవాంకోలజంబూచిరిబిల్వనాగామలకమధూకవకుళవంజుళభూర్జకపాటలీమందారకాదంబార్జునపిచుమందశింశుపాకుటజశాల్మలీకురవజతాలహింతాలచూర్ణకనీపకనీలాశోకవరణపద్మకకేతకీవాసంతికామాధవీగంధపూర్ణకుందగుల్మప్రముఖనిఖిలతరులతాజాలంబులు పర్యాకులీకృతంబులై మ్రొగ్గుపడియుండె నచ్చటివసుంధర హరియూథపులచేత సంపూర్ణమైన పక్వంబులగు కమలకేదారంబులచేతం బోలె నభిరామమై యొప్పె నిట్లవార్యగమనంబునం జని గిరిశ్రేష్ఠంబులగుసహ్యమలయంబుల నతిక్రమించి మహేంద్రమహీధరప్రాంతకాంతారభాగంబు దఱసి సముద్రవేలావనంబుఁ జేరె నప్పుడు సానుజుండగు రాముండు నిరంతరతాళీవనశ్యామంబైన మహోదధియుపకంఠంబు సేరి సుగ్రీవు నవలోకించి యిట్లనియె. 89

సీ. ఎద్దానిఁ దరియింప నెదఁ గోరి వచ్చితి మావనరాశివేలావనంబుఁ
జేరితి మిది చూడ ఘోరమై గంభీరనినదమై యున్నది మనకు దాఁట
నల్పయత్నంబున నయ్యెడుపని గాదు గురుబుద్ధి నిచట నంద ఱముఁ గూడి
యధికయత్నంబున నాలోచన మొనర్ప వలయుఁ గావున మనబలము నెల్ల
ఆ. నిచట విడియునట్లు లెఱిఁగింపు తమతమ
బలము విడిచి యొండువలని కరుగ
కుండ నరసికొనుచు నుండువారుగ సైన్య
పతుల కానతిమ్ము భానుతనయ. 90

చ. అని యిటు రాఘవుండు తగ నాడిన నట్లగు నంచు నాత్రజా
తనుతనయుండు లక్ష్మణుఁడు తానును వానరయూథనాథుల
న్గనుఁగొని మీర లీతటమున న్బలము ల్వసియించునట్లుగా
నానరపుఁ డన్న వారు రయ మొప్పఁగ నందఱఁ బిల్వఁ బంచినన్. 91

—రామనియోగంబున సుగ్రీవుఁడు సేనల వేలావనంబున విడియ నాజ్ఞాపించుట.—

క. గజయూథనిభవనాట, ధ్వజినీసందోహ మబ్ధితటమున మధుపాం
బుజలం బై యలరు ద్వితీయజలధిచందాన నొప్పె నద్భుతభంగిన్. 92

శా. ఏలీలం దరియింత మీజలధి నిం కేలాగు వర్తింత ము
ద్వేలాభీలచలత్తరంగయుత మై వీక్షింపఁగా నయ్యె నం
చాలోచించుచు నాత్మసేనలకుఁ గాపై కార్యచింతారతి
న్వేలోపాంతవనంబులో విడిసి రావేళం జమూవల్లభుల్. 93

క. గోలాంగూలబలంబును, వాలాయము ఋక్షబలము వానరబలము
న్నీలునిపనుపున నంబుధి, వేలావనమందు మూఁడువిధముల విడిసెన్. 94

తే. అప్పుడు వనాటసైన్యంబునందుఁ బుట్టు
భీషణోదగ్రభూరినిర్ఘోషణంబు
వినఁగ నయ్యె విధూదయవేళ మ్రోయు
జలధినిర్ఘోషణమునకు సాటి యగుచు. 95

వ. ఇట్లు సముచితప్రకారంబున విడిసి యక్కపిసైన్యంబు సముదగ్రమహోగ్రగ్రా
హమత్స్యకచ్ఛప కాకోదరతిమితిమింగిలనిఖిలాంతర్వర్తిజలచరవ్రాతంబులశరీర
నిక్షేపణంబునం బుట్టినవాయువేగంబునం దొట్టినయభ్రంకషమహోత్తుంగతరంగ
మాలికాజాలంబులు మెండుకొని యొండొంటిం దాఁకి గొప్పచప్పుళ్లుప్పరంబు
నమృదంగనిస్వనంబుభంగి నైచెలంగఁ బాండురడిండీరఖండవ్యాజంబునంజిఱు
నవ్వు నవ్వుచు రామచంద్రముఖచంద్రాలోకనసంజాతసాంద్రానందంబున ను
ప్పొంగి యుత్సవనృత్యంబు సేయుచున్నచందంబున నందంబగుచున్నమహార్ణవం
బు నవలోకించి మడువులోనం జిక్కినమాతంగంబులమాడ్కిఁ జూడ్కికిఁ బ్రేఁగ
గుచు శిలోచ్చయంబులు తన్మధ్యంబునం గ్రాలు చునికి నచ్చెరువందుచు వీచికా
పరంపరలవిఘట్టనంబునం బుట్టినతుంపురులు మింటి కెగసి వాయువశంబున సిక
తాతలంబుమీఁద వెదచిందు చునికి నానందించుచు నగాధం బగుపాతాళం
బుల నుండి బహుభోగమండితంబు లైనమహానాగంబులు జలంబులపైకి నిర్గ
మించినఁ దదీయఫణాగతరత్నంబుల మహోర్ములు గొని తెచ్చి వేలాతటంబునం
జేర్చు చునికి నిచ్చ మెచ్చుచుఁ గీలాభీలంబు లగుబడబానలజ్వాలాజాలంబులు
గదిసినసంతప్తశరీరు లై యంతర్విషయవాను లగురాక్షసులు వీచికాసోపానంబు
లెక్కుచు దిగ్గుచుం దేలియాడు చునికికి నాగ్రహించుచు దినక్షపామధ్యగతం

బై నసంధ్యాకాలం బగుటఁ జేసి పెల్లుబ్బి కడలెత్తి మ్రోయుచు నుల్లోలకల్లోలంబుల జగంబుల ముంప నరుగుదెంచుచున్నపగిదిం దోఁచుచునికి భయంబు గొనుచు వేలాతటంబున విడిసిసవానరవాహినీసందోహంబు నవలోకించి ప్రతిసముద్రశంకాకళంకితస్వాంతంబున రోషభీషణుండై నిజాంతర్గుప్తమహాస్త్రంబులతోఁ గూడ వెల్లిపరిసి రభసాతిశయంబునం దాఁక నేతెంచునప్పు డెడ లెగక మహాభేరీధ్వనులభంగి నుప్పొంగునభంగతరంగపరస్పరసంఘర్షణసముద్భవభువనభయంకరనిర్ఘోషణంబునకడలుచు మహోన్నతమహీంధరశిఖరాగ్రంబులెక్కి నిక్కిచూచి యక్కడికిం దుదఁ గానక దూరపారం బగు చునికి నిరూపించి యెత్తెఱంగున నుత్తరించువార మని విషాదంబు నొందుచు మహోరగనిషేవితం బై రాక్షసావాసభూతం బై పాతాళంబుం బోలె నతిగంభీరం బై నీలత్వగుణవిశిష్టం బై శశికిరణభాస్వరాంబుసంకులం బై సమాకీర్ణవహ్నికణసమానజలబిందుసమూహనక్షత్రగణశోభితం బై తరంగమాలికాజలధరమాలాసమాకులం బై యొప్పు చునికి సముద్రంబునకు గగనంబునకుఁ దారతమ్యం బేర్పరింపం జాలక యొండొంటిం దాఁకుచు నిరంతరం బగు చునికి నద్భుతంబు నొందుచు మఱియు ననేకప్రకారంబుల సముద్రనిభావంబు వక్కాణించుచు నీలుండును మైందద్వివిదులును దనకుఁ గన్నాకులై చుట్టునుం దిరిగి యధికప్రయత్నంబునం జిక్కుపడకుండ సరసి రక్షించుచుండ సముద్రోత్తరతీరంబున విడిచి సముచితసల్లాపంబులు సేయుచు నిచ్చానువర్తనంబులం బ్రవర్తించుచుండె నిట్లు సైన్యంబులు విడిసినయనంతరంబ రాముండు పార్శ్వగతుం డైనలక్ష్మణు నవలోకించి యి ట్లనియె. 96

రాముఁడు జానకిం దలంచుకొని దుఃఖించుట.

ఉ. అక్కట నామనోరమణి యైనమహీసుతఁ బాసి లక్ష్మణా
పెక్కుదినంబు లయ్యె నతిభీషణమై ఖరి నాఁటినాఁటికిం
దప్పక తద్వియోగజనితం బగుదారుణశోకవహ్ని పెం
పెక్కి మదీయగాత్రము దహించుచు నున్నది యేమి సేయుదున్. 97

క. శోకంబు నాఁటినాఁటికిఁ, జీకాకై పోవు ననుచుఁ జెప్పుదు రిలలో
నా కెంతయు నానాఁటికి, నోకులనుత వృద్ధిఁ బొందుచున్నది మిగులన్. 98

చ. అలనసమీరురాక విష మాయె మనోహరకీరశారికా
కలకలకంఠనాదములు కర్ణకఠోరము లాయెఁ బండువె
న్నెల కడు వేఁడి యాయె విరితేనెచవు ల్విగ టాయెఁ దమ్ముఁడా
నలినదళాయతాక్షి గహనంబునఁ బాసిననాఁటనుండియున్. 99

క. తక్కినశోకము దినదిన, ముక్కఱి చను గేహినీవియోగజశోకం
బెక్కు డగు నాఁటినాఁటికి, నిక్కువ మే నెట్లు సైఁతు నృపకులతిలకా. 100

తే. అళిచికుర దూరమున నున్న దనియుఁ గాదు
దనుజవల్లభ హృత యయ్యె ననియుఁ గాదు
సర్వసుఖసాధనం బైనజవ్వనం
తీత మగుటకు వగచెద నీతిశీల. 101

ఉ. అంబుజగంధి శత్రునిలయంబునఁ జిక్కి నిశాచరుల్ సరో
షంబుగ నాడుమాట వినఁ జాలక హా హృదయేశ యంచు మో
హంబున నన్నుఁ గూర్చి యను నవ్వెత నాత్మఁ దలంచు చున్న గా
త్రంబు దహించుచున్నయది ద్రావినఘోరవిషంబుకైవడిన్. 102

తే. అనఘచరిత తచ్చింతామహార్చి యగుచు
నెసఁగుమదనాగ్ని తద్వియోగేంధనముల
చేత నభివృద్ధిఁ గాంచి మచ్చిత్తమును ద
హించుచున్నది యనిశంబు పేరువాడి. 103

చ. విడువక భర్తృమోహమున వేడుకలం బడి నాదువెంటఁ దా
నడవికి వచ్చె నట్టిహృదయప్రియఁ బాసి యనంగవహ్నిచే
నుడుగుచు దేహతాప మిటు లోర్వఁగఁజాలఁ బయోధినీటిలోఁ
బడియెద నందుఁ గామమయపావకుఁ డేర్పఁగఁ జాలఁ డెంతయున్. 104

వ. వత్సా సజలకేదారోపస్నేహంబున నిర్జలం బైనకేదారంబుజీవించినతెఱంగున
జానకి జీవించియున్న దని మారుతిచేతఁ గథితం బైనప్రియవచనంబు వినుట
వలన నేను జీవించి యున్నవాఁడ నని పలికి యారఘునందనుండు చందనసౌర
భంబు పరిగ్రహించి తనసమీపంబున శీతలస్పర్శనుం డై మందగమనంబున
వీచుమలయమంజరపవను నుద్దేశించి విరహపారవశ్యంబున నిట్లనియె. 105

ఉ. చందనగంధి యున్నెడకుఁ జయ్యన నేగి తదంగ మిట్లు ప్రీ
తిం దగ సంస్పృశించి చనుదెంచి మదంగము సంస్పృశింపు మిం
పొందఁగఁ జంద్రునందు నయ మొప్పఁగ దృష్టిసమాగంబు నీ
యందును స్పర్శనంబు మలయానిల శాశ్వతధర్మమే కదా. 106

ఆ. జనకపుత్త్రి నేను మునుకొని యొకచోట, నొప్పిదముగఁ గూడియుండు టదియె
కామినైననాకుఁ గడు జీవసాధనం, బట్లు గానిచోట నగును బ్రతుకు. 107

తే. పగతు నెప్పుడు పరిమార్తుఁ బద్మపత్త్ర, చారులోచన నళివేణిఁ జంద్రవదనఁ
ఘననితంబను జనకభూపతికుమారి, సీత నెప్పుడు నాకు వీక్షింపఁ గలుగు. 108

తే. ఆస్య మొక్కింత వాంచి రోగాతురుండు
విమల మగునూతనరసాయనమును బోలె
నింతికెమ్మోవిపానక మింపు మెఱయఁ
గోర్కి దీఱంగ నెప్పుడు గ్రోలఁ గలుగు. 109

క. నిరుపమతాళఫలంబుల, కరణిఁ బిసాళించుపీనఘనకుచములు నా

యురమున సోఁకఁగ నెప్పుడు, కర మరుదుగ జనకపుత్త్రి కౌఁగిటఁ జేర్చున్. 110
తే. గాలిచే నీలఘనములు దూలి పోవఁ, గ్రాలుశారదశశిరేఖకరణి నాదు
బాణరయమున దైత్యులు పాఱి పోవ, సీత నాగాత్రల నెపుడు భాసిల్లు ననఘ.
క. ఎప్పుడు దైత్యునియురమున, నొప్పఁగ ఘోరాస్త్రచయము లునిచి ప్రమోదం
బుప్పతిల జనకనందనిఁ, దప్పక కైకొందు శోకతాపము దీఱన్. 112
క. పరమపతివ్రత యగున, త్తరుణి మహోత్కంఠతోడఁ దప్పక నన్నుం
బరిరంభించుచు నెప్పుడు, సరసత నానందబాష్పజలములు నించున్. 113
ఆ. జానకీవియోగజనితశోకంబు శు, క్లేతరాంబరంబురీతి నెపుడు
విడుచువాఁడ నధికవిఖ్యాతసత్కీర్తి, నొందువాఁడ సౌఖ్య మొందువాఁడ.
మ. జనకోర్వీపతికూఁతు రాదశరథక్ష్మానాథవంశాబ్ధిచం
ద్రునకుం గోడలు నాదుపత్ని సుజనస్తోత్రార్హ దుష్టాసురీ
జనమధ్యంబునఁ జిక్కి యాత్మపరిరక్షాదక్షునిం గాన కా
ర్తిని శోకించుచు నుండు నెట్లు విధి యుక్తిం ద్రోవఁగా నల్పమే. 115
తే. పార్థివోత్తమతనయ స్వభావతన్వి, గాన ననశనదుఃఖశోకములచేత
నేఁడు తలపోయ మిక్కిలి వాడి యుండుఁ, బద్మముఖి దేశకాలవిపర్యయమున.
వ అనియిట్లు లారఘువల్లభుండు మదనోద్దీపనకరసముద్రవేలావనవిలోకనంబువలన సముత్పన్నం బైనవిరహవేగంబు సహింపంజాలక సీత నుద్దేశించి బహుప్రకారంబుల విలపించుచుండఁ దదీయవిరహతాపంబుఁ జూడలేనివాఁడుపోలె భాస్కరుండు మందరశ్మియై చరమశిఖరిశిఖరాంతరంబున నస్తమించె నప్పుడు రాముండు సంధ్య నుపాసించి వెండియు మనోహారిణి యగుజానకిం దలంచుకొని సంతాపించుచు నుచితప్రవర్తనంబుల నుండె నట లంకాపురంబున రాక్షసేశ్వరుం డగురావణుండు భయావహం బైనహనుమంతునియద్భుతకర్మంబు విలోకించి రాక్షసుల నందఱ రావించి సిగ్గుపెంపున నొక్కింత మొగంబు వాంచి యెల్లవారును విన నిట్లనియె. 117

రావణుఁడు సభ్యుల రావించి యాలోచించుట.

ఉ. వానరమాత్రుఁ డొక్కఁ డనివార్యగతిం జనుదెంచి జానకి
న్మానుగఁ గాంచి లోపలివనం బది భగ్నము చేసి కొందఱ
న్దానవవీరులం దునిమి తప్పక లంకను బాఁడుఁ జేసి యం
భోనిధి నిస్తరించి యటు పోవుట యంతయుఁ గంటిరే కదా. 118
ఉ. ఏమి యొనర్తు మింక మన కెయ్యది భద్రము యుక్త మెద్ది నా
కేమిటఁ జేకుఱు న్విజయ మింతయుఁ జెప్పుఁడు నాకు మీరు సం
గ్రామజయంబు మంత్రమునఁ గల్గు నిజం బని రాజనీతి వి
ద్యామహిమాధికు ల్పలికి రప్పని తప్పక సేయుఁ డిత్తఱిన్. 119

—రావణుఁడు సభ్యుల కుత్తమమధ్యమాధమమంత్రకర్తల దెల్పుట.—

తే. తలఁప నుత్తమమధ్యమాధము లనంగఁ
గలరు ముగ్గురు నరులు జగంబునందు
వారిలోపల గుణదోషవర్ణనంబు
లేర్పరించెద వినుఁడు మీ రింపు మెఱసి. 120

చ. హితమతులైన చుట్టల సహిష్ణుల మిత్రుల మంత్రనిర్ణయో
చితమతులైనమంత్రుల నశేషనయజ్ఞులఁ గూర్చి మంత్రము
ద్ధతి నొనరించి భారమును దైవముపై నిడి కార్యయత్నముం
జతురతఁ జేయు నప్పురుషసత్తముఁ డుత్తముఁ డండ్రు ధార్మికుల్. 121

క. తా నొకరుండె ధర్మం, బే నెఱి యని నిశ్చయించి హితమంత్రులతోఁ
బూని వచింపక కార్యము, మానుగఁ గావించువాఁడు మధ్యముఁ డుర్విన్.

క. గురుమతి గుణదోషంబుల, నరయక దైవవ్యపాశ్రయము విడిచి పను
లెవ్వరవునఁ దీర్చెద నని యు, ర్వరలోన నుపేక్ష సేయువాఁ డధముఁ డగున్.

తే. మనుజు లెబ్భంగి నుత్తమమధ్యమాధ
మాభిధానంబులు వహింతు రవ్విధమున
మంత్రములు ధాత్రి నుత్తమమధ్యమాధ
మాఖ్యలు వహించు నది యెట్టు లనిన వినుఁడు. 124

తే. ధర్మరతులైనమంత్రిసత్తములఁ గూడి
శాస్త్రసందృష్టమైనలోచనముచేత
నైకమత్యంబు నొంది నిత్యంబుఁ జేయు
నట్టిమంత్రంబు నుత్తమ మండ్రు బుధులు. 125

తే. మచ్చరంబున నొండొరు మెచ్చ కర్థ
నిర్ణయమునందు బహుమతనిరతి నొంది
మరల నైక్యంబు గల్గి నిష్ఠురతఁ జేయు
నట్టిమంత్రంబు మధ్యమ మనఁగఁ బరఁగు. 126

క. హిత మెఱుఁగక తమతమదు, ర్మతములె సిద్ధాంత మని పరస్పర మైక్య
స్థితి గలుగ కుండ నిచ్ఛా, గతిఁ జేసెడుమంత్ర ముర్విఁ గడు నధమ మగున్.

ఉ. కావున మీరు సాధుగతిఁ గార్యవిచారముఁ జేసి యిమ్మెయి
న్నోవ జయంబు గల్గు నని బుద్ధికొలంది యెఱుంగఁ బల్కుఁ డు
ర్వీవరుఁ డర్థనిర్ణయవివేకసమన్వితమంత్రివాక్యసం
భావితుఁ డై వెలుంగుట తపోచరులార సునీతియే కదా. 128

సీ. రాముండు సుగ్రీవసౌమిత్రిసహితుఁ డై వీరవానరసైన్యవితతి గొలువ
నంబుధి నేయుపాయంబున నైన బల్విడి దాఁటి దోహాలం బడర లంక

మీఁదికి సమరవినోదార్థి యై వచ్చు టది నిక్క మబ్బంగి యైన మనకుఁ
గొఱఁత యేమి బలంబుఁ గూర్చి యొద్దారించి ఘనజన్య మొనరింతమనియొ కొక
తే. సంధి సేయుద మనియొ యాచంద మెల్లఁ
గూడి యోచించి పురరాష్ట్రకోశములకు
హాని లేకుండ వచియింపుఁ డనిన వార
లంపఱును గేలు మోడ్చి యిట్లనిరి ప్రీతి. 129

సభ్యులు రావణునకుఁ దమయభిప్రాయముఁ దెల్పుట.

క. పరపక్షముఁ దనపక్షము, నరయక నృపనీతిబాహ్యు లగుదుర్బుద్ధు
ల్తఱి వచ్చినపుడె నృపతికిఁ, గర మాప్తులుఁ బోలె వెరవుఁ గఱపుదు రెందున్.
తే. అధిప తోమరశక్తిగదాసిశూల, పరిఘపట్టిసముద్గరప్రాసకుంత
మండితం బైనసైన్యంబు మనకుఁ జాలఁ, గలిగియుండ విచారంబు గలుగ నేల.
క. భోగవతి కేగి ఘనబా, హాగర్వ మెలర్వ హరుల ననిఁ బోరిగొని త
ద్భోగగతరత్నచయములు, వేగమ గొని తెచ్చినట్టివీరుఁడ వధిపా 132
శా. ఆకైలాసనగాధివాసుఁ డగుయక్షాధీశు నుగ్రాజి న
స్తోకప్రౌఢి వధింపఁ బూని హరమిత్త్రుం బోట మన్నించి కీ
లాకల్పోజ్జ్వలమూర్తి వై పటుశరాలాతాహతి న్వేసల
న్వీఁకం ద్రుంచి తదీయపుష్పకము దేవే తొల్లి రక్షోవరా. 133
తే. మయుఁ డనునిశాచరుండు నీమహిమఁ జూచి
వెరవుతో బాంధవంబు గావింపఁ గోరి
దానవేశ్వర భార్యార్థి వైననీకు
నొసఁగఁడే తొల్లి తనకూఁతు నుత్సుకుఁ డయి. 134
తే. దానవేంద్రుని మధు వనువాని వీర్య
గర్వితుని దురాసదుని విగ్రహమునందుఁ
బేర్చి నొప్పించి విజయంబు పెంపు వడసి
సాఁకితివి కాదె కుంభీనసీకృతమున. 135
శా. అక్షీణోగ్రపటుప్రతాపచతురంగానీకయుక్తంబుగా
దక్షత్వంబున నేగి రాక్షసకులాధ్యక్షుల్ దిశాపాలహ
ర్యక్షుల్ నైర్‌ఋతి నాజిరంగమునఁ బాఱందోలి యాతండు సం
రక్షింపంగదె యంచు దైన్య మెసఁగం బ్రార్థింప సద్యఃకృపా
వీక్షం జంపక కాచి పుచ్చితివి గాదే దైత్యవంశోత్తమా 136
తే. మును రసాతలసీమకుఁ జని నివాత, వర్య శంఖకగోకటకవాసునిధృత
రాష్ట్రతక్షకైరావతప్రముఖసిఖుల, హరివరులఁ బాఱఁదోలి జయంబుఁ గొనవె
ఉ. అక్షయబాహుశౌర్యులు మహాత్ములు లబ్ధవరు ల్నిశాచరు

ద్రక్షిత నొక్కఁడేఁడు నినుఁ దాఁకి రణం బొనరించి యోడి ప్ర
త్యక్షము గాఁగ నీమహిమ లన్నియుఁ గన్గొని ప్రీతచిత్తులై
రాక్షసకోటి కెల్ల నిను రాజుగఁ జేసిరి గాదె రావణా. 137

క. ఊర్జితసత్త్వులు శూరులు, దుర్జయు లగుపవనజులు చతుర్విధసైన్యో
పార్జితలీలన్ శార్ఙ్గిని, నిర్జితులై చనిరి గాదె నీశరనిహతిన్. 138

వ మఱియు మృత్యుదండమహాగ్రాహంబును శాల్మలిద్రుమభూషితంబును గాల
పాశకల్లోలసంకులంబును యమకింకరపన్నగంబు నగువైవస్వతునియపారబలపా
రావారంబు దఱిసి భవదీయకరమండితచండకోదండవిముక్తకాండప్రకాండ
బడబానలంబు నిజాభీలజ్వాలాజాలంబునఁ బరిక్షోభంబు నొందించి జయంబు
గొని మృత్యువుం బాఱఁదోలిన తెఱం గెల్లవారికిం దెల్లంబై యునికి విచారింప
వలవదే యని వెండియు నిట్లనిరి. 139

చ. కులగిరిధైర్యుల న్సురకోవిదులం బరమాస్త్రవేదుల
న్బలరిపుతుల్యవిక్రములఁ బార్థివుల న్నీవుఁ దాఁకి మ్రాకుల
న్హాలికుఁడు గొడ్డట న్నఱికినట్లు వధింపవె వారికంటె న
త్యలఘుఁడె రాఘవుండు దనుజాధిప యింత విచార మేటికిన్. 140

చ. పనిపడి శంకరుం గుఱిచి భక్తిమెయి న్మఖ మాచరించి య
య్యనఘునిచేత దుర్లభము లైనవరంబులు గాంచినట్టినీ
తనయుఁడు మేఘనాదుఁడు జితశ్రముఁ డుండఁగ నింత యేమి గ్ర
క్కున హరివాహినిం దొడరి కూల్పఁడె దారుణబాణసంహతిన్. 141

వ. మఱియు నన్మహావీరుండు శక్తితోమరమహామీనంబును వికీర్ణాంత్రశైవలం
బును గజకచ్ఛపసంబాధంబును దురంగమండూకసంకులంబును రుద్రాదిత్య
మహాగ్రాహంబును మరుద్వసుమహోరగంబును రథాశ్వగజతోయౌఘంబును
బదాతిపులినభూషితంబును నగునిర్జరవాహినీసముద్రంబును నిజశరానలంబున
శోషింపం జేసి శచీపతిం బట్టి రథస్తంభంబునం గట్టి లంకకుం గొనితెచ్చి
లోకపితామహుం డైనపరమేష్ఠినియోగంబున విడిచి పుచ్చిన సర్వలోకనమ
స్కృతుం డగుమహేంద్రుండు విసృష్టుండై యెప్పటియట్ల త్రివిష్టపరాజ్యంబు
పరిపాలించుచుండె నాఁటంగోలె భవన్నందనునకు నింద్రజిత్తుం డనునన్వర్థ
నామంబు గలిగె నిది సర్వలోకప్రసిద్ధం బైనయదియే కదా యిప్పు డక్కుమార
శేఖరుం బంపు మల్లైన రామలక్ష్మణసహితంబుగా వానరవాహినిం బరిమార్చి
నీ కత్యంతప్రియంబు సంపాదించు నింక సందియంబు వదలి సముత్సాహసంప
న్నుండ వై సంగ్రామంబునకు సన్నద్ధుండవు గమ్మని పలికె నప్పుడు నీలాంబుద
నిభుండును మహాశూరుండును సేనాపతియును నగుప్రహస్తుం డనుదానవశ్రేష్ఠుండు
నిటలతటవిన్యస్తహస్తపుటుం డై రావణున కిట్లనియె. 142

ప్రహస్తుఁడు రావణునకుఁ దనయభిప్రాయముఁ దెల్పుట.

క. సురసాధ్యయక్షకిన్నర, గరుడోరగసిద్ధరుద్రగంధర్వాదు
ల్పురమున నినుఁ జెనకంగఁ జాలరనంగా నెంతవారు ప్లవగు లధీశా. 143

తే. అధిప దానవులందఱు నధికమత్తు, లౌటఁ జేసి రణంబున నవ్వనాటు
చేత వంచితులైరి నే నా తెఱంగు, నెఱిఁగి యుండిన బ్రతికి పోనియ్యనయ్య.

క. కడచనినకార్యమునకి, ప్పుడు వగచిన నేమి దనుజపుంగవ శౌర్యం
బడర నవానరంగా నీ, పుడమిని గావించి వత్తుఁ బుచ్చుము నన్నున్. 145

క. వానరులనలనిభయ మి, ద్దానవులకుఁ గలుగకుండఁ దగినయుపాయం
బే నొనరించెద మఱి నీ, మానసమున నున్నవగపు మాన్పెద నధిపా. 146

తే. దనుజనాథ నిజాపరాధప్రభూత, మగువిషాదంబు దక్కి ధైర్యమున నుండు
మనిన నప్పుడు సంక్రుద్ధుఁడై నిశాట, రాజుతో దుర్ముఖుం డను రాక్షసుండు.

దుర్ముఖుఁడు రావణునకుఁ దనయభిప్రాయముఁ దెల్పుట.

చ. వనచరమాత్రుఁ డొక్కరుఁడు వచ్చి యమోఘబలాభిగుప్తులన్
దనుజులఁ జీరికిం గొనక దైత్యవరేణ్యుఁడ వైననీపురి
న్ఘనతరవాలవహ్ని వెసఁ గాల్చి చనం గని యూరకుండిరీ
దనుజులు వీరు కైదువులు దాల్చుట యంతయు భూషణార్థమే. 148

వ. సర్వరాక్షసప్రధర్షణంబును నంతఃపురపరిభవంబును వనభంగంబును రాక్షసేంద్రతిరస్కరణంబును నక్షవధాదికంబును లంకాదహనంబును సహింపం దగినయవి గావు గావున. 149

ఉ. దానవనాథ నాకిపుడు తప్పక యాజ్ఞ యొసంగి పంపు మ
ట్లానతిఁ గాంచి దేవనిలయంబున కేగిన వార్ధిఁ జొచ్చినం
బూని రసాతలంబునకుఁ బోయిన నేఁ బొలివోనిధీరతన్
వానరవీరులం దునిమి వచ్చెద రామసమన్వితంబుగన్. 150

వ. అనియె నప్పుడు వజ్రదంష్ట్రుం డను రాక్షసశ్రేష్ఠుండు మాంసశోణితరూషితంబైనమహాపరిఘంబు లీలం గేల నందుకొని కోపాటోపంబున బొమలు ముడి పెట్టుచు నిట్లనియె. 151

చ. వనములు నాకలంబు దిని వారక దైన్యము నొంది యున్నయ
వ్వనచరుఁ జెప్ప నేల హరివాహిని నిప్పుడు నీటడంచి నా
మునుమున నిల్వలేని రఘుముఖ్యుఁ బదంపడి తత్సహోదరు
న్వనచరనాథునిం దునిమి వచ్చెద నే నొకరుండ యుద్ధతిన్. 152

వ. ఒక నొక్క హితోపదేశంబుఁ జెప్పెద వినుమతంద్రితుండై వీర్యబలంబునకంటె నుపాయబలంబునం బగతుల నశ్రమంబున జయింపవచ్చుఁ గావున నిప్పుడు కామరూపులును ఘోరదర్శనులును శూరులును గపటచారవేషులు

నసురరక్షోవీరులు కొందఱు భవన్నియోగంబున మానుషరూపధరులై రాముని యొద్దకుం జని భయంబు వదలి యతనితో భవత్సోదరుం డగుభరతుండు పంప వచ్చినవార మస్మహీరమణుండు చతురంగబలపరివృతుండై శీఘ్రంబున నెత్తివచ్చుచున్నవాఁడని యెఱింగించువారుగా సంఘటింపు మంత శక్తిశూల గదాచాపబాణాసిహస్తులమై మన మందఱము రయంబునం జని గగనంబున నుండి నిఖిలాస్త్రశస్త్రవర్షంబున హరివాహినిం బరిమార్చి యమక్షయంబున కుం బుచ్చెద మట్లైన రామలక్ష్మణులును విధ్వస్తసహాయులై మనకు వశ్యులగుదు రట్లుగాక యొక్కింత పెనంగిన నశ్రమంబున నిర్జింపవచ్చు నని పలుక నప్పుడు కుంభకర్ణనందనుండు కుంభుం డనువాఁడు వీర్యదర్పంబున నధికుండగువాఁడు కోపోద్దీపితముఖుండై రావణుండు వినుచుండ రాక్షసులనవలోకించియిట్లనియె.

కుంభనికుంభాదిరాక్షసులు రావణునకుఁ దమయభిప్రాయముఁ దెల్పుట.

ఆ. ఇంత యేన్ని పలుక నేల మీ రందఱు, నిష్పురమున నుండుఁ డే నొకండ
యరిగి రామలక్ష్మణార్కజానిలనంద,నాదికపుల నెల్ల నడఁచి వత్తు. 154

క. అని పలుకుచుండ నపుడ,య్యనిమిషరిపుతోడ వజ్రహనుఁ డనుదైత్యుం
డను ఘనకోపవిశేషం,బున నధరోష్ఠము చలింప బొమలు ముడివడన్. 155

చ. అడిచి పెనంగ నేటి కిపు డందఱు వారుణి గ్రోలి యిండ్లనం
దడిబడి యాటపాటల గతవ్యథులై సుఖవృత్తి నుండుఁ డే
నుడుగక యొక్కరుండ చని యుద్ధతిఁ గీశుల నెల్ల మ్రింగి నే
ర్పడరఁగ రామలక్ష్మణుల నర్కసుతు న్వధియించి వచ్చెదన్. 156

వ. అని యిట్లు పెక్కండ్రు పెక్కుతెఱంగులఁ దమతమపేరు వాడి పంతంబు లాడి
గుమిగూడి. 157

సీ. సూర్యశత్రుండును సుప్తఘ్నుఁడును యజ్ఞకోపుండు కుంభనికుంభు లగ్ని
కేతుండు నలరశ్మికేతుండు రభసుండు నాప్రహస్తుండు దేవాంతకుండు
ధూమ్రాక్షయూపాక్షదుర్ముఖమకరాక్షు లావిరూపాక్షనరాంతకులును
దాపసాంతకమహోదరమహాపార్శ్వులు సర్పరోముండును శక్రజిత్తు

తే. మొదలుగాఁ గల్గుదారుణత్రిదశరిపులు
దుష్ప్రధర్షులు బలయుతు ల్దుర్నివారు
లగ్నికల్పులు కులకుధరాభదేహు
లొక్కకార్యంబునకుఁ బూని యుక్కుమిగిలి. 158

చ. పరశుగదాసికుంతములు ప్రాసపరశ్వథభిండివాలము
ద్గరముసలంబు లుగ్రపరిఘంబులు పట్టిసశక్తిశూలము
ల్శరములు కార్ముకంబులు తళత్తళ నంబరవీథిఁ బర్వఁగాఁ
గరములఁ బూని లేచి దశకంఠునిముంగల నిల్చి యుద్ధతిన్. 159

ఉ. ఆపతి యిచ్చి పంపుము సురారికులేశ్వర మమ్ము నిప్పుడే
మానుగ నవ్విరించిపురమర్దను లక్షము వచ్చి కాచిన
స్థానక నాజిరంగమున మానవనాథుల నంగదార్కపు
త్రానిలసంసనాన్వితము గా వధియించెద మీవు మెచ్చఁగన్. 160

వ. అని భీషణరభసాతిశయంబుగాఁ బలుకుచుండ నప్పుడు వారి సందడి నివారించి నీతివిద్యావిభూషణుం డగువిభీషణుం డన్న కభిముఖుండై కేలుదోయి ఫాలంబునం జేర్చి యిట్లనియె. 161

విభీషణుఁడు రావణునకుఁ దనయభిప్రాయముఁ జెప్పుట.

ఆ. మొదల మూఁ డుపాయములు చూచి వానిచేఁ, గార్యసిద్ధి తనకు గలుగకున్న
నవల దండమునకు నర్హకాలం బని, నీతివిదులు పలుకు రీతు లధిప. 162

తే. అధిప గర్వాభియుక్తులయందు మత్తు, లందుఁ బదపడి దైవోపహతులయందు
విధివిరచితమై సిద్ధించు విక్రమ మటు, కాని వారలయం దని కాని పనులు.

క. జితరోషుఁడు విజిగీషుం, డతిధార్మికుఁ డప్రమత్తుఁ డతిదుర్ధర్షుం
డతిసువ్రతుండు రాఘవుఁ, డతని న్వంచింపఁ దలఁచి రంత యబఁతియే. 164

తే. తనకుఁ బగతునకుం గలతారతమ్య
మది విచారించి పిదపఁ గార్యంబు నడపు
నట్టివాఁ డెందుఁ జెడక సౌఖ్యంబు నొందుఁ
గానిచో దుఃఖపాత్రంబు గాఁడె యధిప. 165

సీ. తార్క్ష్యుండు పవనుండు దక్క నన్యులు దాఁట లేనితోయధి నవలీల దాఁటె
హరిహరాదులకైన నటు నిక్కి చూడంగ రానియీలంక నిర్భయతఁ జొచ్చె
మును బహుసంగరంబుల నారితేరినఘనులఁ బెక్కండ్ర రాక్షసులఁ దునిమె
నటు నీవు చేసిన యవనుతి కీడుగాఁ దొడరి పురంబు నల్గడలుఁ గాల్చె

తే. వసుమతీవల్లభునిబంటు వానరుండు, పూని చేసినచేత లెన్నేని గలవ
యధిప కింకరుఁ డంతవాఁడైన వాని నేలువాఁ డెంతవాఁడో యూహింపవలదె.

ఉ. దానవనాథ వీరు శఠు దర్పము గల్గినవారుపోలె న
మ్మానవనాథుఁ ద్రుంతు మని మాటలు పల్కెదరిట్లు నీకడ
న్వానరమాత్రుఁ డొక్కరుఁడు వచ్చి యనేకులఁ ద్రుంచి ప్రోలు వా
లానలుపాలు సేయునమయంబున నిందఱు నెందుఁ బోయిరో. 167

మ. తనపత్నిం గొని తెచ్చినట్టి పగకై తా నాత్మఁ గోపించి రా
మనరేంద్రుండు రణంబులో నిను వధింపం బూని యున్నాఁడు చ
య్యన నమ్మర్త్యున కంతశక్తి గలదే యంటేని ద్రుంపండె ము
న్నని నొక్కండె ఖరాదిదైత్యుల సమోఘాస్త్రంబులన్ వ్రేల్మిడిన్. 168

వ. తొల్లి రామునిచేత నీ కవమానం బొక్కింతైన ననుష్ఠింపంబడినయది గా దమ్మహాత్మునిపత్ని యగుజానకిని వంచించి కొని తెచ్చి నిష్కారణంబుగాఁ బగఁగొం

టివి జనస్థానంబున ఖరాదులం జంపుటది యపకారంబుగాదా యని యంటివేని
లోకంబునందుఁ బ్రాణులకుఁ బ్రాణంబు లవశ్యంబు రక్షితవ్యంబులు గావునఁ
దనయంతందానె నిష్కారణంబుగా రాముని వధింపం జనుదెంచి యప్పరాక్ర
మధుర్యునిచేత ఖరుండు ప్రాణసంరక్షణార్థంబుగా వధియింపం బడియె నది యప
కారంబు గా దదియునుం గాక. 169

తే. ధర్మ మెచ్చటఁ గలుగు నధర్మ మెచటఁ
గలుగు నచ్చట నచ్చటఁ గలుగు విజయ
మపజయము రాఘవుండు ధర్మాత్ముఁ డీవు
కడు నధర్మపరుండవు గాదె యధిప. 170

క. అయశస్య మనాయుష్యము, భయప్రదము నింద్య మధికపాపం బర్థ
క్షయకర మని చెప్పుదు రెం,తయుఁ బరదారాభిమర్శనంబు సురారీ. 171

శా. సీతం దెచ్చిననాఁటఁగోలెను నపేక్షింపంగ నివ్వేళ ను
త్పాతంబు ల్జనియించు చున్నయవి దైత్యశ్రేష్ఠ యీదుర్మతి
వ్రాతోక్తు ల్దిలకించి గైకొనక మద్వాక్యంబు మన్నించి య
న్నాతి న్రామున కిచ్చి పుచ్చి పరమానందంబుతో నుండుమీ. 172

క. సారాస్త్రవిదుఁడు సంగర, సూరుఁడు ధర్మానువర్తి సువ్రతుఁ డగునా
భూరమణునితో నిటు ని,ష్కారణముగ వైర మెత్తఁగా నీ కగునే. 173

తే. హితులకై వడి నీమ్రోల నిచ్చకములు
గఱపుదురు గాని కీడు మే లెఱిఁగి భయము
మాని మోమోట దక్కి సేమంబు గలుగు
నట్టితెఱఁగు బోధింప లేరయ్య వీరు. 174

చ. హితమును గీర్తివర్ధన మహీనసుఖప్రద మాత్మరక్షణో
చితహిత మైననాపలుకు చిత్తమునం దవిలించి రాఘవా
ద్భుతకరచాపముక్తమణిపుంఖసహస్రకరాంశుసన్నిభా
ప్రతిహతతీక్ష్ణబాణముల పాల్పడ కయ్యమ నిచ్చి పుచ్చుమా. 175

తే. భీమవిక్రముఁ డైనయారామభూమి
కాంతునకు సీత నిచ్చినఁ గాని పుత్ర
పౌత్రపురరాష్ట్రబలకోశమిత్రజనులఁ
గాచికొన నొం డుపాయంబు గలదె నీకు. 176

క. దనుజేంద్ర శూరుఁ డగున, య్యినకులునకు జనకపుత్రి నీకున్నఁ బురం
బును నిఖిలరాత్రిచరులు క,దనమున నశియింతు రింత తథ్యం బరయన్. 177

సీ. మహనీయమేరుసమానధీరుం డగు రాముఁ డంబుధి దాఁటి రాక మున్నె
హరివిక్రమాటోపు లగువనాటులు రోషపరవశు లై లంక సొరక మున్నె
కులిశధారాహతిఁ గూలుశైలంబులపగిది రాక్షసు లాజిఁ బడక మున్నె

యసమానకాలకటాక్షో గ్రశరపరంపరలు నీతలలు ద్రుంపకయ మున్నె
తే. యసురకులనాథ నాపలు కాదరించి, శిష్టనిందిత మైనయీచింత విడిచి
మెచ్చుగా రామునకు సీత నిచ్చి పుచ్చి, లంక యేలుము కడునిరాతంకముగను.

వ. అని బహుప్రకారంబుల హితోపదేశము సేయు చున్నవిభీషణునివచనంబు లాకర్ణించి రాక్షసేశ్వరుం డగురావణుం డమ్మాటలు గీటునంబుచ్చుచు నదుత్తరుండు గాక నిరుత్తరుండై యెల్లవారల నిజనివాసంబులకుం బోవం బనిచి యప్పటికొలువు చాలించి తాను నభ్యంతరమందిరంబునకుం జని యారాత్రిఁ గడపి మఱునాఁడు ప్రభాతకాలంబున నెప్పటియట్ల కొలువుకూటంబునందు బంధుమిత్రమంత్రిసహితంబుగాఁ బేరోలగం బున్నయెడఁ బ్రాప్తధర్మార్థనిశ్చయుం డగువిభీషణుండు కాల్యకరణీయంబులు దీర్చి సముచితప్రకారంబున నిజమందిరంబు వెడలి శైలాభ్రచయసంకాశంబును మేరుమహీధరశృంగసంగతంబును సువిభక్తమహాకక్ష్యంబును మహాజనపరివృతంబును నాప్తపర్యాప్తరక్షోగణసురక్షితంబును ననురక్తమహామాత్యనీతివచోవిజృంభమాణంబును మాతంగనిశ్వాసవ్యాకులీకృతమారుతంబును శంఖదుందుభిపటహకాహళీతూర్యనాదానునాదితంబును బ్రమదాజనసంబాధంబును బ్రజల్పితమహాపథంబును దప్తకాంచననిర్వ్యూహంబును భూషణోత్తమభూషితంబును రత్నసంచయసంబాధంబును గంధర్వనగరాకారంబును మరుద్వృక్షకిన్నరోరగమందిరసుందరంబును దూర్యత్రికముఖరితంబును నగురావణునిసభామంటపంబు డాయం జని తేజోవితతరశ్మిమంతుండు భీమకర్ముండు నగువిభీషణుండు సూర్యుండు మహాభ్రపటలంబు ప్రవేశించినకరణి నమ్మణిమందిరంబు ప్రవేశించి వేదవిదు లగుబ్రహ్మరాక్షసులు గావించువిజయసంశ్రితంబు లైనపుణ్యఘోషంబు లాకర్ణించుచుఁ దిలపాత్రసర్పిర్లాజకుసుమాక్షతలచేతఁ బూజితు లగుమంత్రబ్రాహ్మణకోవిదబ్రహ్మరాక్షసుల విలోకించుచు నెడనెడ నెదుర్కొని యాతుధాను లిచ్చుపూజనంబులు గైకొనుచు నిజతనుచ్ఛాయావిశేషంబునఁ దత్సభాంతరకుడ్యంబు లెల్ల సువర్ణమయంబులు సేయుచుం జని యన్నచరణంబుల కభివందనంబుఁ గావించి తదీయకటాక్షనిర్దిష్టం బగు హేమజాలవిభూషితం బైన మణిమయరుచిరాసనంబుకడకుం జని సవినయంబుగ జయశబ్దంబున రాక్షసనాథు నభినందించి యుచితభంగి నాసీనుండై దేశకాలార్థతత్త్వజ్ఞుండును దృష్టలోకపరావరుండును యుక్తినిశ్చితార్థుండును ననుష్ఠితవందనాదిక్రియాక్రముండు నగునతం డన్న కభిముఖుం డై మంత్రకాలనిర్ణయం బెఱింగి మంత్రిసన్నిధియందు దుర్నయంబు బోధించువారి నెల్ల నివారించి ప్రసంగవశంబున రాజనీతివిద్యావిలాసంబు లగువాక్యప్రకరణోపన్యాసంబుల నతనిచిత్తంబొక్కింత మెత్తపఱచి హేతునిశ్చితంబును ధర్మార్థసహితంబు నగుసాంత్వవాక్యంబున ని ట్లనియె.

విభీషణుండు రెండవమాఱు రావణునికి బోధించుట.

ఉ. రాక్షసనాథ సీత నగరంబున నుంచిననాఁటనుండి మ
ద్వీక్షకు దుర్నిమిత్తములు వేయివిధంబులఁ దోఁచె మంత్రసం
ధుక్షితుఁ డయ్యుఁ బావకుఁడు ధూమశిఖాకలితస్ఫులింగుఁడై
యక్షయకాంతిఁ జూపఁడు సుఖాయతనంబుల నేమి చెప్పుదున్. 180

తే. అరయ నగ్నిష్ఠములయందు నగ్నిశాల
లందు బ్రహ్మస్థలులయందు నధిప కాన
నయ్యెడు సరీసృపములు హవ్యములయందుఁ
జాలఁ దోఁచెడు సాంద్రపిపీలికలును. 181

క. రావణ పాలుం గురియవు, గోవులు విమదంబు లయ్యెఁ గుంజరములు హే
షావిష్కరణము లుడిగెను, భావింపఁగ గ్రాసములకుఁ బాసి హయంబుల్. 182

తే. దానవోత్తమ యుష్ట్రాశ్వతరఖరములు
మేఁతలకుఁ బాసి చింతాజడాతురత్వ
మలమికొన నూర్ధ్వరోమంబులై యనార
తంబుఁ గన్నీరు గ్రంచుఁ బత్తనమునందు. 183

మ. అనుమానింపక సద్మగోపురవిమానాగ్రంబున న్సంతతం
బును గాకంబులు గృధ్రసంఘములు గుంపు ల్గట్టి రక్షోవినా
శనముం దెల్పెడుమాడ్కి మ్రోసెడు రహిం జర్చింపఁగా సంధ్యలం
దనఘా ఘోరశివాభిఘోషణము లట్లాలింపఁగా నయ్యెడిన్. 184

క. మఱియుఁ బురద్వారసము, త్కరము న్మాంసాదఖగమృగవ్రాతము ల
ప్పురమున గుమిఁ గూడి భయం, కరగతి వాపోవఁ దొడఁగెఁ గర్బురతిలకా. 185

వ. మఱియు రాక్షసనినాదంబు లశనిస్వనసహితంబులై నిరంతరంబు వినఁబడుచుం
డునిట్టియుత్పాతసూచకదుర్నిమిత్తదోషంబు సమస్తజనంబులకుఁ బ్రత్యక్షంబు
గాఁ గానంబడు చున్నది గావున. 186

క. విను మీదోషంబునకును, బనివడి నీమనమునందుఁ బ్రాయశ్చిత్తం
బొనరింపఁ దలఁచి తేనియు, జనపతికి నొసంగు మిపుడు జానకి నధిపా. 187

శా. సాకల్యంబుగ మంత్రనిర్ణయకళాచాతుర్య మేపార న
స్తోకప్రాఢిమఁ గర్జముం దెలిపి రీదోషాచరామాత్యకు
ల్నాకుం దోఁచినభంగిఁ దెల్పితి నృపన్యాయంబు నీ రెంటిలో
నీకుం దోఁచినదానిఁ జేయుము నయోన్మేషంబు చింతించుచున్. 188

ఆ. ఏను నీకుఁ గర్జ మెఱిఁగి బోధింపంగ, నెంతవాఁడఁ దోఁచినంతపట్టు
తెలిసి తెలియ కిట్లు పలికితిఁ దప్పుగా, నెంచి కనల కిటు సహింపు మధిప. 189

క. అని మంత్రిమధ్యమున నొ, ప్పినవైరివిభీషణుఁడు విభీషణుఁడు హితం
బును బథ్యము నగుబోధము, వినయంబునఁ దెల్పె దైత్యవిభునకుఁ దెలియన్.

వ. ఇట్లు బోధించిన హితంబును మహార్థంబును మృదుహేతుసహితంబును భూత భవిష్యద్వర్తమానకాలయోగ్యంబు నగువిభీషణునివాక్యంబు విని రావణుం డుపస్థితక్రోధుండును స్వగృహీతార్థనివేశవంతుండును నై యిట్లనియె. 191

ఉ. ఎక్కడిమాట లన్మనుజుఁ డేక్రియ నంబుధి దాఁటి రాఁగలం
డిక్కడి కన్మహీతనయ నేపగిదిం గొని పోవ నేర్చువాఁ
డుక్కున నింద్రముఖ్యసురు లొక్కటఁ దోడయి యెత్తి వచ్చిన
న్నిక్కము నాదుమ్రోల నని నిల్వఁగ లేరు విచార మేటికిన్. 192

వ. అని పలికి యద్దివిజసైన్యమర్దనక్షమబాహుబలవిక్రముం డగుదశాననుండు హితవాది యగువిభీషణునిఁ బోనం బనిచి కొలువు విడిచి నిజనివాసంబునకుం జని విభీషణాదిహితవాదులవాక్యంబులయం దనాదరణంబుఁ జేసి మైథిలీకామమోహితుండై మంత్రయోగ్యకాలం బతీతం బగుచుండ యుద్ధంబు సంప్రాప్తం బగుచుండ సుహృదమాత్యులతోడ మంత్రప్రాప్తకాలంబు నిరూపించి పరిచారిక లొసంగుగంధమాల్యంబులు గైకొనక సుహృదులు సేయుహిత ప్రసంగంబులు వినక యొక్కభంగి నారాత్రిఁ గడపి మఱునాఁడు సూర్యోదయసమయంబునఁ బాపకర్మంబులచేత నతిపాపుం డగురావణుండు జవాశ్వంబులం బన్ని యనర్ఘమణివిద్రుమసువర్ణజాలకింకిణీసహస్రంబుల నలంకరించి నేమినిర్ఘోషణావిభీషణంబుగా సూతుండు రథం బాయితంబు చేసి తెచ్చిన సముచితప్రకారంబున నమ్మహనీయస్యందనం బెక్కి యనంతరుచిరోత్తంసప్రభాపటలంబు దిక్కులం బిక్కటిల్ల నసిచర్మధరులును సర్వాయుధపరిష్కృతులును శూలగదాపరిఘహస్తులును శక్తితోమరపరశ్వధపాణులును నానావిధభూషణభూషితులును నానావికృతవేషులునునతిరథమహారథులునునగుయాతుధానులు మత్తమాతంగతురంగశతాంగంబు లారోహించి వెనుక ముందఱ నుభయపార్శ్వంబుల బలసి చనుదేర శంఖకాహళమృదంగపటహపణవదుందుభివీణావేణుప్రముఖనిఖిలవాద్యస్వనంబులు బోరుకలఁగ నేమిరవంబు లూర్జితగర్జారవంబులభంగి నింగి మాటుగట్టి మ్రోయ ముక్తాజాలవిభూషితం బగుపాండరచ్ఛత్రంబు సంపూర్ణనిశాకరునిమాడ్కి మస్తకోపరిభాగంబునం బండువెన్నెలలు గాయ హేమమంజరీగర్భంబులును శుద్ధస్ఫటికసదృశాకారంబులు నగు చామరవ్యజనంబులు సవ్యదక్షిణపార్శ్వంబుల నలంకరింపఁ గొందఱు నిశాచరులు సువర్ణవేత్రపాణులై సందడి జడియుచుఁ బురోభాగంబున నడువ సూతమాగధవందిగాయకవైతాళికు లంతంత నాటలఁ బాటల స్తుతినినాదంబుల నభినందింపఁ గృతాంజలులై యిరుదెసలం జాలుగొని రాత్రించరులుశిరంబులొక్కింత వాంచి యభివందనంబులు గావింప మంత్రవిదులగుబ్రహ్మరాక్షసులు కుసుమాక్షతలు చల్లుచు నాశీర్వాదంబులు సేయ రమ్యహర్మ్యంబులనుండి రాక్షసాంగనలు లాజాక్షతకుసుమముక్తాఫలంబులు సేసలు చల్ల ననంతరమై భ

వాభిరంజితుండై యద్దనుజకుంజరుండు రాజమార్గంబున నాస్థానమండపంబు దరియం జని మొగసాల నరకంబు డిగ్గి సువర్ణరజతాస్తీర్ణంబును శుద్ధస్ఫటికాంతరంబును రుక్మపట్టోత్తరచ్ఛదంబును ననేకపిశాచశతాభిగుప్తంబును విశ్వకర్మనిర్మితంబును జిత్రరత్నప్రభావిరాజమానంబు నగు నమ్మహనీయమందిరంబుఁ బ్రవేశించి యందు వైడూర్యవిరచితంబును బ్రియకాజినసంవృతంబును మహోత్సవాశ్రయంబును బద్మరాగమణిస్థగితంబు నగు రుచిరాసనంబున సుఖాసీనుండై సమస్తలోకరక్షాదక్షుండైన యాశ్వరుండుంబోలె వెలుంగుచు నక్షశగ్రీవుండు. 193

—రావణుండు మంత్రుల నందఱ రావించుట.—

ఉ. చారులఁ జూచి మీరు రభసంబున నేగి మదీయశాసన
స్ఫారబలంబు తోడుగ వెసం బురిలోఁ గలవారి నందఱ
న్వారక తోడి తెండు తఱి వచ్చినయప్పుడు పిన్నపెద్దలం
జేరిచి కార్యనిశ్చయము సేయుట రాజుకి నీతి గావునన్. 194

వ. అనిన విని. 195

సీ. ఆనిశాచరులు మహాప్రసాదం బని వెస నేగి లంకలో వీథులందు
రమ్యమందిరచత్వరములందు మేడలయందు విహారశయనములందు
నుద్యానవనముల నుపవనంబులయందు వసియించి యున్నరాక్షసుల కెల్ల
దశకంఠశాసనోద్ధతిఁ దెల్పి విని వారు వెఱచుచుఁ గొందఱు కరులఁ గొంద

తే. ఱశ్వములఁ గొందఱు మహాశతాంగములను
గొంద ఱుష్ట్రఖరవ్యాఘ్రగోవృషములఁ
దీవ్రగతి నెక్కి కొందఱు తేపనములఁ
జనిరి విభుఁ డున్నయాస్థానసదనమునకు. 196

తే. ఇట్లు గూడినదంతివాజీంద్రవీర, భటశతాంగమహాకదంబములచేత
నప్పురం బొప్పె నప్పు డత్యద్భుతముగఁ, బక్షిగణములచేత నంబరముకరణి.

—విభీషణుండు రావణుసభామంటపమునకు వచ్చుట.—

వ ఇత్తెఱంగున నం జని యయ్యాతుధానులు తమతమవాహనంబులుడిగ్గి గిరిగుహాభ్యంతరంబుఁ బ్రవేశించుసృప్తకంఠీరవంబులచాడ్పున నమ్మహనీయసభామండపంబుఁ బ్రవేశించి తగినతెఱంగున దశకంఠుని సందర్శించి తచ్చరణంబులకుం బ్రణమిల్లి యతనిచేతం బ్రతిపూజితులై తదనుమతంబునం గొందఱు పీఠంబులందును గొంద ఱాస్తరణంబులందును గొందఱు వితర్దికలందును గొంద ఱాసంవృతమేదినియందునుం గా నందఱు యథార్హస్థానంబుల నాసీనులైరి నిశ్చయార్థంబులందుఁ బండితు లగుమంత్రిముఖ్యులును గర్మసహాయు లగునమాత్యులును బుద్ధిసంపన్ను లగుహితులును గుణోపేతు లగుబాంధవులును శూరు

లగుదండనాయకులును ననురక్తు లగుమిత్త్రులును సమానసుఖదుఃఖు లగుపుత్త్ర
పౌత్త్రులును వేర్వేఱ యరుగుదెంచి సముచితంబుగాఁ బొడసూపి పూర్ణమనో
రథులై తచ్ఛాసనంబునఁ దదీయక్షేమంబు విచారించుటకుఁ దత్సభాంతరకుడ్యం
బులందుఁ బ్రతిబింబితసర్వాంగులై యస్థాసనంబులం గూర్చుండి రంతకుమున్న
యుత్తుంగతురంగంబులం బూన్చినసువర్ణమణివిచిత్త్రయుగాక్షకూబరధ్వజ
చక్త్రప్రముఖసర్వాంగసుందరస్యందనం బెక్కి చనుదెంచి యున్నవాఁ డగుటం
జేసి మహాత్ముం డగువిభీషణుండు తత్సమయంబున మొగసాల నరదంబు డిగ్గి
వినీతుండై యన్నకడకుం జని నిజనామాక్షరంబులు నొడువుచుఁ దచ్చరణంబు
లకు నమస్కరించి తత్పార్శ్వంబున నొక్కసువర్ణపీఠంబున నాసీనుం డయ్యెఁ
బదంపడి శుకసారణప్రహస్తులు చనుదెంచి రావణుననుమతంబున యుక్తప్రదే
శంబులం గూర్చుండి రిట్లెల్లవారును సువర్ణమణిమయమండనమండితసర్వాంగు
లును సుగంధిగంధసారకస్తూరికాకర్పూరాగరుచందనద్రవదిగ్ధశరీరులును బరా
ర్థ్యకుసుమమాలికాలంకృతులును దుకూలచేలధరులునై రావణునిమొగంబులం
జూడ్కి నాటించి పృథగాసనాసీనులై యుండ నప్పుడు తదీయపుష్పహారగంధ
సారపరిమళోల్లాసభాసురం బై యమ్మణిమందిరంబు గంధమాదనంబుకరణి
శోభిల్లె నిత్తెఱంగున బంధుమిత్త్రామాత్యసామంతపుత్త్ర పౌత్త్రభ్రాతృసుహృజ్జన
సేనానాథపరివృతుండై దశాననుండు తన్మధ్యదేశంబున వసురుద్రాదిత్యమరుద్గ
ణమధ్యంబునం దేజరిల్లుసహస్రాక్షునిచందంబున నందం బగుచుఁ గొండొక
సేపు కొలువై యుండి యంత నొక్కింత కార్యప్రసంగంబునకుఁ బూర్వరంగం
బుగాఁ బ్రహస్తు నవలోకించి యిట్లనియె. 198

సీ. అమరారి నేఁడు కామాసక్తుఁ డై గృహైకాంతస్థలంబునఁ గార్యగోష్ఠి
సల్పుచున్నాఁడు తత్సందర్శనంబు నేఁటికి లేదు మీరు రేపకడ రండు
పొం డని యెప్పటిపోల్కిఁ గొల్వకు వచ్చువారి కింద్రాదిగీర్వాణవరుల
కెఱుఁగింపఁ దగు నిశాచరుల నల్లవఁకులయందు నిల్పుము తక్కినట్టియెడల
తే. నొరులు రాకుండఁ దలకొని యుండునట్లు
కావు పెట్టు మటన్న నా కరణి నన్న
పనులు సమకూర్చి యెప్పటిభంగి విభుని
మ్రోలఁ గూర్చుండి చేతులు మోడ్చి పలికె. 199
శా. దేవా దేవరవారు చెప్పినటు లెంతే ప్రీతి నిప్పాటికి
న్నావింపం దగ లాఁతివారు చొరకుండ న్లో వెలిన్ ధీరుల
న్దేవారాతులఁ గావు పెట్టితిని సందేహంబు పోఁబెట్టి యే
త్రోవ న్మేలగు నట్టిమంత్రసమయోద్యోగంబు వాటింపుఁడీ. 200
క. నా విని సంతోషము మది, నావిర్భవ మంద సభ్యు లందఱు వినను
శ్రీవిభవ మెసఁగ నార, క్షోవిభుఁ డిట్లనియె రాజ్యసుఖహితరతుఁ డై. 201

రావణుఁడు సభ్యుల కాలోచనీయాంశంబుఁ జెప్పుట.

తే. సారధర్మార్థకామకృచ్ఛ్రములయెడ సు
ఖాసుఖహితాహితములు ప్రియాప్రియములు
మఱియు లాభవ్యయంబులు నెఱిఁగి పతికిఁ
గర్జ మెఱిఁగింప దక్షులు గారె మీరు. 202

మ. భువనక్షోభకరప్రతాపమహిమస్ఫూర్తి స్ఫురద్బాహువా
సనయత్నేశజయంబు మున్నగ సమస్తప్రాప్తకృత్యంబుల
న్భవదాలోచనపూర్వకంబుగ నొనర్ప న్నిష్ఫలత్వంబు నొం
దవు మున్నెన్నఁడు మాకు నిర్వహణమేధాశక్తియుక్తంబులై. 203

క. వసురుద్రాదిత్యసురు, ద్విసరంబులు శక్రునకుఁ ద్రివిష్టపరాజ్యం
బొసఁగిన క్రియ నాకును రాక్షసరాజ్యవిభూతి మీ రొసంగఁగ వచ్చెన్. 204

క. ఆతతశౌర్యుం డతివి, ఖ్యాతబలుఁడు పంక్తికంఠుఁ డని సర్వజగ
ద్వ్రాశము ననుఁ గొనియాడుట, ధాతవరంబునను మీకతంబునఁజుండీ. 205

మ. అమరేంద్రాదిదిగీశు లేఘనునిబాహాసత్త్వ మూహించి చి
త్తమునం గూరినభీతి నాకు నెపుడు న్దాస్యంబు గావింతు ర
య్యమితస్థైర్యుఁడు కుంభకర్ణుఁ డతినిద్రాసక్తుఁ డౌట న్నము
ద్యముఁడై యింతకుమున్నెఱుంగఁడు మదీయంబైనవృత్తాంతమున్. 206

చ. అతఁడు నయానయజ్ఞుఁడు హితాహితకోవిదుఁ డాత్తధైర్యుఁడుం
జతురత మానసపట్కము ప్రసన్నమతి న్నిదురించి సంప్రబో
ధితుఁ డయినాఁడు నేఁ డతనితేజమున న్విజితారినై కరం
బతులితసౌఖ్యసంపదల నందుట యుక్తము గాదె చూడఁగన్. 207

వ. అని పలికి యుద్ధశాసనుం డంత కంత కగ్గలంబుగాఁ దనచిత్తంబు సీతాయత్తం
బగుట నొక్కింత కామభారావసన్నుండై పాపస్వభావంబున వెండియు నిట్లనియె.

చ. అకట మహాప్రయాసమున నవ్విపినంబున నుండి జానకిం
జకితమృగాక్షి నమ్మనుజనాథపురంధ్రిని భోగవాంఛ న్రు
క్కక కొని తెచ్చితిఁ ద్విరదగామిని నేరుపు లెన్నియన్న ను
చ్చికలకు వేడ్క సేయదు భజింపదు తల్పము నేమి సేయుదున్. 209

క. ఆయంగనకుం బలెఁ గల, వా యతిరుచిరాంగసౌష్ఠవములు జగములం
దేయంగనలకు నైనను, దోయజములలోనిమించుతో సరివచ్చున్. 210

ఉ. ఉల్లమునందుఁ బ్రేమ దళుకొత్త సదా విభునే తలంచుఁ దా
నొల్లదు భూషణాంబరము లొల్లదు నవ్యసుగంధిచందనం
బొల్లదు భూషణాంబరము లొల్లదు మజ్జనపానభోజనం
బొల్లదు పుష్పమాలికల నొల్లదు రమ్యవనీవిహారముల్. 211

ఉ. ఎప్పుడు వచ్చుఁ బ్రాణవిభుఁ డెప్పుడు ద్రుంచు దశాస్యు నాజిలో
నెప్పుడు వేడ్క నన్నుఁ గొని యేగు నయోధ్యకు నంచు నాకుఁ జే
పెప్పుడుఁ గోరుఁ గాని సుఖ మించుక గోరదు డాయ దన్యులం
ద్రిప్పుదు రామమార్గగతదృక్చయము ల్తదధీనచిత్తనై. 212

తే. వల్లభుఁడు వచ్చునో యనువాంఛఁ జేసి
తరళలోచన యొక యేఁడు తడ వోసంగ
వలయు నని నన్ను వేఁడిన వరుస దాని
కనుమతించితి నదియు డాయంగ వచ్చె. 213

తే. ఆచకోరాక్షి కంకీరవానలగ్న
శారదేందునిభానన చారుహేమ
బింబనిభ సౌమ్య పులినితంబ మయుని
మాయక్రియ నామనంబును మరులుకొలిపె. 214

క. అరుణనఖంబులు విద్రుమ, తరుణంబులు పద్మరాగతలములు నగుత
చ్చరణంబులు ధృతదివ్యా, భరణంబులు సంతతంబుఁ బాయవు మదిలోన్.

చ. అరుణమరీచికై వశీ హుతాశనుహేతిక్రియం జెలంగున
త్తరుణిని దన్మనోజ్ఞముఖతామరసంబును దద్వినీలసుం
దరకచపాళిఁ దత్పృథునితంబముఁ గాంచినయంత మల్లికా
శరుఁడు దురంతదుస్సహనిశాతశరంబులపాలు సేయఁడే. 216

తే శోకసంతాపనిత్యంబు భీకరంబు, దుఃఖహర్షసమానంబు దుస్సహంబు
నధికదుర్వర్ణకరణంబు నగుదురంత,కామభరమున మిక్కిలి గాసిపడితి. 217

ఆ. కాంతహృదయ మెంతకఠినమో యేఁడాది,నుండి బహువిధముల నొక్కరీతి
వేఁడుకొనిన వినదు విభునిపై మోహంబు, విడువ దించుకైన వెఱవ దకట.

తే. వేయిభంగుల నిత్యంబు వేఁడి వేఁడి
వెలఁది యనుకూల గామికిఁ గలఁగి కలఁగి
కామబాణానలంబునఁ గ్రాఁగి క్రాఁగి
యలసితిఁ బథిశ్రమక్లాంతహయముకరణి. 219

క. నిరుపమసత్వాకీర్ణము, దురంత మక్షోభ్యమైనతోయధి నివు డె
త్తెఱఁగున దాఁటెద రవ్వా, నరవరు లేమైన నున్న నాకుం జెపుఁడీ. 220

తే. వనధి నిక్కము దాఁటలే రనఁగ రాదు
మనుజపతిబంటు వానరమాత్రుఁ డొకఁడు
శరధి నవలీల దాఁటి యిప్పురములోన
నంతలంతలు సేయఁడే యల్లనాఁడు. 221

క. మున్నీరు దాఁటి వచ్చినఁ, గ్రన్నన నరమాత్రుఁ డయినరాఘవుఁ డనిలో
న న్నేమి సేయఁగలఁడు న,మున్నతమతులార మీర లూహింపుఁ డీఁకన్. 222

క. మును దేవాసురయుద్ధం,బున గెల్చుట మీప్రభావమునఁ గాదె ప్రభం
జనసుతుఁ డాదిగఁ గీశుల, నినకులజుల నట్ల నే జయింపఁగ రాదే. 223

ఉ. ఇక్కడ సీత యున్నవిధ మెంతయు వాయుసుతుండు చెప్పఁగా
నెక్కడ లేనికిన్కఁ బృథివీశుఁడు కీశచమూసమేతుఁడై
తక్కక యమ్మహాజలధి దాఁటఁగ యత్నము సేయుచుండెఁ బో
ల్నిక్కువ మింతవట్టు రజనీచరులార తలంచి చూడఁగన్. 224

ఉ. మానుగఁ గంధి దాఁటఁ గలమానవుఁ డెవ్వఁడు లేఁడు ధాత్రి న
మ్మానవనేత దాఁటి గరిమం జనుదెంచుట యంత నిక్కువం
బేనియుఁ జేఁబ గల్గు మన కెల్లను జానకి నిత్తు నంటి నో
యే నెటు లిత్తు వధ్యునకు నిచ్చినఁ బౌరుషహానియే కదా. 225

కుంభకర్ణుండు ప్రబుద్ధుఁడై తన యభిప్రాయము రావణునకుఁ జెప్పుట.

వ. కావున బహువిధసంశయకలుషీకృతం బైనమచ్చిత్తంబునకు సమాధానం బాలోచించి చెప్పుం డనిన నప్పుడు కామపరీతుం డగునన్నపరిదేవనంబు విని తత్కాలసమాగతుం డగుకుంభకర్ణుండు క్రోధారుణితలోచనుండై యిట్లనియె.

సీ. అధిప నీచేసినయట్టికార్యమునకు నీతిబోధము సేయ నేర నైన
నెద్ది యేనియు నొక్కహితకార్య మొనరింప నృపతికిఁ బ్రీతి జనించునపుడె
యాప్తులతోడఁ బర్యాలోచనముఁ జేసి సేయుట లెస్స తాఁ జేసి పిదప
యోచింప నే మగు యుక్తమైన నయుక్తమైనఁ జేకొని సేయు టంతె కాక

తే. సీత నిటు దేకమున్నది చెప్పితేని
యంగజముఁ గూడి యోచింతు మంతమీఁద
యమున యాముననామాచలమును బోలెఁ
జిత్తమును నిశ్చయమును భజించు నధిప. 227

తే. అడవిలో మౌనినై యున్నయట్టివాని
ముదిత మ్రుచ్చిలి కొని తెచ్చి పిదప నతఁడు
కార్యమున కెత్తి వచ్చినఁ గలఁగి నీతిఁ
జెప్పుఁ డని పల్క నే మని చెప్ప వచ్చు. 228

తే. ఇట్టికృత్యంబువలన నయ్యెడుఫలంబు, నీవిపుడు చిత్తమం గని నిశ్చయించి
యున్నవా రది మన కేల యుష్మదభిమతంబు సిద్ధించునట్టివిధంబు వలయు.

తే. అవని నెవ్వాఁడు రాజకార్యములు నీతి, శీలపద్ధతిఁ దప్పక సేయు నట్టి
నిశ్చితార్థమనీషుండు నృపవరుండు, పిదప నెందును మదిలోఁ దపింపఁ డధిప.

క. అనుపాయంబున నేయే, ఘనతరకర్మము లొనర్పఁ గడఁగుదు రాయా
పను లన్నియు వ్యర్థము లగు, దనుజకులోత్తమ యపాత్రదానముభంగిన్. 231

క. మొదల నొనర్పఁ దగినపనిఁ, బిదపం గావించునతఁడు పిదపటిపనిఁ దా

మొదల నొనరించునాతఁడు, నధీశ్వర నయానయజ్ఞుఁ డగునే ధాత్రిన్. 232

తే. అధిప బలవంతుఁ డైనఁ గృత్యములయందుఁ
జపలుఁ డగువానిబలవిశేషంబుఁ జూచి
వానిరంధ్రంబు సొత్తురు పూని రిపులు
కవిలి హంసలు క్రౌంచరంధ్రమును బోలె. 233

వ. రాక్షసేంద్రా నీవు మూర్ఖతాహేయ్యంబున మనంబునఁ దలపోయక ప్రాణహాని
కరం బైనయిక్కార్యంబుఁ జేసితి వింతకు మున్నె యెన్నఁడేని నిహతుండ వై
పోడ వడంగిపోవం దగినవాఁడవు దైవవశంబున రాముండు విషమిశ్రం బైన
మాంసంబుం బోలె నిన్ను వధింపక యుపేక్షించె నింక నా తెఱంగు వినుము.

తే. అధిప నీచే సమారబ్ధ మైనయట్టి, నిరుపమం బైన కర్మంబు గురుబలమున
నేను దీర్చెద నిష్టుడ వానరేంద్ర, మానవేంద్రాదివైరుల మడియఁ జేసి.

ఉ. దానవకాలు లైనఁ దగ వహ్నిసదాగతు లైన నీలకం
ఠాసురవర్యు లైన ధనదాంబుధినాయకు లైన వైరిసం
త్రాసవిలాసి నై రణశిరంబున రాముని వానితమ్ముని
న్భానురలీలఁ జంపెద నిశాచరశేఖర చింత యేటికిన్. 236

క. గిరిమాత్రశరీరుఁడ నై, గురుశూలముఁ దాల్చి నిడుదకోఱలు మెఱయం
బోరిఁబోరి నార్చెడు ననుఁ గని, పురందరుం డైనఁ బాఱిపోఁడె భయమునన్.

మ. అనఘా వాదము లేల సర్వకపియూథాధ్యక్షుల న్ద్రుంగెద
న్మనుజశ్రేష్ఠుల రామలక్ష్మణుల శుంభద్భంగి మర్దించి త
ద్ఘనకాయోత్థితరక్తబిందువులు గిన్కన్ బట్టి వేఁ గ్రోలెదం
బ్రణుతింపం దగ నీకు నిత్తు జయము న్రక్షఃకులాధీశ్వరా. 238

క. నాయంతవాఁడు నీకు స, హాయుఁడు గలుగంగ వెఱవ నగునే విజయ
శ్రీయుతునింగాఁ జేసెద, నోయసురకులావతంస యూఱడు మింకన్. 239

చ. అలఘుఁడు రాఘవుండు మదనంతబలాభిహతి న్రణంబులోఁ
బొలిసి యమక్షయంబునకుఁ బోయినపిమ్మట భర్తృహీన యై
పొలుపుగ రాజపుత్రి నినుఁ బొందెడుఁ గావున విజ్వరుండ వై
తలఁకక వాసితాసవము ద్రావుము సేయు మభీష్టభోగముల్. 240

వ. అని కుంభకర్ణుండు సంరంభవిజృంభితుం డై పలికిన నప్పు డొక్కముహూర్తంబు
చింతించి రావణునియభిప్రాయంబు నెఱింగి మహాబలుం డగుమహాపార్శ్వుండు
కృతాంజలిపుటుం డై యిట్లనియె. 241

మహాపార్శ్వుండు రావణునకుఁ దనయభిప్రాయముఁ దెల్పుట.

క. ధర నెవ్వాఁడు మృగోరగ, పరికీర్ణవనంబు సొచ్చి ప్రాప్తం బగుభా
సురమధువుఁ గ్రోలఁ డానరుఁ, డరయఁగ బాలిశుఁ డనంగ నగుఁ దనుజేంద్రా.

క. ఈశ్వరుఁడ వైననీ కొక, యీశ్వరుఁడుం గలఁడె చింత యేల విడిచి దై
త్యేశ్వర జానకితోఁ దగ, శాశ్వతసౌఖ్యంబు గనుము జయశీలుఁడ వై. 243

మ. ఇటు చింతింపఁగ నేల బల్మి నిపుడీ యింతి న్వశం బట్టి కు
క్కుటవృత్తంబునఁ గాంచు దీఱఁ దగ రక్షోనాథ భోగింపు మం
తట నొక్కింత భయంబు గల్గినను జెంతం ద్రోవఁగా వచ్చుఁ గా
కెటులైనం గడు లెన్న ప్రాణము ఘనం బివ్వాంఛితం బల్పమే. 244

తే. చతురుఁ డికుంభకర్ణుండు శక్రజిత్తు, మహితభుజవీర్యగుప్తుల మమ్ముఁ గూడి
తిగ్మశతకోటిఁ దాల్చినదేవభర్త, నైన సాధింప శక్తులు దానవేంద్ర. 245

ఆ. అధిప నీతికుశలమగువారిచే సుకృ, తంబులైన సామదానభేద
ముల నతిక్రమించి యులఘుదండంబున, నర్థసిద్ధి వడయు మయ్య నీవు. 246

క. వానరయుతముగ నిచటికి, మానవపతి వచ్చెనేని మానక యనిలోఁ
నానాస్త్రశస్త్రచయములఁ, బూని వధించెదము శంక పోవిడు మనఘా. 247

రావణుఁడు తన్ను బ్రహ్మ శపించినతెఱంగు మహాపార్శ్వున కెఱిఁగించుట.

వ. అని పలికిన విని యద్దనుజేశ్వరుండు వానిహితోపదేశంబునకు సంతోషించిన
యతనిం బొగడుచు నిట్లనియె. 248

తే. అసురశేఖర నీచెప్పినట్టి తెఱఁగు
యుక్తమగు నైన దానికి నొక్క వేధ
గలిగి యున్నది విను మది కడు రహస్య
మెఱుఁగ రెవ్వరు దాఁపక యెఱుకపఱుతు. 249

చ. తొలుకరిమించుకైవడి విధూమహుతాశనహేతివై ఖరి
న్వెలుఁగుచు నభ్రమార్గమున నీరజగర్భునికొల్వు సేర ను
జ్జ్వలగతి నేగుదానిఁ జెలువం బగుపాటలదానిఁ బుంజిక
స్థల యనుదాని నొక్కసురతన్విని గాంచి స్మరాతురుండ నై. 250

క. ఏను రయంబునఁ జని య, మ్మానిని బలిమి న్గ్రహించి మాను మటన్న
న్మానక కడు మోహమ్మునఁ, బోనీక రమించి విడిచి పుచ్చితి నంతన్. 251

తే. ఆ నెలఁత వాతలోలిత యైననళిని
పగిదిఁ గడు డస్సి వ్రేఁగున బ్రహ్మకడకుఁ
జని యెఱింగింప నవ్విధి గనలి నన్నుఁ
గూర్చి యిట్లని శపియించె ఘోరభంగి. 252

క. సురవైరి నేఁడు మొదలుగ, గుఱుతుగఁ బరసతులఁ బల్మిఁ గూడితి వేని
న్ధర నప్పుడె నీశీర్షము, లరుదారఁగ నూఱు వ్రయ్యలగు నిక్కముగన్. 253

క. అని మున్ను శపించిన నీ, య్యనఘునిశాపోక్తిఁ దలఁచి యతిభయమున నీ
జనకసుత బలిమిఁ గైకొని, ఘనశయనంబునకుఁ దార్పఁగా లేనైతిన్. 254

ఆ. రాముఁ డడుగుడంచి రణమున నను నోర్వఁ, గలఁ డటన్నచింతగాదు వినుము
సీత నిపుడు బల్మిఁ జేకొని భోగింప, వాలి గామి కాత్మ నడలు పుట్టె. 255

క. శరనిధికిఁ బోలె వేగము, కరుసలికిం బోలెఁ దీవ్రగతియును నాకుఁ
బొరిఁకొను రుమ్మఁగఁ రాఘవుఁ, డెఱఁగిన నాతోడిచివ్వ కేటికి వచ్చున్. 256

తే. శైలగుహాంతరమున నున్న కేసరిని దోలి
నట్లు మృత్యువు వదలించినట్లు గాదె
ఘనకృతాంతుని కై వడిఁ గ్రాలుచున్న
నను రఘూత్తముఁ డెదిరించి చనకు మెల్ల. 257

క. వినుము మదీయధనుశ్చ్యుత, ఘనతరవజ్రోపమాన కాండంబులచే
జనవిభునిఁ బాలియుఁ జేసెదఁ, గనదుల్కలచేత గంధగజమును బోలెన్. 258

క. అనుపమబలయుక్తుఁడ నై, మనుజేంద్రుని బలమునెల్ల మాయించెద నె
ట్లనిన నుదయార్కుఁ డుజ్జ్వల, ఘనతరనక్షత్రజాలకాంతినిబోలెన్. 259

తే. మూఁడుకన్నులు గలయష్టమూర్తి నైన
వేయికన్నులు గలదేవవిభుని నైన
మొనసి నిర్జింప శక్తుఁడ మున్ను హరస
ఖుని ధనదుఁ దోలి యీపురిఁ గొంటిఁ గాదె. 260

ఆ. మాన వేశ్వరుండు వాత్కరమండిత, చండచాపముక్తకాండములను
గాలసర్పములను బోలె సంగరమునఁ, గాంచి పిదప భీతి గాంచుఁగాక. 261

విభీషణుఁడు రావణునకు హితము బోధించుట.

వ. అని పలికిన నన్నిశాచరేంద్రునివాక్యంబులు విని యంతకు మున్ను కుంభకర్ణుం డాడినసగర్వాలాపంబు లాకర్ణించి హితవాది యగువిభీషణుండు కొండొక సేపు దురంతచింతాక్రాంతుం డై యూరకుండి యంత నొక్కింత వెచ్చ నూర్చి రాక్షసరాజముఖ్యు నవలోకించి పరమార్థయుక్తం బగువాక్యంబున నిట్లనియె.

తే. భూరితనువు బాహ్వంతరభోగరాశి
యుతము చింతావిషంబు సుస్మితమహోగ్ర
పటురదంబు పంచాంగుళీపంచశిరము
నైన సీతాహి పొందు నీ కగునె కోర. 263

క. తులువల దుర్బోధంబుల, వలనం జెడిపోక బ్రతుకవల తేని నిశా
టులలామ హితుఁడ నగు నా, పలుకులు విని సీత నిమ్ము పార్థివున కొగిన్. 264

ఉ. కాలకటాక్షతుల్యలయకాలదినేశకరోపమానదం
భోళినమాన హేతుమణిపుంఖనిశాతభయంకరోజ్జ్వల
జ్వాలనిభంబు లై నవరదేవుశరంబులు పర్వ లంకపై
వ్రాలక మున్నె శీఘ్రమున రావణ రాముని కిమ్ము జానకిన్. 265

ఉ. పర్వతకూటమాత్రులును బర్వతదంతనఖద్రుమాయుధు
ల్పర్వతవాసు లుగ్రబలరాసులు కీశులు లంకఁ జొచ్చి దో
ర్గర్వ మెలర్ప దైత్యులఁ గదంబు వధింపక మున్నె కైకసీ
తనయ సుబుద్ధివై దశరథప్రియపుత్త్రున కిమ్ము జానకిన్. 266

ఉ. అంతకదండతుల్యము మహాశనికల్పము వాయువేగ మ
స్వాంతకరంబు నైన మనుజాధిపదారుణబాణజాల మ
త్యంతగతి న్త్వదీయమహాశయంబు నగల్పక మున్నె రావణా
పంతము మాని యమ్మనుజపాలశిఖామణి కిమ్ము జానకిన్. 267

మ. ఘననాదు న్ఘటకర్ణ దుర్ముఖమహాకాయాతికాయోగ్రకుం
భనికుంభాంతకజిన్మహోదరమహాపార్శ్వాదుల న్నమ్మి రా
మనరేంద్రోత్తముతోడ నీవు కలహింపం జూచితే వీర ల
మ్మనుజాధీశునిబాణవేగము సహింపం జాల రూహింపఁగన్. 268

మ. అనుమానింపక నిన్ను గెల్చినవిభుం డా హైహయాధీశుఁ డా
తని నిర్జించినవాఁడు భార్గవకులాధ్యక్షుండు రామాఖ్యుఁ డ
య్యనఘుం గెల్చినవీరుఁ డీరఘుకులాధ్యక్షుండు రాముండు నీ
కును నా రాముని కెంత యంతరము రక్షోనాథ చర్చింపుమా. 269

చ. హరిహయముఖ్యదిక్పతుల నందఱ నోర్చిననన్ను మనుష్యుఁ డె
త్తెఱఁగున నోర్చువాఁ డని మదిం దలపోయకు మన్మహీశశే
ఖరుఁ డొకమర్త్యమాత్రకుఁడు గాఁడు దశానన పద్మయోనికి
న్హరునకు నైన మెచ్చఁదగు నయ్య తదీయులసన్మహత్త్వముల్. 270

సీ. ఖండింపఁడే తొల్లి దండకావనవాసి యతికదంబవిరోధి నవ్విరాధుఁ
జంపఁడే మును సర్వసైన్యాన్వితంబుగాఁ బరిపంథిలోకభీకరుని ఖరునిఁ
ద్రుంపఁడే మున్ను నిలింపులు గొనియాడ నసమానబలసింధు నక్కబంధుఁ
బొలివుచ్చఁడే తొల్లి యలఘుమాయాబలదళితదేవనికాయుఁ దాటకేయు
తే. నంతలంతటిశూరు లట్లగుచు నుండ, నంతకంటెను నీమహత్త్వంబు ఘనమె
పుణ్యజనవంశశేఖర బుద్ధి గలిగి, సీత నొసఁగుము రామభూనేత కిపుడు. 271

వ. అదియునుం గాక. 272

సీ. శతముఖుఁ డెవ్వాని శౌర్యంబునకు మెచ్చి మహితకాంచనపద్మమాల యొసఁగె
నిను వాలమునఁ జుట్టుకొని జవం బేపార వనధులు నాల్గు నెవ్వాఁడు ముంచె
నొకయేఁడు బిలములో నుండి చలంబున మాయావి నెవ్వాఁడు మాయఁ జేసె
వనధిశైలంబు లెవ్వనిఁ గాంచి వెఱచిరి వాని దుందుభిని నెవ్వాఁడు చంపె
తే. నట్టిబలశాలి జయశీలి సజ్జనాలి, నమితతేజోవిశేషజితాంశుమాలి
వాలిని వధించె నమ్మహీవరుని గెల్తు, ననుచుఁ దలపోయు టది వెఱ్ఱితనము గాదె.

ఉ. పన్నుగ సీత నమ్మనుజభర్త కొసంగి సుఖింపు మట్లు గా

కున్న నభంబుఁ బ్రాఁకినఁ బయోనిధి సొచ్చినఁ గ్రింద దాఁగినం
గ్రన్ననఁ జంద్రభాస్కరపురందరు లడ్డము వచ్చి కాచిన
న్నిన్ను వధించు రామధరణీపతి రావణ నిక్క మింతయున్. 274

వ. అని పలికిన విభీషణునిపలుకు లాకర్ణించి ప్రహస్తుం డిట్లనియె. 275

మ. కులమర్యాదలు మాని పోఁడు దగురక్షోనాథుమ్రోల నస్వరో
ధుల నగ్గించెద వీవు చారణమరుద్భోగీంద్రగంధర్వయ
క్షులచే నెన్నఁడు మాకుఁ బోరులఁ బరిక్షోభంబు వాటిల్ల దీ
యిల నేఁ డీనరుఁ డైన తాపసునిచే నెబ్బంగిఁ బాటిల్లెడిన్. 276

వ. అని పలికిన ధర్మార్థకామనివిష్టబుద్ధి యగు నవ్విభీషణుం డహితం బైన ప్రహస్తుని వచనంబు విని రాజహితానుకాంక్షి గావున నూరకుండక వెండియుఁ బ్రహస్తు నవలోకించి హేత్వర్థసహితం బగువాక్యంబున నిట్లనియె 277

చ. గుఱుతుగ నీవు దుర్ముఖుఁడు కుంభనికుంభులు కుంభకర్ణుఁడు
న్నతికాయుఁడున్మహోదరనరాంతకముఖ్యులు చాలఁ గీడు మే
లెఱిఁగి హితంబు గోరి వచియించెడువారలు నే ననర్థము
ల్గఱపెడువాఁడ రాజ్యహితకాంక్షులు గారొకొ మీరు భర్తకున్. 278

ఆ. జగతి ధర్మహీను లగువారిచే నాక, పదము తగ జయింపఁబడనిమాడ్కి
రాజవర్యుఁ డైన రాముఁడు మీచేత, బవరమున జయింపఁబడఁడు సుమ్మి. 279

క. మన మేడ సకలజగదభి, వినుతపరాక్రముఁడు రామవిభుఁ డేడ రణం
బున గెల్చు టేడ వినుమా, మనుజపతికి మనకు హస్తిమశకాంతరముల్. 280

క. శతకోటికంటె వాఁడిమి, వితతోర్వర్బుధునకంటె వేఁడిమి గలయా
క్షితినాథముక్తకాండ, ప్రతతుల వేఁడిమి సహింప రాదు సురారీ. 281

క. మన మేడ నిర్జరేంద్రా, ద్యనిమిషసందోహ మొక్కటై వచ్చిన న
మ్మనుజపతిఁ జెనకలేరు, ప్పనిగొననిదురుక్తు లేల పలికెద విచటన్. 282

క. మాటల వ్రేసినయంతనె, పాటిగ బలవంతుఁ డయినపగతుఁడు సెడునే
మేటిగ ఖద్యోతంబుల, వ్రేటున గాఢంబుతమము విరియునె చెపుమా. 283

క. అర్మిలి జయాపజయములు, ధర్మాధర్మములవలనఁ దగ జనియించు
న్ధర్మము రామునియందు న,ధర్మము మనయందు నొప్పిదం బగుఁ గాదే. 284

ఉ. ఏ నిపు డెంత దెల్పిన నరేంద్రుమహత్త్వ మెఱుంగ లేవు త
న్మానితకార్ముకచ్యుతసమర్థదురాసదశాతబాణము
లూఁపనికిం దీక్ష్ణవజ్రములపోలిక నీయురముం బగిల్చి ప్రా
ణానిలముం దెరల్చునపు డైన నెఱింగెద వీవు రాక్షసా. 285

ఉ. ఆడినయంతవట్టు చలమారఁగఁ జేసెదునంతను వ్రతుం
డాడినఁ గొంత లెస్స తనయంతరముం దెలియంగ లేనివాఁ

డాడినఁ బౌరుషంబె మనుజాధిపుపంపునఁ గోఁతి వచ్చి యీ
వీడు గలంచునాఁడు మనవిక్రమసంపద లెందుఁ బోయెనో. 286

వ. మఱియుఁ గుంభకర్ణుండు విక్రమోద్దీర్ణుం డనియును మేఘనాదుండు నిర్జిత దేవనాథుం డనియు నకంపనుండు భువనకంపనుం డనియును త్రిశీర్షుండు రిపు దుర్ధర్షుం డనియు నతికాయుండు నిర్జితదేవనికాయుం డనియును దేవాంతక నరాంతకులు విత్రాసితాంతకు లనియును గుంభనికుంభులు రణసంరంభు లని యును ధూమ్రాక్షమకరాక్షయూపాక్షవిరూపాక్షులు రాక్షసహర్యక్షులనియును మహాపార్శ్వమహోదరులు శత్రుభయంకరు లనియును నమ్మి మదం బెక్కించు కొని యీరావణుండు రామునితో విగ్రహంబునకుఁ బూని యున్నవాఁ డది యేటివిచారంబు వీరలయం దొక్కరుండు నన్మహనీయపరాక్రమునివిక్రమా టోపంబు సహించి రణంబున నిలువంబడువాఁడు లేఁడీరజనీచరవల్లభుండు మదన వ్యసనాభిభూతుండై తీక్ష్ణస్వభావంబున స్వపరబలవిశేషంబు లెఱుంగక యమిత్ర ప్రతిమానమిత్రు లగుమీచేత రాక్షసవినాశంబునందు నియుక్తుం డై యున్న వాఁ డట్లగుటం జేసి పథ్యంబు లైనావచనంబులు శ్రుతిపుటంబులకు వికటం బు లై యున్నయవి గావున ననంతభోగంబును సహస్రశీర్షంబును భీమంబును మహాబలంబు నగుమహానాగంబుచేతఁ బరిక్షిప్తుం డైనయితని విశ్వాసంబున విముక్తునిం జేసి రక్షింపుం డని పలికి వెండియు ని ట్లనియె. 287

క. తఱి వచ్చినపుడు భూవరుఁ, డరయఁగఁ బరిపూర్ణకాము డగుభృత్యులచేఁ
బరిరక్షితవ్యుఁడు నిశా,చర భూతగృహీత మైనజనము న్బోలెన్. 288

ఉ. పిన్నటనాఁటనుండియును బెంచినకూర్మి దలంచి బుద్ధిసం
పన్నత మీర లందఱు నృపాలపయోధిపయఃపరీతుఁ డై
యున్నదశాస్యుని న్మనుఁగ కుండఁగఁ జేకొని యుద్ధరింపుఁ డే
నన్నహితంబు గోరి వినయంబున సారెకు మిమ్ము వేఁడెదన్. 289

ఆ. కన్నుఁ గాన కిపుడు కాకుత్స్థపాతాళ, వదనగహ్వరమున వ్రాల నున్న
యీనిశాచరేంద్రు, నిందఱు రక్షింపుఁ, డిదియె నామతంబు త్రిదశవైరి. 290

చ. ఇది మన కెల్లవారికి సుహృత్తులకు న్బలకోశదుర్గసం
పదలకు నీనిశాటకులపాలునకుం గడు మేలు గావునన్
వదలనియుక్తి నాపలుకు వాక్యముఁ గైకొని రామభర్తకున్
ముదిత నొసంగునట్లుగఁ బ్రబోధము సేయుఁడు మీర లందఱున్. 291

ఉ. మానుగ దేశకాలమహిమానుంబులు వృద్ధిపరిక్షయంబులున్
స్థానబలంబు నాత్మపరశక్తివిశేష మెఱింగి నీతివి
ద్యానిపుణత్వ మేర్పడ నయానయము ల్పరికించి భర్తకున్
మానుగఁ బథ్యవాది యగుమంత్రియె మంత్రివరుండు చూడఁగన్. 292

వ. అని బహుప్రకారంబుల నీతిప్రబోధంబుఁ జేసిన బృహస్పతితుల్యమనీషుం డగు
నవ్విభీషణునిపలుకు లాకర్ణించి నైరృతయోధముఖ్యుం డగు నింద్రజిత్తీవ్రకోప
దీప్తాననుండై యద్దశాననునాననం బాలోకించి యిట్లనియె 293

ఇంద్రజిత్తు విభీషణునిఁ దిరస్కరించుట.

సీ. అతిభీరుఁ డైనయీయలఁతిమాటల మన కేమి కార్య మనర్థ మింతెగాక
యీదైత్యకులమున నింతకు మున్నిట్టివాఁ డిట్లు పలికెడువాఁడు నిట్లు
గావించువాఁ డెవ్వఁ డావిర్భవింపఁడు శౌర్యవిక్రమధైర్యసత్త్వవీర్య
భూరిదర్పవిముక్తపురుషుఁ డొక్కఁడు గల్గ నక్కులంబున కెల్ల హానిగల్గుఁ
తే. గానఁ బ్రాకృతుఁ డైనయీమానహీనుఁ
డొకఁడు లేకున్న మన కేమి యుమ్మలికము
తమ్ముఁ డను మోహ మది మాని తండ్రి వీని
బలిమి వెడలంగఁ బనుపు మిప్పొలము దాఁట. 294
క. విను మే నొక్కఁడ రణమున, మనుజేంద్రుల గీశబలసమన్వితముగఁ జ
య్యన వధియించెద నిఁక నీ, మనమునఁ గలసందియంబు మానుము తండ్రీ.
క. జనపతిపుత్త్రులు దుర్జయు, లని భీతి జనింప నాఁడె ననిలో వారిం
దునుమఁగ మాలో నొకనీ, చన రాదకుఁ డైనఁ జాలుఁ జర్చింపంగన్. 296
ఉ. దేవ త్రిలోకనాథుఁ డగు దేవవిభుండు పురందరుండు బా
హావిభవోజ్జ్వలుండు కులిశాయుధుఁ డుద్ధతి నన్నుఁ దాఁకి నా
చే వినిపాతితుం డగుట చిత్తమునం దలపోయ వల్వదే
రావణనందనుం డరివిరాముఁ డన న్వినరే జగజ్జనుల్. 297
చ. అమరవిరోధి తొల్లి చలమార సురేభముఁ దాఁకి పీఁకతో
సమర మొనర్చి దానిఁ బెలుచం బడఁద్రోచి తదీయదీర్ఘదం
తముఁ బెకలించి తోడుపడఁ దాఁకఁగ వచ్చిననాకవీరులం
గ్రమమున నంపఱం బలుదెఱంగుల మోదితిఁ గాదె యుద్ధతిన్. 298
ఆ. అట్టియేను గలుగ నధిప నీ కాపద, లేల వచ్చు రిపుల కేల జయము
గలుగు హీనమానవు లనంగ నెంత వా, రడలు మదికి నించుకైన లేదు. 299
వ. అని పలికిన నింద్రకల్పుండును దురాసదుండును మహాతేజుండు నగు నింద్రజిత్తు
పలుకు లాకర్ణించి శస్త్రభృద్వరిష్ఠుం డగు విభీషణుఁడు వాని నవలోకించి మనం
బున గర్హించుచు నిట్లనియె. 300

విభీషణుం డింద్రజిత్తును నిందించుట.

ఉ. ఓరి దురాత్మ నీకు సమయోచితమంత్రమునందు నిశ్చయ
స్ఫారత లేదు మూర్ఖుఁడ వపక్వమనీషుఁడ వట్లు గావున
న్వీరక యర్థహీన మగు వాక్యము వంశవినాశనార్థ మి
ట్లూరక యుచ్చరించితివి యోడక దీన జయంబు గల్గునే. 301

తే. రాఘవునితోడఁ గలహంబు ప్రాణహానిఁ
దెచ్చు నని యెంతఁ జెప్పినఁ దెలియ కిట్లు
పలికి దుర్మతి బోధించుకతనఁ బుత్త్రుఁ
డనుప్రవాదంబుచే వైరి వైతి వీవు. 302

క. అతిమూఢునిఁ గ్రూరుని దుర్మతి నతిసాహసుని నిన్ను మంత్రసమీప
క్షితికిం దెచ్చినరాక్షస, పతికిం జేటగుట కేమిపాటి దురాత్మా.

వ. మఱియు మూర్ఖుండవు నయరహితుండవు తీక్ష్ణస్వభావుండవు దురాత్ముండవునీచ
మతివి గావున దేశకాలంబు లెఱుంగక యజ్ఞానంబున వలచినచందంబునం బ్రేలె
దవు దీన నేమి యర్థసిద్ధి చేకుఱు బ్రహ్మశాపప్రతిమప్రభంబులును గాలనికాశ
రూపంబులును యమదండకల్పంబులును సూర్యమరీచిసన్నిభంబులును నగు
రామునిశరంబులు సహింప నిం దెవ్వండును సమర్థుండు గాఁ డివ్వాక్యంబులు
సత్యంబులు గావున నీదుర్విచారంబు విడిచి విచిత్రదివ్యరత్నసువర్ణభూషణాంబర
సమన్వితంబుగా సీత నారఘుపుంగవునకు సమర్పించి యమ్మహాత్మునిచరణంబులు
శరణంబు గొని వీతశోకులమై యుంద మని పలికిన నతనిపలుకులువిని కాలచో
దితుండై రావణుండు క్రోధవిశేషంబున నేత్రంబుల నెఱ్ఱఁదనంబు గదురఁ బరు
షవాక్యంబున నవ్విభీషణున కిట్లనియె. 304

రావణుఁడు విభీషణునిఁ బరిభవించుట.

ఆ. క్రూరభోగితోడఁ గూడి యుండఁగ వచ్చుఁ, బగతుచెంతఁ జేరి బ్రతుక వచ్చు
రిపుల నొగి భజించుకపటమిత్త్రునిపొత్తు, గూడి మనఁగ రాదు కీడు దెచ్చు. 305

సీ. తనవారి కాపద లలకొనినప్పు డానంద మొందుట మేలు పొందునప్పు
డోర్వక యుండుట యుత్తములును ధర్మశీలురు నగువారిఁ జెనకి హేయ
పరణుల నొగిఁ దిరస్కరణంబు లాడుట చూపోపక మొఱంగి శూరవరునిఁ
బరిభవించుట మఱి ప్రచ్ఛన్నహృదయులై భయము వాటిలునట్టిభంగి నెదకు
తే. టాత్మలోఁ జూడ భువనత్రయంబునందు
జ్ఞాతులకు నీగుణములు నైసర్గికములు
నగు నెఱిఁగి నాఁటఁ గోలె మహాత్మయందు
నమ్మకున్నాఁడ నీబాంధవమ్ము నెపుడు. 306

వ. ఇందుకు నుదాహరణంబుగా నొక్కపద్మవనంబునందుగజగ్రహణపాశహస్తులై
తమ్ముం బట్టవచ్చువారి గజగ్రాహిపురుషుల నవలోకించి గజంబులచేతఁ గొన్ని
గీతలు వినంబడి యుండు వానిం జెప్పెద నాకర్ణింపుము. 307

తే. పావకుం డన్యశస్త్రము ల్పాశనిచయ
మరయ మాకెందును భయావహములు గావు
వూని స్వార్థప్రయుక్తంబు లైనయట్టి
యవియె బాయలు మాకు భయావహములు. 308

విభీషణుఁ డంతరిక్షగతుఁడై రావణుని దూఱుట.

ఉ. అన్నవు తండ్రివోలె దనుజాధిప మాన్యుఁడ వీవు బుద్ధిసం
పన్నత నెద్దియేని యొకమాట వచింపఁ దలంచి తేనియుం
బన్నుగఁ దెల్పు ధర్మ మెడఁబాసి సహింపఁగ రానిమాట లి
ట్లన్నఁ ద్యజించి పోవలసె నక్కట కాలము ద్రోవ నల్పమే. 315

తే. అసురనాయక యకృతాత్ములైన జడులు, కాలవశగతులై మేలు గఱపువారి
విహితనీతిప్రబోధంబు వినఁగ లేరు, ప్రాఁతఫలము దప్పింప నెవ్వారివశము.

తే. ప్రియులఁ బోలె నపథ్యముల్ పెక్కుగతులఁ
బలుకువారలు పెక్కండ్రు గలరు గాని
యప్రియుఁడుఁబోలె హిత మాడునట్టివాఁడు
దొరకొనుట కొక్కరుండైన దుర్లభంబు. 317

తే. అఖిలభూతాపహారి యైనట్టి కాల, పాశమున విధివశమునఁ బట్టువడిన
యట్టి నన్నుపేక్షింపలే కసురనాథ, కొన్ని హితములు చెప్పితిఁ గూర్మిఁ జేసి.

క. ఇనకిరణతులితశితకాం,చనభూషితదివ్యరామచంద్రశరములం
దునిసి పడు నీశిరంబులు, గనుఁగొన లేకింత దడవు గఱపితి బుద్ధిన్. 318

తే. అధికు లయ్యును బలవంతు లయ్యు శూరు
లయ్యును గృతాస్త్రు లయ్యుఁ గాలాభిపన్ను
లగుచుఁ జెడిపోదు రెట్టివారైనఁ బంక్తి
కంఠ జలములయందు సైకతముఁ బోలె. 319

వ. అనిపలికి పరాపరజ్ఞుం డగువిభీషణుండు దుర్మాని యగురావణునిచేత ధిక్కృతుం
డై యంతటం బోక యంతరిక్షంబున నుండి వెండియు నతనిచిత్తంబు స్వామ
తాయత్తం బగునో యనువాంఛం జేసి యుక్తియుక్తంబుగా బోధించి తదాభి
ముఖ్యాభావంబు విలోకించి తత్సహాసంసర్గాయోగ్యత్వంబు నిరూపించి శీఘ్రం
బున రామునిపాలికిం బోవువాఁడై క్రమ్మఱ రావణు నుద్దేశించి గతాయు లగు
నరులు పరేతకల్పులై సుహృత్సమీరితం బైనహితవాక్యంబు విననొల్లరట్లగు
టం జేసి నీవును హితవాది నగునాపలుకులు వినక నన్నుఁ బరిభవించితివి గా
వున నేను యథేచ్ఛం జనియెద మద్విహీనుండవై బహుప్రయత్నంబున నిన్ను
ను నీబలంబును బురంబును గాచికొని సుఖివై యుండు మని పలికి యచ్చోటు

విభీషణుఁడు తనతల్లికి రావణుఁడు తన్నవమానించినవిధము దెల్పుట.

వాసి రయంబున మాతృమందిరంబునకుం జని యందు నానావిధేతిహాసకథాభి
జ్ఞు లగువృద్ధబ్రహ్మరాక్షసులవలనఁ బుణ్యకథలు వినుచున్నతల్లిం గని నమస్క
రించి తనకును రావణునకును సీతానిమిత్తంబు గలిగినసంవాదంబును రావ
ణుండు కోపించి తన్నుఁ బాదప్రహారంబునం దన్ని శిరంబు దెగవ్రేయ గమ
కించి ప్రహస్తునిచేతఁ బ్రబోధితుండై విరమించి పురంబు వెడలి చను మని

పరాభవించుటయు విన్నవించిన విని యక్కైకసి కొండొకసేపు దుఃఖించి
పడంపడి భర్తృవచనంబు దలంచి వత్సా రావణునియపరాధంబున సీతానిమి
త్తంబుగా సకలరాక్షసులు హతు లయ్యెదరు రావణుండు రామునిచేత హతుం
డగుఁ బిమ్మట నీవు రాక్షసరాజ్యాధిపత్యంబు నధిగమించి చిరకాలంబు లంకఁ
బాలింపం గలవు మీతండ్రివచనం బట్టిది నీ విప్పుడు శరణాగతరక్షణదీక్షితుం
డైనరామునిపాలికిం జని యమ్మహాత్మునిచరణంబులు శరణంబు నొంది తత్ప్ర
సాదంబు వడసి సుఖివై జీవింపు మని దీవించి యనిచిన నవ్విభీషణుండు
హిమాచలసంకాశుండును వజ్రాయుధసమప్రభుండును వరాయుధధరుండును
దివ్యాభరణభూషితుండు నై యాత్మసమాను లగుమంత్రుల నల్వురం గూడి
వజ్రకవచప్రభావిశేషం బంబరంబునకు శరదంబుదత్వంబు సంపాదింపనచ్చోటు
వాసి శీఘ్రంబున రామలక్ష్మణులున్నయెడ కంబరమార్గంబున సముద్రంబుదాఁటి
చనుదెంచుచుండ నప్పు డమ్మహోదధియుత్తరతీరంబున నున్నవానరాధిపుండగు
సుగ్రీవుండు గగనమార్గంబున నత్యున్నతత్వపీవరత్వరత్నబహుళత్వంబులచేత
మేరుశిఖరాకారుండై తేజిష్ఠత్వగగనసంచారంబులచేత శతహ్రదాసంకాశుండై
మంత్రిచతుష్టయసమన్వితుండై చనుదెంచుచున్నవిభీషణుని దూరంబున నవ
లోకించి యొక్కముహూర్తంబు చింతించి హనుమదంగదాదివానరవీరుల నెల్ల
విలోకించి యిట్లనియె. 320

విభీషణుఁడు రామలక్ష్మణులకడకుఁ బోవుట.

తే. కంటిరే మీర లభ్రమార్గమున నొక్క
దానవుండు సర్వాయుధధారి యగుచు
దానవుల నల్వురను గూడి తడయ కిటకు
వచ్చుచున్వాఁడు మనలఁ ద్రుంపంగఁ దలఁచి. 321

చ. అన విని వానరప్రవరు లందఱు సాలశిలాచయంబు గై
కొని రథసంబుతోఁ బ్లవగకుంజరుతో నధినాథ మమ్ము వే
పనుపుము క్రూరచిత్తుల క్షపాచరులం దగ గీటణంచి గ్ర
క్కున నవనీతలంబుపయిఁ గూలఁగ వైచెద మీవు మెచ్చఁగన్. 322

వ. అని యిట్లొండొరులు సంభాషించుచుండ నంతలోన నవ్విభీషణుండు జలనిధి
యుత్తరతీరంబు డాయం జనుదెంచి బ్రహ్మదత్తవరప్రభావంబున రాముని సకల
జగద్రక్షణార్థం బిక్ష్వాకువంశంబునం దవతీర్ణుం డైనపరమధర్మరూపపరమ
పురుషుం డైననారాయణునిఁగా నెఱింగినసర్వజ్ఞుండునుసర్వకారుణికుండునుసర్వ
లోకశరణ్యుండు నగురామభద్రుం డవశ్యంబు తన్ను రక్షించు ననెడుమహా
విశ్వాసంబున వానరులపరస్పరసంభాషణం బాదరింపక వానరులు ప్రహరణా
ద్యుక్తు లైనను శంకింపక వారల కభిముఖంబుగాఁ జని నిర్భయంబున నిష్కం

పావస్థానుండై యంతరిక్షంబుననిల్చి యీవానరులు మదీయాభిప్రాయం బెఱుంగక రావణసంబంధి నగుటం జేసి నన్నుఁ బ్రహరింప నిశ్చయించి యున్నవారు రామసమాశ్రయణంబు వీరి కెఱింగించి యీపురుషకారముఖంబున రామలక్ష్మణుల నాశ్రయించెద నీవానరుల కుదయించినమత్ప్రతికూలసంరంభంబు మద్ద్వేషకృతంబు గాదు శ్రీరామభక్తిప్రకర్షపారవశ్యకారితంబు గావున గుణంబుగాఁ బరిగ్రహింపం దగినయది యనియును గృపాళుం డైనన్నృపుండు పురుషకారంబుననే శరణంబు నొందం దగినవాఁ డనియును నే నంతరంగభక్తుండ నన్నేల పరిత్యజించు ననియునీరామపరిచారకులు నన్నిప్పు డంగీకరింపకున్నవా రైన నేమి రామాంగీకారంబువలన వీరలయంగీకారంబు సిద్ధించు నదియె నాకుఁ బురుషార్థంబనియును సోపాధికసంబంధిపరిత్యాగపూర్వకనిరుపాధికరామసమాశ్రయణంబు నాకు ముఖ్యకార్యం బనియును నిశ్చయించి పురుషకారభూతు లైనవారికి సర్వలోకశరణ్యున కార్తరవంబు వినఁబడుటకు మహాస్వరప్రయోగంబు కర్తవ్యంబు గావున నుచ్చైర్నాదంబున వానరుల నవలోకించి యి ట్లనియె. 323

విభీషణుం డుచ్చస్స్వరంబున వానరులకుఁ దన్నెఱింగించుట.

సీ. రావణుం డనియెడురాక్షసుఁ డొక్కఁడు ఖలుఁడు రాక్షసభర్త గలఁడు వాని
పిన్నతమ్ముఁడ నే విభీషణుఁ డనువాఁడ నతిదుష్టుఁ డైనమాయన్న గృధ్ర
పతిని జటాయువుఁ బరిమార్చి ఘనజనస్థాననివాసిని యైనసీత
ముచ్చిలి లంకకుఁ దెచ్చె నయ్యమ రాక్షసీజనాంతరమునఁ జిక్కి దైన్య
తే. మడరఁ బరవశ యై యున్ననయ్యవస్థఁ
గాంచి యే నాత్మఁ గలఁగి రాఘవున కమ్మ
హీసుత నొసంగు మనుచు ననేకగతులఁ
బూని పలుమఱుఁ జెప్పితి వానితోడ. 324

వ. చెప్పిన నద్దురాత్ముండు కాలచోదితుం డై విపరీతుండు దివ్యౌషధంబుం బోలె హితవాది నగునావచనంబు గైకొనక తిరస్కరించె నే నిట్లు వానిచేతఁ బరుషితుండను దాసునియట్ల యవమానితుండ నై పుత్రదారాదులం బరిత్యజించి రాఘవుని శరణంబు నొందితి మీరు సర్వలోకశరణ్యుండును మహాత్ముండు నగురాఘవునితోడ విభీషణుండు సముపస్థితుం డయ్యె నని శీఘ్రంబున నన్నెఱింగింపుఁ డని యిట్లు రావణరాక్షసేంద్రఖలరాక్షసశబ్దప్రయోగంబుచేత రావణునిలోకకంటకత్వంబును భృత్యసంబంధప్రయుక్తదోషవత్త్వంబును గృత్యాకరణాకృత్యకరణదోషవత్త్వంబును జాతిక్రౌర్యంబును నే నతనితమ్ముండ నని పలుకుటవలనఁ దనకు రావణసంబంధనిబంధనదోషత్వంబును దేటపడం జేసి యేతచ్ఛబ్దపంచకప్రయోగంబున గర్వహానిలక్షణకార్పణ్యరూపం బైనయంగం

బును సీత నారఘుపుంగవున కొసంగు మని పలికితి ననుటవలన నానుకూల్య
సంకల్పరూపం బైనయంగంబును దాసునియట్లు యవమానితుండ నైతి నని
పలుకుటవలన నీశ్వరనిర్హేతుకకరుణాపరిపాకసంభూతం బగురావణావమానంబు
చేతఁ గలిగినప్రయోజనాంతరమై ముఖ్యంబును బుత్రదారాదులం బరిత్యజించి
వచ్చితి నని పలుకుటవలనఁ బ్రాతికూల్యవర్జనరూపం బైనయంగంబును రాఘ
వునిశరణంబు నొందితి నని పలుకుటవలన నాత్మనిక్షేపరూపం బైనయంగంబును
సర్వలోకశరణ్యుం డని పలుకుటవలన నధికారిభేదంబు లేకుండ సురనరవాన
రతిర్యక్స్థావరాంతసమస్తభూతంబులకు శరణ్యుండను తాత్పర్యంబును రాఘవుం
డని పలుకుటవలన నర్థిప్రార్థనావైఫల్యంబు లే దనుభావంబును మహాత్ముం డని
పలుకుటవలన రామునిసర్వభావగతిజ్ఞత్వంబును నన్నెఱింగింపుఁ డని పలుకుట
వలన నేను సర్వవిధబంధుత్వంబున రామభద్రున కాశ్రితుండ ననియెడునభి
ప్రాయంబును శీఘ్రం బని పలుకుటవలన శీతలసురభిపద్మాకరంబు గనుంగొనిన
తృషితునకుం బోలె విళంబాసహత్వంబును బ్రకటింపం జేయుచు సర్వలోక
శరణ్యాదివాక్యపంచకప్రయోగంబున గోప్తృత్వవరణరూపం బైనయంగంబును
నుపస్థితుం డయ్యె నని పలుకుటవలన విశ్వాసరూపం బైనయంగంబును విస్ప
ష్టంబుగా సూచింపం జేయుచు భగవచ్ఛాస్త్రోక్తషడ్విధశరణాగతిలక్షణంబు
లేర్పడం బలికిన నతనిపలుకులు విని యలఘువిక్రముం డగుసుగ్రీవుండు లక్ష
ణోపేతుం డైనరామునియొద్దకుం జని సంరబ్ధపరుషంబుగా ని ట్లనియె. 325

సుగ్రీవుఁడు రామునికి విభీషణురాకయుఁ దనయభిప్రాయంబు నెఱింగించుట.

సీ. ధరణీశ రావణాసురునితమ్ముఁడు విభీషణుఁ డనువాఁడు నిశాచరేంద్రుఁ
డన్నచేత నిరస్తుఁ డై సర్వలోకశరణ్యుండ వగునీశరణము గోరి
సమదరాక్షసచతుష్టయసముపేతుఁ డై యరుదెంచి యున్నవాఁ డతనిచంద
మెట్టిదో తెలియ వాఁ డెంతయుఁ బ్రచ్ఛన్నవేషుఁ డై యంబరవీథియందు
తే. నిలిచి యున్నాఁడు వానరనికరమునకు
సేమ మగునట్టి తెఱఁగు యోచించి మనకు
సేగి లేకుండ నిశ్చయస్థితి యెఱుంగ
వలయుఁ దగినట్టిచారులవలన మనకు. 326

వ. మహాత్మా నీవు వానరులతోడ మంత్రంబు గావించి సేనాసన్నివేశంబుఁ జేసి
విచారనిశ్చితసామాద్యుపాయంబులం బ్రయోగించి గూఢపురుషప్రేషణంబుఁ
గావించి పరులమంత్రవ్యూహనయచారప్రేషణంబు లిమ్ముగా నెఱుంగు మట్లైన
నీకుభద్రంబుగలుగు రాక్షసులదృశ్యసంచారస్వభావులు కామరూపులుశూరులు
గూఢవిప్రియకరణాభిజ్ఞులు గావున నెన్నటికి వీరి విశ్వసింపం దగదు వీఁడురాక్ష
సేంద్రుం డగురావణునిచారుం డుపాయంబున మనయందుఁ బ్రవేశించి భేదంబు

బుట్టించు నట్లు గాదేని ఛిద్రాన్వేషణంబుఁ జేసి మనల నందఱ వధించు శత్రుకులంబున నుండి సమాగతుండై నవీనిం బరిగ్రహించిన శత్రునకు బలక్షయంబును మనకు బలవృద్ధియుఁ గలుగు నని తలంప వలనదు మిత్రబలంబునట వీజనబలంబును మూలబలంబును భృతికోపజీవిబలంబును బరిగ్రహింప వచ్చుం గాని శత్రుబలంబు పరిగ్రహింపం దగదు వీనియందు శత్రుబలత్వమాత్రంబె కా దపరిగ్రాహ్యత్వహేతువులు మఱికొన్ని గలవు వీఁడు స్వభావంబున భవద మిత్రుం డగురావణునితమ్ముఁడు వీనియందు మేలుగుణం బెట్లు గలుగు యుక్తవ్యాపారవంతులలో శ్రేష్ఠుండ వైననీకు శరణాగతశబ్దోచ్చారి యైనయీరాక్షసునిగ్రహించుట యుక్తంబని తోఁచుచున్నది శరణాగతుం డెట్లుపరిత్యాజ్యుం డని సందేహింపం దగదు వీఁడు రావణునిచేత సందిష్టుండై యతర్కితుండై కపటబుద్ధిచేత స్వనివాసంబున నుండి శత్రునివాసంబునకు జనుదెంచినవాఁడు గావున మీరువిశ్వసించితిరేనిమనసైన్యంబుఁ జొచ్చి యేమఱించి యంతరంబు నొంది యులూకంబు వాయసంబులంబోలె వానరుల నందఱ వధించు విశ్వాసకృతనిశ్చయంబు లగుకపటవాక్యంబు లుపన్యసించుచున్నవీని నొక్కనింగాదు సహాయసహితంబుగా వధింపవలయు నని పలికి యూరకున్న వాక్యజ్ఞుం డగు రాముండు వాక్యకోవిదుం డైనసుగ్రీవునిపలుకు లాకర్ణించి సమీపస్థు లయిన హనుమదంగదజాంబవత్ప్రముఖనిఖిలహరిశ్రేష్ఠుల నవలోకించి సుగ్రీవవచనోపలాలనపూర్వకంబుగా నిట్లనియె. 327

రాముఁడు వానరవీరులతో నాలోచన సేయుట

ఉ. ఈకపినాథుఁ డన్నవిధ మెంతయు వింటిరె యుక్తియుక్తమై
వీఁక మహార్థవంత మయి వింతగఁ దోఁచుచున్నది భూతికాముల
ప్రాకృతబుద్ధు లన్యజనభావగతిజ్ఞులు మీర లిందఱుం
దేఁకువఁ దోఁచినంతియును దెల్పుఁడు దైత్యునిరాకచందమున్. 328

తే. అర్థనిశ్చయమందు సమర్థులైన, యట్టిభృత్యులు పతికి హితాహితంబు
లరసి తఱి వచ్చినపుడు మేలగు తెఱంగు, నిశ్చయించి బోధించుట నీతి గాదె.

క. అని రఘునాథుం డడిగిన, విని తమతమమతము మెఱసి వినయముతో న
వ్వనచరు లందఱు నవ్విభుఁ, గనుఁగొని యిట్లనిరి విహితకౌతూహలులై.

తే. దేవ మున్లోకములయందు నీ వెఱుంగ, నట్టియర్థ మొకింత లే దాత్మమహిమ
చెలిమి పెంపున సూచింపఁ దలఁచి యిట్లు, మమ్ము నడిగితి రిది సాధుసమ్మతంబు.

వ. మహాత్మా నీవు శరణాగతరక్షణధర్మనిష్ఠాన్వితుండవు శూరుండవుధార్మికుండవు దృఢవిక్రముండవు సర్వజ్ఞుండ వయ్యును గారణంబులచేత మిక్కిలి విమర్శించి కార్యంబు నడపునట్టినిపుణుండవు సుహృన్నివేశితాంతఃకరణుండవు స్మృతిమంతుండవు మమ్ముఁ బెద్దఱికంబుఁ జేసి యడిగిననూరకుండుటవిహితంబుగాదు

నీసచివు లందఱు బుద్ధిసంపన్నులును సమర్థులును గావున వేర్వేఱ స్వమతంబు లెఱింగించెద మని పలికి రప్పు డంగదుండు మతిమంతుండై విభీషణపరీక్షార్థం బారఘువల్లభున కిట్లనియె. 332

అంగదాదులు రామునకుఁ దమతమయభిప్రాయములఁ దెల్పుట.

తే. అధిప పగతునికడనుండి యరుగుదెంచి, నట్టివాఁ డీవిభీషణుం డట్టు లగుట
భావ మెట్టిదో తెలియక ప్రోవు మనుచుఁ, బలికినంతనె విశ్వసింపంగరాదు.
క. జననాథ క్రూరచిత్తుఁడు, తనభావము మాటుపఱిచి తగినయుపాయం
బున వైరిఁ జేరి తఱిఁ గని, దునుము నిది యథార్థ మధికదోషము గలుగున్.
వ. కావున వీని నానానాకకర్మంబునందు నియోగించి గుణదోషంబులు పరీక్షించి గుణంబు గలిగినఁ బరిగ్రహంబును దోషంబు గలిగినఁ బరిత్యాగంబునుం గావింపం దగు గుణదోషంబులు రెండునుం గలిగిన నెట్లుసేయవలయు నంటి రేని గుణం బధికంబును దోషం బల్పంబును గలిగినం బరిగ్రహింప వచ్చునవి విపరీతంబు లైనఁ బరిత్యాగంబు కార్యంబు. 335
క. అని పలుక నపుడు శరభుం, డనువానరుఁ డర్థనిశ్చయసమర్థుం డై
వినయము మోమునఁ దోఁపఁగ, నినకులవర్ధనునితోడ నిట్లని పలికెన్. 336
చ. నెఱిఁ గపటోక్తులం బరులనేర్పులు గన్గొని హాని సేయుటల్
నరవర దైత్యకృత్యమును నమ్మకు మీతనిమర్మకర్మముల్
సరసత సూక్ష్మబుద్ధు లగుచారులచేత నెఱింగి పిమ్మటం
గర మవిరోధయుక్తిమెయిఁ గార్యపరిగ్రహణంబు సేయుమీ. 337
తే. అనుచు శరభుండు పలుక నయ్యవసరమున
సకలశాస్త్రార్థతత్త్వవిశారదుండు
జాంబవంతుండు పలికె దోషప్రసంగ
రహిత మగువాక్యమున ధరారమణుతోడ. 338
తే. వీరుఁ డీదానవుఁ డదేశవేళయందుఁ, బాపకర్ముండు క్రూరుండు బద్ధవైరుఁ
డగుదశాస్యునివలన సంప్రాప్తుఁ డగుటఁ, జేసి మిక్కిలి శంక దోఁచెడు నృపాల.
క. అని పలుక నపుడు మైందుఁడు, తనవైదుష్యంబు మెఱయ దశరథనృపనం
దనుతో మెల్లన వినయం,బున హేతుసమేతవాక్యమున నిట్లనియెన్. 340
చ. నరవర యీవిభీషణుని నమ్మక పోనిడరాదు దుష్టుఁడో
పరఁగ నదుష్టుఁడో యితనిభావము మెత్తనిమేలిమాటల
స్వరున నెఱింగి యవ్వల మనంబునఁ దోఁచినభంగిఁ జేయుఁ డి
ట్లరయక ప్రోచు టెట్లు శరణార్థినిఁ ద్రోచిన దోస మయ్యెడిన్. 341
వ. మఱియు యుక్తియుక్తం బగుమధురవాక్యంబున గూఢపురుషముఖంబుచేత రావణువృత్తాంతం బితని నడిగి మెల్లన యథార్థం బైనయితనియభిప్రాయం

బెఱింగి పరీక్షాపూర్వకంబుగా దుష్టత్వాదుష్టత్వంబులు దెలిసికొని యెయ్యది కర్తవ్యంబు దానిఁ జేయుం డని యిట్లందఱుఁ దమతమమతంబులు మెఱయఁ బెక్కు తెఱంగుల నెఱింగినంతయుం బలికిన సుగ్రీవునిచేతఁ బ్రతిపాదితం బైన నధ్యత్వంబును నంగదాదులచేత సమర్థితంబు లైనగుణదోషపరీక్షాపూర్వక పరిగ్రహపరిత్యాగంబులును విని సుగ్రీవునిమతంబు రాజవచనం బగుటవలనను మిక్కిలి యవిచారమూలం బగుటవలన నుపేక్షించి యంగదాదులమతంబు నేకైకానువాదపూర్వకంబుగా దూషించి శీఘ్రంబున విభీషణపరిగ్రహణంబు యుక్తం బని స్వసిద్ధాంతంబు తేటపఱుపందలంచి వారి నందఱ నివారించి సచివోత్తముండును సకలశాస్త్రాభ్యాసజనితసంస్కారసంపన్నుండు నగుహను మంతుండు రఘునందనునిముఖారవిందం బవలోకించి వివక్షితార్థప్రతిపాదన శక్తంబును శ్రవణమాత్రసుఖప్రతిపాదకంబును స్నిగ్ధంబు నర్థగౌరవయుక్తం బును మితాక్షరంబు నగువాక్యంబున నిట్లనియె. 342

హనుమంతుఁ డంగదాదుల మతంబులందు దోషముల నిరూపించుట.

తే. పార్థివాగ్య్ర దక్షుండవు పండితుఁడవు
నీతిసంపన్నుఁడవు బుద్ధినిధివి వాక్య
కోవిదుఁడ వైననీమ్రోలఁ గొనరి యర్థ
నిర్ణయము సేయ గురుఁ డైన నేరఁడయ్య. 343

తే. గర్వమునఁ గాదు వినుము సంఘర్షణమునఁ
గాదు వైదుష్యమునఁ గాదు వాదమునను
గాదు భూపాలవర రామగౌరవమునఁ
జెప్పెద యథార్థ మంతయుఁ జిత్తగింపు. 344

వ. మహాత్మా భవత్సచివుం డగు తారేయునిచేత గుణదోషనిశ్చయనిమిత్తం బెయ్యది పలుకం బడియె నయ్యర్థంబునందు దోషంబు గలదు పరీక్షారూపకార్యం బిప్పుడు యుక్తంబుగా దెద్ది యేనియు నొకానొకకార్యంబువెంటం బనిచి గుణదోషంబులు పరీక్షించి గుణంబులు గలిగినఁ బరిగ్రహింపం దగు దోషంబు గలిగినఁ బరిత్యజింపం దగు నని పలికె నట్లు కర్మనియోగంబువలన గుణిత్వంబు దెలియుట కశక్యంబై యుండు గుణదోషంబులు పరీక్షింపక మున్నె ఘన కార్యంబునందు వినియోగంబు దోషవంతం బై తోఁచుచున్న దని యిట్లంగద మతంబు నిషేధించి శరభమతంబు దూషించుతలంపున నిట్లనియె. 345

క. చతురత నిటు చారప్రణిహిత ముచితం బనుచు నీదు హితుఁడు పలికె న
ద్గతి నందుఁ బ్రయోజనసం, గతి కయ్యెడు కారణంబు గాన మధీశా. 346

వ. చారప్రేషణంబు దూరతిరోహితవిషయం బగుటవలనఁ బరిదృశ్యమానుండగు విభీషణునియందు యుక్తంబు గాదని పలికి జాంబవన్మతంబు నిరాకరించు వాఁడై వెండియు నిట్లనియె. 347

తే. దేవ యీదైత్యవీరుఁ డదేశకాల
మందు సంప్రాప్తుఁ డయ్యెనటంచు నాడితి
విదియు నొక్కింత నిక్కువం బైన నేమి
యిదియె దేశంబు కాలమై యెసఁగు నిజము. 348

వ. మహాత్మా యీవిభీషణుం డధమపురుషుం డైనరావణునికడనుండి యుత్తమపురుషుండ వైననిన్ను శరణంబు నొంది మీ యిరువుర దోషగుణంబులు విమర్శించి రావణునియందు సీతాప్రత్యర్పణాభావాదిలక్షణదౌరాత్మ్యంబు విలోకించినీయందు విరాధకబంధఖరదూషణప్రముఖరాక్షసవధాదికంబును దురంతబలపరాక్రమవాలివధపూర్వకసుగ్రీవరాజ్యస్థాపనంబును నతిదుస్తరసముద్రతరణోద్యోగంబు నెఱింగి నిన్నాశ్రయింప వచ్చె నతనియాగమనంబు యుక్తంబని పలికి వెండియు మైందమతంబు నిరాకరించుతలంపున నిట్లనియె. 349

తే. అధిప యజ్ఞాతరూపు లైనట్టివారి
నంపి యడిగింపుఁ డని మైందుఁ డాడె నతని
మతము వర్ణింపఁ దగు నని మనమునందుఁ
గౌతుకము మీకు నొక్కింత గలుగు నేని. 350

వ. అత్తెఱం గాదరణీయంబు గాదు బుద్ధిమంతుం డగువాఁ డపరిచితస్వరూపస్వభావు లగువారిచేత నడుగంబడినవాఁడై యవిశ్వాసంబువలన వీరు నన్నడుగుచున్నవారు వీరితోడ నేనునిన నేమి యనర్థంబు వాటిల్లునో యని ప్రతివచనరూపం బైనవచనంబు నుద్దేశించి మనంబున బహుప్రకారంబుల శంకించు నట్లగుటవలన నప్రయత్నలబ్ధుండును సుఖాగతుండు నగుమిత్త్రుండు మిథ్యాపృష్టుండగుచు దూషింపంబడు దానం జేసి మిత్త్రహాని వాటిల్లు మిక్కిలి నిపుణుం డగువానిచే నేనియు గూఢాభిప్రాయంబు లైనప్రశ్నప్రతిభాషితంబులచేతఁ బరునియభిప్రాయంబు శీఘ్రంబున నెఱుంగుటకు శక్యంబు గా దని యివ్విధంబున మతాంతరంబులు నిరాకరించి యింగితాకారభాషణచేష్టితరూపంబు లైనయుపపత్తులచేత నతనినిర్దుష్టత్వం బెఱుంగం దగినయది గావున నీవిభీషణుండు పరిగ్రాహ్యుం డని తేటపఱచుతలంపున నిట్లనియె. 351

హనుమంతుఁడు రామునకు స్వమతం బెఱింగించుట.

తే. ఎంత దడవు భాషించిన నితనియందు
దుష్టభావత్వ మించుక దోఁప దెపుడు
వదన మతిసుప్రసన్నమై వఱలెఁ గాన
నధిప నాచిత్తమున సంశయంబు లేదు. 352

క. ప్రవిమలుఁ డై నిర్భయుఁ డై, యవిశంకితబుద్ధి యై మహాకృపణుం డై
తవిలి చనుదెంచెఁ గావునఁ, గవినన్నుత యితఁడు శఠుఁడు గాఁడు తలంపన్.

తే. తరణికులవర్య యీదైత్యవరునివాక్కు
నందు దుష్టత్వ మించుక యైన లేదు
గాన నొక్కింత యైన నా మానసమున
సత్యముగ దుష్టభావత్వశంక లేదు. 348

తే. జనవర కపటకరచుకాచ్ఛాద్యమాన
మయ్యు నాకార మది దాఁప నలవి గాదు
నేర్పుమెయి నెంత పట్టిన నిలువ నీక
హృదయగతభావ మావిష్కరింపఁ జేయు. 349

వ. అని విభీషణునియందు దోషాభావంబు నిరూపించి యుచితజ్ఞత్వరూపం బైన గుణంబును దర్శింపం జేయుటకు నీతిమర్యాద నవలంబించి యిట్లనియె. 350

ఆ. గరిమ నుచితదేశకాలపూరుషులందుఁ, బూని సంప్రయుక్త మైనకార్య
మొనరఁ గర్త కుర్వి స్వోచితఫలమును, జేయుచుండు నింత సిద్ధ మధిప. 351

వ. మహాత్మా వీనియంతర్గతం బైనభావంబు స్వపరిశుద్ధత్వంబును దృఙ్ముఖంబులవలన నూచింపం జేయుచున్న దిట్టిలక్షణంబులు కపటవిహారశీలునకుం గలుగ నేరవు నీవునుం బరభావవేదజ్ఞుండవు నీకుం జెప్ప నేల యితండు మిథ్యావృత్తుం డైన రావణుని విడిచి నిన్ను సత్యప్రతిజ్ఞునిగా నెఱింగి వాలివధంబును సుగ్రీవరాజ్యాభిషేకంబును విని నీయుద్యోగసమయంబు విచారించి రాజ్యార్థియై బుద్ధిపూర్వకంబుగా భవత్సన్నిధానంబునకుం జనుదెంచె నీపూర్వోక్తధర్మజాతంబుపురస్కరించుకొని యీయర్థంబునందు సంగ్రహంబు ప్రయోగింపంబడుఁ గాక నానేర్చినవిధంబున నిర్దుష్టత్వంబు నుద్దేశించి నాచేత నెయ్యది పలుకంబడియె దాని నాకర్ణించి యెయ్యది కర్తవ్యంబు తత్సర్వంబునకు మీరె ప్రమాణం బని పలికిన నతనిపలుకులు విని సామాన్యవిశేషశాస్త్రజ్ఞుం డగురాముండు సుగ్రీవాంగదజాంబవదాదివాక్యజనితం బగుమనఃకాలుష్యంబు హనుమద్వాక్యంబులచేత నొక్కింత ప్రశమితం బగుచుండఁ బ్రసన్నచిత్తుం డై సర్వమతప్రతిక్షేపరూపం బగుస్వవాక్యంబున స్వమతసిద్ధాంతంబు సేయుండలంచి సుగ్రీవాదులు వ్యాకులితచిత్తులు గాకుండ నుపలాలనంబు సేయుచు నిట్లనియె. 352

రాముఁడు వానరులతో విభీషణుఁడు పరిగ్రాహ్యుఁ డని చెప్పుట.

సీ. వనచరులార నాకును మీకుఁ బోలె నీ దానవేంద్రునిగూర్చి మానసమునఁ
బరిగణనార్హ యై పరఁగు నొక్కవివక్ష గలదు తత్సర్వంబు కరము ప్రీతి
మత్క్షేమనిరతు లై మనియెదుమీరలు ప్రీతి మీఱ వినుండు విశ్రుతముగ
వాస్తవమిత్రభావత్వంబు లేకున్న మునుకొని మిత్రతాభినయమాత్ర
తే. మున సమాగతుఁ డై నట్టిజనుని విడువ, నొల్ల నెట్టిదేశంబున నున్న నెట్టి
కాలమం దైన మఱియెంతకష్టమైనఁ, దలఁప నిటువంటికతినోక్తిఁబలుకఁ జాల.

చ. నగచరులార యీదనుజనాథునితమ్ముని చంద మెట్టిదో
తగ నెఱిఁగింపుఁ డన్న మది దాఁపక చెప్పితి రింతవట్టు నె
వ్వగ గొని మిత్రభావమున వచ్చినవానిఁ బరిత్యజించు టె
ట్లగు నొకదోష మున్నఁ గర మర్థి గుణంబుగఁ గైకొనం దగున్. 355

ఆ. పరుని యందు దోషభావంబు గలిగిన, వచ్చి యతఁడు మఱుఁగుచొచ్చినప్పు
డదియె గుణముగాఁగ నంగీకరించి తా, మనుచు టదియె నీతి మనుజపతికి. 356

ఆ. వినుఁడు మిత్రభావమున సమాగతుఁ డైన, వాని విడువఁ దగదు వాని యందు
దోష మున్న వానిదోషంబు వానికె, యగు బుధాళి కేమి వెగటు సేయు. 357

వ. ఇతండు దుష్టజనుం డైనఁగాని న్నవశ్యంబు పరిగ్రాహ్యుం డీదుష్టజనపరిత్యాజ్యత్వప్రతిపాదకం బైనశాస్త్రంబు సామాన్యవిషయంబు విశేషశాస్త్రోక్త ప్రకారంబున శరణాగతుం డైనవీనిం బరిగ్రహించెద నీశరణాగతదుష్టజనపరిగ్రహణంబు సామాన్యవిశేషశాస్త్రవిదు లగుసత్పురుషులకు గర్హితంబు గాదు పూజనీయం బై యుండు. 358

క. అనవుడు సుగ్రీవుం డా, మనుజేంద్రునిమాట మది విమర్శించి తద
ర్థనిరూఢి మెఱయ వినయం, బున శుభతర మైనవాక్యమున ని ట్లనియెన్. 359

వ. దేవా యీవిభీషణుం డవశ్యంబు పరిగ్రాహ్యుం డని పలికితి రితండు పూర్వోక్తచ్ఛిద్రహంతృత్వాదిదోషయుక్తుం డైనను దోషరహితుం డైనను నిక్కంబుగాఁ గృతఘ్నుం డగువీనియం దేల విశ్వసించెద రీరజనీచరుండు జ్యేష్ఠభ్రాతృత్వప్రయుక్తగౌరవంబు మాని యీదృశం బైనవ్యసనంబు నొంది యున్న రావణుని విడిచి మనకడకుం జనుదెంచె నిట్టివాఁ డెట్టివారి నైన వ్యసనంబునందు విడువం గలఁ డిద్దురాత్ముని నెవ్వం డైన విశ్వసించునే యని పలికిన నవ్వానరాధిపతివచనంబు విని సత్యపరాక్రముం డగురఘుపుంగవుండు సర్వవానరులఁ గలయ నిరీక్షించి మదీయం బైనశరణాగతసంరక్షణవృత్తంబును మత్పరమశక్తియు నెఱుంగక యీసుగ్రీవుం డజ్ఞానంబునం బలుకుచున్నవాఁ డని మందహాసంబు చేయుచుఁ బుణ్యలక్షణుం డైనలక్ష్మణు నవలోకించి యి ట్లనియె. 360

క. ధీవర గురువృద్ధుల నొగి, సేవింపక శాస్త్ర మభ్యసింపక యీసు
గ్రీవుఁడు పలికినకైవడి, భావింపఁగ నెవ్వరైనఁ బలుకం గలరే. 361

చ. అని యిటు పల్కి రామవిభుఁ డంత స్వయుక్తికి నీతిశాస్త్రసా
ధన మగురాజధర్మ మది తప్పక గల్గుటఁ జేసి భానునం
దనుపలుకు ల్హసించి తనతమ్మునిఁ గ్రమ్మఱఁ జూచి యిట్లను
న్వనచరు లంతఱు న్విని మనంబున నచ్చెరు వంది చూడఁగన్. 362

వ. ఈవిభీషణాగమనరూపకార్యంబునందుఁ బరిదృశ్యమానంబును లోకవ్యవహారసిద్ధంబు నగు నెయ్యది సర్వరాజులయందు సన్నివిష్టం బై నాకు గోచరించి యుండు నట్టిసూక్ష్మతరం బైనకించిదర్థరూపంబు గల దది యె ట్లనిన జ్ఞాతులును

సమనంతరదేశవర్తు లగురాజులును వ్యసనంబు లుపస్థితంబు లగుచుండఁ బ్రహర్తలై శత్రువు లనంగీర్తితు లగుదురు గావునవ్యసనప్రహర్తృజ్ఞాతిత్వంబువల నవ్యసని యగురావణుంబ్రహరించుట కీవిభీషణుం డిచ్చటికిం జనుదెంచె మఱియు నేనరేంద్రులు నిష్పాపులై సత్కులీనులై పరిపాలింతు రట్టివారికైనను బ్రజ్ఞాశౌర్యాద్యుస్నేమశాలి యైనజ్ఞాతి మిక్కిలి శంకనీయుండై యుండుఁ బాపకర్ముండై నరాజునకుఁ దాదృశుం డైనజ్ఞాతి శంకనీయుం డగుట కేమి యరిది దురాత్ముం డగురావణునితోడం గలహించి యీవిభీషణుం డిచ్చటికిం జనుదెంచె నీయర్థంబునందు సందియంబు లేదు విభీషణునకు రావణపరిత్యాగంబునందు వ్యసనిజ్ఞాతిప్రహర్తృత్వంబును శోభనజ్ఞాతిత్వంబును గారణద్వయంబు గలదు గాన నీసుగ్రీవునివచనంబు యుక్తియుక్తంబు గాదని పలికి సుగ్రీవు నవలోకించి శత్రుసంబంధత్వమాత్రంబు నవలంబించి యీ విభీషణునియందు నేదోషంబు నీచేఁ గథితం బయ్యె నద్దోషంబును లేదు గావున విభీషణుండు పరిగ్రాహ్యుం డనుతాత్పర్యంబు గూఢము సేయువాఁడై యిట్లనియె. 363

తే. శత్రుసంబంధి యగువిభీషణునిరాక
యందు నీచేత నిగదితం బైనదోష
మందు నీతిశాస్త్రమునకు హాని కలుఁగ
కుండఁ బరిహార మెఱింగింతు నొగి వినుండు. 364

సీ. ఇనతనూభవ మన మీరాక్షసునకు జ్ఞాతులమును బ్రాతిదేశ్యులము గాము
వారక రావణవధపూర్వకముగ నావలన సామ్రాజ్యంబు వడయఁ గోరి
కని వచ్చెఁ గాన స్వకార్యవిఘాతభయంబున రంధ్రంబు లరసి మనకుఁ
గర మపకారంబు గావింపఁ జాలఁడు మూర్ఖులు దైత్యులు బుద్ధి నింత
తే. మొనసి యోచించి చూతురె యనఁగ వలదు
దైత్యులందును బండితోత్తములు గలరు
గాన నీదానవుఁడు పరిగ్రాహ్యుఁ డగుట
కేమియును సందియము లేదు నామనమున. 3

వ. మఱియు నట్టిపండితు లగుజ్ఞాతు లపర్యాకులులును బ్రహృష్టులునగుచు నొకనొకప్పుడైనఁ బరస్పరసంగతులు గా రక్కారణమున జ్ఞాతు లవసరభేదంబు నొందుదురు వినికంఠనాదంబు భీరునికంఠనాదంబుభంగి నముచ్ఛ్రితం బై వినంబడియెడుఁ గావున నితండు బలవంతుం డగురావణునిభయంబువలన నాత్మపరిత్రాణంబుకొఱకు మనయొద్దకుం జనుదెంచె నితనిం బరిగ్రహించుట కేమియు సందియంబు లేదు జ్ఞాతులవలనిభయాగమనంబునందు హస్తిగీతాదిరూపమహాప్రవాదంబు లోకప్రసిద్ధంబుగా వినంబడుచుండు జ్ఞాతిత్వప్రయుక్తదోషంబునకును రాజత్వదోషంబునకును సార్వత్రికత్వంబు శంకింపవలదు పితృదత్తం బైనరాజ్యంబు కరగతం బగుచుండ దానినంగీకరింపక జ్ఞాతిత్వప్రయుక్త

దోషంబును బరిహరించెఁ గావున భరతసమాను లయినభ్రాత లెవ్వరును లేరు లక్ష్మణుం డెంత చెప్పిన నంగీకరింపక జ్యేష్ఠత్వంబున రాజ్యార్హుం డయ్యును బితృవచనగౌరవంబునఁ గనిష్ఠుం డగుభరతునియందు రాజ్యభారం బుంచుటకు సహించుటం జేసి తండ్రికి నాయట్టిపుత్రులు లేరు మిత్రునకు హాని లేకుండ సముచితప్రకారంబున నీతిబోధంబు గావించుటవలన నీయట్టి మిత్రులు లేరని పలికిన నాసుగ్రీవుండు నీతిముఖంబున శరణాగతుం డగువిభీషణునిపరిత్యాజ్యత్వంబు ప్రతిపాదించుట కశక్తుం డై పరిగృహీతుం డగువిభీషణుండు మన కేమియపాయంబు గావించునో యనుభయంబున నొక్కవిభీషణుని శరణాగతికంటెఁ దనచేత లక్ష్మణునిచేతఁ గ్రియమాణంబైనశరణాగతిద్వయంబు ప్రబలం బని తలంచి లక్ష్మణసహితుం డై శీఘ్రంబున లేచి రామునకుం బ్రణతుండై శరణాగతిపూర్వకంబుగా విభీషణనిగ్రహంబు ప్రార్థించుచు నిట్లనియె.

సీ. అనఘాత్మ పాపాత్ముఁ డగురావణునితమ్ముఁ డీవిభీషణుఁ డతం డిచటికి నుప
మనల హింసింపంగ మాయాపరిచ్ఛన్నవేషుఁ డై యంగిట విషము నాలు
కను బెల్ల మిడుకొని చనుదెంచి యున్నాఁడు వీనిమాటలు మది విశ్వసింపఁ
జనదు లక్ష్మణునిచే సచివయుక్తంబుగా వధియింపఁ దగియెడువాఁడు వీఁడు

ఆ. నిగ్రహింపుఁ డనుచు నెయ్యమొప్పఁగఁ బల్కి, యూరకున్న నతని గారవించి
నిశ్చితార్థతత్త్వనిర్ణయజ్ఞుఁడు రాముఁ, డధికయుక్తి నాత్మ నరసి చూచి. 368

వ. ప్రథమకృత విభీషణశరణాగత్యపేక్షచేతఁ బశ్చాత్కృత సుగ్రీవలక్ష్మణశరణాగతి దుర్బలం బనియును శరణాగతుం డైనవాఁడు వధ్యుండైనను రక్షితవ్యుం డనియు నాలోచించి యీరాక్షసుండు మనయందుఁ బ్రవేశించి రంధ్ర మన్వేషించి మనల వధించు ననియెడుసుగ్రీవోక్తదోషంబునకవకాశంబు లేదని నిశ్చయించి సుగ్రీవు నవలోకించి యిట్లనియె. 369

ఉ. వానరవీర వీఁడు కడు వంచకుఁ డంచు వచించె దేటి క
ల్లైనఁ గొఱంత యేమి గరుడామరపన్నగసిద్ధసాధ్యసం
తానముల న్నఖంబులఁ దృణంబుగఁ జిమ్మఁగ జాలు నాకు నీ
దానవుఁ డించుకైన నహితం బొనరింపఁగ లేఁడు చూడఁగన్. 370

వ. అని యిట్లు విభీషణపరిగ్రాహ్యత్వంబునందు నీతిశాస్త్రంబును లోకవ్యవహారంబును స్వశక్తియు దర్శింపం జేసి యశక్తపురుషునిచేత నైనను బ్రాణంబు లర్పించియైన శరణాగతుండు సంరక్షణీయుం డనుటకు నితిహాసంబు ప్రమాణంబు సేయుచు ని ట్లనియె. 371

మ. అనఘా మున్ను కపోత మొక్కయెడ భార్యాహర్త వీఁ డంచుఁ బో
ష్మన శాత్రిన్ శరణార్థిఁ గైకొని కరం బాత్మీయమాంసంబుచేఁ
దనియం జేసె నటంచుఁ జెప్ప విన లేదా పక్షిమాత్రంబు త
ద్ఘనకీర్తిం బడయంగ నిట్లు పడయం గా రాదొకో మాదృశుల్. 372

—రాముఁడు సుగ్రీవునకుఁ గండుమహర్షి ప్రోక్తగాథలను చెప్పుట—

వ. అదియునుం గాక. 373

ఆ. కణ్వపుత్త్రుఁ డైనకండుమహాముని, నాథుచేతఁ గొన్ని గాథలు మును
చెప్పఁబడియె ధర్మశీలప్రకారంబు, తేటపఱతు దానిఁ దెలియ వినుము. 374

క. శరణాగతుఁ డై శిరమునఁ, గరములు ముకుళించి నన్నుఁ గావు మనుచు నా
ర్తరవంబునఁ బలికెడువాఁ, డరియైనను రక్షణీయుఁ డగు నరపతికిన్. 375

ఆ. ఆర్తుఁ డైన నేమి యటుగాక కడుదృప్తుఁ, డైన నేమి శత్త్రుఁ డైన నేమి
గావు మన్న యంత జీవిత మర్పించి, యైనఁ గావవలయు నవనిపతికి. 376

ఆ. కరము ప్రీతి నైనఁ గడు మోహమున నైన, వచ్చి తనదుమఱుఁగుఁ జొచ్చినట్టి
వానిఁ బ్రోవకున్న వసుధేశ్వరునిధర్మ, కౌశలంబు లోకగర్హితంబు. 377

క. శరణాగతుఁ డేనృపుచేఁ, బరుషోక్తిఁ దిరస్కరింపఁబడుఁ దవదురితో
త్కర మానరపతి కిడి వాఁ, డరుగు దివికి వానిసుకృత మంతయుఁ గొనుచున్.

క. వినుము ప్రపన్నుల రక్షిం,పనినాఁ డైశ్వర్యకీర్తి బలవీర్యవినా
శన మస్వర్గ్యం బాదిగ, ననేకదోషములు గలుగు నవనీపతికిన్. 379

వ. అని పలికెఁ గావున నేను ధర్మపరంబును నబాధితార్థప్రతిపాదకంబును బాప
నివర్తకధర్మహేతుకంబును గీర్తికరంబు నగుకండుమహామునివచనంబు నమో
ఘంబు గావించెద నది ఫలప్రదానకాలంబు సముపస్థితం బగుచుండ రక్షితకు
స్వర్గప్రదం బగునని యిట్లుధర్మశాస్త్రప్రసిద్ధం బైనశరణాగతరక్షణరూపధర్మం
బవశ్యం బనుష్ఠించెద నని పలికి సర్వలోకశరణ్యత్వసర్వశక్తిత్వసర్వజ్ఞత్వపరమ
కారుణికత్వపరమసత్త్వాదిగుణవిశిష్టుండ నైననా కనాదిసిద్ధత్వంబున సహజ
వ్రతవిశేషంబునుం గల దనుతాత్పర్యంబు తేటపడ వెండియు నిట్లనియె. 380

తే. మఱుఁగు సొచ్చితిఁ గృప నన్ను మనుపు మనుచు
దీనరవమున నొక్కమా రైన నేమి
విమతుఁ డేనియు నెవఁడేని వేఁడుకొనిన
వాని కభయం బొసంగుట వ్రతము నాకు. 381

ఉ. ఈదివిజారి కే నభయ మిచ్చితిఁ దోడ్కొని రమ్ము చెచ్చెర
న్లే దొక సందియం బిఁక వలీముఖనాయక వీనిఁ బ్రోచు టే
కా దపరాధి నైతి ననుఁ గావు మటంచు మఱుంగు సొచ్చినం
గా దన కిమ్మెయిం గరుణఁ గైకొని రావణు నైనఁ గాచెదన్. 382

వ. మఱియు నితండు నిక్కంబుగా విభీషణుం డైనను విభీషణవేషధారి యైనయే
తాదృశాపరాధి యగురావణుం డైన నితనికి శరణాగతరక్షణవ్రతైకదీక్షాద
క్షుండ నైననాచేత నభయంబు దత్తం బయ్యె నింక నీవితనిం దోడ్కొని రమ్మ
ని పలికిన సుగ్రీవుండు రామునిశరణాగతరక్షణదీక్షయునుదనయందలిసౌహార్దాతి
శయంబును విచారించి విస్మయపరవశుఁ డై దేవా నీవు శరణాగతరక్షణధర్మ

రహస్యజ్ఞుండవు సర్వజనానందకరణశాలివి సత్త్వగుణైకనిష్ఠుండవు ధర్మసంస్థాపనార్థం బవతీర్ణుండవై ననీకు శరణాగతరక్షారూపవిశేషధర్మానుష్ఠానంబుచిత్రంబుగాదు నాచిత్తంబు విభీషణునిఁ బరిశుద్ధునిఁగా నెఱింగినది భవదుక్తయుక్తిసమూహంబువలన నభిప్రాయబోధకముఖప్రసాదాదిచిహ్నంబులవలనను బహిరంతరంగంబులను బరీక్షితుండై పరిశుద్ధత్వంబున సమ్యఙ్నిశ్చితుండయ్యెఁ గావున మహాప్రాజ్ఞుండగువిభీషణుండు మాతోడఁ దుల్యుండయ్యె నితనితోడ సాచివ్యంబు గావించి రక్షింపుఁ డనిన నాసుగ్రీవునిపలుకుల కలరి రాముండు పురందరుండు పతత్రిస్వామితోడం బోలె విభీషణునితోడ సంగమంబు నొందె నిట్లు రామునిచేత నభయదానంబు గొని రావణానుజుం డగువిభీషణుండు భయంబు విడిచి స్వామిసన్నిధియందుఁ బాదపురస్సరావరోహణం బనుచితం బని తలంచి ప్రహ్వీభూతశిరస్కుండై యానయనోద్యుక్తులైనసుగ్రీవాదులచేత నిర్దిష్టుండైనభూతంబు నవలోకించుచు గగనంబుననుండి డిగ్గి యభిమతవస్తులాభజనితప్రీతియుక్తుండై స్తనంధయునకు మాతృస్తనంబుం బోలె శరణాగతునకు శరణ్యునిపాదారవిందద్వయంబె భోగ్యత్వంబునఁ బరమప్రాప్యంబు గావున ననురక్తులగుమంత్రులతోడం గూడ ధర్మాత్ముం డగురామునిచరణాంబుజంబులకు నిజకిరీటకోటిస్యూతపురుషోపలనుహేంద్రనీలపద్మరాగంబులు మరాళమధుకరచక్రవాకంబులసొంపు సంపాదింప గాఢభక్తిం బ్రణతుండై లేచి కరంబులు మోడ్చి యుక్తియుక్తంబును సాంప్రతంబును సదృశసంతోషకరంబు నగువాక్యంబున శరణ్యరామప్రీతివర్ధనంబు సేయుచు నిట్లనియె. 383

చ. అనఘ దశాస్యసోదరుఁడ నాతనిచే నవమానితుండనై
మునుకొని సర్వము న్విడిచి భూతశరణ్యుఁడవై ననిన్నుఁ జ
క్కన శరణంబు నొందితి సుఖంబును రాజ్యము జీవితంబు మిం
చినకృప నీయధీనముగఁ జేకొని భృత్యునిఁ గాఁగ నేలుమీ. 384

వ. అని యివ్విధంబునఁ బలికిన నతనివచనంబులు విని రఘువల్లభుండుముఖచంద్రకౌముదీభూతశీతలకటాక్షవీక్షణంబుల దయార్ద్రభావంబు సూచించుచు సాంత్వవాక్యంబుల నిట్లనియె. 385

విభీషణుఁడు రామునకు రావణునిబలంబుఁ దెల్పుట.

చ. దివిజవరేణ్యవైరికులదీపక నీ వలపంక్తికంఠుచే
నవమతిఁ గాంచి వచ్చుట యథార్థ మెఱింగితి నింకఁ బ్రోచెదం
దవిలినశంకఁ బోవిడిచి దానవనాథుబలాబలంబు దె
ల్పవె యన వాఁడు రాజకులపాలున కిట్లని చెప్పె సర్వమున్. 386

చ బలరిపుతుల్యవీర్య విను పద్మజపౌత్రుఁడు విశ్రవుండు నాఁ
గలఁడు తదీయవీర్యమునఁ గైకసిగర్భమునందుఁ బ్రీతిమైఁ

బాలువుగ మేము మువ్వురము పుట్టితి మగ్రజుఁ డాదశాస్యుఁ డ
గ్గలముగ మధ్యముండు ఘటకర్ణుఁడు నేను విభీషణాఖ్యుఁడన్. 387

ఉ. అంబుజమిత్రవంశకలశాంబుధిచంద్ర పితామహప్రసా
దంబున సిద్ధసాధ్యసురదానవకోటి కవధ్యుఁ డై త్రిలో
కంబుల నాక్రమించి బలగర్వమునం బటుశౌర్యధైర్యవీ
ర్యంబుల మేటి యై చెలఁగు రావణుఁ డింద్రవిరావణుం డిలన్. 388

చ. అమరమహీధరంబుక్రియ నంగము గ్రాల విరించనప్రసా
దమున నజయ్యుఁ డై సురకదంబము మీఁదికి నేగి దారుణ
క్రమమునఁ బెక్కుమాఱు లలుకం బురము ల్వడలంగఁ దోలి దు
ర్దమగతిఁ గుంభకర్ణుఁ డలరారు జగత్త్రయదుర్నివారుఁ డై. 389

క. దనుజేంద్రుని సేనాపతి, ఘనుఁడు ప్రహస్తుఁ డనువాఁడు గలఁ డాతఁడు ము
న్ననిఁ గైలాసమహీధర, మునఁ దోలె న్మాణిభద్రముఖ్యులఁ గడిమిన్. 390

చ. మఱియు దశాస్యపుత్త్రుఁ డసమానపరాక్రముఁ డింద్రజిత్తనా
వఱలు నతం డవధ్యదృఢవర్ముఁడు పావకుని న్రణంబులో
నిరవుగఁ దృప్తుఁ జేసి యతఁ డిచ్చునదృశ్యరథాదిసాధనో
త్కరములతో నదృశ్యుఁ డయి దారుణభంగి జయించు వైరులన్. 391

వ. మఱియు మహోదరమహాపార్శ్వులును దేవాంతకనరాంతకులు నతికాయ మహాకాయులును గుంభనికుంభులును ధూమ్రాక్షమకరాక్షయూపాక్షవిరూపాక్షులు నకంపనుండు నొక్కొక్కఁడు పెక్కులంబుల నారితేరి లోకపాలసములై యుండుదురు మఱియు లంకాపురంబునందు మాంసాహారులును శోణితపంకిలులును గామరూపులు నగు ప్రధానరాక్షసులు దశకోటిసహస్రంబు లున్నవా రట్టిదానవులం గూడి రావణుండు నిరంకుశప్రతాపంబున దిక్పాలకులం బాడిచి గెలిచి మాఱు లేక యుండు నద్దురాత్మునిచేతఁ బరాజితు లై యింద్రాదులు సేయునది లేక దేవసమన్వితంబుగా వగచు చుండుదు రని పలికిన నతని పలుకులు విని దృఢపరాక్రముం డగు రాముండు కొంతొకతడవు యోచించి సర్వధర్మంబులు నెఱింగి విభీషణున కిట్లనియె. 392

చ. దనుజకులావతంస మది దాఁపక నీ వెఱిఁగింప నద్దశా
స్యుని తెఱఁ గెల్ల వింటిఁ గమలోద్భవుఁ డక్షము వచ్చి కాచినం
బనివడి పుత్త్రమిత్త్రజనబాంధవమంత్రిసమన్వితంబుగా
ననిమొన వాని గీటడఁచి యాసురరాజ్యము నీ కొసంగెదన్. 393

శా. పాతాళంబున కేగిన న్సురగిరిప్రాంతంబునన్ డాఁగినం
ద్రాతం గానక మిన్ను ప్రాఁకినఁ బయోరాశిం బ్రవేశించిన
న్సీత న్మ్రుచ్చిలినట్టిరావణుని దుశ్చిత్తు న్విదారింప కే
ఖ్యాతి న్వొండి యయోధ్యకుం జొరమి నిక్కం బింత దైత్యోత్తమా. 394

వ. ఈయర్థంబునందు సందియంబు లేదు భరతలక్ష్మణశత్రుఘ్నులతోడు శపథంబు
చేసితి నని పలికిన. 395

క. అనవుడు విభీషణుం డా, జననాథునిసత్యవాక్యచతురత్వంబు
న్విని తచ్చరణాంబుజములు, తనయౌదల సోఁక మ్రొక్కి తగ నిట్లనియెన్.

రాముఁడు విభీషణుని లంకారాజ్యాభిషిక్తునిఁగఁ జేయుట.

తే. దైత్యవధమందు లంకాప్రధర్షణంబు
నందు సాహాయ్య మొనరింతు నధిప నీకు
నాలమున జీవితము దాఁప కరెబలంబు
చొచ్చి పెనఁగెద నను నీవు మెచ్చి పొగడ. 397

చ. అన విని రాఘవుండు ముదమంది విభీషణుఁ గౌఁగిలించి త
మ్మునిఁ బరికించి మెచ్చితి సముద్రజలంబులచేత వేడ్క నీ
తనిఁ గపిసైన్యమధ్యమునఁ దప్పక లంకకు రాజు గాఁగ గ్ర
క్కున నభిషిక్తుఁ జేయు మనఘుం డితఁ డర్హుఁడు మత్కృపాప్తికిన్. 398

ఉ. నా విని లక్ష్మణుండు రఘునాథునియానతిఁ గాంచి సాప్తుఁ డై
రావణుతమ్మునిన్ దనుజరాజ్యవిభుండవు గమ్మటంచు సం
భావితుఁ జేసి కీశబలమధ్యమునం గడు వేడ్కతోడ సు
శ్రీవిభవం బెలర్ప నభిషేక మొనర్చె సమంత్రకంబుగన్. 399

తే. మానవేంద్రునిసత్కృపామహిమఁ జేసి,యవ్విభీషణుఁ డభిషిక్తుఁ డగుచునుండ
నధికసంతోషమున నవ్వనాటబలము, సాధుగతి మ్రోసె సంపూర్ణజలధికరణి.

వ. అంత నప్పద్మినీకాంతనందనుండును హనుమంతుండును నవ్విభీషణు నాలోకించి
పరమానందభరితస్వాంతంబున నిట్లనిరి. 401

తే. అనఘ మన మందఱము రాఘవునకు నిచట, నర్థిఁ గూర్చినచుట్టలమైతిమి గద
యింక నఱమఱ మాని తదీప్సితంబు, సఫల మగునట్టియత్నంబు జరుపవలయు.

ఉ. ఈవనరాశి నింక మన మిందఱ మేక్రియ దాఁటు వార మి
చ్ఛావిధి నేయుపాయమున సర్వవనాటగణంబు దాఁటు ను
ర్వీవరు లెత్తెఱంగునఁ దరింపుదు రాసురవంశదీప మీ
కీవిధ మంతయుం దెలియ నింపుగ నీ వెఱిఁగింపు నావుడున్. 403

విభీషణుఁడు సముద్రము దాఁటుట కుపాయంబు వానరుల కెఱింగించుట.

ఉ. ఆరజనీచరప్రవరుఁ డక్కపివీరులఁ జూచి పల్కు నీ
నీరధి మున్ను సాగరులనేర్పున నైనది గాన నీరఘు
త్స్వారమణుండు దీనికి వెసన్ శరణాగతుఁ డైనఁ బ్రీతి సొం
పారఁగ నుత్తరించువిధ మంతయు నేర్పడఁ జెప్పు నొప్పుగన్. 404

వ. అని పలికిన నద్దశగ్రీవానుజుపలుకులు విని సుగ్రీవుండు విపులగ్రీవుం డై రయం

బున లక్ష్మణసహితంబు రామునిపాలికిం జని సముద్రంబు దాటుటకుఁ దగిన యుపాయం బెఱింగింపు మని తా నడుగుటయు నందుకు సర్వజ్ఞుండును బండితుండు నగువిభీషణుండు చెప్పినవిధంబును విన్నవించినఁ బ్రియాదరుండగు రామభద్రుండు కమలమిత్రపుత్రసుమిత్రాపుత్రుల నవలోకించి సమ్మానించి విభీషణుండు చెప్పినచందంబు యుక్తంబై యున్నదై నను మీరు పండితులును మంత్రవిచక్షణులును గావున మీకుం దోఁచినచందంబు యోచించి నిశ్చయింపుఁడని స్మితపూర్వకంబుగాఁ బలికిన నవ్వీరోత్తము లిరువురును గొండొకతడవు యోచించి సముదాచారయుక్తంబుగా నిట్లనిరి. 405

చ. ఇనకులవర్య నమ్ముడుగ నేల సమస్తము మీరెఱుంగరే
దనుజవరుండు చెప్పినవిధం బది యిప్పటికి న్సుఖావహం
బనఁ దగియున్న దింద్రవరుణాదిదిగీశుల కైన సేతుబం
ధనమునఁ గాని యివ్వనధి దాఁటఁగ శక్యము గాదు గావునన్. 406

శా. రామక్ష్మావర యిచ్చట న్మసలఁగా రా దింక నివ్వానర
స్తోమోపేతముగా దశాస్యపురి కేతెంచ నవశ్యము న
ద్దామప్రక్రియ నట్టిమార్గ మను వొందం దెల్పు నట్టీనదీ
స్వామి న్వేఁడుము రావణానుజవచస్సాఫల్యముం గల్గఁగన్. 407

రాముఁడు సముద్రప్రసాదమునకై దర్భశయనము నధివసించుట.

క. అని పలికిన విని యాఁగాఁ, గని జలనిధితీరమునఁ గుశాస్తరణముపై
ఘనభంగి నధివసించెను, జననాథుఁడు వేదిపైఁ గృశానుఁడుఁ బోలెన్. 408

శా. ఆలో రాక్షసవీరుఁ డుద్ధతుఁడు దైత్యాధీశుచారుండు శా
ర్దూలాఖ్యుం డొకఁ డేగుదెంచి యలపాథోరాశితీరంబునన్
శ్రీలం గ్రాలుకపీంద్రపాలితచమూశ్రేణి న్సమగ్రంబుగా
నాలోకించి రయంబునం జనియె నుద్యద్భీతితో లంకకున్. 409

చ. చని దశకంఠుఁ గాంచి దనుజప్రవరా కపిసైన్య ముద్ధతి
న్వననిధివోలెఁ బెంపుమెయి వచ్చుచు నున్నది లంకమీఁదికిన్
జనపతు లుత్తమాయుధులు సంగరశూరులు రామలక్ష్మణు
ల్జనకజ డాయ వచ్చి రిదె సర్వవనాటచమూసమేతులై. 410

క. హరిసైన్యము దశయోజన, పరిమాణంబై నభంబు బలసి మెలపున
న్సరనిధియుత్తరతటమున, వఱలుచు నున్నయది రాజవరయుక్తముగన్. 411

వ. మఱియు నబ్బలం బప్రమేయంబై యగాధంబై రెండవసాగరంబుకరణి నొప్పుచున్న దీయర్థంబున సందియంబు లేదు. 412

ఉ. కావున నూరకుండ నికఁ గర్జము గాదసురేంద్ర చెచ్చెర
న్వారికి దూతలం బనిచి వారితెఱంగు నెఱుంగఁ బోలు ని

చ్చావిధి దానభేదముల సాంత్వమునం గడు నేర్పుపెంపుతో
నేవిధి నైన నమ్మొనకు నిప్పుడు భంగము సేయు టొప్పగున్. 413

వ. అని పలికిన నద్దశకంఠుండు శార్దూలునివచనంబులు విని మనంబున నొక్కింత విచారించి శుకుం డనువాని నొక్కరాక్షసు నవలోకించి యి ట్లనియె. 414

—రావణుఁడు శుకుం డనుదూతను సుగ్రీవునికడకుఁ బంపుట.—

ఉ. ఓజ దలిర్ప నీ వరిగి యొప్పుగ నావచనంబు గాఁగ నీ
రేజవనాప్తపుత్త్రునకుఁ బ్రీతి జనింపఁగఁ బల్కుమీ మహా
రాజకులప్రసూతుఁడవు రాజసుతుండవు కీశకోటికిన్
రాజవు సూర్యపుత్త్రుఁడవు భ్రాతృసముండవు నాకుఁ జూడఁగన్. 415

చ. అపహృతదారుఁడై వగచు నారఘుభర్తకు నాకె కాక యో
కపికులవర్య యెన్నఁడును గల్గదు వైరము నీకు నాకు నీ
నృపతికి నాజిఁ దోడుపడ నీ కిట వచ్చుట పాడి గాదు తో
రపుసిరి గల్గునీపురికిఁ గ్రమ్మఱఁ బొమ్ము చమూయుతంబుగన్. 416

వ. నీవు బ్రహ్మపౌత్త్రుండ వగుటం జేసి మాకు బంధుభూతుండ వైతివి నీకు రామావలంబనంబున నయ్యెడునుపకారంబు ననవలంబనంబున నయ్యెడునపకారంబును లేదు నిష్ఫలం బైనవైరం బనుచితంబు గావున నీవును గ్రమ్మఱంజనుము.

క. అరుగక యొడ్డారంబున, నరుదెంచిన నేమికార్య మస్మత్పురి ని
ర్జరు లైనను జొరఁ జాలరు, నరవానరు లెంతవారు నగచరవర్యా. 417

వ. అని సందేశంబుఁ జెప్పిపుత్తెంచిన నారాక్షసుండు నిజనామంబునకుసార్థక్యంబు గల్గునట్లుగా నొక్కపతత్త్రిరూపంబు దాల్చి శీఘ్రగమనంబున నాకాశమార్గంబున సముద్రంబు దాఁటి వచ్చి వానరసైన్యోపరిభాగంబున నిలిచి సుగ్రీవు నవలోకించి దురాత్ముం డగురావణుండు చెప్పినవృత్తాంతం బంతయు నెఱింగించిన విని యక్కపిశ్రేష్ఠుండు కోపించి వానరులం జూచి యిద్దురాత్మునిం బట్టి బంధింపుఁ డనినఁ దత్క్షణంబున నాహరివీరు లాకాశంబున కెగసి కాష్ఠముష్టిప్రహారంబుల నొప్పించి యొడిసి పట్టి బలాత్కారంబునఁ బుడమికి దిగం ద్రోచిన నతం డవతారితుండై వానరులముష్టిప్రహారంబుల కోర్వక రామభద్రు నవలోకించి యి ట్లనియె 419

చ. అనఘచరిత్ర భర్తృమత మాత్మమతంబుగ భీతి దక్క య
న్యనృపులమ్రోలఁ బల్కుటది నైజము చారుల కుర్విలోన ధ
ర్మనియతి మాని నన్ను వడి రాయిడి పెట్టెద రీవనాటు లీ
వమవమధర్మమూర్తి వకటా వల దంచు సదల్ప వల్వదే. 420

క. జననాథ నీతిశాస్త్రం, బనుక్తవాది యగుచారుఁ డరయఁగ వధ్యుం
డని పలికెఁ గాక వధ్యుం, డని పలికెనె యుక్తవాది యగువాఁ డవనిన్. 421

క. అని పలుకఁ దద్విలాపము, విని రాఘవవిభుండు ప్లవగవీరుల నెల్లం
గనుఁగొని వీని వధింపకుఁ, డని పలికెఁ గృపాతరంగితాపాంగుం డై. 422

సుగ్రీవుఁడు శుకునిచే రావణునికి సందేశము పంపుట.

వ. ఇట్లు పలికిన నవ్వనచరులు రాముని శాసనంబు విని వాని విడిచి పుచ్చినవాఁడు దర్శితాభయుండై లఘుగమనంబున నంతరిక్షంబున కెగసి వెండియు సుగ్రీవు నవలోకించి మహాత్మా నీవు మహాబలపరాక్రముండవు సత్త్వసంపన్నుండవు రావణునకుం జెప్ప నెద్దియేనియుం గలదేని యానతి మ్మనిన నవ్వానరవల్లభుం డు వాని కిట్లనియె. 423

ఉ. రావణ నీవు నా కరయ భ్రాతృసముండవు గావు కర్తవుం
గావు సురక్షణీయుఁడవు గావు సఖుండవు గావు వీరసం
భావితుఁ డైనరామజనభర్తకు శత్రుఁడ వైతి గావునన్
వావిరి వాలివోలెఁ గడువధ్యుఁడ వైతివి నిక్క మింతయున్. 424

ఉ. ఓరజనీచరేశ విను ముగ్రవనాటచమూయుతంబుగా
నీరధి దాఁటి వచ్చి రఘునేత మనంబున సంతసింపఁగా
దారుణభంగి బాంధవసుతప్రియభృత్యయుతంబుగా నినున్
ఘోరరణంబులోఁ దునిమి గొబ్బున లంకను నీఱుఁ జేసెదన్. 425

చ. వనజభవుండు దోడుపడ వచ్చిన దేవచమూసమేతుఁడై
యనిమిషవల్లభుండు కృప నడ్డము సొచ్చిన నప్పురాంతకుం
డనుపమభంగిఁ గాచిన నిశాటకులప్రవరా రణంబులో
మనుజవిభుండు నీతలలు మానక ద్రుంచు నిశాతహేతులన్. 426

చ. అనిమొన రాముబారిఁ బడి యార్తిఁ దలంకెడునిన్నుఁ గావఁగా
ననుపమలీల నిజ్జగములందుఁ బ్రసిద్ధి వహించునట్టివా
రనిమిషసిద్ధసాధ్యసనుయక్షపిశాచభుజంగమాహిభు
గ్దనుజపతంగు లైనఁ గృపఁ గావ సమర్థులు గారు చూడఁగన్. 427

క. ద్విజకులవర్యు జరావృద్ధు జటాయువుఁ బరమపుణ్యుఁ ద్రుంచితి వీ వా
వృజినంబు నిన్ను దనుజ, వ్రజనాయక గాల్ప కేల వమ్మై పోవున్. 428

ఉ. రామనరేంద్రచంద్రునిపరాక్రమముం దెలియంగ లేక యా
రామమున న్మృగగ్రహపరత్వమునన్ విభుఁ డేగఁ జూచి యా
భూమిజ ముచ్చిలించి గొని పోయితి వానృపుఁ డొద్ద నున్న ను
ద్దామశరప్రతానమునఁ దప్పక యిప్పుడె ని న్వధింపఁడే. 429

వానరులు శుకుని బంధించి పీడించుట.

క. నాకేశముఖ్యు లేనా, లోకాత్మునిసుహిమఁ దెలియలే రవ్విభుతో
వీఁకఁ బగఁ గొంటి వట యిఁక, నీ కెక్కడిబ్రతుకు పోర నీతివిదూరా. 430

చ. అని కపిరాజు పల్కు సమయంబున వాలికుమారుఁ డంగదుం
డినసుతుతోడ నిట్లనియె నీతఁడు రావణుదూత గాఁడు నే
ర్పున మనయున్నచో ప్పెఱిఁగి పోవఁగ వచ్చినవేగువాఁడు చూ
డ నితని కెడ్డ మ్ముంపు మగుడ న్మఱి లంకకుఁ బోవ కుండఁగన్. 431

వ. అని పలికి యతనియనుమతి వడసి వెండియు రాక్షసునిం బట్టి తెం డని వలీ
ముఖుల నియోగించిన వారు నింగి కెగసి యాపన్నుం డై గతి సెడి విలపించు
వాని లూనపక్షుం డగురాక్షసుని బంధించి పుడమిం ద్రెళ్ల వైచిన నద్దను
జుండు చండవానరసంపీడ్యమానసర్వాంగుండై దుఃఖించుచు మహాత్ముం డగు
రామభద్రు నవలోకించి యి ట్లనియె. 432

మ. నరనాథా కృప మాలి యీకపులు న న్బాధించు చున్నారు ని
ష్ఠురభంగిం గడు నొచ్చె నంగములు నక్షు ల్పెల్కు తెం బక్షముల్
విఱిగెం గంఠగతంబు లయ్యె నసువు లీవారి న్నివారించి స
త్కరుణం బ్రోవు మనాథరక్షణము యుక్తం బే కదా జేనికిన్. 433

చ. తడయక యేను వానరులదారుణపీడకు నొచ్చి ప్రాణముల్
విడిచితి నేని నిక్కముగ వీరజనోత్తమ జన్మ మాదిగా
నుడుగక నేటిదాఁకఁ గర ముద్ధతిఁ జేసినపాప మంతయుం
గడువడి నిన్నుఁ బొందు నటు గావున నాపలు కాదరింపవే. 434

—రాముఁడు శుకుని విడిపించుట.—

క. అని పలుక వానిపరిదే, వనము విని రఘూత్తముండు వానరవరులం
గనుఁగొని దూతను జంపకుఁ, డని పలికినఁ జంపు టుడిగి రయ్యమరారిన్. 435

వ. అంత నమ్మహీకాంతుండు సముద్రప్రాంతంబున నిజాంతర్భక్తియుక్తుండై దర్భా
స్తరణంబుమీఁదఁ బ్రాఙ్ముఖంబుగా నధివసించి మహోదధి కంజలిఁ గావించి
పురాభుక్తవర్జితనానావిధవిచిత్రమణిస్యూతవరకాంచనకేయూరకటకాంగుళీ
యకప్రముఖనిఖిలభూషణవ్రాతోపేతంబును బూర్వపరిచితపరిమళోల్లాస
భాసురచందనాగరుస్థానీయ భూతబాలసూర్యప్రతీకాశ నవకుంకుమాది వాసి
తంబును నిరంతరశ్రేష్ఠపరిచారికాభుజాభిమృష్టంబును శయనసమయసమాలిం
గితసీతాంగనాపరిమళ కుసుమ ముకుళీకృత చికురబంధశోభితంబును జనకతన
యాకుచమండలతారహారాయమాణపాండురనఖవిరాజితంబును సాగరాంత
ధరణీభారనిర్వహణశక్తియుక్తంబును భుజగేంద్రసమానసారంబును గంగాజల
నిషేవితంబును మహాపరిఘసన్నిభంబును బరిపంథిశోకవర్ధనంబును సుహృదా

తుండై మౌనంబు ధరియించి యప్రమాదుండై విధ్యుక్తప్రకారంబున నమ్మ
హోదధి నుపాసించు చుండ నమ్మహనీయచరిత్రునకు నిశాత్రయం బతిక్ర
మించె నంత. 436

—సముద్రుఁడు పరీక్షార్థంబు రాము నుపేక్షించుట.—

మ. నయవిచ్ఛేఖురుఁ డైన రాఘవునిచే నానాప్రకారంబుల
న్నియతిం బ్రార్థితుఁ డయ్యు నై మఱచి మున్నీ రమ్మహాభర్తకుం
బ్రియ మారం బొడసూప కుండె జడధు ల్విఖ్యాతదండక్రియా
నియతిం గాక ప్రశాంతవాక్యముల నన్వేషింపఁగా నేర్తురే. 437

వ. మఱియుఁ దనకు విరోధు లగుమరువాసుల రాముని చేతదండింపం జేయుటకును
రావణునిభయంబునఁ దత్సంహారక్షమం బైనరామునిపరాక్రమంబు పరీక్షించు
టకును సముద్రుండు విలంబనంబుఁ జేసి పొడసూప కుండె. 438

తే. ఉదధి యీరీతిఁ బొడసూపకున్న నలిగి
మనుజపతినేత్రముల నెఱ్ఱఁదనము గదుర
నంతకాకారుఁ డై తనచెంత నున్న
యట్టిసౌమిత్రిఁ గనుఁగొని యిట్టు లనియె. 439

చ. అనఘచరిత్ర కంధిదురహంకృతిఁ గంటివె డాయ రాఁడు నే
ర్పును బ్రియవాగ్విశేషతయుఁ బొల్పుగ శాంతిశమక్షమార్జవా
ద్యనుపమసద్గుణంబులు దురాత్ములకుం బని సేయ వట్టిస
జ్జనుఁ గని సాధునిందితు లశక్తుఁ డటంచుఁ దలంతు రెంతయున్. 440

తే. సర్వదోత్సృష్టదండునిఁ జపలు విసరి, ధావకుని దృప్తు దుష్టునిఁ దన్నుఁ దాను
బొగడుకొనువాని దుర్నీతినెగడువాని, శఠునిఁ గనుఁగొని లోకంబుసత్కరించు.

క. సామమునఁ గీర్తి గలుగదు, సామంబున యశము లేదు సజ్జనుఁ డైనన్
సామమున ఖ్యాతి వడయఁడు, సామంబున నెల్లపనులు సమకొని వచ్చున్.

క. నిరుపమనిశాతసుద్భీ, కరశరనిర్భిన్నమకరకమఠంబులచే
శరనిధి నిరుద్ధసలిలో, త్కరముగఁ గావింతు నిపుడు గనుఁగొను మనఘా. 443

క. పన్నగ దంతికరంబులు, పన్నగ భోగములు కచ్ఛపంబులశిరముల్
క్రన్నన మత్సాయకసం, ఛిన్నము లై పోవునట్లు చేసెదఁ గడిమిన్. 444

క. నమదేభమీనకర్కట, కమఠంబు నశంఖశుక్తికాజాలము ను
గ్రమహోరగసేవిత మగు, కమలధి నింకింతు నీవు గనుఁగొను చుండన్. 445

తే. దశరథకుమార నాయందుఁ దాల్మియునికిఁ
జేసి జలనిధి చుల్కన చేసి నన్నుఁ
గడిమి నసమర్థునిఁగఁ జూచెఁ గావరంపు
జనులయెడ నోర్పు యుక్తమై తనరదయ్య. 446

తే. సామమున నెంత వేఁడిన సాగరంబు, తనదురూపంబు సూపదు ధనువుఁ దెమ్ము
శితశరంబుల దీని శోషింపఁ జేసి, కపులు కాల్నడఁ జనునట్లుగా నొనర్తు. 447

—రాముఁడు కోపించి సముద్రునిపై ఘోరబాణంబులఁ బ్రయోగించుట.—

క. వేలాకృతమర్యాదము, నాలోకనభీకరంబు నగణితవీచీ
మాలాకుల మగునీవము, కాలయమును జూడు మిపుడు హాతరయమునుగాన్.

వ. అని పలికి క్రోధవిస్ఫారితేక్షణుండై యద్దశరథరాజనందనుండు కల్పాంతకాలహుతాశనుండుం బోలె దుర్ధర్షుండై వెలుంగుచు ఘోరం బైనచాపం బందుకొని నారి మ్రోయించుచు జగంబులు కంపింప సహస్రాక్షుండు వజ్రంబుం బోలె నుగ్రశిలీముఖంబు లధరించిన నయ్యమోఘసాయకంబులు విలయపవనప్రేరిత వైశ్వానరజ్వాలాజాలంబులభంగి మంట లుమియుచు మహావేగంబునంబఱచి సముద్రసలిలంబులు సొచ్చి నిర్వక్రగతి నౌర్వానలశిఖలుం బోలె సర్వంబు నాక్రమించి మింటికిం బొగ లెగయ ధగద్ధగాయమానవిస్ఫులింగపటలీసంచారఘోరంబుగాఁ గవిసిన నమ్మహోదధి యాఘూర్ణితతరంగంబును సంభ్రాంత పాతాళతలవాసిమహోరగరాక్షసకదంబంబును నుద్వర్తితమహాగ్రాహంబును సంవృత్తసలిలాశయంబును విస్ఫోటితశంఖశుక్తికాజాలంబును బ్రతప్తమత్స్య కచ్ఛపకర్కటకాకోదరంబును సన్నిరుద్ధమహావేగంబును మహామారుతరయోద్ధూతంబు నై వింధ్యమందరసంకాశంబు లగునుల్లోలకల్లోలజాలసంఘట్టనంబునం బుట్టినమహాధ్వని భూనభోంతరాళంబు నింపఁ బెల్లుబ్బి కడ లెత్తి మ్రోయుచు సుడివడియును జిక్కువడియును జీకాకువడియునుదిరుగుడువడియె నానమయంబున. 449

ఉ. ఆరఘువీరుకోపము మహాద్భుతకర్మము భూరివేగము
దారుణవిక్రమంబుఁ గని తమ్ముఁడు లక్ష్మణుఁ డూరకున్నచో
ఘోరము గాఁగ లోకములకు న్విలయంబు ఘటిల్లు నంచు లోఁ
గూరినభీతి నిట్లనియె గొబ్బునఁ జాపము వట్టి యన్నకున్. 450

చ. అరుదుగ నెప్పుడుం గుపితు లయ్యును సాధుల కప్రియంబు సే
యరు మిముబోఁటిపెద్ద లటు లైన సమాఖ్యకు హాని గల్గు నం
చరయ సమస్తభూతనికరాశ్రయుఁ డైనపయోధి నీగతి
న్శరములపాలుఁ జేయఁ దగునా సుగుణాఢ్య కృప న్క్షమింపవే. 451

శా. నీకోపంబును నీమహామహిమయు న్నీఘోరకృత్యంబు న
స్తోకాటోపముఁ జూచి సిద్ధదివిజస్తోమంబు బ్రహ్మర్షు లి
క్ష్వాకుశ్రేష్ఠ ఘనస్వనంబున నహో కష్టం బహో కష్ట మం
చాకాశంబున మ్రోయఁగాఁ దొడఁగి రుద్యద్భీతి నాలింపవే. 452

క. అని లక్ష్మణుండు తగ వేఁడిన నారఘువీరుఁ డలుక డింపక జలధిం

గనుఁగొని దారుణవాక్యంబున నిట్లని పలికె బొమలు ముడివడుచుండన్.

ఉ. నీమద మేమి చెప్ప నగు నీరధి క్రొవ్వున నాదువిక్రమ
శ్రీమహిమం బెఱుంగక ప్రసిద్ధసమున్నతవీర్యహీనునిం
గా మది నెంచి తీవు ఘనకాండపరంపరల న్భవజ్జల
స్తోమము నింకఁ జేసి పెనుధూళి యొనర్చెద నేఁడు చూడుమా. 454

చ. పలుమఱుఁ ద్రోవఁ జూపుఁడని ప్రార్థన సేయఁగ నేల నిన్ను మ
ద్విలసితచాపముక్తశరవేగమున న్భవదంతరాళము
న్దలకొని ఘోరసత్త్వసహితంబుగ భస్మముఁ జేసి కాల్నడం
బెలుచ వనాటకోటి నడిపించెదఁ జూడుము నాదుశక్తియున్. 455

వ. జలోపరిసేతుబంధనజలస్తంభనతచ్ఛోషణాదిశక్తిత్వరూపం బైనమదీయవిక్రమంబును శాస్త్రవశ్యత్వసౌజన్యనిబంధనశరణారూపపురుషకృత్యంబు నెఱుంగవైతివని పలికి. 456

శా. ఆరాజేంద్రుఁడు బ్రహ్మదండనిభఘోరాకారనారాచము
న్నారప్రక్రియ వింటఁ గూర్చి నియతి న్బ్రహ్మాస్త్రమంత్రాక్షర
స్ఫారన్యాసము సేసి వేగ యశరింపం బూని దుర్దాంతమౌ
ర్వీరావం బొనరించె సర్వజగము ల్భీతిల్లి కంపింపఁగన్. 457

రాముఁడు బ్రహ్మాస్త్రంబు సముద్రునిపైఁ బ్రయోగింపఁ దలకొనుట.

వ. ఇవ్విధంబున రాముండు సముద్రభయోత్పాదనంబుకొఱకు బ్రహ్మాస్త్రంబు సంధించిన. 458

సీ. జగదంతరాళంబు పగిలినయట్లయ్యెఁ దలరి కులాచలంబులు చలించెఁ
గ్రమ్మె ముజ్జగముల గాఢాంధకారంబు తివిరి దిఙ్ముఖములఁ దెలివి మాసెఁ
గలఁగి సంక్షోభించెఁ గమలాకరంబులు తగ మహానిమ్నగ లిగిరిపోయె
గ్రహగణంబులు మింటఁ గాంతిహీనము లయ్యె జగతి కుమ్మరసారెపగిదిఁ దిరిగె

తే. చంద్రభాస్కరు లన్యోన్యసహితు లగుచు
దారకలఁ గూడి తిర్యక్ప్రచారు లైరి
భీషణోదగ్రదీర్ఘనిర్ఘోష మడర
నింగివలన నిర్ఘాతము ల్నిర్గమించె. 459

క. వితతోల్కాశతసందీపిత మై గాఢాంధకారభీషణ మై య
ద్భుతభంగిఁ బొల్చె గగనము, గతమార్తాండోగ్రకిరణకాండం బగుచున్.

చ. గగనమునన్ జనించి లయకాలమునాఁటిరయంబుఁ దాల్చి చం
డగతిఁ బ్రభంజనుండు వికటస్ఫుటదారుణపాంసుయుక్తుఁ డై
నగములఁ గూల్చి మేఘముల నద్దెసలం బడఁ బాఱఁదోలి ఘోం
దుగ గిరిశృంగము ల్విఱుగఁ ద్రోచి రహి న్విహరించె నుద్ధతిన్. 461

క. దివితోఁ రాయుచు బల్విడి, నవమేఘము లొక్కటై నినాదము లెసఁగన్
భువిపై విద్యుత్కాండ్కా,నవకణములు పిడుగులును ఘనంబుగఁ గురిసెన్. 462

మ. ధరణీభాగమున న్నభస్థలిని బాతాళంబునం గొండల
న్సారిసంతంబుల నప్పలం గలుగుదృశ్యాదృశ్యభూతంబు లా
తురత న్వ్రేస న్మ్రోసె నొక్కమొగి నింద్రుం డాదియాదిక్పతు
ల్పరమర్షు ల్సురసిద్ధచారణులు విభ్రాం[illegible] 463

మ. కమఠవ్రాతముతో జలేభతిమినక్రగ్రాహమీనోరగో
గ్రమహారాక్షసకోటితో నెసరు వీఁకం బొంగి మిన్నంది ఘో
రము లాపీచులమ్రోఁత పెల్లెసఁగి మీఱన్ వేలయు న్దాఁటి సం
భ్రమిత న్యోజనదూరము న్బొరలె నప్పాథోధిరా జుద్ధతిన్. 464

వ. ఇట్లు సంక్షోభించి తనమనంబున. 465

ఉ. మోసము వచ్చె రాజకులముఖ్యుఁడు రాముఁడు శస్త్రబాధింప ను
ల్లాసముతోడ దారుణకలంబము దా నరిఁ బోసి యున్నవాఁ
డీశరరాజముం గడిమి నేయక మున్నె యుపాయనంబుల
న్భాసురలీలఁ జేకొని సుభక్తిమెయిం బొడసూపు టొప్పగున్. 466

మ. అని చింతించి మహోదయాచలము నుద్యచ్ఛక్తి భేదించి మిం
చునవాదిత్యునికై వడిన్ జలములన్ సొంపార భేదించి మిం
చినరాగంబున దివ్యరూపధరుఁడై శీఘ్రంబున న్నిర్గమిం
చె నితాంతద్యుతి దిక్కుల న్వెలుఁగ నక్షీణక్రియాదక్షుఁడై. 467

## సముద్రుండు రాముని ననునయించుట.

వ. ఇట్లునిర్గమించి స్నిగ్ధవైడూర్యసంకాశుండును రక్తమాల్యాంబరధరుండునుబద్ధ పత్రనిభేక్షణుండును జాతరూపమయవిచిత్రనానారత్నమణిస్యూతకోటీరకుండల కేయూరకంకణాంగుళీయకకాంచీనూపురప్రముఖబహువిధదివ్యాభరణ భూషితుండును సువర్ణమయదుకూలచేలాలంకృతుండు నై నానావిధధాతుమండల మండితుండై హిమవంతుండుంబోలె వెలుంగుచు నిజోదరసంభూతం బైన కౌస్తుభరత్నంబునకుఁ దోఁబుట్టువు లగువెలలేనిజాతిరత్నంబులు చెక్కినజాంబూనదమయం బైన పతకం బురంబునఁ గ్రాల గంగాసింధుకాళిందీసరస్వతీగౌతమీప్రభృతిమహానదులు మనోహరరూపధారిణు లై యుభయపార్శ్వంబుల నడువ బహుభోగమండితంబు లగుమహోరగంబులును బాతాళతలవాసు లగుదానవులును వెనుక ముందఱ బలసి చనుదేర సర్వపుష్పంబులం గూర్చి యొక్కమాలిక శిరంబున నిడుకొని శీఘ్రగమనంబున శరపాణి యగురఘుపుంగవుని యొద్దకుం జనుదెంచి వలగొని నిటలతటఘటితాంజలిపుటుండై ప్రసన్నముఖుం గావించుకొని యిట్లనియె. 468

చ. క్షితియు నభంబు వాయుజలకీలులు శాశ్వతమైనమార్గముం
జతురత నాశ్రయించి యనిశంబు స్వభావమునం జరింతు రా
గతి రఘువంశశేఖర యగాధత నొందుటఁ జేసి నాకు న
జ్ఞతయు జడత్వసంపదయుఁ గల్గుట చోద్యము గాదు చూడఁగన్. 469

తే. నీకుఁ బొడసూప కుండుట నృపవరేణ్య
రాగమదలోభభయమత్సరములవలనఁ
గాదు మత్స్వభావం బంతె గాక కనలి
నన్ను భంజింప నేటి కన్యాయ మధిప. 470

సీ. రాజేంద్ర నీబాణరయము సహింపంగ నే నెంతవాఁడ నహీనభక్తి
నీపంపుఁ జేసెద నేర్పుతోఁ గపు లుగ్రమకరంబులకు మహామత్స్యములకుఁ
జిక్కకుండఁగ నబ్ధి నక్కజంబుగ దాఁటువిధముఁ జెప్పెదఁ గిన్క విడిచి సుప్ర
సన్నుండ వగుమన్న నన్నరేంద్రుఁడు శాంతుఁడై సముద్రునిఁ జూచి యనఘచరిత

తే. ఇమ్మహాబాణ మవ్యర్థ మెచట విడుతు
ననిన నవ్వారిరాశి మహాత్ముఁ డైన
దాశరథిమాట విని శరోత్తమముఁ జూచి
యిట్టు లని పల్కె సంతోష మెసఁగ. 471

రాముఁడు సముద్రవచనంబున ద్రుమకుల్యపై నస్త్రప్రయోగము సేయుట.

చ. నరవర నీవు సర్వభువనంబుల విశ్రుతిఁ గన్నకైవడిన్
గుఱుతుగఁ బాటి కెక్కె ద్రుమకుల్య మనా నొకపుణ్యదేశ ము
త్తరమున నుగ్రదర్శనులు దస్యులు దుర్మతు లందు నిల్చి మ
త్పరమపవిత్రతోయములు ద్రావుచు నుందు రహర్నిశంబులున్. 472

క. ఆపాపజాతిదుర్జను, లేపున నన్నంటుటకు సహింపక యుందు
న్భూపాలతనయ యచ్చట, నీపరమాస్త్రంబు విడువు మెంతయుఁ బ్రీతిన్. 473

క. అని ప్రియ మారఁగఁ బలికిన, విని రాఘవుఁ డయ్యమోఘవిశిఖంబును గ్ర
క్కున నప్పాథోనిధి చెప్పినచోట న్విడిచె లోకభీకరలీలన్. 474

క. దాశరథిముక్తఘనదీప్తాశనిసమబాణ మెచట నరుదుగఁ బడె నా
దేశము మరుకాంతార మనా సంజ్ఞ వహించె జగతి నానాటవులన్. 475

వ. మఱియు నచ్చటివసుంధర శరపీడిత యై మహానాదంబునం బగిలె రసాతలంబున నుండి జలంబులు తద్వ్రణముఖంబువలన నిర్గమించి సంతతావిచ్ఛిన్నధారారూపంబుగా సముద్రసలిలంబులఁ గలిసె నక్కూపంబు వ్రణకూపం బన జగంబున వినుతి కెక్కె నబ్బాణపాతంబున నంభఃకుక్షిపరిక్షోభంబు నొందె నద్దేశంబు మరుకాంతారం బన ముల్లోకంబుల విశ్రుతి వహించె నిత్తెఱంగున నరోత్తముం డగురఘుసత్తముండు మరువిషయంబు శోషింపం జేసి వెండియు

దయాళుండై పవిత్రంబు నరోగంబును ఫలమూలరసయుతంబును బహుస్నేహ
పూరితంబును నిరంతరక్షీరధారాపూర్ణంబును సుగంధబంధురంబును వివిధది
వ్యౌషధీసమాకీర్ణంబును సమస్తసద్గుణ యుక్తంబునుంగా వరం బొసంగిన
నద్దేశంబు మహానుభావుం డగు రాముని వరదానంబువలనఁ బరమకళ్యాణగుణో
పేతం బై సుపథం బై యొప్పె నంత సరిత్పతి యగుసముద్రుండు సర్వశాస్త్రార్థ
జ్ఞుం డగు రామభద్రు నవలోకించి భద్రవాక్యంబున నిట్లనియె 476

సముద్రుండు రామునికి సేతుబంధనోపాయం బెఱింగించుట

సీ. మనుజేంద్ర యీనలుం డనువానరుఁడు విశ్వకర్మపుత్త్రుఁడు శిల్పకర్మనిపుణ
తా విశేషంబునఁ దండ్రిఁ బోలినవాఁడు గురునిచే వరములు గొన్నధన్యుఁ
డీమహాబలునిచే నింపార నాయందు సేతువుఁ గట్టింపుఁ డాతతముగ
మునుకొని జలములోమునుఁగ కుండఁగ దానినౌదల ధరియింతు ననుచుఁ బలికి
ఆ. మనుజవిభుని వీడుకొని యేగె వారాశి, యంత నలుఁడు పొంగి సంతసమున
లేచి విభుని మోముఁ జూచి యంజలి చేసి, దిట్టఁదనము మెఱయ నిట్టు లనియె.
క. మనుజేంద్ర సాగరము మ, జ్జనకునిసామర్థ్య మెఱిఁగి సత్యమె పలికె
న్వనరాశియందు సేతువు, ననువుగఁ గావింతు వాసవాదులు మెచ్చన్. 478
మ. దమశీలా యకృతజ్ఞులందు విలసద్దండంబె కా కుర్విలో
క్షమయు న్దానము సాంత్వముం బనిగొనం గా నేర్చునే సేతుబం
ధము వీక్షింపఁగఁ గోరి యీజలధి సమ్యగ్భక్తిమై నేఁ డుపా
య మెఱింగించుట దండభీతి మఱికాదా రాజవంశోత్తమా. 479

నలుఁడు తాను సేతువుఁ గట్టెద నని రామునితోఁ జెప్పుట

క. మును విశ్వకర్మ మందర, మున మజ్జనయిత్రి కొసఁగె ముదమున వర మ
య్యనఘాత్మున కౌరసనం, దనుండ నై పుట్టినాఁడఁ దత్సముఁ డనఁగన్. 480
తే అనఘ నిజ మాడె సాగర మతనిచేత
స్మారితుఁడ నైతి జలధిపై మీఱి సేతు
వెన్నికకు నెక్కఁ గట్టెదఁ దన్నుఁ దాను
బొగడుకొనుట నీచం బని దెగడ వలదు. 481
క. జననాయక నాచెప్పిన, యనువున వారాశిమీఁద నతిపుణ్యం
బున సేతువుఁ గావింపుం, డని యాజ్ఞాపింపు మిప్వనాటుల కెల్లన్. 482
వ. అని పలికిన నారఘుపుంగవుం డట్ల కాక యని వానరుల నెల్ల సేతువుఁ గావిం
పుఁ డని పలికిన వారును శతసహస్రాయుతంబు లొక్కొక్క-మొత్తంబై శీఘ్రం
బున నలుదిక్కులకుం బఱచి మహారణ్యంబులు ప్రవేశించివిచ్చలవిడిమహోత్తా
లంబులగు తాలంబులును నంబరోల్లిఖితశాఖాశిఖాజాలంబులగు రసాలంబులును
విశాలంబు లగుతమాలంబులును దీర్ఘసాలంబు లగుసాలంబులును రసాతల

పర్యంతప్రసారితమూలంబు లగుహింతాలంబులును సముచ్ఛ్రితశక్రధ్వజాభీలంబు లగునారికేళంబులును దిర్యక్ప్రసారితవిశాలవిటపోదారంబు లగువంశకరీరంబులు నుదీర్ణంబు లగునశ్వకర్ణంబులును సానుసముద్భవంబులగుధవంబులు ను ఘనీభూతపత్త్రోత్కటంబు లగువటంబులు నదీతటజంబు లగుకుటజంబులును నిరంతరకుసుమోపార్జనంబు లగునర్జునంబులును నగాకారంబు లగుకర్ణికారంబులును నంతర్గతామలకంబు లగుతిలకంబులును గంధపూర్ణంబు లగుసప్తపర్ణంబులును గిరిశంబు లగుతిమిశంబులును బల్లవప్రాతోపేతంబు లగుచూతంబులును శైలసమంబు లగుసశోకద్రుమంబులును మింటికిం జివ్వినజువ్వులును దిక్కులకు నాఁగినరేఁగులును విరిసినదిరిసెనంబులును మిన్నునం బన్నినసురపొన్నలును దట్టంబు లైనకలిగొట్టుచెట్టులును దీవులం బొడమినకడుములును మిన్నుదాఁకినపోఁకలును మఱియు నగాకారంబు లగుననేకతరుసంతానంబు లుత్పాటించి యొక్కొక్కఁడు పెక్కనోకహంబులఁ గరంబుల నురంబున శిరంబున మూఁపున నంసభాగంబుల నిడికొని లఘుగమనంబున నొండొరులం దలకడచి తెచ్చి సముద్రజలంబులం బడవైచుచు హస్తిమాత్రమహాకాయంబు లగుపాషాణనికాయంబులు పెఱికి తెచ్చి వైచుచు సేతువుఁ గావింపం దొడంగి రాసమయంబున. 483

రామనియోగంబున నలుఁడు సేతుబంధనముఁ గావించుట.

మ. హనుమజ్జాంబవదంగదప్రముఖకీశాగ్రేసరు ల్పెచ్చెరం
జని యుద్యద్గతి యోజనాయతమహాశైలంబుల న్నైలశృం
గనికాయంబుల నుద్ధతిం బెఱికి వేఁకం దెచ్చి దోశ్శక్తి న
వ్వనరాశిం బడవైచి రొక్కమొగి దుర్వారక్రియాదక్షు లై. 484

ఉ. అన్నరనేత డెందమున నద్భుత మొందుచు సంతసింపఁగాఁ
గ్రన్నన ఘోరనాదములు గర్జలభంగిఁ జెలంగ మిన్నున
న్బన్నినకీశకోటివలనం గురిసెం జలరాశినీటిపై
సన్నుతలీల నొక్కమొగి సాంద్రశిలాతరుశైలవర్షముల్. 485

చ. తఱుచుగ ఘోరవానరకదంబకరప్రవిముక్తమేదినీ
ధరనికరప్రపాతజనితద్విపమాత్రబృహత్పయఃకణో
త్కరములు మింటిపై కెగసి తప్పక గ్రమ్మఱ నప్పయోధిరా
ట్చరములమీఁద నుద్ధతిఁ బడం దొడఁగెం గడుఁ జిత్రవైఖరిన్. 486

క. పడుచప్పు డెగయుచప్పుడు, కడువడి వానరులు సేయు కలకలముంజ
ప్పుడు గగనంబును గడలును, వడిఁ బుడమియు ఘోరభంగి బ్రద్దలు వాపెన్.

వ. ఇట్లు బలవంతు లగువానరులు మేఘసంకాశంబు లగుతృణంబులును బర్వతమాత్రంబు లగుకాష్ఠంబులును బుష్పితాగ్రంబులగుతరువులునుగిరిప్రఖ్యంబు లగుపాషాణంబులును యోజనసార్ధయోజనప్రమాణంబు లైనగిరిశిఖరం

బులు నుత్పాటించి తెచ్చి యొండ తెగకుండ సముద్రంబునం బడవైచుచుండ
శిల్పకర్మకుశలుండగు నలుండు నిపుణు లగు వానరులం గొందఱ మున్నిడుకొని
నూఱు యోజనంబుల నిడుపును బది యోజనంబుల తనర్పునుం గా సూత్రంబులు
పట్టి వక్రత్వంబు గలుగకుండ నందంద దీర్ఘదండంబులు పాదుకొల్పి రామ
భద్రుండు మనంబున సంతసించి విలోకించుచుండ సేతువుం గావింప సమకట్టె.

చ. తడయక వానరోత్తము లుదగ్రశిలాతరుశైలశృంగము
లొడువడిఁ దెచ్చి బల్విడిఁ జలం బడరం బడవైవ నేర్పుపెం
పడరఁ బయోధిమీఁదఁ బ్రథమాహమునం దల విశ్వకర్మపు
త్త్రుఁడు వెసఁ గట్టె సేతువుఁ జతుర్దశయోజనమాత్రదూరమున్. 489

చ. విసువక శైలము ల్శిలలు వృక్షములుం దృణము ల్మహోగ్రకీ
శసముదయంబు దెచ్చి వడిసం బడ వైవఁగ నప్పయోధిపై
నసదృశలీల రామవిభుఁ డౌనన రెండవనాఁడు దోర్బలం
బెసఁగఁగఁ జేసె నన్నలుఁడు నిర్వదియోజనము ల్మహోద్ధతిన్. 490

చ. ఎదు రెదు రేగి కీశు లితరేతరముం బురికొల్పుకొంచు స
మ్మదమున శైలము ల్తరుసమాజము బల్విడిఁ దెచ్చి వైవఁ దా
ముదమున నవ్వనాటకులముఖ్యుఁడు మూఁడవనాఁడు చేసె ని
ర్వదియొకయోజనంబు జలరాశిపయిం బొలుపార సేతువున్. 491

చ. నలునిమహానుభావము ఘనం బని వేల్పులు సన్నుతింపఁగా
నలయక వీరవానరసమర్పితశైలశిలాద్రుకోటిచేఁ
గులగిరిధైర్యుఁ డాప్లవగకుంజరుఁ డిర్వదిరెండుయోజనం
బులు దగఁ జేసెఁ గంధిపయిఁ బొందుగ నాలవనాఁడు సేతువున్. 492

చ. ఇరుగడలం దృణంబులు మహీరుహము ల్వడి నంటఁ ద్రొక్కుచుం
బరువడి మధ్యదేశమునఁ బర్వతశైలశిల ల్ఘటించుచుం
గరగర మై సువేలదనుకం జతురత్వ మెలర్పఁ జేసెఁ దా
నిరువదిమూఁడుయోజనము లింపుగ నైదవనాఁడు సేతువున్ 493

వ. ఇట్లు వానరసత్తముం డగు విశ్వకర్మనందనుండు తండ్రియుం బోలె నత్యంత
శిల్పకౌశలం బేర్పడ మకరాలయం బగు సాగరంబుమీఁద సేతువుఁ గట్టిన నది
సుకృతంబై సువిశాలంబై సుందరంబై సుభగంబై సుభూమితలంబై సుసమాహి
తంబై శ్రీమంతంబై యంబరంబునందుఁ బొల్చు స్వాతీపథంబు చందంబున విలాస
వతీసీమంతంబు మాడ్కిఁ జూడ్కికి వేడ్క సేయుచు నొప్పె నంతకు మున్న యయ్యద్భు
తకర్మంబు విలోకింపఁ జనుదెంచి మిన్నునం బన్నిన దేవర్షి పరమర్షులును దేవగం
ధర్వసిద్ధసాధ్యరక్షోయక్షగరుడోరగాదులును దశయోజనంబుల తనర్పును శత
యోజనంబుల నిడుపునుం గలిగి సుదుష్కరంబై యచిత్యంబై యప్రమేయం
బై యసహ్యంబై యద్భుతంబై రోమహర్షణంబు నై యున్న నలునిచిత సేతువు

నాలోకించి పరమాశ్చర్యభరితాంతఃకరణు లై రి మఱియు సమస్తభూతంబులు సేతువు నవలోకించి రామునిమహత్త్వంబును నలునినేర్పును వానరులబలంబును బహుముఖంబులం గొనియాడి రప్పుడు మహాతేజులగుమర్కటులు గర్జావిజృంభణవాలచలనప్రముఖనిఖిలకాపేయజాతిచేష్టావిశేషంబులు నెఱపుచు శతసహస్రాయుతకోట్యర్బుదసంఖ్యాతు లొక్కమొత్తంబై లంక కభిముఖంబుగా సేతుమార్గంబుం బట్టి నడువం దొడంగిరి విభీషణుండు గదాపాణియై శత్రువిఘాతార్థంబు సచివసమన్వితంబుగా సముద్రదక్షిణపారంబున నిల్చి యప్రమాదుండై రక్షించుచుండె నంత సుగ్రీవుండు సత్యపరాక్రముం డగురామచంద్రు నవలోకించి. 494

ఉ. మక్కువతోడ నీవు హనుమంతునిపైఁ గడువేడ్క మీఱఁగా
నెక్కుము లక్ష్మణుండు మది నింపుగ నంగదుమూఁపురంబుపై
నెక్కెడు నాహరిప్రవరు లిద్దఱు గ్రద్దన మిమ్ము నిర్వురం
దక్కక నేఁడు మోచికొని దాఁటెద రంబుధి నశ్రమంబునన్. 495

-రామలక్ష్మణులు వానరసేనాసమన్వితంబుగ సముద్రము దాటుట.-

చ. అన విని రాఘవుండు ముద మంది మరుత్సుతు నెక్కె ధన్వియై
యినతనయుండు లక్ష్మణుఁ డహీనవిభూతిదలిర్ప వెంట రా
ననుపమలీల వానరబలాలికి ముంగలి యై రయంబునం
జనియె ననంతతేజము దిశావలయంబునఁ బిక్కటిల్లఁగన్. 496

ఉ. కొందఱు మధ్యభాగమునఁ గొందఱు పార్శ్వములన్ ముదంబుతోఁ
గొందఱు పృష్ఠదేశమునఁ గొందఱు తార్క్ష్యులభంగి మింట నిం
పొందఁగఁ గొంద ఱుద్ధతి మహోదధితోయములందు నేఁగి రం
దంద వనాటవీకులు ఘనార్భటు లంబుధిమ్రోఁత గ్రింగఁగన్. 497

చ. ఉరుగతి నమ్మహోగ్రకపియూథము లీపగిదిన్ సముద్రదు
ష్కరనలసేతుమార్గమున గ్రక్కున నంబుధి నుత్తరించి వి
స్ఫురదసమానగుచ్ఛబహుమూలఫలప్రసవప్రభూతసుం
దరమృదుగంధయుక్త మగుతత్పృథుతీరముఁ జేరె వేడుకన్. 498

-దేవమహర్షిసుచారణులు రాముని కాశీర్వాదము సేయుట.-

ఉ. అప్పుడు రామభద్రునిమహాద్భుతదుష్కరఘోరకర్మముం
దప్పక చూచి వేల్పులును దాపసులు న్సుచారణుల్ ముదం
బుప్పతిలంగ వచ్చి వినులోదకధారల వేదమంత్రము
ల్చెప్పుచు నమ్మహాత్ము నభిషిక్తునిఁ జేసి రనేకభంగులన్. 499

వ. ఇత్తెఱంగున నభిషిక్తునిం జేసి. 500

ఉ. ఇంపుగ వైరివర్గము జయింపుము శాశ్వతమైనకీర్తిఁ బ్రా

పింపుము సాగరాంత యగుపృథ్విని బెక్కుదినంబు లర్థిఁ బా
లింపు మటంచు మోదము దలిర్పఁగ దీవన లన్న రేశ్వరుల్
బెంపుగఁ దేర్చి యేఁగి రటు వేయివిధంబుల నన్నుతించుచున్. 501

వ. అంత నిమిత్తకోవిదుం డై నలక్ష్మణాగ్రజుండు కొన్నినిమిత్తంబులు చూచి సంతోషవిశేషంబున సుమిత్రాపుత్త్రుం గాఁగిటం జేర్చి యిట్లనియె. 502

చ. సరసత పీవఁగాఁ దొడఁగెఁ జందనశీతలవాతపోతము
ల్వరుస నరణ్యము లుసుమవంతము లై తనరారె మేదినీ
వరసుత పోరిలో మన కవశ్యము గల్గు జయంబు సేనల
స్థిరముగ శాస్త్రభంగి విభజించి మొనల్ ఘటియింపు మిత్తఱిన్. 503

చ. జనవర ఋక్షవానరనిశాచరవీరులకు న్మహాద్భుత
ప్రణుతభయంకరోగ్రసమరం బది పాటిలు నందు దోర్బలం
బెనయఁగఁ బోరఁ జచ్చెద రనేకులు కంటివె భూమియందు ది
గ్వనములయందు మింట లయకాలమునాఁటివిధంబు దోఁచెడిన్. 504

క. పుడమి వడంకెడుఁ దడఁబడి, సుడిగాడ్పులు కలుషభంగి సుడిసెడుఁ గొండ
ల్వడి నల్లాడెడుఁ దరు లెక్కుడు మ్రోఁత చెలంగ విఱిగి కూలెడుఁ గంటే.

తే. అనఘ క్రవ్యాదతులితంబు లై పయోధ
రములు పరుషస్వనము లొనరంగ ఘోర
భంగి దట్టంబుగా మింటఁ బన్ని రక్త
వృష్టి గురిసెడుఁ గంటివే వీరవర్య. 506

తే. దశరథకుమార రక్తచందననికాశ, మై పరమదారుణాకృతి నలరె సంధ్య
తపనమండలమున నుండి దారుణాగ్ని, శిఖలు వడి నిర్గమించెడు శిష్టచరిత. 507

—రాముఁడు భయంకరనిమిత్తములను లక్ష్మణునకుఁ జూపుట.—

క. దీనము లై ఖగమృగములు, దీనధ్వను లెసఁగ నెల్లదిక్కులయందుల్
భానున కభిముఖముగ ర, క్షోనాశనసూచనముగఁ గూసెడుఁ గంటే. 508

సీ. అబ్జారి నిశలయం దప్రకాశకుఁ డయ్యె నినునికై వడిఁ బగ ల్లెండ గాసె
రక్తకృష్ణాంశుపర్యంతంబు లై గ్రహంబులు విలయమునాఁటిపోలుపుఁ దెలిపె
హ్రస్వమై సూక్ష్మమై యతిలోహితద్యుతి నలరారెఁ బరివేష మర్కబింబ
మందు నీలిమ దోఁచె నధికరజఃపరిచ్ఛన్న మై నక్షత్రజాల మొప్పెఁ

తే. గాకములు గృధ్రములు జంబుకములు శ్యేన
కములు పాపోవఁ దొడఁగె నుగ్రస్వనముల
భువననాశనసూచనమ్మార్థి మెఱయ
దారుణంబుగ మ్రోసె శివారవములు. 509

క. హారిదైత్యము క్తగిరితరు, పరివృత యై మాంసరక్తపంకిల యై ని
ష్ఠురహేతిసమన్విత యై, కర ముర్వర ఘోరభంగి గాఁగల దింకన్. 510

క. కావునఁ దడయక యిప్పుడె, పోవలయును రాక్షసేంద్రుపురికి శరములన్
రావణు వధించి విజయ, శ్రీవిభవము నందుకొఱకు సేనలతోడన్. 511

వ. అని పలికి ధర్మాత్ముం డగురఘుపుంగవుండు సంగ్రామహర్షుం డై ప్రచండకోదండంబును శరంబులును నిషంగంబులును గవచంబును ధరించి లక్ష్మణుండు తోడరా లంకాభిముఖంబుగా సేనాముఖంబునం జనియె నవ్వానరసైన్యంబులు సుగ్రీవవిభీషణాంగదహనుమజ్జాంబవదాదుల మున్నిడుకొని శత్రువధంబునందుఁ గృతనిశ్చయంబులై సముద్రంబుంబోలె ఘూర్ణిల్లుచు రామునిపిఱుంద దెసనడిచె నప్పుడు రాఘవార్థంబునందు సమారోపితవిక్రములై వీరాలాపంబు సేయుచుఁ బాదవిన్యాసంబులం బుడమి గ్రక్కదల గర్జానిస్వనంబులఁ గులగిరిగుహాముఖంబులం బ్రతిధ్వనులు సెలంగ వడి నడచువానరవీరులకర్మచేష్టావిశేషంబు లవలోకించి రాముండు పరమానందభరితాంతఃకరణుం డయ్యె నిత్తెఱంగున నవ్వీరవానరవాహినీసందోహంబు నక్షత్రపరివృతుండై నచంద్రునిచేత శరత్సమయరాకానిశాకాలంబుంబోలె రామునిచే నుద్దీపితవశం బై చనునమయంబున. 512

ఉ. ఆహరిసైన్యకోటి విని నద్భుతవైఖరి లంకలోన ఘో
రాహవదుర్నివారభయదాసురపాణిసువర్ణదండకాం
డాహతభీషణోగ్రపటహస్ఫుటతూర్యమృదంగభేరికా
కాహళదుందుభిప్రముఖ గాఢనిరంతరవాద్యఘోషముల్. 513

చ. ఇటు విని వానరోత్తము లహీనముదంబున నంతకంటె మి
క్కుటముగ సింహనాదములు ఘోరఘనంబులమాడ్కి నల్పినం
దటుకున నమ్మహారవము దారుణవైఖరి నాలకించి పి
మ్మటఁ గొని రన్నిశాటు లభిమానము వీడి విషణ్ణచిత్తులై. 514

## రాముఁడు లంకాపట్టణము గాంచుట.

శా. ఆరాజేంద్రుఁడు గాంచెఁ గట్టెదుట దివ్యానర్ఘరత్నాంశువి
స్ఫారోద్దీపితసౌధసంఘటితచంచత్కేతనోద్యత్పతా
కారేఖావిలసద్విచిత్రపటసంఘాతానిలోద్ధూతనా
నారూపాంబుధరప్రకాండ మగుచు న్రాజిల్లు లంకాపురిన్. 515

వ. ఇట్లు లంక నవలోకించి జానకిం దలంచుకొని. 516

చ. జనకకుమారి భీషణకుజగ్రహపీడిత యైనరోహిణీ
వనజదళాక్షిమాడ్కి నిట వానరవైరిబలాభిభూత యై
యనిశముఁ జిక్కి యున్న దకటా యని యూర్పులు పుచ్చి లక్ష్మణుం
గనుఁగొని పల్కె నప్పటికిఁ గార్యహితంబును మేలుఁ గల్గఁగన్. 517

చ. అరుదుగఁ జూడ నొప్పెడునగాగ్రమునం దలవిశ్వకర్మచే
నిరుపమలీల మానసవినిర్మిత యై తనరారులంక త

త్సురుచిరహేమరౌప్యమయసుందరసౌధము లాసుమేరుశం
కరకుధరంబు లట్ల యవె గ్రాలుచు నున్నవి కంటె లక్ష్మణా. 518

ఉ. ఆపురుహూతుప్రోలు వరుణాలయ మాపురవైరిమిత్రువీ
డీపురి కీడు సేయఁ దగ దేమని చెప్పఁగ వచ్చు నిచ్చట
న్భూపకుమార కంటివె నభోవిధుచండకరాయమాణపూ
ర్వాపరగోపురాగ్రఘటితాతతమౌక్తికహేమకుంభముల్. 519

తే. బహువిధవిమానములచేతఁ బట్టణంబు, చాల సంకీర్ణమై మ్రోలఁ గ్రాలుచున్న
దమలగుణ కంటె పాండరాభ్రములచేతఁ, బరివృతం బైనయలవిష్ణుపదముభంగి.

క. వితతఫలకుసుమపల్లవ, చతురము లై బహువిహంగసంఘుష్టము లై
క్షితి నందనచైత్రరథ, ప్రతిమము లై వనము లిచటఁ గ్రాలెడుఁ గంటే. 521

చ. అనఘచరిత్ర వింటె ప్రమదాకులకోకిలకీరభృంగము
ల్వనములయందుఁ బల్లవఫలప్రచయంబును మెక్కి సంతసం
బున మృదునాదము ల్సెలఁగ మ్రోసెడుఁ జందనసౌరభంబు గై
కొని కలయంగ వీచెడు నకుంఠితశీతలవాతపోతముల్. 522

రాముఁడు సైన్యంబుల గరుడవ్యూహంబుగాఁ బన్నుట.

వ. అని పలికి యద్దశరథరాజనందనుం డగురాముండు లంక డాయం జని యొక్క రమ్యప్రదేశంబున విడిసి శాస్త్రదృష్టవిధానంబున బలంబుల విభజించి గరుడాకారంబుగా మోహరించిన నవ్వీరోత్తమునిపనుపున వాలిపుత్త్రుం డగునంగదుండు కతిపయబలంబులం గూడి సేనాపతి యగునీలునిం దనకు బాసటగాఁ గొని చంచుస్థానంబునం బొలిచి యుండె వృషభుం డనువానరశ్రేష్ఠుండు కొంతసేనం గూడుకొని దక్షిణపక్షస్థానంబు నధిష్ఠించె గంధహస్తియుం బోలె దుర్ధర్షుం డైనగంధమాదనుండు ప్రచండభుజాసారంబు దీపింప సవ్యపక్షంబునం బన్నె సుమిత్రాపుత్త్రసేవితుం డై గుణసాంద్రుం డగురామచంద్రుండు మూర్ధస్థానం బలంకరించె ఋక్షముఖ్యుం డగుజాంబవంతుండును సుషేణుండును వేగదర్శియు నీమువ్వురును గ్రియాదక్షు లై కుక్షిప్రదేశంబు రక్షించుచుండిరి ప్రచేతసుండు లోకపశ్చార్ధంబుంబోలెఁ గపినాథుం డగుసుగ్రీవుండు జఘనప్రదేశంబు గాచి యుండెఁ దక్కినయూథపులు తమతమసైన్యంబులం గూడి యెడనెడం బన్నిరి యిట్లు వీరవానరసైన్యంబు మహావానరసురక్షితంబునుసువిభక్తమహావ్యూహంబు నై సాభ్రసంప్లవం బగుగగనంబుంబోలెఁ బ్రకాశించుచుండె నప్పుడు. 523

శా. పాషాణద్రుమశైలము ల్కరముల న్భాసిల్ల నుద్వృత్తి నీ
దోషాటప్రభు వీడు ముష్టిహతులం దున్మాడి రాముండు సం
తోషింప న్సమరంబులోఁ దనుజులం దూలింత మం చాత్మలో
రోషోద్రేక మెలర్ప వృక్షచరవీరు ల్పేర్చి రత్యుద్ధతిన్. 524

-రాముఁడు బద్ధుం డగుశుకుని విడువు మని సుగ్రీవునితోఁ జెప్పుట.-

ఉ. అంత రఘూత్తముండు హృదయంబున మోద మెసంగఁ-బద్మినీ
కాంతకుమారుఁ జూచి యనఘా సునిభక్తము లయ్యె సైన్యము
ల్వంత మెలర్ప నీశుకుని బంధవిముక్తునిఁ జేయు మివ్విధం
బంతయు నద్దశాననున కచ్చటివారల కెల్లఁ జెప్పెడిన్. 525

క. అనిన విని రామశాసన,మున సుగ్రీవుండు శుకుని ముక్తునిఁ జేయ
న్వనచరమోచితుఁడై య,ద్దనుజుఁడు మనఁ గంటి ననుచుఁ దద్దయుఁ బ్రీతిన్.

వ. నొచ్చినయంగంబులు సవరించుకొనిరావణునికడకుం బఱచిన నతండు శుకునిం
జూచి దరహాసోల్లాసభాసురవదనుం డై యిట్లనియె. 527

తే. రాత్రిచర నీదుసితపత్త్రములు విఱిగి
యున్నయవి యంగములు నొచ్చి యున్న వేల
పరమసంక్రుద్ధు లైనవానరులచేతఁ
జిక్కువడితివొ కలరూపుఁ జెప్పు మిపుడు. 528

క. నావుడు శుకుండు మది భయ, మావిర్భవ మందఁగాఁ గృతాంజలిపుటుఁ డై
రావణునితోడ నిట్లని, తా విన్నప మాచరించెఁ దద్దయు భీతిన్. 529

ఉ. దేవరవారు చెప్పినగతిం బనిఁ జూచి పయోధి దాఁటి సు
గ్రీవునిచెంతకుం బఱచి కేవలమంజువిధంబు దోఁపఁగా
నీ వనుమన్న మాట లవి నేర్పునఁ జెప్పఁ గడంగునంత ర
క్షోవర కీశు లర్థి ననుఁ జూచినమాత్రనె దుష్టచిత్తు లై. 530

వ. నను నొడిసిపట్టి కాష్ఠముష్టిప్రహారంబుల నొప్పించి గ్రమ్మఱ నిచ్చటికిరాకుండ
బంధించి రక్కారణంబున సుగ్రీవునితోడ సంభాషించుటకునతనివలనఁబ్రత్యు
త్తరంబుఁ బడయుటకు నవకాశంబు లేదయ్యె నచ్చటివారి తెఱంగెఱింగించెద
వినుము. 531

-శుకుఁడు రావణునితో వానరులతెఱంగు చెప్పుట.-

ఉ. ముక్కున నుండుఁ గోప మరిముంగల నిల్చినవేళఁ గన్నులం
జిక్కనిరౌద్రరేఖ విలసిల్లు మనంబులు వజ్రతుల్యముల్
చిక్కనకర్మచేష్ట లవె చెప్పఁగ నేల నిశాచరేంద్ర పే
రుక్కునఁ గ్రాలుచుందురు రయోద్ధతి వానరు లేకచిత్తు లై. 532

మ. రవివంశాగ్రణి వాలిశత్రుఁడు ఖరప్రద్వేషి మారీచహం
త విరాధాదికబంధవైరి సుగుణోదారుండు ధీరుండు రా
ఘవుఁ డంభోనిధిమీఁద సేతువు నొగిం గావించి వే దాఁటి దై
త్యవరా సూర్యకుమారయుక్తముగ డాయ న్వచ్చె లంకాపురిన్. 533

శా. ఆరాజేంద్రుప్రతాపమా విభునివీరాలాపమా కోపమా
యారామాధిపుచాపమా ఘనుని బాహాటోపమా నాతరం

జే రక్షోవర చెప్పఁ బంక్తిముఖుఁ డేఁడీ ద్రుంతు నం చుద్ధతిన్
నారి న్వే మొఱయించుచు న్గడఁగి యున్నాఁ డుగ్రజన్యార్థి యై. 534

క. గిరిమేఘసన్నికాశ, స్ఫురదురుభల్లూకకీశముఖ్యధ్వజినీ
పరివృత యై తద్వానస, స్థిర గన్పడ దయ్యె నేమి చెప్పుదు నధిపా. 535

క. వానరబలౌఘమున కీ, దానవబలమునకు దేవదైత్యులకు బలెన్
దానవవంశవిభూషణ, కానేరదు మిగుల సంధికార్యము దలఁపన్. 536

చ. అగచరవాహినీసహితుఁ డై రఘునాథుఁడు లంకమీఁదికిన్
మగటిమి మీఱ వచ్చె నిఁక మందత సేయుట గాదు మేటివై
జగడము సేయుటో మఱియు జానకి నిచ్చుటొ యుక్తభంగిచే
మిగులక మున్నె శీఘ్రమున మెచ్చఁగఁ గార్యము నిశ్చయింపుఁడీ. 537

వ. అని పలికిన శుకునివాక్యంబు విని రావణుండు రోషసంరక్తనయనుండై చూపు
లనె దహించుచున్నవాఁడుపోలె మండుచు ని ట్లనియె. 538

శా. ఔరా రాక్షస యోడ కా నృపతికై యజ్ఞాశి నిన్నంటి వీ
దారాత్మ్యంబు సహింపవచ్చునె మరుద్గంధర్వ లోకుల్మ్మడిన్
ఘోరప్రక్రియఁ దాఁకి పోరిన జగత్క్షోభంబు వాటిల్లిన
న్వారాసుల్ తగఁ గూడినన్ వెఱతునే వైదేహి నర్పింతునే. 539

చ. ముద మలర న్వసంతమునఁ బూచినభూజముమీఁద వ్రాలుష
ట్పదములమాడ్కి మామకదృఢప్రదరంబులు లోకభీకర
ప్రధనమునందు నాద మడర న్వడి నన్నరనాథుమీఁద బె
ట్టిదముగ రాలు నెప్పుడు కడిందివిచారము పుట్టె నెంతయున్. 540

తే. దారుణోల్కలచే మత్తవారణమును, బోలెఁ దూణీశయస్ఫుటభూరిచాప
విచ్యుతానేకదీప్తోగ్రవిశిఖతతుల, చేత రాముని వెలయింపఁ జేయు టెపుడు.

క. విను ముదయతపనుఁ డుజ్జ్వల, ఘనతరనక్షత్రజాలకాంతినిబోలెన్
దనుజబలపరివృతుఁడ నై, మనుజాధీశ్వరునిబలము మాయింతుఁ దగన్. 542

క. శరనిధికిఁ బోలె వేగము, కరువలికిం బోలెఁ దీవ్రగతియును నాకున్
దొరకొను టెఱుఁగఁడు రాఘవుఁ, డెఱిఁగిన నాతోడిచివ్వ కేటికి వచ్చున్.

చ. ఎఱిఁగినవాఁడు గాఁడు పృథివీశ్వరుఁ డంతకు మున్న నన్ను వీ
రరస మెలర్పఁ దాఁకి సమరం బొనరించినవాఁడు కాఁడు మ
ద్గురుతరచండకాండముల ఘోరవిషాహుల నట్ల చూచి తా
నెఱుఁగఁడు గాన వచ్చె నిపు డీక్రియ జన్య మొనర్ప నుద్ధతిన్. 544

శా. నారిం దంత్రులు చేసి చాపమయవీణాదండ మంకించి దు
ర్వారప్రక్రియ బాణకోణములచే వాయించుచు న్మార్విఁ గాం
డారావంబులు నార్తగీతములు మ్రోయన్ జన్యరంగంబులో
వైరు ల్మూర్ఛ మునుంగ ధిక్కరణవాగ్వాదంబు గావించెదన్. 545

చ. తొడరి సహస్రలోచనుఁడు దోడ్పడి వచ్చినఁ బాశపాణి బి
ట్టడరిన నంతకుండు విశిఖాగ్నిశిఖల్నిగుడంగఁ దాఁకినన్
విడువనికిన్క విత్తపతి వీరచమూయుతుఁడై గడంగినం
గడువడి బెట్టు దాఁకి కడికండ**లు** చేయనె యొక్కవ్రేల్మిడిన్. 546

వ. అని పలికి యద్దశగ్రీవుం డుద్గ్రీవుం డై తనకెలంకుల నున్నయమాత్యముఖ్యుల
శుకసారణుల నవలోకించి యి ట్లనియె. 547

తే. వానరులునీరనిధి దాఁటి వచ్చు టదియొ, యరిది సేతువు గావించుటంతకంటెఁ
గడిఁది చోద్యంబు వినియునుగనియెఱుంగ, మిట్టివింతలు నమ్మంగ నెట్లువచ్చు.

తే. ఐన నెట్టిదో రామమహాప్రభావ
మది విచారింప కెంత లే దనఁగ రాదు
వానరబలప్రమాణంబు వసుమతీశ
వైభవ మవశ్యము నెఱుంగ వలయు మనకు. 549

—రావణుఁడు శుకసారణుల వానరుల చొప్పెఱుంగఁ బంచుట.—

వ. కావున మీరు ప్రచ్ఛన్నవేషధరు లై యిప్పుడ కదలి యొరు లెఱుంగకుండ
వానరసైన్యంబు ప్రవేశించి. 550

సీ. బలవీర్యపరిమాణభంగు లెట్టివొ యందుముఖ్యు లెవ్వారొ రామునకుమంత్రు
లెవ్వరో సుగ్రీవుఁ డెవ్వాని మన్నించునో శూరవరు లెవ్వరో గడంగి
యెవ్వారు మున్నాజి కేతెంచువారలో సైన్యంబు విడిసినచంద మెట్లొ
కడలిపై సేతువుఁ గావించు టెబ్బంగినో సైన్యపతి యెవ్వఁడో నియంత
తే. యెవ్వఁడో రామలక్ష్మణు లెట్టివారొ, వారివ్యవసాయభుజవీర్యవైభవంబు
లెట్టివో కైదువు ల్దెల్పు లెవ్విధంబొ,యింతయుఁ నెఱింగినయమున నేగుదెందు.

వ. అని పలికి వీడుకొల్పిన నారాక్షసశ్రేష్ఠు లగుశుకసారణులు కామరూపులు గా
వున హరిరూపధరు లై యచింత్యంబును రోమహర్షణంబు నగువానరసైన్యంబు
సొచ్చి. 552

సీ. వనరాశి నర్థి దాఁటినదాని దాఁటెడుదాని దాఁటఁగ నున్నదాని మఱియు
విడిసినదానిని విడిసెడుదాని న ట్లొప్పంగ విడియంగ నున్నదాని
శైలాగ్రములయందు సానుదేశములందు వనములయం దుపవనములందు
సెలయేటియిసుకదిన్నెలయందు గుహలందు జలనిధితీరదేశములయందు
తే. నిండుకొని గండుమీఱియుద్దండవృత్తి, నుదధికినమానమై మ్రోయుచున్నదాని
హరిబలముఁ జూచి లెక్కింప నలవిగామి, కద్భుతంబందివిహరించునవసరమున.

—విభీషణుఁడు శుకసారణులఁ బట్టి రామున కొప్పగించుట.—

తే. అసురమాయావిశారదుం డగువిభీష
ణుండు వారల శుకసారణులను గాఁగ

నెఱిఁగి వెసఁ బట్టుకొని తెచ్చి నరవరేణ్యు
మ్రోల నర్పించి చేతులు మోడ్చి పలికె. 554

క. వీరు దశాస్యునిమంత్రులు, సారణశుకు లనెడువారు జనవర కపటా
కారముఁ దాలిచి మనచో, ప్పారయఁ జనుదెంచినార లతనిసనుపునన్. 555

క. అని పలుకుసమయమున న,ద్దనుజులు నృపుఁ జూచి జీవితంబులపై గ్ర
క్కున నాస విడిచి భయ మది, గనుపడ నిట్లనిరి మోడ్పుఁగరములతోడన్.

ఉ. పావనశీల రామనరపాల లసత్కరుణాలవాల ర
క్షోవిభుఁ డైన రావణునకుం బ్రియమంత్రుల మాతఁ డంపఁ ని
క్కైవడిఁ గీశరూపములు గైకొని నీదుబలంబు సర్వముం
గేవలగూఢవృత్తిఁ దిలకింపఁగ వచ్చినవార మెంతయున్. 557

వ. అని పలికిన నచ్చారులవచనంబులు విని సర్వభూతహితుం డగురాముండు ము
ఖారవిందంబునకు మందహాసంబు చెలువొసంగ శుకసారణుల కిట్లనియె. 558

ఉ. దానవులార మీరు మది దాఁపక పల్కితి రింతవట్టు మీ
దానవభర్త చెప్పినవిధంబున నిర్భయులై మదీయసే
నానివహంబు సర్వము మనం బలరం బరికింపుఁ డింపుతో
మానుగ మావిభీషణుఁడు మానక యంతయు మీకుఁ జూపెడిన్ 559

చ. దురమున నస్త్రశస్త్రు లగుదూత లవధ్యు లటంచు ధార్మికుల్
గఱపిరి గాన నత్తెఱఁగు గైకొని మిమ్మిటు గాచి పుచ్చితిన్
వెఱవక కృత్రిమాకృతులు వీడి నిజాకృతుల న్ధరించి మ
త్సురుచిరసైన్యసంతతులఁ జూచి దశాస్యున కంతఁ జెప్పుఁడీ. 560

క. వినుఁ డింతకు మును చూచిన, యనీకమును జూడ వలసినట్టిబలంబుం
గనుఁగొనుఁడు యథాక్రమముగ, ఘనలక్షణనామరూపకర్మంబులతోన్. 561

రాముఁడు శుకసారణుల విడిచిపెట్టుట.

క. మీ రిపుడు లంకకుం జని, చారులకుం దగినభంగి సవినయమతులై
మీరాజుతోడ నిట్లనుఁ, డోరాక్షసులార మామకోక్తులు గాఁగన్. 562

తే. ఏబలము నాశ్రయించి దైత్యేంద్ర సీత
నపుడు మ్రుచ్చిలి గొనిపోయి తాబలంబు
సర్వమును నేఁడు చూపుము సకలబంధు
సైన్యపుత్త్రయుతుండ వై సమరమందు. 563

చ. ఇదె చనుదెంచినాఁడఁ బ్రధనేచ్ఛ సురేంద్రుఁడు దైత్యకోటిపై
భిదురము నట్ల నేను బటుభీషణరోషము నెల్లి పంచెదం
గొదుకక మచ్ఛరప్రహతిఁ గూలినలంకను బంధుమిత్త్రులన్
జిదురుప లైనరాత్రిచరసేనలఁ జూచెద వెల్లి రావణా. 561

క. అని పలికి విడిచి పుచ్చిన, దనుజులు జయజయ యటంచు దశరథసుతునిం
గొనియాడి లంకకుం జని, యనిమిషరిపుఁ గాంచి పలికి రడలు గదురఁగన్. 565

ఉ. నాకవిరోధి నీపనుపునం జని వానరసేనఁ జొచ్చి య
స్తోకగతిం జరింప నముఁ జూచి వధించుట కవ్విభీషణుం
డాకుతలేంద్రుమ్రోలఁ గదియం గొని పోవఁగ నమ్మహాత్ముఁ డెం
తేక్కువఁ గాచి కృష్ణి గణుతి కెక్కు దెంచితి మిట్లు గన్గొనన్. 566

సీ. అంధకాసురవధప్రారంభుఁ డైనశూలికిఁ బోలెఁ బటురౌద్రరేఖ మెఱయ
జంతుపారణకళాచతురుఁ డైనపరేతరాజుకై వడిఁ గోపరసము నిగుడఁ
బ్రళయకాలమునాఁటిభానుబింబముపోలె ముఖమురోషారుణస్ఫూర్తిమెఱయఁ
గల్పాంతకాలసంకర్షణాగ్నికిఁ బోలెఁ జటులతేజోవిశేషం బెలర్ప

తే. భూవరుఁడు లక్ష్మణుండు సుగ్రీవుఁ డలవి
భీషణుఁడు నల్వు రొక్కచోఁ బెంపెసంగఁ
గూడుకొని శక్రయమపాశిగుహ్యకేంద్రు
లట్ల శోభిల్లు చున్నవా రసురనాథ. 567

—శుకసారణులు రావణునికి వానరులతెఱంగు సెప్పుట.—

ఉ. వారిమహానుభావములు వారివచోరచనాచమత్కృతు
ల్వారిమనోజ్ఞవేషములు వారిసమున్నతశౌర్యసంపద
ల్వారివరాస్త్రశస్త్రములు వారిసమున్నతజన్యదాక్ష్య మె
వ్వారికి లేదు ముజ్జగమువారలలోపల నేమి చెప్పుదున్. 568

తే. అధిప రామునియందు శౌర్యాదిగుణము
లెట్లు చెల్వొందు నట్లు పెంపెసఁగఁ దక్కు
నున్నమువ్వురియందు నచ్చొత్తినట్టు
లరయఁగఁ దదైకమత్య మేమనఁగ వచ్చు. 569

ఉ. తక్కినకీశముఖ్యులప్రతాపవిశేషము చెప్ప నేల యొ
క్కొక్కఁడె చాలు సౌధవరణోత్కరగోపురసంయుతంబుగా
నుక్కున నిప్పురంబు రభసోద్ధతిమైఁ బెకలించి వైవ నిం
దొక్కఁడు లేఁడు తద్భుజబలోద్ధతి సైఁచెడువాఁడు చూడఁగన్. 570

తే. రాక్షసాధిప కపిసేన రామబాహు, వరణరక్షిత యైసురాసురుల కైనఁ
దేఱిచూడంగ రాక యదృష్టపూర్వ,వీర్యమునఁ గ్రాలు చున్నది వేయి యేల.

తే పుణ్యజననాథ యెక్కడిపోరు నీకుఁ,జాలు మద్వాక్య మాలించిశమముఁ దాల్చి
వినుతవిక్రముఁ డైనరామునకు సీత, నిచ్చి సంతోషి వై లంక నేలు మింక.

వ. అని పథ్యంబుగాఁ బలికిన నాశుకసారణులపలుకులు విని రావణుండు కోపోద్దీపిత
ముఖుం డై యిట్లనియె. 573

రావణుఁడు వానరసేనం జూడ మంత్రిసహితుండై యున్నతప్రాసాదము నెక్కుట.

ఉ. కర్బురులార మీరు చులకంగ గపిపీడితులై భయంబున
న్దుర్బలులై నరామునకుఁ దొయ్యలి నిమ్మని యంటి గాశుగో
షర్బుధవాసవాదికదిశాపతు లొక్కట నెత్తి వచ్చిన
న్దోర్బలవైభవం బెసఁగ ద్రుంచెదఁ గాక మహీజ నిత్తునే. 574

క. ఇది యేటిచింత నను బెట్టిదిరించి జయించు వీరుఁ డెవ్వఁడు క్రూర
ప్రదరముల ముజ్జగంబుల, నదయుత భస్మంబు సేయనా గడెలోనన్. 575

వ. అని పలికి దనుజవంశశేఖరుం డగు దశగ్రీవుండు క్రోధమూర్ఛితుం డై వానర వాహినీసమాలోకనకౌతుకోద్రేకంబు మనంబునం జెంగలింప శుకసారణసమన్వితుండై బహుతాళప్రమాణోన్నతం బైనయొక్క మహనీయసువర్ణమణిగణ ప్రభాపటలజటిలం బగుప్రాసాదం బారోహించి సముద్రంబును దత్ప్రాంత కాంతారగిరిసంతానంబును విలోకించి తత్తీరంబున రెండవసముద్రంబుకరణి నపారంబై యసహ్యంబై యనంతంబై పుడమి నిండి యున్నకపిబలంబు నవలోకించి సారణున కిట్లనియె. 576

సీ. ఈమర్కటశ్రేణిలో మహాబలు లెవ్వ రెవ్వ రెవ్వరు శూరు లెవ్వ రాఢ్యు
లెవ్వారు మున్నాజి కేతెంచువా రెవ్వ రుత్సాహపరు లెవ్వ రుగ్రమూర్తు
లినజుండు సుగ్రీవుఁ డెవ్వారివాక్యంబు పాటించి వినుఁ జమూపాలు రెవ్వ
రింతయు వేర్వేఱ యెఱిఁగింపు మనిన నచ్చారుండు ముఖ్యవిశారదుండు

తే. గాన వానరవీరుల కర్మరూప, నామచేష్టావిశేషచిహ్నములతోడ
సర్వ మేర్పడ యామినీచరవిభునకుఁ, జెలఁగి ప్రత్యేకముగఁ జూపి చెప్పఁదొడఁగె.

సారణుఁడు రావణునకు వానరవీరుల వేర్వేఱ నిరూపించి చూపుట.

చ. అనుపమవీరవానరసహస్రశతంబులు గొల్వ దారుణ
స్వనమున నీపురి న్వరణసౌధయుతంబుగ వ్రయ్యఁ జేయుచున్
ననిశితభంగి లంకపయిఁ జూడ్కులు నిల్పి ననాటవాహినీ
ప్రణుతముఖాగ్రసంస్థితుఁడు రావణ నీలుఁడు వాఁడె చూడుమా. 578

వ. ఇతండు సమస్తవానరవాహినీనాయకుండు వినుము మఱియును. 579

సీ. కనకాద్రిశిఖరసంకాశదేహంబున జలజాతకేసరచ్ఛాయ నిగుడ
సారెసారెకు విలాసంబున నాడించు వాలనాదమున దిగ్వలయ మదర
మోమున రౌద్రరేఖామయూఖావళు లినకరంబులమాడ్కిఁ నెండగాయ
సింగంపుఁగోదమలభంగి వెలుంగుచు వీరవానరులు వేవేలు గొలువ

తే. పదములఁ గరంబు లూఁది యంబరపథమున
నుండి పుడమికి దాఁటి మహోగ్రకోప
మడర మనలంక కభిముఖుం డై చెలంగు
నతఁడు వాలిప్రియకుమారుఁ డంగదుండు. 580

వ. మఱియు నతండు వానరవల్లభుండై యసుగ్రీవునిచేత యావరాజ్యంబునం దభిషిక్తుండై సుగ్రీవునికరణి స్వామిత్వంబు వహించి యతనికిం బ్రాణసముండై శౌర్యవీర్యధైర్యసాహసోత్సాహబలంబుల వాలియుం బోలె నప్రధృష్యుండై శక్రార్థంబునందు వరుణుండుంబోలె రాఘవార్థంబునందు బరాక్రాంతుండై నిజసైన్యంబులం గూడి దుర్జయప్రతాపవిశేషంబునం గయ్యంబునకుం గాలు ద్రవ్వుచు భీషణరోషాతిశయంబున నిన్నుం జీరుచున్నవాఁ డితనియుపదేశంబు వలననె రామహితకాముఁ డగుహనుమంతునిచేత జనకనందని సందృష్ట యయ్యె నితనిచందంబు విలోకింపుము. 581

తే. దానవేశ్వర వాలినందనునివెనుక
యపరిమితవానరానీక మర్థిఁ గొలువ
ఘనరణోత్సాహ మానసంబునఁ జెలంగఁ
జూడ నొప్పెడుఁ గను మల్లవాఁడె నలుఁడు. 582

తే. యామినీచరకులవర్య యతఁడె కాఁడె, యబ్ధిపై సేతు వొనరించి నట్టిచతురుఁ
డరిది వీనిపరాక్రమ మభినుతింపఁ, గపివిభునిచేత నభినుతిఁ గన్నవాఁడు. 583

వ. మఱియును.

చ. సదమలబుద్ధి భానుజునిచక్కటికి న్రయ మార నేగి తాఁ
బదపడి వచ్చి సేనల విభాగ మొనర్చుచు నున్నవాఁడు సొం
పొదవ హిమాచలంబుక్రియ నొప్పెడుతెల్లనిమేనువాఁడు వాఁ
డదె పరికింపు మాతఁడు దశానన శ్వేతుఁ డనాఁ జెలంగెడిన్. 585

వ. ఇతనిం బరివేష్టించి చందనకాంతారనివాసు లగుకీశు లష్టాదశశతసహస్రంబులును నశకోటిశతంబులును జంఘపరాక్రమంబునం గ్రాలుచు దారుణక్రోధంబున దుష్ప్రధర్షులై యంగంబులు విదుర్చుచు మేఘంబులభంగి నింగి తూఁటుగట్ట నార్చుచు లాంగూలంబులు ద్రిప్పుచు సంరంభవిజృంభితులై ముల్లోకంబు లొక్కయెత్తున నుత్పాటింపం జాలి యున్నవా రట్టివీరవానరులం గూడి బుద్ధిమంతుండును వానరశ్రేష్ఠుండును ద్రిలోకవిశ్రుతుండును భీమవిక్రముండు నగునతండు గిరివనసౌధసాలసహితంబుగా లంకాపురంబు నవలీలం దునుమాడుటకు నొక్కండె సమర్థుండై యున్నవాఁడు మఱియును 586

తే. దితిజకులవర్య గోమతీతీరకలిత
రమ్యసంకోచనాఖ్యపర్వతమునందు
రమణ నివసించి యచ్చటిరాజ్య మేలు
చుండు నాతండు కుముదుఁ డనుయూథపుండు. 587

వ. మఱియు నెవ్వనివాలంబునం గలరోమంబులు బహుదీర్ఘప్రమాణంబులై తామ్రశ్వేతపీతాసితవర్ణంబులై యద్భుతప్రకారంబునం జూపట్టెనతండు చండుం డనుయూథపుం డదీనసత్త్వుండు మహావీరుండు శతసహస్రపరిమితవానరుల

కధినాథుం డట్టినిజానీకంబులం గూడి సంగ్రామార్థి యై వచ్చుచున్నవాఁడు
లంకాపురంబు దాడిపెట్టు నతం డొక్కండె చాలు మఱియును. 588

చ. దనుజవరేణ్య చూడు మటుదవ్వుల నొప్పెడువాఁడు సింహసం
హననుఁడు దీర్ఘకేసరుఁ డహస్కరతేజుఁడు పింగవర్ణుఁడుఁ
వినుతభుజాబలుండు పృథువిక్రమశీలుఁడు వైరిలోకమ
ర్దనచతురుండు వానరవతంసుఁడు రంభుఁ డనాఁ జెలంగెడిన్. 589

తే. అతనిదోర్వీర్య మతిచిత్ర మసురనాథ
దారుణక్రోధరక్తనేత్రములచేత
నుగ్రగతి లంకను దహించు చున్నవాఁడు
పోలె వీక్షించుచున్నాఁడు పోలఁ గంటె. 590

వ. మఱియు నవ్వానరయూథపునకు వింధ్యాచలంబును గృష్ణపర్వతంబును సహ్య
నగంబును సుదర్శనశైలంబును సంతతంబును విహారస్థానంబులై యుండు నిత
నిం బరివేష్టించి చండపరాక్రము లగువారు త్రింశచ్ఛతసహస్రంబులు వాన
రులు శౌర్యాలంకృతులై నిత్యంబునుం బాయక సేవించుచుండుదురు వారొ
క్కొక్క రొక్కలోకంబు నాక్రమింప దక్షు లట్టిసహచరులుం గూడి సుగ్రీవుని
శాసనంబున లంకమీఁదికి సంగ్రామార్థియై వచ్చుచున్నవాఁడు మఱియును.

ఉ. మించినకోపవేగమున మేను విదుర్చుచు సారెకు న్విజృం
భించుచుఁ దోఁక యెత్తి జళిపించుచు వీనులు నిక్కఁబెట్టి యా
డించుచు నడ్డచూపు నిగిడించుచు సంగరకాంక్షి యై వినో
దించుచు నున్నవాఁ డతఁడు ధీరవరా శరభుం డనంబడున్. 592

వ. ఇతండు మహాబలసంపన్నుఁడును మహాజవుండును వీతభయుండు నై మృత్యువు
నైన లెక్కింపక యుక్కునం గ్రాలుచుండు నితనికి రమ్యం బగుసాల్వేయపర్వతం
బునికిపట్టైయుండు నవ్వీరోత్తమునకుఁ జత్వారింశచ్ఛతసహస్రపరిమితులు వాన
రులు బలవంతులు విహారనామకు లున్నవారు వారిం జుట్లు నిడుకొని లంక
నుత్పాటించునట్టిపలుకులు పలుకు చున్నవాఁడు మఱియును. 593

చ సురవిమతేంద్ర కంటె పనసుం డనుయూథపుఁ డల్లవాఁడె వాఁ
డరయఁగ జన్యదుష్ప్రసహుఁ డద్భుతవీర్యుఁడు పారియాత్రభూ
ధరమున నుండువాఁ డతనిఁ దద్దయు వేడ్క భజింతు రుగ్రవా
నరులు జితారు లుద్ధతు లనారత మేఁబదినూఱు వేలొగిన్. 594

వ. మఱియు నివ్వానరుండు యూథోత్తముండు తనబలంబుల శాస్త్రదృష్టవిధానం
బున విభజించి వేర్వేఱ మొనలు ఘటించి తన్మధ్యదేశంబున బృందారకమ
ధ్యంబునం గ్రాలు సహస్రాక్షునిచందంబునం దేజరిల్లుచు మేఘంబు గగనంబు
నాచ్ఛాదించినభంగిఁ బుడమి నాచ్ఛాదించి సంగ్రామంబున కభిముఖుం డై

యున్నవాఁడు వింటివె రాక్షసేంద్రా తదీయకఠోరకంఠహుంకారంబు మహా
భేరీసన్నాదంబుకరణి విన నయ్యెడు నని పల్కి వెండియు నిట్లనియె. 595

మ. పరికింపం దగు నల్లవాఁడె జలధిప్రాంతంబున న్ఘోరబం
ధురయై రెండవసాగరంబుపగిది న్దుష్పారయై యున్నవా
నరసేనం దనమేలిమాటల మహానందంబు నొందించుచుం
గురుశైలక్రియఁ గ్రాలువాఁడు వినతాఖ్యుం డెన్న దైత్యోత్తమా. 596

తే. దనుజవంశాబ్ధిచంద్ర యవ్వినతుచెంత, నంతకాకారుఁడై బలవంతు లైన
కపులు సేవింప నిన్ను సంగ్రామమునకుఁ, జీరుచున్నాఁడు వాఁడె వీక్షింపుమధిప.

వ. అతండు క్రోధనుం డనుయూథపుండు మహాబలసంపన్నుండు వీనికి షష్టిసహస్ర
పరిమితంబు లగువానరబలంబులు గలిగియుండు నమ్మహావీరుండు గంగానదీజలం
బులు ద్రావుచుఁ దత్పరిసరంబున ఫలమూలంబు లుపయోగించుచుండు నతండు
నిజసైన్యంబుల విభజించి మోహరించి సన్నద్ధుండై యుద్ధంబునకు నిన్నుం జీరు
చున్నవాఁ డతనిపార్శ్వంబున గైరికవర్ణసంకాశం బైనతనశరీరంబును యుద్ధహ
ర్షంబువలన నభివృద్ధి నొందించుచు బలదర్పమదవిశేషంబున సర్వయూథపుల
ధిక్కరించిమనంబునం బొడమినక్రోధాగ్నిశిఖలు రక్తాంతవీక్షణవ్యాజంబున వెలి
కిం బర్వ సప్తతిశతసహస్రసంఖ్యాతులగు వానరుల వేర్వేఱవిభజించిసన్నద్ధుండై
నిన్నుం గదియ వచ్చుచున్నవాఁ డతండు గవయుం డనుయూథపుండు వీరందఱు
దుష్ప్రసహులును జండపరాక్రములును బలవంతులును గామరూపులును
గొందఱు యూథపులును గొందఱు యూథపశ్రేష్ఠులు నై తమతమబలంబులం
గూడుకొని సంగ్రామంబునకుఁ గట్టాయితులై యున్నవారు వీరి నెల్ల విలోకించి
తివిగదా ప్రసిద్ధు లైనయీవనచరులలోన నెవ్వారు రాఘవార్థంబునందు జీవి
తంబును రక్షింపక రణంబు సేయ నమకట్టి యున్నవా రట్టియూథపశ్రేష్ఠుల
నెల్లఁ జూపి చెప్పెద వారిచందంబు నిమ్ముగా నెఱింగికొను మని పలికి వెండియు
ని ట్లనియె. 598

సీ. దనుజేంద్ర కంటె సూర్యునిమరీచులమాడ్కి నిడుద లై సితపీతనీలరక్త
మణివర్ణ వాలరోమంబులు కడుఁ జిత్రభంగిఁ బుష్కరవీథిఁ జెంగలింప
గురువులు వాఱువానరు లనేకులు శిల ల్యూభజము ల్గరతలంబులఁ జెలంగ
మనపట్టణము చూఱగొను వేడ్కఁ రయమునఁ జటులకోలాహలస్వనము లెసఁగఁ

తే. జరణసంఘట్టనంబున ధరణి గ్రుంగ
నద్భుతాటోపమున వెన్క నరుగు దేర
వచ్చుచున్నాఁడు వాఁడె దుర్వారభంగి
నుగ్రరూపుండు హరుఁ డనుయూథపుండు. 599

వ. మఱియు నయ్యూథపునిపిఱుంద దెస నసితాంజనసంకాశులును యుద్ధకర్మవిశార
దులును సత్యపరాక్రములును నసంఖ్యేయులును ననిర్దేశ్యులు నై నీలజీమూతం

బులకరణిఁ గ్రాలుచు సముద్రతీరవనంబులందును నదులందును బర్వతములయం
దును నిండి మెండుకొని యూర్జితగర్జానిస్వనంబులు చెలంగ దారుణప్రకారం
బున నిన్నుఁ డాయ వచ్చుచున్నవారు వారె భల్లూకయూథపు లవలోకింపుము
మఱియుఁ దన్మధ్యదేశంబున జీమూతపరివృతుం డైనపర్జన్యునిసొబగునం దేజ
రిల్లుచుఁ గ్రోధారుణితలోచనంబుల నగ్నికణంబులలర ఘోరదర్శనుం డై యున్న
వాఁడు వాఁడె ధూమ్రుం డనుయూథపశ్రేష్ఠుం డతండు సమస్తభల్లూకలోక
నాయకుండు ఋక్షవంతం బనుగిరిశ్రేష్ఠంబున నివసించి నర్మదాజలంబు లుప
యోగించుచు నచ్చటిరాజ్యంబు పాలించుచుండు మఱియును. 600

ఉ. వానికి నగ్రజుం డఖిలవానరలోకనమస్కృతుండు జ
న్యానతశాత్రవుండు కుధరాభశరీరుఁడు సర్వవీరస
మ్మానితుఁ డుగ్రరూపుఁ డసమానపరాక్రముఁ డత్యుదాత్తతే
జోనిధి జాంబవంతుఁ డనుశూరవరేణ్యుఁడు వాఁడె చూడుమా. 601

వ. ఇతండు మహాయూథపయూథపుండు రూపమాత్రంబుచేత భ్రాతృసముం డగుం
గాని వీర్యవిక్రమంబుల నతనికంటె నధికుండు సంగ్రామంబున నధికదుర్జయుండు
ప్రశాంతచిత్తుండును గురువర్తియుఁ జిరజీవియు నని విశ్రుతిం గన్నవాఁడు నితండు
తొల్లి శక్రునకుం దోడ్పడి సమరంబున బలవంతులైన రాక్షసుల ననేకుల వధించి
దేవతలచేత దుర్లభంబులైనవరంబులు వడసినవాఁడు మహామహీధరశృంగంబు
లుత్పాటించి కందుకక్రీడ లాడుచు మహావేగంబున నిరువదియొక్కమాటు
త్రివిక్రమరూపంబునకుఁ బ్రదక్షిణంబు చేసినమహానుభావుం డతనినామంబు
విన్న మృత్యువైనఁ బరువెత్తు నితనికి దైత్యదానవపిశాచసమానంబు లగు
భల్లూకబలంబు లసంఖ్యేయంబులు గలిగి యుండు వానరయూథపు లెల్ల నమ్మ
హాయూథపయూథపునిం బరివేష్టించి యున్నవారు విలోకింపుము. 602

చ. దనుజవరేణ్య కంటె యల దానవభంజను నర్థిఁ గొల్చి య
య్యనఘునిచేత దుర్లభము లైనవరంబులు గాంచి ప్రీతితోఁ
దనదుబలంబులం గొనుచు దారుణభంగి రణం బొనర్పఁగా
ఘనగతి వచ్చువాఁ డతఁడె కా ఋషభుం డనుయూథపుం డొగిన్. 603

తే. ధరఁ జతుష్పాదజంతుయూథములయందు
ఘనత నెవ్వానిరూపంబు కంటెఁ బరమ
మైనరూపంబు లే దట్టియధికుఁ డల్ల
వాఁడె సన్నాదుఁ డనియెడువానరుండు. 604

వ. అతండు సర్వవానరపితామహుం డనియును యూథపయూథపుం డనియును
వినంబడు నితండు తొల్లి శక్రునిం దొడరి ఘోరం బగురణం బొనర్చి పరాజ
యంబు నొందక యతనిచేత మెచ్చు వడసినపరాక్రమశీలుం డతండు యోజన
దూరస్థితం బైనశైలంబును బార్శ్వంబున సంస్పృశించుచు నట్లు గమనవేళ

యందుఁ గాయంబుచేత మీఁద యోజనంబు సంస్పృశించుచున్నవాఁడు విలోకింపుము. 605

మ. రస జంబూతరు వేడఁ బుట్టెను గుబేరస్వామి కిచ్ఛావిహా
రసుఖం బేగిరి యిచ్చె నెయ్యది నగేంద్రశ్రేష్ఠ ముచ్చోట సం
తస మొప్ప న్నివసించువాఁడు రిపుల న్దండించువాఁ డల్లవాఁ
డసురాధీశ్వర క్రోధనుం డనెడుకీశాధీశుఁ డీక్షింపుమా. 606

వ. ఇతనికి శక్రునకుం బోలెఁ బరాక్రమంబు నిసర్గంబై యుండు నవ్వీరోత్తముండు వైశ్వానరునివరప్రసాదంబున గంధర్వకన్యకుం బుట్టినవాఁడు దేవాసురసంగ్రామం బునందు దేవతలకు సాహాయ్యం బాచరింప నరిగి రణంబున నసురులం దోలి సురలకు విజయం బొసంగినవీర్యధుర్యుండు రణంబులందుఁ గులగిరికరణి సుస్థిరోత్సాహుండై దలంకక యుండువాఁ డితనికిఁ గోటిసహస్రసంఖ్యాతులగు వానరులు బలవంతు లున్నవారు నిజానీకపరివృతుం డై లంకాపురంబు నఱిముఱి నుఱుమాడుటకు వచ్చుచున్నవాఁడు విలోకింపుము. 607

తే. దానవోత్తమ మత్తసుందరగజంబు, లీల మద మెక్కి లంకావిశాలసౌధ
వరణపాటనదక్షుఁడై యరుగుదెంచు, చున్నవాఁ డదె గజుఁ డనుయూథపుండు.

వ. ఇతండు గంగాతీరప్రాంతకాననంబుల వసించుచు నమ్మహానదీజలంబులు ద్రావుచు వానరులకుం గరులకుం గలపూర్వవైరంబు దలంచి గజయూథపుల నెల్ల రణంబునం దోలుచుఁ బాదపంబుల విఱుగం ద్రోచుచు శైలంబు లుత్పాటించుచు నింద్రుండు త్రివిష్టపంబునందుం బోలె నచ్చట విహరించుచుండు నితండు వానర వాహినీముఖ్యుం డనంబడు మఱియును. 609

తే. అసురనాథ వాతోద్ధిత మైన మేఘ
మట్లు చూపట్టుచున్నవాఁ డల్లవాఁడె
పోలఁ జూడుము కపివంశభూషణుండు
నురుభుజుండు ప్రమాథి యన్యూథపుండు. 610

వ. ఇతండు హరివాహినీముఖ్యుండు హైమవతీనదీతీరంబునం బొల్చుమందరోపమం బైనయుశీరబీజపర్వతంబు నాశ్రయించి తద్గిరికందరంబుల నివసించుచు నమ్మహానదీసలిలంబు లుపయోగించుచుండు నితనికి వీర్యవిక్రమదృప్తులును భుజాబలసంపన్నులును మేఘగంభీరనిర్ఘోషులు నగువానరులు శతసహస్రసంఖ్యాతులున్నవా రట్టిబలంబులం గూడి సుగ్రీవునిశాసనంబున సంగ్రామార్థియై వచ్చుచున్నవాఁడు కంటివె తదీయచరణసంఘట్టనసముద్ధూతమహాపరాగంబు వాయువశంబున రేఁగి యరుణాభాసంబై యంబరంబునం బెరసి బహుప్రకారంబుల సాంద్రంబుగాఁ గప్పికొని యున్న దని పలికి వెండియు నిట్లనియె. 611

శా. ఆలోకింపుము సేతుమార్గమున దైత్యాధీశ కుప్యన్మహా
కాలాకారు గవాక్షునిం గొలిచి లంకాధ్వంసనప్రోద్ధతిన్

నీలాంగంబులతో సితాస్యములతో నిర్వక్త్రయానంబుతో
గోలాంగూలబలంబు గ్రాలెడు మహాఘోర ప్రకారంబునన్. 612

వ. అబ్బలంబు శతసహస్రశతపరిమితం బై యుండు మఱియును. 613

సీ. ఇనుఁ డెందు వర్తించు నెచ్చోటు నిత్యంబుఁ దప్తహేమద్యుతిఁ దనరు చుండు
నెచ్చట వసియించు మృగఖగవ్రాతంబు బాలసూర్యచ్ఛాయఁ బాటి కెక్కు
ఫలపుష్పపల్లవోజ్జ్వలములై యెచ్చోటితరువులు కోరిక ల్గురియు చుండుఁ
బరమర్షు లెచ్చోటఁ బాయక నిత్యంబు ఘనతపోమహిమచేఁ గ్రాలు చుంద్రు

తే. పరఁగ నెచ్చట మధువృష్టి గురియు నట్టి, రమ్యకాంచనపర్వతరాజమందు
ననిశము వసించి యుండువాఁ డల్లవాఁడె, వాసవారి కేసరి యనువానరుండు.

వ. మఱియు నతండు యూథపముఖ్యముఖ్యుం డనంబడు వానిం బరికింపుము.

తే. అసురనాయక సకలరాక్షసులలోన, నేతవై విశ్రుతిని గన్న నీవపోలె
దండి వేవేల బంగారుకొండలందు, నెక్కుఁడై మించు మేరుమహీధరంబు.

తే. అమ్మహాశైలరాజము నధివసించు, వారు వానరవీరులు వారె చూడు
ధవళపింగళగాత్రము ల్తామ్రముఖము, లొప్ప నొప్పుగ శోభిల్లు చున్నవారు.

వ. మఱియు నప్పనాటవీరులు సింహంబులుం బోలెఁ జతుర్దంష్ట్రులును వ్యాఘ్రం
బులుం బోలె దురాసదులును జ్వలితాశీవిషసమానులును వైశ్వానరసమప్రభు
లును నుత్తమాతంగసన్నిభులును మహాపర్వతసంకాశులును నీలజీమూతనిస్వ
నులును వృత్తపింగళరక్తాక్షులునుభీమపరాక్రములును భీమగమనులునుదీర్ఘాం
చితలాంగూలులును దీక్ష్ణదంష్ట్రులును దంతనఖాయుధులును భయంకరదర్శ
నులు నై యుద్దామపరాక్రమంబున లంకాపురంబు నవలీలందునుమాడెదమని
యున్నవారు మఱియును. 618

ఆ. వారినడుమ నొప్పువాఁడు వారలఁ బ్రీతి, నేలువాఁడు శమనుఁ బోలువాఁడు
సత్యసంగరుండు శతవలి యనువాఁడు, వాఁడె చూడు మసుర వంశవర్య. 619

చ. అతఁ డతిసత్త్వవంతుఁడు మహామతిమంతుఁడు పౌరుషస్థితుం
డతులితశౌర్యుఁ డద్భుతవిహారుఁడు రామహితంబుపొంటె జీ
వితములపై నొకింతనరవిం గృప సేయఁడు రాక్షసేశ్వరా
జితరిపుఁ డైనయాప్లవగశేఖరుచెద్దము లేమి చెప్పుదున్. 620

తే. అధిప గవయుండు గజుఁడు గవాక్షుఁ డల్ల
నలుఁడు నీలుఁ డీయేవురు తలఁప నొక్కొ
క్కఁడు శతకోటివానరయూథపులకు
మేటిగమికాండ్లు ననిమొన మెఱయువారు. 621

క. దనుజవర వెల్లివిరిసిన, వననిధిచందాన నొప్పువానరబలముం
గనుఁగొను మదె వింధ్యాచల, మున నిచ్చల మునికి సేయు ముద మలరారన్.

వ అబ్బలంబు లెక్కింపఁ ద్రిముఖచతుర్ముఖపంచముఖషణ్ముఖసహస్రముఖులకైన నలవి గాదు వినుము. 623

ఉ. అంద అతిప్రభావులు మహాగిరిసన్నిభఘోరకాయు ల
స్పందపరాక్రము ల్విమతపాటనశీలురు జన్యదుర్జయుల్
మందరధైర్యు లబ్ధివనమండలశైలవికీర్ణ మేదినిం
గ్రందుగ నొక్కపెట్టిడి వినష్టముఁ జేయ సమర్థు లెన్నఁగన్. 624

వ. అని సారణుండు పలికినయనంతరంబ శుకుండు రాక్షసాధిపుం డగు రావణునవలోకించి ఘటితాంజలిపుటుండై దేవా యిప్పుడు సారణుం డెఱింగించినయూథాధిపతుల మత్తద్వీపంబులంబలె గంగాతటరుహంబు లగున్యగ్రోధంబులనట్లహిమవంతంబు లగుసాలంబులం బోలె నిమ్ముగా నవలోకించితివిగదా యీవనాట వీరు లందఱు దుష్ప్రసహులును బలవంతులును గామరూపులును దేవగంధర్వాంశసంభూతులును దైత్యదానవసంకాశులును దేవపరాక్రములునుసహస్రకోట్యర్బుదబృందసంఖ్యాతులును సుగ్రీవవశవర్తులును గిష్కింధానిలయవానులును రామప్రియచికీర్షులునై యుండు రింకఁజూడం గలవారి నెల్లఁజూపి చెప్పెద నాదరాయత్తచిత్తుండవై విలోకింపు మని పలికి వెండియు ని ట్లనియె. 625

చ. సురలకుఁ బోలె రూపముల సొంపును బెంపును సౌకుమార్యము
న్గర మరుదార మైందుఁడు తగ న్ద్వివిదుం డనువానరోత్తము
లురుచిరభంగిఁ గ్రాలెదరు చూచితె వీరికి సాటిలేరు సం
గరములయందు నెవ్వరును గర్బురనాయక యేమి సెప్పుదున్. 626

తే. అసురవల్లభ వీరు ముఁన్నబ్జభవుని, చే ననుజ్ఞాతులై ప్రీతి మానితముగ
దేవత లొసంగ నమృతంబుఁద్రావినారు, బహుబలసమృద్ధివిఖ్యాతిఁ బడసినారు.

సీ. వర్ణింప నెవ్వాఁడు వత్సపదీకృత వారాశి యై ధాత్రి వన్నె కెక్క
నతులితభుజబలోద్ధతి మశకీకృతదనుజుఁ డై యెవ్వాఁడు వినుతిఁ గాంచె
వితతవిక్రమతృణీకృతయుష్మదుగ్రప్రతాపుఁ డై యెవ్వాఁడు కోపగించె
వాలాగ్రదీప్తపావకహావిష్కృతభవన్నగరుఁ డై యెవ్వాఁడు పొగడువడసె
తే. భక్తి నెవ్వాఁడు సీతకు భర్తకుశల,వార్తఁ దెలిపె నెవ్వాఁడు నీవనముఁగూల్చె
నట్టిహనుమంతుఁ డనెడుపనాటవీరుఁ, డల్లవాఁడె విలోకింపు మసురనాథ. 628

తే. అధిప విను కేసరిక్షేత్రమందు వాయు
తేజమున నుదయించినధీరుఁ డితఁడు
కరువలికిఁ బోలె ననివార్యగతియు ధృతియు
బలము సామర్థ్య మతనికిఁ గలిగి యుండు. 629

క. తన వలసినయాపముఁ గై,కొన నేర్చుఁ బయోధి నైన గురుబలయుక్తిం
గినుక ప్రోథమునప్పుడు ఘోరన నింకింపంగ నేర్చు రాక్షసనాథా. 630

చ. ఇతఁడు జనించినప్పుడ సురేశ్వర యప్పుడ పుట్టివచ్చు బా
లతిమిరవైరిఁ గన్గొని ఫలం బది యాఁకలి దీఱునట్లు ను
ద్ధతిఁ గబళింతు నంచు బలదర్పితుఁడై విహగేంద్రులీల నా
యతగతి యోజనత్రయసహస్రము వ్రేల్మిడి దాఁటె మింటికిన్. 631

వ. ఇత్తెఱంగునం జని దేవర్షిపతగోరగసిద్ధసాధ్యదైత్యదానవవిద్యాధరాదులకైన
సహింపరానిచండకిరణకరప్రకాండంబుల వేఁడిమికి నోర్వక యవశుండై యుదయ
పర్వతంబుపైఁ బడినఁ దదీయగండశిలాసంఘట్టనంబున నొక్కింత హనువు భగ్నం
బయ్యె నక్కారణంబున నివ్వీరశిఖామణికి హనుమంతుం డను నామంబు గలిగె
నవ్విధంబు సర్వంబును నిక్కంబుగా నెఱింగి యున్నవాఁడ నతనికిం గల బలరూప
ప్రభావంబులు కొలఁదిపెట్ట నెవ్వరికిఁ దరంబు గాదు నైసర్గికమహిమవిశేషం
బున లంకాపురంబు భస్మంబు సేయ నితం డొక్కరుండె చాలుఁ గంటివె
తదీయసముచ్ఛ్రితవాలాగ్రనిహితవైశ్వానరుండు లంకాపురప్రాసాదమందిరంబు
లిప్పటికి దహించుచున్నవాఁ డని పలికి వెండియు ని ట్లనియె. 632

సీ. ధర్మమం దెవ్వాఁడు తప్పక వర్తించు ధర్మ మెవ్వనియందుఁ దరలకుండు
వేదంబులకు ధనుర్వేదంబునకు నేప్రసన్నచిత్తుని కుక్షి జన్మసీమ
పృథివియు గగనంబు భేదించి గ్రమ్మఱ దొనఁ జొచ్చు నెవ్వనిఘనశరంబు
తడయక కలుషచిత్తుఁడ వైన నీచేత నపహృత యయ్యె నేయనఘుసాధ్వి
తే. యట్టిరాముఁడు నీరదశ్యాముఁ డభిన, వాంబురుహపత్రచారునేత్రాభిరాముఁ
డల్లవాఁడె విలోకింపు మసురనాథ, యుద్ధసన్నద్ధుఁడై వచ్చియున్నవాఁడు. 633

తే. దేవభర్తకుఁ బోలె సుదీర్ఘవిక్ర, మంబు మిత్త్రికిఁ బోలెఁ గ్రోధంబు మఱియు
నమరమంత్రికిఁ బోలెఁ గుశాగ్రబుద్ధి, సహజగుణములై యుండు నీసత్యధృతికి.

మ. దమశీలుండు మహానుభావుఁడు దిగంతవ్యాప్తశాంత్యాదికో
త్తమనానావిధసద్గుణుండు కరుణోదారుండు శూరుండు దు
ర్దముఁ డిక్ష్వాకుకులోత్తముండు సుజనవ్రాతావతంసంబు వై
రిమహారణ్యదవానలుం దశరథశ్రేష్ఠుండు దైత్యోత్తమా. 635

తే. అతనివలపటఁ దామ్రపద్మాంబకములు, కుందనపుఁ జాయమేను వెడందయురము
నీలకుంచితకేశము లెన్నెఱయ మెఱయు,చున్నవాఁడు లక్ష్మణుఁడు వీరోత్తముండు.

క. రామునియనుంగుదమ్ముఁడు, భీమపరాక్రముఁడు శత్రుభీకరుఁ డధిక
శ్రీమంతుఁడు గుణవంతుఁడు, ధీమంతుఁడు వాఁడె చూడు దేవవిరోధీ. 637

తే సర్వశాస్త్రార్థతత్త్వవిశారదుండు, దుర్జయుఁ డమర్షి జేత నిస్తులుఁడు బలియు
విజయశీలి విక్రాంతుండు వినయపరుఁడు, వేదవిదుఁడు మహాధనుర్వేదవిదుఁడు.

క. రాక్షసవర రాఘవునకు, దక్షిణభుజ మతఁ డనారతము నతని విభుం
డీక్షించుఁ బ్రాణసమునిఁగ, దక్షతఁ గొనియాడవలదె తద్భుజశక్తిన్. 639

ఆ. అతఁడు రాఘవార్థమందు జీవితమ్ముపై, నాస సేయఁ డించుకైనఁ గాని
యసురకోటి నెల్ల నవలీలఁ దునుమాడఁ, బూని యున్నవాఁడు దానవేంద్ర.

ఉ. రామునిసవ్యపార్శ్వమున రాక్షసనంవృతుఁడై మహోన్నతి
స్ఫీమగతిం జెలంగెడువిభీషణు నీయనుజన్ముఁ గంటివే
రామునిచేతి నీదనుజరాజ్యమునం దభిషిక్తుఁడై భుజ
శ్రీమహిమం జెలంగ ననిసేయఁ దలంచినవాఁ డధీశ్వరా. 441

ఉ. సోముఁడు ఋక్షమధ్యమున శోభిలుచున్నగతి న్సమస్తశా
ఖామృగమధ్యదేశమునఁ గ్రాలెడువీరుఁ డశేషవానర
స్వామి యనంతవీర్యబలసాంద్రుఁడు ధామనిధిప్రియాత్మజుం
డామహనీయమూర్తి గనుమా రజనీచరవంశశేఖరా. 442

తే. అసురనాయక హిమవంతుఁ డఖిలగిరుల, నట్లు లక్ష్మీశవంశమహార్ణవేందుఁ
డింపుతో మర్కటులఁ బ్రకాశింపఁ జేయు, నతుల తేజోవిజనకీర్తిమతులచేత.

తే. అధిప యీతఁడు ఘోరశైలాంతరమున
గహనతరుదుర్గమార్గసంకలిత యైన
యట్టికిష్కింధ యనుగుహాయందు మంత్రి
యూథపులతోడ నివసించి యుండు నెపుడు. 444

ఉ. దానవనాథ యిందిరకుఁ దానక మెయ్యది నూత్నకాంతి నె
ద్దానికిఁ గల్గి యుండు శతతామరసంబులు దేవదైత్యు లె
ద్దానిపిసాళి కచ్చెరువు దాలుతు రట్టిసువర్ణమాల యీ
భానుతనూజువక్షమున భాసిలుచున్నది కంటె ముంగలన్. 445

క. భీకరబలుఁ డగువాలిని, వీఁక నవ్వధియించి ప్రతిన వెలయఁగఁ గృపతో
నీకపిరాజ్యము తారయు, నీకాంచనమాల రాముఁ డిచ్చినదిసుమీ. 446

ఆ. అతులభూరిసత్త్వుఁ డితఁడె పో సుగ్రీవుఁ, డనెడుసర్వవానరాధినేత
యితనివీర్యగర్వ మితనియాటోపంబు, కలయఁ జూడు మిపుడు కర్బురేంద్ర.

వ ఇతనికిం గలబలపరిమాణంబు సెప్పెద వినుము. 448

సీ. లక్షలు నూఱైన లక్షింప నొకకోటి యవి లక్షయైన శంకు వన నొప్పు
నవి లక్షయైన మహాశంకు వనఁ జెల్లు నవి లక్షయైన బృందాఖ్యసంఖ్య
యవి లక్షయైన మహాబృంద మన నొప్పు నవి లక్షయైనఁ బద్మాభిధాన
మవి లక్షయైన మహాపద్మ మనఁ దగు నవి లక్షయైన ఖర్వాభిధాన

ఆ. మవియు లక్షయైన నది మహాఖర్వాఖ్య, మవియు లక్షయైన నది సముద్ర
మవియు లక్షయైన నది యోఘ మవల మ,హౌఘ మవియు లక్షయైన నధిప.

వ. ఇట్లు గణితక్రమాగతంబులైన శతసహస్రకోటిశంకుమహాశంకుబృందమహాబృం
దపద్మమహాపద్మఖర్వమహాఖర్వసముద్రౌఘంబులు క్రమంబున నొక్కొకసహ

స్త్రంబును విశేషించి మహాఘం బొకకోటి సేవింప నంగదాదికుమారులును హనుమదాదిమంత్రులును జాంబవదాదికులవృద్ధులును విభీషణాదిమంత్రులును బరివేష్టింప సుగ్రీవుండు విపులగ్రీవుండై రామసాహాయ్యార్థంబు సీతోద్ధరణం బుసేయుటకు లంకమీఁదికి నిశ్శంకంబుగాఁ జనుదెంచి యున్నవాఁ డవ్వీరోత్త ముండు సత్యపరాక్రముండు మహార్ణవంబుకరణి ఘూర్ణిల్లుచున్నతదీయవాహి నీసందోహంబు నవలోకింపుము రాక్షసేంద్రా నాయెఱింగినంత యూథపుల చందంబును బలసంఖ్యానంబును విస్పష్టంబుగా నెఱింగించితి నాచెప్పినక్రమం బున సర్వంబును విలోకించి నీకుఁ బరులచేతఁ బరాజయంబు గలుగకుండునట్టి యుద్యోగంబు నమకట్టు మని పలికిన నాశుకసారణులవాక్యంబులు విని యద్ద శగ్రీవుండు. 450

రావణుఁడు శుకసారణులపైఁ గోపము సేయుట.

సీ. పార్థివోత్తమునిఁ దత్పార్శ్వస్థు లైనలక్ష్మణవిభీషణులను గపికులేంద్రుఁ
డైనయాసుగ్రీవు ననిమిషపతిపౌత్త్రుఁ డైనయంగదుని బలాఢ్యుఁ డైన
హనుమంతు దుర్జయుం డగుజాంబవంతుని గజుని గవాక్షుని గవయు నీలు
మైందు శిల్పవిదుని మఱియుఁ దక్కినయూథపుల నెల్లఁ జూచి లోనులికి పిదప

తే. నలుక వొడమినడెందాన నధికరోష, ముంచి శుకసారణుల విలోకించి కనుల
రక్తిమ చెలంగ భర్జించి రావణుండు, దిట్టఁదనమునఁ బరుషోక్తి నిట్టు లనియె.

తే. నిగ్రహానుగ్రహములందు నిపుణుఁడైన, విభునిసన్నిధి సచివులు విప్రియములు
పలుకవచ్చునె మీకింతభయము లేక, యాడుటకుఁ దగెఁ జనవిచ్చినందువలన.

తే. స్తుత్యనర్హకాలంబున భృత్యు లిట్లు, సమరమున కెత్తి వచ్చినశత్రువరులఁ
బొగడు టది యాత్మనాథునిఁ దెగడుకంటె, నల్పతరమె విచారింపకంటి రిట్లు.

ఆ. శాస్త్రసార మెఱిఁగి సముచితవైఖరి, భృత్యకార్య మాచరింప కునికిఁ
బరఁగ వృద్ధజనుల గురుల నాచార్యుల, నాశ్రయించు టెల్ల వ్యర్థ మయ్యె.

క. ఎఱిఁగి యొనరింపఁ జేనియు, నురుతరవిజ్ఞానసాధనోచితశాస్త్రో
త్కరభారవాహిగా కా,పురుషుఁడు పండితుఁ డనంగఁ బొగడు వడయునే. 455

వ. అట్టిమూర్ఖసచివులచేతఁ బరివృతుండ నై దైవయోగంబున నింతకాలంబు రాజ్యం బేలుచు జీవించి యున్నవాఁడ సమర్థుండ నైననాయమాత్యులభయంబుదక్కి యిట్టివిప్రియంబు పరుషంబుగాఁ బలుకుచున్నవారు మీదీమనం బేమన వచ్చు నామాత్యుల విప్రియంబు లాడుటకు మీకు మృత్యుభయం బేల కలుగ దయ్యె శాసనంబునం బ్రవర్తించుచున్ననాజిహ్వాచలనంబె మరణంబును శ్రేయంబు నొసంగు నేర్చి పేర్చుకార్చిచ్చు నంటి వనంబునఁ బాదపంబులు జీవించుంగాని రాజకోపపరామృష్టు లైనయపరాధులు జీవింపనేరరు పూర్వోపకారంబులచేత మత్క్రోధంబు మృదుత్వంబు నొంద దేని యే నిప్పుడు శత్రుపక్షప్రశంసకు

లైనపాపాత్ముల మిమ్ము వధించెద నిప్పుడు మాకడ నుండ నర్హులు గారు తొలంగి
చనుండు పూర్వకృతోపకారంబులు దలంచి మిమ్ముఁ జంపక కాచి పుచ్చితిఁ
గృతఘ్నత్వస్నేహపరాఙ్ముఖత్వంబులె మీకు వధం బని పలికిన నాసారణశుకు
లిద్దఱు ప్రీతులై జయశబ్దంబున రావణు నభినందించి తొలంగి చని రంత నద్దశ
గ్రీవుండు సమీపస్థుం డగుమహోదరు నాలోచించి నీతివిశారదు లైనమనచా
రుల శీఘ్రంబున రావింపు మనిన నతండు తద్వచనప్రకారంబున నడుపుటయు
నచ్చారులు పఱతెంచి జోహారు గావించి యంజలి గీలించి పనియేమి యనియడి
గిన వారి కిట్లనియె. 456

రావణుఁడు శార్దూలాదిచారుల వానరులచొప్పెఱుంగఁ బంచుట.

సీ. మీరు భక్తులు కడుశూరులు ధీరులు గతసాధ్వసు లుపాయచతురు లగుటఁ
జేసి నేర్పులు వేయి చెప్ప నేటికి రాముఁ డున్నచోటికి వెర వొప్ప నేగి
యతనిచందంబు తద్వ్యవసాయమును మంత్రనిశ్చయంబును గడునెమ్మితోడఁ
గ్రీడించువిధము నిద్రించుచందంబు మేల్కనురీతియును గార్యకర్త తెఱఁగు
తే. సర్వము నెఱింగి చనుదెండు జనవిభుండు
విహితగతిఁ జారముఖమున విమతుచంద
మెఱిఁగి యల్పయత్నంబున నరిని గెలుచు
నెల్ల నృపులకు నీతియై యొసఁగుఁ గాదె. 457
క. అని పలికి యనుప వారలు, పనిఁ బూని ముదంబున న్క్షపాచరవరు నిం
వున వలగొని యేగిరి గ్ర,క్కున రాఘవుఁ డున్నయెడ కకుంఠితలీలన్. 458
వ. ఇట్లు శార్దూలుని మున్నిడుకొని యచ్చారులు ప్రచ్ఛన్నరూపు లై చని సువేల
శైలప్రాంతంబున విడిసి యున్న వానరబలంబు సొచ్చి యచ్చెరువును భయంబును
బిచ్చలింప నదరి బెదరి చూచుచుం జని తన్మధ్యదేశంబున సుగ్రీవవిభీషణసహి
తులై యున్న రామలక్ష్మణులసమీపంబు మెల్లమెల్లన డాయం జని రప్పు డప్పొ
లదిండితేని వేగులవారిచందం బెఱింగి పరిచితరాక్షసవేషభాషణుం డగువిభీ
షణుండు వారలచందంబు వానరుల కెఱింగించిన నాప్లవగపుంగవులు వారలం
బట్టి బద్ధులఁ గావించి రామునిసన్నిధికిం దెచ్చి పెట్టి విభీషణోక్తప్రకారంబున
నితండు పాపాత్ముం డని శార్దూలు నొక్కని మిక్కిలి కినుకచేత ముష్టిప్రహారం
బుల నొప్పింపం దొడంగిన సదయాళుం డగురాముండు కరుణాతరంగితా
పాంగుండై. 459
ఉ. వీరలతోడి దేమిపని వేగులవారి వధింపరాదు పొ
ల్పారఁగ ద్రోచి పుచ్చుఁ డన నక్కపు లట్లొనరింప వేగ య
చ్చారులు ముక్తులై సరభసంబుగఁ గ్రమ్మఱ లంక కేగి దే
వారి వినంగ నిట్లనిరి యాస్యములం గడు దైన్య మేర్పడన్. 460

శా. రక్షోధీశ జొహారు రాముఁడు సువేలక్ష్మాధరాంకంబునన్
దక్షత్వంబున ఘోరసంగరకళాధౌరేయుఁడై యున్నవాఁ
డీక్షింపంగఁ దరంబు గాక కుతుకం బేపారఁ దత్సేన లం
కాక్షోభం బొనరింపఁగాఁ దగి యశంకన్నిండి యున్నాఁ డొగిన్. 461

శార్దూలుఁడు రావణునితోఁ దనదురవస్థ చెప్పుట.

క. నా విని రావణుఁడు రఘుక్ష్మావరురాకకు నొకింత జాతోద్వేగుం
డై వెండియు శార్దూలునితో నైకారికగుణంబు దోఁపఁగ బలికెన్. 462

తే. ఆస్యమున వెల్లఁదనముదైన్యమువిషాద, మడరెడువడంకెడిని సమస్తాంగకములు
బడలితివి చారశేఖర ప్లవగకోటి, కరములం బడి మిక్కిలి గాసిపడితె. 463

వ. అని యడిగిన భయవిహ్వలుం డై శార్దూలుండు తపవడు నెలుంగున రాక్షస
శార్దూలున కిట్లనియె. 464

ఉ. రాక్షసనాథ రామబలరక్షితవీరవనాటసైన్యముల్
వీక్షణవృత్తికిం జొరవ యీక బలంబును బాహువిక్రమం
బక్షయతేజముం గలిగి యద్రులకైవడిఁ గ్రాలుచున్కి నే
దక్షత మాట లాడుటకు ధైర్యము చాల దదేమి చెప్పుదున్. 465

క. ఏవంకఁ బాఱఁజూచిన, నావంక నశంకశంకరాచలతులకీ
శావలులు గాచి యున్నా,రో వల్లభ లాఁతివార లొగిఁ జొర కుండన్. 466

ఉ. దిట్టఁదనంబున న్నడుమ ధీరులు దాశరథు ల్వసించి రా
చుట్టును గీశు లక్కపులచుట్టును నెట్టన ఋక్షసైన్య మా
చుట్టును గొండముచ్చులును సొంపుగఁ బెట్టినకోటభంగి ని
ట్టట్టు గదల్పరాక చెలువారు నిశాటభయంకరాకృతిన్. 467

తే. అసురనాయక యేను మాయాబలమున, నబ్బలంబు ప్రవేశించు నంతలో నె
ట్లునారాక తెలిసెనో యెఱుఁగరాదు, హరిబలము వేగ ననుఁబట్టియుంటఁగట్టి.

క. భీకరగతి మోఁచేతుల, మోఁకాళ్లం గఱకుగోళ్ల ముష్టిహతుల చేఁ
బోకుండ మరల నెచటికి, రాకుండఁగ బొడిచి విడిచె రామునికరుణన్. 469

క. పట్టువడిననినుఁ జంపక, నెట్టు విడిచి రంటి వేని యెఱిఁగించెద నే
దిట్టఁదనంబున నబ్బల, మట్టె ప్రవేశించి తిరుగు నాసమయమునన్. 470

క. న న్నెఱిఁగి విభీషణుఁ డా,సన్న వనాటులకుఁ గన్నుసన్న యొనర్పం
గ్రన్ననఁ బట్టి నరేశ్వరుఁ, డున్నెడ కీడ్చుకొని పోయి యొప్పించి వెసన్. 471

వ. పలుదెఱంగుల నొప్పించిన నేను దుర్నివారవానరవీరకఠోరభుజాసారసంపీడ్య
మానసర్వాంగుండ నై మేనం గ్రొత్తనెత్తురు గ్రమ్ముదేర నింద్రియంబులు
చలింప మొగంబున దైన్యంబు దోఁప మనంబున నెగడుగదుర నంజలిగీలించి
రాముని శరణంబు వేఁడిన నప్పార్థివోత్తముండు కరుణాదివిధేయుండై చంపనీక
బంధవిముక్తునిం జేసి యనిచిన భవత్సకాశంబునకుం జనుదెంచితి నద్వీరోదా

రుండు ప్రబలాసంఖ్యేయవీరవానరచమూసమేతుండై శైలశిలావృక్షంబుల జల
నిధి బంధించి సేతుమార్గంబున నుత్తరించి బలంబుల గరుడాకారంబుగా మోహ
రించుకొని సాహసోత్సాహబాహాటోపంబులు దీపింప లంకమీఁదికి నిశ్శంకం
బుగాఁ జనుదెంచి యున్నవాఁడు గావున. 472

మ. దివిజారీ తడ వేటి కింక నతిభక్తి న్సీత నర్పించి య
య్యవనీనాథునితోడ నెయ్య మది సేయం బూనుటో యేటిపే
ర్యవిశేషం బని ఘోరసంగర మొనర్పం బూనుటో మంత్రిబాం
ధవవర్గంబులసమ్మతిం దగినచందం బాత్మ నూహింపుఁడీ. 473

ఉ. నా విని రావణుం డనియె నాదుమతంబు వినుండు చెప్పెదక్ష
భూవరుఁ డాంజనేయుఁ డినపుత్త్రుఁడు తక్కినకీశు లేల యా
దేవవరేణ్యుఁ డాది యగుదిక్పతు లందఱుఁ గూడి వచ్చినం
జేవ దలిర్ప జన్యమునఁ జెందుదుఁ గాక మహీజ నిత్తునే. 474

చ. ఎఱుఁగరె మత్ప్రతాపము మహేంద్రుని గెల్చిననాఁడు కాలునిం
బఱపిననాఁడు వహ్ని నెడఁ బాపిననాఁడు దినేశయక్షరా
ద్వరుణులఁ దోలునాఁడు నలవాయువు డాసిననాఁడు క్రొత్తయే
నరునకు నోడి సంధికలన న్మను టొప్పు ననంగఁ జెల్లునే. 475

చ. వనచరసేనఁ జొచ్చి బలువై ఖరులం బరికించితే కదా
ఘనభుజు లెవ్వ రెవ్వ రతిగర్వితు లెవ్వరు ముఖ్యు లెవ్వ ర
త్యనుపమశౌర్యు లెవ్వరు బలాధిపు లెవ్వనిపుత్త్రపౌత్త్రులో
దనుజవరా సమస్తమును దప్పక మాకెఱిఁగింపు మింపుగన్. 476

క. సమర మొనరింపఁ బూనిన, క్షమాపతికి శత్రుసైన్యసంఖ్యాన మవ
శ్యము సేయ వలయుఁ గావునఁ, గ్రమమున నెఱిఁగింపు మింతకర్బుర తెలియన్.

క. నీవలన సర్వమును విని, యావల హితమంత్రిచరుల నందఱ సభకు
న్రావించి జన్యవిజయము, గావించువిధంబు తెలియఁగాఁ దగు మాకున్. 478

## శార్దూలుఁడు రావణునకు వానరులలో విశేషంబు లెఱింగించుట.

వ. అని యిత్తెఱంగున నద్దశగ్రీవునిచేత నడుగంబడినవాఁడై యుత్తమచారుండగు
శార్దూలుండు విగతభయుండై యతనిసన్నిధియం దిట్లని చెప్పందొడంగె. 479

సీ. రాక్షసేశ్వర ఋక్షరజునినందనుఁడు సుగ్రీవుఁ డాతఁడు సర్వకీశవిభుఁడు
వాసవపౌత్త్రుండు వాలిపుత్త్రుఁడు జన్యరతుఁ డంగదుఁడు యువరాజతండు
రోహితాస్యనికుమారుఁడు నీలుఁ డాతండు వానరవాహినీవల్లభుండు
మరుదాత్మజుఁడు హనూమంతుఁ డాతఁడు రుమారమణాదికపులకు రక్షకుండు

తే. పద్మగర్భునిపుత్త్రుండు పరమవృద్ధుఁ, డంబుదోపమకాయుండు జాంబవంతుఁ
డతఁడు చిరజీవి గావున నాలమందు, వెర వెఱింగించుచుండు నెవ్వేళలందు.

వ. మఱియు నాజాంబవంతుండు గద్గదునితనయుండు ధూమ్రుం డనువాఁడతనితోం డవనందనుండు లంకాపురం బెవ్వనిచేత దగ్ధం బయ్యె నట్టిహనుమంతునకు జనకుండైన కేసరి యనువాఁడు శక్రగురుం డైనబృహస్పతికిం బుట్టినవాఁడు ధర్మాత్ముం డగుసుషేణుండు ధర్మనందనుండుదధిముఖుం డనువానరశ్రేష్ఠుండుసోమాత్మజుండుసుముఖుండునుదుర్ముఖుండును వేగదర్శియనునువలీముఖశ్రేష్ఠులు మృత్యుతుల్యరూపులై పరమేష్ఠిచేతసృజింపంబడినవారుబలవంతులైనమైందద్వివిదులిరువురుదస్రపుత్త్రులుగజగవయగవాక్షగంధమాదనశరభులు వైవస్వతునిపుత్త్రులు శ్వేతుండును జ్యోతిర్ముఖుండు ననుకపియూథపులు భాస్కరకుమారులు హేమకూటుం డనుప్లవంగముండు వరుణానందనుండునళుం డనుప్లవంగపుంగవుండు విశ్వకర్మనందనుండు దుర్ధరుం డనువానరుండు వసుపుత్త్రుండు మఱియు వీరందఱు నొక్కొక్కఁడు శూరులును గాలాంతకతుల్యులును యుద్ధకాంక్షులును శ్రీమంతులును దేవాంశసంభూతులు నగుదశకోటివానరయూథపులకు నాయకులు వీరలబలంబు లెక్కింప నెవ్వరికి నలవి గాదని యిట్లుభయభ్రాంతుం డగుటవలనఁ బౌర్వాపర్యవిపర్యయంబుగా వానరోత్పత్తిప్రకారంబు వినిపించి వెండియు నిట్లనియె. 481

సీ. గణుతింప నెవ్వానిఖడ్గదంభోళికి నలవిరాధుఁడు కులాచలత నొందె
ఖరదూషణాదు లెవ్వనిసముజ్జ్వలబాణవహ్నికి శలభంబు లైరి
యరయ నెవ్వానిబాహాబలాశుగమున కాకబంధుఁ డనోకహాత వహించెఁ
బ్రణుతింప నెవ్వానిపటుశౌర్యహార్యక్షమునకింద్రజుఁ డుహస్తిమూర్తియయ్యె
తే. నట్టిదశరథసుతుఁడు రామాధిపుండు, సింహసంహననుండు ప్రసిద్ధబలుఁడు
విక్రమమునందు నారఘువీరవరున, కవనిలోపల సముఁ డొక్కఁడైన లేఁడు.

ఉ. మానుగ నేమహామహుని మార్గణసంహతి నాజిలో జన
స్థానగతు ల్బలాఢ్యులు నిశాచరు లందఱు గీటణంగి రా
మానవనాథశేఖరుని మంజుగుణంబులు సన్నుతింపఁగా
దానవనాథ యొక్కఁడును దక్షుఁడు లేఁడు జగత్త్రయంబునన్. 483

ఉ. అన్నరనాథుతమ్ముఁడు మహాత్ముఁడు మానధనుండు శౌర్యసం
పన్నుఁడు లక్ష్మణుం డతనిబాణపథంబున నిల్చి యాజిలోఁ
బన్నగవాసవుం డయినఁ బ్రాణముతో మరలంగఁ జాలఁ డే
మెన్నదు తత్ప్రభావ మసురేశ్వర చూచినఁ గాని తీరునే. 484

వ. మఱియు రాక్షసవరిష్ఠుం డగువిభీషణుండు నీతమ్ముండు రామహితార్థియై లంకారాజ్యాభిషేకసలిలక్లిన్నమస్తకుం డై విజృంభించి యున్నవాఁ డిత్తెఱంగునం గూడుకొనివానరబలంబును వేలాచలంబునవిడిసియున్నదినాచేతసర్వంబుసమాఖ్యాతం బయ్యెఁ గదా యింక శేషకార్యంబునందు నీవేప్రమాణంబని పలికిన సద్దశాననుం డక్షోభ్యవానరవాహినీసమేతంబుగా రాముండును వేలాచలంబు

నందు విడిసి యున్నవాఁ డనెడుచారులవాక్యంబు విని యొక్కింత జాతోద్వే
గుం డై చుట్లనున్నసచివుల నవలోకించి యిట్లనియె. 485

చ. మన కిది మంత్రకాల మిఁక మంత్రుల నందఱఁ దోడితెం డిమీ
రనిన మహాప్రసాద మని యప్పుడె దోడ్కొని వచ్చిన న్దశా
ననుఁ డటు వారిఁ గూడి కదనస్పృహ మంత్ర మొనర్చి కార్యముం
మనమున నిశ్చయించి యలమంత్రుల నిండ్లకుఁ బంచి చెచ్చెరన్. 486

క. తననగరి కరిగి యాప్తుని, ఘనమాయావిదునిఁ గార్యఘటనాచతురుం
దనుజుని విద్యుజ్జిహ్వుం, జనువానిం బిలువ నంపి యాతని కనియెన్. 487

మ. క్షితిపుత్రిం గడుమాయచే మనకు వంచింపం దగు న్నేఁడు నీ
వతిమాయామయ మైనరాముశిరము న్నాస్త్రస్ఫురచ్చాపముం
జతురత్వం బలరారఁ గైకొని రహి న్నావెంట ర మ్మేను బ్రో
ద్ధతిత్రో మున్నుగ నవ్వెలందికడ కందం బొప్పఁగా నేగెదన్. 488

క. నా విని నిశాచరుం డటు, గావించెద ననిన్ బం క్తికంఠుఁడు మోదం
బావిర్భవింప వానికిఁ, గావలె నని యొసఁగె నొక్కఘనభూషణమున్. 489

వ. ఇట్లు విద్యుజ్జిహ్వుని మణిభూషణప్రదానంబునఁ బ్రీతచేతస్కునిం జేసి సీతా
దర్శనలాలసుం డై మహాబలుం డగురాక్షసవల్లభుండు ప్రమదావనంబునకుం
జని యందు. 490

ఉ. కన్నుల శోకబాష్పములు గాఱఁగ నేడ్చుచు రాక్షసాంగనల్
ద న్నదలించుమాటలకుఁ దద్దయుఁ గుందుచు రామభద్రునిం
బన్నుగ నాత్మలో నెపుడుఁ బ్రార్థన సేయుచుఁ జాల ఖిన్న యై
యున్నమహీసుతం గనియె నుగ్రుఁడు రాక్షసనాథుఁ డత్తఱిన్. 491

వ. మఱియు నధోముఖ యై మహీతలంబున నుపవిష్ట యై యున్నజానకి నవలోకించి
సముచితప్రకారంబున నుపసర్పించి కపటహర్షం బెఱుకపడ దుష్టవాక్యంబున
ని ట్లనియె. 492

ఉ. ఇంతకు మున్ను నన్ను వరియించి సుఖంపుము సీత యంచు నే
నెంతయు వేడిన న్వినక యెవ్వని పై ననురక్తిఁ జేర్చి న
న్నింత తిరస్కరించి కడుహీనునిఁ జేసితి వట్టినీవిభుం
డంతము నొందె నీవె మగువా యిటు గేహిని వైతివే కదా. 493

చ. మునుమిడి నీదుదర్పమును మూలము సర్వము ఛిన్న మయ్యెఁ బో
యినపతితోడి దేమి పని యీవ్యసనంబున నేమి వచ్చు నీ
మనమునఁ గల్గుమాధ్య మిఁక మాని ననుం దమితో భజించి నా
వనితల కెల్ల నేటి వయి వైభవ మొప్పు సుఖంపు మంగనా. 494

క. చండక్రోధన మూఢా, పండితమానిని నిరస్తభాగ్యా నీనా
థుం డీల్గె మత్కృతంబున, భండనమున వజ్రిచేత బలుఁడుం బోలెన్. 495

-:o:- రావణుఁడు సీతతో రాముండు హతుం డయ్యె నని చెప్పుట. -:o:-

వ. అత్తెఱం గెట్లనిన వినుము. 496

సీ. వనజాక్షి నీభర్త నను రణంబునఁ జంపి వడి నిన్నుఁ గొనిపోవువాంఛఁ జేసి
వానరేంద్రప్రణీతానంతకపిబలపరివృతుం డై నదీపతిఁ దరించి
రవి గ్రుంకునప్పు డర్ణవయామ్యతటగతం బైనసువేలాద్రియందు విడిసి
బడలి పథిశ్రమ పాయుట కచ్చోట నంచితభంగి నిద్రించి యుండ

తే. నే నతనిరాక విని కడుహితులఁ జరులఁ
బనిచి రామునిచందంబు బలవిధంబు
సర్వము నెఱింగి నడురాత్రిసమయమందుఁ
దద్వధోపాయ మాత్మలోఁ దలఁచి చూచి. 497

వ. మహాబలుం డగుమత్సేనాపతిఁ బ్రహస్తుని బలాన్వితుం జేసి రామలక్ష్మణసహితంబుగా వానరుల వధించి రమ్మని యనిచిన నతండు మత్ప్రచోదితుం డై నిశాసమయంబున సుఖసుప్తం బైనవానరబలంబు సొచ్చి కాలాయసమయంబు లైనపరిఘపట్టిసప్రాసఖడ్గదండయష్టిశూలకూటముద్గరశక్తితోమరచక్రముసలశరభిండివాలంబులు బ్రయోగించి యులూకంబులు వాయసంబులుంబోలె వానరుల వధించి ప్లవగాధిపుం డగుసుగ్రీవుని భగ్నగ్రీవునిం జేసి చంపి హనుమంతుని నిరస్తహనునిం జేసి వధించి కుఠారంబుచేతఁ బాదపంబుంబోలె జాంబవంతుని జానుకూర్పరముష్టిఘాతంబులఁ బుడమిం ద్రెళ్లవైచి వానరశ్రేష్ఠు లగుమైందద్వివిదుల నిద్దఱ రుధిరసముక్షితాంగులం జేసి పంచత్వంబు నొందించె మఱియు రాక్షసప్రయుక్తమహాసిపరిచ్ఛిన్నకంఠుం డై పనసుండు పనసతరువుపోలిక మేదినిం బడియె బహునారాచసంఛిన్నుం డై వలీముఖుండు దరీముఖంబునం బడియె సాయకాభిహతుం డై కుముదుండు కుముదంబుపగిది నేలం గూలె దానవఖడ్గధారాహతుం డై శరభుండు శరభంబుచాడ్పునఁ గెడసె నొక్కింతసేపు రాక్షసులతోడం బెనంగి యలసి తదీయశరజాలహతుం డై మేనం గ్రొత్త నెత్తురు గ్రమ్ముదేఱ నంగదుండు క్షితిపతితాంగుం డై మడిసె గజరథతురగపదాతులచేతఁ బ్రమథితశరీరు లై కొందఱు వాయువేగహతంబు లైనమేఘంబులమాడ్కిఁ గొందఱు సింహాభిన్నంబు లైనగజంబులభంగిఁ గొందఱు వ్యాఘ్రోపద్రుతంబు లైనలేళ్లకరణి భయవిత్రస్తు లై పఱచి కొందఱు సముద్రంబునం బడిరి కొందఱు గగనంబునకు దాఁటిరి కొందఱు వృక్షంబు లెక్కిరి కొందఱు సాగరానూపగిరివనంబుల డాఁగిరి కొందఱు భయంబునం బరువెత్తం గాళ్లు రాక చిక్కి మడిసిరి విభీషణుండు బద్ధుం డయ్యె లక్ష్మణుండు కతిపయవానరులం గూడి పలాయితుం డయ్యె నప్పుడు ప్రమాథి యగుప్రహస్తుండు. 498

ఆ. నునిశితాసిచేత సుఖసుప్తుఁ డగునీదు, విభునిశిరముఁ ద్రుంచి వెస వధించె
రక్తసిక్త మైనరామునిశీర్షంబుఁ, జూడు మిదిగోఁ దెచ్చి చూపువాఁడ. 499

క. అని పలికి రాక్షసేంద్రుఁడు, జనకజ వినుచుండ నొక్కసమునిశాటిం
గనుఁగొని యిట్లని పలికెను, ఘనాఘననినాదసదృశకంఠధ్వనితోన్. 500

క. దురమున నుండి రఘూత్తము, శిర మెవ్వాఁడు గొని తెచ్చెఁ జెచ్చెర వానిన్
సురరిపు విద్యుజ్జిహ్వుని, గురువిక్రమశాలిఁ దోడుకొని రమ్మిటకున్. 501

క. అని పలుక నపుడు మాయా, ఘనకల్పితరామశిరముఁ గాండాసనము
న్గొని విద్యుజ్జిహ్వుఁడు వెసఁ, జనుదెంచి నమస్కరించి సరగున నిలిచెన్. 502

క. వచ్చినవిద్యుజ్జిహ్వునిఁ, జెచ్చెర వీక్షించి దనుజశేఖరుఁడు ముదం
బచ్చుపడఁ గపటగర్వము, హెచ్చఁగ ఘననినద మెసఁగ నిట్లని పలికెన్. 503

ఉ. రాక్షసవీర రామునిశిరంబు మహీసుతమ్రోలఁ బెట్టు మ
బ్జేక్షణ దీనిఁ జూచి హృదయేశుఁడు పంచత నొందు టెల్లఁ బ్ర
త్యక్షముగా నెఱింగి చెలువారఁగ నన్ను వరించు నన్న నా
రాక్షసుఁ డట్లు చేసి సుకరంబుగ నేగె స్వవేశ్మవాటికిన్. 504

ఉ. అంత దశాస్యుఁ డాధనువు నల్లన నెత్తి మహీజఁ జూచి నీ
కాంతునిసాయకాసనము గంటె ప్రసుప్తుని మర్త్యుఁ జంపి వై
ర్యంతకుఁ డాప్రహస్తుఁడు రయం బలరం గొని తెచ్చె దీని నీ
వింతయు నమ్మి నన్ను వరియింపు మిఁకం జల మూఁగ నేఁటికిన్. 505

రావణుఁడు మాయాకల్పితరామశిరంబును సీతముందటం బెట్టుట.

వ. అని పలికి రావణుండు గ్రమ్మఱ నమ్మాయాకల్పితశిరంబును మౌర్వీసమన్వితం
బైనచాపంబును సీతముందటం బెట్టిన నద్దేవి తచ్ఛిరశ్శరాసనంబు లవలోకించి
ముఖవర్ణంబును నేత్రంబులును కేశంబులును లలాటంబును శుభంబగుచూడా
రత్నంబును విలోకించి సర్వాభిజ్ఞానంబులచేత నిక్కంబని తలంచి కురరిచందం
బున దుఃఖించుచు నినకులనందనుం డగు రాముండు హతుండయ్యెఁగలహశీలిని
వగునీచేతఁ గులం బంతయు సముత్సాదితం బయ్యె నింకఁ గైకేయీకృతకృ
త్యవు గమ్మని పలుకుచు మహాత్ముం డగు రామునిచేతఁ గైకేయి కేమి విప్రియం
బనుష్ఠింపం బడియె నిష్కారణంబుగా మునివేషంబున నరణ్యంబునకుం బనిచి
యింతఁ జేసె నని నిందించుచు వేపమానాంగియై వాతాహత యైనకదళీచం
దంబున ధరణిపయిం బడి యొక్కింతసేపునకుఁ గ్రమ్మఱఁ దెలివినొంది తచ్ఛిరం
బాఘ్రాణించి యిట్లని విలపించె. 506

సీత మాయాకల్పితరామశిరస్సును జూచి దుఃఖించుట.

మ. అతులోదారగుణాకరా రఘువరా హా రామ సత్యవ్రతా
హితముం గానక యొంటి నన్విడిచి నీ విట్లేగితే నీ కను
వ్రత నై యెప్పుడు నే నకారణముగా వంచించి నీచే సమా
హత నై తిం బతిహీన యై బ్రతుకు టన్యాయ్యంబె గా సాధ్వికిన్ 507

క. పతి మృతిఁ బొందిన పిమ్మట, బ్రతుకంగా రాదు పతికి బ్రతికినచోఁ ద
త్సతికంటె మరణ మొందిన, పతియె సుఖాత్ముండు సాధ్వి బ్రతు కధమమగున్.

ఆ. అధిప నన్నుఁ గాన నరుదెంచి నాకొఱ, కసురవిభునిచేత హతుఁడ వైతి
సాంద్రదుఃఖశోక సంతప్త నైననా, కింతకంటె మరణ మింపు గాదె. 508

క. మొదటఁ బతిమరణ మింతికి, హృదయేశ్వర దుశ్చరిత్ర హేతుక మని చె
ప్పుదు రుపచారము లేకయె, యదయత నీ వెట్లు మృతుఁడవైతివొ యిచటన్.

తే. అధిప నీ విట్లు నిహతుండ వగుచు నుండ
జాతవాత్సల్య యైనకౌసల్యసుతుఁడ
వైననీచేత హతవత్స యైనమొదవు
వడువున విత్సగాఁ జేయఁ బడియె నేఁడు. 510

తే. అరయ నెవ్వారిచేత దీర్ఘాయు వమిత
తేజ మది నీకు మును సమాదిష్ట మయ్యె
నట్టిదైవచింతకులవా క్కనృత మయ్యె
నధిప స్వల్పాయు వైతివే యకట నేఁడు. 511

మ. క్షితిలో దుర్వ్యసనంబుల న్వెసఁ దొలంగింప న్సమర్థుండ వై
సతతంబు న్విజితారి వై వినయశాస్త్రజ్ఞుండ వై నిశ్చల
వ్రతనిష్ఠాఖని వై వెలుంగుసుగుణవ్రాతాబ్ధికి న్నీకు దు
ష్కృతికిం బోలె నకాలమృత్యు వెటు గల్గె న్నేఁడు ప్రాణేశ్వరా. 512

వ. దేవా భూతంబులకుఁ బ్రభవం బైనయీకాలం బకాలంబున నిన్ను మృతుం
గావించె నక్కారణంబున ద్వద్విషయంబునందు భవిష్యదర్థజ్ఞానవంతు లగు
దైవచింతకులప్రజ్ఞ నశించెఁ గావలయు నీవు వ్యసనంబులఁ దొలంగంద్రోయుట
యందు మిక్కిలి కుశలుండ వట్టియుపాయజ్ఞుండవు నయశాస్త్రవిశారదుండ
వైననీ వచింతితం బైనమృత్యువు నెట్టులొందితివి నున్నిమి త్తంబున నతినృశం
సయు రౌద్రయు నైనకాళరాత్రిచేతఁ బరిష్వజింపం బడి యిట్లుబలాత్కారం
బునఁ బరిహృతుండ వైతివె యని పలికి వెండియు నిట్లనియె. 513

తే. అనఘచరిత తపస్విని నైననన్ను,విడిచి మిక్కిలి ప్రియ యైనవెలఁదినట్లు
గహ్వరిని బాహుయుగమునఁ గౌఁగిలించి, గాఢసుప్తి వహించితె కాంత నేఁడు.

క. అకటా యీకాంచనకా, ర్ముకమును సతతంబు గంధపుష్పంబులచే
నకలుషమతిఁ బూజింపుదు, వికలత్వము నొందె నేఁడు విధిబలహతమై. 515

వ. మహాత్మా సర్వపితృసహితుం డై యున్నతండ్రి యగుదశరథునితోఁ గూడ
స్వర్గంబునకుఁ జని యందు నక్షత్రభూతుండవై విమానంబుననుండి పుణ్యకర్ము
లగువారలకుఁ గాంక్షణీయంబును బుణ్యంబు నగునిక్ష్వాకువంశంబును విలో
కించు చున్నవాఁడవే యని పలికి వెండియు నిట్లనియె. 516

ఆ. అనఘచరిత బాల్యమాదిగ సహచరి, నై వ్రతానుకూల నై సుభక్తి
నిన్నుఁ గూడి యున్న నన్ను విలోకించి, పలుక వేమి తప్పు గలిగె నాకు. 517

ఉ. కూరిమితో ననారతముఁ గోరి భజించుచుఁ గూడి యున్నన
న్నీరస నొంటి డించి దివి కేఁగఁగఁ జెల్లునె వహ్నిమ్రోల నీ
వారయ మద్వివాహసమయంబున నాడినమాట తప్పకు
ర్వీరమణాగ్రగణ్య నను వేగమ దోడ్కొని పొమ్ము నచ్చెదన్. 518

తే. అధిప నాచేఁ బరిష్వక్త మైననీదు, గాత్రము సమస్తలోకమంగళకరంబు
నేఁడు క్రవ్యాదములచేతనిక్కువముగఁ, బ్రధనతలమున భక్షింపఁబడియెఁ గట.

ఆ. ఆప్తదక్షిణంబులగుపౌండరీకాది, రాజసముచితాధ్వరములు నీవు
సల్పి పిదప వహ్నిసంస్కార మొంద కీ,కరణిఁ జనితి వేలఘనగుణాఢ్య. 520

క. వనమునకు ముప్వురము మును, చనుదెంచితి మిప్పు డొంటి సౌమిత్రి చనం
గనుఁగొని కౌసల్య మనం,బున సందేహంబు శోకముం గదురంగన్. 521

ఆ. అతని నడిగి రాత్రి దితిజులచే నీవు, హతుఁడ వగుట దానవాలయమున
నేను రుద్ధ నగుట యెఱిఁగి శోకంబునఁ, గువలయాక్షి గుండె గ్రుళ్లి చచ్చు.

క. పాతకి నగునాకొఱకై, పాతకహరణుండు రామభద్రుఁడు జలధిన్
ఖ్యాతిగఁ దరించి సమర, ఖ్యాతబలుఁడు గోష్పదమున హతుఁ డయ్యెఁగదా.

తే. కులముఁ జెఱుపంగఁ బుట్టినక్రూరచిత్త
నేను బుణ్యాత్మునకు రాఘవేశ్వరునకుఁ
బత్నిగా నమ్మహాత్మునిప్రాణము గొన
జగతిఁ బుట్టినమృత్యువ నగుట నిజము. 524

క. ఏ నెట్టిదుష్కృతంబులు, పూనిక నజ్ఞానబుద్ధి మును చేసితినో
దానవులచేతిలోఁ బడి, హానాథ భవద్విహీన నై మన వలసెన్. 525

వ. మహాత్మా యేను సర్వాతిథిపూజకుండ వైననీకుఁ బత్ని నయ్యు నిప్పు డిట్టిదుఃఖంబు నొందుటవలన నాచేతం బూర్వభవంబునందుఁ గన్యాదానంబు విదారితం బయ్యె నని యూహించెద నని వగచి రావణు నుద్దేశించి యిట్లనియె.

## సీత రావణునిఁ దనశిరంబునుం దెగవేయుమని ప్రార్థించుట.

క. రావణ పత్యనుగమనము, భావింపఁగ సతికి బరమపదసాధన మౌఁ
గావున నాతల దెగగొని,నావిభుతోఁ గూర్చి మనుపు నన్ను రయమునన్. 527

వ. అని యత్తెఱంగున నమ్మహీనందని రాక్షసమాయాకల్పితరామశిరశ్శరాసనంబులు విలోకించి నిక్కంబనుబుద్ధిం జేసి దుఃఖసంతప్తయై బహుప్రకారంబుల విలపించుచుండ నప్పు డొక్కద్వారరక్షిరాక్షసుం డద్దశగ్రీవునికడకుం జని సముచితంబుగా సందర్శించి కృతాంజలిపుటుం డై యార్యపుత్రా విజయి వగు మని యభివాదనంబు చేసి ప్రసాదంబు వడసి దేవా వాహినీపతి యగుప్రహ

స్తుండు సర్వామాత్యసహితుండై దర్శనార్థియై సముపస్థితుం డయ్యె దర్శనకా
ముండై నయతనిచేతం బ్రేషితుండ నై చనుదెంచినవాఁడ రాజభావంబువలన
భవదాజ్ఞాప్రతీక్షణాన్వితంబును బ్రయాససాధ్యంబు నగునొక్కింతకార్యంబు
గలదు గావునఁ బ్రహస్తాదులకు దర్శనం బొసంగ వలయు నని పలికిన నద్దశాన
నుం డశోకవనంబు విడిచి సత్వరంబుగ మంత్రులకు దర్శనం బొసంగువాఁడై
యరిగి సభాస్థానంబున నాసీనుం డై రామవిక్రమం బెఱింగి మంత్రులతోడం
గూడి సర్వంబును బర్యాలోచనంబు సేయుచుండె రావణుండు చనినతత్క్షణంబ
తన్మాయాకల్పితం బైనతచ్ఛిరంబును గార్ముకంబు నంతర్ధానంబు నొందె నంత
రావణుండు మంత్రులతోడ నొక్కింతసేపు మంత్రంబుగావించి కార్యంబు నిశ్చ
యించి యప్రమాదులై కార్యసాధనంబునందు సమర్థులు గం డని మంత్రు
లకుం జెప్పి సమీపవర్తు లైనహితకాములగువారి బలాధ్యక్షులం జూచి
స్ఫుటకోణవాదనదండహతం బైనభేరీనాదంబున సర్వసైన్యంబుల శీఘ్రంబున
రావింపుఁడు కర్తవ్యకార్యంబులు గావింపుఁడు స్వచ్ఛిద్రంబు లితరు లెఱుఁగ
కుండ రక్షింపుఁ డని నియమించిన వారలట్లు సేయుదు మని తమతమబలంబులం
గూర్చి యుద్ధసన్నద్ధులం జేసి తత్ప్రకారంబు సర్వంబును రావణున కెఱిం
గించి రక్కడ నశోకవనంబున రామమోహితయై దుఃఖించుచు నష్టచేతన యై
మహీతలంబునం బడి పొరలుచు నుపావృత్త యైనబడబచందంబునఁ బాంసు
పరిచ్ఛిన్నసర్వాంగియై లేచి బహుప్రకారంబుల విలపించు చున్నప్రాణప్రణ
యిని యగుజానకి నవలోకించి రావణునిపనుపున నద్దేవిని రక్షించుచున్నదగు
టం జేసి తనచేత రక్ష్యమాణ యైనసీతతోడ సఖ్యంబు వాటించి సానుక్రోశయై
దృఢవ్రతయై యున్నవిభీషణుభార్య సరమ యనునది రయంబున సీత డాయం
జని మృదుమధురవాక్యంబుల నాశ్వాసించి సఖీస్నేహంబున నిట్లనియె. 528

చ. నెలఁత వివేకయుక్త వగునీ కిటు శోకము నొందఁ జెల్లునే
ఖలుఁ డగురావణుండు నినుఁ గాఱియ పెట్టఁ దలంచి వచ్చుట
ల్పలుమఱుఁ గ్రూరవాక్యములు వల్కుట నీ వవి సిక్క మంచుఁ జిం
తిలుచుఁ బరిభ్రమించుటయుఁ దెల్లముగా సకలం బెఱుంగుదున్. 529

సరమ సీతకు రాక్షసమాయలం దెలిపి ధైర్యంబుఁ జెప్పుట.

తే. కువలయేక్షణ నీమీఁదికూర్మిఁ జేసి
ప్రాణ మైన నామదికిఁ బ్రియం బొనర్ప
దనురనాథునివలనిభయంబు విడిచి
నీకు హిత మాచరించెద నెయ్య మలర. 530

తే. రాక్షసకులాధిపుం డైనరావణుండు
యత్కృతమునందు నిష్క్రాంతుఁ డయ్యె నిపుడు

దాని సర్వంబు నెఱుఁగుదు దనుజమాయ
నెఱిఁగి యుండినకతమున నిందువదన.
తే. మఱచి నిద్రించి యుండ నీమగనిఁ జంపె
నల్ప్రహస్తుఁ డటంచు వాఁ డన్నమాట
నిక్కమని నమ్మితే రాజనీతివిదుని
రాముని వధింపఁగా రాదు రాక్షసునకు.
తే. వజ్రిచే నిర్జరులుఁ బోలె వనజనేత్ర
రామభద్రునిచేత సురక్షితు లగు
వృక్షయోధులు కపు లభివృద్ధి నొంది
యుందు రసురులు వారి నెట్లోర్వఁ గలరు. 533

వ. అని పలికి యాజానుబాహుత్వాదిరాజలక్షణధార్మికత్వపౌరుషనయజ్ఞత్వం
బులు విచారించి చూచిన రామునకు వధ్యత్వం బెందును లే దనుతాత్పర్యంబు
తేటపఱచుతలంపున వెండియు నిట్లనియె. 534

సీ. దివ్యమంగళమూర్తి దీర్ఘవృత్తభుజుండు ధానుష్కుఁ డధికప్రతాపవంతుఁ
డధికవిశ్రుతుఁడు ధర్మాత్ముఁడు శూరుండు సింహసంహననుఁ డచింత్యవీర్య
బలపౌరుషుండునిశ్చలుఁడు విక్రాంతుఁడు రాదిసింహుఁడుమహోరస్కుఁడాఢ్యుఁ
డరిబలౌఘములకు హంత శ్రీమంతుండు నయశాస్త్రవిదుఁడు తనకుఁ బరులకు
తే. సంతతంబును రక్షితశౌర్యధనుఁడు, రాఘవుండు సువేలధరంబునందు
లక్ష్మణసమన్వితంబుగా లలిసెలంగ, సన్నుతాంగిరో కుశలియై యున్నవాఁడు.

ఉ. రాముని సర్వశాత్రవవిరాముని సుందరనీలనీరద
శ్యాముని జంప నన్యులకు శక్యమె భూతవిరోధి సంతతా
క్షేమకరుం డయుక్తమతికృత్యుఁడు మాయికుఁడైనరావణుం
డీమెయి మాయఁ బన్నె వినుమింతియె గాక నిజంబె మానినీ. 536

క. శోకము పరిత్యజింపుము, నీకుం గళ్యాణ మొదవు నిజముగ నీకన
స్తోకగతి లక్ష్మి నిన్నుం, జేకొని భజియించు నమ్మి సేయుము ప్రీతిన్. 537

చ. జలనిధి దాఁటి రాఘవుఁడు సర్వవనాటచమూసమేతుఁడై
యలఘుపరాక్రముం డగునిజానుజుఁ డెంతయుఁ బ్రీతిఁ గొల్వ ని
స్తులమహిమాతిరేకమునఁ దోయధిదక్షిణతీరజాద్రిపైఁ
దలకొని యున్నవాఁడు వసుధాతనయా కనుఁగొంటి నింతయున్. 538

సరమ సీతకు రాక్షసయుద్ధసన్నాహము నభివర్ణించి చెప్పుట.

వ. మఱియు నిప్పుడు రావణునిచేతఁ బ్రేషితులై లఘువిక్రము లగురాక్షసు లరిగి
వచ్చి రాముండు పయోనిధి నుత్తరించి సైన్యసమేతంబుగా సువేలాచలంబున
విడిసి యున్నవాఁడని యెఱింగించిన విని యద్దశవదనుండు సమస్తసచివసమన్వి

తుం డై మంత్రంబు గావించు చున్నవాఁ డనిపలికి సరమ సీతతోడం దగినచం
దంబున సల్లాపంబుఁ జేయుచుండ నప్పుడు సర్వోద్యోగసమారంభు లగురాక్ష
సులకోలాహలశబ్దంబు భైరవంబుగా నేతెంచెఁ బదంపడి దండనిర్ఘాతవాదిని
యగుమహాభేరినిస్వనంబు మిన్నుముట్టి వినవచ్చె నమ్మహానాదంబు విని వెండియు
మధురభాషిణి యగుసరమ సీత నవలోకించి యిట్లనియె. 539

చ. జలదము లభ్రమార్గమునఁ జక్కఁగఁ బర్వి చెలంగుకై వడిం
గులగిరులట్లు గ్రాలుఘనకుంజరము ల్రథముల్ హయంబు ల
త్యలఘుభటు ల్రణంబునకు నాయితమై పురిరాజవీథులన్
దళముగఁ బర్వి సంభ్రమమునం జెలువారుచు నున్నవా రొగిన్. 540

క. ఘనరవము లెసఁగఁ బఱచెదు, ననుపమరథవాజిసామజారోహులచేఁ
గనుము పుర మొప్పు చున్నది, వనితా సలిలములచేత వననిధిపోలెన్. 541

క. భేరీశంఖాదికనా, నారవములు కాలమేఘనాదములు మహా
వారిధినాదము మ్రింగుచు, నూరం బెల్లెగసి మ్రోయు చున్నవి వింటే. 542

చ. పరుషశితాస్త్రశస్త్రపటుబాణకృపాణనిషంగచర్మవ
ర్మరుచులు హేమభూషితతురంగశతాంగమతంగజద్యుతుల్
కర మురుఘర్మకాలమునఁ గాఱడవి న్వడి నేర్చువహ్నిని
ష్ఠురతరహేతులట్లు పురి శోభిలు చున్నవి కంటె జానకీ. 543

ఉ. తెంపునఁ బోరొనర్చుతమి తెల్లమి సేయుచు నంత నంతటన్
గుంపులు గట్టియున్నపటుఘోరనిశాటులు గొప్పమేనులన్
సొంపుగఁ దాల్చి యున్నమణిశోభితభూషణచాకచక్యముల్
చంపకగంధి చూచితివె కెంపలకై వడి వీటఁ దోఁచెడిన్. 544

క. సారసలోచన వింటివె, దారుణరణభేరిమ్రోఁత దండోత్థిత మై
భూరిఘననిస్వనముక్రియ, బోరుకలఁగు చున్న దిపుడు పురి నెల్లెడలన్. 545

చ. గురుతరకింకిణీకరథఘోషణము ల్గజబృంహితధ్వనుల్
హరిహయతుల్యవేగతురగారవము ల్సమదాహ్వదారుణా
సురభయదార్భటు ల్పటులసుందరతూర్యమహానినాదము
ల్పురి నలుదిక్కులన్ బెరసి మ్రోయుచు నున్నవి కంటె మానినీ. 546

తే. ఉద్యతాయుధహస్తులై యొప్పునట్టి, దానవేంద్రానుచరు లగుదనుజవరుల
సమ్మదోద్భూతరోమహర్షణరవ మిదె, తుములమై వీచుచున్నది తోయజాక్షి.

చ. అలికులవేణి నిక్కము నిశాటులకు న్భయ మావహిల్లు సొం
పలరఁగ ని న్భజించుఁ గమలాలయ రాముఁడు వచ్చి వజ్రియ
ట్లలుక సమస్తరాక్షసుల నాజిపదంబునఁ ద్రుంచి రావణుం
దులువను బట్టి చంపి నినుఁ దోడ్కొని పోవు జయాభిరాముఁడై. 548

తే. కువలయేక్షణ హరితోడఁ గూడినట్టి
హరిహయునిభంగి రాఘవుం డనుజసహితుఁ
డై రయంబున రణములో వైరిమీఁద
విక్రమింపంగఁ గలఁ డీఁక వెఱవ వలదు. 549

తే. అసురనాథుండు వినిహతుం డగుచునుండ
గ్రక్కున సమాగతుం డైనరామవిభుని
యంకమందు సుఖాసీన వైననిన్ను
నతని సిద్ధార్థ నీక్షించి సంతసింతు. 550

క. విజితారి యైననీపతి, నజితుని వెనఁ గౌఁగిలించి యతనియురమునన్
గజరాజగమన ముదమున, నిజముగ నానందజలము నించెద వింకన్. 551

తే. ముదిత బహుమాసముల నుండి ముడిచియున్న
జఘనగత మైనభవదీయచారువేణి
విడిచి నీవల్లభుండు చిక్కుడలఁ జేసి
కొప్పు దీర్చెడుకాలంబు గూడ వచ్చె 552

తే. అమితబలుఁ డైనరామునియాననంబు, సముదితుం డైనపూర్ణిమాచంద్రునట్లు
వేగ వీక్షించి శోకంబు విడిచె దీవు, భుజగి నిర్మోకమును బోలెఁ బుణ్యసాధ్వి.

క. అనిలోన రాక్షసేంద్రుని, ఘనశరమునఁ ద్రుంచి శీఘ్రకాలంబున రా
మనరేశ్వరుండు ప్రియ వగు, నినుఁ గూడి సుఖించు నింత నిజము ప్రియార్హా.

వ. దేవి మహాత్ముం డగురామునితోడం గూడి హర్షపులకాంకురంబు లెసఁగ సువృష్టిసమాయుక్త యైనమేదిని సస్యంబుచేతంబోలె నానందించెద విప్పుడు దివాకరుండును మేరుగిరివనంబునందు సమంతతఃపరివర్తమానుండై జాత్యశ్వంబుపగిది మండలంబు సేయుచున్నవాఁ డమ్మహాత్ముండు భూతంబులకుఁ బ్రభవంబు గావున నతనిశరణంబు వేఁడుమని యివ్విధంబున వల్గుభాషిణియగుసరమ దివంబు సలిలంబుచేతఁ బృథివింబోలె మృదుమధురాలాపంబుల రావణవాక్యమోహితయైనజానకిని బరమానందయుక్తం జేసి యద్దేవికి హితం బాచరించుతలంపు గలది గావున మందహాససుందరవరనారవింద యై వెండియు సీత నవలోకించి తల్లీ యేను బ్రచ్ఛన్నవేషంబున రామునియొద్దకు జని భవత్కుశలంబు దెల్పి యమ్మహాత్మునికుశలం బెఱింగి వచ్చెద నిరాలంబం బగుగగనంబున గరుడానిలతుల్యవేగంబునం జనునప్పుడు నన్ను విలోకింప నెవ్వండును సమర్థుండు గాఁడని పలికిన నాసరమపలుకుల కలరి వైదేహి శ్లక్ష్ణవాక్యంబున నిట్లనియె. 555

సీత సరమతో రావణమంత్రనిశ్చయం బెఱింగి రమ్మని చెప్పుట.

క. గగనమున కేగఁ బన్నగ, జగమునకుం బోవ నీవు చతురవు నాపై
నెగడినకూరిమి పెంపున, దగువిధమున వెరవుఁ జెప్పఁ దగుదువు సకియా.

క. నాకుఁ బ్రియ మాచరింపఁగ, నీకుఁ బ్రియంబు గల దేని నేర్పున దనుజుం
డాకులతఁ జేయుమంత్రము, చేకొని నిజ మెఱిఁగి వచ్చి చెప్పుము నాకున్. 557

తే. అతఁడు మాయాబలుండు దుష్టాత్మకుండు
క్రూరుఁడు శఠుండు లోకవిరుద్ధధర్మ
వర్తనుం డర్థిఁ గ్రోలినవారుణిక్రియఁ
జెలఁగి సారెకు భ్రమియింపఁ జేయు నన్ను. 558

మ. ఒకమాటుద్ధతిఁ గాఱు లాడు నొకమాటుగ్రాకృతిం దోఁచు వే
ఱొకమాటల్లన మాయఁ బన్ను నొకమాటున్మాది యై చంపఁగా
సుకరాళాస్యల కానతిచ్చు వల దంచుం బల్కు వేఱొక్కమా
టకలంకాత్ముఁడు రాముఁ డిచ్చటికి రాఁ డంచు న్వచించుం దగన్. 559

ఉ. ఎప్పటి కేమి సేయునొ విశృంఖలవృత్తి దశాస్యుఁ డంచు నే
దెప్పర మైనశోకమున దీనతఁ జేష్పడి యున్నదాన నా
చెప్పెడి దేమి యింక ననుఁ జేకొని ప్రోచెద వేని యిప్పుడే
చెప్పు మెఱింగి వచ్చి యెడ సేయక వానిప్రయత్న మంతయున్. 560

చ. అన విని యానిశాటి జనకాత్మజభావ మెఱింగి తద్విలో
చనగళదశ్రుబిందువులు చయ్యన మీటుచుఁ బల్కె దల్లి నీ
పనిచినయట్లు రావణునిపాలికిఁ బోయి తదీయభావముం
దనుజులనిశ్చయం బెఱిఁగి తప్పక వచ్చెద నీకుఁ దెల్పఁగన్. 561

వ. అని పల్కి యాసరమ సీతచే ననుజ్ఞాతయై యరిగి మంత్రిబాంధవసమన్వితుండై విచారించుచున్నరావణునిసమీపంబునకుం జని దురాత్ముం డగువానినిశ్చయం బెఱింగి క్రమ్మఱ శీఘ్రంబున నశోకవనికిం జనుదెంచి తనరాక కెదురు చూచుచున్నజానకిని నిష్టపద్మ యగులక్ష్మింబోలె నవలోకించె నప్పు డద్దేవి పునస్సంప్రాప్త యైనప్రియసఖి నవలోకించి గాఢంబుగాఁ బరిరంభించి యొక్కస్నిగ్ధపీఠంబునం గూర్చుండ నియోగించి క్రూరచిత్తుం డగురావణునినిశ్చయం బంతయు నిక్కంబుగా నెఱింగింపు మనిన నమ్మహీనందని కది యి ట్లనియె. 562

సరమ సీతకు రావణమంత్రనిశ్చయం బెఱింగించుట.

సీ. అంబుజనేత్ర నే నచటికిఁ జనువేళ మమతతో జననియు మంత్రివృద్ధుఁ
డసురనాథునికడ కరుదెంచి ప్రీతితో జనపతి రాముని సత్కరించి
వైదేహి నొసఁగుమా వసుధేశ్వరుఁడు జనస్థానవాసులయందు సల్పినట్టి
ఘనతరవిక్రమకర్మంబె నీకు నిదర్శనం బది గాక తద్భటుండు

తే. జలధిలంఘించియొక్కండెసాహసమున, నుగ్రదైత్యులఁ బెక్కండ్ర నిగ్రహించె
నవని నిట్టియద్భుతకర్మ మాచరింప, మనుజమాత్రున కొకని కెవ్వనికిఁ జెల్లు. 563

క. అని యిట్టు లవిద్ధుండును, జననియు బోధింప వినక జడదైత్యుఁడు దా
నిను విడువ నోపఁ డయ్యెను, దనమనమున ధనపరుండు ధనమునుబోలెన్.

ఆ. భండనమున మనుజపాలుని శరములఁ, జంపు టొండె లేక చచ్చు టొండె
జనకపుత్త్రి నిత్తు ననుమాట పుట్టునె, యనుచు వారితోడ నాడె నతఁడు. 565

చ. కర మిది వానినిశ్చయము కయ్య మొనర్పఁగఁ బూని యున్నవాఁ
డెఱుఁగుదు మృత్యులోభమున నీమతి సుస్థిత మయ్యె వానికిం
దరుణిరో సర్వరాక్షసయుతంబుగ రామశరాభిసంహతి
ద్దురమునఁ జచ్చి కాని యమృతుం డయి నిన్విడఁ జాలఁ డెంతయున్. 566

ఉ. నీరజనేత్ర నీవిభుఁడు నిక్కముగా దశకంఠు నాజిలో
ఘోరశరంబులం దునిమి గొబ్బున నిన్గొనిపోవు నంచుఁ దా
నూఱడిలంగఁ బల్కె నపు డుర్వి చలింపఁగ మ్రోసె భేరికా
దారుణనిస్వనం బవలఁ దట్టుచు వానరసింహనాదముల్. 567

క. ఆనాదము విని యట లం, కానాయకభృత్యులైనకర్బురు లెల్ల
ద్దీను లయి నష్టచేతను, లై నివ్వెఱ మునిఁగి యుండి రప్పురిలోనన్. 568

వ. ఇవ్విధంబున మహానుభావుండును బుణ్యాత్ముండును బరపురంజయుండును బురుషశార్దూలుండును నగురాముండు భీషణవానరకోలాహలశంఖారావవిమిశ్రిత భేరీనిర్ఘోషణపూర్వకంబుగా సమరసన్నద్ధుం డై యుండె నంత జగత్సంతాపనుండును గ్రూరుండును రాక్షసేశ్వరుండు నగురావణుం డమ్మహానాదంబు విని యొక్కింతసేపు ధ్యానంబు పూని పదంపడి భేరీభాంకరణపురస్కృతంబుగా సభామండపంబునకుం జనుదెంచి సచివుల నందఱ నవలోకించి మీచెప్పినట్లు రామునివిక్రమంబును బలసంచయంబును సముద్రతరణంబును సర్వంబు నాచేత నాకర్ణితం బయ్యె మీ రంద ఱాయోధనంబునందు సత్యపరాక్రములు మీచందం బంతయు నాయెఱింగినదియె కదా యిప్పుడు రామునివిక్రమంబు విని పరస్పరముఖావలోకనంబు చేయుచు నిట్లేల యూఁరకున్నవారని యడిగిన నప్పుడు మహాప్రాజ్ఞుండును మాతామహుండు నైనమాల్యవంతుం డనురాక్షసుండు రావణు నవలోకించి యి ట్లనియె. 569

మాల్యవంతుఁడు రావణునకు హిత ముపదేశించుట.

తే. అవని నెవ్వాఁడు రాజనయం బెఱింగి
విద్యలందు వినీతుఁ డై వెలయునట్టి
రాజు స్వవశీకృతారిసామ్రాజ్యుఁ డగుచు
నధిప బహుకాల మైశ్వర్య మనుభవించు. 570

క. కాలం బెఱింగి యరితో, నాలం బొనరించు నెవ్వఁ డతఁడు స్వజనులం
బాలించుచు నిల వర్ధిలు, వాలాయము భోగభాగ్యవైభవయుతుఁ డై. 571

చ. తనకు బలంబు లేనియెడఁ దప్పక వైరులతోడ సంధియుం
దనకు బలంబు గల్గునెడఁ దద్దయు నిగ్రహ మాచరించుచు
న్వినుతగతి న్స్వపక్షపరివృద్ధి యొనర్చెడునట్టిభూవరుం
డనుపమలీల నేలు విజితారియునై ధరఁ బెక్కువర్షముల్. 572

క. పగతుని యుపేక్ష సేయం, దగ దధికునితోడ సౌహృదంబు సమునితోఁ
దగ సంధి జఘన్యునితో, జగడం బొనరించి బ్రతుకఁ జను రాజునకున్. 573

చ. పరమమును ల్సుర ల్భువనపాలకు లెవ్వనికి న్హితైషులై
వఱలుదు రట్టిరామనృపవర్యునిపైఁ బెడబుద్ధి మాని సు
స్థిరముగ సంధిఁ జేసి వెస సీత నొసంగి నిశాటరాజ్యముం
గర మనురక్తి నేలు మటుగాక పెనంగినఁ గీడు గల్గెడిన్. 574

వ. అది యెట్లనిన వినుము తొల్లి భగవంతుఁడైనపితామహుండు సురాసురుల
సృజించి తదాశ్రయంబులుగా ధర్మాధర్మంబులు సృజించె ధర్మంబు మహాత్ము
లగు దేవతలపక్షం బనియు నధర్మం బసురు లగురాక్షసులపక్షం బనియును వినం
బడు ధర్మం బెప్పు డధర్మంబును హరించు నప్పుడు కృతయుగంబు ప్రవర్తిల్లు
నధర్మం బెప్పుడు ధర్మంబునుహరించు నప్పుడు కలియుగంబగు దిగ్విజయార్థంబు
లోకంబులం జరించునప్పుడు నీచేత ధర్మవృద్ధిహేతుభూతంబు లైనతపోయజ్ఞదా
నాదులు వినాశితంబు లయ్యెఁ బరహింసాపరదారపరద్రవ్యాపహరణాదికంబుచే
స్వపక్షభూతాధర్మంబు వివర్ధితం బయ్యెఁ గావున నక్కారణంబున శత్రువు లగు
రామాదులు మనకంటె బలవంతులై యున్నవారు నీచేతఁ బ్రమాదంబువలనఁ
బ్రవర్ధితం బైనయయ్యధర్మంబె మనల నాశంబు నొందించుసురభావనం బైన
ధర్మంబు సురల కభివృద్ధిఁ జేయుచున్నయది విషయలోలుండవై దేవర్షిప్రముఖ
కన్యాపత్నీహరణంబు గావించునట్టినీచేతఁ గాలాగ్నికల్పు లగుమహర్షులకుఁ బ్రదీ
ప్తపావకునిభంగి నతిదుస్సహం బైనమహాక్రోధం బుత్పాదితం బయ్యె వారల
ప్రభావంబు ప్రదీప్తవహ్నిచందంబున నతిదుస్సహం బై యున్నది తపస్సంభావి
తాత్ములును వైశ్వానరసూర్యకల్పులును నగునమ్మహర్షులు ధర్మాభివృద్ధికాములై రా
క్షసవినాశంబుకొఱకు వేదఘోషంబులు సేయుచు వీర్యవంతంబు లైనమంత్రం
బులచేత విధ్యుక్తప్రకారంబున నగ్నిష్టోమాదియాగంబులచేత నగ్నియందు హో
మంబులు సేయుచున్నవారు మఱియు నయ్యగ్నిహోత్రసముత్థితం బైనధూమంబు
దశదిశలు నిండి రాక్షసులతేజంబు నాశంబు నొందుచున్నయది కొందఱు
రాక్షసులు భయభ్రాంతులై యుష్ణకాలంబునందలి మేఘంబులభంగి నల్లడలం
బఱచుచున్నవారు మఱియు నయ్యైపుణ్యదేశంబులందు గృహవ్రతు లైన
యత్తపోధనులచేతఁ జర్యమాణం బైనతీవ్రతపంబు రాక్షసులకు సంతాపంబు
పుట్టించుచున్నది తొల్లి నీవు దేవదానవయక్షులవలన భయంబు గలుగకుండఁ బర
మేష్ఠివలన వరంబువడసితివి గాని మానుషాదులవలన భయంబు లేకుండ వడయ

వైతి విప్పుడు మహాబలు లగుఋక్షగోలాంగూలవరవానరులు రభసంబున
నిచ్చటికిం జనుదెంచి దృఢవిక్రము లై గర్జించుచున్నవా రదియునుంగాక. 575

తే. నాఁటినాఁటికి దఱుచుగా వీటఁ దోఁచు
బహువిధసమస్తదారుణోత్పాతములను
జూచి భయ మందు చున్నాఁడ సురవిమతుల
కేమి వాటిల్లునో యని నామనమున. 576

తే. అంబరంబునఁ బన్ని రక్తాంబుదములు, ప్రళయకాలంబునాఁటిగర్జలు చెలంగ
లంకపై రక్తవృష్టి భయంకరముగఁ, గురియుచున్నవి దైత్యులగుండె లవియ.

చ. విఱిగి పడం దొడంగె మనవీటధ్వజంబులు వాజిసంఘము
ల్కరులును శోకబాష్పములు కన్నుల నించుచు నేడ్వసాఁగె భీ
కరతరజంబుకంబులును గాకసరీసృపగృధ్రఘూకము
ల్పురమటు సొచ్చి రేపవలు మ్రోయుచు నున్నవి దారుణంబుగన్. 578

వ. మఱియుఁ బూతనాప్రముఖశక్తులు పాండురదంతోపలక్షిత లై యువతుల నుద్దే
శించి ప్రతికూలభాషణంబులు పలుకుచు గృహాగతద్రవ్యంబులపహరించి స్వప్నం
బులయందు ముంగల నిలిచి పరిహసించుచున్నవి శ్వానంబులు బలికర్మసాధన
ద్రవ్యంబు భుజించుచున్నవి గోవులయందు ఖరంబులు వొడముచున్నయవి
మూషకబిడాలసూకరకిన్నరరాక్షసులు క్రమంబున నకులశార్దూలశునకరాక్షస
మానవులం గూడి వర్తించుచున్నవా రదియునుం గాక. 579

తే. పాండుదేహంబులును రక్తపాదములును
గలుగువిహగంబు లొక్కటఁ గాలచోది
తంబు లై రాక్షసవినాశనంబుకొఱకు
సంచరించుచు నున్నవి సంభ్రమమున. 580

వ. మఱియు మధురభాషణార్థంబు పంజరంబుల నుంచి పెంచినశారికలు మధుర
భాషణంబులు పరిత్యజించి చీచి కూచి యని క్రూరంబుగా మ్రోయుచున్న
యవి మఱియును. 581

క. దనుజేంద్ర ఖగమృగంబులు, దినపతి కభిముఖము లగుచు దినదినమును రో
దన మొనరించుచు నున్నవి, మనవీటం జిచ్చు లేనిమంటలు పుట్టెన్. 582

వ. మఱియు వికటాంగుండును భయంకరుండును గృష్ణపింగళుండును ముండిత
శిరస్కుండు నై కాలుండు ప్రతికాలంబునందు రాక్షసులగృహంబులవలోకించు
చున్నయట్లు దోఁచుచున్నవాఁడు మఱియు ననేకదుర్నిమిత్తంబులు దోఁచు
చున్నవి గావున వీని నన్నిటిని విచారించి కర్తవ్యకార్యంబు లెఱింగి యుత్తర
కాలోచితం బైనదాని విచారింపు మని యిట్లు నికృష్టు లైనరాక్షసులయం
దుత్తముం డైనమాల్యవంతుండు సత్సభామధ్యంబునం బల్కి రావణునియాని
వర్తనం బెఱింగి యూరకున్న నప్పుడు నీతిశాస్త్రజ్ఞుండును వినయవిధేయుండు

నగునతికాయుండు సీతాపహరణదోషదూషితుం డైనదోషాచరవల్లభుంజూచి
నీతిభూషణభాషణంబున ని ట్లనియె. 583

—అతికాయుఁడు రావణునకు హిత ముపదేశించుట.—

సీ. అసురనాయక విను హరధనుర్దళనంబు పరశురాముని గర్వభంజనంబు
తాటకాహరణంబు తాటకేయవధంబు ఖరదూషణాదికఖండనంబు
మఱియు విరాధునిమరణంబును గబంధనిధనంబు వానరనేతచావు
వారిధిపై సేతుబంధంబు దానవభీకరలంకాప్రవేశనంబు
తే. నివి సమస్తంబు మనములో నెంచి చూడ
మనుజమాత్రున కయ్యెడిపనులు గావు
రాక్షసారాతి యగుహరి రాముఁ డగుచు
నిను వధింపంగ జనియించె నని తలంతు. 585

క. జనకజ కేవల మనుజాంగన యని వంచించి కన్నుగానక యిటకుం
గొని తెచ్చితి వమ్మానిని, మనపాలిటిమృత్యు వనుచు మదిని దలంతున్. 586

క. విరాగ్రేసరుఁ డగురఘు, వీరునితో నీతి మాలి వీఱిఁడి వై ని
ష్కారణముగ నీ వీక్రియ, వైరముఁ గొంటి విఁక మేలు వచ్చునె నీకున్. 587

క. పరసతులఁబొందు గోరుట, నరక మపయశంబు వంశనాశన మనుచుం
బరమనయజ్ఞుండవు సుస్థిరధర్ముఁడ వైన నీకుఁ జెప్పఁగ వలెనే. 588

క. దనుజేంద్ర సీత నిచటికిఁ, గొని తెచ్చిననాఁటనుండి ఘోరము లగుచున్
మనవీట దుర్నిమిత్తము, లనేకములు తోఁచు చున్న వద్భుతభంగిన్. 589

క. కావున జానకి నిప్పుడు, భూవల్లభునకు నొసంగి పొలుపుగఁ బురమున్
దేవారుల నైశ్వర్యము, వావిరి రక్షించుకొనుము వాసవవైరీ. 590

తే. రాముఁ డఖిలలోకైకశరణ్యుఁ డతని, శరణ మొందిన నపరాధశతము నైన
సైఁచి రక్షించు నతనికి జనకపుత్త్రి, నిచ్చి వేఁడుము విడువు మీమచ్చరంబు.

వ. అని యిట్లు బహుప్రకారంబుల న్యాయానుకూలంబుగాఁ బ్రబోధించిన నద్ద
శాననుండు కాలవశంగతుండై వారలపలుకుల నాదరింపక క్రోధపరివృత్తలోచ
నుం డై మాల్యవంతున కి ట్లనియె. 592

—రావణుఁడు మాల్యవంతుని దూఱుట.—

క. పరపక్షగతుఁడ వై నీ, వరయఁగ నతిహితునిభంగి నహితవచనముం
గఱపెద విది నాచిత్తము, సార దింత వివేక మెపుడు చొప్పడె నీకున్. 593

చ. జనకనిరస్తునిం గృపణుసత్త్వవిహీనుని వానరాశ్రయున్
మనుజుని రాము నొక్కని సమర్థునిఁగా వినుతించుచుం గరం
బనిమిషలోకకంటకుఁడ నై రజనీచరలోకభర్త నై
ఘనతఁ జెలంగున న్నొకజఘన్యునిఁగా వచియించె దేలకో. 594

క. వైరిప్రోత్సాహముననో, భారము మోచుటనొ పక్షపాతంబుననో
వీరద్వేషంబుననో, మీ రిపు డీట్లనుట శంకమీఱెడు మదిలోన్. 595

క. వినుము రిపుప్రోత్సాహన,మునఁ గాక సమస్తశాస్త్రపూర్ణుం డగువాఁ
డనుమానింపక రాజును, గని కని సభలోన నెట్లు గర్హించు భువిన్. 596

ఆ. కాననముననుండి జానకి నొక్కటఁ, బక్షిహీన మైనపక్ష నట్లు
మచ్చరించి యిటకుఁ దెచ్చితి నే నేల, వెఱచి రాఘవునకు మరల నిత్తు. 597

చ. హరిహయకాలముఖ్యదివిజాధిపు లెవ్వనిమీఁద విక్రమం
బరుదుగఁ జూపఁగా వెఱతు రట్టిదశాననుఁ డేల పోరిలో
వెఱచు ననేకకీశపరివేష్టితు నర్కసుతు న్సలక్ష్మణు
న్నరపతి నంబకంబుల రణంబునఁ ద్రుంపనె యొక్కరేఖిడిన్. 598

వ. మహాత్మా నన్నేల వెఱపించెదవు శిరోభంగం బైనఁగాని మ్మేను బగతునితోడ సంధిఁ గావింపం జాల. 599

క. ఇది నాకు సహజదోషము, తుది యెట్లాగొ స్వాశయంబు దురతిక్రమ మె
య్యది మదికి గోచరింపదు, త్రిదశారీ నామతంబు దిరుగునె యింకన్. 600

ఉ. అంబుధిమీఁద సేతువు నయంబుగఁ గట్టి వనాటసైన్యయు
క్తంబుగ దాఁటి రాఘవుఁడు గ్రక్కున వచ్చిన నేమి యయ్యె యు
ద్ధంబున మత్కరోల్లసితదారుణచాపవిముక్తకాండపా
తంబుల కోర్చి జీవితయుతంబుగఁ గ్రమ్మఱఁ బోవ నేర్చునే. 601

## రావణుఁడు లంకకు గుప్తికర్మము సేయుట.

వ. అని యిట్లు సంరబ్ధపరుషంబుగాఁ బలికిన విని దుష్టుం డైనదశగ్రీవునిం జూచి మాల్యవంతుండు ప్రీతితుం డై యేమియుం బలుకక జయంబు గొను మని దీవించి యథోచితంబుగా నామంత్రణంబు వడసి నిజనివాసంబునకుం జనియె నంత రావణుండు మంత్రులతో విచారించి నిశ్చయించి లంకయందు గుప్తికర్మం బాచరింపం దలంచి సేనాపతి యగుప్రహస్తు నవలోకించి నీవు కతిపయబలంబులం గూడి పూర్వద్వారంబున నుండుము మహావీర్యులునుమహాకాయులును నగుమహోదరమహాపార్శ్వులు పెక్కండ్ర రక్కసులం గూడి దక్షిణద్వారంబు రక్షించెదరు మహామాయుండగుశక్రజిత్తనేకరాక్షసపరివృతుండై పశ్చిమద్వారరక్షణంబునకుం జాలి యుండు నేను శుకసారణులం గూడి యుత్తరద్వారంబున నుండెద మహావీర్యపరాక్రముం డగువిరూపాక్షుండు బహురాక్షససమేతుం డై మధ్యగుల్మంబు రక్షించుచుండు నని యిత్తెఱంగునఁ బురంబునకుఁ బుష్కలంబుగా గుప్తివిధానంబుగావించి తన్నుఁ గృతకృత్యునింగాఁదలంచుకొనుచు వారలచేత నభినందితుం డై నిజాంతఃపురంబునకుం జనియె నంత నిక్కడ సువేలాచలంబున సలక్ష్మణుం డగురాముండు సుగ్రీవాంజనేయజాంబ

వద్విభీషణాంగదనలనీలశరభశతవలిపనసకుముదవినతమైందద్వివిదసుషేణగజగ
వయగవాక్షగంధమాదనరంభతాలదరీముఖప్రముఖులం జూచి యిట్లనియె.
సీ. దుష్ప్రధర్షం బైనదోషాటవిషయంబుఁ జేరితి మది నిలింపారిబాహు
రక్షిత యై పొల్చులంకాపురం బది సురగరుడాహికిన్నరుల కైన
దుర్జయం బైనది దుష్టాత్ముఁ డగువైరిఁ బొలిపుచ్చి కార్యంబు పొందుపఱచు
నట్టిమంత్రము సేయుఁ డాదశాననుఁ డున్నచొప్పు విచారించి చెప్పుఁ డనిన
తే. నప్పుడు దశాననానుజుండమరతుల్యుఁ,డావిభీషణుఁ డభిముఖుండగుచుఁ బుష్క
లార్థ మగ్రామ్యపదవంతమై తనర్చు,వాక్యమున నిట్టు లనియె భూవరునితోడ.

విభీషణుఁడు రామునకు రావణకృతగుప్తికకర్మప్రకారం బెఱింగించుట.

సీ. అనఘాత్మ సంపాతి యనలుండు ప్రఘసుండు శరభుండు ననెడునల్వురనయజ్ఞు
లస్మదీయామాత్యు లట లంకకుం జని యచ్చటివృత్తాంత మంత యెఱిఁగి
వచ్చి చెప్పిరి నాకు వరుసతో నవ్వార్త వినిపింతు వినుము సవిస్తరముగఁ
గలుషాత్ముఁ డగుదశకంఠునిపనుపున నలప్రహస్తుండు సేనాధిపుండు
తే. లంకతూరుపువాకిట శంక లేని, వలతులు మహోదరుఁడు మహాపార్శ్వులనెడు
దైత్యు లిద్దఱు దక్షిణద్వారమందుఁ, గాచి యున్నా రనేకరాక్షసులఁ గూడి.
చ. కడిమి దలిర్పఁ బ్రాసములు ఖడ్గములుం బటుభిండివాలము
ల్తడయక పూని శూరు లగుదైత్యు లనేకులు తన్నుఁ గొల్వఁగా
నుడుగక రాక్షసేంద్రసుతుఁ డుగ్రమనస్కుఁడు మేఘనాదుఁ డా
పడమటివాకిట న్నిలిచి బాగుగఁ బ్రోవఁగ నున్నవాఁ డొగిన్. 605
క. మును బహుసంగ్రామంబుల, వినుతికి నెక్కినమహోగ్రవీరనిశాటు
ల్తనుఁ గొల్వ నుదగ్ద్వారం,బున రావణుఁ డున్నవాఁడు భూవరముఖ్యా. 606
క. ఘనుఁడు విరూపాక్షుం డను, దనుజుఁడు పటుశూలఖడ్గధరు లగుదనుజు
ల్తనుఁ గొల్వఁగఁ బురమధ్యం,బున నిలిచినవాఁడు పృథుచమూసహితుండై.
తే. దశముఖుం డివ్విధంబునఁ దనపురంబు, కడిమి నెవ్వరు సొరకుండ కాపుఁ బెట్టి
వీటిలో సంగరం బని చాటఁ బంచి, యుద్ధసన్నద్ధుఁ డై ప్రాలుచున్నవాఁడు.
వ. మఱియు వేవురు గజయోధులు బదివేలరథికులు నిరువదివేలయాశ్వికులును
సాగ్రకోటిరాక్షసులును యుద్ధసన్నద్ధు లై యున్నవారు వీరు రాక్షసరాజునకు
నజస్రంబు నిష్టులై యుందు రీపరిగణితగజయోధిప్రభృతిచతుర్విధరాక్షసుల
యం దొక్కొక్కనికి దశలక్షరాక్షసులు వశవర్తులై యుందురు వారందఱిప్పుడు
యుద్ధోద్ధకృతోత్సాహు లై యున్నవారు మఱియుఁ గుబేరునితోడ రణంబు
నకుం దొడరినప్పుడు యక్షులతో సంగ్రామంబుఁ జేసి జయంబు గొన్నరాక్షసు
లఱువదిలక్ష లున్నవారు తేజోవీర్యపరాక్రమదర్పసత్త్వగౌరవంబుల రావణు
నకు సరివచ్చువారు మహాత్మా రావణబలవర్ణనవిషయంబునందు మీకుఁ గోపంబు

కర్తవ్యంబు గాదు పగతునిమీఁద రోషం బుత్పన్నం బగుటకుఁ గల తెఱం
గంతయు విన్నవించితి నీవు వీర్యవిశేషంబున సురల నైన నిగ్రహింపసమర్థుండవు
నీకు రావణుం బరిమార్చు టెంతపని చతురంగబలకార్యకరణసమర్థు లైనవాన
రులం గూడి వానరానీకంబును గరుడక్రౌంచాదివ్యూహాకారంబుగా మోహ
రించి రావణు గీటణఁగింపుమని పలికి లంకకుం జని రావణప్రయత్నం బంతయు
నెఱింగి వచ్చినతనమంత్రులం జూపిన నమ్మహానుభావుండు విభీషణునివచనంబు
విని శత్రుప్రతిఘాతార్థంబు వెండియు నతని కిట్లనియె. 609

రాముఁడు వానరసేనాసన్నివేశప్రకారము నిశ్చయించుట

ఉ. అప్రతిమానతేజుఁడు బలాఢ్యుఁడు నీలుఁడు దుష్టశాత్రవా
త్రిప్రదుఁ డుగ్రసంగరవిధిజ్ఞుఁడు ద్వంద్వరణైకదక్షుఁ డ
గ్నిప్రియపుత్త్రుఁ డాప్తు లగుకీశు లసంఖ్యులు గొల్వఁగాఁ బ్రహ
స్తప్రతియోద్ధయై పఱలుదానవశేఖర తూర్పువాకిటన్. 610

తే. వానరచమూసమేతుఁ డై వాలితనయుఁ
డంగదుఁడు దక్షిణద్వారమందు బన్ని
ప్రధనమున మహోదరమహాపార్శ్వులను స
మంచితబలంబుఁ జూపి బాధించుఁ గాక. 611

తే. అప్రమేయాత్ముఁ డగుపవనాత్మజుండు, బహుకపిసమేతుఁడై భుజాబల మెలర్ప
వాసవజిదాఖ్యుఁ డైనరావణి నెదిర్చి, ప్రధనమునఁ బశ్చిమద్వారమధిగమించు.

సీ. ధరలోన నెవ్వాఁడు దైత్యదానవులకు నధినాథుఁ డనఁగ విఖ్యాతి వడసె
శార్దూలమును గన్నసారంగములభంగి విబుధు లెవ్వనిఁ జూచి వెఱచి పఱతు
రగ్నికల్పు లగుమహర్షుల కెవ్వాఁడు తప్పక శోకప్రదాత యయ్యె
వనమృగంబులకు దావముఁ బోలె నెవ్వాఁడు, ప్రజలకుఁ దాపసంపాదియయ్యె
తే. నట్టినీచుని దశకంఠు ననివధింపఁ, దలకొని సలక్ష్మణుండ నై చలము మెఱయ
వాఁడు గైకొన్నయుత్తరద్వారమందు, విక్రమించెద నేను బ్రావీణ్య మలర.

శా. కీశాధీశుఁడు సత్త్వవంతుఁ డగుసుగ్రీవుండు భల్లూకలో
కేశుం డుగ్రుఁడు జాంబవంతుఁడు నిశాటేంద్రుండు ప్రాజ్ఞుం డనాఁ
బ్రాశస్త్యంబును గన్న నీవును సమిత్పాండిత్య మేపారఁగాఁ
గీశానీకము మధ్యదేశమును రక్షింపుండు శౌర్యోన్నతిన్. 614

చ. తెలిపెడి దేమి యింకఁ బరదేశము మా కిది సర్వమర్మముల్
దెలిసినవాఁడ వీవు కడుధీరత దెల్లముగా నుపాయముం
దెలిపి దశాస్యుఁ డాలమునఁ దీఱెడున ట్లొనరించి నన్ను సొం
పలరఁగ సీతఁ గూర్చి చరితార్థుఁడ వై సుకృతంబుఁ గాంచుమీ 615

క. నినుఁ జూపె దైవ మిప్పటి, కనఘా మా కేడుగడగ నరిదేశమునన్
ఘనుఁ డగుదశరథజనపతి, కనిశముఁ బంచమసుతుండ వైతివి గాదే. 616

వ. మఱియు నయ్యుభయసైన్యంబులు తలపడి పోరాడుసమయంబునఁ గ్రందున బెరసి సందడికయ్యం బగునప్పుడు వానరులు కామరూపధరు లగుటం జేసి మానుషరూపధరులై పోరాడి రేని రాక్షసులును దత్ప్రకారంబున మానుష రూపధరులై పెనంగుదురు దానంజేసి మనకు స్వపరబలవివేకంబు గలుగనేరదు గావున వానరు లందఱు స్వరూపంబులతోడ బవరంబు సేయువారుగా నియో గింపు మేనును లక్ష్మణుండును నీవును మొదలుగా సప్తసంఖ్యాతు లగువారము మానుషరూపంబులతోడ రణంబు సలుపుద మని యివ్విధంబున రాముండు కార్యసిద్ధికొఱకు విభీషణునితో విధానక్రమం బెఱింగించి యతిరమణీయం బైన సువేలాచలంబు విలోకించి యాగామిగోచరార్థతత్త్వజ్ఞుం డగునయ్యవనీ వల్లభుండు తదారోహణంబు సేయ నిశ్చయించి లక్ష్మణానుగతుం డై ధర్మజ్ఞులు ను మంత్రజ్ఞులును ననురక్తులు నగుసుగ్రీవవిభీషణులం జూచి మందమధురాలా పంబుల నిట్లనియె. 617

సీ. తతధాతుపరిశోభితం బైనయీసువేలాద్రిని గంటిరె యనఘులార
యీపర్వతం బెక్కి యీరాత్రి యిచ్చట నివసించి యెల్లి వేకువను లేచి
ధర్మంబు కులము వృత్తము పరహిత మవిజ్ఞాతంబు లయ్యె నేశఠునిచేత
మరణంబుకొఱకు నేమలినచిత్తునిచేత మైథిలి తగ హ్రియమాణ యయ్యె

తే. నిత్య మెవ్వానిచేఁ గడునీచబుద్ధి, నిందితం బైనకర్మంబు నెఱపఁ బడియె
నట్టిక్రూరాత్ముఁ డైనదశాస్యుఁ డున్న, లంక నంతేయుఁ జూచెద శంక లేక. 618

తే. జగతి నెవ్వానిబుద్ధిదోషమున నఖిల
దనుజుల కకాండవిలయంబు మొనసి వచ్చె
నయ్యసురభర్తకీర్తితుం డగుచు నుండ
డెందమున రోష మభివృద్ధియొందఁ దొడఁగె. 619

రాముఁడు వానరసమన్వితంబుగా సువేలాచలం బెక్కుట.

క. చపలాత్ముఁ డైనయొక్కని, యపరాధంబునఁ దదన్వయం బెల్లఁ గరం
బపహృతమై చెడు దైవ, ప్రపీడితుల కుర్విఁ గలదె బ్రతుకు తలంపన్. 620

వ. అని దశగ్రీవునిపైఁ బొడమినయలుక తేటపడం బలుకుచు రాముండు చిత్రసా నుకందరసుందరం బైనసువేలాచలతటం బారోహించె విక్రమాభిరతుం డగు లక్ష్మణుం డధిజ్యధన్వుండై తోడన చనియె హరీశ్వరుం డగుసుగ్రీవుండును సా మాత్యుం డగువిభీషణుండునుహనుమదంగదనలనీలమైందద్వివిదగవయగవాక్ష గంధమాదనశరభపనసరంభహార కుముదజాంబవత్సుషేణఋషభశతవలిదుర్ము ఖులును దక్కినయూథపులును గిరిసానుగోచరంబులగుతమతమపరివారంబులం గూడి రాఘవునితోడ సువేలాచలం బెక్కి యంతరిక్షంబున నున్నస్వర్గపురంబు చందంబున నందం బగుచుఁ ద్రికూటశిఖరాగ్రంబుల శుభదర్శనం బై మహో న్నతద్వారం బై ప్రాకారవరణశోభితం బై వీరరాక్షససంపూర్ణం బై ప్రాకార

చయసంస్థితవినీలనిశాచరపరివృతం బై ద్వితీయవరణభూత యుద్ధసన్నద్ధమహారా
క్షసకోలాహలబహుళం బై యున్నలంకాపురంబు నవలోకించి మహామేఘంబుల
భంగి నింగి పగుల భైరవారావంబులు సేయుచు రామునిపార్శ్వంబులం
గొలిచి యుండి రంత సంధ్యాప్రతిరంజితుండై సూర్యుం డస్తమించెఁ బదంపడి
పూర్ణచంద్రప్రదీప యైనశర్వరి ప్రకాశించె నప్పుడు రాముండు వానరదానవ
నాయకు లగుసుగ్రీవవిభీషణులచేత నభినందితుం డై యూథపయూథంబులు
పరివేష్టింప లక్ష్మణసహితంబుగా నప్పర్వతపృష్ఠభాగంబున యథాసుఖంబుగా
నధివసించె నంత సూర్యోదయం బగుటయు వానరపుంగవు లందఱు దృష్టి
చిత్తాపహారిణి యైనలంక నవలోకించి జాతవిస్మయు లై తమలో ని ట్లనిరి. 621

సీ. చందనతిందుకమందారమాకందనాగద్రుపున్నాగపూగములును
సాలహింతాలతమాలతాలంబులు కింశుకశింశుపావంశములును
శృంగారలుంగలవంగనారంగము ల్వటకుటజాశ్వత్థవిటపములును
ఖర్జూరభూర్జరీసర్జకదంబము ల్జంబీరనింబకదంబములును

తే. రమ్యఫలయుతకుసుమితాగ్రంబు లై ల,తాపరిగతంబు లై సమాతతసుగంధ
బంధురము లై మహోన్నతపాదపములు, వరలుచున్నవి కంటిరె పురముచుట్టు.

తే. రక్తకోమలవికసితరమ్యచిత్ర, కుసుమపరిపూర్ణశాద్వలోల్లసితచిత్ర
నీలవనవాటికలచేతఁ గ్రాలుచున్న, దీపురము చూడుఁ డతులం కింపుగాఁగ. 623

క. వనవృక్షంబులు కంటిరె, పనివడి గంధాఢ్యరమ్యఫలకుసుమములన్
వినుతగతిఁ దాల్చు చున్నవి, మనుజులు ఘనభూషణములమాడ్కిం బెలుచన్.

తే. చారుతరకుందమందారసప్తపర్ణ
కుసుమసంసర్గసురభి యై శ్వసనుఁ డిపుడు
ఘ్రాణసుఖకారి యై పథిశ్రమము పాయ
నుడియు చున్నాఁడు విజయసంసూచకముగ. 625

శా. ఆలోకింపఁగ నయ్యె మ్రోల నొక యుద్యానంబు సర్వర్తుకం
బై లీలాయుతషట్పదధ్వనియుతం బై రమ్యపుష్పాఢ్య మై
లోలత్కోకిలకాకలీకలిత మాలోకోత్సవాదాయి యై
యాలేఖేశ్వరకిన్నరేశ్వరమహోద్యానంబుల న్మీఱుచున్. 626

వానరులు వనంబులు సొచ్చి విహరించుట.

వ. అని బహుప్రకారంబులం గొనియాడుచుఁ గామరూపు లగుహరిపుంగవులు
సుగ్రీవుచేత ననుజ్ఞాతు లై కోకిలాకులషండంబులును భృంగరాజాభిగీతంబులును
నిత్యమత్తవిహంగమంబులును సారసాభిరుతంబులును ఖంజనవిఘుష్టంబులునగు
నమ్మహోద్యానవనోపవనంబులు సొచ్చి విచ్చలవిడి పాదవిన్యాసంబులం బుడమి
గ్రక్కదల లంకాపురం బట్టిట్టు నట్టాడ నుచ్చైశ్చర్నాదంబులు సేయుచు ఖగమృగ

ద్వీపంబుల బెగడం దఱలుచు నిజచరణక్షుణ్ణమహీపరాగంబుగగనంబునకంబు
దత్వంబు సంపాదింప భల్లూకసింహవ్యాఘ్రంబులు వరాహమహిషవానరాది
క్రూరమృగంబులు విత్రస్తంబు లై దశదిశలకుం బాఱి విహరించుచు ముందట
సమంతతఃపుష్పసంచయసంఛన్నం బై మహారజతసన్నిభం బై శతయోజనవిస్తీ
ర్ణం బై విపులం బై చారుదర్శనం బై శ్రీమంతం బై మహోన్నతం బై శకు
నంబుల కైన దుష్ప్రాపం బై మనంబునకైన దురారోహం బై మిన్నుముట్టి
యున్న త్రికూటశిఖరంబు విలోకించి తదుపరిభాగంబున. 627

చ. సలలితపాండురాంబుధరసన్నిభకాంచనగోపురంబులన్
విలసితహేమరౌప్యమయవిశ్రుతసాలములన్ సముల్లస
జ్జ్వలనసమానవర్ణమణిజాలవినిర్మితమందిరంబులం
బొలుపగుదాని దేవపురిపోలికి నొప్పెడుదాని వెండియున్. 628

తే. ఘర్మనిరపాయవేళ మేఘములచేతఁ, దనరుమధ్యమవిష్ణుపథంబుభంగి
మహితసౌధవిమానహర్మ్యములచేత, నిరుపమానప్రకాశత వఱలుదాని.

మ. కనకస్తంభసహస్రకంబుల సమగ్రవ్యాప్తరత్నోత్కృతం
బున నిత్యంబును రక్షితం బగుచుఁ దత్పూర్విభూషణం బై మహా
శనగాకారము గల్గి మిన్నొరయు భాస్వచ్చైత్యసౌధంబుచే
ననిశం బుద్ధతిఁ గ్రాలుదాని సురగేయం బైనదానిం గడున్. 630

క. నానాధాతువిచిత్రో, ద్యానంబుల ఖగమృగముల నలరెడుదానిం
గాననవతి యగుదానిని, నానారాక్షసులచేత నలువగుదానిన్. 631

క. నానానగమండిత మగు, దానిని బటుబహుళసంవిధానంబులచే
మానుగ నొప్పెడుదానిని, మానసహరదివ్యరత్నమయ మగుదానిన్. 632

క. అగణితగృహసంబాధం, బగుదాని మహాకవాటయంత్రంబుల నొ
ప్పగుదాని హర్మ్యమాలా, ధగద్ధగిత మైనదాని దశ మగుదానిన్. 633

తే. వెలయఁగా నూఱు యోజనంబులనిడుపును
బొసఁగ ముప్పదియోజనంబులతనర్పు
గలిగి గిరిశిఖరంబుపైఁ గ్రాలుదాని
దానవేశ్వరపాలితం బైనదాని. 634

తే. రమ్య మగుదాని లంకాపురంబు గాంచి
యహహ యీపుర మింత యొప్పగునె యనుచుఁ
దన్మనోహరసుషమావిధానములకు
విస్మయం బందుచుండి రవ్విపినచరులు. 635

వ. అప్పు డారఘువల్లభుం డగురాముండు లక్ష్మణసహితుం డై సైన్యసమేతంబుగా
యోజనద్వయప్రమాణవిస్తారం బైనసువేలాచలాగ్రం బారోహించియచ్చట

నొక్కముహూర్తంబు విశ్రమించి రోషరూక్షప్రేక్షణంబుల దశదిశలు వీక్షించి ముందట నతిరమ్యంబై త్రికూటశిఖరాగ్రభాగంబున విశ్వకర్మనిర్మితంబై రమ్యకాననశోభితంబై మహోన్నతంబై యొప్పుచున్నలంకాపట్టణంబు నవలోకించి తత్పురగోపురశిఖరాగ్రంబున. 636

శ్రీరాముఁడు రావణునిం జూచుట.

చ. తిరముగ నున్నవానిఁ బటుదీప్తదవాగ్నిపరీతనీలభూ
ధరముక్రియ న్నశక్షతజతామ్రసువర్ణపటావృతాంగుఁడై
వఱలెడువాని నీలఘనవర్ణసవర్ణత నొప్పువాని భా
సురతరనూతనాభరణశోభితుఁడై తగువాని వెండియున్. 637

క. ఘనసంధ్యాతపశోభిత, ఘనరాశి నభంబుభంగిఁ గడులోహితచం
దనలిప్తశరీరుండై, తనరారెడువాని సకలదానవనాథున్. 638

క. విజయాతపత్రశోభితు, నజతుని దున్నవాలునిఁ బర్వశాఖుని శ్వేత
వ్యజనాలంకృతపార్శ్వుని, గజనాథునిభంగిఁ జాలఁ గ్రాలెడువానిన్. 639

తే. అనిమిషేభదంతాగ్రపీడనకృతవ్ర
ణాంకవక్షస్థలంబుచే నలరువాని
దశముఖునిఁ గాంచి దశరథతనయుఁ డపుడు
డెందమునఁ జాల విస్మయ మొందు చుండె. 640

సుగ్రీవుఁడు రావణునిపైకి దాఁటి యతనికిరీటచ్ఛత్రాంగదధ్వజములం దన్నుట.

వ. అప్పుడు వానరేశ్వరుం డగుసుగ్రీవుండు రాక్షసేంద్రసందర్శనసంజాతక్రోధావిష్టచిత్తుండై బలసత్త్వంబు లినుమడింప రయంబున లేచి యచలాగ్రంబుననుండి గరుడానిలతుల్యవేగంబున రావణుం డున్నగోపురాగ్రంబుమీఁదికి నొక్కరుండై సాహసంబున లంఘించి యొక్కముహూర్తంబు నిలిచి వానిచందం బెల్ల నిమ్ముగా విలోకించి వానిఁ దృణప్రాయంబుగా నెంచి నిర్భయనిష్కంపావస్థానుండై పరుషంబుగా వాని కిట్లనియె. 641

ఉ. మిత్రకులాగ్రగణ్యునకు మేచకమూర్తికి రామభర్తకున్
మిత్రుఁడ దాసుఁడ న్బలసమేతుఁడ వానరలోకనాథుఁడన్
మిత్రకుమారుఁడ న్జగతి నింద్యచరిత్రుని నిన్ను నిర్జరా
మిత్రుని గీటణంచుటకు మేల్పడి వచ్చినవాఁడ నెంతయున్. 642

చ. అని రయ మారఁ బల్కి ప్లవగాధిపుఁ డుద్ధతి వానిమీఁదికిం
జని కమనీయరత్నమయచారుకిరీటము తన్మనోజ్ఞచం
ద్రనిభసితాతపత్రమును దత్కనకాంగదము ల్పతాక మే
దినిఁ బడఁ దన్నెఁ ధాత్రి కతిధీరత దాఁచె లఘుత్వ మేర్పడన్. 643

మ. కపినాథుం డిటు దాఁటి గమ్మఱ భుజాగర్వంబు దీపింపనై

త్యసతిం దాఁకఁగ నేగె నప్పు డసురాధ్యక్షుండు సుగ్రీవునిన్
విపులగ్రీవుని వేఁడిచూపులఁ దగన్ వీక్షించి యారా కపీం
ద్రు పృథుగ్రీవుని నిమ్నఁ బట్టి వెస హీనగ్రీవునిం జేసెదన్. 644

చ. రయమున రమ్ము రమ్మనుచు రావణుఁ డప్పుడు ఘోరభంగి దు
ర్జయు జయశీలుని న్వినుతసత్త్వుఁ గపీంద్రునిఁ బంకజప్రియ
ప్రియసుతుఁ దాఁకి బాహువుల బిట్టలుకం దగఁ బట్టి యెత్తి త
న్నయు వడి ధాత్రిపైఁ బడ నుదగ్రబలంబున వైచె నుద్ధతిన్. 645

ఉ. వైచిన నేలపైఁ బడక వానరనాథుఁడు కందుకక్రియన్
లేని సముగ్రబాహుబలలీల చెలంగఁగ బాహుయుగ్మమున్
జాఁచి దశాస్యుఁ బట్టుకొని చయ్యనఁ గ్రమ్మఱ ధాత్రిపైఁ బడన్
వైచిన వ్రేటు దట్టుకొని వాఁడు రయంబున వచ్చి తాఁకినన్. 646

—సుగ్రీవుఁడు రావణునితో బాహుయుద్ధము సేయుట.—

క. వనచరనాయకుఁ డుద్ధతి, ననుపమగతి నతనిఁ దాఁకె నయ్యిద్దఱకున్
ఘనగోపురమధ్యంబున, నని చెల్లె సురాసురులకు నద్భుత మొదవన్. 647

వ. ఇత్తెఱంగున వవ్వనచరనిశాచరనాథులు జాతదర్పంబు లగుసింహశార్దూలంబు
లభంగి సంప్రయుక్తంబు లగుగజేంద్రపోతంబుల కరణిఁ బలువంతంబు లగుప
ర్వతంబులపోలికి భక్షణార్థంబు సక్రోధంబు లైనమార్జాలంబులకై వడి బాహు
యుద్ధంబునకుం దలపడి సవ్యాపసవ్యమండలప్రచారంబులం దిరుగుచు జాను
కూర్పరముష్టికరతలపదాఘాతంబుల నొప్పించుచు నిమ్నానిమ్నముష్టియుక్తప్ర
కోష్ఠంబుల నడఁచుచు శోణితదిగ్ధగాత్రులై శాల్మలికింశుకంబులచందంబున
నలరుచుఁ బొంచి పొంచి పాదవిన్యాసవిశేషంబులు చేయుచు సముదగ్రవేగు
లై యొండొరులం దాఁకుచు విలగ్నదేహులై యన్యోన్యగాత్రంబులు పీడిం
చుచు మహాశనితుల్యవేగంబునం బఱతెంచి ధరాతలంబు సంస్పృశించి గరు
డానిలవేగంబునఁ గ్రమ్మఱ నాకాశంబున కెగయుచు స్వేదసిక్తగాత్రులై యలసి
నిట్టూర్పులు పుచ్చుచుఁ గొండొకసే పూరకుండి యొక్కింత సేద దీర్చుకొని
వెండియు నిరువు రేకకాలంబునం దలపడి పోరుచుఁ బరస్పరాలింగనంబుఁ జేసి
బాహుపాశంబుల నొండొరుల బంధించుచుఁ బరస్పరశ్లిష్టనిరుద్ధచేష్టులై నిలువం
బడుచుం బెనుగట్లమూడ్కి నిట్టట్టు గదల్పరాక పట్టు దట్టించుచు నతిలాఘవంబు
నం దఱి గని డాసి కఠినాశనితుల్యవేగంబు లగుముష్టిఘాతంబుల. ఱొమ్మునం
గ్రుమ్ముచుఁ గంఠార్పితబాహులై యొండొరుల నాకర్షించుచు నొదిఁగియొదిఁగి
తిరిగివచ్చి యేపుమిగించి వెన్నునం దన్నుచు వ్యాయామశిక్షాబలసంప్రయుక్తు
లగుటం జేసి రణంబున నలయక యితరేతరజయకాంక్షులం బెనంగుచుఁ గరిక
రోపమసంవృత్తపరిఘాకారంబు లగుబాహువులచేత నివారించుచు సారెసా
రెకు వెనుకకుం జని బిరుదువెత్తుచు వచ్చి మచ్చరంబునం దాఁకుచు భుజాస్ఫాల

సంబుఁ జేసి హుంకరించుచుఁ బ్రదీప్తవహ్నికుండంబులపగిదినలరురోషారుణిత
లోచనంబులవలన నగ్నిశిఖోపమంబు లగుతిగ్మకటాక్షంబు లొండొరులపయిం
బొలయఁ దిర్యక్ప్రసారంబులు సేయుచు సంరంభశిక్షాబలసంప్రయుక్తులై
యుద్ధమార్గంబు నెఱింగి వారణార్గళపీవరంబు లగుబాహువులచే నొండొరుల
నివారించుచుఁ బాదభ్రమణవిశేషమార్గంబునఁ బరిభ్రమణంబు నొందక విజ్ఞా
నంబు గలిగి చరించుచు విచిత్రంబు లైనమండలంబులును వైష్ణవసమపాదవై
శాఖమండలప్రత్యాలీఢాలీఢనామకంబు లైనస్థానంబులును గోమూత్ర
రేఖాకారకుటిలగమనవిశేషంబులును నుపసర్పణాపసర్పణంబులును దిర్యగ్గమన
వక్రగమనసవ్యాపసవ్యసంచరణంబులును జిత్రగమనంబులునుబరిమోక్షవర్జన
పరిధావనప్రహరణాభిద్రవణాప్లావనాస్థాన విగ్రహ పరావృత్తావద్రుతోపప్లుతోప
న్యస్తాపన్యస్తంబులును జూపుచు వప్రోపరిభాగంబునఁ జిరకాలం బద్భుతంబుగా
భండనంబుఁ జేసి రాసమయంబున. 648

సుగ్రీవుఁడు రావణుమాయ నెఱింగి రామునిపాలికి దాఁటుట.

ఉ. దానవవల్లభుండు కడుదర్ప మెలర్పఁగ మాయఁ బన్ని యా
వానరలోకవల్లభుని వంచితుఁ జేయఁ దలంచునంతలో
వానితలం పెఱింగి కపివర్యుఁడు చిక్కక లాఘవంబునన్
మేను గుదించి శీఘ్రమున మింటికి దాఁటె ఖగేంద్రుచాడ్పునన్. 649

చ. అగచరనాథుఁ డీక్రియ దశాస్యునితోఁ గదనం బొనర్చి దా
మగటిమిఁ జూపి వానియభిమానము దర్ప మడంచి జిష్ణుఁ డై
జగములు సన్నుతింపఁ గడు సంతస మొప్ప విశాల మైనయా
గగనము దాఁటి వేచనియెఁ గ్రమ్మఱ రామనరేంద్రుపాలికిన్. 650

తే. ఇట్లు వచ్చినపతిఁ గాంచి యెల్లకపులు
చిత్త మిగురొత్త నతనిఁ బూజించి రవుడు
ప్రీతితో రాముఁ డతనిఁ బరిష్వజించి
యింపు దళుకొత్త మెల్లన నిట్టు లనియె. 651

ఉ. ఒక్కనితోడ నైన నిది యోచన సేయక నన్ను లక్ష్మణుం
దక్కినయూథపోత్తముల దానవనాథునిసంశయంబు వ
న్నెక్కనఁ జేసి తెంపుమెయి నీవటు రాక్షసనాథుమీఁదికి
ట్లొక్కఁడ వేగఁ జెల్లునె నరోత్తము లుర్వర నిట్లొనర్తురే. 652

క. దోషాచరులు దురాత్ములు, వైషమ్యముఁ బూని మాయ వంచింపుదు రీ
రోషంబునలస నీ విఁక, దోషముఁ గావింప వలదు దుర్ధర్షవధూరా. 653

సీ. వీరశేఖర నీవు వేఱొక్కవిధ మైన నాకు జానకి యేల లోక మేల
లక్ష్మణుం డేల సామ్రాజ్యసంగతి యేల భరతుఁ డేల సుమిత్రపట్టి యేల

బ్రతు కేల పౌరుషభంగంబు గాకుండ రావణు మిత్రపుత్రసహితముగ
ననిలోన వధియించి యలవిభీషణు లంక కధిపతిఁ జేసి రాజ్యంబునందు

తే. భరతు నభిషిక్తుఁ గావించి పనులు దీర్చి
యవల మేనికిఁ బాసెద నంతె గాక
ప్రాణమిత్రుని నినుఁ బాసి బ్రతుకఁగలనె
నీవు రాక మున్నిది నాదునిశ్చయంబు. 654

ఉ. నా విని యాహరీశ్వరుఁడు నవ్వుమొగంబున రామభర్తతో
దేవరవారి దేవి నిటు దెచ్చినయాదశకంఠుఁ జూచి నే
నేవిధి నాత్మపౌరుషము నించుక యైనను జూపకుందు నో
భూవర యంచు నవ్విభుని భూరిముదంబునఁ దేల్చె నంతయున్. 655

క. మనుజవరతనయుఁ డారవి, తనయుని మన్నించి పిదపఁ దమ్ముని సుగుణున్
వినయవినమితశరీరునిఁ, గనుఁగొని యిట్లనియె విజయకౌతూహలి యై. 656

చ. జనసుత శాస్త్రదృష్టగతి సైన్యముల న్విభజించి చక్కఁగా
మొనలు ఘటించి సంగరసముత్సుకత న్గుమి గూడి యుండు మీ
ఘను లగుకీశదైత్యుల కకాండలయంబు ఘటిల్లఁ గంటివే
ఘనముగ నేల మింట లయకాలమునాఁటివిధంబు దోఁచెడిన్. 657

రాముఁడు లక్ష్మణున కప్పటిదుర్నిమిత్తంబులఁ జూపుట.

క. ధరణీధరములు వడఁకెడు, ధరణీధరాగ్రములు విఱిగి తప్పక పడెడున్
ధరణి చలించెడు గాడ్పులుఁ, విరవిరఁ గలుషంబు లగుచు విసరెడుఁ గంటే. 658

వ. మఱియుఁ గ్రవ్యాదసంకాశంబు లగుమేఘంబులు పరుషంబులై పరుషస్వనంబు సేయుచు దారుణప్రకారంబున శోణితబిందువిమిశ్రితంబై నవర్షంబు గురియుచున్నవి రక్తచందనసంకాశ యై సంధ్య పరముదారుణంబుగా నలరెడు సూర్యమండలంబున నుండి వహ్నిశిఖ లుప్పతిల్లుచున్నవి యప్రశస్తంబు లగు మృగద్విజంబులు దీనంబులై దీనధ్వనులు సేయుచు భయంబు పుట్టించుచు నాదిత్యున కభిముఖంబుగా రోదనంబుసేయుచున్నవి రాత్రియందుఁజంద్రుఁడు కృష్ణరక్తాంతపర్యంతుం డై సొబగు దక్కి లోకక్షయకాలంబునందుం బోలె మిక్కిలి తపింపం జేయుచున్నవాఁడు హ్రస్వంబై రూక్షంబై యప్రశస్తంబై యతిలోహితంబై యాదిత్యమండలంబుచుట్టు పరివేషం బొప్పుచున్నదిమఱియు నయ్యినమండలమధ్యంబున నీలలాంఛనంబు దోఁచుచున్నది నక్షత్రంబులు దారుణదర్శనంబు లయ్యె మఱియుఁ గాకశ్యేనగృధ్రంబులు సాంద్రంబుగా లంకమీఁద నాడుచున్నవి శివానాదంబు లశివంబులై భీమప్రకారంబున మ్రోయుచున్నవి యీదుర్నిమిత్తజాతం బంతయు లోకంబునకు యుగాంతంబు నెఱింగించుమాడ్కి వర్తించుచున్నది గావున మన మిప్పుడు కపిబలపరివృతులమై విజయార్థంబు దురాధర్ష యైనలంకమీఁదికి నిశ్శంకంబుగాఁ బోద మని

వలికి మహాబలుం డగులక్ష్మణాగ్రజుండు లక్ష్మణసహితంబుగా రయంబున నప్పర్వతాగ్రంబు డిగ్గి పరులకుఁ బరమదుర్ధర్షం బైననిజసైన్యంబు నవలోకించి సుగ్రీవునియనుమతంబున నందఱ సన్నద్ధులం జేసి రణంబున కనుజ్ఞ యొసంగి కాలజ్ఞుండు గావున సుముహూర్తంబున మహాబలపరివృతుం డై లంకాపురంబున కభిముఖంబుగా నడిచె నప్పుడు. 659

రాముండు వానరసైన్యసమేతంబుగా లంకకుఁ బోవుట.

మ. హనుమంతుండును జాంబవంతుఁడును గీశాధీశుఁ డయ్యంగదుం
డును నీలుండు విభీషణుండును నలుండుం దారుఁడున్ రంభుఁడుం
బనసుండు న్మొద లైనయూథపవరు ల్విఖ్యాతశౌర్యోన్నతు
ల్చని రారాముని వెంట సంగరకళాచాతుర్య మేపారఁగన్. 660

ఉ. తక్కినయూథపోత్తములు దారుణవైఖరి నిస్వనంబులన్
దిక్కులు వ్రయ్యఁ జేయుచు నతిస్ఫుటసాలశిలాద్రిపాణు లై
యుక్కునఁ బాదసంహతుల నుర్వి చలింప నరేంద్రువెంబడిన్
గ్రక్కున నేగి రుగ్రరణకౌతుకమాన్యములం జెలంగఁగన్. 661

క. గోలాంగూలబలంబును, వాలాయము ఋక్షబలము వానరబలమున్
శైలశిఖరములకై వడిఁ, గ్రాలుచుఁ జిత్రగతిఁ జనియె రామునివెంటన్. 662

ఉ. దక్షత నిట్లు రాఘవులు తప్పక యించుకసేపులోన లో
కక్షయకాలదృప్తరవికంజవిపక్షులభంగిఁ గ్రాలుచున్
వృక్షచరాగ్రయోధు లగువీరు లనేకులు గొల్వ నేగి రా
రాక్షసరాజబాహుబలరక్షితలంకను జేరి రుద్ధతిన్. 663

వానరసేన లంకాపురి చుట్టుముట్టుట.

వ. ఇట్లు రఘువీరుం డనంతబలసమేతంబుగా నుచ్చప్రాకారతోరణ యైనలంకాపురి డాయం జని సైన్యంబుల నర్హస్థానంబుల విడియ నియమించి శైలశృంగంబుకరణి మహోన్నతం బై వరుణునిచేత సాగరంబుభంగి రావణునిచేత నధిష్ఠితం బై దానవులచేతఁ బాతాళంబుకరణి శస్త్రాస్త్రపాణు లగుభయంకరరాక్షసులచేత నభిరక్షితం బై దానవులచేత విన్యస్తంబు లైననానావిధాయుధకవచపతాకాధ్వజంబులచేత నలంకృతం బై తనకంటె నన్యులచేత రక్షించుట కశక్యం బై చూపరులకుఁ ద్రాసజనకం బై యొప్పుచున్నలంకాపురియుత్తరద్వారంబు నిరోధించి మహాధనుర్ధరుం డై దాని రక్షించుచుండెఁ బూర్వోక్తప్రాకారంబునవానరచమూవల్లభుం డగునీలుండువీర్యసంపన్ను లైనమైందద్వివిదులం గూడి రాక్షసచమూవల్లభుం డైనప్రహస్తుండున్నపూర్వద్వారంబునిరోధించె మహాబలుం డైనయంగదుండు ఋషభగజగవయగవాక్షులం గూడి మహోదరమహాపార్శ్వు లున్నదక్షిణద్వారంబు నాక్రమించె బలవంతుం డగుహను

మంతుండు ప్రమాథిప్రఘసప్రముఖయూథపులం గూడి యింద్రజిత్తున్నపశ్చిమద్వారంబు నధిగమించె వానరవల్లభుం డగుసుగ్రీవుండు సుపర్ణశ్వసనసంకాశు లగుసమస్తవానరశ్రేష్ఠులం గూడి పరమదుర్జయు లగురావణశక్రజిత్తు లున్నయుత్తరపశ్చిమద్వారంబులనడుమ నయ్యుభయద్వారనిరోధకులగురామహనుమంతులకుఁ గాకాక్షిన్యాయంబున సాహాయ్యంబు గావించుటకు నధివసించెముప్పదియాఱుకోట్లయూథపులు ప్రఖ్యాతబలపౌరుషు లగువారు సుగ్రీవునకు బాసటగా నచ్చట విడిసిరి రామునిశాసనంబున లక్ష్మణుండు విభీషణసహితుండై వానరులలోన మేలిమి గలుగువారలయూథపుల నేర్పరించి యొక్కొక్కగవని కొక్కొక్కకోటివానరులనిలిపెనవ్వానరశార్దూలులుదంష్ట్రాకరాళవదనంబులగుశార్దూలంబులభంగి దర్పించిహృష్టచిత్తులై పాదపశైలాగ్రంబులుకరంబులం బూని వికృతలాంగూలులును దంతినఖాయుధులును వికృతచిత్రాంగులును వికృతముఖులును గొందఱు దశనాగబలులును గొందఱు శతనాగబలులును గొందఱు సహస్రనాగబలులును గొందఱు నాగాయుతబలులును గొందఱు నియుతనాగబలులును గొందఱు ప్రయుతనాగబలులును గొంద ఱనంతబలులు నై కయ్యంబునకుం గాలు ద్రవ్వుచుండిరి జాంబవంతుఁడును సుషేణుండును స్వసైన్యపరివృతు లై రామసుగ్రీవులమధ్యంబున హనుమత్సుగ్రీవమధ్యంబునం బన్ని రప్పు డామహానుభావులసమాగమం బద్భుతం బై విచిత్రం బై యొప్పె నవ్వానరసైన్యంబులచేత నాచ్ఛాదితం బై యచ్చటిమహీతలంబు శలభంబులచేత నాచ్ఛాదితం బై నగగనంబుచందంబునం [illegible] నయ్యె మఱియును. 664

ఆ. మఱియుఁ గోటికోటి మర్కటవీరులు, పాదపాద్రిశృంగపాణు లగుచు
నాల్గుగవనులందు నలు వొప్ప వేర్వేఱ, యేగి రవుఁడు బలము లిసుమడి... 665

తే. మఱియుఁ గొందఱు కపు లసమానబలులు
వీటిచుట్టును రెండవకోటభంగిఁ
జాలుఁ గొని యుండి రటఁ గొంద ఱాలమునకుఁ
బూని యప్పర్వతముఁ జుట్టుముట్టి రపుడు. 666

చ. మిడుతలమాడ్కి ధాత్రియును మిన్నును దిక్కులు నిండ వానరు
ల్గడువడి భూమి యీనినటు గ్రాలుచు లెక్కకు మీఱి వీఁకతోఁ
దడయక లంకచుట్టు కడుదట్టముగా వడి నిండి యుండుటల్
విడువక చూచి దానవులు వేల్పులు విస్మయ మంది రయ్యెడన్. 667

చ. గరుడునికంటె మారుతముకంటె వడిం జన నేర్చువారు భీ
కరభుజవిక్రము ల్సురకర్కశులు న్దశకోటివానరు
ల్పొరిఁ బొరి నిండియున్నరవిపుత్త్రుబలంబులచుట్టు నుద్ధతిన్
దిరుగుచుఁ దత్పరివృత్తు లోగిఁ దెల్పుచు నుండిరి సారెసారెకున్. 668

తే. పాదపోదగ్రపాషాణపాణు లైన, సమదభీషణవీర్యాద్రిచరులచేతఁ
బరివృతం బైనరాక్షసపట్టణంబు, కరువలికి నైనఁ జొర రాక గ్రాలుచుండె.

ఉ. భీకరవానరప్రవరపీడితు లై రజనీచరు ల్తదీ
యాకృతులుం దదద్భుతవిహారము తత్పృథుశక్తియుం దద
స్తోకవిధాన మంతయును జూచి మనంబునఁ జాల మెచ్చుచుఁ
దేఁకువ విస్మయాంబునిధిఁ దేలుచు నుండిరి వీట నంతటన్. 670

సీ. హిమవింధ్యమలయమహీధరంబులగుహాద్వారంబులను బ్రతిధ్వనులు సెలఁగ
భూరిదండాహతిస్ఫుటకుంభములమాడ్కి వరుస దిక్కుడ్యము ల్వ్రీక్కి వాఱ
వెస నిండఁ గ్రాఁగిన యొసరులచందాన శరనిధు లుప్పొంగి పొరలఁ బఱఁగ
ఖలరాక్షసాంగనాగర్భంబులు స్రవింప ఘోరనిశాటులగుండె లవియ

తే. రామసుగ్రీవవాలిసుతభీమరూప, వనచరోత్థితదుర్వారఘనరవంబు
ప్రళయకాలంబునాఁటినీరధిరవంబు, భంగి నై సాంద్రతరముగా నింగి ముట్టె.

తే. ఆరవంబున నపుడు దశాస్యపురము, శైలశాననగోపురసౌధసాల
హర్మ్యమందిరోద్యానసమన్వితముగఁ, జాలఁ గంపించెఁ గుమ్మరసారెపగిది. 672

వ. ఇత్తెఱంగున నారఘుసత్తముండు సేనాసన్నివేశంబు గావించి మంత్రులతో
విచారించి నిశ్చయించి సామాద్యుపాయనీతిఫలతత్త్వవిదుండు గావున ననంతర
కర్తవ్యంబు ప్రాపింప నిశ్చయించి యుద్ధకాముండై శత్రుపురంబునకుం జనుదెంచిన
రాజులు రణంబునకు మొదల సామోపాయంబునఁ బరిపంథిం బిలువవలయు
ననెడు రాజధర్మంబుఁ దలంచి విభీషణునియనుమతిఁ బడసి వాలితనయుం డగు నం
గదకుమారకుఁ బిలిచి యిట్లనియె. 673

రాముఁడు రావణుని యుద్ధంబునకుఁ బిలువ నంగదునిఁ బంపుట.

ఉ. అంగద నీవు నెమ్మది భయంబు దొఱంగి గతవ్యథుండ వై
సంగతి మీఱ నభ్రమునఁ జయ్యన లంకకు నేగి పంక్తికం
ఠుం గుటిలాత్ము రాజనయదూషకునిం గని వానితో వచిం
పం గలభంగి నిట్లనుము మద్వచనంబులు గాఁగ ధీరతన్. 674

చ. వరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకి
న్నరులకు మౌనికోటికి ననారతముం గడుఁ గ్రూరబుద్ధిచే
దురిత మొనర్చి తీవు కడుదుష్టుని నిన్ను వధించి నేఁడు ని
ర్జరులకు మేలు సేయుటకుఁ జయ్యన వచ్చినవాఁడ నంతయున్. 675

చ. అలఘుచరిత్రుఁ డైనగురునానతిఁ దాపసవేషధారి నై
తలకొని కాననంబున వ్రతం బొనరింపఁగ వచ్చియున్నమ
త్కులసతి సీత నొంటిఁ గని దొంగిలి తెచ్చినందునం
దలఁపఁగఁ బద్మగర్భవరదానజదర్ప మడంగె నేఁటికిన్. 676

క. సుజనుల కపకృతిఁ జేసిన, వృజినాత్మున కిహము పరము వెదకినఁ గలదే
రజనీచరాధమా నీ, వృజినమె నిను గీటణంచు వేఱొక కేలా. 677

చ. కనకవిచిత్రచాపమును గాండములం గొని ని న్వధింపఁగా
ఘనతరవిక్రమక్రమ మఖర్వభుజాబలదర్ప మేర్పడన్
వనచరసేనఁ గూర్చుకొని వచ్చి భవత్పురగోపురంబులం
దనువుగ నున్నవాఁడఁ డడవాయె రయంబున రమ్ము పోరికిన్. 678

చ. అనురులపాలి కంతకుఁడ నై చనుదెంచితి నింక మత్కరో
ల్లసదురుచాపముక్తచటులప్రదరంబుల నీజగం బరా
త్మసముగఁ జేసి నిన్ను వెసఁ జంపి మహాత్ములు భూపతు ల్సమం
జనులు మును ల్సుర ల్చనెదు నద్గతికిం బొలుపారఁ బుచ్చెదన్. 679

క. దనుజాధమ యేబలమున, వనమున నను మాయచేత వంచించి మహీ
తనయం గొని తెచ్చితి వా, యనుపమబల మంతఁ జూపు మవసర మయ్యెన్.

తే. దానవకులాధమా భర్త నైననన్నుఁ, జేకొని పవిత్ర యైనమహీకుమారి
వామపదమున నైన భవచ్ఛిరంబు, సంస్పృశింప దీయర్థంబు సత్య మరయ.

చ. ఖలుఁడవు ధర్మహీనుఁడవు కాపథవర్తి వపండితుండ వీ
యలఘుతరం బకంటకమ నైననికాటజనేశ్వరత్వ మీ
విలఁ ద్రుటికాల మైన భుజియింపఁగ నేరవు రమ్ము ధర్మని
శ్చలుఁ డగుమావిభీషణుఁడు శాశ్వతుఁ డై యిఁక లంక నేలెడిన్. 682

తే. శౌర్య మాలంబనముఁ జేసి ధైర్యమూఁది
జన్య మొనరింపు మీ వింక సాహసమున
సమరమున మచ్ఛరంబుల శాంతి నొంది
యనలఁ బూతుండ వయ్యెద వద్భుతముగ. 683

తే. కర్బురాధమ త్రైలోక్యకంటకుండ, వై ననీ వింకఁ దొల్లిటియట్ల మాయఁ
జూపఁ దలఁచెదు నాదుచతుష్పథంబు, నొంది గ్రమ్మఱ బ్రతికి పోనోప వీవు.

క. మదధీనము నీజీవిత, మది నిక్క మొనర్ప వలసినట్టిపనులు పెం
పొదవంగఁ దీర్చుకొని తుదిఁ, గదనంబున కరుగుదెమ్ము గతకాముఁడ వై. 685

క. అని యిట్లు రాక్షసునితో, ఘననాద మెలర్పఁ బలికి గ్రమ్మఱ నిటకుం
జనుదెమ్ము పొమ్ము వాసవి, తనయా యని పలికి యనిచెఁ దద్దయుఁ బ్రీతిన్. 686

వ. ఇవ్విధంబున నక్లిష్టకర్ముం డగురామునిచేత ననుజ్ఞాతుం డై కనకాంగదుం
డగునంగదుండు తత్ప్రసాదంబున మూర్తిమంతుం డైనవైశ్వానరునిభంగి
వెలుంగుచు శీఘ్రంబున నాకాశంబున కెగసి వైనతేయవేగంబున లంకకుం
జని కైలాసశిఖరసంకాశమహోన్నతపాండరప్రాసాదాగ్రభాగంబున సచివస
మన్వితంబుగా నాసీనుం డై కార్యపర్యాలోచనంబు సేయుచున్నరావణుం
గని తత్సమీపంబున నుండి వాని కిట్లనియె. 687

అంగదుఁడు రావణునితో రామోక్తవాక్యంబులఁ జెప్పుట.

ఉ. దానుఁడ రాఘవేంద్రునకుఁ దప్పక నిన్నును ద్రోఁకఁ గట్టి పే
రాసఁ జతుస్సముద్రములయందుఁ జలంబున ముంచినట్టియా
వాసవనందనుం డయినవాలికుమారుఁడ నంగదుండ నా
కోసలనేత నీకడకు గొబ్బునఁ బంపఁగ వచ్చితిం దగన్. 688

వ. అమ్మహాత్ముఁడు నీతోఁ జెప్పు మనినవిధంబు వినిపించెద మంత్రిబాంధవసహి
తంబుగా సమాహితచిత్తుఁడవై వినుము. 689

చ. నరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకి
న్నరులకు మౌనికోటికి ననారతముం గడుఁ గ్రూరబుద్ధిచే
దురిత మొనర్చి తీవు కడు దుష్టుని నిన్ననిలో వధించి ని
ర్జరులకు మేలు సేయుటకుఁ జయ్యన వచ్చినవాఁడ నెంతయున్. 690

ఉ. రావణ సీత నిచ్చి యపరాధిని నిన్నరణంబు నొందితిం
గావు మటంచు నన్నుఁ గడఁకం దగ వేఁడిన నిన్నుఁ గాచెదం
గావర మెత్తి యవ్విధము గాక పెనంగితి వేని నిన్ను బా
హావిభవం బెలర్ప నసురావనిఁ ద్రుంతు సరాక్షసంబుగన్. 691

క. క్రూరాత్ముఁడ వగునీ విపు, డారయ నాచేత హతుఁడ వగుచుండఁగ-సొం
పార నిరుద్వేగము లై, యీరేడుజగంబు లెనకమెసఁగెడు నీచా. 692

చ. ఖలుఁడవు ధర్మహీనుఁడవు కాపథవర్తి వపండితుండ వీ
యలఘుతరం బకంటకము నైననిశాటబలేశ్వరత్వ మీ
విలఁద్రుటికాల మైన భుజియింపఁగ నేరవు రమ్ము ధర్మని
ర్మలుఁ డగుమావిభీషణుఁడు శాశ్వతుఁ డై యిఁక లంక నేలెడున్. 693

చ. అని యిటు భీతి లేక దివిజాధిపపౌత్రకుఁ డన్నమాటకుం
గనలి నిశాచరేశ్వరుఁడు కన్నుల నగ్నికణంబు లొల్కఁగా
దనుజుల ఘోరరూపులఁ బ్రతాపవిశిష్టులఁ జూచి పల్కె నీ
వనచరుఁ బట్టి చంపుఁ డనివార్యగతిం గడు దర్ప మేర్పడన్. 694

అంగదుఁడు తన్నుఁ బట్టవచ్చునల్వురరాక్షసులఁ జంపి ప్రాసాదశిఖరమును బడఁదన్నుట.

ఉ. నా విని భూరిసత్త్వు లగునల్వురు రాక్షసు లుగ్రమూర్తు లై
ధీవరు వాలిపుత్త్రు నతిధీరుని నంగదుఁ బట్టి రంతలో
నావిపినాటశేఖరుఁ డనంతబలుం డటు వారిమీఁద బా
హావిభవంబు కొంత రయ మారఁగఁ జూపుదు నంచు నుగ్రతన్. 695

చ. కరయుగసక్తు లై ఫణులకై వడి రోఁజుచు నున్నవారి న
ల్వురిఁ గొని వేగ వానరకులుం డటు మింటికి దాఁటె నంతఁ ద

త్కారములనుండి జాతి వసుధం బడి గ్రక్కున భిన్నదేహులై
మరణము నొంది రప్పు డొకమాటు దశాస్యుఁడు చూచుచుండఁగన్. 696

వ. ఇత్తెఱంగున నత్తరుచరశ్రేష్ఠుండు మహాద్భుతప్రకారంబున నన్నిశాచరుల నశ్రమంబున గీటణఁగించి మహోన్నతం బైన శైలశృంగంబుమాడ్కిఁ జూడ్కికి వ్రేఁ గగు చున్నప్రాసాదశిఖరంబుమీఁదికి లంఘించి పాదఘాతంబున దానిం దన్నిన నది సహస్రప్రకారంబుల వ్రయ్యలై వజ్రివజ్రప్రహారంబున విదారితం బైనహిమాచలశిఖరంబుకరణి ధరణిపయిం బడియె నిట్లుప్రాసాదభంగంబుచేసి యెల్లవారికి నిజనామంబు విశ్రుతంబు చేసి వియత్తలం బుత్తలపడ నూర్జిత గర్జానిస్వనంబులు గావించుచు రాక్షసులకు సంతాపంబును వానరులకు సంతోషంబును గావించుచు శీఘ్రంబున నాకాశంబున నెగసి జవాతిరేకంబున రాముని కడకుం జనుదెంచె రావణుండు ప్రాసాదభంగంబువలనం దనకుఁ జేటు వాటిల్లు నని తలంచి చింతాకులితమానసుం డై క్రోధోద్రేకంబున నిట్టూర్పులు నిగిడించుచుండె నంత నిక్కడ రాముండు సంప్రహృష్టచిత్తుఁ డై సింహనాదంబులు సేయువానరులం గూడి రిపువధార్థంబున కుద్యుక్తుం డై యుండె గిరికూటసంకాశుండును మహావీర్యుండు నగుసుషేణుండు సుగ్రీవునిపనుపునఁ గామరూపులగువారి ననేకవానరులం గూడి లంకాపురంబునం గలనాల్గుగవనులు గలయం దిరుగుచు దుర్ధర్షుం డై చంద్రుండు నక్షత్రంబులం బోలె వానరుల నందఱఁ బ్రకాశింపఁ జేయు చుండె నప్పుడు సాగరపర్యంతంబు నిండి లంకా పురంబు చుట్టు ముట్టి యిసుక చల్లిన రాల నీక దట్టంబుగాఁ బన్ని రెండవసాగరంబుకరణి ఘూర్ణిల్లుచున్నవీరవానరాక్షౌహిణీసహస్రంబు నవలోకించి లంకా పురంబునం గలరాక్షసులు భయవిస్మయంబులు పెనఁగొన జిచ్చుపడి చూచుచుండిరి కొందఱు సమరోద్ధర్షంబువలన హర్షంబు నొందుచుండిరి కొందఱు భయమోహితులై హాహాకారంబులు సేయుచుండిరి కొందఱు ధృతాయుధపాణులై యుగాంతవాతంబులభంగి నింగి తూఁటుగట్ట మహానాదంబులు సేయుచు సంచరించుచుండిరి లంకాపురం బంతయు మహాభీషణకోలాహలభరితం బై యుండె నప్పుడు. 697

రావణుఁడు మేడమీఁద నెక్కి వానరసైన్యముఁ జూచి చింతించుట.

చ. ఉరుతరసౌధభాగమున నున్నదశాస్యునిపాలి కేగి కొం
దఱు రజనీచరు ల్దనుజనాయక వానరసేన లంక ని
ష్ఠురగతి నాక్రమించుకొని శోభిలుచున్న దటంచుఁ బల్కినన్
గురుతరభూరికోపరసఘూర్ణితలోచనుఁ డై యతం డొగిన్. 698

క. నగరి కటు సంవిధానము, ద్విగుణంబుగఁ జేయఁ బనిచి ధీరత మెఱయన్
గగనముతో రాయుమణి, స్థగితప్రాసాద మొకటి తడయక యెక్కెన్. 699

వ. ఇట్లు ప్రాసాదారోహణంబు సేసి. 700

శా. గంభీరధ్వనినిర్జితాఖిలమహాకల్లోలినీనాథముం
దంభోళిప్రతిమానతీక్ష్ణనఖదంష్ట్రాయుక్తముం జన్యసం
రంభం బొప్పఁ బురంబుచుట్టు నతిసాంద్రప్రస్ఫుటప్రక్రియం
శుంభల్లీలఁ జెలంగుచున్నబలముం జూచె న్సముగ్రంబుగన్. 701

చ. ఇటు తిలకించి పంక్తిముఖుఁ డెంతయు విస్మయ మంది వీరి నే
నెటులు జయింతు నంచు మది నించుకసేపు భయంబుఁ బూని యా
దట నొకకొంతసేపునకుఁ దద్దయు ధైర్యసభావలంబి యై
పటుగతి నేగె లోపలికిఁ బాదహతి న్ధర కంప మొందఁగన్. 702

ఉ. అప్పుడు రాఘవేశ్వరుఁ డనంతవనాటబలాభిగుప్తుఁ డై
యుప్పురవీధి నాకపురియొప్పునఁ జూడ్కికి దుర్నిరీక్ష్య యై
యొప్పునిశాటరాజపురి నుగ్రనిశాటబలాభిరక్షితం
దప్పక చూచి చిత్తమున ధారుణిపుత్త్రిఁ దలంచి యార్తుఁ డై. 703

ఉ. అక్కట సీత దైత్యహృత యై పలవించుచు నిష్ఠురంబులో
దిక్కఱి దానవాంగన లతిక్రుధ నాడుదురుక్తి కార్త యై
పొక్కుచు నొంటిమై హరిణిబోలె వడంకుచు మత్కృతంబునం
దక్కన మైనశోకమున నార్తిఁ దపించుచు నున్న దెంతయున్. 704

రాముఁడు వానరులకు రాక్షసులం జంప నాజ్ఞాపించుట.

చ. అని తలపోసి రాముఁడు ప్రియావిరహవ్యసనానిలంబుచే
దనుజవరేణ్యుమీఁద మును దప్పక పుట్టినక్రోధవహ్ని చ
య్యన నభివృద్ధి నొంది శిఖ లత్తులఁ బర్వ మహోగ్రమూర్తి యై
వనచరసేనఁ జూచి సురవైరులఁ ద్రుంపుఁ డటంచుఁ బల్కినన్. 705

ఉ. వారు మహాప్రసాద మని వాయుజవంబున నంద ఱుగ్రు లై
మీఱి ధరిత్రియు న్దిశలు మిన్నును బ్రద్దలువాఱ నార్చుచుం
దారుణముష్టిఘాతములఁ దక్కక లంకను వ్రక్కలించి దే
వారులఁ బట్టి త్రుంతు మని యద్భుతవైఖరిఁ బంత మాడుచున్. 706

ఉ. కొందఱు శైలఖండములు కొందఱు తాలతమాలసాలముల్
గొందఱు దారుణాశ్మములు కొందఱు నిష్ఠురదీర్ఘతాలముల్
గ్రందుగ సద్భుతక్రియఁ గరంబులఁ బూని మదం బెలర్పఁగాఁ
బొందుగ సింహపోతములపోలికి విక్రమదుర్నివారు లై. 707

చ. కనకసమానవర్ణపటుగాత్రము లద్భుతతామ్రవక్త్రముల్
ఘనతరవాసవధ్వజములై వడి సొం పగుదీర్ఘవాలముల్

దనరఁ బదాభిఘాతజనితం బగుసాంద్రపరాగ మాకసం
బున సజలాంబుదంబుక్రియఁ బొల్పు వహింప వడిం జరించుచున్. 708

వ. మఱియుఁ బ్రాణంబు విడిచి యైన మహానుభావుం డగు రామునకుఁ బ్రియంబు సేయుద మంతకంటె మన కభ్యుదయం బెయ్యది యని తలంచుచు దశకోటి శతకోటివానరు లొక్కుమ్మడి యుత్తుంగులై లంకాపురంబు లగ్గలుపట్టి పర్వతాగ్రద్రుమముష్టిప్రహారంబుల ననసంఖ్యంబు లగుప్రాకారాగ్రంబులు పడఁ గూల్చుచు శైలాగ్రతృణపాంసుకాష్ఠంబులచేతఁ బ్రసన్నసలిలయుతంబు లగునగడ్తలం బూడ్చుచుఁ గాంచనమయంబు లగుతోరణంబు లుత్పాటించుచుఁ గైలాసశిఖరాకారంబు లగుగోపురంబులువిఱుగంద్రోయుచు మహాగజప్రమాణంబు లగు పాషాణంబులు రువ్వుచుఁ గాలమేఘంబులకరణి గర్జించుచు నతిలాఘవంబున మహోన్నతప్రాకారంబులమీఁదికి దాఁటుచు నతిబలుం డగురాముండును మహాబలుం డగులక్ష్మణుండును రాఘవాభిపాలితుం డగుసుగ్రీవుండునువిజయు లగుదురు గాక యని ఘోషించుచుండి రప్పుడు వీరబాహుండును సుబాహుండును వనగోచరుం డగునీలుండును సైన్యసమేతులై లంకాప్రాకారాధిరోహణంబుఁ జేసి రప్పుడు యూథపులు స్కంధావారనివేశనంబు గావించిరి బలవంతుఁ డగుకుముదుండు జితకాశు లగుపదికోట్లవానరులం గూడి యీశాన్యకోణంబునఁ బన్ని పూర్వద్వారం బాక్రమించి నీలునకు బాసటగా నిల్చె నతనికి సహాయుండై మహాబలుం డగుపనసుండును బ్రసభుండును స్వబలసమేతులై యతనిపార్శ్వంబున నివసించిరి శతవలి యంగదునకు బాసటగా దక్షిణద్వారంబు నాక్రమించి యాగ్నేయకోణంబున నిరువదికోట్లవానరులం గూడి వసియించె మహావీరుం డైనసుషేణుండు హనుమంతునకు సహాయంబుగాఁబశ్చిమ-ద్వారంబు నాక్రమించి యఱువదికోట్లవానరులం గూడి నైరృతికోణంబునం బన్నె రామసహాయార్థంబు పూర్వోక్తప్రకారంబున సుగ్రీవుండు జాంబవత్సహితుం డై యనంతబలపరివృతుండై యుత్తరపశ్చిమద్వారంబుల నాక్రమించి వాయవ్యకోణంబున నధివసించెమహాకాయుండును మహావీర్యుండునుభీమదర్శనుండును గోలాంగూలవిభుండు నగుగవాక్షుండు గోలాంగూలకోటి సేవింప రామునిపార్శ్వంబునం బన్నె శత్రునిబర్హణుం డగుధూమ్రుండు భల్లూకకోటి సేవింప రామునిరెండవపార్శ్వంబునం బన్నె మహావీర్యుం డగువిభీషణుండు గదాపాణియై సచివచతుష్టయసమన్వితంబుగా నమ్మహానుభావునిపార్శ్వం బలంకరించె గజగవయగవాక్షశరభగంధమాదనులు సర్వస్థలంబులం దిరుగుచు వానరవాహిని రక్షించు చుండిరి తక్కిన యూథపులందఱు నిజసైన్యసమేతులై యెడనెడం బన్ని రక్తలం గంతయు నెఱింగి రాక్షసేశ్వరుం డగురావణుండు కోపపరీతచిత్తుం డై. 709

రావణుఁడు వానరులమీఁదికి రాక్షసదండనాథులం బంపుట.

ఉ. దానవదండనాథులఁ బ్రతాపవిశిష్టులఁ జూచి మీఱికేఁ
మానుగ నాత్మసేనల ఘనంబుగఁ గూడి మనంబులో నెగు
ల్మాని ప్రచండవేగమునఁ గ్రక్కున నేగి మహారణంబులో
వానరవీరులం దునిమి వచ్చి జయం బొనఁగుండు నా కొగిన్. 710

ఉ. నా విని యానిశాటులు మనంబున మిక్కిలి జన్యకౌతుకం
బావహిలంగ శీఘ్రమున నాత్మబలంబులఁ గూర్చి పేర్చి నా
నావిధసాధనంబులు ఘనంబుగఁ దాల్చి యలంకృతాంగులై
రావణుచే ననుజ్ఞఁ గొని రాజితవిక్రమసార మొప్పఁగన్. 711

ఉ. మించినవేడ్కతో దెసలు మిన్ను చలింపఁ బ్రయాణభేరి ప్రే
యించి ప్రచండశౌర్యము వహించి ముఖానిలపూరితప్రభో
దంచితశంఖనాదము సుదగ్రభయానకసింహనాదము
ల్మించి పురంబు నిండ నవలీల రణంబున కేగి రుద్ధతిన్. 712

ఉ. కొండలకైవడిం దనరు గొప్పశరీరము లొప్పఁ బద్మగ
ర్భాండము వ్రక్కలౌ భయదాయతభీషణబృంహితధ్వనుల్
మెండుగ సల్పుచు న్మృతిసమీరముల న్ఘనము ల్చలింప వే
దండచయంబు లొక్కమొగి నాజికి నేగె నిరంతరంబుగన్. 713

చ. సురుచిరరమ్యదేహమణిశోభితము ల్భృతరంధ్రభాగముల్
గురుతరరోచమానములు గూడినకంఠతలంబు లొప్పఁగా
శరధులభంగి నూర్ముల నెస న్ధరణీతల మాక్రమించుచున్
ఖరహరు లేగె హేషితరవంబు లెసంగ మనోజవంబునన్. 714

సీ. చటులధ్వజాగ్రసంఘటితపటానిలవేగంబున మొయిళ్లు విచ్చి పాఱఁ
గమనీయనేమిసంఘట్టనంబునఁ బుట్టువసుధాపరాగ మాకసము నిండ
రణితఘంటాఘణంఘణనినాదంబులు దిక్కరికర్ణముల్ వ్రక్కలింప
సముదగ్రవేగభారము మోవఁ జాలక బ్రమసి శేషుండు భోగములు వంప

తే. నంబరమ్మునఁ జనుపంకజాప్తరథము, కరణిఁ జూడ్కికి దుర్నిరీక్ష్యంబు లగుచు
నఖిలసాంగ్రామికరథంబు లద్భుతగతి, మొనసి కట్టంబుగా రణంబునకు నడచె.

చ. పరశుగదాసికుంతములఁ బ్రాసపరశ్వధముద్గరంబులం
గరములఁ బూని బిట్టులుక గాటుకకొండలభంగిఁ గ్రాలుచున్
గురుతరసింహనాదములు ఘోరముగా భువి నిండ యామినీ
చరు లతిదారుణక్రియ ససంఖ్యులు పోరికి నేగి రుద్ధతిన్. 716

ఉ. మున్ను రణంబులో దివిజముఖ్యుని శక్రు జయించి కీర్తిఁ గై
కొన్నభుజాబలాధికుఁ డకుంఠితశౌర్యుఁ డమోఘవీర్యసం

పన్నుఁడు భూరిమాయికుఁడు పంక్తిముఖాత్మజుఁ డింద్రజిత్తు దా
నెన్నిక కెక్క జన్యమున కేగె నుదగ్రరథాధిరూఢుఁ డై. 717

వానరరాక్షసు లొండొరులం గలసి పోరుట.

వ. మఱియుఁ బ్రజంఘుండును జంబుమాలియు సుప్తఘ్నుండును యజ్ఞశత్రుండును మిత్రఘ్నుండును నగ్నికేతుండును రశ్మికేతుండును నశనిప్రభుండును వజ్రముష్టియును దపనుండును బ్రతపనుండును గుంభుండును నికుంభుండును విరూపాక్షుండును బ్రఘసుండును విద్యున్మాలియు మొదలుగాఁ గల పేరుగలరాక్షసవీరు లందఱు హయగజరథంబు లారోహించి సకలసాంగ్రామికపరికరసమేతు లై ప్రచండవేగంబున భండనంబునకు వెడలి రిట్లు గజకచ్ఛపంబులును దురంగమండూకంబులును రథపోతంబులును వీరభటమకరంబులును నానావిధహేతిమీనంబులును శంఖడిండీరంబులును బాహువిక్షేపతరంగంబులును గలిగి రాక్షసరాజసేనారూపవృష్టిసమయప్రవర్ధితగంగానదీప్రవాహంబు రామసాగరంబు నుద్దేశించి మహావేగంబునం బఱచె మఱియు గజకుంభకుచయు శంఖకంఠయుఁ జక్రనితంబయు మహాసివేణియుఁ గాహళజంఘికయు ధనుర్భ్యాలతాయుక్తయు మహాపరిఘహస్తయు నై యయ్యాతుధానపృతనేందిర భేరీపణవపటహకాహళమృదంగవాద్యస్వనపూర్వకంబుగా నతివిలాసంబున నిర్గమించి భద్రమూర్తి యగు రామభద్రుని వరింపం జనియె నిట్లందఱుఁ గూడుకొని పురంబు నిర్గమించి పర్వసమయంబునం బూర్యమాణం బైనమహోదధివేగంబులకరణి ననివార్యు లై శంఖసహితంబు లైనశుభనీలశరీరంబులు బలాకలం గూడినవిద్యున్మండలసన్నద్ధమేఘంబులభంగి వెలుంగ భీషణారభసాతిశయంబున వానరసైన్యంబు గదియ నడిచి రప్పుడు తదీయచరణవిఘట్టనంబునఁ బుట్టినమహీపరాగపటలం బంబరంబున కంబుదత్వంబు సంపాదింపఁ దన్మహాభరణస్థగితమణిరత్నచాకచక్యంబులును దదీయవివిధహేతిచ్ఛటాధాళధళ్యంబులును గ్రొక్కారుమెఱుంగుల తెఱం గంగీకరించె నిత్తెఱంగున నుభయసైన్యంబులు కట్టాయితంబు లై కయ్యంబునకుఁ దార్కొనునప్పుడు వానరసైన్యంబులందుఁ బుట్టినభీషణనిర్ఘోషణంబులును రాక్షససైన్యంబులం బుట్టినసింహనాదశంఖదుందుభిస్వనంబులును గజబృంహితంబులును వాజిహేషలును రథనేమిఘంటానిస్వనంబులును మౌర్వీటంకారశబ్దంబులును భూమ్యంతరిక్షదివంబులందును దిగంతంబులందును సాగరంబులందును గులాచలంబునందును ప్రతిధ్వనులు సెలంగ ససానుప్రస్థకందరం బైనమలయాచలంబు నిండి చెలంగె నిట్లు కూడుకొనినవానరులకు రాక్షసులకుఁ దొల్లి దేవాసురలకుంబోలె దారుణం బగుసంగ్రామం బయ్యె నప్పుడు రాక్షసులు నిజవిక్రమంబు ప్రకటింపం జేయుచుఁ బ్రదీప్తగదాముసలముద్గరభిండివాలకరవాలశక్తితోమరపరిఘపట్టిసప్రాసశూలకుంతప్రముఖనిఖిలాయుధంబులు దట్టంబుగాఁ బఱపిన నవ్వానరశ్రేష్ఠులు కోపించి. 718

చ. అనిమొన దేవదానవులకైన నసాధ్యబలుండు రాఘవుం
డనిమిషలోకసన్నుతమహాద్భుతవిక్రముఁ డైనలక్ష్మణుం
డనవరతంబు రామమనుజాధిపరక్షితుఁ డైనసూర్యనం
దనుఁడును మాకు సంగరమున న్జయమిత్తురు గాక సత్కృపన్. 719

మ. అని చింతించుచు నాత్మపౌరుషము లుద్యచ్ఛక్తులు న్నామము
ల్వినుతౌదార్యము దెల్పుచు న్జయజయశ్రీరామ యంచు న్మదం
బున దీపించుచు భూరిశైలశిఖరంబు ల్వృక్షరంబు ల్తరు
ల్గొని దైతేయులమీఁద వ్రేసిరి మహాఘోరప్రకారంబునన్. 720

శా. ప్రాకారంబులనుండి కొంద ఱసురు ల్పాపబల్య మేపార న
స్తోకప్రౌఢి ననేకశూలములు ప్రస్థూలోగ్రఖడ్గంబులున్
వీఁక న్దారుణభిండివాలములు నుర్విన్శక్తులం గేశులన్
సాకల్యంబుగ వ్రేసి యార్చిరి దిశాచక్రంబు గంపింపఁగన్. 721

ఉ. వ్రేటునఁ బుట్టుకోపమున వెండియు సాలముమీఁది కుద్ధతిన్
దాఁటి ప్లవంగమోత్తములు దారుణదంతనఖంబుల న్నిరా
ఘాటనగేంద్రకూటతరుకాండములం గఠినాశ్మసంక్తులన్
వాటముగా వడిం బొడిచి వ్రక్కలు వాపిరి రాక్షసాంగముల్. 722

మ ఇరువా గుద్ధతి నిట్లు దార్కొని రణం బేపారఁ గావింప న
త్తఱి నన్యోన్యశిలాయుధప్రహతులం దద్గాత్రముల్ వ్రచ్చి దు
ర్భరభంగి న్వడి శోణితౌఘము స్రవింప న్నాగెఁ గొండ ల్పయో
ధరవేళ న్సెలయేటులంబలె గజేంద్రంబు ల్మదంబుంబలెన్. 723

సీ. ప్రబలవానరదైత్యపదఘట్టనంబునఁ బుట్టినదట్టంపుభూరజంబు
శిలల రువ్వెఁడు కైదువులఁ గ్రమ్ముఁ దని యిరుగడలవా రాడునగ్గలవునులివు
భ్రమగొని పాఱిపోకుము నిలునిలు మని తఱుమువారల బెట్టిదంపురవము
వెఱ పేది మన కింక వీర్య మెన్నటి కని కలగొనువారిహుంకారనినద

తే. మొండొరులమీఁద నేయుమహోగ్రవృక్ష
కఠినపాషాణశస్త్రసంఘర్షణమున
నరిది పుట్టినపెనుమంట లాకసమున
దట్టమై పర్వె నత్తొలితాఁకునందు. 724

వానరరాక్షసులద్వంద్వయుద్ధము.

వ ఇట్లయ్యిరుదెససైన్యంబులు నిండినసముద్రంబులభంగి నుప్పొంగి యొండొంటిం దాఁకి పోరునప్పు డమ్మహారణంబు తుములం బై మాంసశోణితకర్దమం బై ప్రవర్తిల్లుచుండె నంత రాక్షససైన్యంబునం గలయోధులు బలకోపంబు లినుమడింప నొండొరులం బురికొల్పుకొని రావణునకు విజయంబు సంపాదింపుతలం

పునఁ బలుదెఱంగులం బెనంగ నేర్పు గలిగి కాంచనాపీడంబు లగుహయంబు
లం బూన్చి వహ్నిశిఖాసంకాశంబు లైనసిడంబు లెత్తినసూర్యసంకాశంబు
లగురథంబు లెక్కి వైశ్వానరసమప్రభంబు లగుకవచంబులఁ గైసేసి భేరీశం
ఖారవపూర్వకంబుగా సింహనాదంబులు సేయుచు సేనకుం దలకడచి మౌర్వీ
టంకారనాదంబు దిక్కులంబిక్కటిల్ల భీషణరభసాతిరేకంబుగాసముద్రమధ్యం
బున నుండి వాయువశంబున సువేలాచక్రంబు నతిక్రమించి వచ్చుమహాప్రవా
హంబుకరణి నొప్పుచున్నవానరసేనమీఁదం దలపడిన నందుఁ జేయుంగలయో
ధులు సైన్యంబులఁ బిఱిందికిం ద్రోచుకొని తలమిగిలి మహాపర్వతంబులకరణి
దారుణప్రకారంబున రాక్షసులం దాఁకిన నయ్యిరుదెసల వీరాగ్రేసరులకుఁ
బ్రచండంబుగా ద్వంద్వయుద్ధంబు చెల్లె నందు వాలిపుత్రుం డైనయంగదుం
డును నింద్రజితుండును దురాధర్షుం డగుసంపాతియుఁ బ్రజంఘుండును సమా
రబ్ధుం డగుహనుమంతుండును జంబుమాలియుఁ దీక్ష్ణవేగుం డగువిభీషణుం
డును మిత్రఘ్నుండును మహావీర్యుం డగుమైందుండును వజ్రముష్టియు మహా
బలుం డగుద్వివిదుండును నశనిప్రభుండును బ్రతాపవంతుం డగుగజుండును
దపనుండును మహాతేజుం డగునీలుండును నికుంభుండును వానరేంద్రుం డగు
సుగ్రీవుండును బ్రఘసుండును శ్రీమంతుం డగులక్ష్మణుండును విరూపాక్షుం
డును దుర్ధర్షుం డగునలుండును బ్రతపనుండును బలవంతుం డగుసుషేణుం
డును విద్యున్మాలియుం గ్రమంబునఁ ద్ర్యంబకాంతకులభంగి వాసవవృత్రుల
కరణి గరుడపన్నగంబులవగిది సింహగజంబులకైవడి నృసింహహిరణ్యకశిపుల
చందంబునఁ గార్త్తికేయతారకాసురులమాడ్కి వాయువలాహకంబులసొబగున
భాస్కరాంధకారంబులవైఖరి శార్దూలహరిణంబులచాడ్పున వీరభద్రదక్షుల
క్రియ శరభపంచాననంబులబాగునఁదలపడిరి మహామహీధరంబుతో మార్కొ
న్నతగరులవిధంబున రామునితో రశ్మికేతుండును నగ్నికేతుండును సుప్తఘ్నుం
డును యజ్ఞశత్రుండును మార్కొనిరి మఱియు ననేకులు ననేకులం దాఁకి రిట్లు
దలపడి యన్యోన్యజయకాంక్ష బినుమడింప మచ్ఛరంబునం బెచ్చుపెరిఁగి విచ్చల
విడి ప్రచండభంగిం బోరి రమ్మహాయుద్ధంబు సంకులంబై రోమహర్షణం బై త్రై
లోక్యభయానకంబై ప్రవర్తిల్లె నప్పుడు వానరరాక్షసశరీరప్రభూతంబులై కేశ
శాద్వలంబులై శరీరసంఘాటవహంబులై రణభూమియందనేకరుధిరప్రవాహం
బులుఘోరంబులుగాఁ బ్రవహించెఁ బెక్కెడలఁ బెక్కుసంకులసమరంబులుచెల్లు
చుండె ననేకస్థలంబుల ననేకులొక్కనిమీఁదఁ బరాక్రమించుచుండిరిమఱియు
ననేకదేశంబుల ననేకులమీఁద నొక్కరుండు విక్రమంబుఁ జూపుచుండెనంత.

ఉ. దానవనాథనందనుఁడు దారుణవిక్రముఁ డింద్రజిత్తు తా
మానసవీథిఁ గోప మభిమానము మీఱఁగ వజ్రివజ్రము
న్బోని నిశాతబాణమున భూజచరేంద్రసుతు న్బలాఢ్యు జ

న్యానతవైరి నంగదుని యంగము నొవ్వఁగ నేసి యార్చినన్. 726

ఉ. కోపముఁ బెంచి యంగదుఁడు ఘోరభుజాబలదర్ప మొప్పఁ ద
చ్చాపము ద్రుంచి యశ్వముల సారథి నొక్కటఁ జంపి వహ్నికి
లోపమకాంచనధ్వజము నుర్వరఁ గూల్చి రథంబు ద్రుంప వాఁ
డేవు దొఱంగి వేగ చనియెం దగ నొండొక తేరిమీఁదికిన్. 727

ఉ. ఆతతవిక్రమంబు పొలుపారఁ బ్రజంఘుఁడు భూరిజంఘుఁ డ
బ్జాతసఖాంశుతుల్యవిలసత్ప్రదరత్రయవిద్ధుఁ జేయ సం
ప్రాతి మనంబులోఁ గినుక పర్వ రణంబున నశ్వకర్ణభూ
జాతమున న్నిశాచరునిఁ జయ్యన వ్రేసె మదం బడంగఁగన్. 728

✤ జంబుమాలిమిత్రఘ్నవజ్రముష్ట్యశనిప్రభులు హనుమద్విభీషణమైందద్వివిదులచేఁ జచ్చుట. ✤

చ. అరదముమీఁదనుండి రయమార మహోగ్రుఁడు జంబుమాలి భీ
కరతరకోపవేగమునఁ గన్నుల నగ్నికణంబు లొల్కఁగా
సురుచిరశక్తిచేఁ బవనసూనుని ఱొమ్మదరంగ వ్రేసినం
బరువడి నవ్వనాటకులపాలుఁడు కోపరసోగ్రమూర్తియై. 729

ఉ. వానిరథంబుపై కుఱికి వాజుల గీటణఁగించి సారథిన్
మానక చంపి హేమమయనవ్యయుగధ్వజచక్రకూబర
స్థానములం బదాహతి రస న్వెసఁ గూలఁగఁ దన్ని పాణిచే
వానియురంబు దట్టుటయు వాఁ డిలఁ గూలెఁ గుజంబుచాడ్పునన్. 730

మ. పది తూపు ల్నిగిడించి శీఘ్రము నిలింపద్రోహి మిత్రఘ్నుఁడుం
గదనాసక్తు విభీషణుం బొదివినం గాలాంతకాకారుఁ డై
గదచే నాతఁడు వానిఱొమ్ము పటుదోర్గర్వం బఖర్వంబుగా
విదళించె న్సురసిద్ధసాధ్యులు దివి న్వేనోళ్లఁ గీర్తింపఁగన్. 731

చ. మసలక వజ్రముష్టి యలమైందుని సాయకవిద్ధుఁ జేసిన
న్వెస నతఁ డాగ్రహించి భుజవీర్య మెలర్పఁగఁ దచ్ఛతాంగము
న్విసువక యశ్వసారథులవిద్రుమకేతన మూర్విఁ గూల్చి య
య్యసురునిఁ జంపె ముష్టిహతి నద్రిచరు ల్మదమంది చూడఁగన్. 732

చ. ద్వివిదుఁడు వేడ్క నొక్కపృథివీధరశృంగముఁ దెచ్చి తోడివా
రవు నన దోర్బలం బెసఁగ నయ్యశనిప్రభుమీఁద నేసినం
బవినిభతీక్ష్ణబాణములఁ బర్వతము న్విదళించి దైత్యుఁ డా
ద్వివిదునిమీఁద నేసెఁ బటుతీవ్రసుపర్వశిలాస్త్రజాలముల్. 733

చ. వనచరవీరుఁ డిట్లు పరివర్ధితసాయకవిద్ధగాత్రుఁ డై
మనమున నాగ్రహం బొదవ మానక వాజుల గీటణంచి సూ
తునిఁ దెగటార్చి కేతనము ద్రుంచి శతాంగము గూలఁ దన్ని య
ద్దనుజునిఁ గూలవైచెఁ బటుదారుణపాణితలాభిసంహతిన్. 734

తపనప్రఘసప్రతనవిద్యున్మాలులు గజసుగ్రీవనలసుషేణులచేఁ జచ్చుట.

చ. తపనుఁడు క్రుద్ధుఁడై గజునిఁ దాఁకి శితాంబకవిద్ధుఁ జేయ న
వ్విపులపరాక్రముం డలిగి వేగ హయంబులఁ జంపి సారథిం
జపలగతి న్వెలింగెడుధ్వజంబును ధారుణిఁ గూల్చి దైత్యుని
న్విపులఁ బడంగ నేసెఁ బటువృత్తిమునం దనవారు మెచ్చఁగన్. 785

చ. కులగిరితుల్యకాయుఁడు నికుంభుఁడు సంగరశీలు నీలునిం
దలఁకఁగ గిట్టి మార్గణశతంబున నంగము నొంచి వెండియుం
జలమున నంశుమంతుఁడు ప్రచండకరంబుల మేఘమున్బలెన్
దలకొని తీవ్రబాణములఁ దద్దయు నాతనిఁ గప్పె నుద్ధతిన్. 786

చ. హరిబలనాథుఁ డప్పుడు తదద్భుతవీర్యముఁ జూచి క్రుద్ధుఁడై
హరియనుబోలెఁ దద్రథరథాంగము గైకొని దానిచే రణ
స్థిరఁ బడ వానిసూతుఁ దలద్రెవ్వఁగ నేసిన సంభ్రమంబునం
బొరసి యథేచ్ఛ నీడ్చుకొనిపోయె హయంబులు తచ్ఛతాంగమున్. 787

చ. అరదము డిగ్గి ఘోరముగ నాస్యబిలం బటు విచ్చి సేనలం
దిరముగ మ్రింగ వచ్చుపగిదిం జనుదెంచెడువాని దానవున్
స్ఫురదతిదీర్ఘకాయుఁ బ్రఘసుం గని వానరవల్లభుండు తీ
వరముగ సప్తపర్ణమున వాని వధించె మహాద్భుతంబుగన్. 788

ఉ. అంచితభంగిఁ బన్ని విలయాభ్రము భూరినగంబుమీఁద వ
ర్షించినమాడ్కి దోర్బలవిశేష మెలర్ప రణంబులో విజృం
భించి విరూపలోచనుఁడు మెచ్చఁగ లక్ష్మణుమీఁద నారి మ్రో
యించి మహోగ్రభంగిఁ గురియించె నిరంతరబాణవర్షముల్. 739

ఉ. అప్పుడు లక్ష్మణుండు రయమార నినుండు లసత్కరంబులన్
దెప్పర మైనమంచుపగిది న్రజనీచరబాణవర్షముం
దప్పక మాయఁ జేసి యొకదారుణసాయక మేసి విక్రమం
బుప్పతిలంగ వానిబలముబ్బును జేవయు మాన్చె నుద్ధతిన్. 740

శా. ఆలంబందు మహోగ్రుఁడై ప్రతపనుం డావిశ్వకర్మాత్మజుం
గాలాభు న్నలుఁ దాఁకి దారుణభుజాగర్వోద్ధతిం జూపినన్
వాలాయం బతఁ డల్గి ఘోరసమరవ్యాపారధౌరేయుఁడై
దోలె న్వాని విశాలసాలనిహతి న్దోర్దర్ప మేపారఁగన్. 741

సీ. వీఁక సుషేణునిఁ దాఁకి విద్యున్మాలి చారుకాంచనపుంఖసాయకములు
గుప్పించి నొప్పింపఁ గ్రుద్ధుఁడై యాతండు గిరిశిఖరము పెల్లగించి తెచ్చి
వానిరథంబుపై వైచిన వాఁ డతిలాఘవం బడర నుర్వరకు దాఁటి
గదగొని యేతేరఁ గని కపివరుఁ డొక్కశిల గొని రాఁగ వీక్షించి వాఁడు

తే. తరుచరునిమీఁద గద వైవ దానిఁ ద్రుంచి,వానియురమున శిల వీచివైవ దాని
వ్రేటున నురంబు పగిలి రాత్రించరుండు,కొండభంగి గతాసుఁడై క్షోణిఁగూలె.

రాముం డగ్నికేతురశ్మికేతుయజ్ఞశత్రుసుప్తఘ్నులం జంపుట.

తే. రణములో నగ్నికేతుండు రశ్మికేతు, యజ్ఞశత్రులు సుప్తఘ్ను లలవు చలము
సెలఁగ రామునిపైఁ బెక్కు శితశరములు, తెంపు దీపింప వెస నిగిడింపఁ గనిసి.

ఉ. ఆరఘుపుంగవుం డతిభయంకరుఁ డై వెస నాల్గుతూపుల
న్వారని వేడ్క నద్దివిజవైరుల నల్వురమస్తకంబులన్
దారుణభంగిఁ ద్రుంప నవి తద్దయు నొప్పుచు మింట నుండి యా
ధారుణిఁ గూలె వాతపతితస్ఫుటతాళఫలంబులో యనన్. 744

క. మఱియు ననేకు లనేకుల, నురుబలమునఁ దాఁకి ద్వంద్వయుద్ధ మొనర్పం
దరుచరులచేత రజనీ,చరులు మడిసి రపుడు ఘోరసంగ్రామమునన్. 745

వ. మఱియు నవ్వానరశ్రేష్ఠు లునూతనాయోధనసంవర్ధితసముత్సాహులై బల
దర్పంబు లినుమడింపఁ జలంబు డింపక పోలివోనిబంటుఁదనంబున రాక్షస
బలంబుమీఁది కురవడించి శిలాపాతంబుల మత్తమాతంగంబుల విదళించుచుఁ
దరుప్రహారంబుల హయంబుల నుగ్గునూచంబు సేయుచు శైలశిఖరంబుల నరదం
బులు పఱియలు వాపుచు నఖదంతంబుల వ్రచ్చి రాక్షసుల గీటణంచుచు
విజృంభించిన భగ్నంబులై నఖడ్గశూలగదాశక్తితోమరంబులును నపవిద్ధంబు
లైనయరదంబులును బ్రభిన్నంబులైనసాంగ్రామికహయంబులును నిహతంబు
లైనమత్తమాతంగంబులును విశకలితంబులైనకేతనాతపత్రయుగాక్షచక్రకూ
బరంబులునుజూర్ణితంబులైనభూషణంబులును గతాసులైనరాక్షసులునుంగలిగి
యయ్యాయోధనంబు దారుణదర్శనం బయ్యె ననేకబంధంబు లాకాశంబున
కెగసి యద్భుతప్రకారంబున నాడుచుండ భూతభేతాళంబులును గాకఘూకసృ
గాలంబులును రణరంగంబున ఘోరంబుగాఁ గ్రీడించుచుండెఁ దొల్లి దేవాసుర
యుద్ధం బింత బెట్టిదంబు గా దనుచు గగనంబున దేవత లగ్గించుచుండి రిట్లు
వానరపుంగవులచేత విదార్యమాణులైననిశాచరులు శోణితదిగ్ధగాత్రులై
సూర్యాస్తమయంబు నాకాంక్షించుచునగ్గలికసొంపునంబోరుచుండ భాస్కరుం
డస్తమించెఁ బదంపడి పరస్పరబద్ధవైరులై జయంబు గోరుచు ఘోరంబుగా
ఖండనంబు సేయువానరరాక్షసులకుఁ బ్రాణహారిణి యైనరాత్రి సంప్రవృత్త
యయ్యె నప్పుడు సంధ్యాసమయసంప్రవర్ధితసత్త్వు లగురాక్షసులకునుజితకాశు
లగువానరులకును నత్యద్భుతప్రకారంబున నిశాయుద్ధంబు ప్రవర్తిల్లె నమ్మహాం
ధకారంబునందు. 746

వానరరాక్షసుల రాత్రియుద్ధము.

ఆ. తోఁక లేనివారి దోషాటు లని మది, నెఱిఁగి కపులు పోరి రేవు మీఱి
తోఁక లున్నవారి వీఁకతోఁ గపు లని, యెఱిఁగి పోరి రసురు లేకతమున. 747

క. తెంపుమెయి గాఢతమమునఁ, ద్రుంపుఁడు పిఱుతియక పట్టి దోషాచరులం
జంపుఁడు యమలోకమునకుఁ, బంపుఁ డనుచు బలుకునులివుబహులంబయ్యెన్.

క. నీలాచలములకై వడిఁ, గ్రాలెడురాక్షసులు బద్ధకాంచనముల ను
ద్వేలమహౌషధివనయుత, శైలంబులమాడ్కి నొప్పెసఁగి రవ్వేళన్. 749

క. ఆదారుణంపుఁజీఁకటి, మేదురముగఁ గలిసి కపుల మిన్నక క్రోధో
న్మాదమునఁ బట్టికొని క్రవ్యాదులు నడి మ్రింగఁ దొడఁగి రతిరౌద్రమునన్.

సీ. లాంగూలములఁ జుట్టి రథికసారథిహయాన్వితముగా రథములు విసరి వైచి
యారోహకాధోరణాన్వితంబుగ ఘోరవారణంబుల గోళ్ల వ్రచ్చి చంపి
కనకభూషణతురంగముల నాకర్షించి పిడికిటిపోటులఁ బుడమిఁ గూల్చి
జంభోళినిభతీక్ష్ణధవళదంతంబుల ఘోరాసురులతలల్గొఱికి వైచి

తే. దురమున బలాఢ్యులైన వానరులు గవిసి
క్రోధమూర్ఛితులై మహాఘోరతనుల
దానవులఁ బట్టి కఠినదంతముల నమలి
మ్రింగఁ దొడఁగి రాదారుణసంగరమున. 751

శా. వీరశ్రేష్ఠులు రామలక్ష్మణులు దోర్వీర్యం బవార్యంబుగా
నారి న్వే మొఱయించి మి న్నదరఁగా నానాస్త్రపాతంబులన్
హారాలంకృతగాత్రుల న్ఖలుల దృశ్యాదృశ్యులన్ దైత్యుల
న్ఘోరప్రక్రియఁ గూల్చుచుండిరి పటుక్రోధంబు సార్థంబుగన్. 752

క. ధరణీపరాగ మప్పుడు, హరిఖురవిధ్వస్తమై శతాంగోత్థితమై
తఱుచుగ బెరసి నిశాచర, హరివరులవిలోకనంబు లవరోధించెన్. 753

క. భువనభయంకరవైఖరి, బవరం బటు చెల్లుచుండ భండనధరయం
దవిరళగతి రుధిరనదీ, ప్రవాహము లనేకములుగఁ బ్రవహించె వడిన్. 754

క. భేరీమృదంగఢక్కా, ఘోరధ్వనిశంఖవేణుఘోషయుతం బై
వారాశిరవముకై వడి, బోరుకలఁగె దిశలు మిన్ను పుడమియుఁ బగులన్. 755

తే. వాజిహేషారవంబులు వారణేంద్ర, బృంహితంబులు రథనేమిపృథురవములు
దానవులసింహనాదముల్ దారుణగతిఁ, జెలఁగె నప్పుడు దట్టమై చెవుడు కట్ట.

తే. శక్తిశూలపరశ్వధసంయుతముగఁ
గూలువానరవీరులు కుధరవృక్ష
సహితముగఁ గూలుఘోరరాక్షసులు గలిగి
భండనావని దారుణభంగి యయ్యె. 757

వ. మఱియును. 758

తే. శస్త్రపుష్పోపహార యై సాంద్రరుధిర
వితతకర్దమ యై దుష్ప్రవేశ యై క

రంబు దుర్జయ మై సమారబ్ధ మై ర
ణావని చెలంగె నప్పు డత్యద్భుతముగ. 759

తే. మఱియు నారాత్రి రాక్షసమర్కటులకుఁ
బ్రాణహారిణి యై ఘోరభంగి యై క
రంబు భూతములకుఁ గాళరాత్రిపోలెఁ
బరఁగ ననివార్య యై తోఁచెఁ బ్రధనమందు. 760

క. ఆదారుణతమమునఁ గ్రవ్యాదులు సంహృష్టు లగుచు నంబకవృష్టిన్
మేదురముగఁ గురియించుచుఁ, గైదువ లంకించి రాముఁ గదిసిరి వేగన్. 761

క. ఈరీతిం గదిసిన దేవారాతులసింహనాద మద్భుతభంగిన్
మీఱె లయకాలమందలి, వారిధిన స్తకరవంబువడువున దళమై. 762

వ. ఇట్లు యజ్ఞశత్రుండును మహోదరమహాపార్శ్వులును వజ్రదంష్ట్రుండును శుకసార
ణులు నీయార్వురు రథికులు రాత్రిసమయసంవర్ధితబలు లై చలంబునం దాఁకిన
నవ్వీరశిఖామణి యగురాముండు దీప్తాగ్నిశిఖాసంకాశసాయకషట్కంబు నిగి
డించి నిమేషాంతరమాత్రంబులోన నద్దానవషట్కంబు నుబ్బణంచిన వారు
రామబాణపీడితవర్మమర్ము లై గాఢమూర్ఛాపారవశ్యంబునఁ బుడమిం ద్రెళ్లి
బహుప్రయత్నంబులఁ బ్రాణంబులు రక్షించుకొని తొలంగి చనిరి రాముండు
కాంచనచిత్రాంగంబు లైననారాచంబులచేత దిక్కులును గగనంబును బ్రకా
శింపఁ జేయుచుండె నెవ్వ రెవరు రామున కభిముఖంబుగా నడరి రట్టిభీమకాయు
లగురాక్షసు లందఱుఁ దదీయశరవిదారితావయవు లై పావకు నెదిరించినపతం
గంబులమాడ్కి సముద్రంబుఁ జొచ్చిననదీప్రవాహంబులభంగి శైలంబు
తోడ మార్కొన్నతగరులరీతిఁ బొడ వడంగిరి మఱియు సువర్ణపుంఖంబు లగు
తదీయకాండసహస్రంబులచేత ఖద్యోతంబులచేతంబోలె నారాత్రి విచిత్ర యై
యొప్పె మఱియుఁ దదీయసాయకపరిబద్ధగరుత్సమీరణంబు సముదీర్ణనిర్ఘోష
భీషణం బై ప్రళయకాలఝంఝావాతంబుకరణి రాక్షసులనెల్లనుడివడం జేయు
చుండె నొక్కొక్కచోటఁ బెక్కండ్రరాక్షసులశిరంబులు రామబాణాభిహతం
బు లై ముసలాభిహతంబు లైనమృణ్మయకటకరాసులుంబోలెననేకశకలంబు లై
పుడమిం గూలుచుండె నప్పుడు రాక్షసులకోలాహలంబుల శంఖభేరీనినాదం
బుల నన్నిశ మిక్కిలి ఘోరతర యై తోఁచె నయ్యనుపమానప్రవృద్ధంబులచేతఁ
గందరాకీర్ణం బైనత్రికూటాచలంబు ప్రతిధ్వని గావించిన ట్లయ్యె నప్పుడు.

క. గోలాంగూలబలంబులు, వాలాయము తిమిరతుల్యవర్ణము లై యా
భీలగతి యామినీచర, జాలంబులఁ బట్టి మ్రింగ సాఁగె నురవడిన్. 764

అంగదునిచే నింద్రజిత్తు విరథుం డగుట.

ఉ. ఆసమయంబున న్లయహుతాశనుకై వడి నుగ్రమూర్తి యై
వాసవపౌత్త్రుఁ డంగదుఁడు వాసవజిత్తు వధింపఁ గోరి పే

రాస మహీజ మొక్కటి శయంబునఁ బూని రయం బెలర్ప ను
ల్లాసము మీఱ డాసి హరుల న్రథచోదకుఁ జావ నేసినన్. 765

క. హతరథుఁడు హతతురంగుఁడు, హతసూతుఁడు నగుచు రావణాత్మజుఁడు భయో
ద్ధతి నతివేగంబున న,ద్భుతభంగి నదృశ్యుఁ డయ్యెఁ బులుఁగువిధమునన్. 766

ఉ. వాలికుమారుబాహువిభవంబుఁ బరాజితుఁ డైనరావణిం
బోలఁగఁ జూచి ము న్నతనిపోక లెఱింగినసర్వభూతముల్
హేళిఁ డావిభీషణుఁడు నృక్షచరు ల్నృపతు ల్సుర ల్మును
ల్చాలఁ బ్రమోద మంది పలుచందముల న్వినుతించి రంగదున్. 767

క. ఘనసత్త్వుఁ డైనవాసవి, తనయునిచే విజితుఁ డై ప్రతాపనిధి దశా
ననతనయుఁడు మిక్కుటముగఁ, దనమనమునఁ గినుకఁ బూనె దారుణభంగిన్.

క. ఈరీతిఁ గ్రుద్ధుఁ డైనబ,లారాతివిరోధిరభస మంతయుఁ గని యా
భూరమణుఁడు రాముఁడు కపి, వీరుల వీక్షించి చేయివీచుచుఁ బలికెన్. 769

రాముఁడు కుపితుం డగునింద్రజిత్తును జూచి వానరులఁ బురికొల్పుట.

చ. తరుచరులార వీఁడు విధిద త్తవరంబునఁ జేసి గర్వి యై
పరువడి ముజ్జగంబులకు బాధ యొనర్చుచు నుండు నిచ్చలుం
గర ముగుశక్తిమై మనలఁ గాలబలంబున నిగ్రహింపఁగా
దఱిసె వనాటనాథసహితంబుగ మీరు చలింప కుండుఁడీ. 770

క. ఏనును బంకజభవస,మ్మానార్థ మొకింతసేపు మానసమున దు
ర్మాని యయి విక్రమించెదు, దానవుని సహించి యుండెదను గపులారా. 771

ఇంద్రజిత్తు రామలక్ష్మణుల నాగపాశబద్ధులం జేయుట

వ. అని పలికె నప్పు డప్పాపాత్ముం డగురావణి బ్రహ్మద త్తవరుండు గావునఁ బరను దుర్జయుం డై క్రోధమూర్ఛితుం డై యంతర్ధానగతుం డై యెవ్వరికిం గానరాక మిన్నునం బన్ని యశనిసంకాశంబు లై ననిశితసాయకంబులు నిగుడించుచు మాయాసంవృతుం డై రఘునందనుల మోహింపం జేయుచు సర్వభూతంబుల కదృశ్యుం డై కూటయోధి యగుచు ఘోరంబు లై నఫణిమయశరంబులచేత నమ్మహాత్ములసర్వగాత్రంబులు భేదించి వెండియు నానావిధనారాచంబులు గుప్పించి నొప్పించి పదంపడి ప్రకాశమానుం డయ్యె నయ్యింద్రజిత్తు వీరాగ్రగణ్యు లగు దాశరథుల బాధించుటకు శక్తుండు గాక మాయ నాశ్రయించి వానరు లందఱు విలోకించుచుండఁ బరమసంక్రుద్ధుం డై ఘోరాశీవిషభూతసాయకంబు లడరించి సంధించె నప్పుడు స్వకృతమర్యాదారూపబ్రహ్మవరదానపాలనంబుకొఱకును బ్రహ్మసమ్మానంబుకొఱకును నీవద్భ్రూభంగమాత్రంబున సర్వజగత్సంహ ర్తయున శ్రేశ్వరుండు నైనరాముండుశక్రజిత్ప్రయు క్తనాగబంధనసహనంబుతనకు యు క్తం బని తలంచి యాశీవిషశరపాశబద్ధుం డై యనుజసహితంబుగాఁ బుడమిం బడి తాను బ్రతాపవంతుం డయ్యును నిజవీర్యగోపనంబు గావించి యింద్ర

జిదవస్థానప్రదేశంబు నెఱుంగం గోరి సుషేణదాయాదుల నిరువుర నీలాంగద
శరభమైందద్వివిదఋషభసానుప్రస్థాంజనేయుల దశవానరయూథపుల నవలో
కించి మీర లీరాక్షసునిగతి నన్వేషింపుఁ డని యాజ్ఞాపించిన. 772

సీ. వీరు లాహారు లంసవిన్యస్తపృథు లై రయమున గగనమార్గమున నెగసి
నిపుణు లై దిక్కు లన్వేషింప నప్పు డాయస్త్రవిదుండు దశాస్యసుతుఁడు
బ్రహ్మాస్త్రమంత్రసంపాదితశరముల వేగాఢ్యు లగువారి వేగ మడఁచె
నాకపివీరు లట్లసురబాణార్దితకాయు లై గాఢాంధకారమందు

తే. మేఘజాలావృతుం డైనమిహిరునట్లు, నిబిడమాయాపరీతుఁ డై నెగడు నింద్ర
జిత్తుఁ గనుఁగొనఁ జాలక చేష్టలుడిగి, గగనమున నుండఁజాలక కడురయమున.

చ ధరణికి డాఁటి రంత నలదానవనాథకుమారుఁ డానరే
శ్వరులసమస్తమర్మములు వ్రచ్చి గలంపఁగఁ జాలినట్టిభా
స్వరతరనాగబాణము లసంఖ్యము లేసిన నమ్మహాత్ము లా
స్థిరతరఘోరకాండములచేత నిరంతరగాత్రు లై రహీన్. 774

తే. క్షతజమార్గవినిస్సృతసాంద్రరుధిర
దిగ్ధగాత్రు లై యున్నరదేవసుతులు
పుష్పితాశోకశాల్మలీభూరుహముల
చందమునఁ జూడ నొప్పి రాసమయమునందు. 775

తే. అంత భిన్నాంజనచయాభుఁ డైనదైత్య
రాజపుత్త్రుఁడు పర్యంతరక్తనేత్రుఁ
డగుచు నంతర్హితుం డయి జగతిమీఁద
సొలసి పడియున్ననృపతులఁ జూచి పలికె. 776

చ. ఘనగతి లక్ష్యగోచరుఁడు గాక రణం బొనరించునప్డు న
న్గనుఁగొని డాయ నాసముచిఘస్మరుఁ డైనను జాలఁ డెంత మీ
రనఁగ మదీయఘోరభుజగాంబకపాశనిబద్ధు లైనమి
మ్మనిచెదఁ గాలుప్రోలి కిపు డద్రిచరు ల్వెఱఁగంది చూడఁగన్. 777

క. అని పలికి రాక్షసేశ్వర, తనయుఁడు ధర్మజ్ఞు లైనదశరథసుతులన్
ఘనబాణసహస్రకముల, ననువుగ విదళించి పటుమహాధ్వని సలిపెన్. 778

ఉ. క్రమ్మఱ రావణాత్మజుఁడు కాటుకకొండతెఱంగున న్మరీ
ర మ్మలరారఁ జాపము తిరంబుగ సజ్య మొనర్చి మీటుచు
న్నమ్మతి మీఱ దారుణపృషత్కపరంపర లేసి వారిమ
ర్మమ్ములు నొవ్వఁ జేసె నసమానభుజాబలవైభవంబునన్. 779

క. నీలాంబుదంబు చిత్రా, కాలంబునఁ జల్లు గురియు గతి మారికి నా
ఖీలధ్వనిఁ జేయుచు శర, జాలంబులు గురిసె రాజచంద్రులమీఁదన్. 780

వానరు లందఱు నాగపాశబద్ధు లైనరామలక్ష్మణులం జూచి దుఃఖించుట.

వ. ఇట్లు రామలక్ష్మణులు ప్రథమదివసంబునాఁటినిశాయుద్ధంబున శక్రజిత్ప్రయుక్త నాగపాశబద్ధులై శరజాలవిభిన్నసర్వాంగులై శరశల్యాచితాకృతులై రజ్జుముక్తంబు లైనమహేంద్రధ్వజంబులభంగినాకంపించుచు మర్మభేదకర్శితులై ప్రచలితసర్వాంగులై రుధిరోక్షితతనులై మేఘసమాచ్ఛాదితపర్వతంబులకరణి శరజాలసమాచ్ఛాదితసర్వగాత్రు లై పరమపీడితు లై పరమార్తులై మేదినింబడి శరతల్పంబున శయనించిరప్పుడు తదీయగాత్రంబులం దంగుళమాత్రప్రదేశంబైన శరంబు నాటనిచోటు లేదయ్యె నిట్లు శరతల్పగతులై చేష్టలు దక్కి ప్రస్రవణాఖ్యపర్వతంబులు జలంబుంబోలె సాంద్రంబుగా రుధిరంబు స్రవింపం జేయుచుఁ దేఱిచూడఁ జాలక నిమీలితాక్షు లై యుండిరి వెండియు నయ్యాఖండలరిపుండు రుక్మపుంఖంబులును బ్రసన్నాగ్రంబులును నధోగమనశీలంబులును దురావారంబులు నగునారాచార్ధనారాచభల్లాంజలివత్సదంతసింహనఖసింహసంతతక్షురకాదినానావిధసాయకంబులఁ బరఁగించి రాముని మిక్కిలి నొప్పించిన నమ్మహాత్ముండు స్రుక్కి భిన్నముష్టిగ్రహణప్రదేశంబును ద్రిణతంబును కర్మభూషితంబును నిజ్యంబు నగు కార్ముకంబుతోఁ గూడ వీరశయనంబునం దధివసించె నిట్లు బాణార్దితశరీరుం డై పడియున్నపురుషశ్రేష్ఠుం డగురామునింజూచి లక్ష్మణుండు జీవితంబునందు నిరాశుండై శోకించెఁ బరమసంతాపసంతప్తులైనరామలక్ష్మణులం జూచి కపులందఱుఁ బరమదుఃఖాక్రాంతచిత్తు లైరి మఱియు వానరయూథపులు శరబంధబద్ధు లై చేష్టలు దక్కి పుడమింబడి యున్నరామలక్ష్మణుల నవలోకించి విషణ్ణమానసు లై చేయునది లేక పరివేష్టించియుండిరి హనుమదంగదనలనీలమైందద్వివిదసుషేణకుముదాదివానరవీరు లందఱును సుగ్రీవుండును విభీషణుండును రావణిప్రయుక్తనాగపాశబద్ధు లై శరతల్పంబునం బవ్వళించి చేష్టలు దక్కి నెత్తుటం దోఁగి మందంబుగా నూర్పులు వుచ్చుచు శరజాలాచితు లై మందవిక్రము లై రుధిరస్రావదిగ్ధాంగు లై మందచేష్టితు లై తాపనీయధ్వజంబులభంగి రణావనిం బడి శరతల్పమధ్యంబునం బవ్వళించియున్న రామలక్ష్మణుల విలోకించి బాష్పపిహితలోచను లై మిక్కిలి విషాదంబు నొందుచు గగనంబును దిక్కులను బరికించి మాయాపరిచ్ఛన్నుం డైనరావణిఁ గనుంగొనఁ జాలక నిరుత్సాహులై రామునిం బరివేష్టించి యుండి రప్పు డసురమాయావిశారదుం డగువిభీషణుం డొక్కరుండు తనమాయచేత మాయాపరిచ్ఛన్నుం డై గగనంబునం బన్నియున్నవాని నప్రతిమకర్ముం డగువాని నప్రతిద్వంద్వుం డగువాని నంతర్హితగాత్రుం డగువాని వరదానగర్వితుం డైనవాని యశస్తేజోవిక్రమబలధురంధరుం డగువాని శక్రజిత్తు నవలోకించుచుండె నప్పు డాయింద్రజిత్తు స్వవిరచితకర్మంబును శరతల్పశయాను లైనదశరథాత్మజులం జూచి పరమప్రీతుండై రాక్షసుల నవలోకించి యిట్లనియె, 781

ఇంద్రజిత్తు రాక్షసులతోఁ దనవిక్రమమును బొగడుకొనుట.

క. ఖరదూషణుల వధించిన, నరేంద్రనందనులు వీరె నాదుశరములం
బరవడి సాదితులై రిటు, పరికింపుఁడు పుడమి నెట్లు పడియున్నారో. 782

క. సురసిద్ధసాధ్యకిన్నర, గరుడాహిమహర్షులైనఁ గాకుత్థ్సుల వే
శరబంధవిముక్తులఁ జేసి రహిం బ్రోవంగ లేరు సిద్ధము సుండీ. 783

సీ. దానవులార యెవ్వానిపౌరుషమున నడలుచు శయనంబునందు మేను
సేర్పక మిక్కిలి చింత సేయుచు నున్నమాయయ్యకు నిశ యామత్రయంబు
కడచు నెవ్వనిభీతి నడలినయీలంక వనదకాలమునాఁటివాహినిగతి
నాకుల మై యొప్పె నగచరులకు మూల మెవ్వఁడు దనుజుల కెవ్వఁ డహితుఁ

తే. డట్టిరాఘవుఁ డనుజసమన్వితముగ, వినిహతుం డయ్యెఁ గీశులవిక్రమంబు
జనపతులవిక్రమము శరత్సమయఘనము,భంగి నిష్ఫలమయ్యె మద్బలముకతన.

ఇంద్రజిత్తు వానరవీరుల బాణములచే నొప్పించుట.

క. అనిపలికి బాహువిక్రమ, ఘనుఁ డగుహరిజిత్తు గగనగతవీక్షణుఁ డై
తనచో ప్పరయువనాటులఁ, గని కోప మెదుగ నధిజ్యకార్ముకుఁ డగుచున్.

సీ. నలునిఁ దొమ్మిదిశరంబుల నొంచి పదితూపు లాంజనేయునియుర మంట నేసి
వాల మొక్కటి జాంబవంతునిశిరమున నాటించి వాలితనయునిఁ బెక్కు
సాయకంబుల ముంచి శరభు గవాక్షుని రెండు రెండు సుఘోరకాండములను
విదలించి మైందుని ద్వివిదుని మూఁడుమూఁ డమ్ముల స్రుక్కించి యర్కసుతుని

తే. నీలుఁ బండ్రెండు పండ్రెండు నిశితవిశిఖ
ముల విదారించి యాఱుతూపులఁ బ్రచండ
బలుని ధూమ్రునిఁ దూలించి పనసుఁ గుముదు
విషధరసమానశరముల వెగడు పఱచి. 786

మ. మఱియుం దక్కినయూథపోత్తముల నమ్మాంసాదవర్యుండు ని
ష్ఠురవైశ్వానరహేతికల్పవిశిఖస్తోమంబులం దూలనే
సి రహిం గీశులు చాఁప కట్టువడ నక్షీణోగ్రబాణౌఘము
ల్దఱుచారం గురియించి హర్షమలరన్ దైత్యాలితో నిట్లనున్. 787

ఉ. రాజకులప్రదీపుఁ డగురామవిభుం డనుజన్మయుక్తుఁ డై
పూజితమత్ప్రయుక్తశరభూతమహోరగపాశబద్ధుఁ డై
యాజితలంబునం బడియె నాపద లన్నియుఁ దీఱె మీ రిఁకం
దేజము మీఱఁ దొల్లిటిగతి న్సుఖయింపుఁడు వీతశోకు లై. 788

తే. అనిన విని దైత్యు లెల్ల మహాద్భుతంబు
నెఱయ హర్షించి రాముండు నిహతుఁ డయ్యె
నని తలంచి ఘనంబులయట్లు రవము
సేయుచు దశాస్యసుతుని బూజించి రపుడు. 789

ఉ. ఆరజనీచరప్రవరుఁ డంత నిజాంబకపాశబద్ధు లై
పోరునఁ గూలి యూరువులు వుచ్చక కన్నులు మూసి యున్నయా
శూరుల రామలక్ష్మణులఁ జూచి రహిం స్థాతు లై రటంచు లో
నారసి మోద మొప్పఁగ రయంబున నేగెఁ బురంబులోనికిన్. 790

రామలక్ష్మణులఁ జూచి వెగడుపడినసుగ్రీవుని విభీషణుఁ డూఱడించుట.

వ. అంత శక్రజిత్ప్రయుక్తనాగపాశంబులం గట్టువడి పుడమిం బడియున్న దాశరథుల శరచితంబు లైనతదీయాంగోపాంగంబుల నవలోకించి సుగ్రీవుండు భయంబు గొని దీనుండై శోకవ్యాకులలోచనుండై కన్నీరు నించె నప్పు డతనిదీనదశ నవలోకించి విభీషణుం డిట్లనియె. 791

సీ. ఇనపుత్త్ర శోకింప నేటికిఁ గన్నీరు నింపకుము భయంబు నీకుఁ దగునె
యేవంవిధంబు లై యొసఁగు సంగ్రామంబు లరయ నైష్ఠికవిజయంబు లేదు
మనపూర్వసుకృతంబు మంచిద యగు నేని యవనీంద్రులకుఁ బ్రాణహాని గలుగ
దనిశంబు మముబోంట్లకు భయంబుఁ దెలిపెడు నట్టిధీరుఁడ వీవె యడలఁ దేర్చు
ఆ. వార లెవ్వ రింక వనచరవర యనాథుండ నై నన్నుఁ దొడరి స్థైర్య
వంతుఁ జేయు మిపుడు పరసత్యధర్మయుక్తులకు మృత్యుభయము గలుగ దెందు.

వ. అని పలికి యవ్విభీషణుండు మొదల నశ్రునిరాసార్థంబు సలిలక్లిన్నపాణిచేత శుభంబు లైనసుగ్రీవునినయనంబులు పరిమార్జించి పదంపడి రాక్షసమాయాపరిజ్ఞానంబున నతనికి ధైర్యంబు సంపాదించుతలంపున శోకనివారకవిద్యాభిమంత్రితజలంబు నేత్రంబులు ముఖంబును బ్రమార్జించి యసంభ్రాంతుం డై తత్కాలసదృశం బగువాక్యంబున నిట్లనియె. 798

మ. ప్లవగాధీశ్వర యిట్టికాలమున వైక్లబ్యంబు నొందంగ రా
దవిరోధంబునఁ గార్యయత్న మది సేయం బోలు నిట్లన్నఁ గా
ర్యవినాశంబు ఘటిల్లుఁ గాన మది దైన్యం బంతయు న్వీడి రా
ఘవులం దేర్పుము సేనకు న్హితము గల్గం జేయు ముద్యన్మతిన్. 794

తే. వీరు తెలి వొందునందాఁక వివిధగతుల
మనము రక్షించుకొని యుంద మనఘచరిత
మరలఁ బరిలబ్ధసంజ్ఞు లై మనల నెల్ల
నింపు సొంపార మిగుల రక్షింపఁ గలరు. 795

తే. వీరశేఖర మృతు లైనవారి కెద్ది, కరము దుర్లభ మగు నట్టికాంతి వీరిఁ
జేయు చున్నది గావునఁ బ్రాణభయము, గలుగ దీరాజసుతులకుఁ గలఁకయేల.

క. తరణిజ యాశ్వాసింపుము, హరిబలముల యూథపతుల కందఱ కభయం
బెఱిఁగింపుము నీపంపునఁ, దిర మొప్పఁగ నన్నిపనులు దీర్చెద నేనున్. 797

-- ఇంద్రజిత్తు రావణునితో రామలక్ష్మణులు హతు లైరని చెప్పుట. --

వ. మఱియు నిప్పు డనీకంబుల నాశ్వాసించుటకుఁ బంపుచున్నవన్ను విలోకించి వానరు లందఱు సంప్రాప్తభయవికారు లై పలాయనార్థంబు గుసగుసలు వోవుచున్నవారు వారందఱు భుక్తపూర్వపుష్పమాలికం బోలెఁ ద్రాసంబు పరిత్యజించునట్లుగా ననునయాలాపంబులం దేర్పు మని బహుప్రకారంబుల సుగ్రీవు నాశ్వాసించి సేనలో నందిరిగి విద్రుతం బైనబలంబును గ్రమ్మఱ నభయదానంబున నూల్కొల్పుచుండె నప్పు డంగదహనుమన్నలనీలవృషభకుముదశరభస్కంధతారజాంబవత్ప్రముఖవానరయూథపు లందఱుఁ బాషాణద్రుమంబులు గైకొని పరమాయత్తు లై గరుడాదివ్యూహాకారానీకు లై దశదిశలు విలోకించుచుఁ దృణంబు చలించిన నింద్రజిత్తుం డని పరిభ్రమించుచు రాఘవులం బరివేష్టించి యమ్మహాత్ముల నతిప్రయత్నంబున రక్షించుచుండి రట మహామాయుం డగు శక్రజిత్తు సర్వసైన్యసమావృతుం డై లంకాపురంబు ప్రవేశించి తండ్రికడకుం జని యభివాదనంబు గావించి యంజలి గీలించి రామలక్ష్మణులు నిహతు లై రని విన్నవించినఁ దత్ప్రియవృత్తాంతంబు విని పరమానందభరితాంతఃకరణుం డై రయంబున నిజాసనంబున నుండి లేచి ప్రియపుత్త్రుని గాఢంబుగాఁ బరిష్వజించి శిరంబు మూర్కొని రామలక్ష్మణులవధప్రకారం బడిగి యతనివలన నాగాస్త్రపాశబంధంబువలన నిశ్చేష్టనిష్ప్రభులుగాఁ జేయఁబడి రని విని ప్రహర్షవేగానుగతాంతరాత్ముఁ డై దాశరథులవలన సముత్థితం బైనభయంబు విడిచి సంప్రహృష్టవచనంబులం గుమారు నభినందించి తన్నుఁ గృతార్థునిం గాఁ దలంచికొనుచు నతని సాదరంబుగా నిజనివాసంబునకుఁ బోవం బనిచి సీతకుం గావలియున్నత్రిజటాప్రముఖరాక్షసస్త్రీల రావించి యిట్లనియె. 798

తే. అనిమొన నరేంద్రు లింద్రజిదంబకముల
నిహతు లై రీయుదంతంబు నృపతనయకుఁ
జెప్పఁ డిటు పుష్పకారూఢఁ జేసికొని ర
యం బెసఁగ నేగి చూపుఁడీ యాలమందు 799

-- రావణుఁడు హతు లైనరామలక్ష్మణుల సీతకుం జూప రాక్షసస్త్రీల కాజ్ఞాపించుట. --

క. జనకకుమారిక యెవ్వని, ఘనభుజదర్పంబు నచ్చి కడుగర్వమునన్
ననుఁ జూడ దయ్యె నానృప, తనయుఁడు రాముఁడు రణోర్విఁ దప్పకకూలెన్.

క. నిరపేక్షయు నిశ్శంకయు, వరాభరణభూషితయుఁ బ్రవర్ధితగుణ యై
ధరణీకుమారి నన్నిఁకఁ, గర మనురాగం బెలర్పఁ గైకొనుఁ గాదే. 801

చ. తడయక జానకి న్సమరధాత్రికిఁ దోడ్కొని యేగుఁ డచ్చటం
బడిననిజేశు లక్ష్మణునిపాటుఁ గనుంగొని తా నిరాశ యై
కడువడి యన్యుమీఁద నిఁకఁ గాంక్ష యొనర్పక క్రౌర్య మంతయున్

విడిచి తనంతఁ దానె నను వేడుక మీఱ వరించునే కదా. 802

చ. అని యిటు పల్కి పఙ్క్తిముఖుఁ డాత్మపురంబు నలంకరింపఁ గాఁ
బనిచి ప్రచండవీర్యు లగుపార్థివసూనులు రామలక్ష్మణు
ల్మనుకొని వజ్రపాణిజిదమోఘశరంబుల భిన్నదేహు లై
యనిమొన నేఁటిరాత్రి హతులై రని చాటఁగ బంచె నప్పురిన్. 803

—రాక్షసస్త్రీలు సీతను బుష్పకంబుపై నెక్కించుకొని యుద్ధభూమికిఁ దోడ్కొనిపోవుట.—

సీ. రాక్షసాంగన లంత రావణుపనుపున నవ్యపుష్పకవిమానంబు గొనుచుఁ
దడయక త్రిజటాయుతంబుగ జానకి పాలికి వెస నేగి భర్తృశోక
కర్శిత యైనయాకమలాక్షి నద్దివ్యయానంబుపైఁ ద్రిజటాన్వితముగ
నెక్కించుకొని రయం బెసఁగ నాకాశమార్గమున రణావనిఁ గదియ నరిగి

ఆ. శక్రజిత్ప్రయుక్తశరనికృత్తాంగు లై, ధాత్రిఁ గూలియున్న దాశరథులఁ
బైరుమాడ్కిఁ బుడమిఁ బడి యున్నకపిసైన్య,సమితిఁ జూపి రపుడు జనకసుతకు.

వ. ఇట్లు రాక్షసస్త్రీసందర్శితం బైనవానరసైన్యంబును బ్రహ్మాస్త్రహతు లైనరాఘవుల
ను విప్రవిద్ధశరాసనులై విధ్వస్తకవచులై విశిఖవిదారితసర్వావయవులై శరస్తం
బమయులై శరతల్పగతులై విసంజ్ఞులై నిమీలితనేత్రులై పాంసుపరిచ్ఛన్నగాత్రు
లై రణమేదినిం బడి యున్నవారిఁ బుండరీకవిశాలాక్షులఁ గుమారసంకాశుల
దేవసమప్రభావులఁ బురుషశ్రేష్ఠుల రామలక్ష్మణుల నవలోకించి వారిచుట్టును
బరివేష్టించి దుఃఖార్తులై యున్నహనుమదంగదాదియూథపులఁ గనుంగొని
బాష్పశోకాభిహత యై రోదనంబు సేయుచు బుద్ధిమోహంబున నిక్కంబుగా
హతులై రని తలంచి యిట్లని విలపించె. 805

—సీత పడియున్న రామలక్ష్మణులఁ జూచి విలపించుట.—

సీ. తరలాక్షి నీకు వైధవ్య మెన్నటికి లే దనిరి సాముద్రికు లరసి చూచి
యజ్వలు చూచి కృతాశ్వమేధాదివి మహిషి వయ్యెద వని మాటి కనిరి
మాహూర్తికులు చూచి మంగళాత్మిక వయ్యె దనుచు మత్సన్నిధి నాడిరి మును
ధవళాక్షి వీరపార్థివపత్ని వై సుఖించెద వని పలికిరి శిష్టజనులు

తే. రాముఁడు సమస్తసుగుణాభిరాముఁ డినకు
లాంబునిధిసోముఁ డిటు హతుం డగుచు నుండ
వారివాక్యంబు లన్నియు వ్యర్థ మయ్యె
వార లందఱుఁ గడు మృషావాదు లైరి. 806

తే. జగతి నేచిహ్నములు గలసతులు భర్తృ,యుక్తలై రాజ్యపట్టాభిషిక్త లగుదు
రట్టియీపంకరుహ రేఖ లస్మదీయ, చరణములఁ బొల్చి యున్నవి చారుఫణితి.

తే. అవని దుర్లభభాగ్య లైనట్టినీల, వేణు లెట్టిచిహ్నము లున్నవిధవ లగుదు
రట్టిచిహ్నంబు లెవ్వియు నరయ నాకుఁ,గాన మీఁదుఃఖ మెబ్బంగిఁ గలిగె నేఁడు.

క. లలనల కబ్జాకృతిరే,ఖలు గలిగిన మంగళంబు గలుగు ననుచుఁ బె
ద్దలు వచియించిరి నా కవి, గలిగియు నిష్ఫలము లయ్యెఁ గాంతుఁడు లేమిన్.

వ. మఱియు మదీయకేశంబులు సూక్ష్మాగ్రంబు లై వినీలంబు లై సమంబు లై భ్రూయుగ్మంబు ధనురాకారంబై పరస్పరాసంగతంబై దంతంబులు కుందకుట్మలాకారంబు లై యవిరళంబు లై జంఘికలు వృత్తంబు లై రోమరహితంబు లై నయనోపాంతదేశంబులు నేత్రంబులు కరంబులు పాదంబులు గుల్ఫంబులూరువు లుపచితంబు లై యంగుళులు వృత్తనఖంబు లై యనూ్యనాధికంబు లై స్నిగ్ధంబు లై కుచంబులు మంగళసూచకంబులై పీనంబు లై యవిరళంబు లై నాభిదేశంబు గభీరం బై యున్నతపర్యంతప్రదేశం బై యుదరంబు త్రివళీయుతంబై పార్శ్వంబులు సంభృతంబు లై యురంబు రమణీయం బై శరీరవర్ణంబు మణినిభం బై యంగరుహంబులు మృదులంబు లై పాణిపాదంబునీరంధ్రాంగుళ్యంతరాళంబై ప్రశస్తవర్ణంబై యవాకారరేఖాయుక్తం బై వదనంబు మందహాససుందరం బై పాదాంగుళిపాదతలంబులు భూమియందు సుప్రతిష్ఠితంబులై యొప్పుచున్నవి గావున బాలా భర్తతోఁ గూడ మహాసామ్రాజ్యపట్టాభిషిక్త వయ్యెద వని మాతృగృహంబున నున్నవేళఁ గన్య నైననన్ను నుద్దేశించి సాముద్రికులచేత జ్యోతిశ్శాస్త్రసిద్ధాంతనిపుణు లగువారిచేత నెయ్యది పలుకంబడియె నది యంతయు నేఁడు వితథీకృతం బయ్యె నని వగచి వెండియు. 810

తే. దండకావనమునఁ జతుర్దశసహస్ర, దానవులఁ జంపి యక్షోభ్య మైనజలధి
దాఁటి వచ్చి మహాత్ములు దాశరథులు, గోష్పదంబున నిహతులై కూలి రకట.

తే. అకట వారుణ మాగ్నేయ మైంద్ర మైషి
కమును వాయవ్యగాంధర్వకములు మఱియు
బ్రహ్మశిర మాదిగాఁ గలభాస్వరాస్త్ర
జాల మంతయు వితథ మై చనియె నేఁడు. 812

ఉ. అకటా యెవ్వరిబాణవీథిఁ బడి జంభారాతియత్తేశపా
వకు లై నర్ధధృతిఁ గ్రమ్మఱఁ బ్రతికి పోవం జాల రద్దివ్యసా
యకు లారాఘువు లొక్కదానవునిచే నాలంబునం గూలి రా
ర కృతాంతుం డతిదుర్జయుండు కడు దుర్వారంబు కాలం బొగిన్. 813

తే. అకట ప్రచ్ఛన్నుఁ డై దైత్యుఁ డాజినింత,చేసె రఘుకులవరులఁ బ్రసిద్ధశరులఁ
బరఁగఁ జక్షుష్పథంబునఁ బడిన బ్రతికి, వెండి పోవంగ లేఁ డెంత వేగ మున్న.

వ. మఱియుఁ దపస్విని యగుకౌసల్య సమాప్తవ్రతుం డై సీతాలక్ష్మణసహితంబుగా రామభద్రుం డెప్పుడు వచ్చుఁ గన్నులకఱవు దీఱ నెప్పుడు విలోకింతు నని యుత్సుక యై యుండు నద్దేవి యింక నెత్తెఱంగున జీవింపం గలదని యిట్లు బహుప్రకారంబుల విలపించుచున్నసీత నవలోకించి త్రిజట యి ట్లనియె. 815

త్రిజట సీతకు రామలక్ష్మణులు ప్రాణములతో నున్నవా రని తెలియఁ జెప్పుట.

తే. సన్నుతాంగి సప్రాణుఁ డై యున్నవాఁడు
నీవిభుఁడు శోకమేటికి నిక్కువముగఁ
బరఁగ ననుభూతచరములు ప్రస్ఫుటములు
నైనహేతువు లెఱిఁగింతు నబల వినుము. 816

క. నవతామరసనిభం బై, యువతీ నీవదన మొప్పుచున్నది మిగుల
న్భువిలో నిట్లుండదు గత ధవ యగువనితవదనంబు తామరసాక్షీ. 817

వ. అదియునుం గాక. 818

తే. వెలఁది హతనాథు లైనయోధుల ముఖములు
హర్షపర్యుత్సుకంబు లై యతులకోప
యుతము లై యుండ వీకపిపతులముఖము
లలరుచున్నవి హర్షకోపాన్వితముగ. 819

తే. నాతి యీదివ్యమణివిమానంబు పుష్ప, కాహ్వయం బిది గతపతు లైనసతుల
మోవ దిప్పుడు నిన్నిటు మోచుచున్న, దట్లగుట నీకు వైధవ్య మరయ లేదు.

వ. మఱియును. 821

చ. హతహయవీరసూతగజ మైనబలంబు విషాదదైన్యసం
యుత మయి నిష్ప్రభం బయి నిరుద్యమ మై హతకర్ణధార మై
గతిసెడి యున్ననావగతిఁ గన్పడు నీకపిసేన నిర్భయ
స్థితిఁ గొని వీరిరక్షణము సేయుచు నున్నది కాంతియుక్త యై. 822

చ. అతివరొ నిర్గతాయు లగునట్టిమనుష్యులమోముల న్వివ
ర్ణత గనుపట్టు వీరివదనంబులు పద్మనిభంబు లై సువ
ర్ణత గనుపట్టుచున్నవి మనంబున శోకము వీడు మాఱి మూ
ర్ఛితు లయినారు గాని మృతిఁ జెందినవారలుగారు చూడఁగన్. 823

చ. అనృతము లాడ నిక్కముగ నాఁడెద నీపయిఁ గల్గుకూర్మిచే
ననుపమమంగళోదయము లైననుంచితలక్షణంబుల
న్వనిత రఘుప్రవీరులు ధ్రువంబుగఁ బ్రాణముతోడ నున్నవా
రనిమొన వీరి నోర్వఁగ సురాసురు లైన నశక్తు లెన్నఁగన్. 824

వ. భవదీయపాతివ్రత్యప్రియశీలంబులును వీరల ముఖప్రసాదంబును విలోకించిన
నామనంబునకు సందియంబు లేదు నిక్కంబుగా నీరామలక్ష్మణులు జీవించి
యున్నవారు దుఃఖశోకమోహంబులు పరిత్యజించి స్వస్థచిత్తవు గమ్మని పలికిన
నమ్మహీనందని యాత్రిజటవాక్యంబు విని కృతాంజలియై యవ్వాక్యంబు సత్యం
బగుం గాక యని పలికి మనోజవం బైనయవ్విమానంబు గ్రమ్మఱించి త్రిజటా
సహితంబుగా లంకాపురంబు ప్రవేశించి పుష్పకంబు డిగ్గి రాక్షససహితంబుగా

నశోకవనంబు ప్రవేశించి రామలక్ష్మణులవిజయాభ్యుదయంబు కాంక్షించుచు
సవిషాద యై శింశుపావృక్షమూలంబు నధివసించె నిక్కడ రణభూమియందు
ఘోరశరబంధబద్ధులై మహానాగంబులభంగి నూర్పులు పుచ్చుచు నెత్తుటం
దోఁగి శరతల్పమధ్యంబునం బవ్వళించి యున్నరామలక్ష్మణులం బరివేష్టించి
మహాబలు లైనసుగ్రీవాదివానరశ్రేష్ఠులు శోకపరిప్లుతు లై బహుప్రకారం
బుల విలపించుచుండి రంతఁ గొంతసేపునకు వీర్యవంతుం డైనరాముండు శర
పాశబద్ధుం డయ్యుఁ గొండొకధైర్యంబుకలిమి స్థిరత్వంబున సత్త్వసంయోగం
బున మూర్ఛదేఱి తనపార్శ్వంబున రుధిరక్లిన్నసర్వాంగుం డై విషణ్ణుం డై
దీనవదనుం డై గాఢమూర్ఛాపారవశ్యంబునఁ బుడమిం బడియున్నసౌమిత్రి
నవలోకించి యిట్లని విలపించె. 825

రాముఁడు నేలం బడియున్నలక్ష్మణునిం జూచి విలపించుట.

మ. అకటా ప్రాణసముండు లక్ష్మణుఁడు దైత్యాస్త్రప్రభిన్నాంగుఁ డై
వికలుం డై పడి యున్నవాఁ డితఁ డిట న్వేఱొక్కలా గైన నా
కిఁక నీజానకి యేల ప్రాణములచే నింకేమి కార్యంబు మి
న్నక సర్వంబు నితండు గాక కలదే నా కన్య మూహింపఁగన్. 826

క. పరికింపఁగ జానకితో, సరి యగుసతి దొరకుఁ గాని జగతి నితనితో
సరి యగుతమ్ముండును సాం,పరాయికుఁడు సఖుఁడు భక్తిపరుఁడు దొరకునే.

క. తనజనయిత్రిని మామక, జనయిత్రిని సమముగా విచారించు మనం
బున నింత భేదదృష్టిం, గనుఁగొనఁ డిటువంటి సుగుణి గలఁడే జగతిన్. 828

తే. ఈగుణాఢ్యుఁడు లేనిచో నేను నిమిష,కాల మైనను జీవింపఁ గలనె సర్వ
కీశశేఖరు లటు విలోకించుచుండ, జీవితంబులు విడిచెద సిద్ధ మిపుడు. 829

సీ. అక్కట యీసుమిత్రానందవర్ధనుఁ డట మృతుఁ డౌట యథార్థ మేని
హితమతిఁ గౌసల్య కేమని చెప్పుదుఁ గైకయీదుఃఖ మేగతి నుడువుదుఁ
బుత్రవత్సల యైనపుణ్యసాధ్వి సుమిత్ర తనయుఁ డెందున్నవాఁ డనిన నేమి
పలుకుదుఁ బదపడి భ్రాతృవత్సలు లైనభరతశత్రుఘ్నులు బంధుమిత్రు

తే. లడుగ వారలతోడ నేమని నొడువుదు, విపినవాసం బొనర్ప నావెంట వచ్చి
నట్టితమ్మునిఁ బాసి యే నాత్మతోడ, నొంటి నెబ్భంగి జనుదు నయోధ్యకిపుడు.

చ. పరువడి మన్నిమిత్తముగఁ బ్రాణసమానుఁడు లక్ష్మణుండు భీ
కరతరదైత్యముక్తవిశిఖంబులచేత విభిన్నగాత్రుఁ డై
దురమునఁ గూలె గర్హితుఁడ దుష్కృతకర్ముఁడ నైతి నాకు ను
ర్వర బ్రతుకంగ నేటి కిఁకఁ బ్రాణవిమోచన మాచరించెదన్. 831

క. మానవ మును నీ వనిశము, దీనుఁడ నగునన్ను మిగులఁ దేర్పుదు విపు డా
దానవశరార్దితుఁడ వై, దీనతఁ గొని యున్ననన్నుఁ దేర్ప విదేలా. 832

తే కలన నెవ్వానిచే ననేకులు నిశాట, వరులు నిహతు లై సంగ్రామధరణిఁ గూలి

రట్టివీరుండు నేఁడు నిశాటబాణ, జాలహతుఁ డై రణక్షితిఁ గూలినాఁడు.

క. స్వరుధిరసిక్తాంగుం డై, శరచితుఁ డై బాణతల్పశయనుఁ డయి రహిఁ గ
జరతాఖ్యునిక్రియ నీనర, వరతనయుఁడు వఱలుచున్నవాఁ డురుకాంతిన్. 834

తే. మార్గణవ్యాహతాఖిలమర్ముఁ డగుట, వలన వేదనకలిమిచేఁ బలుకఁ జాల
కిపుడు ఘనరాగసూచకదృష్టిచేతఁ, జూచుచున్నాఁడు మాటికి సొబగు దక్కి.

వ. మఱియు నీలక్ష్మణుండు మాత్రాదిస్నేహంబు సేయక వనంబునకు వచ్చుచున్న
నాతోడ నెట్లు చనుదెంచె న ట్లీనును మాత్రాదిస్నేహంబు విడిచి యీమహా
ద్యుతి వెంట యనుక్షయంబునకుం జనియెద నిష్టబంధుజనుండును నిత్యంబును
నాకనువ్రతుండును మహాగుణపరిగ్రహుండు నైనయీలక్ష్మణుం డనార్యుండ
నైననాదుర్నయంబున నిప్పుడీయవస్థ నొందె నితనిచేత నొకానొకప్పు డైనఁ
బరుషం బగువిప్రియంబు పలుకంబడియెఱుంగ నెవ్వండిష్వస్త్రంబులయందుఁ
గార్తవీర్యునకంటె నధికుం డై యొకకాలంబున నేనూఱుశరంబులు ప్రయో
గించుటకు సమర్థుండయ్యె నెవ్వండు దివ్యాస్త్రంబులచేత మహాత్ముం డగుపురం
దరుని వజ్రంబు నైనఁ గ్రమ్మఱింపం జాలునట్టివీర్యవంతుండును సుహార్హశయ
నోచితుండు నైనయీలక్ష్మణుండు పరులచేత నిహతుం డై రణభూమిపయిం
బడియున్నవాఁ డింక నేమి గల దని బహుప్రకారంబుల దుఃఖించి సుగ్రీవు
నవలోకించి. 836

~~ రాముఁడు దుఃఖంబున సుగ్రీవాదులం గిష్కింధకుఁ బొమ్మని చెప్పుట. ~~

తే. రాక్షసుల కెల్ల నిన్నిఁక రాజొనర్తు, నని విభీషణుతోడ నే నన్నమాట
వ్యర్థమయ్యె మదీయమిథ్యాప్రతిజ్ఞ, నటు సహించి యథేచ్ఛమైనరుగుమనుము.

చ. వనచరవీర నాకొఱకు వానరసేనలఁ గూర్చి వార్ధిపై
ఘనముగఁ గట్ట గట్టి భుజగర్వ మెలర్పఁగ లంకఁ జేరి గ్ర
ద్ధన నరివాహినిం దొడరి దారుణభంగి రణం బొనర్చి పా
యనియనురక్తి మిక్కిలి ప్రయాసము నొందితి వీవు బల్విడిన్. 838

చ. అసమున నొక్కరుండె మకరాలయ మైనమహాంబురాశి సా
హసమున దాఁటిపోయి వసుధాత్మజ నర్మిలిఁ జూచి వచ్చి మ
ద్వ్యసనము మాన్చి మిక్కిలి ప్రయాసము నొంది హితం బొనర్చి యా
శ్వసనసుతుండు నాకు సచివత్వము చేసెను విశ్రుతంబుగన్. 839

క. కాలాంతకసంకాశుఁడు, వాలిసుతుం డంగదుండు వరబలయుక్తిం
జాల హిత మాచరించెను, వాలాయము దైత్యసైన్యవధపూర్వముగన్. 840

సీ. మఱియు సంపాతియు మైందుండు ద్వివిదుండు శతవలి ధూమ్రుండు జాంబవంతుఁ
డతిశూరుఁ డగునలుం డలనీలుఁడు గజుండు పనసుండు తారుండు వినతకుముద
శరభగవాక్ష కేసరిగంధమాదన గవయాదియూథపప్రవరు లెల్ల
మిత్రకార్యమునందు మొయిగొని వర్తించి రే నభాగ్యుఁడ నైన నేమి సేయఁ

తే. గలరు తక్కినకీశవర్యులు మదర్థ
మందుఁ బ్రాణము దాఁపక యని యొనర్చి
రింక నాయనుమతమున నెల్లవారి
నాత్మనిలయంబులకుఁ బోవుఁ డనుచుఁ జెపుమ. 841

తే. అనఘ నీవును నాతోడ నన్నమాట
తప్పకుండ ననేకయత్నములఁ బోరి
చూచితివి దైవ మిటు దప్పఁ జూచె నింక
నేమి కార్యము కిష్కింధ కేగు మిపుడు. 842

సుగ్రీవాదులు రామవచనంబులు విని దుఃఖించుట.

క. నా విని రఘువర్యునిపరి, దేవితము న్విని కరంబు ధృతి చెడి వెన ను
గ్రీవాదికీశు లందఱు, భావంబున నదరి కనుల బాష్పము లొలుకన్. 843

వ. మిక్కిలి శోకరోదనతామ్రాక్షు లై రంతకు మున్ను విభీషణుండు సైన్యంబుల నాశ్వాసించుటకుం జని యున్నవాఁడగుటవలన నభయప్రదానంబున ననీకంబుల నంస్థాపించి గదాపాణి యై మరలి రాఘవుం డున్నచోటికి రయంబునం జనుదెంచుచుండ నీలాంజనచయోపమం బైనయద్దానవేంద్రునియాకారం బుపలక్షించి వానరు లందఱు శక్రజిత్తు మరలఁ జనుదెంచె నని శంకించి భయకంపితశరీరు లై పఱవం దొడంగిన నత్తెఱం గంతయు నాలోకించి మహాతేజం డగుసుగ్రీవుండు విరుద్ధదిగ్వాయుహతం బైననావచనంబున వానరసేన వ్యథిత యయ్యె నిది యేమి యని యడిగిన నంగదుం డిట్లనియె 844

ఉ. వానరనాథ నీ వెఱుఁగవా దనుజేంద్రకుమారుఁ డైనయా
దానవు బాణపాతమునఁ దద్దయు నొచ్చి విసంజ్ఞు లై మహి
న్మానక కూలి యున్నయలమానవనాథులపాటుఁ జూచి యీ
వానరసేన భీతిమెయిఁ బారక పాఱఁ దొడంగె బల్విడిన్. 845

వ. ఇట్లు సుగ్రీవోక్తప్రశ్నవాక్యాభిప్రాయం బెఱుంగక పలికినయంగదునివిపరీతోత్తరంబు విని యక్కపినాథుండు వెండియు సాభిప్రాయంబు తేటపడ నతని విలోకించి యీకపిసైన్యపలాయనం బనిమిత్తంబు కాదనుతలంపున నపూర్వభయనిమిత్తంబునఁ గాఁదగినయది యని యూహించె నని పలికె వెండియు నిట్లనియె. 846

సీ. ఈహరివీరు లుత్సాహంబు పోఁబెట్టి వదనంబునందు వైవర్ణ్య మొదవఁ
బ్రవిషణ్ణమూర్తులై ప్రహరణంబులు వీడి భయకంపితాంగులై రయ మెలర్పఁ
దిరిగి చూడక పరస్పరసమాహతు లయి కడువడి సేతుమార్గమును బట్టి
పరువెత్తుచున్నవా రరయ వీరికి నింత భయ మేల గలిగె నిబ్బంగి యేమి

తే. యనుచుఁ జెక్కుదెఱంగుల నడుగుచుండ
నంతలోన గదాపాణి యై విభీష

ణుండు రాముల్ష్మణుల మనోహరోక్తి
మెఱయ నాశీర్వదించుచు సరుగుదెంచె. 847

వ ఇట్లు సరుగుదెంచిన వైరిభీషణుం డైనవిభీషణు నవలోకించి సుగ్రీవుండు సమీపస్థుం డగుజాంబవంతున కిట్లనియె. 848

చ. గద గొనివచ్చువాని ఘనకాయు విభీషణు వైరిభీషణు
న్వదలక చూచి వానరులు దానవజిత్తనుశంకచే రహి౯
బెదరి కలంక నొందొరులఁ బిల్వక పాఱుచు నున్నవారు శ
త్రుదమన నీవు వేగ చని తోడ్పడి వీరలఁ గ్రమ్మఱింపుమా. 849

చ. అన విని జాంబవంతుఁడు రయంబున నేగి నితాంతభీతిచేఁ
గనుకనిఁ బాఱుమర్కటులఁ గన్గొని గర్వము వీడి సాధ్వసం
బునఁ బఱవంగ నేల కపిపుంగవులార నిలుం డితండు స
ఖ్యనిరతుఁ డావిభీషణుఁడు గాని దశాస్యసుతుండు గాఁడు నా౯. 850

విభీషణుఁడు రామలక్ష్మణులం జూచి దుఃఖించుట.

చ. విని కపు లంకఱుం గడువివేకముఁ బూని విభీషణుం డితం
డని మది నిశ్చయించి హృదయంబున భీతి దొలంగఁ బెట్టి ధై
ర్యనిధులు గావున న్మరలి యెప్పటియట్లు కపీంద్రుసన్నిధి౯
గొనకొని నాదము ల్సెలఁగ గుంపులు గట్టి రనేకభంగుల౯. 851

ఉ. అంత విభీషణుండు విశిఖాహతు లై ధరఁ గూలి యున్నభూ
కాంతుల రామలక్ష్మణులఁ గన్గొని శోకము పైకొనంగ మే
నంతయుఁ గంప మొంద సలిలార్ద్రకరంబున వారిదృగ్ద్వయం
బంతయుఁ సంస్పృశించి వ్యథితాత్ముకుఁ డై విలపించె నీగతి౯. 852

సీ. అకట యెవ్వరివీర్య మాశ్రయించి ప్రతిష్ఠ వడయఁ గోరితి నట్టివాసవాభు
లత్యంతవిక్రాంతు లతిసత్త్వసంపన్ను లమితవీర్యులు ప్రియసమరు లైన
రామలక్ష్మణు లిట్లు రావణనందనసాయకనిహతు లై సమరభూమి
శల్యకంబులభంగి సాంద్రరక్తార్ద్రశరీరు లై పడి యున్నవారు నేడు

తే. ఏను నష్టసామ్రాజ్యప్రధానగుణను
నోరథుండ నై కడు విపన్నుండ నై తిఁ
బగతుఁ డగురావణుండు సంప్రాప్తకాముఁ
డై మఱి కృతప్రతిజ్ఞుఁ డై యలరె నిపుడు. 853

వ. అని యిట్లు దుఃఖించుచున్నవిభీషణుఁ గౌఁగిలించికొని సత్త్వసంపన్నుఁ డగు సుగ్రీవుం డిట్లనియె 854

సుగ్రీవుఁడు విభీషణు నూఱడించుట.

మ. శరసంపీడితు లై రఘూత్తములు మూర్ఛాయుక్తు లై యున్నవా
రరయం గ్రమ్మఱఁ దెల్వి కై కొని సమస్తానీకయుక్తంబుగా

దురితాత్మక దశకంఠుఁ జంపుదు రిఁక దోర్దోద రాజ్యంబు చే
కుఱు నీకు న్మది సంశయింపకుము రక్షోనాథ నిక్కంబుగన్. 855

క. అని యిటు మధురోక్తుల న, ద్దనుజేంద్రు ననూనయించి తపనజుఁ డంతం
దనమామ యగుసుషేణునిఁ, గనుఁగొని యిట్లనియెఁ గౌతుకం బలరారన్.

ఆ. అనఘ నీవు శూరు లగువానరులఁ గూడి, లబ్ధసంజ్ఞు లైనరాజసుతులఁ
గొని పయోధి దాఁటి గొబ్బునఁ గిష్కింధ,కరుగు మచట నుండు టనుచితంబు.

ఉ. ఏను సమస్తబాహుబల మేర్పడ సైన్యసమన్వితుండ నై
దానవనాథుల న్సలకదంబసుహృత్సుతసంయుతంబు గా
మానక ద్రుంచి శత్రుఁడు రమం గొని తెచ్చినమాడ్కి వేడ్కతో
జానకి దెచ్చి యిత్తు నృపచంద్రున కయ్యనఘుండు మెచ్చఁగన్. 858

క. ఏ నొక్కరుండ వ్రేల్మిడి, దానవసహితముగ లంక దగ్ధము సేయం
గా నోపుదుఁ గపిసైన్యము, జానుగఁ దోడ్పడిన నా కసాధ్యము గలదే. 859

క. చిరకాలసంభృతం బగు, గురుతరకోపమును నేఁ డకుంఠితగతిఁ గ
ర్బురనాథునిమీఁదను ద,త్పరివారముమీఁద దీవ్రభంగి విడిచెదన్. 860

తే. అనఘ మామకవీర్యంబు నమితతేజ
మనుపమభుజాబలంబు సౌహార్దమును నృ
పాలశేఖరుపయిఁ గలభక్తిభరము
త్రిభువనంబును జూచి కీర్తించుఁ గాక. 861

ఉ. చందనసారలిప్తములు చారుతరాంగదభూషణంబు ల
స్పందపరాక్రమాఢ్యములు చంద్రముఖీపరిరంభణార్హము
ల్గ్రిందుగ శేషవాసుకినికాశము లైనమదీయబాహు లిం
పొందఁగ నేఁడు ఘోర మగుయుద్ధ మొనర్పఁగ నున్న వెంతయున్. 862

క. ఘనజీమూతనిభాసుర, జనవృత యగులంక నిపుడు సాలయుతముగా
మునుకొని భస్మముఁ జేసెదఁ, బనివడి శ్వసనుండు మేఘపంక్తినిబోలెన్. 863

క. పెక్కన నేటికి రావణు, నిక్కముగ వధింతు నాజి నేఁడు ఖగేంద్రుం
డుక్కున మహోరగంబును, దక్కక వెస గీటణచువిధమ్మున ననఘా. 864

క. అనుపమమద్భుజబలమున, దనుజేంద్రుఁడు నిహతుఁ డైనఁ దదుదంతంబు
న్విని రాముఁడు తనమనమున,జనియించినభ్రమము వగపు చయ్యన విడుచున్.

క. వరుణయమేంద్రధనదులకు, సరి వచ్చు దశాననుండు శౌర్యంబున భీ
కరుఁ డైన నేమి మద్భ్రూ, క్షరణిం బడి బ్రతికి పోవఁ జాలఁడు తలఁపన్. 866

క. అనఘాత్మక మీరందఱుఁ, గనుఁగొనుఁ డిఁక నొకముహూర్తకాలములోనన్
దనుజేంద్రుఁ దునిమి గ్రక్కున, జనకసుతను దెచ్చి రామచంద్రున కిత్తున్.

తే. భూతలేంద్రునిచేఁ బ్రతిజ్ఞాత మైన, నిహతకంటక మైనయానిఖిలదైత్య
రాజ్యము విభీషణున కిచ్చి రాఘవునకు,సంతసము నిత్తు భూరియశంబు గాంతు.

దురితాత్ముఁ డగు దశకంఠుఁ జంపుదు రిఁకఁ దోడ్తోడ రాజ్యంబు చే
కుఱు నీకు న్మది సంశయింపకుము రక్షోనాథ నిక్కంబుగన్. 855

క. అని యిటు మధురోక్తుల న, ద్దనుజేంద్రు ననూనయించి తపనజుఁ డంతం
దనమామ యగుసుషేణునిఁ, గనుఁగొని యిట్లనియెఁ గౌతుకం బలరారన్.

ఆ. అనఘ నీవు శూరు లగువానరులఁ గూడి, లబ్ధసంజ్ఞులైన రాజసుతులఁ
గొని పయోధి దాఁటి కొబ్బునఁ గిష్కింధ, కరుగు మిచట నుండుటనుచితంబు.

ఉ. ఏను సమస్తబాహుబల మేర్పడ సైన్యసమన్వితుండనై
దానవనాథుల న్బలకదంబసుహృత్సుతసంయుతంబుగా
మానక ద్రుంచి శక్రుఁడు రమం గొని తెచ్చినమాడ్కి వేడ్కతో
జానకి దెచ్చి యిత్తు నృపచంద్రున కయ్యనఘుండు మెచ్చఁగన్. 858

క. ఏ నొక్కరుండ ప్రేల్మిడి, దానవసహితముగ లంక దగ్ధము సేయం
గా నోపుదుఁ గపిసైన్యము, జానుగఁ దోడ్పడిన నా కసాధ్యము గలదే. 859

క. చిరకాలసంభృతం బగు, గురుతరకోపమును నేఁ జకుంఠితగతిఁ గ
ర్బురనాథునిమీఁదను దత్పరివారముమీఁద దీవ్రభంగి విడిచెదన్. 860

తే. అనఘ మామకవీర్యంబు నమితతేజ
మనుపమభుజాబలంబు సౌహార్దమును నృ
పాలశేఖరుపయిఁ గలభక్తిభరము
త్రిభువనంబును జూచి కీర్తించుఁ గాక. 861

ఉ. చందనసారలిప్తములు చారుతరాంగదభూషణంబు ల
స్పందపరాక్రమాఢ్యములు చంద్రముఖీపరిరంభణార్హము
ల్గ్రిందుగ శేషవాసుకినికాశము లైనమదీయబాహు లిం
పొందఁగ నేఁడు ఘోర మగుయుద్ధ మొనర్పఁగ నున్న వెంతయున్. 862

క. ఘనజీమూతనిభాసుర, జనవృత యగులంక నిపుడు సాలయుతముగా
మునుకొని భస్మముఁ జేసెదఁ, బనివడి శ్వసనుండు మేఘపంక్తినిఁబోలెన్. 863

క. పెక్కన నేటికి రావణు, నిక్కముగ వధింతు నాజి నేఁడు ఖగేంద్రుం
డుక్కున మహోరగంబును, దక్కక వెస గీటణచువిధమ్మున ననఘా. 864

క. అనుపమమద్భుజబలమున, దనుజేంద్రుఁడు నిహతుఁ డైనఁ దదుదంతంబు
న్విని రాముఁడు తనమనమున, జనియించినభ్రమము వగపు చయ్యన విడుచున్.

క. వరుణయమేంద్రధనదులకు, సరి వచ్చు దశాననుండు శౌర్యంబున భీ
కరుఁ డైన నేమి మద్దృ, క్సరణిం బడి బ్రతికి పోవఁ జాలఁడు తలఁపన్. 866

క. అనఘాత్మక మీరందఱుఁ, గనుఁగొనుఁ డిఁక నొకముహూర్తకాలములోనన్
దనుజేంద్రుఁ దునిమి గ్రక్కున, జనకసుతను దెచ్చి రామచంద్రున కిత్తున్.

తే. భూతలేంద్రునిచేఁ బ్రతిజ్ఞాత మైన, నిహతకంటక మైనయానిఖిలదైత్య
రాజ్యము విభీషణున కిచ్చి రాఘవునకు, సంతసము నిత్తు భూరియశంబు గాంతు.

సుషేణుఁడు సుగ్రీవునకు దివ్యౌషధము లుండు స్థలమును దెల్పుట.

వ. అని యిట్లు సూర్యనందనుం డగుసుగ్రీవుండు సంక్రుద్ధుండై యతిబలవిక్రమోప
పన్నంబు లగుస్వవాక్యంబులచేత వానరుల కుత్సాహబలప్రవర్ధనంబు గావించె
నప్పు డామహానుభావునివాక్యంబు విని సుషేణుండు కపీంద్రా తొల్లి దేవాసు
రులకు దారుణం బగురణంబు చెల్లె నప్పుడు సర్వాస్త్రవిదు లగురాక్షసులు
శరపరంపరాసంస్పర్శకోవిదు లై సారెసారెకు దివ్యాస్త్రజాలంబులం గప్పుచు
నిర్జరుల నిర్జించిన నష్టప్రాణు లై నష్టసంజ్ఞులై పుడమిం గూలియున్న దేవతలం
జూచి మహాత్ముం డగుబృహస్పతి మంత్రప్రచురంబు లైనమృతసంజీవనీప్రభృ
తివిద్యావిశేషంబులచేతను దివ్యౌషధంబులచేతను వారి నందఱం బునస్సంజీవి
తులం గావించె నట్టిదివ్యౌషధంబు లమృతం బెచ్చట నుత్పత్తం బయ్యె నట్టి
క్షీరసముద్రమధ్యంబునం గలచంద్రద్రోణాఖ్యశైలంబునందు దేవతలచేత
నిక్షేపింపంబడియున్నవి యయ్యౌషధంబులు. సౌవర్ణకరణిసంధానకరణివిశల్య
కరణినామకంబు లై యుండు నిప్పు డీమహాబలుం డగుహనుమంతుండు సం
పాతిపనసాదియూథపులం గూడి యచ్చటికిం జని యమ్మహౌషధంబులు గొని
తెచ్చెనేని యీరామలక్ష్మణులు విశల్యు లగుదు రని పలికిన నప్పుడు వాయుదే
వుం డచ్చటికిం జనుదెంచి రామచంద్రు నవలోకించి యి ట్లనియె. 869

వాయువచనంబున రాముఁడు గరుత్మంతుని ధ్యానించుట.

తే. రామ రామ మహాభాగ రాక్షసారి
యుర్వి నిబ్భంగి నవతార మొందినట్టి
యాదినారాయణుఁడవు నీ వాత్మలోన
నిన్ను నీవు స్మరింపుము నేర్పుకలిమి. 870

క. అనఘాత్మ మహాబలుఁ డగు, వినతాసుతు దేవు నిఖిలవిషధరవైరి
న్మనమునఁ దలఁపుము ఫణిబంధనమువలన ముక్తు లయ్యెదరు మీరు వెసన్.

క. నా విని రఘువర్యుఁడు తన, భావంబున సంస్మరించెఁ బన్నగవైరిన్
శ్రీవల్లభరథు నతిబలు, దేవవరిష్ఠుని సువర్ణదేవునిఁ బ్రీతిన్. 872

ఉ. పాయక యిట్లు రాఘవుఁడు భావమునం దలపోయునంతలోఁ
దోయధిపంక్తుల న్జలధితోయము లంతటఁ దూలిపర్వఁ గాఁ
దోయధివాసినాగములు తోయధులందు మునింగి దాఁగ ఘో
రాయతపక్షపాతచలితాచలుఁ డై ఖగరాజు వచ్చినన్. 813

గరుత్మంతుఁడు రామలక్ష్మణుల విశల్యులఁ జేయుట.

క. వచ్చినవినతాసుతుని ర,యోచ్చలితద్వీపసంభవోర్వీరుహునిం
జెచ్చెరఁ గని మోదంబున, విచ్చలవిడి విపినచరులు వినుతించి రొగిన్. 874

క. అరుదెంచినభుజగాశనుఁ, బరికించి నృపాలసుతుల బంధించినయా
శరభూతమహాబలభీకరఫణు లటు విచ్చిపఱచెఁ గడు భీతిమెయిన్. 875
వ. అంత. 876
క. వినతాతనూజుఁ డానృప, తనయుల నాశీర్వదించి తనహస్తముల
న్ఘనశశినిభము లగుతదా, ననములఁ బరిమార్జనం బొనర్చె ముదమునన్. 877
క. ఖగపతిసంస్పృష్టము లై, జగతీవరసుతులమేనిక్షతములు మాసె
న్మిగులం దనువులు శోభిలె, నగణితశోభాయుతంబు లై స్నిగ్ధము లై. 878
క. బలశౌర్యవీర్యవిక్రమములు తేజము ధృతియు మతియు ముదము గుణము ల
త్యలఘుప్రదర్శనం బపు, డలరెం దొల్లింటికంటె నధికము లగుచున్. 879
క. నిరుపమతేజోయుతుఁ డగు, గరుడుఁడు కేలూఁత యిచ్చి గ్రక్కున నయ్యి
ద్దఱఁ గ్రుచ్చి యెత్తి పదపడి, పరిరంభణ మాచరించెఁ బ్రమదం బలరన్. 880
వ. ఇట్లు వైనతేయపాణిపరిమార్జితశరీరుం డై రాముండు నాగాస్త్రపాశంబులవల
న విడివడి విశల్యుండై తనయట్లు విశల్యుం డైనసౌమిత్రితోడం గూడి శీఘ్రం
బున శరతల్పంబుననుండి లేచి సుపర్ణు నవలోకించి మృదుమధురవాక్యంబున
నిట్లనియె. 881

రాముఁడు గరుడునిం జూచుట.

సీ. అనఘాత్మ ధవళదివ్యాంబరంబులు దాల్చి దివ్యమాల్యంబులు దివ్యగంధ
దివ్యాభరణములు భవ్యంబుగాఁ దాల్చి వఱలెదిబ్బంగి నెవ్వఁడవు నీవు
మాతండ్రి దశరథుమాపితామహు నజుఁ జూచినట్లుగ నిన్నుఁ జూచినంత
నాదుచిత్తంబు నమ్మోదసంయుక్త మై తనరెడి నీప్రసాదంబువలన
తే. నేను లక్ష్మణుఁడును దానవేంద్రతనయ
జనితదారుణసాంద్రవ్యసనము గడచి
వితతముగఁ దొంటిచందాన స్మృతియు బలము
ధృతియు వీర్యము తేజ మొందితిమి నేఁడు. 882
వ. అని పలికిన నప్పత్త్రిరాథుండు హర్షపర్యాకులేక్షణుం డై గుణాభిరాముం
డైనరాము నవలోకించి యిట్లనియె. 883
తే. జనవరోత్తమ నీ కేను సఖుఁడఁ బ్రియుఁడఁ
బ్రాణసఖుఁడ సాహాయ్యతత్పరుఁడ విహగ
విభుఁడ మీ కిట్లు హితము గావింపఁ గోరి
యరుగుదెంచినవానిఁ గా నెఱుఁగు మిపుడు. 884
చ. అనఘచరిత్రవీర్యమహిమాధికు లైనసురాసురుల్ సహ
స్రనయనముఖ్యదిక్పతులు చారణకిన్నరసిద్ధసాధ్యు లీ
ఘనతరశక్రజిద్బలవికాసితదారుణబాణబంధము
ల్గొనఁగొన నించుకైన విడిపింప సమర్థులు గారు చూడఁగన్. 885

తే. రాజవర యివి తిగ్మదంష్ట్రములు ఘనవి
షోల్బణము లగుకాద్రవేయోరగములు
వాసవారిమాయాప్రభావంబుచేత
దీప్తశరము లై మిమ్ము బంధించె నిట్లు. 886

క. మృతి నొందక ధృతి వీడక, ప్రతిన ఘడక యీభుజంగబంధమువలనన్
క్షితివర విడివడి మీ రిటు, బ్రతికితి రేనుందు నీదుభాగ్యోదయమున్. 887

క. ఏ నీవృత్తాంతము విని, మానుగ నీవీరుఁదికూర్మి మల్లడిగొన ధా
త్రీనాయక చను దెంచితిఁ, బూనిక ఫణిబాణబంధమోక్ష మొనర్పన్. 888

క. క్షితివర మీ రీఘోరో,న్నతఫణిమయబాణబంధనంబువలన మో
క్షితు లై తి రింక సంతత, మతులితగతి జాగరూకు లై సేయుఁ డనిన్. 889

చ. జనవరపుత్ర దైత్యులు ప్రచండరణంబులఁ గూటయోధు లై
మునుకొని మాయచేఁ బరుల మోహపరీతులఁ జేయు చుందు రీ
దనుజులచేత లిట్టి వని తథ్యముగాఁ గనుఁగొంటివే కదా
మనమున విశ్వసింపకుము మానుగ వీరలకృత్య మంతయున్. 890

క. గుఱుతుగ లంకాపురి నిఁక, శరముల శోషింపఁ జేసి చయ్యన దశకం
ధరు నని వధించి గ్రక్కున, ధరణీసుత వడసె దీవు తథ్యం బనఘా 891

క. ఖ్యాతిగ సఖత నెఱుంగం, గా తూహల మిపుడు నీకుఁ గార్యము గాదో
సీతాధిప కృతకృత్యుఁడ, వై తుది నెఱుగఁ గల వతిసమంచితబుద్ధిన్. 892

ఆ. అధిప నీవు రిపులయందైనవాత్సల్య, మిడు దయాళుఁడవు మహీశవరుఁడ
వఖిలధర్మవిదుఁడ వరయంగ నీకాజి, జయము గలుగుటకు విచార మేల. 893

వానరులు సంతుష్టులై సింహనాదములు సేయుట.

వ. మహాత్మా నీకు నిక్కంబుగా సంగ్రామజయంబు సిద్ధించు స్వస్థచిత్తుండ వై రణంబున రావణు సాధింపు మని సాభిప్రాయంబుగాఁ బలికి యవ్వైనతేయుండు రామలక్ష్మణుల విశల్యులం జేసి వానరులకుఁ బ్రమోదంబు సంపాదించి రామునకుఁ బ్రదక్షిణంబు చేసి గాఢంబుగా నాలింగనంబు గావించి యమ్మహాత్ముని చేత సముచితంబుగా నామంత్రణంబు వడసి వానరు లందఱు విలోకించుచుండ గగనంబున కెగసి పవనుండుంబోలె నధికజవయుక్తుం డై యథేచ్ఛం జనియె నంత విశల్యు లైన దాశరథులం జూచి నగయోధు లగు వానరులు భయంబు విడిచి పరమానందభరితాంతఃకరణు లై లాంగూలంబులు ద్రిప్పుచు సింహనాదంబులు గావించుచు శంఖంబు లొత్తుచు భేరీమృదంగంబులు వాయించుచు భుజాస్ఫాలనంబు సేయుచు సింహపోతంబులభంగిఁ జెలంగుచు గిరిశృంగంబులు పాదపంబు లుత్పాటించి తెచ్చి యంసభాగంబుల నలవరించుకొని శతసహస్రసంఖ్యాతవానరు లొక్కొక్కమొత్తం బై రాక్షసులకు భయంబుఁ బుట్టించుచు యుద్ధకాంక్ష మనంబునం జెంగలింపఁ బాదవిన్యాసంబులం బుశమి

గ్రక్కదల భీషణరభసాతిరేకంబున లంకాద్వారంబు నరికట్టి యర్ధరాత్రసమ
యంబున నందఱొక్కపెట్టి భువనభయంకరంబుగా సింహనాదంబులు చేసిన
నమ్మహోత్తుములశబ్దంబు నిదాఘుకుసుంబునందలిసంవర్తకాది మహామేఘనిర్ఘో
షంబుభంగి నతిభీషణం బై లంకాద్వీపంబు నిండి చెలంగె నప్పుడాబలవంతు
లైనవానరుల స్నిగ్ధగంభీరనిర్ఘోషంబు విని రావణుం డదరిపడి లేచి సమీపస్థు
లైనసచివుల నందఱ నవలోకించి యి ట్లనియె. 894

రావణుండు వానరులసింహనాదము విని వితర్కించుట

సీ. దేవాసులార వింటిరె మహాబలు లైన తరుచరోత్తములమోదప్రభూత
ఘోరనిర్ఘోషంబు దారుణాభ్రరవంబుకరణి గంభీర మై గాఢభంగిఁ
దోయధి శోషింపఁ జేయుచున్నది వనాటులకెక్కుడగుప్రీతి గలిగి యుండఁ
బోలు సందియము లేదీలాగు నిక్కంబు గాని చో రామలక్ష్మణులు తీక్ష్ణ
తే. విశిఖపరిబద్ధు లై యుండ వేళ గాని
వేళ నిట్టిముదారావ మేల కలిగె
శంక వొడమెడు ననుచుఁ దదంకవస్తు
లైనదనుజులఁ జూచి యి ట్లనుచుఁ బలికె. 895
తే. మీరు రయమునఁ గపులసమీపమునకుఁ
జని విషణ్ణసమయంబున సంప్రహర్ష
మిట్లు వొడమినకారణ మెల్ల నెఱిఁగి
వచ్చి చెప్పుఁడు మాకు సర్వంబు నిపుడు. 896
చ. అన విని యానిశాటులు రయంబున సాలము నెక్కి భానువం
శ్తనయుభుజాభిరక్షితజితశ్రమకీశచమూకదంబము
న్ఘనతరఘోరసర్పమయకాండవిముక్తుల రాఘవేంద్రుల
న్ఘనిశితహర్షసంయుతులఁ జూచి మనంబున భీతి పర్వఁగన్. 897
చ. కడువడిఁ గోట డిగ్గి చులుకం దలపాగలు వీడ నంగము
ల్వడఁక ముఖంబులం గడువివర్ణత గన్పడఁ బాదము ల్వడిఁ
దడఁబడ చెమ్మట ల్వొడమఁ దద్దయు రోఁజుచు సత్వరంబుగం
దడయక పాఱి యిట్లనిరి దానవనాథునితోడ దీనతన్. 898
చ. సమరములోన నెవ్వరలశక్రజిదంబకపాశబద్ధు లై
భ్రమ గొని నిష్ప్రకంపపృథురమ్యభుజాకృతు లై గలంగి రా
విమతులు రామలక్ష్మణులు వేగ తదంబకపాశముక్తు లై
సముదితదంతిపోతములచాడ్పున శోభిలుచున్నవారొగిన్. 899
చ. దనుజవరేణ్య వానరకదంబము పంకజమిత్రపుత్రశా
సనమున లేచి పాణిధృతశైలశిలాతరుజాల మై ఘన
స్వనములమాడ్కి దారుణరవంబుల దిక్కులు వ్రక్కలించుచు

మ్మనుపటికంటె నెక్కుడగుమోదము నొందుచు నున్న దెంతయున్. 900

క. నా విని పటుచింతాశో,కావిలచేతస్కుఁ డగుచు నాస్యములందు
నైవర్ణ్య మొదవఁగా ర,క్షోవిభుఁ డిట్లనియె వారిఁ జూచి లఘుగతిన్. 901

శా. ఘోరాశీవిషతుల్యదత్తవరనిర్ఘోషోగ్రభాస్వత్కరా
కారామోఘసురేంద్రజిత్కృతమహాకాకోదరాస్త్రంబులన్
వైరుల్చిక్కక ముక్తులై కుశలులై వర్ధిల్లుచున్నారు నేఁ
డారా యిట్టివిచిత్రము న్గనియు మున్నాలింపలే దెన్నఁడున్. 902

తే. పాయకెద్దానిచే నస్మదీయజీవి,తంబు పగతుల కాజి నదత్త మయ్యె
నట్టివాసుకితుల్యనాగాస్త్రచయము, నిష్ఫలత్వంబు నొందెనే నృపునిచేత.

రావణుఁడు వానరులమీఁదికి ధూమ్రాక్షునిం బంపుట.

వ. అని పలికి కొండొకసేపు దురంతచింతాక్రాంతమానసుండై మహోరగంబుకరణి నిట్టూర్పులు నిగిడించుచుండి యంత నొక్కింత ధైర్యం బవలంబించి దండతాడితభుజంగంబుభంగి సంక్రుద్ధుండై తనకెలంకున నలంకృతుండై భీమపరాక్రమంబునం గ్రాలుచున్నధూమ్రాక్షు నీక్షించి నీవు చతురంగబలంబులఁ గూడి శీఘ్రంబున రణంబునకు వెడలి సర్వవానరసమన్వితంబుగా రాముని జయించి రమ్ము పొమ్మనిన నతండు రాక్షసాధ్యక్షువాక్యప్రేరితుండై వాతప్రేరితంబైన మహామేఘంబుకరణి విజృంభించి గర్జించి యతనికిం బ్రదక్షిణంబును బ్రణామంబునుం గావించి యనుజ్ఞ గొని తదాలయంబు వెలువడి రక్తమాల్యాంబరాభరణానులేపనంబులం గైసేసి మొగసాల నున్నబలాధ్యక్షు నవలోకించి నీవు తడవుసేయక రయంబున బలంబులం గూర్చుకొని సన్నద్ధుండవై రణంబునకు రమ్మనిపలికి వృకసింహముఖంబులు గలకాంచనభూషణాలంకృతంబులైనఖరంబులం బూన్చినసాంగ్రామికంబైనరథం బారోహించి దృఢం బగుకంటకంబు దొడిగి బాణబాణాసనతూణీరంబులు బిగించి శంఖకాహళధ్వనిపూర్వకంబుగా రణంబునకు వెడలెనప్పుడు కాంచనధ్వజపతాకాయుగచక్రకూబరాక్షప్రముఖసర్వాంగసుందరంబులైనస్యందనంబులునునీలాచలోత్తుంగంబు లగుమాతంగంబులునుదిరస్కృతపవమానమానసరయంబులగుహయంబులును నానావిధవదనభీకరంబులగుఖరంబులును గదాపరిఘపట్టిసప్రాసకూటముద్గరముసలశూలకరవాలభిండివాలభల్లపరశ్వథప్రముఖవివిధాయుధపాణులగుపూర్వగీర్వాణులును దండోపతండంబులై జలధరంబులభంగి నింగి తూఁటుగట్ట సింహనాదంబులు సేయుచు వ్యాఘ్రంబులుంబోలె దురాసదులై చరణక్షుణ్ణసముద్భూతమహీపరాగంబు మింటికెగయ నిశాతహేతులతళ్తళలం గలసి సువర్ణరుచులు దిక్కులంబి

ధూమ్రాక్షున కశుభనిమిత్తంబు లగపడుట.

క్కటిల్ల నీరంధ్రంబుగా ధూమ్రాక్షునిం బరివేష్టించి కోలాహలబహులంబుగాఁ జని రిట్లసంఖ్యేయబలపరివృతుండై సువర్ణమయనేమికింకిణీనిర్ఘోషభీషణంబుగా

హనుమంతుం డున్నపశ్చిమద్వారంబు వెడలి వడి నడచునప్పు డారాక్షసున
కశుభంబులు దెలుపుచు భూమ్యంతరిక్షదివంబులయందుఁ గొన్ని దారుణనిమిత్తం
బులు దోఁచె రథశీర్షంబునందు మహాకాయం బగుగృధ్రంబు భీమంబుగా
వ్రాలె ధ్వజాగ్రంబునందుఁ గొన్ని కుణపాశనఖగంబులు సంచరించె రుధిరార్ద్రం
బై యొక్క మహాశ్వేతకబంధంబు పుడమిపయిం బడియె విస్వరంబుగా మ్రోయు
చు ధూమ్రాక్షునిసమీపంబునం గొన్నిమృగంబులు సంచరించె గగనంబున
నుండి రక్తవర్షంబు గురిసె లంకాపురంబు సంచలించెఁ బ్రతిలోమంబుగా వా
యువు విసరె దిక్కులం జీఁకటులు గ్రమ్మె నిర్ఘాతసమనిస్వనం బై రజోవాతంబు
సుడిసె రుధిరాశనంబు లగుగృధ్రకంకశ్యేనప్రముఖవివిధఖగంబులు ధూమ్రా
క్షునిమస్తకోపరిభాగంబునం జరించె నట్టిప్రాదుర్భూతదారుణోత్పాతంబులు
చూచి రాక్షసులు భయభ్రాంతు లైరి ధూమ్రాక్షుం డొక్కింత వ్యథితుం
డయ్యును సరకుగొనక రణోత్సుకుం డై భీమరాక్షసచమూసమేతంబుగా నమ్మ
హాద్వారంబు నిర్గమించి రాఘవబాహుపాలితం బై సముద్రకల్పం బై నిండి
యున్న వానరసైన్యంబు నవలోకించి రభసంబుగాఁ గదియ నడిచె నప్పుడు.

ఉ. భీషణవారివాహముల పెంపున నింగిఁ జెలంగ భీమని
ర్ఘోషము సేయుచుం జటుల ఘోరచమూతతిఁ గూడి వచ్చుఘో
రేక్షుని ధూమ్రలోచను నహీనపరాక్రముఁ జూచి వానరు
ల్రోషము హర్షముం జెలఁగ రూఢిగ నార్చుచు జన్యకాంక్షు లై. 905

వానరరాక్షసులతుములయుద్ధము.

శా. ఆటోపంబున దారుణస్ఫుటభుజాహంకార మేపారఁగా
ఖేటవ్రాతము చూచి చిత్తముల రాగిల్లన్ శిలాశైలసం
ఘాటంబుల్ గొని రౌద్రవైఖరి నిరాఘాటోద్ధతిన్ వచ్చి ని
ష్కౌటిల్యంబున దాఁకి రుగ్రతరసంగ్రామార్థులన్ దైత్యులన్. 906

శా. శోణభ్రాజితనేత్రు లై కుపితు లై శుంభద్గతి న్వచ్చి వి
న్నాణం బేర్పడ నీగతిం గదియు కాంతారాటులం జూచి త
త్క్షోణీచక్రము సంచలింప మిగులం గ్రుద్ధాత్ము లై పూర్వగీ
ర్వాణుల్ గ్రిక్కున వారిఁ దాఁకిరి భుజాప్రాబల్య మేపారఁగన్. 907

వ. ఇట్లు లతివేలమర్యాదంబు లైనసముద్రంబులభంగి నుప్పొంగి మేరమీఱి హరి
రాక్షససైన్యంబులు రోషపరవశంబు లై రౌద్రప్రకారంబున నొండొంటిం
దాఁకిన ఘోరం బగుసంగ్రామం బయ్యె నప్పుడు. 908

శా. అక్షీణస్ఫుటదోర్బలం బెసఁగ నుగ్రాకారు లై వానరు
ల్దక్షత్వంబున ఘోరసంగరకళాప్రాగల్భ్య మేపారఁగా
రక్షస్సైన్యముమీఁద నొక్కమొగి నీరంధ్రంబుగాఁ బర్వడి
న్వృక్షంబు ల్వెస పీచి వైచిరి మహానిర్ఘోషపూర్వంబుగన్. 909

శా. ఆలో దైత్యులు విక్రమించి పటుబాహాటోపులై పావక
జ్వాలాభీలపటుస్ఫులింగపటలీసంచారఘోరంబుగా
శూలంబు ల్వడిఁ బూన్చి బిట్టలుకతో శుంభద్గతి న్వ్రేసి రా
శైలాటధ్వజినీకదంబములపై సాంద్రంబుగా నుద్ధతిన్. 910

శా. విద్యుద్వల్లులమాడ్కిఁ దోఁకలు వియద్వీథిం బ్రకాశింపఁగాఁ
బ్రోద్యద్బాహుబలాతిరేక మదరం బొల్పొంద సంగ్రామసం
పద్యోగం బటు చూచి వేల్పులు నుతింప న్వేఁకతో రాక్షసు
ల్సద్యోమృత్యువు నొంద జా ల్గురిసి రా శైలాటవంశోత్తముల్. 911

ఉ. దైత్యులు విక్రమించి పటుదర్ప మెలర్పఁగ నాక్రమించి త
త్రత్యఘునస్వనంబు బెడిదంబుగ నింగిఁ జెలంగ జన్యపాం
డిత్యము మీఱ ఘోరముగ నిష్ఠురఖడ్గము లేసి దోర్బలా
ద్ధత్యముఁ జూపి రప్పుడు మదం బడఁగ న్గహనాటకోటికిన్. 912

ఉ. అక్షయబాహుశౌర్యులు దురాసదు లుగ్రభుజు ల్వనాటహ
ర్యక్షులు విక్రమంబు చెలువారఁ గృతాంతసమప్రభావులై
దక్షత నేగి వజ్రసమదారుణశాతనఖంబుల న్వడీ
న్రాక్షసకుంభిమస్తములు వ్రక్కలువాపిరి పెక్కుభంగులన్. 913

శా. వీరు ల్దానవు లొక్కభంగిఁ బటుదోర్వీర్యం బవార్యంబుగా
శూరత్వం బిఁక మాకు నెన్నటి కటంచుం జాల సంక్రుద్ధులై
నారి న్వే మొఱయించి మంట లుమియ న్నానాసమానాంబకా
సారంబు న్గురియించి రుగ్రగతిఁ గీశశ్రేణిపై బల్విడిన్. 914

మ. హరివీరు ల్గడుసాహసం బడర నుద్యద్దృప్తశార్దూలము
ల్రురుడింభంబుల నాక్రమించినక్రియ న్రోషోద్ధతి న్యామినీ
చరుల న్భీషణవైఖరిం బొదివి భాస్వత్తీక్ష్ణదంతంబులం
గర ముద్వృత్తి శిరంబులం గొఱికి వేఁకం జంపి రేపారఁగన్. 915

చ. అసురులు భీతిఁ జెందక దురాగ్రహులై భయదస్వనంబుతో
నసమున డాసి వజ్రకఠినాయసదీర్ఘహరిధ్వజోల్లస
న్ముసలములం గరంబుల సముత్సుకతం గొని దోర్బలంబుల
న్విసరి వనాటకోటిపయి నేర్పున వైచిరి దర్ప మేర్పడన్. 916

సీ. కాలాయసమయోగ్రకఠినముద్గరముల విసువక పలుమఱు వ్రేసి వ్రేసి
పవిసన్నిభస్పర్శపట్టిసాయుధముల మచ్చరంబునఁ జాల గ్రుచ్చి గ్రుచ్చి
తీక్ష్ణాగ్రకఠినోగ్రదీర్ఘకుంతంబులఁ గడువడి విడువక పొడిచి పొడిచి
కాంచనవలయసంకలితోగ్రగదలచే నుత్తలపడ వడి మొత్తి మొత్తి

తే. భయదగతి శక్తితోమరప్రాసపరిఘ, ముద్గరపరశ్వథంబుల మోఁది మోఁది
సమదగతిఁ జండరాక్షసు లసంగరమున, మించి వానరబలము నొప్పించి రపుడు.

సీ. కడకాళ్లఁ బట్టి భీకరలీల వడిఁ ద్రిప్పి వీఁకతోఁ బుడమికి వ్రేసి వ్రేసి
కచము లాకర్షించి గ్రక్కునఁ బడఁ ద్రోచి జానుఘాతంబులఁ జదిపి చదిపి
పవిసన్నిభస్పర్శపటుముష్టిహతులచే బొమ్ములు పగులంగఁ గ్రుమ్మి క్రుమ్మి
మెడఁ బట్టుకొని కూల్చి విడువక కంఠము ల్దట్టించి యరికాళ్ల మట్టి మట్టి
తే. దీర్ఘవాలంబు లూపిరి దిరుగకుండ, మెడల కురి పెట్టి కడువడి మెదిపి మెదిపి
చండగతి వీరవానరు ల్సంగరమున, నసురబలములఁ బొలియించి రద్భుతముగ.
ఉ. తెక్కలి దానవు ల్కపులు దారుణభంగి రణం బొనర్పఁగా
మిక్కిలి చూడ నొప్పె రణ మేదినియందు మహాద్భుతంబుగా
నెక్కడఁ గన్నఁ బాదపము లెక్కడఁ గన్న శిలాసముత్కరం
బెక్కడఁ గన్న నుజ్జ్వలదహీనవరాయుధఖండజాలముల్. 919

వానరబలంబున కోర్వలేక రాక్షసులు పాఱుట.

వ. ఇట్లుభయబలంబులు కొండొకసేపు సమానంబుగా భండనంబుఁ జేసి రంతబల వంతు లగువానరులు మహావాతప్రేరితకాలమేఘంబులకరణి విజృంభించి భూన భోంతరాళంబు నిండ గర్జించుచు సింగపుఁగొదమలభంగిఁ జెలంగుచు రాక్షస బలంబులకుం గవిసి విపులంబు లగుమహోపలంబులు రువ్వియు బహుశాఖం బు లగుపాదపంబులు వైచియు ముష్టిప్రహారంబుల నొప్పించియు నఖంబులఁ జించియు దలంబులఁ బ్రహరించియు దంతంబుల విచారించియుఁ గరిదంతం బులఁ బెఱికి వ్రేసియు రథధ్వజదండంబు లుత్పాటించి తెచ్చి మోఁదియుఁ గాలం దేలఁ జమరియు బహుప్రకారంబుల విచిత్రంబుగా రణక్రీడసలిపిన నబ్బ లంబులందు రథికసారథిరథ్యసహితంబుగా నఱవఱ లై కూలినయరదంబులు నాధోరణసమన్వితంబుగాఁ గూలుపర్వతాకారంబు లగుగజేంద్రంబులు నాశ్వి కులతో విగతప్రాణంబు లై వసుధాతలంబునం బడుహయంబులును నిర్భిన్న దేహు లై రుధిరంబు గ్రక్కుచుఁ బుడమిం ద్రెళ్లి జీవితంబులు విడుచువీర రాక్షసులును బహుప్రకారంబులం బాఱుశోణితనదీప్రవాహంబులును మేదో మాంసమస్తిష్కపంకంబును భూతబేతాళకలకలంబులుం గలిగి సంగ్రామత లంబు దారుణదర్శం బయ్యె నప్పు డవ్వానరులముంగల నిలువ నోపక భయ భ్రాంతు లై ముఖంబుల వెల్లఁదనంబు గదుర విప్రకీర్ణశిరోరుహు లై కనుక

ధూమ్రాక్షుఁడు రాక్షసులం బురికొల్పి తానును విక్రమించుట.

నిం బఱచు రాక్షసులంజూచి ధూమ్రాక్షుండు కోపోద్దీపితముఖుండై బరవసం బు జేసి పురికొల్పి వెల్లివిరిసి వచ్చుమహాసముద్రంబుపోలికి ననివార్యం బై చనుదెంచుచున్న వానరబలంబు చెలియలికట్టతెఱంగున నడ్డగించి సాంద్రం బుగాఁ బ్రాసముద్గరపరిఘపట్టసభిండివాలకరవాలశూలాదిసాధనంబులు పరఁగిం చిన నవ్వానరబలంబునందుఁ గొందఱు రుధిరసిక్తాంగు లై కొందఱు విభిన్న వక్షు లై కొందఱు భిన్నోత్తమాంగు లై కొందఱు రుధిరోద్గారిముఖు లై

కొందఱు చూర్ణితాస్థిసందోహులై కొందఱు విదారితశరీరులై కొందఱు
గతాసులై పుడమిం ద్రెళ్ళి రిట్లు వానరబలంబులయుబ్బడంచి రాక్షసులకు
హర్షంబు గావించి ధూమ్రాక్షుండు ధనుష్పాణియై మౌర్వీనాదంబు దిక్కులం
బిక్కటిల్ల నక్కజంబుగా శరవృష్టిం బరఁగించుచుఁ గార్ముకజ్యాతంత్రీమధురం
బుగా హుంకారతాళసమన్వితంబుగా మందస్తనితసంగీతంబుగా యుద్ధగాంధ
ర్వంబు గావించిన నతనియాటోపంబుఁ జూచి సహింపక యుగాంతకాలరుద్రుం
డుంబోలె రౌద్రరసోల్లాసమూర్తియై కన్నులం గెంజాయ రంజిల్ల వాయునంద
నుండు తండ్రియుంబోలె బలవేగంబు లంగీకరించి యొక్క మహాశిలాకరంబునం
బూన్చి పాదవిన్యాసంబులఁ బుడమి గ్రక్కదల భీషణరభసాతిశయంబునం
బఱతెంచి వానరుల కానందంబుఁ బుట్టించుచు నిలు నిలు మని యదల్చుచు
ధూమ్రాక్షున కభిముఖంబుగాఁ జనుదెంచి. 920

హనుమంతుఁడు శిలాపాతనంబున ధూమ్రాక్షురథము చూర్ణము సేయుట.

ఉ. ఏమిర రాక్షసాధమ యొకించుకసేపిటు నిల్వు మిప్పుడే
నీమద మంతయుం గెడపి నిక్కముగా నినుఁ గాలుప్రోలికిన్
దీమస మొప్పఁ బంపెదఁ బ్రతిజ్ఞఁ గనుంగొను మంచు వానిపై
భీమహితుండు వాయుజుఁడు తెంపున వైచె శిలం జలంబునన్. 921

చ. ఇటు మరుదాత్మజోల్లసదహీనసమానభుజప్రముక్తయై
తటుకున నేగుదెంచుశిల తప్పక గన్గొని భీతచిత్తుఁడై
కుటిలనిశాచరుండు గనుఁగొంచు రయంబున దాఁటె నుర్వికిం
బటుగతిఁ దచ్ఛతాంగమును భస్మముఁ జేసె మహోపలం బొగిన్. 922

ఉ. మారుతపుత్త్రుఁ డీక్రియ నమందపరాక్రమదుర్నివారుఁడై
సారథిరథ్యకేతుయుగచక్రశరాసనసంయుతంబుగా
ఘోరనిశాటుతేరు వడిఁ గూల్చి దృగంచలరక్తదీధితు
ల్దారుణభంగిఁ బర్వ జటులప్రళయాంతకులీలఁ గ్రాలుచున్. 923

శా. సస్కంధస్ఫుటపత్త్రమూలవిటపక్ష్మాజంబు లంకించి తే
జస్కాముండు మరుత్కుమారుఁడు భుజాసంరంభ మేపారఁ జం
డస్కంధుం డలతారకానుచరుల న్మర్దించినట్లుగ్ర చే
తస్కుల్ దైత్యులు గూల నేసెఁ బటుదోర్దర్పంబు దీపింపఁగన్. 924

ఉ ఈగతిఁ గ్రవ్యభుగ్బలము నెల్ల రయంబునఁ జంపి సంగరో
ద్యోగమహత్త్వకోవిదుఁడు యుక్తవిచారుఁడు గాడ్పుపట్టి దో
ర్వేగ మెలర్ప నొక్కపృథివీధరశృంగము కేలఁ గ్రాలఁగా
బాగుగ నేగె బల్విడి క్షపాచరవీరునిమీఁది కుద్ధతిన్. 925

ఉ. కాలునిమాడ్కి నిట్లు ధర గ్రక్కదలం జనుదెంచుచున్నవా
తూలకుమారుఁ జూచి కడుదుష్టుఁడు దైత్యుఁడు క్రుద్ధుఁడై దిశా

జాలము వ్రయ్య నార్చుచుఁ బ్రచండరయంబున నేగుదెంచి యా
భీలముగా గద న్విసరి పెచ్చిన నాతనిమీఁద వైచినన్. 926

హనుమంతుఁడు ధూమ్రాక్షునిం జంపుట.

మ. గదచేఁ దాడితుఁ డయ్యు నొవ్వక భుజాగర్వంబు దీపింపఁగాఁ
త్రిదశారీ భవదీయబాహుబలముం దెల్లంబుగాఁ జూపితౌ
నిదె మద్బాహుబలంబుఁ జూడు మిఁక నం చేపార వాతాత్మజుం
డదయుం డై పడవైచెఁ దచ్ఛిరముపై నద్రీంద్రశృంగం బొగిన్. 927

క. గిరిశృంగతాడితుం డై, దురమున మస్తకము పగిలి ధూమ్రాక్షుఁడు చె
చ్చెర నిర్గతజీవితుఁ డై, ధరఁ బడియె విశీర్ణపర్వతముచందమునన్. 928

చ. అనిలజముక్తశైలశిఖరాహతిభిన్నశిరస్కుఁ డై రణాం
బున వడి నీల్గినట్టిబలముఖ్యుని ధీరుని ధూమ్రలోచనుం
గనుఁగొని భీతి నంగములు కంపము నొందఁగ నూర్ధ్వబాహు లై
కనుకనిఁ బాఱి రార్పు లెసఁగ న్పురికి న్హతశేషరాక్షసుల్. 929

వ. ఇత్తెఱంగున రెండవనాఁటియుద్ధంబున నత్తరుచరశ్రేష్ఠుండు ధూమ్రాక్షుని నశ్రమంబునం బరిమార్చి రణమేదినియం దనేకరుధిరప్రవాహంబులుగావించి కపులచేతఁ బూజ్యమానుం డై వృత్రాసురునిం జంపిన దేవేంద్రునిచందంబునం గ్రాలుచుండె నంత రావణుండు ధూమ్రాక్షుండు హనుమంతునిచేత నిహతుం డగుట విని దురంతచింతాభరంబున నొక్కింతసే పూరకుండి పదంపడి మహానాగంబుకరణి దీర్ఘంబుగా వేఁడియూర్పు నిగుడించి రౌద్రక్రోధకలుషీకృతాంతరంగుం డై రక్తాంతవీక్షణంబుల బలాధ్యక్షుల నందఱ నవలోకించి వజ్రదంష్ట్రుం డనురాక్షసు నుద్దేశించి యిట్లనియె. 930

రావణుఁడు వజ్రదంష్ట్రుని వానరులమీఁదికిఁ బంపుట.

ఉ. నీవు రణానివర్తి వరినేతలకు న్సమవర్తి వుగ్రబా
హావిభవప్రచారసముపార్జితకీర్తివి గాన నిప్పుడే
చేవ దలిర్ప సైన్యముఁ జేకొని పోయి రఘుప్రవీరు సు
గ్రీవయుతంబుగా నఖిలకీశుల నాజి వధించి రమ్మొగిన్. 931

చ. అనిన మహాప్రసాద మని యారజనీచరవంశశేఖరుం
డనుపమజన్యహర్షపులకాంకితఘోరశరీరుఁ డై రయం
బున నవరత్నహారమణిభూషణము ల్ధరియించి రక్తచం
దనమున రక్తమాల్యపరిధానమునం గయిసేసి చెచ్చెరన్. 932

శా. తూణీరంబు బిగించి కాంచనమయస్తోకస్ఫురచ్చాపముం
బాణిం బూని సువర్ణభూషితబృహద్భానూగ్రకీలోల్లస
ద్బాణంబు ల్గయిఁ దాల్చి నిష్ఠురతనుత్రాణంబు భాస్వచ్ఛిర
స్త్రాణంబు న్సవరించి జన్యమునకుఁ సన్నద్ధుఁ డయ్యె న్వడిన్. 933

చ. అనిమిషలోకనాథుని భయంబునఁ దద్రిపుఁ డైన దైత్యవ
ర్యుని దశకంధరు న్శరణ మొంది తదీయకృప న్పతత్రము
ల్సునిశితభంగిఁ గాచికొని శోభిలుచున్న నగంబులో యన
న్ఘనముగ నంతలో నచట గంధగజంబులు గూడె నత్తఱిన్. 934

చ. తనువులు మూఁడు భూతములు దాలిచె నే నొకరుండ నేలకో
తనువు వహింప నైతి నని తద్దయు వేడుకతో మహోరయుం
డనిలుఁ డనేకరూపముల నర్థి వహించె ననంగఁ బొల్చు కాం
చనమణిభూషితాశ్వము లసంఖ్యము లచ్చటఁ గూడె నంతలోన్. 935

చ. అతులితభంగి సంగరమహార్ణవము న్దరియింపఁ గోరి యు
ద్భుతగతిఁ జేసినట్టిఘనపోతములో యనఁ జాల నొప్పుమా
రుతసఖహేతితుల్యమణిరోహితకేతుపరిష్కృతంబు లై
వితతరథంబు లాదనుజవీరునిముంగల నిండె నంతలోన్. 936

మ. హరిలోకేంద్రుఁడు పాదఘాతభవభారాక్రాంతుఁ డై చెచ్చెర
స్వరుస న్వేయిమొగంబుల న్విడుచునిశ్వాసోగ్రధూమం బొగి
న్ధర భేదించి నభోంతరాళ మటు నిండం బర్వెనో నాఁగ బం
ధుర మై ధాత్రీరజంబు పెల్లెగయ దైత్యుల్గూడి రొక్కుమ్మడిన్. 937

చ. తురగఖురాభిఘాతమునఁ దోఁచినసాంద్రమహీపరాగ మం
బరమున భూరివారిదముభంగి రహిం జెలు వొందె దానికిన్
గురుతరభేరికాపటహఘోషణము ల్పటుగర్జ లయ్యె భా
సురవివిధాయుధద్యుతులు సొంపుగఁ జంచల లయ్యె నయ్యెడన్. 938

వజ్రదంష్ట్రున కశుభనిమిత్తంబు లగపడుట.

వ. ఇట్లు గూడినఁ జతురంగబలసమేతుం డై యద్దనుజశేఖరుండు గదాకౌక్షేయక ప్రముఖనిఖిలాయుధపరిష్కృతం బైనతప్తకాంచనరథంబు ప్రదక్షిణపూర్వకంబుగా నారోహించి రణార్థి యై యంగదుఁ డున్నదక్షిణద్వారంబు వెడలె నప్పుడారాక్షసుల కశుభసూచకంబుగా నాకాశంబున నుండి విఘనంబు లై తీవ్రోల్కాజాలంబులు పడియె శివాసంఘంబులు పావకజ్వాలలు గ్రక్కుచు ఘోరంబుగా నిర్హ్రాదంబులు సలిపె ఘోరంబు లగుమృగంబులు రాక్షసులకు నిధనంబు దెలుపుచు విస్వరంబుగా మ్రోసె గజతురగపదాతి మండలికి మొగ్గతిలంబడె నిట్టియౌత్పాతికంబులు చూచి సరకుగొనక మహాబలుం డగువజ్రదంష్ట్రుండు ధైర్యం బవలంబించి రణోత్సుకుం డై కోదండటంకారశబ్దంబును సువర్ణకింకిణీనిర్ఘోషంబును రథనేమినిస్వనంబును భీషణభంగిఁ జెలంగ నాటోపంబున వానరబలంబు కదియ నడిచె నప్పుడు నానావిధాయుధచర్మవర్మవివిధభూషణవిచిత్రచేలాలంకృతం బై పూచినకెందామరకొలని తెఱంగున నందంబగుచుఁ జనుదెంచుచున్న రాక్షసబలంబు నవలోకించి జితకాశులగు వానరులు

మదోద్దండవేదండంబులలీలం గ్రాలుచు దిశాచక్రంబు భేదిల్ల సింహనాదం బులు సేయుచు భీషణభంగి నెదుర్కొనిన నయ్యిరుదెసలవారికి ఘోరం బగు సంగ్రామం బయ్యె నప్పుడు. 939

-వానరరాక్షసుల మూఁడవనాఁటియుద్ధము.-

చ. అరుదు జనింప మార్కొని వనాటనిశాటులు క్రుద్ధులై పర
స్పరజయకాంక్షలం దొడరి బాహుబలంబునఁ బోరి పోరి భీ
కరగతి రక్తసిక్తఘనకాయులు భిన్నశిరోధరాంగులై
గురుతరజన్యరంగమునఁ గూలి రనేకులు పెక్కుభంగులన్. 940

చ. ఘనసమరానివర్తు లగుకర్బురవీరులు కొంద ఱుద్ధతిన్
ధనువులు దాల్చి యొండొరులఁ దాఁకి భయంకరవైఖరిన్ గుణ
ధ్వనులు సెలంగ నొక్కుమ్మొగి వహ్నిశిఖోపమబాణజాలము
ల్వనచరసేనమీఁద ననివార్యగతి న్సరఁగించి రుగ్రులై. 941

ఉ. వానరు లుద్ధతిం గవిసి వారనియుక్కు విశాలసాలసం
తానము లుగ్రకర్కశఘనస్ఫుటశైలశిలాకదంబము
ల్పూని భుజాబలం బలరఁ బుణ్యజనధ్వజినీగణంబుపై
మానక వీచి వైచి రసమానమహాధ్వనిపూర్వకంబుగన్. 942

చ. తరువులచప్పుడస్త్రములదారుణశబ్దము ఱాళ్ళమ్రోఁత భీ
కరరథనేమినిస్వనము కాంచనకార్ముకమౌర్వికాధ్వనుల్
గురుతరకంఠహుంకృతు లకుంఠితశంఖమృదంగభేరికా
గురునినదంబు లొక్కటిగఁ గూడి చెలంగె నభోంతరంబునన్. 943

వ. అప్పుడు జితకాశు లగువానరులచేతఁ దమతమయాయుధంబులన్నియుఁ బోడిమైన రాక్షసులు యుద్ధదుర్మదు లగువానరులతోడ బాహుయుద్ధంబునకుం దలపడి విచిత్రప్రకారంబునఁ గొండొకసేపు ఖండనంబుఁ జేసి కొందఱు తదీయకరచరణ ముష్టిజానుకూర్పరఘాతంబుల విభిన్నసర్వాంగు లై మడిసిరి కొందఱు నఖదంత హతుల విలూనకంఠు లై, గెడసిరి కొందఱు శిలాతరుపాతంబులఁ జూర్ణితాస్థిసం దోహులై పొలిసి రత్తెఱం గంతయు విలోకించి వజ్రదంష్ట్రుండు క్రోధవిస్ఫారి తేక్షణుండై తండోపతండంబు లగుకాండప్రకాండంబులు వఱపి వానరసైన్యం బులయుబ్బడంచి భయంబుఁ బుట్టించుచు లోకసంహారంబునందుఁ బాశహస్తుం డగుకాలునిపోలికి విహరించె నతనిప్రాపున నిశాచరగలంకులం దల మిగిలి బలవంతు లగురాక్షసులు స్వామిసందేశనిశ్శంకులై క్రోధవిశేషంబున మై మఱచి నానా ప్రహరణంబుల వానరులలావు సెడం బ్రహరించి రప్పు డారాక్షసులయుద్రేకం బును వజ్రదంష్ట్రునివిక్రమంబును విలోకించి వాలినందనుఁ డగునంగదుండు ద్వి గుణీకృతక్రోధవిక్రముండై సంవర్తానలునిభంగి వెలుంగుచు నేత్రకోణంబులం దామ్రదీధితులు నిగుడఁ బితృపితామహుల తెఱంగుననివార్యుండై సింహంబు

క్షుద్రమృగంబులంబోలె మహోత్తాలం బగుతాలంబున రాక్షసగణంబులం బరి
మార్చుచు నద్భుతప్రకారంబునఁ గదనంబు గావించిన నప్పుడు భీమవిక్రము
లగురాక్షసులు విభిన్నోత్తమాంగులై నికృత్తంబు లగుపాదపంబులచందంబున
నంగదున కభిముఖంబుగా ధరణిపయిం బడిరి తురంగమాతంగరాక్షసశరీరవిని
స్సృతరక్తధారాసారసముక్షితయై యుద్ధరంగంబు భయంకరంబై యొప్పె విశ
కలితరథరథాంగచిత్రధ్వజహారకేయూరవస్త్రాభరణవివిధాయుధపరిష్కృతయై
యచ్చటిమేదిని శరత్కాలరాకానిశచందంబునం జూడ నొప్పె నిట్లయ్యంగ
దునిబాహుబలంబున నపరిమితం బైనతద్రాక్షసబలంబు ప్రభంజనునిచేత
ధారాధరంబుభంగి సుడివడి సంచలించె నప్పుడు. 944

చ. పఱచెడు దైత్యసైన్యముల బంధురభూరిమహీజపాణి యై
తఱిమెడువాలినందనునిఁ దప్పక గన్గొని వజ్రదంష్ట్రుఁ డ
భ్రరవముమాడ్కి నాద మడరంగ బలంబులఁ జేయి వీచి చ
చ్చెరఁ బురికొల్పి క్రోధసువిశేషమునం బటురౌద్రమూర్తి యై

ఉ. దారుణవజ్రఘోషమువిధంబున భూరిగుణప్రణాదము
ల్మీఱి సెలంగ వానరులమీఁద నిరంతరఘోరసాయకా
సారము బల్విడిం గురియసాఁగె నిశాచరకాలమేఘ మే
పార విభూషణస్థమణిహాటకరోచులు శంపలై చనన్. 945

చ. సునిశితభంగి నద్దనుజుసూతిల నిల్చి మహారథు ల్ఘనా
ఘననిభగాత్రు లుగ్రరణకర్కశు లాత్తధనుశ్శరాసులై
దనుజులు శూరు లక్కపికదంబముపై సురరాజవైరిపై
మునుకొని తీవ్రకాండశతము ల్వరఁగించి రనేకభంగులన్. 946

ఉ. వానరులందుఁ జేయఁగలవారు భుజాబలవిక్రమాధికుల్
మానక వాలిపుత్రునికెలంకుల నిల్చి విశాలసాలసం
తానము లద్రిశృంగము లుదగ్రశిల ల్గొని సంభ్రమంబున
న్దానవసేనపై నశనికంష్ట్రునిపైఁ బడవైచి రుద్ధతిన్. 947

చ. పరశుగదాసికుంతములు పట్టిసముద్గరభిండివాలము
ల్వఱపి నిశాచరు ల్కపులభండనమందు వడి న్వధించి రా
హరులును మత్తదంతులక్రియం జెలరేఁగి శిలాద్రుమంబులం
బఱచి నిశాటసైన్యములఁ బంచత నొందఁగఁ జేసి రుద్ధతిన్. 948

ఉ. మానక యిట్లు మార్కొని సమంబుగఁ బోరొనరించునప్పు డా
దానవసేనలో నెచటఁ దప్పక చూచినఁ బాదపాశ్మముల్
వానరసేనలో నెచట వారక చూచిన హేతిఖండముల్
మేనుల నిండి యొప్పెను సమిత్క్రియ మేమనవచ్చు నయ్యెడన్. 949

సీ. భిన్నోత్తమాంగులై పెద్దకొండలభంగి ఘోరంబుగా ధాత్రిఁ గూలువారు 950

రక్తసిక్తాంగులై రమ్యకింశుకములకరణి రణంబున [illegible]
ప్రబలవాతాహతపాదపంబులమాడ్కిఁ గమవడిఁ [illegible] వారు
మంత్రించి వైచినమాడ్కిఁ గీలెడపిన బొమ్మలక్రియఁ [illegible] వారు
తే. నుత్సవాంతంబునందు నిరుత్సుకముగఁ
దెగి పడెడునాదితేయపతిధ్వజముల
రీతి దీర్ఘధ్వని సెలంగఁ ద్రెళ్లువారు
నగుచు హరిదానవులు నేల్గి రాలమందు. 951

సీ. మడిసినమత్తసామజసంఘ మెటు గన్న నెటు గన్న మృతతురంగేంద్రగణము
ఖండితభటగాత్రఖండంబు లెటు గన్న నెటు గన్న శకలితవృషురథములు
నెఱిఁ బాఱుశోణితనిమ్నగ లెటు గన్న నెటు గన్న బహువిధహేతిరజము
బహుమాంసమస్తిష్కపంకంబు లెటు గన్న నెటు గన్న బటుశిలావిటపిపటల
తే. మెచటఁ జూచిన గోమాయుగృధ్రకంక
కాకఘూకబలాకికాగణము మఱియు
నెచటఁ జూచిన బేతాళనిచయనినద
మై రణం బొప్పె నప్పు డత్యద్భుతముగ. 952

వ. ఇట్లు దారుణప్రకారంబున నాయోధనంబు సెల్లుచుండ నప్పుడు హరివీరులు హరితుల్యపరాక్రమంబున నఱిముఱి రాక్షససైన్యంబులమీఁది కుఱికి యుద్ధానుబలంబున శిలాపాదపనఖదంతకరచరణజానుకూర్పరముష్టిఘాతంబుల బడలుపడం జేసిన నందుఁ బగిలినశిరంబులును దెగినకంఠంబులును విలూనంబులైన కరపాదజానుజంఘికామధ్యంబులునుం గలిగి పెక్కండ్రు సమసిరి తక్కినరక్కసులు పులులం గన్న లేళ్లకరణి కనుకనిం బఱచి రిట్లు భీషణంబులైన పెక్కుకబంధంబులు మింట నాడ నద్భుతంబుగాఁ బెచ్చుపెరిఁగి విచ్చలవిడి కయ్యంబు గావించుచున్నతరుచరులం జూచి చమూనాథుం డగువజ్రదంష్ట్రుండు రోషతామ్రాక్షుం డై ప్రతాపంబు దీపింప ధనుష్పాణి యై ఘోరప్రకారంబున వానరబలంబు సొచ్చి యెచ్చటఁ జూచినం దాన యై మచ్చరంబున నన్నతపర్వంబు లగుకంకపత్రసాయకంబులు పరఁగించుచు నొక్కొక్కనిం బెక్కుబాణంబుల నొక్కబాణంబునం బెక్కండ్ర నుక్కడంచుచు నొక్కసాయకంబున నేవురఁ నేడ్వుర నెనమండ్రఁ దొమ్మండ్రఁ గుదురుగ్రుచ్చుచువిచిత్రప్రకారంబున విజృంభించి రణక్రీడ గావించిన నవ్వనచరు లందఱు శరసంవృతదేహులై భయంబు గొని యతనియాటోపంబునకు నిలువ నోపక రయంబునం బఱచి ప్రజలు ప్రజాపతిం బోలె రక్షరక్షేతి యార్తవాక్యంబుల నంగదుని శరణంబు నొందిన నవ్వాలినందనుండు వారి కభయంబు దెలుపుచుఁ గ్రోధావిష్టచిత్తుం డై భీషణప్రకారంబున వజ్రదంష్ట్రునిమీఁది కడరిన వాఁడు దారుణరథసాతిశ

యంబుగాఁ దాఁకుటయు నయ్యిరువురకు మృగేంద్రగజేంద్రంబులకుం బోలె నదృష్టపూర్వం బగుసంగ్రామం బయ్యె నప్పుడు. 953

అంగదవజ్రదంష్ట్రులద్వంద్వయుద్ధము.

చ. దనుజుఁడు వహ్నిహేతినిభదారుణబాణసహస్రకంబు సొం
పెనయ మహాబలుం డగుసురేశ్వరపౌత్రునిమర్మదేశమం
దనువుగ నేసె నేసిన నిరంతరశోణితదిగ్ధగాత్రుఁడై
యనుపమధాతుశోభితమహాధరణీధ్రముభంగి నొప్పుచున్. 954

శా. ఆవాలిప్రియపుత్రుఁ డంగదుఁడు బాహాసత్త్వ మేపారఁ గ్రో
ధావిష్టోగ్రమనస్కుఁడై యొకవిశాలానోకహం బుద్ధతిం
బ్రావీణ్యంబున వీచి వైచుటయు గీర్వాణారి వీక్షించి నా
నావజ్రాభశరంబు లేసి నడుమ న్ఖండించె దద్వృక్షమున్. 955

ఉ. ఆవిధ మంతఁ జూచి వెస నంగదుఁ డొక్కవిశాలశైల మం
తే వడి వీచి వైచి దశదిక్కులు వ్రక్కలువాయ నార్చిన
న్దేవవిరోధి దానిఁ గని తీవ్రమున న్గదఁ గొంచు లాఘవ
శ్రీవిభవంబు పెంపెసఁగఁ జెచ్చెర నుర్వికి దాఁటె నంతలోన్. 956

క. వాలిజకరముక్తలస, చ్ఛైలము పటురథ్యకేతుసారథియుగచ
క్రాలంకృత మగురథ్యకరథ్యకం బలుసిరథ మవనిఁ గూల్చెఁ బ్రధనక్షోణిన్. 957

క. తరుచరవరుఁ డీక్రియ నరి, విరథునిఁ గావించి మఱియు వేఱొకనగముం
దరుభూషితమును దైత్యుని, శిరమునఁ బడ వైచి యార్చె జీమూతగతిన్. 958

మ. అరుదార న్గురుశైలపాతమున మూర్ఛాక్రాంతుఁడై దైత్యశే
ఖరుఁ డక్షు ల్చుకుళించి యూర్పులు సెలంగ న్రక్తసిక్తాంగుఁడై
యురుముష్టిం గద యూతఁగాఁ గొని కరం బొక్కింతసే పూరకుం
డి రహిం గ్రమ్మఱఁ దెల్వి గైకొని బలోన్మేషంబు దీపింపఁగన్. 959

మ. గద సారించి మిడుంగుఱు ల్చెదర నుద్యత్క్రోధుఁడై వీఁకతోఁ
ద్రిదశేంద్రాత్మజపుత్రువక్షమున దోర్వేగంబున న్వైచి దు
ర్మదుఁడై యవ్వల ముష్టియుద్ధ మొనరింపం దాఁకె నయ్యంగదుం
డదయుండై వెస వానిఁ దాఁకెఁ బటుబాహాటోప మేపారఁగన్. 960

వ. ఇత్తెఱంగున రౌద్రంబుగాఁ దలపడి యాహరిరాక్షసు లిరువురు లోండొరులం బ్రహరించుచు సమృద్ధంబు లగువ్రణంబులచేత నిర్ఘరసమన్వితంబులగుపర్వతంబులమాడ్కిఁ జూడ్కికి వ్రేఁ గగుచు విక్రాంతులై యంగారకబుధులచందంబున నందం బగుచు యుద్ధదుర్మదులై డాయుచుఁ బ్రహారజనితశ్రములై పాయుచుఁ గొండొకసేపు ఖండనంబుఁ జేసి రంతఁ బరమతేజస్వి యగువాలినందనుండు కింకిణీజాలసంఛన్నంబునుజర్మపరిష్కృతంబునువిపులంబునుశుభంబును నిశాతంబు నగుకృపాణంబు గైకొనిన వజ్రదంష్ట్రుండును దోడన ఖడ్గ

పాణు లై బెట్టుడురె నయ్యిరువురు విచిత్రప్రకారంబున మార్కొని యన్యోన్య జయకాంక్షు లై యొండొరుల వ్రేయుచు మార్గంబు లెఱింగి విన్నాణంబులు నెఱపుచు నాకాశంబు పగుల మహానాదంబులు సేయుచు రుధిరోద్గారు లై ధాతుశోభితాచలంబులకరణి నలరుచు విచిత్రపదక్రమంబులం బోరుచుఁ బరిశ్రాంతు లై జానువు లూఁతగా ముందటికి మ్రొగ్గతిలంబడుచు హుంకరించుచుఁ బెక్కు తెఱంగుల నక్కజంబుగాఁ బోరుసమయంబునఁ గపికుంజరుం డగువాలినందనుండు నిమేషాంతరమాత్రంబున లేచి నేత్రంబులం దామ్రకోచులు నిగుడ దండతాడితం బగుమహోరగంబుకరణి సంక్రుద్ధుం డై నిర్మలనిశాతఖడ్గంబున వజ్రదంష్ట్రునిశిరంబు దెగవ్రేసిన నది నరోమపరివృత్తాక్షంబును గిరీటకుండలాలంకృతంబును రుధిరసిక్తంబును నై మహావాతపతితం బగుతాళఫలంబుకరణి ధరణిపయిం బడియెఁ దచ్ఛరీరంబు శోణితదిగ్ధం బై పూచినయశోకతరువుపోలికి నుర్విం గూలె నంత. 961

—అంగదుఁడు వజ్రదంష్ట్రునిం జంపుట.—

ఉ. ఈగతి వాలిపుత్రుఁడు సురేంద్రసమప్రభు వజ్రదంష్ట్రు దో
ర్వేగ మెలర్ప జంపి కపివీరులు తన్ను బహూకరింపఁగా
రాగ మెలర్ప దేవగణరంజితుఁ డై నబలారికై వడి
న్బాగుగఁ జూడ నొప్పెఁ గదనంబున హర్షమనోజ్ఞమూర్తి యై. 962

వ. ఇట్లు మూఁడవనాఁటియుద్ధంబున వజ్రదంష్ట్రుండు మడిసిన. 963

సీ. అనిలోన వజ్రదంష్ట్రునిపాటు గనుఁగొని హతశేషు లైన దేవారు లెల్ల
భయమోహితాత్ము లై పలుదెఱంగులనొచ్చి వదనంబునందు వైవర్ణ్య మొదవఁ
దగసిగ్గు పెంపునఁ దల యెత్తి చూడక రయము చొప్పడ నగరంబుఁ జేరి
రావణు లోకవిద్రావణు దర్శించి ఘనతరశోకగాఢత్వ మడర

తే. వాలిపుత్రునిచే మనవజ్రదంష్ట్రుఁ
డాహవంబున హతుఁ డయ్యె ననుచుఁ బలుక
విని దశాస్యుఁడు మనమున విహ్వలించి
యూర్పులు చెలంగఁ గొంత సేపూరకుండి.

తే. అంత నొక్కింతవడికి ధైర్యంబుఁ బూని
మోడ్పుఁగేల్దోయితోఁ దనమ్రోలఁ గొలిచి
యున్నవాని బలాఢ్యత్వు నొకనిఁ జూచి
దిట్టఁదనమునఁ బరుషోక్తి నిట్టు లనియె.

—రావణుం డకంపనుని వానరులమీఁదికిఁ బంపుట.—

మ. మనసేనం గలరాక్షసు ల్సమరసంపత్ప్రౌఢవిదు లై వైరిమ
ర్దనదక్షు ల్నిఖిలాస్త్రశస్త్రవిదు లుద్యద్వీర్యు లౌవారకం

పను ఘోరేషుఁ బురస్కరించుకొని శుంభద్విక్రమారంభు లై
యనికిం జెచ్చెర నేగువారుగ నిలింపారీ నియోగింపుమా. 966

చ. చతురుఁడు సంగరప్రియుఁడు శాస్త్రయు గోప్త్రయు నేత నాకు సం
తతమును భూతికాముఁ డతిదారుణదోర్బలుఁ డీయకంపనుం
డితఁడు రణంబులోన మనుజేంద్రకపీంద్రసమన్వితంబుగా
నతులితసాయకంబుల వనాటుల నెల్ల వధించు ప్రేల్మిడిన్. 967

తే. ఆహవంబున వాసవాద్యమరు లైన, నడలు పుట్టింపఁగాఁ జాల రందువలన
నతఁ డకంపనుఁ డనఁగ నన్వర్థుఁ డయ్యె, హేళికై వడిఁ దేజోభిహితుఁ డతండు.

క. అని దశకంఠుఁడు పలికిన, విని వీరుఁ డకంపనుండు విస్రబ్ధుం డై
ఘనసమరోత్సాహం బా, ననమున దీపింపఁ బటుగుణధ్వని సెలఁగన్. 969

వ. తప్తకాంచనకుండలకేయూరహారరక్తచందనమాల్యంబులఁ గైసేసి మేఘా
భంబును మేఘవర్ణంబును మేఘస్వనమహాస్వనంబు నగురథం బారోహించి
తనుత్రాణబాణాసనతూణీరంబులు బిగించి జంభశాసనశరాసనసమన్వితం బైన
మహామేఘంబుకరణినలరుచు శంఖకాహళమృదంగభేరికానిర్ఘోషభీషణంబుగా
రణంబునకు వెడలె నప్పుడు భగీరథుని వెనుకొని చనుగంగాప్రవాహంబుకరణి
నతని వెనుకొని మాతంగతురంగశతాంగవీరభటపుంగవాత్మకం బైనచతురం
గబలంబు వివిధహేతిచ్ఛటాధాళధళ్యంబు నింగిఁ జెలంగనద్భుతప్రకారంబునం
జనియె నప్పుడు కరటిఘటాఘీంకారంబులును వీరభటహుంకారంబులును వా
జీంద్రక్రేంకారంబులును భేరీభాంకారంబులును శింజినీటంకారంబులును బహు
ళంబుగా మోసె నిట్లు ఘోరవస్త్రాయుధధ్వజం బైనసైన్యంబునుంగూడి భువ
నకంపనుం డగునకంపనుండు రౌద్రప్రకారంబునఁ బశ్చిమద్వారంబున నిర్గ
మించె నప్పు డతనికి రణంబున నపజయంబు దెలుపుచు రథకీలితహయంబుల
కాకస్మికంబుగా దైన్యంబు వాటిల్లె మఱియును. 970

—అకంపనున కశుభనిమిత్తంబు లగపడుట.—

సీ. వామలోచనము దుర్వారభంగిఁ జలించె సారెకుఁ గన్నుల నీరు గ్రమ్మె
వదనంబునందు వైవర్ణ్యంబు గాన్పించెఁ గంఠస్వనమున గాద్గద్య మడరెఁ
గరమున నుండి భీకరకార్ముకము జాఱి పడియె వెంబడిఁ దలపాగ వీడె
ఖగమృగంబులు భయంకరగతి వాపోయె వేఁడిగాడ్పులు మీఁదవిసరె సుదిన

తే. మందు దుర్దిన మయ్యె నిట్లద్భుతముగఁ, దోఁచునౌత్పాతికంబులఁ జూచి సరకు
గొనక శార్దూలదర్పుఁ డకుంఠితాస్త్రుఁ, డయ్యకంపనుఁ డుగ్రుఁడై యనికి వెడలె.

శా. ఈరీతి న్రణకాంక్షి యై పటురయం బేపారఁగా నేగునా
శూరాగ్రేసరుసింహనాదముదధిక్షోభంబు గావించుచు
న్ఘోరం బై పటుసాంద్ర మై యలకులక్షోణీధ్రము ల్వాల బ్ర
త్యాశావంబు లోసంగ న్మ్రోసెఁ దదఖర్వాద్భుతత్వముం జూపుచున్. 972

ఉ. ఆనినదంబు కర్ణపుట మంటినయంతనె త్రస్తచిత్తమై
వానరసైన్య మద్భుతజవంబున లేచి మహోన్నతాశ్మము
ల్కానితపాదపంబులు చలంబునఁ బూని ఘనస్వనోపమ
ధ్వాన మెలర్పఁ బోరికి ముదంబున నాయిత మయ్యె నయ్యెడన్. 973

ఉ. దానవసైన్యవారిదకదంబ మకంపనమారుతేరితం
బై నిఖిలాస్త్రశస్త్రకరకాశనివర్షము గ్రుమ్మరించుచు
న్వానరసైన్యశైలమున వ్రాలె విభూషణదీప్తచంచల
ల్గానుగ జన్యజాతసకలధ్వనిగర్జితము ల్సెలంగఁగన్. 974

వానరరాక్షసుల నాలవనాఁటియుద్ధము.

ఉ. పొందుగ నిట్లు రాక్షసులు పోరికిఁ గ్రమ్మినఁ జూచి వానరు
ల్గ్రిందుగ భూరిపాదపశిలాచయము ల్వరఁగించుచు న్మదిం
జెందినవేడ్క హుంకృతులు సేయుచు బిట్టెదిరించి తాఁకినన్
సందడికయ్య మయ్యెఁ బలుచందములం గపిదైత్యసేనలన్. 975

ఉ అందఱు శక్రసన్నిభబలాన్వితు లందఱు జన్యదక్షు ల
ట్లందఱు ఘోరపర్వతనిభాకృతు లందఱు సింహవీర్యు ల
ట్లందఱు బాహుశౌర్యమహిమాధికు లందఱుఁ గ్రోధదీప్తులై
పొందుగఁ గీశదానవులు పోరఁ దొడంగిరి సాహసంబునన్. 976

క. ము న్నెన్నఁ డిట్టికయ్యము, గన్నది లే దనుచు దేవగంధర్వాదు
ల్సన్నుతి సేయుచు నుండిరి, పన్నుగ నాకసమునందుఁ బరమప్రీతిన్. 977

వ. ఇత్తెఱంగున రామునకు విజయంబు సంపాదించుతలంపున వానరులును రావణునకు విజయంబు సంపాదించుతలంపున రాక్షసులును బరస్పరజయకాంక్షులై కోపంబు తెంపున నొండొరుల ధిక్కరించుచు మహానాదంబులు భీమంబులై నింగి ముట్ట నట్టహాసంబుగాఁ దలపడి ఘోరంబుగాఁ బోరు నెడఁ దదీయచరణక్షుణ్ణసముద్భూతమహీపరాగంబు ధాతకౌశేయపాండరంబై మెండుగా దశదిశలు నిండి చండకిరణకిరణప్రకాండప్రసరణంబు లేకుండ నిరోధించిన నమవసనాఁటినడురేయికరణి గాఢాంధకారబంధురం బయ్యె నప్పు డాహరిరాక్షసులు స్వపక్షపరపక్షనిరూపణంబు సేయనేరక మాతంగతురంగశతాంగవివిధాయుధపతాకాధ్వజచర్మవర్మంబులం గనుంగొనలేక శిలాపాదపశక్తితోమరపరశుపట్టిసప్రాసశూలకరవాలభిండివాలగదాముసలముద్గరపరిఘ్వధ కుంత క్షురికాది సాధనంబులఁ దమతమవారి హింసింపం దొడంగి రయ్యాయోధనంబునందు వనాటనిశాటులకోలాహలశబ్దంబులు బహుళంబుగా వీతెంచుచుండెం గాని రూపంబు లెవ్వియుఁ గాన రావయ్యె నంతఁ గొంతవడికిఁ గరితురగహరిరాక్షసశరీరవ్రణసంజాతరక్తధారాసారంబున నమ్మహీరజం బడంగిన నయ్యాలంపునేలయనేకరుధిరప్రవాహసంకుల మై శరీరశవసంకీర్ణ మై వివిధాయుధశిలాపాదప

చూర్ణమిశ్రిత మై విలూనరథరథాంగయుగధ్వజపతాకాలంకృత మై రొంపి
గొని కాలిడరాక ఘోరప్రకారంబునం జూడ నొప్పె నప్పుడు. 978

మ. అరదంబు ల్పఱపించి నిష్ఠురధనుర్జ్యానిస్వనంబు ల్నిరం
తరభంగి న్వడి మ్రోయ దారుణఫణీంద్రక్రూరనారాచము
ల్తరుచారం బరఁగించి దైత్యరథికు ల్తండోపతండంబుగా
హరిసేన న్నుఱుమింపఁ జొచ్చి రతిశౌర్యస్ఫూర్తి శోభిల్లఁగన్. 979

ఉ. ఱెక్కలు గల్గు శైలములరీతిఁ జెలంగుమదావళంబుల
న్మిక్కిలి గిన్క డీకొలిపి మిన్నక యంకుశతోమరంబుల
వ్రక్కసు లుక్కుమీఱి కఠినంబుగ నార్చుచుఁ గీశసేనలన్
లెక్కకు మీఱ నొక్కమొగి లేచి వధింపఁ దొడంగి రయ్యెడన్. 980

ఉ. వాయుజవంబులం బోలుచు వాజులఁ బై దుమికించి యాశ్వికుల్
పాయక వాసవాయుధనిభస్ఫుటశాతధగద్ధగాయమా
నాయతతీక్ష్ణఖడ్గముల హాలికు లుగ్రవనంబులట్లు లీ
లాయుతు లై వలీముఖబలంబులఁ ద్రుంపఁ దొడంగి రుద్ధతిన్. 981

ఉ. గుంపులు గట్టి రాక్షసులు ఘోరభుజాబలగర్వ మేర్పడం
దెంపరు లై వడిం గదిసి దీఱనియల్క ఘనాయుధంబుల
న్సొంపుగ వ్రేయుచుం బొడుచుచు న్వెసఁ దట్టుచుఁ గీశసేనలం
జంపఁ దొడంగి రుద్ధతిఁ బ్రచండగతిం బటుసాహసంబునన్. 982

చ. దనుజచమూవిభుండు ధృతదర్పుఁ డకంపనుఁ డాత్మసేనలం
గనుఁగొని తత్ప్రతాపము మనంబున మెచ్చుచు మేలిమాటలన్
దనుపుచుఁ దేరు వానరకదంబముపైఁ బఱపించి వజ్రవ
జ్రనిభశిలీముఖంబులదురంబునఁ ద్రుంపఁగ సాగె నయ్యెడన్. 983

వ. ఇట్లు ప్రచండభంగి విజృంభించిన నయ్యకంపనభుజాపరిపాలితు లైన రాక్షసుల
కోల్తల కోర్వక వానరబలంబులం గలమేటిమగ లెల్లం దొలంగి పాఱిన
నత్తెఱం గాలోకించి కుముదుండును నలుండును మైందుండును ద్రేతాగ్నులుం
బోలెఁ దేజరిల్లుచు బరవసంబుఁ జేసి వానరబలంబులం బురికొల్పి సంక్రుద్ధు లై
తీవ్రం బగు వేగం బంగీకరించి మహావృక్షంబు లంసభాగంబులనలవరించి కాల
దండధరు లైనశమనులకైవడి భయంకరాకారు లై రాక్షసచమూముఖంబున
దారుణప్రకారంబునఁ గదనంబు గావింపం దొడంగిన వారలప్రాపున నిశ్శంకు
లై వనచరు లందఱు నూఱెలం బన్ని పరాక్రమించి శైలశిఖరంబులు వైచి
రథికసారథిరథ్యకేతుసహితంబుగా నరదంబులు పఱియలువాపుచు వారణప్ర
మాణమహోపలంబులు పరఁగించి తోమరాంకుశయంతృసమేతంబుగా మత్త
మాతంగంబుల విదళించుచు మహోన్నతసాలతాలంబుల నారోహకసమన్వితం
బుగా నశ్వంబుల నుగ్గునూచంబు సేయుచు నఖదంతకరపాదముష్టిప్రహారంబుల

సుభటసందోహంబులం బొఱికి చనుచు నిట్లనేకప్రకారంబుల మహోక్షంబుల గుంపులసొంపు పెంపారఁ గుప్పు నుఱిచిన తెఱంగున నద్భుతంబుగా నుఱుమాడిన నద్దనుజసైన్యంబులందుఁ బగిలినశిరంబులును దెగినకంఠంబులును దునిసి పడిన బాహువులును నఱవఱ లైనయురంబులును జింపఱవంపఱ లైనపదములును విలూనంబు లైనతొడలును వ్రక్క లైనపిక్కలును నూఁపు సెడిన సర్వావయవంబులుం గలిగి పెక్కండ్రు రక్కసులు మడిసి నాసంగరాంగణంబు హతకళేబరరాసులును గెడసినగజంబుల తెట్టెలును గ్రొంద పొడువునం గూలి యున్నవీరభటపుంగవులును రాలినభూషణరజంబును బాఱెడుబహురుధిర నదీప్రవాహంబులును రొంపిగొనినమేదోమాంసను స్రిమ్మసంకంబును దిప్పలై పడి యున్నశిలాపాదపంబులును రాశీభూతంబు లైనవివిధాయుధఖణ్డంబులుం గలిగి దారుణదర్శనం బయ్యె నవ్విధం బంతయు విలోకించి యకంపనుండు తీవ్రం బగుకోపం బవలంబించి వీరావేశపరవశుం డై కార్ముకగుణప్రణాదంబు సేయుచు సారథి నవలోకించి యిట్లనియె. 984

సీ. కంటె సారథి భుజాగర్వాభియుక్తు లై చండవిక్రమమున గండు మిగిలి
పెక్కండ్రు వానరు లుక్కునఁ జెలరేగి సమరస్థు లైనరాక్షసుల నెల్లఁ
బలుదెఱంగుల శిలాపాదపహతులచే సమయించుచున్నారు సైన్య మెల్లఁ
జచ్చియు నొచ్చియు విచ్చి భయంబునఁ బాఱుచున్నది నేఁడు వీరి నెల్ల
తే. శాతశరముల వధియించి జమునిపురికిఁ, బుత్తు రయమున నరదంబు పోవనిమ్ము
నీ వనిన నాతఁ డాతనిభావ మెఱిఁగి, చెచ్చెర రథం బచటికిఁ బోనిచ్చుటయును.

హనుమంతుఁ డకంపనునితో యుద్ధము సేయుట.

సీ. వడిగండ్లు గురియుచు వడి మింటఁ జనుమహాజలదంబు కై వడిఁ జలము మెఱయ
బెడిదంపుటంపఱ కడువడిఁ గురియుచు దారుణసింహనాదంబు సెలఁగఁ
బటురభసంబునఁ బఱతెంచి వానరయూథపశ్రేష్ఠుల నుక్కడంచి
వీఁకతో బలము చీకాకు గావించుచు మత్తద్విపముమాడ్కి మాఱు లేక
తే. చాల విహరించునాతనివ్రేల నిలువ, లేక కపు లంద ఱలికి నద్దైసలఁ బఱవ
నయ్యకంపనుఁ డనేకఘోరఘోరాని మున, కనిలసుతుఁ డద్రికై వడి నడ్డపడియె.

మ. బలవంతుం డగుగంధవాహసుతుఁ డిబ్బంగి న్భుజావిక్రమో
జ్జ్వలుఁ డై దానవవీరుఁ డాఁకుటయు సర్వంబు న్విలోకించి త
ద్విలసద్వీర్యము నాశ్రయించి మరలం దెల్వొంది కీశు ల్మహా
బలు లై గ్రమ్మఱఁ బోరఁ జొచ్చి రొగిఁ దత్పార్శ్వంబుల న్బలిష్ఠిన్. 987

ఉ. అప్పుడు పర్వతంబుక్రియ నడ్డము నిల్చినవాయుపుత్రునిం
దప్పక చూచి రాక్షసుఁడు దారుణమేఘము వర్షధారలం
గప్పినమాడ్కి దీవ్రశితకాండపరంపరల న్మహోద్ధతిం
గప్పి నభంబు బెట్టవియఁగాఁ బృథునాద మొనర్చెఁ జెచ్చెరన్. 988

ఉ. దానికి నించుకైన మదిఁ దల్లడ మందక వాయునందనుం
డానిశితాంబకంబుల రయంబునఁ దట్టుచు దిట్టయై మది
న్వాని వధింపఁ బూని దవవహ్నివిధంబున నుగ్రమూర్తియై
మానుగఁ గాలవారిదముమాడ్కి దిశల్పగులంగ నార్చుచున్. 989

ఉ. మేదిని కంప మొంద నరిమీఁదికి నుద్ధతి డాసినప్పు డా
మేదురమైనవాయుసుతుమేను జగంబులు గ్రుంగునప్పు డీ
మ్మేదిని నేర్చుపావకుని మేని తెఱంగునఁ జూడ నొప్పెఁ గ్ర
వ్యాదుల కెల్ల డెందముల నద్భుతము న్భయ మంకురింపఁగన్. 990

వ. ఇట్లు ప్రవర్ధమానశరీరుండును నిజప్రతాపదుర్నిరీక్షుండు నైన యమ్మరున్నందనుం డమందవేగంబున నొక్కమహనీయపర్వతశిఖరం బుత్పాటించి తెచ్చి పురందరుండు కులిశంబుచేత నముచిం బోలె నిద్ధరాధరశృంగంబుచేత వీనిం బరిమార్చెదఁ గాక యని నిశ్చయించి ప్రళయకాలధారాధరంబుకరణి మహానాదంబుఁ జేయుచు నమ్మహాశిఖరంబు దక్షిణకరంబునం బట్టి యెత్తి బాహుబలంబుకొలంది బహువారంబు లంబరంబునం ద్రిప్పి దానవునిమీఁద వైవం గడంగునంతలోన నయ్యకంపనుండు తత్ప్రకారంబు విలోకించి దూరంబున నుండి రయంబున నర్ధచంద్రబాణంబుల నప్పర్వతాగ్రంబు విదళించిన నది రాక్షససాయకవిదారితం బై దంభోళిధారాదారితం బైనకరణి సహస్రప్రకారంబుల వ్రయ్యలై గగనంబున నుండి పుడమిం బడియె నిట్లు పర్వతాగ్రంబు వికీర్ణంబై పడినం జూచి హనుమంతుఁడు రోషదర్పాన్వితుం డై. 991

ఉ. ఏమిర వీనిచేతిబలు వే నలవీరవరేణ్యుఁ డైన శ్రీ
రామునిబంట నై విమతరాక్షసుఁ జంపక పోవనిత్తునే
పామును దార్క్ష్యవల్లభుఁడు పట్టి వధించినమాడ్కి వీని సం
గ్రామమున న్వధించి రఘురామునకు న్విజయం బొసంగెదన్. 992

క. అని నిశ్చయించి మారుతి, కనుఁగొనల నితాంతరక్తకాంతులు నిగుడ
న్వినుతగిరిమాడ్కి నొప్పెడు, ఘనవృక్షం బొకటి గాంచి కడువేగమునన్. 993

శా. శాఖామూలయుతంబుగాఁ బెఱికి చంచత్ప్రీతిఁ గీలాలభృ
ద్రేఖ ల్వ్రచ్చి మెలంగి పాఱ వినువీథి న్సారెకుం ద్రిప్పుచున్
లేఖుల్మెచ్చఁగ నూఱువేగమున క్షోణీజంబులం గూల్చుచున్
నాఖండద్యుతి యై పదాభిహతి జన్యస్థాన మల్లాడఁగన్. 994

మ. కరులం గూల్చుచు ఘోటకవ్రజముల న్ఖండించుచు న్వేఁకతో
నరదంబు ల్పొడి సేయుచు న్వినుతదైత్యశ్రేణులం ద్రుంచుచుం
గర ముద్వృత్తి భుజప్రతాప మడరం గల్పాంతకాలాకృతి న్
హరివీరుండు చరించె జన్యవిజయవ్యాపారధౌరేయుఁ డై. 995

శా. ఈరీతిం బటుదర్ప మేర్పడ వడి న్హింసించుచుం గ్రుద్ధుఁ డై

యాతూఢిం గడుఁ జిత్రభంగి ఘనజన్యక్రీడ గావించు నా
వీరాగ్రేసరు గంధవాహతనయు న్వీక్షించి దైత్యాళి వే
పాఱం జొచ్చె మృగేంద్రుఁ గన్నరురుడింభశ్రేణిచందంబునన్. 996

వ. అప్పుడు. 997

శా. క్రుద్ధుం డై విహరించుచున్నహరిముఖ్యు న్బానిం జూచి తాఁ
గ్రుద్ధుం డై ఖలుఁ డై యకంపనుఁడు నిర్ఘోషించుచు న్బాహుగ
ర్వోద్ధత్యం బలరం జతుర్దశనిశాతామోఘనారాచసం
విద్ధుం జేసి శితాస్త్రవృష్టి గురిసె న్విక్రాంతుఁ డై వెండియున్. 998

హనుమంతుఁ డకంపనునిం జంపుట.

మ. ఇనతేజుండు మహాబలుండును మహోహీనస్ఫురచ్ఛౌర్యుఁ డా
హనుమంతుం డిటు బాణపూరితతనుం డై రక్తసిక్తాంగుఁ డై
ఘనకోపాన్వితుఁ డై ప్రరూఢవిలసద్ధాతుద్రిభంగిం బ్రసూ
ననితాంతస్ఫుటకింశుకంబుపగిది న్దావాగ్నిచందంబునన్. 999

తే. చూడ నొప్పుచు దోర్బలస్ఫూర్తి మెఱయ
వేఱొకవిశాలసాలంబు విఱిచి తెచ్చి
వేగసంపద చెలువార విసరి వైచెఁ
బురుషగతి దానవేంద్రునిశిరముమీఁద. 1000

చ. కులిశహతి న్వెసం బగిలి కూలునగంబుక్రియం బరాక్రమో
జ్జ్వలహనుమత్ప్రయుక్తకుజసంహతిచేఁ దల వేయి వ్రయ్య లై
ఖలరజనీచరోత్తముఁ డకంపనుఁ డాహవశత్రుకంపనుం
డిలఁ బడి ప్రాణము ల్విడిచె నే మని చెప్పుదుఁ దత్ప్రభావమున్. 1001

వ. ఇట్లు వృక్షప్రహారంబున గతాసుం డై పుడమిం బడినయకంపనుం జూచి తక్కినరక్కసు లుక్కుసెడి భయభ్రాంతు లై యాయుధంబులు విడిచి శిరోజంబులు వీడ నంగంబులు వడంక నిట్టూర్పులు వుచ్చుచు స్వేదబిందుసందోహంబులు స్రవింప నొండొరులకుం జెప్పక సారెసారెకుఁ దిరిగి తిరిగి చూచుచు భగ్నమనస్కు లై ప్రాణభయంబునఁ గనుకనిం బఱచి లంకసొచ్చి రప్పుడు మహాబలు లగువానరులు పరమానందభరితాంతఃకరణు లై సత్త్వసంపన్నుఁ డైన హనుమంతుని సాధువాక్యంబులం బ్రశంసించి యమ్మహావీరశిఖామణిచేతం బ్రత్యభినందితు లై తదీయవిజయం బెల్లవారికిం దేటపడునట్లుగా హర్షోత్కర్షంబున సింహనాదంబులు చేసి రిట్లు మహాబలనందనుం డగుహనుమంతుండు నాలవ నాఁటియుద్ధంబున రాక్షసేంద్రుం డగునకంపనుం బరిమార్చి తత్సహచరుల ననేకరాక్షసుల వధించి విజయలక్ష్మీవిరాజమానుం డై కైటభాసురుని గీటణంచినవిష్ణుదేవునికరణిం దేజరిల్లుచుండె నమ్మహావీరునిపరాక్రమంబు విలోకించి మిన్నునం బన్నిన సురసిద్ధసాధ్యులు బహువిధంబులఁ బ్రస్తుతించిరి మహాను

భావ్యుం డగు రాముండును మహాబలుండగు లక్ష్మణుండును సుగ్రీవప్రముఖవానర
శ్రేష్ఠులును విభీషణుండును బ్రీతిసంహృష్టసర్వాంగు లై మారుతిం గొనియాడి
రంత హతశేషు లగు రాక్షసులు లంకకుం జని యకంపనవధప్రకారంబు సర్వం
బును విస్పష్టంబుగా నెఱింగించిన విని రాక్షసేశ్వరుం డగు రావణుండు కించిద్దీన
వదనుం డై యొక్కముహూర్తంబు విచారగ్రస్తమానసుం డై యుండి యొ
క్కింత ధైర్యం బవలంబించి మంత్రుల నందఱ నవలోకించి వారితోడ విచా
రించి నిశ్చయించి తత్పూర్వాహ్ణంబున సర్వగుల్మంబుల నవలోకింపం జని రాక్షస
గణసంగుప్త యై బహుగుల్మసమావృత యై పతాకాధ్వజమాలిని యై యున్న
లంకాపురి సర్వంబు నవలోకించి వానరగణసంరుద్ధయై యుండుట కమర్షితుం
డై తత్కాలసన్నిహితుం డైన ప్రహస్తుం డనురణకోవిదు నిరీక్షించి యిట్లనియె.

ఉ. రాక్షసవర్య వైరులు పురం బరికట్టి కలంచుచున్నవా
రక్షయబాహుశౌర్యమున నద్భుతవైఖరి వారి నెల్ల జ
న్యక్షితి గీటణంచి పొలు పారఁగ నాకు జయం బొసంగఁగా
దక్షుఁడ వీవె గావె మఱి దానవుఁ డన్యుఁ డొకండు గల్గునే. 1003

రావణుఁడు ప్రహస్తుని వానరులమీఁదికిఁ బంపుట.

సీ. ఈయొద్దు భేదింప నెవ్వారుఁ జాలరు దానవబలపతి వైననీవు
నేనును నతికాయుఁ డింద్రజిత్తుండును గుంభకర్ణుండు నికుంభుఁ డంతె
గాని వేల్పులు చూచి కడువడి మనలఁ జుల్కనఁ జూడ కుండఁగఁ గడిమి మెఱసి
వలసినచందాన బలములఁ దోడ్కొని విజయార్థ మిప్పుడె వెడలు మచటి

తే. కీవు వెడలినమాత్రాన భావితాత్ము
లైనదానవవీరుల మానితోగ్ర
రవము విని భీతిఁ బఱతురు ప్లవగు లుర్వి
మృగములు చలించి పఱచుట కేమి యరిది. 1004

క. కపు లవినీతులు మృగములు, చపలాత్ము లయుక్తమతులు చలచిత్తులు నీ
విపులధ్వని వినఁ జాలరు, ద్విపములు సింహస్వనంబు విన లేనిగతిన్. 1005

క. నగచరసైన్యము విద్రుత, మగుచుండఁగ నవశుఁ డై నిరాలంబుం డై
జగతీంద్రుఁ డనుజయుతముగ, నగణితబల భవదధీనుఁ డగు నిక్కముగన్.

వ. మఱియు సంగ్రామంబునందు జయాపజయంబుల కవ్యవస్థితత్వంబు గలుగుటం
జేసి పాక్షికజయసద్భావంబువలన మరణంబు సంశయితం బగుటం జేసి యది
శ్రేయస్కరం బై యుండు యుద్ధంబు లేనియెడ శత్రువులచేత మరణంబు నిస్సం
శయం బగుటం జేసి యది శ్రేయస్కరంబు గాదు మదుక్తార్థవిషయంబునందుఁ
బ్రతికూలానుకూలంబులు యోచించి హితం బెయ్యది దాని నెఱింగింపు మనిన
వాహినీనాయకుం డగు ప్రహస్తుండు భార్గవుం డసురేంద్రునకుంబోలె రాక్ష
సేంద్రున కిట్లనియె. 1007

సీ. దనుజేంద్ర యింతకుమును నీతివిదులైనమంత్రులఁ గూర్చి సముచితముగ
నాలోచన మొనర్చి యరులబలాబలం బటు విమర్శించి భావ్యర్థ మెల్ల
రహి నిశ్చయించి సంగ్రామంబునకుఁ బోవ సమకట్టి యున్నాఁడ సంభ్రమమున
జానకి నిత్తునా పమరం బొనర్తునా యని మున్ను నీవు నన్నడిగినపుడు

తే. మనుజునకు నోడి సతి నిచ్చు టనుచితంబు
పోరు గావింత మని నీకు బోధఁ జేసి
కార్యమున కెత్తి వచ్చినఁ గడిమి మెఱసి
వైరుల వధింతుఁ గా కేల యూరకుండు. 1009

తే. ఏను నీచేత సతతంబు దానమాన, వివిధసాంత్వవాక్యంబుల వేయిగతుల
నర్చితుండ నై తఱి వచ్చినపుడు నీకుఁ, బ్రియము గావింప కేటికి రిత్తవుత్తు.

చ. తనయకళత్రమిత్రధనధాన్యము లెక్కుడు గాదు నాకు నీ
పనుపున నేగి ఘోరరణపండితు రాముని వానితమ్ముని
న్వనచరసైన్యయుక్తముగ వ్రచ్చి వధించెద నీకుఁ బ్రీతిగా
దనుజవరేణ్య ప్రాణములు దాఁపుదునే యిఁక వేయి యేటికిన్. 1010

వ. అని పలికి సంరంభవిజృంభితుం డై సమస్తరాక్షసప్రశస్తుండును ఖ్యాతప్రహస్తుం
డునగు ప్రహస్తుండు సముచితంబుగా రావణునిచేత ననుజ్ఞాతుండై తనముంగల
నున్నదండనాయకుల నవలోకించి యిప్పుడు మదీయదివ్యబాణాశనివేగంబున
రణంబులోన నరవానరుల వధించి తదీయరక్తమాంసాహారంబుల మాంసాదం
బు లగుమృగపక్షిగణంబుల కాఁకలి దీర్చెద మీరు శీఘ్రంబున బలంబుల
సంగ్రామంబునకు సన్నద్ధంబులఁ గావింపుఁ డని పలికిన వారు తద్వచనప్రకారం
బునఁ గృతత్వరులై తన్మందిరాంగణంబునందుఁ జతురంగబలంబుల నసంఖ్యా
తంబుగాఁ గూర్చిన నమ్మహాచమూకదంబంబు తిగ్మనానావిధాయుధంబై యనం
తహేతిచ్ఛటాపరిస్ఫీతం బైనదవాగ్నిచందంబునం గ్రాలుచుండె లంకాపురంబు
శతాంగమాతంగతురంగభటపుంగవసంకులంబై మత్తమాతంగసంకులం బైన
జలాశయంబుకరణి శోభిల్లె నప్పుడు రాక్షసు లందఱు హవిరాజ్యహోమంబుల
చేత హుతాశనునిఁ దృప్తి నొందించి బ్రాహ్మణులకు నమస్కరించి పుష్పగం
ధాంబరభూషణంబులం గైసేసి సంగ్రామసజ్జంబు లైనబాణబాణాసనతూణీరత
నుత్రాణశిరస్త్రాణగోధాంగుళిత్రాణంబులు ధరించి ప్రీతిసంహృష్టసర్వాంగులై ద
శగ్రీవుని శాసనంబునఁ బ్రహస్తునిం బరివేష్టించి రప్పు డాహవిరాజ్యగంధప్రతివ
హుండై పరిమళించుచు గంధవహుండు విసరెనంతవాహినీవల్లభుండగు ప్రహస్తుం
డుచతుర్విధాలంకారభూషితుండై వైశ్వానరసమప్రభం బైనకవచంబుదొడిగి
తూణీరంబు బిగించి శక్రధనుస్సంకాశం బైనకార్ముకంబు ధరించి సకలసాం
గ్రామికపరికరసమేతుం డై సమరభేరి మ్రోయించి మహాజవహయసంయుక్తంబును
సమ్యక్సూతసుసంయుతంబును మహాజలదనిర్ఘోషంబును సాక్షాచ్చంద్రార్క

భానుస్వరంబును మహోగ్రధ్వజోపేతంబును సర్వాయుధపరిష్కృతంబును శోభనరథగుప్తికర్మంబును సువర్ణజాలసంయుక్తంబును మహనీయప్రభాభాసురంబును సుసమాహితంబు నగుదివ్యరథం బారోహించి బలంబు నభేద్యంబుగా మోహరించుకొని శింజినీటంకారంబు సేయుచు రావణార్పితశాసనుండై పర్జన్యనినదోపమశంఖదుందుభికాహళమృదంగపణవనిర్ఘోషభీషణంబుగాఁ బూర్వద్వారంబున వెడలె భీమరూపులును మహాకాయులు నగుప్రహస్తుని సచివులు నరాంతకుండును గుంభహనుండును మహానాదుండును సమున్నతుండు ననుసంజ్ఞలుగల రాక్షసులు భీమనాదంబులు సేయుచు నతనియగ్రభాగంబునం జనిరి గజయూథనికాశం బై సాగరంబుకరణి ఘూర్ణిల్లుచు ననంతం బై నరాక్షససైన్యం బతనిఁ బరివేష్టించి చనియె నిత్తెఱంగున బలసంయుతుండై యక్కాలం బగుతేజంబు దిక్కులం బిక్కటిల్లఁ గాలాంతయమోపముం డై ప్రహస్తుండు రణంబునకుం జనునప్పుడు తదీయనిర్యాణఘోషంబున లంకలోఁ గలసర్వభూతంబులు వికృతస్వరంబుల మ్రోయుచుండె మఱియును. 1011

-- ప్రహస్తున కశుభనిమిత్తంబు లగపడుట. --

క. ఘనహీన మైనగగనంబునకు న్వెస దాఁటి మాంసభోజనఖగముల్
దనుజునిరథంబునకు మొల్లన వడి యపసవ్యమండలంబులు సలిపెన్. 1012

క. జ్వలనజ్వాలలు గ్రక్కుచు, నులూకములు వానిమ్రోల నురుగతి వెడలెం
దల మునుఁగ రాలెనుల్కలు, కలుషము లై యపుడు వేఁడిగాడ్పులు విసరెన్.

తే. గ్రహము లన్యోన్యముఖము లై కనలు గదుర
నప్రకాశంబు లై యుండె నతనిరథము
మీఁద ఖరనిస్వనంబులు మీఱఁ బన్ని
జలదములు సాంద్రరక్తవర్షంబు గురిసె. 1014

తే. కేతనాగ్రంబుపై వ్రాలె గృధ్ర మొకటి
నిశిత మగుచంచుపుటమున నెగడి యుభయ
పార్శ్వములు వ్రచ్చి తత్రత్యపటుసమగ్ర
శోభను హరించె నపజయసూచకముగ. 1015

తే. చటులహయగతిశిక్షావిచక్షణుండు, నాతతరణాభికాంక్షియు సూతవంశ
జాతుఁ డగునట్టి సారథిచేత నుండి, జగతిమీఁదఁ బ్రతోదంబు జాఱిపడియె.

క. అనుపమగతి శోభిల్లెడు, దనుజునినిర్యాణలక్ష్మి తత్కాలమున
న్వినశించె మఱియు ముందఱ,కనుపఱ యాకస్మికముగ హయములు మొగ్గెన్.

తే. ఇట్టిదారుణోత్పాతంబు లెన్ని యేని
దోఁచిన గణింప కవ్వలఁ ద్రోచి పుచ్చి
రాక్షసచమూవిభుండు దుర్వారభంగిఁ
గడు రయంబునఁ గపిసేనఁ గదియ నడిచె. 1018

ఉ. అంత వనాటసేన భయదాకృతి వచ్చునిశాటసేన న
ల్లంతనె చూచి శీఘ్రమున నద్భుతశైలశిలాగపాణు లై
పంతము మీఱ నాకసము బ్రద్దలువాఱఁగ వీఁక నార్చుచు
న్నంతన మంకురింపఁ గదనంబున కాయిత మయ్యె నయ్యెడన్. 1019

మ. ప్లవగానీకవిధంబుఁ జూచి పటుతీవ్రస్ఫూర్తి శోభిల్లఁ గై
దువు లంకించి మహోగ్రకోప మడరం దోర్దోలయాభ్రంబుభం
గి విజృంభించి ఘోరవార్భటులు నింగిం బర్వ దుర్దాంత మై
దివిజారిధ్వజినీకదంబ మపు డుద్దీపించె జన్యార్థి యై. 1020

క. మిక్కిలి తేజము శౌర్యం, బెక్కుడు భుజవిక్రమం బహీనస్థైర్యం
బెక్కువ తక్కువ లే కిటు, నక్కజముగఁ జూడ నొప్పె నయ్యురువాగున్. 1021

క. అనుమానింపక యాజికిఁ, జనుదెంచు మదం బడంచి శమనునిపురికిం
బనిచెద మని యిరుదెస వా, రనుపలుకు నభంబు నిండె నపుడు తుముల మై.

క. ఏ మేమె మున్న దాఁకెద, మీమెయి మనలంగ నేల యిఁక నని దర్పం
బామూకొన జగతి వణఁకఁగ, సీమ గదియ నడిచె నుభయసేనలు ప్రీతిన్.

తే. పటురణోత్సాహమున వైరిబలముమీఁది
కుఱికెదుతలంపె గాని యం దొకని కైన
నాపద ఘటిల్లు ననెడుభయంబు గలుగ
దేమి చెప్పుదు వారల దీమసంబు. 1024

ఉ. అప్పుడు దైత్యసైన్యవిభుఁ డాహవజేత ప్రహస్తుఁ డుగ్రుఁ డై
తప్పక తీవ్రవేగమును దారుణభంగి రణద్గుణారవం
బుప్పరవీది నిండఁ గపియూథము డాయఁగ వచ్చె నుద్ధతిన్
దెప్పర మైన పెన్మిడుత దీప్తహుతాశనుఁ జేరుకై వడిన్. 1025

శా. ఈరీతిం జనుదెంచురాక్షసబలౌఘేశు న్మహాసత్త్వునిన్
శూరుం బౌరుషపర్యవస్థితుఁ బ్రహస్తుం జూచి రాముండు ర
క్షోరాజానుజు నవ్విభీషణు జనస్తోత్రార్హు నీక్షించి సాం
పార న్సుందరమందహాసయుతవక్త్రాంభోజుఁ డై యిట్లనున్. 1026

మ. అనఘా ఘోరచమూకదంబయుతుఁ డై యత్యద్భుతాకారుఁ డై
ఘనశౌర్యంబునఁ బోరొనర్పఁ బెనుకిన్కన్ వచ్చువాఁ డీమహా
దనుజుం డెవ్వఁడు దెల్పు మన్న విని యాదైత్యాన్వయశ్రేష్ఠుఁ డి
ట్లనియెం గ్రమ్మఱ రామభూవిభునితో నానందసంపాది యై 1027

చ. అనఘచరిత్ర వీఁడు సకలాస్త్రవిదుండు పరాక్రమాధికుం
డనుపమబాహుసత్త్వుఁడు ప్రహస్తుఁడు దైత్యచమూవిభుండు శూ
రనుతుఁడు శౌర్యశాలి సమరం బొనరింపఁగ బూని రావణుం
డనుపఁ ద్రిభాగసైన్యయుతుఁ డై చనుదెంచుచు నున్నవాఁ డొగిన్. 1028

ఆ. ఇతనిపేరు విన్న నింద్రాదిదిక్పతు, లధికభీతిఁ బఱతు రాహవమున
నితనిమాట నమ్మి యింతకుఁ దెచ్చె నీ, దనుజవిభుఁడు సంధి దప్పఁజేసి. 1029

ఆ. ఈఖలుండె నమ్మి యింతకు మూలంబు, వీఁడు దెగినఁ జిత్తవీడ దెగును
నీతిశాలి వైన నీదు తేజంబున, నీతఁ డాజి మడియ కేల దక్కు. 1030

వ. అని పలుకునంతలోనఁ బ్రహస్తుండు వానరసైన్యంబు కదియ వచ్చె నిట్లు రాక్షసబలపరివృతుం డై మహామేఘంబుకరణి గర్జించుచు మహాశైలంబుచాడ్పున శరీరంబు గ్రాల భీమపరాక్రమంబునం జనుదెంచుచున్న ప్రహస్తు నవలోకించి బలీయం బైనవానరసైన్యంబు సంజాతరోషం బై రయంబునం బఱతెంచి మహాపర్వతంబు నాక్రమించినకాలమేఘంబుకరణి నద్దనుజచమూనాథునిం జుట్టుముట్టి యట్టహాసంబుచేసిన నత్తెఱంగు విలోకించి రాక్షసులు జయకాంక్షు లై వివిధచిత్రఖడ్గశక్త్యృష్టిబాణశూలముసలముద్గరపరిఘపట్టిసప్రాసపరశ్వథచక్రచాపప్రముఖనిఖిలహేతివ్రాతంబుల రోచులు వీచీసమీచీనంబు లై దశదిశలు నిండ భూనభోంతరాళపరిపూర్ణంబుగా మహానాదంబులు సేయుచు సరభసంబుగా వానరులం దాఁకిన నయ్యుభయసైన్యంబులకు భువనభయంకరం బగు సంగ్రామం బయ్యె నప్పుడు. 1031

వానరరాక్షసుల మొదటినాఁటియుద్ధము.

మ. అలుక నవ్వజ్రధరుండు పంప లయకాలాభ్రంబు వ్యోమంబున
న్దళమై పన్ని మహోగ్రదారుణదృషద్వర్షంబు సాంద్రంబుగాఁ
జల మొప్పం బరఁగించెనో యనఁగఁ గీశశ్రేణి దైత్యాలిపైఁ
గలయ న్ఘోరశిలాగవృష్టి గురిసెం గాఢప్రకారంబునన్. 1032

క. ఎడ తెగక కురియునట్టపు, జడివానయుఁ బోలె రాత్రిచరముక్తం బై
బెడిదంబుగఁ గపితతిపై, వడి గొని నిఖిలాస్త్రశస్త్రవర్షము గురిసెన్. 1033

మ. పఱపై సాలశిలాస్త్రశస్త్రతతి యభ్రవ్యాప్త మౌచుం బర
స్పరసంఘర్షణజాతపావకశిఖాశంప ల్నదద్భూతభీ
కరనానారవగర్జితంబులు చెలంగ న్వారిదత్వంబు గాం
చి రవిం గానఁగ నీక దుర్దిన మొనర్చె న్సంగరక్షోణికిన్. 1034

వ. అప్పుడు మహోపలంబులు కరంబుల నిడుకొని యరివీరులపయిం బడ వేయ రభసంబునం బఱతెంచుచు నంతలోన ప్రతివీరులు నిశితకరవాలంబు లంకించి శిలలతోఁ గూడఁ గరంబులు దునిసిపడ భుజంబులు నఱికిన నప్పాషాణంబుల మీఁదం బడి విభిన్నమస్తకు లై ప్రాణంబులు విడుచువానరులును గార్ముకగుణప్రణాదపూర్వంబుగా శరవృష్టిఁ బరఁగించుచు నట్టహాసంబుగా రథంబులు దోలించుకొని కపికాండ్రమీఁదికి మహావేగంబున నడరునంతలోన మహాశైలశిఖరంబులు శిరంబులమీఁదం బడినఁ జూర్ణితాస్థిసందోహు లై సూతకేతురథ్యచక్రయుగకూబరాక్షసహితంబుగా నూఁపుసెడి కూలురాక్షసరథికులును

మహోత్తాలతాలంబు లంసభాగంబుల నలవరించుకొని పాదవిన్యాసంబులఁ
బుడమి గ్రక్కఁగలఁ దలపడి యడరునంతలోనఁ గాలాయసమయంబు లగు
ముసలంబు లుత్తమాంగంబులపయిం బడిన నిష్పిష్టశరీరు లై శిరంబులుపగిలి
గిరిశిఖరంబులవలనం దొరఁగు సెలయేళ్లకరణి సాంద్రంబుగా రక్తధారలు
స్రవింపఁ బుడమింబడి కెడయుమర్కటులును మదపుటేనుంగులడీకొలిపి తోమ
రాంకుశప్రహారంబుల నెదిరివారిం బ్రహరింప నుంకించునంతలోన విశాలసాల
తాలప్రహతుల విభిన్నవత్సు లై రుధిరంబులు గ్రక్కుచు వివృతవదను లై పుడ
మిం ద్రెళ్లి జీవితంబులు విడుచుగజారోహకు లగుదానవులును మహేంద్ర
ధ్వజసంకాశంబు లైనదీర్ఘాంచితలాంగూలంబు లెత్తికొని భీషణరభసాతిరేకం
బున వడి నడుచునంతలోన నర్ధచంద్రనాయకంబులఁ గంఠనాళంబులు దెగిన
నదియె వేగంబున నొక్కింతదూరం బరిగి గతాసు లై నేలం గూలువాలి
ముఖులును హయంబుల దుమికించుచు నిశాతంబు లగుకౌక్షేయకంబు లెత్తి
కొని యొరులం దెగవ్రేయ గమకించునంతలోన దృఢం బగువాలపాశంబుల
నురివెట్టి పుడమికిం బడ నీడ్చిన నూపిరి వెడలక తన్నుకొని చచ్చునాశ్వికు
లగుయాతుధానులును నిశాతనఖంబుల వ్రచ్చి వధింప వీరావేశంబునం జను
దెంచునంతలోన నిశాతాగ్రంబు లగుకుంతంబులం బొడిచిన గతజీవు లై
కుఠారధారానికృత్తంబు లగుతరువులపోలికి రోఁజుచుఁ బుడమిం ద్రెళ్లుకపులును
దీప్తాగ్రంబు లగుశూలంబు లెత్తుకొని మహాశనివేగంబున డాయునంతలోన
వజ్రాశనిసమస్పర్శంబు లగుపిడికిటిపోటులం గ్రుమ్మిన భగ్నసర్వావయవులై కూ
లునిశాచరులును నొగలు పట్టుకొని రథికసారథిరథ్యసహితంబుగా భుజాబలంబు
కొలంది విసరి వైచిన విభిన్నసర్వాంగంబు లై పడురథంబులును మహేంద్రధ్వజ
సన్నిభంబు లగుతుండంబులు పట్టుకొని జిఱజిఱం ద్రిప్పి నేలకు వ్రేసినఁ జదు
రుపలై ధరం దొరఁగుమత్తేభంబులును నఖదంతప్రహతుల శరీరంబులు వ్రచ్చి
ననేకముఖంబుల శోణితంబు లొలుకఁ జిందఱవందఱ లై మడయుతురంగం
బులునుం గలిగి యయ్యాయోధనం బత్యద్భుతదర్శనం బయ్యెఁ బ్రహస్తునిసచి
వులు నరాంతకుండును గుంభహనుండును మహానాదుండును సమున్నతుండును
దలమిగిలివానరబలంబులకుంగవిసి యనేకశస్త్రాస్త్రపరంపరలుపరఁగించి పెక్కండ్ర
నక్కజంబుగా నుక్కణంగించుచుఁ బెక్కుతెఱంగుల రణక్రీడ గావించిన నది
విలోకించి యలుక వొడమినచిత్తంబున వియత్తలం బుత్తలపడ సింహనాదం
బులు సేయుచు మహారంహంబున వానరసింహు లగుద్వివిదుండును దారుం
డును జాంబవంతుండును దుర్ముఖుండును గ్రమంబున వారలం దలపడి విచిత్ర
ప్రకారంబున శిలాపాదపంబులఁ గొండొకసేపు ఘోరంబుగాఁ బోరు
గావించి రంత. 1085

—ద్వివిదదుర్ముఖజాంబవత్తారులు నరాంతకసమున్నతమహానాదకుంభహనులం జంపుట.—

క. పరువడి సంక్రుద్ధుండై, గిరితుల్యుఁడు ద్వివిదుఁ డేకగిరిశృంగహతి
న్ధురమున నరాంతకాసురు, నఱిముఱివధియించి పంపె యమునిం గొలువన్.
క. వీరోత్తముండు దుర్ముఖుఁ, డారయ నొకవిపులవృక్ష మడరించి మహా
ఘోరాకారు సమున్నతు, దారుణగతిఁ జంపె సురలు తద్దయు మెచ్చన్. 1037
తే. జాంబవంతుండు క్రుద్ధుఁడై చటులతేజ, మెసఁగ నొకఘోరపాషాణ మెత్తివైవ
నురముపగిలి గతాసుఁడై యుర్విఁ గూలె, నసురవరుఁడు మహానాదుఁ డద్భుతముగ.
క. తారుఁడు లయకాలయమాకారుండై దారుణాశ్వకర్ణనగహతి
న్ధారుణిఁ గూలఁగ వైచెను, ఘోరేషునిఁ గుంభహనుని గురుతరశక్తిన్. 1039
తే. తనసచివు లిట్లు వానరోత్తములచేత
నిహతు లగుట విలోకించి నెఱయఁ గినిసి
రథము పఱపించి కార్ముకరవము లెసఁగ
నగచరబలంబుమీఁదఁ బ్రహస్తుఁ డడరి. 1040
సీ. సారంబు గల దొడ్డనారాచ మడరించి యురుకాయు ద్వివిదుని యుబ్బడంచి
యశనిసంకాశంబు లైనమూఁడమ్ములఁ బరఁగ దుర్ముఖు చేతిబలువు మాన్చి
కాలకటాక్షనికాశంబు లగునూఱు వరశరంబుల జాంబవంతు నొంచి
మహనీయవైశాఖమిహిరకరోపమదశసాయకంబులఁ దారు నేసి
తే. తరుచుగా జిత్తజల్లులు గురిసినట్లు, వహ్నికీలోపమానదుర్వారకాల
దండసంకాశకాండప్రకాండములను, మించి వానరసైన్యంబు మీఁదఁ బఱపె.
క. క్షుభితాత్ముఁడై ప్రహస్తుం, డిభసన్నిభకీశబలము లేపు సెడి కరం
బభిముఖసంవృత్తములై, రభసంబున ధరణిఁ గూల రణమొనరించెన్. 1042
క. పరమాద్భుతకరదారుణ, శరబంధనరజ్జుజాలసంవృతులై భూ
ధరచరు లనేకు లతిభీ,కరవైఖరిఁ జాఁపకట్టుగాఁ బడి రుర్విన్. 1043
క. పడుతలలు తెగుకరంబులు, కడువడి భిన్నంబు లైన కటకంఠంబుల్
బొడి యైనయవయవంబులు, చెడుతనువులు గలిగి కపులు క్షితిఁ గూలి రొగిన్.
తే. ఉభయసైన్యరవంబు సంక్షుభితకంధి, రవముమాడ్కి నిస్తతోభ్రమణకమున
మొనసి యావర్తమైనచాడ్పునఁ జెలంగి, దశదిశలునిండె నిఖిలభూతంబు లవియ.
తే. ఏమి చెప్పుదు నపుడు సంగ్రామభూమి, ఘోరవానరరాక్షసభూరికాయ
కలితమై ఘనపర్వతకలిత యైన, కరణి నత్యద్భుతంబుగాఁ గాన నయ్యె. 1046
తే. మఱియు నయ్యాహవధరిత్రిఁ దఱుచు పఱచు
శోణితౌఘసంఛన్నమై చూడ నొప్పెఁ
బొసఁగఁ జైత్రమాసంబునఁ బుష్పితాగ
మానితపలాశసంఛన్నమైనకరణి. 1047

వ. అప్పుడు మహావీరసమూహవప్రయు భగ్ననానావిధసాధనమహాద్రుమయు శోణి
తౌఘమహాతోయయు యమసాగరగామినియు హృదయదక్షిణవామభాగస్థ
మాంసవిశేషపంకయు వికీర్ణాంత్రశైవలయు విచ్ఛిన్నకాయశిరోమీనయు సర్వా
వయవశాద్వలయు గృధ్రహంససమాకీర్ణయుఁ గంకసారససేవితయు మేధః ఫేన
సమాకీర్ణయు దీనస్తనితనిస్వనయు నగుమహారుధిరనిమ్నగ ఘర్మాపాయంబు
నందు హంససారససేవితయైనమహానదియుంబోలె నగాధంబుగాఁ బ్రవహించె
దుస్తరయైనయమ్మహానదియందు మత్తగజంబులు పద్మరజోధ్వస్తయైననలిని
యందుం బోలె హరిరాక్షసముఖ్యులు సంభ్రమంబున నీఁదులాడుచు వైరం
బున నొండొరులం బట్టుకొని క్రిందు మీఁదికిం బెనంగుచుండిరి కొందఱు
మేదోమాంసమస్తిష్కపంకంబున నిమగ్నులై పంకనిమగ్నాంగులైనకుంజరం
బులమాడ్కి నిశ్చేష్టులై యుండిరి కొందఱు రుధిరప్రవాహంబువెంటం బోవు
చుండిరి కొందఱు నదీప్రవాహంబున కెదు రెక్కుసారచేఁపలచందంబున మహా
వేగంబున కెదురెక్కుచుండి రప్పుడు ప్రహస్తుండు మహార్ణవంబునందు యానపా
త్రయుంబోలె నమ్మహాశోణితనదియందు జ్వలత్పావకసంకాశం బైనరథంబు
దోలించి యరులమీఁద బాణవర్షంబు గురియుచు ననివార్యగమనుండై యతి
రభసంబున విహరించుచున్నఁ దత్ప్రకారంబుఁ జూచి సహింపక వానరవాహినీ
వల్లభుం డగునీలుండు రోషభీషణుండై కాలాంతకునిమాడ్కి వెలుంగుచు మహా
వాతంబుకరణిఁ బ్రహస్తుని కడ్డంబై వానియాటోపంబు నిలువరించిన నమ్మర్కట
సేనానాయకుని భుజావిజృంభణంబుఁ జూచి సహింపక దానవసేనానాయకుఁ డమ్మ
హావీరున కభిముఖుం డై కదియ నడిచి. 1048

నీలుఁడు ప్రహస్తునితో యుద్ధము సేయుట

శా. చాపంబు న్నవరించి నారి మొరయం జండాస్త్రము ల్జన్యవి
ద్యాపాండిత్యము మీఱ సేసినఁ గరం బయ్యస్త్రము ల్సంగర
వ్యాపారక్షముఁ డైననీలునిమహావక్షంబు భేదించి ర
క్తోపేతంబుగ నేల నాటె రుషితాద్యుగ్రోరగప్రక్రియన్. 1049

శా. ఈలీలం బటుభంగి రాత్రిచరసైన్యేశప్రముక్తానల
జ్వాలాభీలనిశాతసాయకముల న్సంతాడితుండై వడి
న్నీలుం డంతకుమాడ్కి నల్గి విజయోన్మేషంబు చింతించుచుం
స్థూలక్ష్మాజహతిం బ్రహస్తు ననిలోఁ దూలించెఁ జిత్రంబుగన్. 1050

ఉ. క్రేటునఁ బుట్టుకోపమున వెండియు బాహుబలం బెలర్ప దో
పాటబలాధినాథుఁడు ప్రహస్తుఁడు నీలునిమీఁద దుష్టుఁ డై
వాటముగా లయాంబుదము వాన సృజించినమాడ్కి వీఁకతో
నూటిగ బాణవృష్టి కడుఁజోద్యముగాఁ గురియించె నుద్ధతిన్. 1051

వ. ఇట్లసంఖ్యేయంబులై యనివార్యంబులై యప్రమేయంబులై తండోపతండం

బులై పఱతెంచు ప్రహస్తహస్తముక్తప్రశస్తకాండప్రకాండంబులు వారింపన
లవిగాక నీలుండు నిమీలితాక్షుండై జడివానకుం దలంకనిసుందరవృషభంబు
చందంబునం గొండొకసేపూరకుండి వెండియుం గోపంబగ్గలంబగుటయు రోషభీష
ణుండై యొక్క విశాలసాలంబు లీలం గేల నందుకొని మండలప్రకారంబున జఱ
జఱం దిప్పుచు పుంఖానుపుంఖంబులై పఱతెంచు సాయకజాలంబు జడియ
నడుచుచు గరుడానిలతుల్యవేగంబునం బఱచి లాఘవంబున వానిరథంబుమీఁ
దికలంఘించి మనోజవంబు లగుఘోటకంబులం జదియ మోఁది సూతుం దెగ
టార్చి మెఱుము మెఱసినట్లు మెఱయుచుం జిత్రగతులం దిరుగుచు లక్ష్యగోచ
రుండు గాక తదీయకేతుదండంబు విఱుగం దన్ని కాంచనవలయభూషితంబైన
దృఢకార్ముకం బొడిసి పట్టి వేదండం బిక్షుదండంబు విఱిచిన తెఱంగున నవలీల
భంజించి కిరీటకేయూరంబులు ధరణిం గూల్చి సింహనాదంబుం జేసిన నా ప్ర
హస్తుండు విరథుండును హతాశ్వుండును హతసారథియునై కాలాయసమయం
బగుముసలంబు గొని నీలునిం దలపడిన బలవంతులును జాతవైరులును వాహి
నీముఖ్యులును సింహశార్దూలసదృశులు సింహశార్దూలవిక్రములును సమానస
త్త్వులును విక్రాంతవిజయులును సమరానివర్తులును మహావీరులును బరస్పరజయ
కాంక్షులు నగు నా ప్రహస్తనీలురకు వృత్రవాసవులకుంబోలె ఘోరంబగుద్వం
ద్వయుద్ధంబు సెల్లె నప్పుడు తీక్ష్ణాగ్రంబు లగునఖదంతంబుల శరీరంబులు
వ్రచ్చుచు నితరేతరప్రహారంబుల శోణితదిగ్ధగాత్రులై పుష్పితాశోకంబులచందం
బున నలరుచు సమానవిక్రమంబునం బోరు నెడ. 1052

చ. అసురబలాధినాథుఁడు ప్రహస్తుఁడు నీలుని ఫాలమందు వే
ముసలము ద్రిప్పి వైచిన సముద్ధతి శోణితదిగ్ధగాత్రుఁడై
యసమున నబ్బలీముఖబలాధిపుఁ డొక్క మహామహీజము
న్విస విస వీచి వైచె రజనీచరభర్తయురంబునం బడన్. 1053

ఉ. దానికి నించుకైన మదిఁ దల్లడ మందక యోర్చి యుగ్రుఁడై
మానసవీథిలో దురభిమానము మీఱఁగ బావసంహతి
స్వానుగ నుర్వి గ్రుంగ నసమానలసన్ముసలంబుఁ బూని యా
దానవుఁ డంతకాకృతి మదం బలర న్గనుదెంచునంతలోన్. 1054

నీలుఁడు ప్రహస్తునిం జంపుట.

ఉ. వాని తెఱంగుఁ జూచి యల వానరసైన్యవిభుండు హవ్యభు
క్సూనుఁడు క్రుద్ధుఁడై చటుల ఘోరమహోపల మొక్క టుద్ధతిఁ
జానుగఁ గేల బూని రభసం బలరం జనుదెంచి బల్విడి
న్దానవు నెత్తిమీఁదఁ బడఁ దప్పక వైచె బలం బెలర్పఁగన్. 1[illegible]

చ. హరిబలనాథముక్తకఠినాశనితుల్యశిలాభిసంహతిఁ
గురుకులిశాహతిం బగులు ఘోరనగాగ్రముభంగి యామినీ

చరునిశిరం బొగిం బగులఁ జయ్యన వాఁడు గతాసుసత్త్వుఁడై
పరువడి ఛిన్నమూల మగుపాదపమో యనఁ గూలె నుర్విపైన్. 10

తే. ఉపలభిన్నోత్తమాంగుఁడై యుర్విఁగూలి, యున్నదనుజునంగం[illegible]నుండి
మొక్కమొగిఁ బాఱినగమువనుండి నిష్ఠు,రంబుగాఁ బాఱు [illegible]

వ. ఇట్లు నిహతుండై కూలినప్రహస్తు నవలోకించి రక్కసులు శో[illegible]
బునఁ బెనంగొన వీరావేశంబున నవ్వానరవాహినీనాయకుం [illegible]దయ
జాటోపపీడితులై యతనిమ్రోల నిలువం జాలక సేతుబంధం[illegible] వాఁకి [illegible]
బై నసలిలంబుచందంబున నంకఱుఁ బొడవడంగిన హతశేష[illegible]లు
నిరుద్యములై లంకకుం బఱచి తీవ్రం బగుశోకార్ణవంబున [illegible]
లై నకరణి ధ్యానమూకత్వంబు నొంది యుండి రి త్తెఱంగున మహాబలుం డగు
నీలుం డై దవనాటియుద్ధంబునఁ బ్రహస్తునిం బరిమార్చి స్వకృతాద్భుతకర్మం
బునం బ్రశస్యమానుం డగుచు విజయలక్ష్మీవిరాజమానుం డై బాణక్షతసం
జాతం బైనరక్తొత్తనెత్తుటం దోఁగి సంధ్యాభ్రంబుచందంబున వెలుంగుచు
నలక్ష్మణుం డై నరామునికడకుం జని నమస్కరించి యస్సుహోత్మునిచేత నభి
నందితుండై సంతసంబునం బొదలు చుండె నంత హతశేషు లగురాక్షసు
లదియే పోకగాఁ బోయి రాక్షసవల్లభుం డగురావణునందర్శించి శోకగద్గదకం
ఠులై రాక్షససైన్యనాథుం డగుప్రహస్తుండు వానరసైన్యనాథుం డగునీలుని
చేతసంగ్రామరంగంబున నిహతుం డయ్యె నని యెఱింగించిన విని రావణుండు
సైన్యపాలమరణశ్రవణసంజాతశోకంబును వానరసైన్యపాలవిజయశ్రవణసంజా
తక్రోధంబును జంటయై పెనంగొని చిత్తంబుకలంచినఁ గలుషీకృతాంతరంగుఁ
డై నింద్రుం డమరయోధముఖ్యులం బోలె యాతుధానయోధముఖ్యుల నవ
లోకించి యిట్లనియె. 1058

చ. హరిబలసూదనుం డగుబలాఢ్యుఁడు మద్బలనాయకుండు నం
గరమున సైన్యసంయుతముగా రహి నవ్వరిచేతఁ జచ్చె న
య్యరులు మహోన్నతు ల్భుజబలాధికు లుగ్రులు వారినీఁదికి
న్వరుస నలంతులం బనిచినం బని గాదవమాన మయ్యెడిన్. 1059

రావణుఁడు సైన్యసమేతుఁడై యుద్ధమునకు వెడలుట.

చ. అని కిఁక నేన వేచని దవాగ్నియుఁ బోలె శితాంబకార్చుల
న్వనచరసైనికాటవి నవార్యగతి న్వడి నేర్చి జన్యమే
దిని కటు కీశరక్తములఁ దృప్తి యొనర్చి నరేంద్రుల న్రయం
బున జముపీటి కంపి జయముం గొని వచ్చెద నీక్షణంబునన్. 1060

వ. అని పలికి రాక్షసరాజముఖ్యుండును లోకవిద్రావణుండును నిర్జితై రావణుండు
నగురావణుండు పరమక్రోధుం డై దిగ్గనఁ బరమాసనంబు డిగ్గి యుగాంతవాత
ప్రేరితవైశ్వానరుభంగి భగ్గుభగ్గనమండురోషవిశేషంబున నిరువదికన్నులు

ప్రదీప్తవహ్నికుండంబులభంగివెలుంగ ననర్ఘమణిగణప్రభాపటలజటిలకిరీటకే యూరహారాదివివిధభూషణప్రభలచేత నావృతుం డై శంపలతోడం గూడిన నీలజీమూతంబుకరణిఁ జెలంగుచుఁ గృశానుసంకాశం బైనకంటకంబు దొడిగి తూణీరంబులుఁ బిగించి శరశరాసనంబులు గైకొని జ్వలత్పావకసంకాశంబును గురంగోత్తమరాజయుక్తంబును సర్వాయుధసంపన్నంబును గింకిణీసహస్ర విభూషితంబును సముద్గ్రథితకేతుదండంబు నగుకాంచనరథం బారోహించి దశశిఖరసమన్వితం బైననీలాచలంబుమాడ్కి దశశిరంబుల నొప్పారుచు రాక్ష సులు సేయుపుణ్యస్తవంబులచేతఁ బూజ్యమానుం డై శైలజీమూతనీకాశ రూపులును మాంసాశనులును బావకదీప్తనేత్రులు నగురాక్షసరాజముఖ్యు లచేత నభిసంవృతుం డై భూతపరివృతుం డైనరుద్రునిచందంబునం జూపట్టుచు శంఖభేరీపటహప్రణాదసమాస్ఫోటితక్ష్వేళిత సింహనాద పురస్సరంబుగా నతి రభసంబున రణంబునకు వెడలె నప్పు డతనివిఱుందఁ బర్వసమయఘూర్ణ మానమకరమత్స్యకచ్ఛపకాకోదరప్రముఖనిఖిలసత్త్వసమన్వితమహార్ణవౌఘంబు కరణి ఘూర్ణిల్లుచు మహోత్తుంగమాతంగశతాంగతురంగసుభటసంకులం బైనరాక్షససైన్యంబు భయంకరగతి నడిచె మఱియు నింద్రజిత్తుండు నకం పనుండు నతికాయుండును మహోదరుండును బిశాచుండును ద్రిశిరుండునుగుం భుండును నికుంభుండును నరాంతకుండును సముచితయానంబు లారోహించి మణిమండనమండితాంగు లై పూచినయశోకంబులకరణి నలరుచు రావణుని యిరుగెలంకులం జని రిట్లద్భుతప్రకారంబున నగరంబు వెలువడి మహాతేజుం డగురావణుం డగ్రభాగంబున మహార్ణవాభ్రస్తనితం బై పాదపశైలహస్తం బై సముద్యతం బై యుగ్రం బై నిండి యున్నవానరసైన్యంబు గలయ నవలో కించునప్పుడు. 1061

చ. అలఘుపరాక్రముండు భుజగాధిపబాహుఁడు రాఘవుండు సొం
పలర ననద్భుతానుగతుఁ డై పృథుతేజ మెలర్పఁ బొల్చి యు
జ్జ్వలదతిచండభంగి నెస వచ్చునురాగులఁ జూచి శస్త్రభృ
త్తిలకు విభీషణుం గని సుధీరతఁ దాతనితోడ నిట్లనున్. 1062

చ. సునిశితకేతువర్మపృథుశూలవరాయుధచక్రజుష్ట మై
యనుపమశైలసన్నిభగజాన్విత మై నదభీరుయుక్త మై
ఘనగతి వచ్చుచున్నది సఖా బల మెవ్వని దీబలంబు మా
కనువుగ నింతయుం దెలుపు మద్భుతము మ్మద మంకురించెడిన్. 1063

విభీషణుఁడు రామునకు రాక్షసవీరుల నిరూపించి చెప్పుట.

వ. అని యడిగిన శక్రసమానవీర్యుం డగువిభీషణుండు రామునితోడ మహాత్ము లగురాక్షసపుంగవులబలప్రవేశంబు నిట్లని చెప్పం దొడంగె. 1064

మ. తరుణాదిత్యసమానవక్త్ర మలర న్నాత్రీధ రేంద్రోపమ

ద్విరదస్కంధము నెక్కి యాత్మవిలసద్దేహాతిభారంబునం
గర మేపారఁగఁ దన్మహేభశిరముం గంపింపఁగాఁ జేయుచున్
స్థిరమై వచ్చెడువాఁ డకంపనుఁడు ధాత్రీనాథ వీక్షింపుమా. 1065

చ. సురుచిరసింహకేతుపరిశోభితహేమశతాంగ మెక్కి భీ
కరతరశక్రచాపనిభకార్ముకటంకృతు లాచరించుచుం
బరమవివృద్ధదంష్ట్రికరిభంగి మదంబున వచ్చుచున్నవాఁ
డరయఁగ నింద్రజిత్తు మనుజాధిప శూరవరప్రధానుఁడున్. 1066

చ. చతురత్వంబున ధన్వియై కవచియై చాపంబు సారించుచున్
వితతస్ఫీతరథస్థుఁడై కడిమి ఠీవి న్వచ్చుచున్నాఁడు వాఁ
డతికాయుం డతివిక్రముం డతిరథుం డాదిత్యగాట్సన్నిభుం
డతికాయాఖ్యుఁ డతుల్యమానుఁ డతిశౌర్యాటోపుఁ డుర్వీశ్వరా. 1067

చ. నవరవిబింబతుల్యనయనంబుల రక్తిమ మీఱఁ ఘంటికా
రవజనితప్రణాద మగురమ్యగజేంద్రము నెక్కి క్రుద్ధుఁడై
నవనమహావలాహకముచాడ్పున గర్జలు సల్పుచుం దమిం
దివిరి రణాభికాంక్షఁ జనుదెంచెడువాఁడు మహోదరుం డొగిన్. 1068

మ. ఘనసంధ్యాభ్రగిరిప్రకాశమును సంగ్రామోచితంబు న్వినూ
తనజాంబూనదచిత్రభాండ మగు జాత్యశ్వోత్తమం బెక్కి శో
భనశంపారుచినద్ధతీక్ష్ణచటులప్రాసాన్వితుండై మహా
శనివేగంబున వచ్చువాఁ డిలఁ బిశాచాఖ్యుండు ధాత్రీశ్వరా. 1069

చ. హిమకరసంప్రకాశవృషభేంద్రము నెక్కి తటిత్సుప్రభం
బమితబలంబు దీక్ష్ణము మహాశనివేగము కాలదండనా
రము నగుశాతశూలము కరంబునఁ బూని చలం బెలర్ప నం
భ్రమమున వచ్చువాఁడు నరపాలమణీ త్రిశిరుం డనంబడున్. 1070

ఉ. గాఢధనుర్గుణస్వన మఖండగతిం జెలఁగ న్రథస్థుఁడై
గూఢపదేంద్రకేతనము గొబ్బునఁ గ్రాలఁగ వచ్చువాఁ డనా
లీఢభుజుండు రాక్షసకులీనుఁడు మేఘసమానుఁడుం బృథు
వ్యూఢనుజాతవక్షుఁడు రణోగ్రుఁడు కుంభుఁడు వాఁడె చూడుమా. 1071

మ. తతజాంబూనదవజ్రజుష్టము ప్రదీప్తంబు న్సధూమం బనా
హతసారం బగుభూరిఘోరపరిఘం బత్యుద్ధతిం దాల్చి యా
దితిజానీకముఖోల్లసత్తిలకమై ధీరోద్ధతి న్వచ్చువాఁ
డతిశూరుం డతిఘోరకర్ముఁడు నికుంభాఖ్యుండు రాజోత్తమా. 1072

మ. పటుచాపాసిశరౌఘజుష్టము బృహద్భానుప్రతీకాశము
న్జటులప్రాంశుమణిధ్వజంబు నగుభాస్వత్స్యందనం బెక్కి యు

త్కటకోపంబున వచ్చువాఁడు పృథుశృంగక్షోణిభృద్యోధి రా
త్రి ఘటవర్ణ్యుండు నరాంతకుం డనెడువాఁ డత్యంతశౌర్యుం డిలన్. 1073

వ. మఱియుఁ దన్మధ్యదేశంబున నానావిధఘోరరూపులును వ్యాఘ్రోష్ట్రనాగేం
ద్రమృగేంద్రముఖులును వివృద్ధనేత్రులు నగురక్షోవీరులు పరివేష్టింప సూక్ష్మ
శలాకంబును శరదిందుప్రతిమంబునుబరనుశోభనంబు నగుసితచ్ఛత్రంబు మస్త
కోపరిభాగంబున నలరఁ దళకిరీటమణిరోచు లంబరంబునకుఁ జిత్రాంబుదత్వంబు
సంపాదింప మేరువింధ్యోపమం బగుమహాకాయంబు గ్రాల భూతపరివృతుండై
క్రుద్ధుం డై నరుద్రునికరణిం దేజరిల్లుచు దివ్యరథాధిరూఢుం డై యుదయ
మహామహీధరాగ్రంబునం బొల్చుమార్తాండునిభంగి వెలుంగుచుండును దెంచు
చున్నవాఁడు మహేంద్రవైవస్వతదర్పహంత యైనరావణుం డని చూపి చెప్పిన
నారఘుకుంజరుండు విస్మితుండై యరిందముం డగువిభీషణు నవలోకించి
పెండియు నిట్లనియె. 1075

రాముఁడు రావణుని తేజమును బ్రశంసించుట.

చ. కరములచే దురీక్షుఁ డగుకంజవనప్రియుమాడ్కి నీనిశా
చరపతి భూరితేజమునఁ జాల వెలుంగుచు నున్నవాఁ డహో
తిరముగ వీనికిం గలప్రదీప్తజగంబుల నెందుఁ గాన మ
చ్చెరువు ముదంబు కోపమును జేయుచు నున్నది వీనిఁ జూచినన్. 1075

తే. అనఘ వీనిప్రభావ మేమనఁగ వచ్చు, దేవగంధర్వకిన్నరదితిజయక్ష
దానవోరగసిద్ధుల కైన వీని, మేని కీడైనరూపంబు గాన మెందు. 1076

క. అందఱుఁ బర్వతసన్నిభు, లందఱు నగశృంగయోధు లందఱు శూరుల్
అందఱు దీప్తాయుధధరు, లందఱు సమరోగ్రు లీదశాస్యునను చరుల్. 1077

తే. ఈదశాస్యుఁడు మోదసంపాదిదీప్త, భీమదర్శనరాక్షసోపేతుఁ డగుచు
గాత్రవర్తిష్ణుభూతసంకలితుఁ డైన, యంతకునిచందమునఁ జూడ నయ్యె సహహా.

తే. తప్పకీపాపచిత్తుండు దైవికమున, సమర మద్దృష్టిపథగతుం డయ్యె నేఁడు
జానకీహరణజనితం బైనక్రోధ, మిపుడు విని యోగమును బొందు నితనియందు.

వ. అని పలికి వీర్యవంతుం డగురాముండు చాపం బందుకొని శరోత్తమం బెక్కు
పెట్టి లక్ష్మణసహాయుండై వైరిరాకకెదురుసూచుచుండె నంత ఘోరపర్వతాయుధ
ధ్వజం బైనరాక్షసబలంబు గదియ నడిచె నప్పుడు రావణుండు మహాబలులగు
రాక్షసుల నవలోకించి యి ట్లనియె. 1080

వానరరాక్షసుల యాఱవనాఁటి యుద్ధము.

సీ. దానవులార యిందఱు మొక్క మొత్తమై కదువడి నగరంబు విడిచి యనికి
వచ్చితి మీరాకపివర్యు లీచందంబు నెఱిఁగి రయంబునఁ బురము సొచ్చి
విచ్చలవిడిఁ గడు మచ్చరంబునఁ బుర మాక్రమించి మథింతు రట్లు గాన
చర్యాగృహములందు సాలాగ్రములయందు గోపురంబులయందు ఘోరదైత్య

తే. లుఱక నిశ్శంకులై గాచి యుండువారు
గా నియోగింపుఁ డని పల్కి కశినదైత్య
నందనుల నేర్పరించి యందంద నిలిచి
పురము రక్షింపుఁ డని పంచి పోలుపు మించి. 1081

—సుగ్రీవుఁడు రావణునితో యుద్ధము చేసి మూర్ఛిల్లుట.—

వ. రథంబు రయంబునం బఱపించి మహామీనంబు పూర్ణంబైనమహార్ణవౌఘం బుంబోలె వానరవాహినీసాగరౌఘంబు విదారించుచుఁ దఱియంజొచ్చి విచ్చ లవిడి గుణప్రణాదంబు సేయుచు సాంద్రంబుగా శరవర్షంబు పరఁగించుచు రణంబు గావింపం దొడంగిన నతనియాటోపంబుఁ జూచి సహింపక సుగ్రీ వుండు విపులగ్రీవుండై బహువృక్షనానుకందరం బైనయొక్కమహీధరా గ్రం బుత్పాటించి తెచ్చి రావణుని కక్షంబు వచ్చి యచ్చెరువు గావించుచు మచ్చరంబున నతనిమీఁద వైచిన నద్దశముఖుం డత్తెఱం గాలోకించి శీఘ్రం బునఁ దపనీయపుంఖంబులైనప్రచండకాండంబులు పరఁగించినఁ బ్రవృద్ధోత్తమ సానువృక్షం బైనయయ్యచలశిఖరంబు రావణబాణాభిహతం బై సహస్రప్ర కారంబుల విరిసి పుడమింబడియె నిట్లు రాక్షసనాథుండు పర్వతశృంగంబు చూ ర్ణంబు చేసి రుష్టుండై గుణంబు సారించి మహాహికల్పంబును మహాశనితుల్య వేగంబును విస్ఫులింగపటలీసంచారఘోరంబును జ్వలనజ్వాలాభీలంబును గా లాంతకాభంబు నగుశరం బరిఁబోసి వధార్థంబు సుగ్రీవునిమీఁదం బ్రయోగిం చిన నది మెఱుఁగు మెఱసినట్లు మెఱయుచు మిడుంగుఱులు సెదర రావణ బాహుముక్తం బై శక్రాశనితుల్యవేగంబునం బఱతెంచి గుహారిత యైనమ హాశక్తి క్రౌంచంబుంబోలె సుగ్రీవువక్షంబు భేదించిన నవ్వనచరనాయకుండు సాయకార్తుండై చేష్టలు దక్కి గాఢమూర్ఛాపారవశ్యంబున మైమఱచి నినా దంబు సేయుచుఁ బుడమిం బడియె నిట్లు విసంజ్ఞుండై పడినసుగ్రీవునిం జూచి యాతుధాను లందఱుఁ బ్రహృష్టులై సింహనాదంబులు సెలంగఁ జిందంబు లొత్తి రప్పుడు గవాక్షుండును గవయుండును సుషేణుండును ఋషభుండును జ్యోతిర్ముఖుండును నలుండు నను నార్వురు వానరయోధులు వివృద్ధకాయులై మహోన్నతంబులైనశైలంబు లుత్పాటించి తెచ్చి ఘోరప్రకారంబున నొక్కపెట్ట రావణునిమీఁద వైచిరి. 1082

—గవాక్షాదు లార్వురు రావణునితో యుద్ధము చేసి మూర్ఛిల్లుట.—

చ. అలిగి దశాననుం డతిరయంబున ఘోరశితాగ్రసాయకం
బులఁ గపిముక్తశైలములఁ బొందుగఁ జూర్ణము చేసి క్రమ్మఱం
బొలుపుగ దీక్ష్ణవజ్రములఁ బోలిన కాంచనపుంఖమార్గణం
బుల వడి వార లార్వురను మూర్ఛితులై ధరఁ గూల నేసినన్. 1083

క. ఆవనచరవీరులు రక్షోవరపటుచాపముక్తఘోరశరౌఘ

వ్యావిద్ధగాత్రులై మూర్ఛావశులై ధరణిం బడిరి సాలముల క్రియన్. 1084

ఉ. అంత దశాననుండు సముదగ్రమహోగ్రవనాటసైన్యమున్
బంతము మీఱఁ దీవ్రపటుబాణముల న్వెసఁ గప్పుచు న్మది
న్నంతన మంకురింపఁగ ఘనాఘననిస్వనము ల్చెలంగఁ గా
లాంతకులీల విక్రమవిహారము సల్పె నవార్యవైఖరిన్. 1085

వ. ఇట్లు రావణుండు సంరంభవిజృంభితుండై విక్రమక్రీడ సల్పిన నతనికోలల కోర్వక బాణక్షతసంజాతరక్తధారాసంప్లుతదేహులై మహానాదంబులు సేయుచు భయశల్యవిద్ధులై వానరబలంబునం గలమేటిమగ లెల్లం దొలంగి శరణ్యుం డగు రాముని శరణు చొచ్చిన నమ్మహాత్ముండు వారల కభయంబు దెల్పి మహాధనుర్ధరుండై గుణప్రణాదంబు గావించుచు రయంబున రావణున కభిముఖంబుగా నడరిన నప్పుడు లక్ష్మణుం డంజలి గీలించి పరమార్థయుక్తం బగు వాక్యంబున నిట్లనియె. 1086

లక్ష్మణుండు రావణునితో యుద్ధము చేయ రామానుమతిని గోరుట.

శా. దేవా దేవరవారిదివ్యవిలసత్తేజంబె చేదోడుగా
దేవారిప్రభుఁడైన యీదశముఖు న్దీర్ఘోద్ధతిం జంపఁగా
భావంబందుఁ దలంచినాఁడఁ గృప సంభావించి నా కానతి
న్ద్యావైరిం బరిమార్చి నీకుఁ బ్రమదం బే నిత్తు నిక్కంబుగన్. 1087

క. అన విని సత్యపరాక్రముఁ, డనుపమతేజుండు రాముఁ డాసౌమిత్రి
న్ఘనకరుణాలోకనమునఁ, గనుఁగొని మృదుపూర్వకంబుగా నిట్లనియెన్. 1088

సీ. శూరశేఖర దశాస్యుఁడు మహావీర్యుండు రణమందుఁ జిత్రపరాక్రముండు
కడుఁ గిన్కఁ బొడమినప్పుడు వానిముంగల బలహారాదులకులైన నిలువలేరు
తచ్ఛిద్రము లెఱింగి త్వచ్ఛిద్రములు గాచి కొనుచు యత్నంబున ధనువుచేత
నప్రమాదుండవై యాత్మరక్షణమందు నేమఱ కరుల జయింపు మాజి

తే. ననుచు దీవించి యనిచిన నమ్మహాత్ముఁ
డన్నచరణంబులకు మ్రొక్కి సన్నుతించి
కౌఁగిటఁ గదించి యనుమతి గాంచి చాప
మందుకొని చనె సురవైరి కభిముఖముగ. 1089

వ. ఇత్తెఱంగునం జని. 1090

మ. కనియె న్రాజసుతుండు కట్టెదుట సూక్ష్మప్రేక్షణుండై ఘన
స్వనుఁడై యుద్యతచాపుఁడై పటుశరవ్రాతంబులం గీశసై
న్యనికాయంబుల గీటణంచుచు మహోగ్రాకారుఁడై సంభ్రమం
బున సంగ్రామము సల్పు రాక్షసపతి న్భూరిప్రతాపోద్ధతున్. 1091

హనుమద్రావణులు ముష్టియుద్ధము సేయుట.

వ. ఇట్లు విలోకించి సంరంభవిజృంభితుండై మౌర్వీనాదంబులు సేయుచు డాయం

జనునంతలోన బలవంతుం డగుహనుమంతుండు దర్పంబు మెఱయ నేర్చిన సౌమిత్రిని వారించి భయంకరాకారుం డై కల్పాంతకాలంబునం దుగ్రపటు ప్రతాపస్ఫుటాట్టహాససముచ్చలితబ్రహ్మాండకోశుం డైనశూలిపోలికిం గ్రాలుచు మహేంద్రధ్వజసన్నిభం బైనదక్షిణభుజం బెత్తి వాలప్రచలనంబున రావణ ప్రముక్తకాండంబులు జడియంజేయుచుం బాదవిన్యాసంబున నుర్వీతలంబు కంపింప నత్యంతరభసంబుగా రావణునిరథంబు డాయంజని ప్రళయకాలజీమూతగర్జాసముజ్జృంభణగంభీరభాషణంబుల నిట్లనియె. 1092

చ. నరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యులన్
దురమునఁ దోలినాఁడ నని ద్రుళ్లెద వింతకు మున్న మద్బలం
బెఱుఁగవు నాదుదక్షిణకరేంద్రముఁ జూడుము పంచశాఖ మై
కఱకఱ నీదుజీవితము గైకొన నుద్యత మయ్యె రావణా. 1093

క. అని పలికిన మారుతనం,దను వాక్యం బాలకించి దశముఖుఁడు రయం
బునఁ గోపోద్రేకంబునఁ, గనులం దామ్రరుచి నిగుడఁగా నిట్లనియెన్. 1094

తే. కరతలంబున నన్ను శీఘ్రమున వ్రేసి, శాశ్వతం బైనభూరియశంబు నొందు
మవల జ్ఞాతవిక్రాంతుఁడ వై ననిన్ను, నాశ మొందించి పుచ్చెద నగచరేంద్ర.

క. అన విని హనుమంతుం డా,దనుజేంద్రునిఁ జూచి తొల్లి తప్పక నాచే
వినిహతుఁ డైనభవన్నం,దను నక్షుని శూరవరునిఁ దలఁచుకొను మిఁకన్. 1096

క. నా విని సుతనామశ్రవ,ణావిర్భావార్తివర్ధితాటోపుం డై
రావణుఁడు కరతలంబునఁ, బావనివక్షంబు వ్రేసెఁ బటురభసమునన్. 1097

వ. ఇట్లు మారుతనందనుండు దశగ్రీవకరతలాభిహతుం డై సారెసారెకుఁ జలించుచు నొక్కముహూర్తం బుండి తేజస్వి గావున వెండియు స్థైర్యం బవలంబించి క్రుద్ధుం డై వజ్రాశనిసమస్పర్శం బైననిజకరతలంబున సమరద్వేషి యగురావణునియురంబు వ్రేసిన నద్దశగ్రీవుండు మహాత్ముం డైనహనుమంతునికరతలంబున నభిహతుం డై మహేంద్రునివజ్రప్రహారంబునం గూలినపర్వతంబుకరణి గాఢమూర్ఛాపారవశ్యంబున రథంబుపై ద్రెళ్లి కొండొకసేపు చచ్చినట్లుండె నిట్లు పవనతనయకరతలతాడితుం డై పడినరావణు నవలోకించి గగనంబునం బన్నిన దేవర్షిబ్రహ్మర్షిసురసిద్ధసాధ్యులును మహీతలంబున నున్నవానరులును సంప్రహృష్టచిత్తు లై సాధువాక్యంబులఁ బావనిం బ్రశంసించి రంతఁ గొంతవడికి మూర్ఛ దేఱి మహాతేజుం డగురావణుండు హనుమంతు నవలోకించి వానరేంద్రా నీవు శత్రుండ వై నను భుజావిక్రమంబున మిక్కిలి శ్లాఘనీయుండ వైతి వని పలికిన నవ్వానరోత్తముండు రావణున కిట్లనియె 1098

సీ. దనుజాన్వవాయపాంసన యేమి పొగడెదు ధిదురంబుకంటె బల్పైడిద పైన
యస్మదీయతలప్రహారంబుచేఁ జోక బ్రతికితి వేటిదోర్బలము నాకు

నొక సారి దప్పె నింకొకసారి గొనుము మద్దారుణముష్టిపాతంబు దీన
నీకు మృత్యువుగల్గు నిక్కువం బని పల్కు విని రావణుఁడు క్రోధవివశుఁ డగుచు
తే. వృత్తలోచనుఁ డై కడువేగ యడరి, సవ్యముష్టి ఘటించి ప్రచండభంగిఁ
బిడు గడిచినట్లు కరువలికొడుకు వక్షు, మద్భుతంబుగఁ బొడిచె దేవారు లలర.
వ. ఇట్లు పవమాననందనుండు రావణముష్టితాడితుం డై యొక్కింత మూర్ఛిల్లిన
నద్దశకంఠుండు విహ్వాలుం డై మారుతి నవలోకించి యితండు తెలివొందిన నే
మిసేయునో యనుభయంబున నమ్మహాత్మునిఁ గ్రీడించి రథంబు రయంబునం దో
లించుకొని వహ్నినందనుం డైననీలునిమీఁదికిం జని 1100

—రావణుఁడు నీలునితో యుద్ధము సేయుట.—

ఉ. లావును జేవయుం దనర లాఘవలక్ష్యపటుత్వ మేర్పడన్
రావణుఁ డుగ్రకార్ముకగుణధ్వని భీషణభంగి మ్రోయ నా
నావిధభీమరూపఫణినాథసమానశిలీముఖంబులం
బావకసూనుమర్మములు బ్రద్దలువాపె ననేకభంగులన్. 1101
చ. వనచరసైన్యనాయకుఁడు వహ్నికుమారుఁడు నీలుఁ డీగతి
న్దనుజవరేణ్యబాణగణతాడితుఁ డై కడుఁ గోప మెత్తి చ
య్యన నొకభూరిఘోరకుధరాగ్ర మొగిం బెకలించి తెచ్చి దై
త్యుని పెనుఱొమ్ముమీఁదఁ బడ నొక్కకరంబున వైచె నుద్ధతిన్. 1102
తే. అంతలోఁ దెల్వి నొంది వాతాత్మజుండు
తొల్లి పూన్చిన పెనుముష్టితోడ లేచి
దశముఖుఁడు మోలి లేకున్నఁ దప్పి చనియె
వెదకి చంపెదఁ గా కంచు వ్రేలు గఱచి. 1103
వ. కొండొకదూరంబున జయశీలుం డగునీలునితోడ రణంబు గావించుచున్న
రావణు నవలోకించి యన్యునితోడ సంగ్రామంబు గావించువానిమీఁదికిం
బోవుట యుద్ధధర్మంబు గా దని తలంచి. 1104
క. మునుకొని నాచే సమరంబునఁ జావక బ్రతికి దప్పి పోతివి పోపో
దనుజాధమ యని పలుకుచుఁ, గనుల న్రక్తిమ చెలంగఁ గనుఁగొను చుండెన్.
చ. అంత నిశాచరేంద్రుఁ డనలాత్మజము క్తమహాద్రిశృంగ మిం
తింతలు తున్కలై వెస మహీస్థలి రాలఁగ సప్తఘోరకా
లాంతకదండసన్నిభఘనాంబకము ల్నిగిడింప నవ్విధం
బంతయుఁ జూచి నీలుఁడు లయాగ్నివిధంబున దీప్తమూర్తి యై.
ఉ. సాలతమాలకింశుకవిశాలరసాలధవాశ్వకర్ణహిం
తాలకదంబనింబపటుతాలవటామలకార్జునాదికో
ద్వేలమహోగ్రసాంద్రతరువృష్టి వెస న్గురియింపఁ గ్రవ్యభు
క్పాలుఁడు బాణవర్షమున గ్రక్కున దాని నడంచె నుద్ధతిన్. 1107

తే. సురరిపుఁడు మీఁది కెదురించు శరము లద్రి
చరుఁడు పటుపాదపంబులఁ జదియ నడఁచె
తరుచరుఁడు మీఁది కెదురించుతరులు రాత్రి
చరుఁడు పటుసాయకమ్ములఁ జదియ నడఁచె. 1108

చ. మగఁటిమి మీఱ దానవుఁడు మర్కటుఁ డీక్రియఁ బోరి రత్తఱిన్
మిగిలి దశాననుం డలిగి మేఘము ఘోరనితాంతవృష్టిచే
నగమును గప్పినట్లు కదనంబున దారుణబాణవృష్టిచే
నగచరసైన్యనాథుని ఘనంబుగఁ గప్పె మహాద్భుతంబుగన్. 1109

—నీలుఁడు రావణునిచే మూర్ఛిల్లుట.—

వ. ఇట్లు శరౌఘసమభివృష్టుం డై వానరచమూపాలుం డగునీలుండురయంబునదన
రూపంబు హ్రస్వంబుగావించి విచిత్రలాఘవంబున ధ్వజాగ్రంబుమీఁదికిలంఘిం
చి సింహనాదంబుఁ జేసిన నద్దశగ్రీవుండునిజధ్వజాగ్రస్థితుం డై నపావకకుమారుం
జూచి క్రోధరసోద్దీప్తముఖుం డై ప్రచండకాండంబులు పరఁగింపం బూనిన
నతండు లక్ష్యగోచరుండు గాక ధ్వజాగ్రభాగంబున నుండి కిరీటాగ్రంబుమీఁ
దికిఁ గిరీటాగ్రంబునుండి కార్ముకాగ్రంబుమీఁదికిఁ గార్ముకాగ్రంబున నుండి
వెండియు ధ్వజాగ్రంబుమీఁదికి బహుప్రకారంబులదాఁటుచుఁ జిత్రగతుల గా
డ్పుచాడ్పున మెలంగుచుండ నతనిలాఘవంబు విలోకించి రాముండును లక్ష్మ
ణుండును బరమాశ్చర్యరసావిష్టచిత్తులై సంతోషవిశేషంబునం బ్రశంసించుచుం
డిరి మహాతేజుం డగురావణుండును గపిలాఘవవిస్మితుం డై సేయునది లేక
తెచ్చపడి నూచుచుండె నప్పుడు వానరు లందఱు లబ్ధహర్షవిజయు లై నీలలా
ఘవసంభ్రాంతుం డై నరావణునవలోకించి ముదంబున మహానాదంబులుగావిం
చిన నద్దనుజవల్లభుండు వానరులకోలాహలశబ్దంబువిని సంరబ్ధుండై రయంబునఁ
జాపంబు సారించి యాగ్నేయమంత్రసంయుక్తం బై నశరం బరిఁ బోసి ధ్వజశీర్ష
స్థితుం డై ననీలు నవలోకించి సంరబ్ధపరుషం బగువాక్యంబున నిట్లనియె. 1110

సీ. అగచర భూరిమాయావిశేషంబున నతిలాఘవయుతుండ వైతి వీవు
నానావిధాలక్షితానేకరూపము ల్సృజియించితివి కడుఁ జిత్రభంగి
నిను రణంబునఁ జంపఁబనిఁబూని యిదె వహ్నిశరమేయుచున్నాఁడ సమదవృత్తి
వీరుండ వై తేని వెరవు చొప్పడ నీదు జీవితం బింక రక్షించుకొనుము

తే. మాట లేటికి ననుచు నిశాటవిభుఁడు
కాండ మస్త్రమంత్రంబునఁ గలయఁ గూర్చి
శింజినీధ్వని సెలగంగఁ జిత్రభాను
దేవసుతుమీఁదఁ దెగ నిండఁ దీసి విడిచె. 1111

వ. ఇట్లు రావణకార్ముకప్రముక్తం బై యమ్మహనీయాస్త్రంబు పొగలేనిమంటలుమి
యుచు విస్ఫులింగపటలీసంచారఘోరంబుగా నరిగి నీలునివక్షంబు దాఁకిన

నవ్వనచరవాహినీనాయకుండు ప్రచండాస్త్రమంత్రప్రయుక్తబాణతాడితుండై ధ్వజాగ్రంబున నుండి మోఁకాళ్లూఁతఁ గాముందటికి మ్రొగ్గతిలఁబడమింబడి పితృమాహాత్మ్యసంయోగంబువలనను స్వతేజంబువలనను బ్రాణంబులురక్షిం చుకొనియుండె నిట్లు విసంజ్ఞుం డైననీలునిం జూచి దశగ్రీవుండు రణోత్సుకుం డై ప్రవృద్ధఘంద్రాంబుదధీరనాదం బగురథంబు దోలించుకొని సుమిత్రాపుత్త్రుఁ గదియ నేతెంచి లబ్ధసంజ్ఞు లై యడ్డంబు వచ్చినసుగ్రీవనీలగవాక్షగవయగంధ మాదనాదుల నివారించి రణమధ్యంబున వైశ్వానరునిభంగివెలుంగుచు మహీ తలంబు కంపింపఁ గార్ముకగుణప్రణాదంబు సేయుచున్న నతని వీక్షించి రూక్ష ప్రేక్షణుం డై యప్రమేయం బగుచాపంబు సారించి మౌర్వీనాదంబు సేయుచు లక్ష్మణుం డిట్లనియె. 1112

—— లక్ష్మణరావణుల పరస్పరతిరస్కారము ——

ఉ. కావర మెత్తి క్రొవ్వి కనుగానక దుష్కృత మాచరించుచు
నీ వొకపోటుబంటువలె నేర్పులు సూపెద వేల యీవనా
టావలితోడి దే మిదె రణాభిరతిం జనుదెంచినాఁడ నా
క్రేవకు డాసి జన్య మొనరింపుము శూరుఁడ వేని రావణా. 1113

చ. అని యిటు లక్ష్మణుండు తగ నాడినఁ దత్పరిహాసవాక్యము
ల్ఘనతరమేఘగర్జితము లై వడి మ్రోయుధనుర్గుణధ్వని
న్విని విపరీతమానసుఁడు వీర్యధురంధరుఁ డంతకామి యా
దనుజవిభుండు వహ్నిక్రియఁ దద్దయు మండుచుఁ బల్కె నెండియున్. 1114

ఉ. విష్టపశక్తి యెవ్వనిప్రవీణత విన్నఁ దలంకు నట్టినా
దృష్టిపథంబునం బడితి వెక్కడి కేగెద వింక నీవు నిక్
రుష్టుఁడ నై మహారజతరుగ్విశిఖాహతుఁ జేసి భూరిదో
శ్శౌష్ఠవ మొప్ప నిన్ను జముచక్కటి కంపెద నీక్షణంబునన్. 1115

వ. అని పలికిన నద్దశరథరాజనందనుండు రోషభీషణుండై యుద్వృత్తశితాగ్రదం ష్ట్రుఁడై వృథాజల్పంబు లాడురావణు నవలోకించి యెండియు నిట్లనియె. 1116

చ. ధరణి మహానుభావులు వృథాలపితంబులు పల్క రంతరం
బెఱుఁగక నీవు రిత్తపలు కిట్లు వచించితి వట్లు గావున
న్గురుతరబాణజాలముల గుండెలు వ్రక్కలు చేసి యిప్పుడే
యురుదుగ మృత్యుదేశమున కంపెద వేల్పులు మెచ్చి చూడఁగన్. 1117

వ. రాక్షసేంద్రా రణరంగధీరుండ నైననేను క్షత్త్రధర్మంబున ని న్నారాధించెద భవదీయవీర్యంబును బరాక్రమంబును బలంబును బ్రతాపంబును సర్వంబు నెఱుంగుదుఁ బెక్కువాదంబు లేల శరచాపపాణి నై యుద్ధంబునకు సన్నద్ధుండ నైతి రయంబునం జనుదెమ్మని పలికిన నద్దశగ్రీవుండు కుపితుం డై. 1118

## లక్ష్మణరావణులద్వంద్వయుద్ధము.

ఉ. దారుణభంగిఁ జాపనినదంబు చెలంగ సుపుంఖన_స్తదు
ర్వారశరంబు లేయఁ గని వాసవతుల్యుఁడు లక్ష్మణుండు పొ
ల్పార శితాగ్రధార భిదురాభసువర్ణవిచిత్రపుంఖశో
భారుచిదీ_ప్తబాణముల మాన్చెఁ దదీయశిలీముఖంబులన్. 1119

శా. ఈమాడ్కి న్రఘువర్యసాయకహతాహీనోపమానస్వకీ
యామోఘాంబకరేఖ ఖండితఫణవ్యాళాలిభంగి న్రణో
ర్వీమధ్యంబున వ్రాలినం గని దశగ్రీవుండు సంక్రుద్ధుఁ డై
సౌమిత్రి న్వడి నేసె భోగివిలసచ్చండాస్యకాండంబులన్. 1120

శా. ఆరామానుజుఁ డుగ్రకార్ముకవిముక్తామోఘభల్లార్ధచం
ద్రాకూటక్షురికాస్యసింహముఖనానాకారవజ్రోల్లస
న్నారాచంబుల రావణాంబకముల న్ఖండించి దోర్దర్పవై
న్ఘోరాశీవిషతుల్యసాయకములన్ గుప్పించె నత్యుద్ధతిన్. 1121

చ. కదువడి లక్ష్మణోగ్రవిశిఖంబులచేఁ దనబాణజాలము
ల్గదుఁ బొడి యైనఁ దత్ప్రసరలాఘవసంపద కాత్మ మెచ్చుచుం
దడయక తీవ్రకాండములఁ దచ్ఛరము ల్విరియించి గ్రమ్మఱ
న్వడువక మీఱి యేసె రఘువీరునిమీఁద ననేకబాణముల్. 1122

చ. అలిగి రఘూ_త్తముండు కఠినాశనికంటె మహాహికంటెఁ ద
త్కులిశముకంటెఁ గాలునియకుంఠితదారుణహేతికంటె మి
క్కిలి బెడిదంబు లై నవిమకీర్ణశరంబుల వింటఁ గూర్చి పెం
పలర నిశాచరేంద్రునిశరార్ధము వే నిగిడించె నుద్ధతిన్. 1123

వ. ఇట్లు ప్రచండభంగి నిగిడించిన నద్దనుజశేఖరుండు కోపోద్దీపితుండై రయంబున
లాఘవలక్ష్యశుద్ధశ్వదృఢత్వంబు లేర్పడఁ గాండప్రకాండంబులు పరఁగించి లక్ష్మ
ణప్రయు_క్తబాణంబుల జడియ నడఁచి తొల్లి విరించి యొసంగినకాలాగ్నిసము
ప్రభం బైనయొక్కదివ్యసాయకం బారాజనందనునిలలాటదేశంబు నాట
నేసిన నద్దశరథపుత్త్రుండు రావణసాయకార్తుం డై యొక్కింత చలించి గ్రమ్మఱ
లబ్ధసంజ్ఞుం డై యతిప్రయత్నంబున నప్పౌలస్త్యునిచాపంబు ఖండించి వైశ్వా
నరజ్వాలోపమంబు లై నమూఁడుబాణంబు లురంబు గాఁడ నేసిన నతండు సౌమి
త్రిశితాగ్రశరాభిహతుం డై యొక్కింతసేపు మూర్ఛాపరవశత్వంబున రథధ్వ
జం బూఁతగా నిశ్చేష్టుం డై యుండి వెండియు నతిప్రయాసంబున మూర్ఛదే
ఱి నికృ_త్తచాపుండును శరతాడితుండును మేదస్సి_క్తగాత్రుండును రుధిరావ
సి_క్తుండు నై కోపోద్రేకంబున. 1124

చ. జలజభవుండు మెచ్చి మును సత్కరుణం దన కిచ్చినట్టిని
శ్చలసముదగ్రశ_క్తి గలశ_క్తిని ధూమయుతాగ్నిసన్నిభ

న్బలవదరాతిమర్దని క్షపాచరవానరసాధ్వసప్రదం
జలమునఁ గేలఁబూని రఘుసత్తముపై వెస వైచె నుద్ధతిన్. 1125

వ. ఇట్లు రావణప్రయుక్తయై వజ్రాశనివేగంబునం బఱతెంచుచున్నశక్తి నవలోకించి భరతానుజుండు హుతాగ్నికల్పంబు లగునానాస్త్రబాణంబులు పఱఁగించిన. 1126

మూర్ఛితుఁ డగులక్ష్మణుని రావణుఁ డెట్టెట్టు కదల్పలేకపోవుట.

చ. అనుపమఘోరబాణముల నన్నిటి మ్రింగుచు వచ్చి శక్తి పె
ల్చన రఘువీరముఖ్యునివిశాలభుజాంతరసీమఁ జొచ్చెఁ జొ
చ్చిన వెస శక్తిమంతుఁ డగు శ్రీపతిసన్నిభుఁ డామహాత్ముఁ డా
య్యనఁ బెనుమూర్ఛ పైకొనిన నద్భుతభంగిఁ బడె న్రణంబునన్. 1127

వ. ఇట్లు బ్రహ్మాస్త్రశక్తితాడితుం డై భరతానుజుం డగులక్ష్మణుండు తద్విపత్పరిహారార్థంబు తన్ను స్వమూలకారణుండును భగవంతుండును సర్వవ్యాపారుం డైననారాయణునియచింత్యం బైనభాగంబునుం గాఁ దలంచుచు మూర్ఛితుం డైననమ్మహాత్ముని డాయం జనుదెంచి లంకకు గొనిపోయెదఁగాక యని దలంచి మహాబలుం డగురావణుండు బాహువులు సాఁచి బలంబుకొలంది కొంతదడవు పీడించి. 1128

చ. మును పురవైరియుక్తముగ భూరిబలంబున వెండికొండ నె
త్తిన ఘనుఁ డాదశాస్యుఁ డబిధీరుని లక్ష్మణు నెత్తఁ జాలఁ డ
య్యె నిఖిలవిష్టపంబుల రహిం దనలో నిడికొన్నదైత్యమ
ర్దనునివరాంశభూతుఁ డగుదాశరథిం గదలింప శక్యమే. 1129

వ. మఱియు సమస్తధీరోపమానభూతుం డైనహిమవంతుండును సమస్తరత్నాకరప్రధానగంభీరతరక్షీరోదక్షోభణక్షమం బైనమందరంబును జతుర్దశభువనంబులకాధారభూతం బైనహేమాచలంబును సప్తసాగరకులాచలసహితం బైనభూమండలంబును జరాచరానంతకోటిభూతనికరాశ్రయం బైనత్రైలోక్యంబును భుజాబలంబునఁ జలింపం జేయుటకు సమర్థుఁ డగురావణుండు లక్ష్మణు నిట్టట్టుగదల్పంజాలక వెగటువడి. 1130

హనుమంతుఁడు ముష్టిచే రావణునిఁ బొడిచి మూర్ఛిలఁ జేయుట.

తే. ఉరగపతిమాడ్కి రోఁజుచు నోపినట్లు
విడువక పెనంగురాక్షసవిభునిఁ జూచి
రుష్టుఁ డై వాయుజుఁడు వానిఱొమ్ముఁ బొడిచె
కులిశనిభ మైనపిడికిట గుండె లవియ. 1131

క. ఈరీతి వాయునందన, దారుణపవితుల్యముష్టితాడితుఁ డై దే
వారి ముఖనయనకర్ణ,ద్వారంబుల శోణితంబు తరుచుగ నిగుడన్. 1132

మ. గిరిమాడ్కిం జలియించి వారిదముభంగి న్బల్విడి న్రోయుచు
న్బరశుచ్ఛిన్నమహీరుహంబుపగిది న్గన్మూసి పెన్మూర్ఛచే
ఖలుఁ డారాక్షసలోకవల్లభుఁడు మోఁకాళ్లూఁతగా భూమిమీఁ
ద రహిం ద్రెళ్లె సురాసు లెల్ల భయసంత్రస్తాత్ములై చూడఁగన్. 1133

వ. ఇట్లు మరణోపమానగాఢమూర్ఛాపరవశుం డై పడియున్నభీమవిక్రముం డైన రావణుంజూచి దేవత లానందించిరి పరమర్షులు కీర్తించిరి సిద్ధసాధ్యాదులు కౌతుకంబున వీక్షించిరి వానరులు హర్షోత్కర్షంబున సింహనాదంబులు గావించి రంత. 1134

చ. అతులితసత్త్వుఁ డై పవనాత్మజుఁ డుగ్రనిశాచరేశ్వరా
ర్దితుఁ డగులక్ష్మణు న్నురధీరుని శక్రసమానవీర్యునిం
జతురుని శూరవర్యు నతిసాహసుఁ జేతులఁ గ్రుచ్చి యెత్తియ
ద్భుతగతిఁ దెచ్చి రాఘవునిముంగలఁ బెట్టెఁ గపు ల్నుతింపఁగన్. 1135

తే. అపుడు సౌమిత్రి పగతుల కప్రకంప్యుఁ
డయ్యుఁ బవమానసుతునియత్యంతభక్తి
కతిసుహృత్త్వమునకుఁ జుల్క నయ్యె బుధులు
జగతి భక్తపరాధీను లగుట యరుదె. 1136

తే. వక్షమున నాటి యున్నరావణునిశక్తి, నమరదుర్జయుఁ డైనలక్ష్మణుని విడిచి
మరల దశముఖునొద్దకుఁ బఱచి వాని,రథముమీఁద నెప్పటియట్టులధివసించె.

లక్ష్మణుఁడు మూర్ఛ దేఱుట.

తే. శత్రుసూదనుఁ డైనలక్ష్మణుఁడు తన్నుఁ
దగ నమీమాంస్య మైనమాధవునిభాగ
మనుచుఁ దలఁచుచు నాశ్వస్తుఁ డతివిశల్యుఁ
డై పొలుపు గాంచెఁ దొల్లిటియట్లు లపుడు. 1138

ఉ. అంత నిశాచరేంద్రుఁడు దశాస్యుఁ డొకింతకు మూర్ఛ దేఱి కా
లాంతకుభంగిఁ గ్రోధవివశాత్ముఁ డై మఱి యొండు కార్ముకం
బెంతయుఁ దాల్చి నారి మొఱయించుచు ఘోరనిశాతబాణము
ల్పంతము మీఱ నేయుచు నృపాలుని డాయఁగ వచ్చె నుద్ధతిన్. 1139

వ. ఇట్లతిరభసంబుగాఁ జనుదెంచుచు నున్నరావణునిఁ దదీయదారుణశరార్దితం బై భయంబునం బఱచువానరసైన్యంబునుం జూచి వైరివిరాముం డగురాముండు రయంబున వానిమీఁదికి నడరిన నమ్మహాత్మున కంజలిఁ జేసి హనుమంతుం డిట్లనియె. 1140

క. అనఘా గిరినిభ మగుమ,ద్ఘనపృష్ఠం బెక్కి ఘోరకాండంబులచే
దనుజాధిపుఁ డగురావణు, ననిలో శాసింపు మమరు లభినుతి సేయన్. 1141

-ం- రాముఁడు హనుమత్పృష్ఠారూఢుఁడై రావణునితో యుద్ధము సేయుట. -ం-

సీ. అనవిని రఘురాముఁ డతిసంప్రహృష్టుఁడై కనకాద్రినిభ మైనగాడ్పుపట్టి
పెనుమూఁపురం బెక్కి ఘనతరపూర్వాద్రిపై వెలింగెడుబాలభానుభంగిఁ
దేజరిల్లుచు హేమదీప్తశరాంగస్థుఁడై నదుష్టాత్ము దశాస్యుఁ జూచి
భీషణవజ్రనిష్పేషనిస్వన మైనదారుణశింజినీధ్వని యొనర్చి
తే. క్రుద్ధుఁడై నేత్రములఁ దామ్రరుచులు నిగుడఁ
గదియఁ జని యాతపాపాయకాలజనిత
సాంద్రజలదస్వనోపమశక్త్రతుల్య
వాక్యమున నిట్టు లని పల్కె వానితోడ. 1142
చ. నిలు నిలు రాక్షసప్రవర నీవు దురాత్ముఁడ వై జితారిగుం
డలునకు నాకు విప్రియ మొనర్చితి వెక్కడి కేగె దింక ని
స్తులమణిపుంఖఘోరపవితుల్యసుపర్వశితాగ్రసాయకం
బుల నిను గీటణంచి జముప్రోలికిఁ బుచ్చెద నీక్షణంబునన్. 1143
చ. అనిమిషనాథపావకకృతాంతనిశాటులు దోడుఁజూపినన్
వనధిపతిప్రభంజనశివప్రియు లొక్కటఁ గూడి కాచినన్
వనజభవేశు లడ్డపడి వచ్చిన దిక్కుల నెందు డాఁగిన
న్దనుజకులప్రదీప నినుఁ దప్పక చంపెద సంగరంబునన్. 1144
చ. అనుపమశక్తి నెవ్వని రణావని మూర్ఛితుఁ జేసి లంకకుం
గొని చనఁ జూచి బాహువులు గ్రుచ్చి కదల్పఁగఁ జాలవైతి వా
ఘనభుజు నగ్నికల్పు నరికాలుని సంగరభీము లక్ష్మణు
న్నిను వధియింప నుర్వర జనించినమృత్యువుగా నెఱుంగుమా. 1145
తే. ఈరఘుకులోత్తమునిచేత ఘోరదర్పనులు జనస్థానకృతగేహు లలఘుహేతి
ధరులు ఘనవిక్రములు చతుర్దశసహస్రవీరదైత్యులు పొలియుట వినవె నీచ.
వ. అని పలికిన నారఘుపుంగవునివచనంబులు విని రాక్షసేంద్రుం డగురావణుండు క్రోధపరీతచిత్తుండై కార్ముకజ్యారవంబు భైరవంబుగా మ్రోయఁ గాలానలశిఖోపమంబు లైనతీక్ష్ణసాయకంబులు మహావీర్యుం డగుమారుతిం దాఁక నేసిన స్వభావతేజోయుక్తుం డగునమ్మహాబలనందనుండు బాణతాడితుం డయ్యును గ్రమ్మఱ నధికతేజోయుక్తుం డై వెలింగె నంత మహాతేజుం డగురాముండు రావణునిచేతం గృతవ్రణుం డైనపవమానసూను నాలోకించి కోపారుణితలోచనుండై రయంబున. 1147
చ అనుపమఘోరకార్ముకగుణార్భటు లంబరవీథి నిండఁ గాం
చనమణిపుంఖబాణములు సాంద్రముగాఁ బరఁగించి సూతకే
తనయుగచక్రఘోటకగదాపరిఘాయుసశూలపట్టిసా
శనిసహితంబుగా నతనిస్యందనముం బొడి చేసి వెండియున్. 1148

మ. ఘనవజ్రాశనిసన్నిభం బగుమహోగ్రక్రూరకాండంబునన్
దనుజవ్యూహధనుజాతరూపబలయుక్తస్ఫీతదోర్మధ్యముం
దు నెఱిం గాఁడఁగ నేసెఁ దొల్లి భగవంతుం డైనశక్రుండు గో
బ్బున వజ్రంబున భూరిమేరుకుధరంబు న్వ్రేసిన ట్లుద్ధతిన్. 1149

ఉ. నాశము నొందక దుర్భుతరణంబుల నెవ్వఁడు తొల్లి వజ్రపా
తాశనిసన్నిపాతముల నార్తి వహించి చలంకఁ బట్టిదై
త్యేశుఁడు రామకార్ముకవిసృష్టశరాహతుఁ డై భృశార్తుఁ డై
గాసిలి చేతివి ల్విడిచి గ్రక్కున మూర్ఛితుఁ డయ్యె నయ్యెడన్. 1150

రాముఁడు యుద్ధంబున విహ్వలుఁ డైనరావణునిఁ జంపక విడిచిపెట్టుట.

వ. ఇట్లు విహ్వలుం డైనదశాస్యు నవలోకించి రాముండు వెండియు నొక్కదీప్తార్ధచంద్రసాయకంబున నర్కవర్ణం బైనవానికిరీటంబును శరదిందుప్రతిమం బైనఛత్రంబును బుడమిఁబడంగూల్చి వడంవడి నిర్విషాశీవిషసన్నికాశుండై శాంతార్చి యైనపావకునివడువున వేఁడిమి సెడి రాహుగ్రస్తుం డైనసూర్యునిపగిది నిస్తేజుం డై వెలఁగుపడి యున్నరావణుం జూచి యిట్లనియె. 1151

ఉ. రాక్షసనాథ నీచలము లావును జేవయు విక్రమంబు ప్ర
త్యక్షము గాఁగఁ జూపితివి తప్పక మా కవి తెల్ల మయ్యె దో
ష్షక్తి వైననీబలము సర్వముఁ జూడఁగ గోరి నేఁడు ని
న్నక్షయబాహుశౌర్యమున నాజి వధింపక కాచి పుచ్చితిన్. 1152

చ. అసురవరా రణార్దితుఁడ వైతివి గావున లంక కేగి సొం
పెసఁగఁగ నేఁటిరాత్రి వసియించి గతప్రథనశ్రముండ వై
మనలక నీవు రేపకడ మంచిశతాంగము నెక్కి ధన్వి వై
వెసఁ జనుదెమ్ము నాదుభుజవిక్రమ మంతయుఁ జూచె దాజిలోన్. 1153

చ. అన విని రావణుండు హృదయంబున సాధ్వస మంకురింపఁ జ
య్యన హతదర్పహర్షుఁడు హతాశ్వరథధ్వజసూతచక్రుఁడున్
వినిహతసత్త్వతేజుఁ డపనీతకిరీటశరాసిచాపుఁ డై
మనమునఁ దొంటిపౌరుషము మాని రయంబున నేగె లంకకున్. 1154

ఉ. ఆరజనీచరేంద్రుఁడు మహాభుజసత్త్వుఁడు మానిహంత శ
క్రారి పురంబుఁ జొచ్చుటయు నవ్వల లక్ష్మణసంయుతంబు గా
దారుణజన్యరంగమునఁ దద్దయు నొచ్చినవారిఁ గీశుల
న్నారభుజుండు రాముఁడు విశల్యులఁ గా నొనరించె నందఱిన్. 1155

చ. అని మొన నిట్లు క్రూరుఁడు సురారి పరాభవ మొందు చుండఁగాఁ
గనుఁగొని ధారుణీగగనకాండచరాఖిలభూతజాలము
ల్మునులును దానవు ల్దివిజముఖ్యులు సాగరము ల్దిశ ల్విధుం

డినుఁడును వానరప్రవరు లెంతయు సంతస మంది రయ్యెడన్. 1156

రావణుండు తనకుం బాటిల్లిన శాపములను దలంచి దుఃఖించుట.

వ. ఇత్తెఱంగున రావణుం డాఱవనాఁటియుద్ధంబున రామబాణభయార్దితుం డై భగ్నదర్పుండై మృగేంద్రునిచేత మత్తమాతంగంబుకరణి ఖగేంద్రునిచేతఁ బన్నగంబుభంగి మహాత్ముం డగురామునిచేత నభిహతుం డై పలాయితుం డై లంకఁ జొచ్చి బ్రహ్మదండప్రతీకాశంబులు నవిద్యుత్సదృశవర్చంబులును యుగాంతకాలసముత్థితాగ్నివర్ణధూమకేతుప్రకాశంబులు నగురాముని బాణంబులు దలంచుకొని వ్యథితాకులేంద్రియుండై కాంచనమయదివ్యసింహాసనంబున నాసీనుండై రాక్షసుల నందఱఁ గలయ నవలోకించి యి ట్లనియె. 1157

చ. హరిహయపావకాదికదిశాధిపు లెవ్వని కోడి భీతిచే
నిరవులు పాసి రేపవలు భృత్యులకై వడిఁ బొల్తు రట్టినే
నరుదుగ నాజి మానవున కక్కట యోడితి నేఁడు చాల మ
త్పరమతపంబు సర్వమును బౌరుష మంతయు రిత్త యై చనెన్. 1158

చ. అలయక నేను దొల్లి తప మర్థి నొనర్పఁగ మెచ్చి వచ్చి యా
నలినభవుండు భూరికరుణ న్వరదాన మొసంగునాఁడు మ
ర్త్యులవలన న్భయంబు గదురుఁ మది నుంపు మటంచుఁ బల్కె న
ప్పలు కిటు నేఁ డమోఘ మయి పాయక డాయఁగ వచ్చెఁ దోడుతన్. 1159

చ. కృప జలజాసనుండు వర మిచ్చెదఁ గోరు మటంచుఁ బల్కు నే
నపుడు పతంగసిద్ధఫణియక్షసురాసురకిన్నరాళిచే
నెపు డిలఁ జావు లేనివర మిమ్మని పల్కితిఁ గాని తొల్లి మ
ర్త్యపతులచేతఁ జావనివరం బది వేఁడఁగ నైతిఁ గ్రొవ్వునన్. 1160

వ. మఱియుఁ దొల్లి పుత్రమిత్రభ్రాతృమంత్రిబాంధవపరివారసమేతంబుగా దుర్మార్గవర్తి వైన నిన్ను సంగ్రామంబున నెవ్వాఁడు వధించు నట్టిపురుషుండు మద్వంశంబునందు భవదర్థంబుగా నవతరించు రాక్షసాధమా నిక్కంబని యిక్ష్వాకుకులసంభవుం డైన యనరణ్యునిచేత శప్తుండ నైతి దశరథరాజనందనుం డగురాముని ననరణ్యోక్తరీతి మదర్థం బవతరించినపురుషుగాఁ దలంచెద నదియునుంగాక.

సీ. వినుఁ డేను దొల్లి దిగ్విజయంబు గావించి వచ్చుచు నొకరమ్యవనములోనఁ
దపము గావించెడుతాపసి నలవేదవతి యనుతన్వి నొక్కతెను జూచి
కామాతురుండ నై క్రక్కునఁ బట్టిన నన్నాతి కోపించి నన్నుఁ గాంచి
నీచవర్తన యేను నీలంకలోఁ బుట్టి తనయానుజాప్తయుక్తముగ నిన్ను

తే. నాశ మొందింతు నని నన్ను వే శపించి
యేను గనుఁగొనుచుండ మహానలంబు
సొచ్చె నవ్వేదవతియె బల్మిచ్చరమున
జనకునకు సీత యై పుట్టె సత్య మింత. 1162.

క. వేమఱు నాచే బాధితు, లై మునులు తపోబలమున నాడినవచనం
బామెయి నేటికి జతనం, బై యొనసె మహర్షి వాక్య మనృతం బగునే. 1163

వ. మఱియుఁ దొల్లి కైలాసగిరిచలనసమయంబున రావణునకు స్త్రీనిమిత్తంబుగా మరణంబు గల్గు నని పార్వతీదేవి శపియించె నదియునుం గాక రాక్షసనాథ మా వానరమూర్తి నగున న్నవలోకించి మత్ప్రభావం బెఱుంగక మార్ఖ్యంబునఁ బరిహసించి న న్నవమానించితివి గావున మద్రూపసంయుక్తులును మద్వీర్యసమతేజులు నగువానరులు భవద్వినాశార్థంబు జనించెద రని నందీశ్వరుం డాడె మఱియు నెప్పుడేని. కామార్తుం డై యకామ యగుయువతిని బలాత్కారంబున ధర్షించునప్పు డతనిశీర్షంబు సప్తప్రకారంబుల వ్రయ్య లగు నని నన్నుద్దేశించి రంభానిబంధనుం డై నలకూబరుండు పలికె రావణుండు స్త్రీధర్షణనిమిత్తంబున వధంబు నొందునని వరుణకన్యకానిబంధనుండై విరించి తిట్టె నవి యన్నియు నమోఘంబు లై నాచేత సంప్రాప్తంబు లయ్యెఁ దచ్ఛాపనిమిత్తంబు లెఱింగి బలవంతు లగురాక్షసులు చర్యాగృహగోపురద్వారప్రాకారంబు లారోహించి మహాయత్నంబున లంకాపురంబు రక్షింతురుగాక యని పలికి తనపరాజయంబును బ్రహస్తునిమరణంబును విచారించి కుంభకర్ణుని భీమబలునిఁగా నెఱింగి తన్నిబోధనంబు నుద్దేశించి రాక్షసుల నవలోకించి యిట్లనియె.

రావణుండు కుంభకర్ణుని మేలుకొలుప రాక్షసుల కాజ్ఞాపించుట.

సీ. దనుజశేఖరులార మనకుంభకర్ణుండు మంత్రంబు గావించి మనము జన్య
మారంభ మొనరించునంతకు మును తొమ్మిదవనాఁటనుండి పద్మజునిశాప
పరవశుఁ డై మేను మఱచి గాఢంబుగా నిద్రించి యున్నాఁడు నెఱయ నాఱు
నెలలు నిద్రించి యవ్వలనొక్కనాఁడు మేల్కనువాఁడుగావున ననియెడుంగఁ

తే. డతఁడు దేవదానవదర్పహంత శూరుఁ, డతిబలుం డతిధీరుఁ డప్రతిమరూపుఁ
డమితగంభీరుఁ డరికాలుఁ డతని మేలుకొలుపుఁ డిప్పుడు కార్యంబు గూడవచ్చు.

చ. అతఁ డపరాజితుండు నిఖిలాసురముఖ్యుల కెల్ల మేటి య
ప్రతిమభుజాబలుండును సుపర్వుల కెల్లను జిత్తశల్య మా
యతభుజుఁ డాజిరంగమున నద్రిచరేంద్రుల రాజపుత్రులన్
క్షితి నవలీలఁ గూల్చి జయశీలుఁడు నాకు జయం బొసంగెడిన్. 1166

తే. సకలరాక్షసముఖ్యుండు సంగరమునఁ
గేతుభూతుండు లోకవిఖ్యాతసత్త్వుఁ
డతఁడు మూఢుఁ డై గ్రామసౌఖ్యంబు మరగి
మంచి చెడు గాన కెపుడు నిద్రించి యుండు. 1167

తే. ఆఘనుండు ప్రబోధితుం డయ్యెనేని, దారుణం బైనసంగ్రామతలమునందు
మానవేంద్రశరార్తుండ నైననాకు, శోక మించుక గలుగదు శూరుఁ డగుట.

క. అనిమిషపతినిభబలుఁ డగు, జనపతిచే నిట్టివగవు నమరొని రా నె

వ్వనిచే నే మగు నాతనిఁ, గాని యేమి యొనర్చువాఁడ క్రూరత్వమునన్

క. అని పలికి వారివలన, న్వినఁ దగు ప్రత్యుత్తరంబు వినఁబడ కునికి
న్మనమున ఖేదించుచు నద్దనుజాధిపుఁ డనియె మరల దైత్యులతోడన్. 1170

తే. ఇట్టివ్యసనంబు దొరకొనినట్టిచోట, వాఁడి మెఱసి రణంబునఁ దోడుపడని
విబుధనాథప్రతీకాశవీర్యుఁ డైన, కుంభకర్ణుఁ డిఁ కెన్నఁడు గూడి వచ్చు.

వ. అని పలికిన రావణునివచనంబు విని మాంసశోణితభోజను లగు యాతుధానులు కొందఱు పరమసంభ్రాంతు లై యతనియనుపున గంధమాల్యంబులును భక్ష్యంబులునుగొని రయంబునఁ గుంభకర్ణునివేశనంబుకడకుం జని యొక్కచోట మహాద్వారకవాట యై సమంతతో యోజనాయత యై రమ్య యై శోభన యై కాంచననిబద్ధభూమి యై సర్వగంధప్రవాహిని యై యొప్పునొక్క గుహ నవలోకించి యతిప్రయత్నంబునం బ్రవేశించి యందు భీమనాసాపుటుం డై పాతాళవిపులాననుం డై శయ్యావిన్యస్తసర్వాంగుం డై మేదోరుధిరగంధి యై కాంచనాంగదనద్ధాంగుం డై హారకిరీటశోభితుం డై భీమదర్శనుం డై యూర్ధ్వరోమాంచితశరీరుం డై వికృతరూపుం డై మహాశ్వాసవిత్రాసితసర్వభూతుం డై కుబుసంబు గప్పినమహాపన్నగంబుకరణి వికీర్ణం బైనపర్వతంబుమాడ్కిఁ జూడ్కికి వ్రేఁగగుచు శయనించి కాలవ్యాళంబుపగిది బుసకొట్టుచు గాఢంబుగా నిద్రించుచున్నమహాబలుండును నైరృతవ్యాఘ్రుండు నరిందముండు నగుకుంభకర్ణు నవలోకించి రాక్షసు లందఱుఁ దదీయనిశ్శ్వాసవాతావధూతు లై నాసావివరంబులలోనికిం బోవుచుఁ గ్రమ్మఱ నిర్గమించుచుఁ గాకాకులగతి సుడివడి మహాబలులు గావునఁ గొండొకసేపునకు నతిప్రయాసంబున నూల్కొని యతనికడకుం జని తదీయాగ్రభాగంబునఁ బరమతర్పణం బైనమాంసంబునుమృగమహిషవరాహమాంససంచయంబును బరమోదనంబును మహాద్భుతంబుగా మేరుమహీధరంబుపోడువున రాశిపడ వైచి శోణితకుంభంబులును వివిధమద్యభాండంబులును నించి పరార్ధ్యకాలాగరుచందనంబులం దివ్యసుగంధిగంధమాల్యంబుల నలంకరించి సుగంధధూపంబు లర్పించి తద్విబోధార్థంబు కొందఱు జలదంబులభంగి గర్జించిరి కొందఱు శశాంకసదృశప్రభంబు లగుశంఖంబులు పూరించిరి కొందఱు సింహనాదంబులు చేసిరి కొందఱు భుజాస్ఫాలనంబు గావించిరి కొందఱు భేరీమృదంగపటహంబులు వాయించి రి ట్లంద ఱేకకాలంబున మహానాదంబులు గావించినఁ దదీయనానావిధనిర్ఘోషంబు దశదిశలు నిండి త్రిదివంబు నాక్రమించి భీషణభంగిం జెలంగిన నయ్యఖండనిస్స్వనంబున కవిసి గతప్రాణంబు లై విహంగమంబులు మింట నుండి పుడమిం బడియెఁ గుంభకర్ణుం డంతకు మేల్కొనకున్నం జూచి. 1172

రాక్షసులు కుంభకర్ణుఁడు మేలుకొనుటకు నానావిధప్రయత్నములఁ జేయుట.

చ. అసురగణంబు లుగ్రపరిఘాశనిపట్టిసశూలఖడ్గము

ల్ముసలముసుంఠిముష్టితలముద్గరము ల్పృథుశైలశృంగము
ల్విసుకక పూన్చి బాహుబలవేగమునన్ సుఖసుప్తుఁ డైనరా
క్షసపతిఁ గుంభకర్ణు నతిసాంద్రముగాఁ బ్రహరించి రొక్కటన్. 1173

ఉ. ఆయసురాన్వయప్రవరుఁ డంతకు మేల్కొనకున్నఁ జూచి దై
తేయకు లూర్పుగాడ్పులకు ధీరత ముంగల నిల్వలేక వే
పాయుచుఁ దన్మహాశ్రవణభాగములం బదివేల రాక్షసు
ల్వ్రేయఁ దొడంగి రొక్కమొగి విశ్రుతఘోషవిశాలదుందుభుల్. 1174

క. కొందఱు శంఖము లొత్తిరి, కొందఱు పణవములు భూరికుంభగణంబు
ల్పొందుగ వాయించిరి మఱి, కొందఱు కర్ణములలోన ఘోషించి రొగిన్.

చ. తనువుల వ్రేసియున్ గదలఁ దన్నియు మోఁదియుఁ గాళ్లఁ జేతులం
గర మురుదార నుట్టియు నఖంబుల వ్రచ్చియు దంతపంక్తులం
గఱచియుఁ బెక్కుచందములఁ గాఱియపెట్టియు నప్పు డానిశా
చరగణనాథు మేల్కొలుపఁజాలక చిక్కిరి దైత్యు లందఱున్. 1176

ఉ. వెండియు నూరకుండినఁ బ్రవీణత గల్గునె యంచు దైత్యులు
ద్దండభుజావలేపమున దారుణకర్మ మొనర్పఁ బూని వే
దండములన్ ఖరోష్ట్రముల నశ్వములం బయిఁ ద్రొక్కఁ బంచి బల్
దండకశాంకుశంబులఁ జలంబున వ్రేసిరి మిక్కుటంబుగన్. 1177

చ. విడువక తీక్ష్ణశూలముల వ్రేయుచుఁ గాష్ఠకటంకరంబులం
బొడుచుచు రాళ్ల రువ్వుచును బుంఖగదాముసలాసిపంక్తిచే
నడుచుచుఁ గూటముద్గరమహాపరిఘంబులఁ జాల మోఁదుచుం
గడువడిఁ జేసి రొక్కమొగి గాఢనిరంతరవాద్యఘోషముల్. 1178

ఉ. ఆపటునిస్వనంబున ననాచలసాగరసౌధపాలికా
గోపురసాలసద్మగృహకుడ్యసమేతముగాఁ గలంగి లం
కాపుర మంతయుం బులుఁగుకై వడిఁ జాలఁ జలించె గాని యా
పాపపురక్కసుం డపుడు ప్రక్కఁ గదల్పక యుండె నెంతయున్. 1179

తే. అంత బలవంతు లైనదోషాటు లతని
శ్రవణములఁ జేరి మృష్టకాంచనవిశాల
దండములఁ గొని జగములగుండె లవియ
మించి భేరులు వేయి వాయించి రపుడు. 1180

క. ఈరీతి నెంతఁ జేసిన, సారససంభవునిఘోరశాపంబున దే
వారాతివంశవర్యుఁడు, ధీరుఁడు రాక్షసుఁడు నిద్ర దెలియక యున్నన్. 1181

వ. అత్తెఱంగాలోకించి రాక్షసులు మహాక్రోధసమావిష్టులై భీమపరాక్రమంబున సర్వప్రాణంబుల నతిప్రయత్నంబున నీలాంజనచయాకారుం డగుకుంభకర్ణునిం బ్రబోధించుటకు మహాద్భుతకర్మంబు గావింప సమకట్టి విక్రమించి. 1182

సీ. శిరమందు నురమందుఁ బరుషగాత్రములందుఁ దఱుచుగా గిరిశృంగతరులు వైచి
పొంగఁ గాచిననూనెబుంగలఁ గొని తెచ్చి శ్రోత్రరంధ్రములలోఁ గ్రుమ్మరించి
పటురజ్జుబంధనబద్ధఘోరాకారదీర్ఘశతఘ్నులఁ దిరుగ వ్రేసి
దీర్ఘంబు లై నిక్కి దివితోడ నొరసెడు దట్టంపుమీసాలు పట్టి పెఱికి
తే. కఠినకూటముద్గరములఁ గడియ మోఁది
క్రకచములఁ గోసి ఘనకుఠారముల నఱికి
విక్రమించిన నమ్మహాశక్రరిపుఁడు
మేలుకొన కున్న వీక్షించి చాలఁ గినిసి. 1183

క. దోషాటప్రవరులు కడు, రోషంబున వానరాజరురుసంఘముల౯
భీషణవై ఖరి నపుడా, దోషాచరుమీఁదఁ దోలి ద్రొక్కించి రొగిన్. 1184

వ. ఇట్లనేకప్రకారంబుల నొప్పించిన నక్కుంభకర్ణుండు బహుప్రయత్నంబునఁ గొండొకసేపునకు మేల్కని గిరిశృంగవృక్షంబులఁ దాడితుం డయ్యును దద్వపుల ప్రహారంబులు చింతింపక యావులించి నీల్గి నిద్రాక్షయంబువలన నధికక్షుత్పిపాసాపీడితుం డై శీఘ్రంబున లేచి నాగభోగాచలశృంగకల్పంబులును గిరిశృంగసారంబులు నగుబాహువుల విదిర్చి కాలమేఘంబున నుండి వెలికి నిగుడు శంపాలతికచాడ్పున దీప్తాగ్నిజ్వాలాసంకాశయు విద్యుత్సదృశదీధితియు నగు దీర్ఘజిహ్వ వెలికి నిర్గమింప బడబాముఖసన్నికాశం బైనవికృతవదనంబు దెఱచి యావులించి ప్రదీప్తంబు లగుమహాగ్రహాంబుకరణి మహానేత్రంబులు వెలుంగ నాసీనుం డైన నతని విలోకించి రాక్షసులు తాము దెచ్చిననానావిధానంత సర్వభక్ష్యంబులు సమర్పించిన నక్కుంభకర్ణుండు వరాహమహిషమాంసంబులు నోదనంబును బుష్కలంబుగాఁ గుడిచి శోణితంబును మేదఃకుంభంబులను మద్యంబును యథేష్టంబుగాఁ గ్రోలి సంతృప్తుం డయ్యె నప్పు డతనిఁ దృప్తుం డైనవానిఁ గా నెఱింగి భయంబు వదలి నిశాచరు లంద ఱతనికడకుం జనుదెంచి శిరంబులు పాదంబులు సోఁకం బ్రణతు లై యాతనిం బరివేష్టించి రంత నన్నిశాచరశ్రేష్ఠుండు నిద్రావిశదనేత్రుం డగుటవలనఁ గలుషీకృతలోచనుం డై ప్రబోధంబున కచ్చెరు వందుచు రాక్షసుల నందఱిఁ గలయ నవలోకించి సాంత్వవాక్యంబుల మన్నించుచు నిట్లనియె. 1185

—— కుంభకర్ణుండు మేలుకొని రాక్షసులను దన్ను మేలుకొల్పుటకుఁ గారణం బడుగుట. ——

సీ. ఏనేల మీచేత నిపు డకారణముగా ధీరత సంప్రబోధితుఁడ నైతి
భయమించుకయు లేక పంక్తికంధరుఁడు మాయన్నసుఖాత్ముఁడై యున్నవాఁడె
పరులచే నొక్కింత భయము వాటిల్లినచందంబు దోఁచెడు సత్వరముగ
నది యెట్టిదో చెప్పు డా దైత్యనాథుని దిగులు వ్రేల్మిడిలోనఁ దీర్చి పుత్తు
తే. నల్పకార్యంబునకు రాక్షసాధిపుండు
ననుఁ బ్రబోధితుఁ గావింపఁ బనుపఁ డనలుఁ

బలిపుఁడనో శక్రు ద్రుంతునో యెఱుఁగఁ జెపుఁడు
మీ రిపుడు మత్ప్రబోధనకారణంబు. 1186

వ. అని యిట్లు సంరబ్ధుం డై పలికిన మహాబలుం డగుకుంభకర్ణునివాక్యం బాకర్ణించి
రాజసచివుం డగుయూపాక్షుండు బద్ధాంజలిపుటుం డై యి ట్లనియె. 1187

యూపాక్షుఁడు రావణునకుం బాటిల్లినయాపదను గుంభకర్ణున కెఱింగించుట.

సీ. రాక్షసనాథుండు రామునిపత్నిని మచ్చరంబునఁ జెఱఁ దెచ్చుటయును
జగతీశుపంపున నగచరుఁ డొక్కఁడు వారిధి తరియించి వచ్చి లంక
సొచ్చి జానకిఁ జూచి సురుచిరవనభంగ మొనరించి పెక్కండ్ర దనుజవరుల
ఖండించి పుర మెల్లఁ గాల్చి పోవుటయును వింటిరె కద మీరు వీరవర్య!
తే. దానవేంద్రుఁడు వానరసేనఁ గూడి
జలధి లంఘించి వచ్చి ప్రచండభంగి
లంక నరికట్టుకొని నిరాటంకమహిమఁ
గదనమున దైత్యవరులఁ బెక్కండ్రఁ దునిమె. 1188

ఉ. పన్నగసిద్ధసాధ్యమునిపక్షిసురాసురయక్షకోటిచే
నెన్నఁడుఁ బోరులందు భయమింత యెఱుంగనిమాకు నేఁడు వీ
రోన్నతుఁ డైనరాఘవనృపోత్తముచే నిటు దీర్ప రానియీ
పన్నత వచ్చె మమ్ము సురభంజన చేకొని యుద్ధరింపవే. 1189

తే. దైత్యదానవదేవసంతతులవలనఁ
బ్రథనములఁ గల్గుభయ మింత భయము గాదు
మనుజుఁ డింతకు వచ్చెఁ గ్రమంబు దప్పి
యే మనఁగ వచ్చు నాతనిదీమసంబు 1190

క. గిరిసన్నిభు లగుకీశులు, గురుబలముల లంకఁ జుట్టుకొని సమదగతిం
బరువడి రాత్రిచరులఁ గా,వరమున భంజించుచున్నవా రసురవరా. 1191

మ. అరుదారన్ నవవజ్రదంష్ట్రుఁడు విరూపాక్షుండునుం గృత్తశ
త్రురిపుస్తోముఁ డకంపనుం డఖిలరక్షస్సైన్యపాలుండు దు
ర్భరతేజుండు ప్రహస్తుఁడుం గెసి రుక్ష్యద్బాహుసత్త్వప్రశ
స్తరణాకంపితవీరవానరులచే సంగ్రామరంగంబునన్. 1192

చ. అనిమిషసిద్ధసాధ్యపతగాహులచేతఁ బరాజయం బెఱుం
గనిదనుజేశ్వరుండు దశకంఠుఁడు నిన్న మహారణంబులో
దినకరతేజుఁ డైననరదేవునిచేఁ గడుఁ బ్రాణసంశయం
బునఁ బ్రవిముక్తుఁ డయ్యెఁ దనపూర్వభవాపద నేమి చెప్పుదున్. 1193

క. మున్నెన్నఁ డిట్టిచోద్యము, గన్నది లే దసురవర్య కాకుత్స్థుఁడు మీ
యన్నను వధింపఁ దలఁకొని, యున్నాఁ డన్నిగులు విభున కుడుపఁగవలయున్.

వ. అని విన్నవించిన సంగ్రామంబున నన్నపరాజయంబు విని కుంభకర్ణుండు వివృత్త
నేత్రుండై గ్రక్కున యూపాక్షున కిట్లనియె. 1195

క. దనుజోత్తమ యే నిప్పుడె, చని దారుణకీశసైన్యసంయుక్తముగా
జనపతులఁ దునిమి విజయము, గొని వచ్చెద నవల దశముఖుం బరికింపన్.

క. సురవైరివిభుఁడు మెచ్చఁగఁ, దరుచరవరమాంసశోణితంబులచేఁ గ
ర్బురులకుఁ దృప్తి యొనర్చెద, ధరణీశులరుధిర మేను ద్రావెదఁ గడిమిన్.

వ. అని పలికిన సగర్వితంబును రోషవివృద్ధదోషంబు నగుకుంభకర్ణునివచనంబు
విని నైరృతయోధముఖుం డగుమహోదరుఁ డంజలిగీలించి రాక్షసేంద్రా రావణు
వచనంబు విని గుణదోషంబులు విమర్శించి యవ్వలఁ బగతుల జయించుట
యుక్తం బని తోఁచుచున్నదైనను మీవచనంబు రావణునకుం జెప్పి తదీ
యాభిప్రాయం బెఱింగి వచ్చుటకుఁ దగినరాక్షసులం బంచెద నందాఁక నను
గ్రహింప వలయు నని పలికి యతనిచేత ననుజ్ఞ వడసి కొందఱ రాక్షసుల రావ
ణునిపాలికిం బనిచి తక్కినరాక్షసులుం దానును భీమాక్షుండును భీమపరాక్ర
ముండు నగుకుంభకర్ణునిం బరివేష్టించి కొలిచి యుండె నంతఁ గుంభకర్ణ
ప్రేరితులైననిశాచరులు శీఘ్రంబున దశగ్రీవనివేశనంబునకుం జని పరమాస
నస్థుం డైనయతని సముచితంబుగా సందర్శించి కేలుదోయి ఫాలంబునం
గీలించి యిట్లనిరి. 1198

శా. దేవా దేవరవారితమ్ముఁడు మహాధీరుండు త్వత్పాదసం
సేవాసక్తుఁడు కుంభకర్ణుఁ డట మాచే బోధితుం డయ్యె నా
త్రోవం బోరికిఁ బోవుటో యిచటికిం దోడ్తోడ నేతెంచుటో
ప్రావీణ్యంబునఁ దెల్పుఁడీ భవదభిప్రాయంబు తెల్లంబుగన్. 1199

తే. అనిన విని హృష్టుఁ డగుచు దశాననుండు
దానవులఁ జూచి మీర లాదనుజవర్యు
నాకడకుఁ దోడితెండు వినమ్రుఁడైన
వాని వీక్షించి పూజింప వాంఛ వొడమె 1200

చ. అనిన మహాప్రసాద మని యారజనీచరు లెల్లఁ గ్రక్కునం
జని ఘటకర్ణుఁ గన్గొని నిశాచరవంశవరేణ్య మిమ్ము నె
మ్మనమునఁ జూడఁ గోరె సురమర్దనశీలుఁడు రావణుండు వే
చని వినయోక్తులం బతికి సమ్మదము న్గలిగింపుఁ డింపుగన్. 1201

## కుంభకర్ణుఁడు రావణునికడకుఁ బోవుట.

చ. అన విని కుంభకర్ణుఁడు బలాధికుఁ డారజనీచరేంద్రశా
సనము నెఱింగి మంచి దని శయ్య రయంబున డిగ్గి క్షాళితా
ననకరపాదుఁడై తనమనంబున సంతస మంకురింప నూ
తనరుచిరావతంసపరిధానములం గయిసేసి గ్రక్కునన్. 1202

వ. రావణునిశాసనంబున రాక్షసులు బలవృద్ధికరం బైనమాంసంబును నానావిధ
మద్యకుంభంబులును సమర్పించిన నతండు యథేష్టంబుగా మాంసంబు భుజి
యించి రెండువేలఘటంబులమద్యంబు గ్రోలి యీషత్సముత్కటుండు నుమత్తుం
డును దేజోబలసమన్వితుండును బరమసంహృష్టుండును గాలాంతకయమోప
ముండును నై రయంబున ననేకరాక్షసులు తన్నుం బరివేష్టింప నుగ్రుండు నిజ
కరంబులచేత ధరణీతలంబుం బోలెఁ దనుచ్ఛాయల రాజమార్గంబుం బ్రకా
శింపఁ జేయుచు ఘటితాంజలు లై యిరుగెడలఁ జాలుఁగొనియున్నరక్కసులఁ
జెక్కంట్ర నవలోకించుచు నిజతేజంబున నాదిత్యుని సంస్పృశించుచు విరించి
భవనంబునకుం జనుశతమన్యునిమాడ్కి రావణునిమందిరంబునకుం జనియె నిట్లు
శైలశృంగకల్పుం డై యప్రమేయుం డై కిరీటశోభితుం డై యద్భుతదర్శనుం
డై వివృద్ధకాయుం డై రాజమార్గంబునం జనుదెంచుచున్నకుంభకర్ణు నవలోకిం
చి బహిస్థితు లైనవానరయూథపు లెల్ల భయకంపితశరీరు లై రయంబునఁ
గొందఱు రాముని శరణంబు నొందిరి కొందఱు మూర్ఛాక్రాంతు లై పుడమిం
బడిరి కొందఱు గిరిగహ్వరంబుల డాఁగిరి కొందఱు దిక్కులకుం బఱచి రిట్లు
భయార్దితు లై పఱచువానరుల నవలోకించి మహాతేజుం డగురాముండు వారి
కందఱకభయం బొసంగి కిరీటాలంకృతుం డై మహాకాయుం డై పర్వతాకార
దర్శనుం డై నతోయాంబుధరసంకాశుం డై కాంచనాంగదభూషణుం డై తొల్లి
గగనంబునిండిన నారాయణునిమాడ్కిఁ జూడ్కికి వ్రేఁగగుచు వచ్చుచున్న
రాక్షసశ్రేష్ఠుం డగుకుంభకర్ణునిం జూచి విస్మయంబు నొందుచు నధికవ్యథన్వుం
డై రాక్షసపుంగవుం డైనవిభీషణు నవలోకించి యిట్లనియె. 1203

రావణునికడకుఁ బోవుకుంభకర్ణునిం జూచి వానరులు భీతిల్లుట.

సీ. రాక్షసవర్య పర్వతసన్నికాశుఁ డై కనకకిరీటి యై కపిలనేత్ర
ములు గల్గి చంచలాకలితనీలాభ్రంబుకై వడి లంకలోఁ గ్రాలుచున్న
వాఁ డెవ్వఁ డిలకుఁ గేవల కేతుభూతుఁడు వీఁడొక్కఁ డని తోఁచె వీనిఁ జూచి
హరులు భయంబునఁ బఱుగెత్తుచున్నవా రెది మహాభూతమో త్రిదశరిపుఁడొ

తే. యెన్నఁడును మున్ను కని విన మిట్టిభూత
మితనిచంద మంతయు విన నిచ్చ గలిగెఁ
దెలుపు మన నవ్విభీషణుం డలఘువీర్యుఁ
డింపు సొంపార రఘుపతి కిట్టు లనియె. 1204

విభీషణుఁడు రామునకుఁ గుంభకర్ణవృత్తాంతము సెప్పుట.

మ. అనఘా వీఁడు ప్రతాపవంతుఁడు గిరీంద్రాకారుఁ డింద్రుం గృతాం
తుని సంగ్రామమున జయించినమహాదోర్దర్పుఁ డావిశ్రవ
స్తనయుం డుగ్రుఁడు కుంభకర్ణుఁడు దశాస్యభ్రాత క్రూరుండు మే
దినిలో నీతనిఁ బోలినట్టిఘనుఁ డై తేయుండు లేఁ డెన్నఁగన్. 1205

ఉ. ఈతనిచే రణంబున ననేకులు దానవయక్షకిన్నరు
  ల్బ్యాతములుర్ ఫణుల్ దితిజులుం బతగాదులు చచ్చి రుగ్రుఁ డై
  యీతఁడు చేత శూలము వహించినఁ జూచి సురాసురు ల్భరం
  బాతతభీతి మైఁ బఱతు రంతకుఁడో యని విహ్వలించుచున్. 1206

క. బలసూదనాదు లితనికిఁ, దలఁకుచు సేవింతు రుగ్రదర్పుఁడు ధరలో
  బలవంతుఁ డనఁగ నీతఁడె, గలుగఁడు వేఱొకఁడు వీనికంటె నధికుఁడున్. 1207

వ మఱియు నిద్దానవుండు స్వభావంబునఁ బరాభిభవస్వామర్థ్యవంతుండు మహా
  బలుం డన్యరాక్షసులు వరదానకృతబలశాలు లిమ్మహాత్ముండు పుట్టినప్పుడె
  క్షుధార్తుండై యనేకసత్వసహస్రంబులం బట్టి మ్రింగం దొడంగిన సర్వభూతం
  బులు భయపీడితు లై శక్రునిశరణంబు నొంది రాక్షసకృత్యం బెఱింగించిన
  నతండు కోపించి కఠోరం బైనవజ్రాయుధంబున వ్రేసిన నతండు శక్రవజ్రాభిహ
  తుం డై మిక్కిలి సంక్రుద్ధుం డై భూనభోవలయంబు కంపింప నొక్క మహానా
  దంబుఁ జేసి రయంబున నైరావణమహానాగదంతంబుఁ బెఱికి వాసవునియురం
  బున వ్రేసిన నతండు కుంభకర్ణప్రహారార్తుఁ డై చలించి కొండొకసేపునకుఁ దె
  లివొంది విషాదంబు నొందుచుఁ దనయట్లు విష్ణు లైన దేవర్షిబ్రహ్మర్షిసురసిద్ధ
  సాధ్యులం గూడి బ్రహ్మకడకుం జని యిట్లనియె. 1207

శా. వాణీనాయక కుంభకర్ణుఁ డనుగీర్వాణారి యొక్కండు గీ
  ర్వాణశ్రేష్ఠులఁ దోలుచుం బ్రజల శేవ న్మ్రింగుచు న్దానవ
  శ్రేణిం బట్టి వధించుచు న్వసఁ బరస్త్రీలం జెఱ ల్పట్టుచుర్
  క్షోణి న్ఋశ్యవనంబు నాగజగము న్ఘోరాడుచున్నాఁ డాగిన్. 1209

క. సారససంభవ దినదిన, మీరీతిం బ్రజల మ్రింగె నేనియు లోకం
  బూరక శూన్యం బై చెడుఁ, గారుణ్య మెలర్ప మమ్ము గావు రయమునన్.

చ. అన విని పద్మగర్భుఁడు దయారసపూరితచిత్తుఁ డై రయం
  బునఁ జనుదెంచి మోగ్రలఁ బెనుభూతముకై వడిఁ గ్రుద్ధుఁ డై ప్రజం
  దనియఁగఁ బట్టి మ్రింగుచు మదంబున వచ్చెడుకుంభకర్ణునిం
  గనుఁగొని మోమునం గినుక గన్పడఁగాఁ బరుషోక్తి నిట్లనున్. 1211

తే. రాక్షసాధమ నీవు విశ్రవునిచేత, నిఖిలభువననాశమునకు నిర్మితుండ
  వైతి గావున నీవు నేఁ డాది గాఁగఁ, జచ్చినట్లు నిద్రింపుము సంజ్ఞ మఱచి.

తే. అనుచుఁ బరమేష్ఠి శపియింప నసురవరుఁడు
  బ్రహ్మశాపాభిభూతుఁ డై పడియె నుర్వి
  నంత రావణుఁ డధికవిభ్రాంతుఁ డగుచు
  నంజలి ఘటించి ధాత కి ట్లనుచుఁ బలికె.

తే. నలువ మనుమని శపియింప న్యాయ మగునె
  తాను బెంచినకాంచనతరువు తాన

కరుణ మాలి ఫలించెడుకాలమందుఁ
బెటికి వైతురె యింత కోపింప నేల. 1214

వ. దేవా మీవచనం బమోఘంబు గావున నితండు నిక్కంబుగా నిద్రింపం గలం డితనికి జాగరంబులయందుఁ గాలనిరూపణంబు గావింపుఁడనిన నవ్విరించి కరుణించి యాఱుమాసంబుల కొక్కనాఁడు మేల్కాంచి బుభుక్షితుం డై యితండు లోకంబులం జరించుచు వ్యాత్తాననుండై సంక్రుద్ధుం డై నపావకునిభంగి నిఖిలభూతంబుల భక్షించుం గాక యనిపల్కె నిప్పుడు రావణుండు భవత్పరాక్రమభీతుం డై వ్యసనంబు నొంది కుంభకర్ణుని మేల్కొల్పిన నతండు సంక్రుద్ధుండై శిబిరంబు నిర్గమించి భీమపరాక్రమంబునే వానరుల భక్షించుటకు వచ్చుచున్నవాఁ డితనిం జూచినంతనె వానరులు భయభ్రాంతు లై కనుకనింబఱచుచున్నవా రింక రణంబునకు డాసినప్పు డితని నేమి వారించెద రిది యొక్కమహాయంత్రం బని వానరులకుం జెప్పు మది యొక్కటి నిక్కం బని నమ్మి నిర్భయులై యుండెద రని పలికిన హేతుమంతంబును సుముఖోద్గతంబు నై నవిభీషణునివచనంబు విని రాఘవుండు సేనాపతి యగునీలు నవలోకించి యి ట్లనియె. 1215

చ. అనలకుమార నీవు రయ మారఁగ నేగి సమస్తసేనలన్
మొనలు ఘటించి యగ్గవకులన్ వరణంబుల సంక్రమంబులన్
మునుమిడి యడ్డగించి నగము ల్గిరిశృంగములుం గరంబులం
గొని బలవంతు లై నప్లవగు ల్వసియించెదున ట్లొనర్పుమా. 1216

క. అని నిర్దేశించిన న,వ్వనచరబలనాథుఁ డై నవహ్నిసుతుం డా
జనపతి చెప్పినక్రియఁ జ,య్యన నాజ్ఞాపించె వానరావలి కెల్లన్. 1217

తే. అంత శరభుండు హనుమంతుఁ డంగదుండు
నలగవాక్షుండు ఘోరశిలాద్రివృక్ష
పాణు లై పెద్దకొండలపగిది లంకఁ
గలబహిర్ద్వారముల నరికట్టి రపుడు. 1218

క. తక్కినహరివరు లందఱు, నుక్కున జితకాశు లగుచు నురుపాదపముల్
గ్రక్కునఁ గొని పరవాహిని, కక్కజముగ భయముఁ బొడమున ట్లుండిరొగిన్.

వ. ఇట్లు శైలోద్యతదీప్తహస్తం బైనవీరవానరవాహినీసందోహంబు గిరిసమీపానుగతం బైనమహాభ్రపటలంబుచందంబున నందం బగు చుండె నంత. 1220

సీ. నిద్రామదాకులనేత్రుండు పరమదుర్జయుఁడు దురంతవిక్రముఁడు కుంభ
కర్ణుండు ఘోరరాక్షససహస్రపరీతుఁడు డై నిజప్రభలచే నతిశయముగ
సముదగ్రరాజమార్గము వెలిగించుచుఁ బురసతీకరము క్తపుష్పవృష్టిఁ
దోఁగుచు సౌధపంక్తులు వడి దాఁటుచు నరిగి మహోన్నతం బైనదాని
తే. విపుల మగుదాని మణిజాలవితత మైన,దాని భాస్కరదర్శనం బైనదాని
రమ్య మగుదాని శుచిభంగిఁ గ్రాలుదాని, రాక్షసేంద్రునినగరు సేరంగ నేఁ

—కుంభకర్ణుఁడు రావణునిం జూచుట.—

వ. సూర్యుండు మహాభ్రపటలంబు ప్రవేశించినకరణి నమ్మహానీయమందిరంబు ప్రవేశించి పదన్యాసంబుల మహీతలంబు కంపింపఁ గక్ష్యాత్రయం బతిక్రమించి పుష్పకవిమానాగ్రఘటితరుచిరాసనంబునఁ బరమోద్విగ్నుం డై కూర్చుండి యున్న రావణునిఁ జేరం జనియె నప్పుడు తనకడకుం జనుదెంచుచున్న కుంభకర్ణు నవలోకించి దశగ్రీవుండు సంహృష్టచిత్తుం డై రయంబున లేచి యెదుర్కొని గాఢంబుగాఁ బరిరంభించి పరమాసనంబుఁ గూర్చుండ నియోగించిన మహాబలుం డగుకుంభకర్ణుండు రావణునిచేతఁ బ్రత్యుద్గతుండును సంపరిష్వక్తుండును యథావదభినందితుండు నై పర్యంకమధ్యంబున నుపవిష్టుం డై న యన్న చరణంబుల కభివందనంబు గావించి తదుపదిష్టకాంచనాసనంబున నాసీనుం డై క్రోధారుణితలోచనంబుల రావణుని వీక్షించి యిట్లనియె. 1222

తే. అసురనాయక నీచేత నవసరంబు
దెలియ కే నేల సంప్రబోధితుఁడ నైతి
నవని నెవ్వానివలన భయంబు గలిగె
జెప్పు మెవ్వఁడు జముపీడు చేరఁ దలఁచె. 1223

క. అని పలికినఁ గ్రుద్ధుం డగు, ననుజన్మునిఁ గుంభకర్ణు నతిబలు నీష
ద్ఘనవృత్తనేత్రములచేఁ, గనుఁగొని యిట్లనియెఁ బంక్తికంఠుఁడు కినుకన్.

చ అనిశము బ్రహ్మశాపమున నర్థి సుఖంబుగ నిద్రవోవుచుం
బెనుపుగ నాకుఁ బాటిలినభీతి నొకింత యెఱుంగ వీవు నేఁ
జనివడి రామభూధవునిపత్నిని బంకజనేత్ర జానకి
వనమున నుండి మున్ను గొని వచ్చుట యంత యెఱుంగుదే కదా. 1225

—రావణుఁడు తనకు సంభవించినవిపత్తును గుంభకర్ణున కెఱింగించుట.—

ఉ. ఆవసుధేశ్వరుం డిపు డనంతవనాటబలాభిగుప్తుఁ డై
వావిరి సేతుమార్గమున వారిధి దాఁటి బలాఢ్యుఁ డైన సు
గ్రీవునిఁ గూడి పావకునిరీతి వెలుంగుచు లంకఁ జేరి బా
హావిభవం బెలర్ప దివిజారులఁ ద్రుంచుచు నున్నవాఁ డొగిన్. 1226

తే. కడు సుఖంబుగ సేతుమార్గమున జలధి, దాఁటి వచ్చి ప్రచండవనాటసైన్య
మొప్పుచున్నది లంకావనోపవనము, లందు రెండవతోయధిచంద మొంది.

తే. మొనసి దైత్యులలోఁ గడు ముఖ్యు లెవ్వ
రట్టివా రెల్ల నిహతు లై రాజిలోన
వానరబలంబులో నొక్కఁ డైన మడియఁ
డరయ నిది యేమి చిత్రమో యెఱుఁగ రాదు. 1228

క. మున్ను కపులు బవరంబున, నెన్నఁడు పరాజయం బొకింత యెఱుఁగన
ట్టున్నా రది కారణముగఁ, గ్రన్నన సాధ్వసము వొడమె రాక్షసవర్యా. 1229

ఉ. తమ్ముఁడ యేమి చెప్పుదుఁ గదా శరథుం డనిలోన నిన్న క్రో
ధమ్మున నాథుజీవితము దక్కఁ గొనం దగునట్టిదారుణా
స్త్రమ్ము లనేకము ల్పఱపి దైవవశంబునఁ జంప కింటికిం
బొమ్మని దిట్టయై విడిచి పుచ్చినఁ బ్రాణముతోడ వచ్చితిన్. 1280

రావణుఁడు తన్ను రక్షింపు మని కుంభకర్ణుని వేఁడుట.

క. భూపాలసుతులఁ గీశుల, నేపార వధించి శౌర్య మేర్పడ నాకీ
యాపద గడవం బెట్టుట, కై పనిపడ బోధితుండ వైతివి నాచేన్. 1281

ఆ. వీరవర్య బాలవృద్ధావశేషిత, యైనలంకఁ బ్రోవు మస్మదర్థ
మందు ఘోరకర్మ మాచరించి నిశాట, వంశమందుఁ గీర్తి వడయు మిపుడు.

క. నీ వెన్నఁడు మును నాచే, నీవిధమున నడుగఁ బడియు నెఱుఁగవు నీకున్
నావంకఁ గూర్మి గలుగుట, కీవాక్యము విని యొనర్పు మిదియె ఫల మగున్.

చ. అనిమిషదైత్యయుద్ధముల నద్భుతభంగి ననేకవారము
ల్దనుజుల నిర్జరోత్తములఁ దప్పక దోలి జయంబు గొన్నన
ద్విగుణితబలుండ వాబలము తేజము సర్వము నేఁడు చూపు మే
మని వచియింతు నీకు సరి యైనబలాఢ్యుఁడు లేఁడు ధారుణిన్. 1284

చ. అనిలుఁడు తీవ్రవేగమున నభ్రములం బలె నీవు దోర్బలం
బున విపినాటసైన్యముల భూరిరణంబునఁ బాఱఁ దోలి క్ర
ద్ధన నృపపుత్త్రులం దునిమి తద్దయు నాకు జయం బొసంగి గ్ర
న్నన ఘనకీర్తి నొందుము రణప్రియ మత్ప్రియబాంధవప్రియా 1285

కుంభకర్ణుఁడు రావణునకు రాజనీతి సెప్పుట.

వ. అని పలికిన రాక్షసనాయకుం డగు రావణునిపరిదేవితంబు విని కుంభకర్ణుండు
మనంబున గర్హించుచు నతనిం జూచి దేవా మున్ను మంత్రనిర్ణయంబునందు
మాచేత నేదోషంబు సందృష్టం బయ్యె హితులయిం దనభియుక్తుండ వైన
నీచేత నాదోషంబు సమానాదితంబయ్యె దుష్కృతకర్ముం డగుపురుషున కెట్లు
నిరయంబులయందుఁ బతనంబు గలుగు నట్లు నీకు సీతాహరణరూపపాపకర్మ
ఫలంబు శీఘ్రంబున సంప్రాప్తం బయ్యెఁ గేవలవీర్యదర్పితుండ వైననీచేత నీ
పాపకర్మవిధానంబునకంటె ము న్నీరామాగమనలంకాదాహాదికంబును దోషో
త్పాదంబును ఫలత్వంబున నవిచారితంబు లయ్యెఁ బ్రేక్షావంతుం డగుపురు
షునిచేత మొదల విచారించి పిదపఁ గర్మం బాచరింపం దగు నది నీచేత విపరీ
తముగాఁ గృతం బయ్యె నెవ్వం డైశ్వర్యమత్తుండై పూర్వకాలకర్తవ్యకార్యం
బు లుత్తరకాలంబున నుత్తరకాలకర్తవ్యకార్యంబులు పూర్వకాలంబున నాచ
రించు నతండు నయానయజ్ఞుండు గాఁడు దేశకాలవైపరీత్యంబునఁ గృత
కర్మంబునకు దోషంబు గలుగు ననుకూలంబు లైనను గర్మంబులు స్వోచితదే
శకాలవియుక్తంబు లై క్రియమాణంబు లయ్యెనేని యశుచిజనంబులం దిడిన

పురోడాశాదికంబులుం బోలె విపరీతంబులై విరుద్ధఫలంబు లగు మఱియు
నెవ్వండు సచివులతోడ సమయంబు చేసి నీతిశాస్త్రోక్తప్రకారంబున నాత్మోప
చయపరగ్లానిసంభవసమయక్రియమాణదండోపయోగియానరూపం బైనయు
త్తమకర్మంబు నాత్మపరబలసామ్యక్రియమాణసామసాధ్యసంధానరూపం బైన
మధ్యమకర్మంబును బరోపచయాత్మగ్లానిసమయక్రియమాణదానపూర్వసమా
శ్రయణరూపం బైనజఘన్యకర్మంబు ని ట్లుత్తమమధ్యమాధమభావంబునఁ
ద్రివిధంబు లగుకర్మంబుల దేశకాలాత్మద్రవ్యప్రయోజనసంబంధపంచవిధయో
గంబు లెఱుంగు నతఁడు సాధీయుం డగు నెవ్వండు యథాశాస్త్రంబుగాఁ
గార్యనిర్ణయం బెఱుంగఁ దలంచి సుహృదులతోడ నాలోచనంబు గావించు
నారాజు బలీయుండు మఱియు విహితపూర్వాహ్ణమధ్యాహ్నసాయాహ్న
కాలంబులందు ధర్మార్థకామంబులు ప్రత్యేకంబుగాఁ గాని ప్రాతఃకాలవిహిత
ధర్మంబును మధ్యాహ్నకాలవిహితార్థంబును బ్రాతఃకాలంబునం గాని మధ్యా
హ్నవిహితార్థంబును బ్రాతఃకాలవిహితధర్మంబును మధ్యాహ్నంబునం గాని
సాయంకాలవిహితకామంబును మధ్యాహ్నవిహితార్థంబును సాయంకాలం
బునం గాని సాయంప్రాతర్మధ్యాహ్నవిహితకామధర్మార్థంబులు సాయంకాలం
బునం గాని భజించువాఁ డుత్తముండు కేవలకామంబు సర్వకాలంబునందు
సేవించునట్టిపురుషుం డధముం డనంబడు నీధర్మార్థకామంబులయందును ద్రివిధ
పక్షంబులయందు నెయ్యది ప్రశస్తతరం బగు. దాని నెఱింగి రాజు గాని
రాజమాత్రుండు గాని యాచరింపం డట్టివానిశాస్త్రశ్రవణం బనుష్ఠానాభా
వంబువలన వ్యర్థం బగు సామదానభేదదండంబులను దద్యోగంబును దన్ని
ర్వాహానిర్వాహప్రకారంబులును ధర్మార్థకామంబులును సచివులతోడ నాలో
చించి తత్తదుచితకాలంబునందు వశీకృతమనస్కుం డై యెవ్వండు సేవించు
నతండు లోకంబునందు వ్యసనంబు నొందకుండు నెవ్వాఁడు సచివులతోడఁ
గర్తవ్యాకర్తవ్యంబులు విచారించి యర్థతత్త్వజ్ఞుం డై కార్యంబు నడుపునతండు
హితానుబంధంబు నొంది జీవించు నని యిట్లు రాజుచేత నీతివ్యతిక్రమం
బకర్తవ్యం బని పలికి నీతిబాహ్యం బైనమంత్రివాక్యంబును బరిగ్రాహ్యంబు
గా దనుతాత్పర్యంబు దేటపఱుపం దలంచి వెండియు ని ట్లనియె. 1266

సీ. అసురేంద్ర పశుబుద్ధు లై నదుష్పురుషులు తలకొని కార్యమంత్రంబునందు
నభ్యంతరీకృతు లై శాస్త్రతత్త్వంబు లెఱుఁగక నృపనీతు లెఱిఁగినట్లు
ప్రాగల్భ్యమున నీతిఁ బలుకుచుందురు చాల సిరి గోరునట్టిభూవరుఁ డశాస్త్ర
విదులు చెప్పెడుమాట విని యొనర్పఁగ రాదు కాదని చేసిన లేదు మేలు
తే. అఖిలశాస్త్రార్థతత్త్వజ్ఞు లై ననృపులు
ధార్ష్ట్యమున నహితంబు హితంబు గాఁగఁ

గలుపువారి విచారించి కార్యమంత్ర
మునకు రాకుండ వెడలంగ ననుప వలయు. 1237

చ. అనవరతం బుపాయవిదులై నయరాతులఁ గూడి మంత్రులే
వున విపరీతకృత్యములు పూని యొనర్చుచు నుండు రిట్టిదు
ర్జనులను మిత్రరూపు లగుశత్రుల మంత్రవినిర్ణయంబునం
దనువుగ భూవరుండు వ్యవహారమునం బరికింపఁగాఁ దగున్. 1238

క. పరికింపనివాఁడు మహీ, వరునిసిరియుఁ బుత్రమిత్రవర్గము బలముల్
సరిలేనిజీవితంబును, గురుతరమై భవము యశము గొబ్బునఁ బోవున్. 1239

క. వైరులు నుపసంహితసుం, త్రీరితకార్యములు సేయు నృపతుల రంధ్రం
బారసి పొత్తురు రాక్షస, వీరా ఖగము లలక్రౌంచవివరమును బలెన్. 1240

తే. రాత్రిచరవంశవర్య ధరిత్రి నెవ్వఁ
డరుల నెఱిఁగి నిషేధింపఁ డానరపతి
కాపదలు వచ్చు సంపద లవలఁ బోవు
స్థానచలనంబు కలుగు విచార మెదవు. 1241

తే. అసురవర తమ్ముఁ డోపినయంత మున్ను
నీతిఁ గఱపెను సేమంబు నెగడుకొఱకు
నీవు తెలియనివాఁడవు గావు నీకుఁ
దోఁచినవిధంబు సేయుము 'దోష మెఱిఁగి. 1242

వ. అని పలికినఁ గుంభకర్ణునివచనం బాకర్ణించి దశకంఠుండు కోపించి వికటభ్రు
కుటిదుర్నిరీక్ష్యుం డగుచు నతని కిట్లనియె. 1243

-రావణుఁడు క్రుద్ధుఁడై పరిదేవనము సేయుట.-

తే. పూజ్యుఁడై నయాచార్యుండు భూరికరుణ
శిష్యునిం బలె నన్ను శాసించె దేల
నిట్లు వాక్యమ మొందిన నేమి కార్య
మిప్పటికి యుక్త మగుదానిఁ జెప్పు మీవు. 1244

క. తెలిసియొ తెలియకయో మఱి, చలమున బలముననొ మిగిలి సలిపినపనికిం
గలగూడ కిపుడు ననుఁ దప్పులు పట్టిన నేమి కార్య మమరద్వేషీ. 1245

క. గతమునకు వగవ రార్యులు, గతము గతమె వగవ నేమి కార్యము గలుగున్
మతిమంతుఁడవై కాలో,చితగతిఁ గృతిసాధనంబు చేయు నరగునన్. 1246

సీ. యామినీచరవర్య నామీఁదఁ గడుభక్తి గలదేని బాహావిక్రముఁడ వేని
యీకార్య మంతయు నీకార్య మని నిజస్వాంతంబునందుఁ దలంతు వేని
మామకాపనయసంభవ మైనదోషంబు విపులవిక్రమమున నపనయింపు
మాపదలందు సాహాయ్యంబు గావించు నతఁడెపో బాంధవుఁ డట్టిచోటఁ

ఆ. గానివాఁడు తనకు లేనివాఁ డి త్తెఱంగు, గెలిఁగి సంగరమునఁ బరులకడిమి
దీర్చి పుచ్చి వేగ దీనుఁడ నగుచున్నఁ, గావు మవసరంబు గదియ వచ్చె. 1247

వ. అని యిట్లు సంక్షుభితేంద్రియుం డై పలికిన ధీరదారుణం బైనయతనివా
క్యంబు విని యతని రుష్టుం డైనవానిఁగా నెఱింగి కుంభకర్ణుండు వినయంబున
నాశ్వాసించుచు మెల్లన శ్లక్ష్ణవాక్యంబున నిట్లనియె. 1248

—: కుంభకర్ణుఁడు రావణు నూఱడించుట. :—

క. దనుజేంద్ర సత్త్వసంపద, మన కేమి గొఱంత యింతమాత్రమునకు నీ
మనమునఁ జింతిల నేటికి, మనుజేంద్రునివలనిభయము మాను మధీశా. 1249

క. దానవనాయక నీ విపు, డే నుండఁగ దైన్య మొంద నేటికి నీవె
ద్దాని గుఱించి తపించెద, వా నగులు హరించి వైతు నడలకు మింకన్. 1250

ఆ. శౌర్యధుర్య యేను సౌభ్రాత్రమున బంధు,భావమున నృపాలభావ్యనీతిఁ
బట్టి యిట్టిమాటఁ బలికితిఁ గా కేల, పౌరుషంబు మాని పరుల విడుతు. 1251

ఆ. చిన్ననాఁట నుండి చేసినమన్నన, కెన్ని కెక్క ధాత్రిఁ గన్నవన్నె
కమితసత్త్వమునకు సమముగా నాచేతి,బలువుఁ జూపి నేఁడు పగఱ గెలుతు.

ఉ. గ్రక్కున బాహువీర్య మలరంగ వనాటచమూకదంబముల్
దిక్కులఁ బాఱఁ దోలి నరదేవుల రాఘవుల న్వధించి వే
రుక్కునఁ దచ్ఛిరంబులు మహోద్ధతిమైఁ గొని తెచ్చి చూపి పెం
పెక్కఁగ నీకు జానకికి నిచ్చెద మోదము క్షేమముం దగన్. 1253

చ. ప్రధనములో వనాటులు నృపాలురు మత్ప్రథుదోర్బలంబునన్
నిధనము నొందుచుండఁ గని నేఁడు పురిం దమబంధువర్గ మూ
ర్జితధరణియందుఁ జచ్చుటకుఁ జింతిలు చున్ననిశాటకోటికిం
బ్రథ తగ నశ్రుమార్జన మొనర్చెదఁ జూడుము రాక్షసేశ్వరా. 1254

ఉ. రావణ నేఁడు చూడు సమరంబున నాదుభుజాబలంబునన్
దేవనగోపమానదృఢదేహుని సూర్యమహాభ్రతుల్య బా
హావిభవాభిరాముని సమస్తవనాటకులాధినాథు సు
గ్రీవునిఁ జంపి దైత్యులకుఁ బ్రీతి యొనర్తు మహాద్భుతంబుగన్. 1255

క. చలమున రామునిఁ జంపఁగఁ, దలఁచిన మత్ప్రభృతిసర్వదనుజవరులచేఁ
దలకొని రక్షితుఁ డగు నీ, కలఘుగుణా యేమి గొఱఁత యడలకు మింకన్.

తే. ఏను మున్నుగ జానకీజానిచేత, హతుఁడ నైన ని న్నవల ఘోరాజిఁ జంపు
నేను జీవించి యున్నాఁడ గాన నీకు, భయము లేదించుకైన క్షపాచరేంద్ర.

తే. అరుల నాజి వధించి జయంబు గాంచి, యధిప యేనుండ నన్యుల కాశపడఁగ
నేల నాకానతిచ్చి నేఁ డాలమునకుఁ,బనుపుము ప్రసన్నముఖుఁడవై వనట దక్క.

ఉ. వాసవకాలు రైన మఱి వహ్నినదాగతు లైన నీలకం

ళాసురవర్యు లైన ధనదాబ్ధిపు లైనను నస్త్రిక జగ
త్త్రాసనమూర్తినై రణశిరంబున రాముని వానితమ్ముని
న్నాభసురలీలఁ జంపెద క్షపాచరశేఖర చింత యేటికిన్.

క. గిరిమాత్రశరీరుఁడ నై, గురుశూలము కేలఁ బూని కోఱలు వెలికిం
బఱవఁగ మ్రోసెడునన్నుఁ గని, పురందరుం డైనఁ బాఱిపోఁడే భయమునన్.

తే. శక్తిశస్త్రయుతుండ నై సంగరమునఁ
గడిమి దీపింప శత్రుసంఘములఁ బాఱఁ
దోలునప్పుడు నామ్రోలఁ దొడరి జీవి
తాశ గలవాఁడు నిలుచునే యసురవర్య 1261

క. పరశుగదాఖడ్గంబులు, పరిఘంబులు సాయకములు పనిసేయవు సం
గరమునఁ గరములచే భీకరభంగి బలారి నైనఁ గడఁపుదు నధిపా 1262

క. నాముష్టివేగ మనిలో, రాముండు సహించె నేని క్రమ్మి యపుఁ ద
ద్భీమామోఘప్రదర, స్తోమము మచ్ఛోణితంబు సొంపుగఁ గ్రోలున్.

క. ఏ నుండ నీకు వగవం, గా నేల నిశాచరేంద్ర క్రక్కున రిపులం
బూని వధించి జయము గొని, మానుగఁ జనుదెంతుఁ బంపుమా నన్ననికిన్.

చ. దనుజవరేణ్య డెందమున ధైర్యముఁ బూనుము బాహువిక్రమం
బున బలవంతు లైన రఘుపుంగవుల న్శతపత్రమిత్రపు
త్రునిఁ బురిఁ గాల్చిపోయినమరుత్సుతు సంగదు నీలు జాంబవం
తునిఁ గపిసైన్యసంతతులఁ ద్రుంచి సమిద్విజయం బొసంగెదన్. 1265

చ. హరిహయవహ్నికాలదనుజాప్పతివాయుధనేశ్వరేశులం
దఱిమెదఁ జంద్రభాస్కరులఁ దారలఁ గూల్చెద భూదివంబులం
బఱియలు వాపెద న్నిఖిలపర్వతము ల్పొడిగా నొనర్చెదన్
శరధులు రొంపి చేసెద దిశాగజకుంభములం బగల్చెదన్. 1266

తే. అధిప చిరకాలము న్నుండ నైననాదు, విక్రమంబు విలోకించి వివిధభూత
ములు భయంబునఁ బఱవ వైరుల వధించి, మ్రింగివుచ్చెద మృత్యువుభంగి నేఁడు.

సీ. దానవవైరి భవత్సుఖార్థం బేను రణమున కేగి దుర్వారభంగి
రామలక్ష్మణభాస్కరకుమారయుతముగాఁ దరుచరవరుల నందఱ వధించి
మ్రింగి వుచ్చెద రఘుపుంగవుండు యమక్షయమున కేగిన వెన్క నవనిపుత్త్రి
నిన్ను వరించుట నిక్కువం బింతయు నాత్మలోఁ గలభయం బవలఁ ద్రోచి

తే. విజ్వరుండ వై రమియింపు వేడ్క మీఱ, సారవారుణిఁ గ్రోలుము సర్వకృత్య
ములు నొనర్పుము బలరిపుముఖ్యదివిజ, వరులఁ జేరికిఁ గొనకుము వరగుణాఢ్య.

మహోదరుఁడు కుంభకర్ణునిమతమును దూషించుట.

వ. అనిపలికిన నతికాయుం డగుకుంభకర్ణునివచనంబు విని మహోదరుండు మంత్రుల

తోడ విచారింపక రావణునిచేతఁ గృత్యంబు కృతం బయ్యె ననియు ననహా యంబుగా రామాదులతో రణంబు చేసెద ననియు నెయ్యది కుంభకర్ణునిచేత సముదాహృతం బయ్యె నయ్యుభయంబు దూషించుతలంపునఁ గుంభకర్ణు నిట్లనియె. 1269

క. అనిశం బవలిప్తుఁడ వై, పని యెఱుఁగ మనీష లేమిఁ బార్థివకులసం
జనితుఁడ వయ్యును బ్రాకృత, జనులపగిదిఁ జూడఁబడితి శౌర్యధనులచేన్.

వ. అని పలికి యతండు నయానయంబు లెఱుంగం డనునది యాదిగా రావణునుద్దే శించి కుంభకర్ణుం డాడినచందంబు పరిహరించువాఁ డై యిట్లనియె. 1271

ఉ. స్థానము దేశకాలములచందము స్వేతరతారతమ్యముం
హానియు వృద్ధియుం దెలిసి యార్యులు మెచ్చఁ జరించునట్టియీ
దానవనాయకుండు నృపధర్మ మెఱుంగనివాఁడె ముంగలం
మానక బాలభావమున మాటలు పల్కెద వీవు రాక్షసా. 1272

వ. అని పలికి లోకంబునందుఁ గాపురుషుల కైన నెయ్యది యాచరించుట కనర్హం బై యుండు నట్టికర్మంబును వివేకి యగురావణుం డెట్లు గావించు ననుతాత్ప ర్యంబు తెల్లంబు సేయుటకుఁ గ్రమ్మఱ నిట్లనియె 1273

క. కేవలమూర్ఖున కార్యుల, సేవింపనివాని కుగ్రశేముషి కైనం
గావింప రానికర్మము, భావింపఁగ బుధుఁ డొనర్పఁ బాల్పడునయ్యా. 1274

వ. అని పలికి క్రమ్మఱ ధర్మాధర్మంబులకు హితాహితసాధనత్వంబు నిశ్చయించి సీతాహరణరూపం బగుపాపంబువలన నీ కీయనర్థంబు ప్రాప్తం బయ్యె నని రావ ణునితోడఁ గుంభకర్ణునిచేత నెయ్యది పలుకం బడియెఁ దద్ధర్మాధర్మంబులందు హితాహితఫలనియమాభావంబువలన సంబంధంబు గలుగ నేర దనునభిప్రా యంబు ప్రతిపాదించుట కిట్లనియె. 1275

తే. అవని నెయ్యవి పృథగాశ్రయములు నృపుల, కనుచుఁ బలికితి వట్టిధర్మార్థకామ
ములస్వభావంబుచేతను దెలిసికొనుట, కసురవర లక్షణంబు లే దరసి చూడ.

వ. అది యెట్లనిన సుఖఫలకయాగానుష్ఠానాదిధర్మానుష్ఠానదశయందుఁ దాత్కాలిక శరీరాయాసజనితదుఃఖదర్శనంబువలనను దుఃఖజనకపరద్రవ్యహరణాద్యధర్మా చరణసమయంబునందుఁ దాత్కాలికసుఖదర్శనంబువలనను నర్థకామంబుల తె ఱంగునిట్టిదగుటవలనను ధర్మార్థకామంబులనుస్వరూపంబువలన నెఱుంగుటకుఁ బ్రమాణం బెద్దియు లేదు ధర్మార్థకామంబుల కెట్లు నియతఫలంబు లే దట్లు కర్మం బులకు నియతఫలంబు లేదు సర్వసుఖంబులకుఁ బుణ్యకర్మంబు సాధకంబని పలు కుదు రట్టిపుణ్యకర్మంబునందును దుఃఖఫలం బగుచున్నది పాపకర్మంబులకును సుఖఫలంబు గానంబడుచున్నది ధర్మార్థసాధనభూతకర్మంబులు సధర్మానర్థసాధన భూతకర్మంబులును నీచతుర్విధకర్మంబులును శ్రేయస్కరంబు లై యుండు నొ కానొకప్పు డధర్మానర్థంబులకు దుఃఖఫలంబును సుఖంబును బ్రాప్తం బగునిహ

లోకపరలోకోపయోగిధర్మార్థకామరూపకర్మఫలంబు [illegible] బగుచున్న దవ్విధంబున యథేచ్ఛాచారులను [illegible] [illegible] వించుం గావున విహితంబై శుభప్రదం బగియును [illegible] దనియును ధర్మార్థకామంబులకు ఫలనియమంబు లేదు [illegible] కుం జెల్లు నని పల్కి వెండియు నియ్యర్థంబు విమర్శించి [illegible] సీతాపహరణం బస్మదాదులచేత ననుమతం బైనయది [illegible] చుట కిట్లనియె. [illegible]77

తే. అసురపతిచే సునిశ్చితం బైనజనక, జాపహరణకర్మంబు మా కభిమతంబు యరులవిషయంబునందు సాహసము వలయు,నందుదోషంబులేకునుజారికిన్న.

వ. ఈపక్షంబునందు రావణునిచేత నచాతుర్యకృతం బాకింత యైన దర్శింపం జేయుట కశక్యం బని పలికి కుంభకర్ణకాభియానపక్షంబు నిరసించుటకు మరల నిట్లనియె.

తే. భండనంబున నే నొక్కరుండ నిప్పు
డరిగెద నటంచుఁ బలికితి వసురనాథ
యం దయుక్త మసాధ్య మత్యవహితంబు
హానియును దోఁచె నది యెట్టు లనిన వినుము. 1280

ఉ. మానుగ మున్ను రోష మభిమానము గల్గినరాక్షసు లఘ్న
స్థానకృతాలయు ల్ప్రబలదర్పులు రామునిచేతఁ జచ్చి ర
మ్మానవనాథు శూరజనమాన్యు ననంతబలాభిగుప్తుఁ డా
మానుగ నొంటి నెట్లు కదనంబున గెల్చెద వీవు రాక్షసా. 1281

తే. మును జనస్థానమందు రామునిమహోగ్ర, విశిఖరయమున కోర్వక వెఱచి వచ్చి నట్టిరాక్షసు లిప్పటి కడలు విడిచి,,ధైర్య మొంద లేకున్నారు దనుజవర్య. 1282

సీ. అసురనాయక నుప్తుఁ డైనవాసుకినట్లు హరిభంగి సంక్రుద్ధుఁ డైనరామ
మనుజేంద్రు నజ్ఞానమునఁ బ్రబోధింపంగఁ దలఁచితి వతఁడు ప్రతాపవంతుఁ
డాజిదురాసదుం డగ్నికల్పుఁడు శౌర్యఘనుఁడు మృత్యువుభంగిఁ గ్రాలువాఁడు
వానిముంగలికిఁ బోవంగ నెవ్వం డోపు జగతిఁ దభిముఖుం డగుచు నుండ

ఆ. సంశయస్థ మయ్యె సర్వంబు నీమతం, బట్లు గాన నొంటి నాలమునకుఁ
బోవఁ దగదు వినక పోయిన నచ్చట, నీకుఁ గీడు వచ్చు నిక్కువముగ. 1283

తే. అరయ హీనార్థుఁ డైనవాఁ డవని నెవ్వఁ, డసురవర్య సమృద్ధార్థుఁ డైనరిపునిఁ బ్రాకృతునిఁగాఁ దలంచి నిరాకరించి, తనదుప్రాణంబు వోఁగొట్టుకొనఁగఁజూచు.

తే. వాసవసమానుఁ డెవ్వఁ డెవ్వనికి మనుజు
లందు నెవ్వాఁడు సముఁడు లేఁ డప్రతిహత
కార్ముకుం డెవ్వఁ డట్టిరాఘవునితోడ
నొంటిసంగ్రామ మొనరింప నొప్పు గలదె. 1285

-:- మహోదరుఁడు రావణునకు సీతావశీకరణోపాయం బెఱింగించుట. -:-

వ. అని యిట్లు మహోదరుండు సంరబ్ధుండై కుంభకర్ణునితోడం బలికి రాక్షసమధ్యంబున నాసీనుం డైన రావణుం జూచి రాక్షసేంద్రా నీవు కార్యసిద్ధి వడయుటకుం దగిన తెఱం గెఱుంగక విచారగ్రస్తమానసుండ వై వృథాజల్పంబులాడెదవు సీతోపస్థానకారకం బైనయొక్క యుపాయం బేనుగంటి విననభిమతం బేని సవిస్తరంబుగాఁ జెప్పెద వినుము మహోదరుండును విద్యుజ్జిహ్వుండును సంహ్రాదియుఁ గుంభకర్ణుండును వితర్దనుండును నియ్యేవురు పంచాగ్నులభంగి వెలుంగుచు రామవధార్థంబు రణంబునకు వెడలుచున్నవా రని పురంబునఁ జాటింపంబంపు మే మేవురము శీఘ్రంబునఁ జని బహుప్రయత్నంబున రామునితో రణంబు గావించెద మమ్మహాయుద్ధంబున శత్రువుల జయించితి మేని మనకు సీతావశీకరణోపాయంబువలనఁ గార్యంబు లే దట్లు గాక పగతుల జయింపఁ జాల మైతి మేని యొక్కింత సేపు రణంబు గావించి యవ్వల మనస్సమీక్షితం బైనయుపాయజాతంబు నవలంబించి నిజశరీరంబులు రామబాణవిదారితంబు లైనభంగిం గావించుకొని రుధిరసముక్షితదేహులమై రామనామాంకితంబు లైనశరంబులతోఁ గూడ సంగరంబున నుండి పురంబునకుం జనుదెంచి రామలక్ష్మణులు మాచేత భక్షితులై రని నొడువుచు భవచ్చరణంబులకుం బ్రణమిల్లెద మప్పుడు నీవు సమ్మభీష్టసత్కారంబులఁ బ్రీతులం జేసి గజస్కంధస్థితపురుషునిచేత రామలక్ష్మణులు సైన్యసమేతంబుగా మహోదరాదులచేత నిహతులై రని పురంబు నల్గడల ఘోషింపం బంచి కపటసంప్రీతి కల్పించుకొని భృత్యులకు దాసదాసీజనంబులకు యథేష్టంబుగా రత్నాభరణసువర్ణవస్త్రాదు లొసంగి వీరులకు మాల్యానులేపనంబు లొసంగి యోధులకు మద్యంబుఁ బోయించి సముదితుండవై మద్యంబు గ్రోలు మంతట రాముండు సుహృత్సమేతంబుగా భక్షితుం డయ్యె ననుజనవాదంబు బహులంబై దశదిశల మ్రోయు నప్పుడు నీవు వనంబు ప్రవేశించి జానకి నవలోకించి సాంత్వవాక్యంబుల ననూనయించి ధనధాన్యరత్నాద్యభిమతపదార్థంబులు సమర్పించి యద్దేవిచిత్తంబు వడయు మమ్మహీపుత్త్రి సంపాదితభయశోకం బైన యీకపటోపాయంబుచేత వంచిత యై సేయునది లేక యకామ యయ్యును దొల్లి సుఖసమృద్ధయు సుఖార్హయుఁ గావున రమణీయుం డగుభర్త వినష్టుఁ డగుటం జేసి భవత్సాంగత్యంబ సుఖంబుగా నెఱింగి నైరాశ్యంబువలనను స్త్రీచాపల్యంబువలనను సర్వప్రకారంబుల భవద్వశగత యగునిది నాకుం దోఁచినయుపాయంబు వేఱొక్కవెరవున ననర్థంబు వాటిల్లుం గావున నీవు రణార్థం బుత్సుకుండవు గా వలవదు దీన సుఖలాభంబు గలుగు నెప్పం డేనియు ననష్టసైన్యంబు ననవాప్తప్రాణసందేహంబు నైనయుద్ధవ్యతిరిక్తోపాయంబునఁ బగతులం బరిమార్చు నట్టిమహీపతి యశంబును బుణ్యంబును గీర్తియుఁ జిరతరసుఖంబునుం జెందు నని పలికిన విని యక్కుంభకర్ణుం డిది యేటియుపాయం

బని మహోదరునివాక్యంబు నిందించి రావణున కభిముఖుం డై యిట్లనియె.

చ. దనుజవరేణ్య యేను భుజదర్ప మెలర్ప దురాత్ముఁ డైనయా
మనుజవరేణ్యునిం దునిమి మానక నీదుభయంబు పాపెద
న్మనమున వైరభావ మది మాని సుఖంబున నుండు మిచ్చట
న్ఘనుఁ డగుకుంభకర్ణుఁ డొకకార్య మొనర్పఁగ లేఁడె చూడఁగన్. 1287

క. శూరులు నిష్ఫలము లగు, వారిదములభంగి రాజవర్యులమ్రోలన్
ఊరక గర్జింప రహం,కారంబున నాడినంత గావింతు రిలన్. 1288

కుంభకర్ణుఁడు మహోదరుని దూఱుట.

తే. అధిప శూరులు పౌరుష మాశ్రయించి
నెగడుదురు గాని తమ్ముఁ దాఁ బొగడుకొనరు
మొదల నాత్మపౌరుషమును బదిలపఱచి
దీర్పఁ గూడనిపని యైనఁ దీర్తు రెందు. 1289

తే. విక్లబుఁడు బుద్ధిహీనుఁడు వెరవెఱుంగ, లేనివాఁడు పండితమాని యైనయట్టి
యీమహోదరుబోఁటి దుష్ప్రకృతులు పలుకు, విన్నరాజుల కాపద వేగ వచ్చు.

వ. అని పలికి మహోదరుని నాలోకించి పరుషంబుగా నిట్లనియె. 1291

ఆ. అనవగతము హితము నరయక రాజేచ్ఛ, ననుసరించి ప్రియము లాడునట్టి
యుద్ధభీరు లైనయుష్మదాదులచేత, నసురపతికి నిట్టియడలు పుట్టె. 1292

చ. హితముఖు లైనవైరు లని యింత యెఱుంగక మీ యనర్థభా
షితములఁ బట్టి యీదనుజశేఖరుఁ డైనదశాననుండు దు
ర్మతి యయి మంత్రిబాంధవపురంబులఁ గోశసుహృత్స్థలంబుల
న్హితులను బాడుచేసికొనె నింతకు మూలము మీరలే కదా. 1293

క. మీదుర్నయమునఁ బుట్టిన, యీదోషముఁ బాపుటకు నహీనద్యుతి నై
యాదరమున నిప్పుడు రణ, మేదిని కేఁ జనెద నం దమిత్రుల గెల్వన్. 1294

వ. అని పలికిన ధీమంతుం డగుకుంభకర్ణునివచనంబు విని ప్రహసించుచు రావణుం
డతని కిట్లనియె. 1295

రావణుఁడు కుంభకర్ణునిం బ్రశంసించుట.

సీ. ఈమహోదరుఁడు సంగ్రామంబున నరేంద్రశరబాధితాంగుఁ డై మరల నరికిఁ
జనుటకు భీతిల్లి సంభ్రమంబున నిట్లు వెర వెఱింగించెడు వీనిమాట
కేమి సౌహృదమున హితమున బలమునఁ ద్వత్సముం డింక నెవ్వాఁడు లేఁడు
భయనాశనార్థ మిప్పగిది నాచే నీవు సంబోధితుఁడ వైతి సత్వరముగఁ

ఆ. బ్రీతి గలిగినట్టి యాతుధానుల కెల్ల, నిదియె కాల మింత కెక్కు డెద్ది
శౌర్యధుర్య నీవు శత్రుజయార్థంబు, చనుము బలము మెఱసి సమరమునకు.

ఉ. శూలము కేలఁ బూని యలసూర్యకుమారునిభంగిఁ గోపి వై
గ్రాలెడునిన్నుఁ గాంచి రఘురాముఁడు లక్ష్మణుఁ డర్కపుత్రుఁడుం

జాల మనంబులోఁ దలఁకి సైన్యయుతంబుగఁ బాఱకుండు రే
యాలమునందు వేగ చను మద్భుతవిక్రమ శంక యేటికిన్. 1296

వ. అని పలికి యద్దశగ్రీవుండు కుంభకర్ణబలపరాక్రమాభిజ్ఞుండు గావున నతనివలన నిక్కంబుగాఁ దనకు విజయంబు గలుగు నని నిశ్చయించి తన్నుఁ బునర్జాతునిఁగాఁ దలంచుకొనుచు ముదితుం డై నిర్మలుం డగుశశాంకునిచందంబునం దేజరిల్లుచుండె నిట్లు రావణునిచేతఁ బలుకంబడినవాఁ డై మహాబలుం డగుకుంభకర్ణుండు సముద్యతుం డై శీఘ్రంబున శితంబును శత్రునిబర్హణంబును సర్వకాలాయసనిర్మితస్వరూపంబును దీప్తంబును దప్తకాంచనభూషణంబును శక్రాశనిసమంబును భీమంబును వజ్రప్రతిమగౌరవంబును దేవదానవగంధర్వయక్షకిన్నరసూదనంబును రక్తమాల్యమహాదామంబును స్వోద్గతపావకంబును శత్రుశోణితరంజితంబు నగుమహాశూలంబు గైకొని రావణున కిట్లనియె. 1297

క. ఇభహయరథభట మేటికి, సభయంబున నే నొకండ సరిగి కడిమి సంక్షుభితు లగుకపుల నందఱ, రభసంబున మ్రింగి వత్తు రాక్షసవర్యా. 1298

చ. అన విని రావణుం డనియె నాతని కిట్లనరాదు వానరుల్
ఘనభుజు లుగ్రదర్పులు దురాసదు లొక్కని లెక్క సేయ కే
పున వధియింతు రీవు బలముఖ్యుల శూరుల శస్త్రపాణులం
గొని చని యాజిలో రిపులఁ గూల్పుము పొమ్ము నిశాచరోత్తమా. 1299

రావణుఁడు కుంభకర్ణుని భూషణములచే నలంకరించుట.

వ. అని పలికి శీఘ్రంబున నాసనంబున నుండి లేచి యద్దశాననుం డొక్కమహనీయసువర్ణసూత్రగ్రథితమణిమాలిక కుంభకర్ణునికంఠంబున నిడి వెండియుఁ గనకాంగదంబులు నంగుళీవేష్టనంబులును గరాభరణంబులును శశిసంకాశం బైనహారంబును దత్తదుచితస్థానంబుల సంధించి దివ్యసుగంధమాల్యదామంబుల నలంకరించి శ్రీమంతంబు లగురత్నకుండలంబులను గర్ణంబులయందు సంఘటించి ప్రశస్తం బైనప్రాస్థానికస్వస్త్యయనంబు ప్రయోగించి యాలంబున కనిచిన బృహత్కర్ణుం డగుకుంభకర్ణుండు కాంచనాంగదకేయూరనిష్కాభరణభూషితుం డై హుతాగ్నిచందంబున వెలుంగుచు మహనీయవిశాలమేచకశ్రోణిసూత్రంబున నమృతోత్పాదనంబునందు భుజంగముచేత నద్ధం బైనమందరంబుచందంబున నందం బగుచుఁ దప్తకాంచనమయంబును నివాతంబును యుద్ధప్రహారభారక్షమంబును ననేకభారనిర్మితంబును విద్యుత్ప్రభంబును దీప్తంబు నైనకవచంబు దొడిగి సంధ్యాభ్రసంవీతం బైన యద్రిరాజుకరణి నలరుచుఁ బ్రవర్ధమానశరీరుం డై త్రివిక్రమకృతోత్సాహుం డైననారాయణునిమాడ్కిం జూడ్కికి వేడ్కసేయుచు శూలపాణి యై పాశహస్తుం డైనయంతకునిపగిదిఁ జూపట్టుచు సర్వాభరణసన్నద్ధాంగుం డై

ధాతుశోభితం బైననీలాద్రికైవడిఁ బ్రకాశించుచు రావణునిం గౌఁగిలించు
కొని ప్రదక్షిణంబు గావించి మస్తకంబు తచ్చరణంబులు సోఁకం బ్రణమిల్లి
యనుజ్ఞ గొని ప్రళయకాలధారాధరంబుకరణి గర్జించుచు మహాబలుమాడ్కి
వేగంబు వహించి పాదవిన్యాసంబులమహీతలంబు కంపింప సౌధప్రాసాదవిమా
నాగ్రంబులయందుండి రాక్షసాంగనలు పుష్పంబులు సేసలు చల్ల ధృతాతప
త్రుండై మదోత్కటుండై శోణితగంధమత్తుండై శంఖకాహళదుందుభినిర్ఘో
షపురస్సరంబుగా భయంకరప్రకారంబున రణంబునకు వెడలె నప్పుడు. 1300

కుంభకర్ణుఁడు యుద్ధమునకు వెడలుట

సీ. కాలజీమూతంబుకైవడి ఘోషించు చారుచామీకరస్యందనములు
కరములు సైఁకెత్తి గగనమహాధుని జలము లాకర్షింపఁ జాలుకరులు
ప్రళయకాలమునాఁటిపవనవేగము గల చటుల హేమాపీడసైంధవములు
పిడికిటిపోటుల బిరుదుకొండల నైనఁ బిండి సేయఁగఁ జాలు చండభటులు
తే. తెంపు పెంపు దీపింప గణింపరాక, దట్టమై పన్ని దారుణధ్వనులు సెలఁగఁ
జగతి కంపింప దిశల రజంబు పర్వ, వినుతగతిఁ గుంభకర్ణునివెంటఁ జనిరి. 1301

మ. తతజాంబూనదరత్నభూషణమహోత్తాలోగ్రపాణింధమా
యతదీప్తుల్దివి ప్రింగ నుష్ణఖరవాహావ్యాఘ్రభల్లూకసిం
హాతరక్షుద్విపపంక్తి నెక్కి మొనగాం డ్రత్యుద్ధతి న్నూరెలం
జతురత్వంబున నేగి రప్పుడు ధరాచక్రంబు భేదిల్లఁగన్. 1302

ను. ఘననాదోపమభేరికాభయదభాంకారంబుల న్వ్రయ్యవా
సినదిక్కుడ్యములందుఁ బూయుటకుఁ దచ్చిత్రాశ్వరింఖోత్థితా
వనిధూళీపటలాభియుక్తవిలసద్వారాశిసంఘుష్టజీ
వనము లక్కర్దమ మయ్యె నప్పుడు మహావైచిత్రి సొంపారఁగన్. 1303

వ. మఱియుఁ బదాతులు నీలాంజనచయసంకాశమహాకాయులును వహ్నికుండ
సదృశరక్తనేత్రులును ఘనస్వనోపమానకంఠనాదులును వాయుసమానవేగులు
నగుచుఁ బావకజ్వాలాభీలం బగుశూలంబులును గాలాయసమయంబు లగు
ముసలంబులును నిశితంబు లగునిస్త్రింశంబులును బహువ్యామప్రమాణంబు
లగుపరిఘంబులును బ్రచండంబు లగుగదాకాండంబులును విపులంబు లగుతాళ
స్కంధంబులును దురాసదంబు లగుక్షేపణీయంబులును వజ్రసంస్పర్శంబు లగు
పరశ్వథంబులును గైకొని యనేకు లనేకప్రకారంబుల వీరాలాపంబులు పలు
కుచు సమరసన్నాహసంరంభవిజృంభితులై రణంబునకుం జని రిట్లు చతురంగ
బలపరివృతుం డై మహాబలుం డగుకుంభకర్ణుండు వేఱొక్కశరీరంబు దాల్చి
ధనుశ్శతవైశాల్యవంతుండును షట్ఛతధనుస్సముచ్ఛ్రితుండును శకటచక్రాక్షుం
డును మహాపర్వతసన్నిభుండును దగ్ధశైలోపముండును రౌద్రసర్పనుండును నై

సంగ్రామంబునకుం బోవుచుఁ దనచుట్ల నున్న రాక్షసుల నిరీక్షించి పాతాళవివర తుల్యం బైనవక్త్రంబు విచ్చి ప్రహసించుచు ని ట్లనియె. 1304

ఉ. దానవులార యేను భుజదర్ప మెలర్ప రణంబులో బృహ
ద్భానుఁడు విక్రమించి శలభంబుల నేర్చినమాడ్కిఁ గిన్కతో
వానరముఖ్యయూథపుల వారక వ్రేల్మిడిలో దహించి య
మ్మానవనాథనందనులఁ మానక యిప్పుడె మ్రింగి వుచ్చెదన్. 1305

క. ననుఁ జూచినంత శక్రా, ద్యనిమిషపతు లడలి పఱతు రనిలో నా కీ
వనచరులఁ జంపు టది యొక, పనియే మశకములనట్లు బారి సమరనే. 1306

క. పురరోధమునకు మూలం, బరయఁగ నరవిభుఁడు రాముఁ డతఁడు దెగిన వా
నరు లపుడె తెగినవారలు, దురమున ము న్నతనిమీఁదఁ దొడరఁగ వలయున్.

—ఇది కుంభకర్ణున కశుభనిమిత్తము లగుపడుట.—

చ. అని యిటు రావణావరజుఁ డాడినవాక్యము లాలకించి యా
దనుజు లశంకితాత్ము లయి తద్దయు వేడ్క బహూకరించుచున్
ఘనములమాడ్కి నిష్ఠురముగా నినదంబు లొనర్చి రప్పు డా
దనుజునిమ్రోలఁ దోఁచె వితతంబుగ దారుణదుర్నిమిత్తముల్. 1308

సీ. ఘోరంబుగా మ్రోలఁ గురిసె నెత్తురువాన కడువడిఁ బిడుగులు పడఁ దొణంగె వననిధిశైలకాననసహితంబుగా సర్వసర్వంసహాచక్ర మడలెఁ బెనుమంట లుమియుచు భీమణభంగిఁ గౌశికములు వాపోయె శితమహాస్త్ర శూలంబు పై గ్రద్ధ వ్రాలెఁ బక్షులు గట్టె మాటికి నపసవ్యమండలములు

తే. భాస్కరుఁడు చాల మందగభస్తి యయ్యె
వేఁడిగాడ్పులు విసరె నవ్విబుధవైరి
యెడమకన్ను చలించె ఫణీంద్రతుల్య
భుజము కంపించె నతనిపై రజము నుడిసె. 1309

వ. ఇట్లు సముత్థితంబు లై నరోమహర్షణమహోత్పాతంబు లవలోకించి గణింపక కుంభకర్ణుండు కృతాంతబలచోదితుం డై యుద్ధంబు వచ్చినసౌధవిమానగోపుర ప్రాకారద్వారంబుల దాఁటుచు నగరంబు వెలువడి మహాభ్రఘనప్రఖ్యుం డై యద్భుతం బై నిండి యున్నవానరబలంబు నవలోకించి శిలోచ్చయసహితంబుగా సముద్రజలంబులు పొంగి పొరల నొక్కమహానాదంబు చేసిన మహాగిరిసంకాశుం డై నకుంభకర్ణు నవలోకించి తిరస్కృతప్రళయకాలధారాధరస్తనితం బై నతదీయకంఠనాదంబు విని వానరు లెల్ల సింగంబుఁ గన్న లేళ్లచందంబున భయభ్రాంతు లై కొందఱు వాతాహతంబు లైనమేఘంబులభంగి దశదిశలకుం బఱచిరి కొందఱు నికృత్తమూలంబు లగుసాలవృక్షంబులమాడ్కి మహీతలంబునం బడి రిట్లు తనరాకకు భయంబు నొంది నానాప్రకారంబులం

బఱచువానరుల నెల్ల నిరీక్షించి కుంభకర్ణుండు ప్రావృట్కాలవలాహకంబుకరణి మేనుఁ బెంచి విజృంభించి మార్గంబున సారెసారెకు సింహనాదంబు సేయుచు విపులపరిఘవంతుండై యుగాంతంబునందుఁ గింకరదండవంతుం డైనయంతకుని పగిదిఁ జూపట్టుచు లోచనంబుల నగ్నికణంబు లొలుక నలుక రెట్టింప భయంబు పుట్టించుచు ననివార్యగమనంబున నాగదుపులం దునుముశార్దూలంబు కైవడి వానరసైన్యంబుల వెనుకొని తఱుమం దొణంగె నప్పుడు శక్రయమవరుణాద్యఖిలదిశాపాలకావధ్యుం డైనకుంభకర్ణునిం జూచి ప్రాణభయంబునం బఱచువానరుల నందఱ నవలోకించి పురందరపౌత్రుం డైనయంగదుండు నలనీలగవాక్షకుముదులం గూడి చేవీచి బరవసంబుచేసి పురికొల్పుచు ని ట్లనియె. 1310

### వానరరాక్షసుల యేడవనాఁటియుద్ధము.

చ. తరుచరులార పౌరుషము దవ్వులఁ బో నిడి సాధ్వసంబునం
బఱవఁగ నేల ప్రాకృతులభంగి నితం డిటు ఘోరకాయుఁ డై
పరఁగుటె గాని దుర్బలుఁడు పాయక వీని వధింత ముద్ధతి
న్మరలుఁడు మీరు ప్రాణ మది మానము కంటె ఘనంబె చూడఁగన్. 1311

క. అని పలికి యధికయత్నం,బున నాశ్వాసించి మరలఁ బురికొల్పిన న
వ్వనచరవీరులు ధైర్యం,బున గుమిగొని యుండ ఱొక్కమొత్తం బగుచున్.

సీ. సామజమాత్రపాషాణముల్ గైకొని దవ్వుల నుండి పై రువ్వువారు
తతవృక్షసానుకందరశోభితాత్యున్నతాచలంబులు మీఁద వైచువారు
నస్కంధమూలవిశాలశాఖాయుక్తవృక్షషండంబులు వ్రేయువారు
కడు సాహసమున డగ్గఱి శాతనఖముష్టివాలదంతంబుల వ్రచ్చువారు

తే. నగుచు వానరవీరు ల ట్లక్కజముగ, వ్రేసి యార్చిన నమ్మహావిబుధవైరి
ఘోరవృష్టికిఁ దలఁకని కులనగంబు, కరణి సుస్థిరుఁ డయ్యె నచ్చెరువు గాఁగ.

ఆ. గాఢభంగిఁ గుంభకర్ణునిపైఁ బడు, మారివిముక్తతరుశిలాచలములు
కొండమీఁదఁ బడినకుండలచందాన, వేయి వ్రక్కలగుచు విఱిగి కూలె.

వ. అంత. 1315

ఉ. ఆరజనీచరాన్వయదవాగ్ని వలీముఖబాహుముక్తదీ
ర్ఘోరుమహీరుహాచలమహోపలరూపదృఢేంధనంబుల
న్వారక ప్రజ్వలించి యనివారణచాతురిఁ గీశసైన్యకాం
తారము నుగ్రభంగి వితతంబుగ నేర్చఁ దొడంగె నయ్యెడన్. 1316

### కుంభకర్ణునిమ్రోల నిలువలేక వానరులు పాఱుట.

వ. అప్పుడు. 1317

సీ. రుధిరార్ద్రగాత్రులై రోహితపుష్పధాత్రీరుహంబులమాడ్కిఁ ద్రెళ్లువారు

పురుషత్వ ముడిగి యొండొరుల వీక్షించుచుఁ బ్రాణభయంబునఁ బఱచువారు
వెలవెలఁ బాఱు మోములతోడ వాఁగువ్రంతల నిమ్నభూముల దాఁగువారు
పాయ కెక్కడఁ జూచునో యనుభయమున మున్నీటినీటిలో మునుఁగువారు
ఆ. నగము లెక్కువారు నగగహ్వరంబుల, డాఁగువారు మింటి కేగువారు
చచ్చినట్లు ధరణిఁ జాఁపకట్టుగఁ బడు, వారు నైరి ప్లవగవర్యు లపుడు. 1818
మ. బలవంతుం డగుకుంభకర్ణునిభుజాప్రాబల్య మూహించి ని
శ్చలు లై నూల్కొన లేక యూథపవరు ల్శార్దూలముం గన్నజిం
కలచందంబున భీతి నొంది యొడ లాకంపింపఁగాఁ జిత్తము
ల్గలఁగం గ్రమ్మఱ సేతుమార్గమున నేగం బాఱి రత్యుద్ధతిన్. 1819
ఉ. వారలఁ జూచి యంగదుఁడు వానరయూథపులార యీగతిం
బాఱినఁ బౌరుషం బగునె ప్రాణము లంత ఘనంబె ధాత్రి బ
ల్శూరులు పాఱి పోదురె నిలుండు నిలుం డని యెంతఁ జెప్పినన్
నూరెల భీతిచేఁ దిరిగి చూడరు వానరు లేమి చెప్పుదున్. 1820
ఉ. ఎక్కడ వచ్చె నీదనుజుఁ డిట్లు వనాటులు ధైర్యహీను లై
మిక్కిలి భీతిఁ బాఱెదరు మిన్నక నే నిపు డెంతఁ జెప్పినన్
ఎక్కడిమాట పో మ్మనుచు నించుక స్థైర్యము నొంద రేగతిన్
గ్రక్కున వీరి నందఱ మరల్పుదునో యెటు పో దొనర్తునో. 1821

అంగదుఁడు వానరులఁ బురికొల్పుట.

మ. అని యోచించి సురేంద్రపౌత్రుఁడు వనాటానీకముం జూచి యి
ట్లనియె న్మీ రిటు భీతిచేఁ బఱవ శూరాగ్రేసరు ల్విన్న మ
న్నన గావింతురె యేటిప్రాణభయ మీడై తేయునిం బట్టి బ
ద్ధునిఁ గావింతుము గ్రమ్మఱింపుఁడు కపిస్తోమంబుల న్యూథపుల్. 1822
క. అనిలోన నిరాయుధు లై, పెనుభీతిం బఱచునట్టిభీరునిఁ గని త
ద్వనిత లొగి నపహసింతురు, పనికిం గొఱమాలి యవల బ్రతికిన మేలే. 1823
సీ. వనచరులార సద్వంశమందు జనించి విక్రమాధికు లనా వినుతి గాంచి
ప్రాకృతప్లవగులభంగి భయార్తు లై పాఱిపోవఁగ మీకుఁ బాడి యగునె
శౌర్యంబు దిగనాడి సంగ్రామభీతు లై పఱచినవారలఁ బంద లండ్రు
తఱివచ్చినపుడు భీకరలీల రిపులపై వాఁడిమిఁ జూపినవాఁడె బంటు
తే. రిపుల వధియించెద మటంచు రిత్తచోట, బిఱుసుమాటలు పదివేలు ప్రేలవచ్చుఁ
గార్యమున కెత్తివచ్చినఁ గాని తెలియ, దద్రిచరులార తద్విక్రమాతిశయము.
తే. అతని నెవ్వాఁడు ధిక్కృతుం డై చరించు, నతనిభీమప్రభావంబు లాలకించి
ఖండనంబున శూరులు పంద యనుచు, వాని దూషింతు రగచరవర్యులార.

చ. అనిమిషవైరిపైఁ దొడరి యాల మొనర్తుము వీని నాజిలోఁ
దునిమితి మేనియు న్మనకుఁ దొడ్డయశం బొడఁగూడు వీఁ డని
న్మనల వధించె నేనియు రమాపతిలోకము గల్గు శూరు లెం
చినఘననీతిమార్గము భజింపుఁడు వీడుఁడు సాధ్వసం బొగన్. 1326

ఆ. ప్రాణభీతి నొంది భండనంబున నోడి, పాఱి రౌరవమునఁ బడుటకంటెఁ
బరులచేతఁ జచ్చి బ్రహ్మలోకసుఖంబుఁ, బడయు టొప్పుఁ గాదె ప్లవగులార.

చ. తడయక మంటలోఁ బడుపతంగముకైవడి నీనిశాచరుం
డుడుగక మత్తుఁడై రఘుకులోత్తమదారుణదృక్పథంబునం
బడి తదమోఘబాణములఁ బంచత నొందెడు మీర లింతలోఁ
బదపడి వీనికి న్వెఱచి పాఱఁగ నేల నిలుండు ధీరతన్. 1328

వానరవీరు లందఱు నొక్క మొత్తమై కుంభకర్ణునితో యుద్ధము సేయుట.

వ. మఱియు బలవంతుల మైనమన మనేకుల మొక్కరాక్షసున కోడి ప్రాణభయం
బునం బఱచిన నెంత భీరులని శూరులు నిందింతురు దానం జేసి మనయశంబు
నకు హాని వచ్చు నని పలికిన నయ్యంగదునివచనంబులు విని యక్కపులు నీ వేమి
చెప్పిన నిక్కుంభకర్ణునిమునుమున నిలువం జాల మేడ కేనియుం జని ప్రాణం
బులు రక్షించుకొనియెదము ప్రాణంబులకంటెఁ బ్రియవస్తువెద్దియు లేదు గదా
యని శూరవిగర్హితంబుగాఁ బలుకుచు నిలువం బడక కుంభకర్ణభయభ్రాంతు
లై పఱచుచున్న నయ్యంగదుండు వారల కడ్డంబు చని నిలువరించి సాంత్వవా
క్యంబుల సప్తసాలగిరిభేదనాదిదృష్టాంతంబుల వెలువుదీర్చి బరవసంబుఁ జేసి పురి
కొల్పి క్రమ్మఱించిన నయ్యూథపు లంగదవాక్యబోధితులై యతనిశాసనంబు
నుల్లంఘింపం జాలక యెట్టకేలకుఁ గొండొకధైర్యంబుఁ బూని సంగ్రామార్థు
లై క్రమ్మఱఁ గుంభకర్ణున కభిముఖంబుగా నడిచి రప్పుడు వాయునందనుండు బు
షభశరభమైందనలనీలకుముదసుషేణగవాక్షరంభతారద్వివిదపనసులం గూడి
యద్దశాననానుజునిమీఁద నడరె నిట్లు వానరయూథముఖ్యు లందుఁ జేయంగల
మేటిమగ లందఱొక్కమొత్తంబై కథితాత్మీయప్రాక్పరాక్రములైన్యమారోపిత
విక్రములై మరణం బొండె యశం బొండె నని కృతనిశ్చయులై భయంబు వదలి
వీరావేశంబున ధారాధరంబులు ధరాధరంబునుం బొదివినకరణిఁ గుంభకర్ణునిం
దదనుచరులం బొదివి సానుమంతంబు లగుపర్వతంబులును సమూలంబు లగు
పాదపంబులును బరఁగించి తుములంబుగా యుద్ధంబు గావించిన నక్కుంభకర్ణుండు
మేనుఁ బెంచి విజృంభించి వీర్యం బంగీకరించి సంక్రుద్ధుండై ప్రచండంబైన
గదాదండంబు జిఱజిఱం ద్రిప్పుచు నుభయపక్షంబుల నాక్రమించి యొక్కొక
వ్రేటునకుఁ బదివేల నిరువదివేల వానరులం బుడమిఁ గూల్చుచు నొక్కొక్క
మాటు వైనతేయుండు పన్నగంబులం బోలె నూర్వుర నిన్నూర్వురం బట్టి
మ్రింగుచు బలుమానిసి చీమలం జమరినతెఱంగునఁ గాలం గేలఁ జమరుచు

యుగాంతకాలంబున సర్వప్రాణిసంహారకారకుండై నయంతకునిమాడ్కి భృశసం
క్రుద్ధుండై రణవిహారంబు గావించుచున్ననమ్మహారాక్షసుని త్రివిక్రమప్రకారం
బు వీక్షించి సహింపక యతిప్రయత్నంబునంగూడుకొని వృక్షశిలాశిలోచ్చయ
పాణులై వానరు లోపినకొలంది మెలంగుచుండి రప్పుడు వానరశ్రేష్ఠుండగు
ద్వివిదుండు మహోన్నతంబైనయొక్కపర్వతంబుత్పాటించి తెచ్చి ప్రలంబ
తోయదంబుభంగి వెలుంగుచు గిరిశృంగతుల్యుండైనకుంభకర్ణునిమీఁదవిసరి
వైచిన నమ్మహాపర్వతంబు వానిమీఁదంబడక తప్పి రాక్షససైన్యంబుమీఁదం
బడి యనేకశతాంగమాతంగతురంగంబులునుగ్గునూచంబు చేసిన నత్తెఱంగు
విలోకించి యవ్వనచరయూథపుండు వేఱొక్కగిరిశిఖరంబునఁ బెక్కండ్ర రక్క
సులనక్కజంబుగా రూపుమాపిననయ్యాయోధనంబుతచ్చైలవేగాభిహతంబై
హతాశ్వంబై హతసూతంబై రుధిరక్లిన్నంబై సురాసురసంభ్రమప్రదంబై
యద్భుతదర్శనంబై యొప్పె నప్పుడు. 1329

చ. ప్రథనపయోధిపోతములభంగిఁ జెలంగుశతాంగపంక్తి సా
రథిజనవాజినైపుణము గ్రాల వెసం బరఁగించి క్రవ్యభు
గ్రథికులు ఘోరసాయకపరంపర లేసి వనాటవీరుల
న్నిధనము నొందఁ జేసి రతినిష్ఠురమస్తకఖండనంబులన్. 1330

ఉ. ధీరులు వానరోత్తము లతిస్ఫుటభూరిశిలాచయంబులన్
దారుణముష్టిపాతముల దంతనఖంబులఁ బర్వతంబులన్
భూరుహపంక్తుల న్సమరభూమి ననేకనిశాటవీరులన్
ఘోరనినాదము ల్చెలఁగఁ గూల్చిరి విక్రమదుర్నివారులై. 1331

హనుమంతుఁడు కుంభకర్ణునితోఁ బోరి మూర్ఛిల్లుట.

క. అనిలకుమారుఁడు పతగేంద్రునికైవడి మింట నుండి ఘోరముగా వృ
క్షనగాశ్మవృష్టి గురిసెను, దనుజేంద్రునిశిరముమీఁదఁ దద్దయుఁ గినుకన్. 1332

చ. ఘనభుజుఁ డానిశాటుఁ డలుకం దనచేతినిశాతశూలసా
ధనమున దట్టమై గురియుతత్తరుశైలశిలాప్రవృష్టి గ్ర
క్కున విరియించి సింహ మొగి క్షుద్రమృగంబులఁ బోలె నుద్ధతి
న్వనచరుల న్వడిం దఱిమె వారక దిక్కులు వ్రయ్య నార్చుచున్. 1333

చ. అనిలకుమారుఁ డప్పుడు రయంబునఁ గోపరసోగ్రమూర్తియై
యనిమిషలోకకంటకున కడ్డము వచ్చి చలం బెలర్ప నొ
క్కనగము వీచి వైచుటయు గ్రక్కున నాతఁడు రక్తసిక్తుఁడై
యనుపమధాతుశోభితమహాచలశృంగముభంగి నొప్పుచున్. 1334

సీ. మెఱుఁగుచందంబున మెఱయుచు మంటలనుమియుమహోగ్రశూలముననతఁడు
మునుకార్తికేయుండమోఘోగ్రశక్తిచేరహిఁ నొప్పుక్రౌంచభూధ్రమునుబోలె

ననిలనందనుని భుజాంతరంబున వ్రేసె వ్రేసిన నమ్మహావీరవరుఁడు
విహ్వలుఁడై నోట వెడవెడ రక్తంబు గ్రక్కుచుఁ గాలాంతఘనముమాడ్కి
తే. ఘోరనాదం బొనర్చె నవ్వీరుఁడిట్లు, వ్యథితుఁ డగుటవిలోకించియసురు లపుడు
హర్షనాదం బొనర్చిరి హరిబలంబు, వేగ దైత్యేంద్రుకడిమికి వెఱచి పఱచె.

నీలఋషభశరభగవాక్షగంధమాదనులు కుంభకర్ణునిచే మూర్ఛిల్లుట.

వ. అప్పుడు వానరచమూపాలుం డగునీలుండు బలంబులఁ జిక్కుపడకుండ మోహరించి యొక్కమహోగ్రశైలశిఖరంబు కుంభకర్ణునిమీఁద వైచిన నయ్యసురవల్లభుండు శక్రాశనిసమస్పర్శం బైనపిడికిట నయ్యచలశృంగంబు నడిచిన నది పొడియై మిడుంగుఱులు సెదరఁ జెదలు మంట లెగయ మహీతలంబునం బడియె నంత నీలునకు బాసటయై ఋషభుండును శరభుండును గవాక్షుండును గంధమాదనుండునుం గూడుకొని రిట్లేవురు వానరశార్దూలురు పంచాగ్నులుంబోలెఁ దేజరిల్లుచుఁ గుంభకర్ణు నాక్రమించి సర్వప్రాణంబుల శిలావృక్షముష్టిపాదతలంబుల ననేకప్రకారంబులఁ బ్రహరించిన నద్దనుజశేఖరుండు తత్ప్రహారంబులం జింతింపక మదోన్మత్తుం డై మహావేగుం డై ఋషభుని బాహువులం గ్రుచ్చిపట్టి మెదిచిన నవ్వానరశ్రేష్ఠుండు తదీయభుజాంతరపీడితుం డై ప్రముఖాగతశోణితుం డై ధరణిపయిం బడియెఁ దదీయముష్టిహతుం డై శరభుండు మూర్ఛితుం డయ్యె జానుఘాతంబున నీలుండు పుడమిం ద్రెళ్లెఁ దలప్రహారంబున గవాక్షుండు విసంజ్ఞుం డయ్యె నిట్లవ్వానరవీరులు తత్ప్రహారవ్యథితులై శోణితంబు గ్రక్కుచు నికృత్తంబు లగుకింశుకంబులభంగి మేదినిం బడి రిట్లు వానరముఖ్యుల మూర్ఛితులం జేసి వానరబలంబున కుఱికి బహుప్రకారంబుల మథింపం దొడంగిన నవ్వనచరులం [illegible] యూథంబులు మహామహీధరంబు నారోహించినకరణి నక్కుంభకర్ణునిమీఁదికిం బ్రాఁకి నఖంబులఁ జించుచు దంతంబులఁ గఱచుచుఁ దలంబుల వ్రేయుచు ముష్టిఘాతంబులం బొడుచుచు జానుకూర్పరంబుల మర్దించుచు ననేకప్రకారంబుల నొప్పించిన మహాపర్వతోపముం డగుకుంభకర్ణుండు వానరసహస్రసమాచితుం డై యాత్మరుహంబులచేతఁ బర్వతంబుకరణి శోభిల్లుచు సంక్రుద్ధుం డై తార్క్ష్యుండు పన్నగంబులం బోలె వానరసహస్రంబులం బట్టి మ్రింగం దొడంగిన నబ్బలీముఖులు పాతాళసన్నిభం బైనవక్త్రంబునందుఁ గుంభకర్ణునిచేతఁ బ్రక్షిప్తులై గ్రమ్మఱ నాసారంధ్రంబులవలనను గర్ణబిలంబులవలనను నిర్గమించుచుండి రిట్లు పర్వతసన్నిభుఁ డైనవానరుల భక్షించుచు బహుప్రకారంబుల భంజించుచు రణమేదిని మాంసశోణితసంపూర్ణ గావించుచు హరిసైన్యమధ్యంబునఁ గాలాగ్నిచందంబునఁ గ్రోధమూర్ఛితుం డై కాలాయసమయం బగుశూలంబు కేలం గ్రాల భయంకరాకారుం డై విహరించుచు నిదాఘకాలంబునఁ బావకుండు శుష్కారణ్యంబు దహించువడువున వానరవాహినీసందోహంబుల దహించిన నవ్వనచరులు హతయోధులును వధ్యమానులును

విగతనాయకులునై భయంబున ఘోషించుచుం బఱచి ఖిన్నచిత్తులై రాముని శరణంబు నొంది రప్పుడు భయార్దితులై పఱచుకపుల నిరీక్షించి వాలిపుత్త్రుం డైనయంగదుండు వేగంబున నొక్కగిరిశిఖరంబు కరంబునం బూని సారెకు మహానాదంబు సేయుచుఁ గుంభకర్ణపదానుగులైన రాక్షసులకు భయంబుఁ బుట్టించుచు నతిరభసంబుగాఁ బఱతెంచి. 1336

అంగదుఁడు కుంభకర్ణునితో యుద్ధముచేసి మూర్ఛిల్లుట.

సీ. కడు రయంబునఁ గుంభకర్ణునిశిరముపై బృథుమహీధరశృంగ మెత్తివైవ
నద్దానవుండు మహాకోపమున మండి చరణఘట్టనమునఁ బుడమి యుదర
నాకంబు పగుల మహాధ్వని సేయుచు వాఁడిమగం డైనవాలిసుతుని
డాయఁగ వచ్చి కాలాయసమయ మైనచటులశూలంబు రోషమున వైవ
తే. దాని వీక్షించి జన్యవిద్యావిదుండు, ప్లవగకులశేఖరుం డతిలాఘవమున
వ్రేటు దప్పించుకొని భుజవిక్రమంబు, గ్రాలఁ గడురభసంబునఁ గదియవచ్చి.

చ. పటుశతకోటితుల్య మగుపాణితలంబునఁ గుంభకర్ణునిం
దటుకున వ్రేసె వ్రేయుటయుఁ దద్దయు దొమ్మరవోయి యంతలో
దిటమునఁ గొంతసేపునకుఁ దేఱి రయంబున ముష్టిచే మదో
త్కటముగ వాలిజుం బొడువఁ దప్పక మూర్ఛితుఁ డయ్యె నాతఁడున్. 1338

ఉ. ఈగతి నంగదుం గినుక నెంతయు మూర్ఛితుఁ జేసి భూరిదో
ర్వేగ మెలర్ప రాత్రిచరవీరుఁడు శూలము దాల్చి కన్నుల
న్నాగ మెలర్ప వేగ రవినందనుమీఁదికి నాగ్రహంబుతో
నేగెఁ బదాభిఘాతమునఁ బృథ్వి చలింపఁ జలంబు మీఱఁగన్. 1339

శా. ఈరీతిం జనుదెంచురాత్రిచరుని న్వీక్షించి సంరంభియై
వీరుం డాప్లవగాధిపుండు పటుదోర్వీర్యంబు దీపింపఁగా
ధీరత్వంబున శైలము న్గొని వియద్వీథి న్వడిం ద్రిప్పుచు
న్ఘోరప్రక్రియ వానిమీఁది కుఱికెం గ్రోధంబు రెట్టింపఁగన్. 1340

చ. ఇటు చనుదెంచుచున్నప్లవగేంద్రునిఁ గన్గొని కుంభకర్ణుఁ డు
త్కటపటురోషవేగమునఁ గన్నుల నగ్నికణంబు లొల్కఁగాఁ
గుటిలమనస్కుఁ డై వికృతఘోరశరీరము మిన్నుముట్ట మ
ర్కటకులభర్త కట్లభిముఖంబుగ నిల్చె మహాద్భుతంబుగన్. 1341

క. కపిశోణితదిగ్ధాంగునిఁ, గపుల న్వడి మ్రింగువాని ఘటకర్ణునిఁ గ్రో
ధపరీతచిత్తుఁ గనుఁగొని, కపివిభుఁ డిట్లనుచుఁ బలికె గర్వం బెసఁగన్. 1342

సుగ్రీవుఁడు కుంభకర్ణునితోఁ బోరి మూర్ఛిల్లుట.

చ. కడువడి దుష్కరం బయినకార్య మొనర్చి తనేకవీరులం
గడపితి వాజిదుర్జయులఁ గీశుల మ్రింగితి వింతె చాలు నీ

పుడుగు మలంతులం దొడర యుద్ధ మొనర్చినఁ గీర్తి గల్గునే
విడువక మత్ప్రయుక్తగిరివేశ మొకింత సహింపు ముద్ధతిన్. 1343

క. అని పలికిన వానరవ, ర్యుని పౌరుష సత్త్వధైర్య యుక్తవచనముఁ
విని రాక్షసశార్దూలుఁడు, ఘనతరకోపంబు గదురఁ గా నిట్లనియెన్. 1344

తే. అజునిమనుమఁడ వలఋక్షరజునిసుతుఁడ
వఖిలవానరనాథుఁడ వతిబలుండ
వధికపౌరుషయుక్తుండ వని యెఱుఁగుదు
నిన్ను సుగ్రీవ యేల యీ ఖ్యాపన్నిదంబు. 1345

చ. అన విని వానరప్రవరుఁ డద్భుతరోషకషాయితాత్ముఁడై
ఘనభుజసత్త్వ మేర్పడ నగంబు రయంబునఁ ద్రిప్పి కుంభక
ర్ణనిపయి నైవ వానిపెనుఱొమ్మున వజ్రముభంగిఁ దాఁకి గ్ర
క్కునఁ బడి నూఱు వ్రయ్యలయి కూలెఁ దదద్రి మహాద్భుతంబుగన్ 1346

క. అది చూచి ప్లవగు లందఱు, మద మఱి సువిషాదయుక్త మానసులై రా
త్రిచరులు లెల్లఁ గనుఁగొని, ముదమున గర్జించి రపుడు భూరిద్యుతులై. 1347

సీ. శర్వరీచరుఁ డిట్లు పర్వతశృంగాభిహతుఁడై కోపంబు నిగుడ భీక
రాస్యంబు విచ్చి మహాధ్వని సేయుచు మించుచందంబున మెఱయుదానిఁ
దపనీయదామయుక్తం బగుదాని నిశాతశూలముఁ ద్రిప్పి సత్వరముగ
నర్కకుమారవధార్థంబు వైచిన నది మంట లుమియుచు నరుగు దేరఁ

తే. గని సమీరకుమారుండు కడు రయమున
వితతభారసహస్రనిర్మితశితాగ్ర
లసితకాలాయసోగ్రశూలంబు నొడిసి
పట్టి బలమున మోకాటఁ బెట్టి విఱిచె. 1348

వ. ఇట్లు హనుమంతునిచేత భగ్నంబైనకాలాయసమయంబైనశూలంబు నవ
లోకించి వానరవాహినీసందోహంబు పరమసంహృష్టంబై యనేకప్రకారం
బుల మహాస్వనంబు గావించె నావనగోచరు లానందంబున సింహనాదంబులు
గావించి మారుతిం బూజించి రిత్తెఱంగునఁ దనశూలంబు భగ్నంబగుట
విలోకించి మహాత్ముం డగుకుంభకర్ణుండు కోపించి మహోన్నతంబైనలంకా
మలయశృంగంబు బుత్పాటించి తెచ్చి సుగ్రీవునిమీఁదవైచిన నతండు శైలశృం
గాభిహతుండై విసంజ్ఞుండై ధరణిపయిం బడియె నిట్లు మూర్ఛితుండై పుడ
మిం బడిన సుగ్రీవునిం జూచి పరమసంహృష్టులై యాతుధానులందఱు మహా
నాదంబుఁ జేసి రప్పుడు కుంభకర్ణుండు మహాద్భుతఘోరవీర్యుండై నసుగ్రీవుని
డాయం జని ప్రచండానిలంబు మేఘంబుంబోలె సుగ్రీవుని భుజంబుల నెత్తు
కొని మేరుప్రతిమానరూపుం డగురాక్షసుండు సముచ్ఛ్రితఘోరశృంగం బైన

మేరువుపగిది నలరుచు రాక్షసశ్రేష్ఠులచేత సంస్తూయమానుం డై ప్లవంగరాజ
గ్రహణవిస్మితు లై నగీర్వాణులమహాఘోషం బాలకించుచు నితండు హతుం
డైన రామసహితంబుగా సర్వవానరసైన్యంబు హతం బైన దని తలంచుచు
మేఘనికాశరూపుం డైనసుగ్రీవునిం గొని లంకకుం జనియె నిట్లు కుంభకర్ణ
గృహీతుం డైనసుగ్రీవునిం జూచి భయంబునం బఱచువానరుల నవలోకించి
హనుమంతుండు తనమనంబున. 1349

—కుంభకర్ణుండు మూర్ఛితుం డగుసుగ్రీవుని లంకకుం గొనిపోవుట.—

ఉ. ఈమనుజాశనేంద్రుఁ డని నెంతయు మూర్ఛితుఁ డైనవానర
స్వామిని బల్మి నెత్తుకొని వారక యేగెడు లంక కింక నే
నేమి యొనర్పువాఁడ నిపు డెయ్యది కార్యము నాకు దేవతా
భూమిధరోన్నతుండ నయి పోల్పగ నీదనుజు న్వధింతునో. 1350

చ. మసలక యీనిశాచరుఁడు మత్పటుముష్టివికీర్ణదేహుఁ డై
రసఁ బడు చుండ సర్వకపిరాజు మహేంద్రసమానుఁ డావిభా
వసుతనయుండు వేగ విడువం బడు చుండ వనాటు లెల్ల సా
ధ్వసమును శంక వీడి ప్రమదంబు వహింతురు గాక ధీరతన్. 1351

చ. అనిమిషసిద్ధసాధ్యఫణు లైన నడి న్దనుఁ బట్టినప్పు డెం
తని నిరసించి లావు మెఱయ న్విడిపించుకొనంగ దక్షుఁ డీ
యినతనయుండు ఘోరగిరిశృంగహతిం బెనుమూర్ఛ నొంది యీ
దనుజుఁడు తన్ను బల్మిఁ గొని తారు టెఱుంగక యున్నవాఁ డిటన్. 1352

చ ఒనరఁగ నీవిభుం డొకముహూర్తములోపల లబ్ధసంజ్ఞుఁ డై
తనకును మాకుఁ బథ్య మగుదాని నొనర్చెడు నింతలోన నే
ననుపమబాహుశక్తి మెఱయ న్విడిపించితి నేని యీయశో
ధనునకుఁ గీర్తినాశనము తద్దయుఁ గోపము గల్గు నెంతయున్. 1353

వ కావున నొక్కముహూర్తం బీవనచరవిభునివిక్రమంబు గాంక్షించుచు నతండు
మూర్ఛదేఱి తనయంతం దాను జనుదెంచునందాఁకఁ జెదరిపడినవానరబ
లంబుల నాశ్వాసించి నిలువరించెదఁ గాక యని నిశ్చయించి యప్పవననంద
నుండు గ్రమ్మఱ వానరచమూకదంబంబుల సంస్తంభంబు గావించె నంత
నక్కుంభకర్ణుండు. 1354

—సుగ్రీవుఁడు మూర్ఛదేఱి నఖదంతంబులఁ గుంభకర్ణునికర్ణనాసికము ఖండించుట.—

సీ. మెఱుఁగుచందంబున మెఱయుసుగ్రీవునిఁ గొని లంక సొచ్చి తద్గోపురాగ్ర
చర్యాగృహవిమానసౌధస్థితులచేత సుమలాజగంధోదకములచేత
నవకీర్యమాణుఁ డై యల్ల నల్లన రాజమార్గంబుఁ బట్టి సంభ్రమము మీఱఁ
జనుచుండఁ దచ్ఛైత్యమునఁ గొంతవడి కాత్తసంజ్ఞుఁ డై పాదపచరవరిష్ఠుఁ

తే. దమితబలుఁడై నవానిభుజాంతరమునఁ, జిక్కి పురరాజపథము వీక్షించి వీని
చే గృహీతుఁడనైననా చేత నిపుడు, ప్రతికృతి యొనర్పఁబడుట కుపాయ మెట్లు.

—కుంభకర్ణుఁడు రోషంబున మరల యుద్ధము సేయఁ బూనుట—

వ. అని యోచించి వానరుల కంటఁబడకు హితం బగునట్లుగా వీని నంగవికలుం గావించెదఁ గాక యని నిశ్చయించి నిశాతనఖంబులు వ్రచ్చి దంతంబులఁ దదీయనాసికఁ గొఱికి యుభయపార్శ్వంబుల నొప్పించిన నద్దనుజశేఖరుండు హృతకర్ణనాసుండై విమర్దితశరీరుండై విదారితసర్వావయవుండై క్షతజార్ద్రనేత్రుండై రోషంబున నవ్వనచరనాథునిఁ బట్టి యెత్తి పుడమిం బడవైచిన నతండు నేలం బడక లాఘవంబున మింటికెగసి శీఘ్రంబునఁ గ్రమ్మఱ రాముని సమీపంబునకుం జనుదెంచె నంతఁ గర్ణనాసావిహీనుండై నకుంభకర్ణునిశరీరంబు వలనఁ దోరంబుగా రక్తంబు స్రవించె మఱియు శోణితార్ద్రమహాకాయుండై సంధ్యాభ్రపరీతంబైననీలగిరిచందంబున నలరుచు నమర్షంబున వెండియు యుద్ధాభిముఖుండై రయంబునఁ బురంబు నిర్గమించి యుద్ధభూమికిం జనుదెంచి మహోగ్రంబైనవానరబలంబు ప్రవేశించి బుభుక్షితుండై ప్రదీప్తుండై నయుగాంతకాలవైశ్వానరుండు ప్రజలంబోలె శోణితగంధమత్తుం డగుటం జేసి మోహంబున స్వపరబలవివేకంబు లేక యొక్కమాటు పెక్కండ్ర రక్కసులఁ గపుల భల్లూకంబుల బాహువులం బట్టి మ్రింగుచుఁ బ్రళయకాలంబునందుఁ బ్రాణిసంఘంబుల గ్రసించుమృత్యువుచాడ్పున రాక్షససమేతంబుగా వానరయూథపుల భక్షించుచుఁ గీశులకంఠంబులు ద్రెంచి తదీయరక్తంబులు గ్రోలుచుఁ బాణితలంబుల మెదిచి తన్మేదోమాంసమస్తిమ్కపంకంబు శరీరంబున నలఁదుకొనుచు నిరుగెడలం బెడచేతుల శిరంబులు పగుల నడుచుచు నిట్లనేక ప్రకారంబుల వధింపఁ దొడంగిన వానిఁ దేఱిచూడం జాలక వానరులు భయభ్రాంతచిత్తులై కనుకనిం బఱచి రామునిమఱుఁగు సొచ్చిన నత్తెఱం గాలోచించి సహింపక లక్ష్మణుండు సంక్రుద్ధుండై యారాక్షసునిం దాఁకి. 1356

చ. చటులగుణారవార్భటులు చండతరంబుగ మ్రోయ విస్ఫుర
త్పటుహుతభుజ్మహాశిఖలభంగి వెలుంగుశరంబు లేడు మి
క్కుటముగ వింటఁ గూర్చి యలఘుక్రమ మొప్పఁగఁ గ్రవ్యభుగ్వృహ
న్నిటలము దాఁక నేసిన గణింపక చాలఁ దృణీకరించుచున్. 1357

క. మత్తుండై రాక్షసుఁడు వి,యత్తల మదరంగ వేగ యార్చుచు ధరణీ
భృత్తిలకుఁ డైనయారఘు,సత్తము డాయంగ నేగె క్షమ కంపింపన్. 1358

సీ. అంత రఘూత్తముఁ డత్యంతరయమున ననుగునిమీఁద రౌద్రాస్త్ర మేసి
తోడ్తోడ రవికరతుల్యనారాచంబు లురమున నాటింప నుగ్రదైత్యుఁ
డంగారమిశ్రంబులైనపెన్మంటలు వదనశోచిష్కేశువలన నిగుడ

రామాస్త్రవిద్ధుఁడై భీమసంక్రుద్ధుఁడై మేఘంబుకైవడి మేను పెంచి
తే. ఘోరవానరవీరులఁగుండె ఝల్లుమనఁ, జాల నార్చుచు శిఖిఁ జేరుతూలరాశి
కైవడి రఘుప్రవీరునిఁ గదియవచ్చె, రాముఁ డదిచూచి కోపించి రయమునించి.

## రామకుంభకర్ణుల యుద్ధము.

ఉ. కాలకటాక్షతుల్యపటుకాండము లేసిన వాఁడు విద్ధుఁడై
సాలముమాడ్కి మైమఱచి చాలఁ జలించిన నంతలోనఁ ద
చ్ఛైలనిభాంగసంస్థితగదాముసలాదివరాయుధంబు లా
భీలముగా మహిం బడియె భీతి బలంబు దొలంగి పాఱఁగన్. 1360

చ. అసురవరేణ్యుఁ డీగతి నిరాయుధుఁడై రుధిరోక్షితాంగుఁడై
యసదృశధాతుశోభితకులాద్రివిధంబునఁ జాల నొప్పుచుర్
మసలక వీరు వారనక మర్కటదైత్యులఁ బట్టి మ్రింగుచు
న్విసువక గాలఁ గేల నరివీరుల నద్భుతభంగి మట్టుచున్. 1361

క. తుంగమదువు సొచ్చినమాతంగముక్రియ దనుజవిభుఁడు తరుచరబలము
న్బొంగి కలంచుచు నారఘుపుంగవునిం గదిసెఁ బెద్దభూతముమాడ్కిన్. 1362

వ. ఇట్లు గదియం జనుదెంచి. 1363

మ. బలవంతుం డగురాక్షసోత్తముఁడు కుప్యత్సూర్యజాకారుఁడై
యలుక న్భీమపరాక్రమం బలర దైత్యశ్రేణు లెన్నం గులా
చలశృంగం బొక టుద్ధతిం బెఱికి దోస్సత్త్వం బెలర్పం బ్రచం
డలసద్వైఖరి వీచి రామవిభునిం దాఁకంగ వైచె న్రహిన్. 1364

సీ. అది చూచి రఘువీరుఁ డత్యంతరయమునఁ జామీకరవిచిత్రశరము లేడు
నిగిడించి నడుమనె నగశృంగమును ద్రుంప నది వేయి వ్రయ్యలై త్రిదశశైల
శృంగంబుగతిఁ జాల నింగి వెలుంగుచు ధరణిపైఁ గూలిన దానిక్రిందఁ
బడి కపు లెక్కండ్రు మడిసి రప్పుడు సుమిత్రాతనూజుం డలరాముఁ జూచి

ఆ. దేవ కుంభకర్ణుఁ డెగఁ జూడు మిప్పుడు, జాగు సేయ నేల యోగములను
బెక్కుఁ గంటి వీఁడు నిక్కంబు హతుఁ డగు, భవదమోఘబాణపాతనమున.

వ. మహాత్మా వీఁడు శోణితగంధమత్తుండై తనవారి నెదిరివారి నెఱుంగక వాన
రుల రాక్షసులం బట్టి మ్రింగుచున్నవాఁడు వానరయూథముఖ్యు లందఱు
వీని నారోహించి ముష్టితలప్రహారంబుల మర్దించువారుగా నియోగింపు మట్ల
యిన నిద్దురాత్ముండు వానరారోహణగురుభారపీడితుండై బలంబుల వధింపం
జాలక పుడమిం ద్రెళ్లు నని పలికిన నద్దశరథరాజనందనుండు తమ్ముని మాటలకు
సమ్మతించి యట్లు సేయుం డని వానరుల కానతిచ్చిన నబ్బలీముఖులు సంహృ
ష్టులై కుంభకర్ణునిమీఁద నారోహించిన నతండు సంక్రుద్ధుండై మదహస్తి
యుంబోలె మహావేగంబున నొడలు విదిర్చిన నక్కపులు పట్టు దప్పి యెక్క

డెక్కడం బడి రిట్లు నిర్ధూతు లైనవానరులం జూచి కుంభకర్ణుని దుష్టునిఁగా నెఱింగి రాముండు క్రోధతామ్రేక్షణుం డై శీఘ్రంబున భుజంగకల్పంబును దృఢ గుణంబును దపనీయచిత్రంబును మేరుసమానసారంబు నగుకార్ముకంబు సజ్యం బుచేసి నిబద్ధోత్తమతూణుం డై పరమదుర్జయుం డై మహాతేజుం డై లక్ష్మణా నుచరుం డై కుంభకర్ణభయార్దితు లైనవానరుల నంతఱ నాశ్వాసించి హర్షంబుఁ బుట్టించుచు వానరులం గూడి తనచూపుచిచ్చున వైరుల దహిం చుచుఁ గట్టెదుట రక్తాక్షుం డై కిరీటకుండలాలంకృతుం డై శోణితాప్లుతలో చనుండై యద్భుతదర్శనుండై వింధ్యమందరసంకాశుం డై కాంచనాంగదభూష ణుం డై కాలాంతకయమోపముం డై దీప్తానలసమతేజుం డై వాతోద్ధతమేఘ కల్పుం డై భుజంగరాజోత్తమభోగబాహుం డై ధరణీధరతుల్యగాత్రుం డై సముత్థితమహామేఘంబు వర్షంబుం బోలె వక్త్రంబువలన రుధిరంబు స్రవిం చుచు దీర్ఘజిహ్వచేత శోణితంబుఁ బరిలేహనముచేయుచు వానరానీకంబుం బట్టి మ్రింగుచు దుష్టుం డైనదిశాగజంబుమాడ్కి మదించి రాక్షసపరివారితుం డై వానరుల వెదకుచు విహరించుచున్నకుంభకర్ణు నవలోకించి గుణప్రణాదంబు సేయుచు రాముం డిట్లనియె. 1366

సీ. రాక్షసాధమ నీవు రమ్ము కార్ముకబాణపాణి నై నిను వధింపంగఁ బూని
యున్నాఁడ నీమది నన్ను రామునిఁ గాఁగ దెలియు మిప్పుడె నిన్నుఁ దీర్చివుత్తు
నన విని యాదైత్యుఁ డతని రాఘవునిఁ గా నెఱిఁగి సక్రోధుఁడై హరులగుండె
లవియ మేఘముమాడ్కి నతివికృతంబుగా నవ్వి పార్శ్వముల వానరులు చేర

తే. కుండ నదలించి బెట్టుగా హుంకరించి, రాము నీక్షించి ఘోరవక్త్రంబు దెఱచి
వెడఁదకోఱలకాంతులు వెలికి నిగుడ, దిట్టఁదనమునఁ బరుషోక్తి నిట్టు లనియె.

తే. ఖరుఁడఁ గాను విరాధుండఁ గాను మఱిక,బంధుఁడను గాను వానరపతినిగాను
దాటకేయుండఁ గాను విత్రాసితయము, వాసవుఁడఁ గుంభకర్ణుండ వచ్చినాఁడ.

చ. నరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకి
న్నరుల ననేకుల న్మను రణంబునఁ జంపి ప్రసిద్ధి గన్న మ
ద్గురుతరవజ్రతుల్యపటుఘోరమహాయసనిర్మితోగ్రము
ద్గరమును జూడు మో నృపసుతా నిను దీన వధించి పుచ్చెదన్. 1369

క. ముక్కు సెవులు లేవని నను, మిక్కిలి నవ్వంగ వలదు మిహిరకులేశా
ముక్కులు చెవులుం బోయినఁ, దక్కువ యయ్యెనె పటుప్రతాపబలంబుల్.

తే. రఘుకులోత్తమనీదువీర్యంబునాదు,గాత్రములయందుఁ జూపుమక్కజముగాఁగ
నవల దృష్టవిక్రాంతుండ వైననిన్ను, మ్రింగి పుచ్చెద నసురులు పొంగి పొగడ.

చ. అని యిటు రాక్షసప్రవరుఁ డాడిన రామవిభుండు నెమ్మనం
బునఁ గడుఁ గోప మూని దృఢపుంఖశితాగ్రశిలీముఖంబు లా

దనుజుని మేన గ్రుచ్చిన నతం డిటు వజ్రసముగ్రవేగత
ఘనశరవిద్ధుఁ డయ్యుఁ బెనుగట్టుక్రియం జలియింప కుండినన్. 1372

వ. తత్ప్రకారంబు విలోకించి రఘుపుంగవుండు. 1373

చ. ఇలఁ బడ సప్తసాలముల నేవిశిఖంబులఁ గూల్చె నేశరం
బుల హరినాథునిం దునిమెఁ బొల్పుగ నేదృఢమార్గణంబులన్
జలధి గలంచె నట్టిపటుసాయకము ల్రిపుమేన గ్రుచ్చినం
గులిశనిభంబు లయ్యుఁ గుంఠితసారము లయ్యె నెంతయున్. 1374

చ. దనుజవరుండు సాంద్రజలధారలనట్లు తదంబకంబులం
బనివడి యాత్మదేహమునఁ బాని మొనర్చుచు నుగ్రవేగము
న్ఘనరుధిరోక్షితంబు పవికల్పము నై తనరారుముద్గరం
బున హరిసేనలం జదియ మోఁదుచు బాణములం దెరల్చుచున్. 1375

వ. మదోన్మత్తుం డై విహరించుచున్నం గనుంగొని రామభద్రుండు రౌద్రరసోల్లాన
మూర్తి యై రయంబున. 1376

సీ. అసురునిమీఁద వాయవ్యాస్త్ర మేసిన నది ఘోరతరముగా నరుగుదెంచి
ముద్గరయుత మైన తద్గురుబాహువు ఖండింప నది మహోగ్రస్వనంబు
సేయుచు నీలాద్రిశిఖరంబుకై వడి హరిరాజసైన్యంబునందుఁ బడియె
దాని క్రింద ననేకతరుచరవీరులు హతు లైరి తక్కినయద్రిచరులు

తే. దారుణం బైన రఘునాథదనుజనాథ
సంగరంబు విలోకించి యంగములు వ
డంక మోముల దీనత్వ మంకురింప
దవ్వులకుఁ బాఱి రతిభీతి నివ్వటిల్ల. 1377

### రాముఁడు కుంభకర్ణుని వధించుట.

వ. ఇట్లు కుంభకర్ణుండు రామాస్త్రనికృత్తబాహుం డై నికృత్తశిఖరం బైనమహా
చలేంద్రంబుభంగిఁ జూపట్టుచుఁ దక్షిణకరంబున మహోన్నతం బైన
యొక్కసాలవృక్షంబుఁ బెఱికికొని ఘోరప్రకారంబున రామునిమీఁద నడరిన
నమ్మహాత్ముం డైంద్రాస్త్రమంత్రప్రయుక్తం బైనజాంబూనదచిత్రితసాయకం
బున ససాలవృక్షంబును సముద్యతంబును బన్నగభోగకల్పంబు నైనకుంభకర్ణుని
కరంబు దెగ వ్రేసిన గిరిసంకాశం బైనతత్కరంబు దునిసిపడి యనేకవృక్షం
బులఁ బాషాణంబుల వానరుల రాక్షసుల నుగ్గునూచంబు గావించె నిట్లు భిన్న
బాహుం డై మహానాదంబు సేయుచుం బఱతెంచుచున్నరాక్షసునిం జూచి
రాముండు వెండియు నిశితార్ధచంద్రబాణమ్ముల వానిపాదంబులు రెండు ఖం
డించిన నవి దిక్కులును విదిక్కులును గులాచలంబులును భూమ్యంతరిక్షంబు
లును మహార్ణవంబును లంకాపురంబును హరిరాక్షససైన్యంబులును బ్రతి

ధ్వనులు సేయ నినాదంబు గావించుచు ధరణిం బడి రిట్లు విలూనకరచరణుం
డై యామినీచరుండు బడబాముఖసంకాశం బైనవక్త్రంబు దెఱచికొని గర్జిం
చుచు నంతరిక్షంబునఁ జంద్రునిం గదియఁ జను రాహువుపోలికె రామునిం గదియ
నేతెంచుచున్నం జూచి యప్పరమాస్త్రవిదుండు శీఘ్రంబున. 1378

చ. అసురముఖంబునందు నిశితాగ్రసువర్ణవినద్ధపుంఖవ
జ్రసమశరంబు లేసిన నిశాచరుఁ డంబకపూర్ణవక్త్రుఁ డై
వసమఱి దేఱిమూఁగ నొకవాక్యముఁ బల్కఁగ నాలకింప వె
క్కసముగ డాయఁగా వశము గాక భ్రమించుచు నుండ నయ్యెడన్. 1379

సీ. జాంబూనదవిచిత్రచారుసుపుంఖంబు సందీప్తపావకసంప్రకాశ
మర్కమరీచితుల్యము వాయుసమవేగ మతిశితంబు వీర్యాధికంబు
బ్రహ్మదండాంతకపాశకల్పంబు నిస్తులము వజ్రాశనితుల్యసార
మాతతతేజం బరాతులకశుభప్రదం బమోఘం బసాధ్యంబు నైన

తే. దారుణైంద్రాస్త్ర మరిఁ బోసి దనుజవరుని
మీఁద నిగిడింప నది మింట మెఱుఁగు మెఱసి
నట్లు మెఱయుచు మంటలు చుట్టఁ బర్వ
వేయిపిడుగుల మ్రోఁతతో డాయ నరిగె. 1380

వ. ఇట్లయ్యమోఘాస్త్రంబు రామబాహుచోదితం బై స్వతేజంబున దిశలు వెలిం
గించుచు రయంబునం జని మహాపర్వతకూటసన్నిభంబును వివృత్తదంష్ట్రాచల
చారుకుండలంబు నగుకుంభకర్ణశిరంబు ఖండించినఁ బర్వతసన్నికాశం బైన
తచ్ఛిరంబు రామబాణాభిహతం బై కర్తనవేగంబున మింటి కెగసి కుండలాలం
కృతం బై రాత్రియందుఁ బునర్వసూనక్షత్రంబు విదితం బగుచుండఁ దన్మధ్య
గతుం డైనశశాంకుండుంబోలె వెలుంగుచుఁ దక్షిణంబ చర్యాగృహగోపుర
ప్రాకారంబులమీఁదం బడిన నవి చూర్ణంబు లయ్యె హిమవత్ప్రతీకాశం బైన
తదీయకళేబరంబు సముద్రజలంబులం బడి మహాగ్రాహమీనకచ్ఛపకాకోదరం
బుల మర్దించి భూతలంబు ప్రవేశించె నిట్లు మహాబలుండును బ్రాహ్మణదేవ
శత్రుండు నగుకుంభకర్ణుండు రణంబున నిహతుం డగుచుండ ధరాధరసహితం
బుగా ధరణీచక్రంబు చలించె నప్పుడు దేవర్షిబ్రహ్మర్షిసురసిద్ధసాధ్యగరుడోరగ
గుహ్యకయక్షగంధర్వకిన్నరవిద్యాధరాదులు రామపరాక్రమహర్షితు లై గగ
నంబునఁ దుములంబుగాఁ బ్రశంసించిరి కుంభకర్ణునిపాటు విలోకించి నైరృత
రాజబాంధవు లగుయాతుధానులు దుఃఖితు లై తొల్లి హరిం గన్నరాక్షసుల
కరణి రామునిం జూచి భయభ్రాంతు లై మిక్కిలి ఘోషించుచుఁ గనుకనిం
బఱచిరి రామభద్రుం డివ్విధంబున సప్తమదివసంబునఁ గుంభకర్ణునిం దెగటార్చి
వృత్రాసురునిం జంపినపురందరునిమాడ్కిఁ దేజరిల్లుచు రాహుముఖవిము
క్తుం డైనసూర్యునిభంగి దుర్నిరీక్షుఁ డై వానరచమూమధ్యంబునఁ బరమా

నందంబునం బొదలుచుండె వానరు లందఱుఁ బ్రబుద్ధపద్మప్రతిమంబు లైన యాననంబులతోడ హర్షరసావిష్టచిత్తు లై యిష్టభాజనం బైనరామునిం బూజించి రంత హతశేషు లైనరాక్షసులు రయంబున లంకకుం బాఱి రావణు నవలోకించి శోకంబున నిట్లనిరి. 1381

రాక్షసులు రావణునకుఁ గుంభకర్ణమరణమును దెల్పుట.

సీ. కాలాభుఁ డగుకుంభకర్ణుండు నీతమ్ముఁ డరిసేన ననిలోన నుఱుము చేసి
ప్లవగులఁ బెక్కండ్ర భక్షించి కడు వెక్కసంబుగా ఘోరరణం బొనర్చి
తుదిఁ గృత్తకంఠోరుదోర్మధ్య మగునట్లు దశరథసుతబాణదళితుఁ డగుచు
దావదగ్ధం బైనతరువుమాడ్కి లగండభూతుఁడై వికృతుఁ డై పొలుపు బలుపు
తే. దక్కి యర్ధప్రవిష్టగాత్రమున జలధి
నమిత మగుశరీరోర్ధ్వభాగమున లంక
గవను నరికట్టి శక్రసంకాశరాను
తేజమున శాంతుఁ డయ్యె రాత్రించరేంద్ర. 1382

క. అని పలికిన దశకంధరుఁ, డనుజుఁడు దెగుట విని దుఃఖితాత్ముం డై గ్ర
క్కునఁ గప్పినమోహంబునఁ, దనువు మఱచి యవశుఁడగుచుధరణిం బడియెన్.

క. హతుఁ డయినపితృవ్యుని విని, యతికాయుఁడు త్రిశిరుఁడును నరాంతకుఁడునుమహా
ద్యుతి దేవాంతకుఁడును శో, కతిరోహితచిత్తు లగుచుఁ గడు నేడ్చి రొగిన్.

తే. ఘనరణంబున నక్లిష్టకర్ముఁ డైన
రాఘవునిచేతఁ జచ్చిన భ్రాతను విని
పార్శ్వమున మహోదరమహాపార్శ్వ లధిక
శోకవిక్రాంతు లై చాల స్రుక్కి రపుడు. 1385

ఆ. అంత గొంత వడికి నధికయత్నంబునఁ, దెలివి నొంది దనుజకులవిభుండు
దైత్యవర్యుఁ డైనతమ్ముఁడు పడుటకు, దీనుఁ డగుచుఁ జాల దిగులు గదుర.

రావణుఁడు నానావిధంబుల విలపించుట.

వ. ఇట్లని విలపించె. 1387

క. హావీర హామహాబల, హావైరివినాశ హామహాగుణశాలీ
దైవోపహతుఁడ వైన, న్నీవిచ్చట విడిచి పోయి తే యమపురికిన్. 1388

తే. నాదుహృదయశల్యంబు బాంధవులదుఃఖ
మపనయింపక శత్రుసైన్యముల నేర్చి
నరవరశరార్దితుండ వై నన్ను విడిచి
యొంటి నీ వేగితే యిట్లు జంటఁ బాసి. 1389

తే. రణములో నేఁడు నాదుదక్షిణభుజంబు
తెగి పడియె నొంటి నే నింకఁ బగఱ నెట్లు
గెలుతు నేభంగి దేవదైత్యులఁ దలంచి
యడలు గైకొన కుందు జయంబు గొందు. 1390

క. కాలాగ్నిగతి వెలుంగుచు, వాలాయము దేవదైత్యవర్యుల ననిలోఁ
దూలించి విక్రమంబునఁ, గ్రాలెడు నీ విపుడు పడితె రామశరమునన్. 1391

చ. అసురవరేణ్య తొల్లి కతినాశని వ్రేటున కించుకైన దు
ర్వ్యసనము నొందనట్టి బలవంతుని [illegible] నిన్ను నేఁడు ఘో
రసమరమందు మర్త్యుఁ డగు రాఘవుఁ డొక్క శిలీముఖంబున
న్వెస వధియించెఁ గాలగతి వింతయు వచ్చె నిఁ కేమి సేయుదున్. 1392

సీ. అద్రులఁ బిండిసేయఁగ నోపు వజ్ర మెవ్వానిశిరమునకు వజ్ర మయ్యె
దనుజుల నెల్లఁ ద్రుంచినవిష్ణుచక్ర మే బలశాలి యఱుతకుఁ బతక మయ్యెఁ
బ్రజలఁ ద్రుంపఁగఁజాలురవిపుత్త్రుదండ మే దనుజేంద్రుమేనకుఁ బూదండయయ్యె
నప్రతిహత మైనయలపాశిపాశ మే ఘనునిబాహువుల కంగదము లయ్యె

తే. నట్టిజయశాలి వైన నీ వసురవర్య
ప్రధనమున నొక్క మర్త్యమాత్త్రకునిచేత
హతుఁడ వైతివి తొల్లిటి యలవు బలము
పృథుపరాక్రమపటిమ నేఁ డెందుఁ బోయె. 1393

చ. నిహతుఁడ వైననిన్నుఁ గని నేఁడు సుపర్వులు చారణుల్మును
ల్గహనయ[illegible] [illegible] మోదంబునఁ గ్రాలుచు నున్నవార లా
గహనచ[illegible] [illegible] మోదకుతూహలం బగురింపఁగ లబ్ధలక్ష్యులై
[illegible] నిఁక [illegible] ప్రాఁకఁగఁ బూనుదు రేమి సేయుదున్. 1394

తే. చండతేజ భవద్విహీనుండ నైన, నాకు సామ్రాజ్య మేల యీనగరమేల
జీవితం బేల సిరి యేల సీత యేల, హయము లేల మదేభసంచయము లేల.

ఆ. నిన్నుఁ జంపినట్టి నృపకులతిలకుని, నాజి నేను జంపనైతి నేని
బ్రతికి యేమి ఫలము పంచత్వ మధికోదయంబు గాదె రాక్షసావతంస. 1396

తే. దేవకంటక యిప్పుడు నీవు పడిన
విషయమున కేను వచ్చెద విడువఁ జాలఁ
బ్రాణతుల్యుఁడ వగునిన్నుఁ బాసి ధాత్రి
నిమిష మైనను జీవింప నేర్తునయ్య. 1397

సీ. నీవు రణంబున నిహతుండ వగుచుండఁ గనుఁగొని పూర్వాపకారి నైన
నన్నింక వేల్పులు గ్రన్నన హింసింతు రింద్రాదిరిపుల నిం కెట్లు గెలుతుఁ
జతురాత్ముఁ డగువిభీషణుఁడు చెప్పినహితం బజ్ఞానమున విననైతి నపుడు

తద్వాక్య మంతియుఁ దథ్యమై చేకూడెఁ గామాంధునకు నెందుఁ గలదె పెంపు
తే. శూరశేఖరుఁ డగుప్రహస్తుండు నీవు, దారుణం బగుసంగ్రామతలమునందు
బడిన నప్పటినుండి మద్భావమునకు, సత్య మని దోఁచె నవ్విభీషణునిపలుకు.
వ. మఱియు మహాత్ముం డైనవిభీషణునిఁ బాపచిత్తుండ నై దురహంకారంబున
సభలో నిందించి పురంబువెడల ననిచితి నని యిట్లు విలపించుచున్నదురాత్ముం
డగురావణునిపరిదేవితంబు విని త్రిశిరుం డిట్లనియె. 1399

త్రిశిరుఁడు రావణు నాశ్వాసించుట

సీ. అధికమహావీర్యుఁ డగుకుంభకర్ణుండు పగతులఁ బెక్కండ్ర బారిసమరి
తుదిఁ గాలధర్మయుక్తుం డయ్యె నతనికై శోకింప నేటికి శూరవరులు
నీయట్లు వగవరు నీవు ధీరుండవు భువనకంటకుఁడవు భూరిబలుఁడ
విటు ప్రాకృతునిభంగి నేల దుఃఖించెదు పరిపంథులకుఁ జాలఁ బలుచన యగు
తే. నింతమాత్రంబుచేత నీకేమి గొఱఁత, బ్రహ్మదత్తధనుశ్శక్తిబాణకవచ
ములు సహస్రఖరోపేతజలదనినద, కాంచనరథంబు మేమును గలిగి యుండ.
క. ఒకటం గైదువులేకయ, సకలసురాసురుల మున్ను చంపిపి వనిలో
సకలాయుధయుక్తుఁడ వై, యొకనరుఁ ద్రుంచుటకు నింత యోచన యేలా.
చ. అసురవరేణ్య యూఱడిలు మాజికి నే నిపు డేగి దోర్బలం
బెసఁగఁగఁ బన్నగాశనుఁ డహిప్రకరంబులనట్లు వైరుల
న్వెస వధియించెద న్నరకు విష్ణుఁడు జంభుని శక్రుఁడుంబలె
న్దశరథనందనుం దునిమెద న్రహి నీకు జయం బొసంగెదన్. 1402

రావణుఁడు దేవాంతక నరాంతక త్రిశిరోతికాయమహోదర మహాపార్శ్వుల యుద్ధమునకుఁ బంపుట.

వ. అని పలికినఁ ద్రిశిరునివచనంబు విని రాక్షసేంద్రుం డగురావణుండు క్రమ్మఱ
ధైర్యం బవలంబించి తన్నుఁ బునర్జాతునింగాఁ దలంచుకొనుచు నమ్మహావీరుని
రణప్రయాణంబున కీయకొనియె నంత మహావీరు లగుదేవాంతకనరాంతకు
లును దేజస్వి యగునతికాయుండును యుద్ధహర్షితు లై త్రిశిరునకు బాసటగా
రణంబునకు సన్నద్ధు లై రిట్లు మహావీరులును శక్రతుల్యపరాక్రములును గగన
సంచారక్షములును మాయావిశారదులును దేవదానవదర్పఘ్నులును రణదుర్జ
యులును బలపరాక్రమసంపన్నులును విస్తీర్ణకీర్తులును సమరంబునం దశ్రుత
పూర్వపరాజయులును దేవదానవగంధర్వయక్షకిన్నరహృదయశల్యులును రణ
పండితులును యుద్ధమార్గవిశారదులును బ్రహ్మవరవిజ్ఞానులునులబ్ధవరులునుభాస్క
రతుల్యతేజులు నవ్యర్థనామములును రావణనందనులు నగు దేవాంతకనరాంతకత్రి
శిరోతికాయులు నల్వురు జాతరోషు లై యేన యేన రణంబునకుం జనియెద
నని పంతంబు లొడ్డుచు మేఘంబులకరణి గర్జించుచు ననుజ్ఞాకాంక్షు లై రావ
ణుం బరివేష్టించి కొలిచి యుండి రిట్లు నందనులచేత నుపాస్యమానుం డై శతు

బలమర్దనుం డగునద్దశగ్రీవుండు విబుధులచేత నుపాస్యమానుం డైనదేవేంద్రుని చందంబునం దేజరిల్లుచుఁ బుత్రులం గౌఁగిలించుకొని సర్వాభరణభూషితులం గావించి వీర్యవంతంబు లైనవేదమంత్రంబులచేత నాశీర్వదించి సంగ్రామంబునకుఁ బొండని పలికి పదంపడి తత్కుమారరక్షణార్థంబు తనతమ్ము లైనయుద్ధోన్మత్తుం డైనమహోదరుని మత్తుం డైనమహాపార్శ్వునివెంట జంట చేసి రణంబున కనిచిన నయ్యార్వురు యోధులు రిపురావణుం డైనరావణునకుఁ బ్రదక్షిణంబు చేసి యనుజ్ఞ గొని రణోత్సుకు లై గంధమాల్యాలంకృతు లై కాలచోదితు లై సర్వాయుధపరిష్కృతు లై యాయుధప్రహారనివారకమహౌషధులు సంగ్రహించుకొని సంగ్రామంబునకు వెడలి రప్పుడు. 1403

సీ. నీలజీమూతంబు లీలఁ గ్రాలెడుదానిఁ గులపర్వతముమాడ్కి నలరుదాని
సకలహేతిచ్ఛటాసంకీర్ణ మగుదాని ఘనతూణయుక్త మై తనరుదాని
నైరావతకులంబునందుఁ బుట్టినదాని మదవిశేషమున మైమఱచుదానిఁ
గొండతో నైన మార్కొనఁగఁ జాలినదానిఁ గడు దీర్ఘదంతము ల్గలుగుదాని

తే. వరసుదర్శననామకద్విరద మెక్కి, చరమగిరిశృంగగతుఁ డైనతరణిభంగి
నింగి వెలుఁగుచు రణకాంక్షనిగుడ మృత్యు,సోదరుం డాజికేగె మహోదరుండు.

క. ఆతని వెనుకొని రథములు, మాతంగగణంబు హయసమాజము సుభట
వ్రాతము కోలాహలసం, స్ఫీతము లై యపుడు చనియెఁ బెక్కువిధములన్.

చ. ఖరకరవాజితుల్యతురగంబులఁ బూన్చి మహామణిధ్వజం
బరుదుగ నెత్తి యాయుధచయం బిడి సజ్జ మొనర్చినట్టినుం
దరరథ మెక్కి ధన్వి యయి త్రిశిరుండు నవిద్యుదుల్కభూ
ధరగతసేంద్రచాపజలదంబువిధంబునఁ జాల నొప్పుచున్. 1406

క. అనుపమరత్నవిరాజిత, కనకకిరీటత్రయాభికలితుం డై కాం
చనసునిశిఖరత్రయయుత, ఘనతుహినాచలముమాడ్కిఁ గ్రాలుచు నరిగెన్.

క. ఆరథికుని వెనుకొని దు,ర్వారగతిం జనియెఁ బెక్కురథములు హయము
లావారణములును బదాతులు, ఘోరాయుధదీప్తి గగనగోళము ముంగన్.

సీ. వాసవాద్యమరు లెవ్వనిపేరు చెవికి సోఁకినయంత నతిభయంబునఁ జలింతు
రతిరథసమ్మతుం డితఁ డని శూరు లేధీరశేఖరునిఁ గీర్తింతు రెవుడు
నినునకుఁ గల తేజ మింద్రునకుం గలవిక్రమం బెవ్వాని విడువ కుండుఁ
గాంచనాచలసన్నికాశాతిమానోగ్రకాయ మెవ్వానికిఁ గలిగి యుండు

తే. రాజనీతికి నెవ్వాఁడు రాయసంబు, అమితసత్త్వంబునకు నెవ్వఁ డాలవాల
మట్టిఘనకాయుఁ డతికాయుఁ డాజివిజిత,నిర్జరనికాయుఁడీక్షించి నేర్పు మించి.

సీ. ప్రాలేయశైలంబుభంగిఁ జాల వెలుంగు మహనీయవజ్రవర్మంబు దొడిగి
నవరత్నఖచితసుందరకిరీటాంగదప్రముఖనానాభూషణములు దాల్చి

కాకోదరస్వామికై వడి నతిఘోరవితతసారం బైనవిల్లు దాల్చి
నానాముఖవిరాజితానేకశరపూర్ణమహితతూణీరయుగ్మము బిగించి

తే. రక్తచందనమలఁదిమాల్యములు దాల్చి, రవికరంబుల మేరుపర్వతముఁ బోలెఁ
జారుచామీకరవిచిత్రచటులదివ్య, మండనద్యుతి విభ్రాజమానుఁ డగుచు. 1410

శా. తూణీబాణశరాసనోగ్రపరిఘాస్త్రోకాసిభాస్వత్తను
త్రాణోపేతము కూబరాక్షయుగచక్రస్ఫీతరథ్యధ్వజ
శ్రేణీయుక్తము నైకకాంచనమణిశ్రీరాజితాత్యున్నత
ద్రోణోర్వీధరసన్నికాశరథ మారోహించి తేజస్వి యై. 1411

మ. రథము ల్సానుజము ల్హయంబులు భటవ్రాతంబు లుద్యద్గతిం
గుధరంబు ల్దగ నాశ్రయించిన మహాక్షోణీజముల్పోలె నా
రథికశ్రేష్ఠునిఁ జుట్టుముట్టుకొని రాఁ బ్రస్ఫీతసాంద్రద్యుతిం
బ్రథనేచ్ఛ న్వడి నేగె దేవయుతజంభద్వేషిచందంబునన్. 1412

తే. అతనియాటోప మతనిశౌర్యప్రవేగ
మతనితేజంబుఁ జూచి దశాననుండు
వీఁడు పగతులఁ బరిమార్చి విజయ మొసఁగు
నిక్కువం బని తెలివొందె నెమ్మనమున. 1413

చ. అనిమిషవాజిసన్నిభసితాంగమనోజవయుక్తచారుకాం
చనమయభూషణప్రబలసైంధవరాజము నెక్కి ప్రాసి యై
ఘనశిఖి నెక్కి శక్తిఁ గొని గ్రాలుకుమారునిభంగి నొప్పుచు
న్ఘనభుజుఁ డానరాంతకుఁడు గ్రక్కున నేగె రణాభికాంక్షి యై. 1414

ఆ. అతనివెనుకఁ జనియె నరదంబు లశ్వంబు, లున్నతద్విపంబు లురుపదాతి
గణము లుగ్రభంగి గణుతింపఁగా రాక, ధరణిరజము మింటఁ దఱుచు నిగుడ.

మ. ధరణీభృత్సమసారదారుణమహాదంభోళితుల్యస్ఫుర
త్పరిఘం బొక్కటి కేలఁ బూని మును మంథానాద్రి నుద్యద్గతిం
బరమోదారత నెత్తినట్టిహరిరూపంబు న్విడంబించుచు
న్స్థిరసత్త్వం బలరార నేగె నపు డాదేవాంతకుం డాజికిన్. 1416

తే. అమ్మహావీరశేఖరు ననుసరించి
కరిఘటలు తేరు లశ్వసంఘములు భటక
దంబము లనేకములు సముదగ్రభంగిఁ
జనియె నప్పుడు కలకలధ్వనులు సెలఁగ. 1417

మ. ముద మొప్పం జెవలన్ మిడుంగుఱులగుంపు ల్దట్టమై పర్వఁగా
గద సారించుచుఁ బర్వతంబుకరణిం గాయంబు శోభిల్ల ను
న్మదుఁడై సైన్యసమేతుఁడై ధనదుచందాన న్మహిం గ్రాలుచుం

ప్రధనక్షోణికి నేగె నప్పుడు మహాపార్శ్వుండు ఘోరాకృతిన్. 1418

చ. పొదలుచుఁ బర్వకాలమునఁ బొంగుసముద్రజలౌఘ మన్మహా
నది కెదురెక్కు భంగిఁ గదనస్పృహ మీఱ బలౌఘ ముద్ధతి
న్వదలక యమ్మహారథికవర్యుల వెన్కొని యేగె బల్విడిం
బదహతి నుర్వి గ్రక్కదలఁ బాంశుపరాగము నింగి ప్రాఁకఁగన్. 1419

క. అపు డాదైత్యకుమారులు, తపనసమప్రభులు మణివతంసాయతకాం
తిపరీతులై వెలింగిరి, క్షపాచరులనడుమ మింట గ్రహములమాడ్కిన్. 1420

ఆ. మఱియు దనుజహస్తమండితధవళాస్త్ర, శస్త్రరాజి జాలశారదాభ్ర
సన్నికాశ మగుచుఁ జటులహంసావళి, భంగి నింగిపై వెలింగె నపుడు. 1421

క. అరుల వధించుట యొండెను, మరణం బొండె నని యిట్లు మతిఁ జేసి నిశా
చరవీరులు తెంపున సంగరమునకును జనిరి యపుడు కడు రభసమునన్. 1422

వ. మఱియును. 1423

మ. త్రిదశారిప్రియనందను ల్కుపితులై ధీరోద్ధతి న్యుద్ధదు
ర్మదులై దారుణశింజినీధ్వనులు మీఱ న్విండ్లు సారించుచు
న్బ్రిదరంబు ల్విగిడించుచు న్నగుచు సంభాషించుచు న్వ్రేయుచుం
గదనక్షోణికి నేగి రప్పుడు మహాకల్పాంతకాకారులై. 1424

సీ. మలయవింధ్యాదికకులమహీధరగుహాద్వారంబులను బ్రతిధ్వనులు సెలఁగఁ
గడ లెత్తి మ్రోయుచుఁ గంధు లభంగతరంగము ల్మిన్నందఁ బొంగి పొరలఁ
గోణాభిహతమైనకుంభంబుపోలికిఁ గడువడి గగనభాగంబు పగుల
లంకాత్రికూటశైలదితిజాన్వితముగా జగతి కుమ్మరసారెపగిదిఁ దిరుగఁ

తే. ఘోరకాహళశంఖభేరీరవములు, హేషలు రథస్వనములు బృంహితము లుగ్ర
భూరిసింహనాదంబు లాస్ఫోటితంబు, లేకమై మ్రోసె నపుడు దివౌకు లదర.

వ. ఇట్లు భీషణప్రకారంబున నద్దోషాచరవీరులు సకలసాంగ్రామికపరికరసమేతులై
రణంబునకు వెడలి పురంబు నిర్గమించి యగ్రభాగంబున. 1426

ఉ. పాదపము ల్మహాశిలలు పర్వతము ల్గొని నిర్విశంకులై
మోదము జన్యకౌతుకము మోములఁ గన్పడ నెవ్వ రాజి నం
వాద మొనర్ప నిచ్చటికి వచ్చెదరో యని చూచుచున్న క్ర
వ్యాదులపాలియంతకుల వానరవీరులఁ జూచి రెంతయున్. 1427

వానరరాక్షసుల యెనిమిదవనాఁటియుద్ధము.

చ. కరిరథవాజియుక్తమయి కాలవలాహకతుల్యమై నిరం
తరవరకింకిణీరవనినాదితమై రవివహ్నితుల్యక
ర్బురవృతమై సముద్యతసుపుంఖవరాయుధకేతుదండమై
తఱుమఁగ నచ్చురాక్షసకదంబముఁ గన్గొని రాబలీముఖుల్. 1428

వ. ఇట్లుద్దీప్తులై దశగ్రీవసుగ్రీవభుజాభిగుప్త నిశాటవనాటు లొండొరుల నిరీ
క్షించి లబ్ధలక్ష్యులై సముద్యతనానావిధాయుధులై భుజాస్ఫాలనంబుఁ జేసి
నింగి పగుల సింహనాదంబులు గావించి మచ్చరంబున నొండొరులఁ దలపడం
దివురుచుండునప్పుడు బలవంతు లగువానరులు విజయప్రభూతప్రమోదులై
వీర్యదర్పితులై కోపరసోద్దీప్తముఖులై భైరవారావంబులు సేయుచు భీషణ
ప్రకారంబున మహోగ్రంబైనరాక్షససైన్యంబుసొచ్చి శృంగవంతంబులైన
పర్వతంబులవడువునఁ దన్మధ్యభాగంబున సంచరించుచు గగనంబునకెగసి సాం
ద్రంబుగా శిలాపాదపవర్షంబులు గురియుచు దారుణభంగి రణంబునకుం దలప
డినఁ దద్రక్షస్సైన్యంబులు పరశుగదాముసలముద్గరకుంతప్రాసపట్టసకరవాలభిండి
వాలశరజాలంబులు పరఁగించుచుఁ గోలాహలబహులంబుగా వానరసేనం దల
పడిన నయ్యిరువాఁగులకుఁ బూర్వపశ్చిమసముద్రంబులకుంబోలె ఘోరం బగు
సంగ్రామం బయ్యె నంతఁ గపివీరులు చెలరేఁగి రాక్షసబలంబులకుం గవిసి కవచా
భరణశోభితులైనరథికులమీఁద బహుపాదపశృంగాకీర్ణంబులైనశైలంబులు
వైచియుగజారోహకులమీఁద శాఖావంతంబులైనవిశాలసాలంబులడరించియు
నాశ్వికులమీఁద హస్తిమాత్రపాషాణంబులు రువ్వియు వజ్రసమస్పర్శంబులై
నముష్టిబంధంబులఁ బదాతుల బొడిచియు నానాప్రకారంబుల విజృంభించిన
నయ్యాతుధానులు పగిలినశిరంబులతోఁ దెగినకంఠంబులతోఁ బొడియైనగా
త్రంబులతో వాంతలోచనంబులతో రోఁజుచుఁ బుడమిం ద్రెళ్లి గతాసులైరి
యుద్ధమదాన్వితులైనరాత్రించరులును వీరావేశంబునఁ గపిబలంబులకుంగవిసి
శరజాలంబులు పరఁగించుచుఁ దోమరాంకుశంబుల వ్రేయుచు ఖడ్గంబుల నఱకు
చు గదాముసలముద్గరభిండివాలశూలాదులం గ్రుమ్ముచు విక్రమవిహారంబు సలి
పిన నందు ఛిన్నోత్తమాంగులై విలూనకరచరణజానుకంఠులై నిష్పిష్టసర్వాం
గులై యనేకవానరులు ధరణింగూలి రిట్లుభయసైన్యంబులవారు పరస్పరజయ
కాంక్షులై దలపడి యన్యోన్యప్రహారంబుల విదారితశరీరులై శోణితదిగ్ధగాత్రు
లై వినష్టసర్వాయుధులై విశకలితకేతనాతపత్రచామరులై విఖండితమధ్యోరు
లై పెక్కండ్రు పొడవడంగి రప్పు డయ్యాయోధనభూమియొక్క ముహూర్తంబున
కనేకరుధిరప్రవాహసమావృతయై యగణితవికీర్ణపర్వతాకారహరిరాక్షసకళేబ
రసంపూర్ణయై కంఠదఘ్నమేదోమాంసమస్తిష్కపంకయై రాశీభూతసర్వాయుధ
ఖండజాలయై యొప్పె నంతకుఁ బిరుసనక యయ్యిరుగడలవారును రోషప్రవృద్ధస
త్త్వులై క్రమ్మఱ నద్భుతప్రకారమున రణంబునకుం దలపడి పోరాడం దొడంగి
రప్పుడు వానరులు కొండొకసేపు శిలాతరుశైలంబుల రణంబుఁ జేసి యాసన్నమ
హీరుహంబులు సమసిన రాక్షసులం గొని రాక్షసుల వ్రేయుచు రాక్షసులచేతి
యాయుధంబులఁ బెఱికికొని వారలం జంపుచు రథంబుచేత రథంబును
వారణంబుచేత వారణంబును హయంబుచేత హయంబును జావనేయుచు విచి

త్రోత్కర్షంబుఁ జూపిన నద్దానవులును మహాక్రోధంబునఁ గొంతసే పాయుధ యుద్ధంబు సలిపి యాయుధంబులు పొడి యైనవానరుల చేతిశిలాపాదపంబులను వానరులనుం గొని వానరులఁ దెగటార్చుచుఁ బరుల కాశ్చర్యంబుపుట్టించుచు బెనంగి రి త్తెఱంగున నయ్యుభయసైనికు లన్యోన్యప్రహారపీడితులై భిన్నమర్మ తనుత్రాణశరమస్తకులై మహాద్రుమంబులు నిర్యాసంబుంబోలె వెడవెడశోణితం బు స్రవించుచు ఛిన్నమూలంబు లైనతరువులపోలికి గొప్పచప్పుళ్లతోఁ బుడ మింబడిరి మఱియురక్షోరథికప్రయుక్తభల్లాంజనక్షురికార్ధచంద్రసాయకంబులం దెగి కూలినవానరప్రయుక్తశిలాశైలపాదపఖండరాసులు కొండలభంగి యుద్ధ మేదినియందు నిండియుండె నిట్లు వికీర్ణంబులై పడినపర్వతాగ్రద్రుమగజహ యరక్షోవానరకళేబరంబులచేత నయ్యాలంపునేల దుర్గమార్గ మైయుండె నివ్వి ధంబున భయంబు విడిచి గర్వితులై హృష్టచేష్టులై యదీనసత్త్వులై యుద్ధదు ర్మదు లై నరాక్షసులతోడఁ దుములంబుగా సంగ్రామంబుసేయుచు ననేకప్రకా రంబుల రాక్షసప్రకరంబుల నుగ్గునూచంబు గావించుచు విహరించుచున్న వానరులం జూచి దేవగణంబులును మహర్షులును గగనంబు నాశ్చర్యరసావిష్ట చిత్తు లై బహుప్రకారంబులం బ్రశంసించుచుండి రంత. 1429

నరాంతకుఁడు చెలరేఁగి వానరుల వధించుట.

ఉ. మారుతతుల్యవేగ మతిమానము నైనహయోత్తమంబు నిం
పారఁగ నెక్కి దీప్తశరిటనాయతశక్తి ధరించి క్రుద్ధుఁ డై
మీఱి నరాంతకుండు కడిమి న్జలధిం దరియంగఁ జొచ్చుదు
ర్వారమహానగంబుగతి వానరసైన్యముఁ జొచ్చి యుద్ధతిన్. 1430

ఉ. వానిపరాక్రమాతిశయవైఖరి యెట్టిదొ ఘోరభంగి దీ
ప్తానలహేతిమాడ్కిఁ జెలువారెడుప్రాసముచే క్షణంబులో
మానితశక్తి నష్టశతమర్కటవీరులఁ ద్రుంచి క్రమ్మఱ
న్నేనల నెల్లఁ జిక్కువడఁ జేసె సుర ల్వెఱఁగంది చూడఁగన్. 1431

మ. హరిపృష్ఠస్థితుఁ డై సముద్యతమహావ్యాళోపమప్రాసుఁ డై
హరిసేనాగణమధ్యదేశమున ఘోరాకారుఁ డై సంచరిం
చురణాభీరు నరాంతకుం గని కపిస్తోమంబు విద్యాధరు
ల్సురమర్త్యుల్ లయకాలుఁడో యనుచు విభ్రాంతాత్ము లై రత్తఱిన్. 1432

చ. వితతనగేంద్రతుల్యహరివీరకళేబరసన్నికర్ష మై
యతులితవృక్షఖండయుత మై పృథుశోణితమాంసపంక మై
యతఁడు రణార్థ మేగినమహాపథ మయ్యెడఁ జూడ నయ్యె ను
ద్ధతహలికాభికృత్తరచితస్ఫుటదావపథంబుచాడ్పునన్. 1433

క. అవిబుధరిపుఁడు కినుకం, బావకశిఖ లుప్పతిల్లు నయనంబులతో

నేవంకఁ బాఱఁ జూచిన, నావంకం బాఱఁ జూచు హరిసైన్యంబుల్. 1434

ఉ. మచ్చర మొప్పఁ గార్మెఱుఁగుమాడ్కి వెలుంగుచు రౌద్రరేఖతో
నెచ్చటఁ గన్నఁ దాన యయి యేపున విక్రమదుర్నివారుఁడై
యచ్చుపడన్నిదాఘసమయంబున శుష్కవనంబు నేర్చు కా
ర్చిచ్చువిధంబు దోఁపఁ గపిసేనల నెల్ల వధించె వ్రేల్మిడిన్. 1435

చ. విడువక వీనిపై నడరి విక్రమసంపదఁ జూపి యాజిలోఁ
గెడపుద మంచు డెందమునఁ గీశు లొకింత దలంచునంతలోఁ
గడువడిఁ గోపవేగమునఁ గన్నుల నగ్నికణంబు లొల్కఁ ద
త్తడి దుమికించి ప్రాసమున దైత్యుఁడు వారి వధించు నుద్ధతిన్. 1436

క. తరుగిరులఁ బెఱికికొని వెసఁ, బఱతెంచెడునంతలోనఁ బ్రాసాభిహతిన్
హరులు డెగి పడుదు రెంతయు, గురుకులిశాభిహతిఁ దెగినకొండలమాడ్కిన్.

క. పొలివోవనీక వానర, బలములఁ దగ నాక్రమించి బాహాటోపం
బలరార సింహము మృగం,బులనట్లు నరాంతకుండు పొలియించె రహిన్.

సీ. నాగాంతకునిలీల నభమున కెగయుచుఁ బిడుగుచందంబునఁ బుడమిఁ బడుచు
వరశరభంబుకై వడి మింట నాడుచుఁ గంఠీరవేంద్రంబు గతిఁ జఱుముచుఁ
గరువలిమాడ్కిఁ జిక్కకసంచరించుచుఁ గ్రొక్కారుమెఱుఁగులాగున మెఱయుచు
గాలమేఘముభంగి గర్జలు సలుపుచు గిరిరాజురీతి సుస్థిరతఁ గనుచు

తే. సైంధవము చిత్రగతివిశేషమునఁ దిరుగఁ
జుట్టుఁ దిరుగుచు దశముఖసుతుఁడు దారు
ణాంతకసమాన మైనప్రాసాయుధమున
నరిబలంబులఁ ద్రుంచె నత్యద్భుతముగ. 1439

క. సురరిపుఁడు చుట్టుఁ దిరిగెడు, తఱి హరిఖురధుతరజంబు దట్టంబై యం
బరవీథి కెగసి పెట్టిన, వరణముచందమున నలరె వనచరతతికిన్. 1440

తే. అచలముల నెల్లఁ బిండి సేయంగ నోపు, వజ్రవేగం బది సహింపవచ్చుఁ గాని
యాతుధానుని ప్రాసాభిపాతనంబు, హరులకు సహింప రా దయ్యె నాలమందు.

ఉ. భానుమరీచితుల్య మగుప్రాసమునం దెగి బెట్టు మ్రోయుచు
న్వానక కూలునట్టిఘనమర్కటరూపము లప్పు డెంతయు
న్గానఁగ నయ్యె వాసవునికైదువుచే వినికృత్తకూటసం
తానము లై ధరిత్రిఁ బడు దారుణభూమిధరంబులో యనన్. 1442

క. వనచరసైనికు లపుడ,య్యనిమిషరిపుబాధితాంగులై తమకంటె
న్మను ఘటకర్ణునిచేఁ జ,చ్చినవారె సుఖాత్ము లనుచు జింతించి రొగిన్. 1443

ఉ. వానిపరాక్రమక్రమము వానివిచిత్రవిహారవైఖరి
న్వానిప్రతాపవైభవము వానిసమున్నతజన్యదార్ఢ్యము

మానక చూచి రోష మభిమానము వీడి హతావశేషు లా
వానరు లార్తిఁ బాఱి రల వ్యాఘ్రము గాంచిన లేళ్లకైవడిన్. 1444

వ. ఇట్లు నరాంతకభయత్రస్తం బై యావలావలం జెదరి పఱచువానరసైన్యంబు
నవలోకించి హయపృష్ఠప్రతిష్ఠితుండై సముద్యతప్రాసుండై క్షుద్రమృగంబులం
దఱుముసింహంబుపోలికి మహావేగంబున వానరులం దఱుముకొని వచ్చుచున్న
నరాంతకుని వీక్షించి వానరవల్లభుం డగుసుగ్రీవుండు విపులగ్రీవుం డై శక్ర
సమానపరాక్రముం డగునంగదకుమారునిం జీరి యి ట్లనియె. 1445

ఉ. ఈదనుజాధముండు హయపృష్ఠగతుం డయి ప్రాసపాణి యై
మేదురచంచలాకలితమేచకమేఘముమాడ్కిఁ గ్రాలుచు
న్మోద మెలర్ప వానరసమూహములన్ విదళించుచున్నవాఁ
డాదర మొప్ప నీ వతిరయంబున నేగి వధింపు మీతనిన్. 1146

వ అని పలికిన సుగ్రీవునివచనంబు విని హరిగణశ్రేష్ఠుం డై యంగదుండు మేఘా
నీకంబువలన నిర్గమించుసహస్రరశ్మికరణి మేఘసంకాశం బైనవానరానీకంబు
వలన నిర్గమించి శైలసంఘాతసంకాశుం డై సన్నద్ధాంగదుండు నై ధాతుశో
భితం బైనమహాపర్వతంబుచందంబునశోభిల్లుచుఁ గేవలనఖదంష్ట్రాయుధుండై
రయంబునం జని యాఁకలి గొన్నసింగంబు మదపుటేనుంగుం బొదివినభంగి
నరాంతకుం బొదివి గంభీరభాషణంబుల నిట్లనియె. 1447

అంగదుఁడు నరాంతకునితో యుద్ధము సేయుట

తే. కరము దుర్బలు లైనయీకపులతోడ, నేమి పోరాడెదవు రాక్షసేంద్రతనయ
చాలశూరుఁడవేని నా మ్రోల నిలిచి, నీపరాక్రమ మంతయుఁ జూపు మిపుడు.

క. నా విని నరాంతకుఁడు క్రో, ధావిష్టమనస్కుఁ డగుచు నౌడు గఱచి యా
శీవిషముభంగి రోఁజుచు, నావాలికుమారుమీఁద నడరె లఘుగతిన్. 1449

చ. చదల మిడుంగుఱు ల్పెదర శాతకృపాణము ద్రిప్పి వీఁకతో
నదటున వ్రేసె వ్రేయుటయు నమ్మహనీయవరాయుధంబు బె
ట్టిదముగ వచ్చి దారుణపటిష్ఠమహాపవికల్ప మైనయం
గదునియురంబుఁ దాఁకి శతఖండము లై ధరఁ గూలె నత్తఱిన్. 14:0

వ. ఇట్లు సుపర్ణకృత్తోరగభోగకల్పం బై ధరణిం బడిననరాంతకునిప్రాసంబు గనుం
గొని. 1451

ఉ. వ్రేటునఁ బుట్టుకోపమున వీరవరేణ్యుఁడు వాలిపుత్త్రుఁ డు
ద్ఘాటితముష్టివజ్రనిభదక్షిణపాణితలంబు నెత్తి దో
పాటకుమారుఁ డెక్కినహిమాచలతుల్యశరీర మైనయా
ఘోటకము న్వడి న్జఱచె గొబ్బున వానరసైన్య ముబ్బఁగన్. 1452

వ. ఇట్లు హయశ్రేష్ఠంబుభుజంగరాజభోగకల్పపురందరపౌత్రపాణిప్రహారంబునవికీ

ర్ణమస్తకంబై నిమగ్నపాదంబై విస్ఫుటితలోచనతారకంబై నిష్క్రాంతజిహ్వం బై విగతప్రాణంబై పర్వతంబుకరణి ధరణిం గూలె నిట్లు పడినతురంగంబు నీక్షించి నరాంతకుండు రోషపరీతచిత్తుండై రయంబున. 1453

అంగదుఁడు నరాంతకునిం జంపుట.

చ. కడునడి ముష్టిఁ బూన్చి ప్లవగప్రవరాత్మజుమస్తకంబుపై
విడువక వ్రేసె వ్రేయుటయు వేగమె ముష్టివిభిన్నశీర్షుఁడై
వెడవెడ వేఁడి నెత్తురు స్రవింపఁగ మూర్ఛ మునింగి యంతలోఁ
దడయక తెల్వి దాల్చి విగతశ్రముఁడై కపివీరుఁ డుద్ధతిన్. 1454

చ. కులగిరిశృంగకల్పశతకోటిసమానరయోగ్రముష్టిచేఁ
జలమున వానివక్షము వెస న్విదళించిన భిన్నగాత్రుఁడై
ఖలదనుజుండు శోణితము గ్రక్కుచు నిర్గలితాక్షితారుఁడై
కులిశనిపాతభగ్నమగుగోత్రముకై వడిఁ గూలె నుర్వరన్. 1455

తే. అంగదునిచేత నిట్లు భంగి నాజి నిహతుఁ
డై పడినరావణాత్మజు నట్టె చూచి
భువిఁ గపులు మింట వేల్పు లద్భుతము నొంది
ప్రీతి నవ్వాలిసుతునిఁ గీర్తించి రపుడు. 1456

ఉ. అంగదుఁ డర్కవర్ణకనకాంగదుఁ డిట్లు దశాస్యపుత్త్రు నా
జిం గబళించి యన్యులకుఁ జెల్లనికృత్య మొనర్చి చాలఁ గీ
ర్తిం గని రామభద్రున కతిప్రమదం బొనగూర్చి వేడ్క ను
ప్పొంగుచుఁ దన్వి నొంద కటు యుద్ధసముత్సుకుఁ డయ్యె వెండియున్. 1457

వ. ఇట్లు నిహతుండై పడియున్ననరాంతకుం జూచి రాక్షసు లెల్ల శోకించి రంత భ్రాతృవ్యసనసంతప్తుండై బలవంతుండైనదేవాంతకుండు ప్రదీప్తంబైన పరిఘంబు గొని రయంబున నంగదునిమీఁద నడరె నతనికి బాసటగా ఘోటకంబుల దాఁటించి యాదిత్యసంకాశంబైనరథంబు దోలించుకొని శీఘ్రంబున నం బఱతెంచి త్రిశిరుండు వాలినందనుండలపడియె నయ్యిరువుర కపాయంబు గలుగకుండ రక్షించుకొనుటకు మేఘసంకాశంబైనవారణేంద్రంబు నెక్కి పౌలస్త్యుండైనమహోదరుండు తారేయునిం దాఁకె ని త్తెఱంగున దేవదర్పఘ్నులైనయమ్మువ్వురురాక్షసయోధులచేత నభిద్రుతుండై వానరశ్రేష్ఠుం డగు వాలిపుత్త్రుండు కోపించి. 1458

దేవాంతకమహోదరత్రిశిరు లంగదునితోఁ బోరుట.

క. బహువిటప మైనధరణీ, రుహ మొక్కటి పెఱికి తెచ్చి రోషం బడర
న్గహనాటు లెల్లఁ బొగడఁగ, రహిఁ దేవాంతకునిమీఁద గ్రక్కున వైచెన్.

క. వైచిన దానిం గాంచి క్ష, పాచరవరుఁడు త్రిశిరుండు పన్నగనిభనా

రాచంబు లేసి దనుజులు, చూచి నుతింపంగ నదుమఁ జూర్ణముఁ జేసెన్. 1460

క. తా నడరించిన తరు విటు, మానుగ హత మైనఁ గని సమంచితగతి న
ద్దానవునిమీఁదఁ దోడ్తో, వానరకుంజరుఁడు శైలవర్షము గురిసెన్. 1461

చ. అలిగి త్రిమస్తకుండు నిశితాంబకము ల్నిగిడించి విక్రమం
బలర సురేంద్రపౌత్త్రుని మహాచలవృష్టి యడంప నమ్మహా
బలుఁడు సముద్ధతి న్మరలఁ బాదపము ల్గురియింపఁ గోప మ
గ్గలముగ దాని మాన్పఁ బరిఘంబున వేగ సురాంతకుం డాగెన్. 1462

సీ. అంతఁ ద్రిశీర్షకుం డలవాలిసుతునిపైఁ గడు నల్గి నిశితాంబకముల నేసెఁ
గరిని డీకొల్పి భీకరుఁడు మహోదరుం డడరించెఁ బటుతోమరాంకుశములు
దేవాంతకుఁడు డాసి దీర్ఘోరుపరిఘంబు వెస బలంబుకొలంది విసరి వైచె
నివ్విధంబున మువ్వ రేకకాలంబునఁ బరువడిఁ బ్రహరింప సరకుగొనక

తే. ధీరుఁ డై యేకవీరుండు ఘోరభంగిఁ, గనలి కరువలిమాడ్కి వేగంబుఁ బూని
కఠినదంభోళినిభ మైనకరతలమున, నమ్మహోదరుఁ డెక్కిన హస్తి నడిచె. 1463

క. కరి యిట్లు రణార్ణవమున, హరినాథతలప్రహార హత మై యలమం
దరగిరికై వడి జలజలఁ, దిరుగుచు ఘనముగతి మ్రొసె దృక్కులు రాలన్.

ఉ. వెండియు నంగదుండు భుజవిక్రమ మొప్పఁగ నమ్మహోగ్రవే
దండవిషాణము న్బెఱికి యాదివిజాంతకుమీఁద నేయ నా
తండు ముఖంబున న్రుధిరధారలు గ్రక్కుచు విహ్వలాంగుఁ డై
చండసమీరవేగహతసాలముమాడ్కిఁ జలించి గ్రమ్మఱన్. 1465

వ. మహాబలుండు గావునఁ గొండొకసేపున కతిప్రయాసంబున నూల్కొని. 1466

క. పరిఘము ద్రిప్పి రయంబున, హరివీరుని వైవ నమ్మహాసత్త్వుఁడు ముం
దఱి కటు జానువు లూఁతగ, ధరణిం బడి యపుడె తెలిసి తడయక లేచెన్.

ఆ. అంతలోనఁ ద్రిశిరుఁ డాశీవిషోపమ, మార్గణత్రయంబు మర్కటేంద్రు
నొసలు దాఁక నేసె వెస మహోదరుఁ డల్గి, తోమరముల వ్రేసెఁ దోడుతోడ.

వ. ఇత్తెఱంగున నమ్మహాయోధులు మువ్వు రట్టహాసంబున దిట్ట లై విక్రమించి
పోరు గావింప నయ్యాయోధనం బంగదున కొక్కనికి దుర్భరం బగుట విలో
కించి హనుమంతుండును నీలుండును మహావేగంబున నురువడించి యంగదు
నకు బాసటగా వారలం దలపడిన నమ్మువ్వురకు మువ్వురతోడ మహాయుద్ధం
బయ్యె నప్పుడు. 1469

## నీలహనుమంతు లంగదునికిఁ దోడు వచ్చుట.

క. నీలుండు గినిసి రయమున, శైలాగ్రము త్రిశిరుమీఁదఁ జలమున వైచె
న్నాలికనారసముల నతఁ, డాలమ్మునఁ దూల నేసె నగ్గిరితలమున్. 1470

క. గిరిశిఖర మిట్లు శరశత, పరికీర్ణం బై ప్రవిద్ధపాషాణం బై

యురుదార మంటలు మిడుం,గుఱులు పఱవ మింట నుండి కూలె న్నేలన్.

తే. తడయ కిటు నిష్ఫలం బైన దానిఁ జూచి
హార్ష మున వీఁకఁ డై నదేవాంతకుండు
శాఖాశాఖాసముద్యతపరిఘుఁ డగుచు
మించుగతి వాయుపుత్త్రునిమీఁద నడరె. 1472

— హనుమంతుఁడు దేవాంతకునిం జంపుట. —

చ. మిడుత తెఱంగున న్మిడిసి మీఁదికి వచ్చెడు దైత్యుఁ గాంచి వీ
రుఁడు పవనాత్మజుం డతనిఱొమ్ము మహోశనికల్పముష్టిచేఁ
బొడిచి దిశ ల్నభం బగల భూరిరవం బొనరింప దానిచేఁ
బడి రిలమీఁద గుండియలు బ్రద్దలువాఱ ననేకరాక్షసుల్. 1473

తే. ముష్టినిష్పిష్టపరికీర్ణమూర్ధుఁ డగుచు
నాలుకయు దంతములు లోచనములు వెలికి
నిగుడ వికృతాస్యుఁ డై రజనీచరుండు
తత్క్షణంబ గతాసుఁ డై ధరణిఁ గూలె. 1474

వ. ఇట్లు పవమానతనయముష్టిప్రహారంబునం గెడసి పడినదేవాంతకునిం జూచి శోకరోషంబులు మనంబునం బెనంగొనఁ గ్రుద్ధుం డై నిశితాగ్రం బైన మహోగ్రబాణవర్షంబు గురియుచు త్రిశిరుం డప్పవనిపై నడరె మహోదరుం డును సక్రోధుం డై రయంబున రశ్మిమంతుండు మందరంబుంబోలెఁ బర్వతోప మం బైనకుంజరంబు నొండారోహించి యతిరభసంబుగాఁ గవిసె ని ట్లియ్యి రువు రమ్మారుతనందనునితోడఁ గొండొకసేపు నానాప్రకారంబుల దుర్భరం బుగాఁ బోరి రప్పుడు త్రిశిరుండు మరుత్తనయునితోడం బోరుచు శక్రచాప వంతం బైనతోయదంబు గిరిమీఁదంబోలె నీలునిమీఁద సాంద్రంబుగా శర వర్షంబుఁ బరఁగించిన నవ్వానరసైన్యపాలుం డమ్మహనీయసాయకౌఘంబుల చేత నభివర్ష్యమాణుం డై విభిన్నగాత్రుం డై విశ్లథావయవుం డై మూర్ఛ నొంది యొక్కింతసేపునకుఁ గ్రమ్మఱ లబ్ధసంజ్ఞుం డై శీఘ్రంబున వృక్షషండ సహితం బైనయొక్కశైలం బుత్పాటించి తెచ్చి మహోగ్రవేగుం డై గగనం బున కెగసి మహోదరునిశిరంబుపైఁ బడవేసిన నద్దానవుండు శైలాభిహతుం డై గతాసుం డై వజ్రాభిహతం బైననగంబుపగిది మహీద్విపసహితంబుగాఁ బుడమిం గూలె నంత నిహతుం డైనపితృవ్యునిం జూచి త్రిశిరుండు కోపించి రథంబు దోలించి కదియ నేతెంచి చాపంబు సారించి రోషావేశంబున. 1475

— నీలుఁడు మహోదరునిం జంపుట. —

చ. పవినిభతీక్ష్ణబాణములఁ బావని నేసిన నాతఁ డుగ్రుఁ డై
యవిరళవృక్షషండయుత మైనకులాచలశృంగ మొక్కఁ డా

దివిజవిరోధిమీఁదఁ గడు తెంపున నేసిన వాఁడు క్రుద్ధుఁడై
దవశిఖమాడ్కి మండి వెసఁ దన్నగము న్పొడి చేసెఁ దూపులన్. 1476

క. అది పరికించి మరుత్సుతుఁ, డదయుండై మింట నుండి యతిసాంద్రముగాఁ
ద్రిదశారినందనునిపై, వదలక తోడ్తోడ వృక్షవర్షము గురిసెన్. 1477

ఆ. దశముఖాత్మజుండు దారుణమార్గణ, వృష్టిచేఁ దరుప్రవృష్టిమాన్చి
మిగిలి పవనసుతునిమీఁద సాంద్రంబుగాఁ, జారుహేమపుంఖశరము లేసె. 1478

క. అనిలసుతుఁ డల్గి రయమున, ననిమిషకంటకుని తేరిహయల నఖముల
న్మనుకొని వ్రచ్చి వధించెను, ఘనకంఠీరవము మత్తగజములఁబోలెన్. 1479

సీ. అంతఁ ద్రిమస్తకుం డతికుపితాత్ముఁడై, యముఁ డుగ్రకాలదండమునుబోలె
రథశక్తిఁ గొని సమీరకుమారకుని వైవ, నది మింట నుల్కపగిది నభంగ
యై రయంబునఁ జనుదేర వీక్షించి యానగచరవీరుండు సమును నొడిసి
పట్టి చేతుల నెత్తి పట్టి బంధించి మహానాద మొనరింప నత్తెఱంగుఁ

తే. గాంచి సంహృష్టులై కీశగణము లెల్ల
నభ్రములభంగి ఘోషించి రంతఁ ద్రిశిరుఁ
డల్గి ఖడ్గంబు గొని వానరాగ్రగణ్యు
వక్షమున నేసె బాహుగర్వం బెలర్ప 1480

## హనుమంతుఁడు త్రిశిరుని వధించుట

వ. ఇట్లు మరుత్తనయుండు ఖడ్గప్రహారాభిహతుండై కోపంబు రెట్టింప భోగీంద్ర భోగకల్పం బైనకరతలంబున నయ్యసురునివక్షంబు వ్రేసిన వాఁడు మూర్ఛితుం డై మై మఱచి యాయుధంబు విడిచి రోఁజుచు మహీతలంబునం బడిన నవ్వనచరవీరుండు వానిఖడ్గంబు గొని రాక్షసు లెల్ల భయంబునం బాఱ జళిపించుచు మహానాదంబుఁ జేసె నంతలోనం దెలివొంది త్రిశిరుండు లేచి పిడుగున కెన యైనపిడికిట హనుమంతునిం బొడిచిన నవ్వీరశిఖామణి ముష్టిప్రహారప్రవృద్ధకోపుం డై శీఘ్రంబున నమ్మహారాక్షసునికిరీటంబులు నేలంబడఁ దన్ని తొల్లి పురందరుండు విశ్వరూపునిమస్తకంబులం బోలె నిశాతఖడ్గంబునఁ గిరీటజుష్టంబులును సకుండలంబులును బ్రదీప్తవైశ్వానరాయతలోచనంబులును గిరిశిఖరసంకాశంబులు నగుత్రిశిరునిశిరంబులు దెగ వ్రేసిన నవి మింటనుండి డిగి పడిననక్షత్రంబులచందంబున ధరణిపయిం బడియె నంతఁ ద్రిశిరునిమరణంబు విలోకించి వానరు లందఱుఁ బ్రీతిసంహృష్టసర్వాంగు లై సింహనాదంబులు గావించిరి రాక్షసులు భయభ్రాంతు లై మహీతలంబు కంపింపఁ గనుకనిం బఱచి రిట్లు నిహతుం డైనత్రిశిరుని నంతకు మున్ను మృతు లైనమహోదర దేవాంతకనరాంతకులను వీక్షించి మహాపార్శ్వుండు పరమామర్షి యై కాలాయసనిర్మితస్వరూపయు హేమపట్టపరిక్షిప్తయు మాంసశోణితలేపనయు శత్రు

పక్షభయంకరయు రక్తమాల్యాదిభూషితయు నైరావతమహాపద్మసార్వభౌ
మభయావహయు వపుర్విరాజమానయుఁ దేజోదీప్తసితాగ్రయు నర్చిష్మతియు
భయంకరాకారయు నైనగద సారించుచుఁ గోపవిశేషంబునఁ గాలాగ్నిభంగి
వెలుంగుచు భీషణప్రకారంబున హరులం దోలుచు రయంబునం బఱతెంచు
చున్న నమ్మహారాక్షసు నవలోకించి వానరశ్రేష్ఠుం డగుఋషభుండు మహాపర్వ
తంబుకరణి శోభిల్లుచు వానిముంగలం దోఁచిన నతనివీక్షించిమహాపార్శ్వుండు
కోపంబున. 1481

ఋషభుఁడు మహాపార్శ్వునిం జంపుట.

చ. అనుపమవజ్రకల్ప యగు నగ్గద ద్రిప్పి వనాటవీరు ఱొ
మ్మునఁ బ్రహరింప నాతఁ డటుభూరిగదాహతి భిన్నవక్షుఁ డై
యనిలహతిం జలించుకుజమట్లు వడంకుచు రక్తమానసం
బున నడిఁ గ్రమ్ము దేరఁ బెనుమూర్ఛ మునింగి యొకింతలోపలన్. 1482

ఉ. క్రమ్మఱఁ దెల్వి నొంది కపిరాజసఖుండు చలం బెలర్ప ను
గ్రమ్ముగ వానిచేతిగద గైకొని వేమఱుఁ ద్రిప్పి వానివ
క్షమ్మున వ్రేసె వ్రేయుటయుఁ జయ్యన నద్దనుజుండు దంతనే
త్రమ్ములు రాల శోణితము గ్రక్కుచుఁ గూలె గతాసుఁ డై రహిన్. 1483

తే. అసురుఁ డిట్లు వజ్రాహతం బైనకొండ, కరణిఁ గూలిన వీక్షించి కపులు పరమ
మోదమున నవ్వలీముఖముఖ్యు సన్నుతించి హర్షనాదంబు గావించి రపుడు.

ఆ. మఱియు నతఁడు పడుట పరికించి కైదువు, ల్వాఱ వైచి ప్రాణభయమువలన
భిన్ననీరరాశి సన్నికాశం బైన, త్రిదశవైరిబలము చెదరి పఱచె. 1485

అతికాయుఁడు కోపించి యుద్ధమున కడరుట.

వ. ఇట్లు చెల్లాచెదరై పఱచుబలంబును రణంబునం దెగిపడిన వాంతకనరాంతక
త్రిమస్తకమహోదరమహాపార్శ్వులం జూచి మహాతేజుండును బ్రహ్మదత్తవరుం
డును దేవదానవదర్పఘ్నుండును రాక్షసయోధముఖ్యుండును గిరిసంకాశఘోర
కాయుండు నగునతికాయుండు భీషణరోమాతిరేకవిధేయుం డై జ్వలద్భా
స్కరసహస్రసంఘాతంబుభంగి నతిభాస్వరం బైనకాంచనరథంబు నెక్కి కిరీట
మృష్టకుండలుం డై శక్రచాపసంకాశం బైనచాపంబు సారించుచు నతికా
యుండు రణంబునకుం జనుదెంచినాఁ డెఱింగి తొలఁగుం డని వానరులకుం
జెప్పుచుఁ బ్రళయజీమూతంబుమాడ్కి నాదంబు గావించుచు సారెసారెకు
గుణప్రణాదంబు గావించుచుఁ దత్సింహనాదనామవిశ్రావణశింజనీశబ్దంబుల
వానరులగుండె లవియించుచు శరాసారఘోరంబుగాఁ గవిసిన నప్పుడు వానరు
లందఱు నారాయణునిత్రివిక్రమరూపంబుచాడ్పునఁ జూడ్కికి వ్రేఁగగు చున్న
వానిదేహమాహాత్మ్యంబుఁ జూచి వెఱగందుచుఁ గుంభకర్ణుండు గ్రమ్మఱ లబ్ధ

జీవితుండై చనుదెంచెనో యనుభయంబునఁ బరమార్తులై మూఢచేతస్కులై యతనిఁ దేఱిచూడం జాలక పరస్పరసమ్మర్దనంబున విఱుగం బడుచు నతిప్రయత్నంబునం బఱచి శరణ్యుం డైనలక్ష్మణాగ్రజుని శరణంబు నొంది రప్పు డారఘుపుంగవుండు దూరంబునఁ గాలమేఘంబుకరణి గర్జించుచు రథస్థుం డై పర్వతసమానగాత్రుం డై కార్ముకజ్యానిర్ఘోషభీషణంబుగాఁ జనుదెంచుచున్నయతికాయునిం జూచి విస్మితుం డై వానరుల నెల్ల నాశ్వాసించుచుఁ బార్శ్వస్థుం డైనవిభీషణున కిట్లనియె. 1486

రాముఁ డతికాయునిం జూచి మెచ్చి విభీషణుని వానిప్రకారం బడుగుట.

చ. అనుపమధాతుశోభితకులాద్రినిభాంగము సింహనేత్రము
ల్కనకకిరీటము న్గలిగి కప్రతురంగసహస్రయుక్తకాం
చనరథ మెక్కి దీర్ఘ మగుచాపము గైకొని నచ్చుచున్నయీ
దనుజవరేణ్యుఁ డెవ్వఁ డరిదర్పహరా యెఱిఁగింపు మింతయున్. 1487

ఆ. నిశితశూలతీక్ష్ణనిఖిలాయుధసమన్వి, తాద్భుతప్రతాపయాతుధాన
యుక్తుఁ డగుచుఁ భూతయుక్తుఁ డై సపురారి, యొప్పుగలిగి గ్రాలుచున్నవాఁడు.

తే. కాలజిహ్వప్రతీకాశఘనరథస్థ, శక్తిశంఖపరీతుఁడై చటులదీప్త
చంచలాగుణపరివృతసజలఘనము, కరణి శోభిల్లు చున్నాఁడు కంటె వీఁడు.

క. అనుపమకాంచనభూషిత, ధనుశ్శతము వీనిపటురథముపై మిగులం
దనరారుచున్న దెంతయు, ఘనంబు పైఁ బొల్చుశక్రకార్ముకముక్రియన్.

చ. సురుచిరరాహుకేతనముసొంపుగ నెత్తినసూర్యవర్ణసుం
దరరథ మెక్కి దారుణధనంజయహేతిసమానకాండము
ల్దఱుచుగ నేయుచు న్స్వరుచుల న్దిశల న్వెలుఁగంగఁ జేయుచు
న్దరమిడి వచ్చునయ్యతిరథప్రవరుం గనుఁగొంటె దవ్వులన్. 1491

క. త్రిణతము ఘననిర్హ్రాదము, రణత్కనకకింకిణీకరణితం బగుత
ద్గుణయుక్తధనువు నిర్జర,గణనాథునిధనువుభంగిఁ గ్రాలెడుఁ గంటే. 1492

తే. రాక్షసోత్తమ యవ్వీరురథము కేతుసహిత మై సానుకర్షమై సయుగచక్ర
మైచతుస్సాదియుక్తమైయభ్రముగతి,మ్రోయుచు జెలంగుచున్నది మ్రోలఁగంటె.

వ. మఱియు నారథికశ్రేష్ఠునిరథంబుమీఁద ముప్పదియెనిమిది తూణీరంబులును భీమంబు లగుకార్ముకంబులును హేమపింగళంబులగుగుణంబులును జతుర్హస్తప్రమాణముష్టిచితంబులును వ్యక్తహస్తదశాయతంబు లగురెండుఖడ్గంబులును బార్శ్వభాగంబునం దనరఁ బునర్వసూనక్షత్రమధ్యగతుం డైనపూర్ణశశాంకబింబంబుకరణి మణిఖచితకుండలమధ్యంబున శుభేక్షణం బైనవక్త్రంబు శోభిల్ల దుర్గంబు లగుశృంగంబులచేతఁ బర్వతంబుకరణిఁ గాంచనాంగదపినద్ధభుజంబులచేతనలరుచు మేఘస్థుండై నభాస్కరునికరణిఁ దేజరిల్లుచు రథస్థుండై

మహారథసంబునం జనుదెంచుచున్నయీదనుజశ్రేష్ఠుం డెవ్వండు వీనిం జూచి వానరులెల్ల భయార్దితులై బెబ్బులిం గన్న లేళ్ళకరణిఁ గనుకనిం బఱచుచున్న వా రతనిచందంబు సవిస్తరంబుగా వినుపింపు మని యడిగిన నవ్విభీషణుం డవ్వసుమతీవల్లభున కిట్లనియె. 1494

విభీషణుం డతికాయునితెఱంగు రామునకుం జెప్పుట

చ. అనఘచరిత్ర యెవ్వఁడు దశాననుఁ డెవ్వఁడు రాక్షసేంద్రుఁ డా
ధనదునితమ్ముఁ డెవ్వఁ డతిదర్పితుఁ డెవ్వఁడు నెవ్వఁ డుగ్రజ
న్యనిరతుఁ డట్టిరావణున కాత్మజుఁ డీతఁడు తత్సమానుఁడుక్
ఘనుఁడు ప్రతాపవంతుఁ డతికాయుఁడు వీర్యవిధేయుఁ డుర్వరన్. 1495

సీ. అవనీశ వీఁడు సర్వాస్త్రకోవిదులలో నుత్తముండు నిశాటసత్తముండు
వృద్ధసేవియు మహావీరుండు శ్రుతధరుం డాజి దుర్జయుఁడు రణానివర్తి
యిభరథతురగంబు లెక్క క్రమంబునఁ గర్షణకార్ముకఖడ్గయుద్ధ
మొనరింప దక్షుఁడు ఘనమంత్రనిపుణుండు పండితుండు చతురుపాయకుశలుఁ

తే. డనిశ మీతనిదోర్బల మాశ్రయించి, లంక నిర్భయ యై యుండు శంకలేక
ధాన్యమాలినియందు నాదనుజవిభుని, తేజమున నుద్భవించిన ధీరుఁ డితఁడు.

మ. నృపవర్యా మును బల్తపంబున నజు న్మెప్పించి యద్దేవుచే
నిపుణత్వంబున నిర్జరాసురులచే నిత్యం బవధ్యత్వము
న్విపులస్యందనము న్మహాకవచము న్దివ్యాస్త్రశస్త్రంబులు
న్విపులం దోలెడునంతశక్తియుఁ గొనె న్వీఁ డద్భుతప్రక్రియన్. 1497

శా. శూరాగ్రేసర వీనిచే మును రణక్షోణి న్మహోదగ్రతే
జోరాసు ల్సురసిద్ధసాధ్యఫణిరక్షోయక్షగంధర్వదే
వారాతు ల్హతు లైరి దిక్పతులదివ్యాస్త్రాయుధంబు ల్బలో
దారత్వంబున నిగ్రహింపఁ బడె నింద్రద్వేషి వీఁ డెంతయున్. 1498

ఉ. వీఁడు పరాక్రమాధికుఁడు వీరవరేణ్యుఁడు సాయకంబుల
న్వాఁడి దలిర్ప జన్యమున వానరసైన్యముల న్వధించుచుక్
వేఁడిమి మీఱ వాయుసమవేగము గైకొని వచ్చుచున్నవాఁ
డోడక మీ కీక న్మనలు టొప్పదు వేగ వధింపు మీతనిన్. 1499

క. అని పలుకుచుండ నప్పుడు, ఘనుఁ డతికాయుండు తీవ్రకాండమ్ములచే
వనచరసేనలఁ ద్రుంచుచు, వనదనినాదంబు లెసఁగ వచ్చుచు నుండెన్. 1500

అతికాయుఁడు వానరుల ననేకులఁ జంపుట.

వ. ఇట్లనివార్యగమనంబున వచ్చుచున్నయతికాయునిం జూచి సహింపక వానర బలంబులందుఁ జేయం గలమేటిమగలు కుముదద్వివిదమైందశరభనీలగజగవయుని వినతాదు లుజ్జ్వలశిలాశైలసాలపాషాణపాణు లై రయంబున నమ్మహావీయుం

జుట్టుముట్టి యట్టహాసంబుఁ జేసి యేకకాలంబున ననేకశిలావృక్షంబులు పరఁగించిన. 1501

శా. ఆరక్షఃపతినందనుం డపుడు ఘోరాకారుఁడై శింజినీ
భూరిధ్వానము మింటఁ బర్వ నలుకం బుంఖానుపుంఖంబుగా
నారాచంబులు హేమపుంఖశరము ల్నాళీకబాణంబు లే
పార న్వే నిగిడించి తత్తరునగేంద్రాశ్మంబులం ద్రుంచుచున్. 1502

ఉ. మీఱి దవానలంబు కడిమి న్నిజహేతులఁ గ్రమ్మి శుష్కకాం
తారము నేర్చినట్లు పటుదారుణశాతశిలీముఖంబుల
న్వారక చుట్టు ముట్టుకొనువానరసైన్యముల న్వధించె న
వ్వీరుఁడు రావణాత్మజుఁడు వేల్పులు నింగిఁ గలంగి చూడఁగన్. 1503

తే. పట్టపగటింటిసూర్యునిభంగి నుగ్ర
మూర్తియై యతికాయుఁ డమోఘతీవ్ర
బాణకరముల వానరబలజలాశ
యమును శోషింపఁ జేసె నత్యద్భుతముగ. 1504

తే. చిత్రగతులఁ జరించుచుఁ జిత్తజల్లు, గురిసినట్లు శరౌఘము ల్పఱపఁ గపుల
భూరిశిరము లన్యోన్యాభిముఖము లగుచు, దట్టమై వ్రాలె వానిరథంబుచుట్టు.

క. పెక్కండ్ర నొక్కశరమున, నొక్కనిఁ బెక్కంబకముల నురువానరుల
న్రక్కలువాపుచు రాక్షసుఁ, డక్కజముగ నిట్లు రణవిహారము సలిపెన్. 1506

క. అక్షీణతేజమున హర్యక్షము మృగగణమునట్టు లద్భుతభంగిన్
రాక్షసనాథతనూజుఁడు, దక్షత భంజించెఁ గపికదంబము నెల్లన్. 1507

క. అపు డాకపిసైన్యములో, క్షపాచరవరేణ్యసాయకము సోఁకనివా
రపురూప మేమి చెప్పుదు, విపులంబై చెల్లె వానివీర్య మరులకున్. 1508

తే. అసురవరసాయకార్దితులై విషణ్ణవదనులై సేయునది లేక నుదిలకొనుచు
చిచ్చువడి సూచుచుండిరి వృక్షచరులు, దవముముంగలిహరిణపోతములభంగి.

తే. తఱిమి యెక్కడఁ జూచినఁ దాన యగుచు
మెఱుఁగుచందాన మెఱయుచు శరము లేయు
రాక్షసునిఁ జూచి ప్లవగవారంబు పద్మ
దళవిలగ్నతోయముభంగిఁ దల్లడిల్లె. 1510

మ. నుతదోర్వీర్యు ఖరు న్విరాధునిఁ గబంధు న్వాలి నెవ్వాఁ డనిం
జతురత్వంబునఁ ద్రుంచె నెవ్వఁ డుదధి న్సంక్షోభితుం జేసె ము
న్నతఁ డేఁడీ యిటు చూపుఁ డిప్పు డనిలో నవ్వీరుపైఁ గాని నా
యతులాస్త్రం బడరింప నంచుఁ బటుగర్వాలాపము ల్పల్కుచున్. 1511

క. ఘోరశరంబులఁ గపుల వి,దారించుచు సరభసముగ దశరథసుతునిం

జేరి ధనువు సారించుచు, ధీరోద్ధతి నిట్టు లనియెఁ దేజం బెసఁగన్. 1512

ఉ. అచ్చుగ వీర్యగర్వమున నాటికి నే శరచాపపాణి నై
వచ్చినవాఁడఁ బ్రాకృతుల వానరులం జెనకంగ నొల్ల నీ
రోచ్చలితారిపైఁ దొడరి యుద్ధ మొనర్చెద మున్ను వాలిపై
హెచ్చున వార్ధిపై నడరి యేసినబాణము లేయు నాపయిన్. 1513

చ. అని యిటు పల్కుచుండ నవు డాతనిగర్జనమేతవాక్యముల్
విని పరిపంథిహంత యగువీరుఁడు లక్ష్మణుఁ డుగ్రమూర్తి యై
ఘనతరకోపవేగమునఁ గన్నుల రక్తిమ మీఱ సాయకా
సన మవలీల నందుకొని సజ్య మొనర్చి ప్రచండవైఖరిన్. 1514

తే. పరఁగ వల్మీకగత మైనఫణినిబోలెఁ, జటులతూణీగతం బైనశాతశరము
నతిరయంబునఁ దీసి శరాసనంబు,నందు సంధించి శౌర్య మంతంత నెదుగ.

శా. కర్ణోపాంతము సోఁకునట్లు గుణ మాకర్షించి దోర్విక్రమో
దీర్ణుం డై కడు రౌద్రభంగి నభము న్దిక్కు ల్సముద్రంబులున్
స్వర్ణాద్రిప్రముఖాచలంబులు ధరాచక్రంబు పాతాళముల్
ఘూర్ణిల్లం బటుశింజినీభయదనిర్ఘోషం బొనర్చె న్రహిన్. 1516

లక్ష్మణాతికాయులపరస్పరవివాదము.

క. అనినదము చెవి సోఁకిన, దానవులు శతప్రకారదళితహృదయు లై
మానితపరశుచ్ఛిన్నము,హానగములభంగిఁ గూలి రద్భుతభంగిన్. 1517

ఉ. భీషణభంగి మ్రోయు రిపుభీకరలక్ష్మణభీమచాపని
ర్ఘోషము లాలకించి నరకుం గొన కయ్యతికాయుఁ డుగ్రుఁ డై
రోష మెలర్పఁ గార్ముకము రూఢిగ సజ్యముఁ జేసి యొక్కఘూ
రేషువుఁ గూర్చి నారి కొలఁదియించుచు సవ్విభుతోడ నిట్లనున్. 1518

ఉ. బాలుఁడ వీవు యుద్ధములపాటి యెఱుంగవు కండక్రొవ్వునం
గ్రాలెద వింతె గాని భుజగర్వ మొకింతయు లేదు నీకుఁ ద
త్కాలసమానమూర్తి నతికాయుని న న్నెదిరించి పోరఁగాఁ
జాలవు పొమ్ము రాజసుత శౌర్యధనుం డగురాముచెంతకున్. 1519

క. వాలాయము నిద్రించెడు, కాలాహిని మేలుకొలుపఁ గాంక్షించితి వీ
బాలత్వ మేల యుడుగుము, పోలదు చాపంబు విడిచి పొ మ్మావలికిన్. 1520

చ. హరిహయవహ్నిమారుతయమాదిదిశాపతు లైన మేరుమం
దరతుహినాచలాదివసుధాధరశేఖరు లైన నాజి మ
త్కరపరిముక్తశాతశరఘాటి సహింపఁగ లేరు నీకు సు
స్థిరముగ జీవితేచ్ఛ గలదేని తొలంగుము రాజనందనా. 1521

క. తొలఁగక యెడ్డారంబునఁ, దలకొని నాతోడఁ బోరఁ దలఁచితి వేని

న్నిలుపుము క్షణమునఁ బ్రాణంబులు విడిచి కృతాంతుపురికిఁ బోయెదవు రహిన్.

క. అగ్నిదర్పనిషూదనములు, హారాయుధాభములు తప్తహాటకభూషా
కరములు నిశితము లగు మ, చ్ఛరంబు లివి చూడు మిపుడు జననాథసుతా.

తే. వీరశేఖరదృప్తకంఠీరవంబు
దర్పమున మత్తకరిశోణితమునుబోలె
నస్మదీయోగ్రఫణిసమానాంబకంబు
వితతముగ నేఁడు నీదుశోణితము గ్రోలు. 1524

చ. అని యిటు పల్కి కార్ముకము నంబరమార్గము నిండ శింజినీ
ధ్వనిఁ దనరింప నాతని సధార్ష్ట్యసరోషసగర్వితోక్తిఁ దా
విని హరితుల్యవిక్రముఁడు వీరుఁడు లక్ష్మణుఁ డుగ్రమూర్తియై
యనుపమకోపవేగమున నయ్యతికాయునితోడ నిట్లనున్. 1525

చ. దనుజకులాధమా యిటు వృథాలపితంబులు పల్కినంతనే
ఘనుఁడవు గావు శూరులు వికత్థనము ల్వచియింప రీగతిఁ
ధనువును బాణము ల్గొని మదంబున నాజికి వచ్చినాఁడ నా
మునుమున నిల్చి దోర్బలసముద్ధతి నంతయుఁ జూపు మీఁదయెడన్. 1526

క. ఊరక వాదం బేటికి, వారక బాణములచేత వాదింపు మిల
న్పౌరుషయుక్తుం డగువాఁ, డారయ శూరాగ్రగణ్యుఁ డనఁ దగు ధాత్రిన్.

చ. అరదము నెక్కి నీవు వివిధాయుధము ల్గొని చాపపాణివై
పురుషత యున్నవాఁడు వలె పోరొనరింపఁగ నేగుదెంచితౌ
శరముల నస్త్రశస్త్రములఁ జక్కఁగ నేర్చినభంగి విక్రమ
స్ఫురణము సర్వము న్దెలియఁ జూపుము చూచిన మీఁద నుద్ధతిన్. 1528

క. దేవారినాథసుతుఁడవు, గావున మన్నించి కనకఖచితశరమున
న్నీవరశిర మిలఁ గూల్చెద, పవనుని వేగంబు తాళఫలమును బోలెన్. 1529

తే. తప్తకాంచనభూషణోద్యతమదీయ, మేదురశిలీముఖములు నీమీఁద వ్రాలి
బాణశల్యాంతరోత్థితశోణితంబు, తనివి దీరంగ నిప్పుడు ద్రావఁ గలవు. 1530

ఉ. బాలుఁడ నంచు నన్నదిరిపాటునఁ జుల్కనఁ బల్కి దీవు నే
బాలుఁడనో వయస్కుఁడనొ పాటిగ నిప్పుడు గానవచ్చు నీ
పాలిటి కంతకుండ నిఁకఁ బంతము లేటికిఁ దూలరాశికి
జ్వాలదె సూక్ష్మపావకకణంబు దహింప నిశాచరాధమా. 1531

క. సురకంటక బాలుం డగు, హరి మున్ను త్రివిక్రమమున నసదృశలీల
న్సురలు వెఱఁగంది చూడం, బెరిఁగి జగత్త్రయము నాక్రమించెనొ లేదో.

### లక్ష్మణాతికాయులద్వంద్వయుద్ధము

వ. అని పలికి యక్కకుత్స్థకులతిలకుండు సంక్రుద్ధుండై రయంబున శరాసనంబు

నందు శరంబులు సంధించి యద్భుతప్రకారంబున నతికాయునిమీఁద నడరె
నతండును హేతుమంతంబును బరమార్థవంతంబు నైనలక్ష్మణునివాక్యంబు విని
సక్రోధుండై చాపారోపితోత్తమబాణుండై యాఁకటితో నున్నసింగంబుపైఁ
గవియుమత్తేభంబుచాడ్పున నవ్వీరశిఖామణిం దలపడియె నప్పు డయ్యతిరథ
శ్రేష్ఠులయాయోధనంబు గనుంగొనువాంఛంజేసి దేవదానవగంధర్వవిద్యాధర
సిద్ధసాధ్యగరుడోరగగుహ్యకులును మహాత్ములగుపరమర్షులును దివ్యయానా
రూఢులై చనుదెంచి గగనంబునం బన్ని విలోకించుచుండి రంత. 1533

మ. కుపితుండై దశకంఠపుత్త్రుఁడు మహాకోదండమౌర్వీరవం
బవు డాకాశము నిండ మ్రోయ నొకసర్పాకారవజ్రోపమో
గ్రపృషత్కం బరిఁబోసి వేగ చెవి సోఁకం దీసి గట్టల్కనా
నృపవర్యాత్మజుమీఁద నేసెఁ బటుదోర్వీర్యం బవార్యంబుగన్. 1534

తే. అంబరంబునఁ జనుదెంచునయ్యమోఘ,దారుణాశీవిషోపమోదగ్రశరము
నర్ధచంద్రబాణంబున నక్కకుత్స్థ,కులవరేణ్యుఁడు ద్రుంచె నాకులు నుతింప.

ఆ. కృత్తభోగ మైనకృష్ణసర్పముమాడ్కి, నవనిఁ బడినతచ్ఛితాంబకమును
జూచి రాక్షసేంద్రసుతుఁడు కాలాగ్నిచం,దానఁ జాలఁ గనలి తత్క్షణంబ.

క. కాలకటాక్షసమానా, భీలశిలీముఖము లైదు పృథుశౌర్యశ్రీ
లోలుఁ డగులక్ష్మణునిపైఁ, గీలలు వడి నిగుడ నేసెఁ గేవలశక్తిన్. 1537

చ. జనవరనందనుం డపుడు శాతశరంబులఁ దచ్ఛరంబులం
దునిమి కృశానుహేతిసమదుస్సహశాతశరంబు సాయకా
సనమునఁ గూర్చి బాహురభసం బలరం దెగ నిండఁ దీసి యా
దనుజవరేణ్యునెన్నొసలు దాఁకఁగ నేసె మహాద్భుతంబుగన్. 1538

వ. ఇట్లు సన్నతపర్వం బైనయమ్మహనీయసాయకంబు పూర్ణాకృష్టవిసృష్టం బై వజ్రా
శనివేగంబునం బఱతెంచి భీమకాయుం డగురాక్షసునిలలాటదేశంబునాటి తదీ
యశోణితాప్లుతం బై మహాపర్వతమగ్నం బైనపన్నగంబుచందంబున నందం
బై చూడంబడియె నయ్యతికాయుండు లక్ష్మణబాణప్రపీడితుండై రుద్రబాణాభి
హతం బైనత్రిపురగోపురంబుచాడ్పున నాకంపించి గ్రమ్మఱ స్థైర్యం బవలం
బించి తదీయపరాక్రమప్రకారంబునకుఁ జింతించి విమర్శించి యాశ్వస్తుండై
లక్ష్మణు నవలోకించి రాజనందనా నీవు శత్రుండ వైనను బాణనిపాతనంబున
మిక్కిలి శ్లాఘనీయుండ వైతి వని బహూకరించి యాననంబును భుజంబులును
సవరించికొని నిశ్చలుండై యెప్పటియట్లు రథోపరిభాగంబున నాసీనుండై మంద
రాచలసంకాశం బైనకాంచనరథంబు విచిత్రగతులం ద్రిప్పుచు మండలీకృతకో
దండుండై తండోపతండంబులుగాఁ గాంచనపుంఖచిత్రితకాండప్రకాండంబులు
పరఁగించిన నవి రవిమయూఖంబులభంగి నింగి వెలుంగం జేయుచు నభంగర
యంబున నప్పతంగకులపుంగవునిదెస నడరిన నసంభ్రాంతుం డై యద్దశరథరాజ

నందనుండు నిశితంబు లగునానాముఖసాయకంబులు పరఁగించి యద్దనుజరాజ
నందనోత్సృష్టశరౌఘంబుల నివారించిన నత్తెఱంగాలోకించి కోపాటోపంబున.

చ. అసురవరేణ్యపుత్త్రుఁడు మహాహి తెఱంగునఁ గ్రాలుదోర్ఘనా
రసన మరిఁ బోసి తీవ్రగతి రామునితమ్మునివక్షమందు సా
హసమున నేసె నేయుటయు నవ్విభుఁ డించుక స్రుక్కి రక్తము
న్వెసఁ దొరఁగించి మత్తకరి వేమఱుఁ దీవ్రమదంబునుం బలెన్. 1540

తే. అంత నొక్కింత సేపున కన్నరేంద్ర,సూనుఁడు విశల్యుఁ డై రవిసూనుమాడ్కిఁ
గనలి చాపంబు సవరించుకొని ధరిత్రి, నభము పగులంగ మౌర్వీస్వనంబుఁ జేసి.

మ. ప్రభ లాశావలయంబునం దఱచుగాఁ బర్వం బ్రదీప్తాచిర
ప్రభతో దీటగుసాయకం బొకటి చాపంబందు సంధించి దై
త్యభటు ల్నివ్వెఱఁ గందఁగా నియతుఁ డై యాగ్నేయమంత్రంబుతో
నభిమంత్రించి తదస్త్రమోక్షణము సేయం బూని యుండె న్రహిన్. 1542

చ. సొలయక దైత్యుఁ డత్తెఱఁగు సూచి ప్రతాప మెలర్ప వింటఁ గుం
డలినిభ హేమపుంఖనిశితస్ఫుటకాండముఁ గూర్చి దాని సొం
పలరఁ బ్రచండభంగిఁ దపనాస్త్రముతోఁ దగఁ గూర్చె నంత న
య్యలవుచలంబుఁ జూచి మనుజాధిపనందనుఁ డల్గి చెచ్చెరన్. 1543

సీ. కల్పాంతశూలివైఖరి రౌద్రమూర్తి యై శమనుండు కాలదండమునుబోలె
దనుజకులేంద్రనందనుమీఁద దోర్వేగ మెసఁగ నాగ్నేయాస్త్ర మేయఁగ నది
పొగలేనిమంటలు గగనభాగము నిండఁ జనుదేరఁ గని వాఁడు సంభ్రమమునఁ
గడువడి సౌర్యాస్త్ర మడరింప నయ్యస్త్రములు రెండు నభమునఁ జలముమెఱయఁ

తే. దాఁకి తేజఃప్రదీప్తవక్త్రంబు లగుచుఁ, గ్రుద్ధపన్నగములమాడ్కిఁ గొంతసేపు
మింట ఖేచరు లతిభీతి నంటి పర్వ, ఘోరవీర్యంబు దీపింపఁ బోరి పోరి. 1544

వ. పదంపడి పరస్పరప్రదీప్తతేజఃప్రదహ్యమానంబులై నిస్తేజంబులై భస్మీకృతంబులై పుడమిం బడియె నంత నయ్యతికాయుండు సంక్రుద్ధుం డై రయంబునఁ ద్వష్టృదేవతాకం బైనయైషీకంబు లక్ష్మణునిమీఁద నిగిడించిన నప్పరాక్రమధుర్యుం డైంద్రాస్త్రంబున దాని ఖండించిన నన్నిశాచరవరకుమారుండు కోపించి. 1545

శా. చండాశీవిషసన్నికాశబలవత్సౌమ్యాస్త్రమంత్రోల్లస
త్కాండం బొక్కటి వింటఁ గూర్చి గుణ మాకర్షించి సంరంభి యై
నిండారం జెవిఁ దీసి లక్ష్మణునిపై నేర్పొప్పఁగా నేసెఁ గో
దండప్రస్ఫుటఘంటికాధ్వనుల దిగ్దంతిశ్రుతు ల్వ్రయ్యఁగన్. 1546

ఉ. అంత సుమిత్రపట్టి హృదయంబునఁ గోపము చెంగలింప న
త్యంతరయంబు మీఱఁ బవనాస్త్రమున న్రజనీచరాస్త్రము

న్పంత మెలర్పఁ ద్రుంచి బహుభంగుల వెంటనె డాసి వానిమే
నంతయు నొవ్వఁ జేసె సముదగ్రశితాగ్రనవాంబకాహతిన్. 1547

వ. మఱియును. 1548

ఉ. తప్పక లక్ష్మణుండు జలదంబు నిరంతరవర్షధారలం
గప్పినభంగి వేగ యతికాయుని దారుణబాణధారలం
గప్పినఁ దచ్ఛరౌఘ మది గ్రక్కున నాతనివజ్రవర్మము
న్నెప్పుగఁ దాఁకి భగ్నమయి మేదిని వ్రాలె మహాద్భుతంబుగన్. 1549

వ. ఇట్లు తనబాణంబు లన్నియు భగ్నంబు లగుట విలోకించి పరవీరమర్దనశీలుం
డగులక్ష్మణుండు కోపించి వెండియు సూర్యమరీచికల్పంబు లైనకాండసహస్రం
బులు పుంఖానుపుంఖంబులుగా నడరంచిన నవియును మోఘంబులయ్యెఁ బదం
పడి నారాచసహస్రంబులు నిగిడించిన నవియు వ్యర్థంబులయ్యె మఱియుసన్నత
పర్వంబు లగువెడందవాతియమ్ములు పెక్కు నిగిడించిన నవియు వమ్మై చెడియె
నిట్లనంతబాణౌఘంబుల నభివర్ష్యమాణుం డయ్యు నయ్యతికాయుం డవధ్య
కవచుం డగుటవలన నొక్కింత యైన వ్యధితుండు గాకుండె నిత్తెఱంగున నెన్ని
తూపులు నిగిడించియు నద్దనుజరాజనందనునకు నించుక యైన రుజ సంపాదిం
చుటకు శక్తుండు గాక వెగడుపడి యున్న లక్ష్మణునికడకు వాయుదేవుండు చను
దెంచి రహస్యంబుగా నిట్లనియె. 1550

లక్ష్మణుఁ డతికాయునిం జంపుట.

చ. అనఘచరిత్ర వీఁడు కమలాసనదత్తవరుం డవధ్యశో
భనకవచావృతుండు రిపుభంజనశీలుఁడు గాన నీకు నీ
తని సమరంబులో నిపుడు తక్కినయస్త్రముల న్జయింప రా
దనుపమఘోరపంకజభవాస్త్రమున న్వధియింపు ముద్ధతిన్. 1551

క. అని యుపదేశించిన న, య్యనిలునివాక్యంబు విని మహాత్ముఁడు బలసూ
దనసమవీర్యుఁడు లక్ష్మణుఁ, డనుపమశౌర్యం బెలర్ప నతివేగితుఁ డై. 1552

మ. రయమార న్యముదూతకల్పము విచిత్రస్వర్ణవజ్రప్రపుం
ఖయుతం బాఢ్య మమోఘవేగము శితాగ్రం బద్భుతంబు న్జగ
త్త్రయసంపూజ్యము నైనసాయకము కోదండంబునం గూర్చి వే
నియతిం బద్మభవాస్త్రమంత్ర మభిమంత్రించె న్సమగ్రంబుగన్. 1553

వ. ఇట్లు బ్రహ్మాస్త్రంబు సమగ్రంబుగా సంధించి మౌర్వీనాదంబు గావించిన 1554

ఆ. అంబరంబు మ్రోసె నద్రు లిట్టటు మ్రొగ్గె, గ్రహగణంబు మింట గాసిపడియె
దిశలు తెల్విఁ బాసె దిననాథసోములు, గతులు దప్పి యుర్వి కంప మొందె.

వ. ఇట్లు భువనభయంకరంబుగాఁ దిగిచి విడిచిన సప్పరమాస్త్రంబు జ్వలనజ్వాలిక

భంగి నింగి వెలుంగుచుఁ బ్రదీప్తాంతకకాలకల్పం బై గరుడానిలతుల్యవేగం బున నతికాయునిమీఁది కడరిన విలోకించియయ్యసురపుంగవుండవిపన్నచిత్తుం డై రయంబున. 1556

చ. పరశుగదాసికుంతములు ప్రాసపరశ్వథశక్తిశూలము
ద్గరము లనేకము ల్బఱపఁ జయ్యన నప్పరమాస్త్ర ముద్ధతి
న్మెఱయుచు వాని నన్నిటిని మ్రింగుచు వేల్పులు చూచి మెచ్చ భీ
కరగతి మీఱ నేగి యతికాయునిశీర్షము ద్రుంచె వ్రేల్మిడిన్. 1557

—రావణుఁ డతికాయాదులమరణంబు విని విలపించుట.—

వ. ఇట్లు తెఱంగున నశిరస్త్రాణం బైనయతికాయునిశీర్షంబు లక్ష్మణబాణప్రమర్దితం బై విశీర్ణభూషణం బై హిమవత్పర్వతశిఖరంబుకరణి శీఘ్రంబునమహీతలంబునం బడియె దాని విలోకించి హతశేషు లగురాక్షసులు భయభ్రాంతచిత్తు లై లంక కుం బాఱి రప్పుడు వానరు లందఱు హర్షవిశేషంబునం బొదలుచుఁ బ్రబుద్ధ పద్మప్రతిమానవదనులై యిష్టభాగి యగులక్ష్మణుం బూజించిరంతమహాతేజుం డగులక్ష్మణునిచేత నెనిమిదవనాఁటియుద్ధంబున నతికాయుండు హతుం డగుట విని రావణుండు పరమోద్వేగంబు నొంది యిట్లనియె. 1558

సీ. ఇంద్రాదిదివిజులఁ బృథుబాహుబలమున నాజి నోర్చినవిరూపాక్షుఁ డీల్గెఁ
గులశైలముల నైన నులిమి వైవఁగఁ జాలుశూరుండు వజ్రదంష్ట్రుండు మడిసె
నరుదార మృత్యువు నైన లెక్కింపనిఘనతేజుఁ డాయకంపనుఁడు గెడసె
సకలరాత్రించరసైన్యనాయకుఁ డైనచండవీర్యుఁడు ప్రహస్తుండు చచ్చె
తే. దండితారాతికుంభకర్ణుం డడంగె
దండధరసన్నిభుఁడు మహోదరుఁడు గ్రుంగె
నసురవరాళి మహాపార్శ్వుఁ డంత మొందె
శౌర్యధుర్యుండు ధూమ్రలోచనుఁడు పొలిసె. 1559

తే. మఱియు నసమానశౌర్యులు మాననీయ
మహితతేజులు ధీరులు మత్కుమారు
లధికులు నరాంతకుండు దేవాంతకుండు
త్రిశిరుఁ డతికాయుఁ డాజిలోఁ దెగిరి నేఁడు. 1560

ఆ. నాదుచండశాసనమున నాజి కరిగి, వీరుఁ డైనరామవిభునిచేత
హరులచేతఁ జచ్చి రసురు లనేకులు, శైలయోధు లధికశస్త్రవిదులు. 1561

క. జేతలు పరసైన్యములకు, నేత లసురసైన్యములకు నిత్యాజితు లా
ఖ్యాతబలపౌరుషులు ఘన, దైతేయులు చచ్చి రెంతతక్కువ యయ్యెన్. 1562

చ. నిరుపమతేజు లైనరజనీచరు లెవ్వనిచేతఁ జచ్చి రా
నరపతి యైనరాముని రణంబున భ్రాతృబలాన్వితంబుగా

నరుదు జనింప నొంపఁ దగినట్టిభుజాబలవిక్రమాధికుం
డరయఁగ లేఁడు మత్పురమునం దొకఁడైనను నేమిసేయుదున్. 1563

చ. అనిమిషలోకనాయకుని నాజితలంబున గెల్చి యింద్రజి
త్తనఁగఁ బొగడ్త కెక్కినబలాఢ్యుఁడు మత్తనయుండు గోరి చే
సిన మహనీయదత్తవరచిత్రదురాసదనాగపాశబం
ధనము లోకింత యైన రఘునాయకు నొంపఁగఁ జాల దయ్యెఁగా. 1564

చ. మఱచినఁ బోదు మోహనమొ మాయయొ మంత్రమొ సత్ప్రభావమో
నరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకి
న్నరులకు వీడ రానిపటునాగశరంబులచే విముక్తులై
సురుచిరలీల రాఘవులు సొంపుగ శోభిలు చున్నవా రొగిన్. 1565

చ. అరుదుగ నాదుపంపున రణావని కేగినయాతుధాను లెం
దఱు గల రంద ఱాలమునఁ దప్పక చచ్చిరి గాని రామునిం
దరణికుమారలక్ష్మణయుతంబుగ నొంచి చమూసమూహము
న్వరుస వధించి మేలు గొని వచ్చినవీరునిఁ గాన మొక్కనిన్. 1566

శా. సాహంకారత నేగి జన్యమున దేవారాతు లెవ్వానిస
ద్బాహావిక్రమసంపదం గెడసి రాధాత్రీశు నాయోధనో
త్సాహం బుజ్జ్వలదస్త్రసంపదయు దోర్దర్పంబు వీరవ్రతం
బాహా యేమన వచ్చుఁ దత్సముఁడు లేఁ డర్థిం ద్రిలోకంబులన్. 1567

రావణుఁడు జాగ్రత్తతో లంకను రక్షించుచుండుఁ డని రాక్షసుల కాజ్ఞాపించుట.

వ. అని బహుప్రకారంబులఁ గొండొకసేపు చింతించి చుట్లనున్నరాక్షసుల నిరీక్షించి రామునిభయంబున నీలంకె దలంకుచున్నయది మీరందఱ నప్రమత్తులై రక్షించుచుండవలయు నశోకవనికామధ్యంబున నెచ్చట సీత రక్షింపఁబడుచుండు నచ్చటికి నరవానరులు రాకుండ సర్వప్రకారంబులం గాచి యుండవలయు మఱియు సర్వగుల్మంబులయందు వేర్వేఱ బలవంతులై నదానవులుస్వసైన్యపరివృతులై యంతటం గాచికొనియుండువారుగా నియోగింప వలయు మనకేమఱియుండఁ దగదు ప్రదోషార్ధరాత్రప్రత్యూషకాలంబులయందు వానరబలంబుల విహారసముద్యోగస్థానంబులు నిత్యంబు నెఱుంగుచుండవలయు నని పలికిన నద్దశగ్రీవునివచనంబు విని రాక్షసులు తద్వచనప్రకారంబునసర్వకార్యంబులకుఁ దగువారల నియమించి రిట్లు దనుజుల కాజ్ఞాపించి రాక్షసేశ్వరుం డగు రావణుండు నిజాలయంబు ప్రవేశించి మన్యుశల్యంబు వహించి సందీపితకోపానలుండై మొగంబున దైన్యంబు దోఁప రణంబున మృతులైనకుంభకర్ణాదిభ్రాతల నతికాయప్రభృతికుమారులను బ్రహస్తాదిమంత్రులనుం దలంచుకొని శోకబాష్పపరివృతలోచనుండై మైమఱచి సారెసారెకు నిట్టూర్పులు పుచ్చుచు

రామునివిజయంబునకుఁ దనపరాజయంబునకుఁ జింతించుచు శోకార్ణవమగ్నుం
డై దరి చేర నుపాయంబు లేక తిరుగుడు పడుచున్నతండ్రి నవలోకించి రాక్షస
శ్రేష్ఠుం డైనయింద్రజితుం డిట్లనియె. 1568

—ఇంద్రజిత్తు తాను యుద్ధమునకుఁ బోయెదనని రావణు నూఱడించుట.—

చ. దనుజవరేణ్య యెవ్వఁ డరిదర్పహరుం డన వన్నె కెక్కె నె
వ్వనివటుబాణవీథిఁ బడి వాసవుఁ డైన మనంగఁ జాలఁ డా
ఘనభుజుఁ డగ్నికల్పుఁడు జగన్నుతవిక్రముఁ డింద్రజిత్తు నీ
తనయుఁడు గల్గి యుండ మదిఁ దద్దయు నీకు విచార మేటికిన్. 1569

చ. నిరుపమమచ్ఛరాసనవినిర్గతబాణవికీర్ణదేహులై
కరము గతాసులై నిశితకాండసమాచితసర్వగాత్రులై
దరమునఁ గూలియున్నహరితుల్యుల రాజకులప్రదీపులన్
నరసుల రామలక్ష్మణులఁ జయ్యనఁ జూచెదు నేఁ డధీశ్వరా. 1570

ఉ. పౌరుషదైవయుక్తమయి పాటికి నెక్కిననాప్రతిజ్ఞ నిం
పార వినుండు తొల్లి బలయజ్ఞమున న్హరివిక్రమంబున
ట్లారయ వేల్పు లందఱు మదద్భుతవీర్యముఁ జూడ రామునిన్
వారక వానితమ్ముని నవార్యశరంబుల నేఁడు ద్రుంచెదన్. 1571

క. అని పలికి యద్దశానన,తనయుఁడు త్రిదశేంద్రరిపుఁడు దారుణసత్త్వం
బనువంద ఘోరతనుఁ డై,జనకునకుం జెప్పి వేగ సంగరకాంక్షన్. 1572

చ హరిరథసన్నికాశము ననర్ఘమణిధ్వజహేమఘంటికా
పరికలితంబు నుజ్జ్వలము పావనవేగతురంగయుక్తమ
త్యురుతర మైనదివ్యరథముద్ధతి నెక్కి నితాంతతేజ మం
బరమున నిండ నేగె నసమానరయంబున జన్యభూమికిన్. 1573

శా. ఈరీతిం జనువానివెంట ఘనమత్తేభంబులం దేరులన్
సారాశ్వంబుల నెక్కి తోమరధనుశ్శస్త్రంబులం దాల్చి దే
వారు ల్వీరు లనేకు లేగిరి మహాహంకారులై యాజి కిం
పార న్బృంహితనేమినాదపటుహేషారావము ల్మీఱఁగన్. 1574

—ఇంద్రజిత్తు యుద్ధమునకు వెడలుట.—

చ. పరశుగదాకృపాణములు ప్రాసపరశ్వథశూలకుంతము
ద్గరముసలంబు లుగ్రపరిఘంబులు గైకొని తత్ప్రదీప్తు లం
బరపథ మాక్రమింపఁగ నిభంబులకై వడి మత్తులై బలా
రిరిపుపదాతు లేగిరి ధరిత్రియు మిన్నును గంప మొందఁగన్. 1575

క. భేరీస్వనములు పటుశం,ఖారావము లుగ్రకాహళార్భటులు సువ
ర్వారాతులకలకలములు,దారుణగతి నొక్కభంగి దళముగ మ్రోసెన్.

తే. శంఖశశివర్ణ పాండరచ్ఛత్ర మపుడు, శక్రజిత్తుశిరంబుపైఁ జాల నలరె
రజనియందు నభంబుపైఁ గ్రాలుపూర్ణ,నలినవనపరిపంథిమండలముకరణి.

క. హేమవిభూషితసుందర, హైమాయతచామరద్వయం బిరుగడలన్
శ్రీ మీఱ నపుడు దైత్య స్వామిసుతు నలంకరించెఁ జతురిమ మెఱయన్.

ఇంద్రజిత్తు విజయప్రదంబగుహోమము సేయుట.

వ. ఇత్తెఱంగున మహావీర్యుండును మహాతేజుండును సర్వధనుష్మన్ముఖ్యుండును పావకసదృశప్రభుండును రిపునిషూదనుండు నగుశక్రజిత్తుసర్వసన్నాహసంరంభవిజృంభితుం డై సకలసాంగ్రామికపరికరసమేతుం డై రణంబునకు వెడలి మధ్యందినాదిత్యుండు గగనంబుంబోలె నప్రతిహతతేజంబున లంకాపురంబును వెలుంగం జేయుచుఁ బూర్ణవేగంబునం జని యుద్ధభూమి డాసి యందు నొక్కవిజనప్రదేశంబున రథంబు డిగ్గి బలవంతు లగురాక్షసులఁ గాపుగాఁ దనచుట్ల నిడికొని రక్తమాల్యాంబరగంధాలంకృతుం డై పావకుం బ్రతిష్ఠించి రెండవ వైశ్వానరుండుంబోలె వెలుంగుచు శస్త్రంబులును శరంబులును దోమరంబులును బరిధులు గావించి విభీతకంబులు సమిత్తులుచేసి స్రుక్స్రువంబులు కార్ష్ణాయసంబులుగా సంఘటించి యచలనిష్ఠాగరిష్ఠుం డై మాల్యగంధపురస్కృతంబు లైన సంస్కృతహావిర్లాజంబులచేత హోమంబుగావించి హోమాంతంబునసర్వకృష్ణం బైనఛాగగళంబు ఖండించి తత్కంఠరక్తంబున పూర్ణాహుతి వేల్చిన నయ్యగ్నిదేవుండు విధూమం డై ప్రసన్నముఖుం డై ప్రదక్షిణావర్తశిఖుం డై తప్తకాంచనభూషణుం డై విజయలక్షణంబులు సూచింపం జేయుచుఁ బొడసూపి హవ్యంబులు ప్రతిగ్రహించి తృప్తుం డై బ్రహ్మాస్త్రంబును రథంబును జాపంబును గవచంబు నొసంగి యంతర్ధానంబు నొందిన నయ్యింద్రజిత్తు వైశ్వానరకరుణాలబ్ధవరాస్త్రరథకోదండతనుత్రాణుం డై సార్కగ్రహేందునక్షత్రం బైననభస్థలంబు కంపింపఁ దద్రథాదిపరికరంబులతోన మింటి కెగసి హయరథపతాకాధ్వజశోభితం బైననిజసైన్యంబు నవలోకించి యిట్లనియె.

ఉ. ఏఁ గలుగంగ మీకు భయ మింతయుఁ బుట్టదు భూరివిక్రమో
ద్యోగము శౌర్యసంపద బలోన్నతి మచ్చర ముగ్రసాహసో
ద్వేగము మీఱ నందఱును ధీరత నొక్కటఁ గీశసేనపై
కేగి ప్రతాప మొప్ప వధియింపుఁడు దానవులార హృష్టు లై. 1580

ఇంద్రజిత్తు వానరులతో యుద్ధము సేయుట.

చ. అని పలుక న్నిశాటవరు లందఱు నిర్భయు లై భయంకర
ధ్వని యొనరించుచుం గపికదంబముమీఁదికి నేగి రుష్టు లై
ననిశితభిండివాలశరశూలగదాపరిఘాసితోమరా
ద్యనుపమశస్త్రవర్షమున నద్భుతక్రైఖరి ముంచి రందఱన్. 1581

శా. కోపాటోపము బాహుశౌర్యము లసత్కోదండపాండిత్యముం
గాపట్యం బఖిలాస్త్రకౌశలము దక్షత్వంబు కౌటిల్యము
ద్దీపింప న్దశకంఠపుత్త్రుఁడు మహాతేజుండు దుర్దాంతమా
యోపాయంబున నంబరంబున నదృశ్యుండై చలం బొప్పఁగన్. 1582

శా. నానాస్త్రంబులు శక్తితోమరగద ల్నాళీకనారాచము
ల్నానాసాయకము ల్మహాముసలము ల్ప్రాసంబుల న్శూలము
ల్నానాభంగుల నేసి యాకసము నిండ న్బట్టుగా నార్చుచున్
ధానుష్కప్రవరుండు రావణివడి న్వర్షించెఁ గీశావలిన్. 1583

ఉ. వెండియు హేమపుంఖయుత వీక్షణసన్నిభభాస్కరోపమా
ఖండలశస్త్రతుల్యశిఖికల్పమహాశరాయుధోల్లస
త్కాండపరంపర ల్దఱుచుగా నిగిడించి మహోగ్రమూర్తియై
మెండుగ వానరోత్తముల మేనులు చక్కలువాపె నంతయున్. 1584

క. పిడుగుల కంటెను మిక్కిలి, బెడిదము లగుదైత్యముక్త పృథువిశిఖము ల
ప్పుడు మింట నుండి కడువడిఁ, బడఁ దొడఁగె నిరంతరముగఁ బ్లవగులమీఁదన్.

చ. ఘనతరశింజినీస్వనము గర్జలుగాఁగ గిరీటజుష్టనూ
తనమణిమాలికారుచు లుదంచితశంపలు గాఁగ నింద్ర
జిత్తనియెడు కాలమేఘము దిగంతము లన్నియు నిండ మింట న
త్యనుపమలీలఁ బన్ని గురియం దొడఁగెం బటుబాణవర్షముల్. 1586

ఆ. ఒక్కసాయకమునఁ బెక్కండ్రఁ గీశులఁ గుదురుగ్రుచ్చి చంపు ఘోరభంగిఁ
బెక్కుసాయకముల నొక్కనిఁ గడుఁదురు, ల్గఱచినట్లు వెగడుపఱచి దునుము.

సీ. ఒకవంక విలయసూర్యునిమాడ్కి నలరుచుఁ గరములగతిఁ గ్రాలు శరము లేయు
నొకచోట దీప్తపావకునికై వడిఁ దోఁచి తొడరి దివ్యాస్త్రహేతుల దహించు
నొకక్రేవఁ గాలపయోధరక్రియఁ బొల్చి వివిధదారుణశస్త్రవృష్టిఁ గురియు
నొకచాయ మించుపోలికిఁ జాలమెఱయుచుఁ దొరఁగించుఁ బిడుగులుతోడుతోడ

ఆ. పక్షవంతమైన పర్వతేంద్రముమాడ్కి, జెలఁగి యొక్కదిక్కు శిలలు రాల్చు
దైత్యుఁ డెందుఁ గన్నఁ దానయై రణమున గహనచరులఁ ద్రుంచె గడిమి మెఱసి.

సీ. పిడుగులకంటె బల్బెడిదంబు లగుశిత ప్రదరపాతనములఁ బడెడువారు
కులిశంబుకంటె మిక్కిలి వాఁడి గలబహు తీవ్రాయుధంబులఁ ద్రెళ్లువారు
కడువడి నుడుగక జడివానగతి రాలు ఘోరశిలావృష్టిఁ గూలువారు
కార్చిచ్చుకై వడిఁ గవియుదివ్యాస్త్రాగ్నికీలల భస్మమై గెడయువారు

తే. నగుచుఁ బ్లవగు లొక్కొకచోట నద్భుతముగఁ
గూలి రప్పుడు పెక్కండ్రు ఘోరభంగి
మును సుదార్ఢంబు బెట్టు మార్కొని నపూర్వ
సురులచే నాజిఁ గూలిన సురలకరణి. 1589

చ. మఱియు దశాననాత్మజుఁడు మాయలఁ బన్ని శిలాద్రువర్షముం
గురిసిన భిన్నదేహు లయి కొందఱు కొందఱు భిన్నశీర్షులై
యురుదుగఁ జూర్ణితావయవులై మఱికొందఱు గూలి రందఱుం గొం
దఱు కడుఁ బ్రాణభీతి బెడిదంబుగ మ్రోయుచుఁ బాఱి రెంతయున్. 1590

ఉ. అప్పుడు వాలిపుత్త్రనలు లాదిగ యోధులు పాఱుసైన్యము
న్ద్రిప్పుకొనంగ లేక కడుఁ దెంపున నందఱుఁ గూడి క్రుద్ధులై
యుప్పరవీది కేగి రయ మొప్పఁగఁ బాదపశైలవర్షము
ల్గుప్పలు గాఁగ నద్దనుజకుంజరుపైఁ గురియించి రుద్ధతిన్. 1591

ఉ. దానికి నల్గి రావణి మదంబున దారుణచాపశింజినీ
ధ్వానము మింటఁ బర్వ లయవహ్నిశిఖాతులితోగ్రభానుమ
ద్భానుసమానతీవ్రయమదండనిభస్ఫుటఘోరకాండము
ల్వే నిగిడించి యద్రిచరవీరుల దూలఁగ నేసి వెండియున్. 1592

సీ. తొమ్మిదితూపుల దూరసంస్థితుఁడైన నలు నొంచి సప్తబాణముల మైందు
నదలించి పదునెనిమిది విశిఖంబుల గంధమాదనునిదొడ్డర్వ మణఁచి
మర్మవిదారణ మార్గణపంచకంబున గజుఁ డనువాని పోలుపు మాన్చి
ముప్పదిసాయకంబుల నీలుఁ దూలించి పదివాలముల ఋక్షపాలు నొర్చి

తే. శమనసమఘోరతీవ్రకాండముల ఋషభు
ఖరకరాత్మజు ద్వివిదు నంగదునిఁ జచ్చి
నట్లు పడవైచి తక్కిన హరిబలాధి
పతుల బహుసాయకంబుల బడలుపఱిచి. 1593

చ. తనపటుబాణజాలముల తాఁకున కోర్వక భిన్నగాత్రమై
ఘనరుధిరార్ద్రకాయ మయి కాండవిమోహితమై మహాజమే
దినిఁ బడి యున్నదాని నతి దీనత నొందినదానిఁ గీశసై
న్యనికరముం గనుంగొని దశాననసందనుఁ డుత్సహించుచున్. 1594

ఇంద్రజిత్తు వానరుల నందఱ మూర్ఛితులం జేయుట.

వ. వెండియుఁ దపోలబ్ధప్రభావుండై రౌద్రరసోల్లాసభాసురుండై నిశాసమయసం
వర్ధమానబలుండై మండలీకృతకోదండుండై సమారోపితోత్తమసాయకుండై
గగనసంచారక్షముండై గర్జాసముజ్జృంభణభీషణుండై నిజవిజయవిలోకనసం
జాతపరమోత్సాహుండై మేఘమండలాంతర్గతుండై నపర్జన్యునివడువున మా
యాతిమిరతిరోహితుండై లక్ష్యగోచరుండు గాక కాలవ్యాళసన్నిభంబు లైన
నాళీకనారాచంబులును సూర్యమరీచికల్పంబు లైన నానాముఖసాయకంబులును
దీప్తానలసన్నిభంబు లగుశూలనిస్త్రింశపరశ్వథంబులును నవిస్ఫులింగోజ్జ్వలపావ
కంబు లగుముసలముద్గరభిండివాలపరిఘపట్టిసప్రాసంబులును మఱియు బహు
విధశస్త్రాస్త్రంబులును నిరంధ్రంబుగాఁ గురియించుచు శితాగ్రంబు లగురవి

ప్రకాశబాణగణంబుల నంతరిక్షంబును దిక్కులును బ్రచ్ఛాదించి సింహనాదంబు గావించిన నప్పు డర్ధచంద్రసాయకంబులఁ గంఠంబులు దెగిన నింద్రవజ్రాభిహతంబు లైన నగేంద్రంబుల భంగిం గూలువారును వెడందవాతియమ్ముల నురంబులు దునిసినఁ బరశునికృత్తంబు లగుసాలంబుల కరణి ఘోరస్వన మెసఁగుచుఁ బుడమిం ద్రెళ్లువారును ముసలముద్గరప్రపాతంబుల శిరంబులు పగిలిన రుధిరావసిక్త సర్వాంగు లై పూచినమోదుగులమాడ్కి నవనిం బడువారును గరవాలంబుల నవలగ్నంబులు విలూనంబు లైన లవిత్రంబులం గోసినరంభాస్తంభంబులపగిది రెండు తుండంబు లై యొఱగువారును నారాచంబుల తాఁకున నురంబులు పగిలిన నిలువున నసువులు విడిచి కాలుసేతులం బెనచుకొని వ్రాలువారును నానావిధాయుధప్రహారంబులఁ జరణజానుజంఘోరుమధ్యపార్శ్వకటికంఠమస్తకంబులు చూర్ణం బైన రూపు సెడిపోవువారును రక్కసుం డెక్కడనున్నవాఁడో యని వదనంబు లెత్తి గగనంబు విలోకించుచు శరపూరితలోచను లై యొండొరులం బట్టుకొని యొకరిమీఁద నొకరు పడువారును దివ్యాస్త్రశిఖిశిఖాపరంపరలు గవిసిన దవాగ్నిమధ్యంబున జిక్కిన లేళ్ల కై వడిఁ దప్పించుకొను నుపాయంబు లేక సంతప్త శరీరు లై నేలం బడి పొరలువారును రుధిరప్రవాహంబుల వెంటం బోయి యెడ నెడఁ గళేబరరాసు లడ్డం బైన నానాముఖంబులం దిరుగుడువడువారలు నై వానరసైన్యంబులు కరకాశనియుక్తం బై నజడివానకుం బడినపక్వంబు లగుకలమకేదారసస్యంబుల చందంబున నిరవశేషంబుగా రణమేదినియందుఁ జాఁపకట్టుగాఁ బడియె వెండియు మేఘనాదుండు బహువిధశస్త్రాస్త్రబాణంబులు ప్రయోగించి హనుమత్సుగ్రీవజాంబవదంగదనలనీలగజగవయగవాక్షగంధమాదనమైందద్వివిదసుషేణవేగదర్శిగోముఖకేసరిహరిలోమవిద్యుద్దంష్ట్రసూర్యాననజ్యోతిర్ముఖహరిముఖపావకాక్షకుముదరంభతారవినతశతవలిప్రముఖవానరయూథముఖ్యుల నెల్ల మూర్ఛితులం జేసి భాస్కరరశ్మికల్పంబులును దపనీయపుంఖంబులు నగుశరవృష్టిజలంబులు సలక్ష్మణుం డగురామునిపైఁ బరఁగించిన నమ్మహాత్ముండు బాణవర్షాభివర్ష్యమాణుం డై వర్షధారలకుం జలింపనికొండపగిది నతిసుస్థిరుం డై తత్పరమాద్భుతకృత్యంబులు విలోకించి లక్ష్మణున కిట్లనియె. 1595

రాముఁడు లక్ష్మణునితో నింద్రజిద్బ్రహ్మాస్త్రమువలనఁ దాములోనఁ బడవలయునని చెప్పుట.

సీ. తమ్ముఁడ కంటె యీదైత్యరాణ్ణందనుం డరుదైన బ్రహ్మాస్త్ర మాశ్రయించి
మంత్రించి వైచినమాడ్కి సైన్యంబులఁ బడవైచి యూథాధిపతుల నెల్ల
మర్దించి శరముల మసలఁ జలంబున గారించుచున్నాఁడు గడిమి నితఁడు
వనజసంభవవరప్రసాదబలమున మాయాతిరోహితకాయుఁ డగుచు

తే. నంబరంబున నిల్చి జన్యం బొనర్చుచున్నవాఁ డిప్పు డితని నోర్వ మనకు
నలవి గాదు తేజోధికుం డై వెలుంగుచున్నవాఁ డతిశౌర్యంబు గన్నవాఁడు.

ఉ. వీనిప్రచండకాండముల వేగ మొకింత సహింప కెంతయు

స్దీనత నొంది మై మఱవు దీరఁగ నెత్తుటఁ దోఁగి చేష్టలన్
మాని బలాధినాయకులు మర్కటసైన్యము లొక్కయెత్తునన్
మానక యాజిభూమిఁ గలమంబుక్రియం బడి యున్నవా రొగిన్. 1597

క. దిక్కుల నెక్కడఁ జూచిన, నక్కజముగ వీనితూపు లతిసాంద్రముగా
మిక్కిలి శోభిలు చున్నవి, త్రెక్కొను చీకపుల రవిమరీచులమాడ్కిన్. 1598

ఆ. అరయ నిది విరించనాస్త్రప్రభావంబు, వలన నైనకార్య మెలమితోడ
నయ్యమోఘబాణ మఖిలజగత్పూజ్య, మగుటఁ జేసి పూజ్య మయ్యె మనకు.

వ. కావున నీవు ధైర్యం బవలంబించి యవ్యగ్రచిత్తుండ వై యొక్కింతసేపు మత్స
మేతంబుగా బాణావపాతంబుల సహించియుండుమితండునివృత్తయుద్ధులమైగత
రోమహర్షులమై పడి యున్నమనల విలోకించి రణాగ్రలక్ష్మిందోడ్కొని యిప్పుడు
లంకకుం జను నని పలికి రాముండు లక్ష్మణసహితంబుగా నింద్రజిదస్త్రజాల
బద్ధుండై యుండె నిట్లు నాఁటిరాత్రి యుద్ధంబున వానరసైన్యంబుల ననేకుల
నేలకుంగోలకుం దెచ్చి వానరయూథాధిపతుల మూర్ఛితులం జేసి రామలక్ష్మ
ణుల విషాదంబు నొందించి హర్షవిశేషంబున సింహనాదంబుఁ జేయుచు మేఘ
నాదుండు సైన్యసమేతంబుగా దశగ్రీవభుజాభిగుప్తం బైనలంకాపురంబు ప్రవే
శించె నంత బుద్ధిమంతులలోన వరిష్ఠుం డైనవిభీషణుండు శరమోహితం బైన
వానరబలంబును మృతప్రాయులై పడి యున్నసుగ్రీవనీలాంగదజాంబవత్ప్ర
ముఖహరియూథపులను బాణపీడితు లైనరామలక్ష్మణులను విలోకించి యప్రతి
మానవాక్యంబుల శాఖామృగరాజవీరుల నందఱ నాశ్వాసించుచు నిట్లనియె.

-విభీషణుఁడు వానరుల నాశ్వాసించుట.-

సీ. కపివరులార రాఘవు లాజి వివశు లై పడియున్నవా రింక భండనమున
మనల నెవ్వఁడు ప్రోచు ననుచు భీతిలకుఁ డీ దాశరథులవిషాదమున మీకు
వలదు విషాదంబు నలువ మున్నితనికి బ్రహ్మాస్త్ర మొసఁగెఁ గృపాళుఁ డగుచు
నాయస్త్రమున నైన నీయద్భుతక్రమ మవనీశుఁ డాపద్మభవునిమాట
తే. భావమున నెంచి మన్నించి దేవవల్ల
భారిదివ్యాస్త్రసాదితుఁ డైనవాఁడు
పోలె సానుజుఁ డై రణభూమిఁ దనకుఁ
దా నె పడియున్నవాఁ డింత తథ్య మరయ. 1601

వ. ఇది బ్రహ్మసమ్మానార్థం బింతియె గాని వేఱొక్కవిధంబు గాదు దీన నేమి
విషాదం బని యాడిలం బలికిన నతనివచనంబు విని యచ్ఛోట నున్నహను
మంతుం డమ్మహనీయాస్త్రంబును సమ్మానించి విభీషణు నవలోకించి పడియున్న
వానరసైన్యంబునం దెవ్వఁ డెవ్వండు ప్రాణంబులు ధరియించియున్నవాఁడు
వానినాశ్వాసింతము రమ్మని పలికిన నతండును దాను నుల్కాహస్తులై రాత్రి
కాలంబున రణభూమియందుఁ జరించుచుఁ దెగినవాలంబులతోఁ దునిసినహస్తం

బులతో విలూనంబు లైనపాదాంగుళిశిరోధరోరుమధ్యంబులతో క్షతజార్ద్రగా
త్రంబులతో వీడినకేశంబులతో శరపూరితముఖంబులతో వజ్రవజ్రాభిహతంబు
లైనకొండలపగిది రాశీభూతు లై ధూళి బ్రుంగి నేలం బడియున్నవానరుల
ననేకశస్త్రాస్త్రఖండజాలంబులతో నిండుకొని రణభూమిం జచ్చినయట్లు నిశ్చేష్టు
లై కూలియున్నసుగ్రీవాంగదనలనీలశరభగంధమాదనగజగవయగవాక్షసుషేణ
వేగదర్శిమైందద్వివిదవినతపనసజ్యోతిర్ముఖులను మఱియు బ్రహ్మాస్త్రప్రభా
వంబున హతప్రాయు లై నేలం గూలియున్నసప్తషష్టికోటివానరయూథాధి
పతులను విలోకించుచు నద్భుతంబు నొందుచుఁ బ్రసుప్తం బైనసాగరౌఘంబు
కరణి బాణార్దితం బై నిశ్శబ్దంబుగాఁ బడియున్నవానరానీకంబు సొచ్చి జాంబ
వంతుం డెచ్చట నున్నవాఁడో యని వెతకుచుం జని చని యొక్కచోట శర
శతాచితసర్వగాత్రుం డై శాంతినొందినపావకునివడువున రణమేదినిం బడియున్న
వాని స్వభావజరాయుక్తు నతివృద్ధుఁ బ్రజాపతిసుతు నధికవీరు జాంబవంతు నవ
లోకించి మెల్లన నుపసర్పించి పవననందనానుమతంబున విభీషణుం డమ్మహాత్ము
నుద్దేశించి మహాత్మా తిగ్మంబు లైనశరంబులఁ జావకుండఁ బ్రాణంబులు రక్షిం
చుకొని యున్నవాఁడవే యని యడిగిన. 1602

విభీషణుండు జాంబవంతు నాశ్వాసించుట.

తే. అనఘుఁ డవ్విధినందనుం డానిశాట
కులవిభూషణుమాట వీనులకు సోఁక
యత్నమునఁ గొంతవడికి ధైర్యంబు పూని
యెలుఁగు సవరించుకొని వాని కిట్టు లనియె. 1603

ఉ. పన్నగ రావణాత్మజుని బాణపరంపర సోఁకినందునం
గన్నులు గానరా విపుడు కంఠరవం బది యాలకించి వి
ద్వన్నుత నిన్ను దైత్యకులవర్య విభీషణుఁగా నెఱింగితిన్
ము న్నిటువంటిదుర్దశయు మోసముఁ జూచి యెఱుంగ మెన్నఁడున్. 1604

క. దనుజోత్తమ యంజనియం, దనిలుని తేజమున నెవ్వఁ డద్భుతభంగిన్
జనియించె నట్టిశూరుఁడు, హనుమంతుఁడు ప్రాణయుక్తుఁ డై యున్నాఁడే.

ఉ. నా విని రాక్షసేంద్రుఁడు మనంబున నచ్చెరువంది యిట్లనున్
ధీవర రాముఁ డుండ రణధీరుఁడు లక్ష్మణుఁ డుండ రాజు సు
గ్రీవుఁడు నంగదుం డఖిలకీశచమూగణనాథు లుండఁగాఁ
బావని సేమమే యనుచుఁ బల్కితి వీ వది యేమి చెప్పవే. 1606

వ. అనిన విని యవ్విరించినందనుం డవ్విభీషణున కిట్లనియె. 1607

ఉ. మారుతి శక్రసన్నిభుఁడు మారుతతుల్యుఁడు వహ్నికల్పుఁ డా
ధీరుఁడు ప్రాణయుక్తుఁ డయి తేకువ నుండిన నెల్లవారమున్
సారము దక్కి చచ్చియును జావనివార మతండు పోరిలోఁ

దీటినఁ జావకుండియును దీటినవారము నిక్క మింతయున్. 1608

ఆ. అతఁడు బ్రతికి యున్న నాజిరంగంబులో, మనల నెల్లఁ బ్రోచు ననెడువాంఛఁ
జేసి యాతుధానశేఖర మున్నుగా, నమ్మహాత్ము సేమ మడిగినాఁడ. 1609

క. అని పలుక నపుడు మారుత,తనయుఁ డతనిఁ జేర నరిగి తద్దయు భక్తిన్
వినతి యొనరించి యిదె నే,హనుమంతుఁడ వచ్చినాఁడ నని పలుకుటయున్.

ఉ. ఆతనిమాట కర్ణపుట మంటినయంతనె తెల్విఁ దాల్చి య
జ్జాతభవాత్మజుండు ధృతి పట్టుగఁ గైకొని దన్నిలం బున
ర్జాతునిఁగా దలంచుకొని సంతస మందుచు వాయునందనుం
జేతుల గ్రుచ్చి యెత్తి నుతిసేయుచు మందమృదూక్తి నిట్లనున్. 1611

జాంబవంతుఁడు హనుమంతుని దివ్యౌషధులఁ జేర నియోగించుట.

చ. హరివర రమ్ము నీకు సరి యైనబలాఢ్యుఁడు లేఁడు ధాత్రిలో
హరిజిదమోఘబాణముల నాజితలంబునఁ గూలినట్టియీ
హరివరుల న్నరేశ్వరుల నర్మిలిఁ బ్రాణము లిచ్చి కావు మ
క్కఱపడి మాకు నీవె గతిగాఁ కిఁక నిప్పుడు వేఱె యున్నదే. 1612

చ. అనిలకుమార నీదుబల మంతయుఁ జూపెడువేళ యయ్యె న
న్యునిపని గాదు ఋక్షకపియూథపులు న్మఱి సర్వసైన్యముల్
సనయుల రాజనందనుల సత్కరుణన్బ్రతికించి ధాత్రిలో
ననుపమవిశ్రుతిం బడయు మయ్య నృపాలుఁడు నిన్ను మెచ్చెడిన్. 1613

సీ. నీ విపు డవలీల నింగికి దాఁటి యాకంధిరాదుపరిమార్గమున నేగ
హిమవంత మనెడు మహీధరశ్రేష్ఠ మొక్కటి చూడ నగు దానిఁ గడచి యవల
నరుగఁ గాంచనమయం బగువృషభం బను శైలంబు కైలాసశైల మొప్పు
నగరాజములరెంటి నడుమ సంధ్యారక్తవర్ణమై కాంచన వప్రమగుచు

తే. సర్వదివ్యౌషధులు గల్గి చాల నలరు
నౌషధినగంబు తదధిత్యకాగ్రమందు
దీపములభంగి దిక్కులఁ దేజ మెసఁగ
నాల్గుదివ్యౌషధులు పొల్చు నయగుణాఢ్య. 1614

క. మృతసంజీవని యన నుద్యత యైనవిశల్యకరణి యనఁగా మఱియుక్
షితి సౌవర్ణకరణి యన, నతులితసంధానకరణి యన నవి యొప్పున్ 1615

క. ఆయోషధులను గైకొని, పాయక శీఘ్రమున వచ్చి పార్థివసుతులన్
మాయందఱ బ్రతికింపుము, వాయుసుతా దీన యశము వచ్చు న్నీకున్. 1616

హనుమంతుఁ డోషధిపర్వతమునకుఁ బోవుట.

వ. అని పలికి దీవించి యనిచిన నమ్మరున్నందనుండు జాంబవత్ప్రేరితుం డై ప్రావృ
ట్కాలవలాహకంబుకరణి మేనుఁ బెంచి విజృంభించి విలయపవనునిమాడ్కి

వేగం బంగీకరించి బలంబు దీపింపఁ బర్వకాలసముద్రంబుభంగి నుప్పొంగి సముద్రతటాగ్రస్థం బైనయొక్కపర్వతశ్రేష్ఠంబు నెక్కె రెండవపర్వతంబుకరణి శోభిల్లుచు గండశిలాచయంబు నుగ్గునూచంబు గాఁగ వృక్షంబులు చాఁపకట్టు పడ మహోన్నతశిఖరంబులు విఱిగి కూలఁ బక్షిసంఘంబులు మింట గుంపులు గట్టి రోదసేయ మృగకదంబంబు భయంబున నొండొకకొండకుం బఱవ ధరాతలంబు బ్రద్దలువాఱ గుహాలం గ్రీడించు చున్నకిన్నరగంధర్వమిథునంబులు విమానంబులతోడ గగనంబున కెగయ బిలంబుల నొదిఁగి యున్నమహాసర్పంబులు సందష్టదశనంబు లై ముఖంబుల విషాగ్నిజ్వాలలు గ్రక్క నడుములోనఁ దాటిపండుచందంబున నమ్మహామహీధరంబు ధరణీతలంబునం గ్రుంగఁ బర్వతస్థంబు లైనసర్వభూతంబులు భయంబున మహాధ్వని గావింపఁ బాదంబులు కొండమీఁద నూఁది బడబాముఖసన్నికాశం బైనముఖంబు విచ్చి సముద్రచరభూతంబులును ఖేచరవ్రాతంబులును సకలరాక్షసద్వారతోరణగోపురసౌధవిమానసహితంబుగా లంకాపురంబును భగ్నంబు లై కూలనొక్కమహానినాదంబు గావించి భక్తియుక్తుం డై మనంబున రామలక్ష్మణులకు నమస్కరించి భుజంగకల్పం బైనలాంగూలం బెత్తి పృష్ఠంబు వంచి కర్ణంబులు నిక్కించి దూరపథంబునం జూడ్కి నాటించి వదనంబు వంచి గగనంబు మ్రింగం జను వానిపోలికిఁ బ్రచండవేగంబున నాకాశంబున కెగసి నప్పుడు తద్బాహూరువేగోద్ధతంబు లై ప్రాకృతవానరసమూహంబును వృక్షంబులును శిలాఫలకంబులును గొండొకదూరంబు మింటి కెగసి పదంపడి క్షీణవేగంబు లై సలిలంబులం బడియె నాఘూర్ణితవీచిమాలాకులం బై సముద్రంబురోదసేయుచునుండె నడియె నిట్లు మింటి కెగసి భుజంగారినికాశవీర్యుం డైనహనుమంతుండు భుజంగభోగకల్పంబు లైనభుజంబులు సాఁచి విష్ణుకరాగ్రముక్తం బైనచక్రంబుకైవడి రామకరాగ్రముక్తం బైనదివ్యాస్త్రంబువైఖరిఁ బితృతుల్యవేగంబున నాదిత్యపథం బాశ్రయించి దిగంతభాగంబులు ప్రతిధ్వను లొసంగ మహానాదంబు సేయుచు మహోన్నతంబు లగుశైలంబులును వృక్షగణంబులును సరోవరంబులును నదులును దటాకంబులును బురోత్తమంబులు స్ఫీతంబు లగుజనపదంబులు నంతనంత విలోకించుచు నుత్తరాభిముఖుం డై చని చని వేగాతిశయంబున జాంబవదుక్తపర్వతం బతిక్రమించి యవ్వల బహుయోజనదూరం బరిగి యచ్చట నుండి మరలఁ జనుదెంచుచు ముందఱ. 1617

చ. అనిలసుతుండు గన్గొనియె నంబరచుంబిశిరోవిశాలమున్
వనగజహస్తకంపితవివర్ధితతాలతమాలసాలముం
బ్రణుతగుహాసరిత్తటచరత్సురకిన్నరసిద్ధజాలమున్
ఘనతరకుంజపుంజగమృగక్షణకాలము శీతశైలమున్ 1618

క. అని మఱియు సకలభోగాస్పద మై యమృతోపమానజల మై భద్ర

ప్రద మై యుండుట కెంతయు, మదిలో నచ్చెరువు గదుర మారుతి యచటన్.

—హనుమంతుఁ డోషధిపర్వతమును గనుంగొనుట.—

సీ. బ్రహ్మకోశంబును రజతాలయంబును హరిహయాలయము హయాననంబు
బ్రహ్మాసనంబును బ్రహ్మశిరంబును సూర్యప్రభంబును శుక్రపదము
వరుణాలయమును శంకరకార్ముకంబును యక్షేశుపదము వజ్రాలయమును
దహనాలయమును రుద్రశరప్రమోక్షంబు నంబికాలయము గుహాలయమును

తే. పావకస్థానమును సిద్ధపదము కిన్న
రాలయంబును జ్యవనభృగ్వాలయములు
మొదలు గాఁ గలయాశ్రమపదము లెల్లఁ
జూచి హర్షించి యమ్మరుత్సూనుఁ డంత. 1620

శా. కైలాసాచలము న్దదంతికమునం గన్పట్టుచామీకర
శ్రీలం జాల వెలుంగునట్టివృషభోర్వీభృన్మణిం దన్మహా
శైలాభ్యంతరసీమ నొప్పువిలసత్సర్వౌషధీశైలముం
బోలం జూచి యతండు విస్మయము సమ్మోదంబు సంధిల్లఁగన్. 1621

ఉ. ఆనగ మెక్కి డెందమున నానఁగరానిమనోరథంబుతో
మానితవీర్యుఁ డవ్విధికుమారుఁడు చెప్పినమందు లన్నియున్
మానక యంతటం గలయ మక్కువతోఁ బరికించుచుం దదీ
యానుపమానసానుకటకాదులయందుఁ జరించుచుండఁగన్. 1622

ఉ. ఆరజనిం బ్రదీప్తదహనార్చులభంగి వెలుంగుచుండియున్
మారుతిరాకయుం దెలిసి మందు లదృశ్యము లయ్యె నంత నా
ధీరవరుండు కోపరసదీపితవహ్నినికాశనేత్రుఁడై
వారిధరంబుకై వడి రవం బొనరించుచుఁ గొండ కిట్లనున్. 1623

చ. రఘుకులవార్ధిసోముఁ డగురామునిపైఁ గృప మాని యీగతి
న్లఘుగతిఁ బూని యోషధికలాప మొసంగక దాఁచి తిప్పుడు
ర్వీ ఘనులచొప్పెఱుంగఁ గలవే పెనుతాల్మిఁ గ వేఁడ నేల గా
డ్పు ఘనమునట్లు వే పెఱికి పొల్పుగ నిన్గొనిపోదు నుద్ధతిన్. 1624

—హనుమంతుఁ డోషధిపర్వతమును బెకలించి లంకకుఁ గొనితెచ్చుట.—

ఉ. చూడు మటంచుఁ బల్కి గిరిచుట్టును వాలముఁ జుట్టి ధాత్రి య
ల్లాడఁగఁ గూటము ల్వీఁగి యట్టిటుఁ గూలఁగ రామభక్తియే
తోడుగ సర్వవృక్షములతో మృగకుంజరధాతుకోటితోఁ
గూడ నగేంద్రము న్పెఱికె గొబ్బున దేవత లుబ్బియాడఁగన్. 1625

మ. బల మేపారఁగ నీగతిం గుధర ముత్పాటించి దేవాసురా
దులు లోకంబులు భీతిలంగ ఖచరుల్ స్తోత్రంబు గావింపఁ జే

తుల నొక్కండఁ బరిగ్రహించుకొని యెంతో ప్రీతితో నమ్మహా
బలసూనుండు నభంబునం జనియె సౌపర్ణాగ్ర్యవేగంబునన్. 1626

చ. రవినిభ మైన శైలశిఖరం బటు గ్రక్కునఁ గేలఁ బూని యా
రవినిభతేజుఁ డై నకపిరాజసఖుండు మరుత్కుమారుఁ డా
రవిపథ మంటి వాయుగతి రాముని జేరఁగ నేగునప్పుడు త
త్సవిత్రుని క్రేవఁ దోఁచెఁ బ్రతి తామరసప్రియుఁ డో యనన్ గ్రహిన్. 1627

క. కరకలితశిఖిశిఖాసం, భరితసహస్రారఘోరపటుచక్రముచే
హరివోలె గిరినిభుం డా, హరినాయకుఁ డప్పు డొప్పె నగ్గిరిచేతన్. 1628

### ఓషధీగంధాఘ్రాణంబున వానరసహితంబుగా రామలక్ష్మణులు విశల్యు లగుట.

వ. ఇట్లు దివ్యౌషధీపర్వతంబు గొని యమోఘరయంబునం జనుదెంచుచున్న హనుమంతుని దవ్వులం జూచి వానరు లందఱొక్కమొగి సింహనాదంబులు గావించిరి వారలం జూచి యమ్మరుత్నందనుండును సంతోషవిశేషంబున నిజవిజయంబు తేటపడునట్లుగా నొక్క మహాస్వనంబు చేసె వారలసముద్ఘుష్టరవంబులు విని లంకామలయనివాసులగు రాక్షసులందఱు భీమతరంబుగా సింహనాదంబులు గావించి రంతలోన నమ్మహాత్ముం డప్పర్వతంబు గొని తెచ్చి వానరసైన్యమధ్యంబున నిలిపి జాంబవదాదివానరోత్తములకు భక్తితో నభివందనంబుఁ జేసి విభీషణునిం గవుంగిలించె నంత నమ్మహౌషధిగంధం బాఘ్రాణించి మానవరాజనందనులగు రామలక్ష్మణులు విశల్యులై రిమ్మఱియు రణంబున నిహతులైన హరివీరులందఱును దత్క్షణంబ తద్దివ్యౌషధిగంధంబున విశల్యులును విరుజులునై సుప్తులైన వారు నిశాంతంబునం బ్రబుద్ధులైనచందంబున నందంబు వహించిరి యుద్ధారంభదినంబు మొదలుగాఁ బ్రతిదినంబును రణంబునఁ గపికుంజరులచేత నిహతులైన రాక్షసుల నందఱ విచారించి తత్పరిగణనార్థంబును రాక్షసు లనేకులు నిహతులైరని సర్వజనంబు లెఱుంగుదురనియెడుదురభిమానంబునను మృతులైనరాక్షసుల నందఱ నిత్యంబును సముద్రంబులో వైవుం డని రావణుం డానతిచ్చుటం జేసి తత్ప్రకారంబున మృతరాక్షసుల నెల్ల రాక్షసు లుదధిలో వైచినవారు గావున నక్కాలంబున దివ్యౌషధిగంధాఘ్రాణంబుఁ జేసి క్రమ్మఱ బ్రతుకుటకు రాక్షసుం డొక్కండైన లేఁ డయ్యె నిట్లు మారుతపుత్రుం డోషధిప్రదానంబున రామలక్ష్మణసహితంబుగా వానరుల నెల్ల విశల్యులం జేసి మృతులైనవారి నెల్లఁ బునస్సంజీవితులం గావించి యమ్మహౌషధిపర్వతంబు నెప్పటిచోట వైచి క్రమ్మఱఁ జనుదెంచి కృతార్థుం డై రామునిసమీపంబునకుం జనియె నంత వానరాధిపుం డగు సుగ్రీవుండు హనుమంతు నవలోకించి కర్తవ్యకార్యంబు తెలియం జేయుచు నిట్లనియె. 1629

### సుగ్రీవుఁడు వానరులను లంక దహింప నాజ్ఞాపించుట.

చ. అనిలకుమార పంక్తిముఖుఁ డాలమునం దెగి కూలినట్టినం

దనుల బలాధినాథులఁ బ్రధానుల మిత్రుల నందఱ న్మనం
బునఁ దలపోసి దుఃఖమున మోహమున న్మనతోడ సంగరం
బున కీవు డేగుదెంచుటకుఁ బూనఁడు గావున వాని కీయెడన్. 1630

చ. అలుక జనించునట్లుగ బలాఢ్యులు శూరులు వీర్యవిక్రమో
జ్జ్వలులు ప్రచండవేగు లగువానరవీరులు ధీరులై మహో
ల్కలు గొని లంకమీఁదికిఁ జలంబున నేగి దహించువారుగా
నలఘుచరిత్ర నీ వతిరయంబున నానతి యిచ్చి పంపుమా. 1631

చ. అని యరవిందమిత్రసుతుఁ డాడిన నట్లగుఁ గాక యంచు న
య్యనిలసుతుండు యూథపుల కందఱ కవ్విధమంతఁ దెల్పఁగా
విని కపివీరు లుల్కలు ప్రవీణతఁ గైకొని నిర్విశంకులై
చనిరి ప్రచండవై ఖరి నిశాసమయంబున లంకమీఁదికిన్. 1632

శా. ఈరీతిం బటుగుల్మమందిరగతాహీనాసురు ల్భీతులై
పాఱ న్దారుణభంగి మ్రోయుచుఁ గపు ల్పాటించి లంకాపురిం
జేరం బోయి తదీయగోపురగృహశ్రేణీవిమాన ప్రతో
ళీరేఖావరచర్యలందు ఘనకీలిం గొల్పి రౌక్కుమ్మడిన్. 1633

వానరులు లంకాపురిని దహించుట.

వ. ఇట్లు వానరవిసృష్టుం డై యవ్వీతిహోత్రుండు విలయపవనప్రేరితసంకర్షణాగ్ని చందంబున మండి గగనచుంబిశిఖాపరంపరుం డై విస్ఫులింగపటలీసంచార భీకరుం డై మింటం బొగ లెగయ మహాకారణ్యంబు నేర్చు కార్చిచ్చువడువున నయ్యాతుధానరాజధానిం జుట్టుముట్టుకొని మహోన్నతపర్వతాకారంబు లైన విమానగోపురప్రాసాదహర్మ్యమందిరంబులు దహించుచు వరాగరుహరిచంద నంబులును సుస్నిగ్ధమణిముక్తాఫలకంబులును వజ్రంబులును ప్రవాళంబులును రమ్యంబు లగుక్షౌమంబులును శోభనంబు లగు కౌశేయంబులును నవిరోమనిర్మిత పటంబులు నూర్ణామేషాదిలోమనిర్మితకంబళాదికంబును గాంచనోపకరణంబు లును వరాయుధసంచయంబులును ననేకవిచిత్రవిన్యాసతురంగాలంకారపల్యయ నాదిపరికరంబులును సమ్యగ్గ్రథితంబు లైన రథోపకరణంబులును గజగ్రైవేయ కక్ష్యాసంచయంబును వరయోధులతనుత్రాణంబులును వాజివరణవర్మంబులును ఖడ్గంబులును జామరంబులును గుణంబులును నాయకంబులును దోమరాంకుశ శక్తులును రోమజన్యకంబళాదికంబును వ్యాఘ్రచర్మంబును గస్తూరికాదిపరిమళ ద్రవ్యంబులును ముక్తామణివిచిత్రప్రాసాదసహస్రంబులును నానావిధాస్త్రసం ఘంబును బహువిధస్వస్తికాదిగృహసన్నివేశవిశేషంబులును భస్మంబు గావిం చుచు హేమవిచిత్రతనుత్రాణులును మాల్యదామాంబరధారులును శీధుపాన చలాత్ములును మదవిహ్వలగమనులును గాంతాలంబితవస్త్రులును శత్రుసంజా తమన్యులును గదాశూలాసిహస్తులును మహార్హశయనప్రసుప్తులును బ్రియా

సహితులును మధుపాననిరతులును మాంసభోజనాసక్తులును భయవిత్రస్తులును
నిద్రితులగుపుత్రులం గొని రయంబునం బాఱువారును లంకానివాసులు నగు
రాక్షసులగృహసహస్రంబులు నీఱుసేయుచు నంతకంతకుఁ బ్రవర్ధమానతేజం
బై సారవంతంబులును మహార్హంబులును గంభీరగుణవంతంబులును హేమ
నిర్మితచంద్రాకారంబులును నర్ధచంద్రాకారంబులునుశిరోగృహోన్నతంబులును
రత్నచిత్రగవాక్షంబులును మణివిద్రుమవిచిత్రంబులునుభాస్కరచుంబిశిఖరంబు
లును సాధిష్ఠానంబులును క్రౌంచబర్హిణవీణావేణుభూషణనిస్వననినాదితంబు
లును కైలాసాచలసంకాశంబులును నగురావణుమందిరంబు లన్నియుదహించె
నప్పుడు. 1634

క. ఘోరాగ్నిపరీతము లై, తోరణములు చూడ నొప్పె దోయదవేళన్
భూరితటిన్నద్ధము లై, వారక శోభిల్లు ఘననివహములమాడ్కిన్. 1635

క. జ్వలనపరీతము లై యం, దలిశోభనమందిరములు ధారుణిఁ గూలెన్
బలవైరిపవిహతము లై, యిలఁ గూలెడుమేరుశైలశృంగములక్రియన్. 1636

క. మఱి కొన్నిసదనములు శిఖి, పరికలితము లగుచు నపుడు పట్టణవీథిం
బరమౌషధిసమయుతసుం, దరహిమవచ్ఛిఖరములవిధంబుల నలరెన్. 1637

తే. మఱియు యామినియందు నప్పురవరంబు
దారుణహుతాశనార్చిఃప్రదహ్యమాన
మహితహర్మ్యవిమానసద్మములచేతఁ
బుష్పితపలాశములచేతఁ బోలె వెలిఁగె. 1638

ఆ. విలయకాలమందు జలధిలోఁ దిరిగెడు, మకరకచ్ఛపములమాడ్కి దైత్య
పట్టణమునఁ జూడఁ బడియె యంత్రవిముక్త, మత్తకరితురంగమంబు లపుడు.

క. పరిముక్తమైనహయమును, బరికించి గజంబు భీతిఁ బాఱఁగఁ జొచ్చెం
బరిముక్తమైనగజమును, బరికించి హయంబు భీతిఁ బాఱఁ దొడంగెన్. 1640

తే. మఱియు లంకాపురము దహ్యమాన మగుచు
నుండఁ బావకచ్ఛాయాభియుక్తసలిల
మై మహోదధి గన నయ్యె నపుడు లోహి
తోదకం బైనజలరాశి యొప్పు మిగిలి. 1641

తే. అంత నొక్కింత సేపున క్షప్పురంబు, కపివరోద్దీపితం బయి కాననయ్యెఁ
గడు భయంకర మైనలోకక్షయంబు, నందుఁ గనుపట్టుదీప్తోర్విచంద మొంది

క. పొగలోనఁ జిక్కి శిఖి తే, ర్చఁగ నోర్వక పెట్టుమ్రోయురమణులవలన
న్నిగుడురవము విన నయ్యెను, మిగులం బదియోజనములమేర తరుచుగన్.

ఉ. అప్పుడు లంకలోఁ గలనిశాటులు వహ్నిశిఖాపరీతు లై
దెప్పర మైనతాపమునఁ దిమ్మిరిచుం బురిలోన నుండ లే

కుప్పరవీదినుండి రభసోద్ధతి నార్చుచు బాహ్యభూమి కా
చొప్పున నిర్గమించుటయుఁ జూచి వనాటులు చాలఁ గ్రుద్ధులై. 1644

క. వారిదములక్రియ నార్చుచు, వారలఁ దలపడిన నసురవానరవీరో
దారధ్వనులు నభంబును, ధారుణియును దిశలు నిండ దళముగ మ్రోసెన్.

తే. మానుగ విశల్యు లైనమహానుభావు
లానరేంద్రులు సంభ్రాంతు లై విశాల
చాపములు రెండు గైకొని యేపు మీఱ
నుగ్రమూర్తు లై చూపట్టు చుండి రపుడు. 1646

ఉ. చండపరాక్రమార్జితయశఃపరిపూర్ణుఁడు రాముఁ డంతఁ గో
దండము నెక్కు వెట్టి విదితంబుగ మౌర్వి రవం బొనర్చినన్
మెండుగ నమ్మహాధ్వని తమీచరకీశరవంబు మ్రింగి పె
న్గొండలు నిండి దానవుల గుండెలు వ్రక్కలువాపె నంతయున్. 1647

తే. కార్ముకము కేలఁ దాల్చి రాఘవుఁడు గనలి
వేదమయ మైనబలితంపు విల్లుఁ దాల్చి
నట్టిలయకాలరుద్రుఁడో యనఁగ నపుడు
చాలఁ జూపట్టె వనచరు ల్సంతసింప. 1648

క. వానరులకలకలంబును, దానవులమహాస్వనంబు దశరథతనయు
జ్యానాదం బొక్కటి యై, భూనభములు దిశలు నిండి బోరన మ్రోసెన్.

రావణుఁడు కుంభనికుంభాదుల యుద్ధమునకుం బంపుట.

వ. ఇట్లు సమరసంరంభవిజృంభితుం డై రాముండు నిశితంబు లగుశరంబులు నిగి
డించి కైలాసాచలశిఖరసన్నిభం బైనతత్పురగోపురంబు నేలం గూల్చిన నవ్వి
ధం బాలోకించి చర్యాగృహవిమానంబులం దున్నరాక్షసులు సన్నద్ధు లై
సింహనాదంబు సేయుచుఁ బురంబు నిర్గమించి రణభూమికిం జనుదెంచుచున్న
వారలం జూచి సుగ్రీవుండు వానరుల కాజ్ఞాపించినవా రతిత్వరితగమనంబునం
జని లంకాద్వారంబు లాక్రమించిన నయ్యిరుదెసలవారి కారాత్రి కాళరాత్రి
యై తోఁచె నత్తెఱం గంతయు విని రావణుండు క్రుద్ధుం డై రణసన్నద్ధుం డై
జృంభితవిక్షేపంబువలన దిశాజాలంబు వ్యాకులం బై వడంక విలయకాలరుద్ర
నిరూపంబు రూపవంతం బైనదో కో యనఁ గనుపట్టుచుఁ గుంభకర్ణనందను లైన
కుంభనికుంభుల ననేకరాక్షసపరివృతులం జేసి రణంబునకుం బొమ్మనిపలికి పడం
పడి యూపాక్షశోణితాక్షప్రజంఘకంపను లనువారి నల్వుర యోధాగ్రేసరులఁ
గుంభనికుంభులకు బాసటగా పనిచి వారల నిరీక్షించి మీరు మచ్చాసనంబునం
జని పగతుల నిర్జించి జయంబు గొని యభిజ్ఞానంబుకొఱకు సింహనాదంబులు
గావింపుఁ డని పలికి సముచితంబుగా వీడుకొల్పిన నయ్యాతుధానయోధు

లార్వురును గోపంబును బ్రచండవిక్రమాటోపంబును దీపింపఁ బ్రజ్వలితాయుధ
పాణు లై దిక్కు లక్కజంబుగాఁ బగుల నొక్క మొగిఁ బెనుమొగుళ్లవడువున
గర్జించుచుఁ బ్రత్యూషకాలంబునఁ బురంబు నిర్గమించి భీషణరభసాతిరేకంబునం
జనుదెంచుచుండి రప్పుడు రక్షోవీరులభూషణకాంతులును వరాయుధంబులతళ
తళలును బ్రజ్వలితవహ్నిద్యుతులును మింట వెలుంగుచంద్రునిదీధితులును దార
కాప్రభలునుం గూడుకొని గగనంబును బుడమియు దిగంతంబులును వానర
రాక్షససైన్యంబులును దదుభయసేనామధ్యగతాకాశంబును మిక్కిలి వెలుం
గం జేసె నప్పు డూర్ధ్వప్రదీప్తమందిరప్రభలచేత. సంసక్తపాతాళం బై చల
త్తరంగసంకులం బై మహోదధి యధికంబుగాఁ బ్రకాశించె నంతఁ బతాకా
ధ్వజసంసక్తంబును నుత్తమాసిపరశ్వథంబును భీమాశ్వరథమాతంగంబును నానా
పత్తిసమాకులంబును దీప్తశూలగదాఖడ్గప్రాసతోమరకార్ముకంబును భీమవిక్రమ
పౌరుషంబును బ్రజ్వలితముసలభిండివాలపట్టిసంబును గింకిణీశతనాదితంబును
హేమజాలాచితభుజంబును నుత్తేజితపరశ్వథంబును వ్యాఘూర్ణితమహాసత్త్వం
బును బాణసంసక్తకార్ముకంబును గంధమాల్యమధూత్సేకసమ్మోదితమహానిలం
బును ఘోరశూరజనాకీర్ణంబును మహాంబుధరనిస్వనంబును బరమదారుణంబు
నైనఘోరరాక్షసబలంబు నవలోకించి ప్లవంగబలంబు భూనభోంతరాళంబు
నిండ సింహనాదంబులు సేయుచు రభసోద్రేకంబునం దలపడిన నయ్యాతుధాన
సైన్యంబును బావకునిపై కురవణించుపతంగసంఘంబుకైవడి నొండొరుం
ద్రోచి నడుచుచుం జనుదెంచి భేరీశంఖకాహళధ్వనిపూర్వకంబుగా నరిబలం
బులఁ దాఁకె ని ట్లయ్యిరువాఁగులును నిండినసముద్రంబులభంగి నుప్పొంగి
యొండొంటిం దాఁకినఁ బోరు ఘోరం బయ్యె నప్పుడు. 1650

### వానరరాక్షసుల తొమ్మిదవనాఁటి యుద్ధము.

మ. ఉరుశైలాకృతి నొప్పువానరులు యుద్ధోన్మత్తు లై బల్విడిం
దరుసంఘంబులు శైలము ల్ద్విరదమాత్రగ్రావము ల్యామినీ
చరసైన్యంబులమీఁద నొక్క మొగి దోస్సత్త్వంబు దీపింప భీ
కరభంగిం బరఁగించి యార్చి రట దిక్చక్రంబు కంపింపఁగన్. 1651

మహాస్రగ్ధర. చరణోద్యద్ధూళి మింట న్జలధరముక్రియ న్సాంద్ర మై పర్వ రోషో
త్కరు లై శూలాయుధంబు ల్గదలు ముసలము ల్ఖడ్గము ల్పట్టిసంబు
ల్శరము ల్ప్రాసాయుధంబు ల్చటులపరశువు ల్చక్రకుంతక్షురంబు
ల్పరిఘంబు ల్ఘోరభంగిం బఱపి రరిచమూపాళిపై దైత్యు లల్కన్. 1652

తే. దళనహృతకర్ణు లై తలదళితవక్షు, లై శిలాపాతభగ్నాంగు లై కఠోర
ముష్టినిష్కీర్ణశీర్షు లై దుష్టదైత్యు, లవుడు పెక్కండ్రు పొలిసి రయ్యాలమందు.

క. తెగినకరచరణములతో, నగలినవక్షములతో సహస్రవిధములం

బగిలినమస్తకములతో, నగణితముగ నేలఁ గూలి రవ్వీపినాటుల్. 1651

క. కొండఱు వానరవరు లా,సందడికయ్యమున డాసి సాహస మొప్పన్
ముందలలు పట్టుకొని వెసఁ, గ్రిందికిఁ బడఁ ద్రోచి పొడిచి గెడపి రసురులన్.

క. దానవులయందుఁ గొందఱు, మానక వానరులఁ బొదివి మడిసంచముగా
జానువులఁ గ్రుమ్మి పొడిపొడి, గా నులిమి వధించి రపుడు కడుఘోరముగన్.

సీ. కులిశోగ్రముష్టిచే గుండియ ల్పగులంగఁ బొడుచువారియురంబుఁబొడుచువారు
దారుణశాతదంతములచేఁ గర్ణము ల్గొఱుకువారలచెవుల్ గొఱుకువారు
క్రకచసమాననఖంబులఁ గంఠము ల్గిల్లువారలమెడ ల్గిల్లువారు
నీ వెంతవాఁడవు నినుఁ ద్రుంతు రమ్మని పిలుచువారల బెట్టు పిలుచువారు

తే. పృథుబలంబున మీఁదికి నెత్తి పుడమి, వైచువారలఁ బుడమిపై వైచువారు
నగుచు వనచరు లసురు లత్యద్భుతముగఁ,జలము దీపింప రణకేళిసలిపి రపుడు.

చ సమర మొసంగ రా పెనఁగఁ జాలుదు విచ్చెద రా రణంబులో
భ్రమగొని పాఱఁ జూడకుర పందకు నీ కది చెల్లుఁ గాక నే
భ్రమగొని పాఱి పోదు నటరా యని యీగతి బాహువీర్యగ
ర్వమునఁ గపు ల్నిశాటులు పరస్పరము న్వచియింతు రయ్యెడన్. 1658

క. పరిఘాసిశూలవరము, ద్గరసంకుల మై సముద్యతప్రాసంబై
హరిరాక్షసవీరుల క,త్తఱి సంగ్రామంబు సెల్లె దారుణభంగిన్. 1659

క. పెక్కండ్రు గూడి యొక్కని, నక్కజముగ నుక్కడంతు రతియత్నముతో
నొక్కఁడు కడుఁ జిత్రంబుగఁ, బెక్కండ్ర వధించు నపుడు భీకరలీలన్. 1660

క ధ్వస్తకవచధ్వజంబై, స్రస్తపటాభరణకేశజాలంబై వి
త్రస్తభటంబై యస్త, వ్యస్తంబై దైత్యసైన్య మలమట నొందెన్. 1661

ఆ. అంతఁ గొంతపడికి నగచరసైన్యంబు, బలము మీఱి దైత్యబలముఁ జుట్టు
ముట్టియట్టహాసము సెలంగ నఖదంత, శిలలఁ దరుల నుఱుముసేయఁ దొడఁగె.

వ. ఇట్లు మహాద్భుతప్రకారంబున నయ్యాయోధనంబు వీరజనక్షయంబై సంకులం
బుగాఁ బ్రవర్తిల్లుచుండె నప్పుడు. 1663

ఉ. తెంపున వాలిపుత్త్రుఁ డతిధీరుఁడు సంగరకాంక్షియై వడిం
గంపను డాసెఁ డాయుటయుఁ గన్గొని వాఁడును మేటి యాటఁ గం
పింపక రమ్ము రమ్మనుచు భీషణవైఖరిఁ బల్కి యుల్క దీ
పింపఁగ నమ్మహాబలుని బెట్టు గద న్వదళించె నుద్ధతిన్. 1664

క. గదచే నిటు తాడితుఁడై, వదలక యొక్కింత స్రుక్కి వాలితనయుఁడం
గదుఁ డంతలోనఁ గ్రమ్మఱఁ, గదనంబునఁ దెల్విఁ దాల్చి కడుఁ గోపమునన్.

క. గిరిశిఖరము బెట్టిదముగ, నురవడిఁ బెకలించి తెచ్చి యురువేగమునన్
సురవైరిమీఁద నేయఁగ, గిరినముఁ డద్దాన నతఁడు గెడసె రయమునన్. 1666

క. అది చూచి శోణితాక్షుఁడు, కదనమునం గాంచనరథ గతుఁడై యయ్యం
గదునిం గదియుచు ఘోర, ప్రదరంబుల నేయఁ గనలి కపివరుఁ డంతన్.
చ. వానిరథంబుపై కుఱికి వాజుల గీటణఁగించి సారథిన్
మానక చంపి చాపమును మార్గణము ల్వెసఁ ద్రుంచి వైచి యా
దానవుఁ జంపఁ జూచు నెడఁ దప్పక గన్గొని శోణితాక్షుఁ డా
వానరవీరుపై నడరె వాలును బల్కియుఁ దాల్చి చెచ్చెరన్. 1668

—అంగదునిచేతఁ గంపనుఁడు చచ్చుట.—

సీ. ఆరాక్షసునిచంద మంతయు వీక్షించి వాలినందనుఁ డల్గి వానిచేత
గాలసర్పముమాడ్కిఁ గ్రాలు ఖడ్గముఁ గొని యజ్ఞోపవీతంబు నంగుదోఁపఁ
గడు లాఘవంబునఁ గర్చురుఁ బ్రహరించి గగనంబు దిక్కులు పగుల సింహ
నాదంబు సేయుచు మోదంబు రెట్టింప నంతకులీల సైన్యముల కుఱికి
తే. దానవులఁ బట్టి భూరిదోర్దర్పమడరఁ, దలలు దఱుఁగుచు హాలికుఁ డుద్దండవృత్తి
వనము నఱుకువిధంబున మునుముఁ బెట్టి, పడుగు పేకల నఱికె నబ్బలము లెల్ల.
వ. అప్పుడు. 1670
క. కాలాయసనిర్మితగద, వాలాయము ద్రిప్పికొనుచు వాలిసుతునిపైఁ
గాలానలుక్రియ మండుచు, నాఁగో వెండియును శోణితాక్షుం డడరెన్. 1671
క. వీరోత్తముఁడు ప్రజంఘుఁడు, ధీరాంబుదనాద మైన తేరెక్కి మహా
క్రూరుఁడు యూపాక్షుఁడు పోలు, పారం దనవెంట రాఁగ నంగదుఁ దాఁకెన్.
వ. ఇట్లు మహాకాయుం డగుశోణితాక్షుండును యూపాక్షసహితుండై ప్రజంఘుం
డును దారుణభంగి నవ్వానరసింహునిం దలపడిన నతం డద్దానవయోధమధ్య
గతుం డై విశాఖామధ్యగతుం డైనపూర్ణచంద్రునిమాడ్కిం దేజరిల్లె నప్పుడు
బలవంతు లగురాక్షసులు మువ్వురొక్కయంగదునిపై నురవణించుట విలో
కించి తత్సమీపంబున నున్నమైందద్వివిదు లయ్యంగదునకు సహాయంబుగా
వారలం దలపడిన మహాకాయు లగురాక్షసులతోడ మహాబలు లగువానరు
లకు మహాద్భుతప్రకారంబున రణంబు సెల్లె నప్పుడు. 1673
ఉ. ఆహరియూథముఖ్యులు మహాత్ములు కోపపరీతచిత్తులై
బాహుబలాతిరేకమునఁ బాదపము ల్పెకలించి వైచినన్
సాహస మొప్ప వీరుఁడు ప్రజంఘుఁడు తత్తరుకోటి నెల్ల ను
త్సాహ మెలర్పఁ ద్రుంచెఁ బటుశాతకృపాణముచే రయంబునన్. 1674
చ. గురుతరశైలశృంగములఁ గుంజరయూథముల న్రథంబులన్
పరతురగంబులం దునిమి వైచుచు వానరయూథనాయకు
ల్పరువడి విక్రమించినఁ జలం బడర న్వెస వాని నన్నిటిన్
దురమున యూపలోచనుఁడు తున్కలు చేసి నిశాతహేతులన్. 1675

తే. ఆవనాటోత్తములు మువ్వు రద్భుతముగ
వితతముగ సాంద్రపాషాణవృష్టి గురియఁ
జూచి దనచేతిగదచేత శోణితాక్షుఁ
డంచితంబుగ దాని భంజించె నడుమ. 1676

—అంగదుఁడు ప్రజంఘునిం జంపుట.—

క. పరమర్మవిదారణ మగు, గురుతరపటుఖడ్గ మెత్తికొని రభసమునన్
సురవినుతుఁ డా ప్రజంఘుఁడు, హరిహాయపౌత్రకునిమీఁద నడరె రయమునన్.

వ. ఇట్లు తనమీఁదికిం గవిసిన ప్రజంఘునిం జూచి మహాబలుం డగుయువరాజు సక్రుద్ధుం డై బహువిటపం బైనయశ్వకర్ణవృక్షంబున వానిం బ్రహరించి యంతటం దీఱక కఠినాశనిసన్నిభం బైనపిడికిట వానియురంబునం బొడిచిన వాఁడు చేతిఖడ్గంబు జాఱిపడ నొల్లంబోయి మెల్లనఁ దెలిసి రోషావేశంబున వజ్రకల్పం బైనముష్టి నలవరించి వానరశ్రేష్ఠుం డైన యంగదునిలలాటదేశంబున వ్రేసిన నమ్మహాతేజుండు మూర్ఛిల్లి యొక్కముహూర్తంబునకుం దెలివిఁ బొంది కోపాటోపంబున. 1678

క. తనచేతిఖడ్గమున హరి, మును పవిచే నముచికంఠమునుబోలెఁ బ్రజం
ఘునితల దెగవ్రేసిన నది, దనుజులు వీక్షింప సమరధరణిం బడియెన్. 1679

తే. తనపితృవ్యుఁడు వాలినందనునిచేత
హతుఁ డగుటఁ జూచి యూపాక్షుఁ డపుడు బాష్ప
పూర్ణనేత్రుఁ డై కొంతసేపునకుఁ జాలఁ
గినుక రెట్టింప వీర్య మంగీకరించి. 1680

క. చెచ్చెరఁ గరవాలము గొని, మచ్చరమున రథము డిగ్గి మానుగ దనుజుల్
మెచ్చఁగ నంగదుమీఁదికి, విచ్చలవిడి నేగుదెంచె వేగం బడరన్. 1681

శా. ఈరీతిం గడుసాహసం బడరఁగా నేతెంచుయూపాక్షునిన్
ఘోరాకారునిఁ జూచె యాద్వివిదుఁ డుగ్రుం డై వడిం దాఁకి సాం
పారం గేసరి హస్తినింబలె మహాహంకారుఁ డై వాని దు
ర్వారప్రక్రియఁ బట్టెఁ బట్టుటయుఁ బాఱం జూచి సంరంభి యై. 1682

—యూపాక్ష శోణితాక్షులు మైందద్వివిదులచేఁ జచ్చుట.—

చ. కడువడి శోణితాక్షుఁ డలుక న్గద నాతనిఱొమ్ము గ్రుమ్మినం
జొడ జొడ నెత్తు రొల్కఁ గడుస్రుక్కి యొకింతకు లబ్ధసంజ్ఞుఁ డై
విడువక వానిచేతిగద వేగమె గైకొని వ్రేసె నంతలోఁ
దడయక మైందుఁ డల్కమెయిఁ దట్టెఁ దలంబున యూపనేత్రునిన్. 1683

వ. ఇట్లు బలవంతు లగుయూపాక్షశోణితాక్షులు మైందద్వివిదులచేతఁ బీడితు లై

పాలివోనిబంటుఁడనమ్మునఁ దీవ్రం బగునాక్షోత్పాటనంబులు సేయుచుఁ బలు
దెఱంగుల నద్భుతంబుగాఁ బోరు సమయంబున. 1684

చ. అనుపమసత్త్వుఁ డాద్వివిదుఁ డంతకుక్రైనడిఁ బేర్చి శోణితా
క్షునివదనంబు వజ్రనిభఘోరనఖంబుల జీరి చేతులం
బెనుపుగ మీఁది కెత్తి పుడమిం బడవైచిన భిన్నదేహుఁ డై
దనుజుఁడు ప్రాణము ల్విడిచె దానవు లార్వ వనాటు లుబ్బఁగన్. 1685

తే. దండితారాతి యైనమైందుండు గనలి, పృథుబలంబున యూపాక్షుఁ ద్రెళ్లవైచి
కాళ్లఁ జేతుల మర్దించి కాలుపురికి, బనిచె నంగదముఖ్యులు ప్రస్తుతింప. 1686

వ. ఇవ్విధంబున మైందద్వివిదులచేత యూపాక్షశోణితాక్షులు హతులైనవారలం
జూచి రాక్షససైన్యంబు దెసచెడి పఱవం దొడంగినఁ గుంభకర్ణనందనుం
డగుకుంభుండు సముద్రంబు చెలియలికట్టతెఱంగున దాని నిలువరించి చెయి
వీచి బరవసంబుఁ జేసి పురికొల్పి సంరంభవిజృంభితుండై శరాసారఘోరంబుగాఁ
గవిసి యడ్డంబు వచ్చినవానరుల నెల్ల నాశీవిషసమాననారాచంబులఁ బడ
వైచుచు మర్మవిదారణంబులైన ప్రచండకాండంబుల సైన్యంబుల బడలుపడం
జేయుచు నక్కజం బగుతేజంబు దిక్కులంబిక్కటిల్ల నెక్కడఁ జూచినం దాన
యై భీషణమౌర్వీనిర్ఘోషం బాకాశంబు నిండ సబాణం బైనబాణాసనంబు
విద్యుద్దైరావతార్చిష్మంతం బైనద్వితీయేంద్రచాపంబుచాడ్పునం గ్రాల విచిత్ర
కేతనాతపత్రచ్ఛాయలు భూషణచ్ఛాయలంగలసి నభంబునకు వింత చెలువొ
సంగ మహార్ణవమధ్యంబునం దిరుగుమందరాచలంబుపగిది రథంబు వానరసేనా
మధ్యంబునం దిరుగ ననేకభంగుల వెక్కసంబుగా రణంబుఁ జేయుచు నాపీత
శస్త్రాకారముఖంబు లగుబాణంబులును నర్ధచంద్రాకృతిసాయకంబులును నారా
చంబులును వత్సదంతాకారశరంబులును గంకపత్రసదృశమార్గణంబులును
నుభయపార్శ్వకృతకర్ణికాకారావయవప్రదరంబులును శల్యనారాచాకృతిశిఖర
శరంబులును గరవీరపత్త్రాగ్రసదృశముఖవిశిఖంబులును మఱియు నానావిధానేక
పృషత్కంబులును బరఁగించి వానరబలంబులం గలమేటిమగల నెల్ల వాటం
బుగాఁ బుడమిం గూల్చుచు నద్భుతాటోపంబున విహరించుచు. 1687

మైందద్వివిదులు కుంభునిచే మూర్ఛిల్లుట.

ఉ. అంచితకంకపత్త్రయుత మర్కమరీచిసమాన ముల్లస
త్కాంచనచిత్రపుంఖ మగుకాండము వింట ఘటించి నారి మ్రో
యించి ప్రచండవేగము వహించి వడిం దెగ నిండఁ దీసి లో
మించినకిన్కతో ద్వివిదుమీఁద రహి న్నిగిడించె నుద్ధతిన్. 1688

ఉ. ఆజితలంబులో నిటు నిశాటకులప్రవరాంబకార్తుఁ డై
తేజము సత్త్వసంపదయుఁ దెల్వియు నించుక మాటు చెంద నా

భూజచరాన్వయోత్తముఁడు భూధరశృంగముభంగి నెంతయుక్
రోఁజుచు వ్రాలె రాక్షసవరు ల్కడుసంతస మంది చూడఁగన్. 1689

చ. తమ్మునిపాటుఁ జూచి యల దస్రకుమారుఁడు మైందుఁ డాత్మలోఁ
గ్రమ్మిన కోపవేగమునఁ గాయముఁ బెంచి విశాలశైలశృం
గమ్మును బెల్లగించుకొని గ్రక్కున వచ్చి సమగ్రబాహుస
త్త్వమ్మున వేచి కుంభుపయి వైచె సుపర్వులు చూచి మెచ్చఁగన్. 1690

ఉ. ఆనగకూటముం బవినిభాద్భుతసాయకపంచకంబునం
బూనికఁ ద్రుంచి వేఱొకసుపుంఖశితాగ్రఫణాధరోపమా
నానుపమానబాణము రయంబునఁ జాపమునందుఁ గూర్చి య
వ్వానరవీరువక్షమున వారక యేసెఁ బ్రచండవైఖరిన్. 1691

క. వనచరవీరుం డీగతి, దనుజవరోత్సృష్టబాణతాడితుఁడై గ్ర
క్కున మూర్ఛ మునిఁగి రణమే, దినిపైఁ బడియె న్మరుత్పతిధ్వజముక్రియన్.

అంగదుఁడు కుంభునితో యుద్ధముచేసి మూర్ఛిల్లుట.

వ. ఇట్లు మూర్ఛితులై పడినమైందద్వివిదుల విలోకించి మహాబలుండగునంగదుం
డుకోపాటోపంబునఁ బాదపశిలాసారంబుగురియుచుమహావేగంబున నక్కుంభుం
డలపడిన నతం డయ్యంగదున కభిముఖంబుగా రథంబుదోలించి నారాచపంచ
కంబున నొప్పించి వెండియు మూఁడు వాఁడితూపులమర్మంబులుగలంచి పదం
పడి తోమరంబులచేత మత్తమాతంగంబుంబోలె బహువిధసాయకంబులు
గుప్పించి వెగడుపఱచిన నవ్వానరకంఠీరవుండు నిశితాకుంఠధారకనకభూషణ
బాణవిద్ధుండయ్యును గణింపక తృణీకరించి కాలజీమూతంబుకరణినిరంతరంబు
గా శిలాపాదపవర్షంబు లతనిశిరంబుమీఁదంగురిసిన వాఁడచలుండై నిశితశిలీము
ఖంబులఁ దత్సమీరితపాషాణపాదపంబుల నన్నింటిఁ జూర్ణంబులు చేసి డాసి
రోసంబున మహోల్కలచేతఁ గుంజరంబుంబోలె నాశీవిషసన్నికాశబాణంబుల
రెంట నవ్వీరోత్తమునిభ్రూమధ్యంబు విదళించిన నతండు తద్వ్రణసంజాతరక్త
ధారాస్ఖలితలోచనుండై యొక్కకరంబున నేత్రంబులు గప్పికొనివేఱొక్కకరం
బున నాసన్నవిశాలసాలం బుత్పాటించి యలవరించి జిఱజిఱం ద్రిప్పి
కుంభునివక్షంబున నేసిన నది మహేంద్రకేతుప్రతిమం బై మందరసన్నిభం
బై గడువడి మింటం జనుదెంచు చున్నదాని నిరీక్షించి యక్కుంభకర్ణనంద
నుండు కుఠారముఖంబు లగుసప్తసాయకంబులు పరఁగించి నడుమ నింతింతశక
లంబులు గావించి చూపఱ కాశ్చర్యంబు పుట్టించి యంత నిలువక. 1693

ఆ. తొడరి కౌంభకర్ణి దొడ్డనారసము మే, నుచ్చిపోవ నేయ నొచ్చి యతఁడు
పారవశ్య మొంది బాహువు లూఁతఁగా, మ్రొగ్గ దనుజు లుబ్బి మొనసిచూడ.

తే. ఇంకినపయోధికైవడి నిట్లు వ్యధితుఁ, డైనవాని దురాసదు నగచరేంద్రు

నంగదునిఁజూచి వానరులవ్విధంబు,రామునకుఁజెప్పి రపుడు సంభ్రమముతోఁ.

క. చెప్పిన రఘునాథుఁడు రయ, మొప్ప వ్యథితుఁడైనవానరోత్తము నాజిం
దప్పక గైకొని విధితన,యాప్పతితనయాదికపుల కందఱ కనియెన్. 1696

క. మీ రతిరయమునఁ జని సుర,వైరిఁ బొదివి సంగరమున వాలికుమారున్
వీరు న్సంగరశూరున్, ధీరు న్రక్షింపుఁ డిపుడు తేజం బెనఁగన్. 1697

చ. అన విని వానరప్రవరు లంగదు రామునిశాసనంబున
ఘనతరపాదపాశ్మములు గైకొని కోపవిఘూర్ణితాత్ములై
నిరుపమబాహుసత్త్వుని మహాత్ము సముద్యతచాపుఁ గుంభుని
న్దనుజవరేణ్యనందనునిఁ దాఁకిరి కాలపయోధరార్భటిన్. 1698

క. పెక్కండ్రు ప్లవగు లీగతి, నక్కజముగ నొక్కమొత్తమై తనుఁదాఁకన్
స్రుక్కక నుక్కు సెడక యా, రక్కసుఁ డక్కాలుపగిదిఁ గ్రాలుచుఁ గడిమిన్.

క. తనమీఁది కడరువారల, మునుకొని పటుబాణజాలముల నరికట్టె
ఘనతటినీవేగంబును, బెనుపుగ శైలమున నడ్డపెట్టినమాడ్కిన్. 1700

చ. గురుతరసత్త్వు లయ్యు రణకోవిదు లయ్యు ననేకు లయ్యు ని
ర్జరుల కజయ్యు లయ్యు నతిసాహసు లయ్యు వనాటయూథపు
ల్శరనిధివేలఁ దాఁ గడవఁ జాలనికైవడి నాజి నన్నిశా
చరవరు నొక్కనిం గడవఁ జాలక చిక్కిరి యేమి చెప్పుదున్. 1701

సుగ్రీవుఁడు కుంభునితో యుద్ధము సేయుట.

ఆ. అప్పు డసురసాయకాసారపీడితు, లైనప్లుతచరబలాధిపతులఁ
జూచి కపివిభుండు సుగ్రీవుఁ డధికసం, క్రుద్ధుఁ డగుచు బలసమృద్ధి మెఱయ.

ఆ. అంగదునిఁ బిఱింది కటు ద్రోచికొని తల, మిగిలి పైడికొండ మీఁదఁ దిరుగు
సురగజంబుమీఁది కుఱుకుసింగముభంగి, నాదితేయవైరిమీఁది కుఱికె. 1703

ఉ. నేలయు నింగియు న్దెసలు నిండఁ గడంగి యనేకభంగులన్
సాలతమాలకింశుకరసాలవిశాలకదంబనింబహిం
తాలధవాశ్వకర్ణవటతాలకురంటకనారికేళత
క్కోలకపిత్థబిల్వముఖఘోరమహీరుహవృష్టి ముంచినన్. 1704

క. బెదరక చెదరక కుంభుఁడు, ముదమునఁ బవిసన్నికాశమహనీయోగ్ర
ప్రదరముల వాని నన్నిటిఁ, జిదురుపలై పుడమిఁ దొరఁగఁ జేసెం బెలుచన్.

క. దనుజశరఖండితములై, మునుకొని సుగ్రీవబాహుముక్తద్రుమము
ల్వెనుపొంద నెందుఁ జూచినఁ, దనరారె విశాలపటుశతఘ్నులమాడ్కిన్. 1706

ఉ. అంతటఁ బోక కుంభుఁడు లయానలహేతిసమానకాండము
ల్వంత మెలర్పఁ గీశకులపాలునిపై నిగిడింప నాతఁ డొ
క్కింత చలింప కెంతయు సహించి మనంబునఁ గిన్కఁ బెంచి కా

లాంతకులీలఁ గ్రాలుచుఁ దదంబకము ల్విరియంగఁ దట్టుచున్. 1707

చ. రయమున వానిపైకి మృగరాజుగతిం జని ఘోరభంగిఁ ద
చ్ఛయమున నింద్రకార్ముకముచందమునం దనరారుచాప మెం
తయు వడి మీఱఁ గైకొని మదంబునఁ దున్కలు జేసి భగ్నశృం
గయుతమహాద్విపంబుక్రియఁ గానఁగ నయ్యెడువాని కిట్లనున్. 1708

ఉ. శ్రీదునిఁ బాకశాసనుఁ బరేతపతి న్బలి నబ్ధినాథుఁ బ్ర
హ్లాదునిఁ బోలు దీ విల బలంబునఁ దండ్రికి సాటి వత్తు వా
హ్లాదము నిచ్చె మాకు భవదద్భుతవిక్రమబాణవేగము
ల్నీదుప్రభావము ల్బలమునిష్ఠ దశాస్యుని కైనఁ గల్గునే. 1709

ఉ. నీవు ధనుర్ధరుండ వయి నిక్కము కిన్క వహించి యాజిలో
లావును జేవయు న్వరకలాపసముద్ధతిఁ జూపునప్పు డా
దేవత లైన నిన్నటులు దేఱి కనుంగొనలేరు దైత్యవ
ర్యా విను మాత్మతత్త్వవిదు నాథులు చూడఁగ లేని కైవడిన్. 1710

మ. వరదానంబున రావణుం డసురగీర్వాణాదుల న్గెల్చె దు
ష్కరతేజుం డలకుంభకర్ణుఁ డనిలో శారీరసత్త్వంబున
న్సురలన్ దానవులన్ జయించె రణదక్షుం డింద్రవిద్వేషి భీ
కరచాపంబున దేవదైత్యుల ననిం గారించె నత్యుద్ధతిన్. 1711

చ. దనుజవరేణ్య నీవు వరదానబలంబున దోర్బలంబునం
బ్రణుతధనుర్బలంబున రణంబున దేవనిశాటకోటుల
న్వెనుకొని దోలినట్టిపటువిక్రమశాలివి దైత్యకోటిలో
వినుతికి నెక్కినట్టిఘనవీరుఁడ వైతివి సర్వభంగులన్. 1712

చ. ఇతరులతోడి దేమి మన మిద్దఱ ముద్ధతి డాసి యాశత
క్రతుఁడు బలుండుఁ బోలె బలగర్వ మెలర్ప రణం బొనర్త మ
ద్భుత మగునీప్రతాపమును భూరిబలంబును జాపకౌశలం
బతులితభంగిఁ జూపుము నిశాటవరా తడవేల నాపయిన్. 1713

చ. స్థిరతరశక్తి నిందనుకఁ జేసితి వప్రతిమానకర్మము
న్సురుచిరచాపకౌశలముఁ జూపితి వద్రిచరప్రవీరుల
న్శరములపాలు చేసితివి శౌర్యము సత్త్వము తెల్ల మయ్యె నీ
సరియగుబంటు గానము నిశాచర ధారుణి నెందుఁ జూచినన్. 1714

చ. పలువురతోడఁ బోరి బహుభంగుల మిక్కిలి డస్సియున్నచోఁ
దలకొని కుంభునిం దునిమెఁ దామరసప్రియపుత్త్రుఁ డంచు నా
ద్యులు నిరసింతురో యనుభయోద్ధతి ని న్ననిలోన నింత దాఁ
కలఘుభుజాబలం బలర నాజి వధింపక సైఁచి యుండితిన్. 1715

క. వాలాయ మనేకులతోఁ, నాలం బొనరించి చాలనలసితి విపు డిం
కేలా విశ్రాంతుఁడవై, యాలోకింపు మసురేంద్ర యస్మద్బలమున్. 1716

—సుగ్రీవుఁడు కుంభునిం జంపుట.—

వ. అని సావమానంబుగాఁ బలికిన నభిమాని యగుకుంభుండాజ్యాహుతిప్రవర్ధమానుం డగువహ్నిచందంబున మండి ప్రచండవేగంబున నమ్మార్తాండనందనుం జంపుదు నని తెంపునం జని బాహువులం గదియఁ బట్టిన నాహరివల్లభుండు తత్ప్రకారంబున వానిం బట్టె నిట్లయ్యిరువు రాహితమదదేహంబు లగుగజేంద్రంబులపగిది నన్యోన్యగాత్రగ్రథితులై సారెసారెకునూర్పులు పుచ్చుచు నొండొరుల నాకర్షించుచుఁ బరిశ్రమంబువలన వదనంబులనుండి విస్ఫులింగధూమసహితంబుగా వైశ్వానరజ్వాలలు వెలికి నిగుడఁ బాదాభిఘట్టనంబున మహీతలంబు గ్రక్కదల వ్యాఘూర్ణితతరంగంబులచేతమకరాలయంబుక్షోభింపఁ గరలాఘవంబులు మెఱయఁ గొండొకసేపు మహాద్భుతప్రకారంబునం బోరి రప్పుడా సుగ్రీవుండు కుంభునిం బట్టి త్రిప్పి సముద్రంబులో వైచిన నతండు తొల్లి రమావల్లభునిచేత నైవం బడినమందరాచలంబుకరణి జలరాశిం బడి పతనవేగంబున రసాతలపర్యంతంబు చని వెండియుఁ బైకి నిర్గమించి రయంబునం బఱతెంచి క్రుద్ధుండై సుగ్రీవునివక్షంబు వజ్రవేగం బగుముష్టిం బొడిచిన నెమ్ములు విఱిగి శోణితోత్కీర్ణం బై బహుప్రకారంబుల వ్రయ్యలయ్యె నప్పుడు వజ్రివజ్రనిష్పేషసంజాతజ్వలనజ్వాలం బైన మేరుశైలంబునందుం బోలె దద్వక్షంబునందుఁ దేజంబు ప్రజ్వలితం బయ్యె నంత సుగ్రీవుండు దానికిం గోపించి వజ్రకల్పంబును నర్చిస్సహస్రవికచరవిమండలసమప్రభంబు నగుముష్టి నమర్చి దానవునివక్షంబుఁ బొడిచిన నక్కుంభుండు తత్ప్రహారంబున భృశతాడితుం డై విహ్వలుం డై గతసత్త్వుం డై శాంతి నొందినపావకునివడువున నాకాశంబున నుండి యదృచ్ఛ జాఱిపడిన దీప్తరశ్మి యగులోహితాంగుని పగిది మహీతలంబునం బడి విగతాసుం డయ్యె నప్పుడు సుగ్రీవముష్టిభగ్నుండైనకుంభునిరూపంబు రుద్రాభిభూతుం డైనసూర్యునిరూపంబుపగిదిఁ జూపట్టె నిత్తెఱంగున మహాబలుం డగుకుంభుండు భీమపరాక్రముం డగువానరవల్లభునిచేత రణంబున హతుం డగుచుండ వనశైలసాగరసహితంబుగా ధరాచక్రంబు చలించె రాక్షసు లెల్ల నధికభయభ్రాంతచిత్తులై కనుకనిం బఱచి రంత నికుంభుండు సుగ్రీవునిచేతహతుం డైనకుంభునింజూచి కోపానలజ్వాలాజాలంబులం గాల్చుచున్నవాఁడుపోలె నవ్వానరేంద్రునిఁ జుఱచుఱ వీక్షించి సన్నద్ధపుష్పదామనిబద్ధంబును జందనకుంకుమాద్యర్చితపంచాంగుళిముద్రాముద్రితంబును నగేంద్రశిఖరోపమంబును హేమపట్టపరిష్కృతంబును వజ్రవిద్రుమభూషితంబును యమదండసన్నికాశంబును రక్షోభయనాశనంబును శక్రధ్వజసన్నిభంబు నగు

పరిఘంబు గొని వివృతవదనుండై నింగి పగుల మహాధ్వని గావించుచు వక్షో
గతంబైననిష్కంబుచేతభుజగతంబు లగుకాంచనాంగదంబులచేతఁ గర్ణగతం
బులగుమృష్టకుండలంబులచేత విచిత్రసురుదామంబులచేతఁ గరగతంబైనపరి
ఘంబుచేత నానావిధభూషణంబులచేత నింద్రధనుశ్చంచలాకలితంబైననీలమే
ఘంబుకరణి ఘోషయుక్తంబైనవిధూమపావకునిమాడ్కి శోభిల్లుచుఁ బరిఘా
గ్రంబున సప్తమహావాతగ్రంథిని విరియం దట్టుచు గంధర్వభవనోత్తమసహి
తంబుగా నలకాపురంబును సర్వదేవతామందిరసహితంబుగా నమరావతీపురం
బును దారకాగ్రహనక్షత్రచంద్రమహాగ్రహసహితంబుగానభస్స్థలంబునుబరి
భ్రమణంబునఁ గపింపం జేయుచు జగంబుల నేర్చువిలయకాలాగ్నిచందంబున
వానరబలంబు నేర్చుచు ననివార్యప్రకారంబున రణక్రీడసలుపుచు విహరించు
చున్న నద్దానవునిమ్రోల నిలువనోపక వానరులును రాక్షసులునుభయంబునఁ
బఱవం దొడంగి రప్పుడు. 1717

హనుమంతుఁడు నికుంభునితో యుద్ధము సేయుట.

చ. అనిలతనూజుఁ డొక్కఁ డచలాకృతి సుస్థిరుఁడై గజేంద్రహ
స్తనిభకరంబులం బ్రబలసాలములం గొని భీమణోద్ధతి
న్దనుజుని మ్రోల నిల్చుటయుఁ దప్పక కన్గొని వాఁ డుదగ్రుఁడై
ఘనపరిఘంబు ద్రిప్పి బలగర్వ మెలర్పఁగ వైచె నొమ్మునన్. 1718

తే. అడరి యటు వైవ నయ్యుగ్రమహాఘోరాయుధంబు
వజ్రనిభ మైనపావనివక్షమందుఁ
దాఁకి వెస నూఱుతున్కలై ధరణిఁ బడియె
నంబరంబున నుల్కాశతంబుపగిది. 1719

క. ఆకపివరుఁ డీగతిఁ ద,ద్భీకరపరిఘప్రహారపీడితుఁ డగుచు
న్భూకంపమందు భూరిది,వౌకశ్శైలంబుభంగి నపుడు చలించెన్. 1720

వ. ఇట్లు చలించి యంతలోన నూల్కొని. 1721

హనుమంతుఁడు నికుంభునిం జంపుట.

క. ధీరుండై వాతూలకు,మారుఁడు మారుతముక్రియ నమందరయుండై
సారముకొలంది గ్రక్కున, పేరలుక న్వానిఱొమ్ము పిడికిటఁ బొడిచెన్. 1722

క. పొడిచిన వానియురంబున, వెడవెడ రక్తంబు పొడమె విలయసమయమం
దుడుగక నీలాభ్రంబునఁ, గడువడి గ్రొక్కారుమెఱుఁగు గలిగినమాడ్కిన్.

ఆ. దానవోత్తముండు తత్ప్రహారంబున, నవశుఁ డగుచుఁ బ్రాలి యంతలోనఁ
దెలివి నొంది లేచి తెంపున నమ్మహా,బలకుమారు గ్రుచ్చి పట్టె నపుడు. 1724

ఉ. ఒప్పుగఁ గుంభకర్ణతనయోద్ధృతుఁడై నసమీరపుత్త్రునిం
దప్పక చూచి రాక్షసులు తద్దయుఁ జిత్తములందు సమ్మదం

బుప్పతిల న్నికుంభునిమహోద్ధతి మెచ్చుచు దుర్మదాంధులై
యుప్పరవీధి నిండ జలదోగ్రరవంబున నార్చి రంతయున్. 1725

సీ. వారలహర్ష సమీరితనాదంబు విని వృషదశ్వనందనుఁడు గినుక
రెట్టింప దిట్టయై దట్టించి పిడుగున కెన యైనపిడికిట దనుజుఱొమ్ముఁ
బొడిచినభుజసత్త్వ మెడలనాతఁడుదన్నువిడిచిసాలముమాడ్కిఁబుడమిఁ బడినఁ
గాళ్లఁజేతుల వానిఁ గదునడి మర్దించి యురముపైఁ గూర్చుండి యుగ్రభంగిఁ

తే. దెగువ సిగఁ బట్టుకొని మెడ ద్రిప్పి శైల
శిఖరమున కెన యైన తచ్ఛిరము ద్రుంచి
వైచె వినువీధి నున్న దేవతలు పొగడ
దనుజు లవ్విధిఁ గనుఁగొని తల్లడిల్ల. 1726

శా. క్రూరాత్ముండు నికుంభుఁ డీగతి రణక్షోణీస్థలిం గూలిన
న్ఘోరప్రక్రియ నాకసంబు పగిలెన్ క్షోణీధ్రము ల్వ్రొగ్గె నం
భోరాసు ల్విను ముట్టి పొంగి పొరలెన్ భూచక్ర మల్లాడెఁ బ్ర
త్యారావంబు లొనంగె దిక్కు లతిచిత్రాకారులై రంచఱున్. 1727

వ. ఇట్లు మహాద్భుతప్రకారంబున రణంబునం గూలిననికుంభు నవలోకించి యం
తకు మున్ను వానరుల మార్కొని సమాగతరోషులై దారుణప్రకారంబున
రణంబు గావించుచున్నరాక్షసులు పోరు సాలించిభయభ్రాంతచిత్తులై లంకకుం
బాఱిరి వానరులును గొంతదూరంబు వారలం దఱిమి క్రమ్మఱ హనుమంతుని
కడకుం జనుదెంచి సంప్రహృష్టచిత్తులై వినుతించి సింహనాదంబులు గావించి
రంతఁ గుంభనికుంభు లాలంబులోఁ గూలుట విని రావణుండు పరమామర్షియై
హుతాగ్నిచందంబున మండి క్రోధశోకంబులు మనంబునఁ బెనంగొననొక్కింత
సేపు విచారించి తనమ్రోల నున్నఖరపుత్త్రుం డైనమకరాక్షు విశాలాక్షు నిరీ
క్షించి యిట్లనియె. 1728

క. తడయక నాచే నాజ్ఞప్తుఁడవై మకరాక్ష నీవు పోలువుగ సేన
న్విడువక గొని చను మాజికిఁ, బొడిచి గెలువు మద్రిచరుల భూవరసుతులన్.

చ అన విని శూరమాని యగు నమ్మకరాక్షుఁడు రాక్షసేశ్వరుం
గనుఁగొని దేవ మీపనుపు గాదన నాకుఁ దరంబె యిప్పుడే
చని భుజవిక్రమం బలర సర్వవనాటచమూయుతంబుగా
జనపతిపుత్త్రులం దునిమి చయ్యన నీకడ కేగుదెంచెదన్. 1730

క. అని పలికి యతండు దశాననునకుఁ బ్రీతిం బ్రదక్షిణంబుఁ బ్రణామం
బొనరించి విశద మగుతద్ధ్వజసద్మము నిర్గమించి కడు వేగమునన్. 1731

ఆ. తనదుమ్రోల నున్నదళవాయిఁ గనుఁగొని, సంగరార్హ మైనస్యందనమును
వివిధభంగి నొప్పు చతురంగబలమును, సైన్యనాథ తెమ్ము సత్వరముగ. 1732

చ. అన విని వాఁడు గ్రక్కున శతాంగము నుగ్రచమూకదంబముం

గొనకొని తత్సమీపమునకుం గొని తెచ్చిన నాతఁ డంత స్యం
దనమునకుం బ్రదక్షిణ మొనర్చి రయంబున దాని నెక్కి సూ
తునిఁ గని చెచ్చెర న్రథము దోలుము నీవని పల్కి యుద్ధతిన్. 1733

సీ. అసురులఁ జూచి మీ రందఱుఁ గడు సాహసంబునఁ గపులతో సంగరంబు
గావింపుఁ డేను రాక్షసనాథుఁ డగుదశకంఠుచే రామలక్ష్మణులవధము
నందు నియుక్తుఁడ నైతిఁ గావున నేఁడు కడువడి వారిపై నడరి తీవ్ర
శరముల వధియించి శాఖామృగస్వామి సుగ్రీవుఁ దెగటార్చి యుగ్రభంగిఁ
తే. సవల వైశ్వానరుండు కాఱడవి నేర్చు,కరణి వానరసైన్యసంఘముల నాక్ర
మించి భుజగర్వమున విజృంభించి విశిఖ,శిఖి దహించెద దానవశ్రేష్ఠులార.

మకరాక్షున కశుభనిమిత్తంబు లగపడుట.

వ. అని పలికిన నమ్మకరాక్షునివచనంబు విని బలవంతు లగురాక్షసు లందఱుఁ గా
మరూపధరులై నానాయుధోపేతులై సమాహితులై పింగళేక్షణులై మదోన్మ
త్తులై యుద్ధాభికాంక్షులై దంష్ట్రాకరాళవదనులై భయంకరాకారులై మత్త
మాతంగంబులభంగి ఘీంకారంబులు సేయుచు భుజాస్ఫాలనంబు గావించుచు
నభూతపూర్వతేజోవిశేషంబునంగ్రాలుచు సమరసన్నాహసంరంభవిజృంభితులై
మహాకాయుం డగుమకరాక్షునిం బరివేష్టించి సమాహతశంఖకాహళభేరీనినా
ద పురస్సరంబుగా నట్టహాసంబున రణంబునకు వెడలి రప్పు డాకస్మికంబుగా
సారథికరంబుననుండి ప్రతోదంబు జాఱి పుడమిం బడుటయు ఖరపుత్త్రునిరథంబు
పై నెత్తిన మణిధ్వజంబు విఱిగి కూలుటయు రథసంయుక్తంబు లగుహయం
బులు విక్రమవర్జితంబులై దీనముఖంబులై కన్నీరు నించుచుఁ జరణంబులు తడఁ
బడం జనుటయుఁ బవనుండు ఖరదారుణుండై పాంసుయుక్తంబుగా వీచుటయు
నివి మొదలుగాఁ గలదుర్నిమిత్తంబు లనేకంబులు విలోకించియు వీరసత్తము
లగుటంజేసి చింతింపక గజమహిషాంగతుల్యవర్ణులగురాక్షసు లేన యేన
తల మిగిలి వానరులం బరిమార్చెద నని పంతంబులు పలుకుచుఁ జరణసంఘట్ట
నంబున మహీతలంబు కంపింపంజేయుచు నతిసమ్మర్దంబుగాఁ ద్రోచి నడిచి రంత.

ఉ. ఆజికి నిట్లు వచ్చుమకరాక్షుని దర్పులఁ జూచి రుష్టులై
భూజచరప్రవీరులు చమూపతి చోదితులై రయంబునన్
రాజితవృక్షసంఘములు ఱాల్లు కరంబులఁ గ్రాలఁ గ్రవ్యభు
గ్రాజులతోడ ఘోరసమరం బొనరింపఁగఁ బూని రయ్యెడన్. 1736

ఉ. వారలఁ జూచి రాక్షసులు వారక రోషపరీతచిత్తులై
దారుణభంగి దాఁకి రిటు తప్పక మున్నల దేవదానవుల్
చేరినమాడ్కి నయ్యుభయసేనలవారును జేరి వీఁకతోఁ
బోరిరి సింహనాదములు భూరిపరాగము నింగి ముట్టఁగన్. 1737

క. సాహసమున నయ్యుభయస,మూహంబులు మచ్చరమున ముష్టాముష్టిన్
బాహాబాహిఁ గచాకచి, సాహస మొనరించె నప్పు డద్భుతభంగిన్. 1738

మకరాక్షుఁడు వానరులతో యుద్ధము సేయుట.

తే. తరుచరులు మీఱి నిగిడించు తరులు శిలలు
సాంద్రముగ మింటఁ బర్వ తత్సమరవిధముఁ
జూడ వచ్చిన వేల్పులచూడ్కికములు
నాట నీ వయ్యె నది యే మనంగ వచ్చు. 1739

క. తెగిపడెడుతలలు కడువడి, గగనంబున కెగయుతలలు గానఁగ నయ్యెన్
మిగుల రణలక్ష్మి ముద మొ, ప్పఁగ నాడెడుకల్వపూలబంతులమాడ్కిన్.

చ. శిరములు కూర్మముల్ చదలఁ జిందినహేతిరజంబు సైకతం
బురుకరు లుగ్రనక్రములు ప్రోల్లసదాయుధఖండము ల్ఫణుల్
కరములు మీనము ల్రణతురంగము లొక్కట యానపాత్రముల్
వఱల రణావని న్రుధిరవాహిని పాఱె నొకింతలోపలన్. 1741

చ. గిరిచరు లుగ్రభంగిఁ బరఁగించు నగంబులఁ బ్రస్తరంబులం
బరశుగదాసికుంతముల బ్రద్దలువాపుచు గండు మీఱి ము
ద్గరముల మోఁది పెన్నదలఁ బట్టి శిరంబుల గ్రుచ్చి గత్తులన్
నఱికి నిశాటవీరులు రణంబునఁ ద్రుంచిరి వారి నుద్ధతిన్. 1742

మ. మకరాక్షుండును భూనభంబులు చలింప న్నార్వి మ్రోయించుచున్
వికటభ్రూకుటిదుర్నిరీక్షుఁ డగుచున్ వేయేసి బాణంబు లొ
క్కొకముష్టి న్నవరించి వేవు రురుకాయు ల్గూలఁగా నేయుచున్
సకళుండై విహరించె వానరచమూసందోహమధ్యంబునన్. 1748

తే. అతనిప్రాపున నిర్భయులై సుపర్వ
విమతు లొగి మచ్చరంబున విచ్చలవిడి
వానరబలంబు సొచ్చి యవార్యభంగిఁ
జించి చెండాడఁ దొడఁగిరి చిత్రగతుల. 1714

చ. గురుబలు లైనదానవులకొల్లల కోర్వక వానరోత్తము
లొరువడిఁ బ్రాణభీతిమెయిఁ బాఱఁగఁ జూచిన వారిఁ జూచి ని
ర్జరవిమతు ల్సమిద్విజయరాజితు లై కడు సంతసిల్లి కే
సరులక్రియ న్సినాదములు సల్పుచు వే దఱుచుంగ జొచ్చినన్. 1745

ఉ. వారలఁ జూచి రాఘవుఁడు వానరులం బురికొల్పి చాపమౌ
ర్వీరవ మాచరించి నరవిఙ్ఛదము ల్గల సర్పరాజాలం
గేరుప్రచండకాండము లొగిం బరఁగించి యొకింతలోన దే
వారులభూరిదోర్బలరయం బడఁగించెఁ బ్రతాప మేర్పడన్ 1746

క. పాఱెడునిజసైన్యము గని, వారించుచు ఖరసుతుం డవార్యగతి హరిం
జేరుకరిభంగి రామునిఁ, జేరి కినుక నెత్తి కెక్కఁ జెచ్చెరఁ బలికెన్. 1747

మకరాక్షుఁడు రామునిఁ దిరస్కరించుట.

ఉ. మేఘము వంటి నీకురుసమీరుఁడ నే నిదె వచ్చినాఁడ నో
రాఘవ నీకొనంగెదఁ దిరంబుగ నిప్పుడు ద్వంద్వయుద్ధముం
లాఘవ మొంది పాఱక చలంబునఁ బోరుము నిల్చి భీకరా
మోఘమదీయకార్ముకవిముక్తశరంబుల గీటణంచెదన్. 1748

చ. అనిమిషసిద్ధసాధ్యగరుడాదుల కాజి నజయ్యుఁ డైనమ
జ్జనకుని రాక్షసోత్తముని సైన్యయుతంబుగ నాఁడు దండకా
వనమునఁ ద్రుంచినట్టిపగవాని నయుక్తవిచారు నిన్నునిం
గనుఁగొనినంత రోష మధికం బగుచున్నది యంతకంతకున్. 1749

శా. ఆ కాలంబున నమ్మహావనములో నచ్చోట రాజేంద్ర నే
లేకున్న న్బలశాలి మజ్జనకు దోర్లీలోద్ధతిం జంపఁగా
నీకుం జెల్లె మహాధనుర్ధరుఁడనై నిక్కంబు నే నున్న న
స్తోకానేకశిలీముఖంబుల నినుం దోడ్తోడ మర్దింపనే. 1750

ఉ. ఎప్పుడు చూతు రాము నిఁక నెప్పుడు ద్రుంతు నటంచుఁ గౌతుకం
బొప్ప దినంబులం గడుపుచుండఁగ నేఁటికి దైవికంబునం
దప్పక నన్నుఁ జేరితివి తద్దయు నాఁకట డస్సి కానలో
దప్పిఁ జరించు కేసరిని దావమృగం బడి చేరినట్లుగన్. 1751

చ. విషపరిదిగ్ధమద్విశిఖవేగమున న్వెస నీవు ప్రేతరా
డ్విషయగతుండ వై కడువడిం దగ నింతకుము న్రణోర్వి నీ
యిషువులఁ గూలి యావలని కేగినశూరులఁ గూడె దివ్య పౌ
రుషము కలంతకాల మవిరోధముగాఁ బని సేయ నేర్చునే. 1752

చ. పలుకులు వేయి యేటికిఁకఁ బార్థివనందన నేఁడు పోరిలోఁ
దలఁగక సర్వలోకములు తావకతేజము మత్ప్రతాపముం
గలయఁ గనుంగొనంగలవు ఖడ్గగదాశరబాహుయుద్ధముం
దలయక నీవు నేర్చినక్రియం దడవేల పెనంగు ముద్ధతిన్. 1753

వ. అని పలికిన బహుప్రలాపి యగుమకరాక్షునివచనంబు విని ప్రహసించుచు ఖరాంతకుం డిట్లనియె. 1754

తే. కండక్రొవ్వునఁ జేడ్పాటుగాన కిట్లు, రిత్తపలుకులు వేయేల ప్రేలెదీవు
రాక్షసాధమ సంప్రహారమునఁ గాని, వాగ్బలంబునఁ గలుగునె వైరిజయము.

చ. అసురకులాధమా మును రణావని నీజనకుం ద్రిమస్తకు
న్వెరువక దూషణు న్భువనవిశ్రుతులం బదునాల్గువేలర

క్కసుల వధించు టొక్కసని గాదు రణంబున నిన్నుఁ జంపి నేఁ
డసమునఁ గాకఘూకశునకాదుల కిచ్చెద నీదుమాంసమున్. 1756

మకరాక్షుఁడు రామునితో యుద్ధము సేయుట.

క. అని పలుక నవుడు కోపము, మనమున రెట్టింప ఖరకుమారుఁడు రఘునా
థునిమీఁద నవిరళంబుగ, వనదముచందాన బాణవర్షము గురిసెన్. 1757
క. ఆయంబకముల నన్నిఁటి, సాయకవర్షమునఁ బెక్కుశకలంబులుగాఁ
బాయక ఖండించిన హైమాయతపుంఖములు మెఱయ నవి భువి వ్రాలెన్.
క. శరనిధులు పొంగి పొరలఁగ, ధరణి యదర మిన్ను వణఁక దరుచరులు నిశా
చరులు వెఱఁగంది చూడఁగ, ఖరసుతునకు రాఘవునకుఁ గయ్యము సెల్లెన్.
చ. ధనువులు మౌర్వినాదము లుదంచితకాంచనపుంఖదీధితుల్
ఘనతరకాండముల్ గలిగి కయ్య మొనర్చిరి వార లద్రిభి
ద్ధనువులు గర్జితధ్వనులు దట్టపుఁ గారుమెఱుంగులు న్శిలా
శనులును గల్గి యభ్రమున సాంద్రఘనంబులు పోరుచాడ్పునన్. 1760
క. మకరాక్షుఁ డేయుశరములు, ప్రకటితముగఁ దునిమివైచు రఘువిభుఁ డాభా
నుకులేంద్రుఁ డేయుశరములు, మకరాక్షుఁడు దునిమివైచు మార్గణవితతిన్.
క. ఖరరిపుఖరనందనభీ,కరకరపరిముక్తసాయకంబులు నభము
న్ధరణియు దిక్కులు శరధులు, కర మరుదుగ నిండె నెందుఁ గనరాకుండన్. 1762
క. అపు డిరువురు రణవిద్యా, నిపుణు లగుటవలన శింజినీధ్వని గుఱిగా
విపులశరము లేయుచు ధైర్యపరీతాత్ము లయి పోరి రద్భుతభంగిన్. 1763
వ. ఇట్లెక్కువతక్కువలు లేక కొండొకసేపు నానాప్రకారంబుల రణంబు గావించి
రంత. 1764

రాముఁడు మకరాక్షునిం జంపుట.

ఉ. ఆనరనాథవర్యుఁ డఖిలాస్త్రవిదుండు మహాభుజుండు జ
న్యానతవైరి రామవిభుఁ డల్క జనింప శరాష్టకంబునన్
వానిరథంబు చక్కడిచి వాజుల గీటణఁగించి సారథిన్
మానక చంపి విల్విఱిచి మారణవిద్ధునిఁ జేసె నుద్ధతిన్. 1765
వ. ఇట్లు విరథుండై మకరాక్షుండు ధరకు లంఘించి పాలివోనిబంటుఁదనంబున
యుగాంతాగ్నిసమప్రభంబును దివ్యహాటకవలయమండితంబును సర్వభూతసం
త్రాసనంబును గాలాయసనిర్మితస్వరూపంబు నగుశూలంబుగొని మిణుంగుఱులు
సెదర వేయిమార్లు ద్రిప్పి విసరి వైచిన న త్తెఱంగు విలోకించి రాముండు వజ్ర
కల్పంబు లగుమూఁడువాఁడితూపుల దాని ఖండించిన నమ్మహాశూలంబు రామ
బాణార్దితంబై విఱిగి యాకాశంబున నుండి మహోల్కవగిది. మండుచుఁ

బుడమిం బడియె నద్భుతకర్ముం డగురాముని చేత నిహతం బైనతచ్ఛూలంబునవ
లోకించి మింట నున్న వేల్పులు సాధువాక్యంబుల రాముని బ్రశంసించి రంత.

మ. తనశూలం బటు భగ్నమై పడిన నద్దైత్యుండు సంక్రుద్ధుఁడై
ఘనముష్టిం గొని తిష్ఠ తిష్ఠ యనుచుం గట్టల్క దీపింపఁగాఁ
జనుదేరం గని రాఘవుండు నియతి న్పప్తార్చిరస్త్రంబు గ్ర
న్నన సంధించి సురారిపైఁ బఱపె మంటల్మింటిపైఁ గ్రమ్మఁగన్. 1767

తే. అనుడుఁ డమ్మహానీయానలాస్త్రశిఖల, దగ్ధుఁడై ధాత్రిపైఁ బడి తత్క్షణంబ
తరుచరులు సంతసింప నిర్జరవినుతులు, ఆచ్చపడి సూచుచుండఁగఁజచ్చెనపుడు.

వ. ఇట్లు తొమ్మిదవనాఁటియుద్ధంబున రాముండు మకరాక్షునిం బరిమార్చి విజయ
లక్ష్మి నధిగమించి ప్రకాశించె నప్పుడు. 1769

ఉ. ఆలములోన రాఘవవరాస్త్రవిశీర్ణశరీరుఁడై మహిం
గూలినదైత్యనందనుని గోత్రవిరోధికరప్రముక్తదం
భోళివిలూనపక్ష మయి భోరనఁ గూలినశైలము న్బలెం
బోలఁగఁ జూచి వేల్పు లతిమోదము నొంది నుతించి రవ్విభున్. 1770

--- రావణుఁడు యుద్ధమున కింద్రజిత్తును బంపుట. ---

వ. అంత. 1771

క. మకరాక్షుఁడు హతుఁ డగుటకుఁ, జకితుండై దశముఖుండు చాలఁ దపించెన్
వికటభ్రుకుటీబంధము, ప్రకటితముగఁ గోపయుక్తభావము దెలుపన్. 1772

వ. ఇట్లు శోకరోషభయంబులు మనంబున ముప్పిరిగొనఁ గొండొకసేపు తలవాంచి
యూరకుండి వెండియు నొక్కింత ధైర్యం బవలంబించి యింక నేమి సేయు
వాఁడ నని చింతించి తనమ్రోల నున్నశక్రజిత్తు నవలోకించి యిట్లనియె 1773

ఉ. వీరవరేణ్య నీవు బలవీర్యములం గడుమేటివారిలో
ధీరుఁడ వట్లు గావున నదృశ్యుఁడవై పరిదృశ్యమానుల
న్వీరుల రామలక్ష్మణుల వేగ వధించి తదంబకంబులం
దీఱినవారి నెవ్వగలు దీర్పుము చేర్పుము భక్తి నాపయిన్. 1774

చ. అనుపమశౌర్యుఁడై నదివిజాధిపునంతటివాని నాజి నో
ర్చినబలశాలివయ్యు సుతశేఖర నీవు రణంబులోన రా
ముని నొకమర్త్యమాత్రకుని భూజచరాశ్రితు నల్పు దుర్బలుం
డనుమ నుపేక్షఁ జేసితివి ద్రుంగఁడె నీ పని నిక్క మల్గినన్. 1775

క. అని పల్కి వీడుకొల్పినఁ, బనివినియెద ననుచు నతఁడు పైనంబై గ్ర
క్కునఁ దత్సదనము వెలువడి, చనియె న్మఖభూమి కపుడుసంభ్రమ మెసఁగన్.

--- ఇంద్రజిత్తు తనకు జయము గలుగుటకై యగ్నిదేవు నారాధించుట. ---

వ. ఇట్లు దశముదివసంబున యుద్ధార్థం బరిగి యందుఁ గలోప్తప్రాకారంబున ననలుం

బ్రతిష్ఠించి రక్తమాల్యాంబరాభరణగంధాలంకృతుండై మౌంజీదండోపవీతం
బులు దాల్చి యచట ఖట్వాంగధ్వజంబు నిలిపి కపాలాసనారూఢుండై స్రుక్స్రు
వంబులును రక్తంబు నినుపపాత్రల నిడి త్రికోణాకారనిర్మిత మైనవేదికిదక్షిణ
భాగంబునం బెట్టి మౌనంబు ధరియించి యథర్వణమంత్రంబు లుచ్చరించుచు
నహోమయంబు లగుస్రుక్స్రువంబులఁబట్టి తాఁడిసమిధలును దిలలును సర్షపం
బులును జరువును హోమంబు చేసి హోమాంతంబునందు జీవయుక్తం బైనకృష్ణ
చ్ఛాగగళంబు కరవాలంబునం దెగవ్రేసి పూర్ణాహుతి గావించిన నయ్యగ్ని దే
వుండు విధూమప్రదక్షిణావర్తశిఖుండై విజయలక్షణంబులు తేటపడ వెలుం
గుచు హవ్యంబులు ప్రతిగ్రహించితప్తహాటకసన్నిభుండై కుండంబువలనవెల్వడి
పొడసూపి దివ్యరథంబును దివ్యాస్త్రంబులును దివ్యకవచంబును దివ్యచాపంబు
నొసంగిన నమ్మహనీయరథం బారోహించి కంకటంబుదొడిగి తూణీరంబుబిగిం
చి చాపంబు గైకొని నారి సారించుచు బ్రహ్మాండకర్పరంబు పగుల సింహనా
దంబు చేసి శంఖం బొత్తి దివ్యమణిమండనరోచులు దిక్కులం బిక్కటిల్ల రాక్ష
సాంగన లిరుగెలఁ జారుచామరంబులు వీవఁ బాండరచ్ఛత్త్రంబుశీర్షోపరిభాగం
బున నలర భేరీనిస్సాణధణంధణశబ్దంబులు బోరుకలఁగ శతాంగమాతంగతు
రంగపదాతివర్గంబు లనేకంబులు వెన్నాడి నడువ రణోత్సాహమానసంబునం
జెలంగ నమోఘప్రతాపదీపితుండై వివిధాట్టహాసపూర్వకంబుగా రణంబునకు
వెడలి యుద్ధభూమికిం జనుదెంచునపుడు సమారోపితమహాచాపంబై వాజి
చతుష్టయయుక్తంబై తపనీయపరిచ్ఛదంబై సౌవర్ణవలయశోభితంబై యంతర్ధాన
శక్తియుక్తంబై దీప్తపావకసన్నిభంబై చంద్రార్ధచంద్రాకారరచనావిశేషనారాచ
శోభితంబై వైడూర్యకేతుసమాలంకృతంబై బాలభానునిచందంబునం దేజ
రిల్లుచున్నశక్రజిత్తురథంబు దవ్వులం జూచి వానరులు భయభ్రాంతచిత్తులై
రప్పు డాయింద్రజిత్తు రథంబుతోడ నాకాశంబున కెగసి రాక్షసుల నందఱ
నవలోకించి యిట్లనియె. 1777

ఉ. నేఁడు రణంబులోన రజనీచరులార నృపాలపుత్త్రుల
న్వాఁడిశరంబులం దునిమి వాలిజవాయుజముఖ్యకీశులం
బోఁడిమి మీఱ గీటణఁచి భూమి నవానరఁ గా నొనర్చి బ
ల్వేడుకతోడ సౌఖ్యపదవి న్జయ మిచ్చెద దైత్యభర్తకున్. 1778

ఇంద్రజిత్తు వానరులమీఁదఁ బలుదెఱంగుల బాణవర్షము గురియుట.

క. అని పలికి యదృశ్యుండై, వినువీధిం దిరిగ వచ్చి విబుధరిపువరుం
డనుపమశరవర్షంబును, వనచరతతిమీఁదఁ గురిసె వనదముమాడ్కిన్. 1779

ఉ. ఆశరవృష్టికిం దలఁకి యాస్యము నెత్తఁగ లేక భీతులై
కీశులు కొంద ఱంబునిధిక్రేవకుఁ బాఱిరి కొంద ఱాజివి
ద్యాశరధి న్మహాశరధి దాశరథి న్శరణంబు వేఁడి ర

భ్యాళగతాద్రికందరములందును డాఁగిరి కొంద ఱార్తులై. 1780

ఉ. ఆయసురేంద్రుఁ డిట్లు విపినాటులఁ గాండములు న్బశల్పశం
జేయుచు వచ్చి యొక్కెడఁ ద్రిశృంగయుతాద్రులభంగిఁ బొల్చి యా
చాయకు డాయకుండ శరజాలము లేయుచు రౌద్రమూర్తులై
పాయక సైన్యమధ్యమున భాసిలుచున్ననరేంద్రసూనులన్. 1781

ఉ. చూచి నిజంబు వీరె నృపసూను లటంచటు నిశ్చయించి దో
షాచరవంశశేఖరుఁడు చాపము సజ్యము చేసి ఘోరనా
రాచపరంపరల్ వెలుదెఱంగులఁ బైఁ బరఁగించె జన్యవి
ద్యాచతురత్వ మేర్పడ లయాభ్రము దారుణవర్షముం బలెన్. 1782

తే. మఱియు నానైరృతుఁడు దివ్య మంత్రశక్తి
రథముతోఁ గూడ గగనమార్గమున కెగసి
సంచరించుచు దృష్టిగోచరుఁడు గాక
ఘోరశతకోటినిభశరకోటిఁ బంచె. 1783

క. పెనువెల్లువకై వడి నడిఁ, జనుదెంచుసురేంద్రవైరిచాపవిముక్త
స్వనయుక్తశరౌఘం బా, ఘనులకు వారింప నలవి గాకుండె ననిన్. 1784

ఉ. ఏమని చెప్పవచ్చు నసురేంద్రకుమారుఁ డొనర్చు ఘోరసం
గ్రామవిధంబు తన్నిశితకాండకృతవ్రణజాతరక్తధా
రామిళితాంగులై మనుజరాజులు జేవుఱుఁ గ్రోల్తతోడియు
ద్దామనగంబులో యనఁగఁ దద్దయుఁ జూడఁగ నొప్పి రయ్యెడన్. 1785

ఉ. అంత నొకింతసేపునకు నారఘువర్యులు ధైర్య మూఁది కా
లాంతకదండతుల్యవివిధాంబకము ల్వెస వింటఁ గూర్చి రో
దోంతర మెల్ల నిండ రయమార నిగిడ్చి దశాస్యసూతిపైఁ
బంత మెలర్ప దీవ్రపటుబాణచతుష్టయ మేసి రుద్ధతిన్. 1786

ఉ. ఆరజనీచరేంద్రుఁడు దురంతనిశాచరమాయఁ బన్ని యే
పారఁగ దిఙ్నభోగత సమస్తచరాచరభూతజాలముల్
సూరెల నెవ్వియు న్వెదకి చూచినఁ గన్పడకుండ సాంద్రనీ
హారఘనాంధకారతమ మద్భుతభంగి సృజించె నుద్ధతిన్. 1787

ఇంద్రజిత్తు రామలక్ష్మణులమీఁద బాణవర్షము గురియుట.

తే. కదిసి జడివాన గురియుమేఘంబులోని
స్తనితములభంగి రథనేమిచాపనిస్వ
నములు విన వచ్చుఁ గాని తత్తిమిరమందుఁ
గాన రాదయ్యె నింద్రారికాయ మపుడు. 1788

చ. దనుజవరేణ్యపుత్త్రుఁడు పితామహదత్తవరుండు గాన్ఁ జ

క్కన నిటు దృష్టిగోచరుఁడు గాక తమోవృతుఁడై పురందరా
శనినిభభానుభానుసమసాయకము ల్నిగిడించి రాఘవేం
ద్రుని నిఖిలాంగమర్మములు నొవ్వఁగఁ జేసె మహాద్భుతంబుగన్. 1789

తే. అంబుధారలచేఁ బర్వతంబుకరణి
ననురపరతీవ్రనారాచహన్యమాను
లయ్యు రాఘవు లొక్కింత యైన సరకు
గొనక కృతచాపశింజినీఘోషు లగుచు. 1790

చ. నిరుపమవిక్రమం బడర నింగికిఁ జూడ్కులఁ బర్వఁ జేసి వి
స్ఫురదురుకంకపత్త్రమణిపుంఖశితాంబకము ల్వరాస్త్రముల్
పఱపిన నావిఁ దాకి వెస భగ్నములై శరమోఘబాణముల్
వసుధ నికృత్తభోగఫణిపంక్తులనై పడెఁ గూలె నుర్విరన్. 1791

ఉ. వ్రేటునఁ బుట్టుకోపమున వీర్యము తేజము వృద్ధిఁ బొంద దో
ష్పాటకులోత్తముండు వివిధాననతిగ్మసువర్ణపుంఖక
ర్కోటకసన్నిభప్రదరకోటులఁ బైఁ బరగించె సంతతో
ద్ఘాటనితాంతమౌర్వినినదంబు లజాండము వ్రయ్యఁ జేయఁగన్. 1792

క. తక్కక తద్విశిఖంబుల, నక్కజముగ హన్యమానులై నృపసూనుల్
స్రుక్కక పటుభల్లంబులఁ, జక్కలువాపిరి తదీయశాతశరములన్. 1793

ఉ. దానికి నల్గి రావణి ప్రతాప మెలర్పఁగ విల్లు వంచి మౌ
ర్వీనినదంబు పెల్లెసఁగ వెక్కస మైనప్రచండకాండముల్
వే నిగిడింప వజ్రసమవేగములై యవి రాఁ దొడంగె మి
న్నీనినమాడ్కి భాస్కరకులేంద్రులమీఁదికి సేనమీఁదికిన్. 1794

క. ఏచాయఁ గన్న దృష్టి క, గోచరుఁడై చిత్తజల్లు గురిసినక్రియ దో
షాచరనాథసుతుఁడు నా,రాచపరంపరలు పఱపె రామునిమీఁదన్. 1795

క. ఏవంకఁ జూడఁ జూచిన, నావంకం గురియు సాయకానారం బా
రావణనందనశరవి,ద్యావిభవం బింత యనుచు నలవియె పొగడన్. 1796

మ. శరజాలంబులు గూర్చి యేయుటకు హస్తం బెత్తి రాకుండఁ బు
ష్కరవీథిం దనయున్కిఁ జూచుటకు వక్త్రం బెత్తి రాకుండ భీ
కరలీల న్నరకు న్నభంబునకు నేకత్వంబు గల్గ న్ఘన
చ్ఛరము ల్వే నిగిడించె నొక్కమొగిఁ బర్జన్యుండు వృష్టింబలెన్. 1797

సీ. ఒకవంకఁ గోదండ ముద్ధతి మెఱయించు నొకచోటఁ దిగ్మసాయకము లేయు
నొకచాయ హరిభంగి హుమ్మని ఘోషించుఁ గడువడి నొకక్రేవఁ గానిపించు
నొకమూరఁ జిత్రయుద్ధోద్యోగ మొనరించు నొకదెసఁ గురియించునుపలవృష్టి
నొకదారిఁ దననామ మకలంకగతిఁ జెప్పు నొకయెడ నదలించు నుగ్రలీలఁ

ఆ. నొకటమాయఁబన్ను నొక్కెడఁగలుషించు, నొక్కమూలఁద్రుళ్లు నొకటనవ్వు
విబుధవైరి యిట్లు విష్ణుపదంబునఁ, జిత్రగతిఁ జరించెఁ జిక్కుపడక. 1798

ఆ. రాజసుతులు దైత్యరాజనందనముక్త, శరకృతక్షతాభి జాతరక్త
పూరసిక్తు లగుచుఁ బుష్పితకింశుక, భూరుహములభంగిఁ బొల్చి రపుడు. 1799

క. ఈగతి ననన్యభేద్యుం, డై గురుతరబాహుశక్తి నసమానశరో
ద్వేగమున రాజవర్యుల, బాగుగ నెగడుపడఁ జేసి పటుశౌర్యమునన్. 1800

చ. ధనువు రథంబు గుఱ్ఱములు తాను సారథియు న్బతాకయుం
గనఁబడకుండఁ దీవ్రగమనంబునఁ బైఁ బయి నాక్రమించి కాం
చనవలయప్రదీప్తపటుశాణశితాగ్రశరంబు లేయుచున్
వెనఁకువ మీఱ వానరులఁ బీనుఁగుపెంటలఁ జేసె నెంతయున్. 1801

క. విచ్చలవిడి నద్దైత్యుఁడు, చెచ్చెర నిగిడించునట్టి శితసాయకముల్
క్రచ్చఱఁ బిడుగులక్రియ భూ,భృచ్చరతతిమీఁదఁ బడియె భీషణభంగిన్.

వ. ఇట్లు మహాద్భుతప్రకారంబున నంతర్ధానగతుండై రణంబుసేయుచున్న శక్ర
జితునియాటోపంబుఁ జూచి సహింపక లక్ష్మణుండు సంక్రుద్ధుండై రామభద్రు
నవలోకించి యిట్లనియె. 1803

ఉ. గర్హితవర్తనుండు దశకంఠతనూజుఁడు మాయఁ బన్ని యుం
తర్హితకాయుఁడై కడుమదంబున నంబరవీథినుండి మా
నార్హుల వానరోత్తముల నంబకవిద్ధులఁ జేయుచున్నవాఁ
డర్హమె సద్గుణాఢ్య మన కార్తులఁ బ్రోవ కుపేక్ష సేయఁగన్. 1804

క. ఆలస్య మేటి కిఁక నర,పాలమణీ యానతిమ్ము బ్రహ్మాస్త్రమునన్
వాలాయము నిఖిలాసుర,జాలంబుల గడియలోన సమయింతు ననిన్. 1805

—రాముఁ డింద్రజిత్తును వధింప నిశ్చయించుట.—

చ. అన విని రాముఁ డిట్లనియె నక్కట యొక్కనికై కుమార యీ
దనుజుల నెల్లఁ ద్రుంచు టది ధర్మమె నీకది గాక భీతిమైఁ
జనియెడువాని ఛన్న ననిసల్పనివాని నిరాయుధుం బ్రమ
త్తుని శరణాగతుం గృపణుఁ ద్రుంపఁగ రా దనిలోన జేనికిన్. 1806

ఉ. పాయక వీని వేఱొక యుపాయమునం బరిమార్ప యత్నముల్
జేయఁగఁబోలు మిక్కిలి ప్రసిద్ధఫణాధరసన్నిభాస్త్రముల్
సాయకము న్వెసం బఱపి సాంద్రతరంబుగఁ గ్రమ్మి యున్న యీ
మాయ నడంగఁ జేయుదము మానక యవ్వల వీఁడు దోఁచెడిన్. 1807

ఉ. అంతట వానరప్రవరు లద్భుతవీర్యుని క్షుద్రకర్ముఁ గా
లాంతకతుల్యు మాయికు ననంతబలాఢ్యుని వీనిఁ జూచి క్రో
ధాంతర మెల్ల నిండ వడి నార్చుచు మ్రాకుల రాళ్ల వీని మే

నంతయు నొవ్వఁ జేసి రయమార వధించెన దుగ్రమూర్తియై. 1808

ఉ. మానద భూమి సొచ్చిన నమర్త్యజగంబున కద్రి నేగిన
న్నానక మిన్ను ప్రాఁకినఁ గ్రమంబున వార్నిధిలో మునింగినం
బూని రసాతలంబునకుఁ బోయిన నుత్పరమాస్త్రదగ్ధుఁడై
యీనముచిద్విమద్విమతుఁ డిప్పుడె తప్పక ధాత్రిఁ గూలెడిన్. 1809

ఇంద్రజిత్తు మాయాసీతను గల్పించి దానిం జంపఁ బూనుట.

వ. అని పలికి యక్కకుత్స్థకులతిలకుండు వానరశ్రేష్ఠపరివృతుండై పావకస్తంభముగు రావణిం బరిమార్చుటకుం దగినవేగం బంగీకరించి రణంబు నాలించినయనుజాత్ముమనం బెఱింగి రావణనందనుండు రణంబు నాలించి రయంబునఁ బురంబు ప్రవేశించి బలవంతు లగుకుంభకర్ణాదిరాక్షసవీరులనిధనంబు దలంచి క్రోధలాత్రేక్షణుండై యేరీతినైన సర్వవానరసమన్వితంబుగా రామలక్ష్మణుల వధింపక గాక యని నిశ్చయించి యచ్చట నిలువక కతిపయబలంబులం గూడి పశ్చిమద్వారంబున వెడలి వచ్చి యుద్ధంబునకు సముద్యతులైన రామలక్ష్మణుల సముద్యోగంబు నూచి స్వగమనవిఘాతంబుగా నెంచి తన్నివారణార్థంబు సకలమోహకారిణి యైనమాయ నవలంబించి మోహనార్థంబు మాయాసీతం గావించి రథంబుపై నిడుకొని తద్వధవ్యవసితుండై గ్రమ్మఱఁ బురంబు వెడలి వానరుల కభిముఖంబుగాఁ జనుదెంచుచున్నతని విలోకించి వానరులు సంక్రుద్ధులై శిలాపాదపంబులు గైకొని రణంబున కడరి రప్పు డాంజనేయుం డొక్కెడ

హనుమంతుం డింద్రజిత్తునిమీఁది కేగుట.

దురాసదం బైనపర్వతంబు గొని వానరులం దలకడచి శక్రవైరి మార్గంబునం బోవుచు వానిరథంబుమీఁద నెడతెగక వెడలువేఁడినిట్టూర్పులఁ గంది మిక్కిలి కృశం బైనశరీరంబును గమలపత్రంబులఁ బోలుకన్నులం దొరఁగుబాష్పజలంబును జడకట్టుకొని యున్నమలినంబు లగుశిరోజంబులును ధరణీరజోలిప్తసర్వాంగంబును విన్నయైనవదనంబును గరపల్లవంబు గదిసినచెక్కును మాసినవలువయుం గలిగి రామవిరహానలంబు వెక్కసంబుగా నిక్కిన నాహారనిద్రలు దొఱఁగి తుదిలేనిశోకంబు నొందుచున్నదానిచందంబున గాలిం దూలి కదలువనలతికయై వడి నాకంపిందుచున్నమాయాసీత నవలోకించి యొక్కముహూర్తంబు తద్రూపవిశేషంబు లన్నియుఁ బరామర్శించి యచిరకాలదృష్టత్వంబువలన నిక్కంబుగా సీత యని నిశ్చయించి పేఁడి దేవి నేమి సేయం దలంచి కొని వచ్చినవాఁడొకో యని చింతించి శోకంబు పెంపున బాష్పవ్యాకులముఖుండై సర్వవానరసమేతంబుగా రయంబున వానిపై నురవడించిన నింద్రజిత్తు వాయునందనాదికపుల నిరీక్షించి మీరేల బరవసంబునం జనుదెంచెదరు రెద్దానికై పోరెద రట్టిసీత యిదె చూడుఁడు దీని తల ద్రెవ్వ నేసెద నని పలికి వ్యాఘ్రంబుకడ లేడిపోలుపున వడంకుచు నయనాంబుజంబుల బాష్పంబు

లోలుక హారామ హారామా యని యార్తరవంబున విలపించుచున్నమాయా మైథిలి నొడిసి పట్టి యొక్కకరంబునఁ గరవాలం బంకించి వేఱొక్కకరంబునఁ దలవెండ్రుకలఁ బట్టి దట్టించి యీడ్చిన నత్తెఱంగు విలోకించి కన్నీరు నించుచు మనున్నందనుండు క్రోధాతిశయంబునఁ బరుషంబుగా వాని కి ట్లనియె. 1810

-ఘఘ హనుమంతుం డింద్రజిత్తుని దూఱుట. ఘఘ-

తే. ఓరి దుష్టాత్మ రాక్షసయోనిగతుఁడ
వైన నగుదు గాకేమి నీ వబ్జయోని
వంశమునఁ బుట్టినాఁడవు వసుమతీశు
తరుణి తలఁ బట్టుకొని యీడ్వఁ దగునె నీకు. 1811

తే. ఇట్టిదుష్కర్మ మొనరించితేని యింకఁ
బాపకర్ముండు క్షుద్రుం డపండితుండు
వీర్యహీనుండు ఖలుఁ డని విన్నవారు
నిన్ను ధిక్కృతుఁ జేయరే నీచచరిత. 1812

తే. కదనమున శక్రునంతటిఘనుని గెలిచి, పృథివిలో నింద్రజిత్తనఁ బేరువడసి
గర్వితం బైనయిట్టిదుష్కార్య మెత్తి, చేయుటకు రాక్షసాధమ సిగ్గు గాదె.

ఉ. మందిరసౌఖ్యసంపదలు మాని ధనంబుఁ బరిత్యజించి రా
జ్యేందిరఁ బాసి వెంటనె హృదీశకరచ్యుతయై మనోవ్యథం
గుందెడుపుణ్యసాధ్వి నిటు క్రూరతఁ జంపఁ గడంగి తేల యీ
యిందునిభాస్య నీకు నిపు డేమి విరోధముఁ జేసె రాక్షసా. 1814

క. ఈనతిని జంపి ధర నుల్లాసంబున నిమిష మైన బ్రతుకఁగ లేవే
దోసమున వధ్యుఁడవు దుష్టానుర నుత్కరగతుండ వైతివి తలఁపన్. 1815

ఉ. సాహస మొప్పు నీసునతిఁ జంపితి వేని దురాత్మ నీవు మ
ద్బాహుహతుండవై యిచటఁ బ్రాణము గోల్పడి ఘోరయాతనా
దేహము నొంది యింతుల వధించినవారికి మానికోటిచే
వ్యాహృత మైనలోకమున కర్థిఁ జనం గల విప్పు డింతయున్. 1816

క. అని పలికి పవనతనయుఁడు, నునమునఁ గోపంబు గదుర మర్కటయుతుఁడై
ఘనవేగంబున రావణతనయుపయిం జనియె బాహుదర్పం బలరన్. 1817

క. విచ్చలవిడి రథనంబున, వచ్చెడుకపిసేనఁ జూచి వారించుటకుం
జెచ్చెర రాక్షససేనలఁ, బుచ్చి దశాననసుతుండు భుజశక్తిమెయిన్. 1818

క. తరణికిరణసన్నిభశిత, శరశతముల నవ్వనాటసైన్యశ్రేణిక్
సుఖముమాటి హరిపయిం జగు, కరువలినుతుతోడ ననియె గర్వం బెసఁగన్.

చ. వనచర బ్రహ్మనందనుఁడు వాలితనూజుఁడు నీవు రాఘవుం
డినసుతుఁ డేనిమిత్తమున నిచ్చటికిం గపిసైన్యయుక్తులై

వననిధిఁ దాఁటి యత్నమున వచ్చితి రాసతి నీవు చూడఁగా
మునుకొని ఖడ్గధార శిరముం దెగవ్రేసెద నీక్షణంబునన్. 1820

—ఇంద్రజిత్తు మాయాసీతం బట్టి తెగవ్రేయుట.—

క. ఈరాముఁ జంపి యవ్వల, నారాఘవు నతనియనుజు నంగదు నిన్నుక
వీరుని సుగ్రీవుని దివిజారి విభీషణుని శితశరాలిఁ దునిమెదన్. 1821

క. సుదతుల వధింపఁ దగ దని, పదిలంబుగఁ బలికి తీవు పరులకుఁ బీడా
స్పద మగుకార్యం బదియే, యెదియైనను సేయ వచ్చు నెంతయుఁ బ్రీతిన్.

వ. అని పలికి యారావణనందనుండు తనయరదంబుమీఁదరోదనంబు సేయుచున్న మాయాసీతం బట్టి శితధారం బగుఖడ్గంబున యజ్ఞోపవీతధారణప్రకారంబుగాఁ దెగవ్రేసి పుడమిం ద్రోఁచి వెండియు హనుమంతు నవలోకించి వనజాప్తకులసంభవుం డైనరామునిమనోహారిణి యగునీసీత నలుక వొడమినడెందంబునఁ గరవాలంబునం దెగవ్రేసితి మీరణోద్యోగంబు లెల్ల విఫలంబు లయ్యె నింక నీవృత్తాంతంబు రామలక్ష్మణులకుం జెప్పఁ జను మని విజృంభించి పలికి సంప్రహృష్టచిత్తుండై రథంబుమీఁద నుండి దిశాకుక్ష్యంబులు పగుల నొక్క సింహనాదంబు చేసి వ్యూహీకృతరాక్షసపరివేష్టితరూపదుర్గంబు నాశ్రయించి యుండె నంత దీర్ఘనిర్ఘాతసమనిర్ఘోషం బైనయమ్మహాధ్వని విని సమీపవర్తులగువానరులు భయభ్రాంతచిత్తులును విషణ్ణవదనులు నై సింహంబు గన్న మహాద్విపంబులభంగిదిక్కులు సూచుచు చెదరి పఱచినవానరులంజూచిబరవసంపుమాటలఁ బురికొల్పుచుఁ బవననందనుం డిట్లనియె. 1823

చ. వనచరులార మీరు పరివారలు నవ్వ విషణ్ణవక్త్రులై
యనికిఁ దొలంగి మిక్కిలి భయంబునఁ బాఱెద రేటి కిట్లు మీ
ఘనబల మెందుఁ బోయె గిరి గైకొని యేను గడంగి ముంగలం
జనియెద నాపిఱుందదెస నత్వరతం జనుదెందు ధీరులై. 1824

క. నా విని వానరు లందఱుఁ, బావనివచనమునఁ దేఱి బాహాశౌర్య
ప్రావీణ్య మలర భూరిగ్రావంబులు పాదపములు గైకొని వెలుచన్. 1825

—హనుమంతుఁడు కోపంబుపెంపున నింద్రజిత్తునితోఁ బోరుట.—

క. ఘనములక్రియ గర్జించుచు, హనుమంతునిఁ గూడి విక్రమాటోపములం
జని రాక్షససేనల మూఁగ్కొనిరి మహీరుజము గగనకుహరము మ్రింగన్. 1826

ఉ. ఆహనుమంతుఁ డిట్లు విపినాటచమూయుతుఁ డై గడంగి యు
త్సాహ మెలర్ప నంతకునిచాడ్పునఁ గ్రాలుచుఁ దాఁకి పీఁకతో
సాహస మొప్ప దావశిఖి చయ్యనఁ గాఱడవి న్దహించిన
ట్లాహవమేదిని న్నిశిచరాటవి నెల్ల దహించె నుద్ధతిన్. 1827

చ. అనిలతనూజుఁ డిట్లు విలయానిలవేగము నొంది పీఁకతో

దనుజబలంబుఁ జక్కడిచి తద్దయు శోకము రోష మాత్మలోఁ
బెనఁగొన నొక్కభూరిగిరిశృంగము వే పెకలించి తెచ్చి చ
య్యన దశకంఠపుత్రునిశతాంగముపైఁ బడవైచె నుగ్రుఁడై. 1828

ఉ. వైచినఁ జూచి యాంధికవర్యునిపంపున సూతుఁ డాత్మవి
ద్యాచతురత్వ మేర్పడ రథంబు రయంబున దాఁటఁ దోలినన్
వేచి తదద్రిశృంగ మతివేగమునం జని క్రూరుఁ డైనదో
షాచరమాళిపైఁ బడక జన్యమహిం బడి గ్రుంగె నెంతయున్. 1829

ఉ. తప్పక దానిక్రిందఁ బడి దైత్యు లనేకులు చూర్ణితాంగులై
రప్పుడు కీశవర్యు లనిలాత్మజు ప్రాపున నిర్విశంకులై
గొప్పశిల ల్మహీజములు గొబ్బునఁ గైకొని దానవావలిం
జెప్పెడిదేమి ఘోరగతిఁ జందఱవందఱ చేసి రుద్ధతిన్. 1830

చ. గగనము తూఁటుగట్టఁ బటుగర్జలు సల్పుచు నింద్రజిత్తుపై
నగములు గ్రావము ల్తరుగణంబులు లెక్కకు వెక్కసంబుగా
నిగుడఁగఁ జేసి వెండియు వనేచరు లక్ష్మగిరీంద్రవృష్టిచే
మగఁటిమి మీఱ రాక్షససమాజములం బరిమార్చి రుద్ధతిన్. 1831

క. విచ్చలవిడి ని ట్లవనీ, భృచ్చరు లడరించువృక్షవృష్టి నిశాటు
ల్చచ్చిరి చొచ్చిరి విచ్చిరి, సొచ్చిరి శస్త్రారిమయుఁగు సొంపుసెడి వెసన్. 1832

క. తరుచరబలార్దితం బై, పఱచెడునిజబలముఁ జూచి పటుకోపమున
న్సురవైరి ప్లవగతతిపై, నరదముఁ బఱపించె నుద్యతాయుధుఁ డగుచున్. 1833

మ. శరజాలంబులు శూలము ల్ముసలము ల్చక్రంబులుం గుంతము
ల్పరశక్తు ల్కరవాలము ల్పరశువు ల్ప్రాసంబులు న్ఘోరము
ద్గరము ల్పట్టిసము ల్గద ల్పఱపి యుద్దండప్రతాపంబునన్
హరిసేనం దునుమాడె సింహము సముద్యద్దంతిరాజంబలెన్. 1834

తే. వానినూ రెలఁ బన్ని దుర్వారబలులు
దానవులు విక్రమంబునఁ దరులు శిలలు
నిఖిలశస్త్రంబు లడఁగించి నేర్పు మీఱఁ
దరుచరుల వ్రేసి నొప్పించి తఱిమి రపుడు. 1835

వ. ఇత్తెఱంగున నప్పూర్వగీర్వాణులకోల్తల కోర్వక భయంబునం బఱచువాన
రులం జూచి హనుమంతుండు బరవసంబుఁ జేసి పురికొల్పి యంతకాకారుండై
పేర్చి యనేకశిలాసాలజాలంబుఁ బరఁగించి రాక్షసుల నవలీలం దోలి వానరుల
నవలోకించి యి ట్లనియె. 1836

హనుమంతుఁడు రామునియొద్దకుఁ బోవుట.

సీ. తరుచరులార ఘోరదనుజాధముఁడు రామరమణిని జంపెఁ గార్యంబు దప్పె
నీసేన యస కీప్పు డెంతయు సాధింపఁ గాకున్న దింక సంగ్రామ మేల

జనపతికడ కేగి జనకజవృత్తాంత మంతయుఁ జెప్పుడ మంతమీఁద
నారాముఁ డర్కకుమారునిఁ గూడి యోచించి పంచినదానిఁ జేయఁ బోలు
తే. నని పలికి యమ్మరుత్సుతుఁ డఖిలకీశ సైన్యముల మరలించి తత్సహితుఁ డగుచు
విన్ననైనమొగంబుతో వెడలి భానువంశవరుఁ డున్నచోటికి వచ్చుచుండె.

వ. అంతఁ దిరిగి చనెడుహనుమంతు నవలోకించి దశవదనసందనుండు మనంబున
హర్షించి యీమహాబలుం డరిగె నింకమీఁద హోమవిఘ్నంబు సేయ నోపు
వా రెవ్వరును లే రాతంత్రంబు నిర్విఘ్నంబుగా సమాప్తినొందించి రాము నవ
శ్యంబు గెల్తుఁ గాకయని నిశ్చయించి చైత్యనికుంభిలకుఁజని యందుఁ బావకుం
బ్రతిష్ఠించి నిష్ఠాతాత్పర్యంబున నతిశాంతుండై కల్పోక్తప్రకారంబున నయ్య
గ్నిదేవు రుధిరమాంసాదులం దనిపి హోమంబు సేయుచుండె నప్పావకుండు
హోమశోణితతర్పితుండై మంట లెగయ సంధ్యాభ్రగతుండైనసూర్యునిభంగి
మిన్నంది వెలుంగుచుండె నయానయజ్ఞు లగురాక్షసు లచ్చటికిఁ బర లెవ్వ
రును రాకుండ నుద్యతాయుధు లై కాచికొని యుండి రంత రాముండు పశ్చి
మద్వారంబున రక్షోవానరవిపులసంగ్రామనిర్ఘోషంబు విని జాంబవంతు నవలో
కించి యి ట్లనియె. 1838

సీ. భల్లూకనాయక పడమటిదెస వాయుసుతునకు నలరాక్షసులకు ఘోర
కదనంబు చెల్లుచున్నది వింటివే భీమవిపులనిర్ఘోషంబు వినఁగ నయ్యె
నొక్కఁడు పోరాడు చున్నవాఁ డీవింక నతులితనిజబలాన్వితుఁడ వగుచు
నమ్మహాత్మునకు సాహాయ్యంబు గావింప నతివేగమునఁ జను మచటి కనిన
ఆ. నవ్విరించితనయుఁ డట్లకా కనుచు నాత్మీయభూరిబలసమేతుఁ డగుచుఁ
బవనతనయుఁ డున్నపడమటిగవనికి నద్భుతాట్టహాస మడరఁ జనుచు. 1839

క. నడుమఁ గనుఁగొని విధిపుత్త్రుఁడు కృతరణనిశ్వసత్తరుచరయుతుండై
తడయక విషణ్ణముఖుఁడై, కడువడిఁ జనుదెంచుచున్న కపివలిపట్టిన్. 1840

ఉ. ఆకపికుంజరుండును ఘనాసితమేఘముమాడ్కి ఘోరమై
పోక నమోఘవాయుసమవేగమునం జనుదెంచుచున్న భ
ల్లూకబలంబు గన్గొని నిరోధముఁ జేసి మరల్చి వెంటఁ ద
ద్భీకరసైన్యముం గొని సుధీవరుఁ డేగె నృపాలుపాలికిన్. 1841

వ. ఇట్లు రయంబునం జనుదెంచి రఘువల్లభుం గాంచి దుఃఖితుం డగుచు నిట్లనియె.

-:o:- హనుమంతుఁడు రామునకు సీతావధం బెఱింగించుట. -:o:-

చ. అనఘచరిత్ర యేము దనుజావలి మార్కొని పోరుచుండ న
ద్దనుజవరేణ్యనందనుఁడు దారుణభంగి మహీకుమారి గ్ర
ద్ధనఁ గొని తెచ్చి మాయెదుటఁ దప్పక శీర్షము ద్రెవ్వ వేసె నా

మనము గలంగి యవ్విధము మానక నీ కెఱిఁగింప వచ్చితిన్.

క. అని పలుక నతనివాక్యము, విని రాముఁడు గాఢశోకవివశుం డై లో
చనముల నశ్రులు గ్రమ్మఁగ, ననిలాహతతరువుభంగి నవనిం బడియెన్. 1844

క. ఇత్తెఱఁగున నిలఁ బడినర, ఘూత్తము నమరనిభుఁ జూచి యుభయమునఁ గీ
శోత్తము లందఱు శోకా,యత్తహృదయు లగుచు నార్తులై పడి రుర్విన్.

ఆ. అంతఁ గొంతవడికి నగచరవర్యులు, తెలివి నొంది కువలజలజగంధి
శీతవారిఁ దెచ్చి సీతేశుపైఁ జల్లి, రుత్థితాగ్నిమీఁద నునిచినట్లు. 1846

వ. అప్పుడు లక్ష్మణుం డస్వస్థుం డై పరితపించు చున్న రాముని బాహువులం గ్రుచ్చి పట్టి తొడలపైకి రాఁదిగిచికొని ధర్మాధర్మంబులయందుహితాహితసాధనత్వం బెఱింగియు జానకీహరణశ్రవణంబునం బుట్టినశోకంబు ననవరతధర్మవిశిష్టుం డగు రాముండు రణంబునఁ బ్రచ్ఛన్నునివధించుట ధర్మంబుగాదని పలికి బ్రహ్మాస్త్రప్రయోగంబు సేయకుండ నివారించినకారణంబునం బుట్టినకోపంబునుం బాపాత్ముం డగు రావణుండు సుఖియై యుండుటయుఁ జేవచ్చినరాజ్యంబు విడిచి పితృవచనపరిపాలనరూపధర్మం బనుష్ఠింప వచ్చినరాముండు తత్ఫలభూత సౌఖ్యంబుగానక వ్యసనపరంపరనొందుటయుం దలపోసి వ్యసనాతిశయంబునం బుట్టినకాలుష్యంబును మనంబున ముప్పిరిగొన ధర్మాధర్మంబుల కర్థానర్థహేతుత్వనియమంబు నిరాకరించువాఁడై రాము నవలోకించి హేతురూపార్థయుక్తం బగువాక్యంబున ని ట్లనియె. 1847

లక్ష్మణుఁడు ధర్మాధర్మంబు లసత్యంబు లని హేతువాదంబున నిరూపించుట.

సీ. కరగతరాజ్యంబు కపటితఁ గైకొన్న కైకపై నలుగని క్షమయుఁ దల్లి
ధనపరుండను గాను నను మునిసమునిఁగాఁ గనుఁగొను మనుచు నక్కైకతోడ
నాడినసాధుత్వ మన్నియు వర్జించి తండ్రివాక్యంబు సద్భక్తితోడ
సలుపఁగఁ దగు నంచుఁ బలికినముఖ్యధర్మైకపరత్వ మత్యంతధర్మ

ఆ. విదుఁడ వైననిన్నువిను మనర్థంబుల,వలనఁ గాన కునికి నలఘుచరిత
యవని ధర్మ మది నిరర్థక మనియును, నిష్ప్రమాణ మనియు నేఁ దలంతు.

వ. దేవా ప్రామాణికం బైనధర్మంబునకు నిరర్థకత్వం బెట్లంటి రేని ఫలదర్శనంబు వలన ధర్మంబునకు సార్థకత్వంబు గలుగుం గాని ఫలాదర్శనంబువలన నది యనుపాదేయం బనుటకు సందియం బేమి: ధర్మసద్భావంబునం దనుమానప్రమాణం బేమియు లేదని పలికి వెండియుఁ బ్రత్యక్షప్రమాణంబు లేదని నిరాకరించువాఁడై యి ట్లనియె. 1849

సీ. వసుమతిలోన స్థావరజంగమంబుల దర్శనం బెట్లు ప్రత్యక్ష మట్లు
తలపోయఁగా ధర్మదర్శనం బుర్విఁ బ్రత్యక్షంబుగా కున్కి ధరణినాథ
యది మిక్కిలి యసత్య మని విచారించెద స్థావరంబునుబోలె జంగమంబు

సువ్యక్త మగుచుండు శోధింప నారీతి నీధర్మరూపార్థ మించుకైన
తే. వ్యక్త మగునేని నమ్మంగ వచ్చుదాని, నదియుఁ గాక ధర్మంబు మహాత్మ సత్య
మయ్యె నేని నీయట్టిధర్మాత్ముఁ డిట్టి, యాపదలఁ బొందునే ధర్మ మనఁగ నెద్ది.
వ. అని యిట్లు ధర్మసద్భావంబునందు బాధకంబు నిరూపించి వెండియు ధర్మాధర్మ
సద్భావంబునందును బాధకం బుపన్యసించుతలంపున నిట్లనియె. 1851

చ. జనవినుతా యధర్మము నిజం బగు నేని యధర్మమార్గని
ష్ఠున కల పంక్తికంఠునకు శోకము గల్గు నితాంతసర్వధ
ర్మనిధికి నీకు నెప్పుడుఁ గరం బొకదుఃఖము గల్గకుండు న
య్యనువునఁ గానరా కునికి నయ్యుభయంబు నిరర్థకం బగున్. 1852

వ. అని యిట్లు ప్రతినియతఫలప్రదత్వాభావంబువలన ధర్మాధర్మంబు లసత్యంబు
లని పలికి ఫలవిపర్యాసనంబునను ధర్మాధర్మంబులు లేవనుభావంబు తేటపఱుపం
దలంచి వెండియు నిట్లనియె. 1853

తే. లోకవిద్వేషికి సుఖంబు నీకు వగవు
గలుగుచుండ ధర్మాధర్మములు విరుద్ధ
ఫలము లొసఁగిన వటు గానఁ దలఁప నుభయ
మొకటికొకటి విరోధి యై యుండు సధిప. 1854

వ. మహాత్మా ధర్మానుష్ఠానంబునఁ దత్ఫలం బైనసుఖంబు నధర్మానుష్ఠానంబునఁ
దత్ఫలం బైనదుఃఖంబునుం గలుగు నని విచారింప వలవ దెవ్వారియందు
ధర్మంబు ప్రతిష్ఠితం బై యుండు నట్టివారు ధర్మఫలం బైనసుఖంబును గ్రమం
బుగా ననుభవించి రేని సర్వజనంబులు ధర్మంబునె యాచరించుచుందు రట్టిధర్మి
ష్ఠు లైనవారికి సుఖంబె గలుగ వలయు నధర్మపరులగువారికి దుఃఖంబె గలుగ
వలయు నట్లు గానంబడక యధర్మనిష్ఠు లగువారికి సుఖంబును ధర్మనిష్ఠు లగు
వారికిఁ గ్లేశంబును బరిదృశ్యమానంబు లగుటవలన లోకవ్యవహారంబువలన ధర్మా
ధర్మంబు లవ్యవస్థితఫలంబు లని యిత్తెఱంగున హితాహితప్రాప్తిలక్షణకార్యం
బుల కనియతత్వంబుచేత వ్యాప్త్యభావంబువలనఁ గార్యంబులచేత ధర్మాధర్మం
బు లనుమానించుటకు శక్యంబులు గావని పలికి ధర్మాధర్మంబులకు శబ్దంబు
ప్రమాణంబుగా దను తాత్పర్యంబు దెలుపం దలంచి ధర్మాధర్మంబులు కర్మస్వ
రూపంబులో కర్మజన్యాతిశయంబులో యని ద్వివిధంబుగా వికల్పించి యాద్యం
బైనకర్మస్వరూపపక్షంబు దూషించువాఁ డై యిట్లనియె దేవా పాపకర్మ
లగువా రధర్మస్వరూపకర్మంబుచేత బాధింపఁబడుదు రందు రేని బాధకకర్మ
రూపం బైనయధర్మంబుశబ్దబుద్ధికర్మంబులు త్రిక్షణావస్థాయు లగుటం జేసి స్వల్ప
కాలంబున హతం బగు నట్లు హతం బైన యది యెవ్వనిని వధింపం జాలదు
ధర్మంబు నిట్టిద గావున నది యెవ్వనికి శ్రేయం బొనర్పం జాలదు క్రియారూపంబు
లైనధర్మాధర్మంబులకు క్షణికత్వంబునఁ గాలాంతరభావిఫలజనకత్వాసంభవంబు

వలన బాధితవిషయం బైనవేదంబు గ్రావప్లవనాదివాక్యంబువలెనుపచరితార్థకం బై యుండు గర్మంబునకుఁ బాక్షికత్వంబున ఫలప్రదత్వంబు గలుగక పోనిమ్ము సకసత్కర్మకారయితృసాక్షిభూతదైవంబు ఫలంబొసంగునని యంటి రేని దైవం బజనంబుచే నధర్మంబు జేయించినపక్షమునఁదత్కర్మఫలంబగు దుఃఖంబు దైవంబునకే కావలయుఁ బ్రయోజ్యకర్తకుఁ గాక పోవలయు నీన్యాయంబు ధర్మకర్మంబునందును దుల్యం బగుటవలన సుఖంబును బ్రయోజ్యకర్తకుఁగాకుండవలయుఁ గావునఁ గర్మస్వరూపంబునకధర్మత్వంబును ధర్మత్వంబును సంభవింప నేరదని యిట్లు కర్మస్వరూపపక్షంబునిరసించికర్మజన్యాతిశయరూపధర్మంబుశ్రేయస్సాధనం బనియెడు రెండవపక్షంబునందును స్వాతంత్ర్యపారతంత్ర్యరూపపక్షద్వయంబు వికల్పించి యందుస్వాతంత్ర్యపక్షంబు నిరాకరించువాఁడై యిట్లనియె.

తే. అంబుజాక్ష ప్రత్యక్షఫలం బొసంగ, లేక తాను బ్రత్యక్షంబు గాక యుక్తి నరసి చూడ నసద్భూత మైనధర్మ, మెవ్విధంబున శ్రేయంబు నిచ్చుఁ జెపుమ.

వ. అని పలికి యీయసత్త్వంబే విపక్షంబునందు బాధకతర్కప్రదర్శనముఖంబు చేతను దృఢంబు సేయుటకు నిట్లనియె. 1857

తే. వాసవోపమ ధర్మాఖ్యవస్తు వుర్వి, సత్య మగునేని ధర్మనిష్ఠాయుతుండ వైననీకు దుఃఖం బించుకైనఁ గలుగ,కుండుఁ గలుగుటవలన సత్యోక్తిగాదు.

వ. అని పలికి ధర్మంబు పౌరుషంబు నాశ్రయించి ఫలం బొసంగు నని యెడు పారతంత్ర్యపక్షంబు నిరాకరించుటకు వెండియు రామభద్రు నుద్దేశించి యిట్లనియె దేవా కార్యకరణాసమర్థం బగుటవలన ధర్మంబు కార్యోత్పాదనంబునందుఁ బౌరుషంబు నాశ్రయించు నేని యిట్టిదుర్బలంబును మర్యాదారహితంబు నైన ధర్మంబు సేవ్యంబు గాదు ధర్మం బస్వతంత్రంబు బలంబున కుపసర్జనభూతంబు గావున నట్టియుపసర్జనభూతం బైనధర్మంబు పరిత్యజించి బలసాధ్యం బైనపరాక్రమంబునందు వర్తింపుము మీరు సత్వంబును ధర్మంబుగా దం దేకదేశం బైనసత్యంబు పరమధర్మంబు గావున నాచేత వనంబున నివసించెదనని తండ్రిమ్రోలఁ బ్రతిజ్ఞాతం బైనసత్యవచనం బనుష్ఠేయం బేతదర్థం బిది యనుభూతం బందు రేని సత్యాభినివేశివై వనంబున కరుదెంచుటవలన నింత పుట్టె సత్యవచనరూపధర్మంబును వార్ధక్యంబున నిరాకరింపం దగియున్న దత్తెఱం గెట్లనిన వినుము. 1859

ఆ. అధిప సత్యవచన మది నిక్కమేని నీ,యందుఁ గరుణ వీడి యనృత మాడి నట్టిజనకుఁ డేటి కనిబద్ధుఁ డయ్యెఁ బో, సత్య మన్నియెడల సమము గాదె.

వ. సర్వజనసన్నిధియందు నెల్ల రామునిఁ బట్టాభిషిక్తునిం జేసెద నని పలుకంబడిన ప్రాథమికం బైనపితృవచనంబు పరిత్యజించి పదంపడి వనగమనవిషయం బైన పితృవచనంబు గావించెద నని దానిం బాలించునట్టి నీచేత సత్యవచనంబును సమ్యక్పరిపాలితంబు గాదయ్యె నని పలికి వెండియు నిట్లనియె. 1861

సీ. అవనీశతిలక ధర్మాధర్మసద్భావమందును రాజున కనవరతము
నలువొప్పు ధర్మమైన నధర్మమైనను నియమంబుచే సేవనీయకంబు
గాదు నిక్కంబు తత్కాలప్రయోజనంబున కనుగుణముగా బుద్ధి నెఱిఁగి
యుభయంబు సేవించు టొప్పగు మును వజ్రముని యైనవిశ్వరూపుని వధించెఁ
తే. బిదప జన్నంబు గావించి పెంపు వడసె
నెందుఁ గన్న శిష్టాచార మిట్లు యుండు
ధర్మమని యుక్తమెఱుఁగక తనకుఁ దానె
యాపదలు దెచ్చుకొనినవా రవని లేరు. 1862

వ. మఱియు ధర్మంబె గావింప వలయు ననియెడునియమంబు గలదేని యింద్రుండు విశ్వరూపుని వధింపక యజ్ఞంబె గావించు నధర్మంబె యాచరింపవలయు నని యెడునియమంబు గలదేని యజ్ఞంబు గావింపక విశ్వరూపుని వధించు నట్లు గాకుండ క్షత్రధర్మవిశారదుండైనయింద్రుండు తత్తత్కాలానుగుణంబుగా ధర్మాధర్మంబుల రెంటి నాచరించెం గావున రాజుచేత యథార్థంబుగా నుభయంబును సేవింపం దగు. 1863

క. ఇలలో ధర్మాధర్మంబులు రెండును వేఱువేఱ పొలుపుగ నియతిం
దలకొని భజించువారికిఁ, దలపోయఁగ మేలు లేదు ధరణీనాథా. 1864

క. కావున సముచితముగ గో,త్రావననియమంబు విడిచి యయ్యుభయంబుం
గావింప వలయు నరపతి, భావింపఁగ నిదియె నాదుభావ మధీశా. 1865

సీ. రాజేంద్ర వినుము ధర్మమునకర్థమమూలమండ్రు రాజ్యముఁ బాసియడవినుండ
వచ్చిననీచేతఁ జెచ్చెర నయ్యర్థమంతయు విచ్ఛిన్నమయ్యె నర్థ
హైన్యంబుచే ధర్మహాని యెక్కుడె గాదు చర్చింపఁ జాలదోషంబు గలుగు
నది యెట్లు లంటేని యర్థపరిత్యాగి సారిదిఁ బూర్వాభ్యస్తసుఖముకొఱకు
తే. జగతి నన్యాయముగ ధనార్జనము సేయు
దాన దోషంబు చేకూరుఁ గాన మనుజ
విభుఁడు ధన మెంత వచ్చిన విడువ రాదు
విడిచె నేనియు దుఃఖంబు వెంట వచ్చు. 1866

క. త్యాజ్యము గా దన కిటు సా,మ్రాజ్యము విడనాడినట్టిమున మెందైనం
బూజ్యుల మగుదుమె సుఖములు, భోజ్యంబులు గావె రాజపుంగవున కిలన్.

తే. అనఘచారిత్ర నిర్ధనులైనపురుషు, లవనిఁ గావించువివిధప్రయత్నములును
మండువేసవియందు నిమ్నగ లడంగి,నట్లు చెడిపోవు నని బుధులాడ వినమె.

తే. అధిప ధనవంతుఁ డగువానికఖిలజనులు, బాంధవులుమిత్రులగుదురుపాయకెప్పు
డతఁడె పో పురుషశ్రేష్ఠుఁ డనఁగ నతని, కిందు నందును దుస్సాధ మింత లేదు.

మ. ధనవంతుం డగువాఁడె సద్గుణుఁడు విద్యావంతుఁ డాఢ్యుండు శో
భనచారిత్రుఁడు బుద్ధిమంతుఁడు మహాభాగుండు ప్రాజ్ఞుండు వ

జ్ఞనుఁ డార్యుండును నీతిమంతుఁడు బుధశ్లాఘ్యుండు విక్రాంతుఁ డా
తనిఁ గీర్తింతురు నిర్జరు ల్మునివరుల్ ధాత్రీశ్వరు ల్నిత్యమున్. 1870

క. ఏ నెంత నివారించిన, మానక రాజ్యంబు విడిచి మానవనాథా
కానకు వచ్చితి వీగతి, దానం గలఫలము నేఁడు తప్పక గలిగెన్. 1871

క. కలవాఁడె పుడమిలోపల, గలవాఁ డాతనికి ధర్మకామంబులు ని
చ్చలు సిద్ధించు మహాత్మా, కలవారలపనికి సేగి గలదే తలఁపన్. 1872

ఉ. భూతియు దర్పహర్షములు పుణ్యము సొంపును బెంపు లోకవి
ఖ్యాతియుఁ దేజమున్ ధృతియుఁ గామము ధర్మము లావు చేవయున్
నీతియు విద్యయు న్యశము నేర్పు శమంబు దమంబు విక్రమం
బాతతశౌర్యము న్సుగుణ మన్నియు నర్థమె రాజశేఖరా. 1873

వ. దేవా కేవలధర్మానుష్ఠానపరుల కైహికసుఖంబు గలుగనేర దాముష్మికసుఖంబు గలుగు ననుటకు శాస్త్రదృష్టంబె కాని ప్రత్యక్షంబు లేదు గావున నది సదస ద్రూపం బై యుండు నర్థంబు సకలశ్రేయస్సాధనభూతం బట్టియర్థంబు నీచేత ననాదృతం బగుటవలన నీయాపదలు సంభవించె నర్థపరిత్యాగి యగువాని కాపదలు వచ్చు ననుటకుఁ గరగతసామ్రాజ్యంబు పరిత్యజించి పితృవచనవ్యవస్థితుండ వై యరణ్యంబునకుఁ జనుదెంచి రాక్షసునిచేతఁ బ్రాణంబులకంటెఁ గరీయసియైన భార్యం గోల్పడి పరదేశంబునందు దుఃఖంచుచున్ననీవె దృష్టాంతం బింత వగచిన నేమి యగు నే నిప్పుడు భవత్కార్యంబున సంప్రాప్తం బైనయీవిపులదుఃఖంబును మచ్ఛౌర్యకర్మంబున నపనయించెదఁ గావున నీవిచారంబు దక్కి నీవు పరమాత్మగా నిన్నెఱింగికొని శౌర్యం బంగీకరింపుము సీతానిధనశ్రవణజాతశోకార్దితుండ నైనయే నింక నేమి సేయుటకు సమర్థుండ గా నంటి రేని యేను గావించెద నన్ను నియోగింపు మేను భవత్ప్రియార్థం బుత్పన్నుండనై నవాఁడఁ గావున జనకసుతానిధనంబు సహింపం జాల నీవు సకలశాస్త్రార్థతత్త్వజ్ఞుండవు శక్తి గలిగిన శౌర్యంబుఁ జూప వలయుం గాక ధర్మాధర్మఖండనం బిట్లేల గావించితి వని నిరసింప వలవదు జనకసుతానిధనంబు విని రుష్టుండ నై ధర్మాధర్మఖండనరూపార్థం బుపన్యసించితి నింక సీతానిధనప్రతీకారార్థంబుగా హయరథగజరాక్షస సహిత యైనలంక నిప్పుడు భస్మంబు గావించెద నని బహుప్రకారంబుల లక్ష్మణుండు భ్రాతృవాత్సల్యంబున సీతావల్లభు నాశ్వాసించుచుండ నప్పుడు. 1874

సీ. సకలవానరచమూసందోహములఁ గలయంగఁ గన్గొని యుభయంబు దెల్పి
మతిమంతు లగుతనమంత్రులతోఁ గూడ మాతంగయుత మైనమత్తగజము
పోల్కి నొప్పుచు ముదంబున నచ్చటికి రయం బెసఁగ విభీషణుఁ డేగుదెంచి
మోహంబు నొంది తమ్మునియంకమునఁ జేరి,ఖిన్నుఁ డై చాల దుఃఖంచుచున్న
తే. రాము నీక్షించి యన్మహీరమణునట్లు
ఖిన్ను లై యాస్యములు వాంచి యున్నకపులఁ

జూచి తానును మిక్కిలి శోక మొంది
యిట్లు దీను లై యున్నవా రేల యనుడు. 1876

క. ఆయసురేంద్రునివదనము, పాయక వీక్షించి శోకబాష్పపరిక్లి
న్నాయతలోచనుఁ డై ప్రే, మాయుతుఁ డాలక్ష్మణుండు గ్రక్కునఁ బలికెన్.

తే. ఏమి చెప్పుదు దనుజేంద్ర యింద్రజిత్తు
జానకిని జంపె నని పవమానసుతుఁడు
చెప్ప విని రాఘవేంద్రుండు చిత్త మెరియఁ
గన్నుగవ మోడ్చి మౌని నై యున్నవాఁడు. 1877

క. అన విని విభీషణుం డో, యనఘా యిది యేటిమాట యనుచు సుమిత్రా
తనయుని వారించి మహో, వినయంబునఁ జేరి రామవిభునకు ననియెన్. 1878

విభీషణుఁ డింద్రజిత్తుచే వధింపఁబడినది మాయాసీత యని రామున కెఱిఁగించుట.

ఉ. మానవనాథ మారుతకుమారుఁడు నీరధి యింకె నన్నచం
దాన వచించె నప్పలుకు నమ్మఁగ రాదు దురాత్ముఁ డైన యా
దానవభర్తడెందమునఁ దప్పక యున్నతలం పెఱుంగుదు
జ్జానకిఁ జంపఁ జూడఁ డిది సత్యము శోకము నొందనేటికిన్. 1879

చ. జనవర యేను నీకు మును జానకి నిమ్మని యెంత చెప్పిన
న్వినఁడు నిశాటనాథుఁ డవివేకత నట్టిదురాత్ముఁ డేల సీ
తను వధియింపఁ బంపు నిది సత్యము గాదు యథార్థ మేని పె
ల్చన సచరాచరంబు లగుసర్వజగంబులు నేఁడు గ్రుంగవే. 1880

చ. విమలవిచార రావణుఁడు వేయి విధంబుల సామదానభే
దముల మహీజ వేఁడియును దత్తను వంటఁగఁ జాలఁ డయ్యె నీ
రమణిని దాఁక నన్యునితరంబె జడోద్ధతిఁ దాఁకె నేని స
ర్వము నొగిఁ గేలఁ గైకొనినబాలునికై వడి నేలఁ గూలఁడే. 1881

చ. ఇది యొకబొంకు గాని మనుజేశ్వర నిక్కము గాదు శక్రజి
త్తదయత గెల్పు చేకొనుట కాసురహోమ మొనర్పఁ బూని దు
ర్మదమున మాయఁ బన్ని సుకరంబుగఁ గీశుల నెల్ల నీగతిం
గదనమునందు మోహితులఁగా నొనరించె విచార మేటికిన్. 1882

ఇంద్రజిత్తు నికుంభిలయందు హోమము సేయుటను విభీషణుఁడు రామునకు దెల్పుట.

ఉ. ఆదివిజారి యిప్పుడు మహాత్మ నికుంభిల కేగి యచ్చటన్
మోద మెలర్ప హోమము సముద్ధతి నల్పుచు నున్నవాఁడు త
ద్వేదికయందు విఘ్నముగ వేలిమి పారము ముట్టెనేని శ
క్రాదిదిగీశు లందఱొక టైనను వాని జయింపలే రనిన్. 1883

ఉ. ఓరఘువర్య రాక్షసునిహోమము పూర్ణము గాక మున్నె దు
ర్వారపటుప్రతాపబలవైభవ మొప్పఁగ నేము బల్విడిన్
మారుతతుల్యవేగమహిమ న్రహిఁ నేగి యనేకభంగులన్
వారక హోమముం జెఱచి వచ్చెద మానతి యిచ్చి పంపవే. 1884

వ. దేవా శోకకర్శితుండ వై ననిన్ను విలోకించి సైన్యంబంతయు ఱిచ్చవడియున్నది సమాగతం బైనయీమిథ్యాసంతాపంబు పరిత్యజించి స్వస్థచిత్తుండ వై విక్రమోత్సాహసంపన్నుండ వగుము శుభలక్షణుండగులక్ష్మణుండు చమూసహితుల మైనమమ్ముఁ గూడి శీఘ్రంబునం జని నిశితశరంబుల హోమంబుఁ జెఱచి పత్త్రిపత్త్రాంగసంజాతవేగంబులగుతీక్ష్ణాగ్రబాణంబులరావణిం బరిమార్చి విజయంబు సంపాదించుం గావున వజ్రధరుండు వజ్రంబుంబోలె రాక్షసనాశనంబునకునిప్పరాక్రమధుర్యుంబనుపుము రాక్షసేంద్రనందనుండుసమాప్తహోమకర్ముండయ్యెనేని యదృశ్యుం డై సురాసురుల నైనరాక్షసుల నైనగణింపక విక్రమంబుసలుపు నప్పుడు వాని జయింతు మనుపలుకు సంశయితంబై యుండుఁగావునఁ గాలవిళంబనంబు సేయక రయంబున మత్సమేతంబుగా లక్ష్మణుం బంపు మని పలికిన నవ్విభీషణునివచనంబువిని పరపురంజయుం డగురాముండు ప్రియాహననసంజాతశోకాక్రాంతచిత్తుండై మైమఱచి యున్నవాఁడగుటం జేసి విభీషణోక్తవాక్యాభిప్రాయగ్రహణంబునం దసమర్థుం డై కొంతేవడికిఁ గొండొకధైర్యం బవలంబించి తనమ్రోల నాసీనుం డై యున్నవిభీషణు నవలోకించి రాక్షసేంద్రా రావణునియభిప్రాయం బెట్టిది శక్రశత్రుం డిట్లేల గావించె నీవిప్పుడు పలికినయర్థంబు గ్రమ్మఱ నెఱిఁగింపు మని యడిగిన నవ్విభీషణుండు వినయరసావేశవివశాత్మకుం డై యంజలిఁ గీలించి రామభద్రు నవలోకించి వెండియు నిట్లనియె. 1885

సీ. అనఘచరిత్ర నీ వానతిచ్చినభంగి వేర్వేఱ గుల్మనివేశనంబు
గావించితిమి విభక్తంబు లై బలములు శోభిల్లుచున్నవి సురుచిరముగ
నరయంగ మన కిది హర్షకాలము గాని దుఃఖకాలము గాదు తోడుతోడ
భూరిశౌర్యంబున వైరుల నిర్జించి జనకకుమారిఁ గైకొనుము నీవు [చేసెఁ

తే. పంక్తికంఠాత్మజుఁడు మాయఁబన్నిమనల, మోహితులఁ జేయుటకు నిట్లుమొనసి
గర్బురుం డేడ సీత యెక్కడ వధించె, ననఁగ నెక్కడ నిది వెఱ్ఱితనము గాదె.

చ. ఇనకులవర్య లక్ష్మణు నహీనశరాఢ్యునిఁ బంపు మిప్పు డ
య్యనఘుఁడు మత్సహాయుఁడయి యర్థి నికుంభిల కేగి సాయకా
సనపరిముక్తవజ్రనిభశాతశరంబుల నింద్రజిత్తునుం
దునిమి జయంబు చేకొని విధుద్యుతితోఁ జనుదెంచు వేడుకన్. 1887

వ. దేవా రావణనందనుండు తొల్లి తపంబు పెంపునఁ బరమేష్ఠి మెప్పించి యద్దేవుని వలన బ్రహ్మశిరం బనుదివ్యాస్త్రంబు వడసినవాఁ డదియునుం గాక యప్పితామహుండు వానికివరంబొసంగునప్పుడెప్పుడేనియు నికుంభిలయందుహోమకర్మంబు

నిరంతరాయంబుగా సమాప్తి నొందెనేని కామసంచారక్షమతురంగమయుక్త
రథంబును గవచంబును జాపంబును దివ్యాస్త్రంబులును వహ్నిసకాశంబువలన
నుత్పన్నంబు లగుఁ దద్రథస్థుండై యాలంబులకుఁ జనిన నింద్రాదిసురుల కజ
య్యుండగుననియును హోమంబు కడముట్టదేని వధ్యుం డగుననియును బలికెఁ
గావుననిప్పు డయ్యింద్రజిత్తు సైన్యసమేతంబుగా నికుంభిలకుంజని హోమంబు
సేయుచున్నవాఁ డాహోమంబు సమాప్తి నొందెనేని మనల నందఱ నిస్సంశ
యంబుగా వధియించుఁ గావున నవ్వేలిమి తుదిముట్టకమున్నె వాని వధించు
టకు మహావీరుండైన లక్ష్మణుని నియోగింపుము మాయావి యగువీఁడు మడిసి
నం జాలు సుహృత్సమేతంబుగా రావణుండు నీచేత రణంబునం జచ్చినవాఁ డని
పలికిన నవ్విభీషణునివచనంబు విని రాముండు కలంక దేఱి క్రమ్మఱ నతనికిట్లనియె.

ఉ. రాక్షసవర్య రౌద్రుఁ డగు రావణిమాయ నెఱుంగుదు న్సమి
ద్దక్షుఁడు విక్రమాధికుఁడు దానవసత్తముఁ డస్త్రకోవిదుం
డక్షయబాహుసత్త్వుఁడు మహాత్ముఁడు వాఁ డనిలోన నాసహ
స్రాక్షయమాదిదిక్పతుల నైన విసంజ్ఞులఁ జేయు నుద్ధతిన్. 1889

చ. అరదముతోడ మింట రయమారఁ జరించెడువేళ నీనిశా
చరుగతి సాంద్రవారిధరసంప్లవమందు మహాత్ముఁ డైన భా
స్కరుగతిభంగిఁ జూపఱకుఁ గన్పడకుండు నిశాటవర్య వీఁ
డరయఁగ దేవదానవులకైన నసాధ్యుఁడు సంగరంబునన్. 1890

చ. అని యిటు పల్కి రాముఁడు దురాత్మకుఁ డైన నిశాటరాజనం
దనునిపరాక్రమంబును దతస్ఫుటమాయ నెఱింగి కీర్తివ
ర్ధనుని బరాక్రమాధికుఁ బ్రతాపవిశిష్టుని ధీరు లక్ష్మణుం
గనుఁగొని చూపులం గరుణ గన్పడ గారవ మొప్ప నిట్లనున్. 1891

రాముఁ డింద్రజిద్వధమందు లక్ష్మణు నియోగించుట

ఉ. వీరవరేణ్య సర్వకపివీరచమూగణసంయుతుండ వై
దారుణభంగి నేగి యలదానవనాథసుతుం దురాత్మకుం
ధీరుని మాయికు న్బలవిధేయు నిశాతశిలీముఖంబులం
బోరి వధించి రమ్ము పరిపూర్ణయశుండవు గమ్ము లక్ష్మణా. 1892

మ. హనుమంతుండును జాంబవంతుఁడు ప్లవంగాధీశ్వరుం డంగదుం
డును నీలుండు నలుండు శంభుఁడు సుషేణుం డాసురాచార్యనం
దనుడుం గేసరి మున్నుగాఁ గలచమూనాథు ల్బలోపేతు లై
యనఘా నీవెనువెంట వచ్చెదరు బాహాటోప మేపారఁగన్. 1893

తే. మనుకులవరేణ్య దానవమర్మవిదుఁడు
శత్రుభీషణుఁ డీవిభీషణుఁడు నీదు

వెంట సచివసమేతుఁ డై వినయ మెసఁగ
వచ్చి నీకు యాగముఁ జూపు నచ్చుపడఁగ. 1894

క. అని పలికి రాఘవేంద్రుం, డనుజుని దీవించి యనుప నయ్యనఘుఁడు నె
మ్మనమున మోదము గదురఁగ, నినకులుపాదముల కెఱఁగి యిట్లని పలికెన్.

చ. అలఘుచరిత్ర యిప్పుడు మదంచితకార్ముకముక్తగోత్రభి
త్కులిశసమానకాండము లకుంఠితలీల నిశాటుగాత్రముం
జలమున వ్రక్కలించి వరుసం జని రాక్షసరాజధానిపైఁ
బలుమఱు వ్రాలుఁ బుష్కరిణిపై వడి నంచలు వ్రాలుకై వడిన్. 1896

వ. అని పలికి ప్రతాపవంతుం డగులక్ష్మణుండు భక్తియుక్తంబుగా రామునకుఁ ప్రదక్షిణంబును బ్రణామంబునుం గావించి యమ్మహాత్ముని చేత స్వస్త్యయనపూర్వకంబుగా ననుజ్ఞాతుం డై వజ్రకవచంబు దొడిగి శరపూర్ణంబు లైనకవదొనలుబిగించి హేమవిభూషితం బైన వేఱొక్కకార్ముకశ్రేష్ఠంబు దాల్చి ఖడ్గంబు గొని యభూతపూర్వ తేజోవిశేషంబునం దేజరిల్లుచు రావణనందనవధాకాంక్షి యై శీఘ్రంబునం జనియె నప్పు డనేకవానరసహస్రపరివృతుం డై హనుమంతుండును నీలమేఘసన్నికాశభల్లూకబలసమేతుం డై జాంబవంతుడును సచివచతుష్టయసమన్వితుం డై విభీషణుండు ససంఖ్యాతవీరమర్కటవాహినీకగణోపేతులై తక్కినయూథపులును ధనుష్పాణి యైనలక్ష్మణుంబరివేష్టించి పాదాభిఘట్టనంబునం బుట్టినధరణీపరాగంబు గగనంబునం బర్వఁ జరణాతిభారంబు మోవంజాలక శేషుండు శిరంబులు వంపఁ గోలాహలశబ్దంబుల దిక్కుంభికర్ణంబులువగుల భయదాట్టహాసంబునం జనిరి యిట్లనంతబలపరివేష్టితుం డై మిత్రతేజుం డగుసుమిత్రాపుత్రుం డప్రమేయవేగంబున దూరం బరిగి నికుంభిలఁ జేరి యందుఁ గాలమేఘసదృశం బై వ్యూహీకృతచతురంగరథపదాతిజనసంకులం బై నానావిధవిమలశస్త్రభాస్వరం బై విపులం బై నిస్తరంగసముద్రంబు చందంబున నిండికొని నికుంభిలావనంబుఁ జుట్టుఁ గాచికొని యున్నరాక్షససైన్యంబు నవలోకించె నప్పుడు విభీషణుండు సౌమిత్రి నవలోకించి యర్థసాధనం బగువాక్యంబున ని ట్లనియె. 1897

సీ. అనఘాత్మ యిదె చూడు మసితాభ్రతుల్య మై తనరారుచున్నది దనుజసైన్య
మీసేన తనచుట్ల నిడికొని రావణి హోమంబు గావించు చున్నవాఁడు
కఱకుటమ్ముల దీనిఁ దెఱిపి గావించినఁ గాని శక్రద్వేషి గానఁబడఁడు
గావునఁ గపిసేన గవియించి పెనఁగించి తోడ్తోడఁ గ్రొవ్వాఁడితూపు లేయు

తే. మింకఁ దడ వేటి కీహోమకృత్య మిపుడు
పార మొందకమున్నె యీఘోరదైత్యు
విశిఖతతుల వధింపుము వీఁడు ఖలుఁడు
క్రూరకర్ముఁడు మాయావి వీరవరుఁడు. 1898

క. అని దైత్యవరుఁడు పలికిన, విని రామానుజుఁడు కోపవివశుం డై లో
చనముల రక్తిమ మీఱఁగ, దనుజులపై విశిఖవృష్టి దళముగఁ గురిసెన్.

వానరరాక్షసుల తుములయుద్ధము.

చ. తరువులు శైలశృంగము లుదగ్రశిల ల్గొని ఋక్షసైన్యముల్
తరుచరసైన్యము ల్భయదదారుణనిస్వనము ల్సెలంగ భీ
కరగతి దైత్యసైన్యముల గ్రక్కునఁ దాఁకిరి వారు వారలం
బరువడిఁ దాఁకి రుగ్రశరపట్టిసముద్గరకోటి నించుచున్. 1899

క. ఆరణము సంకులం బై, ఘోరం బై నభము వగులఁ గులగిరు లదరన్
ధారుణి వడంక లంకా, ద్వారంబులు బోరుకలఁగఁ దప్పక సెల్లెన్. 1900

క. తరుగిరిశృంగంబులచే, శరపట్టిసభిండివాలచక్రగదాము
ద్గరవితతులచే నప్పుడు, కర మాకాశంబు నిరవకాశం బయ్యెన్. 1901

చ. అసురులు బిట్టదల్చి వికృతాననులై పటుశస్త్రపాణులై
మసలక కీశసేన నడుమ న్వడిఁ జొచ్చి కలంప నత్తఱిన్
విసువక వారియట్లు కపివీరులు ఘోరశిలాద్రిపాణులై
వెస నరిసేనఁ జొచ్చి ఘనవీర్య మెలర్పఁ గలంచి రుద్ధతిన్. 1902

ఆ. అంతఁ గొంతవడికి నద్భుతబలులైన, వానరర్క్షసైన్యవరులచేత
వధ్యమానులైనవానవరిపుల కత్యంతభయము వొడమె నాలమందు. 1903

వ. అప్పుడు వానరులకోల్తలకోర్వక విషణ్ణంబై పఱచుచున్ననిజానీకంబు నవలో
కించి జాతక్రోధుం డై దుర్ధర్షుం డగు శక్రజిత్తు లేచి కల్పోక్తప్రకారంబున
హోమంబు పరిసమాప్తి నొందక మున్న శీఘ్రంబున వృతాంధకారంబువలన
నిర్గమించి వెలికిం జనుదెంచి పూర్వయుక్తం బైనరథం బెక్కి భీమకార్ముకశరుం
డై కృష్ణాంజనచయోపముం డై కోపసంరక్తనయనాననుం డై కాలాంతకుని
చందంబునం గ్రాలుచు సాంద్రంబుగా శరవర్షంబుఁ బరఁగించుచు సంరంభవి
జృంభితుం డై తరుచరసైన్యంబుల నొప్పింపం దొడంగిన నతనిప్రాపున నిర్భయు
లై రాక్షసులు నానావిధాయుధాసారఘోరంబుగా వానరులపయిం గవిసి రణం
బు గావించిన నత్తెఱం గాలోకించి. 1904

చ. అనిలతనూజుఁ డప్పుడు సురాచలసన్నిభఘోరకాయుఁ డై
ఘనతరపాదపం బొకటి గైకొని యొక్కొకవ్రేటు దాఁకునన్
దనుజు లనేకు లుర్విఁ బడఁ దట్టుచు శుష్కవనంబు నేర్చున
య్యనలునిభంగి రాక్షసుల నందఱ నేర్చఁ దొడంగె నెంతయున్. 1905

ఉ. అప్పుడు శూరులైనక్షణదాటులు కొందఱు సాహసంబునన్
దెప్పర మైనభంగి నతిధీరుని వాయుకుమారుఁ దాఁకి నే
ర్పొప్పఁగ నాశ్వికు ల్రథికు లుగ్రపదాతులిభాధిరోహకుల్
గప్పిరి తీవ్రఖడ్గవిశిఖస్ఫుటముద్గరతోమరంబులన్. 1906

వ. మఱియును. 1907

సీ. శితశూలధరు లగుదితిజులు శూలముల్ ఖడ్గపాణులు మహాఖడ్గములను
శక్తిహస్తులు ఘోరశక్తిసందోహముల్ పట్టసాయుధు లుగ్రపట్టసములు
పరిఘసాధనులు భీకరపరిఘంబులు చక్రయోధులు తీవ్రచక్రములును
ఘోరగదాయుద్ధకోవిదు ల్గదలును బరశువు ల్గలవారు పరశువులును

తే. ఖండనమున నొక్కుమ్మడిఁ బఱపి రందుఁ, గైదువులు లేనివారలు కఱకుఁగోళ్ల
రదనములఁ బాణితలముల భిదురతుల్య,ముష్టిహతులఁ బెనంగి రద్భుతముగాఁగ.

క. మఱియు నిశాటులు కొండలు, గురుభారశతఘ్నిముసలకుంతాశనిము
ద్గరభిండివాలములు వడిఁ, బరఁగించిరి ధీరుఁడైన పావనిమీఁదన్. 1909

ఆ. వృష్టిధారలఁ జలియింపనిశైలంబు, రీతి వారిశస్త్రవృష్టి నోర్చి
వారియాయుధములు వారక చేకొని, వారినెల్లఁ దునిమె వాయుసుతుఁడు.

ఇంద్రజిత్తు హనుమంతునితో యుద్ధము సేయుట.

క. అపు డామరుత్కుమారుని, విపులభుజావిక్రమంబు వీక్షించి మదిం
గుపితుండై రయమున నా, క్షపాచరవరేణ్యసుతుఁడు సారథి కనియెన్. 1911

తే. అనిలనందనుఁ డరవాయిగొనక దైత్య,సైన్యముల నేర్చుచున్నాఁడు సమదలీలఁ
గడవు చేసిన నింక నందఱ వధించు, వానిమీఁదికి రథము పోవంగ నిమ్ము.

వ. అని పలికిన సూతుండు తద్వచనప్రకారంబున యుగ్యంబుల పగ్గంబులు వదలి
వాయునందను నభిముఖంబుగా రయంబున నం దేరు దోలిన. 1913

శా. సాహంకారత రాక్షసుం డలిగి ఘోరాకారుఁడై బాణసం
దోహంబు ల్పటుశూలముద్గరము లస్తోకాసికుంతంబు లు
త్సాహం బొప్పఁ గపీంద్రుపైఁ బఱపి రౌద్రప్రక్రియన్ సేనలం
ద్రాహి త్రాహి సమీరపుత్ర యనుచు న్వాపోవఁ జేసె న్రహిన్. 1914

క. అమరారిముక్తపటుశ,స్త్రము లన్ని ప్రతిగ్రహించి సంక్రుద్ధుండై
బొమలు ముడివడఁగ మారుత,కుమారుఁ డద్దనుజుఁ జూచి గొబ్బునఁ బలికెన్.

క. దనుజాధమ నీమాయలు, పనిగొన వింక దొంటిపగిది ఖండనమున కేఁ
జనుదెంచినాఁడ నాతోఁ, బెనఁగుము శూరుండవేని పింఛ మణఁచెదన్. 1916

మ. అనిమేషారికులాధమా వినుము మాయాసీతఁ గావించి న
న్ననిలోఁ జాల భ్రమింపఁ జేసితివి నీ వాఙ్బాము నీమీఁద నే
వినియోగించెదఁ జూడు నాకడిమి నీవృక్షప్రహారంబున
న్నిను జన్యంబునఁ ద్రుంచి పుచ్చెద నొగి న్నేఁ డంతకుం గూడఁగన్. 1917

చ. ఎఱుఁగవె నీవు తొల్లి దనుజేంద్రసుతా ప్రమదావనంబు గ్ర
చ్చఱఁ బెకలించి నీయనుజుఁ జంపి నిశాచరకోటిఁ ద్రుంచి నీ
పురము దహింప విక్రమసముద్ధతిఁ గ్రమ్మఱఁ బోవు టంతయుం
గరువలిపట్టిఁ దాఁకి బ్రతుకంగఁ దరంబె దురాత్మ నీకనిన్. 1918

క. వినుమిక బాహాయుద్ధం, బొనఁగెద వేగంబుఁ బూని యోడక గొనుమా
యనురాధమ వెయ్యేటికిఁ, బొసఁగదు నను మీఱి తొలఁగి పోవఁగ నీకున్.

క. నా విని సక్రోధుం డై, రావణనందనుఁడు కనులరక్తిమ నిగుడం
బావని మార్కొని జన్యము, గావింపఁ దొడంగె బాణకౌశల మలరన్. 1920

వ. అప్పుడు రాక్షసశ్రేష్ఠుం డగువిభీషణుండు లక్ష్మణున కయ్యింద్రజిత్తుం జూపి యిట్లనియె. 1921

చ. మనుజవరేణ్య రావణకుమారుఁడు హేమరథాధిరూఢుఁ డై
యనిలతనూజునిం బొదివి యాలముఁ జేయుచు నున్నవాఁడు వీఁ
డనిమిషనాథునోర్చినబలాఢ్యుఁడు గావున వీని వజ్రక
ల్పనిశితధాతృదండనిభబాణము లేసి వధింపు ముద్ధతిన్. 1922

క. అన విని లక్ష్మణుఁ డప్పుడు, గనుఁగొనియె దురాసదు న్నగప్రతిమానున్నత
ఘనభుజుని భీమబలు దుర్జను మాయికు నింద్రజిత్తు సముదోన్మత్తున్. 1923

ఇంద్రజిత్తు చేయుచుండినహోమమును విభీషణుఁడు లక్ష్మణునకుఁ జూపుట.

వ. అంత నవ్విభీషణుండు జాతక్రోధుం డై ధనుష్పాణి యైనలక్ష్మణుం దోడ్కొని చని రయంబున నమ్మహావనంబు ప్రవేశించి యందు నీలనారదసంకాశం బై భీమదర్శనం బై యొప్పుచున్నన్యగ్రోధంబుక్రింద నయ్యింద్రజిత్తు గావింపం గడమ పడియున్నహోమంబుఁ జూపి వెండియు నిట్లనియె. 1924

సీ. రాజనందన కంటె రావణి యిక్కడ సమరంబుకొఱకు వేలిమి యొనర్చి
మునుకొని యుపహారముల భూతముల కిచ్చి యనలుఁ డొసంగినయరదమెక్కి
పరుల కదృశ్యుఁ డై పటుసాయకంబుల వివిధశస్త్రంబులఁ దివిరి దునుము
నిదె గనుఁగొను మిప్పు డీయగ్నిలో నుండి వెడలుచున్నది యొక్కవింత తేరు

తే. వాఁడు గ్రమ్మఱ నిమ్మహావటకుజంబు, కడకు రాకుండ నరికట్టి కాలదండ
సదృశపవనాతివేగనిశాతఘోర, మార్గణంబులఁ జంపుము మసలవలదు. 1925

చ. అన విని మిత్రవత్సలుఁ డనంతబలాఢ్యుఁడు లక్ష్మణుండు నె
మ్మనమున నుత్సహించి ఘనమర్కటసైన్యసమేతుఁ, డై కరం
బనిమిషనాథకార్ముకనిభాయతదారుణచాపశింజినీ
స్వన మొనరించుచుండె హరివైరిసమాగమనంబు గోరుచున్. 1926

మ. రథి యై కార్ముకి యై మహాకవచి యై రౌద్రోన్నతుం డై ససా
రథి యై పూర్ణనిషంగి యై తురగి యై రమ్యధ్వజోపేతుఁ డై
ప్రథనోత్సాహ మెలర్ప దాశముఖి మ్రోలం దోఁచినం జూచి శౌ
ర్యధురీణుం డగులక్ష్మణుండు వలికె న్బ్రావృట్పయోదార్భటిన్. 1927

క. ఖల రాక్షస యిఁక నీమా, యలు పనిగొన వేను గడిమి నాలంబునకుం
బిలిచెద శూరుఁడ వేనియుఁ, దలఁగక నాకొసఁగు మిపుడు ద్వంద్వరణంబున్.

### ఇంద్రజిత్తు విభీషణుని నిందించుట.

క. అన విని సక్రోధుం డై, దనుజేశ్వరనందనుండు తత్పరిసరమం
దనువుగ నున్నవిభీషణుఁ, గనుఁగొని తామ్రాక్షుఁ డలరఁగా నిట్లనియెన్.

క. ఘనపౌరుషయుక్తం బగు, దనుజాన్వయమున విభుండు దశకంఠున కీ
వనుజుఁడవై పుట్టితి విటు, తనయుఁడ నగునాకు నెగ్గు దలఁపఁగఁ దగునే. 1930

క. జ్ఞాతిత్వము సౌహార్దము, జాతియు మర్యాద ధర్మసౌగుణ్యంబు
న్నీతియుఁ బౌరుషమును వి,ఖ్యాతియు మానమును నీకుఁ గలుగవు తలఁపన్.

క. తనవారి విడిచి యన్యుల, మునుకొని సేవించునట్టిమూఢుఁడ వార్యుల్
నిను నిందింతురు లఘుజీ,వన మోర్తురె శక్తులైనవారు నృశంసా. 1932

క. స్వజనపరిత్యాగం బ,న్యజనాశ్రయ మతివిరుద్ధ మని తెలియక నీ
చజనులకడఁ జేరితి విది, సుజనులచందంబె నిన్నుఁ జూడఁగ నగునే. 1933

ఆ. నీచబుద్ధి వైననీకతంబున రాక్ష,సాన్వయమున కెల్లహాని కలిగె
నేడ స్వజనవాస మేడఁ బరాశ్రయ, మెంతచెనటి వైతి వేమి యందు. 1934

తే. అరయఁ దనవారు దుర్గుణు లైనఁ బరులు
చాల గుణవంతు లైనను స్వజనవాస
మన్యవాసంబుకంటె శ్రేయగపదంబు
పరుల సేవించు టది యొక్కపౌరుషంబె. 1935

తే. పౌసఁగ నెవ్వాఁడు తనవారిపొత్తు విడిచి,పరుల సేవించు నతఁడుస్వపక్షజనులు
నాశ మొందినపిదప నన్యాయసరణి, వారిచేతనె హతుఁ డగువానవారి. 1936

క. తమవారిమర్మకర్మము, నెమకి విరోధులకుఁ జెప్పు నిరనుక్రోశ
త్వము నీకె గాక నిర్జర, విమతా చేఁబోకని కుర్వి వెదకినఁ గలదే. 1937

వ. అని పలికిన విభీషణుండు గ్రమ్మఱ వానికి ట్లనియె. 1938

### విభీషణుఁడు ఇంద్రజిత్తునకు బుద్ధి చెప్పుట.

తే. అసురనాథతనూజ దురాత్మ నీవు, పూని మచ్చిల మెఱుఁగనివానికరణి
తివిరి ప్రేలెద వేల గౌరవమువలనఁ, బొడమినట్టిపారుష్యంబు విడువు మింక.

క. కలకాలము ఖలరాక్షస, కులజాతుఁడ నయ్యుఁ గ్రూరగుణము విడిచి సా
ధులముఖ్యగుణము గైకొని, యలఘుమతిఁ జరించు టెఱుఁగ వఁటరా నీచా.

ఉ. దారుణవృత్తి గైకొని యధర్మ మొనర్తురు మీరు నిత్యముం
దారుణవృత్తి గైకొనక ధర్మ మొనర్తుదు నేను మీకడం
జేరఁగ రాదు నే విషమశీలుఁడ నై తగ నెట్లు మీదురా
చారము మాన్ప నోపుదు నృశంసులపొత్తు మనంగ వచ్చునే. 1941

క. ధర్మప్రచ్యుతశీలుని, నిర్మర్యాదకుని బాపనిశ్చయు మఱి దు
ష్కర్ముని గరగతఫణి నే, ట్లర్మిలిఁ బోనడిచి సుఖము లందఁగ వలయున్ . 1942

వ. మఱియు హింసయుఁ బరస్వహరణంబును బరదారాభిమర్శనంబును దురాచారం
బును నీనాల్గు వంశక్షయావహంబు లని పెద్దలు పలుకుదు రిన్నాల్గింటిని బుద్ధి
మంతుం డగువాఁడు ప్రజ్వలితగృహంబునుంబోలెఁ బరిత్యజింపవలయు ఘోరం
బైనమహర్షివధంబును సాధు లగుదేవతలతోడ విగ్రహంబును దురహంకారం
బును గోపంబును బద్ధవైరత్వంబును బరులకలిమి కసూయపడుటయు నివి మొద
లుగాఁ గలదోషంబులు తోయదంబులు పర్వతంబునుంబోలె రావణునిగుణం
బులఁ గప్పికొని యున్నవి దుర్గుణంబులు జీవితైశ్వర్యనాశనంబు సేయు కేల
తక్కు నీదోషంబువలన విముక్తునిం జేసి సుఖాత్మునిఁ గావించుట కేను బెక్కు
తెఱంగుల నీతిప్రబోధంబుఁ జేసి పిదప నిట్లు నిరస్తుండ నైతి నింక నేల లంక
యెక్కడ రావణుం డెక్కడ నీవు బాలుండవు దుర్వినీతుండవు దురభిమానివైన
నీవు రావణునకుఁ బుత్త్రుండవై జనించుటవలన నింత పుట్టె దురాసదం బైన
కాలపాశంబునం గట్టువడితి వింకఁ దొల్లింటిచందంబున నీకు లంకకుం బోవరాదు
హోమంబు సేయుటకు వటంబుక్రిందికిఁ జనఁగూడదు నీమాయలు మాయ
మయ్యెఁ బరాక్రమధుర్యుం డైనలక్ష్మణునిబారింబడి బ్రతికిపోవం జాల వమ్మహా
త్ముతోడ రణంబు గావింపుము నిజబలంబుఁ జూపుము సర్వాయుధసాయకవ్య
యంబు సేయుము తుది నమ్మనుజవరశరాసనముక్తదురాసదశాతశరజర్జరితావయ
వుండవై సమరంబులోనఁ బ్రాణంబులు విడిచి బలసహితంబుగా యమలోకం
బునకుం జని యమనిలయకింకరుండ వయ్యెద వని పలికినవిభీషణునివాక్యం
బులు విని మహావీరుం డగురావణనందనుండు క్రోధాతిశయంబునఁ గన్నులం
గెంజాయ రంజిల్లఁ బరుషవాక్యంబుల విభీషణుని నిందించుచుఁ గాలాంతకసన్ని
భుం డై మహాప్రమాణం బైనవిపులకార్ముకంబు జిఱజిఱం ద్రిప్పుచు నమిత్ర
నాశనంబు లైనశరంబులు పరామర్శించి కాలాశ్వయుక్తం బైనకాంచనరథంబు
మహావేగంబునం గదియఁ దోలించి తనమ్రోల మహోన్నతశరీరుం డగుహను
మంతునిమీఁద నారోహించి స్వతేజోభూషితుం డై యుదయమహీధరమండ
లాగ్రసంస్థితుం డైనసహస్రకరునిభంగి వెలుంగుచున్నలక్ష్మణునిదత్పరిసరంబున
నున్నవిభీషణునిదిక్కునయూథపుల నందఱఁ గలయ నవలోకించి మహాశనికల్పం
బగువాక్యంబున ని ట్లనియె. 1948

చ. వెఱవక మద్విచిత్రభుజవేగముఁ జూడుఁడు నేఁడు మింటిపైఁ
దరలక పన్ని కాలజలదంబు నిరంతరభంగి వర్షముల్
గురిసినమాడ్కి సాంద్రముగ ఘోరనిశాతశరప్రవర్షముల్
బఱపెద మీ రనిం జెదరి పాఱ కొకింత సహింపుఁ డిత్తఱిన్. 1944

తే. నేఁడు మత్పృథుకార్ముకనిస్సృతప్రచండకాండపరంపర ల్గండు మీఱి
ఘోరభంగి మీతనువులు నీఱు సేయుఁ, జిచ్చు తూలరాశిని నీఱుఁ జేసినట్లు.

క. శూలాసిశక్తితోమర, కాలకటాక్షోపమానకాండంబుల మి
మ్మాలమునఁ దునిమి యిప్పుడె, వాలాయము కాలుఁపురికి వరుస ననిచెదన్.
తే. కార్ముకనినాదములు ఘోరగర్జితములు, భర్మభూషణరుచులు శంపలు శరౌఘ
వృష్టి గలిగి లయాభ్రంబులీలఁ జాల, నెరయునామ్రోల నెవ్వాఁడు నిలువనోపు.
చ. మఱచితె యింతలోన మునుమాపటియుద్ధమునందు మిమ్ము వా
నరుల నమోఘసాయకగణంబుల మూర్ఛ మునుంగఁ జేసి స
త్వరమునఁ గూలవైచినవిధం బహినాథుని మేలుకొల్పిన
ట్లరయక నన్నునిం జెనకె తెంతకుఁ జేరినవాఁడ వెంతయున్. 1948
వ. అని పలికిన నయ్యింద్రజిత్తుగర్జితంబు విని లక్ష్మణుం డభీతవదనుండై కోపంబు
రెట్టింప రక్తాంతవీక్షణంబుల వాని నవలోకించి వెండియు ని ట్లనియె 1949
సీ. దానవాధమ యీవృథాగర్వ మేల నీ కాడినయంత సేయంగనోవు
నట్టిమహాబలుం డాడినఁ గొంతలె స్సగు నంతర మెఱుంగ నట్టిమూఢుఁ
డాడిన మేలె మిమ్మందఱఁ దునిమి కృతార్థుండ నయ్యెద నన్నమాత్ర
నరయఁ గృతార్థుండ వైతివె మున్నాజి నందఱ నోర్చితి నంటివేని
తే. యేమఱించి తస్కరవృత్తి వ్యోమవీధి, డాఁగి దైత్యమాయాబలోద్యోగమలర
బవరమున నెల్లవారికిఁ బారవశ్య, మంటఁ జేసితి వది యొక్క బంటుతనమె.
క. ఎదిరించి నిలిచి నాతోఁ, గదనం బొనరింపు మిపుడు కడిమి దలిర్పన్
భిదురసమాననిశాత, ప్రదరంబులఁ ద్రుంతు రిత్తపలుకు లిఁకేలా. 1951
క. నా విని సక్రోధుండై, రావణనందనుఁడు కనుల రక్తిమ నిగుడం
బ్రావీణ్య మెసఁగ దిశలు న,భోవలయము వగుల మౌర్వి మోయించి వెసన్
తే. కాలసర్పసమానోగ్రకనకఖచిత, శరము లేసిన నవి మహాస్వనము లెసఁగ
నత్వరంబున నరిగి లక్ష్మణునియురము, దాఁకి వీపున వెడలి ధరణిఁ బడియె.
మ. మఱియుం రావణి సాయకంబులు ధనుర్జ్యార్చిం దగం గూర్చి బ
ల్గఱు లాడం దెగ నిండఁ దీసి వెస వక్షం బుచ్చిపో నేసినం
గురుబాణక్షతజాతరక్తకలితాంగుం డై సుమిత్రాసుతుం
డరయం బొల్చె విధూమవహ్నిగతిఁ బుష్పాఢ్యద్రుమప్రక్రియన్. 1954
వ. ఇట్లు మేఘనాదుండు లక్ష్మణుని రక్తధారాసిక్తగాత్రుం జేసి సింహనాదంబుఁ జేసి
డాసి రోషంబున ని ట్లనియె. 1955
తే. జనవరకుమార మచ్ఛరాసనవిముక్త, జీవితాంతకవిషదిగ్ధశితపటిష్ఠ
కంకపత్త్రోగ్రపటుసాయకములు గదిసి, వితతముగ నేఁడు నీదుజీవితము గ్రోలు.
క. బహువిశిఖంబుల నాచే, నిహతుఁడవై ధరణిఁ బడిననీమాంసంబుల్
రహిఁ గంకకాకఘూకని,వహములు భక్షించు నేఁ డవశ్యం బాజిన్. 1957
చ. వివిధనిశాతబాణములు వే నిగిడించి సమగ్రశక్తి నీ
కవచము సించి వి ల్విఱిచి గ్రక్కున నేఁ దల ద్రుంచి వైచెదన్

బవరములోపలం బడినభక్తుని దమ్ము ననార్యు ని న్నికన్
రవినిభ తేజుఁడై నరఘురాముఁడు చూడఁగలండు నేఁ డొగిన్. 1958

వ. అని సంరబ్ధుండై పరుషంబుగాఁ బలికిన నయ్యింద్రజిత్తువచనంబులకుఁగోపించి లక్ష్మణుండు హేతుమంతం బగువాక్యంబున నిట్లనియె. 1959

తే. కర్బురాధమ యీవృథాగర్వ మేల, బిరుసులాడినమాత్రానఁ బెంపుగలదె
బంటవై తేని నామ్రోలఁ బలికినంత, సేయు మట్లైన ఘనుఁ డని చెప్పవచ్చు.

క. మాటల వ్రేసినయంతనె, పాటిగ బలవంతుఁడై నపగతుఁడు చెడునే
మేటి వయి తేని యిప్పుడు, నూటిగ నీపలికినంతఁ జూపుము పెలుచన్. 1961

క. తన వేల సాయకంబులు, విడువుము నీచంద మెల్ల వీక్షించి తుదిన్
బిడుగుల కెన యగుతూపులఁ, బడవై చెద నిన్ను వజ్రి బలునిం బోలెన్.

తే. వట్టివాగ్వాద మేల దుర్వారవిశిఖ
వాద మొనరింపు మిది వీరవరునిగుణము
రాక్షసాధమ ఘోరమార్గణబలమునఁ
గాక భువి రిత్తమాటలఁ గలదె జయము. 1963

-లక్ష్మణుఁ డింద్రజిత్తుతో యుద్ధము సేయుట.-

వ. అని పలికి మిత్రతేజుం డగుసుమిత్రాపుత్రుండు రౌద్రరసోల్లాసభాసురవదనుండై సువర్ణవలయమండితం బైనకోదండంబు సవరించి గుణంబు సారించి ప్రత్యాలీఢపాదస్థుండై సూర్యమరీచికల్పంబులును సుజాతపక్షవిరాజితంబులునుగాలాశీవిషసన్నికాశంబులును మహావేగంబులు నగునారాచంబు లైదు పొగ లేని మంటలు మింటం బర్వ వింటం గూర్చి ఘంటారవంబులు సెలంగ నాకర్ణపూర్ణంబుగాఁ దిగిచి రావణియురంబు గాఁడ నేసిన నద్దానవుండు లక్ష్మణశరాభిహతవక్షుండై శోణితంబు గ్రక్కుచు మూర్ఛితుండై రథంబుపయిం బడి యొక్కింతకుఁ దెలివి నొంది రోషభీషణుండై వజ్రకల్పంబు లగుమూఁడువాఁడితూపులు సౌమిత్రియురంబు దాఁక నేసె ని త్తెఱంగున బలసంపన్నులును విక్రమాధికులును విక్రాంతులును సర్వశస్త్రవిశారదులును బరమదుర్జేయులును నిస్తులబలపౌరుషులును మహావీరులును మహాత్ములును జండకోదండవరాస్త్రశస్త్రధరులు నగునరరాక్షససింహులు దృప్తసింహంబులచాడ్పున మహాగ్రహంబులపోలికం గుమారతారకులభంగిఁ బురందరశంబరులకరణి గరుడపన్నగంబులపగిది నన్యోన్యజయకాంక్షలం దలపడి కన్నుల నగ్నికణంబు లొలుక సింహనాదంబులు సెలంగ గుణప్రణాదంబులు దిక్కులు నిండ లావును జేవయు బలంబును జలంబును దిట్టతనంబును నట్టహాసంబులు దీపింపఁ గాలమేఘంబుల భంగి నొండొరులమీఁద బాణవర్షంబులు గురియుచుఁ బాయుచు డాయుచు నేయుచు నహంకరించుచు హుంకరించుచు ధిక్కరించుచుఁ దృణీకరించుచు

వివిధప్రకారంబుల విన్నాణంబుగాఁ బోరుచుండ నయ్యాయోధనంబు మహా
భీమంబై తుములంబై సురాసురసంభ్రమప్రదంబై త్రిలోకభయానకంబై
చెల్లె నప్పుడు. 1964

ఆ. శత్రుకర్శనుండు సౌమిత్రి కోపించి, కనుల దారుణాగ్నికణము లలరఁ
దొడరి దనుజుమీఁద దొడ్డనారసము మే, నుచ్చి పోవ నేయ నొచ్చి యతఁడు.

క. చండతర మైనతత్ప్ర,దండశ్వసన మూలకించి తద్దయుఁ గినుకం
బెండు సెడి దీనముఖుఁడై, యుండె న్లక్ష్మణునివదన మొగిఁ గనుఁగొనుచున్.

తే. ఈకరణి దీనవదనుఁడై తేఁకువ సెడి
తిచ్చవడి యున్నవాసవరిపుని జూచి
శత్రుభీషణుఁ డగువిభీషణుఁడు వినయ
మింపు సొంపార సౌమిత్రి కిట్టు లనియె. 1967

క. మనకు శుభనిమిత్తంబులు, గన నగుచున్నయవి రాజకంఠీరవ యీ
దనుజుఁ డవశ్యము మృతుఁడగు,మునుకొని పటుశరము లేయుమురయంబడరన్.

ఉ. నా విని లక్ష్మణుండు ఫణినాథనిభాగ్నిశిఖోపమాననా
నావిధవజ్రతుల్యదిననాథమయూఖసమానకాండము
ల్దేవవిరోధిమీఁద దొరలించిన సంక్షుభితాఖిలాంగుఁడై
వావిరి వాఁడు మై మఱచి వ్రాలె శతాంగముమీఁద రోజుచున్. 1969

తే. ఇట్లు మూర్ఛితుఁడై రాక్షసేంద్రతనయుఁ
డొకముహూర్తమునకుఁ దెలివొంది నొచ్చి
యున్న నిఖిలావయవముల నుదుటుకొల్పి
కార్ముకం బందుకొని రోషకలితుఁ డగుచు. 1970

క. కన్నుల రక్తిమ నిగుడఁగఁ, బన్నుగ వీరాగ్రగణ్యుఁ బార్థివతనయుం
గన్నారఁ జూచి పరుషం, బెన్నిక కెక్కంగ మరల నిట్లని పలికెన్. 1971

సీ. మనుజేంద్రనందన మఱచితే తొలినాఁటిరాత్రియుద్ధంబున లావు మెఱసి
నిన్ను నీయన్నను నిరుపమనాగాస్త్రపాశబద్ధులఁ జేసి భండనమునఁ
బడవైచినవిధంబు పదపడి మొన్నటిమాపు మి మ్మందఱ నేపు మీఱి
చలమునఁ గఱకుటమ్ముల విసంజ్ఞులఁ జేసి యనిలోనఁ గూలవైచిన తెఱంగు

తే. నిద్రవోయెడు కేసరి నెమకి లేపి, సటలు వెఱికినమాడ్కి వేసరక నన్నుఁ
జెనక వచ్చితి విబ్భంగిసిగ్గుమాలి, వాఁడితూపులనినుఁ ద్రుంతుఁ జూడుమిపుడు.

వ. అని పలికి రోషపరవశుండై యద్దనుజరాజనందనుండు వహ్నిశిఖలం బోలిన
సప్తనారాచంబులు లక్ష్మణునిమీఁదఁ బరఁగించి నొప్పించి పదంపడి పదిబాణం
బులు పవననందనునిపై నడరించి వెంటనె వజ్రకల్పంబు లగునూఱువిశిఖం
బులు విభీషణుని నెఱకలు గాఁడ నేసి విజృంభించిన నద్దశరథరాజనందనుండు
వానికడిమి కైకొనక సూర్యమరీచికల్పంబు లైనకాండసహస్రంబులు పరఁ

గించి యుబ్బడంచి ముఖారవిందంబునకు మందహాసంబు చెలువొసంగ వాని
కిట్లనియె. 1973

ఉ. ఓరి దురాత్మ యిందనుక నూరక ప్రేలితి వేమి యయ్యె నీ
పౌరుష ముర్వి నుత్తముఁడు పంతము లాడక శత్రువర్గము
న్వారము నొందఁజేయు నటు పంతము లాడియు నల్పుఁ డెంతయు
నవ్వైరుల గెల్వ లేఁడు పటువాగ్బల మాజి జయం బొసంగునే. 1974

క. బల్లిదుఁడ నంచుఁ బలుకుచుఁ, బ్రల్లదములు పలికి పిదపఁ బగతుఁడు డాయన్
వెల్లదనంబున నుండం, జెల్లునె చెల్లింపు మీవు చెప్పినయంతన్. 1975

క. అని పలికి కోపమున డా, సినఁ గవచము దెంచి మేను చిల్లులు వాఱ
న్ననిశితసాయకవర్షము, దనుజేంద్రకుమారుమీఁద దళముగఁ గురిసెన్. 1976

తే. రాజపుత్రుసాయకముల రాక్షసేంద్రు
హేమవర్మంబు చూర్ణ మై వ్యోమవీథి
నుండి పడెడుతారాజాలమో యనంగ
నడలి వనచరు ల్చూడంగఁ బుడమిఁ బడియె. 1977

చ. శరపరిధూతవర్ముఁడయి సాంద్రకృతవ్రణుఁ డై విభావరీ
చరుఁడు మహామహీధరముచాడ్పునఁ గంపము నొంద కత్తుల
న్వరుస మిడుంగుఱు ల్సెదర వారక రాజకుమారుమీఁద భీ
కరతరవజ్రతుల్యపటుకాండసహస్రము లేసె నుద్ధతిన్. 1978

క. ఆమహనీయప్రదర,స్తోమము సీతాధిపానుజుని దాఁకి వెసన్
మైమఱువు సించి గాత్రము, భీమోద్ధతిఁ దూంట్లు గట్ట భేదించె వడిన్. 1979

వ. ఇట్లన్యోన్యకృతప్రతీకారు లై యద్దాశరథిదాశకంఠు లుత్కంఠ దీపింప నకుంఠితలీల మత్తకంఠీరవంబులచాడ్పునం దలపడి సవ్యాపసవ్యమండల ప్రకారంబులం దిరుగుచు మండలీకృతకోదండు లై పరివేషపరివృతసూర్య మండలంబులయొప్పుఁ జూపుచు సాసారంబు లగుప్రళయకాలవలాహకంబుల కరణి గర్జించుచు నొండొరులమీఁద నీరంధ్రంబుగా నంపవాన గురియుచుఁ బరస్పర ప్రహారభిన్నవక్షు లై ప్రస్రవణంబులు జలంబులు దొరఁగుచం దంబున రుధిరంబు గ్రక్కుచు రక్తధారోక్షితశరీరు లై ధాతుశోభితంబు లగుకులాచలంబులమాడ్కిఁ జూడ్కులకు వ్రేఁగగుచు రుధిరావసిక్తశరస్యూత సర్వాంగు లై హేతిమంతు లైనవైశ్వానరులభంగి వెలుంగుచు బాణక్షతవే దన సహింపంజాలక సారెసారెకు నిట్టూర్పులు పుచ్చుచు మత్తమాతంగంబుల మాడ్కి మాఱుమసలుచు నొండొరులశరప్రహారంబులు వారింప నలవి గాక నొడుగఱచుచుసాయకవిదారితసర్వాభరణు లై మ్రోటువడియున్నకదంబవృక్షం బులలాగునం జూపట్టుచు యుద్ధోన్మత్తు లగుటం జేసి పరిశ్రమం బెఱుంగక

రౌద్రరసోల్లాసభాసురవదనులై లయకాలరుద్రులకైవడిఁ దేజరిల్లుచు మఱియు రక్తధారాసారసంసిక్తసర్వాంగులై యఖండసంధ్యారాగమండలాంతర్గతమార్తాండునిం గ్రేడిసేయుచు నుచ్చావచాకారంబు లగు నారాచంబుల నంతరిక్షంబు బంధించుచు సర్వాస్త్రకోవిదులలోన నగ్రగణ్యులుగావున సారెసారెకు నస్త్రకౌశలంబులు చూపుచు విచిత్రప్రకారంబునఁ గరలాఘవశరలాఘవంబులు దీపింప నన్యోన్యజయకాంక్షలం గులాచలంబులు కంపింప సముద్రంబులు పొంగి పొరల గగనంబు ఘూర్ణిల్ల దిక్కులు వడంక సర్వభూతంబులు భయంబునం బర్వ దివారాత్రంబు లేర్పడకుండ దీర్ఘకాలంబు రణంబుగావించి రప్పుడు.

క. నరరాక్షససాయకకర, పరిముక్తసువర్ణపుంఖబాణములు తదం
గరుధిరపరిషిక్తములై, ధారిపనమున నొప్పెఁ బావకార్చులమాడ్కిన్. 1981

క. మఱికొన్ని మార్గణము లం,బరపథమున నుండి పుడమిపైఁ బడఁ దోడఁగెం
బెరసి విలయసమయంబున, నురుగతి మహిఁ వ్రాలుదారుణోల్కలమాడ్కిన్.

క. దారుణలయఘననిర్ఘో,షారవములభంగి మ్రోసె నతిసాంద్రముగా
వారిధనుర్గుణరవములు, ఘోరములై విన్నవారిగుండెలు వగులన్. 1983

ఉ. ఒండొరుమీఁద నుగ్రగతి నొక్కట నేయులసచ్ఛరంబు లొం
డొండ నభంబునం దొరసి యుక్కునఁ బుట్టినఘోరవహ్ని చే
మండుచుఁ దద్రణక్రమము మాపులు సర్వము గానిపించున
ట్లుండగఁ గ్రాలుబల్దివియలో యనఁ జూడఁగ నయ్యె నయ్యెడన్. 1984

తే. అంబకాసారసుకృతవ్రణంబులైన, దాశరథిదాశకంఠులతనువు లపుడు
చూడ నయ్యె నివృత్తకుసుమితభూరి, శాల్మలీకింశుకంబుల చంద మొంది.

చ. నలువుగ వారిగాత్రముల నాటినసాయకము ల్నగంబుపైఁ
బొలిచినభూరిభూజములపోల్పునఁ జూడఁగ నయ్యె నప్పు డ
య్యలవు బలంబు శౌర్యము వరాస్త్రసమృద్ధియుఁ బోలఁ జూచి వీ
రు లనఁగ వీరె యంచు నమరు ల్దనుజు ల్గొనియాడి రెంతయున్. 1986

క. ఆలోకనభీకరమై, వేలుపులకుఁ దాపసులకు విస్మయకరమై
కీలాభీలంబై యపు, డాలోకింపంగ నయ్యె నయ్యుద్ధ మొగిన్. 1987

క. వేసరక చలము డింపక, గాసిల్లక రాక్షసుండు కాకుత్థ్సవరుం
డీసున రోసంబుల నుల్లాసంబునఁ బోరి రిట్లు లా వినుమడి గాన్. 1988

వ. ఇత్తెఱంగున మహావీరులును గీర్తిమంతులును జయశీలురును సర్వాస్త్రకోవిదులు నగు మానవదానవనాథనందనులు రౌద్రతం బెనంగు నెడ సమరపరిశ్రాంతుం డై నరాధమిం బ్రవర్ధమానతేజుం డై నలక్ష్మణునిం జూచి యమ్మహారాజనందనునకుఁ బ్రియహితంబులు సంపాదించుతలంపున మహాతేజుం డగు విభీషణుండు సంగ్రామంబుగావింప సమకట్టి సచివసమన్వితుండై కలభపరివేష్టితం బైనమత్త

శుండాలంబులీల ననుకరించుచు రోదసీకుహరంబు నిండ గుణధ్వనిఁ జేసి విపుల
రోషంబునఁ జిచ్చఱపిడుగులం బోనినిశితవిశిఖంబులు సాంద్రంబుగాఁ బరఁ
గించిన నవి వైశ్వానరజ్వాలలు కాఱడవిఁ దహించుచందంబున రాక్షససైన్యం
బుల దహింపం దొడంగె నప్పు డతనిప్రాపునం బన్ని తదనుచరులు శూలాసి
పట్టిసకూటముద్గరగదాపరిఘంబులు ప్రయోగించి దనుజబలంబుల నేలకుం
గోలకుం దెచ్చి రిట్లు విభీషణుండు మంత్రులుం దానును నలిరేఁగి యాతుధా
నుల నుగ్గునూచంబు చేసి వానరుల నవలోకించి యి ట్లనియె. 1989

చ. వనచరులార రాత్రిచరవర్యునిజీవిత మన్న దోర్బలం
బనిన నితండె యీఖలనిశాటుఁడు చచ్చినఁ బంక్తికంధరుం
డని మొన రామబాణనిచయంబులఁ జచ్చినవాఁడు గావునన్
ఘనభుజు లందఱొక్కమొగిఁ గ్రమ్మి వధింపుఁడు వీని నుద్ధతిన్. 1990

సీ. కుంభనికుంభులు కుంభకర్ణుఁడు ప్రహస్తుఁడు వజ్రదంష్ట్రుఁడు ధూమ్రనయనుఁ
డలజంబుమాలి మహామాలియును నిఘ్నుఁ డశనిప్రభుండు సంహ్రాది వికటుఁ
డగ్నికేతుండును యజ్ఞకోపుండు సుప్తఘ్నుం డకంపనప్రఘసతపన
తరణిశత్రులు మహోదరమహాపార్శ్వప్రఘసకప్రజంఘాతికాయభాస

తే. కర్ణదేవాంతకనరాంతకద్విజిహ్వ, లావిరూపాక్షయూపాక్షయజ్ఞశత్రు
లాదిగాఁ గలదైత్యబలాధినాథు, లందఱును ఘోరగతిఁ గూలి రాలమందు.

క. పంతము మీఱి రణార్ణవ, మంతయు దాఁటితిరి మీర లటు గోష్పదకం
బంతకడఁ జిక్కె నీతని, నంతము నొందించి దాఁటుఁ డాశేషంబున్. 1992

క. మగఁటిమి మీఱఁగ మనతో, జగడమునకు వచ్చినట్టి సాహసు లెల్లం
దెగటారి రితఁడు మడిసిన, నగచరవరులార మనమనగపీడ దెగున్. 1993

క. పినతండ్రి నైననా కిటు, తనయునిఁ జంపంగఁ దగదు దాఁ జంపిన నొ
క్కనిచే రణమునఁ జంపించిన భువి నీరెండు సరియె చింతింపంగన్. 1994

తే. దురిత మైనను గానిమ్ము పరమహితము, రామకార్యార్థ మిది గాన భీమవర్యుఁ
డైనసౌమిత్రిచే వీని నద్భుతముగఁ, గలనఁ జంపింతు మాయలు గెలువ నింక.

క. వానరు లందఱుఁ దలపడి, నానావిధతరుల శిలల నఖదంతములన్
వీనిసహచరుల నందఱఁ, బూని వధింపుఁడు సమగ్రభుజబల మలరన్. 1996

వ. అని పలికిన విభీషణప్రేరితు లై వానరు లందఱు విలయపవనప్రేరితమేఘంబుల
పగిది విజృంభించి మేఘంబులం జూచిన మయూరంబులభంగి భూనభోంతరంబు
నిండ సింహనాదంబులు చేయుచు లాంగూలంబులు ద్రిప్పుచు మదగజేంద్రం
బులపై కుఱుకుకొదమసింగంబులమాడ్కి రాక్షసులమీఁది కురవణించి సాం
ద్రంబుగా శిలాపాదపవర్షంబులు గురియుచు విక్రమించిన నయ్యాతుధానులు
కోపించి భయంబు విడిచి గదాపరిఘపట్టిసప్రాసకరవాలభిండివాలశక్తితోమర

పాణు లై వారలం దలపడిన నయ్యిరుగెడలవారికి దేవాసురులకుంబోలె
ఘోరం బగుసంగ్రామం బయ్యె నప్పుడు భల్లూకనాథుం డగుజాంబవంతుండు
నిజబలంబులఁ బురికొల్పి తానును రాక్షసబలంబు సొచ్చి కాలమేఘంబు కర
కాశనివర్షంబు గురియుచందంబున నీరంధ్రంబుగా శిలావర్షంబు గురియుచు
నఖదంతంబుల వ్రచ్చుచు బహుప్రకారంబుల రూపుమాపం దొడంగిన నద్దా
నవు లావరాక్రమధుర్యుం బొదివి నీలజీమూతంబు మహాచలంబుమీఁద జడి
వాన గురియుపోల్కి నానాస్త్రశస్త్రవర్షంబుఁ బరఁగించి వెనుదీయక యేపునం
బెనంగుచుండి రిత్తెఱంగాలోకించి మరున్నందనుండు లక్ష్మణుని డించి యొక
విశాలసాలం బుత్పాటించి తెచ్చి యొక్కొక్క వ్రేటున ననేకరాక్షసుల నేలం
గూల్చుచు విక్రమవిహారంబు సలిపె విభీషణుండును మంత్రులుం దానును నలి
రేఁగి వివిధాస్త్రశస్త్రంబుల దనుజులఁ బెక్కండ్రఁ బాఱి సమరు చుండె నక్కల
కలం బాలకించి యింద్రజిత్తు కోపించి బ్రహ్మాండభాండంబు వగుల ధనుష్టం
కారంబు గావించి వజ్రాశనిసమప్రభంబు లైననారాచంబులు విభీషణుని
మీఁదం బ్రయోగించిన నవి యతనిశరీరంబు భేదించి ధరణి గాఁడిన నది దండ
తాడితం బైనకుంభంబుపగిది పగిలి వ్రయ్యలయ్యె నప్పు డతనియాటోపంబుఁ
జూచి సహింపక లక్ష్మణుం డెప్పటియట్ల హనుమంతు నెక్కి యింద్రజిత్తుం దల
పడిన నవ్వీరశిఖామణుల కనన్యసాధారణం బైనరణం బయ్యె నంత. 1997

ఉ. చండభుజావలేపమున సాంద్రగుణధ్వని మింటఁ బర్వఁగా
నొండొరుమీఁద నొక్కమొగి నుగ్రశరప్రకరంబు లేయుచుం
గాండతిరోహితాంగు లయి కాలఘనాంతరితౌషధీశమా
ర్తాండులభంగిఁ గన్పడక దారుణభంగిఁ బెనంగి రిద్దఱున్. 1998

మ. శరసంధానమునుం బ్రమోక్షము ధనుస్సవ్యాపసవ్యక్రమం
బురుముష్టిప్రతిబంధనంబు గుణసంయోగంబు లక్ష్యోప్తియుం
గర మాదానము విగ్రహంబును సమాకర్షంబుఁ గన్పట్టకుం
డ రహిం బోరిరి పాణిలాఘవమునన్ మాఱొడ్డి చిత్రంబుగన్. 1999

తే. చాపవేగప్రముక్తవిశాలబాణ, జాలములచే నభంబు సంఛన్న మగుచు
నుండఁ దద్గతవిమలగ్రహోడువితతు, లెవ్వియును జూడఁబడవయ్యె నెట్టిరణము.

తే. రాజసుతుతోడ మార్కొన రావణికిని, రావణి నెదిర్చి పోరాడ రాజసుతున
కగునుగా కమ్మహాత్ముల నలమ నొరుల,కలవియే యని కొనియాడిరమరు లపుడు.

క. అతులితశరబాహాహం,కృతిఁ బోరెడువారిఁ జూచి యితఁడు గెలుచు నేఁ
డితఁ డోడు నని యథార్థ, స్థితి నూహింపంగ లేక చిక్కిరి వేల్పుల్. 2002

చ. సమకొని వార లిర్వురు ప్రచండగతిం బరఁగించు శాతకాం
డము లతిసాంద్రభంగి గగనంబును దిక్కులు నిండఁ బర్వ న

య్యమవసనాఁటిరాత్రి యసితాభ్రము గ్రమ్మినవేళఁ బుట్టునం
తమసమువోలె ఘోరముగఁ దత్సమయంబునఁ గ్రమ్మెఁ జీఁకటుల్. 2003

ఆ. అంతలోనె సూర్యుఁ డస్తమించె రణాంగ,ణమునఁ బాఱురక్తనదులకాంతి
మింటఁ బర్వి కెంపుమించెనో యనుమాడ్కిఁ,బరమదారుణముగఁ బరఁగె సంధ్య.

సీ. కాంక్ష దీరఁగ మాంసఖండజాలము మెక్కి లీలమై నాడు బేతాళరవము
పునుకలో మెదడు గైకొని తిని సొక్కెడు కూశ్మాండగణములఘోషణంబు
కడుపులు నిండ రక్తము ద్రావి దిరుగు భీకరజంబుకంబుల కలకలంబు
మస్తిష్కము భుజించి మలయుకంకోలూకకాకగృధ్రములభీకరనినాద

తే. మొక్కలై భీమగతి మ్రోసె నుర్వి నిండ
వాయువులు వీవ నోడె వైశ్వానరుండు
వెలుఁగఁ డయ్యె నక్షత్రము ల్వెలుఁగుఁ జూప
వెఱచె విలయకాలమునాఁటివిధము దోఁచె. 2005

క. ఆయుత్పాతము గని నిర,పాయులు పరమర్షు లెల్ల భ్రాంతహృదయులై
పాయక గోబ్రాహ్మణులకు, శ్రేయం బగుఁగాక యని పచించిరి వరుసన్. 2006

ఉ. ఆరభసంబుఁ జూచి గరుడామరకిన్నరసిద్ధసాధ్యయ
క్షోరగగుహ్యకాదులు భయోద్ధతి నచ్చటి కేగుదెంచి యా
వీరవరేణ్యు లక్ష్మణుని వేయువిధంబుల సన్నుతించి యీ
ఘోరనిశాటుఁ ద్రుంపు మని గొబ్బున దీవన లిచ్చి రయ్యెడన్. 2007

ఉ. అంత రఘుప్రవీరుఁడు మహాభుజవీర్యుఁడు లక్ష్మణుండు కా
లాంతకుమాడ్కి బిట్టలిగి యద్భుతఘోరగుణాస్వనంబు రో
దోంతర మెల్ల నిండ నిశితాయుధము ల్వరఁగించి వానరు
ల్సంతస మందఁ దత్తనువు జల్లెడకంతలు చేసి వెండియున్. 2008

క. దక్షతఁ బదిబాణంబుల, వక్షము పగులంగ నేసె వదలక విలస
త్పృథూర్ధచంద్రశరమున, రక్షఃపతిసుతునివిల్లు గ్రక్కునఁ దునిమెన్. 2009

ఆ. మఱియు నొక్కఘోరమార్గణంబున వాని, పడగ నేలఁ గూల్చి పటునిశాత
శరచతుష్టయమున హరిచతుష్టయమును, వికల మొందఁ జేసి వేగ మడర. 2010

ఉ. పాయక యొక్కదారుణసుపర్వసుపత్రసుపుంఖశాతపూ
ర్ణాయతము క్తనిర్జరవరాయుధసన్నిభ కాలదండక
ల్పాయతభానుభానుతులితాగ్నిశిఖోపమ కాంచనోల్లస
త్సాయక మేసి వాని రథసారథిశీర్షము ద్రుంచె నుద్ధతిన్. 2011

వ. ఇట్లు వినిహతసారథియు విశకలితకేతనుండును వికలసాధనుండు నై యయ్యాఖండ
లరిపుండు తానె సారథ్యంబుసేయుచు వేఱొక్కమహోద్దండకోదండంబు గొని
గుణధ్వనిఁ జేసి నిరంతరంబుగా శరంబులు గురియుచుఁ జూపఱ కద్భుతసామ

ర్థ్యంబుఁ జూపుచుం గవిసిన నాలక్ష్మణుండు వానియాటోపంబుఁ జూచి సహింప
పక కోపించి వాఁడి నారసంబు లదరంట నేసిన నద్దనుజశేఖరుండయ్యమోఘశ
రంబుల నొచ్చి యంతలోన లబ్ధసంజ్ఞుం డై నసారథిం దలంచుకొనిచింతించి వేఁ
డినిట్టూర్పులు పుచ్చుచుఁ జాపంబు సారింప శరంబు సంధింప శక్తుండు గాక
లక్ష్మణుం దేఱిచూడం జాలక విషణ్ణవదనుం డై యూరకున్న నతనిముఖలక్షణం
బుపలక్షించి వానరు లందఱు పరమసంహృష్టు లై లక్ష్మణుం బ్రశంసించి రంత
బ్రమాథియురభసుండునుశరభుండునుగంధమాదనుండునువీరావేశంబునంగవిసి
శైలశృంగంబులు రావణిరథంబుపై వైచిన నది మథితాష్టతురంగమం బై భగ్నా
క్షకూబరం బై విశకలితకేతనాతపత్రచక్రం బై ధరణింగూలె నిట్లురథంబు నుగ్గు
నూచంబుఁ జేసి యవ్వానరోత్తములు నల్వురు గ్రమ్మఱ లక్ష్మణుని పాలికిం జనుదెం
చి తత్పార్శ్వంబునం గొలిచి యుండిరి యిట్లు తనరథంబు భగ్నం బై కూలినవిర
థుం డై లాఘవంబునఁ బుడమికిం దాఁటి పదాతి యై కోపంబు రెట్టింపఁ బాలివోని
బంటుతనంబునఁ బుంఖానుపుంఖంబులుగా శరంబులు పరఁగించుచు మార్కొ
నిన నద్దశరథరాజనందనుండు సంక్రుద్ధుం డై శరాసారఘోరంబుగాఁ గవిసిన
నమ్మహావీరులు పరస్పరజయకాంక్ష లినుమడింప మత్తగజంబులచాడ్పునం దల
పడి ఛిద్రంబు లన్వేషించుచు రౌద్రంబునం బెనంగు నెడఁ దత్పార్శ్వంబుల
నలిరేఁగి రాక్షసులు వానరులు భీమప్రకారంబున మార్కొని మహారభసంబున
ఘోరప్రకారంబునఁ బెనఁకువకుం జొచ్చిన సందడికయ్యం బయ్యె నప్పు డాసం
దున నెడగని రావణనందనుండు రాక్షసుల కి ట్లనియె. 2012

సీ. కలయంగ బెరసిన కటికిచీఁకటులచే దిక్కు లన్నియుఁ జాలఁ దెల్వి దప్పెఁ
దనవారు నెదిరివా రని తెలియఁగ లేక భ్రమగొని యున్నారు ప్లవగవరులు
వీరల వంచించి వెస నేను బురి కేగి రథ మెక్కి వచ్చెద రణ మొనర్ప
నావచ్చునందాఁక నావార్త వానరు లెఱుఁగకుండఁగఁ బోరుఁ డేపు మెఱసి

తే. యేను బురి కేగుటయు మది నెఱిఁగి రేని, యీదురాత్ములు వానరు లెట్టు లైన
నతిమి పోనీక పెనఁగుదు రట్లు గాన, స్వస్థచిత్తు లై కయ్యంబు సలుపవలయు.

క. అని పలికి రాక్షసేశ్వర, తనయుఁడు తనపనికి యాతుధానుల నిడి కా
ననచరవీరుల సందడిఁ, గనుమఱపి నిశాటపురికి గ్రక్కున నరిగెన్. 2014

చ. అరిగి సువర్ణకేతనసమంచితనూత్నయుగాక్షచక్రకూ
బరపరికీలితంబు ప్రతిబద్ధజవాశ్వము సర్వశస్త్రసం
భరితము కాంచనాభరణభాసిత మశ్వగతిజ్ఞసూతశే
ఖరసహితంబు నై నగిరికల్పశతాంగము నెక్కి చెచ్చెరన్. 2015

ఉ. దానవయోధముఖ్యులు ప్రతాప మెలర్పఁగఁ దన్నుఁ గొల్వ న
ద్దానవనాథనందనుఁడు తప్పక గ్రమ్మఱ యుద్ధభూమికిన్

మానుగ వచ్చు వాని లఘిమ న్గని వానరు లావిభీషణుం
డా నృపనందనుండు హృదయంబున విస్మయ మంది రయ్యెడన్. 2016

ఉ. అంత దశాస్యపుత్త్రుఁడు దురంతకృతాంతబలాభిభూతుఁడై
పంత మెలర్పఁ గార్ముకము బాగుగ సజ్యముఁ జేసి శౌర్య మం
తంతకు మీఱ సాయకసహస్రము లేసి వనాటసైన్య మిం
తింతలు తున్కలై వెస మహీస్థలిఁ గూలఁగఁ జేసి బల్విడిన్. 2017

ఉ. వెండియు మండలీకృతనవీనశరాసనుఁడై మహోద్ధతిం
జండశిలీముఖంబు లతిసాంద్రముగాఁ బరఁగించి వేసవి
న్జండకరుండు తీవ్రకిరణంబుల నల్పజలాశయంబు ను
ద్దండత నింకఁ జేసినవిధంబునఁ గీశతతిం గలంచినన్. 2018

తే. వికటమారారిమూర్తియై విక్రమించు, వానికోల్తల కోర్వక వానరాళి
నొచ్చి సౌమిత్త్రిశరణంబుఁ జొచ్చెనపుడు, భయముదీపింపఁ బ్రజప్రజాపతినిఁబోలె.

క. ఆరఘువర్యుఁడు వానర, వీరుల కభయంబుఁ దెల్పి వేగం బడరన్
భూరికరలాఘవంబున, సారాంబక మేసి వానిచాపము ద్రుంచెన్. 2020

క. అతఁ డొండొకకోదండము, చతురతఁ గైకొనిన దానిఁ జయ్యన బాణ
త్రితయమునఁ దునిమె మఱియొక, వితతధనువు గొనిన దానివిసువక దునిమెన్.

తే. తునిమి తోడ్తోడఁ గ్రొవ్వాఁడితూపు లేసి, కత్తళము సించి పదపడి కాలఫణిస
మానశరపంచకంబున వానిగాత్ర, ముచ్చిపో నేసె వేల్పులు మెచ్చి పొగడ.

క. సౌమిత్త్రికార్ముకస్రుత, భీమశరము లతనిమేను భేదించి వడిన్
వ్యోమమున కెగసి వెంటనె, భూమిం బడె రక్తగాత్ర భోగులమాడ్కిన్. 2023

చ. విడువక యింద్రజిత్తు రఘువీరవరాంబకభిన్నవర్ముఁడై
కడువడి నోట శోణితము గ్రక్కుచు వేఱొకవిల్లు దాల్చి బి
ట్టడరి కులాద్రిమీఁద విలయాభ్రము వర్షము గుమ్మరించుకై
వడి రఘువర్యుమీఁద శరవర్ష మొగిం గురియించె నుద్ధతిన్. 2024

తే. అర్కుఁ డాత్మీయకరముల నవిరళముగ, నెఱసికొని యున్నచీఁకటి విరియఁజేసి
నట్లు దశరథసుతుఁడు నిజాంబకముల, రాక్షసోత్సృష్టబాణవర్షంబు మాన్చె.

ఆ. మంచు విరియఁ జేసి మహిత తేజంబునఁ, గ్రాలుభానుగతి విరాజమానుఁ
డగుచు వైరిమీఁద నవిరళశరవృష్టి, గురిసి విస్మయంబు వఱలఁ జేసె. 2026

క. సురవైరి మేన నాఁటిన, శరములు రఘువీరువింటి శరము లొకటియై
పరికింపఁ ద్రాళ్ళు వెనఁచిన, కరణిం జూపట్టె నడిమి కాండము లెల్లన్. 2027

క. ఒక్కొకని మూఁడుశరములఁ, దక్కినరక్కసుల నెల్లఁ దద్దయుఁ గినుకన్
స్రుక్కించి సురల రావణి, నక్కజముగఁ బెక్కుఁగఱకుటమ్ముల నొంచెన్,

ఆ. శత్రుతాపి యైనసౌమిత్రిచే నిట్లు, హన్యమానుఁ డగుచు నసురవరుఁడు
కనుల నిప్పు లురలఁ గాకుత్స్థవంశాగ్ర,గణ్యు ఘోరసాయకములఁ గప్పె. 2029

ఉ. దానికి నల్గి రాఘవుఁడు దారుణశాతశిలీముఖంబులం
దానవముక్తకాండములఁ దట్టి వడిం గరలాఘవంబున
న్మానక సూతుఁ జంపినఁ గ్రమంబున వాజు లవిక్లబంబులై
పూని రథంబు మోఁచికొని పూర్వగతి న్విహరించె నేర్పునన్. 2030

ఆ. ఆవిధంబుఁ జూడ నద్భుతం బయ్యె సౌ,మిత్రి యంతఁ గనలి మిహిరకిరణ
తులితసాయకములఁ దోడ్తోడ వేగంబు, నివ్వటిల్ల హారుల నొవ్వఁ జేసె. 2031

క. రాఘవునిభూరికరశర,లాఘవ మది చూచి కనలి రాక్షసవర్యుం
డాఘోషం బడర దశా,మోఘశరము లేసె వక్షముం దాఁకంగన్. 2032

ఆ. వానివజ్రతుల్యవాసుకిసన్నిభ, సాయకములు పవనసమరయమున
నేగి రఘువరేణ్యు హేమవర్మము దాఁకి, మిడుఁగుఱులు సెలంగ మిట్టిపడియె.

ఉ. అంతటఁ బోక వాఁడు విలయాగ్నివిధంబునఁ బేర్చి యార్చి కా
లాంతకదండకల్పనిశితాంబకము ల్వేన మూఁడు గూర్చి య
త్యంతరయంబునం గుణరవార్భటి వింటఁ జెలంగ నమ్మహీ
కాంతకుమారుఫాలఫలకం బొగి నాటఁగ నేసె నుద్ధతిన్. 2034

తే. ఘనలలాటస్థపటుసాయకత్రయమున, నమ్మహారాజసుతుఁడు రణాగ్రమందుఁ
జాల శోభిల్లె నపుడు లసత్త్రిశృంగ,కలిత మైనసుమేరునగంబుకరణి. 2035

తే. రాజసుతుఁ డిట్లు రాక్షసరాజతనయ, బాణవిద్ధుఁ డై కోపంబు ప్రజ్వరిల్ల
ధనువు సారించి వానివక్త్రంబుమీఁద, విశిఖపంచక మడరించి వెగడుపఱచె.

న. ఇట్లు మహాబలశరాసనులును సముద్యతాయుధులును మహావీరులును భీమపరాక్రములును బ్రచండవేగులును నగురాజనందనరావణనందనులు పరస్పరజయాభిలాషలం గవిసి నిశితాగ్రంబు లగుఘోరనారాచంబు లొండొరులమీఁదం బరగించుచు శోణితదిగ్ధాంగులై పుష్పితాశోకకింశుకంబులచందంబునం దేజరిల్లుచుండి రప్పుడు సమరకోపసంయుక్తుండై రావణాత్మజుండు సౌమిత్రితోడం బోరుచు నెడగని మూఁడువాఁడితూపులు విభీషణువదనంబు గాఁడ నేసి వెండియు లాఘవంబున నయోముఖంబులై నభల్లంబులు పరఁగించి యొక్కొక్కశరంబున నొక్కొక్కవానరుం గూలనేసి వానరుల నందఱ బడలుపడంజేయుచు విజృంభించిన నతనిభుజాటోపంబున కలిగి విభీషణుండు గదగొని సాహసంబున వాని రథంబుపైకి లంఘించి హయంబులం జదియ మోఁదిన నతండు హతాశ్వసూతుండై పుడమికి దాఁటి కోపాటోపంబున. 2037

క. మదమున రథశక్తిం గొని, వదలక పినతండ్రిమీఁద వైచిన దానిం
జదలఁ గని రాముతమ్ముఁడు, పదితునుకలు సేసె నడుమఁ బటుభల్లములన్.

చ. అలిగి విభీషణుండు చలమారఁగ నైదు శితాంబకంబు లా
బలభిదరాతినాథసుతుపై నిగిడించినఁ దచ్ఛరంబు లా
ఖలునియురంబు దూఱి చులుకన్వెస వీఁపున నిర్గమించి శో
భిలె నతిలోహితావయవభీషణభోగులమాడ్కి నెంతయున్. 2039

క. రావణి యప్పుడు కన్నులఁ, బావకశిఖ లుప్పతిల్లఁ బటుగుణరవము
న్గావించి పితృవ్యునిపైఁ, జీవము గొనునట్టిఘోరశితశర మేసెన్. 2040

క. తడయక దశరథతనయుఁడు, కడువడిఁ బఱతెంచుదానిఁ గాంచి రయమునం
బిడుగులకెన యగుతూపుల, నడుమనె ఖండించి వైచె నాకులు మెచ్చన్. 2041

వ. అంత. 2042

ఉ. రావణనందనుం డలిగి రాక్షసు లందఱు మెచ్చి చూడ నెం
తే వడి శింజినీస్వనము దిక్కులు నిండఁగఁ జేసి వీఁకతో
వావిరిఁ గాలుఁ డిచ్చినయవార్యశరం బరిఁబోసి వీరసం
భావితుఁ డైనలక్ష్మణునిపై నిగిడించెఁ బ్రచండవైఖరిన్. 2043

ఉ. దాని తెఱంగుఁ జూచి వసుధావరపుత్త్రుఁడు మున్ను స్వప్నమం
దానరవాహనుం డొసఁగినట్టిసురాసురలోకదుస్సహం
బైనయమోఘబాణము రయంబున వింట ఘటించి శింజినీ
ధ్వానము మీఱ దేవపతివైరిపయిం బరఁగించె నుద్ధతిన్. 2044

వ. ఇట్లమ్మహనీయాస్త్రంబులు రెండును పరిఘోపమబాహుపూర్ణాకృష్టవిసృష్టం
బులై ప్రచండతేజంబునవెలుంగుచుఁ గ్రౌంచంబులపగిదివిరావంబులు సేయుచు
వైశ్వానరజ్వాలలభంగి నింగి వెలుంగం జేయుచు భయంకరప్రకారంబున
గగనంబున ముఖాముఖి నొండొంటిం దాఁకి పరస్పరసంఘట్టనంబునం బుట్టిన
సధూమవిస్ఫులింగపావకజ్వాలలు భూనభోంతరంబునిండ మహాగ్రహంబులపో
ల్కి దారుణంబుగాఁ బోరిపోరి యన్యోన్యతేజఃప్రదహ్యమానంబులై పుడమిం
బడియె నిట్లు ప్రతిహతంబులైనశరంబుల విలోకించి దశరథనందనులు వ్రీళితులై
యొక్కింతసేపూరకుండి వెండియుఁ జాతరోషులై రౌద్రప్రకారంబునరణంబు
గావించుచు. 2045

శా. వీరగ్రామణి లక్ష్మణుండు పటుదోర్వీర్యంబు దీపింప నే
పార న్రావణిమీఁద వారుణశరం బత్యుగ్రుఁ డై యేసినం
గ్రూరాత్ముం డగురాక్షసుండు మదిలోఁ గోపించి రౌద్రాస్త్రము
న్ఘోరప్రక్రియ నేసి దాని నడుమన్ దున్మాడె సత్యుద్ధతిన్. 2046

ఉ. రావణి యల్గి తీవ్రతరరావము లేర్పడ సర్వలోకము
ల్దేవత లార్తి నొందఁ బటుదీప్తహుతాశనబాణ మేసిన
న్భూవరనందనుం డపుడు భూరిభుజావిభవాభిరంజితుం
డై వడి సౌరబాణమున నయ్యనలాస్త్రముఁ ద్రుంచె వ్రేల్మిడిన్ 2047

శా. ఆరక్షఃపతినందనుం డపుడు ఘోరాకారుఁడై పేర్చి మా
ర్వీరావంబు చెలంగ సర్వజగము ల్భీతిల్లి కంపింప దే
వారాతు ల్వినుతింప వాయుశర మేయుం దాని ఖండించె నే
పార న్లక్ష్మణుఁ డాకపు ల్వొగడ నైంద్రాస్త్రప్రయోగంబునన్. 2048

మ. దనుజాధీశకుమారుఁ డప్పు డురగాస్త్రం బేసినం జూచి రా
మనరేంద్రావరజుండు వేల్పు లనుతింపం గారుడాస్త్రంబు నే
సిన నారెండును మింటఁ దాఁకొని బలశ్రీమీఱఁ గాఁ బోరి గ్ర
ద్దన నన్యోన్యవధంబులై ధరణిమీఁదం గూలె నత్యుగ్రగతిన్. 2049

తే. ఇటుల నవ్వీరశేఖరు లిరువు రుగ్ర, మహితలై నాహసంబున మొనసి యస్త్ర
సమరమొనరించునప్పుడేచాయఁ గన్నఁ, బ్రళయకాలంబునాఁటి తెఱంగుదోఁచె.

క. ద్యోవీథి నున్నమారులు, దేవతలారథములు గ్రద్దీజకు నొగి నం
భావించుచు దీవించుచు, సేవించిరి సమరవిజయసిద్ధి దలఁచుచున్. 2051

ఉ. అప్పుడు దైత్యవర్యుఁడు నృపాస్త్రనివారితమైన బాణము
ద్దప్పక చూచి యల్గి భుజదర్ప మెఁకొన్నటి కంచుఁ గన్నులన్
నిప్పులు రాలఁ దీవ్రగతి నేర్పున వింట నుహాసురాస్త్రముం
దప్పక కూర్చి యేసె వితతంబుగ మంటలు మింటఁ బర్వఁగన్. 2052

మ. దనుజుం డిట్లు సమగ్రశక్తి నసురాస్త్రంబు న్బ్రయోగింపఁ జ
య్యన నయ్యస్త్రమహాత్త్వ మెట్టిదొ యసంఖ్యాతంబులై శూలముల్
ఘనచక్రాసిపరశ్వధంబులు గదల్ ప్రాసంబులున్ శక్తులుం
దనికాయంబులు పుట్టి యాకసము నిండం బర్వె ఘోరంబుగన్. 2053

క. ఆయుత్పాతము గనుఁగొని, పాయక దేవతలు మునులు భయమున నధిక
శ్రీయుతుఁ డగుసౌమిత్రి క, పాయము రానీకు మండ్రు పోడిమి బ్రోచి రనిన్ 2054

మ. అసురాధీశకుమారబాహుగళితంబై ఘోరమై తీక్ష్ణమై
యసిచక్రాదికగర్భమై సకలభూతావార్యమై మాగితం
బన మీఱ న్నభసనాతివేగమున శుంభల్లీల నేతెంచున
య్యసురాస్త్రంబును జూచి లక్ష్మణుఁడు తీవ్రాటోపసంరంభియై. 2055

చ. అలిగి మహేశ్వరాస్త్రము రయంబున నేసిన నమ్మహాస్త్రము
జ్జ్వలదినుఁ డాత్మతేజమున సాంద్రతమంబు నడంచుకైవడిం
దలకొని దానవాస్త్రమును దప్పక దగ్ధముఁ జేసి సత్త్రము
న్గలయ దహించినట్టిశిఖకైవడి శాంతి వహించె నంతయున్. 2056

—ఇంద్రజిత్తు లక్ష్మణునిచేఁ జచ్చుట.—

వ. ఇట్లమిత్రబలమర్దనుం డగులక్ష్మణుండు మాహేశ్వరాస్త్రంబున నసురాస్త్రంబు
నవలీల రూపుమాపి యంత నిలువక యంతకుభంగి నంతంత కధికరౌద్రుండై

యింద్రజిత్తుం జూచి ప్రచండకోదండగుణప్రణాదంబు రోదసీభాగంబు నిండం బూరించి కోపంబుఁ బెంచి సింహనాదంబు గావించి తొల్లి దేవాసురయుద్ధంబునందు మహాతేజుం డగుపురందరుం డెద్దానివలన దానవుల జయించె నట్టిహుతాశనసమస్పర్శంబును రాక్షసవినాశనోచితంబును బత్త్రశోభితంబును సుసంస్థితాంగంబును సుపర్వంబును సువర్ణాలంకృతంబును వీరశరీరాంతకరంబును దురావారంబును దుర్విషహంబును సర్వలోకభయావహంబును నాశీవిషప్రఖ్యంబును సర్వదేవనమస్కృతంబును నమిత్రమథనక్షమంబును నజిహ్మగంబును నప్రతిహతంబును ననంతబలంబు నగునైంద్రాస్త్రంబు గొని సచరాచరంబు లగులోకంబులు భయంబున నాకంపింప మహీచక్రంబు చలింప దిక్కులుఁ బీఁటలువాఱ దివాకరుండు మందరశ్మి గాఁగ సురగరుడోరగగంధర్వపరమర్షిసిద్ధవిద్యాధరాదులు గగనంబునం బన్ని సంభ్రాంతహృదయులై రావణి న్జయింపుమని పలుక సమంత్రకంబుగా శరాసనంబునందు సంధించి యాకర్ణపూర్ణంబుగా నాకర్షించి లక్ష్మీవంతుం డగులక్ష్మణుండు కార్యసాధనం బగువాక్యంబున ని ట్లనియె 2057

చ. అతులితభంగి రాఘవనృపాగ్రణి ధార్మికుఁ డేని సత్యసు
వ్రతుఁ డగునేని లోకగణరంజనుఁ డేని సుపర్వకోటికిన్
హితుఁ డగునేని నిక్కముగ నీశరరాజము నేఁడు రావణిం
జతురతఁ జంపుఁ గాక సురసాధ్యమహామునిసాక్షికంబుగన్. 2058

క. అని పలికి లక్ష్మణుఁడు చ,య్యన నాకర్షించి యమ్మహాస్త్రము నసురేం
ద్రునిమీఁద విడిచె శక్రుఁడు, మును జంభునిమీఁద వజ్రమును బోలె రహిన్.

సీ. కల్పాంతకాలసంకర్షణానలశిఖామాలికాజాజ్వల్యమాన మగుచుఁ
బ్రళయకాలోదగ్రభాస్కరతిగ్మమరీచికాగణదుర్నిరీక్ష మగుచుఁ
గాలజీమూతసంఘాతనిర్గతమహానిర్ఘాతతులితోగ్రనినద మగుచుఁ
బ్రబలమహీధరోత్పాటనక్షమమహావిలయఝంఝూవాతవేగ మగుచు

తే. నంబరమ్మున న ట్లెగి యమ్మహాస్త్ర, మెల్లవారలు చూడ నహీనరత్న
ఖచితకుండలకోటీరకలిత మైన, జంభసూదనరిపునిమస్తకము ద్రుంచె. 2060

క. అపు డారాత్రించరసై,న్యపతివిపులశిరము శోణితౌఘోక్షిత మై
తపనీయకందుకముక్రియ, క్షపాచరులు చూచి యేడ్వఁ గహ్వరి డొల్లెన్. 2601

క. సతనుత్రాణము నారో, పితచాపము రత్నఖచితపృథులాభరణ
ద్యుతియుత మగుతత్కాయము, క్షితిజముచందాన నపుడు క్షితిపైఁ గూలెన్.

ఆ. వానిపాటుఁ జూచి వనచరు లందఱు, హర్షకలితు లగుచు నలబలుండు
పుడమిఁ బడినఁ జూచి పొంగువేల్పులభంగి, సింహనిస్వనములు సేసి రపుడు.

ఆ. అంత నంతరిక్షమందు గంధర్వదే,వర్షిసిద్ధసాధ్యవసుభుజంగ
యక్షగరుడచారణాప్సరోజనహర్ష, నిస్వనంబు దిశలు నిండి చెలఁగె. 2064

క. ప్రముదితమానసులై యపు, డమరులు గగనమున నుండి యారఘుకులన

త్తము వేనోళ్ల నుతించుచుఁ, గొమరారఁగఁ బుష్పవృష్టిఁ గురిసిరి వేడ్కన్. 2065

క. సురతటినీజలశీకర, పరిషిక్తతదీయకమలపరిమళలహరీ
పరికలితుఁడై రఘూత్తము, పరిశ్రమము వాయ నపుడు పవనుఁడు విసరెన్.

క. పాడిరి గంధర్వులు గొని, యాడిరి పరమర్షి చారణాదులు దివిపై
నాడిరి దివ్యాప్సరసలు, తోడనె మ్రోయించి రమరదుందుభులు రహిన్. 2067

క. విగతవ్యథంబులై సమ్యగలంకృతమందిరంబులై భవ్యములై
నిగదితశుభకథనములై, జగములు శోభిల్లె నపుడు సమ్మోదమునన్. 2068

మ. దురితాత్ముం డగురావణాత్మజునిచే దూరీకృతస్వార్జితా
ధ్వరులై గొందుల డాఁగి దిక్కఱి మహాదైన్యంబుతో నున్నయీ
పరమర్షిప్రభు లింక నాత్మతపము ల్పాలించుచుఁ హృష్టులై
చరియింపం గల రంచుఁ బల్కిరి దివి న్సాధ్యోరగు ల్దేవతల్. 2069

మ. తను మున్నాజి జయించినట్టిఖలుఁ డుద్యద్బాహువీర్యుండు దు
ష్టనిశాటుండు దశాస్యపుత్త్రుఁ డనిలో క్ష్మానాథపుత్త్రప్రయు
క్తనిశాతాస్త్రవిలూనకంఠుఁ డగుచుం ధాత్రీస్థలిం గూలినం
గని యానందము నొందె శక్రుఁడు మరుద్గంధర్వయుక్తంబుగన్. 2070

ఉ. మించినవేడ్కతో సురలు మింటను దుందుభు లొక్కరీతి వా
యించిరి పుష్పవృష్టి గురియించిరి పెక్కుతెఱంగుల న్నెనో
దించిరి రాజపుత్త్రు వినుతించిరి నిర్జరవారకాంత ల
భ్యంచితభంగి నాడిరి జయాంకముఁ బాడిరి వీడి రాపదల్. 2071

సీ. నీరధు లన్నియు నిర్మలాంబువు లయ్యె దిక్కు లన్నియుఁ జాలఁ దెల్వి నొందె
గగనంబు గ్రహతారకాయుక్తమై యొప్పె సుస్థిర యై ధాత్రి చూడ నయ్యె
మేదురస్వనములై మేఘంబు లొప్పారె విగతార్తిబహుళమై జగము దనరెఁ
బుష్పవంతంబులై పుణ్యాశ్రమము లొప్పె ఘనతరంగిణులు ప్రకాశ మొందె

తే. సురభిశీతలపవనుండు సుడిసెఁ జంద్ర, సూర్యు లెప్పటివలె భూరిశోభఁ దాల్చి
రఖిలలోకభయావహుం డగుదశాస్యు, కొడుకు సౌమిత్రిచే నాజిఁ గూలుచుండ.

క. అమరరిపుఁ డీల్గె నిఁక భూ, మ్యమరు లిఁకఁ బ్రశాంతకలితులై విజ్వరులై
యమరఁ జరింతురు గాకని, యమరగరుడసిద్ధసాధ్యు లాడిరి వరుసన్. 2073

వ. ఇట్లు దేవగణంబులు పరమోత్సవంబు సలిపి ప్రియదర్శనుండైనసౌమిత్త్రి నభి
నందించి పరమానందభరితాంతఃకరణులై దివంబునకుం జని రంత రాక్షసులు
లక్ష్మణబాధపీడితుండైనరావణి నవలోకించి జితకాశు లగువానరులచేత వధ్య
మానులై యాయుధంబులు పరిత్యజించి భయంబునం బఱచి కొందఱు లంకా
పురంబు ప్రవేశించిరి కొందఱు సముద్రంబునం బడిరి కొందఱు పర్వతగుహా
లాశ్రయించి రత్తెఱంగున సూర్యుం డస్తంగతుండైనసతనికిరణంబు లతనితోఁ
గూడ నరిగినచందంబున నింద్రజిత్తుండు హతుం డగుచుండ రాక్షసు లందఱు

దశదిశలకుం బాఱి రప్పుడు శాంతరశ్మి యైనసూర్యునికరణి నిర్వాణపావకుని
కైవడి గతజీవితుండై నిక్షిప్తసర్వాంగుండై మహాశైలంబుపగిది నేలం గూలి
యున్నశక్రజిత్తు నవలోకించి లక్ష్మణుండు గతశ్రముండై విజయలక్ష్మితోడం
గూడి నిజవిజయం బెల్లవారికిఁ దెల్లంబగునట్లు శంఖంబుపూరించి కార్ముకజ్యా
నినాదంబు గావించి సింహనాదంబుఁ జేసిన నవ్విపులనాదంబు విని వానరు
లందఱు సంప్రహృష్టచిత్తులై రయంబునం గూడుకొని విజయలక్ష్మీవిరాజమా
నుండై యున్నసౌమిత్రి నవలోకించి నమస్కరించి సాధువాక్యంబులఁ బ్రస్తు
తించిరి విభీషణుండును సంతుష్టాంతరంగుండై యమ్మహాత్మునాలోకించియాలింగ
నంబుఁ జేసి వినుతించె హనుమదంగదనీలసుషేణపనసర్షభగజగవాక్షగవయ
గంధమాదనమైందద్వివిదజాంబవత్ప్రముఖనిఖిలయూథాధిపతులందఱుఁ గ్రమం
బునం బొడసూపి శుభలక్షణసమన్వితుండై నలక్ష్మణునకుం బ్రణమిల్లి సాదరం
బుగా నాలింగనంబుఁ జేసి బహుప్రకారంబులం గొనియాడి హర్షోత్కర్షంబునం
గొందఱు గానంబు సేసిరి కొందఱు నృత్యంబు గావించిరి కొందఱు సింహ
నాదంబుచేసిరి కొంద ఱుచ్చైర్నాదంబుల లక్ష్మణువిజయంబు సాటించిరి కొం
ద ఱొండొరులం గౌఁగిలించుకొని ప్రీతిసంహృష్టసర్వాంగులై లక్ష్మణవిజయసం
శ్రితకథాప్రసంగంబునలిపిరి యిత్తెఱంగునలక్ష్మణుండు పండ్రెండవనాఁటిరాత్రి
యుద్ధంబున శక్రజేతనాహవంబునఁ దునిమి సంతోషవిశేషంబునం బొదలుచు
రుధిరక్లిన్నగాత్రుండును శరసంవృతసర్వాంగుండు నై ధాతుశోభితంబును దరు
పరివేష్టితంబు నైనహిమవత్పర్వతంబుకరణి శోభిల్లుచు నచ్చట జయస్తంభంబు
పాదుకొలిపి హనుమత్ప్రముఖవానరపరివేష్టితుండై విభీషణుం దోడ్కొని
సర్వశోభాసమన్వితుండై శీఘ్రంబున రామసుగ్రీవులపాలికిం జనుదెంచి సమర
పారవశ్యంబున విభీషణాంజనేయుల నవష్టంభించి వినయవినమితశరీరుండై రా
మునిచరణంబుల కభివందనంబు గావించి యంజలి గీలించి యిట్లనియె. 2074

మ. నరశార్దూల భవత్ప్రసాదమున విన్నాణంబుగా రావణి
స్వరబాణంబులఁ ద్రుంచి వచ్చితి నిఁకే స్వస్థుండ నై యామినీ
చరనాథుం డగుపంక్తికంఠుని ఖలు న్సంగ్రామరంగంబులో
నురుబాణంబులఁ జంపునట్టివిధముల్ యోజింపు ముద్యన్మతిన్. 2075

క. అని విన్నవింప నప్పుడు, ప్రణతుఁ డయి విభీషణుండుపరమోత్సాహం
బున ఘటితాంజలిపుటుఁ డై, యినకులవర్ధనునితోడ నిట్లని పలికెన్. 2076

తే. అధిప మీ రానతిచ్చినయట్ల భవ్య, లక్షణవిరాజితుం డగులక్ష్మణుండు
ఘోరశరముల రావణిఁ గూలవైచి, వచ్చెఁ గృతకృత్యుఁ డై శౌర్యమచ్చుపడఁగ.

క. నా విని హనుమత్ప్రముఖులు, భావంబునఁ బొంగి రామభద్రుని గని యో
దేవా లక్ష్మణుఁ డనిలో దేవారి వధించి వచ్చెఁ దేజం బెసఁగన్. 2078

సీ. అని పల్కి రిబ్బంగి నందఱు రావణివధ మెఱింగించిన వసుమతీశుఁ

దధికహర్షంబున నవ్విభీషణుఁ గొనియాడి శుభోక్తుల నద్రిచరుల
నందఱ వీక్షించి యర్హవిధంబుల మన్నించి తనమ్రోల నున్నధీరు
లక్ష్మణు నాదరోల్లాసంబునం గని యుగసన్నిభాళబాహువులు సాఁచి
తే. తిగిచి తొడమీఁద నిడుకొని మిగుల విశ్వ
సించి హర్షబాష్పంబుల శిరముఁ దడిపి
యతిమధురభాషణంబుల నాదరించి
శిరము మూర్కొని మోదంబు కరము నించి. 2079

ఇంద్రజిత్తును వధించివచ్చినలక్ష్మణుని శ్రీరాములు గారవించుట.

క. మిక్కిలి యనురాగంబునఁ, జెక్కిలి ముద్దుగొని ప్రియము చేసి చుబుకముఁ
జక్కఁగఁ బుణికి కృపారస, మక్కజముగఁ గనులఁ గురియ నంగము దడివెన్.
క. జననాయకుఁ డివ్విధమున, ననుజన్ముని గారవించి యతనిశరీరం
బున నాఁటియున్న దారుణ, సునిశితపటుసాయకములఁ జూచి మనమునన్. 2081
చ. దనుజవరేణ్యనందనవధశ్రవణప్రభవాతిమోద మ
య్యనుజశరీరలగ్ననిశితాంబకదర్శనజాతఖేదముఁ
బెనఁగొనఁ గొంత మైమఱచి నేర్పున గ్రమ్మఱఁ దెల్విఁనొంది త
మ్మునిఁ దగ గారవించి రఘుముఖ్యుఁడు సంతస మంది యిట్లనున్. 2082
ఉ. రావణనందనుం డనఁగ రాక్షసకోటికి నెల్ల మేటి బా
హావిభవాధికుండు సకలాస్త్రవిదుండు రణానివర్తి యా
దేవపతిన్ జయించి కొని తెచ్చినసాహసి యెట్టిదుర్జయు
న్నీవనిలో వధించితివి నేఁడు మహాద్భుత మయ్యె లక్ష్మణా. 2083
ఆ. దేవతలకు దిగులు దీఱె నా కెంతయు, నమ్మదంబు గలిగె సకలలోక
ములకు సేమ మయ్యె మునుల యాపద మానె, నేఁడు నీకతమున నృపకుమార.
క. యే నీఁక రావణు ననిలో, మానక వధియింతు వానిమహిమయు బలముం
మానితతేజముఁ దనయుని, తో నటు నేఁ డాజిఁ బొలిసె దుర్జనదూరా. 2085
సీ. సమరధీరుఁడు సర్వశస్త్రాస్త్రకుశలుండు దనుజుల కెల్ల నాధారభూతుఁ
డగుప్రియనందనుం డాజిలోఁ గూలుట విని సర్వకామము ల్విడిచి పంక్తి
ముఖుఁడురోషరసోగ్రమూర్తియై రయమునఁ దోడ్తోడ నెల్ల కైదువులుదాల్చి
సమరంబు గావింపఁ జనుదెంచె నేనియు సముదగ్రవజ్రోగ్రసాయకముల
తే. మహితచతురంగసేనాసమన్వితముగ
వాని ననిలోనఁ దునిమి దేవతలు మెచ్చి
చూడఁ దత్తనుత్వఙ్మాంసశోణితంబు
పూని యుపహార మిచ్చెద భూతములకు. 2086
చ. దనుజకులాధినాథునకు దర్పము వైభవము న్ప్రచండశౌ

సనమును సత్త్వసంపదయు సర్వ మతండె యతండు నేఁడు నీ
ఘనతరఘోరవజ్రనిభకాండముల న్దగి కూలెఁ బాపవ
ర్తనుఁ డగుపంక్తికంధరుని దక్షిణబాహు వడంగ నెంతయున్. 2087

శా. ఈవాతాత్మజుఁ డివ్విభీషణుఁడు నీ కెంతేని సాహాయ్యము
న్గావింపం గడుమేటి వై రిపుని వీఁక న్మాఁ డహోరాత్రముల్
ప్రావీణ్యంబునఁ బోరి చంపితివి నీబాహాబలం బల్పమే
నీవీర్యంబున జానకిం బడసితి న్నిర్వైరినై మించితిన్. 2088

క. అని యూఱడించి రాముఁడు, తనకరములు సాచి ప్రీతిఁ దమ్ముని నాలిం
గన మొనరించిన నపుడా,ఘనభుజుఁ డానంద మొందె గతవేదనుఁ డై. 2089

వ. అంత నారఘుపుంగవుండు ముదితుం డై సభానుధ్యంబున నున్నసుషేణునిం బిలిచి మిత్రవత్సలుం డగునీసౌమిత్రియు మహాప్రాజ్ఞుం డగువిభీషణుండును ద్రుమశైలయోధు లగుభల్లూకవానరగోలాంగూలవీరులును దక్కినసమస్త సైనికులును రాక్షసప్రయుక్తశస్త్రాస్త్రపరంపరల నొచ్చి యున్నవారు వీరి నందఱ నధికప్రయత్నంబున విశల్యులం జేసి సుఖాత్ములం గావింపు మని పలికిన మహాత్ముం డగునవ్వానరశ్రేష్ఠుండు రయంబునం జని విశల్యకరణిం గొని తెచ్చి లక్ష్మణునకు విభీషణున కాంజనేయునకుఁ దక్కినయూథపులకు సమస్తసైన్యంబులకుం జూపిన నాదివ్యౌషధిగంధం బాఘ్రాణించి లక్ష్మణుండు విగతవేదనుండును లలితశరీరుండు నై శోభిల్లెఁ దక్కినవా రందఱును వీతశరవ్రణవేదను లై సుగ్రీవునిపనుపున సర్వాభరణభూషితు లై సర్వశోభాసమన్వితు లై చారువిగ్రహు లై మహనీయ తేజోవిశేషంబునఁ జంద్రసూర్యులచందంబునఁ బ్రకాశించుచు సింహనాదంబులు సేయుచు నృత్తవాదిత్రగీతంబులు నెఱపుచు గోలాంగూలంబులు ద్రిప్పుచు బహుప్రకారంబుల విహరించుచుండిరి విభీషణుండును సుగ్రీవుండును నంగదుండును హనుమంతుండును జాంబవంతుండును నీలుండును నలుండును సుషేణుండును దక్కినయూథపులును విగతశ్రము లై సంతుష్టాంతరంగు లై శుభలక్షణుం డగులక్ష్మణుం బురస్కరించుకొని యమృతంబు ప్రాపించిన దేవతలకరణి రాముని బ్రాపించి రావణున కవలంబనభూతుం డైనశక్రజేతమరణంబునకు సమ్మోదంబు గాంచి విజయలక్ష్మీవిరాజమానుం డైనలక్ష్మణుని విలోకించి హర్షవిశేషంబున సారెసారెకుం బూజించుచు సంపూర్ణకాము లై యథాసుఖంబుగా విహరించుచుండిరంత హతశేషు లైనరాక్షసులు లంకకుం జని సముచితంబుగా రావణు సందర్శించి కేలుమొగిచి శోకభయగాద్గద్యంబున నిట్లనిరి. 2090

సీ. దనుజేంద్ర నీప్రియతనయుండు శక్రారి కార్చిచ్చు వనవాటి నేర్చుకరణి
బాహాబలము మీఱఁ బటువిశిఖాగ్నులఁ దరుచరసేన నంతయు దహించి
మఖభుక్కు లరుదంద మహనీయదివ్యాస్త్రసుహిమ దీపింప లక్ష్మణునితోడ

దెప్పర మయ్యెడు తెఱఁగునఁ బోరాడి పటుశక్తిఁ జీకాకుపడఁగఁ జేసి
తే. ప్రౌఢి దీపించి తుది నాన్నృపాలతనయు, దివ్యసాయకనిహతుఁడై దివసనాథుఁ
డస్తమించినగతి శిఖి యాఱినట్లు, సమరధరమీఁదఁ బడి జీవితములు విడిచె.
క. అని యింద్రజిత్తు మరణము, వినిపించిన నతఁడు శోకవిహ్వలమతి యై
తనయవధశోకదహనుఁడు, తను వేర్చఁగ నోర్వ లేక ధరణిం ద్రెళ్లెన్. 2092

-రావణుఁ డింద్రజిత్తుపరాక్రమముఁ దలంచి దుఃఖించుట.-

తే ఇట్లు పెద్దయుఁ బ్రొద్దు దైత్యేశ్వరుండు
తను వెఱుంగక పెనుమూర్ఛ మునిఁగియుండి
నేర్పుమైఁ దేఱి వేఁడి నిట్టూర్పు వుచ్చి
కంపితశరీరుఁ డై విలపింపఁ దొడఁగె. 2093
శా. హా లంకాపురపాల కార్ముకధరా హా వీరచూడామణీ
హా లేఖాంతక హా మహారథవరా హా వీరదర్పఘ్న లో
కాలోకాంతగతప్రకాశితయశా హా పుత్ర మున్నాశచీ
పాలుం దోలిననీవు లక్ష్మణునిచేఁ బంచత్వముం బొందితే. 2094
ఉ. నీవు ధనుర్ధరుండ వయి నిక్కి వ మల్లి ప్రచండభంగి జ
న్యావనిముంగల న్నిలిచినప్పుడు నీకడఁ దేఱిచూడఁగా
దైవతసిద్ధసాధ్యఫణిదానవు లైనను జాల రట్టి బా
హావిభవాధికు న్నిను రణాగ్రమునం దొకమర్త్యుఁ డోర్చెనే. 2095
సీ దండికొండల నెల్లఁ బిండిచేసినశక్రు గెలిచిననిన్నెట్లు గెడపె నరుఁడు
జగము లన్నియు మ్రింగఁజాలుకాలున కార్తి నిచ్చిననీశౌర్య మెందుఁబోయెఁ
బూని మందరగిరి నైన వ్రక్కలు సేయు నీమార్గణావళు లేమి యయ్యెఁ
దోయధు లన్నియు ధూళి గావించు నీవిక్రమస్ఫురణ మేవీరుఁ డణఁచె
తే. బవరమున మున్న పలుమాఱు పార్థివేంద్ర
సుతుల నవలీల గెలిచి వచ్చితివి బలస
మృద్ధి నేఁ డాపరాక్రమ మెట్లు సమసె
నిచట నన్నొంటి విడిచి పోయితె కుమార. 2096
ఉ. యోధవరేణ్య నీవు ప్రతియోధునితోఁ వడిఁ బోరి పోరి యా
యోధనమందుఁ గాలగతి నొందితి వీ తెఱఁగుర్విలో మహా
యోధుల కొప్ప నిట్లు సమరోర్వి రహిం దెగి వచ్చినట్టియా
యోధవరు న్సమస్తసురయోధులు మెచ్చి నుతింతురే కదా. 2097
క. సురరాజవినుత యెవ్వఁడు, పరువడిఁ బితృకృతమునందు భండనభూమి
న్మరణంబు నొందు నతనికిఁ, జిరవీరస్వర్గసుఖము సిద్ధించుఁ గదా. 2098
ఉ. మేరునగంబుభంగి రణమేదినిఁ గూలిననిన్నుఁ గాంచి బృం
దారకసిద్ధసాధ్యసునాగనభశ్చరయక్షకిన్నరు

ల్పాఱులు తాపసు ల్భువనపాలురు భీతి దొఱంగి హృష్టు లై
స్వైరవిహారధీరు లయి చాల సుఖింతురు నేఁడు పుత్త్రకా. 2099

క. నీ వొకఁడవు లేనందున, స్థావరజంగమసమన్వితము లగుజగము
ల్భావింప ధరణి యంతయు, దేవారీ శూన్య మైన తెఱఁగునఁ దోఁచెన్. 2100

క. కాంతారయుతాద్రిగుహా, భ్యంతరమునఁ గరిణీరవమునట్లుగ నేఁ డీ
యంతఃపురమున రాక్షస, కాంతలరోదనరవంబు కడు వినవలసెన్. 2101

క. వాలాయము దైవబలము, చాలమి నిను నరుఁడు నేఁడు చంపఁగఁ జాలె
న్గాలవిపర్యాసంబునఁ, గాలుఁడు నీకన్నఁ జాల ఘనుఁ డయ్యెఁ గదా. 2102

క. నీయిష్టసఖుల లంకను, నీయువరాజత్వబుద్ధి నీతల్లిని నీ
దాయాదులఁ బుత్త్రుల నీ,జాయల విడనాడి పోవఁ జాలితె తండ్రీ. 2103

తే. అన్యలోకంబునకుఁ జనినట్టితండ్రి, కాత్మజుఁడు ప్రేతకృత్యంబు లన్ని దీర్చు
చున్న ధర్మంబు నేఁ డది యెట్లు వోయె, శక్రవిద్వేషి యే నీకు సలుపవలసె.

చ. ఇనసుతుఁ డావిభీషణ నరేంద్రకుమారకు లానమీరనం
దనుఁడును నాదుమర్మములు నాఁటి గలంచుచు నున్నవారు పె
ల్చన నటువంటినాహృదయశల్యములం బెకలించి వైవ కి
ట్లనిమిషలోకనాథవిమతా యెటు వోయితి వేమి సేయుదున్. 2105

క. అని యీగతి విలపించెడు, దనుజాన్వయనాథుఁ డైనదశకంఠునకుం
దనయవధశోకజం బగు, ఘనకోపము వొడమె వహ్నికల్పం బగుచున్. 2106

వ. ఇట్లు వొడమినపుత్త్రమరణజనిత మనఃకాలుష్యంబులు స్వభావకోపనుం డైన యద్దశగ్రీవుని నిదాఘసమయంబునఁ దిగ్మమరీచులు స్వభావదీప్తుం డైనసూర్యునింబోలె మిక్కిలి వెలుంగం జేసిన నద్దానవేశ్వరుండు యుగాంతకాలవాతప్రేరితమహాగ్రాహసహితతరంగంబులచేత నుదీర్ణం బైనమహార్ణవంబుకరణి లలాటఘటితవికటభ్రుకుటీబంధంబులచేత నతిదుర్నిరీక్షుం డై విజృంభించిన నప్పుడు బడబాముఖంబువలన నిర్గమించుసధూమవైశ్వానరజ్వాలలభంగి నతనిదశవదనంబులనుండి రోషాగ్నిజ్వాలలు నిర్గమించె స్వభావరక్తంబు లైనయతనినేత్రంబులు క్రోధానిలజ్వాలాభీలంబు లై ప్రదీప్తవహ్నికుండంబులపగిది దారుణప్రకారంబునం గనుపట్టె మఱియు స్వభావఘోరం బైనవానిరూపంబు క్రోధాగ్నిమూర్ఛితం బై దురాసదం బైనవిలయకాలరుద్రునిరూపంబుపగిదినలరె దీప్తంబులగుదీపంబులనుండి యర్చిష్మంతంబు లైన తైలబిందువులు దొరఁగుచందంబునఁ దదీయనేత్త్రములనుండియు శ్రుబిందువులునిరంతరంబుగాఁ గురిసెఁ దదీయదంతసంఘట్టనసంజాతనిస్వనంబు దానవులచేత భ్రామ్యమాణం బైనమహాయంత్రఘటితనినదంబుభంగి దిఙ్ముఖంబులం బ్రతిధ్వనులు సెలంగ నతిభయంకరంబుగా మ్రోసె నిట్లు సమస్తచరాచరజంతుసంహారసమయసంక్రుద్ధుం డైన

కాలాంతకునిచందంబున నతిఘోరదర్శనుం డై యద్దశగ్రీవుండు విలయసమయ మహావాతప్రేరితవైశ్వానరునిభంగిమండుచుఁ దనమ్రోల నిలువనోపక రాక్షసు లెల్ల భయభ్రాంతులై పఱవ నెల్లదిక్కులు విలోకించి యుద్ధభీతు లగురాక్షసుల నెల్ల వెఱపు దీఱునట్లుగాఁ బ్రావృట్కాలజీమూతధీరనాదంబున నిట్లనియె.

ఉ. నీరజగర్భుఁ గూర్చి పటునిష్ఠ ననేకసహస్రవర్షముల్
దారుణభంగి నేను ముని తత్పరతం దప మాచరించి సొం
పారఁ దపస్సమాప్తిసమయంబున నమ్మహనీయసత్కృపా
ధారుఁ బ్రసన్నుఁ జేసికొని తప్పక పెక్కువరంబు లొందితిన్. 2108

శా. వాణీనాథకటాక్షలబ్ధవిలసద్వజ్రప్రభోద్యత్తను
త్రాణం బొక్కటి యున్న దాకవచ మారక్షోమరాయోధన
క్షోణిం దత్పవిశక్తి గైకొనక మించుఁ దాని గైకొన్న గీ
ర్వాణుల్ దానవు లైన న న్నెదిరి పోరం జాల రాలంబునన్. 2109

తే. మఱియు నద్దేవదేవుండు మత్తపంబుఁ
జూచి మెచ్చి కృపాళుఁ డై సురదనుజుల
వలన ననిఁ జావు లేకుండ వర మొసంగెఁ
గాన నా కెందును భయంబు గలుగ దింక. 2110

చ. జలజభవుండు నాకు మును సత్కృప నిచ్చిన విల్లు నమ్ములుఁ
దలముగ దివ్యవాద్యనినదంబులతోఁ గొని తెండు వాని సొం
పలరఁగఁ దాల్చి ఘోరచతురంగబలంబులఁ గూడి యేగి దో
ర్బలమున నాజిలోన నరరాజుల వానరుల న్వధించెదన్. 2111

మ. అని యిట్లాగ్రహ మొప్పఁ బల్కి క్షణదాటాధీశ్వరుం డంతలో
దనయశ్రేష్ఠవధప్రభూతపృథుసంతాపంబు కోపంబు పై
కొనినం జానకిఁ జంపి కాని వెస నీక్షోభంబుఁ బాపంగ లే
నని చిత్తంబునఁ దోఁచిన న్గరల దైత్యశ్రేణితో నిట్లనున్. 2112

మ. అనిలో వానరవంచనార్థముగ మాయాజానకిం జంపె మ
త్తనయుం డత్తఱి నాయుపాయ మది వ్యర్థం బయ్యె నే నిప్పు డా
వనజాక్షిన్ నిజంబుగాఁ దునిమి దుర్వారోద్ధతి న్రాము నా
తనితమ్ము న్రవిపుత్రు శోకభవసంతాపాబ్ధిలో ముంచెదన్. 2113

వ. అనిపలికి పుత్రశోకాకులచేతనుండై రోషావేశంబున నిర్మలాకాశసదృశం బైన చంద్రహాసంబు కలయం గొని జళిపించుచు భార్యాసచివసమన్వితుండై చరణాహతి మహీతలంబు కంపింప నతిరభసంబున సీత యున్నయశోకవనంబునకుం జనుచుండ నప్పు డతనికోపాటోపంబుఁ జూచి రాక్షసు లందఱు సింహనాదంబు సేయుచు నొండొరులం గౌఁగిలించుకొని తమలో ని ట్లనిరి. 2114

సీ. ఈరాక్షసేశ్వరుం డేపార నృపతుల నిశితశరంబుల నేఁడు ద్రుంచు
బాహాబలంబునఁ బాకశాసనయమాద్యఖిలదిక్పాలుర నాజి నోర్చి
నాదిత్యవసురుద్రయక్షమరుత్సిద్ధగరుడగంధర్వకిన్నరపిశాచ
సాధ్యవిద్యాధరచారణగుహ్యకతుషితులఁ జెక్కుంద్రఁ దూలఁ దోలె
తే. ముజ్జగము లాక్రమించె సంపూర్ణశక్తి, విష్టపంబుల ననమానవీరుఁ డయ్యె
నీజతారికి నరు లన నెంతవారు, తరుణి వధియించు టొక్కటె తగదు గాక.

-- రావణుఁడు సీతాదేవిం జంపఁ బోవుట. --

క. అని పలుకుచు దనుజేశ్వర, వనితను వధియింపఁ బోవ వల దని వారిం
చినఁ జలము డింప కాతఁడు, కనులం బటుకోపవహ్నికణములు రాలన్. 2116

క. ఘోరాకృతి నేగి యశో, కారామము సొచ్చి మింట నతిభీమముగాఁ
గ్రూరగ్రహంబు రోహిణిఁ, జేరినక్రియ సాధ్వి యైనసీతం జేరెన్. 2117

ఉ. తెంపున ఖడ్గధార గొని దేవ నెలంతలఁ జంపరాదు రో
షింపకు మంచు బాంధవులు సెప్పిన మానక తన్నుఁ గిన్కమైఁ
జంపఁగ నిట్లు వచ్చుఖరజాతి దశాస్యునిఁ జూచి భీతిచేఁ
గంపము నొంది భూమిసుత గద్గదికం దలవాంచి యిట్లనున్. 2118

-- సీతాదేవి దుఃఖించుట. --

శా. క్రూరాత్ముం డగురావణుం డిపు డతిక్రోధంబున న్రాక్షసుల్
వారింపం దమకంబు మాన కతిరౌద్రం బొప్ప నామీఁది కే
పార న్వచ్చుచు నున్నవాఁడు నను శాతాసి న్వడిం జంపు ని
ష్కారుణ్యంబున నేఁడు దానవునిచేఁ జంపించితే దైవమా. 2119

చ. పలుమఱు డాసి వీఁడు రఘుభర్తకనువ్రత నైననన్ను నే
ర్పలరఁగ నాకు భార్య వగు మంచు దురుక్తులు వేయుఁ బల్క నా
పలుకుల నిగ్రహింపఁబడి భావమునందు దురాశ మాని బి
ట్టలుక శితాసిధారఁ దునుమాడఁగ వచ్చినవాఁడో చూడఁగన్. 2120

చ. అనుపమలీల నీపురమునందు మదాగణితప్రహృష్టదై
త్యనికరధీరదారుణసమగ్ర ముదీరితభీమసింహని
స్వనము చెలంగుచున్నది నిశాచరుచే నని రామలక్ష్మణుల్
పనివడి మన్నిమిత్తముగఁ బంచత నొందిరో నేఁడు దైవమా. 2121

తే. అకట నామీఁదఁ బగచేఁ గృతాంతకుండు
మాన్యచరితుల రామలక్ష్మణులఁ దెచ్చి
యక్కసంకటముల బెట్టెఁ జేటు వాడి
యేమి సేయుదు నింక నా కేది దిక్కు. 2122

క. అటుగాన వీఁడు తనసుతుఁ, డటురణమున నీల్గ బెట్టెఁగి యాజిసుతులతో

బటుశక్తిఁ బనఁగ జాలక, యిటు నను వధియింపఁ బూని యేతెంచెనొకో.

చ. అనిలసుతుండు మున్ను వినయంబున రాముని పాలి కేను జ
య్యనఁ గొని పోదు రమ్మనిన నాగతి రాఁ దగ దంటి నప్పు డే
చనిన దశాస్యుచే నిచటఁ జావక పుణ్యచరిత్రుఁ డైన నా
మునియొదపై వసించి కడుమోద మెలర్ప సుఖంతు నేకదా. 2124

సీ. అక్కడ మన్నాథుఁ డసురునిచే నేఁడు హతుఁ డయ్యె నేని తత్సుతునివార్త
విని వీట నేకనందన యగు కౌసల్య యమ్మహామహునిజన్మాతిశయము
బాల్యంబు యౌవనప్రాప్తియు రూపంబు ధర్మగుణంబులు తలఁచి తలఁచి
యధికదుఃఖమున నిరాశయై విఫలితహృదయయై యౌర్ధ్వదైహికము సలిపి

ఆ. చేఁదు మ్రింగి యైనఁ జిచ్చులోఁ బడియైన, జీవితము పరిత్యజించుఁ బాప
చిత్తయైనకుబ్జ సేఁతల నద్దేవి, కిట్టికష్ట మొదవె నే మొనర్తు. 2125

క. అని యీగతి విలపించుచు, వనితామణి కనులనీరు వఱదలుగట్టం
బెనువగలఁ గుందు చుండఁగ, దనుజుం డాసీత గదిసెఁ దద్దయుఁ గినుకన్. 2126

ఆ. అతని తెగువఁ జూచి యాహానినాదంబు, లెసఁగఁ దల్లడిల్లి రసురులెల్ల
దీనవదను లగుచు దివిజులు శోకించి, రఖిలభూతములకు నడలు గలిగె. 2127

వ. అప్పుడు రావణుసచివుండు సుపార్శ్వుం డనువాఁడు నీతివిద్యావిదుండు బుద్ధిమంతుండు రయంబున నతని కడ్డంబు వచ్చి సాహసంబున నతనిం బట్టుకొని సాంత్వవాక్యంబుల బోధించుచు ని ట్లనియె. 2128

రావణుని కడ్డంబువచ్చి సుపార్శ్వుండు నీతి బోధించుట.

సీ. దానవేశ్వర పులస్త్యబ్రహ్మమనుమఁడ వలవిశ్రవునకు నీ వాత్మజుఁడవు
శ్రీదానుజుండవు వేదవిద్యావ్రతస్నాతుండవు స్వకర్మనీతివిదుఁడ
వధికకోపంబున ననుపమధర్మంబు విడనాడి పెద్దలు విన్నఁ దెగడు
నట్టిదుర్మార్గంబు పట్టితి విశ్లేల తగ దాఁడువారలఁ దవిలి చంప

తే. నదియుఁ గాక సరోజాక్షి యనుపమాన
కోమలాంగన్యలావణ్యసీమ యగుటఁ
జేసి కాలాంతరంబునఁ జిక్కు నేమొ
యడిచిపడి వధియింపరా దుడుగు మిపుడు. 2129

క. నీపాటివిభుల కింతికిఁ, గోపింపఁగఁ దగదు దనుజకుంజర దేవీ
కోపం బంతయు ననిలోఁ, భూపాలునిమీఁదఁ జూపుము సన్నద్ధుఁడ వై. 2130

చ. ప్రమద మెలర్ప నేఁ డసితపక్షచతుర్దశి గాన మంచిల
గ్నమునఁ బురోపకంఠవిపినంబుల నేఁడు వసించి యుండి త్రే
పమువసనాఁటిప్రొద్దున జయార్థము వెల్వడి యాజిలో నృపా
త్మజుల వధించి సీతను ముదంబునఁ జేకొను మీ వధీశ్వరా. 2131

వ. అని పలికి చంద్రహాసంబుపుచ్చుకొని సుపార్శ్వుండు గ్రమ్మఱం దోడ్కొనివచ్చిన
నద్దశగ్రీవుండు సుహృన్నివారితకోపుం డై మరలి గృహంబునకుం జని మఱవ
రానిపుత్త్రమరణాతురత్వంబున మిక్కిలి మఱుఁగుచు నెప్పటియట్ల కొలువుకూ
టంబునకుం జనుదెంచి యాసనముఖ్యంబునం గూర్చుండి పరమదుఃఖితుం డై
సంక్రుద్ధుం డైనసింహంబుపగిది నూర్పులు వుచ్చి వదనంబున దైన్యంబు
దోఁప బలముఖ్యుల నందఱం గలయ నవలోకించి బహూకరించి యంజలి
గీలించి దీనస్వరంబున నిట్లనియె. 2182

చ. బలపతులార మీరు కడు భక్తులు శక్తులు యుక్తు లాజికిం
గలనికి నాదుశాసనము గైకొని గ్రక్కున మీర లందఱుం
జలమున వాజిసంఘములు సామజయూథములు న్రథవ్రజం
బులు భటవర్గముం గొని ప్రభుత్వము మీఱఁగ నేగుఁ డుద్ధతిన్. 2183

చ. మదమున డాసి యానృపకుమారుల నిద్దఱ సాహసంబునన్
బొదివి ప్రతాప మేర్పడఁగఁ బ్రోష్ఠపదంబున మింటఁ బన్ని వా
రిదములు ఘోరవర్ష మడరించినచాడ్పున శాతదారుణా
యుధశరవృష్టిపైఁ బఱపి యుక్కున గీటడఁగించి రం డొగిన్. 2184

తే. సంగరంబున మీచేతఁ జావఁ డేనిఁ
బలుదెఱంగుల మే నెల్ల నలియఁ బొడిచి
రండు నే నెల్లి చని ఘోరరణములోనఁ
దునిమి వచ్చెద శరవృష్టి మునుఁగఁ జేసి. 2185

రావణమూలబలంబు యుద్ధమునకు వచ్చుట.

వ. అని పలికి సాదరంబుగా వీడుకొలిపిన నద్దశగ్రీవుని శాసనంబునలంకలోఁగలమేటి
గమికాండ్రందఱు నొక్క మొత్తం బై వజ్రాంగులు దొడిగి నానావిధభూషణ
వ్రాతశోభితశరీరు లై తమతమవాహనంబు లెక్కి పూర్వపరిచితనానావిధసాధనం
బులు గైకొని తొల్లి దిక్పాలాదులతోడం బోరునప్పు డైనను నిర్గమింపనట్టిచిర
కాలసంరక్షితం బైనమూలబలంబును దోడ్కొని యుద్ధసన్నద్ధు లై సువర్ణఘం
టికాకలితకరటిఘటాఘీంకారంబులును గాంచనాపీడతురంగహేషారవంబు
లును గమనీయశతాంగనేమినిర్ఘోషంబులును వీరభటహుంకారంబులునుశింజినీ
టంకారంబులును గంకణఝణంఝణశబ్దంబులును ఘంటాఘణంఘణనినాదం
బులును నిస్సాణధణంధణనినదంబులునుబరస్పరబహూకారధిక్కారరవంబులును
గేతనాగ్రఘటితనూతనపటపటాత్కారంబులును నొక్కటియై మంథానశైలమ
థితమహార్ణవధ్వనిభంగి దిక్కులన్ ఘూర్ణిల్ల మహీతలంబు కంపింపసింహనాదం
బులు నింగి ముట్ట శంఖంబు లొత్తుచు నొండొరులం దలకడచిభీషణప్రకారం
బునఁ జతుర్దశినాఁటిరాత్రి సూర్యోదయసమయంబున లంకాపురంబువెలి సా
గరంబు నిర్గమించుబడబాగ్నిజ్వాలాసహస్రంబులభంగి నతిరభసంబుగాఁ జను

దెంచి వానరబలంబు దాఁకిన నక్కపివీరులు రణోత్సాహంబున నుప్పొంగి సిం
హనాదంబులు సేయుచుఁ గూర్మవరాహశేషదిశాగజకులకుధరంబులు కుదికిలం
బడ గగనంబున కెగిరి జగతికి దాఁటుచు బ్రహ్మాండభాండంబువగులభుజాస్ఫా
లనంబు సేయుచు మహీధరమహీరుహగండశిలాజాలంబు లుత్పాటించికొని తె
చ్చి ప్రచండవేగంబున దానవులం దలపడి రిట్లు నిశాచరసైన్యంబులు దక్షిణో
త్తరసముద్రంబులమాడ్కి వివిధాయుధతరంగమాలాభీలంబుగాఁ దార్కొని
యార్చి పేర్చి యొండొరులమీఁద గదాఖడ్గపరిఘపట్టిసప్రాసపరశ్వధభిండివాల
తోమరముసలముద్గరముసుంఠిచక్రశూలశక్తికుంత జీవితాంతక సాయక గిరితరు
శిలాచయంబులు నీరంధ్రంబుగాఁ బరఁగించుచు గిట్టి యట్టహాసంబునం బెనఁగు
నెడ నుభయసేనాపదాఘాతసముద్ధూతమహీపరాగంబు పెల్లెగసెఁ బడంపడి
రక్తధారాసారంబున నది యడంగిన నప్పుడు రణాంగణంబున మాతంగరథకూ
లంబు లై వాజిమత్స్యంబు లై ధ్వజద్రుమంబు లై శరీరసంఘాటవహంబు లై కంఠ
దఘ్నంబు లై యనేకశోణితప్రవాహంబులు ప్రవహించె నంత. 2136

క. తరుచరు లడరించుమహా,తరులు గిరులు దైత్యు లేయు దారుణశస్త్రో
త్కరములు గగనపథంబున, గిఱికొని గాఢప్రతమము గిఱికొనఁ జేసెన్. 2137

క. ఎవ్వానిఁ గన్న గమికాఁ, డెవ్వానిం గన్న శూరుఁ డెవ్వనిఁ గన్నం
జివ్వకుఁ గాల్ద్రివ్వెడువాఁ, డెవ్వానిం గన్న మేటి యిరుదెసలందున్. 2138

క. హరి హరిఁ దాఁకినకై వడి, గిరి గిరిఁ దార్కొన్నకరణిఁ గేవలశక్తిం
గరి కరిఁ బెనంగుచాడ్పునఁ, దరుచరరాత్రిచరు లపుడు దాఁకిరి వరుసన్.

సీ. అరదము ల్వ్రఱిపించి సురుచిరపటునాయకము లేసి వీరాంగకములు దునిమి
కరుల డీకొల్పి భీకరతోమరము లేసి సకలావయవములు చక్కఁజేసి
హయముల దుమికించి యభిముఖవృత్తంబు లగునట్లు కత్తుల నెగిచి నఱికి
మదమత్తు లై మాఱుమసలుచు వడిఁ దాఁకి దారుణనానాయుధములఁ గ్రుమ్మి

తే. యామినీచరరథికులు సామజాధి,రోహకులు నాశ్వికులు ఘోరరూపు లైన
భటులు వీరాతివీరు లై బలముఁ జలము,మెఱయ వానరవీరులఁ దఱిమి రపుడు.

సీ. రమణఁ దోఁకలఁజుట్టి రథికసారథిసమన్వితముగాఁ దేరులు విసరివైచి
గురుబాహుబలమున గొప్పకొండలు వైచి సమదవారణముల సమయఁ జేసి
సస్కంధవిటపవృక్షము లేసి హయములఁ సాదులతోఁ గూడఁ జదియ మోఁది
ఘనశక్తిఁ బిడుగుల కైన యగుపిడికిళ్ల భటులవక్షంబులు వగులఁ బొడిచి

తే. కఱకుఁగోళ్ల ఘ్రాణంబులుఁ గనులుఁ జెవులు
బెఱికి శితదంష్ట్రలను మెడ ల్గొఱికి జాను
కూర్పరతలాభినిహతుల గుదియఁ జటిపి
యసురబలముల వధియించి రద్రిచరులు. 2141

సీ. దవ్వుగా మింటి కుద్ధతిఁ దన్నుకొని పోయి కడువడిఁ బుడమిపైఁ బడఁగ విడిచి

కడకాళ్ళు వట్టి భీకరలీలఁ బలుమాఱు వడిఁ ద్రిప్పి త్రిప్పి నల్గడల వైచి
విసువక దోర్బలవేగంబు దీపింప నురుతరాశ్మములపై నుదికి యుదికి
గగనంబుపై నుండి కఠినాశనులమాడ్కిఁ బఱతెంచి తలలపై వరుస దుమికి

తే. కడిమిఁ దలవెండ్రుకలు వట్టి పడఁగ నీడ్చి
కాళ్లఁ జేతుల మర్దించి ఱాళ్లఁ బొడిచి
పృథివిలో నంటఁ ద్రొక్కి యావృక్షచరులు
దితిజుల వధించి రప్పు డద్భుతము గాఁగ. 2142

వ. వెండియు 2143

సీ. నవరుక్మకేతుదండమును గైకొని సూతరథికరథ్యములఁ జూర్ణంబు సేసి
కరిదంతములు గొని కడువడి మత్తేభభద్రకుంభంబులఁ బగుల మోఁది
చలము దీపింప నశ్వకళేబరంబులు గొని హయంబుల నేలఁ గూలవైచి
తక్కక యొకనితో నొక్కని వ్రేయుచు భటకదంబము నెల్ల బడలుపఱిచి

తే. ఘోరదుర్వారపటుభుజాసార మెసఁగ, వీరవానరసైనికు ల్వేల్పు లలరఁ
బ్రబలదానవచతురంగబలము నెల్లఁ, జించి చెండాడఁ దొడఁగి రచ్చెరువుగాఁగ.

క. ఒక్కొకదనుజునిఁ గీశులు, మొక్కలముగ నూర్వు రొక్కమొగి నుద్ధతిమై
నెక్కిరి మిక్కిలి శకునము, లెక్కుడుతమి ఫలితతరువు నెక్కినమాడ్కిన్. 2145

వ. ఇట్లు నానాప్రకారంబులఁ గనుపుగొట్టినం గోపించి యాతుధానయోధులు
గోఱంతవసనిబీరంబునం బెచ్చుపెరిఁగి విచ్చలవిడి వానరబలంబు సొచ్చి మచ్చ
రంబున భూనభోంతరంబు నిండ సింహనాదంబులు సేయుచుఁ జిందంబులు
పూరించుచు రుధిరప్రవాహంబులు దాఁటి గజాశ్వరథాదికంబులు పఱపించి నిరం
తరంబుగా ఘోరనారాచంబులఁ బ్రయోగించియుఁ గరవాలంబుల నఱికియు
గదల వ్రేసియు శూలంబులం బొడిచియు ముసలంబులు విసరివైచియు ముద్గ
రంబుల మోఁదియుఁ బరశువులం దెగవ్రేసియు నీటెలం గ్రుమ్మియు భిండివాలం
బులం జదియనడిచియు మఱియు బహువిధాయుధంబులం బ్రహరించియు విజృం
భించి విక్రమక్రీడ సలిపిన విలూనకంఠచరణజానుజంఘోరుమధ్యబాహులై
విభిన్నవక్షులై రుధిరోక్షితసర్వాంగులై చూర్ణితాస్థిసందోహులై కొందఱు
పుడమిం ద్రెళ్లిరి కొందఱు తమచేతియాయుధంబులు పాఱవైచి భయంబున
సేతుమార్గంబు వట్టి పఱవం దొడంగి రప్పు డంగదహనుమంతు లడ్డంబు చని
ధైర్యంబు దెలిపి గ్రమ్మఱించిన వారలు చనుదెంచి రామునిమఱువు సొచ్చిన
నవ్వీరశిఖామణి వారల కభయంబు దెలిపి చాపం బందుకొని గుణధ్వనిఁ జేసి
మేఘమండలంబువలన నిర్గమించి సూర్యుఁడు నిర్మలగగనంబుఁ బ్రవేశించి తిగ్మ
కరంబులు సహస్రప్రకారంబుల వెదచల్లుకైవడి రాక్షసబలంబు ప్రవేశించి నీరం
ధ్రంబుగాఁ జతురంగసైన్యంబులమీఁద నిశాతశిలీముఖంబులు పరఁగించి రశని
సంఘట్టనసంజాతవహ్నిశిఖాపరంపరలనరివాహిని దహింపం దొడంగిన నప్పుడు,

సీ. రథికసారథికేతురథ్యయుతంబుగా మందరాచలనిభస్యందనములు
నాధోరణారోహకాభియుక్తంబుగాఁ బక్షవద్గిరితుల్యభద్రకరులు
సాదులతోఁ గూడ జవవినిర్జితమనోగంధవాహము లైన సైంధవములు
కాలమేఘనికాశకరినాంగసౌష్ఠవవిజితపర్వతు లైనవీరభటులు
తే. నక్కజంబుగఁ గూలిరే దిక్కు గన్నఁ, బెక్కుదిట్ట లై లెక్కకు వెక్కసముగ
నద్భుతాటోపరఘువీరహస్తముక్త, దివ్యమార్గణవితతులఁ దెగి రణమున.
సీ. కడువడి బవనుండు గహనమధ్యము సొచ్చి వృక్షమండంబులు విఱుగఁ ద్రోయు
తఱి నెల్లవారికిఁ దాఁ గానరాకుండ లలిఁ గార్యభూతఫలంబుచేత
ననుమితుఁ డైనట్టులారఘుసత్తముఁ డమరారిసైన్యమధ్యంబు సొచ్చి
కరుల రథంబుల హయులఁ బదాతుల సాయకంబులఁ గూలఁ ద్రోయునపుడు
తే. దానవుల కెందుఁ గన్నఁ దాఁ గానరాక, మఱిఁగి యనుకర మైనకర్మంబుచేత
ననుమితుం డయి వేగ వీర్యములు పూని, రణవినోదంబుసలిపె నిర్జరులువొగడ.
ఉ. భండనభూమి రామనరపాలశరాసనవిచ్యుతోల్లస
చ్చండపృషత్కకోటిఁ దిలశశ్శతశశ్శకలంబు లై రహిఁ
మెండుగఁ గూలురాక్షసులమేనులు గన్పడుఁగాని వేగవం
తుం డగురాముఁ డెచ్చటఁ గనుంగొనఁ గన్పడఁ డయ్యె నయ్యెడన్. 2149
మ. ఘనవేగాతిశయంబున న్శరములన్ గాత్రంబులన్ ఘోరవీ
ర్యనిహాఢిం బ్రహరించురామవిభుని న్రక్షోవరు లొవ్విరిలోఁ
గనలే రై రొగి నింద్రియాదివిషయౌఘప్రేరకత్వంబునం
దనుమధ్యంబునఁ దేజరిల్లుపరమాత్మం జూడ లేనట్లుగన్. 2150

## మూలబలంబుపై శ్రీరాములు సమ్మోహనాస్త్రంబు ప్రయోగించుట.

సీ. అప్పుడు రఘురాముఁ డధికసంక్రుద్ధుఁ డై తనుఁ జుట్టుముట్టి రౌద్రగతిఁ బోరు
వీరరాక్షసులను వీక్షించి రయమున నరుదార సమ్మోహనాస్త్ర మేయఁ
దత్ప్రభావంబున దనుజుల కాజిలో నంతట రామసహస్రకములు
దోఁచినఁ గుపితు లై తోడరియాతఁడు గుఱ్ఱములఁ జంపె నితఁడేనుఁగులవధించె
తే. నితఁడు రథికులఁ జక్కాడె నితఁడు భటుల
గలఁచె నని రామసామ్యంబువలన భ్రమసి
యొండొరుల బెట్టువ్రేయుచుఁ జండభంగిఁ
బెనఁగి తమలోన హతు లైరి దనుజవరులు. 2151
వ. ఇట్లు మహనీయం బైనగాంధర్వాస్త్రంబున మోహితు లై యాతుధాను లొక్క
తఱిఁ బెక్కండ్ర రాములం జూచుచు నొక్కతఱి నొక్కరామునిం జూచుచు
నొక్కతఱి మండలాకారగతివిశేషంబున భ్రమించుటం జేసి యలాతచక్రప్రతి
మ యై యొప్పునప్పరాక్రమధుర్యునికాంచనకార్ముకకోటి నవలోకించుచు

నొక్కతఱి రామధనుశ్చ్యుతంబై నశరజాలంబును సూర్యమండలసంభూతంబైన రశ్మిజాలంబున ట్లవలోకించుచు నొక్కతఱి శరరశ్మిసహస్రాఘ్యుండును మధ్యాహ్నదిత్యవర్చస్కుండు నై దిగంతంబులు వెలుంగంజేయుచునికి నిరీక్షింపంజాలక కన్నులు మూయుచు నొక్కతఱి ధనుశ్శిక్షాకృతలాఘవాతిశయంబున మండలీకృతకార్ముకుండై శరపరంపరల నరివాహిని దహించుచు శరీరనాభిమధ్యప్రదేశంబును సత్త్వార్చియు శరారంబును నేమికార్ముకంబును జ్యాఘోషతలనిర్ఘోషంబును దేజోబుద్ధిగుణప్రభంబును దివ్యాస్త్రగుణపర్యంతంబు నైనరామచక్రంబును గాలచక్రంబునుం బోలె నిరీక్షించుచు నొకపదాతి యైనరామునిచేత దినాష్టమభాగంబునకు నూటడెబ్బదియాఱుకోట్ల నలువదియొక్కలక్షయేఁబది యాఱువేలచతురంగబలంబు హతం బయ్యె నమ్మహాయుద్ధంబున రాక్షసకళేబరంబు లనేకంబులు గగనంబున నాడుచుండెఁ దద్రణభూమి హతగజహయరథపదాతిగణసంకులయై క్రుద్ధుండైనరుద్రుని యాక్రీడభూమిచందంబునం జూపట్టె నిట్లు పదుమూఁడవదివసంబున మహాత్ముం డగురాముండు రణంబున నశ్రమంబున మూలబలంబులు నిశ్శేషంబుగా రూపిమాపిన రాము నవలోకించి దేవర్షి గంధర్వాదు లచ్చెరువంది హర్షవిశేషంబునం బ్రశంసించి రప్పుడు రాముండు సుగ్రీవవిభీషణమైందద్వివిదహనుమజ్జాంబవదాదుల నవలోకించి పరమానందంబున నిట్లనియె. 2152

ఆ. ఏను శివుఁడు దక్క నిమ్మహాసీయాస్త్ర, మెఱుఁగఁ డన్యుఁ డొక్కఁ డిజ్జగముల
దీనిమహిమ లెఱుఁగఁగా నేర రింద్రాదు, లెంత చేసెఁ జూడుఁ డీక్షణమున.

క. అని పలికి శక్రసముఁ డగు, మనుజవిభుం డస్త్రశస్త్రమహిమంబున దై
త్యనికరములఁ దునిమి మనంబున నానందించుచుండె మునులు నుతింపన్.

సీ. ఈరీతి రాఘవుఁ డేపారుశరములఁ బెక్కుగజంబులఁ బెక్కుహరులఁ
బెక్కురథంబులఁ బెక్కండ్రదనుజుల నక్కజంబుగఁ దునుమాడి సురల
కద్భుతం బొనరింప నవ్విధ మంతయుఁ గనుఁగొని హతశేషదనుజు లతిభ
యంబున లంకకు నతిరయంబునఁ బాఱి యెఱిఁగింప విని దైత్యతరుణు లెల్ల

తే. భండనంబున హతు లైనపతుల సుతుల
హితులఁ జుట్టలఁ దలపోసి వితతదుఃఖ
భరమున శరీరములు వ్రాల బాష్పపూర్ణ
వదన లై గూడుకొని యిట్లు వగచి రపుడు. 2155

మ. సుకుమారుండు మహారథుండు సుజనస్తుత్యుండు సర్వాస్త్రశ
స్త్రకళావేది సరోజనేత్రుఁడు తనూసౌందర్యగాంభీర్యధై
ర్యకళానిర్జితమారవారిధినువర్ణాద్రిప్రజానాథుఁ డ
త్యకలంకాత్ముఁడు రాఘవుండు ముని యై యుక్కానలో నుండఁగన్. 2156

ఉ. కావరమెత్తి యంతరము గానక దుర్ముఖియుం గరాళ దు

ర్భావయు నిర్ణతోదరి యభాగ్యయు వృద్ధయు శ్వేతకేశి ఘో
రావయవాంగి క్రూరయు దురాత్మకయు న్గుణహీన భీరుదం
ష్ట్రావళి యైనశూర్పణఖ యాదటఁ గామపరీతచిత్త యై. 2157

సీ. అసమానబలుఁ డైనయారఘుస్వామిని జేరి గట్టల్క ధర్షింప నేల
దానికి నల్గి భూజాని ఖడ్గము కేలఁ గొని కర్ణనాసము ల్గోయ నేల
యంతటఁ బోక యయ్యతివ ఖరాదుల ననికిఁ బంపఁగ నేల యవ్విభుండు
వారిఁ జంపఁగ నేల వరుసతో రావణుం డడవిని వంచించి యతని దేవి
తే. నపహరింపంగ నేల యయ్యవనివిభుఁడు, వచ్చి మనవారి నందఱ మచ్చరమున
బవరమునఁ జంప నేల శూర్పణఖవలన, నింత యాపద జనియించె నేమిగలదు.

ఉ. ఈరజనీచరేంద్రుఁడు మహీసుత నాత్మవినాశనార్థ మై
వారక దోడి తెచ్చె బలవంతునితోఁ బగ మేలె యమ్మహా
వీరునిపత్ని చేకొనఁగ వీనికిఁ జెల్లునె తా నొకండె దు
ర్వారతఁ జావ కిట్లు మనవారల నందఱఁ జంపె నక్కటా. 2159

చ. వినువక దండకాగహనవీథి నెదిర్చి మహీకుమారిక
న్వెనఁ గొనఁ బూనినట్టిపటువిశ్రుతవీర్యు విరాధు నాజిలో
మసలక యుగ్రభంగి నొకమాత్ర వధించె రఘుప్రవీరుఁ డ
య్యసదృశవిక్రముం దొడరి యాఁల మొనర్ప నితండు శక్తుఁడే. 2160

సీ. ఖలజనస్థానవాసులఁ జతుర్దశసహస్రనిశాచరుల నాజిఁ జంపుటయును
ఖరుని దూషణునిఁ ద్రిశిరునిఁ గల్పానలకీలాభశరముల గెడపుటయును
యోజనాయతబాహు నుగ్రకబంధుని దొడరి ఖడ్గంబునఁ ద్రుంచుటయును
నమరేంద్రనందను నమితవిక్రమశాలి వాలి నమ్మునఁ గూలఁ వైచుటయును
తే. వనధి నరికట్టి వెసదాఁటివచ్చుటయును, గుంభకర్ణేంద్రజిత్తులఁగూల్చుటయును
బార్థివునివీర్యమున కివి ప్రత్యయంబు, లతని నిర్జింప వీనికి నలవి యగునె 2161

శా. ఆలిం గోల్పడి ఋశ్యమూకగిరిపై నత్యంతదుఃఖంబున
న్వాలాయంబు కృశించు దీనముఖు భాస్వత్పుత్రుఁ జేపట్టి యి
ల్లాలి న్వానరరాజ్య మిచ్చె రఘువంశాగ్రేసరుం డత్తెఱం
గాలోకింపఁ దదీయవిక్రమవిధం బవ్యాహతంబే కదా. 2162

చ. అనిలతనూజుఁ డొక్కఁడు మహార్ణవ మొక్కట దాఁటి వచ్చి వా
లనిహితవహ్నిచేఁ దొడరి లంక దహించి బలాఢ్యుఁ డైనయ
క్షుని వధియించి భూతనయఁ జూచి వెసం జనె నవ్విధంబు గ
న్గొనియు గణింప కీదనుజకుంజరుఁ డింతకుఁ దెచ్చె నందఱిన్. 2163

క. హితవాది యగువిభీషణుఁ, డతులితమతి నన్నవాక్య మది వినఁ డితఁ డా
గతి నాఁడు వినిన నేఁ డీ,గతి లంక శ్మశానభూత గాకుండుఁ గదా. 2164

మ. ఘనకాయుం డగుకుంభకర్ణుఁడు మహాకాయాతికాయోగ్రకుం
భనికుంభు ల్నరిజిన్మహోదరమహాపార్శ్వుల్ప్రహస్తుం డకం
పనదేవాంతకు లాదిగాఁ గలబలప్రౌఢు ల్నిశాటు ల్రణా
వనిలో నీల్గిరి వీరిదుర్ణయమున న్వాపోవఁ జేసెం బురిన్. 2165

మ. పతులుం బుత్రులు బాంధవు ల్సచివులు న్భ్రాతల్కపిశ్రేణిచే
హతులై రాజి ననేకవాజులు శతాంగానీకముల్ వారణ
ప్రతతుల్ ఘోరపదాతివర్గములు సంగ్రామంబులోఁ జచ్చె న
ద్భుతభంగి న్రఘునాథముక్తవిశిఖస్తోమంబుల న్వ్రేల్మిడిన్. 2166

శా. రక్షోరాజ వధింపఁ బూని తగ మర్త్యత్వంబు గైకొన్నప
ద్మాక్షుండో హరుఁడో పితామహుఁడొ దేవాధీశుఁడో పాశియో
సాక్షాదంతకుఁడో రఘుప్రవరుఁ డా చందంబుగాకున్న న
ప్రక్షీణద్యుతి నిట్లు రాక్షసులవర్గంబెల్లఁ జక్కాడునే. 2167

మ. మనవా రందఱు రామబాణములచే మంత్రించిన ట్లాజి మే
దినిలోఁ గూలిరి వీట నింక మనకుం దిక్కెవ్వరు చర్చింప నీ
ఘనదుఃఖాబ్ధికిఁ బార మెద్ది తనువు ల్గంపింపఁగాఁ జొచ్చె నే
మనినం దీఱు దశాస్యచెయ్దములు వంశాంతంబుఁ జేసెం దుదిన్. 2168

ఉ. కాంచనగర్భదత్తవరగర్వమున న్దశకంధరుండు తా
నించు కెఱుంగఁ డీరఘుకులేంద్రునిచేఁ దన కైనమోస మ
భ్యంచితవస్తుఁ డైనమనుజాధిపుబారికి నగ్గమైనచోఁ
బంచత నొందకుండఁ బరిపాటిగఁ బోవఁగఁ జాల రెవ్వరున్. 2169

క. అనికి వెడలు నపుడెల్లను, మునుకొని కడు దుర్నిమిత్తములు దోఁచుచు రా
మునిచే నితనికి రణమే,దినిఁ జేటగునట్టివిధము దెలిపెడి వరుసన్. 2170

ఉ. ఈదనుజుండు తొల్లి భువనేశుగురించి తపం బొనర్చి న
మ్మోద మెలర్ప నద్విజముఖ్యునిచే వర మందునాఁడు దే
వాదిసమస్తభూతనివహంబులచే నభయంబు వేఁడె న
ట్లాదర మొప్ప వేఁడఁ డభయం బటు మర్త్యునిచే జడాత్ముఁ డై. 2171

ఆ. దానఁ జేసి నేఁడు తప్పక మనుజుని, వలన సకలరాక్షసులకు దైత్య
వరుని కిటు వినాశకర మైనఘోరభ,యంబు వొడమె సందియంబు లేదు. 2172

వ. మఱియుఁ దొల్లి యాదశగ్రీవునిచేత బాధితులై వేల్పులును గంధర్వవిద్యాధ
రాదులును విధాత నుద్దేశించి ఘోరతపంబు గావించి యద్దేవుని బ్రసన్నుం
జేసికొని వివిధప్రకారంబుల నారాధించిన నమ్మహాత్ముండు సంతుష్టుండై దేవత
ల నందఱఁ గలయ నవలోకించి నేఁడుమొదలు మీరు భయంబుదక్కి ముల్లో
కంబులయందు వలసినచోట్లనెల్ల యథేచ్ఛం జరియింపుఁడనిపలికి వారికి హితం
బాపాదించె నయ్యాదిత్యప్రముఖులు పదంపడి భగవంతుం డైనపురాంతకునిం

జేరి నానాప్రకారంబుల నభినుతించి తత్ప్రసాదంబువడసి తమనొప్పియెఱింగిం
చిన నమ్మహాదేవుండు కృపాళుం డై మీకు హితంబు రాక్షసులకు వినాశంబు
సేయుట కొక్కయువతి జనియించు నెమ్మదిగ నుండుండని యానతిచ్చెఁగావున.

సీ. ఆచంద్రశేఖరుఁ డానతిచ్చినమాడ్కి నీసీత దేవతాహితముకొఱకుఁ
బ్రభవించె మృత్యువు ప్రళయకాలమునందు మిన్నక ప్రాణుల మ్రింగునట్లు
దనుజేంద్రయుతముగా మనల నందఱ మ్రింగు నీరావణుఁడు దుర్విచారపరత
నిట్టియాపద దెచ్చె నిఁక మన కెవ్వరు శరణంబు కల్పావసానమందు

తే. భానుసుతుమ్రోలఁ జిక్కిన ప్రజలభంగి
దవముచే వేష్టితము లైనదంతులక్రియఁ
బార్థివునిచేతఁ బొదువంగఁ బడితి మకట
యేమి సేయుద మసురేంద్రుఁ డెంత చేసె. 2174

క. అని పెక్కుగతుల దనుజాం, గనలు భయము చిత్తమందు గడలుకొనఁగఁ జ
య్యన నొండొరుఁబట్టుకొనుచుఁ, బెనువగలం బొగిలి రపుడు భీషణభంగిన్.

క. వారలదుఃఖసమీరిత, భూరినినాదములు బెరసి పురి నిండెంతం
దారుణగతి నెగసిన సుర, వైరి విని మొగంబున న్వివర్ణత గదురన్. 2176

తే. మనమున ముహూర్తమాత్రంబు మౌన మూఁది
యొక్కనిట్టూర్పు నిగిడించి మిక్కుటముగఁ
గినుకఁ బొడమిన నిప్పులు కనులఁ దొరఁగ
నాస్యములు ఘోరదర్శన మై వెలింగె. 2177

తే. అధరము చలించెఁ గటము లంతంత నదరె
నొడలు కంపించెఁ జెమ్మట లూరె బొమలు
ముడివడియె దంతఘట్టనోద్భూతఘోర
నాద మశనిస్వనంబుచందాన మ్రోసె. 2178

వ. ఇట్లు యుగాంతాగ్నిచందంబునఁ గ్రోధానలప్రజ్వలితశరీరుం డై యెల్లవారికిం
దేఱిచూడ రాక సమీపస్థు లగురాక్షసుల వేఁడిచూపుల నిరీక్షించి క్రోధావ్య
క్తకంఠుం డై మీరు రయంబున మచ్ఛాసనంబు దెల్పి చతురంగసైన్యంబు
నాయోధనంబునకుఁ గట్టాయితంబు గావింపుఁడు మున్ను రణంబున మద్భ్రాత
లగుమహోదరమహాపార్శ్వులు హతులై రిప్పుడు మత్సచివులై బలముఖ్యులైన
మహోదరమహాపార్శ్వవిరూపాక్షులు సంగ్రామంబునకుం జనువారలుగా నియో
గింపుఁ డనిపలికిన నయ్యాతుధానులు తద్వచనప్రకారంబున నందఱకు బవరం
బునకుఁ బైనంబుఁ జెప్పిన నక్తంచరు లందఱు రాజశాసనంబు నియ్యకొని
భయంకరాకారు లై ధీరు లై వీరాంకవీరు లై నానావిధసాధనంబులు ధరించి
రావణునకుం బొడసూపి యతని సముచితప్రకారంబునం బూజించి యనుజ్ఞ
గొని కృతస్వస్త్యయను లై తద్విజయంబు గోరుచు సంగ్రామరంగంబునకుం

బోయి రప్పు డద్దశగ్రీవుండు క్రోధపరవశుం డై విరూపాక్షమహోదరమహాపా ర్శ్వుల కి ట్లనియె. 2179

మ. అనిమేషేంద్రకరీంద్రహ స్తనిభదీర్ఘాస్త్రత్క రాగ్రస్ఫుర
త్కనకాద్రీంద్రసమానసారపటుకోదండప్రముక్తోగ్రనూ
తనకల్పాంతదినేశసన్నిభపృషత్కశ్రేణిచే రాజనం
దనులం గీటడఁగించి నేఁడు జముచెంతం జేరఁగాఁ బుచ్చెదన్. 2180

క. విపులశరంబుల నృపులం, గపులఁ దునిమి నేఁడు కుంభకర్ణాచలభి
ద్రిపుకుంభనికుంభకరా,దిపూర్వదివిజులఋణంబు దీర్చికొనియెదన్. 2181

క. గగనము ధాత్రియు దిశ లా,పగలు సముద్రములు నాదుపటుతీవ్రశితా
శుగజలదవృతము లై నేఁ, డూగిఁ బ్రద్యోతంబు నొందకుండెడు మిగులన్.

తే. వీఁకఁ బర్జన్యుఁ డూగి శిలావృష్టి గురిసి, సస్యసంతతి గూల్చినసరణి నాదు
సాంద్రశరవృష్టిఁ గపిసైన్యసమితి నేల, పాలు సేసెద నిందఱుఁ బ్రస్తుతింప.

తే. మారుతజవంబున రథంబు సుందరంబు, కరణిఁ జరియింప మచ్చాపశరనిధిప్ర
భూతబాణోర్మివితతుల భూజచరబ,లాలియనుదీవి ముంచి జయంబు గొందు.

తే. నలినకింజల్కవర్ణవానరచమూవి,శాలసలిలాశయంబుల సమదసామ
జంబుభంగిఁ గలంచి రాక్షసుల కెల్ల,వేడుక జనింపఁ జేసెదఁ జూడుఁ డిపుడు.

క. హరియూథపు లందఱు నేఁ, డరయఁగ మద్విశిఖపూరితాననములచే
వరుస ధరఁ గప్పెదరు సురు,చిరసమ్యణాళాంబుజములచేతం బోలెన్. 2186

క. ఒక్కొక్క ఘోరశరమునఁ, దక్కక యుద్ధప్రచండ తరుచరవరులం
బెక్కండ్ర శైలయోధుల, నక్కజముగ నేఁడు ద్రుంతు సమరులు వొగడన్.

క. అనిలోఁ జచ్చినభర్తలఁ, దనయుల సోదరులఁ దలఁచి తద్దయు దుఃఖం
బునఁ బొగులుదనుజవనితా,ననగళదశ్రుప్రమార్జనం బొనరింతున్. 2188

తే. వినుఁడు మద్బాణనిర్భిన్నవిప్రకీర్ణ
విగతచేతనఘనరూపు లగువనాట
వరులచే నేఁడు సంగ్రామ వసుధ యధిక
యత్నసంప్రేక్ష్యతల యగు టరుదె తలఁప. 2189

క. కాలవ్యాళనిభాంబక, జాలార్దితశత్రుమాంసశకలంబులచేఁ
జాలఁ బరితృప్తిఁ జేసెద, నాలంబున గృధ్రజంబుకాదులకు వడిన్. 2190

చ. మసలక మచ్ఛతాంగమును మానుగ నాయితపెట్టుఁ డింద్రచా
పసదృశఘోరకార్ముకము బాణములం గొని తెండు సర్వరా
క్షసులును నాదువెంట వరుస న్రణభూమికి వచ్చువారుగా
వెస నియమింపుఁ డిప్పు డరివీరమృగంబుల వేఁటలాడెదన్. 2191

వ. అనిపలికిన నద్దశగ్రీవునివచనంబులు విని రాక్షసోత్తముం డగుప్రమత్తుండుసమీా పస్థు లగుబలాధ్యక్షుల నవలోకించి మీారు రయంబున హతశేషు లగురాక్షసుల

నందఱ రాజశాసనంబున రణంబునకుఁ బైనంబు సేయింపుం డనిన వారతిత్వరి
తగమనంబునం బ్రతిగృహంబునకుం జని లంకలోఁ గలయాతుధానుల నందఱ
యుద్ధసన్నద్ధులం జేసి తోడి తెచ్చిన నొక్క ముహూర్తంబులోనఁ బరాక్రమధుర్యు
లగు రాక్షసవర్యు లనేకులు భయంకరాకారులై కాలమేఘంబులకరణి గర్జిం
చుచుఁ బట్టసాసిశూలగదాముసలముద్గరశక్తికుంతచక్రప్రాసపరశ్వధభిండివాల
శతఘ్నీప్రముఖనిఖిలాయుధంబులు భుజంబుల నిడికొని భీమప్రకారంబున
రావణసమీపంబునం గూడుకొని రంతలోన సూతుండు మహోన్నతకేతనం
బెత్తి యెనిమిది జవాశ్వంబులం బూన్చి ధనురాదిసాధనంబుల నలంకరించి రథం
బాయితంబు చేసి తెచ్చిన నమ్మహనీయకాంచనమణిగణప్రభాభాసమానరథం
బెక్కి రావణుండు సత్వగాంభీర్యతేజోధైర్యంబులు వెలుంగ రాక్షసబలోపేతుం
డై నిజతేజంబున దశదిశలు వెలుఁగం జేయుచు ధరణీతలంబు గ్రక్కదల రణం
బునకుం జనియె నతనిపిఱుంద డెస రథారూఢులై యుద్ధోన్మత్తమత్తవిరూపా
క్షులు ఘోరనాదంబులు సేయుచు రభసాతిశయంబున మహీచక్రంబు బ్రద్దలు
వాఱ భీషణప్రకారంబునం జని రిట్లు సర్వసంరంభసన్నాహవిజృంభితుం డై
కాలాంతకయమోపముం డగు రావణుండు కరంబునఁ జాపంబు గ్రాల సూతసా
రథ్యనైపుణవిశేషంబున నతిదుర్నిరీక్షుం బై రథంబు పఱవఁ గోలాహలబలం
బుగా నుత్తరద్వారంబున వెడలి చనుసమయంబున. 2192

-ooo రావణుఁడు యుద్ధంబునకు వచ్చుట. ooo-

సీ. నలినబాంధవుఁడు వినష్టప్రభుం డయ్యె దిక్కులఁ దిమిరంబు పిక్కటిల్లెఁ
క్రవ్యాదములు భయంకరగతి వాపోయె గవ్వారిచక్రంబు కంప మొందె
నిర్ఘాతసన్నిభనినదంబులై మహోల్కలు రాలె రక్తవర్షంబు గురిసె
కాకఘూకసృగాలకంకగృధ్రంబులు ధ్వనులు సేసె శివారవంబు లెసఁగ
తే. రథ్యములు మ్రొగ్గె రావణురథముమీఁద
గద్ద వాలెఁ దదంగము లల్లాడప మొందె
మోమున వివర్ణతయుఁ దోఁచె వామలోచ
నము చలించె స్వరంబు హీనత వహించె. 2193

క. మఱియుఁ బథంబున దనుజే, శ్వరుఁ డగుదశకంధరునకు సంగ్రామమునఁ గ
మరణము దెలుపుచుఁ దఱుచుగఁ, బొరిఁబొరిబహుదుర్నిమిత్తములుదోఁచెరహిన్.

తే. దానవేశ్వరుఁ డామహోత్పాతములను
గాంచి చింతింపక తృణీకరించి మించి
కాలచోదితుఁ డై వేగ కయ్యమునకుఁ
జనియె భయదాట్టహాసనిస్వనము లెసఁగ. 2195

ఉ. వారిశతాంగఘోషమున వానరసత్తము లుత్సహించి సొం
పారఁగఁ దాఁకి యుగ్రగతి నద్దనుజు ల్వెస వారిఁ దాఁకి రే

పారఁగ దక్షిణోత్తరమహార్ణవము ల్వడిఁ బోరుకై వడి
న్వారక పోరె నయ్యుభయవాహిను లార్పులు నింగి ముట్టఁగన్. 2196

క. జయకాంక్ష లినుమడింపఁగ, రయమునఁ గపిరాక్షసులు కరముచలమున నెం
తయు నొండొరులం బిలుచుచు,భయదగతిం బెనఁగి రపుడుపటుశౌర్యమునన్.

క. ఆదారుణసమరంబున, నాదంబులకంటె మున్ను నగచరరక్షః
పాదహతభూపరాగము, మేదురముగ నెగసి దెసల మింటం బర్వెన్. 2198

ఉ. అంత వనాటవీరులు భయంకరవిక్రమదుర్నివారులై
పంత మెలర్ప శైలములఁ బాదపసంఘముల న్నఖంబులన్
దంతములం గరంబులఁ బదంబుల దైత్యుల నుగ్గు సేసి రో
దోంతరమెల్ల నిండ వడి నార్చిరి వేల్పులు మెచ్చి చూడఁగన్. 2199

క. ఆవిధ మంతయుఁ గనుఁగొని, రావణుఁ డతిరుష్టుఁ డగుచు రాక్షసభటులం
దా వీక్షించి వనాటబ,లావలిపైఁ గవిసి పోవుఁ డవిశంకితులై. 2200

చ. అని పురికొల్పినం దనుజు లార్చి జయస్పృహులై భుజాబలం
బినుమడిగాఁగ సాంద్రశరవృష్టి గదాపరిఘాసిశూలపా
శనిశితశక్తితోమరకశాముసలాంకుశముద్గరంబుల
న్వనచరనాథసైన్యముల వ్రచ్చి వధించి రనేకభంగులన్. 2201

చ. దశముఖుఁ డల్గి చాపగుణదారుణనిస్వన మత్యుదాత్తమై
దశదిశలం జెలంగ వితతస్ఫుటరాజదయోముఖాగ్రక
ర్కశసితవత్సదంతపవికల్పవికర్ణిసుపుంఖపత్త్రవ
ద్విశిఖము లేసి వానరుల వేగ నుడంచి వధించె వ్రేల్మిడిన్. 2202

క. ఆరక్షఃపతిముంగల, బీరము దీపింప నిలిచి పెనఁగెడువీరుం
డేటిన నొక్కఁడు లేఁడా, భూరుహచరవాహినీసమూహములోనన్. 2203

వ. అంత నొక్కింతధైర్యంబున వానరబలంబులోనఁ జేయం గలమేటిమగ లెల్ల నొక్కుమొత్తంబై పర్వతాగ్రంబులుఁ బాదపంబులు హస్తిమాత్రపాషాణంబులుం గైకొని రావణుఁ జుట్టుముట్టి యట్టహాసంబుఁ జేసి ప్రాణహరంబైనశిలాద్రుమవర్షంబు నీరంధ్రంబుగాఁ గురిసిన. 2204

ఉ. దానికి నల్గి కన్గొనల దారుణవహ్నికణంబు లొల్క న
ద్దానవలోకనాయకుఁడు దండధరాకృతి ఘోరదర్శనుం
డై నిశితాగ్నిసన్నిభమహాహిసమానశరప్రవృష్టిచే
వానరవీరసేనల నవార్యగతిం దునుమాడె నుద్ధతిన్. 2205

క. మఱియు దశాస్యుఁడు కల్పాం, తరవిక్రియఘోరశరకదంబకరములం
దరుచరసేనాప్రాదమును, దురమున శోషింపఁజేసె దుస్సహశక్తిన్. 2206

తే. రావణుం డనుకల్పాంతపావకుండు, క్రోధవాతప్రయుక్తుఁడై ఘోరబాణ
సాంద్రశిఖలచే వానరసైన్యశుష్క, విపినమును జుట్టి నీఱు గావించె నపుడు.

క. దితిజకులేశ్వరకాండా,ర్దితులై భిన్నాంగులై రుధిరపూరపరి
ప్లుతులై గతజీవితులై, క్షితిఁ గూలిరి వానరులు విచేతను లగుచున్. 2208

వ. ఇట్లు వానరబలంబుల నెల్ల నేలకుం గోలకుం దెచ్చి గంధమాదనుం డడరినఁ
బదునెనిమిదిశరంబుల దూలనేసి నలుండు దూరంబునం బొడనూపిన దశవిశి
ఖంబులు మేనం గ్రుచ్చి మైందుండు వచ్చిన సప్తసాయకంబుల వేగం బడంచి
గజుం డెదిరించిన నైదుతూపుల విముఖునిం జేసి హనుమంతుండు మార్కొ
నిన ముప్పదిబాణంబుల నివారించి నీలుండు దోఁచినఁ బదికాండంబుల వెగడు
పఱచి గవాక్షుండు గవిసిన నిరువదేనువెడందవాతియమ్ములం గ్రమ్మఱించి ద్వివి
దుండు మొనసూపిన నాలుకుప్పెకోలల నొప్పించి పనసుం డదల్చినఁ బదిగన్నె
రాకుఁగోలల వాఁడిమిఁ జెఱచి కుముదుండు మీఁది కుఱికినఁ బంచదశశిలీము
ఖంబుల నిశ్చేష్టితుం జేసి జాంబవంతుం డాహ్వానంబుఁ జేసిన సప్తనారాచంబుల
వికలాంగునిం జేసి తారుండు గదియవచ్చిన నైదుకాండంబుల సొగియనేసి
వినతుండు తలమిగిలిన నెనిమిదిమార్గణంబులఁ గాందిశీకునిం జేసి యంగదుం
డడ్డంబై యొడ్డారించినఁ బండ్రెండుతీవ్రాశుగంబుల వికలసాధనుం జేసి శర
భుండు దలపడిన నొక్కయర్ధచంద్రాంబకం బురంబు గాఁడ నేసి యుబ్బడంచి
క్రథనుండు ప్రథనంబున కుత్సహించిన మూఁడువాఁడితూపులు లలాటంబున
నాఁటించి మూర్ఛితుం జేసి వెండియు సూర్యమరీచికల్పంబు లగుకాండసహ
స్రంబులు సేనమీఁదం బరఁగించి మర్మంబులు సించిన నందుఁ గొందఱు భిన్న
మస్తకులై కొందఱు విఖండితబాహులై కొందఱు విశకలితచరణజానుజం
ఘోరుమధ్యులై కొందఱు చతుర్వివర్జితులై కొందఱు భిన్నగాత్రులై
కొందఱు రుధిరోక్షితశరీరులై పుడమిం గూలి రప్పుడు. 2209

క. అవిరళగతిఁ దెగి కూలిన, ప్లవగులచేఁ దఱుచుగాఁగ రాలినతరుశ
స్త్రవరాస్త్రఖండములచే, బవరపుమేదిని ముసుంగువడి యుండె రహిన్. 2210

ఆ. అప్పు డప్రధృష్యమైనదశాస్యుఘో, రేషుసంప్రపాత మించుకైన
వైరు లోగి సహింప లేరైరి మారుత, మిత్రు నోర్వలేని మిడుతలట్లు. 2211

క. రావణతీవ్రశరార్దితు, లై వానరు లార్తినొంది యాక్రందితము
ల్గావించుచు వెసఁ బఱచిరి, దావానలదహ్యమానదంతులభంగిన్. 2212

క. ఇనతేజంబునఁ దమ మొ, య్యన విరిసినక్రియ దశాస్యుఁ డని సేవంకం
గనుఁగొనె నావంకం గల, వనచరసైన్యంబు విచ్చి వననిధిదాఁకన్. 2213

క. ఆయసురేంద్రుఁడు వెనుకొని, సాయక సాయకము లేసి ప్లవగులఁ దోలె
న్వాయువు నిజవేగంబునఁ, దోయదముల నభ్రవీథిఁ దోలినమాడ్కిన్. 2214

మ. దనుజాధీశ్వరుఁ డిట్లు కొంతవడి యుద్ధక్రీడ గావించి చ
య్యన నాత్మీయపృషత్కమోహితములై యంభోజపత్రస్థజీ

వనమున్బోలెఁ దలంకుకీశపృతనావర్గంబులం జూచుచు
ఞ్జనియె న్రాఘవుఁ డున్నచోటికి రణేచ్ఛ న్గ్రోధసంరంభి యై. 2215

వ. ఇట్లనివార్యగమనంబునం జనుదశగ్రీవుని దవ్వులం జూచి సుగ్రీవుండు విపుల
గ్రీవుం డై యతనికోల్తల కోర్వక భయభ్రాంతు లై దీనదశకు వచ్చి తొలంగి
పాఱువానరుల కభయంబు దెల్పి మధ్యమగుల్మసంరక్షణంబునం దాత్మసమా
నబలుని సుషేణుని నియోగించి యొక్కవిశాలసాలం బుత్పాటించి తెచ్చి యం
సభాగంబున నిడికొని మత్తశుండాలంబులీల మాఱుమసలుచుఁ బాదవిన్యాసం
బునఁ బుడమి వడంక సంగ్రామార్థి యై రావణున కభిముఖంబుగా నరిగె నతని
వెనుక నుభయపార్శ్వంబుల ననేకయూథాధిపతులు వివిధద్రుమంబులు శైలం
బులు కరంబుల నిడికొని పరుసంపుమాటల నొండొరులం బురికొల్పుకొనుచు
సహాయార్థం బరిగి రిట్లడరి సూర్యనందనుండు తనయన్నపగిది భయంకరాకా
రుండై బ్రహ్మాండభాండంబు వగుల నుచ్చైర్నాదంబు సేయుచుఁ గ్రోధసంరక్త
నయనుం డై యుగాంతసమయంబునందుఁ బ్రభంజనుండు ప్రవృద్ధవృక్షంబునుం
బోలె నెడనెడ నడ్డంబు వచ్చినమహాకాయు లగురాక్షసుల బడలువడం
జేయుచుఁ గాననాభ్యంతరంబున మేఘంబు పక్షిసంఘంబుమీఁదశిలావర్షంబు
గురిసినభంగి రాక్షససైన్యంబులమీఁద నీరంధ్రముగాఁ బాదపవర్షంబులుగురి
యుచు సురేంద్రుండు వజ్రప్రహారంబున ఱెక్కలు దెగవ్రేసినఁ బుడమిం
గూలుపర్వతంబులమాడ్కిఁ దనచేతివృక్షప్రహారంబున శిరంబులు వగిలి
దానవు లవనిం ద్రెళ్ల ననేకప్రకారంబుల భుజావిక్రమంబు ప్రకటించుచుం
జని రావణుం గదియునెడ రథికుం డగువిరూపాక్షుం డడ్డంబు వచ్చి నిలువరించి
యేను విరూపాక్షుండ రణంబునకుం జనుదెంచినాఁడ నన్ను మీఱి పోవరాదు
బంటవై తేని నాతో రణంబుసేయు మనిపలికి పొగలేనిమంట లుమియునారసం
బులు దట్టంబుగాఁ బరఁగించిన నతనిప్రఖ్యంబు లగుతత్సాయకంబులు నెక్కొం
పక సుగ్రీవుండు గర్జించుచు శరాభిముఖుం డై వానిం గదియ నుఱికె. 2216

చ. హరిహయవిక్రముండు ప్లవగాధిపుఁ డుద్ధతి వాని తేరు స
త్వరముగ నాక్రమించి వడిఁ దద్రథకీలితవాజిశీర్షము
ల్హరిశతకోటిసన్నిభ పదాహతి వ్రక్కలువాఱఁ దన్నిన
న్నెఱిసెడి కన్ను లూడిపడ నెత్తురు గ్రక్కుచు వ్రాలె నేలకున్. 2217

క. ఇనతనయుఁ డివ్విధంబున, దనుజనిహాయముల వధించి తరుచరసేనల్
తను వినుతింపఁగఁ దత్స్యం,దనచోదకుఁ దునిమె ఘోరతరవృక్షహతిన్. 2218

తే. అంతలోన విరూపాక్షుఁ డతిజవమున
ధరకు లంఘించె నంతలోఁ దరుచరేంద్ర
సచివు లందఱు గ్రమ్మి తత్స్యందనమును
జూర్ణ మొనరించి రింద్రాదిసురులు పొగడ. 2219

సీ. దానవుఁ డిబ్భంగి ధరణికి లంఘించి కవచియు ఖాఁశియుఁ గార్ముకియును
దూణియు నై పటుబాణజాలంబులు కపివల్లభునిమేను గాఁడ నేసి
నంతలో రావణుం డధికరోషమున వానరభర్తపైఁ బెక్కునారసములు
పరఁగించి వెంటనె బహువిధాంబకములు సేనపై నిగుడించి చిక్కుపఱచె
తే. నతనికోల్తల కోర్వక యద్రిచరులు, కాండపీడితులై భీతి గడలుకొనఁగఁ
బఱచి రఘుకులవర్యునిమఱుఁగు సొచ్చి, రపుడు సుర లజుమఱుఁగున కరిగినట్లు.
ఆ. రావణప్రయుక్తుఁ డై విరూపాక్షుండు, చలము బలము గినుక జవము మెఱయ
సంభ్రమమున నఖిలశస్త్రోపకల్పితం, బైననగసమానహస్తి నెక్కె. 2221
క. నింగి పగులంగ నార్చుచుఁ, బొంగి నిశాటులకుఁ బ్రీతి పుట్టించుచు మా
తంగశ్రేష్ఠమును వెసఁ బ్లవంగబలము నడుమ నిలిపి వారనియలుకన్. 2222
క. కరలాఘవ మొప్పఁగ వన,చరపతిసర్వాంగమర్మసంధులు నాటం
గుఱిసేసి భుజగసన్నిభ,శరములు నిగుడించెఁ బెక్కుచందముల వడిన్. 2223
చ. కపివిభుఁ డిట్లు రాత్రిచరకార్ముకముక్తశరాతివిద్ధుఁ డై
యపు డతికోపవేగమున నక్షుల వహ్నికణంబు లొల్కఁగా
విపులమహీరుహంబు గొని వేగమె వాని వధించు కోర్కెఁ
జపలగతి న్మృగాధిపునిచాడ్పున నేగె గజంబుమీఁదికిన్. 2224
క. హరివిభునిరయము గనుఁగొని, విరూపనేత్రుఁ డతిభీతి వేగం బడరం
గరిమీఁద నుండి తడయక, ధరణికి లంఘించెఁ గపివితానము నవ్వన్. 2225
ఆ. అంత వానరేంద్రుఁ డాకుజంబున సామ,జంబు నేయ నది శిరంబు వగిలి
వింటిపెట్టుదవ్వు వెనుకకు ఘీంకార,మడరఁ బఱచి చచ్చి యచటఁ బడియె. 2226
క. వానరనాథునిచేఁ దన, యేనుఁగు రణభూమిఁ బడుట వీక్షించి వెసన్
దానవుఁడు చిత్తమున నభి,మానము రోసముఁ జలంబు మల్లడిగొనఁగన్. 2227
క. వాలును బలుకయుఁ గైకొని, కాలానలులీలఁ జాలఁ గనలుచు రక్షః
పాలుఁడు శమనునికైవడిఁ, గ్రాలుచు గపివిభుని కెదురుగాఁ జనుదెంచెన్. 2228
క. ఆలో దినేశతనయుఁడు, శైలాగ్రం బొకటి తెచ్చి సాహస మడర
న్వాలమునఁ జుట్టి విసరి వి,శాలబలం బలర రాత్రిచరుపై వైచెన్. 2229
క. వైచినదానిం గని రజ,నీచరవీరుండు నిశితనిస్త్రింశమున
న్బాహ్యిచర్య మెసఁగ నచలుం, డై చూర్ణముచేసె నడుమ నయ్యచలంబున్.
ఆ. దనుజుఁ డిట్టు వ్రేటు దప్పించుకొని డాసి, వేగ యినజు ఖడ్గవిద్ధుఁ జేయ
నొచ్చి యతఁడు మూర్ఛవచ్చిన నొక్కింత, సొలసి యంతలోనఁ దెలివినొంది.
క. అక్షుల నిప్పులు రాలఁగ, వీక్షించి సురేంద్రహేతి కెనయగుముష్టిన్
లక్షించి రాక్షసునిపెను,వక్షంబునఁ బొడిచె దైత్యవర్గము బెదరన్. 2232
క. దానికి నించుక స్రుక్కక, దానవుఁడు నిశాతఖడ్గధారాభిహతి
న్వానరవల్లభు సొగియం, గా నేసిన నతఁడు నొచ్చి కడువేగమునన్. 2233

ఉ. క్రమ్మఱఁ దెల్వినొంది బలగర్వ మెలర్పఁగ వానిఱొమ్ము వే
ళమ్ముగ వజ్రసన్నిభతలంబున వ్రేసిన దాని కాత్మలో
నుమ్మలికంబు నొందక సముద్ధతి వాఁడు వనాటరాజువ
క్షమ్మొగి ముష్టిచేఁ బొడిచె సాంద్రకృశానుశిఖ ల్జనింపఁగన్. 2234

క. దనుజునివ్రేటు కపీంద్రుఁడు, వనచరపతివ్రేటు దానవశ్రేష్ఠుం డా
య్యనఁ దప్పించుకొనుచు నేర్పున నతిముఱఁ బోరి రిరువురు ప్రచండగతిన్.

శా. అన్యోన్యభ్రమణంబు సేయుచు జిగీషాయత్తు లై మీఁది క
న్యోన్యం బుద్ధతిఁ బట్టి యె త్తి ధరపై నత్యుగ్రు లై వైచుచున్
సైన్యంబు ల్వెఱఁగంది చూడఁగ మహాసత్త్వాఢ్యు లై పెంపునన్
జన్యక్రీడ యొనర్చి రిద్దఱును ముష్టాముష్టి ఘోరంబుగన్. 2236

వ. ఇట్లు మహాద్భుతప్రకారంబునం బోరు నెడ నెడ గని సుగ్రీవుండుమహేంద్రాశని కల్పం బైనపాణితలంబున విరూపాక్షునిఁ బెడతలవ్రేసిన నయ్యాతుధానుండు శిరంబు పగిలి రుధిరక్లిన్నశరీరుం డై సఫేనం బగుశోణితంబు గ్రక్కుచు వికృత వదనుం డై వివృత్తనేత్రుం డై వికృతనాదంబు సేయుచుఁ బుడమిం బడి పొర లుచుఁ బ్రాణంబులు విడిచె నిట్లు విరూపాక్షతరుం డై ధరణిం గూలిన విరూ పాక్షు నీక్షించి వానరులుపరమానందభరితాంతఃకరణు లై సుగ్రీవునిఁ బ్రశంసిం చిరి వానరబలంబు మహోద్వేలగంగాప్రతిమం బై తన్నియోగంబునం జెలరేఁగి నానాప్రకారంబుల రాక్షసుల నుగ్గునూచంబు గావింపం దొడంగినఁ దదా టోపంబున కోర్వక రాక్షసబలంబు భయభ్రాంతం బై నిదాఘసంతప్తజలా శయంబుకరణిఁ బరిక్షోభంబునొంది పద్మపత్రగతజలంబులమాడ్కిఁ దల్లడిల్లుచు దశదిశలకుం బాఱె నప్పుడు రావణుండు స్వబలవిఘాతంబును విరూపాక్షు వధంబును విలోకించి దైవవిపర్యయంబు చింతించి గాఢవ్యథాక్రాంతుం డై కోపంబు రెట్టింప సమీపస్థుం డై నయుద్ధోన్మత్తుం డగుమహోదరు నవలోకించి యిట్లనియె. 2237

సీ. అమరారివర్య యీసమయంబునం దీవు దక్క వేఱొకఁడు యుద్ధంబుఁ జేసి
విజయ మొసంగెడు వీరుండు లేఁ డిది పార్థివునిఋణంబుఁ బాపుకొనుట
కవసరం బిపుడు శౌర్యం బంతయును జూపి పగఱ నిర్జింపుము భండనమున
ననిన నద్దానవుఁ డట్ల గావించెద నని రణోత్సాహ మాస్యమునఁ జెలఁగ

తే. నద్భుతాటోపయుతుఁ డై మహామకరము, వారినిధిఁ జొచ్చినట్లు దుర్వారభంగి
రథముఁ బఱపించి శత్రువర్గంబుసొచ్చి, వృక్షచరులను సాయకవృష్టి ముంచె.

చ. అమితబలాఢ్యు లైనవిపినాటులు పాణిధృతాశ్మవృక్షు లై
సమదగతి న్సముద్ధత నిశాచరసైన్యముఁ జొచ్చి దైత్యులన్
గ్రమమున వ్రేసి యార్చి రది గన్గొని వాఁ డలుక న్ప్రచండకాం
డము లడరించి కీశచరణంబులుఁ జేతులుఁ ద్రుంచె బల్విడిన్. 2239

ఉ. దానవచాపముక్తశితధారశరార్దితులై వలీముఖు
ల్ప్రాణభయంబునం జెదరి పాఱి మహీధరకందరంబులం
గాననసీమల న్నదులఁ గంధితటంబులఁ బల్వలంబులన్
మానక వృక్షషండములమాటున డాఁగిరి వీతగర్వులై. 2240

క. మొన విఱిగి పఱచుసేనల, వెనుకొని వడిఁ దఱుముదైత్యవీరుని మ్రోలం
గనుఁగొని పంకజబాంధవ, తనయుఁడు కోపించి దష్టదశనచ్ఛదుఁడై. 2241

క. కులగిరినిభఘోరాతత, శిల నొక్కటి గొని గడంగి చిడిముడి గదుర
న్బలియుఁ డగురాక్షసునిపై, బలముకొలఁది విసరివైచె బటురోషమునన్. 2242

క. ఈచందంబునఁ బెనుశిల, వైచిన దానిఁ గని వేగవంతుండై దో
షాచరుఁ డుడుగక పటునా,రాచంబుల నడుమ నూఱువ్రయ్యలు సేసెన్. 2243

క. సమరోన్మత్తవిశాలశ, యముక్తసాయకనికృత్తమై యాఘోరా
శ్మము మింటనుండి వెస గృధ్రమండలముమాడ్కి నవుడు ధరణిం గూలెన్.

క. శిల నుగ్గై కూలుట గని, జలజాతసఖాత్మజుండు సక్రోధుండై
యలఘుబలంబున సాలము, పలలాశనుమీఁద వైచె బటురవ మెసఁగన్. 2245

క. దానికి నించుక దలఁకక, దానవుఁడు శరత్రయమునఁ దద్వృక్షంబున్
మానక ఖండించి తపన, సూనునిమర్మములు నాటఁ జొనిపెం దూపుల్. 2246

మ. తనవృక్షం బటుభగ్నమై పడుటకుం దన్నాసురారాతి చ
య్యన నానాంబకవిద్ధుఁ జేయుటకుఁ గీశాధీశ్వరుం డల్గి యా
దనుజశ్రేష్ఠుని తేరిపై కుఱికి కోదండంబు ఖండించి సూ
తుని మర్దించి పతాక గూల్చి హరులం దున్మాడి యత్యుద్ధతిన్. 2247

చ. అరదముమీఁద నున్నపరిఘాయుధము న్గొని డాసి క్రవ్యభు
గ్వరుని వధింపఁ జూచిన జవంబున వాఁడు రథంబు డిగ్గి భీ
కరగతి నార్చి వేగ గద గైకొని మచ్చర మొప్పఁ దాఁకె వా
నరపతి తేరు డిగ్గి జతనంబున నాతనిఁ దాఁకె నుద్ధతిన్. 2248

వ. ఇవ్విధంబున నన్నగనిశాచరవరులు గదాపరిఘహస్తులై విద్యుత్సమన్వితంబు
లైనఘనంబులమాడ్కిఁ దలపడి గోవృషంబులచందంబున ఱంకెలువైచుచుఁ
బ్రచండభంగిం బోరునెడ సంక్రుద్ధుండై తాపవంతుండునుయుద్ధోన్మత్తుండునగు
మహోదరుండు గదాదండంబు జిఱజిఱం ద్రిప్పి వైచినదాని నవలోకించి సుగ్రీ
వుండు రోషతామ్రాక్షుండై తనచేతిపరిఘంబు విసరివైచిన నయ్యాయు
ధంబులు రెండు నొండొంటిం దాఁకి పరస్పరహతంబులై పుడమిం గూలె నంత
సుగ్రీవుండు రథంబుపై నిడినకాలాయసమయంబైనముసలంబు గొని విసరి
వైచిన నద్దనుజపుంగవుండు వేఱొక్కగదగొని వైచిన నవి రెండును బరస్పర
సంఘర్షణంబున భిన్నంబులై ధరణింబడియె నిట్లాయుధంబులు నుగ్గై రా

లీన నయ్యిరువురు ముష్టియుద్ధంబునకుం దలపడి తేజోబలసమన్వితు లై దీప్త
హుతాశనులచందంబున వెలుంగుచు ఘనాఘనంబులకరణి సారెసారెకు గర్జిం
చుచు మత్తకంఠీరవంబులమాడ్కి విక్రమించుచు మర్మంబు లెఱింగి యొండొ
రులం బ్రహరించుచుఁ బరస్పరప్రహారపీడితు లై సొలసి ధరణితలంబునం బడి
యంతలోనఁ దెలిసి యొండొరులం బొడుచుచుఁ బరువు లెత్తుచుం బఱతెంచి
యురవష్టిం దాఁకుచు బాహుయుద్ధంబు నశ్రమంబునొంది తత్సమీపంబున
నున్ననిశితఖడ్గంబులు గొని రోషపరీతస్వాంతు లై సాహసధైర్యశౌర్యలాఘ
వంబు లేర్పడఁ దమశస్త్రవైశారద్యంబునకు మెచ్చుచు నుభయసైన్యంబులు
వెఱఁగుపడి సూచుచుండ సవ్యాపసవ్యమండలప్రచారంబులం దిరుగుచు నన్యో
న్యజయకాంక్షు లై ఛిద్రాన్వేషణంబు సేయుచు ననేకమార్గంబులం బోరునప్పు
డు మహోదరుండు ఖడ్గంబున సుగ్రీవుని వ్రేసిన నవ్వనచరనాథుండు నేర్పున
వ్రేటు దప్పించుకొని తనచేతిఖడ్గంబునఁ గిరీటకుండలోపహితం బయినరాక్షసు
నిశిరంబు ధరణీతలంబున డొల్ల నేసిన నత్తెఱంగు విలోకించి. 2249

మహోదరుఁడు సుగ్రీవునిచేఁ జచ్చుట.

క. భగ్నం బై కమలదళవి, లగ్నజలముకై వడిం దలంకుచుఁ బరమో
ద్విగ్నం బై దుఃఖార్ణవ, మగ్నం బై రాత్రిచరసమాజము పాఱెన్. 2250

క. హృష్టుం డై శూరజనవ,రిష్ఠుం డై భూరుహాచర ఋషిస్తుతి సం
తుష్టుం డై విజయరమా, జుష్టుం డై యలరె సూర్యసుతుఁ డవ్వేళన్. 2251

క. గుము లై జయనాదజితా,భ్రము లై పాణిధృతపాదపము లై సంతు
ష్టము లై గగనోద్యతవా,లము లై యపు డద్రిచరబలంబులు చెలఁగెన్.

క. ఘను లై కృతజయజయని,స్వను లై దైత్యవధజనిత సంభ్రమలసితా
నను లై పరివేష్టితముని, జను లై విలసిల్లి రాకసమున సుపర్వుల్. 2253

క. ధీరుం డై ప్రకటితదో,స్సారుం డై విజయలబ్ధసాంద్రానందో
దారుం డై చిత్తహారా,కారుం డై రాముఁ డలరెఁ గదనక్షోణిన్. 2254

క. ఖిన్నుం డై బంధువధవి,పన్నుం డై శోకజనితబాష్పజలపరి
క్లిన్నుం డై రోషపటు, చ్ఛన్నుం డై యుండెఁ బుణ్యజనవిభుఁ డచటన్. 2255

ఉ. దేవసమప్రభావుఁ డతిధీరుఁడు వానరవల్లభుండు సు
గ్రీవుఁడు యాతుధాను నిటు గీటణఁగించి కృతార్థుఁ డై ప్లవం
గావృతుఁ డై నవీనరుధిరాప్లుతుఁ డై విజయాభిరాముఁ డై
యావసుధీశుఁ డున్నవిషయంబునకు న్జనియె న్ముదంబునన్. 2256

సీ. అంత మహోదరుఁ డాదిత్యసుతునిచే హతుఁ డౌట గని మత్తుఁ డధికరోష
రక్తాక్షుఁ డై తేరు రయమునఁ బఱపించి వెదకి వానరలోకవిభునిఁ గాన
కొడు గఱచి మ్రోల నత్యుగ్రుఁ డై నిండికొని యున్నవాసవి తనయుసైన్య
గహనంబు సొచ్చి భీకరశరానలహేతివితతులఁ గాల్చుచు విక్రమించి

తే. యమితవాతంబు తాలఫలములఁబోలె, మహితవానరవీరుల మస్తకములు
భల్లముల డొల్లనేయుచుఁ బాదపాణి, జానుజంఘోరుమధ్యము ల్లక్కు సేసె.

క. అసురకరముక్తసాయక, విసరవిభిన్నాంగు లగుచు వృక్షచరవరు
లైనచెడి సమరవిముఖు లై, వసమతి యుండిరి విషణ్ణవదనంబులతోన్. 2258

క. తనసైన్యం బట్లగుటకు, మనమునఁ గనలూది శక్రమనుమఁడు పర్వం
బునఁ బొంగునముద్రముక్రియ, ఘనరయ మంగీకరించి కడురభసమునన్.

క. హేళిమరీచిసమప్రభ, కాలాయసమయవిశాలకఠినపరిఘము
నీలఁ గొని విసరి రక్షః,పాలునివక్షమున వైచెఁ బటురోషమునన్. 2260

వ. మత్తుండు తత్ప్రహారపీడితుం డై మైమఱచి నెత్తుటంజొత్తిల్లినశరీరంబుతో రథం
బుమీఁదనుండి పుడమింబడియె నంతలోన నీలాంజనచయోపముండును మహా
వేగుండును దేజస్వియు సవిద్యున్మేఘసన్నిభుం డగుజాంబవంతుండు క్రుద్ధుం డై
గిరిశృంగసన్నిభం బైనవిపులగ్రావం బొక్కటి యెత్తి బలంబుకొలంది తద్రథం
బుపై వైచి సూతాశ్వసహితంబుగా నుగ్గు గావించె నంత నొక్కముహూర్త
మాత్రంబునకు గ్రమ్మఱ లబ్ధసంజ్ఞుండై మత్తుండు తన మ్రోల నున్నవానరపోత్రు
నవలోకించి తదీయస్తనాంతరంబున దశవిశిఖంబులు నాటించి పదంపడి మూఁడు
వాఁడితూపులు జాంబవంతునిమేనం గీలుకొల్పి పదిసాయకంబుల నీలునిమర్మం
బులు నొప్పించి పంచశిలీముఖంబుల గవయుం దూలనేసి సింహనాదంబు గా
వించిన నప్పు డంగదుండు శరనిపీడితు లైనవానరుల నవలోకించి క్రోధమూ
ర్ఛితుం డై రయంబున. 2261

మ. ఇనరశ్మిప్రతిమానదీప్తపరిఘుం బేర్పారఁగాఁ జేతులం
గొని పల్లార్చు మిడుంగుఱు ల్చెదర నుగ్రుండై వడిం ద్రిప్పి గ్ర
ద్దన నద్దైత్యుని బొమ్మునం బడ వధార్థం బుద్ధతి నైన్యవ వే
చని యాశస్త్రము వానిచాపము శిరస్త్రాణంబు ద్రుంచె న్రహిన్. 2262

తే. వాలిసుతుఁ డిట్లు దైత్యుని వరకిరీట,కార్ముకంబులు ధరఁ గూల్చి కడిమిమెఱసి
మకరకుండలయుక్తమై మలయువాని, కర్ణమూలం బదర నేసెఁ గరతలమున.

ఉ. దానికి నించు కైన మదిఁ దల్లడ మందక ధైర్య మూఁది యా
దానవుఁ డల్గి ఘోరసముదగ్రనిశాతమహాహిసన్నిభా
నూనపరశ్వధం బరిజను ల్బెగడొందఁగఁ గేలఁ బూని యా
వానరనాథనందనుని వామభుజం బదరంట నేసినన్. 2264

అంగదునిచే మత్తుఁడు చచ్చుట.

సీ. వనచరోత్తముఁడు నేర్పున దానిఁదప్పించుకొని కృతాంతునిమాడ్కిఁగనలివేగ
మంగీకరించి దురంతసత్త్వముఁ బెంచి చతురత మర్మదేశం బెఱింగి
పిడుగున కెనయైనఁ బిడికిట మత్తుని వక్షంబుఁ బొడిచిన వాఁడు బొమ్మ
వగిలి రొఁజుచు నేలఁ బడి శోణితము నోట వెడలఁ బ్రాణంబులు విడిచె నతని

తే. పాటు గనుఁగొని రాక్షసబలము పఱచె
వనచరబలంబు సంతోషమునఁ జెలంగె
దైత్యవల్లభుఁ డైనయాదశముఖునకు
వెఱఁగుపాటును శోక మావిర్భవించె. 2265

ఉ. అప్పుడు సంప్రహృష్టవిపినాటులపుష్కలసింహనిస్స్వనం
బుప్పురవీథి నున్న పురుహూతముఖామరహర్షనిస్స్వనం
బొప్పఁగ నొక్కటై గిరివనోపవనాలయసంయుతంబుగా
నప్పులదిండిజేనిపురి నెంతయు బ్రద్దలువాపె నెంతయున్. 2266

వ. అంత నద్దశగ్రీవుండు దేవవానరులమహాప్రణాదం బాలకించి సహింపక రోషవివశుండై వెండియు భండనంబున కాభిముఖ్యంబు వహించి మృతులైనమహోదరవిరూపాక్షులను గాందిశీకులైనతక్కినబలవంతులైనరాక్షసులం దలంచుకొని కన్నీరునించి యొక్కింతసేపు కార్యశేషంబు చింతించి సైన్యంబుల రణంబునకు మరలించి రథంబు దోలు మని సూతున కాజ్ఞాపించి యెల్లవారలు విన వాని కిట్లనియె. 2267

సీ. రణరంగమున నేఁడు రాజపుత్రులఁ ద్రుంచి హతులైనమంత్రులవితతదుఃఖ మగచరబలరుద్ధ మైనమత్పురిదుఃఖ ముపనయించెదఁ దోలు మరద మిపుడు రాఘవుఁ డన నొక్క రమణీయవృక్షంబు భూపుత్రి దానికిఁ బుష్పఫలము హనుమదంగదనీలపనసనుషేణజాంబవదాదియూథాధిపతులు కొమ్మ

తే. లరయ మూలంబు హతమైన నన్నియును హ
తంబులై నట్లు సంగ్రామధరణి నతఁడు
నిహతుఁ డైన దక్కినవారు నిహతు లగుదు
రతఁడ కాఁడె భుజావిక్రమాధికుండు. 2268

క. అని పలికి పటుశతాంగ, ధ్వని రోదసి నిండఁ జెలఁగఁ దద్దయు రభసం
బున రాముఁ డున్నచోటికిఁ, జనియెఁ దశముఖుఁడు దశదిశలు కంపింపన్. 2269

తే. మును హరి త్రివిక్రమమునందు దనుజవరులు
వెఱచి పఱచినక్రియ దైత్యవిభునిఁ జూచి
ప్లవగచరులు రణంబున వెఱచిపఱచి
వచ్చి రఘుపతి శరణంబుఁ జొచ్చి రపుడు. 2270

రావణుండు మరల యుద్ధమునకు వెడలుట.

ఉ. వారలఁ జూచి రాజకులవల్లభుఁ డోడకుఁ డంచుఁ బల్కి సొం
పారఁగఁ గాలమేఘముక్రియ న్వడి మ్రోయుచు విల్లుదాల్చి దు
ర్వారపటుప్రతాప మడరం జనుదెంచునిశాచరేంద్రుని
న్వారక మ్రోలఁ జూచి హితవాది విభీషణుఁ గాంచి యిట్లనున్. 2271

ఉ. దవ్వుల నీలశైలమువిధంబునఁ గ్రాలుచుఁ జాపటంకృతు
ల్నివ్వటిలంగ వర్మరుచి నింగిఁ జెలంగఁగ బాణపాణి యై
క్రొవ్వునఁ గీశులం గనుపుగొట్టుచు బల్విడి వచ్చుచున్నవాఁ
డెవ్వఁడు దైత్యసత్తమ తదీయవిశేషము మాకుఁ జెప్పుమా. 2272

వ. అనిన విని యవ్విభీషణుం డవ్వసుమతీవల్లభున కిట్లనియె. 2273

ఉ. రాజకులప్రదీప యలబ్రహ్మకు మన్మఁడు విశ్రవస్సుతుం
డాజి నజయ్యుఁ డస్త్రవిదుఁ డద్భుతవీర్యుఁడు దైత్యకోటికి
న్రాజగు రావణుం డితఁ డరాతి భయంకరమూర్తి క్రూరుఁ డం
భోజభవప్రసాదమున ముజ్జగము ల్గయికొన్నవాఁ డొగిన్. 2274

తే. పాపకర్ముండు క్షుద్రుండు పండితుండు
క్రూరచిత్తుండు దారుణాచారుఁ డాజి
నమరవీరుల దోర్దర్ప మడఁచి జయము
గొన్నవాఁ డతివిఖ్యాతి గన్నవాఁడు. 2275

తే. తపము పెంపున మును దేవదానవులను
సంగరంబున గెలిచినచతురుఁ డితఁడు
వానరుల బల్మిఁ దోలుచు వచ్చుచున్న
వాఁడు వీని వధింపుము వసుమతీశ. 2276

క. అన విని రాముఁడు విలు గయికొని సజ్జ్యముఁ జేసి సాంద్రగుణ నిర్ఘోషం
బొనరించి యలవిభీషణుఁ, గనుఁగొని గాంభీర్య మెసఁగఁ గ్రమ్మఱఁ బలికెన్.

క. నీచాత్ముఁ డైనయీరజనీచరపతి దైవికమున నేఁటికి నాకుం
గోచరుఁ డయ్యె నితని దెగఁ, జూచి కృతార్థత వహింతుఁ జూడుము మిత్రా.

క. అని పలికి బాణ మొక్కటి, ధనువున సంధించి తిగిచి దశముఖుపై నే
సినఁ దలఁక కతఁడు దానిం, గనుఁగొని భల్లత్రయమున ఖండించె వెసన్. 2279

చ. దనుజనికృత్తసాయకము తప్పక గన్గొని చాపభృద్వరుం
డనుపమబాహువీర్యుఁడు బలాఢ్యుఁడు లక్ష్మణుఁ డల్కఁ బూని లో
చనములఁ గెంపుసొం పెసఁగఁ జండతరస్ఫుట చాపశింజినీ
స్వనమునఁ బెక్కురక్కసులఁ జావగఁ జేసె మహాద్భుతంబుగన్. 2280

చ. జలధులు తల్లడిల్లఁ గులశైలము లట్టిటు కంప మొంద ది
క్కులు గలఁగంగ నాకసము కుంభిని బ్రద్దలువాఱ సాంద్ర మై
కదియఁగ మ్రోయులక్ష్మణునికార్ముకనిస్వన మాలకించి వే
ల్పులు వెఱఁగంది రాదనుజపుంగవుఁ డెంతయు విస్మితాత్ముఁ డై. 228

క. కర మల్గి నిశితసాయక, మురవడిఁ గొని తనదుమ్రోలనున్నసుమిత్రా
వరపుత్త్రుఁ జూచి పవినిభ, పరుషోక్తుల నిట్టు లనియెఁ బటుగర్వమునన్. 2282

చ. నరవరపుత్త్ర చూడు మిదె నాదుశిరంబులు వజ్రభూషణ
స్ఫురితము లై మహారజతపుంఖము లై నిశితంబు లై హరి
ద్ధరణిముఖంబు లై విమతదర్పనిషూదనదక్షిణంబు లై
పరువడిఁ గాలసర్పములభంగిఁ జెలంగుచునున్న వెంతయున్. 2283

చ. అరుదుగ నన్నుఁ గన్గొని భయంపడి పాఱక నిల్వ మీశరో
త్కర మిటు నీదుశోణితము తప్పక పానము సేయు నంతటం
బరువడి నీవు ప్రాణములఁ బాసి కృతాంతునిరాజధాని కి
ప్పురమున నేగె దస్త్రములు బాణము లన్నియు నేయు మిత్తఱిన్. 2284

చ. అన విని లక్ష్మణుండు హృదయంబునఁ గోపము చెంగలింప న
య్యనిమిషవైరిఁ జూచి యసురాధమ కార్ముకబాణపాణి వై
ఘనరథ మెక్కి కైదువులు గైకొని వచ్చితి వాజిలోన నీ
సునిశితశౌర్య మంతయును జూపుము వ్యర్థదురుక్తు లేటికిన్. 2285

ఉ. నీదుపరాక్రమక్రమము నీశరనైపుణ మంత చూచి యా
మీఁద సమీరణుండు వడిమీఱఁగఁ బక్వఫలంబులం బలెన్
మేదురశాతకాండముల నీశిరము ల్పడఁగూల్తు వట్టివా
గ్వాద మొనర్చినం జయము గల్గునె నీ కిటు చావు దప్పునే. 2286

తే. తప్తకాంచనభూషణోద్ధతమదీయ, మేదురశిలీముఖములు నీమేన వ్రాలి
వితతముగ నేఁడు నీదుశోణితముగ్రోలు, దానవారాతు లమృతంబుఁ ద్రావినట్లు.

క. అనిన విని రాక్షసేంద్రుఁడు, మనమునఁ గోపించి యొక్కమార్గణము రయం
బున లక్ష్మణుపై నేసినఁ, గని యవ్వీరోత్తముండు కడురోషమునన్.

క. చండాశీవిషసన్నిభ, కాండం బడరించి దాని ఖండించినఁ ద
త్కాండము శతఖండంబై, మండుచు మహి వ్రాలె మును లమరులునుతింపన్.

ఉ. దానికి నల్గి రావణుఁడు దాశరథిం బ్రదరాళిఁ గప్పి య
వ్వానరసేనమీఁద శరవర్ష మొగిం బరఁగించి యంగదు
న్భానుసుతు న్విభీషణుని బాణపరంపర ముంచి ఘోరవై
శ్వానరహేతికల్పశరజాలము లేయుచుఁ జేరె రామునిన్. 2290

క. చేరిన రావణు గన్గొని, ధీరుఁడు రఘువల్లభుండు తీవ్రాంబకముల్
దారుణగతి నేయుచుఁ గరిఁ, జేరుమృగేంద్రంబులీలఁ జేరె న్వానిన్. 2291

వ. ఇట్లు క్రోధావేశవివశు లై పరస్పరజయకాంక్షలం దలపడిన యారామరావ
ణులకు ఘోరంబును జీవితాంతకరంబును రోమహర్షణంబు నగుమహాయుద్ధం
బయ్యె నప్పుడు. 2292

### రామరావణుల యుద్ధము.

ఉ. రాక్షసలోకవల్లభుఁడు రామునిదివ్యశరప్రవేగము
దక్షతయు న్బలంబును బ్రతాపము లాఘవ మంత చూచి వాఁ

డక్షుఁడై శితాగ్రవిశిఖావలి సమ్మహనీయుఁ గప్పి హ
ర్యక్షసమాను లక్ష్మణుని నస్త్రగణంబుల ముంచి వైచియున్. 2293

శా. శైలాంభోధివనావృతాఖిలమహీచక్రంబు గంపింప నా
భీలాస్త్రంబులు శక్తు లుగ్రశరము ల్భీమాయుధశ్రేణి వా
త్యాలుం డిచ్చినదివ్యసాధనము లాకాశంబు నిండ న్శిఖ
జ్వాలాభీలముగా మహీరుహచరవ్రాతంబుపై నేసినన్. 2294

క. యూథాధిపతులు వాతెఱి, భూధరచరబలము తత్సుపుంఖవిశిఖసం
బాధితమై ధరణిం బడ, బాధాకుల మయ్యె దిగ్విభాగము లెల్లన్. 2295

క. ధరణీపరాగ మెగసెను, హరిదంతము లతిభయంకరాకృతు లయ్యెన్
హరిసైన్యము ఝంఝానిల, పరిధూతం బైనజలధిభంగిఁ దలంకెన్. 2296

క. ఈకరణి రాక్షసేంద్రుఁడు, వీఁక నమోఘాస్త్రశస్త్రనికరంబుల న
స్తోకగతి వానరావళిఁ, జీకాకుపఱంగఁ జేసి చిడిముడిఁబడుచున్. 2297

సీ. వనజాతనేత్రుఁ గూడినమహేంద్రునిభంగి ననుజన్మసహితుఁడై యలరువాని
కంపాలతాయుక్తసజలాంబుదముమాడ్కి నురుకార్ముకము దాల్చియున్నవాని
గంధవాహప్రయుక్తహుతాశనునిలీలఁ బృథులకోపమున దీపించువాని
నలుపైనకెందామరలఁ బోలురోషారుణితలోచనంబుల నెగడువాని
తే. దీర్ఘబాహు నరిందము దీప్తతేజుఁ, బీనవక్షు బరాక్రమస్థానభూతు
నజితు నపరాజితు నదీను విజయశీలు, రాజలక్షణలక్షితు రాముఁ గాంచి. 2298

క. కోపంబుఁ బెంచి దారుణ,రూపం బంగీకరించి క్రూరాత్ముం డై
చాపంబు వంచి దిక్కులు, వాపోవఁగ శింజినీరవం బొనరించెన్. 2299

వ. అంత మహాతేజుం డగురాముండు భగ్నం బై పఱచునిజానీకం బాలోకించి
రక్తాంతవీక్షణుండై సౌమిత్రిసహితంబుగా మహాప్రమాణవిపులం బైనకోదం
డంబు సారించి ఘనభోంతరాళంబు నిండ గుణప్రణాదంబుఁ జేసిన. 2800

క. సురవైరిచాపరవమున, నరనాథధనుర్గుణప్రణాదంబున ను
ర్వర వణఁకె నభము పగిలె న, సురసైన్యము మూర్ఛమునిఁగి క్షోణిం ద్రెళ్లెన్.

తే. రాక్షసేశ్వరుఁ డప్పు డారాజసుతుల
కాండపథముఁ బ్రాపించి నక్షత్రనాథ
భాస్కరులమ్రోల నున్నస్వర్భానుపగిది
సొంపుచెడి వెల్లనై ప్రకాశింప కుండె.

వ. ఆసమయంబున శుభలక్షణుం డగులక్ష్మణుం డఖండకోదండపాండిత్యంబు నతి 2802
యమెఱసి ప్రచండమార్తాండునిభంగి నతిదుర్నిరీక్షుం డై యుద్ధనిజమండలా
ఖండలుతోఁ బ్రథమభండనంబు తా నొనరింప సమకట్టి. 2803

క. దిశ లద్రువ శిఖిశిఖోపము, విశిఖంబులు పెక్కు పఱప వినువక వెస న
ద్దశముఖుఁడు వాని నన్నిటి, నిశితశరము లేసి నడుమ నేర్పునఁ దునిమెన్. 2804

క. ఒకటి కొకటి రోసము డిం,పక మూఁటికి మూఁడు మఱియుఁబదిటికిఁబది నూఁ
టికి నూఱమ్ములు పఱపి న్పృ,పకుమారునిసాయకములు సాయక దునిమెన్.

క. తక్కక పటుకోపంబున,నక్కజముగఁ బెక్కుదారుణాశుగములు పే
రుక్కున నేయుచు లక్ష్మణుఁ, జిక్కువడం జేసి కడువిశృంఖలవృత్తిన్. 2806

ఉ. సాంపుగఁ బాణిలాఘవముఁ జూపుచుఁ గార్ముకకౌశలంబు దీ
పింపఁ బృషత్కవృష్టి పరపించుచు వింశతిలోచనంబులం
గెంపు సెలంగ లక్ష్మణుని గేవలశక్తి నతిక్రమించి పై
రింపఁగ రానిరోస మిఁగురింపఁగ రామునిఁ జేరి ధీరతన్. 2807

క. కాలాంబుదంబు కాంచన,శైలముపై వృష్టి గురియుచందమున మహీ
పాలకులశేఖరునిపై, వాలాయము సాంద్రబాణవర్షము గురిసెన్. 2808

ఉ. రావణకార్ముకచ్యుతశరంబులు గన్గొని రాముఁ డస్త్రవి
ద్యావిదుఁ డుగ్రుఁ డై నిజశరాసన ముక్కిడి ముక్తకంచుకా
శీవిషతుల్యభల్లములు చెచ్చెర వేయుచు వాని నన్నిటిం
జేవ దలిర్పదుత్తుమురు సేసె సుర ల్వెఱఁగంది చూడఁగన్. 2809

క. రాఘవుని రావణుం డా,రాఘవుఁ డారావణునిఁ బరస్పరమును దో
ర్లాఘవ మొప్పఁగ వివిధశ,రాఘంబులఁ గప్పి రప్పు డతిసాంద్రముగన్. 2810

క. ఒండొరులమీఁద నురవడిఁ, జండగతి న్బఱచు వివిధశరతతి యునిలో
నొండొంటిఁ దాఁకి మిక్కిలి, మండుచు సాంద్రముగ గగనమండలి నిండెన్.

వ. ఇట్లు మహాద్భుతప్రకారంబునం దలపడి సకలాస్త్రశస్త్రవిశారదులును బరాక్ర
మధుర్యులును మహాహవులును రణకర్మనిపుణులునగు రామరావణులు సవ్యా
పసవ్యమండలప్రచారంబులం దిరుగుచుఁ బరస్పరచ్ఛిద్రాన్వేషణంబు సేయుచు
విచిత్రక్రమంబులం జూపుచు యమాంతకసన్నికాశు లై చూపఱకు భయంబు
పుట్టించుచు రౌద్రరసోల్లాసభాసురవదను లై కదనవైశారద్యంబుఁ జూపుచుఁ
గాలమేఘంబులు వృష్టిధారలు గురియుచందంబున నిరంతరంబుగా నొండొరుల
మీఁద బాణవర్షంబులు గురియుచు నన్యోన్యజయకాంక్ష లినుమడింప దారు
ణంబుగాఁ బోరుచుండ నప్పుడు తదీయబాణవేగంబుఁ జూచి సర్వభూతంబులు
భయంబునం బఱచె నానావిధసాయకపరిచ్ఛన్నం బై గగనంబు విద్యుజ్జ్వాలికా
సమాకులం బైనప్రావృణ్మేఘంబులచేతఁ బరిచ్ఛన్నం బైనపగిదిఁ జూపట్టె మఱియు
నయ్యంబరంబు శరవర్షంబున గవాక్షితం బైనచందంబునం దనరె నాగా
కృతతి వజ్రాగ్నిస్ఫురితాననంబు లగుతీక్ష్ణాగ్రసాయకంబుల నభివృతం బై యాకా
శంబు గాఢాంధకారపరివృతం బయ్యె నిట్లు సంధ్యాసమయసమావర్జితబలు లై

కాలాగ్నికిం గల వేఁడిమియు యుగాంతాదిత్యునకుం గల తేజంబును గల్పాంత వాయువునకుం గల వేగంబును బ్రళయకాలాంతకునకుం గల కోపంబును దమ యందు నెలసి మెఱయ వానరవృత్రులకరణి గరుడపన్నగంబులమాడ్కి సింహగజంబులపోల్కి విన్నాణంబుగాఁ జిరకాలంబు సంగ్రామంబు సలిపి రాసమయంబున నమ్మహావీరులశరోర్మ్యులు వాయుప్రవిద్ధంబు లైనమహోదధుల మహోర్మ్యులుంబోలెఁ దండోపతండంబు లై నభోమండలంబు నిండె నంత.

సీ. శక్రారి కోపించి సంసక్తహస్తుఁ డై లక్ష్మణాగ్రజునిలలాటమందు
గార్ముకచ్యుతఘోరనిర్ముక్తసంకాశరమణీయనిశితనారాచమాల
నాటింప నమ్మహీనాథోత్తముఁడు దాని మహితనీలోత్పలమాలనట్ల
శిరమునఁ దాల్చి తత్తఱపాటు నొందక సంక్రుద్ధుఁ డై మంత్రజప మొనర్చి
తే. కనుఁగొనలఁ దాప్రదీధితుల్ గ్రమ్ముదేర
నతధనుర్జ్యావిమాకర్షణం బొనర్చి
యుగ్రరౌద్రాస్త్రమంత్రప్రయుక్తఘోర
మార్గణము లేసెఁ బొగలేనియుంట లెసఁగ. 2813

క. శ్రేణీకృతంబు లై తద్బాణంబులు వేగ పఱచి దైత్యపతితను
త్రాణంబు దాఁకి వమ్మై, క్షోణిం బడెఁ గాని మేను సొర లేనయ్యెన్. 2814

ఆ. దివిజరిపుఁ డభేద్యకవచుఁ డౌ టెఱిఁగి న,ర్వాస్త్రకుశలుఁ డానృపాత్మజుండు
వ్రేలు గఱచి మరల వేఱొక్కపరమాస్త్ర, మేసె బాహువీర్య మినుమడింప.

క. ఆయస్త్రమువలన వివిధ, సాయకజాలములు వొడమి సత్వరముగ దై
తేయపతిఁదాఁకి ఘోరన, మ్రోయుచు ధరఁ బడియెఁ బంచముఖఫణులక్రియన్.

మ. అసురాధీశ్వరుఁ డిట్లు రాఘవునిదివ్యాస్త్రంబుఁ బో సేసి కో
పసముద్దీపితనేత్రుఁ డై కుపితసర్వప్రక్రియన్ రోఁజుచు
న్బస మీఱన్ శ్వసనాతివేగమున శుంభద్విక్రమాటోపుఁ డై
యసురాస్త్రం బడరించె నంతమున మాశాంతంబులం గ్రమ్మఁగన్. 2817

వ. ఇట్లు సమంత్రకంబుగాఁ బ్రయోగించినఁ దన్మహనీయాస్త్రప్రభావంబున సింహ శార్దూలకాకకంకసృగాలగృధ్రశ్యేన ఖరకోకగజోష్ట్ర వరాహశ్వాన కుక్కుట మకరాశీవిషమహామృగభల్లూకబలాకాచకోరవదనంబులును భయానకంబులును నేకానేకముఖంబులు నగునిశితసాయకంబు లనేకంబులు జనించి గగనంబు నిండినం గనుంగొని. 2818

క. పావకనిభుఁ డగురాముఁడు, భావంబునఁ గోప మూఁది పరమోత్సాహ
శ్రీ విలసిల్లఁగ గ్రక్కునఁ, బావకశర మేసె దైత్యపాలునిమీఁదన్. 2819

వ. ఇట్లు నిష్ఠాగరిష్ఠుం డై నిగిడించిన నాదివ్యాస్త్రంబువలన నగ్నిదీప్తముఖంబులును వజ్రసూర్యసంకాశంబులును జంద్రార్ధచంద్రవక్త్రంబులును ధూమకేతువదనంబ

బులును ధూమకేతువదనంబులును గ్రహనక్షత్రలపనంబులును మహోల్కా ముఖసన్నిభంబులును విద్యుజ్జిహ్వోపమంబులు నగునానావిధనిశాతబాణంబు లనేకంబులు వోదమి తండోపతండంబులై మెండుగా నభోమండలంబు నిండి కొని దశాననప్రయుక్తకాండప్రకాండంబుల నెల్ల నిశ్శేషంబుగా విలయంబు నొందించిన. 2320

ఉ. ఆవిధ మంతఁ జూచి విపినాటబలంబులు వాయుపుత్రసు
గ్రీవనలాదియూథపులు ప్రీతియుఁ గౌతుక మొప్ప రాము బా
హావిభవాభిరాముఁ గొనియాడుచు దిక్కులు పిక్కటిల్ల ని
చ్ఛావిధి సింహనాదములు సల్పిరి వాలములెత్తి యార్పుచున్. 2321

ఉ. ఆరఘువంశవర్యుఁడు దశాననకార్ముకనిస్సృతాస్త్రముల్
దారుణభంగిఁ ద్రుంచి ప్రమదంబునఁ గ్రాలుచు నుండె నంత నా
ధీరుఁడు రావణుం డలిగి తేఁకువ మీఱ మయుండు మున్ను సొం
పార సృజించి యిచ్చినవరాస్త్రము సేయ నుపక్రమించినన్. 2322

చ. ముసలగదాసిచక్రములు ముద్గరతోమరకూటపాశప
ట్టసపరిఘంబులుం బటుకుఠారనిశాతమునుంతిశూలకుం
తసముదయంబు లొక్కమొగిఁ దత్పృథుచాపభవంబులై యుగాం
తసమయమారుతంబులవిధంబున రోదసి నిండఁ బర్వినన్. 2323

క. శూరనుతుఁ డుత్తమాస్త్రవి,శారదుఁ డగురాఘవుండు చయ్యన దానిన్
దారుణగాంధర్వాస్త్రము,వారక నిగిడించి త్రుంచె వనచరు లలరన్. 2324

క. దానవనాథుఁడు నిహతం, బైననిజాస్త్రమును జూచి యతికుపితుం డై
మానక సౌరాస్త్రంబును, బూని ప్రయోగించె రాజపుంగవుమీఁదన్. 2325

ఉ. కలయ న్దాన జనించెఁ జక్రము లనేకంబు ల్విధూమాగ్నికాం
తులు పెల్లారఁగ వానిచే గగన మెంతో దీప్తచంద్రగ్రహం
బులచేఁ బోలెఁ బ్రదీప్తమై తనరె రాముం డుగ్రుఁడై మేటితూ
పుల నొక్కుమ్మడి వాని నన్నిటి వడిం బో సేసెఁ జిత్రంబుగన్. 2326

క. హత మైననిజాస్త్రము గని, దితిజకులేశ్వరుఁడు క్రోధదీపనయుతుఁ డై
శితశరము లేసె రఘువం,శతిలకునర్వాంగమర్మసంధులు నాటన్. 2327

క. ఆనరనాథకులేంద్రుఁడు, దానవకరనిస్సృతప్రదరవిద్ధుం డై
మేను రుధిరంబు గ్రమ్మఁగ,మానుగ ధాతుయుతనగముమాడ్కి నచలుఁడై.

క. లోచనయుగమున శోణము,రీచులు నిగుడంగఁ బేర్చి పృథులనిశితనా
రాచములు వఱపె నట దో,షాచరపతిసర్వగాత్ర సంధులు నాటన్. 2329

విభీషణుఁడు రావణునిరథాశ్వంబులం జంపుట.

వ. ఆసమయంబున బలవంతుం డై నలక్ష్మణుండు సంక్రుద్ధుం డై గిరికందరంబు నిర్గ మించి వచ్చుదృప్తకంఠీరవంబుచాడ్పున నతిలాఘవంబునం జనుదెంచి రావణున

కభిముఖుండై పావకునిసప్తార్చులం బోలినసప్తసాయకంబులు నిగుడించి తదీయ కేతుదండంబు సప్తఖండంబులు చేసి యొక్కవెడందవాతియమ్మునసముజ్జ్వలిత కుండలం బైనసారథిశిరంబు ద్రొల్లంజేసి పంచవిశిఖంబులం గరికరోపమం బైన చాపంబు ముష్టికిం దెగవ్రేసె నంతలోన వైరిభీషణుం డగువిభీషణుండు కాల దండసదృశం బైనగదాదండంబు బాహుదండంబులం బట్టి మిడుంగుఱులు చదలం జెదర జిఱజిఱం ద్రిప్పుచు మహావేగంబున రావణురథంబుపై కుటిలకాల మేఘసంకాశంబులును మహాపర్వతసన్నిభంబులు నగురథాశ్వంబులం బిలుకు మార్చెనిట్లు దశముఖుండు హతాశ్వుండును హతసూతుండు నై రథంబుమీఁద నుండిరయంబునం బుడమికిదాఁటిదశముఖంబులం జిడిముడిపాటు గదురం దీవ్రం బగుక్రోధం బంగీకరించి దీప్తాశనివిధంబున వెలుంగునొక్కశక్తిం గొని విభీషణు మీఁదం బ్రయోగించిన దాని నవలోకించి లక్ష్మణుండు శీఘ్రంబున మూఁడు వాడిశరంబుల తుత్తునియలుగా ఖండించిన నది భిన్న యై కాంచనభూషణరోచు లు వెలుంగ విస్ఫులింగపటలంబులు రాల నంతరిక్షంబున నుండి డిగి పడు మహోల్కపగిదిఁ బుడమిం బడియె నత్తెఱంగునవిలోకించి వానరులందఱుం బర మానందభరితాంతఃకరణులై భూనభోంతరాళంబు నిండ సింహనాదంబుఁ జేసి రంత. 2330

సీ. యమవాయువరుణేంద్రయక్షేశ్వరాదుల కైన దురాసద యైనదానిఁ
గమనీయవిపులాష్టఘంటారవాస్ఫోటి తాజాండకర్పర యైనదాని
దృగ్భీకరాత్మీయ తేజోధగద్ధగి తాఖిలహరిదంత యైనదానిఁ
ననిశంబు గంధపుష్పాక్షతంబు లొసంగి యురుభక్తిఁ బూజించుచున్నదాని

తే. నసురమాయావినిర్మిత యైనదాని, నఖిలపరిపంథిఘాతిని యైనదాని
దీప్తపావకశిఖ లుప్పతిల్లుదాని, నమితవజ్రాశనిప్రభ యైనదాని. 2331

తే. అహికులేంద్రజిహ్వోపమ యైనదానిఁ, గనకభూషణకలిత యై గ్రాలుదాని
శక్తి గొని రావణుఁడు విభీషణునిమీఁదఁ, దీవ్రభుజశక్తినిగిడింపఁదివురునపుడు.

క. తనమది జీవితసంశయమున మిక్కిలి భయము నొంది మునుకొని దిక్కుల్
గనుఁగొనుచున్నవిభీషణు, గనుఁగొని లక్ష్మణుఁడు కడఁగి కడువేగమునన్. 2333

చ. అతనిఁ బిఱిందికిం దిగిచి యడ్డము నిల్చి మహోగ్రచాప ము
ద్ధతి నవరించి మౌర్వి నినదం బొనరించి నిరంతరంబుగా
నతులితశక్తిహస్తుఁ డగుసద్దశకంఠునిమీఁద బల్విడిన్
శితవిశిఖప్రవృష్టి గురిసెన్ మొరసెం బటునాద మయ్యెడన్. 2334

ఉ. ఆశరవృష్టికిం దలఁక కవ్విభు లక్ష్యము సేయ కాజిలోఁ
గీశులవంకఁ బోక విముఖీకృతవిక్రముఁ డై గడంగి దై
త్యేశుఁడు తమ్మునిం దునుము నెంతయుఁ బోరి తరంబు గాక వా
రాశిగభీరు లక్ష్మణుఁ గరం బలుకం బరికించి యిట్లనున్. 2335

చ. జడత వహించి రాజసుత చావఁగఁ జూడకు మావిభీషణుఁ
విడువుము వీడ కిప్పుగిది వీర్యముఁ జూపితి వేని మందుచుం
గడువడి మత్కరాగ్రమునఁ గ్రాలెడు నిమ్మహనీయశక్తి బ
ల్వడి భవదీయవక్షము గలంచి వధించి చనుఁ నిజంబుగన్. 2336

## రావణుశక్తిచే లక్ష్మణస్వామి మూర్ఛిల్లుట.

వ. అని పలికి యద్దశగ్రీవుం డమ్మహనీయశక్తి లక్ష్మణుమీఁద వైచిన నది రావణ బాహుపరిఘోత్సృష్ట యై దంష్ట్రాకరాళవదన యై జ్వలనజ్వాలాభీలయై శక్రాశనిసమస్వనయై భీమవేగంబునం బఱతెంచుచున్నదాని నవలోకించి మహాత్ముం డగురాముండు నిర్మలాంతఃకరణుం డై యీమహనీయశక్తివలన లక్ష్మణునకుఁ బ్రాణభయంబు గలుగకుండెడు మని పలుకుచుండ నప్పు డమ్మహాశక్తి రయంబునం జనుదెంచి లక్ష్మణుని వక్షంబు గాఁడిన నమ్మహావీరుండు శక్తినిర్భిన్నహృదయుం డై దూలి రణమేదినిం బడియె నప్పు డవ్వీరోత్తమునియవస్థ విలోకించి మహాతేజుం డగురాముండు భ్రాతృస్నేహంబున విషణ్ణహృదయుం డై దుఃఖబాష్పజలంబులు కన్నులం గ్రమ్ముదేర నొక్కముహూర్తంబు మౌనంబుఁ బూని విషాదకాలంబు గాదని చింతించి సునిశితంబు లగుకాండసహస్రంబులు రావణునిమీఁదం బరఁగించి బహుప్రయత్నంబున నతని నివారించి వెండియు రుధిరావసిక్తసర్వాంగుం డై సపన్నగం బైనపర్వతంబుకరణి నేలం బడి యున్న లక్ష్మణు నవలోకించి యతనిసమీపంబునకుం జనియె నప్పుడు బలవంతు లైన హరిశ్రేష్ఠు లందఱు లక్ష్మణునికడకుం జని యతనిహృదయంబు భేదించి ధరణిం గాఁడి యున్నశక్తిం బెఱుక సమర్థులు గాక రావణప్రయుక్తబాణపరంపరార్దితు లై యూరకున్న నప్పుడారాముండు లక్ష్మణు డాసి కరికరోపమంబు లగుకరంబుల నమ్మహాశక్తిం బెఱికివిఱిచివైచి దూరంబున నుండిరావణుండు సర్వాంగంబులు నాట నురవడిం బ్రయోగించునారాచపరంపరలు గణింపక తృణీకరించి లక్ష్మణుం గౌఁగిలించికొని సమీపస్థు లైనహనుమదంగదసుగ్రీవజాంబవత్ప్రముఖ వానరుల నిరీక్షించి యుగాంతాగ్నిచందంబున వెలుంగుచు వారల కిట్లనియె.

సీ. కపివర్యులార లక్ష్మణుఁ గాచికొనుఁ డిది లక్షింప శోకకాలంబు గాదు
ఘర్మాంతమునఁ జాతకంబున కొయ్యన నంబుదదర్శన మబ్బినట్లు
చిరకాంక్షితం బైనగురుపరాక్రమకాల మిప్పుడు నా కబ్బె నీదురాత్ము
ననిలోనఁ దునిమి కృతార్థుండ నయ్యెద వినుఁడు నాదుప్రతిజ్ఞ విశ్రుతముగ

తే. రావణుం డొండెనటు కాక రాముఁ డొండె, రామరావణు లిరువురుభూమినున్కి
గలుగ నేరదు సత్యసంకల్ప మిదియు,పగఱ నణఁపక తక్కిన బ్రతుకు మేలె.

చ అనుపమరాజ్యనాశము మహాగహనప్లవనంబు దండకా
వనపరిధావనంబు సురవైరిసమాగమనంబు జానకీ

దనుజుఁడు మ్రుచ్చిలించుటయు దైత్యులతోడ రణంబు గల్గుటన్
ఘనతరదుఃఖ మంతయును గ్రక్కున రావణుఁ జంపి పాసెదన్. 2839

సీ. ఎవ్వానిఁ జంపుట కీమహీధరచరానీక మంతయు సమానీత మయ్యె
వాలి యెవ్వానికై వధియించి సుగ్రీవు రాజుఁ జేసితిఁ గపిరాజ్యమునకు
వనచరవీరు లెవ్వని వధింపఁగఁ బూని కడలిపై సేతువు గట్టి రెలమి
వరుస మీ రంద ఱెవ్వానివధార్థమై యనిఁ జేసితి రతిప్రయాస మలర

తే. నట్టిపాపాత్ముఁ డైన దేవారి నాఁడు, దృష్టిమార్గంబునకు వచ్చె దివిరి నేఁడు
దృష్టివిష మైనకాలాహి దృష్టిఁ బడిన, జడునిచందాన బ్రదికిపోఁజాలఁ డింక.

క. హరిపుంగవు లందఱు భూ,ధరశిఖరాగ్రంబు లెక్కి తద్దయు వేడ్కన్
సురవైరికి నాకయ్యెఁడు, సురుచిరజన్యక్రమంబుఁ జూడుఁడు కడిమిన్. 2841

క. సురసాధ్యయక్షకిన్నర,గరుడోరగసిద్ధు లెల్లఁ గడువడి మద్భీ
కరరణముఁ జూచి నేఁ డిటు, పరికింతురు నన్ను రామభద్రునిఁగాఁగన్. 2842

తే. ధారుణీచక్ర మెందాఁక దలఁక కుండు
వసుధ నెందాఁక సప్తార్ణవంబు లింక
కుండు నందాఁక మత్కృతయుద్ధకర్మ
మఖిలవిష్టపములు గొనియాడుఁగాక. 2843

క. కపివీరులార యిఁక వి,ష్టపత్రయమునందుఁ గల్గు సంగరముల క
ట్లుపమానపాత్రమై మ, ద్విపులరణము చెల్లుఁ గాక విశ్రుతఫణితిన్. 2844

క. అని పలికి రాఘవుఁడు కాం,చనభూషణభూషితోగ్రశరములు దనుజేం
ద్రునిమీఁదఁ బఱపెఁ గార్ముక,నినదంబులు గగనవీథి నిండి చెలంగన్. 2845

క. సురవైరియుఁ గోపంబున, సురుచిరనారాచవృష్టి క్షోణీంద్రునిపైఁ
గురియించెఁ గాలజలదము, గురుశైలముమీఁద వృష్టి గురిసినమాడ్కిన్.

## రామరావణుల యుద్ధము

వ. ఇట్లు మహాద్భుతప్రకారంబునం దలపడి రణంబుగావించునప్పు డారామరావణ కార్ముకవినిస్సృతనిశాతశిలీముఖంబు లొండొంటిం దాఁకుచు నుగ్రనిర్ఘోషంబులును బరస్పరసంఘర్షణంబునం బుట్టిన మంటలును గోదండచండగుణటంకారంబులును భువనభయంకరంబు లై నభోమండలంబు నిండె నంతఁ గొంతవడికిఁ దత్సాయకంబులు విశీర్ణంబు లై యంతరిక్షంబున నుండి మహోల్కల భంగిఁ బుడమిం బడియెఁ దదీయజ్యాతలనిర్ఘోషంబు విని సర్వభూతంబులు విభిన్నహృదయంబు లై భయంబునం బఱచె రయ్యాయోధనంబద్భుతోపమంబయ్యె నంత నమ్మహీకాంతునిబాణంబు లనంతంబు లై దిగంతంబులు నిండి గాఢసంతమసంబు గావించిన నయ్యంపవాన వారింప నలవి గాక దశగ్రీవుండు వెగడువడి సింహంబుముంగలి మదవారణంబుమాడ్కి దీనవదనుం డై నిలువ

నోపక భయవిహ్వలితగాత్రుం డై రణభూమి విడిచి కచభారంబులు వీడఁ గమ
నీయరత్నఖచితభూషణవ్రాతంబు కనుకనిం జెదరఁ జరణాభిహతి మహీచక్రంబు
కంపిల్లఁ దొలంగి లంకకుం బాఱి యంతఃపురంబుసొచ్చి నొచ్చినయంగంబులు
సవరించుకొని కొండొకసేపు సేద దీర్చికొని లజ్జాభయవిషాదంబులు మొగం
బునం దోఁప నేమియుం దోఁపక నిజపత్ని యగుమందోదరి రావించి యద్దేవి
తోడఁ బెద్దయుం బ్రొద్దు చింతించి యిట్లనియె. 2347

—శ్రీరాములచే దెబ్బలు దిని రావణుండు మందోదరితో విలపించుట.—

సీ. ఏనని చెప్పుదు నింతిరో నేఁ డుగ్రరణమునఁ గల్గుపరాభవంబు
రాముండు లయకాల భీమునిక్రైవడి నత్యుగ్రమూర్తియై యచలసార
మగువింట ఘంటారవార్భటుల్ సెలఁగంగ జ్యావల్లి నవరించి సాంద్రభంగి
విలయకాలాభ్రంబు వృష్టిని గురియించు కరణి సాయకవృష్టి గురియఁ జేసె
తే. నమ్మహాసాయకనికాయ మబ్ధివేగ
మనుకరించి యవార్యమై యరుగుదెంచి
దీవిచందాన నను ముంచె జీవితంబు
దక్కఁ గొని వచ్చినాఁడ యత్నంబుతోడ. 2348
చ. అనలునికన్న వేఁడిమి బలాంతకవజ్రముకన్న వాఁడిమిన్
ఘనతరకాలదండమునకన్న నమోఘత మారుతంబుక
న్నను గడు వేగము న్గలిగి దాశరథిప్రవిముక్తఘోరమా
ర్గణములు కాలసర్పములక్రైవడిఁ దాఁకి కలంచె మర్మముల్. 2349
చ. హరిహయుతోడఁ బోరితి ధనాధిపుతో సమరం బొనర్చితిన్
వరుణయమాగ్నికోణపతి వాయుదిశేశులతోడ ఘోరసం
గర మొనరించితిన్ ఫణిజగత్పతితోడ రణంబు సల్పితిన్
సరసిజనేత్ర తద్విశిఖ సంతతి కింత రయంబు లే దొగిన్. 2350
ఆ. హరునికంటిమంట లవి సహింపఁగ వచ్చుఁ, గాని రామశరనికాయ మించు
కయు సహింపరాదు కంటివె జల్లెడ, కంత లయ్యె నాదుగాత్ర మెల్ల. 2351
సీ. జగము లన్నియు మ్రింగఁ జాలుపరాక్రమో దీర్ణుండు మనకుంభకర్ణుఁ డీల్గె
నింద్రాదిదిక్పాలహృచ్ఛూల మైనవీకోత్తముం డలశక్రజిత్తు మడిసె
నీతిసారజ్ఞవిఖ్యాతి వాటించిన ఘనతేజుఁ డయ్యతికాయుఁ డడఁగె
ననిలోన మాణిభద్రాదులఁ దోలిన చండవీర్యుఁడు ప్రహస్తుండు గడసె
తే. నఖిలరణములయందు మున్నారితేరి, నట్టిజెట్టిజోదులు మకరాక్షవజ్ర
దంష్ట్రదేవాంతకాదిప్రధానదైత్య, వరులు గూలిరి రణమందు హరులచేత.
ఆ. అఖిలభువనవిజయ మర్మిలిఁ గావించి, యసురవిభుఁ డనంగ ఖ్యాతి వడసి
యమరవర్యు లూడిగములు సేయఁగ ధాత్రి, వన్నె గన్నయేను భంగపడితి.

క. దాశరథిబాణములు ఘో, రాశీవిషనిభము లగుచు నద్భుతభంగిన్
రాశీభూతము లై రా, నోసరక సహింప నెవ్వఁ డోపు మృగాక్షీ. 2854

చ. సురపతివజ్రమున్ హరునిశూలము కాలునిదండమున్ ధనే
శ్వరుగదయుం బయోధిపతిపాశము నైరృతిరాజఖడ్గము
న్దురమునఁ జీరికిం గొనక దోర్బలశక్తి వెలుంగునేను సం
గరమున నొక్కమర్త్యువిశిఖంబులఁ జిక్కితి నేమి చెప్పుదున్. 2855

క. ఏలాగు రాఘవుని నే, నాలంబునఁ గడచువాఁడ నాతనిరూపం
బాలోకించినయంతనె, కాలుం డనుసంశయంబు గలిగెడుఁ దన్వీ. 2856

చ. నయవిదుఁ డావిభీషణుఁడు నాఁ డటు నీతి యెఱుంగఁ బల్కు దు
ర్నయమున నేను గైకొనక గ్రక్కునఁ బో వెడలంగఁ బుచ్చితిన్
నియతమునన్కుఁ దాతఁ డొగి నేర్పునఁ జెప్పినమాట లన్ని త
ద్దయు నిజ మయ్యె నేఁడు వనితా యిపు డేమన నేమి కాఁదగున్. 2857

క. దివియందు జలధులందును, భువియందును దిక్కులందు బూర్ణము లై రా
ఘవునిపటుదివ్యబాణము, లవిరళగతి నిండియున్నయట్లుగఁ దోఁచెన్. 2858

క. కను మూసినఁ గనువిచ్చిన, ఘనుఁ డారాఘవుఁడు మ్రోలఁ గన నయ్యెడు నే
యన నేల భువన మంతయు, వనితా రామమయ మగుచు వారక తోఁచెన్.

వ. దేవీ నా కిప్పు డొండుశరణంబు లేదు దర్పకదర్పహరణుండును జంద్రకిరీటాలంకృతమస్తకుండును మందాకినీసరిత్సలిలపూరితజటాజూటుండును వ్యాఘ్రచర్మాంబరధరుండును విభూత్యనులిప్తసర్వావయవుండును నాగయజ్ఞోపవీతధరుండును గజచర్మోత్తరీయుండును త్రిశూలాలంకృతకరుండును భక్తానుగ్రహవిగ్రహుండును శైలజావిభూషితవామభాగుండును సకలలోకశంకరుండు నగుశంకరుని శరణంబు నొందెద నప్పరమేశ్వరుండు తొల్లి మదీయసంగీతంబునకుమెచ్చి పరమదయాళుండై యెప్పు డేనియు నీకరులవలన సంగ్రామంబునఁ బరాజయంబు గలుగునప్పుడు నన్ను నుద్దేశించి హోమంబు గావింపు మవ్వేలిమి విఘ్నంబు లేకుండఁ బారంబు నొందెనేని వహ్నికుండంబున నుండి దివ్యాశ్వసమన్వితంబైనదివ్యరథంబును దివ్యాస్త్రంబులును దివ్యకవచశరాసనతూణీరంబులునుం బొడము నమ్మహనీయసాధనంబులు గైకొని రణంబున కరిగితివేని గెలువవశ్యంబు గలుగు నని యాదేశించెం గావున నే నిప్పు డమ్మహానుభావు నుద్దేశించి హోమంబు గావించెద నని పలికి శీఘ్రంబున సుస్నాతుండై ధౌతాంబరంబులు ధరించి యొక్కశివాలయంబునకుం జని యం దొక్కవేదిక నిర్మించి మంత్రవిదు లగుబ్రహ్మరాక్షసుల యాజకులుగా నియమించి సమిత్కుశలాజపుష్పాక్షతాదికంబులు సంగ్రహించి బలవంతు లగురాక్షసులఁ జుట్టునుం గావువెట్టి హోమంబు గావింప నమకట్టిన నప్పు డచ్చటికిఁ దలోదరి యగుమందోదరిచను దెంచి నిజభర్త నవలోకించి యిట్లనియె. 2860

శివునిఁ గూర్చి హోమముసేయ సమకట్టినరావణునకు మందోదరి నీతి గఱపుట.

సీ. దనుజేంద్ర యిట్లేల మునివృత్తి దాల్చెదు ధరణి వీరున కిది ధర్మ మగునె
మున్ను నీచే రణంబున నోడిపాఱినవేల్పు లీచందంబు విన్న నగరె
దంతిరథాశ్వపదాతిసంకుల మైనబలము నీ కది చాలఁ గలిగి యున్న
దది గాక మును రజతాచలం బెత్తిన కరము లిర్వది నీకుఁ గలిగి యుండఁ
తే. గొఱఁత యేమి బలంబులఁ గూర్చి హోమ
కృత్య మది మాని విక్రమోద్ధత్య మడరఁ
గలని కీవు డేగి పగతుల గెలువు మఱఁతి
సేఁతఁ బౌరుషభంగంబు సేయ నగునె. 2361

ఉ. ఇంత భయంబు గల్గిన మహీసుత నప్పుడు దెచ్చి తత్సతీ
కాంతునితో నకారణముగా నిటు వైరము గొంటి వేల నేఁ
డింతకు వచ్చినం దలఁకి యిట్లు తపించినఁ బోనె యేటి కీ
చింత దొలంగఁ బెట్టి యనిసేయఁగ నేగుము ధైర్యశాలివై. 2362

చ. మనుకులవర్యు రాఘవుని మానవమాత్రునిఁగాఁ దలంచితో
యనిమొన దేవదానవులకైన నసాధ్యుఁ డతండు విల్లు గై
కొనిన జగత్త్రయంబు నొకకోలనె భస్మము సేయఁ జాలు న
య్యనఘుని బాహుశక్తికి ఖరాదులచా వది సాక్షి గా దొకో. 2363

క. నీపేరు విన్నయంత ది,శాపాలురు సోమరవులు శైలగుహాలలో
నేపఱి తనువులు వడఁకఁ బ్ర,తాప ముడిగి యుడఁగి యుండ్రు తద్దయు భీతిన్.

తే. అధిప నీ కేమి కొదవ మాయాబలంబు, శస్త్రబలము దోర్బలమును సైన్యవితతి
గలిగి యున్నదిచాల సంగరమునందు,మనుజపతి గెల్వ మిఁక వేఱుమాటలేల.

వ. అని పలికిన నద్దశముఖుండు ప్రియురాలివచనంబులకు లజ్జించి హోమకృత్యంబు చాలించి తత్సమేతంబుగా నభ్యంతరమందిరంబునకుం జనియె నంతరాముండు పదునాలవనాఁటిరాత్రియుద్ధంబున నడురేయి రావణశక్తినిహతుం డై రుధిరోక్షితసర్వాంగుం డై గాఢమూర్ఛాపారవశ్యంబునం బడి యున్నసౌమిత్రి నవలోకించి శోకపరీతచిత్తుం డై సుషేణున కిట్లనియె. 2366

మూర్ఛితుం డగులక్ష్మణునిం జూచి రాముఁడు విలపించుట.

సీ. అనఘాత్మ రణధీరుఁ డైనయీసౌమిత్రి రహి దశాననశక్తి నిహతుఁ డగుచుఁ
బన్నగేంద్రునిమాడ్కిఁ బరివేష్టితాంగుఁ డై యుద్ధమేదినిఁ బడియున్నవాఁడు
కడఁగి ప్రాణంబులకంటెఁ బ్రియుం డితఁ డురుదార రుధిరసిక్తాంగుఁ డగుచు
నిబ్భంగిఁ బడియుండ నెట్లు చూడఁగనోర్తు నురుశోకము జనించు చున్నదకట
తే. భవ్యలక్షణయుక్తుండు పరమభక్తుఁ, డితఁడు పంచత్వ మొందిన నింక నాకు
జీవితం బేల సుఖ మేల సిగ్గు వోడము, చున్న దెంతయు నాశౌర్య మెన్నికొనిన.

చ. కరమున నుండి కార్ముకము గ్రక్కున జాఱెఁ దోఁణంగె నేత్రముల్
పొరిఁబొరి శోకబాష్పపరిపూర్ణము లయ్యె శిలీముఖౌఘముల్
కరము నశించె గాత్రములు కంపము నొందెడు శౌర్య మింకె న
య్యురముగఁ దీవ్రచింత మదిఁ బుట్టె నహో యిఁక నేమి సేయుదున్. 2868

తే. అని పలికి నష్టచేష్టుఁడై యవని వ్రాలి, యున్నతమ్ముని దుఃఖార్తి నుగ్రశక్తి
హతు బహిశ్చరప్రాణంబు నట్ల చూచి, తీవ్రశోకాభిభూతుఁడై దిగులు గొనుచు.

తే. అంగములు నొచ్చి యున్నవి యనుజుఁ డెట్లు
బ్రతుకువాఁ డని తలపోసి భయము నొంది
గాత్రములు కంప మొందఁగ గాఢశోక
వివశుఁడై విలపించె నవ్వీరవరుఁడు. 2870

చ. తక్కక ప్రాణతుల్యుఁ డగుతమ్ముఁడు దానవశక్తివిద్ధుఁడై
మిక్కిలి ధూళి గ్రుంగి రణమేదినిపైఁ దగ వ్రాలె నింక నా
కెక్కడిసీత యేటిబ్రతు కెక్కడిరాజ్య మిఁ కేటిసంగరం
బక్కట వీనియట్లు చను టంతియె కార్యము వేఱె యున్నదే. 2871

వ. అని యిత్తెఱంగున విలపించుచు శోకవిహ్వలితేంద్రియుండును విచేష్టమానశరీరుండు నై దైన్యంబున దుఃఖించుచు సారెసారెకు నిట్టూర్పు నిగిడించుచున్న రాము నవలోకించి మందమధురాలాపంబుల నాశ్వాసించుచు సుషేణుం డిట్లనియె. 2872

సీ. లోకేశ నీకింత శోకింప నేటికి లక్ష్మివర్ధనుఁడై నలక్ష్మణుండు
మృతుఁడు గాఁ డిదె చూడు మితనివక్త్రమున నై వర్ణ్యంబు నిష్ప్రభత్వంబు లేదు
కడు సుప్రసన్నమై కాంతమై సుప్రభాకలితమై యున్నది కరతలంబు
పద్మపత్త్రంబులపగిదిఁ జూపట్టెడు నయనంబు లివె ప్రసన్నత వహించి

తే. ప్రాణయుక్తులై యున్నవారలకె గాక, యిట్టిరూప మప్రాణుల కేల గల్గు
నితఁడు జీవించియున్నవాఁ డిది నిజంబు, మది విషాదంబు నొందకుముదితతేజ.

తే. నాసికారంధ్రనిర్గతోచ్ఛ్వాసమాన్య
కలితకాంతి ముహూర్ముహుఃకంపమాన
హృదయు డితఁడు సప్రాణుఁడై యొసఁగు చున్న
చంద మెఱిఁగించు చున్నవి జనవరేణ్య. 2874

క. అని పలికి రాఘవేంద్రుని, మనమునఁ గలసందియంబు మాన్చి సుషేణుం
డనఘాత్ముఁడై సమారుతి, తనయునిఁ దనమ్రోలఁ జూచి తడయక పలికెన్.

హనుమంతుండు సంజీవనీపర్వతమును దేఁబోవుట.

సీ. అనిలకుమార నీవజసందనుఁడు మున్ను చెప్పినయోషధిశిఖరికడకుఁ
దడయక చని దానిదక్షిణశిఖరంబు నందుఁ బ్రసిద్ధంబులై విశల్య

కరణియు సంధానకరణియు సావర్ణ్యకరణియు సంజీవకరణి యనఁగ
దివ్యౌషధులు నాల్గు తేజరిల్లుచు నుండువానిఁ గైకొని తెచ్చి మానితముగ.
తే. నింపుతో లక్ష్మణుని బ్రతికింపు మనిన,నట్లసేయుదు ననుచు నయ్యతిబలుండు
వేగ శైలంబుకడ కేఁగి వెదకి మందు,లన్నియును గొని తెత్తుఁ గాకనుచుఁ బూని.
వ. రాఘవేంద్రస్తుతివచనాకర్ణనజనితమహోత్సాహప్రవర్ధమానశరీరుం డై విక్ర
మోద్దీర్ణుం డై నత్రివిక్రమదేవునిభంగిం జూపట్టుచు భూచరఖేచరపయోధిచరభూ
తవ్రాతంబులగుండె లవియ నొక్కమహానాదంబుఁ జేసి సముద్రప్రాంతకాంతా
రమండితం బైనయొక్కకొండ యెక్కి యమ్మహామహీధరంబు మహీతలంబు
నం గ్రుంగఁ బాదంబు లూఁది గగనంబున కెగసి విష్ణుకరపరిముక్తం బైనసుద
ర్శనచక్రంబుకై వడి నతిదుర్నిరీక్షుం డై మహావేగంబున నుత్తరాభిముఖుం డై
పోవుచుండె నప్పు డావృత్తాంతంబు చారులవలన విని దశగ్రీవుం డొక్కింత
సేపు విచారించి యర్ధరాత్రసమయంబున నెవ్వరికింగానరాకుండఁ దాటకేయుం
డగుమారీచుపుత్త్రునుందిరంబునకుం జని యెడ నెడ నెదు రైనయాతుధాను
లందఱుఁ గాలుం డని శంకించి భయంబునఁ దొలంగిపాఱ నొక్కవెరవున
వాని డాయం జనియె నప్పుడు రావణునిరాక యెఱింగి శీఘ్రంబున నెదు
ర్కొని వినయంబునం దోడి తెచ్చి యొక్కయుచితాసనంబున నాసీనుం జేసి
యర్ఘ్యపాద్యాదినానావిధోపచారంబులు గావించి యంజలి గీలించి మెల్లన
నిట్లనియె. 2377

చ. ఉడుగక యేను జేయుపని యున్న ననుం బిలిపింప కక్కటా
నడునిశ నీకు రాఁ దగునె నాథుఁడ వీ వఖిలాసురాళి కి
వ్వడువున నొంటి నిచ్చటికి వచ్చినకార్యము నానతిమ్ము నేఁ
గడువడి దానిఁ దీర్చెదను గట్టిగ నోపిన నోప కుండినన్. 2378

రావణుఁడు కాలనేమిని హనుమంతునకు విఘ్నము సేయ నియోగించుట.

ఉ. నా విని రావణుండు కదనంబున మద్ఘనశక్తి లక్ష్మణుం
డావిధి మూర్ఛితుం డయిన నాతని వే బ్రతికింపఁ బూని యు
ర్వీవరుపంపునం బ్లవగవీరుఁడు మారుతనందనుండు సం
జీవని దేర ద్రోణగిరిఁ జేరఁగఁ బోవుచు నున్నవాఁ డొగిన్. 2379
శా. మారీచాత్మజ నీవు తండ్రిపగిదిన్ మాయల్ తగ న్నేర్తు వే
పారం ద్రోవకు నడ్డ మేగి కదనం బత్యుద్ధతిన్ సల్పి య
వ్వీరుం జంపుము గానిచోఁ దెరువునన్ విఘ్నంబు గావింపుమా
నీరేజాప్తుఁడు వచ్చునందనుక నీనేర్పుల్ రిపుల్ మెచ్చఁగన్. 2380
క. ఇనుఁ డుదయించినపిమ్మట, మనుజవిభునితమ్ముఁ డుర్విఁ మనఁజాలఁడు గా
వున నంతదనుక నీనేర్పున విఘ్నము సేయు మసురభూషణ నెమ్మిన్. 2381

వ. ఇందు కొక్కయుపాయంబు గలదు దాని నీ కెఱింగించెద ద్రోణగిరిసమీపం
బున నొక్కయగాధం బైనసరోవరంబు గల దది దేవనిర్మితం బందు ఘోరం
బైనయొక్కమహాగ్రాహి నివసించి యుండు నది యింద్రాదిదేవతల నైన
మ్రింగంజాలు దానినోరం బడి గ్రమ్మఱ బ్రతికివచ్చుట కెవ్వండును సమర్థుండు
గాఁడు నీ వచ్చట మాయామయం బైనయొక్కమహనీయతాపసాశ్రమంబు
నిర్మించి యందొక్క మునివై యుండి యుపాయబలంబున హనుమంతు నక్కొ
లనికడకుం బుచ్చు నతం డమ్మకరిచేత మ్రింగంబడినవాఁడై మృతుం డగు
దానం జేసి మనయుద్యోగం బంతయు సఫలం బగు నీ విక్కార్యంబుగావించి
కీర్తి వడయు మని పలికిన నమ్మారీచనందనుం డతని కిట్లనియె. 2882

కాలనేమి రావణునకు బుద్ధులు గఱపుట.

సీ. దనుజవల్లభ నీవు దలఁచినకార్యంబు వల దని పలుక నెవ్వారివశము
నీవు పంచినయట్ల నేర్చినవిధమునఁ జేసెద వంచనఁజేయ కిపుడు
ప్రాణుల కెపుడైనఁ బంచత గలుగుట సిద్ధంబు ప్రాణేశ్వుచేతఁ గాదు
నాకుఁ దోఁచినభంగి నయవాక్య మొక్కటి చెప్పెదఁ గృపఁజేసి చిత్తగింపు
తే. మధిప మాయయ్య మును మీభయంబువలన
నరిగి రామునిఘోరశరార్తి గడసె
నమ్మహాత్మునిపేరు విన్నంత గుండె
లవియుచున్నవి యింక నేమని వచింతు. 2883
చ. ఖరుఁ డనిఁ గూలె దూషణుఁ డకంపనుఁడుం ద్రిశిరుండుఁ జచ్చి రా
గురుభుజు లాప్రహస్తుఁడును గుంభనికుంభులుఁ గుంభకర్ణుఁడున్
హరిహయతుల్యవీర్యుఁ డగునయ్యతికాయుఁడు మేఘనాదుఁడున్
మఱియు ననేకరాక్షసులు మానక కూలిరి శైలసన్నిభుల్. 2884
ఉ. తెంపున నేగి జన్యమున ధీరుని రాముని సాయకంబులం
జంపుట యొండెఁ గాని యొక జానకి నిచ్చి చలంబు మాని ర
క్షింపు మటంచు భక్తి నతిసేయుట యొండె నిశాటనాథ ద
ర్పింపఁగ నొం డుపాయ మిఁకఁ జెల్లదు మాటలు వేయు నేటికిన్. 2885
క. అనుజుని రావించి ముదంబున లంకారాజ్య మిచ్చి భూపుత్త్రిని రా
మున కొసఁగి తాపసుఁడవై, వనమున కేగు మిట నుండ వల దిఁక మీఁదన్.
వ. అని పలికిన విని యాగ్రహోదగ్రవ్యగ్రమానసుం డై దశగ్రీవుం డుగ్రప్రేక్ష
ణంబుల నిరీక్షించి చంద్రహాసంబు గొని వానిం దెగవ్రేయుట కదరిన వాఁడు
భయంబుగొని నీ కింతకోపం బేల నీవంచినయట్ల గావించెద నని పలికి వలగొని
సమస్కరించి యనుజ్ఞవడసి మనోజవంబునం బఱచి దశగ్రీవోపదిష్టప్రదేశంబునఁ
దనమాయచేత నతిరమణీయంబుగా నొక్కయాశ్రమంబు నిర్మించి కపటముని
వేషంబు దాల్చి మిథ్యాజపంబు సేయుచు హనుమదాగమనంబు ప్రతీక్షించు

చుండె రావణుం డంతఃపురంబునకుం జని చింతాకులమానసుండై నిద్ర వేగిం
చుచుండె నట హనుమంతుండు జాంబవత్సుషేణోపదిష్టమార్గంబున ద్రోణా
ద్రికిం బోవుచుండ నప్పుడు మార్గంబునందు. 2887

మ. వృజినాత్ముం డగు కాలనేమి యుచితర్విఘ్నంబు గావింపఁగా
ద్విజరూపంబున నున్నవాఁ డితని దోర్వీర్యంబునం జంపి సం
ఖ్యజయంబుం గొన రమ్మటంచు సుతు వేడ్కం బిల్వ నేతెంచె నాఁ
గ జగత్ప్రాణుఁడు వీచె సర్వసుమనోగంధాఢ్యుఁడై పైపయిన్. 2888

శా. నానాచిత్రమనోజ్ఞ కాంతివిలసన్నక్షత్రమాలాంచితా
నూనానంతపథంబుచందమున నన్యూనప్రభావిస్ఫుర
త్సూనాచ్ఛాదితవృక్షపంక్తి మగుచున్ శోభిల్లుదివ్యన్మహో
ద్యానం బొక్కటి గానవచ్చె ధనదోద్యానంబు గ్రేడించుచున్. 2889

సీ. మందారకుందమాకందపుష్పమరంద బిందుపానావశేందిందిరంబు
పరిపక్వదాడిమీఫలబీజఖాదనోన్మదకీరమృదునాద నాదితంబు
లలితరసాలపల్లవఖాదనోన్మాద కలకంఠకులకంఠకలనినాద
మభ్రంకషానోకహాగ్రనిషణ్ణమయూరసంఘాతకేకారవంబు

తే. నగుచు నభినవమణిగణస్థగితకనక, పట్టభూషితమేదినీపద్మగంధి
నీలవేణిచందంబునఁ గ్రాలుచునికి, నద్భుతానందములు మది నావహిల్ల. 2890

మ. గరిమన్ మున్నలజాంబవంతుఁ డనుపంగా నేను సంజీవనీ
కరణిం దేఁ జనునప్పు డిట్టివనమున్ గన్పట్ట దిచ్చోట నేఁ
డరుదారం గనుపట్టుచున్నయది భ్రాంతాత్ముండనై ద్రోణభూ
ధరముం జేరఁ ద్రోవ దప్పితినొ వ్యాకులం బెదన్ గల్గెడిన్. 2891

హనుమంతుఁడు మునివేషధరుం డగు కాలనేమియాశ్రమమునకుఁ బోవుట.

ఉ. ఇది యొక తాపసేంద్రవన మిచ్చట నొక్కవిరించిసన్నిభుం
డుదితయశుండు మౌనివరుఁ డుండఁగఁ బోలు సమగ్రభక్తిఁ ద
త్పదముల కేను మ్రొక్కి వితతంబుగ నమ్మహనీయమూర్తిచే
ముదమునఁ ద్రోవచొప్పెఱిఁగి పోయెదఁ గాక యని నిశ్చితాత్ముఁడై. 2892

సీ. మాకందఖర్జూరమాలూరమందార కింశుకశింశుపావంశతిలక
జంబీరజంబూకదంబనింబకదంబ వటకపిత్థాశ్వత్థకుటజనీప
మాతులుంగలవంగ మాధవీధవలుంగ నారంగపున్నాగనాగపూగ
తాలతక్కోలతమాలహింతాలరసాలసాలాంకోలకోలతూల

తే. కేలికృతమాలకుద్దాలపీలునీల, భూర్జకస్ఫూర్జకార్జునసర్జకాది
వివిధతరుశోభితం బయి వెలయునట్టి, కావనంబు ప్రవేశించి యవలఁ జనుచు.

సీ. వరకుసుమాళినంపదకు నివాసమై బలవైరియుద్యానవనముపగిది
ననిశంబు పుణ్యజనానందకారియై రహిమించు నలచైత్రరథముభంగి

నలశుకాదివనప్రియద్విజోపేతమై నైమిశాఖ్యమహావనంబుమాడ్కి
నిరుపమశైలభూనీలకంఠవిలాస వైభవంబై కామ్యవనమురీతి
తే. నలరుచు నదృష్టపూర్వమై యక్షిహృదయ
హారియై యద్భుతానందకారియైన
కాంతరుచి నొప్పుచున్నది తపసివిపిన
మహహ యేమందు దీనిశోభాతిశయము. 2894

మ. ప్రసవోత్థిప్తరజోవిభూతియు మరుద్వ్యాధూతశాఖాశిఖా
విసరోత్కింగజటాచయంబు కుసుమోత్పీడాళిరుద్రాక్షలుఁ
బసమీఱ న్ధరియించి నిశ్చయతపఃప్రారూఢిమైఁ బొల్చు తా
పసులుం బోలెఁ జెలంగు పాదపములం బార్శ్వంబులం జూచుచున్. 2895

చ. పురుషులతోఁ బెనంగొనిన భూరిపయోధరభారనమ్రనుం
దరతరగాత్రలైన యెలనాగలనట్లు తదాశ్రమంబునం
దరువులతోఁ బెనంగొనిన నవ్యఘనస్తబకాభిరామబం
ధురరుచిరోలపంబుల మనోజ్ఞగతిం బరికించె నత్తటిన్. 2896

సీ. పొదరిండ్లలోనఁ గ్రోల్పులులు శంబరములమూఁపులు నాకుచు ముచ్చటాడఁ
దుండముల్ సాఁచి వేదండచయంబులు కంఠీరవంబులఁ గదియ దిగువఁ
గాకోదరంబులు కడువేడ్క ముంగిల మూతులు నాకుచు ముద్దులాడ
నెలుకలుఁ బిల్లులు నేకమై యొకచోట నవిశంకబుద్ధిఁ జెల్లాటమాడఁ
తే. దక్కినమృగవ్రజంబు లండజము లొకట
వికతజాతివైరంబులై వెలయుచుండఁ
జూచి మునిశేఖరునితపస్స్ఫూర్తిమహిమ
కాత్మ నలరుచు నడుదారి నరిగియరిగి. 2897

సీ. నస్యక్షలితచూతజంబూఫలస్రవద్రసధార లేఱులై వసుధఁ బాఱఁ
దరువిటపాగ్రపతత్సూనరాసులు రురుదంపతులకుఁ బఱుపులు గాఁగ
గుంజావినిర్మితకుంజపుంజంబులఁ గస్తూరిమృగము లుత్కలికఁ జూప
వైడూర్యవర్ణశాడ్వలతలంబుల రణత్కేకిగణంబు సంక్రీడ సల్ప
తే. లలితకిసలయకుసుమపల్లవమరంద
గంధము గ్రహించి శీతలగంధవహుఁడు
పుష్పొడిదుమార మంతటఁ బొలియ ఘూర్ణ
హారియై వీవ నవ్విపినాంతరమున. 2898

వ. ఇట్లు బహువిధగుణోపేతంబై నేత్రమనఃకాంతంబై యదృష్టపూర్వశోభారమ
ణీయంబై నానాతరులతావితానకలితంబై మధువాపీశతశోభితంబై శుద్ధ
స్ఫటికసవర్ణసుధోపమాననిర్మలసలిలపూరితదీర్ఘికానంకులంబై యొప్పు నవ్వన
మువిలాసంబు నంతనంతఁ గనుంగొనుచుఁ జనిచని తన్మధ్యదేశంబున. 2899

చ. విపులగతిఁ శుకంబు లటువేదములం జదువం బికంబు ల
య్యుపనిషదర్థజాతము సుయుక్తిఁ బ్రసంగము సేయ శారికల్
చపలత శాస్త్రవాదములు సల్పఁగఁ దేంట్లు సుతానగీతముల్
నిపుణతఁ బాడ నొప్పు నొకనిర్మలపర్ణకుటిప్రదేశమున్. 2400

ఆ. కాంచి మానసమునఁ గౌతుకంబు ముదంబు, సంభ్రమంబు చాల సందడింప
భయము భక్తి మెఱయఁ బర్ణశాలాంతర, సీమ నంచితముగఁ జేరి యందు.

సీ. పొలుపొంద నెమ్మేన భూతిరుద్రాక్షలు దాల్చి కాషాయవస్త్రము ధరించి
కపిలవర్ణసవర్ణవిపులజటాజాలబంధంబు శిరమునఁ బాదుకొలిపి
దండంబు సలిలకమండలు లిరువంక నలవరించి స్వనాసికాగ్రమందుఁ
జూడ్కులు నాటించి సురుచిరయోగాసనంబునఁ గూర్చుండి నయనయుగళ

తే. మరయ నర్ధనిమీలితం బై తనర్పఁ
దివిరి జపమాలపూసలు ద్రిప్పికొనుచుఁ
గపటమునివేషధారి యై కపటజపము
సలుపుకాలనేమిని గాంచి సంభ్రమమున. 2402

తే. అతని నిక్కము మునియ కా మతి దలంచి, వినయవినమితగాత్రుఁడై విమలభక్తి
వందన మొనర్చి పేశలవాగ్విశేష, మొసఁగ నమ్మాయతపసితో నిట్టు లనియె.

ఉ. మానివరేణ్య యేను హనుమంతుఁడ మారుతపుత్త్రుఁడన్ గుణ
శ్రీనిధి రాఘవుం డనుప జీవదదివ్యమహౌషధీలతన్
జానుగఁ దేర ద్రోణగిరి చక్కటి కేగుచుఁ ద్రోవ దప్పితిన్
దాని తెఱంగుఁ జెప్పి కరుణ న్ననుఁ బ్రోవుము సత్వరంబుగన్. 2404

వ. మునీంద్రా దప్పి న్బడలియున్నవాఁడ నివ్వనంబున నిర్మలతోయం బైనజలా
శయం బొక్కటి గలదేని యానతిమ్మని యడిగిన నమ్మాయతపసి హనుమంతున
కిట్లనియె. 2405

కాలనేమి హనుమంతునితో వంచనోక్తులు పలుకుట.

సీ. వాయునందన రఘువర్యుండు లక్ష్మణజానకీసహితుఁ డై కాననమున
నుండ రాక్షసవల్లభుండు జానకి నెత్తుకొని పోవుటయు రాజకుంజరుండు
వనచరోపేతుఁ డై వారాశి బంధించి లంకకుఁ జనుటయు లక్ష్మణుండు
రావణశక్తిచే రణరంగమున మూర్ఛ నొందుటయును నీవు పొందుపడఁగ

తే. నవనినాయకుఁ డంపఁ ద్రోణాద్రి కేగి, కడిమి మెఱయ సంజీవనీకరణినాము
కౌషధంబు తేఁ బోవుట యంత యేను, యోగదృష్టిచేఁ గనుఁగొనియున్నవాఁడ.

వ. కపీంద్రా నీవు సర్వలోకహితకరుం డై నరామునకు భృత్యుండ వగుటం జేసి
నాకు మిక్కిలి పూజనీయుండ వైతి వమ్మహాత్మునికార్యంబు నీకుంబోలె నాకు
నవశ్యకర్తవ్యం బై యుండు నే నిప్పు డొక్కమంత్రంబు నీ కుపదేశించెద దా
నిం బ్రతిగ్రహించితి వేని నీ కభీష్టలాభసిద్ధి యగు ధృతియు మతియు దృష్టి

యు దాక్ష్యంబు నెప్పుడు నశింపకుండు సంగ్రామంబున శత్రుజయంబు గలుగు
మఱియు నమ్మంత్రప్రభావంబున దివ్యౌషధులు తమయంతం దాము పొడ
సూపు నదియునుం గాక మదీయాశ్రమంబున నమృతకల్పంబు లైనపక్వఫలం
బులు సమృద్ధంబులై యున్నవి వీని నుపయోగించి సుధోపమం బైనమదీయక
మండలుజలంబు ద్రావి యీరాత్రి యిచ్చట వసియించి సంజీవన్యాదిదివ్యౌ
షధు లిచ్చటనె యున్నవి గావున వానిం గొని ప్రభాతకాలంబున యథేచ్ఛం
జనుము మత్ప్రసాదంబున క్షణమాత్రంబులోన లంకాపురంబు ప్రవేశించెద
వని పలికిన విషమిశ్రమధూపమం బైనవానివచనంబు విని యవ్వాయునందనుం
డమ్మాయామునికిట్లనియె. 2407

సీ. మౌనిశేఖర నీకమండలుజలమున దప్పి దీఱదు నాకుఁ దడయ కిప్పు
డివ్వనంబున బ్రాద మెచ్చోటఁ గలిగిన నచ్చటి కరిగెద నానతిమ్ము
లంకాపురంబులో లక్ష్మణుం డటుమూర్ఛ నొందియుండఁగ నారఘూత్తముండు
వ్యసనియై యుండ నేఫలములు గొని యెట్లు భుజియింతు నిట నిద్రవోదు నెట్లు
తే. ప్రొద్దు పొడిచిన నారాజపుత్రకుండు, మనఁడు గావున నిచ్చోట మనలఁదగదు
మాన కీరాత్రి యెటులైన మందులుగొని, శీఘ్రజవమున లంకకుఁ జేరవలయు.
క. అని పలికినఁ గృత్రిమముని, విని యప్పుడు మందహాసవికసితముఖుఁడై
యనిలతనూజునిఁ గనుఁగొని, ఘనతరగౌరవము మెఱయఁగా నిట్లనియెన్. 2409

— కాలనేమి హనుమంతునకు నొకసరస్సును జూపించుట. —

ఉ. ధీరవరేణ్య తూర్పుదెస దివ్యసరోవర మొప్పుచున్న దిం
పారఁగ శీఘ్రగామి వయి యచ్చటి కేగి సుధోపమానత
స్నీరము దప్పి దీఱఁ గొని నేర్పున మాకడ కివు గ్రమ్మఱం
జేరఁగ రమ్ము సత్కరుణఁ జెప్పెద నీకొకమంత్రరాజమున్. 2110
క. మారుతసుత నీ వచ్చటఁ, గోరికఁ గడుపార నీరు గ్రోలు నపుడు సొం
పారఁగ నయనద్వంద్వము, వారక మూసికొని ద్రావవలయుం జుమ్మీ. 2411
క. అని పలికి యొక్కశిష్యుని, మునుకొని తో డిచ్చి పనుప మోదంబున న
వ్వనచరవీరుఁ డతఁడు చూపిన తెరువున నరిగి యొకవివిక్తతలమునన్. 2412
శా. కాంచెం బావని నిర్మలస్ఫటికసంకాశామృతోదారముం
బ్రాంచద్భృంగచలన్మయూరబకచక్రక్రౌంచసంచారముం
బంచాస్త్రప్రదరీకృతస్ఫుటితపద్మశ్రేణికాధారముం
జంచత్కోకమలచంచరీకపరివజ్ఝంకారకాసారమున్. 2413
వ. మఱియుఁ గుసుమితాభినవసుగంధబంధురమాధవీమాలతీమల్లికైలాలతాళతా
కీర్ణకుంజకుటీరరంజితతీరప్రదేశంబగుదానిఁదటరుహవిటపివిటపపటలభూషాయ
మాన పరిపక్వమాకందజంబుజంబీరఫలరంధ్రగళన్మధురసప్రవాహప్రసరణం
బగుదానిఁ గన్నెమావిగొమ్మలజిబురుగొన్న కెందలిరుజొంపంబులు మెక్కి నిక్కి

యున్మదావస్థ నెక్కొనఁ గుహూకారంబులు సేయుకలకంఠంబులకంఠకలకలం
బులు మదనాస్త్రమంత్రంబులై యలర సురభికుసుమమకరందరసాస్వాదనపరవ
శేందిందిరఝుంకారంబులు మార్వీటంకారంబులయందంబు పొందుపఱుపఁ బరి
పక్వదాడిమీఫలబీజగ్రసన సముత్థసముత్సాహకీరగీరమావిలాసంబు రమాకు
మారునియుదారకీర్తికథాగానసంపదసొంపు సంపాదింప విరహిణీజనమృగం
బుల వేఁటాడుటకుం జనుదెంచినపుష్పబాణునిమృగయాస్థానంబుభంగిఁ జెలంగు
దానిమఱియును. 2414

సీ. మలయమరుత్ప్రేతచలితపుష్పలతాప్రసూనసౌరభసాంద్రమైనదానిఁ
బద్మకుట్మలమిళద్భ్రంభరస్వనముల వలరాజుకీర్తనల్ పాడుదాని
నుడివోక పాలయుపుష్పాడిగంధవడి వనసారసపాణిపైఁ జల్లుదానిఁ
బృథులోర్మిడోలికాప్రేంఖన్మరాళికాకలనాదములఁ దన్నుఁ బిలుచుదానిఁ
తే. గలితపుష్కరశోష రేఖావికీర్ణ, లలితశీతలవాలుకాతలని షేవి
తాంచితరథాంగసారసక్రౌంచమిథున, చారురవముల మిగుల నొప్పారుదాని.

సీ. అనిశంబు నాశ్రయించినహంసతతులకు విడక తామరతూండ్లు గుడువ నిచ్చి
వదలక గీపెట్టు కొదమతుమ్మెదలకు విరులతేనియ లిచ్చి విందుచేసి
యభ్యాగతుండైనయలసవాయువునకుఁ గుసుమసౌరభ మిచ్చి కూర్మి నెఱపి
తనచుట్ల నున్నయున్నతతరులతలను బుష్కరకణములు పోసి పెంచి
తే. మత్స్యకచ్ఛపనక్రకూర్మద్విరసన, ముఖనిఖిలజంతుసంతానములకు నియత
మైనయాహార మిడి తనయఖిలభువన, జీవనత్వంబు తెల్లంబు సేయుదాని.

సీ. వికచపద్మోత్పలవీక్షణంబులు గల్గి రమణీయచక్రస్తనములు గల్గి
రుచిరశైవాలశిరోరుహంబులు గల్గి నవ్యమరాళయానంబు గల్గి
పృథుతరావర్తగంభీరనాభియుఁ గల్గి విలసితకల్లోలవళులు గల్గి
వితతసైకతతలోన్నతనితంబము గల్గి లలితమృణాళదోర్లతలు గల్గి
తే. సుందరాకృతిఁ గైకొన్నసుదతివోలెఁ, గన్నులకు వేడ్క సేయుచు నున్నదాని
మానససరోవరంబుచందాన మదికి, నరుదు పుట్టించునమ్మహాసరసిఁ గాంచె.

ఉ. ఈగతిఁ గాంచి వాయుసుతుఁ డింపు దలిర్పఁగ దాని డాయఁగా
నేగి తదీయశైవలము నీవల నావలఁ బాయఁదట్టి లీ
లాగతి గంధసింధురములాగున భూరిఘనంబువై ఖరిఁ
బాగుగఁ దజ్జలం బతిపిపాసితుఁడై వడిఁ ద్రాగుచుండఁగన్. 2418

## —ముసలి హనుమంతుని బట్టి మ్రింగుట.—

క. చింతింపక మును మకరము, పంతంబున దంతిరాజుఁ బట్టినమాడ్కిన్
వింతగ నొకమకరి హనూ, మంతునిపాదములు పట్టె మచ్చర మొప్పన్. 2419

వ. ఇట్లతిఘోరరూపిణి యైనమహాగ్రాహి మునిదత్తశాపవిమోచనంబు గావించి
రక్షింపవే యని ప్రార్థించుకై వడి నమ్మహావీరునిచరణంబులు పట్టిన దాని విలో

కించి బలవంతుం డగుహనుమంతుండు వజ్రాశనిసమస్పర్శం బైనవాలంబున
దానిదంతంబులు విఱుగం బ్రహరించి వైనతేయుండు మహాసర్పంబుం బోలెఁ
దీక్ష్ణనఖంబులఁ గఠోరకంటకభరితం బైనదానినాలుక వెలికిం బెఱికి వైచిన
నది యంతటం బోక రయంబున. 2420

ఉ. అంబుచరంబుబల్మి మెఱయం బటుదారుణతప్తలోహపిం
డంబును లోలెఁ బావని ననంతపరాక్రమదుర్నివారు శీ
ఘ్రంబునఁ బట్టి మ్రింగె యలుకన్ మునివల్లభదత్తశాపరో
గంబు హరింప భేషజముఁ గాంక్షమెయిం దగ మ్రింగుకై వడిన్. 2421

సీ. ఆసమయంబున ననిలతనూభవుం డేఁకనేమి సేయుదు నెద్ది తెఱఁగు
దారుణగ్రాహిణి తప్పక నను బట్టి దిగిచి మ్రింగఁ ద్రోణంగె దీనిచేతఁ
జావంగ వలసెనో జనవల్లభునికార్య మెట్లగునో తమ్ముఁ డింపు మెఱయ
జీవింప కున్న సుగ్రీవవానరచమూసహితుఁ డై పోలియునో జనకపుత్రి
తే. ప్రభునిపా టంతయును విని విమతి నొంది, చచ్చునో సూర్యవంశయశంబు కీశ
వంశకీర్తి నశించునో పరఁగ దైవ, మేమి గావింప నున్నదో యింకమీఁద.

హనుమంతుండు మొసలిగర్భంబు చించి దానిం జంపుట.

వ. అని యించుక విచారించి కలవళింప నేలయిప్పు డల్పగాత్రుండనై దీనియుదరం
బు ప్రవేశించి వధింతుఁ గాక యని నిశ్చయించి యంగుష్ఠమాత్రుం డై గరళపు
ముద్దయుంబోలె నుండుచు గాఢాంధకారభరితగుహాసదృశం బైనదానికుక్షి
లోనం బ్రవేశించి మహార్ణవమధ్యంబునం బరిభ్రమించుబడబానలంబుచందం
బున నేర్చుచు శరీరంబుఁ బెంచి వజ్రాయుధసంకాశంబు లైనకరరుహంబుల
దానియుదరగతంబు లైననరములు ద్రెంచి నెమ్ములు చూర్ణంబులు చేసి మాం
సంబుఁ జెక్కి సంధులు నుఱుము గావించి ప్రేవులు ముద్దచేసి యూపిరి వెడలి
రాకుండఁ గంఠబిలంబున కడ్డంబుగాఁ ద్రోచిన నమ్మకరి తదీయవేదన సహింపం
జాలక యిది నాకు నఱుగునాహారంబు గాదు దీన నిక్కంబుగా మరణంబు
సిద్ధించు నని తలంచి యుల్లోలకల్లోలంబులు కడలకుం బఱవ నమ్మహాసరోవర
మధ్యంబునఁ బరిభ్రమించుచు నూపిరి వెడలక కొండొకసేపునకుఁ బంచ
త్వంబునొందె నప్పుడుతదీయవదనకర్ణనాసారంధ్రవినిస్సృతశోణితధారాప్రవా
హంబున నమ్మహాసరోవరసలిలంబు సిందూరితం బయ్యె నంత నమ్మరున్నంద
నుండు దానియుదరంబు భేదించి వెలుపలికి నిర్గమించి ఘోరం బైనమకరి
కళేబరం బీడ్చికొని శీఘ్రంబునఁ దత్సరోవరతీరంబుఁ జేరి రక్తసిక్తాంగుండై ఘుసీ
భూతం బైననీహారంబు విరియఁ దట్టి ప్రకాశించుచున్న బాలదివాకరునిపోలు
పునం దేజరిల్లుచు విధుంతుదవదనవినిర్గతుం డైనశశాంకునిపోంకంబున నతి
ప్రియదర్శనుం డై యొప్పె నంత. 2422

ధాన్యమాలినికి మకరరూపంబు వదలి యప్సరోరూపంబు వచ్చుట.

సీ. తనయచిరత్వంబు దలఁగఁ బెట్టి తనుత్వ మరుదారఁ గైకొన్న మెఱుఁగుభంగి
సతతంబు గగనసంచారంబుపై రోసి ధరణికి వచ్చినతారపగిది
నందనోద్యానంబునం దున్కి మాని యుర్వర జనించెడుకల్పవల్లిమాడ్కి
ముజ్జగంబుల నెల్ల మోహింపఁ జేయంగ స్మరుఁడు పంపినపుష్పశరముకరణిఁ
తే. దనువు గైకొని వెలికి వచ్చినసరోంబు
బింబితమనోజ్ఞశశికిరణంబురీతి
మాకరాంగంబు విడిచి యమ్మకరి యపుడు
సుందరాకారయువతి యై చూడ నొప్పె. 2424

సీ. బంభరీభూషితపంకేరుహంబులు నలువొప్ప నయనాననములు సేసి
జలభంగసంచలచ్చారుచక్రంబులు రమణీయకుచనితంబములుసేసి
భూరిసౌరభలుబ్ధపుష్పంధయశ్రేణి తీరైనజడయు నూఁగారు సేసి
పొందుగా విరిసినకెందమ్మిఱేకులు చరణయుగ్మాధరోష్ఠములు సేసి
తే. మొలకనవ్వులు నునుదొడ లవ్వలుఁదచెక్కు
లలరునాభియుఁ గలదు లేదనెడుకౌను
వళుల సాక్షాత్కరించిన సరసిలక్ష్మి
వైఖరిఁ జెలంగు చున్నయవ్వనితఁ జూచి. 2425

ఉ. మారుతి యేమిచిత్ర మిది మాకరరూపము మాని భూరితే
జోరమణీయమూర్తి యగుసుందరి యై కన నయ్యెడి స్మరు
త్సారసనేత్రయో భుజగచంపకగంధియొ యక్షకాంతయో
చారుజలాధిదేవతయొ జవ్వని యంచుఁ దలంచు చుండఁగన్. 2426

చ. అతులసువర్ణరత్నరచితార్కసమానవిమానరాజ ము
ద్భుతగతి నెక్కి కార్మెఱుఁగుపోలిక నింగి వెలుంగఁ జేయుచున్
స్మితరుచిజాల మవ్విపినసీమకు వెన్నెలతేటఁ జూపఁగాఁ
జతురతఁ బల్కెఁ బావనికి సాంద్రసుధారసధార లొల్కఁగన్. 2427

ఉ. మారుతి నీప్రసాదమున మాకరరూపము వీడి నేఁటి కి
చ్చో రమణీయభంగిఁ గడుసొంపుగఁ దాల్చితి దివ్యదేహ మిం
పారఁగఁ బూర్వజన్మసుకృతాతిశయంబు ఫలించి దుఃఖముల్
దీఱెఁ గృతార్థ నైతి నిఁక దేవజగంబున కర్థి నేగెదన్. 2427

సీ. అనిలనందన యిది మునితపోవని గాదు దితిజమాయావినిర్మితవనంబు
దశకంఠుపనుపునఁ దాటకేయసుతుండు తనమాయచే దీనిఁ దగ సృజించి
తాపసవేషంబుఁ దాల్చి నీకంతరాయము సేయ నిచ్చటి కనిపె నిన్ను
వీనిమాటలు నీవు విశ్వసింపఁగ రాదు తెగు[illegible] వీని వధించి పుచ్చి

తే. ద్రోణధాత్రీధరమున కీత్రోవ నేగి, కోర్కి దివ్యౌషధంబులు గొని రయమున
లంకకుం జని సంప్రీతి లక్ష్మణునకు,నిడి బ్రతుకఁ జేసి సత్కీర్తి వడయు మయ్య

వ. కపీంద్రా యేను ధాన్యమాలిని యను పేరం బరఁగు నప్సరఃకాంతను మహాత్ముం
డైన శాండిల్యముని శాపంబున నీసరోవరంబునందు మకరినై యుండు టెఱింగి
యున్నవాఁ డగుటం జేసి రావణుండు నాచేత నిన్నుఁ జంపించువాఁడై మారీచ
నందనుం డైన కాలనేమి యనువాని మహామాయు నొక్కరాక్షసుం బనిచిన
వాఁ డిమ్మాయావనంబు నిర్మించి కపటమునివేషంబుఁ దాల్చి యుపాయబలం
బున ని న్నిచటికిం బనిచె నేను శాపవశంబున నజ్ఞాతభవత్ప్రభావనై నిన్నుం బట్టి
మ్రింగితి నీవు మహాబలవంతుం డగుటం జేసి నన్ను వధించి కుశలివై తీరంబు
నకుం జనుదెంచితి నేను భవత్ప్రసాదంబున మునిదత్తశాపవిముక్తనై ఘోర
గ్రాహీరూపంబుఁ బరిత్యజించి యెప్పటియట్ల దివ్యరూపంబు ధరించి కృతార్థ
నైతి నింకఁ బురందరునికొలువునకుం జనియెద ననుజ్ఞ యొసంగు మని పలికిన
విని యమ్మరున్నందనుం డాశ్చర్యరసావిష్టచిత్తుం డై యవ్వరారోహ కిట్లనియె.

క. శమభూషణులు జితేంద్రియు, లమలాత్ములు పుణ్యు లతిదయాళురు మౌనుల్
కమలేక్షణ శాండిల్యుఁడు, శమము విడిచి నీకు నేల శాపం బిచ్చెన్. 2431

క. అని యడిగిన నద్దివిజ, వనితామణి ముద్దుగుల్కుఁబల్కులఁ దేనెల్
చినుకఁగ మెల్లన నిట్లని, వినిపించెను దనదుపూర్వవృత్తాంతంబున్. 2432

ధాన్యమాలిని తనపూర్వవృత్తాంతంబు హనుమంతునకుఁ జెప్పుట.

శా. లోకస్తుత్యచరిత్ర శంభుసభ నాలోకింప నే నొక్కనాఁ
డాకైలాసనగాధిరాజమున కుద్యత్ప్రీతితో నేగి య
స్తోకప్రౌఢిను లాస్యము ల్సలుప నంతోసిల్లి మన్నించి నా
కీకళ్యాణవిమానరాజ మొసఁగెఁ హేమాద్రిధన్వుం డొగిన్. 2433

చ. అది మొద లేను శంకరునియాజ్ఞనతి గైకొని దీని నెక్కి స
మ్మదమున సర్వలోకములు మానుగ నిచ్చలు సంచరించుచు
న్వదలక యొక్కనాఁడు కపివర్య మనోహరపద్మసౌరభా
స్పద మగునిమ్మహాసరసి వారివిహారము సల్పుచుండఁగన్. 2434

చ. అపరిమితప్రభావుఁడు మహామహుఁడు న్మృగచర్మధారియు
న్గపిలజటాచ్ఛటాధరుఁ డకల్మషభూతివిలిప్తగాత్రుఁ డై
తపనునికై వడిం దెస లుదగ్రరుచి న్వెలుఁగంగఁ జేయుచుం
దపసి యొకండు నాకడకుఁ దప్పకఁ జేరఁగ వచ్చి యిట్లనున్. 2435

తే. ఏను శాండిల్యనామమునీశ్వరుండ, దూరమున నీతనుద్యుతిఁ బాఱఁ జూచి
చక్కనిమెఱుంగుఁదీఁగెయో చంద్రకళయొ, యని పరీక్షింప వచ్చితి నబ్జవదన.

సీ. మోహనగాత్రి నీమోమున కెన యైనజలజాతచయ మిందుఁ గలిగి యునికిఁ
గువలయగంధి నీకుచములతో సాటి యగుచక్రవాకంబు లలరుచునికి

నెలఁత నీనిడుదపెన్నెఱులకుఁ దుల యైనమృదులశైవలలతల్ వొదలుచునికి
గజరాజగమన నీకనులకు జోడైననీలోత్పలము లిందు నెగడుచునికి
తే. నీసరోవరలక్ష్మితో నీను పూని
తమ్ములు మునుంగఁ జక్రముల్ తలఁగి పాఱ
శైవలము దూలఁ దోషలు సంచలత నొందఁ
గలఁచెదవ యేమి చెప్పుమా కాంత యిపుడు. 2437

చ. సుదతిరొ దాఁచ నేల నినుఁ జూచినయప్పటినుండి మన్మథుం
డదయతఁ దివ్యబాణముల నారటపెట్టఁగ సాగె ధైర్యము
న్వదలితి నింక నే నొకక్షణం బయిన న్నిలుపోపఁ జాల నీ
యధరసుధారసం బొసఁగి యంగజతాపము దీర్పవే దయన్. 2438

సీ. మానినీమణి నీదుమధురాధరము గన్నయంతనే యనురాగ మావహిల్లె
శుకవాణి నీకురుల్ చూచినయంతనే ఘనతరమోహాంధకార మొదవెఁ
గలకంఠకంఠి నీకనులయందముఁ జూచినంతనే చపలత్వ మంకురించె
నలినాయతాక్షి నీనడుముఁజూచినయంతఁ బలువుఱు నొడలఁ గంపముజనించె
తే. రమణి నీపీనవక్షోరుహములఁ జూచి
డెందమునఁ గొంతధైర్యంబు నొంది యున్న
వాఁడఁ గౌఁగిట గదియించి వలపు మించి
యింపు సొంపార రతులఁ దేలింపు మబల. 2439

వ. అని పలికిన నేను భయకంపితాంగి నై వినయంబున నమ్మునివరున కిట్లంటి.

చ. అనఘచరిత్ర పాపనిలయంబు తపఃఫలహానిహేతుకం
బనవరతంబు ఘోరనరకాస్పదము న్బుధలోకనిందితం
బును గులధర్మనాశకరము న్సురలోకపథావరోధకం
బును వెలయాలిపొందు మిముబోఁటి మహాత్ములు గోరఁ బాడియే. 2441

క. నా విని యమ్మునినాథుఁడు, భావజపరిముక్తబాణబాధితుఁ డగుచుఁ
గేవలపరితాపంబున, నావదనముఁ జూచి పలికె నమ్రుం డగుచున్. 2442

చ. పడఁతిరొ నీకటాక్షశరపాతవిభిన్నహృదంబుజుండ నై
బడలితి నోర్వఁ జాల నిఁక బంధకి వౌనినుఁ బొంది ప్రాణము
ల్విడువక నేఁడు గాచికొని వెండియు భూరితపంబుపెంపునం
బడయఁగ రాదె పుణ్యము దినంబును భావనధర్మసంపదన్. 2443

ఉ. కోమలి నేఁడు నీవు ననుగూడక కాదని త్రోచి పుచ్చినం
గామశితాస్త్రపాతమున గాసిలి ప్రాణము నిల్వ దెంతయుఁ
బ్రేమ సుధార్ద్రదృష్టిఁ గని వేడుక మీఱఁ బరిష్వజించి భా
షామధురత్వ మేర్పడఁగ సంగమసౌఖ్య మొసంగి ప్రోవవే. 2444

వ. అని పెక్కు తెఱంగులం బ్రార్థించిన మాఱువలుకంజాలక యియ్యకొని మునీం
ద్రాయే నిప్పుడు రజస్వల నై యున్నదాన నేఁడు ప్రథమదివసంబుదినత్రయంబతీ
తంబై నపిమ్మటఁ బరిశుద్ధ నై నాలవనాఁడు మీయొద్దకుం బఱ తెంచెద నందాఁక
దాల్మి వహించియుండవలయు నని పలికిన నత్తాపసేంద్రుండు సమ్మతించి
యథేచ్ఛం జనియె నంత నేను గంధమాదనపర్వతంబునకుం జని యందొక్క
పుష్పోద్యానంబునందుఁ జంద్రకాంతశిలాఫలకంబుమీఁద సుఖాసీన నై వీణా
దండం బంకించి పాణిపంకజరత్నకంకణఝుణఝుణత్కారంబు తాళమానం
బులు దెలుపఁ దరుణపల్లవసుకుమారాంగుళులచేతఁ దంత్రులు మీటుచు రాగ
సంపద లేర్పడ శ్రుతిమనోహరంబుగా గీతప్రబంధంబులు పాడుచుంటి నంతకు
మున్న రావణుండు దిగ్విజయార్థం బరిగి దైవయోగంబున నాఁటిరేయి సేనా
సమేతంబుగా నమ్మహామహీధరంబుమీఁద విడిసి యంత నంత నప్పర్వతవిలా
సంబులు గనుంగొనుచు నేకాంతంబుగాఁ జనుదెంచి నాయున్నపుష్పోద్యానంబు
ప్రవేశించి మధురం బైనమదీయగానస్వనం బాలకించి శీఘ్రంబున నాకడకుం
జనుదెంచి తదీయభయంకరరూపసందర్శనసంజాతభయభ్రాంత నై వాతాందో
ళితనూతనవల్లియుం బోలె వడంకుచున్ననన్ను విలోకించి యంగజరాగమత్తుం
డై యిట్లనియె. 2445

మ. కమలాక్షీ విను మేను రావణుఁడ లంకానాథుఁడన్ దోఃప్రతా
పమహోదగ్రుఁడ సర్వదైత్యవిభుఁడన్ భాషేశవిశ్రాణితో
త్తమనానావరుఁడన్ త్రిలోకజయ ముద్యచ్ఛక్తిఁ గావించి దు
ర్దమలీలం జరియించువాఁడను మహాధన్యుండ నే నన్నిటన్. 2446

ఉ. కాంతరో యేమి చెప్ప నినుఁ గాంచినయప్పటినుండి బల్విడిన్
గంతులతాంతశాతశరకంపితగాత్రుఁడ నైతి నింక నా
కెంతయు నీదుమోవిమధు విచ్చి కవుంగిట గారవించి గి
ల్గింతలు సల్పి వేడ్క రతికేళి నను న్వేలయింపు మిత్తఱిన్. 2447

సీ. హరిచక్ర మఱచేత నవలఁ దట్టిననన్నుఁ జెలి నీదుజఘనంబుచిక్కువఱచె
గోత్రారివజ్రంబు గోట మీటిననన్నుఁ గలికి నీచూడ్కులు గాసిపఱచె
శయములఁ గైలాసశైల మెత్తిననాకు గఱిత నీపాలిండ్లు ఘనతఁ జూపె
భుజగలోకాధీశుఁ బొడిచి గెల్చిననన్ను వెలఁది నీవేనలి వెతలఁ బెట్టె

తే. వనిత నాపౌరుషంబు సర్వము నడంచెఁ, జారుభవదీయసుందరాకారలీల
నీకు దాసుఁడ నైతిని నెనరు గల్గి, సురతసుఖ మిచ్చి ప్రోవుము సురభిలాంగి.

తే. అంబుజమహాపత్త్రనేత్ర నాయంతవాఁడు, బంటుగతి వేఁడుకొనినఁ గాదంటివేని
యవనిలో రతిసారజ్ఞ లైనసతులు, నిన్ను నిందింపరే యవినీత వనుచు. 2449

చ. అని యిటు వల్క నేను నయమార దశానన యే రజస్వల
న్ననుఁ గదియంగ రా దనిన నవ్వుచు వాఁడు రజస్వల ల్వరాం

గనలును మద్యసేవినులు గల్గినచోఁ గడు లెస్స మాకుఁ గ్ర
మ్మినతమి నంటి కాంతల రమించుట ధర్మము దైత్యపాళికిన్. 2450

చ. అని తమకంబు పెంపున దశాస్యుఁడు నన్బలిమిన్ గ్రహించి గ్ర
క్కున మధురాధరామృతము గ్రోలుచు మర్మములం గలంచుచున్
దనియక పెక్కుగాఢసురతక్రియల న్నను గాసిపెట్టెఁ దొ
ల్చిన సలిలాశయం బటు లులాయము సొచ్చి కలంచుకైవడిన్. 2451

వ. ఇట్లు శిలోచ్చయకఠినవిగ్రహుం డైన రావణుండు భోగించివిడిచిన నేను మహా
వాతలోలితపుష్పలతయుంబోలె నాకంపితాంగి నై బడలి యుంటి నప్పుడు
నాకు సద్యోగర్భంబున శైలసంకాశ దేహుండును ఘనారావసమనిస్వనుండును
భోగీంద్రభోగకల్పదీర్ఘబాహుండును విశాలశిలాఫలకసమానవక్షుండు నగు
నొక్కపుత్రుం డుద్భవించిన నక్కుమారున కతికాయుం డనునామం బిడి
వానిం దోడ్కొని రావణుండు యథేచ్ఛం జనియె నంత నేను దివసత్రయం
బతిక్రమించిన నాలవనాఁడు కృతాభిషేక నై ధౌతపరిధానంబు ధరియించి
మణికుండల పుష్పదామచందనద్రవంబులచేత నలంకృతాంగి నై మనోహరా
కారంబుతో శాండిల్యునికడకుం జని మహాత్మా పరిశుద్ధ నై చనుదెంచితి
నింక నావలన నిష్టోపభోగంబు లనుభవింపు మని పలికిన నమ్మహాత్ముం డతీతా
నాగతవృత్తాంతాభిజ్ఞుండు గావున మనంబున రావణకృత్యం బంతయు నెఱింగి
కోపారుణితలోచనుం డై నా కిట్లనియె. 2452

సీ. వనజాక్షి నాయొద్ద వర్తించుచుండి నీ వన్యునిఁ బొందుట యర్హ మగునె
చలితమానసుఁడ నై కులట వౌనీమీఁద వేడ్కఁ జేసితి నెంత వెఱ్ఱి నైతి
జలధరచ్ఛాయలు చంచలాదీప్తులు జలరేఖ లతివలసంగమములు
తేజంబునకు గాఢతిమిరంబునకుఁ బోలెఁ గులటలకును దాపసులకుఁ బొందు

తే. గలుగ దెప్పటికైనను గటకట నీదు, వదన మీక్షింప దోసంబు వచ్చు మాకు
రూపగర్వంబు నీకింత యేపు దెచ్చె, మకరి వై యుండు మింక నిమ్మడువులోన.

క. కను గానక ని న్నిటు చేసినదుష్టుఁడు బంధుసుతసచివసహితముగా
ఘనసంగ్రామంబున రిపు, జనములచేఁ గూలు నింత సత్యం బబలా. 2454

చ. అని యిటు శాప మిచ్చిన భయాకులితాత్మక నై వడంకుచు
న్బ్రణతజనప్రసన్న యపరాధ మొకించుక లేదు నాయెడన్
దనుజుఁడు మూర్ఖుఁడై బలిమి దర్పకకేళి యొనర్చి యేగె స
జ్జనులు ప్రశాంతచిత్తులిఁక శాపవిముక్తి యనుగ్రహింపవే. 2455

ఉ. నా విని మౌనిభర్త కరుణ న్ననుఁ జూచి మదేభయాన నీ
కీవిధి వేయివత్సరము లేగినపిమ్మట రామదూత యా
పావని వచ్చు నిచ్చటికి భవ్యగతి న్బనిఁ బూని యమ్మహా
పావనమూర్తిచేఁ గలుగుఁ బట్టుగ శాపవిమోచనం బొగిన్. 2456

వ. అని పలికి యమ్మహాముని యథేచ్ఛం జనియె. 2457

క. మునినాథుఁ డన్నచందం, బున నీచే నాకు శాపమోక్షము గలిగె
న్నీను మతికృతార్థ నైతివి, జనియెద నే నింక శక్రసదనంబునకున్. 2458

క. అని పల్కి ధాన్యమాలిని, దినకరకులుభృత్యవరుని దీవించి వెసన్
జనియె నటు మెఱుఁగు మెఱసిన, యనువున నమ్మేనికాంతి యాశలఁ బఱవన్.

తే. అంతఁ బవమాననందనుం డతిరయమునఁ
గపటముని వేషధరుఁ డైన కాలనేమి
కడకుఁ బోయిన నవ్వీరుఁ గాంచి యతఁడు
పలికెఁ గపటమాధుర్యంబు బయలుపడఁగ. 2460

చ. అనిలతనూజ యెంత దడవాయె జలంబులు గ్రోలి వచ్చితే
గొను మిఁక మంత్రరాజమును గూర్మి నొసంగెద దీన మందు లో
య్యనఁ గన వచ్చు దీని కెనయౌ గురుదక్షిణ యెద్ది యన్న న
వ్వనచరవంశవర్యుఁ డనివార్యపరాక్రమదుర్నివారుఁ డై. 2461

క. గురుమంత్రంబున కెన యగు, గురుదక్షిణ యొసఁగఁ బోలుఁ గొను మిదె నీకున్
గురుదక్షిణ యిచ్చెద నని, గురుముష్టిం బొడిచె వానిగుండియ లవియన్. 2462

-:o:- హనుమంతుండు కాలనేమిం జంపుట. -:o:-

వ. ఇట్లు కఠోరదంభోళిధారాసంకాశమరున్నందనముష్టిప్రహారభిన్నవక్షుం డై యామారీచనందనుండు క్రోధావిష్టచిత్తుండై తత్క్షణంబ కృత్రిమమునివేషంబుఁ బరిత్యజించి నిజరూపంబు దాల్చి ప్రత్యగ్రనిశితాగ్రం బైనమండలాగ్రంబున నాసుగ్రీవసఖునివక్షంబు వ్రేసిన నతండు బెండుపెడక గండుమిగిలి యాగ్రహోదగ్రుండై యుగ్రత్రిశూలకల్పం బైనకరతలం బెత్తి దురాత్మా నీమాయలింకఁ బనిగొన విదె మదీయపాణిప్రహారంబు గొనుము దీన నీకుం జావు సిద్ధించు నింక నెక్కడి కేగ వచ్చు నని తర్జించుచుఁ బెడతల వ్రేసిన వాఁ డొల్లం బోయి మెల్లనఁ దెలిసి యొక్కపక్షిరూపంబు దాల్చి పక్షసంజాతవాతంబులఁ దూలం దోలుచు నిశాతనఖంబుల వ్రచ్చుచుఁ బ్రచండతుండంబునం గఱచుచు విజృంభించిన వానియాటోపంబుఁ జూచి సహింపక యమ్మహాబలనందనుండు తండ్రియనువున బలవేగంబు లంగీకరించి మహోద్దండ కాలదండసదృశంబు లైన నిశాతనఖంబులం జీఱుచు నశనిపాతకల్పం బైనకఠోరముష్టిం బొడుచుచు మహేంద్రధ్వజసన్నిభం బైనదీర్ఘవాలంబునం దట్టుచుఁ జరణనఖతుండపత్త్రంబులు విఱిచి నుగ్గునూచంబు చేసిన వాఁ డాపత్త్రిరూపంబుమానిదంష్ట్రాకరాళభీషణం బైనసింహాకారంబు దాల్చి నటాసంచలనసంజాతవాతూలసముద్ధూతజీమూతవ్రాతుం డై వనద్వీపంబులు భయంబునం బఱవఁ గఠోరకంఠహుంకారంబుఁ జేయుచు రభసాతిరేకంబునం గవిసిన నప్పవననందనుండు శర

భంబులీల నవలీల వానిమీఁది కుఱికి ముష్టిపాతంబునఁ దదీయదంష్ట్రిలు విఱు
గం బొడిచి సటాజాలంబుఁ జేతికివ్రేచి నెమ్ములు విఱుగఁ బాదంబులం దన్ని
కరతలంబున శిరంబు పగులవ్రేసిన నద్దానవుం డారూపంబు చాలించి స్వకీయ
మాయాబాహుళ్యంబునసుగ్రీవుండై చనుదెంచి లక్ష్మణుండు మూర్ఛదేఱి దశ
గ్రీవునితో నుగ్రసమరంబు గావించుచున్నవాఁ డింక సంజీవనీకరణి దేవల
దిచ్చటనుండి గ్రమ్మఱ లంకకుం జనుదెమ్మని పలికిన విని హనుమంతుండిదిరాక్ష
సమాయ గాని నిక్కంబుగా సుగ్రీవుండు గాఁడు వీనిమాటలు విశ్వసింపఁ దగ
దని నిశ్చయించి గంధసింధురంబుపైకి లంఘించుసింగంపుఁగొదమభంగి వాని
మీఁది కుఱికి తదీయదంతంబులు రాల నెమ్ములు విఱుగ శిరంబు పగులఁ జరణ
జానులాంగూలముష్టిఘాతంబుల బడలుపడం జేసిన వాఁ డమ్మాయాసుగ్రీవ
రూపంబు విడిచి నిజరూపంబు దాల్చి కోదండంబు గొని కాండప్రకాండంబు
పరఁగించుచుఁ గొండొకసేపు నానాప్రకారంబుల భండనంబు గావించె నప్పు
డవ్వనచరశ్రేష్ఠుండు కాలాత్యయం బైనం గార్యంబు చెడుఁ దడవు గాకుండ
వీని వధింపవలయు నని తలంచి లయకాలరుద్రమూర్తి తెఱంగున రౌద్రరసో
ల్లాసభాసురుం డై వాలచలనంబునఁ దదీయశరపరంపరలు విరియందట్టుచునద్ద
నుజాధముని గ్రిందం బడఁద్రోచి దాను మీఁదై జానుకూర్పరముష్టిఘాతంబుల
సర్వాంగసంధులు నొప్పించి హీనసత్వుం జేసి మదసింధురంబు కమలనాళం
బుం బోలె వానికంఠనాళంబు ద్రెంచి వధించి కాలుద్రొలికిం బుచ్చి విజయ
లక్ష్మీవిరాజమానుం డై ద్రోణశిఖరిమార్గంబుం బట్టి యతిత్వరితగమనంబునం
బోవుచుండ నప్పుడు. 2463

సీ. కిన్నరపరివృఢక్రీడాసరోవరస్తిమితసౌగంధ్యగంధము గ్రహించి
నిర్మలమందాకినీసరిత్కల్లోలధృతవారిశీకరార్ద్రిత వహించి
రమణీయతరచైత్రరథవనంబునఁ గల పువుటీరములచెంతఁ బొంచి పొంచి
మానసకాసారమహితపద్మోత్పలకుసుమపరాగంబు గొల్ల లాడి
తే. నిధువనశ్రాంతకిన్నరమిథుననిటల,కలితనూతనఘర్మాంబుకణము లార్చి
సమరసంజాతబంధురశ్రమము వాయఁ, దనకుమారునిపై వీచెననిలుఁ డపుడు.
చ. అటఁ జని కాంచె వానరకులాగ్రణి దుగ్ధపయోధివీచికా
పటలబృహత్ప్రయఃకణవివర్ధితసాంద్రవిశాలసాలముఁ
గటకచరత్తరక్షుగజగండకభల్లమృగేంద్రకోలముఁ
దటరుహజీవనౌషధిలతారుచిజాలము ద్రోణశైలమున్. 2465

—హనుమంతుండు ద్రోణాద్రిం గనుంగొనుట.—

వ. ఇట్లు విలోకించి యమ్మహామహీధరం బెక్కి. 2466
సీ. హరినఖదళితసింధురకుంభవిగళితముక్తికాలంకృతమార్గములును
గిన్నరదంపతీక్రీడావినోదాభిరామనిర్ఝరవనస్తోమములును

సౌదామనీలతాసంకాశదీప్తకాంచనలతాభూషితసానువులును
వృక్షశాఖాగళద్వ్రతుసన్నిభసుమాస్తీర్ణమనోహరాధిత్యకలును
తే. రమ్యమణిమయధాతుపరాగపటల,పాటలీకృతవివిధభూభాగములును
ధరసరిద్భంగచటులమృదంగనిస్వ,నానురూపనటన్మయూరాళిఁ గనియె. 2467
తే. ఇట్టు లచ్చటికందువ లెల్లఁ జూచి, యలసుషేణుండు చెప్పినయట్టిమందు
లరసి కనుఁగొన వేగ డాయంగఁబోవు,నంతలోపల నవి యదృశ్యంబు లయ్యె.
వ. అప్పు డప్పవననందనుండు చింతాకులితమానసుండై యప్పర్వతంబున కిట్లనియె.
చ. నగవర యేను రామునకు నమ్మినబంటఁ దదాజ్ఞఁ బూని సొం
పుగ భవదీయశృంగమునఁ బొల్చుమహౌషధము ల్గొన న్వడిఁ
మగఁటిమిఁ మీఱ వచ్చితిని మందులు ప్రీతి నొసంగు మింక నీ
కగణితకీర్తిలాభ మగు నవ్విభుకార్యము దీర్చినందునన్. 2470
చ. అని నయ మారఁ బల్కిన నగాగ్రణి మిక్కిలి గర్వితాత్ముఁడై
మనమున శంకఁ బో విడిచి మందులు వేగ మొసంగకున్న న
వ్వనచరవంశవర్యుఁ డనివార్యమహోగ్రహదుర్నిరీక్ష్యుఁడై
కనుల మిడుంగుఱు ల్వెదరఁ గ్రమ్మఱ నిట్లని పల్కె దానికిన్. 2471
చ. పలుమఱు మందు లిమ్మనుచుఁ బ్రార్థనఁ జేసిన నీ వొసంగు దే
కులిశముచేత ద్రెయఁ దగు కొండలు మెత్తనిమేలిమాటలన్
దలఁకునె కర్కశత్వ మది దప్పునె ని న్నెకలించి దోర్బలం
బలరఁగ లంకకుం గొని రయంబున నేగెద నేఁడు చూడుమా. 2472

—:o:— హనుమంతుండు ద్రోణశైలంబు గొని లంకకు వచ్చుట. —:o:—

వ. అని పలికి యాప్రభంజననందనుండు ప్రావృట్కాలజీమూతంబుకరణి విజృంభమాణశరీరుండై యవక్రపరాక్రమంబున జగత్త్రయంబు నాక్రమింప నుపక్రమించిన త్రివిక్రమదేవునిమాడ్కి నద్భుతదర్శనుండై చతుర్దశభువనభారధౌరేయశాద్రవేయసమానసారంబైనవాలంబు దిరుగం జుట్టి యట్టహాసంబుఁ జేసి తొల్లి నారాయణుండు మందరాచలంబు నుత్పాటించినతెఱంగున నమ్మహామహీధరంబుఁ బెఱికి ప్రళయకాలధారాధరంబుభంగి నొక్కమహాధ్వని గావించిన.
సీ. అవనిమండలము చక్రాకృతిఁ జలియించె దిగ్గజంబులు భీతి దిమ్మదిరిగెఁ
గిటికచ్ఛపాహులు లుత్కటభయంబున మ్రొగ్గెఁ గులశైలవరములు కలఁగఁబడియె
నింగియు దిక్కులునిబిడంబుగా మ్రోసెఁ బొంగి పయోనిధుల్ పొరలఁబడియెఁ
దఱచుగా దివినుండి తారకంబులు వ్రాలె గ్రహగణంబులు మింట గతులు దప్పెఁ
తే. బంచభూతంబు లధికవిభ్రాంతి నొందె
ఖచరభూతంబు లన్నియు గాసివడియె

భీకరాకారుఁ డై మరుత్ప్రియసుతుండు
గిరివరము వాలమునఁ జుట్టి పెఱుకునపుడు. 2474

వ. ఇట్లఖిలభువనభయంకరంబుగా నిరువదియోజనంబులతనర్పును నూఱుయోజనంబులపొడవునుం గలయప్పర్వతం బుత్పాటించి కరంబుల నెత్తి శిరంబున నిడికొని నిరంకుశప్రతాపంబునం దేజరిల్లుచు గమనోన్ముఖుం డయ్యె నప్పు డద్దివ్యౌషధులకుం గావలి యున్నచిత్రసేనాదిత్రయోదశకోటిగంధర్వపతులు సంరంభవిజృంభితులై భీషణరోషాతిరేకంబునం జనుదెంచిరభసంబునంబోనీక పొదివి నిలునిలు మనియదల్చుచుఁ జుట్టు ముట్టి యట్టహాసంబుఁ జేసి యతిభయంకరాకారులై గదాముసలముద్గరభిండివాలకరవాలశూలప్రాసకుంతచక్రశక్తితోమరపరశ్వథాదినానావిధసాధనంబులు సాంద్రంబుగాఁ బరఁగించిన నవ్వీరశిఖామణి సరకుగొనకవిజృంభించి వాని నన్నిటిని దూరంబుగా వాలంబున విరియందట్టి పాదంబులం దన్నుచు మోకాళ్లఁ గ్రుమ్ముచు నఖంబులఁ జీఱుచు నఱచేతులం బ్రహరించుచు మోఁచేతులఁదాటించుచుఁ బిటికిటంబొడుచుచు పక్షంబు నందట్టుచు లాంగూలచలనంబునఁ దూలందోలుచు ఘోరనాదంబున గుండెలవియించుచు నిట్లనేకప్రకారంబుల విజృంభించిన నాగంధర్వులు నచ్చియు నొచ్చియు విచ్చియు సుడివడియుఁ జీకాకుపడియు మహావాతోద్ధూతజీమూతవ్రాతంబురీతిఁ జెల్లాచెదరై నలుదెసలకుంబఱచి రందుఁగొందఱుమహాత్మా మహాబలుండవైన నీతోడ రణంబు గావింప మే మెంతవారము మాయపరాధంబు సహించి శైలంబు గొని శీఘ్రంబునం జను మని పలికి రిట్లు గంధర్వపతుల నందఱ నక్రమంబున నిర్జించి దుర్జయుండై యమ్మహాశైలంబు గొని గ్రీష్మాదిత్యుని భంగి నింగి వెలుంగుచు వాయువేగంబునం బోవుచుండె నప్పుడు. 2475

భరతుండు నందిగ్రామంబునందు దుస్స్వప్నంబు గని వ్యాకులచిత్తుం డగుట.

సీ. పొసఁగ నందిగ్రామమున నాఁటిరాతిరి భరతుండు నిద్రించి పరమధార్మి
కుం డైనరాముండు దండకావనములో జానకీలక్ష్మణసహితుఁ డగుచుఁ
దైలసిక్తాంగుఁ డై తలవెండ్రుకలు జాఱఁ బంకంబులోఁ జిక్కువడినయట్లు
కల గని మేల్కాంచి కళవళ మందుచు రామలక్ష్మణులకు నేమి కీడు

తే. గలిగెనో రాక్షసులచేత గాసిపడిరొ
యెన్ని యిడుములఁ బడిరొ యెందున్నవారొ
వీనులకు నేమి దుర్వార్త వినఁగ నగునొ
యేమి సేయుదు నింక నా కెద్ది తెఱఁగు. 2476

క. దిక్కుల ధూమము గవిసెను, నక్కలు గూయంగ సాగె నల్లడలందుఁ
జుక్కలు రాలఁ దొడంగెను, గ్రక్కున దివినుండి వేఁడిగాడ్పులు విసరెన్. 2477

మ. అని చింతించుచు ధైర్యము న్వదలి మే నాకంపముం బొందఁ గ్ర
న్నన నావేళనె భూసురప్రవరుల న్రావించి దానాదికం

బును వేదాధ్యయనంబు మంత్రపఠనంబు న్శాంతిహోమాదికం
బును గావింపఁగఁ బంచి దానును మహాపూతాత్ముఁడై గ్రక్కునన్. 2478

ఉ. ఏను రఘుప్రదీపకున కెంతయు భక్తుఁడ నేని నిత్యము
న్మానుగ సత్యధర్మనయమార్గమునం జరియింతునేనియుఁ
మానుగ రామలక్ష్మణు లమానుషచర్యులు సీతఁ గూడి య
క్కానఁ జరించి నేమమునఁ గ్రమ్మఱ వత్తురు గాక వీటికిన్. 2479

వ. అని పలుకుచున్న నప్పుడు. 2480

క. తాపురసప్రియుక్తి వడి, వేపులు గగనంబు దిశలు వెలిఁగించుచు నా
సామీరి వేగ నంది, గ్రామము సేరంగ వచ్చి ఘనసౌధమునన్. 2481

—హనుమంతుఁడు భరతునిం గాంచి శ్రీరాములని వ్యాకులచిత్తుం డగుట.—

సీ. సజలనీలాంబుదశ్యామలాంగమువానిఁ గమలపలాశనేత్రములవాని
నాజానులంబిబాహార్గళుం డగువానిఁ గంబుసన్నిభ మైనగళమువాని
విపులాంసములవాని వెడఁదవక్షమువానిఁ గమనీయదివ్యవిగ్రహమువాని
రాకేందుసంకాశరమ్యవక్త్రమువాని సముదేభతుల్యయానములవాని

తే. వరజటాజాలభూషితశిరమువాని
నగ్నివల్కావృతావలగ్నంబువానిఁ
బరమమునివేషమున నున్నభరతుఁ గాంచి
వనచరకులోత్తముఁడు రాముఁ డని భ్రమించి. 2482

ఉ. అక్కడ లక్ష్మణుండు సమరావని రావణశక్తివిద్ధుఁడై
తక్కక మూర్ఛ వోవఁ గని తద్వ్యసనంబున నిల్వలేక దా
నుక్కును బౌరుషం బెడలి యుష్మకరాత్మజుఁ బోవఁ బంచి యా
చక్కటి జానకి న్విడిచి చయ్యన రాఘవుఁ డేగుదెంచెనో. 2483

మ. అని చింతించి తదగ్రసంపద తదీయానూనదోశ్శక్తి త
ద్వినుతప్రజ్ఞయుఁ బౌరుషంబు మదిలో వీక్షించి రాముండు నీ
చనిశాటుం బరిమార్ప లేక నిజవంశఖ్యాతిఁ బోఁ బెట్టి యి
ట్లనుమానింపక వచ్చునే గతరణవ్యాపారుఁడై వీటికిన్. 2484

భరతుండు హనుమంతునిం జూచి పెనుభూతం బని బాణంబు వేయుతఱి నాకాశవాణి వలదనుట.

క. మదిలోఁ దప్పఁ దలంచితి, నిది యేటివిచార మొదవె నీతఁడు సుగుణా
స్పదుఁ డగురామునిఁ బోలిన, సదమలమానివరుఁ డింత సత్యం బరయన్.

క. అని నిశ్చయించి సభమునఁ, జనుచుండఁగ నవ్వనాటనత్తముఁ గని యా
ఘనభుజుఁడు భరతుఁ డిదియొక, పెనుభూతం బను చుమదిని విస్మయ మొదవన్.

క. దీనిఁ బడవైతుఁ గాకని, మానుగఁ జాపంబు గొని సమగ్రవిశిఖ సం
ధానంబుఁ జేసి మార్వీ, స్వానము గావించె దశదిశలు కంపింపన్. 2487

తే. అప్పు డశరీరవాణి యిట్లనుచుఁ బలికెఁ
గైకయీపుత్త్ర యీతఁడు మీకుఁ జాల
హితుఁడు పరమాస్త్ర మితనిపై నేయ వలవ
దుడుగు మన విని యవ్వీరుఁ డూరకుండె. 2488

వ. అంత. 2489

శా. వీరాగ్రేసరుఁ డైన పావని మరుద్వేగంబునం బోయి సొం
పార న్మంగలఁ గాంచె నంబరపథవ్యాప్తోర్మిసంచారముం
ఘోరగ్రాహకుళీరనక్రకమఠక్రూరోరగోదారముం
బారావారము శంఖశుక్తిసికతాభాస్వన్మహాతీరమున్. 2490

— మాల్యవంతుండు దశకోటిరాక్షసులం గూడి హనుమంతున కడ్డంబువచ్చుట. —

వ. ఇత్తెఱంగున నాకపిసత్తముండు సముద్రంబు విలోకించి తదుపరిమార్గంబునం బోవుచుండ నప్పుడు రావణప్రేరితుండై ధైర్యనిర్జితమాల్యవంతుం డగుమాల్యవంతుండు శమనకింకరభయంకరు లగుదశకోటిరాక్షసులంగూడి భీషణరభసాతిరేకంబుగా హనుమంతున కడ్డంబు వచ్చి చుట్టుముట్టి యట్టహాసంబుఁ జేసి యంబరంబున జీమూతంబులకరణిం బన్ని యూర్జితగర్జానిస్వనంబులు ఘనస్తనితంబులై యలర సర్వాభరణరోచు లచిరరోచులసొంపు సంపాదింపఁ గనత్కనకవలయమండితకార్ముకదండంబు లాఖండలచాపంబులయందంబు పొందుపఱుప గదాముసలముద్గర భిండివాల కరవాలశక్తితోమరపాశపరశ్వధచక్రకుంతక్షురికాశిలీముఖాదినానాసాధనవర్షంబు నీరంధ్రంబుగాఁ గురియించిన నప్పవమానసూనుండు చలింపక చిక్కుపడక యాజ్యాహుతిప్రవర్ధమానపవమానసఖుండుం బోలె నక్కజం బగుతేజంబు దిక్కులం బిక్కటిల్ల నుక్కుమిగిలి రక్కసులెక్కడెక్కడం బడ రాక్షసులపాలిధూమకేతువుం బోలె విస్ఫులింగజ్వాలాభీలం బైన వాలంబున విసరుచుఁ బిడుగుల కెనయైనపిడికిటిపోట్లం బొడుచుచు వజ్రాయుధనఖంబు లైననఖంబుల శిరంబులఁ జిదిమి వైచుచుఁ గరచరణజానుజంఘోరుమధ్యవక్షశ్శీర్షంబులు శకలంబు లగునట్లుగాఁ బదతలంబులం దన్నుచు జానుకూర్పరఘాతంబుల సర్వాంగసంధులు విశ్లేషించుచుఁ బదుగుర నూర్వుర నిన్నూర్వురం బట్టి పాణితలంబుల మెదిచి చూర్ణంబు సేయుచుఁ బ్రళయకాలధారాధరగర్జాభీషణం బైనఘోషణంబున గుండె లవియం జేయుచు నిట్లనేకప్రకారంబుల విజృంభించి శుష్కకాంతారంబు నేర్చుకార్చిచ్చుచాడ్పున మదువులోనం జొచ్చి కలంచుమాతంగంబుకరణిఁ గురంగశాబకంబులభంజించుసింగంపుఁ గొదమభంగి మహోత్తాలతాలవనమధ్యంబున విహరించుమహావాతంబురీతిదారుణరణక్రీడ గావించిన నద్దానవులు తద్దయు భీతిల్లి హనుమంతునిముంగలనిలువంజాలక కాకాకులగతి సుడివడి దశదిశలకుం బఱచి రయ్యాయోధనంబు

నిరాలంబం బగువాయుమార్గంబునం బ్రవర్తిల్లుటం జేసి పదనిక్షేపణశబ్దరహితం బై చెల్లె నప్పుడు. 2491

శా. ఘోరాకారుఁడు మాల్యవంతుఁడు చలత్కోదండటంకార మే
పార న్మేచకవృష్టిమేఘము ఘనంబై గాఢవర్షం బొగి
న్నీరంధ్రంబుగఁ గాంచనాచలముపై నిండార వర్షించిన
ట్లారూఢిం గపివీరుపైఁ గురిసె నుద్యత్సాయకాసారమున్. 2492

ఉ. దానికి నించుకైన మదిఁ దత్తఱ మందక ధీరుఁ డామరు
త్సూనుఁడు వాలఘాతమున నూఱెల నన్నిటిఁ దూలఁ దోలుచు\[?\]
మానితతిగ్మతేజమున మంచును మాయఁగఁ జేసి నింగిపై
మానుగ నొప్పుభాస్కరునిమాడ్కి వెలింగె నుదీర్ణతేజుఁ డై. 2493

ఆ. అంత మాల్యవంతుఁ డతిరుష్టుఁ డై గద, ద్రిప్పి వహ్నికణము లుప్పతిల్ల
వాయుసుతునిమీఁద వైచి పెల్లార్చి తా, దిట్టతనము మెఱయ నిట్టు లనియె.

హనుమంతుండు మాల్యవంతునిం జంపుట.

మ. అవురా వానర తొల్లి విష్ణుఁడు ఖగేంద్రారూఢుఁ డై వచ్చి న
న్ను వడిం దాఁకి రణం బొనర్చి తుదిఁ దానుం బోరఁగా లేక శ
క్తివిహీనుం డయి పాఱె నాజి నలుపం గీశుండ వీ వెంతవాఁ
డవు సప్రాణుఁడ వై వెస న్జలధిఁ గొండ న్వైచి పొమ్మవ్వలన్. 2495

చ. అన విని వాయుపుత్రుఁడు మహోగ్రుఁడు డై వెసఁ దత్ప్రియుక్తకాం
చనగద నుద్ధతిం జదిపి చయ్యనఁ జూర్ణము చేసి బల్విడి\[?\]
ఘననఖరంబులం జిదిమి కండలు చెక్కలువాపి యల్కతోఁ
బనివడి వానిగుండియలు బ్రద్దలువాఱఁగఁ దన్నె నంఘ్రులన్. 2496

వ. అంత నద్దానవుండు కాలవ్యాళకరాళం బైనకరవాలంబున వ్రేసిన నదివజ్రసమస్పర్శం బైనతదీయవక్షంబు దాఁకి సహస్రఖండంబులై పుడమిం బడియెఁ బదంపడి కాలాయసమయం బైనముసలంబు విసరివైచిన దానిఁ గరంబుల నొడిసి పట్టి మదోద్దండవేదండం బిక్షుదండంబుం బోలె విఱిచి వైచె వెండియు దంష్ట్రాకరాళభీషణం బైనశక్తి నిగిడించిన దాని నముద్రజలంబులం బడునట్లుగాఁ బాదంబులం దన్నె నంత నద్దానవుండు వికలసాధనుండై సేయునది లేక వెల్లనై నూచుచుండ నప్పుడు బాహువుల వాని నాకర్షించి పాణినిష్పేషణంబున హీనసత్త్వం గావించి వాలపాశంబు గళంబునం జుట్టి మీఁది కెత్తి ఖగేంద్రుండు కాకోదరంబుం బోలె వేయిమాఱు లంబరంబునం ద్రిప్పి సముద్రంబులఁ బడవైచిన నన్నిశాచరుండు పతనవేగంబున రసాతలంబంటి మరల వచ్చుటకు సామర్థ్యంబు లేమిం జేసి మృతుం డై యమునదనంబునకుం జనియె హతశేషు లగు రక్కసు లుక్కుసెడి భయభ్రాంతులై లంకకుం బఱచి రిట్లు వాతూలనందనుండు

మాల్యవంతుని సేనాసమేతంబుగా నంతకగోచరుం జేసి జయంబు గొని కర
తపువాశాఖధిపర్వతుం డై సింహనాదంబు చేసి గ్రీష్మాదిత్యునిభంగి నింగి నెలుం
గుచు మనోవేగంబున లంకాద్వీపంబు డాయం జనియె నప్పుడమ్మహనీయమూ
ర్తి తేజోవిశేషంబును ద్రోణమహీధరమునిదీప్తులు దూరంబు నవలోకించి
రాముండు సూర్యుం డుదయించి వచ్చుచున్నవాఁ డని తలంచి లక్ష్మణప్రాణశంకి
తుం డై. 2497

**రాముండు దూరంబున హనుమంతునిం జూచి సూర్యుం డని కొంత శోకించుట.**

సీ. అక్కట లక్ష్మణుం డమరారిశక్తిచే మేదినిఁ బడియె సమీరసుతుఁడు
దివ్యౌషధీలతల్ దెచ్చెద ననిపోయి తడవాయె భానుఁ డుదగ్రభంగి
నుదయించుచున్నవాఁ డదయుఁడై యింకనే నేమిసేయుదుఁ దమ్ముఁ డెట్లు బ్రతుకు
నెలమి సుమిత్రతో నేమని భాషింతు భరతునిదుఃఖ మేపగిది నణఁతు

తే. ఘనుఁడు శత్రుఘ్నుఁ డడుగ నేమని వచింతు
నల విభీషణుతోడ నే నన్నమాట
యనృత మయ్యె మదన్వయయశము వోయె
వనచరులకష్టమంతయు వ్యర్థ మయ్యె. 2498

మ. అని యిబ్భంగిఁ దలంకుచుండఁ గపివంశాధీశుఁ డేతెంచి రా
మనరేంద్రుం గని పల్కె నోయనఘ ధీమంతుండ వీ విట్టిధం
బున దుఃఖింపఁగఁ జెల్లునయ్య జగముల్ పుట్టింప రక్షింప గ్ర
ద్దన నాశం బొనరింప దక్షుఁడ వెదఁ ధైర్యంబు గీల్కొల్పుమా. 2499

తే. దేవ నాలవజాము వర్తించుచున్న, దెలమి నిఁకనొక్కయామంబుగలదు రాత్రి
లక్ష్మణున కేమిహాని గల్గదు దురంత, దుఃఖ మది వీడి స్వస్థచిత్తుండ వగుము.

తే. అనుచు నిబ్భంగి సూర్యనందనుఁడు ధైర్య
మెంత చెప్పిన నుడుగ కయ్యినకులుండు
పెక్కువిధముల దుఃఖించి పిదపఁ గోప
రసము నిగుడంగ నత్యంతరౌద్రుఁ డగుచు. 2501

సీ. వనజమిత్రుండు మద్వంశంబునకుఁ గర్త యయ్యును గృపమాలి యనుజుఁ డిచట
మూర్ఛదేఱక మున్నె మునుకొని పగతురపాలివాఁ డై నన్ను పరిభవించి
యుదయించి చనుదెంచుచున్నవాఁ డితనిదౌ దుర్నయ మేమని దూఱ వచ్చుఁ
గడువేగమున వీనిఁ బుడమిపైఁ బడఁగూల్చి జగమంతయు నరాక్షసం బొనర్తుఁ

తే. జూడుఁ డని రక్తకాంతులు చూడ్కిగములఁ
గ్రమ్ముకొన విల్లుగొని జగత్త్రయము బెగడ
ఘోరరౌద్రాస్త్ర మరిఁబోసి దారుణముగ
గుణరవముఁ జేసె దైత్యులగుండె లవియ. 2502

మ. శరధిక్షీరము లింకె బల్విడి ధరాచక్రంబు కంపించె భూ
ధరము ల్వ్రొగ్గె నభంబు బిట్టవిసె దిగ్దంతావళిశ్రేణి యా
తురతం బొందె నిరంతరంబుగ నుడుస్తోమంబు రాలె న్నిశా
చరభూతాలి గలంగె రాఘవధనుష్టంకారమాత్రంబునన్. 2503

వ. అట్టిమహోత్పాతంబులు చూచి సుగ్రీవుం డతిభీతుం డై దేవా యొక్కనికై పెక్కండ్ర నొక్కపెట్ట వధింపం బూనుట ధర్మంబుగాదు మీ రెఱుంగనిధర్మంబు గలదే యని పలుకుచుండ నప్పుడు సుషేణుండు చనుదెంచి మహాత్మా బలవంతుం డగుహనుమంతుండు దివ్యౌషధీశైలంబు గొనివచ్చుచున్నవాఁ డిది తదీయదివ్యతేజఃపుంజంబు గాని సూర్యుండు గాఁడు శీఘ్రంబున నవ్వీరోత్తమున కెదురుగాఁ దగువానరులం బంపు మని పల్కిన నతనిపల్కులం గలంక దేఱి కోదండం బెక్కుడించి రాముండు సౌమ్యదర్శనుం డై యతిరయంబున వానరుల నప్పావని నెదుర్కొనం బంచె నంతలోన నయ్యంజనానందనుండు శైలంబు గొని తెచ్చి వానరసేనామధ్యంబున డించి కౌసల్యానందనునిచరణారవిందంబుల కభివందనంబు గావించి పదంపడి సుగ్రీవజాంబవదాదులకు నమస్కరించి తక్కినయూథపోత్తముల నయ్యైతెఱంగుల సంభావించి నిటలతటన్యస్తహస్తపుటుం డై వినయంబున రామభద్రున కిట్లనియె. 2504

హనుమంతుండు ద్రోణపర్వతమును రామునకు సమర్పించుట.

సీ. అనఘచరిత్ర మీయానతి మందులు గొని తేరఁ బనిఁబూని ఘనరయమునఁ
బోవుచు నుండంగఁ ద్రోవ ననేకవిఘ్నంబులు గల్గె మీకరుణవలనఁ
దలఁకక యవి యెల్లఁ దప్పించుకొని ద్రోణగిరిఁ జేరి యోషధు లరసి కాంచి
తేఁ బూని కాల మతీత మౌ నని యెంచి శైల ముత్పాటించి జవము మెఱయ
తే. నిటకుఁ దెచ్చితి నింతసే పేల తడవు, చేసితి వటంచుఁ గోపంబు సేయవలదు
డెందమున నాదుతప్పులు క్రిందుపఱచి, ఘనకృపాదృష్టిఁ జూడుము మనుకులేంద్ర.

ఉ. నా విని రామభద్రుఁడు మనంబున సంతసమంది పల్కు నో
ధీవర నీకుఁ దప్పు గలదే కృప లక్ష్మణుప్రాణ మిచ్చి నా
జీవము మత్కులంబుఁ గపిశేఖరువంశము నిల్పి తీవు నే
నేవిధిఁ దీర్చికొందుఁ బ్లవగేశ్వర నీఋణ మెంచి చూడఁగన్. 2506

ఉ. ఎక్కడ లంక ద్రోణనగ మెక్కడ నొంటిగ వైరికోటికిం
జిక్కక శైలముం బెఱికి శీఘ్రమునం గొని తెచ్చి తీవు నీ
కెక్కడ నెవ్వ రీడు గల రేమనవచ్చు భవత్ప్రభావముం
దక్కక తార్క్ష్యుఁ డైనను సదాగతి యైనను సాటి వత్తురే. 2507

చ. అనుచు బహూకరించె విభుఁ డంత సుషేణుఁడు కీశయుక్తుఁ డై
ఘనగతి శైల మెక్కి మణిగైరికధాతువిచిత్రసానువు

ల్వనరుహషండమండలవిభాసితరమ్యసరోవరంబులు
న్వినుతఫలప్రసూనయుతవృక్షవనంబులు గాంచి యిట్లనున్. 2508

సీ. ఇచట విష్ణుఁడు సుధ నింపార దనుజుల వంచించి సురలకుఁ బంచిపెట్టె
నిచటఁ గృత్రిమసురాకృతి నమృతముద్రావు రాహువుశిరము చక్రి త్రుంచె
జెలఁగి యిచ్చోట సంజీవనీప్రముఖ దివ్యౌషధంబులు దాఁచి రమరవర్యు
లిచ్చోట శక్రాదు లేపార దానవరాజితో దారుణరణ మొనర్చి

తే. రనుచుఁ దనతోడికపులతో నచటఁ గలుగు, కందువలఁజూపిచెప్పుచుఘనవిశల్య
కరణి గనుఁగొని దానిఁ గైకొని నితాంత,సమ్మదము మీఱ నప్పర్వతంబు డిగ్గి.

—లక్ష్మణుండు మూర్ఛదేఱుట.—

తే. ఒకశిలాఫలకంబుపై నుత్సుకమున
దాని నిష్పేషణము చేసి తడయ కపుడు
ప్రీతి సౌమిత్రి కొసఁగ నా పృథుబలుండు
క్షణములో మూర్ఛదేఱి విశల్యుఁ డయ్యె. 2510

వ. ఇట్లు లక్ష్మణుం డాదివ్యౌషధిగంధం బాఘ్రాణించి మూర్ఛదేఱి విశల్యుం డై నిద్రితుం డగుపురుషుండు మేల్కాంచినతెఱంగున లేచి సుఖాసీనుం డై తొల్లింటికంటె నధికం బైనబలవీర్యతేజంబులు గలిగి ప్రకాశించుచుండె నప్పుడారామభద్రుండు సౌమిత్రిం గౌఁగిలించికొనిపరమానందబాష్పధారాపూరంబులఁ దదీయశరీరంబు దడుపుచుఁ బులకాంకితవిగ్రహుం డై శిరంబు మూర్కొని చెక్కిలి ముద్దుగొని సుధామధురసల్లాపంబుల గారవించి సుషేణుం జూచి కపీంద్రా భవదనుగ్రహంబున సహోదరుం బడసి ధన్యుండ నైతి నీవు గావించిన యీమహోపకారంబునకు నధికం బగుప్రత్యుపకారం బేమియుఁ గావించుటకు సమర్థుండఁ గా నని బహూకరించె నంత వానరు లందఱు సమందానందరసపోషితవిగ్రహులై కులశైలగుహాముఖంబులఁ బ్రతిధ్వనులు సెలంగ సింహనాదంబులు చేసి భుజాస్ఫాలనంబులు గావించి వాలసంచలనాదికాపేయజాతిచేష్టావిశేషంబులు నెఱపి పరమోత్సవంబు గావించి సుషేణునియనుమతంబున నమ్మహామహీధరారోహణంబుఁ జేసి యచ్చటం గలచిత్రవస్తుజాతం బంతయుఁ గలయ నవలోకించి యరుదందుచు నమృతకల్పంబు లగుఫలంబులు మెసవి సుధారసోపమానంబు లగుతత్రత్యదివ్యసరోవరసలిలంబులు ద్రావి దివ్యౌషధీలతాసమీరస్పర్శంబున విగతజన్యశ్రము లై శీఘ్రంబున నప్పర్వతంబుడిగ్గి తేజస్సత్త్వజవాధికు లై కయ్యంబునకుఁగాలుద్రువ్వుచుండి రంతనమ్మహీకాంతుండు హనుమంతు నవలోకించి బహుమానపురస్సరంబుగా నిట్లనియె. 2511

చ. తరుచరవర్య నీకరుణఁ దమ్ముఁడు గ్రమ్మఱఁ బ్రాణయుక్తుఁ డై
సురుచిరసత్త్వతేజముల శోభిలె నేఁ గృతకార్యసిద్ధి నై

వఱలితి నింక నిన్నగము వారక యెప్పటిచోట నుంచి భా
సురగతి రమ్ము కష్ట మని చూడక చెచ్చెరఁ బొమ్ము నావుడున్. 2512

ఉ. దేవరవారికార్య మది దీర్చుట కష్టమె నీకటాక్షమే
కావలెఁ గాక యీనగము గ్రమ్మఱఁ గైకొని యేగి తొంటిచో
వావిరి డించి మీకడకు వచ్చెద భూరిసమీరవేగి నై
దేవవిరోధు లెంచ నరుదెంచినఁ బీచ మణంచి యుద్ధతిన్. 2513

హనుమంతుఁడు ద్రోణపర్వతము నెప్పటిచోట నునుచుట.

క. అని పలికి వాయునందనుఁ, డనుపమభుజసత్త్వ మలర నగ్గిరి గేలం
గొని జలదముగతి నార్చుచు, ననిలునిచందమున వేగ యరుగుచు నుండన్.

సీ. అప్పుడు దశకంఠుఁ డాంజనేయుఁడు కొండ గొని వెండి పోవుట విని రయమున
స్థూలజంఘికుని జతుర్వక్త్ర గజకర్ణ నుల్కాస్య ఘనవర్ణ నుగ్రరూపు
నలమహాదంష్ట్రమహానాదు లనుమహోదరమహావీర్యుల దైత్యవరుల
రావించి మీరు శీఘ్రంబునఁ బావని కడ్డంబు చని వాని నతిబలమునఁ
బట్టి తెం డటు గాక దిట్టయై పోరిన శైలంబు వారిధి జలములోన

తే. వైచి రం డట్లు గాదేని వానిఁ జంపి, రండు మీలోన నెవ్వఁడు గండు మిగిలి
యిప్పని యొనర్చు వాని కింపెసఁగ నర్ధ,రాజ్య మిత్తు నిమ్మాట తిరంబు సుండి.

చ. అని నియమించి పంచిన మహాబలు లారజనీచరోత్తము
ల్ఘనములమాడ్కి గర్జిలుచుఁ గాటుకకొండలభంగిఁ గాయము
ల్దనరఁగ భీమరాక్షసకదంబములం గొని సాస్త్రులై రయం
బునఁ జని మారుతాత్మజుఁడు పోవుపథం బరికట్టి యుద్ధతిన్. 2516

ఉ. ఓరి వనాట కొండ గొని యుద్ధతి నెక్కడి కేగె దబ్ధిలోఁ
బాఱఁగవైచి శీఘ్రమునఁ బ్రాణయుతంబుగ నేగు మట్లు గా
కీరస మెత్తి మార్కొనిన నిప్పుడె మాకరదండవిస్ఫుర
ద్ఘోరవరాస్త్రశస్త్రములఁ గూలఁగ వైచెద మొక్కువ్రేల్మిడిన్. 2517

వ. అని పలికి. 2518

చ. మసలక శైలముం బొదివి మబ్బులు దారుణవృష్టి ముంచి న
ట్లసమున ఘోరబాణపరిఘాళనితోమరశూలపాశప
ట్టసకరవాలచక్రశితటంకగదాప్రముఖాస్త్రశస్త్రముల్
వినువఁక వేసి యార్చి రలవిష్ణుపదంబు దిశల్ చలింపఁగన్. 2519

వ. అప్పుడు. 2520

శా. ఆలోకించె సమీరనందనుఁడు క్రోధారక్తనేత్రాంతుఁ డై
కీలాభీలవరాస్త్రశస్త్రచయసంకీర్ణప్రభాద్ధత్యులం
త్రైలోక్యస్థితవీరసన్నుతసముద్యద్దోర్బలౌన్నత్యులన్

వ్యాలోలద్భుజవీర్యనిర్జితసమస్తాదిత్యులన్ దైత్యులన్. 2521

వ. ఇట్లు విలోకించి. 2522

ఉ. దానవులార మీరు కడు దర్పము గల్గినవారుపోలె నా
తో నని సేయ వచ్చితిరి తొల్లిటివారలచే నెఱుంగరే
ప్రాణములం దవేక్ష గలదన్నఁ గడంగి తొలంగి పొండు గా
దేని భుజాబలం బెసఁగ నింకఁ ఱ నిప్పుడె తీర్చి పుచ్చెదన్. 2523

వ. అని పలికి. 2524

శా. కాలవ్యాళకరాళము న్స్మితవహోగ్రజ్వాలికాభీలము
న్మేలానిర్జితచక్రవాళము సుపర్వేంద్రధ్వజోత్తాలముం
శైలారాతిధనుర్విశాలము మదోన్మత్తాహితోన్మూలముం
వాలంబు న్వడిఁ బెంచె సంచలనవిష్వగ్జాతవాతూలమున్. 2525

వ. ఇట్లు పెంచి. 2526

చ. సరసిజలోచనుండు నిజచక్రమునుం బలె వేయిమాఱు లం
బరమునఁ ద్రిప్పి వేయుటయుఁ బర్వతసన్నిభయాతుధాను లం
దఱు వెస దానిక్రిందఁ బడి తప్పక చూర్ణితదేహులై సరి
త్పరివృఢమధ్యసీమఁ బడి పంచత నొందిరి తత్క్షణంబునన్. 2527

వ. ఇట్లనేకరాక్షసుల వాలప్రహారంబునం బిలుకుమార్చి గెలుపుగొని సింహనాదం
బుఁ జేసి మనోవేగంబునం బఱచి ద్రోణశైలం బెప్పటిచోట నునిచి గ్రమ్మఱం
జనుదెంచి కౌసల్యానందనునిచరణంబులకు నమస్కరించి యమ్మహాత్మునిచేత
నున్నన వడసి తత్పార్శ్వభాగంబునఁ గొలిచి యుండె సుగ్రీవజాంబవదంగదనలనీల
సుషేణాదులు హనుమంతుని తేజస్సత్త్వవీర్యసాహసోత్సాహప్రభావంబులు
బహుప్రకారంబులం గొనియాడి రంత. 2528

సీ. విబుధారిమోములు వెలవెలఁ బాఱంగ దివిఁ దారకలగుంపు తెలివి మాసె
సౌమిత్రిగాఢమూర్ఛాతమం బడఁగంగఁ గడలఁ గావ్యోన్నచీఁకట్లు విరిసె
వనచరాననములు ననురక్తి మీఱంగఁ దొలిసంజకెంజాయ దళముగొనియె
శక్రాదిసురులయాస్యంబులు వికసింపఁ గమలషండములు వికాస మొందె

తే. నిఖిలలోకైకరక్షణనిరతుఁ డైన, కౌసలేయునిదుర్నిరీక్ష్యస్ఫుటప్ర
తాపమావిర్భవింపంగఁ దపనుఁ డపుడు, వేడ్కఁ బూర్వాద్రిమీఁద నావిర్భవించె.

వ. అప్పు డారఘువల్లభుండు లక్ష్మణుం జూచి భ్రాతృస్నేహంబునఁ దమ్ముఁడ రమ్మని
కరంబులం దిగిచికొని గాఢంబుగా నాలింగనంబుఁ జేసి యానందబాష్పధారా
పూరితలోచనుండును బ్రీతిసంహృష్టసర్వాంగుండు నగుచు నిట్లనియె. 2530

చ. అతులితశక్తిచే హతుఁడ నైన ధరఁ గూలియు నేఁడు మాత్పురా
కృతసుకృతంబు పెంపున నరిందమ చావక నీవు గ్రమ్మఱన్

బ్రతికితి విట్లు నీకు సమరంబున వేఱొకభంగి నైన నే
గతిఁ జనువాఁడ జీవితము గల్గిన నేమి ప్రయోజనం బగున్. 2531

తే. అనిన విని లక్ష్మణుండు దయాళుఁ డైన, రాముఁ డీక్షించి ఖిన్నుఁ డై మోము వాంచి
కేలు దోయి ఫాలంబునఁ గీలుకొలిపి, యింపు దళుకొత్త మెల్లన నిట్టు లనియె.

సీ. దేవ ప్రాకృతుఁడవే నీవు మహానుభావుండవు మహనీయపండితుఁడవు
సత్యప్రతిజ్ఞుండ వత్యంతశూరుఁడ వలఘువీర్యుఁడ విట్లు పలుక నేల
మును దండకాటవి మునిసమక్షంబునఁ జేసినసమయంబు శిష్టుఁ డైన
యనవిభీషణున కిచ్చిన బాస చెల్లించి చరితార్థుఁడవు గమ్మ సాధుపురుషు

తే. లాడి తప్పరు నృపజాతి కవనిలోనఁ, బ్రతిన నెఱపుటకంటె ధర్మంబు గలదె
ఘోరశరముల దశకంఠుఁ గూలవైచి, సొంపుమీఱఁ బ్రతిజ్ఞ పాలింపు మధిప.

క. హరినాథుబారిఁ జిక్కిన, కరినాథునిభంగి రాజకంఠీరవ నీ
శరపథమునఁ బడిననిశా, చరనాథుఁడు బ్రతికి పోవఁ జాలఁడు తలఁపన్. 2534

క. తడ వేటి కింక దిననా, థుఁడు గ్రుంకకమున్నె మెఱుఁగుతూపులఁ బుడమి
న్బడఁగూల్పుము దశకంఠుని, విడువక దేవతలు మింట వినుతింపంగన్. 2535

చ. పరువడి నీప్రతిజ్ఞ నెఱపంగఁ దలంచితి వేని జానకిం
గర మనురక్తిఁ గైకొనఁగఁ గాంక్ష మనంబునఁ గల్గె నేని యో
నరవర పథ్యవాది నగు నావచనంబుఁ బరిగ్రహించి దు
ర్భరపరశాతబాణముల రాక్షసనాథునిఁ ద్రుంపు మిత్తఱిన్. 2536

క. అని యిట్లు విన్నవించిన, ననుజన్ముని మాట కలరి యనఘచరితుఁ డా
జననాథుఁడు సంగ్రామం, బున కభిముఖుఁ డయ్యె శౌర్యభూషితుఁ డగుచున్.

వ. అంత నద్దశముఖుండు హనుమంతుని పరాక్రమంబును లక్ష్మణుండు మూర్ఛ దేఱుటయు రాముని సమరోత్సాహంబును వానరుల వ్యవసాయంబును సర్వంబును విని చింతాకులితమానసుండై తప్తపాత్రాంతరాళస్థతైలంబు భంగిఁ దొట్రుపాటు వహించి యేమియుం దోఁపక నమ్రవదనుం డై కొండొకసే పూరకుండి యంత నొక్కింత జయోపాయం బాలోచించి శీఘ్రంబున నిజగురుం డైన శుక్రుని యొద్దకుం జని యమ్మహాత్మునిచరణంబులు నిజకిరీటంబులు సోఁకం బ్రణమిల్లి నిటలతటఘటితకరపుటుండై మొగంబున దైన్యంబు దోఁప వినయంబున నిట్లనియె. 2538

-:- రావణుండు శుక్రాచార్యులయొద్ద కరిగి తన్ను రక్షింపు మని చెప్పుకొనుట. -:-

సీ. భార్గవకులవర్య భానువంశజుఁ డైన రాముండు వానరరాజిచేత
సేతువు గట్టించి చెలువొప్పు జలరాశి లంఘించి కడువడి లంకఁ జేరి
ద్వారంబు లరికట్టి ఘోరసంగరమునఁ బెక్కండ్ర దైత్యులఁ బీఁచ మడఁచి
తనయుల భ్రాతల దండనాథుల మంత్రివరులను సఖుల నందఱ వధించె

తే. నాజి కేగినవారిలో నసురుఁ డొక్కఁ
డైనఁ గ్రమ్మఱ బ్రతికి రాఁడయ్యె నకట
భయము జనియించె దైన్యంబు పాదుకొనియె
నేమిసేయుదు నింక నాకెద్ది తెఱఁగు. 2539

తే. అనఘ నీయంతగురుఁ డుండ నాజిలోన
నరులచేఁ బడి చావఁ బాలైతి నింక
నైన నదుపాయ మెఱిఁగించి యధికకరుణ
గెలు పొసఁగి శిష్యవరుని రక్షింపరాదె. 2540

ఉ. మాయలు సర్వతంత్రములు మంత్రములు న్సమరక్రియాజయో
పాయము లీ వెఱుంగుదు తపంబున నత్యధికుండ వన్నిట
న్నాయెడ నీవు పూర్ణకరుణారసపూరితదృష్టిఁ జూచిన
న్వే యన నేల శాత్రవులవ్రేల్మిడిలోన వధించి పుచ్చనే. 2541

క. వాలాయము మీ రిచ్చిన, దీలంకయు నీబలంబు నీయైశ్వర్యం
బీలక్ష్ములు నీసర్వము, పాలింపుము శత్రువరులపా ల్గాకుండన్. 2542

సీ. అని యిట్లు ప్రార్థింపనక్కావ్యుఁడు ప్రసన్నుఁడై వానిఁజూచి యిట్లనుచుఁబలికె
మంత్రము ల్తంత్రము ల్మందులు మాయలు మఱి పెక్కుపాయముల్కనకుఁజాలఁ
గలిగియున్నవి యింత కలవళింపఁగ నేల యే నుండ నింక నీకేమి కొదవ
పాతాళహోమంబు పటునిష్ఠ నాచెప్పినట్లు సేయుము వహ్నియం దమోఘ
తే. ఘనరథధనుశ్శిలీముఖకవచకుండ, లాదికంబులు వొడము నీ వంచితముగ
వాని నన్నిటిఁ గైకొని పూని యనికిఁ, జనితి వేనియు జయ మవశ్యంబు గలదు.

—శుక్రాచార్యులయంపున రావణుండు పాతాళహోమంబు సేయుట.—

వ. హోమంబున నంతరాయంబు గలిగెనేని చేటు వాటిల్లు నట్లు గాకుండ వేలిమి
పరిసమాప్తి నొందింపు మని పలికి తన్మంత్రతంత్రక్రియాకలాపంబులు సమగ్రం
బుగా నెఱింగించి యనిచిన నద్దశముఖుండు నిజగృహంబునకుఁ జనుదెంచి బల
వంతు లగు రాక్షసుల నలయు నెడలఁ గాపు వెట్టి కవాటంబులు బంధించి పాతాళ
సన్నికాశం బైన యొక్క గుహ ప్రవేశించి విద్యుజ్జిహ్వుం డను వాని నొక్క
రాక్షసుని జతురంగబలసమేతంబుగా గుహాముఖంబున నుండ నియోగించి కృత
స్నానుం డై రక్తాంబరమాల్యానులేపనంబులు ధరియించి గంధాక్షతపుష్పా
లంకృతం బైన వేదికయందు విధ్యుక్తప్రకారంబున నగ్నిప్రతిష్ఠాపనంబుఁ
జేయించి లోహపాత్రలు నస్త్రసమిధలు వేదిసమీపంబునం బెట్టి భల్లాతకదాడి
మసమిధలును దత్ఫలంబులును దూర్వాగరుసర్షపగుగ్గులుమధుఘృతరక్తప్రవాళ
పాయసదర్భలును ఛాగకాకమీననక్రకూర్మమేషంబులును గాకకంకశ్యేనగృధ్ర
సర్పభల్లూకరరంబులును జందనకుంకుమకర్పూరరక్తపుష్పంబులును ధాతురసం

బులును గేశంబులును గల్పోక్తప్రకారంబున హోమంబు సేయుచుండె నప్పుడు
తదీయహోమధూమంబు విలయకాలసంకర్షణముఖవినిర్గతనిశ్వాసధూమంబు
పగిది నతిభయంకరం బై వెలుపలికి నిర్గమించి ప్రళయకాలజీమూతంబుకరణి
గగనంబును దిక్కులును నీరంధ్రంబుగా నావరించిగాఢసంతమసంబుఁబుట్టించె
నప్పుడుసిద్ధచారణమరుద్గంధర్వయక్షకిన్నరోరగాదులత్యంతసాధ్వసంబుననంధీ
భూతులై సుడివడిరి వాతంబులు కలుషంబు లై సుడిసె దిక్పాలకులేమియుం
దోఁపక చిచ్చువడియుండిరి వానరులు భయకంపితాంగు లైతూలగతిందూలిరి
జగంబంతయు నతిభయంకరం బై తోఁచె నమ్మహోత్పాతంబులన్నియువిలో
కించి రావణకృత్యం బంతయు నెఱింగి నీతివిద్యావిభూషణుం డగువిభీషణుండు
రయంబున రామునియొద్దకుం జనుదెంచి యిట్లనియె. 2544

రావణుండు పాతాళహోమంబు చేయుచున్నాఁ డని విభీషణుండు శ్రీరామున కెఱింగించుట.

చ. నరవర మిమ్ము మార్కొని రణం బొనరింపఁగ లేక భీతుఁ డై
కర మసుదార రావణుఁడు కావ్యునిపంపున భూబిలంబులో
నురవడి నాభిచారికపుహోమముఁ జేయుచు నున్నవాఁడు స
త్వరముగ వేలిమిం జెఱుప వానరవీరులఁ బంపు మిత్తఱిన్. 2545

చ. పరువడి హోమకృత్య మది పారము ముట్టిన వహ్నియందు ది
వ్యరథకృపాణబాణకవచాదికము ల్వెస నుద్భవించు భీ
కరగతి వాని నన్నిటిని గైకొని పోరికి నేగుదెంచినన్
హరిపరమేష్ఠిశంకరులకై న నసాధ్యుఁడు వాఁ డధీశ్వరా. 2516

ఉ. నా విని రాఘవుండు కపినాథున కిట్లను బాహువిక్రమ
శ్రీవిభవాభిరాములను వృక్షచరాగ్రణుల నంగదాదుల
న్వేవిరి వేలిమిం జెఱుపఁ బంపుము జాగొనరింప వల్వ దా
రావణు నాజిలో గెలువ రా దటు హోమము పార మొందినన్. 2547

సీ. అని యానతిచ్చిన నవ్వానరాధీశుఁ డంగదజాంబవదాంజనేయ
నలనీలకుముదపనసవలీముఖధూమ్రగంధమాదనగజగవయవృషభ
శరభగోముఖరంభశతవలిమైందద్వివిదగవాక్షసుషేణవినతతార
ముఖ్యవానరయూథపులఁ బదికోటుల నియమించి పంచిన రయము మెఱయ

తే. వారు బ్రహ్మాండభాండంబు పగుల నార్చి,వృష్టిఘనములగతి వినువీది నిండి
పక్షవత్పర్వతంబులపగిది నేగి, లావు దీపింప నురవడి లంకఁ జేరి. 2548

అంగదాదులు రావణునిపాతాళహోమంబునకు భంగము సేయ నరుగుట.

శా. ప్రాకారంబులు గూల్చి ఖేయములు విధ్వంసంబు నొందించి య
స్తోకప్రౌఢిమ ద్వారరక్షకుల రక్షోవీరులం జంపి నా

కొలకు త్రెచ్చుఁ గవాటము లివ్విఁగ నొయ్యం దన్ని బాహాబలో
ద్రేకం బొప్పఁగ లంక సొచ్చి విజయశ్రీ మీఱఁగా నేగుచున్. 2549

సీ. వాజిశాలలు చొచ్చి వాయువేగము గలఘోటకంబుల ధాత్రిఁ గూలఁ దన్ని
కరిమందిరంబుల కుఱికి బల్విడికీల్ల భద్రేభకుంభము ల్వగుల మోఁది
రథగృహంబుల కేగి రభసంబుతో శతాంగంబుల నుగ్గునూచంబు సేసి
యాయుధశాలల కరిగి మహాధనుర్విశిఖాదికంబులు విఱిచివై చి
తే. సౌధములు నేలఁబడఁ దన్ని సాహసమున
వరనిశాచరగృహములు పాడుచేసి
మదగజేంద్రంబు లొక్కట మడువు సొచ్చి
గలఁచినట్లు లంకాపురిఁ గలఁచి రపుడు. 2550

చ. తమ కెదురైన దైత్యుల నుదగ్రబలంబునఁ బట్టి నేల దు
ర్దమగతి వ్రేయుచుఁ ఖరకరంబులఁ దట్టుచుఁ గాళ్ల మెట్టుచు
న్విమతునిఁ బంక్తికంధరుని వేగమె చూపుఁడు మాకు నంచు సం
భ్రమమున యామినీచరుల బాధలువెట్టి రనేకభంగులన్. 2551

వ. మఱియును. 2552

చ. అసమున యాతుధానులగృహంబులు దూఱి చలం బెలర్ప రా
క్షసులను బట్టి యీడ్చికొని గ్రక్కున వచ్చి శిలాతలంబుల
న్విసువక వైచి చంపుచుఁ బ్రవృద్ధుల బాలురఁ బట్టి బల్మిమైఁ
గసిమసిచేసి చంపిరి యఖండపరాక్రమదుర్నివారులై. 2553

సరమవలనఁ బాతాళహోమగుహ నెఱింగి యంగదుండు గుహాలోనికిఁ జొచ్చుట.

వ. ఇట్లు లంకాపురంబంతయు నాకులంబుగావించిన నన్నిశాచరులు తదీయప్రహార
పీడితులై పద్మదళవిలగ్నజలకణంబులమాడ్కిఁ దల్లడం బొందుచుఁ బ్రాణభ
యంబునఁ గొందఱు దశదిశలకుం బాఱిరి కొంద ఱుచ్చైర్నాదంబున రోదనం
బు గావించిరి కొందఱు పాపాత్ముం డగు రావణునిదుర్నయంబున నింతవుట్టె నిట్టి
మహోపద్రవం బెన్నఁ డెఱుంగమని కటకటంబడుచుండి రాసమయంబున విభీ
షణునిభార్య సరమ యనునది రావణుండు హోమంబుచేయుచున్న గుహాస్థలంబు
హస్తసంజ్ఞచేత నంగదునకుం జూపిన నవ్వీరోత్తముండు దాని నెఱింగి రయం
బున గుహాకడకుం జని గుహావాత వైచియున్న పాషాణంబు పాదప్రహారంబున
నుగ్గునూచంబు చేసి యచ్చటం గావలియున్న రాక్షసుల నిశ్శేషంబుగా వధించి
పుచ్చి గుహాలోనికి డిగ్గి యందు. 2554

శా. అక్షీణద్యుతి యైనవాలితనయుం డచ్చోట వీక్షించె జ
న్యక్షోణీతలనిర్జితాగ్నియమరాడ్యక్షేశరక్షస్సహా
ప్రాక్షు న్భూరిపరాక్రమాక్రమితహార్యక్షుఁ నిశాటాన్వయా

ధ్యత్యుగ్ర దారుణహోమకృత్యకలనాదతు న్సముద్రాత్యునిన్. 2555

చ. కని పటుకోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల డాయఁగాఁ
జని కుసుమాక్షతాదిబలిసంతతియుగ్ర ఘనహోమవస్తువు
ల్పనివడి పంక్తికంధరుని పాణుల నొప్పెడుస్రుక్స్రువంబుల
న్మనుకొని హోమపాత్రలు సముద్ధతితోఁ బడవైచె వహ్నిలోన్. 2556

వ. ఇట్లు హోమార్థంబు సమానీతంబు లైనపదార్థంబు లన్నియు నిశ్శేషంబుగా వహ్నికుండంబునం బడవైచి రావణుం గదిసి. 2557

సీ. పిడుగుల కెనయైనపిడికిటిపోటుల గుండియ ల్వగులంగఁ గ్రుమ్మి క్రుమ్మి
పవిసన్నిభస్ఫుర్యపటునఖంబుల మేను చిల్లులు వాఱంగ జీల్చి చీల్చి
కరములఁ బట్టి చిక్కనితలవెండ్రుక ల్బిఱుసైనమీసాలు వెఱికి వెఱికి
వీరుండ వైతేని వెడలిర మ్మాజి సేయఁగ నంచు రోషోక్తు లాడి యాడి

తే. పెక్కువిధముల బాధించె నుక్కు మిగిలి
యెంత చేసిన దశకంఠుఁ డించుకైన
నేత్రములు విచ్చి చూడక నిష్ఠ వదల
కచలమును బోలె సుస్థిరుం డగుచు నుండె. 2558

తే. అత్తెఱం గంతయును జూచి యమరనాథ
పౌత్త్రుఁ డొక్కింత యోచించి పటురయమున
నచట నుండక సురవైరియంతిపురికి
నుక్కు మెఱయంగ నరిగి యందొక్కచోట. 2559

—అంగదుండు దుఃఖించుచున్నమండోదరి నీడ్చుకొని రావణునికడకు వచ్చుట.—

సీ. రాకాబ్జనిర్గళత్సాంద్రలేయకణములకరణిఁ గన్నుల నశ్రుకణము లొలుక
విడువక వెడలు బల్వేఁడినిట్టూర్పుల లలితాధరోష్ఠపల్లవము గంద
స్వర్భానుకబళితశశిమండలమువోలె వదనంబు మిగుల వైవర్ణ్య మొందఁ
గరపల్లవోష్మతఁ గమలి చారుకపోలముకురంబు మలినతాస్ఫూర్తి నొప్ప

తే. వాలుఁగొప్పంసతలమునఁ దూలియాడ, వాతవేగసముద్ధూతవల్లిభంగి
గాఢశోకంబుచే మేను కంప మొంద, విన్నమోమునఁ గూర్చుండి యున్నదాని.

చ. అలఘుచరిత్ర నంచితగుణాఢ్యను సాధ్విని రాజపుత్త్రి దే
వల దని చెప్పిన న్వినక వార్యగతిం జని కానలోన ము
చ్చిలి కొనితెచ్చె రావణుఁడు చేసినదోసము రిత్తవోవునే
కలన వధంబు గల్గు నని కాంతలతో ననుదాని వెండియున్. 2561

చ. గురుబలుఁ డామహోదరుఁడు కుంభనికుంభులు కుంభకర్ణుఁడు
న్మఱియుఁ బ్రహస్తుఁ డాదియగుమంత్రులు శక్రజిదాదిపుత్త్రులు
న్నరహరివీరదోర్బలమున న్నశియించిరి పోర నింక నె

వ్వరి గొని యాజి గెల్వ గొనువాఁడు నిశాచరనాథుఁ డారయన్. 2562

ఆ. ఏమి సెప్పుదాన నింతకాలమున కి, ట్లనుభవింపవలసె నమితదుఃఖ
మకట దైవకృత్య మలవియె తప్పింప, ననుచు సఖులతోడ నాడుదాని. 2563

సీ. ఖరదూషణాదుల మరణంబు మారీచమథనంబును గబంధవధము శక్ర
తనయునినిధనంబు తపనపుత్త్రునిసఖ్య ముదధిబంధనము రణోర్వియందుఁ
గుంభకర్ణాదికఘోరదైత్యులచావు, రామలక్ష్మణులమార్గణసమృద్ధి
వానరవరులదుర్వారబలోద్ధతిఁ జేర్కొని మదిలోన భీతిఁ జెంది

తే. రామభద్రుని నెదిరించి రణములోన
జయము చేకొని రాక్షసోత్తమునకు
వశమె యడియాస లింకేల వదలఁ డనుచు
నొడలు కంపింప నుడుకుచు నున్నదాని. 2564

వ. మందోదరిం గాంచి యవ్వాలినందనుండు రయంబునఁ దారం జేరుమహాగ్ర
హంబుకైవడి నూతనలత డాయుమహావాతంబుపోల్కి గజాంగనం బొదువుసిం
హకిశోరంబుచాడ్పున మృగాంగనం గవియుశార్దూలపోతంబుమాడ్కి నద్దేవిం
గదిసి మత్తశుండాలంబు తుండంబున శైవాలపుంజంబుం బరిగ్రహించినభంగి
కచంబులం బట్టుకొని దశకంఠునియశశ్శకుసుమంబులపోల్కి ననర్ఘరుచిరావతంస
స్థగితస్థూలముక్తాఫలంబులు జల్లనఁ బుడమిం బడ రాక్షసవల్లభునిప్రతాపం
బనేకశకలంబులై పుడమి రాలిన తెఱంగున వక్షోనిక్షిప్తమహార్హమణిభూషణ
వ్రాతంబులు చిందఱవందఱలై రాల భర్తృకరవిమర్దనం బింకఁ గలుగమికి
దుఃఖించుచున్నకరణిఁ గుచమండలంబు నిరంతరగళదశ్రుధారల నొప్ప దదీయరమ
ణీయగాత్రవల్లికాగ్రప్రసూనంబులసొబగున గొప్పకప్పుఁ గొప్పునం జుట్టినవిరులు
విరిసిపడ వదనసరోరుహపరిభ్రమన్మత్తబంభరడింభంబులపోలుపునరంగై నముం
గురులు నిటలతటంబునం జలింప నిశాటపతికిం జేటు గల్గు నని మొఱవెట్టు
చందంబున మణిరంజితమంజీరంబులు మొఱయ దివినుండి దేవతాంగనలు
హర్షనాదంబులఁ గావింపఁ జుట్ట నున్నరాక్షసవనిత లుచ్చైచ్ఛ్రాక్రందంబున రోద
నంబు గావింప రాక్షసరాజ్యలక్ష్మింబోలె నమ్మందోదరి నీడ్చికొని యతిసాహ
సంబున రావణునొద్దకుం జని వానితో నిట్లనియె. 2565

ఉ. రావణ నీవు ము న్నలయరణ్యమునం బతి యొద్ద లేనిచో
వావిరిఁ దస్కరుండ వయి వంచనఁ దెచ్చితి వామహీసుత
న్నీవును నీదుబాంధవులు నేఁడు గనుంగొనుచుండ బల్మి నీ
దేవిని బట్టి యీడ్చికొని తెచ్చితి చూడుము దీని ముంగలన్. 2566

క. అని పలుక నవుడు శోకము, మనమున నంతంత కెదుగ మందోదరి రో
దన మొనరించుచు భర్తను, గనుఁగొని యి ట్లనియె వడలు గడలుకొనంగన్.

మండోదరి రావణునకు రోసంబు పెరుఁగ నాడుట

చ. జనపతి యొద్ద లేనియెడ జానకి మ్రుచ్చిలి తెచ్చి తీవు నీ
దనుజులు నీవుఁ జూడ నిటు దప్పక దెచ్చితి నీదుగేహినిం
గనుఁగొను మంచు గర్వ మది గన్పడ నీకపి యన్నవాక్యము
న్వినియును నీకు లజ్జయు వివేకముఁ గోపముఁ బుట్ట దేలకో 2568

చ హరిహయువైరి సర్వపరమాస్త్రవిదుండు మదగ్రనందనుం
డురుభుజవిక్రముండు మని యుండిన నీవిపినాటుఁ డీక్రియం
దిరముగ నన్నుఁ బట్టికొని తెచ్చునె పాశియమేంద్రకిన్నరే
శ్వరులకు నైనఁ జూడఁగ వశంబె నిశాచరనాథ నాదెసన్. 2569

ఉ. వాసవతుల్యుఁ డైనరఘువర్యునిదేవిని మ్రుచ్చిలించి యు
ల్లాసము మీఱ దెచ్చితివి లంకకు శంక యొకింత లేక నీ
దోసము రిత్తవోవునె యధోగతికి న్నినుఁ బుచ్చుఁగా కిఁ
నీవ్పరవోవునే యనుభవించినఁ గాక నిజాపరాధముల్. 2570

ఉ. కాలము డాయవచ్చిన నకార్యము కార్యము బుద్ధిలోఁ గనం
జాలరు దోచినంతపని సల్పుదు రార్యహితోపదేశము
ల్మేలని చూడ రంతమున మిక్కిలి హాని యొనర్చుసీత నీ
పాలిటికాళరాత్రి యని భావమునం దలపోయఁజాలితే. 2571

ఉ. రామునిదివ్యసాయకపరంపరల న్నిసురంబులోన ను
ద్దామపరాక్రమాధికులు దానవవీరు లనేకు లీల్గి రిం
కేమని చెప్పుదాన నను రేంద్ర యొకండవు చిక్కి తీవు సం
గ్రామజయంబు గల్గు నని రాక్షసనాథ తలంప నేటికిన్. 2572

చ. కడువడిఁ గాలపాశ మురిగాఁగ మెడం దగిలించుకొంటి వె
క్కడఁ జనవచ్చు నింక బలఘస్మరుఁ డైనను గావ శక్తుఁడే
విడువక యాజి కేగి రఘువీరుని దాఁకి వధింపు గానిచోఁ
దడయక చావు మవ్విభుని దారుణదివ్యశరాభిసంహతిన్. 2573

క. చిచ్చొడిఁ గట్టినవానికి, వచ్చునె మేలకట రాజవర్యునిదేవిం
దెచ్చినయప్పుడె నీపనిఁ, జచ్చితి వని దలఁచితిని నిశాచరనాథా. 2574

చ. తలఁగక జన్యరంగమున దాశరథిన్ వధియించు టొండె న
య్యలఘుచరిత్రుదివ్యవిశిఖాహతిఁ జచ్చుట యొండె మాయలున్
బలుమఱు మంత్రతంత్రము లుపాయములున్ బని సేయ వింక నీ
వలవనియాశ మాని సురవైరికులోత్తమ లెమ్ము చెచ్చెరన్. 2575

మ. హరిదంతద్విపదంతముల్ నెఱికి దుర్గాధీశుకై లాసి మొ
త్తి రహిన్ దివ్యధనుర్గుణవ్రణకిణోద్దీప్తంబులై నిర్జరే

శ్వరయక్షేశయమాదిదిక్పతులదోఃప్రాబల్యముల్ మాన్చి బం
ధురలీలం జెలువారె నీదుభుజముల్ దుర్వారశౌర్యోద్ధతిన్. 2576

మ. అసమానోరుభవత్కరార్పితసముద్యద్దేవతానోకహ
ప్రసవాలంకృత మైననాదుకబరీభారంబు నివ్వానరుం
డసురుల్ చూడఁగఁ బట్టి యీడ్చె దనుజేంద్రా భూరిబాహాబలం
బెసఁగన్ వీనిమదంబు వో నిడక నీ కిట్లుండఁగాఁ జెల్లునే. 2577

చ. అజునిఁ దపంబునం దనిపి యవ్విభుచేత వరంబు లంది దో
ర్విజితజగత్త్రయుండ వయి వీరుఁ డనంగఁ బ్రసిద్ధి గన్న నీ
నిజసతి కేశపాశ మొకనీచవనాటుఁడు పట్టి యీడ్చె నో
రజనిచరేంద్ర మానముఁ దిరం బగుకీర్తియు నింక నిల్చునే. 2578

క. మునివృత్తి హోమకృత్యం, బొనరించి నృపాలమౌళి సుద్ధతి ననిలో
మునుకొని జయింపఁ జూచితొ, పనిగొన వింకఁ గొఱగానిపనులు సురారీ.

తే. మంత్రములు తంత్రములు దైత్యమాయ లన్ని
శక్రజితునితోడనె వెంటఁ జనియె నింక
నేమి చేసిన నే మగు నృపవరేణ్య
శరనిహతిఁ గూలు టంతియె గొఱఁత నీకు. 2580

చ. రణమున కీవు పోయి రఘురామునిముంగలఁ గొంతసేపు మా
ర్గణములకల్మిఁ జూపి తుది రాజలలామునివిస్ఫురద్ధను
ర్గుణపరిముక్తకాండములఁ గూలుము భూస్థలి నట్లు గానిచో
గుణ మది గల్గి రామునకు గొబ్బున జానకి నిమ్మధీశ్వరా. 2581

వ. అనియిట్లు మందోదరి శోకరోషభయలజ్జాపరాభవకలిత యై పలికిన విని రాక్షస వల్లభుం డగురావణుండు హోమంబు చాలించిమౌనంబువిడిచిడిగ్గన లేచిరోషానలజ్వాలాభీలలోచనుండై కాలవ్యాళంబుం బోనికరవాలంబంకించి వాలినందనునిభుజాంతరంబు వ్రేసి మూర్ఛితుంజేసి తనప్రాణేశ్వరినివిడిపించిన నదివాతాందోళితవనలతకైవడి నడలుచుఁ గేశబంధంబు వీడి వెన్నున జీరియాడఁ బాదంబులు తొట్రుపడ రోదనంబు సేయుచు నంతఃపురంబునకుం జనియెనప్పుడువిసంజ్ఞుం డైనయంగదుం జూచి బలవంతుం డగుహనుమంతుండు మహాశనిసంకాశం బైనముష్టి నలవరించి దశగ్రీవునిమస్తకంబుఁ బొడిచె నంతలోనం దలివొంది పురందరపౌత్త్రుండు రక్తధారాస్నపితదేహుం డై ధాతుభూషితం బైనశైలంబు చాడ్పునం జూపట్టుచు నతికోపంబున దైత్యేంద్రునిబలంబుదూలిపోవఁగరతలంబునవ్రేసె నిట్లుయ్యురువురచేత వ్రేటుపడియు సరకుగొనక బలంబెడలక చలంబుడింపక రావణుండు వహ్నికుండంబులవలన నిర్గమించువిస్ఫులింగంబులుంబోలె భీషణరోషకషాయితలోచనంబులనగ్నికణంబులుప్పతిల్లగదాదండంబుననాఖం

డలపౌత్త్రుని దూలనేసి పదంపడి హుతాశనజ్వాలాభీలం బైనకరవాలంబున హనుమంతునిం బ్రహరించి దోడనెనలనీలగజగవయగవాక్షగంధమాదనశరభశతవలిమైందద్వివిదులఁ గ్రమంబున ముసలముద్గరపరిఘపట్టసప్రాసకుంతతోమరాంకుశశూలచక్రంబులు ప్రయోగించి జర్జరితాంగులం జేసిన వారు బెండుపడక గండుమిగిలికరచరణనఖదంతముష్టిజానుకూర్పరవాలతలపార్ష్ణిఘాతంబుల నొప్పించి వెగడుపఱచి నిజసైన్యంబులం గూడి రామునియొద్దకుం జనుదెంచి హోమంబుఁ జెఱిచి వచ్చితి మని వినయంబున విన్నవించి పరమానందంబు నొందించి రంత రావణుండు హోమం బంతరాయంబు నొందిన నతిభీతుండై సేయునది లేక యేమియుం దోఁపక యభ్యంతరమందిరంబునకుం జని యం దేకాంతంబున శోకరసాధిదేవతయుం బోలెఁ జూపట్టుచు రోదనంబు సేయుచున్న మందోదరిం గాంచి యిట్లనియె. 2582

చ. పడఁతిరో యింత నీకు వగవం బనిలేదిలఁ బ్రాఁశికోటికిం
గుడువక తీర దెన్నటికిఁ గోరి యొనర్చినకర్మసంచయం
బెడపక నేను జన్యమున కేఁగి మహోగ్రశిలీముఖావళుల్
వడిఁ గురియించి రాఘవులవానరులన్ వధియించి వచ్చెదన్. 2583

చ. నళినదళాయతాక్షి కదనంబున రామునిఁ జంపు టొండె న
య్యలఘుచరిత్రుదివ్యవిశిఖాహతిఁ జచ్చుట యొండె నంతె పో
పలుకు లిఁకేల యే నచటఁ బంచత నొందిన నీవు దుఃఖ ను
వ్వల నిడి జానకిం దునిమి వహ్నిముఖంబునఁ జావు మొక్కటన్. 2584

—శ్రీరాములప్రతాపమును మందోదరి రావణున కతిఁగింమట.—

క. అన విని మందోదరి తన, మనమునఁ గడు నుమ్మలించి మానక విభునిం
గనుఁగొని బాష్పకణంబులు, చనుమిట్టలఁ జిందుచుండఁ జయ్యనఁ బలికెన్.

మ. విబుధేంద్రస్తుతశౌర్యు రాముని రణోర్విం జంపఁగాఁ జాల వెం
తబలౌద్ధత్యము నీకుఁ గల్గిన దిగంతవ్యాప్తతేజుండు బా
డబకీలోపమదివ్యబాణుఁడు ప్రచండస్ఫారవీర్యోన్నతిం
గబళింపంగ సమర్థుఁ డీజగములం గాకుత్స్థుఁ డూహింపఁగన్. 2586

మత్తకోకిల. శక్రతుల్యపరాక్రముండు విశాలకీర్తిఘనుండు దో
ర్విక్రమార్జితవీరలక్ష్ముఁ డరిందముం డనఘుండు ని
ర్వక్రసాధుచరిత్రుఁ డాశ్రితపారిజాతమహీజ మో
షక్రశిష్యవరేణ్యు రాముఁడు సుప్రశస్తబలుం డిలన్. 2587

ఉ. మానవనాథు రాఘవుని మానవమాత్రునిఁగాఁ దలంచితో
మానితతావకీయశరమర్దితులై సుర లెల్ల వేఁడఁగా
మానవరూపధారి యయి మర్త్యజగంబున దుష్టదైత్యులం

బూని వధింప నాజికటు పుట్టినమాధవుఁగా నెఱుంగుమా. 2588

చ. నిను మును దోఃకఁ జుట్టుకొని నీరధు లన్నియు ముంచినట్టియా
ఘనబలశాలి వాలి నొకకాండమునన్ వధియించె వార్ధిపై
వనచరకోటిచేత సులభంబుగ సేతువు గట్టఁ జేసె నా
య్యన నివి మర్త్యమాత్రునకు నయ్యెడుకార్యములే హ్రాదీశ్వరా. 2589

సీ. పిన్ననాఁడె త్రిలోకభీకరాకృతి యైనతాటకఁ జంపె నుద్దండవృత్తిఁ
దాటకేయాదిదుర్దనురాక్షసులఁ దోలి కౌశికయాగరక్షణ మొనర్చె
భుజశక్తి సురలైన మోపెట్టఁ జాలని శూలికార్ముక మవలీల విఱిచె
గార్తవీర్యునిబాహాకాండంబు ద్రుంచిన భార్గవరాముని భంగపఱిచె

తే. దానవేశ్వర యివి యన్ని దలఁచి చూడఁ
గర మమానుషచర్యలు గావె యధిప
యిట్టిజగదేకవీరు నహీనసత్త్వ
సమితశౌర్యు జయింప నీ కలవి యగునె. 2590

సీ. మత్స్యరూపమున సోమకుఁ జంపి ధాతకు శ్రుతుల నొసంగిన దితఁడు గాఁడె
కమఠమై మందరాగము నెత్తి వేల్పుల కింపుతో సుధ నిచ్చె నితఁడు గాఁడె
కిటియై హిరణ్యాక్షుఁ గెడపి బల్గొమ్మునఁ బృథివీతలం బెత్తె నితఁడు గాఁడె
కరరుహంబులఁ జీఱిసురలెల్లఁ గొనియాడ హేమకశిపుఁ జంపె నితఁడు గాఁడె

తే. వామనాకృతి బలి గిట్టి వైచి జగము
లేపుతో నాక్రమించిన దితఁడు గాఁడె
భృగుకులంబునఁ బుట్టి ముయ్యేడుమాఱు
వెతకి రాజుల వధియించె నితఁడు గాఁడె. 2591

క. దురమున నినుఁ బొరిగొని నిర్జరులకు హిత మాచరించి సంయమివరులం
గరుణం గావఁగ నందక, ధరుఁ డిప్పుడు రామరూపధరుఁ డై పుట్టెన్. 2592

తే. సంగరంబున నీ కింకఁ జావు నిజము
నాకు నీతోడ ననుగమనంబు సేయ
రాదు ముదిమియు మరణంబు లే దటంచు
మున్ను వర మిచ్చె మాతండ్రి మునివిరోధి. 2593

ఆ. ఏమి సేయుదాన నిఁక నెద్ది దిక్కు నా, కొంటి నిన్ను విడిచి యుండవలసె
వరుసఁ బూర్వకర్మఫలము భుజింపక, తీఱ దుర్వి నెంతవారి కైన. 2594

తే. సంభ్రమమ్మున నలవిభీషణునిభార్య
సరమ పంచినపను లన్ని సంతతంబు
దాసిచందానఁ జేయుచు దోసి లొగ్గి
బ్రతుకవలసె నా కింక సుపర్వవైరి. 2595

వ. అని పలికి రావణుం గౌఁగిలించుకొని దీనముఖి యై లోచనగళదశ్రుధారాసా
రంబునఁ బతిశరీరంబు దడుపుచు నుచ్చైర్నాదంబున రోదనంబుగావించె నప్పు
డద్దశగ్రీవుం డుచితసల్లాపంబులం బ్రియురాలి నూరార్చి తత్కాలసదృశంబగు
వాక్యంబున ని ట్లనియె. 2596

—రావణుండు మండోదరితోఁ దనదీనస్థితిని జెప్పుకొనుట—

చ. తనయుల మంత్రులన్ సఖులఁ దమ్ముల భృత్యుల సర్వబంధులన్
ఘనచతురంగసైన్యములఁ గయ్యమునన్ మును గోలుపోయితిన్
వనజదళాక్షి యే నొకఁడఁ బట్టుగ నేమి సుఖంబు నొందఁగా
మనియెద వారు పోయినక్రమంబున నాకును బోవు టొప్పగున్. 2597

మ. అనిమేషేంద్ర భుజావలేపహననవ్యక్తప్రతాపోదయున్
ఘనమాయున్ నిఖిలాస్త్రశస్త్రవిదు జన్యప్రేము నయ్యింద్రజి
త్తును గోల్పోయితి నింక నేల బ్రతుకన్ దోశ్శక్తి నమ్మానవేం
ద్రునిఁ బోరన్ వధియింతుఁ గానియెడఁ జత్తుం గాక నే నున్నదే. 2598

చ. చెఱిచితి యజ్ఞకర్మములు శిష్టుల మానుల బాధపెట్టితిన్
బరసతులం దగన్ జెఱలువట్టితి వేల్పుల హింసచేసితిన్
గరివరయాన యేను గనుగానక చేసితిఁ బెక్కుపాపముల్
గఱకఱి నన్నిటిం గుడుచుకాలము డాయఁగ వచ్చె నేఁటికిన్. 2599

చ. నరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకి
న్నరగరుడోరగాదుల రణంబునఁ దోలి యశంబు గన్న నే
నరుదుగ నేఁడు మర్త్యు శరణాగతి నొందుట యెట్లు పౌరుషం
బఱుగదె యింతకంటె సమరాంగనిఁ జచ్చుట మేలుగాదొకో. 2600

క. బాలా పౌరుష మణఁగిన, నేలా రాజ్యంబు భోగ మేలా సైన్యం
బేలా నశ్వరజీవిత, మేలా నీ వేల భాగ్య మేటికిఁ జెపుమా. 2601

చ. హరిహయుచేతివజ్రము కృతాంతునిదండము పాశిపాశమున్
గరువలికేతనం బసురఖడ్గముఁ బావకుశక్తిఁ గిన్నరే
శ్వరుగదఁ జీరికిం గొననివాఁడ మహేశ్వరదత్తభూరిభీ
కరతరచంద్రహాస మది గల్గఁగ నింత విచార మేటికిన్. 2602

—శ్రీరాములచేఁ జచ్చుటయే నాపరమార్థం బని రావణుండు భార్యకుఁ జెల్పుట.—

చ. అళికులవేణి యొక్కపరమార్థముఁ జెప్పెద దేవతల్ మునీం
ద్రులు దను వేఁడుకొంటకుఁ జతుర్భుజుఁ డాజి ననుం బరాక్రమం
బలర వధింపఁగా దశరథావనిభర్తకుఁ బుత్త్రుఁ డై ముదం
బలవడ రామరూపమున సర్థి జనించుట నే నెఱుంగుదున్. 2603

ఉ. రాఁగ మెలర్ప ఘోరసమరంబున రామశరంబులం దను
త్యాగముఁ జేరి దుర్లభసుఖావహశాశ్వతముక్తికామినీ
భోగము నొందఁ గోరి నృపపుత్త్రిని ముచ్చిలి తెచ్చితి న్నను
ద్యోగ మెలర్ప నవ్విభున కుద్ధతి నాపయిఁ గిన్కఁ బుట్టఁగన్. 2604

తే. నేఁటితో సరి వనితదో నీదుపొందు
భూపతిశరంబులం దెగి ముక్తికాంతఁ
బొంద రణమున కిప్పుడె పోవువాఁడ
నిదియె సుముహూర్త మెడసేయ నేటి కిచట. 2605

రావణుండు కడపటియుద్ధంబునకు వెడలుట.

వ. అని పలికి యద్దేవికిం జెప్పి దనుజకుంజరుండు దిగ్గన లేచి రణోత్సాహసాహస బాహాటోపకోపంబు లభివృద్ధి నొంద శీఘ్రంబున నంతఃపురంబు వెలువడి పాదవిన్యాసంబున మహీతలంబు గ్రక్కదల సముదగ్రవినూతనమహాగ్రహంబున నతిదుర్నిరీక్షుం డై యాస్థానసదనంబునకుం జనుదెంచి మణిఖచితహేమసింహాసనంబున నాసీనుం డై యుదయమహీధరోపరిగతనీలజీమూతంబుకరణిం జూపట్టుచుఁ గులమహీధరగుహాముఖంబులం బ్రతిధ్వనులు సెలంగ సప్తసముద్రంబులు పొంగి పొరల ధరాచక్రంబు తల్లడపడ దిశాముఖంబులు బ్రద్దలువాఱ గగనంబు ఘూర్ణిల్ల భూచరఖేచరభూతవ్రాతంబులగుండె లవియ గ్రహంబులు గతులుదప్పఁ గోటిపిడుగులమ్రోఁతకు సీటగునట్లుగాఁ బ్రస్థానభేరి వ్రేయించి యనర్ఘమణిమయరత్నకిరీటంబులు దశశిరంబుల నలంకరించి మణికేయూరంబు లిరువదిభుజంబుల బాదుకొల్పి మాణిక్యమయకుండలచ్ఛాయాసంక్రాంతవింశతిగండమండలుం డై నానావిధకమనీయతరళతారహారంబు లురంబున సవరించి శశక్షతజకల్పసుశీతలచందనపంకలిప్తగాత్రుం డై సంధ్యారాగపరీతజీమూతంబు ననుకరించుచు మణిమండనమండితసర్వాంగుం డై ధాతుశోభితాంజనాచలంబుపోల్కిం దేజరిల్లుచు శరశరాసనగదాముసలముద్గరభిండివాలకరవాలశక్తితోమరపాశపరిఘాంకుశచక్రకుంతశూలప్రాసపరశ్వధక్షేపణీప్రముఖబహువిధాయుధాలంకృతవింశతిబాహుం డై తీవ్రమయూఖమండితుం డై నపుండరీకబంధుండుంబోలె వెలుంగుచుఁ గాలకేతునామకసూతుండు సహస్రజవాశ్వంబులం బూన్చి మణిమయపతాకాకేతనంబు లెత్తి కార్ముకబాణతూణీరాదిబహువిధాస్త్రశస్త్రపరిపూర్ణంబు గావించి షోడశచక్రపరిక్షిప్తం బైన సాంగ్రామికకాంచనరథం బాయత్తంబుచేసి సహస్రఘంటానిర్ఘోషభీషణంబుగాఁ దెచ్చిన దాని నారోహించి శంఖదుందుభికాహళభేరీభాంకరణపురస్సరంబుగా దివ్యవిమానాధిరూఢుం డై పరమపదంబునకుం బోవుచందంబున నాజిరంగంబునకుం జనియె నతనిరథంబు వెనుకొని సర్పరోముండును ఖడ్గరోముండును వృశ్చికరోముండు నగ్నివర్ణుండు నను నామంబు గలయాతుధానయోధులు నలువురు

సర్వాయుధపరిష్కృతు లై ముక్తపురుషుని వైకుంఠంబునకుం గొని చను పార్ష
దులభంగి వెలుంగుచుం జనిరి వారల వెనుకొని చక్రపయోధరయుఁ దూణీరజం
ఘికయు శతఘ్నీశూలకేశాంతయు శంఖగళయు ధనుర్భ్రూలతోపేతయు శితసా
యకకటాక్షవీక్షణయు మత్తదంతావళయానయు శతాంగరథాంగనితంబయు
సముచ్ఛ్రితధ్వజపతాకాహస్తయు నానావిధహేతివ్రాతమణిభూషణాలంకృత
యు నై రాక్షససేనాలక్ష్మీబహువిధవాద్యంబులతో రామభద్రుని వరియింపం
జనుచందంబుగా నరిగె నిట్లు రావణుండు సకలసాంగ్రామికపరికరసమేతుం డై
రథభారంబు మోవంజాలక శేషుండు శిరంబులు వంప రథచక్రసముద్ధూతధరణి
పరాగపటలంబు గగనంబున కెగయఁ గోలాహలబహులంబుగా నుత్తరద్వా
రంబున వెడలి వానరబలంబు సొచ్చి మహావాతంబు జీమూతంబులం దోలు కై
వడి నిజాభీలశరజాలంబుల వానరులం దూలం దోలుచు నతిరభసంబున రామ
భద్రునియొద్దకుం జనుదెంచుచుండె నప్పుడు. 2606

క. దనుజానీకము రావణు, పనుపున నవిశంకవృత్తిఁ బ్రబలస్వనముల్
వినువీది ముట్ట నురవడి, వనచరబలవితతిఁ దాఁకి పటురోషమునన్. 2607

చ. గదలును శక్తు లుగ్రపరిఘంబులు తోమరకుంతము లృటు
ప్రదరములు న్లుతారములుఁ బ్రాసపరశ్వథముద్గరంబులు
న్వదలక చక్రశూలములు పట్టసము ల్నితమండలాగ్రము
ల్మదమున వైచి వానరసమాజము నుబ్బడఁగించి రేపునన్. 2608

చ. కపులును బీఱువోవక యఖండభుజాబలదుర్నివారు లై
విపులశిలాచయంబులును వృక్షగణంబులు వీచి వైచుచుఁ
గుపితమనస్కు లై గఱకుగోళ్ల వధించుచు నుగ్రభంగిఁ గో
ణపులమదం బడంచి గగనం బగల న్వడి నార్చి రుద్ధతిన్. 2609

ఉ. వానరదానవప్రవరపాదతలాభిహతప్రభూత మై
తోన మహీరజం బెగసి దొంతర లై గన నయ్యె మిన్నున
న్మానక యొక్కరీతిఁ గదనంబునఁ జచ్చినవీరు లయ్యెడం
బూని మరుజ్జగంబునకుఁ బోవ నమర్చినమెట్టులో యనన్. 2610

మ. ఇరువాఁగు ల్వడి నిట్లు దార్కొని చలం బేపార నొండొంటిపైఁ
గర ముద్వృత్తి నిగుడ్చువిస్ఫురదమోఘక్రూరశస్త్రాస్త్రముల్
వసున న్దత్పృథుకంఠనాళములపై వ్రాలె న్మరుత్కామినీ
గుసుహస్తప్రవిముక్తదామములతోఁ గూడ న్విచిత్రంబుగన్. 2611

చ. మృతభటదంతిఘోటకశరీరగణంబులు శాతఖడ్గని
ర్గతకరపాదశీర్షముల తెట్టెలు గల్గి నితాంతరక్తపూ
రితసమరాంగణంబు విపరీతగతిం గన నయ్యె నప్పు డ
ద్భుతముగ ద్వీపపర్వతవిభూషితభూరిపయోధిచాడ్పునన్. 2612

ఆ. అందు యానపాత్రలై యరదము లొప్పె, సకలభూతములు పిశాచములును
మకరకచ్ఛపములమాడ్కిఁ జరించె భూ,షణరజంబు లిసుకచంద మొందె. 2613

—౼ఖడ్గరోమ సర్పరోమ వృశ్చికరోములు హనుమదంగదనీలులచేఁ జచ్చుట.—

క. వనధు లిల నభము ఘూర్ణిల, దనుజుల కగచరుల కిట్లు దారుణరణముల్
జనలోచనభీకర మై, యనుపమ మై యద్భుతావహం బై చెల్లెన్. 2614

వ. అప్పుడు. 2615

క. తల మిగిలి ఖడ్గరోముఁడు, చలమున నాత్మీయరోమశాతాసులచే
బలువడిఁ గీశులగాత్రం,బులు చెక్కులు వాపు చిట్లు పోరొనరించెన్ 2616

ఉ. అప్పుడు వానిమీఁదఁ బవనాత్మజుఁ డొక్కవిశాలసాలముల్
దప్పక పెల్లగించి నిజదర్ప మెలర్పఁగ వేయిమాఱులుం
ద్రిప్పి రయంబున న్విసరి తెంపున వైవ నతండు దానిచే
గొప్పమహీధరంబుక్రియఁ గూలె విభిన్నశిరస్కుఁ డై భువిన్. 2617

ఉ. ఆతనిపాటుఁ జూచి మది నాగ్రహ మొప్పఁగ సర్పరోముఁడుల్
జేతులతీట వోవ ననిసేయుచుఁ దోడినిశాటు లెల్ల సం
ప్రీతి వహింపఁగా నిజశరీరజరోమవిషాహిదష్టు లై
యాతతతేజు లైనవిపినాటులు చావఁగఁ జేసె బల్విడిన్. 2618

ఉ. వానితెఱంగుఁ జూచి కపివర్యుఁడు వాలితనూజుఁ డుగ్రుఁ డై
మానక గండశైల మసమానభుజాబల మొప్పఁ దెచ్చి య
ద్దానవుమీఁద వైచిన నతం డొకవ్రేటున భిన్నవక్షుఁ డై
ప్రాణము లంగము న్విడిచి పాఱఁగఁ గూలె నగంబుచాడ్పునన్ 2619

చ. అనిమిషనాథపౌత్రపటుహస్తవిసృష్టశిలాహతి న్రయం
బున సమరావనిం బడినభూరిపరాక్రము సర్పరోమునిం
గనుఁగొని భూరికోప మెసఁగ న్వడి వృశ్చికరోముఁ డుగ్రుఁ డై
వనచరసేనఁ జొచ్చి యనివార్యగతి న్విదళించె నందఱన్. 2620

తే. అతనికొల్లల కోర్వక యద్రిచరులు, చదలఁ బఱచినవారల జడుపుదీర్చి
వహ్నితనయుండు నీలుం డవార్యశౌర్య, మొప్ప రయమున వానిపై కురవణించి.

చ. హరిహయవజ్రతుల్య మగుహస్తతలంబునఁ దత్కపోలము
న్జఱచిన దీర్ఘదంతములు జల్లన రాలఁగ నక్షితారక
ల్పరువడి నిష్క్రమింపఁగ క్షపాచరు లందఱుఁ జూచి యేడ్వఁగా
గురుకులిశాహతి న్దెగినకొండవిధంబునఁ గూలె నుర్వరన్. 2622

—౼రాముం డగ్నివర్ణునిం జంపుట.—

వ. కూనిపతనంబు విలోకించి యగ్నివర్ణుండు కోపించి కాలాగ్నియుంబోలె మం
డుచు నిజతేజోజాలంబుల వలీముఖుల నెల్ల శలభంబులంబోలె దహించుచు

నిరంకుశప్రతాపదీపితుం డై రణక్రీడ సల్పి నతనియాటోపంబుఁ జూచి రా
ముండు విభీషణునివలన నతనివృత్తాంతం బంతయు నాకర్ణించి శీఘ్రంబున వాయ
వ్యాస్త్రంబు శరాసనంబునం గూర్చి తిగిచి విడిచిన నయ్యమోఘాస్త్రపాతం
బున నద్దానవుండు గతప్రాణుం డై పుడమిం బడియె నిట్లు తనచక్రరక్షకు లగు
ఖడ్గరోమవృశ్చికరోమసర్పరోమాగ్నివర్ణులు నలువురుఁ బంచత్వంబు నొందిన
విలోకించి రావణుండు దశవదనంబులం జిడిముడిపాటు గదుర నుదీర్ణవిక్రముం డై
రథంబు దోలించి మార్తాండుండుంబోలె వెలుంగుచు నిజశరమయూఖంబుల
వానరబలజలాశయంబును శోషింపఁజేయుచు రభసోద్రేకంబున రణవిహారంబు
గావించుచుండె నప్పుడు. 2623

ఉ. అనుపమతేజుఁ డారఘుకులాగ్రణి గన్నులఁ గెంపు మీఱ గ్ర
క్కున దివిజేంద్రచాపనిభఘోరశరాసన మెక్కు వెట్టి కాం
చనవలయాభిశోభితనిశాతశిలీముఖము ల్నిశాటనా
థునిపయి నేసె నంగములు దూల గుణధ్వని నింగిముట్టఁగన్. 2624

. ఆరజనీచరాధివిభుఁ డగ్రశతాంగగతుండు భాస్కరుం
జేరినరాహుభంగి నృపుఁ జేరి ఘనంబు మహాగిరిం బయో
ధారలఁ గప్పినట్లు వితతంబుగఁ గాంచనపుంఖవహ్నికీ
లారుచివజ్రసన్నిభకలంబము లేసె మహాద్భుతంబుగన్. 2625

క. దానికి నించుక దలఁకక, మానవనాయకుఁడు ఘోరమార్గణవితతుల్
పూని శతాంగగతుం డగు, దానవనాయకునిమీఁద దళముగఁ గురిసెన్. 2626

ఇంద్రుఁడు దనరథంబు గొని రామునకు సారథ్యము సేయ మాతలి నియోగించుట.

వ. ఇట్లు పదియేనవనాఁటిప్రాతఃకాలంబునం దలకొని సమానవిక్రమంబునం బోరు
నెడ నంబరమధ్యగతు లైన వేల్పులు రథి యైన రావణునిఁ బదాతి యైన రాముని
విలోకించి వీరిరువురకు రణంబు సమంబు గా దని పలికిన వారలవచనంబు విని
పరమార్థవిదుం డగు పాకశాసనుండు నిజసారథి యగు మాతలి రావించి నీవు
శీఘ్రంబున మద్రథంబు దోలుకొని రఘూత్తమునికడకుం జని యమ్మహాత్మునకు
సారథ్యంబుఁ జేసి దేవతలకు హితంబు సంపాదించి పెంపువడయు మని పలికిన
నతం డట్ల కావించెద నని యూఁకొని శక్రునకు బ్రణామంబుఁ జేసి యనుజ్ఞా
తుం డై కాంచనచిత్రాంగంబును వైడూర్యకృతకూబరంబును దరుణాదిత్యసం
కాశంబును గింకిణీశతవిభూషితంబు నగురథంబు సన్నద్ధంబుఁ జేసి రుక్మవేణు
ధ్వజం బెత్తి కాంచనాపీడంబులును సూర్యసంకాశంబులును శ్వేతప్రకీర్ణయు
క్తంబులును హరిద్వర్ణంబులు నగుతురంగంబులం బూన్చి యమ్మహారథంబుగొని
దివంబున నుండి పుడమికి దిగి వచ్చి సముచితప్రకారంబున రామునకుం బొడ
సూపి నిటలతటఘటితాంజలిపుటుం డై వినయంబున నిట్లనియె. 2627

మ. అనఘా యేను సురేంద్రసూతుఁడఁ దదీయం బైన తే రుద్ధతిం
గొని శీఘ్రంబునఁ దత్ప్రచోదితుఁడ నై ఘోరాజిలో నీవు దై
త్యునిఁ దున్మాడి జయంబు చేకొనుట కెంతో ప్రీతి నే తెంచితి
న్నను మన్నించి శతాంగ మెక్కి రణము న్గావింపు ముద్యద్వ్రతిన్. 2628

శా. ఐంద్రం బొక్క మహాశరాసనము దివ్యం బైనవర్మంబు భో
గీంద్రప్రఖ్యపృషత్కము ల్సితమహాహీనోగ్రశక్తు ల్సుప
ర్వేంద్రుం డంపెఁ బరిగ్రహించి కుతుకం బేపార నీనీచ దై
త్యేంద్రుం జంపుము సంగరంబున ధరిత్రీంద్రానురు ల్మెచ్చఁగన్. 2629

తే. ఏను సారథ్య మొనరింప నింపు మెఱయఁ, దొల్లి జంభారి దనుజుల ద్రుంచినట్టు
లేనుసారథ్య మొనరింప నింపు మెఱయ, నిపుడు దశకంఠు వధియింపు మినకులేంద్ర.

రాముం డింద్రరథారూఢుండై రావణునితో యుద్ధము సేయుట.

క. అని విన్నవింప రాముఁడు, మనమున హర్షించి వాని మన్నించి రథం
బునకుఁ బ్రణమిల్లి శీఘ్రంబున నెక్కె స్వదీప్తి లోకముల వెలిఁగింపన్. 2631

ఆ. అంత ముజ్జగంబు లాకులపడఁగ భూతములు కడు భయమునఁ దత్తఱింప
రథికు లైన రామరావణులకు ఘోర, సంగరంబు చెల్లె సంకులముగ. 2632

మ. దశకంఠుండు కడంగి ఘోరతరగాంధర్వాస్త్ర మేయ న్సమ
స్తశరజ్ఞుండు రఘుప్రవీరుఁ డటు గాంధర్వాంబకం బేసి దై
త్యశరంబు న్వడిఁ ద్రుంచె వాఁ డలుక దైవాస్త్రంబు బిట్టేయ స
ద్యశుఁ డాయోధనధుర్యుఁ డా నృపతి దైవాస్త్రంబునం ద్రుంపఁగన్. 2633

చ. అలిగి దశాననుండు చలమారఁగ దారుణరాక్షసాస్త్ర ము
త్యలఘుగతి న్నిగుడ్ప వెస నప్పరమాస్త్రమునందుఁ గాంచనో
జ్జ్వలమహనీయదుష్ప్రసహసాయకకోటులు పుట్టి బల్వడిన్
దళముగ సర్పరూపములు దాల్చి మహాద్భుతభంగి దోఁచఁగన్. 2634

చ. కడువడి దీప్తపావకశిఖాతతిఁ గ్రక్కుచు వాతదుర్విషం
బడర భయానకంబు లయి వ్యాదితవక్త్రము లై యహీంద్రు లై
వడి వడిఁ బూని దిక్కులు దివంబును ధాత్రియు నిండి విక్రమం
బడరఁగ రామభద్రుదెస కట్లుడరెం గడు రౌద్రవైఖరిన్. 2635

చ. కనుఁగొని రాజనందనుఁ డకంపితుఁడై వడి గారుడాస్త్ర మే
సిన వెస దానియం దతివిచిత్రతరంబుగ ఘోరపక్షుముల్
సునిశితతుండము ల్గలిగి శోభిలునట్టిసువర్ణకోటి చ
య్యన జనియించి వహ్నిశిఖలట్ల వెలుంగుచు ఘోరవైఖరిన్. 2636

మ. ఘనయు న్దిక్కులుఁ బుష్కరస్థలము నాచ్ఛాదించి తీక్ష్ణాగ్రతుం
డముల న్వ్రచ్చియు వజ్రసన్నిభనఖాంతవ్యాహతిం జించి పా

దములం దన్ని పతత్త్రజాతపటువాతప్రోద్ధతిం దూలఁ దో
లి మహారాక్షసముక్తసర్పశరముల్ లీల న్విదారించినన్. 2637

మ. తనయస్త్రం బిటు నిష్ఫలం బయిన దైత్యస్వామి కోపించి ఘో
రనఁ గాలాంబుద మద్రిమీఁద ఘనవర్షంబు న్వర్షించుచా
డ్పున నారామునిమీఁద నొక్కమొగి నాపుల్ చూచి వర్షింప గ్ర
క్కున నీరంధ్రపృషత్కవృష్టిఁ గురిసె న్ఘోరప్రకారంబునన్. 2638

ఉ. వాసవవైరి యిట్లు రఘువర్యుని నమ్ముల ముంచి వెంటనే
వాసవసూతు మాతలి నవార్యపృషత్కసహస్రవిద్ధునిం
జేసి సుపర్ణకేతనముఁ జెచ్చెరఁ దూపుల నుర్విఁ గూలఁగా
నేసి సురేంద్రవాజుల ననేకశరంబులఁ గప్పె నుద్ధతిన్. 2639

వ. ఇట్లు దశగ్రీవుండు దశవదనంబులం జడిముడిపాటు గదురఁ దనయిరువదిచేతుల
బరువుఁ జూపిన. 2640

ఆ. ఆర్తుఁ డైన రాము నప్పుడు వీక్షించి, సురలు కిన్నరులును బరమమునులు
గరుడయక్షసిద్ధగంధర్వకిన్నర, సాధ్యముఖులు కడు విషణ్ణు లైరి. 2641

తే. అసురవరరాహుసంగ్రస్తుఁడైన రామ,చంద్రు వీక్షించి వానరసహితుఁ డైన
సవితృనందనుఁడును విభీషణుఁడు జాల, దీను లైరి మొగంబులఁ దెలివి దక్క.

క. ప్రజల కశుభావహుం డై, ద్విజరాజసుతుండు మిగుల విధువల్లభ ప్రా
యజదేవతాకతారమ, బుజుగతిఁ జననీక యావరించెం గడిమిన్. 2643

తే. శరనిధి సధూమపరివృత్తసాంద్రవీచి, యగుచు మంటలు పర్వ నత్యంతకోపుఁ
డై రవిని సంస్పృశింపంగ నరుగుమాడ్కి, నిబిడనిర్ఘోష మడరంగ నింగి ముట్టె.

తే. మందరశ్మి యై శస్త్రసమానవర్ణుఁ
డై పరుషుఁ డై కబంధాంకుఁ డై వినీల
పరిధి యై భాస్కరుండు నిష్ప్రభత నొంది
ధూమకేతువుతోఁ గూడి దోఁచె మింట. 2645

తే. తెలుఁగునకుఁ దప్పి యింద్రాగ్ని దేవతాక, మైనకోసలనక్షత్ర మగువిశాఖ
నాక్రమించి యంగారకుఁ డంబరమునఁ, గింశుకచ్ఛవి నటు విలోకింప నయ్యె.

క. పదితల లిరువదిభుజములు, పది కార్ముకములును గలిగి భండనభూమిం
ద్రిదశారికులవరేణ్యుఁడు, కదలనిమైనాకశిఖరికై వడి నొప్పెన్. 2647

వ. ఇట్లు రావణునిచేత నిరస్యమానుం డై రాముండు కొండొకసేపు శరసంధా
నంబు సేయుటకుం దోఁపక వెగడుపడి యుండి వెండియు ధైర్యాతిశయంబునం
బరమసంక్రుద్ధుం డై విలయకాలవైశ్వానరునిభంగి వెలుంగుచు బొమలు ముడి
వడ రోషారుణితలోచనంబున దహించుచున్నవాఁడుపోలెఁ జూపట్టిన నప్పుడార
ఘువల్లభునివదనం బుపలక్షించి సర్వభూతంబులు భయంబు నొందెఁ బుడమి

వడంకె నచలంబులు చలించె ద్రుమంబులు చాఁపకట్టువడియె సముద్రంబులు
సంక్షోభించె మేఘంబులు భయంకరంబు లై యుత్పాతకాలంబునందుంబోలె
భీమనిర్ఘోషంబులు సేయుచు మండలంబు సేయుచుండె నట్టిదారుణంబు లైన
యౌత్పాతికంబులు విలోకించి రావణుండును బరమోద్విగ్నుం డయ్యె దేవ
గంధర్వకిన్నరగరుడోరగసిద్ధచారణరక్షోయక్షాదులు విమానస్థు లై నానావిధ
భీమప్రహారంబులచేత రభసంబుగా రణంబు సేయువారి మహాశూరు లగురామ
రావణులను లోకసంవర్తసంస్థితం బైనతదీయయుద్ధంబును విలోకించి మహాద్భు
తంబు నొందుచుండి రప్పుడు. 2648

క. రిపుని వధింపుము దైత్యాధిప యని రాక్షసులు రిపు వధింపుము రామా
ధిప యని వేల్పులు సారెకు, విపులంబుగఁ బల్కి రభ్రవీథి నురవడిన్. 2649

తే. అంత దుష్టాత్ముఁ డైనదశాననుండు
కోపసంరక్తనేత్రుఁ డై ఘోరభంగిఁ
బదిమొగంబులఁ జిడిముడిపాటు గదుర
నృపలలామునిఁ బ్రహరింప నిశ్చయించి. 2650

సీ. వజ్రసారము సర్వవైరినిబర్హణ మసమాన మఖిలభయావహంబు
గిరిశృంగనిభకూటకలిత మతిరవచలితకాలాగ్నినిభప్రభంబు
చటులాగ్నికణధూమసంచారఘోర మనాసాధ్య మతిరౌద్ర మద్భుతంబు
తతసర్వభూతసంత్రాసనంబు దురాసదంబు భేదన మతిదారుణంబు

తే. నైనకాలాయసమయోగ్రమాననీయ
శూల మొక్కటి గైకొని కాలవహ్ని
గతి వెలుంగుచు నిజసైన్యతతికిఁ గడు ము
దం బొసంగుచు ఘోరనాదం బొనర్చె. 2651

మ. అతికాయుం డతిదారుణుం డతిభుజాహంకారుఁ డై నట్టియా
దితిజాధీశుఁడు భూరిరోషము మది న్దీపింపఁ బెల్లుబ్బి యా
గతి నాదం బొనరింపఁ దద్రవముచేఁ గంధు ల్దిశ ల్వ్యోమము
న్గుతలంబు న్మఱి సర్వభూతములు సంక్షోభించె నొక్కుమ్మడిన్. 2652

తే. దశముఖుం డిట్లు శూలాయుధమును గేలఁ
బూని జళిపించుచు నితాంతభూరిరవము
చేత సర్వంబు శోషింపఁ జేసి గర్వ
మెసఁగ నారఘువరునితో నిట్టులనియె. 2653

చ. సురుచిరవజ్రసార మగుశూలముఁ జూచితె రామ నీకుఁ గా
నురవడి మత్కరంబున సముద్యత మయ్యె రణాంగణంబున
న్గర మిది నీదుజీవితము గైకొని లక్ష్మణు గీటణంచి గ్ర
మ్మఱఁ జనుదెంచు నిప్పుడె సమర్థుఁడ వేని దలంకకుండుమీ. 2654

క. ఘనశూలంబున ని న్నని, మొన నిప్పుడు గీటణంచి మును నీచేఁ జ
చ్చినరాక్షసవీరుల యా,ననగళదశ్రుప్రమార్జనం బొనరింతున్. 2655

క. అని పలికి రాక్షసేంద్రుఁడు, కనుఁగొనలఁ బ్రదీప్తవహ్నికణములు రాలం
దనబలముకొలఁది శూలము, మనుజేంద్రునిమీఁద వైచె మంటలు దొరుఁగన్.

వ. ఇట్లు మహాశూలంబు రావణకరోన్ముక్తం బై విద్యుజ్జ్వాలాసమాకులం బై యష్ట
ఘంటామహానాదం బై ఘోరదర్శనం బై మంటలు గ్రక్కుచు భీషణరభసాతి
రేకంబునం దన కభిముఖంబుగా నడరిన నారఘుపుంగవుం డనేకవిశిఖంబులం
బరఁగించి పురందరుండు జలౌఘంబుచేత యుగాంతవహ్నిం బోలెఁ దచ్ఛరా
సారంబున దాని వారించిన నది నరకుగొనక పావకుండు పతంగంబులంబోలె
రామకార్ముకవినిస్సృతసాయకంబుల నన్నింటిని నిజతేజంబున దహించినశూల
సంస్పర్శచూర్ణితంబు లై భస్మసాద్భూతంబు లైననిజశరంబుల నవలోకించి
రాముండు రయంబున· 2657

ఉ. ఆతతకోప మేర్పడ బలారివినిర్మిత మైనదాని న
మ్మాతలిచేతఁ దేఁబడినమానితశక్తిఁ బరిగ్రహించి వి
ఖ్యాతబలుండు గానఁ జులుకం బలుమా ఱటు వీచి వైచె ఘం
టాతతినిస్వనంబులు కడానిమెఱుంగులు మింటఁ బర్వఁగన్. 2658

క. ఈలీల రాఘవునిచేఁ, దోలిత యై యింద్రశక్తి దోడ్తోడ మహో
ల్కాలీల వెలుంగుచుఁ జని, శూలముపైఁ బడియె మింటఁ జుక్కలు రాలన్.

తే. దారుణోదగ్రశక్తిచే దానవేంద్ర, శూల మది భిన్న మై రణక్షోణిఁ గూలె
నవ్విధంబు గనుంగొనియమరవరులు,నగచరులు మెచ్చి రామునిఁ బొగడిరపుడు.

ఉ. అంత రఘూత్తముండు విలయాగ్నిశిఖోపమవజ్రకల్పకా
లాంతకదండతుల్యనిశితాంబకకోటులరథ్యము ల్పరి
క్లాంతము లై కరంబు వికలత్వము నొందఁగఁ జేసి సూతునిం
బంత మెలర్ప శాతశతబాణముల న్వడి నొంచి వెండియున్. 2661

క. మంట లుమియుబాణము లై,దింట నురము మూఁట శిరముదెస యేడింటన్
రెంట నొసలు భుజములు నా, ఱింటం బార్శ్వములు నేసి రేఁగెం గడిమిన్.

ఉ. రావణుఁ డిట్లు జన్యమున రాఘవబాణవిభిన్నగాత్రుఁ డై
కావర మేది దట్టముగఁ గాఱెడునెత్తుటఁ దోఁగి ధాతుజా
లావృతశైలరాజముక్రియం గనుపట్టుచుఁ గోపతాపము
ల్భావమున న్బెసంగొన విషణ్ణత నొంది చలించి వెండియున్. 2663

ఉ. రోషముపెంపునం గనుల రోహితరోచులు నివ్వటిల్లఁగా
భీషణభంగి నేర్పు గనిపింప గుణస్వన మాచరించి ఘో
రేషుపరంపర ల్రఘుకులేంద్రునిపైఁ బరఁగించి ముంచె ని
ర్ఘోషము సేయుచు న్ఘన మకుంఠితవృష్టిఁ దటాకము న్బలెన్. 2664

ఉ. ఆరజనీచరప్రవరుఁ డద్భుతభంగి నిగుడ్చుతూపులం
బూరితగాత్రుఁ డై గిరియుఁ బోలె నకంప్యుఁడు రామభద్రుఁ డే
పారఁ జలింప కర్కుఁడు నిజాంశువులం బెనుచీఁకటింబలెన్
సారశరంబుల న్రిపునిసాయకము ల్విరియించె వ్రేల్మిడిన్. 2665

ఉ. వెండియు రావణుం డలిగి వేయిశరంబులు వింటఁ గూర్చి కో
దండగుణార్భటు ల్సెలఁగఁ దప్పక రామనరేంద్రుమీఁద ను
ద్దండత నేయఁ దద్విశిఖతాడితుఁ డై రవివంశవార్ధిసో
ముం డొగి నెత్తుటం దడిసి పూచినమోదుగుభంగిఁ దోఁచుచున్. 2666

ఉ. వ్రేటునఁ బుట్టుకోపమున వీరవరేణ్యుఁడు లక్ష్మణాగ్రజుం
డేటిప్రతాప మీతని జయింపక యుండిన నంచుఁ గ్రుద్ధుఁ డై
మాటికి వేయు వేయు పటుమార్గణము ల్నిగిడించి గాత్రము
ల్చీఁటలువాఱఁ జేయు చిటు భీషణభంగిఁ బరాక్రమించినన్. 2667

చ. దనుజవరేణ్యుఁ డవ్విధముఁ దప్పక గన్గొని దుర్మదాంధుఁ డై
ఘనతరసాయకావళులఁ గప్పుచు డాసిన నమ్మహారథు
ల్ఘనభుజవీర్యు లవ్విశిఖగాఢతమంబున నెల్లవారికిం
గనఁబడకుండి రప్పు డలుక న్రఘువీరుఁ డొకింతలోపలన్. 2668

చ. గురుతరహేమపుంఖశరకోటులఁ దత్ప్రదరాంధకారము
న్విరియఁగఁ జేసి జన్యమున వీరరసోజ్జ్వలఘోరరూపుఁ డై
యురుతరభంగిఁ గట్టెదుట నున్నదశాస్యుని వేఁడిచూపులం
జుఱచుఱఁ జూచి పల్కెఁ దనశూరత గన్పడ దారుణోక్తులన్. 2669

శ్రీరాములు రావణుతో వీరాలాపంబు లాడుట.

ఉ. ఏమిర రాక్షసాధమ మహీసుత యొంటి వసించి యుండ నీ
వామదిరాక్షిఁ దస్కరుఁడ వై కొని తెచ్చితి వప్పు డాన నీ
కేమియశంబు వచ్చెఁ దుది నిట్టియకార్య మొనర్చి యేను దే
జోమహిమాధికుండ నని శూరులమ్రోల వచించె దెంతయున్. 2670

ఉ. ఓరివివేకహీన పరయోషల బల్మి గ్రహించువానికి
న్దారుణపాతకంబు కులనాశము గర్హణ మార్తియు న్సదా
చారవిరోధము న్గలుగు సత్యము నీ వది గాన లేక నే
శూరుఁడ నంచుఁ బల్కెదిది శూరునికృత్యమె యెంచి చూడఁగన్. 2671

క. నీపాలిమిత్తి యగుధాత్రీపాలకపుత్త్రి నిట్లు దెచ్చి దెలియ కో
పాపాత్మక శూరుఁడ నని, మాపాల వచించె దెంతమతిహీనుఁడవో. 2672

క. ఘనశూరుం డగుధనదుని, యనుజుఁడవు బలాధికుండ వయినందుకు గ్ర

ద్దనఁ బెద్దలు గొనియాడెదు, పనియే గావించితీవు ప్రాజ్ఞుఁడ వరయన్. 2673

వ. మఱియు నుత్సేకంబున ననుష్ఠింపంబడినయీనిందితకర్మంబునకుం దగినఫలం బిప్పుడె యనుభవించెద వదియునుం గాక. 2674

తే. ఘోరకృత్యంబు గావించి శూరవరుఁడ
ననుచు నిను నీవె నుతియించుకొనెద వేల
సిగ్గు లేదించుకైన నీచెయ్వులన్ని
విన్నవారలు గర్హించుచున్నవారు. 2675

తే. అరయ మత్సన్నిధానంబునందు సీత
బలిమి నీచేత ధర్షింపఁ బడియె నేని
యపుడె మత్సాయకంబుల హతుఁడ వగుచు
గొబ్బున ఖరాదిదనుజులఁ గూడఁ జనవె. 2676

చ. ఉడుగక దైవయోగమున నుద్ధతి నాదగుదృక్పథంబునం
బడితివి నేఁడు నిన్నిపుడె బాణముల న్రణభూమిఁ ద్రుంచి యే
పడరఁగ ధర్మరాజపురి కంపెద నిక్కువ మింతలోన నీ
వడిచిపడంగ నేల దనుజాధమ తొల్లిటిపాటు చెల్లునే. 2677

తే. ఆజి మద్బాణనిర్భిన్న మైననీదు
వెడఁదఱొమ్మున నుడుగక వెడలుసాంద్ర
శోణితము గ్రోలి విహగముల్ చొక్కి మింట
కలకలంబులు గావింపఁగలవు నేఁడు. 2678

తే. లలితకోటీరకుండలోజ్జ్వలిత మైన
నీదుమస్తకనికరంబు నేఁడు నాదు
పటుశరంబుల దెగి ధాత్రిఁ బడుచు నుండఁ
గాకఘూకాదికము లీడ్వఁ గలవు నీచ. 2679

తే. ఘోరసంగ్రామతలమునఁ గూలియున్న, నీవిశాలవక్షమ్మున నేఁడు వ్రాలి బాణశల్యాంతరోత్థిత శోణితంబు, తనివి దీరంగ ఖగములు ద్రావఁగలవు. 2680

క. శరభగ్నాంగుఁడ వై సంగరమునఁ బడియున్న నీదుగాత్రంబులు చెచ్చెర నీడ్వఁగలవు ఖగములు, గరుడులు సర్పముల నీడ్చుకరణి దురాత్మా. 2681

క. అని పలికి రాఘవేంద్రుఁడు, దనుజుని వధియింపఁ బూని తద్దయుఁ గినుక న్ఘనశరములు వెదచల్లుచు, ననిమిషకంటకునిఁ గదిసె నాటోపమునన్. 2682

వ. అప్పుడు. 2683

ఉ. సాహసము న్పరాక్రమము శౌర్యముఁ దేజము భూరిసంగరో
త్సాహము సత్త్వసంపదయు సర్వవరాస్త్రవిశేషకౌశలం
బాహవనైపుణంబు విజయస్పృహ ధైర్యము పాణిలాఘవం
బాహయు వృద్ధిఁ బొందె రయ మొప్పఁగ రాముని కంతకంతకున్. 2684

తే. అంత నారఘుపుంగవుఁ డాత్మగతము
లైనశుభచిహ్నములు చూచి మానసమునఁ
బొంగి వింట ఘంటాధ్వనుల్ నింగి ముట్ట
రావణునిమీఁద శరసహస్రంబు నేసె. 2685

ఆహరివీరులు వెంటనె, సాహసమున దనుజుమీఁద, సాంద్రశిలాసం
దోహముఁ బరఁగించిరి పటు, బాహుబలము విక్రమంబు పాటికి నెక్కన్.

వ. ఇట్లు దశగ్రీవుండు రామప్రయుక్తశరౌఘంబులచేత వానరప్రయుక్తశిలానికరంబులచేత నేకకాలంబున హన్యమానుం డై విహ్వలహృదయుం డై శరాసనం బెక్కుపెట్టుటకును సాయకప్రయోగంబు సేయుటకునుసమర్థుండుగాకమూర్ఛాపారవశ్యంబున రథంబుపైఁ ద్రెళ్లె నప్పుడు రామునివీర్యం బప్రతిహతం బయ్యె నప్పుడారావణప్రయుక్తదివ్యాస్త్రంబులు పరిపంథిపరాజయంబునకుంగాక మోఘరయంబులై పఱవం దొడంగెనది యాతనికిమృత్యుకాలంబు సన్నిహితంబగుటను సూచించె నాసమయంబున రావణునిరథచోదకుండు వానిదురవస్థ విలోకించి యచ్చట నుండనీక రయంబున రథంబు దొలంగం దోలుకొనిపోయె నంతఁ గొంతసేపునకు మూర్ఛదేఱికృతాంతబలచోదితుం డై యువివేకంబునసంక్రుద్ధుం డై కన్నులం గెంజాయ రంజిల్ల సూతు నవలోకించి యి ట్లనియె. 2687

—రథంబు తొలఁగం దోలినసారథిని రావణుండు దూఱి నాడుట.—

ఉ. ఓరి దురాత్మ యస్త్రబల మున్నతవీర్యము బాహుసత్త్వము
స్థీరతయు న్పరాక్రమము తేజము శౌర్యము భూరిమాయయు
న్బౌరుషము న్యశంబు పరభావగతిజ్ఞత నాదుసొమ్ము నీ
వారయ లేక యన్నిటికి హాని యొనర్చితి నేల చెప్పుమా. 2688

సీ. అతిమాని నైననాయాశయం బెఱుఁగక భండనంబున వైరి పరిహసింపఁ
దలకొని రథ మేల తొలఁగఁ దోలితి విట్లు నిర్మలం బైనమన్నిబడకీర్తి
దుగ్ధవారాశికిఁ దోడ్తోడ నీచేత హాలాహలముచేతఁ బోలె మిగుల
నురవడి మాలిన్య ముపపాదితం బయ్యె బహుకాలతపమునఁ బడసినట్టి
తే. బలము వీర్యంబు దేజంబు ప్రత్యయంబు
యశము కోల్పుచ్చితివి విక్రమాఢ్యుఁ డైన
రిపునిముంగల నన్నుఁ జాల రిత్తవానిఁ
జేసితివి దుర్యశం బెంత చెందె నేఁడు. 2689

ఉ. విక్రమరంజనీయుఁ డగు వీరుఁడు రాముఁడు చూచుచుండ ని
ర్వక్రగతిం బ్రచండసమరం బొనరింపఁగఁ బూని యున్ననా
విక్రమ మంత నేఁ డడవివెన్నెలచందము నొందె డెంద ని
ట్లక్రమ మాచరించి పురుషాధముఁ జేసితి విప్డు దుర్మతీ. 2690

చ. దివిజవిరోధి నీతెఱఁగు తెల్లముఁ జేసితి శత్రుపక్షపా
తివి నినుఁ దేరుఁ దోలుటకుఁ దేకువఁ దోడ్కొని వచ్చినందుకై
బవరమునందు మాకుఁ దలవంపులు చేసితి వౌర యింత వాఁ
డ వని యెఱింగియున్న జగడంబునకుం గొని తేక యుండనే. 2691

క. నీ వొనరించినకృత్యము, భావింపఁగ నాకు మేలొ పరిపంథికి మే
లో వివరింపు మిది హితము, గావింపఁ దలంచువానికార్యమె తలఁపన్. 2692

—సూతుండు రావణుకోపం బుపశమిల్ల నాడుట.—

క. అరి రాక మున్న గ్రక్కున, మరలింపుము సమరమునకు మామకరథముం
జిరకాలంబున నుండియు, నెఱుఁగవె మన్నిష్ఠగుణము లెల్లను సూతా. 2693

క. అని యిటు మతిహీనుం డై, దనుజకులవిభుండు కోపతాపంబునఁ బ
ల్కిన మతిమంతుం డగువాఁ, డనియె మరల సతనితోడ సానునయోక్తిన్.

ఉ. భీతుఁడఁ గాను శత్రుకృతభేదము నొందినవాఁడఁ గా నవి
ఖ్యాతుఁడఁ గాను బాలిశుఁడఁ గాను బ్రమత్తుఁడఁ గాను దేవదు
ర్జాతుఁడఁ గాను విప్రియము సల్పినవాఁడను గాను దుర్గుణ
వ్రాతుఁడఁ గాను నన్నుఁ గడవానిఁగ మీ రిటు దూఱ నేటికిన్. 2695

వ. రాక్షసేంద్రా హితకాముఁడ నైనయేను యశంబు రక్షించుకొఱకు స్నేహప్రస
న్నచిత్తంబునఁ బ్రియంబె కావించితి నది నీ కప్రియం బై తోఁచె నీయర్థంబు
నందుఁ బ్రియహితుండ నైననాయందు లఘుచిత్తుం డైనయనార్యునియందు
నుంబోలె దోషారోపణంబు గావింపం దగదు సంగ్రామంబున నిమ్మహారథంబు
చందోద్రియప్రవర్ధమానసముద్రోదకంబుచేత నదీవేగంబుకరణి నాచేత విని
వర్తితం బైననిమిత్తం బెఱింగించెదఁ గోపం బుజ్జగించి వినుము మేను ఘోరం
బైనమహాయుద్ధకర్మంబున బడలితి నీవును వీర్యసుముఖత్వంబును రణోత్సాహం
బును విడిచి శత్రుప్రహారపీడితుండ వై యలసి రథంబుమీఁదం బడితివి రథ్యం
బులు రథోద్వహనఖన్నంబు లై స్రుక్కి ఘర్మజలంబులం దోఁగి వృష్టిహతంబు
లైనగోవులపగిది దీనదశకు వచ్చె మఱియు నెయ్యెడం జూచిన మనకుఁ బ్రతి
కూలనిమిత్తంబులు వొడమె రథంబు గడపుసారథియగువాఁడు దేశకాలంబులు
నస్త్రశస్త్రప్రయోగశైఘ్ర్యమాంద్యాదికంబులును శుభాశుభనిమిత్తంబులును
ముఖప్రసాదవైవర్ణ్యాదికంబులును ధైర్యంబును దైన్యంబును ఖేదంబును
హర్షంబును బలాబలంబులును భూమియందు స్థలనిమ్నంబులును సమవిషమం
బులును యుద్ధకాలంబును బరచ్ఛిద్రదర్శనంబును సమీపగమనపశ్చాద్గమనంబు
లును స్థానంబును నపసర్పణంబును గ్రమంబున నెఱింగి రథంబు గడపవలయు
నీకును రథాశ్వంబులకు విశ్రాంతి సంపాదించుతలంపున దుస్సహం బైనఖేదం
బుఁ బాపుటకు రథంబుఁ దొలంగం దోలితి నిది యుక్తంబె గాక యయుక్తంబు

గా దకారణంబుగా నిప్పని యొనరించినవాఁడఁ గాను భర్తృస్నేహపరుండ నై గావించితి నింకనీచెప్పినట్లు సూతకృత్యంబు గావించి ఋణంబుఁ బాపికొనియెద నానతిమ్మనిన నద్దశగ్రీవుం డతనివాక్యంబున సంతుష్టుండై రణలుబ్ధుండుగావున బహుప్రకారంబుల వానిం బ్రశంసించి రావణుండు నేఁడు రణంబున శత్రుని వధింపక గాని మరలండు రయంబున రథంబు రామునిసమ్ముఖంబునకుం దోలు మని పంచి యనర్ఘం బైనయొక్కహస్తాభరణం బొసంగిన నతండు పరమప్రీతుండై యుగ్యంబులపగ్గంబులు వదలి యమోఘరయంబున రథంబు రాముని సమ్ముఖంబునకుం దోలుకొని వచ్చె నంతకు మున్నె వేల్పులతోఁ గూడ రణం బువిలోకించుటకుంజనుదెంచి గగనమార్గంబున నున్నయగస్త్యుండప్పుడు యుద్ధ పరిశ్రాంతుం డై రావణవధోపాయంబు చింతించుచున్నరామునిం జూచి పదం పడి రణార్థంబు సముపస్థితుం డైనరావణుని విలోకించి రయంబున రామునికడ కుం జనుదెంచి స్వవీర్యోపబృంహణంబుకొఱకు నాదిత్యహృదయనామకం బైన స్తోత్రం బుపదేశించుతలంపున నిట్లనియె. 2696

శ్రీరాములకు నగస్త్యుం డాదిత్యహృదయం బుపదేశించుట.

సీ. దశరథతనయ యెద్దాని జపించినఁ గలన శత్రుజయంబు గలుగు నట్టి
యాదిత్యహృదయాఖ్య మగుస్తోత్ర మిపు డుపదేశింతు దానిఁ బ్రతిగ్రహింపు
మది గుహ్య మది పుణ్య మది విజయావహం బది శత్రునాశన మదియు జప్య
మది శివ మక్షయ్య మది సర్వమంగళమాంగళ్యమును బరమంబు సర్వ
తే. తాపనాశంబు శోకచింతాప్రశమన, ముత్తమం బప్రతర్క్యమాయుష్కరంబు
వీర్యవర్ధన మంచితైశ్వర్యకరము, నిఖిలపాపప్రణాశంబు నిర్మలాత్మ 2697
వ. మఱియు నాదిత్యమండలమధ్యవర్తిపరమపురుషప్రతిపాదకంబగుటవలననమ్మహా
స్తోత్రం బాదిత్యహృదయసంజ్ఞికం బయ్యెఁ గావున. 2698
క. పరమాంతరంగభక్తాంతరమున భాసిల్లువానిఁ దప్పక దేవా
సురనరగరుడోరగముని, వరుల కుపాసింపఁదగినవాని న్మతియున్. 2699
క. ధర్మము సంస్థాపించుట, కర్మిలి యుగయుగమునందు నభినవఫణితి
న్నిర్మలమతిఁ బుట్టి విహిత, కర్మము నడిపించునట్టి కారుణ్యనిధిన్. 2700
క. నిరతిశయదీప్తిమంతుని, సురుచిరముగఁ జంద్రవహ్నిసూర్యాదులకున్
వరదీప్తి యొసఁగువానిని, బురుషోత్తము భువనపతిని బూజింపు మొగిన్. 2701
తే. ఇతఁడు సర్వదేవాత్మకుం డితఁడు రశ్మి,భావనుఁ డితండు తేజస్వి పరమపురుషుఁ
డమరులను విష్టపంబుల ననవరతముఁ, దనగభస్తులఁ బాలించుదాత యితఁడు.
తే. విష్టపంబుల సృజియించువిధి యితండు
పరఁగ నన్నిటిఁ బాలించుహరి యితండు
వరుస నన్నిటి గ్రసియించుహరుఁ డితండు
మూఁడుమూర్తుల కిరవైనమూల మితఁడు. 2703

తే. శత్రుశోషణ మొనరించు చతురుఁ డితఁడు, మణ్మఖాకృతి గైకొన్న జాణ యితఁడు
వసుధలోఁ బ్రజాపతిశబ్దవాచ్యుఁడితఁడు, వర్ణితైశ్వర్యమున నిరవధికుఁ డితఁడు.

తే. ఇతఁడు లోకసంహారకుం డితఁడు వేద, సిద్ధసర్వఫలప్రదుఁ డిద్ధయశుఁడు
సర్వకారణమయసోమశబ్దవాచ్యుఁ,డితఁడు సమవర్తి యితఁడపాంపతి యితండు.

క. ఋతు వితఁడు కర్త యీతం,డితఁడు వసువు లితఁడు సాధ్యు లితఁడు మరుత్తుల్
పితరులు వాయువు వహ్నియు, నితఁ డాశ్విను లితఁడు ప్రాణమితఁడు మనువగున్.

వ. వత్సా స్తోత్రప్రకారం బెఱింగించెద నీవు సమాహితుండవై సూర్యమండల
మధ్యవర్తి యైనపరమపురుషు నుద్దేశించి దేవా నీవ శేషవిషయభోక్త వగుటం
జేసి యాదిత్యుండవు సమస్తజగంబునకుఁ బ్రేరకుండ వగుటం జేసి సవితవు కర్మ
ప్రేరకుండ వగుటం జేసి సూర్యుండవు పరమాకాశగతుండ వగుటం జేసి ఖగుం
డవు స్థితికర్త వగుటం జేసి పూషుండవు సర్వవ్యాపిని యగులక్ష్మిగలవాఁడ వగు
టం జేసి గభస్తిమంతుండవు పక్షవంతుండ వగుటం జేసి సువర్ణుండవు సర్వతప
నుండ వగుటం జేసి తపనుండవు సర్వంబును వెలుంగం జేయువాఁడ వగుటం జేసి
భానుండవు హిరణ్మయం బైనయండోత్పాదకద్రవ్యంబు గలవాఁడ వగుటం జేసి
హిరణ్యరేతసుండవు అజ్ఞాననివర్తనపూర్వకంబుగా జ్ఞానంబుత్పాదించువాఁడవగు
టంజేసి దివాకరుండవు మనోహరగరుడవాహనంబుగలవాఁడవగుటంజేసి హరి
దశ్వుండవు అనంతకళ్యాణగుణవంతుండ వగుటంజేసిసహస్రార్చివిసప్తాఖ్యసప్తి గల
వాఁడ వగుటం జేసి సప్తసప్తివి శంఖచక్రగదాధరుండ వగుటం జేసి మరీచిమం
తుండవు జ్ఞానోత్పత్తిప్రతిబంధకదోషనివర్తకుండ వగుటం జేసి తిమిరోన్మథనుం
డవు నీవలన సుఖంబు గలుగుటవలన శంభుండ విరువదియొక్కమాఱు వెదకి
ధరణీచక్రం బక్షత్రంబు గావించినవాఁడ వగుటంజేసి త్వష్ట వచేతనం బైన
బ్రహ్మాండంబు జీవింపఁజేయుటంజేసి మార్తాండుండ వంతర్బహిర్వ్యాప్తిమం
తుండ వగుటంజేసి యంశుమంతుండవు సకలజగదుత్పాదకసమష్టిజీవజాతంబు
గర్భంబునందుఁ గలవాఁడ వగుటంజేసి హిరణ్యగర్భుండవు తాపత్రయసంతప్తు
లగువారికి విశ్రమస్థానంబ వగుటంజేసి శిశిరుండవు విరోధిసంతాపకరుండ వగు
టంజేసి తపనుండవు సర్వవస్తుసాక్షాత్కారహేతుభూతుండవైనలోకకర్తవగు
టంజేసి భాస్కరుండవు సర్వప్రాణులచేత స్తూయమానుండ వగుటవలనను దేవ
తల కుపదేశించువాఁడ వగుటవలనను రవివి కాలాగ్నిరుద్రుండు గర్భంబునందుఁ
గలవాఁడ వగుటంజేసి యగ్నిగర్భుండవు పురందరునిరక్షించువాఁడ వగుటంజేసి
యదితిపుత్రుండవు నిరవధికానందవంతుండ వగుటంజేసి శంఖుండవు సూర్యరూ
పంబున హిమంబు నాశంబు నొందించువాఁడవు గావున శిశిరనాశనుండవు తా
మసాహంకారరూపంబున నాకాశస్రష్ట వగుటంజేసి వ్యోమనాథుండవు భక్తుల
తమోగుణంబు భేదించువాఁడ వగుటంజేసి తమోభేదివి సకలవేదపర్యవసాన

భూమి వగుటం జేసి ఋగ్యజుస్సామపారగుండవు నీవలన సకలకర్మఫలంబు లధి
కంబులై నెగడుం గావున ఘనవృష్టివి మహార్ణవశాయి వగుటం జేసి యహామి
త్రుండవు ముక్తప్రాపకుండు వగుటం జేసి వింధ్యవీథీప్లవంగముండవు జగన్నిర్మాణ
సంకల్పంబు గలుగుటం జేసి యానశివికౌస్తుభాదికంబు గలుగుటం జేసి మండలివి
మృత్యుశరీరకుండ వగుటం జేసి మృత్యువవు సుశీలుండ వగుటం జేసి పింగళుండ
వేకకాలంబున సకలాంశసంహారకుండవు గావున సర్వతాపనుండవు విదితాఖిల
వేద్యుండవు గావునం గవివి విశ్వశరీరకుండవు గావున విష్ణుండవు నిరవధికపరాభి
భవసామర్థ్యంబు గలవాండవు గావున మహాతేజుండవు సర్వరంజకుండవు గావున
రక్తుండవు సర్వజగదుత్పత్తిహేతుభూతుండవు సర్వభవోద్భవుండవు నక్షత్రగ్ర
హతారకాంతర్యామివి గావున నక్షత్రగ్రహతారకాధిపుండవు విశ్వస్థితికారణం
బవు గావున విశ్వభావనుండవు ప్రశస్తతేజస్వివి గావునం దేజోవంతులకుం దేజం
బొసంగువాండవు ద్వాదశమండలాంతర్వర్తివి గావున ద్వాదశాత్మకుండ వట్టినీకు
నమస్కారంబు గావించెద. 2707

సీ. పూర్వపశ్చిమమహాభూధరాంతర్యామి కత్యంతముక్తజనాధివిభున
కప్రతిహతవిక్రమాధికునకు నుపాసకుల నానాకిల్బిషంబు లడంచి
కళ్యాణ మొసంగెడుఘనున కవ్యయునకు హరివాహనునకు దినాధిపతికి
నాదిత్యునకును సహస్రజీవున కనుపాసకోగ్రునకు శుభప్రదునకు

తే. వీరవరునకు హంసావతారునకును, బ్రణవమునం బ్రతిపాదింపంబడెడువాని
కనవరతము సారగ్రాహి యైనవాని, కంనముగ నేను గావింతు వందనములు.

తే. తగ నచేతన మైనయీజగము నెల్లం, జేతనత్వం బొసంగి రక్షించువాని
కర్థిం బద్మప్రబోధకుం డైనవాని, కంచితంబుగ వినతి గావించువాండ. 2709

తే. సృష్టిసంహారసంస్థితు లేయునట్టి, యజహరాచ్యుతులకు విభుం డైనవాని
కఖిలయజ్ఞస్వరూపకుం డైనవాని, కంజలి ఘటింతు నతిభక్తి ననవరతము. 2710

తే. అఖిలకర్మసంప్రేరకుం డైనవాని, నగణితదినేశతేజుం డైనట్టివాని
నమితసౌందర్యవిగ్రహుం డైనవాని, నఖిలమఖభోక్త యగువాని నాశ్రయింతు.

. అరిసంహారార్థము నర, హరిరూపము దాల్చినట్టియధిపునకుం దమో
హరునకు రవిరూపంబున, సురుహిమము నడంచువాని కొనరింతు నతుల్.

. తనయంతం దానె వెలింగెడు, ఘనునకు విజితేంద్రియునకుం గలికల్మష నా
శనున కఖిలసురరూపున, కనంతమహిమాధికునకు నభివందనముల్. 2713

తే. కల్పితాజ్ఞానతిమిరవిఖండనునకు, విశ్వకర్మకు వేదాంతవేద్యునకును
బరమగతికి హిరణ్మయపురుషునకును సర్వసాక్షికి మ్రొక్కెద సంతతంబు.

వ. అని యిట్లు స్తోత్రంబు గావింపుము ఘటజయు నితండు మహాప్రళయంబున సర్వ
భూతంబుల నాశంబు నొందించి పదంపడి కర్మసహాయంబుగా సృజించి సూర్య

రూపంబు దాల్చి గభస్తులచేత సర్వరసంబుల నాకర్షించి క్రమ్మఱ వర్షించుచుఁ బ్రవర్ధమాననానావిధౌషధులచేత రక్షించుచుండు సదియునుంగాక యితండు భూతంబులయం దంతర్యామిత్వంబున నుండి సుషుప్తిసమయంబునఁ దనయం తం దాను బ్రకాశించుచుండు. 2715

తే. అగ్నిహోత్రఫలంబు నయ్యగ్నిహోత్ర
మధ్వరంబులు వేదంబు లధ్వరఫల
మితఁడు సర్వకార్యములకుఁ బతి యితండు
సకలభువనంబులకుఁ బ్రవర్తకుఁ డితండు. 2716

తే. కాననములందు ఘోరసంకటములందు
భయమునం దాపదలయందు భక్తితోడ
నితని భజియించుపురుషుఁ డొకించుకైన
వంత నొందక కుశలి యై వఱలు నధిప. 2717

మ. అనుమానింపక నీవు భక్తి నిపు డేకాగ్రుండ వై విశ్వరూ
పుని విశ్వాత్ముని దేవదేవు నితనిం బూజించి ముమ్మాఱు లీ
వినుతస్తోత్ర మొగిం జపింపు మటు గావింపన్ రణోర్విం దశా
ననుఁ డీల్గు న్విజయంబు నీకుఁ గలుగుం దథ్యంబు రాజోత్తమా. 2718

ఆదిత్యుండు రామునకుఁ బ్రసన్నుం డగుట.

మ. అని యిట్లామునిరాజు పల్కి రయ మొప్పారన్నభోవీథికిం
జనియెం బిమ్మట రాఘవుండు ఘననిష్ఠాయుక్తుం డై సమ్మదం
బున నీరంబుల వార్చి కుంభభవుఁ డామోదంబు మీఱ న్వచిం
చినభంగి న్రవిఁ జూచి స్తోత్రము పఠించె న్భక్తి ముమ్మాఱొగిన్. 2719

వ. ఇవ్విధంబున నారఘుపుంగవుం డాదిత్యహృదయంబు పఠించిన నయ్యాదిత్యుం డు పరమానందపులకితగాత్రుం డై రావణనాశంబు నిశ్చయించి నిజమండలంబు వలన నిర్గమించి సమీపంబునకు వచ్చి గగనంబునందుండి రామభద్రు నవలో కించి వత్సా శీఘ్రంబున దశగ్రీవుని వధియింపు మని వేగిరపడి పలికిన నక్కా న లేయుండు నష్టశోకుం డై రయంబున మహనీయకోదండం బందుకొని సర్వ యత్నంబున రావణునివధంబునందు దృఢనిశ్చయంబుఁ జేసి యుద్ధాభిముఖుం డై తనకట్టెదుటఁ బరసైన్యప్రధర్షణం బై గంధర్వనగరాకారం బై సముచ్ఛ్రితపతా కాలంకృతం బై హేమాభరణభూషితపరమసంపన్నకృష్ణాయుక్తం బై ధనుఃకవ చాదియుద్ధోపకరణసంపూర్ణం బై రాక్షససైన్యహర్షణం బై మహాధ్వజోపేతం బై మహానాదం బై యనంతకాంతిబహుళం బై తటిత్తుల్యపతాకాసంకీర్ణం బై యింద్రాయుధసదృశసర్వాయుధపరిష్కృతం బై మేఘసంకాశం బై వర్షాంబు దంబు ధారాసారంబుంబోలె శరధారాసారంబు గురియుచు గగనంబున నుహ్యా

మానం బైనమహావిమానంబుపోలికిఁ జూపట్టుచు నుహీతలంబు బ్రద్దలువాఱ గగనంబు మ్రింగం జనుదెంచుచున్న దానిపోలికిఁగింకిణీజాలనిర్ఘోషభీషణంబుగా మహావేగంబున వజ్రాభిహతగిరిస్వనసదృశస్వనం బై యపసవ్యంబుగాఁ జనుదెంచుచున్న రావణునిరథంబుఁ జూచి రాముండు బాలచంద్రనతం బైనధనువు సారించి భీషణప్రకారంబున గుణప్రణాదంబు సేయుచు సహస్రాక్షసారథి యైన మాతలి నవలోకించి యి ట్లనియె. 2720

చ. ఖలుఁ డగురాక్షసాధమునికాంచనచిత్రరథంబు గ్రమ్మఱ
న్వలగొని భూరివేగమున వచ్చుచు నున్నది ఘోరభంగి మా
తలి గనుఁగొంటె నేఁ డని నితం డిపు డాత్మవధార్థ మీగతిం
దలఁకొని యున్న తెంపు బెడిదంబును గన్పడుచున్న దెంతయున్. 2721

ఉ. మానద యేను జన్యమున మారుత మభ్రసముత్థితాభ్రము
న్మానక పాఱఁదోలినక్రమంబున వీని వధింపఁబూనితి
న్మానుగ నీవు నేఁ డిటఁ బ్రమాదము మాని రథంబు వీనితే
రానఁగఁ దోలు మాఱుగ రయంబున నీచతురత్వ మేర్పడన్. 2722

తే. సంభ్రమము మాని రశ్మిసంచారనియతి
గలిగి వైక్లబ్య ముడిగి వ్యగ్రతయు వీడి
హృదయమును వీక్షణంబులు చెదరనీక
రథము దోలుము సవ్యమార్గమున నిపుడు. 2723

చ. హరిహయునంతవానికి సురాసురయుద్ధములందు శంక లే
కరుదుగఁ దేరు దోలినమహాచతురుండవు నీకు నేరుపు
ల్వరుస గణింపఁగా వలెనె వైరివధం బొనరింపఁ గోరి నేఁ
గఱపితి జ్ఞాపకార్థ మిటు గ్రమ్మఱ శిక్షకుఁ గాదు మాతలీ. 2724

చ. అని యిటు రాఘవుండు వినయంబునఁ బల్కిన హృష్టచిత్తుఁ డై
ననయుఁడు శక్రసూతుఁ డలచక్రసముత్థితధూళిఁ గప్పుచుం
దనుజకులప్రదీపుని రథం బపసవ్యముఁ జేసి ఘంటికా
ధ్వనులు చెలంగ మారుతజవంబునఁ దేరటు దోలె నుద్ధతిన్. 2725

ఉ. ఆరజనీచరప్రవరుఁ డావిధ మంతయుఁ జూచి తామ్రవి
స్ఫారితనేత్రుఁ డై పటునిశాతమహోగ్రశిలీముఖావళుల్
ఘోరముగా రథప్రతిముఖుం డగురామునిమీఁద నేయ నా
భూరమణుండు కోపరసపోషితదుస్సహభూరితేజుఁ డై. 2726

చ. రయమున నైంద్రచాపము తిరంబుగ సజ్య మొనర్చి కాండము
ల్నియతి దలిర్ప నాకసము నిండ ననేకము లేయుచు న్వడి
న్భయదగతి జ్జెలంగె నిటు పట్టుగఁ దార్కొని యమ్మహారథు
ల్జయము దలంచుచు న్హరులచందమున న్వడిఁ బోరి రుద్ధతిన్. 2727

రావణునకు దుర్నిమిత్తంబులు రామునకు శుభనిమిత్తంబులుం దోచుట.

తే. అప్డు రావణవధకాంక్షు లైనదేవ, గరుడగంధర్వసిద్ధులు పరమమునులు
రామరావణసంగరక్రమముఁ జూడ, వచ్చి వినువీది నుండిరి వరుసతోడ. 2728

వ. ఆసమయంబున దశగ్రీవునినాశంబు తెలియంజేయుచుఁ గొన్ని దారుణోత్పా
తంబులు దోఁచెఁ బర్జన్యుండు రావణునిరథోపరిభాగంబున సాంద్రంబుగా రుధిర
వర్షంబు గురిసె రావణునిదృష్టి లోపింపఁ జేయుచు నపసవ్యంబుగా రజోవా
తంబులు సుడిసె గృధ్రంబులు గుంపులుగట్టి రాక్షసేంద్రునిశీర్షోపరిభాగం
బునం బరిభ్రమించుచు నతనిరథంబు చనినచోటికెల్లం జనుచుండె జపాపుష్ప
సన్నికాశమైనసంధ్యచేత లంకాపురంబు సమావృతంబగుటం జేసి పర్వతభూమి
యంతయు రాత్రియం దగ్నిచేత సంప్రదీప్తమైనక్రైవడిఁ బవటియందునుం
బ్రదీప్తమై చూపట్టె మహోల్కాసమన్వితంబులై నిర్ఘాతంబులు వడియె రావ
ణునిహితు లగురాక్షసులకెల్ల విషాదంబు నొడమె లంకాసహితంబుగా మహీ
చక్రంబు చలించె రణంబు గావించురాక్షసుల బాహువులు ప్రగృహీతంబు
లైనమూడ్క స్తబ్ధంబు లయ్యె శిలోచ్చయధాతువులవలెఁ దామ్రపీతాసితశ్వేత
రూపంబు లగుచు రవికిరణంబులు రావణునియంగంబునం బడియె శివాగణం
బులు గృధ్రంబులతోఁ గూడి వదనంబులం బావకజ్వాలలు గ్రక్కుచు రావ
ణుని విలోకించి ఘోరంబుగా రోదనంబు సేయుచుండె రాక్షససైన్యంబుమీఁద
శక్రాశనులు సాంద్రంబుగాఁ బడియె రక్తమేఘంబులు దారుణంబుగా గర్జించు
చుండె దిక్కులఁ దిమిరంబు నెఱసె సాంద్రరజోవర్షంబుచేత గగనంబు దుర్దర్శం
బయ్యె శారికలు పరస్పరంబు కలహించి భయంకరారావంబు సేయుచు శత
సంఖ్యాతంబులై దశగ్రీవునికిరీటంబులమీఁద వ్రాలె రావణునిరథతురగం
బులు జఘనంబులవలన వహ్నికణంబులును నేత్రంబులవలన బాష్పకణంబు
లును నించె నిట్లు బహుప్రకారంబుల భయావహంబులైనమహోత్పాతంబు
లనేకంబులు దోఁచెఁ బదంపడి రామునకు విజయంబు సూచించుచు దక్షిణ
నయనోరుబాహుస్ఫురణాదిశుభనిమిత్తంబు లనేకంబులు దోఁచె నంత నారఘు
పుంగవుండు నిమిత్తకోవిదుండు గావున నాత్మగతంబులైనశుభనిమిత్తంబు
లన్నియు విలోకించి నిక్కంబుగాఁ దనకు విజయంబు గలుగు నని నిశ్చయించి
దశగ్రీవు నిహతుండైనవానిఁగాఁ దలంచి పరమసంహృష్టుండై తొల్లింటికంటె
ద్విగుణీకృతంబైనవిక్రమం బంగీకరించి హర్షవికసితవదనుండై శరాసారఘో
రంబుగా రావణుం గదిసి విజృంభించిన నారామరావణులకు సర్వలోకభయా
వహంబైనద్వంద్వయుద్ధంబు ప్రవర్తిల్లె నప్పు డమ్మహాద్భుతసంగ్రామంబుఁ
జూచి రాక్షససైన్యంబును వానరసైన్యంబును నానాప్రహరణాలంకృతభుజం
బయ్యు నమ్మహారథులద్వైరథరణంబు విలోకించుతలంపున నొండొరులతోడం
బోరక రణంబుసాలించి ఱెప్పవ్రేయక తప్పక దశగ్రీవదాశరథుల విలోకించుచు

విస్మితబుద్ధియై చిత్రప్రకారంబున నిశ్చేష్టంబై యూరక సూచుచుండె నివ్విధం బునం దలపడి రామరావణులు మహావేగం బంగీకరించి నిర్భయులై తమతమ వీర్యం బంతయు నానాప్రకారంబుల నొండొరులకుం జూపుచుఁ బరస్పరజయ కాంక్షులం బోరుచుండి రప్పుడు. 2729

—రామరావణుల ద్వంద్వయుద్ధము.—

మ. దనుజాధీశ్వరుఁ డల్గి దారుణభుజాదర్పం బెలర్పం బ్రచం
డనిశాతాశుగము ల్సురేంద్రుధ్వజదండం బుద్ధతిం దాఁక నే
సిన నయ్యంబకము ల్మరుద్ధ్వయముతో శీఘ్రంబునం బోయి కే
తనశక్తి న్బ్రథశక్తిఁ గాంచి ధరమీఁద న్వ్రాలె మోఘంబులై. 2730
మ. క్షితినాథుం డది చూచి లోచనములం గెంజాయ రంజిల్లఁగాఁ
బ్రతికారం బొనరింపఁ బూని పటుచాపం బట్టె సారించి య
ప్రతిమానోగ్రశిలీముఖం బొకటి రౌద్రస్ఫూర్తి మీఱ న్నభో
గతదైత్యేంద్రరథాంగకేతనము దాఁకన్వేగ యేసె న్వడిన్. 2731
ఉ. రామకరప్రయుక్తశరరాజము మంటలు గ్రక్కుచు న్ఫణి
స్వామి తెఱంగునం బటుజవం బడరం జని యామినీచర
స్వామిరథోపరిస్థితవిశాలమణిధ్వజ ముర్విఁ గూల్చి యు
ద్దామగతి న్రసాతలము దాఁకఁగ బ్రద్దలువాపె మేదినిన్. 2732
మ. రథకేతూన్మథనంబుఁ జూచి ఘనుఁ డారక్షోవిభుం డక్షులం
బ్రథితక్రోధజవిస్ఫులింగములు రాల న్బ్రజ్వలన్మూర్తియై
ప్రథనోర్విం గరలాఘవంబున లసద్బాణంబులాశైలభి
ద్రథరథ్యంబులు దాఁక నేసెఁ బటుదోర్గర్వం బఖర్వంబుగన్. 2733
ఉ. రాక్షసరాజసాయకపరంపరలం బరివిద్ధమై సహ
స్రాక్షరథాంగవాజినివహం బవుడించుక డైనెఁ దత్ప్రభ
త్క్షతజాతఖేద మది గానక స్రుక్కక స్థైర్యయుక్తమై
దక్షతఁ జూడ నొప్పె సుమదామమహాతేభగణంబుచాడ్పునన్. 2734
సీ. అమరేశుఁ డవ్విధ మంతయు వీక్షించి క్రుద్ధుఁడై వెండియు ఘోరభంగి
శరవృష్టి గురియించి చలమునఁ దోర్దర్పడఁ బరిఘగదాచక్రపరశుకుంత
ముద్గరతోమరముసలపట్టసశూలభిండివాలప్రాసగండశైల
పాదపాసారంబుఁ బరుకడి నిగిరించి మఱియు వెంటనె దైత్యమాయఁ బన్ని
తే. నిఖిలశస్త్రాస్త్రవర్షంబు నిసుడఁ జేయ
నవి తుములమై భయంకరమై మహోగ్ర
నినదమై దిక్కులు నభంబు నిండి శస్త్ర
మయము గావించె భూనభోమధ్య మెల్ల. 2735

చ. దివిజవిరోధి వెండియును దెంపును బెంపును రోస మీను లా
ఘవము పరాక్రమం బెసఁగఁ గాండసహస్రము లానరేంద్రుపై
నవిరళభంగి నేసిన రయాతిశయంబున నాప్పృషత్కము
ల్రవికులుతేరు దాఁటి యవలం గపిసైన్యము ముంచె నుద్ధతిన్. 2736

క. నరవిభుఁ డరిశరలాఘవ, కరలాఘవములను జూచి గ్రక్కునఁ దాను
న్సరిలేనివీర్యమున భా,సురగతిఁ దనచేతిబలువుఁ జూపినయంతన్. 2737

ఉ. ఆరఘువంశశేఖరుని హస్తమహత్త్వమొ మంత్రశక్తియో
యారయ భూరికార్ముకమహత్త్వమొ దాని నెఱుంగరాదు సొం
పార నమోఘసాయకసహస్రపరంపర లుప్పతిల్లి దు
ర్వారగతి న్దిశల్ నభము వారక నిండె నొకింతలోపలన్. 2738

క. వసుధేశశరార్దితులై, పస చెడి రాక్షసులు మ్రోడుపడి యుండిరి సొం
పు సెడంగ జంగపురువులు, ముసరిన నేరంజవృక్షములచందమునన్. 2739

క. జనపతిబాహాటోపము, గనుఁగొని దైత్యేశ్వరుండు కలుషించి రయం
బున సాంద్రశరాసారం, బినవంశజుమీఁదఁ గురిసె నినుమడిగాఁగన్. 2740

తే. నరవిభునిసాయకములు దానవునిశరము, లాకసము నిండి తన్మహాహవవిధంబుఁ
జూడవచ్చినవేల్పులచూడ్కు లుర్వి, నాట నీ కడ్డగించె నేపాటిరణమొ. 2741

క. మనుజపతిశరము సోఁకని, దనుజుం డొక్కరుఁడు లేఁడు దనుజశరము సోఁ
కనికపి యొక్కఁడు లేఁ డే,మని సెప్పుదు వారివిక్రమాధిక్యంబున్. 2742

క. వలపట దాపటఁ దిరుగుచుఁ, జలమున జడివాన గురియుచందంబున ని
ట్టలముగ శరములు గురియుచుఁ, బలుతెఱఁగుల నాకసంబు బంధించి రొగిన్.

తే. రామరావణముక్తమార్గణములందు, నిష్ఫలము భేద్య మవిభేత్తనిర్నిమిత్త
మైనశరమొక్కటైన లేదరసిచూడఁ, బరఁగ నన్యోన్యహతము లై ధరణిఁబడియె.

క. పాదస్వనములు ఘంటా, నాదంబులు భూరిసింహనాదంబులు జ్యా
నాదము లపు డేకం బై, భేదించె నభంబు దిశలుఁ బృథివీతలమున్. 2745

క. ఒండొరులమీఁద నడరుచు, నొండొరులహయాలిమీఁద నుగ్రాంబకము
ల్మెండుగఁ గురియుచు సూతుల, గం డడచుచు నిరువు రుగ్రగతిఁ బోరి రొగిన్.

క. ఆయుద్ధమేమి సెప్పుదుఁ, బాయక వీక్షించునట్టి పరులకు భయసం
ధాయక మై శూరజన, ధ్యేయం బై ముజ్జగంబు లిట్టటు చేసెన్. 2747

క. ఒండొరులఁ జంపఁ దివురుచు, గండుమిగిలి యొండొరులనుగదియుచు మిగులఁ
గుండె లవియ గర్జించుచు, భండన మొనరించి రపుడు పటుశౌర్యమునన్.

క. హుంకారంబులు బాహా,హంకారంబులు పరస్పరాకృష్టధను
ష్టంకారంబులు మీఱ భ,యంకరగతి రణ మొనర్చి రపు డారథికుల్. 2749

క. నొగ నొగయు హయము హయమును, వగురీతి సిడంబు సిడముదాఁక రథంబు

ల్నిగిడించి సాహసంబున, జగడం బొనరించి రఘుడు జగములు మెచ్చన్. 2750

క. శరవర్షము గురియించుచు, సరభసగతి నడుపువారి స్యందనములు సం
గరముఖమునఁ గన నయ్యెను, దఱుచుగ సాసారవారిధరములపోల్కిన్.

తే. రోషవీర్యప్రవృద్ధస్వరూపు లగుచు, దారుణంబుగ నని సేయువారిఘోర
రూపములు లయకాలాగ్నిరుద్రరూప,ముల తెఱంగునఁ గనుపట్టె [illegible]

క. మున్నెన్నఁ డిట్టికయ్యము, గన్నది విన్నదియు లేదు కడుఘోరం [illegible]
యున్న దని సురలు మును ల,భ్యున్నతగతి సన్నుతించు చుండిరి [illegible]

వ. ఇట్లు మహాద్భుతప్రకారంబునం దలపడి రామరావణులు సూతసారథ్యనైపుణ్యం
బున రథంబు లప్రతిహతగమనంబు లై సంచరింప మండలీకృతకోదండ [illegible] తం
డోపతండంబులుగాఁ గాండంబులు నిగిడించుచుఁ బ్రచండభంగి మండలంబు
లును వీథులును గతప్రత్యాగతంబులును బ్రవర్తననివర్తనంబులందు బహువిధ
గతివేగవిశేషంబులునుం జూపుచుఁ బాయుచుఁ డాయుచుఁ బెక్కువిన్నాణం
బుల రణక్రీడ సల్పి రాసమయంబున. 2754

ఉ. రాముఁడు క్రుద్ధుఁ డై పటుశరంబులు నాల్గడరించి రాక్షస
గ్రామణి తేరిగుఱ్ఱములగర్వ మడంచి తొలంగఁ దోలినం
దామసుఁ డానిశాచరుఁడు దానికి నల్గి హయోత్తమంబులన్
దీనుస మొప్పఁ ద్రిప్పికొని పెంపున రాముని డాసి గ్రమ్మఱన్. 2755

క. భీమతరంబుగ విశిఖ,స్తోమంబులు రామమేనఁ జొనిపిన మదిలో
నేమియు స్రుక్కక నృపతి, గ్రామణియుఁ జలింపకుండెఁ గనకాద్రిక్రియన్.

ఉ. వెండియు రావణుం డలిగి వేయినిశాతశిలీముఖంబు లా
ఖండలసూతుగాత్రములు గాఁడఁగనేసిన నించుకైన నా
తం డని మోహ మందక వ్యథాపరిణద్ధుఁడు కాక నిశ్చలా
త్ముం డయి సూతకృత్యము సముద్ధతి సల్పుచు నుండె ధీరతన్. 27[illegible]

ఉ. మాతలి నిట్లు రావణుఁడు మార్గణవిద్ధునిఁ జేయు టంతయు
న్యాతలనేత చూచి మదిఁ బుట్టినకోపము తాల్మి గ్రింగఁగా
శాతశిలీముఖాయుతము చయ్యన నొక్కొకసారి నించుచున్
ఖ్యాతిగఁ దద్రథంబు విముఖత్వము నొందఁగఁ జేసె వ్రేల్మిడిన్. 2758

క. అసురవిభుండును గోపం, బెసఁగ నృపకుమారుమీఁదఁ బృథుపరశుగదా
ముసలాంకుశశరవర్షం, బసదృశముగఁ గురిసి యార్చె నంబర మదరన్. 2759

క. రిపుఁ డేయనృపుఁడుద్రుంచును, నృపుఁ డేయఁగరిపుఁడుద్రుంచురిపుఁడు న్నృపుఁడు
న్విపులగతిఁ బోరి రెంతయు, నపురూపం బై తనర్చె నయ్యుద్ధ మొగిన్.2760

సీ. సప్తసాగరములు సంక్షుభితము లయ్యె దిక్కుడ్యములు వేయివ్రక్క లయ్యె
గ్రహతారకలు మింట గతులు దప్పి చరించె జగతి కుమ్మరసారె పగిదిఁ దిరిగెఁ

గులమహీధరములు కుదురు దప్పి చలించెఁ బద్మమిత్త్రుఁడు మందభానుఁడయ్యెఁ
బాతాళతలవాసి పన్నగంబులు దూలె జడత సమీరుండు సుడియ కుండె
తే. ఘోరరాక్షసకరముక్తభూరిశస్త్ర, జనితనాదంబులోఁ గూడ జనవరేణ్య
ఘనధనుర్ముక్తసాయకౌఘప్రభూత, చండపవనంబు జగములు నిండుకొనిన.
వ. అట్టిమహోత్పాతంబులు విలోకించి దేవగంధర్వమహోరగకిన్నరసిద్ధసాధ్యులు
చింతాకులమానసు లై గోబ్రాహ్మణులకు స్వస్తియగుఁగాక లోకంబులు శాశ్వ
తంబు లై యుండుఁగాక రాఘవుండు రణంబున రాక్షసేశ్వరుం డగురావణుని
జయించుంగాక యని జపించుచు వెండియు వసదృశం బై రోమహర్షణం బై
ఘోరం బై ప్రవర్తిల్లుచున్నరామరావణులయుద్ధంబుఁ జూచి గగనసాగరంబు
లకు సదృశవస్త్వంతరాభాసంబువలన గగనంబు గగనంబుతోడ సాగరంబు
సాగరంబుతోడ నె ట్లుపమింపంబడియె నట్లు రామరావణులయుద్ధంబు రామ
రావణులయుద్ధంబున వోలి యసమానం బై ప్రవర్తిల్లుచున్నది కంటిరే యని
యొండొరులకుం జెప్పుచుఁ బరమాశ్చర్యరసావిష్టచిత్తు లై యుద్ధప్రకారంబు
విలోకించుచుండి రంత. 2762

రావణునితలలు రామునిచే ఖండింపఁబడినపై మాటిమాటికిని మొలుచ సాగుట.

ఉ. వీరవరేణ్యుఁ డై రఘువీరుఁడు రాముఁడు జాతరోషుఁ డై
దారుణభోగితుల్యనిశితక్షుర మొక్కటి గూర్చి దానిచే
ఘోరగతి న్సముజ్జ్వలితకుండల మైనదశాస్యశీర్షము
న్వారక ద్రుంచె వేల్పులు మనంబునఁ బొంగి చెలంగి చూడఁగన్. 2763
క. దానవపతిశిర మీగతి, క్ష్మానాథకుమారబాణసంఛిన్నం బై
మానక వజ్రాభిహతం, బైనగిరిశిరంబుమాడ్కి నవనిం ద్రెళ్లెన్. 2764
క. దనుజపతిమస్తకం బిటు, దినకరకులుసాయకమునఁ దెగి కూలినవెం
టనె వేఱొకశిరము వొడమి, మునుపటివలెఁ జూడనొప్పె భూరిద్యుతితోన్.
ఉ. వెండియుఁ జండవిక్రముఁడు వీరవరేణ్యుఁడు రామభద్రుఁ డా
ఖండలశస్త్రతుల్య మగుకాండము వింట ఘటించి ప్రోల్లస
త్కుండలదీప్త మై కలితకుంతల మై తనరారుదాని నా
రెండవశీర్షముం దునిమె రేసి సురల్ వెఱఁగంది చూడఁగన్. 2766
క. తునిమినఁ దోడనె వేఱొక, ఘనతరశీర్షంబు వొడముఁ గనుఁగొని దాని
న్మనుకులుఁడు రాఘవేంద్రుఁడు, కనత్కనకసాయకమున ఖండించె రహిన్.
క. తల లెన్ని యంకురించినఁ, జలమున రాముండు ఘోరసాయకములచే
నలఘుగతి హస్తలాఘవ, మలరారఁగఁ దునిమి వైచె నన్నిటి వరుసన్. 2768
క. ఉడుగక యులఁబడుశిరములు, నెడతెగక నభంబుమీఁది కెగయుశిరంబు
ల్గడువడిఁ దెగియొడుశిరములు, కడుఁ జిత్ర మొనర్చె నవుడు గనువారి కొగిన్.

క. బెడిదపుఁజప్పుడుతో నిలఁ, బడుదైత్యునితలలు చూడఁబడియె నపుడు గా
డ్పడరిన నుడుగక పుడమిం, బడియెడుపరిపక్వతాలఫలములమాడ్కిన్. 2770

వ. ఇత్తెఱంగున నారఘుసత్తముం డుత్తమవీర్యంబున నేకోత్తరశతవారం బేకోత్తరశతశిరంబులు ఖండించిన నవి యెప్పటియట్ల చూపట్టుటయుఁ దత్ప్రకారం బు విలోకించి రావణునిజీవితక్షయవిషయంబునందు నిశ్చయంబు నిరూపింపం జాలక తనమనంబున. 2771

సీ. మున్ను క్రౌంచారణ్యమున విరాధుం డనుదైత్యుఁ డేశరముల దళితుఁడయ్యె
నలజనస్థానవాసులు ఖరదూషణత్రిశిరు లేశరములఁ దీఱి చనిరి
దండకావనమునఁ దాటకేయకబంధు లేశరంబుల నీల్గి రేపు మాని
వాలి యేతూపుల నాలంబులోఁ గూలె నేసాయకముల నదీశుఁ డింకె

తే. నట్టిబాణంబు లన్నియు నసురవిభుని,యం దిపుడు మందతేజంబులయ్యె నేమి
కారణం బని చింతించివైరియురము,మీఁద శరవృష్టిఁ బరఁగించె మేదురముగ.

చ. అసురవరేణ్యుఁడు న్గినిసి యద్భుతమై ఖరి డాసి యీసున
న్ముసలగదాసిచక్రపటుముద్గరతోమరకుంతవర్షము
న్వెస నిగిడించె నిట్లడరి వేయితెఱంగులఁ బోరఁ దద్రణం
బసదృశమై జగద్భయదమై ఘనమై గన నయ్యె నయ్యెడన్. 2773

వ. మఱియు నారథికశ్రేష్ఠులు త్రికూటశిఖరిశిఖరంబున ఘోరంబుగా రణంబు సేయుచు నాగ్రహాకృతగతివశంబున నంతరిక్షంబున కెగయుచుఁబర్వతసమీప భూమికి డిగ్గుచుఁ గ్రమ్మఱ గిరిశిఖరంబుమీఁదికి దాఁటుచు రాత్రియైన దివం బైన నొక్కముహూర్తంబైన నొక్కక్షణంబైనవిరామంబునొందకవీరాద్భుత భయానకబీభత్సరౌద్రరసంబుల కాస్పదంబుగానహోరాత్రంబు మహాయుద్ధం బు గావించి రప్పుడు సురవరరథసారథి యగుమాతలి రామదానవులకు జయ పరాజయంబులఁ జింతించి రామునకు విజయంబు సంపాదించుతలంపున నమ్మ హాత్మున కిట్లనియె. 2774

—రాముఁడు మాతలిప్రేరితుఁడై రావణునిమీఁద బ్రహ్మాస్త్రముఁ బ్రయోగించుట.—

చ. ఎఱుఁగనివానిచందమున నీవు చరించెద వేల వీఁడు భీ
కరకమలాసనాస్త్రమునఁ గాని రణంబునఁ జావఁ డీనిశా
చరుపయిఁ గాలయాపనము సల్పక యమ్మహనీయసాధనో
త్కర మడరింపు మీతనికిఁ గాలము డగ్గఱె వచ్చె భూవరా. 2775

క. అనిమిషపతిసారథిచే, జననాథుకుమారుఁ డిట్లు సంస్మారితుఁడై
తనమనమున నుత్సాహము, ఘనమోదముఁ గౌతుకంబుఁ గడలుకొనంగన్.

తే. అఖిలభువనంబులు సృజించునంతకంటె, నధికయత్నంబున సరోరుహాసనుండు
వేడ్క నిర్మించి త్రైలోక్యవిజయకాంక్షి, యైనదేవేంద్రున కొసంగినట్టిదాని

ఆ. కుంభసంభవుండు కూర్మితో మున్నర్థిఁ, దన కొసంగినట్టిదాని మించు
కరణి మెఱయుదాని నిరుపమం బగుదాని, నఖిలలోకపూజ్య మైనదాని. 2778
తే. అఖిలదివ్యాస్త్రసారాంశ మైనదాని, విలయకాలాగ్నిశిఖభంగి వెలుఁగుదానిఁ
గ్రూరసర్పంబుగతి బుసకొట్టుదాని, నఖిలలోకసంత్రాసనం బైనదాని. 2779
తే. పక్షములయందుఁ బవనుండు ఫాలమందుఁ
దపనవహ్నులు తనువందు విపులనభము
గౌరవమునందు మందరమేరుగిరులు
గలుగుదాని వాసుకిభంగి నలరుదాని. 2780
తే. భూరితేజంబుచే సర్వభూతములకు, దపనదీప్తి నొసంగుచుఁ దనరుదాని
భువననుత మైనదాని సుపుంఖ మైన,దానిఁ గాంచనభూషితం బైనదాని.
తే. మహితకాలాగ్నిచందాన మండుదాని, వివిధరుధిరమేదోక్త మై వెలయుదాని
వీర్యమునఁ గ్రాలుదాని నవార్య మైన,దాని భీషణనిస్వనం బైనదాని. 2782
తే. అఖిలవానరనందనం బైనదాని, నసురవంశనిషూదనం బైనదాని
శత్రుకోటికి శోకం బొసంగుదాని, నింపుగాఁ దన కానంద మిచ్చుదాని. 2783
తే. సమితిదారుణ మై వజ్రసార మై ప్ర,చండనిస్వన మై మహోద్దండ మై య
మోఘ మై సర్వలోకసమ్మోహసంప్ర,దాయకం బయి పొగడొంది దనరుదాని.
తే. ఆలమున సర్వభూతబేతాళములకుఁ
గాకఘూకోగ్రజంబుకకంకగృధ్ర
ములకుఁ దక్కినమాంసాదములకు భక్ష్య
మొసఁగుదానిఁ గాలాభ మై యొప్పుదాని. 2785
తే. పృథుమదావళఘోటకబృందములకు, భేదనం బైనదాని నభేద్య మైన
దానిఁ గులమహీధరముల నైన డాసి, వేయివిధముల వ్రక్కలు సేయుదాని.
మ. అభివృద్ధిం గనుదాని నొక్కమహనీయామోఘకాండంబు వే
రభసం బొప్పఁగఁ దీసి దాని నియతి న్బ్రహ్మాస్త్రమంత్రంబుచే
నభిమంత్రించి శ్రుతిప్రయుక్తవిధిచే నాపద్మమిత్రాన్వయ
ప్రభుఁ డా రాముఁడు భూరినిష్ఠ మెయిఁ జాపం బందు సంధించినన్. 2787
క. ధర వడఁకె నభము ఘూర్ణిల్లె, శరధులు క్షుభితంబు లయ్యె జగములు బెదరె
న్గిరు లొడ్డగిల్లె భూతము, లరుదార భయాన్వితంబు లై సుడివడియెన్. 2788

రావణుండు నిహతుం డగుట.

వ. ఇట్లు రాముండు బ్రహ్మాస్త్రంబు సంధించి పరమాయత్తుం డై యాకర్ణపూర్ణం
బుగాఁ దిగిచి విడిచిన నమ్మహనీయాస్త్రంబు రామకార్ముకప్రముక్తం బై వజ్ర
బాహువిసర్జితం బైనవజ్రాయుధంబుపగిది నవార్యం బై నకృతాంతునికరణినతి

వేగంబునం బఱచి దురాత్ముం డగు రావణునియురంబు భేదించివానిప్రాణంబులు హరించి రుధిరావసిక్తంబై వేగాతిశయంబున ధరణీతలంబు ప్రవేశించి కృతకృత్యంబై వినీతం బైనదానిపోలికిఁ గ్రమ్మఱఁ దూణీరంబు సొచ్చె హతుం డైన రావణునికరంబున నుండి ససాయకం బైనకార్ముకంబు పుడమిం బడియె నిట్లు రామబాణాభిహతుం డై మహాద్యుతి యగుదశగ్రీవుండు గతాసుం డై వజ్రవజ్రాభిహతుం డైనవృత్రునిపగిది రథంబుపై నుండి పుడమింగూలె నప్పుడు రణమేదినిం బడినరావణునిం జూచి హతశేషు లైననిశాచరులు హతనాథు లై గతాశ్రయత్వంబువలన బాష్పప్రస్రవణముఖు లై శోకంబునం బఱచిరి రాక్షసేంద్రునినిధనంబు విలోకించి జితకాశు లగు వానరులు పరమానందభరితాంతఃకరణు లై సింహనాదంబులు సేయుచు రామునివిజయంబు గొనియాడిరి గగనంబున దేవదుందుభులు మ్రోసె దివ్యగంధవహుం డై సమీరుండు సుఖంబుగా వీచె నంతరిక్షంబుననుండి సాంద్రంబుగా రామునిరథంబుమీఁదఁ బుష్పవర్షంబు గురిసె గగనంబున నుండి దేవతలు సాధువాక్యంబుల రామునిం బ్రశంసించిరి సర్వలోకకంటకుం డగు రావణుండు నిహతుం డగుచుండ దేవగంధర్వసిద్ధచారణాదుల కనంతసమ్మోదం బావిర్భవించె రాక్షసపుంగవుం డగురావణుని వధియించి రాముండు ప్రీతిసంహృష్టసర్వాంగుండై సుగ్రీవాంగదహనుమదాదులతోడ సరసాలాపంబు లాడుచుఁ గృతప్రతిజ్ఞుండై నిహతరిపుం డై స్వజనబలాభివృతుండై త్రిదశగణాభివృతుం డైనదేవేంద్రునిచందంబునం దేజరిల్లుచుండె మరుద్గణంబులు ప్రసాదంబు నొందిరి దిక్కులు తేజంబునొందె నభంబు విమలం బయ్యె ధరాచక్రంబు చలింపకుండె సమీరణుండు సుఖస్పర్శుండై విసరె సూర్యుండు స్థిరప్రభుం డయ్యె నంత సుగ్రీవవిభీషణాదు లగుసుహృదులు లక్ష్మణసహితంబుగా రామునియొద్దకుం జనుదెంచి రావణవధతోషితు లై యమ్మహాత్మునిం బూజించి రంత. 2789

విభీషణుండు హతుం డైనరావణు వీక్షించి దుఃఖించుట.

క. దక్షుఁ డగురామభద్రుని, యక్షయబాణమున నిహతుఁ డై ఘనసంగ్రా
మక్షితిఁ గూలినయన్నను, వీక్షించి విభీషణుండు విలపించె రహిన్. 2790

శా. హా వీరోత్తమ హా త్రిలోకవిజయవ్యాపారధౌరేయకా
హా విఖ్యాతపరాక్రమా దనుజవంశాగ్రేసరా జన్యవి
ద్యావైదుష్యము మాని మంజుశయనస్థానంబు వర్జించి నేఁ
డీ విబ్భంగి నరేంద్రుచే హతుఁడ వై పృథ్వీస్థలిం గూలితే. 2791

తే. సిద్ధవిద్యాధరామరస్త్రీల నెపుడు, విడువ కాలింగనంబు గావించునట్టి
దీర్ఘకరములు సాఁచి యధీశ నీవు, పృథివిఁ గౌఁగిటఁ జేర్చి సూర్కొంటివె నేఁడు.

తే. అర్కమండలములభంగి ననుపమాన, దివ్యరత్నప్రభలచేత దిశలు వెలుఁగఁ

జేయునీదుసువర్ణవిచిత్రనరకిరీటములు నేలఁ బడియెనే నేఁటి కధిప. 2793

చ. వలవదు రాక్షసేంద్ర బలవంతునితోడివిరోధ మీవు మై
థిలిని నొసంగు మింక నరదేవున క ప్లానరింపవేని నీ
తలలు రణంబులోఁ దునుము దాశరథుం డని యేనుబల్క నా
పలుకులు నిగ్రహించితివి పల్కినయంతయు నిక్క మాయెఁగా. 2794

చ. హరిహయజిన్మహోదరనరాంతకకుంభనికుంభకుంభక
ర్ణరుధిరభోజనాదు లయినం దగ దంచు వచింప రైరి యీ
నెఱి చనఁ గీడు వచ్చు నని నీకును దోఁపక పోయె నాఁడు న
న్బరుసము లాడి ప్రోల్వెడలఁ బంచితి వీగతి యయ్యెఁ గా తుదిన్. 2795

తే. నీవు దీఱినకతమున నేఁడు ధర్మ
విగ్రహము నీతిమర్యాద వితతసత్త్వ
సంగ్రహంబును మఱియుఁ బ్రస్తవములగతి
సర్వమును దీఱిపోయె నిశాచరేంద్ర. 2796

తే. అస్త్రవిదులలో నధికుండ వైననీవు, పడుట జలనిధు లింకినభంగి మఱియు
మిహిరతుహినకిరణు లస్తమించినక్రియ, పావకుండు చల్లాఱినపగిదిగాదె.

చ. కడిమి దలిర్పఁ దొల్లి త్రిజగంబుల నొక్కట గెల్చి యేకవీ
రుఁడ వన ఘోరమధ్యమున రూఢికి నెక్కిన నీవు నేఁడు సొం
పెడలి రజంబులో మునిఁగి యీగతిఁ గూర్కెడువానిభంగిఁ జే
డ్పడి రణభూమిఁ గూలఁ గని పౌరుషము వ్యర్థ యంచుఁ జూచెదన్. 2798

క. భీకరతేజుఁడ వగునీ, వీకరణి హతుండ వగుచు నిలఁ గూలిన నీ
లోకం బంతయు నిపు డా,లోకిత మయ్యె హతఘోరలోకం బగుచున్. 2799

చ. కలితధృతిప్రవాళ మవికంపితము న్బ్రసవాగ్రపుష్ప ము
జ్జ్వలితతపోబలం బనదృశంబును శౌర్యనిబద్ధమూల మౌ
విలసితరాక్షసప్రవరవృక్షము రాఘవమారుతంబుచే
నలఘుతరంబుగా నిహత మై రణమేదినిఁ గూలె నక్కటా. 2800

చ. అతులతరప్రసాదశయ మంచితకోపరసాపరాంగ మ
ద్భుతబలవీర్యదంతము సమున్నతసత్కులవంశవంశ మ
ప్రతిమపరాక్రమంబు నగుబంధురరావణగంధహస్తి నేఁ
డతులితభంగి రాఘవమృగాధిపుచే హత మయ్యె నాజిలోన్. 2801

తే. స్వబల తేజోయుతంబు నిశ్వాసధూమ
హితము విక్రమోత్సాహవిజృంభితార్చి
యైనరావణవహ్ని నేఁ డాజి రాఘ
వాశుగాభ్రంబుచేతఁ జల్లాఱె నకట. 2802

తే. ఘోరరాక్షసవాలుకకుద్విషాణ, మరిజయోత్సాహగంధసింధురము చాప
లేక్షణశ్రుతి యైనదైత్యేంద్రవృషము, పార్థివవ్యాఘ్రనిహత మై పడియె నేఁడు.

— రాముఁడు విభీషణు నూఱడించుట. —

వ. అని యిట్లు బహుప్రకారంబుల శోకసమావిష్టుండై విలపించుచున్న నప్పుడు పరిదృష్టార్థనిశ్చయంబును హేతుమంతంబు నైనయవ్విభీషణునివాక్యం బాకర్ణించి రామభద్రుం డతని కిట్లనియె. 2804

చ. వినుతపరాక్రముండు భుజవీర్యఘనుండు రణానివర్తిగం
ధనపరుఁ డుగ్రతేజుఁ డతిదర్పుఁడు శూరజనాగ్రగణ్యుఁ డీ
దనుజవరేణ్యుఁ డీతఁ డనిఁ దప్పక పంచత నొందియు న్స్వర్గం
బున మని యున్నవాఁ డితనిపోకకు శోకము నొంద నేటికిన్. 2805

చ. వదలక వృద్ధికాము లగువారు ప్రతాపముఁ జూపి వైరిచేఁ
గదనమునందుఁ గూలుదురు కయ్యములోపలఁ జన్నవారికిం
త్రిదశపదంబు గల్గు నటు దీఱినవారలఁ గూర్చి ధర్మకో
విదు లగువారు చిత్తముల వేమఱు శోకము గూర్ప రుర్వరన్. 2806

ఉ. ఈదనుజాన్వయప్రవరుఁ డెల్లజగంబులు గెల్చి శక్రకా
లాదిసమస్తదిక్పతుల నాజితలంబునఁ బాఱఁ దోలి క్ర
వ్యాదకులాంబురాశిశశి యై స్వజయార్జితవీరశబ్దుఁ డై
యాదటఁ గాలధర్మగతుఁ డయ్యె మహాత్ముఁ డితండు శోచ్యుఁడే. 2807

తే. పుడమి నేకాంతవిజయ మభూతపూర్వ
మాహవతలంబున నొకానొకప్పు డైనఁ
బరులచేఁ జచ్చు మఱియుఁ దాఁ బరుల నైనఁ
జంపువీరుండు జయ మది చంచలంబు. 2808

తే. సమరమరణంబు క్షత్త్రియసమ్మతంబు, త్రిదశవర్యులచేత సందృష్ట మైన
చంద మిదియె రణంబునఁ జచ్చినట్టి, నృపతి శోచ్యుఁడు గాఁ డిది నిశ్చయంబు.

వ. విభీషణా నీ వీనిశ్చయం బెఱింగి విజ్వరుండ వై యనంతరకార్యం బెయ్యది కర్తవ్యంబు దాని విచారింపు మనిన నతండు రామభద్రు నవలోకించి శోకగద్గదకంఠుం డై యిట్లనియె. 2810

ఉ. రాజవరేణ్య యీతఁడు పరాజయ మెన్నఁ డెఱుంగ కట్లు ము
న్నాజితలంబున న్సురవరాదులఁ దోలి జయంబు గొన్నవాఁ
డోజవలిర్ప నేఁడు సమరోన్మదుఁ డై వెస నిన్నుఁ దాఁకి వే
లాజితసాగరంబుక్రియ లావఱి గూలెఁ బ్రభగ్నదర్పుఁ డై. 2811

చ. ధనము లొసంగె మిత్రులకు దైవముల న్భజియించె భోగముం
దనివి సన న్భుజించె భుజదర్పము వైరులయందు నించె భృ

త్యనికరము స్మరించె వివిధాధ్వరకర్మము లాచరించె లో
కనుతతపం బొనర్చెఁ ద్రిజగంబుల విశ్రుతి గాంచె నన్నిటన్. 2812

వ. కావునఁ బ్రేతత్వగతుం డైనయీరాక్షసేంద్రునకు భవత్ప్రసాదంబున సంస్కా
రంబు గావింపం గోరెద నని పలికిన నారఘువల్లభుండు విభీషణునిపలుకులు విని
మిత్రా వైరంబులు మరణాంతంబులు మత్సంకల్పితప్రయోజనం బంతయుఁ
దీఱె నింక నీరావణుండు స్నేహవిషయంబునందు నీ కెట్టివాఁడు నాకు నట్టి
వాఁ డయ్యె నితనికి స్వర్గారోహణసాధనం బైనసంస్కారంబు గావింపు మని
పలికె నంత రామునిచేత రావణుండు రణంబున నిహతుం డగుట విని రాక్షస
కాంత లెల్ల శోకకర్శిత లై యంతఃపురంబు నిర్గమించి యెవ్వ రెంత నివారించిన
నిలువక మహీరేణువులం బడి పొరలుచు ముక్తకేశకలాపలై హతవత్స లైన
గోవులభంగి దుఃఖపీడిత లై యనేకరాక్షసులతోడ నుత్తరద్వారంబు వెడలి
మాంసశోణితకర్దమం బై కబంధాకం బై ఘోరదర్శనం బై యున్నసంగ్రామ
రంగంబు సొచ్చి రావణుఁడు పడియున్నచోటు వెదకుచు హానాథా యని
యాక్రందనంబు సేయుచుఁ గన్నీరు నించుచు శోకపరాజిత లై దూలుచు
హతయూథప లైనగజాంగనలపగిది నారావంబు సేయుచుం జనుదెంచి
యొక్కచోట. 2813

రావణునిభార్యలెల్ల యుద్ధభూమికి వచ్చి యాక్రందించుట.

చ. హతకరుఁ డైనహేళిక్రియ నప్పుల నాఱినవహ్నికై వడి
న్నతమఖవజ్రఖండితవిశాలవినీలనగంబుమాడ్కి భూ
పతిశరభిన్నగాత్రుఁ డయి బంధురశోణితసిక్తుఁ డై రణ
క్షితిఁ బడియున్నదైత్యకులశేఖరు రావణుఁ గాంచి చెచ్చెరన్. 2814

క. భూరికుఠారపరిచ్ఛిన్నారణ్యకలతలభంగి నడలుచు దివిష
ద్వైరిపతియొడలిపైఁ బడి, ఘోరంబుగ నేడ్చి రప్డు గురుశోకమునన్. 2815

సీ. విభునిఁ గౌఁగిటఁ జేర్చి విలపించె నొక్కతె భుజములు పైకెత్తి పొక్కెనొకతె,
గళ మవలంబించి విలపించె నొక్కతె మగనియంఘ్రులు వట్టి వగచె నొకతె
తొడమీఁద శిర ముంచి దుఃఖించె నొక్కతె యురముపై వ్రాలిబిట్టఱచె నొకతె
తను వంటి రోదన మొనరించె నొక్కతె కేశము ల్వీడ శోకించె నొకతె

తే. చిందు కన్నీటిచినుకులచేత జీవి,తేశువదనంబు దడుపుచు నేడ్చె నొకతె
దైత్యసతు లిట్లు పెక్కుచందముల విభునిఁ, బట్టుకొని విలపించిరి బంధురముగ.

వ. వెండియు నంద తేకవాక్యంబున. 2817

సీ. ఇంద్రాదిదిక్పతు లెవ్వానిభయమున నూరుల నని తలఁ జూప వెఱతు
రాలంబున ధనేశుఁ దోలి పుష్పకనామ ఘనదేవయాన మేఘనుఁడు దెచ్చె
సురదైత్యముఖులచే మరణంబు లేకుండ వరము లెవ్వఁడు ధాతవలనఁ బడసెఁ
దన కడ్డ మైనకంభునిఁ జెండికొండను బెకలించె నెవ్వాఁడు పృథుబలమున

తే. గరుడగంధర్వయక్షకిన్నరులు చాల, వెఱతు రెవ్వానినామంబు విన్నయంత
నట్టిరాక్షసలోకేంద్రుఁ డాజి నొక్క, నరునిచే హతుఁ డై కూలినాఁడు నేఁడు.

క. పరులవలన భయ మెన్నఁడు, నెఱుఁగనిశూరోత్తమునకు నెక్కడ నేఁ డీ
ప్పురుసునఁ బదాతి యగునొక,నరునివలన భయము గలిగె నాయముదప్పెన్.

చ. హితమతు లైనపెద్దలు సుహృత్తులుఁ జెప్పిననీతివాక్యముల్
శ్రుతిపుట మంట నీక నృపసుందరి నాత్మవధార్థ మీవు దు
ర్మతిఁ గొని తెచ్చి రాక్షసుల మమ్మును నిన్నును జంపుకొంటి వ
ప్రతిమపరాక్రమాఢ్యుఁ డగుభానుకులేంద్రునిసాయకంబులన్. 2820

చ. అరసి విభీషణుండు మనకందఱ కీగతి వచ్చు టాత్మలో
నెఱిఁగి మహీజ నానృపతి కిమ్మని నేర్పున నెంత చెప్పిన
న్బరుసఁదనంబున న్వినక పట్టణము న్వెడలంగఁ బంచి తా
పరమవివేకశాలి మును వల్కినయంతయుఁ దథ్య మాయెఁగా. 2821

చ. అసురవరేణ్య రాఘవున కప్పుడె జానకి నిచ్చి పుచ్చినం
బస చెడి సర్వరాక్షసులు బంధులు మిత్రులు ద్రుంగి పోక యీ
వ్యసనము మాకు లేక సుతులందఱుఁ బంచత నొంద కీవు ఘో
రసమరమందుఁ జావక తిరంబుగ నందఱ ముందుమే కదా. 2822

సీ. మాననీయుం డైనమనవిభీషణుమాట పాటించి వినిన నిప్పన్న కామఁ
డగునాతఁ డందున నాప్తపక్షుం డైన జనపతి నిన్నాజిఁ జంపకుండు
నీవు చావక యున్న నేఁడు మాకెల్ల నీకరణి వైధవ్యంబు గలుగ కుండుఁ
బగవార లైనదిక్పతులకు సురలకుఁ గోర్కులెల్లను సమకూర కుండు

తే. నవనిపుత్త్రిని మరల నీనందువలన, నేకకాలంబున సమస్తహితులు సుతులు
వాహినీంద్రులు నేము భవత్సమన్వి,తంబుగ వధింపఁబడితిమి దానవేంద్ర. 2823

క. మానుగ దైవాధీనం, బీనిఖిలము దైవనిహత మెయ్యది దాని
న్మానవుఁడు ద్రుంచు స్వేచ్ఛా,ధీనోద్యోగంబు లేదు తెలియఁగ నీకున్. 2824

క. వానరులకు నీకు నఖల, దానవులకు నాశనంబు దైవమువలన
న్మానక ప్రాప్తం బయ్యెను, మానవపతికతన నేఁ డమర్త్యవిరోధీ. 2825

క. బలశౌర్యాజ్ఞావిక్రమ,ముల మఱి యుద్ధమునఁ గామమున దైవగతిం
దలకొని మరల్పఁగా లేఁ, రిలలో నెవ్వార లైన హృదయాధీశా. 2826

―మందోదరి రావణుం జూచి విలపించుట.―

వ. అని యిట్లు బహుప్రకారంబుల దుఃఖార్త లై దీనస్వర లై రావణపత్ను లందఱుఁ గన్నీరు మున్నీరుగా రోదనంబు సేయుచుండి రప్పు డగ్రపత్నిమండోదరి యచింత్యకర్ముం డగురాముని చేత నిహతుం డై రణమేదినిం బడియున్న రావణు నవలోకించి దీనస్వరంబున ని ట్లని విలపించె. 2827

సీ. ప్రాణేశ ఘోరసంగ్రామతలంబునఁ గ్రుద్ధుండవైన నీమ్రోల నిలువ
విబుధనాయకుఁడైన వెఱచు నీనామంబు చెవుల సోఁకినయంత సిద్ధసాధ్య
గరుడగంధర్వులు గడగడ వడఁకుచుఁ బఱతురు దిశలకు భయముతోడ
విష్టపత్రయమున వీరశిఖామణి యనఁగ విశ్రుతి గన్న ఘనభుజుండ
తే. వట్టినీవు మానుషమాత్రుఁడైన రాము, నృపతిచే సంగరంబున నిర్జితుండ
వైతి వేమందు దైవయోగాతిరేక, మిట్లు పడుటకు నీకు సిగ్గేల లేదు. 2880
తే. అసురనాయక త్రైలోక్య మాక్రమించి, విక్రమశ్రీయుతుండ వై వితతతేజ
మున వెలింగెడునిన్ను నేఁ డని నరణ్య, గోచరుం డగునరుఁ డెట్లు గూలవైచె.
తే. కర్బురోత్తమ నరుల కగమ్య మైన, దేశమునఁ గామరూపి వై ధీరవృత్తిఁ
బరఁగ వర్తించుని న్నెట్లు నరుఁడు చంపె, నిట్టివింతలు పుట్టునే డిచట నీకు.
క. అనిమిషుల జయించిననిను, మనుజుఁడు సంగ్రామమందు మర్దించె నన
న్విన విన వింతగుచున్నది, మనమున నమ్ముంగఁ జాల మానవనాథా. 2881
తే. శమనుఁ డిబ్భంగి నీవినాశంబుకొఱకు
మించి దుర్వారమాయ నిర్మించి రామ
రూపమున వచ్చెఁ గాఁబోలు రూఢి మెఱయ
నట్లు గాకున్న నరుఁ డింత కర్హుఁ డగునె. 2882
సీ. చెలువొప్పఁ గపులచే సేతువు కట్టించి వారాశి లంఘించి వచ్చుటయును
బహుదైత్యయుతముగా భండనంబున ఖరదనుజుని ద్రెల్మిడిఁ దునుముటయును
జలమున నిను నాల్గుసంద్రము ల్ముంచిన వాలిని వెసఁ గూలవైచుటయును
దరుచరుఁ డొక్కఁడు వెఱవక చనుదెంచిపుర మంతయు దహించిపోవుటయును
తే. మఱియు రామునియద్భుతమహిమ లరసి
యతఁడు మర్త్యమాత్రుండు గాఁడంచుఁ జాలఁ
జిత్తమున నెంచి యతనిచేఁ జేటు నీకుఁ
గలుగు నని యుమ్మలింపుదుఁ గర్బురేంద్ర. 2883
తే. వాసవుఁడు రామరూపుఁ డై వచ్చి నిన్ను, గొంటుతనమున నిటుచేసె నంటి నేని
వైరులకు దుస్సహుండ వై వఱలునిన్నుఁ, జంపుటకు వాసవున కంతశక్తి గలదె.
సీ. స్వాభావికజ్ఞానశక్తియుక్తుఁడు సనాతనుఁ డఖిలాంతరాత్మకుఁ డజుండు
ప్రకృతికంటెఁ బరుండు పరిణామవిరహితుఁ డాదిమధ్యాంతశూన్యాద్వయుండు
క్షయశూన్యుఁడు మహత్తుకంటె మహత్తను సర్వలోకేశుండు స్రష్ట యచలుఁ
డరిసుదర్శనగదాధరుఁ డజయ్యుఁడు రమావరుఁ డచ్యుతుండు శ్రీవత్సవక్షుఁ
తే. డైనవిష్ణుండు లోకహితార్థ మిట్లు, మానుషాకృతి ధరియించి మర్కటత్వ
మొందినసుపర్వులనుగూడి యుద్ధమందు, నిన్నువధియించె నేఁ డిదినిక్కువంబు.
తే. అసురనాయక మున్నింద్రియముల గెలిచి
గెలిచితివి ముజ్జగంబుల నలఘుభంగి

వరుస నయ్యింద్రియంబులే మరల నిన్ను
గెలిచె వైరయుక్తము లౌటవలన నేఁడు. 2836

క. మానవపతితో వైరము, మానుము వైదేహి నిమ్ము మరల ననుచు ము
న్నే నెంత బుద్ధి చెప్పిన, మానుగ విన వైతి విది సమాగత మయ్యెన్. 2837

తే. పుణ్యసతి యైనసీతపైఁ బుట్టినట్టి, కామ మది వహ్నిరూపమై కర్బురేంద్ర
నిన్నునన్నును గులమును నిఖిలసుతుల, హితుల మంత్రుల నెల్ల దహించె నేఁడు.

సీ. దనుజనాయక యరుంధతికంటె రోహిణికంటె విశిష్ట యై గ్రాలుదాని
వసుధలో క్షమ గలవారి కెల్లను నిదర్శనభూత యైనట్టిరసకు సర్వ
సౌభాగ్యయుతు లైనజనుల కెల్లను నిదర్శనభూత యైనవారాశినుతకు
దృష్టాంతభూమి యై తేజరిల్లెడుదానిఁ బతిభక్తి గలదానిఁ బరమసాధ్వి

తే నబల సర్వానవద్యాంగి యైనదాని, మహితశీలంబు గలదాని మాన్య యైన
దాని సీతను బతియొద్ద లేనివేళ, మ్రుచ్చిలి యరణ్యమున నుండి దెచ్చి తీవు.

తే. తెచ్చినందున ఫలమేమి దీర్పరాని
కలుషము ఘటిల్లుటయుఁ జేటు గల్గుటయును
గులము చెడుటయు నింతియే గలిగెఁ గాని
భోగ మేమైనఁ గలిగెనే పొసఁగ నీకు. 2840

సీ. రాక్షసేశ్వర పతివ్రత యైనసీత తపోగ్నిచే దగ్ధుండ వైతి మున్నె
తనుమధ్య నద్ధతి ధర్షించునప్పుడే దగ్ధుండవై పోక తక్కి తదియు
నురుతపోమహిమను బురుహూతముఖసురు లురుభయంబునఁగుందుచుండ్రి దేనఁ
బరిపక్వకాలంబు పర్యాగతం బైనఁ గలుషకర్మఫలంబు కర్త కౌదవు

తే. శుభము గావించుపురుషుఁడు సుఖము నొందు
దురిత మొనరించుపురుషుఁడు దుఃఖ మొందు
సుకృతి యగువిభీషణునకు సుఖము గలిగె
దోషకారికి నీ కిట్టిదుఃఖ మొదవె. 2841

క. దివిజారి రూపవతు లగు, యువతులు పెక్కండ్రు కలిగియున్నా రిట నీ
కవివేకతఁ గన వైతివి, యవనీసుతకంటె వారి నధికలఁ గాఁగన్. 2842

క. ఉరుమోహంబున మదిలో, నెఱుఁగఁగ లేవైతి వామహీసుత కులరూ
పరమాగుణముల నాతో, సరివచ్చునె యెక్కు డగునె చర్చింపంగన్. 2843

క. తనవిభునిఁ గూడి జానకి, యనుపమహర్షాబ్ధి నోలలాడుచు నుండు
న్నినుఁబాసి యేను సతతంబును శోకపయోధియందు మునిఁగి యడలెదన్.

సీ. ప్రాణేశ దివ్యచిత్రస్రగంబరములఁ గైసేసి యసమానకాంతితోడ
నినుఁ గూడి సంతత మనురూప మగువిమానం బెక్కి నిస్తులానంద మలర
వివిధదేశంబులు వీక్షించుచును మేరునగమందు మందరనగమునందుఁ
గైలాసనగమందు ఘనచైత్రరథమందుఁ దక్కిన దేవతోద్యానవీథు

తే. లందు విహరించు చుండుదు నట్టియేను
గామభోగసంత్యక్త నై కళలు దొఱఁగి
విధవనై యుండవలసె భూవిభులభోగ
భాగ్యములు నమ్మఁదగవు చపలము లరయ. 2845

తే. దానవోత్తమ సర్వభూతముల కిల న,కారణం బగుమృత్యువు గలుగ దట్లు
గాన మైథిలీహేతుకం బైనమృత్యు, విట్లు నీకును గలిగె నింకేమి గలదు.2846

సీ. దనుజేంద్ర సుప్రసాదంబుచే శోభచే దీప్తిచే శశిపద్మదినకరులకు
సాటి యై సుభ్రూవిశాల మై సుకుమార మై సమున్నస మై విలాసినేత్ర
కలిత మై దీప్తకుండల మై మనోజ్ఞ మై మకుటాభిరామ మై మహితమద్య
పానభూములయందుఁ బటుమదవ్యాకులదీప్రాక్షమై యొప్పు నీప్రధాన

తే. వదన మిప్పుడు రాఘవప్రదరభిన్న, మై రుధిరసిక్త మై దీన మై వికీర్ణ
మాంసమస్తిష్క మై పరిమ్లాన మగుచుఁ, గన్నులకు వేడ్కగావింపకున్నదకట.

వ. దేవా మందభాగ్య నైననాచేత నొకానొకప్పు డైన నెయ్యది యవిచారితం
బయ్యె నట్టిమద్వైధవ్యకారిణి యైనయిట్టిమూవస్థ నీకు సంప్రాప్త యయ్యె నని
వగచి వెండియు. 2848

తే. అఖిలరాక్షసవరుఁడు మాయయ్య యనియు
దానవకులేశ్వరుండు మద్భర్త యనియు
దండితపురందరుండు నాతనయుఁ డనియు
విఱ్ఱవీఁగుచు నెపుడు గర్వించి యుందు. 2849

ఉ. పట్టుగ మీరు ఖ్యాతబలపౌరుషు లాహవశూరు లెంతయుఁ
దిట్టలు విక్రమాధికులు ధీరులు నించుక యైన మీకు నే
పట్టున హాని గల్గ దని భావమునం దగ నమ్మియుంటి నేఁ
డిట్టులు మర్త్యుచేత భయ మింత ఘటింగు లెఱుంగ నక్కటా. 2850

సీ. లలితేంద్రనీలనీలము ప్రాంశుశైలేంద్రసదృశంబు మణిమయచారుమకుట
కమనీయకంకణాంగదహారకేయూరసురుచిరసుమదామశోభితంబు
ఘనవిహారములందుఁ గాంతంబు సమరంబులందు దీప్తంబు భార్యాంగరాగ
దీప్తిచే శంపాప్రదీప్తమేఘనిభంబు రమణీయచేలాభిరంజితంబు

తే. నైననీదుశరీర మత్యలఘుశల్య
శలలములచేతఁబోలె ననంఖ్యనిశిత
కాండసంవ్యాప్త మై నేఁడు కౌఁగిలించు
కొనుటకు నశక్య మై యున్న దనిమిషారి. 2851

చ. నిరుపమరామకార్ముకవినిస్సృతదారుణచండకాండముల్
[illegible] ఁడిన నెత్తుటఁ దోఁగి నెమ్ములు

న్వెఱిగి భవచ్ఛరీరము పవిప్రవిఖండిత మైనకొండవై
ఖరి నిలఁ గూలి యుండ నిటు గన్గొనఁ బాలయితిః హృదీశ్వరా. 2852

తే. అధిప యిది స్వప్నము యథార్థ మయ్యె నేని
రాముఁ డెబ్బంగి నిను సమరమునఁ జంపె
మృత్యువున కైన మృత్యువ వెట్లు మృత్యు
వశగతుఁడ వైతి వీవు దుర్వార తేజ. 2853

ఉ. జేతవు లోకపాలురకుఁ జెల్వుగ సర్వనిశాటకోటికి
న్నేతవు సార్వకాలికము నిన్ను భజించెడుభృత్యకోటికిః
దాతవు భీతులై నుఱుఁగు తప్పక సొచ్చినవైరపాళికిం
దాతవు సర్వశాస్త్రపరిరక్షిత వీవు విధాత వెన్నఁగన్. 2854

క. భర్తవు ముజ్జగములకుఁ బ్రహర్తవు వైరులకు రాక్షసాన్వయమునకుం
గర్తవు సురనరపతులకు, హర్తవు విద్యాధికుండ వసురవరేణ్యా. 2855

క. లోప్త వనేకమఖములకు, గోప్తవు హితమంత్రబంధుకోటికి నెల్లః
క్షేప్తవు కైలాసాద్రికి, నప్తవు కమలాసనునకు నయగుణశాలీ. 2856

క. వ్యక్తపరాక్రమపరుఁడవు, వక్తవు శత్రువులమోఁకీల వరదర్పమున
న్యుక్తిసహితవాక్యములకు, భోక్తవు త్రైలోక్యరత్నభోగంబులకున్. 2857

తే. వీరవర్య యావిష్కృతవిక్రముండ, వఖిలవిష్టపములకు భయప్రదుఁడవు
వ్రేలఁ జూపినవారలఁ గాలఁ జూపి, నట్టిఘనుఁడవు బాహుసత్వాధికుఁడవు.

క. నీకంఠస్వనము వినిన, లోకస్థసమస్తభూతలోకం బెల్లం
జీకాకుపగిది నుడివడు, భీకరమూర్తివి ప్రతాపపేటివి తలఁపన్. 2859

తే. పాయుక నివాతకవచులఁ బాఱఁదోలి
నట్టిశూరుండ వఖిలమాయామహత్త్వ
కోవిదుండవు సకలవిద్యావిదుండ
వఖిలధర్మవ్యవస్థాభిమంత వీవు. 2860

తే. అసురపుంగవ మాకెల్ల ననుదినంబుఁ, గామభోగంబుల నొసంగి గారవించు
నట్టికృప గలవాఁడ వీ వతిరథుండ, వలఘుచారిత్రుఁడవు త్రిలోకాధికుఁడవు.

వ. ఇట్టిప్రభావసంపన్నుండ వైననీవు రామబాణాభిహతుండ వై పుడమిం బడి
యుండ నిన్ను విలోకించి హతప్రియ నై యీదేహంబు ధరించి యున్నకారణంబుననే నత్యంతకఠినహృదయ నైతి నని దుఃఖించి వెండియు నిట్లనియె 2862

క. విలసితమహార్ఘతల్పం,బులపై నిదురించునట్టిభోగివి నీ వె
ట్లిలపాంసుపాటలుఁడ వై, యిలపై వసియించినాఁడ వేమందు విధిన్. 2863

క. సుతుఁ డింద్రజిత్తు సమరక్షితిలో లక్ష్మణునిచేతఁ గెడసినయపుడే
హత నైతి నిపుడు వెసఁ బాతిత నైతి మహాత్మ నీవు దెగినకతమునన్. 2864

క. పతిసుతహితబాంధవవిర, హితనై గాఢకామభోగహీన నయి మహి
స్థితి లేనిదుఃఖభరమున, గతిసెడి మనియుండవలసెఁ గలకాలంబున్. 2865

క. నినుఁ బాసి నిమిషమైనను, మనియుండఁగఁజాల నన్ను మన్కువతోడం
గొని పొమ్మిచ్చుట నొంటిగ, నను విడిచి యొంటిఁ జనఁగ న్యాయమె యధిపా.

క. విలపించెడునను( గనుఁగొని, పలుకవు నగరంబు విడిచి పాదగతి స్వే
చ్ఛలవిడి వచ్చిననాపై, నలుగవు మాటవు మృదూక్తు లాడ వదేలా. 2867

తే. విగతలజ్జావగుంఠిత లగుచుఁ బురము, విడిచి వెలికి విశృంఖలవృత్తి నేఁగు
దెంచిననిజాంగనల విలోకించి నీవు, కోపగింప వదేల రక్షోవరేణ్య. 2868

తే. అధిప క్రీడాసహాయమైనట్టియీజనంబు దిక్కులేక వ్యసనమునఁ జిక్కి
చాల విలపించుచున్న దీవేళ దీని, నాదరింపవు మన్నింప వసురనాథ. 2869

సీ. దనుజేంద్ర మును నీవు ధర్మమార్గము దప్పి భర్తృశుశ్రూషణాపరత ధర్మ
నిరతల సాధ్వులఁ బరమపుణ్యలఁ గులస్త్రీల సువ్రతలను జెఱలుపట్టి
వారిభర్తల నెల్ల వధియించితివి బల్మి నయ్యుత్తమాంగన లప్పుడు గినిసి
నీవంశమంతయు నిర్మూల మగుఁ గాక నీశిరంబులు దెగి నేలఁ గూలుఁ
తే. గాక నీపత్ను లింక మాకరణి విగత, కాంతలై యేడ్చుచుందురుగాక యనుచు
ఘోరభంగి శపించి రాగోడు నీకు, దైవకృతమునఁ దప్పక తగిలె నేఁడు. 2870

వ. దేవా యెవ్వనికృతంబునఁ బతివ్రత లగుయువతులకన్నీరు మహీతలంబునం
బడు నట్టివానికి నాశంబు గలుగు ననియెడుప్రవాదంబు నేఁడు సత్యం
బయ్యె బాహువీర్యంబున లోకత్రయంబు నాక్రమించి ప్రతాపవంతుం
డవై తేజరిల్లెడునీకుఁ బరాంగనాభిమర్శనంబు క్షుద్రం బని తోఁప
కేల చనియెఁ గపటమృగవ్యాజంబున రాముని దూరగతుం జేసి యా
శ్రమంబున నొంటిఁ జిక్కియున్నవేళఁ గపటపరివ్రాజకరూపంబున జానకిం
గొని తెచ్చితి వది నీకుఁ గాతర్యలక్షణంబు రణంబులయం దింతకుమున్న
నీకొకానొకప్పుడైనఁ గాతర్యంబుగలిగె ననుమాట యెన్నఁడు విని యెఱుంగ
నిట్టియకాతరప్రకృతి వైననీకు భాగ్యవిపర్యాసంబువలనఁ జౌర్యరూపం
బైనయీకాతర్యంబు పుట్టె నది వినాశజ్ఞాపకం బయ్యె నతీతానాగతవర్త
మానార్థవిచక్షణుండును మహాభాగుండు నగుమద్దేవరుండు నీచేత వంచించి
తేఁబడినసీతం జూచి నిట్టూర్పులు పుచ్చి కొండొకసేపు విన్ననై ధ్యానంబు
పూని యుండి దీన రాక్షసులకు వినాశంబు గలుగు నని పలికె నతండు సత్య
వాదిగావునఁ దద్వచనప్రకారంబున రాక్షసముఖ్యులకెల్లవినాశంబు సంప్రాప్తం
బయ్యెఁ గామక్రోధసముత్థవ్యసనప్రసంగి వైననీచేతమూలహరంబైనయిట్టియన
ర్థంబు సమానీతం బయ్యె మా[illegible]ంబువలన. నీరాక్షసకులం బంతయు ననాయ
కంబు గావించితివి ప్రఖ్యాతబలపౌరుషుండవైననీవు నాకు శోచితవ్యుండవు

గావు స్త్రీస్వభావంబున నాబుద్ధి కా[illegible]ంబునందు [illegible]
సినసుకృతదుష్కృతంబులు చేసి నీవు [illegible]తికిం జ[illegible]
బున దుఃఖార్తనై గతిగానక దుఃఖించుచుం[illegible]
యుద్దేశించిదుఃఖంచెద హితకాములగుసుహృత్తు[illegible]
కర్ణుండును మాల్యవంతుండును విభీషణుండును [illegible]
క్తంబును శ్రేయస్కరంబును దారుణేతరంబు నగుహి[illegible]
వీర్యవంతుండవై వారలహితోక్తులువినక [illegible]
వీఁక నేమి వగచిన నేమిఫలం బని పలికి యంతకంత [illegible]
వెండియు నిట్లని విలపించె. 2871

శా. హా పీతాంబర హా శుభాంగదధరా హా పూర్ణ తేజోనిధీ
హా పంచాననతుల్యవిక్రమ వినీలాంభోధరాభద్యుతీ
భూపాలాస్త్రహతుండవై గళదసృక్పూరాప్లుతాంగుండవై
యేపుం జేవయు వీడి నీవిటులు జన్యేలాస్థలిం గూలితే. 2872

తే. అనుపమానదుఃఖాక్రాంత నైననన్నుఁ గరుణ వీక్షించి మంజువాగ్వైభవమున
నాదరింప వదేల నాయందు నేర, మించుకైనను లేదు రాత్రించరేంద్ర.

తే. అమితవిక్రమశాలి రణానివర్తి, యైనమాల్యవంతునకు నీ వసురలోక
పాల దాహిత్రుఁడవు పరిభవము నొంది, నేలపైఁ బడియుండె దీవేళ లెమ్ము.

సీ. రాక్షసాధీశ్వర రవికరంబులు నిరాతంకంబులై నేఁడు లంక సొచ్చె
నుద్యానవనములు నుపవనంబులు డాసి విచ్చలవిడి గాడ్పు విసరసాగెఁ
దనమానప్రమునఁ గూరినభీతిఁ దలఁగించి పావకుఁ డుజ్జ్వలుండై వెలింగెఁ
దలఁజూప వెఱచి గొందుల డాఁగియున్ననిర్జరపంక్తిచెలరేఁగి దిరుగఁదొడఁగెఁ

తే. దోయధులు పొంగి మిన్నందె మ్రోయసాగె
గ్రహగణంబులు వినువీది గండుమీఱె
సకలలోకప్రశస్తకంటకుఁడవైన
నీవు గూలినకతమున నిర్జరారి. 2875

మ. ఇనరశ్మిప్రతిమాన మెద్ది యనిలో నెద్దానిచే వైరిపం
క్తినిరాసం బొనరింతు వింద్రపవిమాడ్కిం బూజితం బెద్ది కాం
చనభూషాన్విత మెద్ది యట్టిభవదంచచ్చంద్రహాసంబు లే
ఖనికాయం బటు చూడ నేఁడు తిలశఃఖండంబులై గూలెనే. 2876

తే. అసురపుంగవ ప్రియురాలినట్లు నేఁడు
కదనమేదినిఁ గాఁగిటఁ గదియఁ బట్టి
నాదువదనంబుఁ జూడవు మోద మిడవు
నన్నుఁ గడదానిఁగాఁ జూడ న్యాయమగునె. 2877

తే. అఖిలకామసుభోగము లిచ్చునట్టినీవు
యుద్ధమేదినిఁ బంచత్వ మొందుచుండఁ
బోలఁ గని వేయిప్రయ్యలై పోవ దేల
భిదురమయము గాఁబోలు నాహృదయ మకట. 2878

మ. అని యిట్లా మయపుత్రి శోకజనితవ్యాలోలబాష్పాంబులో
చన యై మోహము పైకొనం దనువు ఝుంఝామారుతోద్ధూతనూ
తనచంచల్లతకై వడి న్వడఁక సంధ్యారక్తనీలాభ్రయు
క్తనవైరావతిభంగి భర్తయొడ మీఁదన్ వ్రాలి దుఃఖించినన్. 2879

వ. అప్పు డామండోదరివిలాపంబుఁ జూచి సపత్నులందఱు భృశాతురలై యద్దేవిం గ్రుచ్చియెత్తి యాసీనం జేసి బాల్యకౌమారయౌవనవార్ధకాద్యవస్థాభేదపర్యాయంబు సంప్రాప్తం బగుచుండ లోకస్థితి రాజసంపత్సహితంబుగా నస్థిర యని యెఱుంగవే నీకింత యజ్ఞానం బేల యని యాశ్వాసించిన నారావణపత్నిశోకంబు డింపక బాష్పధారాసారంబునఁ గుచంబులు దడుపుచు సశబ్దంబుగా రోదనంబు సేయుచుండె నంత నారఘుపుంగవుండు విభీషణుం జూచి యాలస్యం బేల యీయవరోధజనంబుల నెల్ల నూరార్చి పురంబులోనికిం బంచి యితనికి సంస్కారంబు గావింపు మని పలికిన నవ్విభీషణుండు వినయాన్వితుండై ధర్మజ్ఞుండు గావున మనంబున విమర్శించి రామానువృత్తికొఱకు ధర్మార్థసహితం బగువాక్యంబున రామభద్రున కిట్లనియె. 2880

సీ. అవనీశ యితఁడు సంత్యక్తధర్మవ్రతుం డనృతుండు సాధుహింసాభిరతుఁడు
క్రూరుండు క్షుద్రుండు ఘోరకర్ముండు దుర్మదుఁ డన్యదారాభిమర్శనుండు
భ్రాతృరూపుం డైనపరిపంథి నాకితఁ డఖిలలోకాహితుఁ డట్లు గాన
నితనికి సంస్కార మే నొనర్పఁగ నొల్ల గౌరవపూజ్యుండు గాఁడు నాకు

తే. భ్రాత కపరకర్మం బొనర్పనికతమున
మొదల నిందింపుదురు నన్ను మూర్ఖుఁ డనుచు
నవల నితనిదుర్గుణజాత మంతయు విని
సుకృతి యని యెన్నుదురు నన్ను సూరిజనులు. 2881

## రావణశవదహనము.

వ. అని పలికిన విని ధర్మాత్ముం డగు రాముండు వెండియు విభీషణు నవలోకించి నీచేత మత్ప్రియంబె కర్తవ్యంబై యుండు నాచేత భవద్ధితంబె యుపదేశింపం దగి యుండుఁ గావున నారావణసంస్కారంబు నాకుఁ బ్రియంబును నీకు హితంబునుం జేయు నితండు మిక్కిలి యధర్మానృతసంయుక్తుండైనను దేజస్వియు బలవంతుండును రణమునందు శూరుండును మహాత్ముండును శతక్రతుప్రముఖ దిక్పాలురతోడం బోరి పరాజయం బెఱుంగనివాఁడునుం గావున గుణశాలు

శ్యంబువలన సంస్కరించుటకుం దగియున్నవాఁడు వైరంబు మరణాంతంబులు
మత్సంకల్పితప్రయోజనం బంతయు నిర్వృత్తం బయ్యె నీరావణుండు ప్రేతవిష
యంబునందు నీ కెట్టివాఁడు నాకు నట్టివాఁ డయ్యె నితనికి విధిపూర్వకంబుగా
సంస్కారంబు గావించి నీవు యశోలాభంబు వడయు మని పలికిన నారాఘవుని
వచనంబువిని యవ్విభీషణుండు రావణునకు యాయజూకానురూపసంస్కారంబు
గావింప సమకట్టి సుగంధిద్రవ్యవిశేషయుక్తంబుగాఁ జందనకాష్ఠంబులచేతఁ
బద్మకోశీరంబులచేఁ జితిగావించి వేదోక్తక్రియావిశేషంబున రాంకవాస్తరణో
పేతం బైనయచ్చితామధ్యంబున రావణునికళేబరంబిడియె నప్పుడు ఋత్విజులు
వేదవిహితక్రమంబున నంత్యేష్టి గావించి పితృమేధంబుఁ జేసి యాగ్నేయభా
గంబున వేదియందు యథాస్థానంబునఁ బావకుం బ్రతిష్ఠించి శాస్త్రదృష్టవిధి
చేతఁ దన్మధ్యంబునఁ బశువిశసనంబుగావించి తదంగంబులు ఘృతంబునం దడి
పి హోమంబుగావించి దధిసహితఘృతపూర్ణం బైనస్రువంబగ్నిలోనం బడవై
చి శకటంబును ముసలంబు నులూఖలంబును దారుపాత్రంబులు నరణియు నుత్త
రారణియు శ్రుతిస్మృతిప్రోక్తవిధానంబున సర్వంబును యథాస్థానంబున నునిచి
రాజగవి నాలంభించి తచ్చర్మంబుచేత నాచ్ఛాదించి రావణునికళేబరంబుగంధ
మాల్యవస్త్రంబులచేత నలంకరించి లాజలు చల్లి రంత విభీషణుండు విధియు
క్తంబుగా రావణున కగ్నిసంస్కారంబు గావించి స్నానంబుఁ జేసి యార్ద్రవస్త్ర
ధరుండై విధిపూర్వకంబుగా నతనికిఁదిలోదకంబులొసంగి నమస్కరించి మండో
దరీప్రముఖనిఖిలాంతఃపురకాంతల సాధువాక్యంబుల ననూనయించి లంకకుం
బనిచి కృతకృత్యుం డై గ్రక్కున రామునొద్దకుం జనుదెంచి వినీతుండై గొలిచి
యుండె రాముండును రిపువధజనితహర్ష వదనుం డై సుగ్రీవవిభీషణహనుమదాది
సుహృత్సమేతుం డై వృత్రాంతకుఁ డైనపురందరునికరణిఁ దేజరిల్లుచుండె నంత
రావణవధంబు విలోకించి దేవగంధర్వదానవులు రావణునివధంబును రాముని
పరాక్రమంబును వానరులయుద్ధంబును సుగ్రీవునిమంత్రిత్వంబును లక్ష్మణుని
యనురాగంబును వీర్యంబును నానాప్రకారంబుల వక్కాణించుచు మఱియు
శుభకథాప్రసంగంబులు సేయుచుఁ బరమానందభరితాంతఃకరణులై తమతమ
విమానంబులతోఁ గూడ నిజనివాసంబులకుంజని రప్పుడు రాముండు మాతలిం
బూజించి యీదివ్యరథంబు గొని నీవు దివంబునకుం జను మని పలికిన నతండు
రామునిచేత ననుజ్ఞ వడసి శిఖిప్రభం బైనయమ్మహనీయస్యందనంబుతోఁగూడ
నింద్రుపాలికిం జనియె నంత రాముండు పరమప్రీతుం డై సుగ్రీవుం గౌఁగిలిం
చుకొని హరిశ్రేష్ఠులచేతఁ బూజ్యమానుం డై లక్ష్మణసహితంబుగా నిజబలంబు
లోనికిం జనుదెంచి తనపార్శ్వంబునఁబరమానందప్రవర్ధమానతేజుండై యలరు
చున్నలక్ష్మణు నవలోకించి యిట్లనియె. 2882

—ః శ్రీరాముఁడు విభీషణుని లంకారాజ్యపట్టాభిషిక్తునిం జేయ లక్ష్మణుని నియోగించుట. ః—

మ. అనఘాత్ముండు మహోపకారి మన కత్యానందసంధాయకుం
డనురక్తుండును భక్తుఁడు న్వినయవిద్యాదానసంపన్నుఁడు న్
ఘనబాహుండు విభీషణుం డితని లంకారాజ్యపట్టాభిషి
క్తునిఁ గావింపుము నాదువాక్య మఖిలస్తోత్రార్హమై చెల్లఁగన్. 2883

ఆ. దేవసమ్మతుండు దితిజాన్వయవరుండు, దోషరహితుఁ డీవిభీషణుండు
నదభిషేకసలిలసంక్లిన్నమస్తకుం, డగుచు నుండఁ జూడ హర్ష మొదవు. 2884

చ. అన విని లక్ష్మణుండు హృదయంబున హర్షము నివ్వటిల్లఁగా
గనకఘటంబుల న్నిఖలకంధిజలంబుల బట్టి తెండు మీ
రని విపినాటులం బనుప నాదట వారలు లక్ష్మణుండు చె
ప్పినపగిదిం బయోనిధిక్రృపీటములం గొని వేగ వచ్చినన్. 2885

తే. లక్ష్మణుం డంత రయమున లంకలోని
కరిగి సుముహూర్తమునఁ బరమాప్తు నలవి
భీషణుని హేమమయభద్రపీఠిమీఁద
నునిచి మంగళవాద్యనిస్వనము లెసఁగ. 2886

ఉ. తా నొకహేమకుంభము ముదంబునఁ జేకొని రాఘవాజ్ఞ చే
వానరసంవృతుం డగుచు వారక రాక్షసమధ్యమందు సు
శ్రీనిధిమంత్రదృష్టవిధిచే నభిషిక్తునిఁ జేసె వేడ్కతో
దానవరాజ్యమం దఖిలదైత్యవిభూషణు నవ్విభీషణున్. 2887

క. ఈకరణి లక్ష్మణుం డభిషేకము గావించి ప్రీతచిత్తుం డగుచున్
చేకొని చిరకాలం బవ్యాకులమతి లంక నేలుమని దీవించెన్. 2888

తే. అప్పు డభిషిక్తుఁ డైనమహాత్ము నలవి
భీషణునిఁ జూచి భూరిసంతోష మడర
హితులు మంత్రులు సేనాధిపతులు భక్తి
మెఱయఁ బూజించి మ్రొక్కిరి వరుసతోడ. 2889

ఆ. రామదత్త మైనరాజ్యంబు ప్రాపించి, యలవిభీషణుండు హర్షవికసి
తాస్యుఁ డగుచు రాఘవానుజయుక్తుఁ డై, పరమసఖులు వెంట నరుగుదేర.

చ. మునుకొని లాజ లక్షతలు మోదుకము ల్సురపుష్పదామముల్
గొని రఘువర్యుపాలికి నకుంఠితవైఖరి నేగుదెంచి స
ద్వినయ మెలర్పఁ దాను గొనితెచ్చినమంగళవస్తువు ల్లగ
జనవరమౌళికిం దదనుజన్మున కర్పణ చేసె నంతయున్. 391

తే. దోషవర్జితుఁ డైనవిభీషణుండు
తగ నొసంగినమంగళద్రవ్యములను

రామభద్రుండు తప్పిదియార్థము గ్రహించి
యతని మన్నించి నమ్మోద మతిశయిల్ల 2892

—రాముఁడు హనుమంతుని సీతకు నిజజయంబుఁ జెప్పఁ బంచుట.—

ఉ. బంగరుగట్టుభంగిఁ దనపార్శ్వమునం గమనీయగాత్రుఁడై
పొంగుచు భక్తిహస్తములు మోడ్చి వినమ్రత నొంది యున్నవా
నిం గపివంశశేఖరు ననింద్యచరిత్రుని వాయుపుత్రుని
న్నంగతి మీఱఁ గాంచి నృపసత్తముఁ డంచితసూక్తి నిట్లనున్. 2893

సీ. అనఘాత్మ నీవు దైత్యాధీశుఁ డగువిభీషణునకుఁ జెప్పి తచ్ఛాసనమున
లంకలోనికిఁ బోయి లలి రావణునిగృహం బటు ప్రవేశించి సమంచితముగ
వై దేహితోడ రావణుఁడు సంగ్రామరంగమునఁ జచ్చుటయును గడిమిమెఱయ
సేప లక్ష్మణవానరేంద్రవిభీషణయుతముగాఁ గుశలినై యుండుటయును

తే. సర్వము నెఱుంగఁ జెప్పి యాచంద్రవదన
కుశల మరసి సందేశంబు గొని రయమున
రమ్మనుచుఁ బల్క నవ్వానరప్రవరుఁడు
రామునకు మ్రొక్కి వీడ్కొని రయమునఁ జని. 2894

తే. దానవులచేత సంపూజ్యమానుఁ డగుచు
రావణునిమందిరము సొచ్చి రమ్యకాంతిఁ
దనరునంతఃపురోచిత వనము చేరి
కనకమయశింశుపాఖ్యవృక్షంబుక్రింద. 2895

సీ. అబ్జవైరివిహీన యైనరోహిణిభంగి విన్ననై కనుపట్టు చున్నదాని
శార్దూలమధ్యదేశమునఁ జిక్కినలేడిగున్నమాడ్కి వడంకు చున్నదానిఁ
జెక్కిటఁ జెయిఁ జేర్చి చింతాభరంబున నూరక ధ్యానించు చున్నదాని
రామునివిజయంబు రావణుపంచత్వ మొయ్యన వినఁ గోరు చున్నదాని

తే. గాంతు నెప్పుడు వీక్షింపఁ గల్గునో య
టంచుఁ దనడెందమునఁ దమకించుదాని
జనకజను జూచి నమ్రుఁడై సంభ్రమంబు
వినయగౌరవ మెసఁగ వందన మొనర్చె. 2896

తే. ఇటులు సాష్టాంగ మొనరించి నిటలదేశ
కలితకరపుటుఁడై మ్రోలఁ గొలిచి యున్న
శ్వసనసుతుఁ జూచి జానకి సాంద్రమోద
కలిత యయ్యును దా నేమి పలుక కుండె. 2897

—హనుమంతుఁడు రామవిజయరావణవధంబులను సీతాదేవి కెఱింగించుట.—

వ. అప్పుడు హనుమంతుం డమ్మహాదేవిముఖప్రసాదాదికం బుపలక్షించి వినయ
వాక్యంబున నిట్లనియె. 2898

చ. జనకజ రాముభద్రుఁ డనుజన్మవిభీషణపద్మమిత్రనం
దనులను గూడి వానరయుతంబుగ సేనుము నొంది యున్నవాఁ
డనిమిషలోకకంటకు దశాస్యునిఁ జంపి జయాభిరాముఁ డై
తనకుశలంబు దెల్పుటకుఁ దద్దయు వేడుకఁ బంప వచ్చితిన్. 2899

క. జననీ లక్ష్మణునయమున, ననిశంబు విభీషణునిసహాయత రఘురా
మునిదివ్యసాయకంబుల, దనుజవరుం డీల్గె బలయుతంబుగ నాజిన్. 2900

క. ఖండనమున రాముఁడు శిత, కాండంబుల రిపునితలలు ఖండించి కృతా
ర్థుం డయి పరమానందా, త్ముం డయి కుశలంబుఁ జెప్పఁ బుత్తెంచె రహిన్.

ఉ. వీఁక రఘూద్వహుం డసురవీరునిఁ బంక్తిముఖు న్వధించు నం
దాఁక శుభాంగి నీ విచట దైవవశంబున మేనఁ బ్రాణముల్
దేఁకువఁ దాల్చి యుంటి వీఁక ధీరవరేణ్యుని రాముఁ గూడి య
స్తోకసుఖంబు లొందెదవు శోకము సర్వము దీఱె నేఁటికిన్. 2902

క. పగతుఁడు రావణుఁ డీల్గెను, దగ విజయము మాకుఁ గలిగెఁ దప్పక నేఁ డీ
నగరము వశగత మయ్యెను, మగువా వగ లుడిగి స్వస్థమానస వగుమా. 2903

తే. జలధి బంధించి రాముని బలయుతముగఁ
దోడుకొని వచ్చి పగతుని ద్రుంచి ప్రతిన
నెఱపునందాఁకఁ గంటికి నిద్ర యెఱుఁగ
జనని నేఁటికి నామాట సత్య మయ్యె. 2904

ఉ. ఇందునిభాస్య యొంటిమెయి నీపురిలోఁ జెఱ నుంటి విన్నినా
ళ్లందుకు నాత్మలో వగచినందునఁ గార్యము లేదు వేడ్క లిం
పొంద నిజేశుఁ గూడి విభవోన్నతి నింక నయోధ్యలో భవ
న్మందిరసీమయందు గరిమ న్విహరించెద వీవు జానకీ. 2905

మ. అని యిటు గంధవాహసుతుఁ డాడిన నామిథిలాధినాథనం
దన దశకంఠరాక్షసవధశ్రవణప్రభవప్రమోదసం
జనితనితాంతబాష్పజలసంభృతలోచన యై మనంబులో
నెనసినపారవశ్యమున నేమియుఁ బల్కక యూరకుండినన్. 2906

క. అనిలకుమారుఁడు వెండియు, జనకకుమారికనుజూచి జననీ చిత్తం
బునఁ జింతఁ బూని నాతో, మునుకొని భాషింప వేల ముదితవు గమ్మా. 2907

తే. అనుచుఁ బావని పల్కిన నమ్మహీజ, విపులసమ్మోదవికసితవదన యగుచుఁ
బవనతనయుని వీక్షించి పలికెఁ బరను, హర్షగదదస్వరమున నతనితోడ. 2908

తే. వీరశేఖర మత్ప్రాణవిభునివిజయ, కలితశుభవార్త యాలించి గాఢమోద
కంధివీచిపరంపర ల్గప్పికొనఁ క్ష, ణాంతరం బేను నిర్వాక్య నైతి నిట్లు. 2909

సీ. వానరవర్య సర్వప్రియంబులలోన నత్యుత్తమప్రియమైనరామ
భద్రునివిజయంబు పాపాత్ముఁ డగుపంక్తివదనునినిధనంబు వరుసఁ జెప్పి
యసమానసంతోష మొసఁగితి నీయట్టి యుపకారి వేఱొక్కఁ డుర్విఁ గలఁడె
గణుతింప నీప్రియాఖ్యానంబునకుఁ దుల్య మగువస్తువొండుగ నెయ్యదియు లేదు
తే. పరగఁ ద్రైలోక్యసామ్రాజ్యపద మొసఁగిన, నాకపర్వతమంతధనం బొసఁగిన
వివిధరత్నంబు లిచ్చినఁ బ్రియవచనము, లెన్నిచెప్పిన దీనికి నీడు గాదు. 2910
క. నా విని సంతోషము మది, నావిర్భవ మందఁ బ్రకటితాంజలి యగుచు
న్నావని గ్రమ్మఱ వినయ, ప్రావీణ్య మెలర్ప నద్ధరాసుత కనియెన్. 2911
తే. సౌమ్యమై సారవంతమై శ్లాఘ్యమై మ,హార్థమై సుంజుమధురమై యమృతసార
మై మనోజ్ఞమై నీపలు కలరుచున్న, దిట్లు భాషింపఁగా నర్హ వీవె తల్లి. 2912
తే. అమితరత్నౌఘ మిచ్చినయంతకంటె, నమరరాజ్యం బొసంగినయంతకంటె
దేవి నీవచనంబు నాభావమున క,నంతసమ్మోదసంపాది యయ్యె నేఁడు. 2913
తే. వినుతుఁ బరిమార్చి రాముండు విజయలక్ష్మి, నధిగమించినకతన ననర్ఘ దేవ
రాజ్యరత్నాదిగుణము లర్థంబువలనఁ, బరఁగ నాచే నధిష్ఠింపఁ బడియె నేఁడు.
తే అనిన విని సీత మరల నిట్లనియె యుక్తి, యుక్తమష్టాంగబుద్ధిసంయుక్తమమృత
సిక్తమాధుర్యగుణవిభూషితము నైన, యుక్తిని వచింప నీవె యర్హుండ వనఘ.
వ. మఱియు భవదీయవాక్యం బత్యంతలక్షణసంపన్నంబై యున్నది. 2916
చ. అనఘచరిత్ర నీవు పృమదశ్వనుతుండవు ధార్మికుండవు
న్ఘనుఁడవు శ్లాఘనీయుఁడవు కాంతియుఁ దేజము శౌర్యసత్త్వము
ల్వినయము సుస్థిరత్వము వివేకము దాక్ష్యము విక్రమంబు నో
ర్పును మఱి సర్వసద్గుణసమూహము నీయెడ నుండు నిత్యమున్. 2917
క. అన విని హర్షవిశేషం, బున నుబ్బి సమీరసుతుఁడు మోడ్పుఁగరములన్
వినయవిధేయుం డై య, య్యినవంశజుపత్నితోడ నిట్లని పలికెన్. 2918

## సీతాదేవి తనకుఁ గావలియున్న రాక్షసస్త్రీలఁ జంపం జూచినహనుమంతుని వారించుట.

వ. దేవి పతిదర్శనకాంక్షివై దిక్కుఱి యశోకవనికామధ్యంబున దుఃఖించుచున్ననిన్నాశ్వాసింపక భయంకరాకారలై క్రౌర్యంబున దారుణవాక్యంబులఁ దర్జించినయీరాక్షసస్త్రీల వధియింప నిశ్చయించితి ననుజ్ఞ యొసంగితివేని యిప్పుడ చరణజానుజంఘోరుపాణిముష్టిదంతనఖప్రహారంబుల నిందఱ నిశ్శేషంబుగా వధించెదఁ జిత్తంబుకొలంది యానతి మ్మనిన నప్పుహాదేవి యమ్మరున్నందనున కిట్లనియె. 2919
సీ. శ్వసననందన రాజసంశ్రయవశ్యలై పరులశాసనమునఁ బనులఁ జేయు
నట్టిదాసులమీఁద నలుగఁ జెల్లదు భాగ్యవైషమ్యయోగంబువలనఁ బూర్వ

దుష్కృతంబున నింత దురవస్థ దొరకొనె స్వకృతకర్మఫలంబు వ్యర్థమగునె
తనపూర్వకర్మంబు దక్క సుఖంబు దుఃఖము సేయ వేఱొక్క కర్త గలఁడె

తే. రావణునియాజ్ఞ నీదైత్యరమణు లెల్ల, నన్నుఁ దర్జించి రిందాఁక నయము విడిచి
యతఁడు దెగియె నింకేమి సేయంగఁ గలరు, వీరిఁ జంపిన మన కేమి పేరు గలదు.

వ. వానరోత్తమా మున్నొక్క మహారణ్యంబులోన నొక్క వ్యాధుం డొక్క శార్దూలంబుచేత ధర్షింపంబడి సాధ్వసంబున నొక్క వృక్షం బెక్కిన నావృక్షంబు మీఁద నంతకు మున్నొక్క భల్లూకం బెక్కి యుండి తన్ను విలోకించి మిక్కిలి భయంబున వడంకుచున్న వ్యాధున కభయంబు దెల్పి తనయొద్దకుం దిగిచికొని నీవు నిర్భయంబున నిద్రింపు మేను మేల్కాని యుండెద నని పలికినఁ దద్వచన ప్రకారంబున వ్యాధుండు నిద్రించుచుండ నప్పు డావృక్షంబు క్రిందనే యుండి వ్యాఘ్రంబు భల్లూకంబుతో నీవ్యాధుండు మన కంతకుండు దైవయోగంబున నిప్పుడు చిక్కె వీనితోడి దేమి పని వీని దిగం ద్రోయు మేను వీని భక్షించి యథేచ్ఛం జనియెద దీనం జేసి నీకును నాకును సఖ్యంబు గలుగు నని పలికిన నాభల్లూకంబు శరణాగతుం డైనవీనిం బరిత్యజించిన ధర్మహాని యగు నీచెప్పినట్లు సేయ నోప నని పలికి వ్యాధుం బ్రబోధితుం జేసి యే నింక నొక్కింతసేపు నిద్రించెద నీవు మేల్కాని యుండు మని పలికి భల్లూకంబు నిద్రించిన నావ్యాఘ్రంబు వ్యాధునితో నీభల్లూకంబు భక్ష్యలుబ్ధం బై నీతోడ మాయావాదంబుఁ జేసె దీనిం బడఁద్రోచితి వేని యేను భక్షించి చనియెద నంత నీవు నిర్భయంబున వృక్షంబు డిగ్గి యథేచ్ఛం జనియెద వట్లు గావింపు మని పలికిన వ్యాఘ్రచోదితుండై వృక్షంబుమీఁదనుండి ఋక్షంబు క్రిందం బడఁద్రోచిన నది యభ్యాసబలంబున శాఖాంతరం బవలంబించి దిగువం బడక కృతాపరాధుం డైనవీనిం బడఁద్రోయు మని వెండియు వ్యాఘ్రంబుచేత నుచ్యమానం బయ్యును భల్లూకంబు కృతాపరాధుం డైనను వీని నీకొసంగ నని పలికి వ్యాధుని రక్షించె నని పురాణకథ గలదు పరుల నుద్దేశించి పాపం బాచరించువారికిఁ బ్రాజ్ఞులగువారు ప్రత్యుపకారరూపం బైనపాపం బంగీకరింప రపకారులయం దైనఁ బ్రత్యపకారవర్జనరూపం బైనయాచారంబు రక్షితవ్యం బై యుండుఁ బెద్ద లగువారు చారిత్రభూషణులై యుందురు వధార్హు లగునట్టివారియందును సజ్జనునిచేతఁ గారుణ్యంబు కర్తవ్యం బై యుండు లోకంబునం దపరాధంబు గావింపనివాఁ డొకఁడైన లేఁడు దయాశాలి యగువానికి సర్వజనరక్షణంబు యోగ్యంబు లోకంబునందుఁ బరహింసనంబును గ్రామసంచారంబును బాపాచరణంబును రాక్షసులకు స్వాభావికం బైనధర్మం బట్టివారియందు దండనంబు సముచితంబు గా దని పలికిన నవ్వాయునందనుం డవ్వైదేహి కిట్లనియె. 2921

తే. పరమకళ్యాణి నీవు భూపాలమణికిఁ, బతికి రాముని కనురూపపత్నివైతి
వేమనఁగ వచ్చు నీగుణం బేను విభుని, కడకుఁ బనిచెద సందేశంబు నొడువు మింక.

చ. అన విని భూమిపుత్త్రి ముదమంది సమీరకుమారు మోముఁ గాం
చి నెనరు దోఁప నిట్లనియెఁ జెప్పెడిదే మిఁక ముజ్జగంబుల
న్వినుతికి నెక్కినట్టిఘనవిక్రమశాలిఁ గకుత్స్థవంశవ
ర్ధనుని మనోజ్ఞవేషు గుణధాముని రాముని జూడఁగోరెదన్. 2923

ఉ. నా విని వాయుపుత్త్రుఁడు మనంబున సంతస మంది యమ్మహా
దేవిని జూచి పల్కె నతిధీరునిఁ బూర్ణశశాంకవక్త్రుని
న్నాభవజసన్నిభు న్విమతభంజను మిత్త్రసమేతు భ్రాతృసం
సేవితు రాముఁ జూచెదు శచీసతి శక్రునిఁ జూచినట్లుగన్. 2924

క. అని పలికి యతఁడు సాధ్వీ,వనజాలయభంగి నలరు వసుధాసుతకు
న్వినతి యొనరించి వీడ్కొని, చనియె రఘూత్తమునికడకు సమ్మద మెసఁగన్.

వ. ఇవ్విధంబునం జనుదెంచి సముచితంబుగా రాముని సందర్శించి బుద్ధిమంతుం
డగుహనుమంతుం డంజలి గీలించి యమ్మహాత్మున కిట్లనియె. 2926

—హనుమంతునివలన సీతావాంఛితమును విని రాముఁడు చింతించుట.—

సీ. అవనీశ కీశసైన్యములఁ గూర్చుటయును గడలిపై సేతువు గట్టుటయును
పరిపంథి ననిలోనఁ బొరిగొనుటయు మొదలైనయీయారంభ మేనిమిత్త
మామహీసుత నుశోకాభిపీడిత నింక వీక్షింప వలయు నావిమలహృదయ
నీవిజయము విని నిర్గతశోకయై పరమసమ్మోదంబు పాదుకొల్పెఁ

తే. బూర్వకప్రత్యయమున నాపుణ్యసాధ్వి
చాల మది నమ్మి లక్ష్మణసహితుఁ డైన
వానిఁ గృతకృత్యుఁడై యున్నవాని జీవి
తాధిపుని జూడఁగోరెద ననుచుఁ బలికె. 2927

వ. అని విన్నవించిన ధర్మభృద్వరిష్ఠుం డగురాముండు హనుమద్వచనంబు విని
రావణభవనోషితసీతాపరిగ్రహంబునందు మహాలోకాపవాదం బగుననియును
నిర్దోష యైనయద్దేవిపరిత్యాగంబునందు మహాదోషం బగు ననియుం దలంచి
యేమిసేయు వాఁడ నని కించిద్బాష్పపరిప్లుతలోచనుండై దీర్ఘంబుగా వేఁడి
నిట్టూర్పు పుచ్చి పరిశోధన సేయకయె జానకిం బ్రతిగ్రహించితినేని యేతా
దృశదివ్యసుందరి యగుసీత నవలోకించి రావణుం డేల యూరకుండు రాఘవుం
డెంతచపలాత్ముం డని జను లందఱు బహువిధదురితపంకకళంకితచిత్తులై నిష్క
ళంక యగుదేవియందు దోషంబును నాయందు గర్హణంబు నారోపింతు రని
తలంచి జగన్మర్యాదాపాలనార్థం బవతీర్ణుం డైనవైకుంఠుండు గావున శ్రేష్ఠుం
డగువాఁ డెద్దాని నాచరించు నదియె యితరజను లాచరింతు రనున్యాయంబను
సరించి నిష్కల్మషగా జానకి నెఱింగియు లోకాపవాదనివృత్తికొఱకు నద్దేవి
యందుఁ బరుషితుం డైనవాఁడుపోలెఁ బరుషోక్తు లాడుచు నద్దేవి నగ్నిప్రవే

శంబు సేయించి పద్మభవమహేంద్ర ప్రముఖసురశ్రేష్ఠులచేతఁ బ్రార్థితుండై యవ్వల నిత్యశుద్ధ యైనదేవి నంగీకరించుతలంపున భూమి నవలోకించుచు మేఘసంకాశుం డైనవిభీషణున కిట్లనియె. 2928

రాముఁడు సీతం దనయొద్దకుఁ బిలుచుకొని వచ్చుటకు విభీషణుని నియోగించుట.

క. జనకజను శిరస్స్నాతను, ఘనతరదివ్యాంగరాగకలితను నవకాం
చనదివ్యాభరణోపేతను గావించికొని రమ్ము తడయ కిచటికిన్. 2929

క. అన విని విభీషణుఁడు చయ్యన నంతఃపురము సొచ్చి యాత్మీయస్త్రీ
జనములచే ముున్నుగ నా,ఘునివచనము చెప్పి పంపి తోడనె తానున్. 2930

ఉ. మానుగ నయ్యశోకవనమధ్యమునం దొకవృక్షమూలమం
దానరనాథపత్నిఁ గని యంజలిఁ జేసి వినీతగాత్రుఁ డై
జానకి నీవిభుండు నిను సమ్మతిఁ జూడఁగఁ గోరె దివ్యభూ
షానవచేలపుష్పచయచందనభూషిత వై రయంబునన్. 2931

చ. అనుపమయాన మెక్కు మన నాసతి యాతనిఁ జూచి యేను మె
ల్లనఁ బతిపాలి కిప్పు డనలంకృతనై చనుదెంతు నన్న నా
యనఘుఁడు భర్త చెప్పినక్రియ న్జనుదెంచుట లెస్స యన్న నా
ఘనకచ భర్తృదేవతయ గావున దానికి సమ్మతించినన్. 2932

సీ. అపుడు విభీషణు ననుమతి రాక్షసనతులు మైథిలికి మజ్జన మొనర్చి
దివ్యాంబరంబులు దివ్యభూషణములు దివ్యమాల్యంబులు దివ్యగంధ
మర్పించి గై సేసి రంత నాదనుజేంద్రుఁ డద్దేవి ననర్ఘరత్న
ఖచితదివ్యాంబరకలితరక్షోగణరక్షిత మగుదివ్యరత్నయాన

తే. మర్థి నెక్కించుకొని రయ మాన రాము
పాలి కేతెంచి ప్రణతుఁ డై పరమహర్ష
ముప్పతిల్ల మహాసాధ్వి నుర్వీపుత్రి
సీత నర్పించె నవ్వీరశేఖరునకు. 2933

క. దనుజగృహచిరోషిత యగు, జనకసుతను గాంచినంత జననాథకుమా
రునకుఁ బ్రమోదము దైన్యము,ఘనతరరోషంబు మూఁడు గ్రక్కునఁ బొడమెన్.

వ అప్పు డారఘువల్లభుండు తనపార్శ్వగతుం డైనవిభీషణు నవలోకించి నీవు శీఘ్రంబున వైదేహిని మత్సన్నిధానంబునకుం దోడ్కొని రమ్మని యాజ్ఞాపించిన నతండు కంచుకోష్ణీషు లగువేత్రపాణులం జూచి మీరు సర్వజనోత్సారణంబు సేయుం డనిన వారలు ఋక్షరాక్షసవృక్షచరుల సంఘ గుంపులు చేసి దూరంబునకుం దోలిప నుత్సార్యమాణు లగువారలమహాస్వనంబు వాయువుచేత నుజ్జృంభమాణం బైనసముద్రనినిస్వనంబుభంగి నింగిఁ జెలంగె నప్పుడు జాతసంభ్రములై నవారి సంఘ నిరీక్షించి దాక్షిణ్యంబువలనను దద్దర్శనాసహ

నంబువలనను నివారించి సంరబ్ధుండై రోషకషాయితాక్షుండై చుఱుకుఁజూ
పుల విభీషణునిం జూచి సోపాలంభంబుగా నిట్లనియె 2935

క. సన్నాదరింప కేటికిఁ, బన్నుగ వానరుల గాసిపఱఁ జేసెదవీ
రెన్నఁగ స్వజనము మాకిటఁ, గ్రన్నన మరలింపు మత్సకాశంబునకున్. 2936

విభీషణుఁడు సీతాదేవిని రామునకు సమర్పించుట.

తే. దనుజవర సాలములును వస్త్రములు మఱియు
గేహములు ధాత్రిలోఁ దిరస్క్రియలు గావు
తివిరి యిట్టివి రాజసత్కృతులు గావు
వారిజాక్షికి వృత్తంబె వరణ మరయ. 2937

తే. పరిణయమునందు విభునియభ్యాశమందు
వ్యసనములయందుఁ గృచ్ఛ్రములందు మఱియు
యాగమందు స్వయంవరమందు సమర
మందు సతిదర్శనంబు దూష్యంబు గాదు. 2938

తే. ఈయువతి యుద్ధగతయును గృచ్ఛ్రగతయు
వ్యసనసంగతయును మదభ్యాశగతయుఁ
గాన రాక్షసనాథ యీలోకముల నేత్ర
దర్శనమునందు దోష మింతయును లేదు. 2939

క. కావున నీసీతను రక్షోవర నాకడకు వేగ గొనితె మ్మిపుడీ
దేవి సుహృద్గణసహితుఁడ, నై వెలిఁగెడునన్నుఁ బ్రీతి నవలోకించున్. 2940

క. అని యాజ్ఞాపించిన నద్దనుజేంద్రుఁడు పుణ్యసాధ్వి ధరణీపుత్త్రిన్
గొనితెచ్చి పుణ్యరతుఁ డగు, జనపతిపార్శ్వమున నునిచె సమ్మద మలరన్. 2941

వ. అప్పుడు లక్ష్మణసుగ్రీవులును హనుమంతుండును రామునివాక్యంబు విని మిక్కిలి
వ్యథితమనస్కులై కళత్రనిరపేక్షంబులైన యింగితంబులచేత రామునిసీతయం
దప్రియుండైనవానిఁగా వితర్కించుచుండి రిట్లు వైదేహి విభీషణానుగతయై
రామునిపార్శ్వంబునకుం జనుదెంచి వ్రీడాసంకుచితసర్వాంగియై వానరసభా
మధ్యంబున నార్యపుత్త్రా యని మధురంబుగా నుచ్చరించి వదనంబునఁ బటం
బొత్తి రోదనంబు గావించి పదంపడి పతిదేవతగావున నచింతితరామపునస్సం
దర్శనంబున విస్మయంబును బ్రియదర్శనంబున హర్షంబును స్వాభావికంబైన
స్నేహంబును మనంబున ముప్పిరిగొన రాకాశశాంకవదన యగుజానకి సౌమ్య
తరవదనయై యుదితపూర్ణచంద్రకాంతంబగుటవలన నతిసౌమ్యంబైనరాముని
వదనంబు విలోకించి మనోగతంబైనదుఃఖంబు నపనయించె నప్పుడు తన
పార్శ్వంబున వినమ్రశరీరిణియై యున్నసీత నవలోకించి రాముండు హృద
యాంతర్గతక్రోధుండై యిట్లనియె. 2942

చ. సరసిజనేత్ర యాలమున శాత్రవునిం బరిమార్చి నిన్ను వే
చెఱ విడిపించి పౌరుషముఁ జెల్లఁగఁ జేసి యమర్షలాభము
న్బరువడిఁ గాంచి చిత్తమున నాటిన వైరికృతావమానము
న్వరుస విషాదము న్బాటికినైచి కృతార్థుఁడ నైతి నెంతయున్. 2943

క. పౌరుషము దృష్ట మయ్యెను, జారుముఖీ శ్రమము నేఁడు సఫలం బయ్యె
న్వారక ప్రతిజ్ఞ దీరెను, ధారుణిలో నేను జాల ధన్యుఁడ నైతిన్. 2944

రాముఁడు సీతాదేవితోఁ బరుషోక్తులు వలుకుట.

ఉ. ఏ నెడఁబాసియున్న యెడ నీచలచిత్తుఁడు రావణుండు నిర్
గానన సీమనుండి చులుక న్వన మ్ముచ్చిలి దెచ్చె నింతయు
న్మానిని దైవకృత్య మది మానుకపౌరుషశక్తిచే రహి
న్వాని జయించితి న్ద్రిభువనంబున భూరియశంబు గాంచితిన్. 2945

క. తన కొదవిన యవమానము, ననుపమ తేజమున నవల నటు ద్రోయఁగఁ జా
లనియల్పతేజుఁ డగు పురుషునకుం బురుషార్థ మరసి చూచినఁ గలదే. 2946

సీ. అబ్ధిలంఘన మాదియగు మరుత్సుతుపరిశ్రమ మంతయును నేఁడు సఫల మయ్యె
దరుచరసైన్యప్రదానాదిసుగ్రీవయత్న మంతయు. నేఁడు సార్థ మయ్యె
సామ్రాజ్యకాంక్షియై శరణుఁ జొచ్చినవిభీషణుని కామము ఫలసహిత మయ్యెఁ
బ్రాణము ల్దాఁపక రణముఁ జేసిన కపిశ్రేష్ఠులు కృతకార్యసిద్ధు లైరి

తే. లక్ష్మణునివిక్రమము సఫలత వహించెఁ
బరఁగ మత్పౌరుషంబు సాఫల్య మొందె
భువనకంటకుఁ డైనయీదివిజవైరి
ఘనరణంబున హతుఁ డైనకారణమున. 2947

వ. అని పలికిన విని. 2948

క. చకితమృగేక్షణ యగు జానకి నిజవల్లభునిమాట నైరాశ్యద్యో
తకమై యుండుట కడలుచు, నకటా యని లోచనముల నశ్రులు నించెన్. 2949

తే. ఇట్లు శోకించుచున్నమహీజఁ గాంచి, భూవిభుండు ప్రభూతఘృతావసిక్తుఁ
డైనదీప్తపావకునిచందానఁ గనలి, యంత కంతకు మదిఁ గ్రోధ మగ్గలింప. 2950

క. రయమునఁ దిర్యక్ప్రేక్షిత, నయనుం డై బొమలు మోమున న్ముడివడ వెం
డియు నెల్లవారు విన నిర్దయుఁడై పరుషోక్తి సద్ధరాసుత కనియెన్. 2951

క. మానము గలనృపుచే నవమానముఁ బాపుటకు సదభిమానంబున నె
ద్దాని నొనరింపఁగాఁ దగు, దానిం గావించి యేను ధన్యుఁడ నైతిన్.

శా. ప్రాచుర్యంబుగఁ గుంభసంభవమునీంద్రశ్రేష్ఠుచే దక్షిణా
శాచక్రంబు జయింపఁబడ్డగతి దోశ్శక్తి న్రహి న్నేఁడు నీ

వో చంద్రాసన శత్రుహస్తగతవయ్యు న్బల్మిడిం గ్రమ్మఱ
న్నాచే నిర్జిత వైతి వీక్షియ ననూనప్రౌఢి దీపింపఁగన్. 2953

చ. వనచరసేనఁ గూర్చుటయు వారినిధి న్వడి దాఁటి వచ్చుటల్
ఘనసమరంబులోన దశకంఠుని బుత్త్రసుహృద్యుతంబుగా
ననుపమశక్తిఁ ద్రుంచుటయు నాదిగ నీశ్రమ మంతయుం ఘనా
ఘననిభవేణి నీకొఱకుఁ గాదని యుల్లమునం దెఱుంగుమా. 2954

క. పౌరుషమును జారిత్రము, భూరికులాచారధర్మము న్బోషించుటకుం
మీఁటి యపవాద ముడుగుట, కీరితి నొనర్చినాఁడ నిది నిజ మబలా. 2955

తే. ప్రాప్తచారిత్రసందేహ వైన మదగ్ర, భాగమున నున్ననీ వక్షిరోగి మ్రోల
నున్నదీపంబుచందాన నువిద నాకు, మిగులఁ బ్రతికూల వైతివి వగపు లేల.

సీ. పరగృహోషిత వైనపత్నిని గ్రమ్మఱఁ గులమును దేజంబు గలపురుషుఁడు
మిగుల సుహృల్లేఖ్య మగుమానసంబునఁ గైకొనఁ దలఁచునె వీఁక రావ
ణాంకపరిభ్రష్ట వై దుష్టదృష్టిచేఁ బరిదృష్ట వైనని న్మరల నెట్లు
గైకొందు రిపుహస్తగత వైనయశమును గ్రమ్మఱఁ గొంటి దోర్బలముపేర్మి

తే. నబల మాకు నీతోడికార్యంబు లేదు, రక్తి లేదు నీమీఁదియాసక్తి లేదు
ప్రజ్ఞ లేటికి మాచే ననుజ్ఞ వడసి, యెచటి కేనియు నరుగు మింకేమి గలదు.

క. తనమందిరమునఁ జిక్కిన, ఘనవేణిని దివ్యరూపఁ గాంతను నిన్నుం
గనుఁగొని యిన్నాళ్లేటికి, దనుజాధముఁ డూరకుండుఁ దద్దయుఁ దాల్మిన్. 2958

వ. పుత్త్రసదృశు లైనలక్ష్మణభరతసుగ్రీవవిభీషణులలో నెవ్వని నైన నొక్కని నాత్మ
భరణార్థం బనుసరింపు మని పలికినఁ బ్రియశ్రవణార్హ యైనయవ్వైదేహి సరో
షుం డైనప్రియునివలనఁ బరుషంబును రోమహర్షణంబు నశ్రుతపూర్వంబును
రూక్షంబు నైనయప్రియవచనంబు విని గడగడ వణంకుచు గజేంద్రహస్తా
భిహత యైనవల్లికి క్షీరంబు నించినచందంబున బాష్పంబు నించి ప్రవ్యథి
తాంతరంగ యై లజ్జాభరంబున మొగంబు వాంచి నిట్టూర్పు సెలఁగ వదనార
విందంబు గంద నమందశోకతాపంబు పైకొన దుఃఖరసాధిదేవతయుం బోలెఁ
జూపట్టుచు బాష్పగద్గదకంఠి యై మెల్లన నిజభర్త కిట్లనియె. 2959

సీతాదేవి రామునిమాటలు విని పరితపించుట.

సీ. హృదయాధినాథ ప్రాకృతుఁడు ప్రాకృతనట్ల కర్ణదారుణ మైనకఠినవాక్య
మిట్లేల పలికితి విటువంటిమాట నీ వనుట కే వినుట కనర్హరూప
మై యున్న దిపుడు మహాత్మ నీవు దలంచినట్టిదుర్జాతి గా నర్కచంద్ర
పావకు లానతి గాఁ బలికితి నిమ్మాట ధరలోన దుష్టకాంతలప్రచార

తే. మరసి స్త్రీజాతి యంతయు నట్టి యంచుఁ
జిత్తమున నెంచితివి నాదుచిత్తవృత్తి

యాదినుండి పరీక్షిత మయ్యె నేని
వంచన యిఁదేల విడువుము వట్టిశంక. 2960
దుఃఖభరమున నవశనై దుష్టదైత్యు, గాత్రసంస్పర్శ మొందితిఁ గాని నాకుఁ
గామకారంబు లేదు నిక్కముగ నందు, దైవ మటు చేసె నుదపరాధంబు లేదు.
తే. దనుజుఁ డప్పుడు ననుఁ గేల దాకినందు, కధిప జీవితత్యాగంబునం దొకింత
శక్తి గలదేని యప్పుడే చత్తు నవశ, నగుటఁ జేసి చావంగ రాదయ్యె నాకు.
ఆ. పరులచే గ్రహింపఁబడుటకు శక్యంబు, గాని దగుట నాదుమానసంబు
నృపవరేణ్య యపుడు నీమీఁద వర్తించెఁ, జిక్కె గాత్ర మేమి సేయుదాన.
వ. దేవా చిరకాలంబున నుండి నొక్కచోట సహసంవాసంబును సహసల్లాపంబును సహసంచారంబును సహక్రీడయు సహసంసర్గంబునుం గావించినవాఁడవయ్యు మత్స్వభావం బెఱుంగని కారణంబున నేను మిక్కిలి హతనైతి నింత యనుమానంబు మనంబున నిడికొని యుండి నాఁటికి నాఁడే విసర్జింపక మత్కుశలం బరసి రమ్మని హనుమంతు నేల పంచితి వప్పీరోత్తముండు ప్రత్యక్షంబుగా నప్పటిమద్వృత్తాంతంబంతయు నెఱింగి యున్నవాఁడు నీవలన నైరాశ్యం బెఱింగిన నే నప్పుడె ప్రాణత్యాగంబు సేయుదు దానం జేసి నా కింతకాలంబు భవద్వియోగజనితవ్యథ లేకయుండు నీకును బ్రాణసందేహకరం బైనయీవ్యథాపరిశ్రమంబు లేకుండుభవత్సఖు లైనసుగ్రీవాదులకును నిష్ఫలం బైనయీపరిక్లేశంబు గలుగకుండు లఘుచిత్తునిచేతంబోలె నీచేత స్త్రీత్వంబు పురస్కరించుకొని క్రోధంబు ప్రకటింపంబడియెఁ గాని మచ్ఛీలంబు విదితంబు గాదయ్యె జనకవ్యాజంబున వసుధాతలంబున నుండి యేను బొడముటయును బాల్యంబున నుండి మత్సుచరిత్రంబును సదాచారంబును విచారింప వైతివి బాల్యంబునందు నీచేత నాచరింపంబడిన పాణిగ్రహణం బప్రమాణీకృతం బయ్యె మదీయశీలంబును నీయందుం గలభక్తియు సర్వంబును వెనుకకుం ద్రోచితి వని పలికి రోదనంబు సేయుచుఁ దత్పరిసరంబున దీనవదనుండై చింతించుచున్నలక్ష్మణు నవలోకించి యిట్లనియె. 2964

సీతానియోగంబున లక్ష్మణుండు చితి యొనర్చుట.

సీ. అనఘాత్మ యేను మిథ్యాపవాదము నొంది జీవింప నేర్తునే చింత యేల
యీవ్యసనంబున కెలమి భేషజ మైనచితిఁ జేర్పు మిప్పుడెల్ల హితులమ్రోల
సద్గుణంబులచేత సంప్రీతి నొందనిభర్తచే విడువంగఁ బడిననాకుఁ
గరము ప్రమాణంబు గావించుటకు నర్హ మైన ప్రదీప్తాగ్నియందుఁ జొత్తు
తే. ననిన నాలించి లక్ష్మణుఁ డన్న మోము
గని తదాకారసూచితకార్యభావ
మెఱిఁగి తదనుమతంబున హరులు వెఱఁగుఁ
జెంద దృఢకాష్ఠములచేతఁ జితి యొనర్చె. 2965

చ. వెఱవక నిష్ఠచే నపుడు వీరపతివ్రత యైనసీత చె
చ్చెరఁ బతికిం బ్రదక్షిణముఁ జేసి సురాలికి భూసురాలికి
న్వరుస నమస్కరించి యలవహ్నిసమీపముఁ జేరి హస్తముల్
స్థిరమతి ఫాలభాగమునఁ జేర్చి జనంబు వినంగ నిట్లనున్. 2966

సీతాదేవి యగ్నిప్రవేశము సేయుట.

సీ. అనిశంబు మచ్చిత్త మాత్మనాథునియందుఁ దవిలి వర్తించుట తథ్య మేని
వితతదుష్టత్వశంకిత నైనయే నుర్వి నతిశుద్ధచారిత్ర నైతి నేని
కరము వాఙ్మానసకర్మంబుచే మనోధిపుమాట మీఱి వర్తింప నేని
రవిచంద్రదిగ్వాయురాత్రిసంధ్యాదినభూనభంబులు సర్వభూతములును
తే. సకలదిక్పాలకులు నాదుసచ్చరితము, సర్వము నెఱింగి యుండుట సత్యమేని
సవనహేతువు లోకైకసాక్షి యైన, చిత్రభానుండు నన్ను రక్షించుఁగాక. 2967

చ. అని యిటు పల్కి తప్తకనకాభశరీరిణి తప్తహేమమం
డన యగుసీత వహ్నికిఁ బ్రదక్షిణము న్దగ నాచరించి చ
య్యన గగనంబు ముట్టి భయదాకృతి మండెడుచిచ్చులోఁ బ్రవే
శన మొనరించె సర్వజనసన్నిధియం దవిశంకితాత్మ యై. 2968

క. రయమున నీగతి శిఖిలోఁ, నియతి న్వడిఁ జొచ్చినట్టినృపపుత్త్రిని ద
ద్దయు శోకంబునఁ గనుఁగొని, భయ మందిరి సర్వజనులు బాలురు వృద్ధుల్.

క. ఘనపుణ్యఘృతాహుతిక్రియ, ననలుఁ బ్రవేశించినట్టియవనీతనయ
న్గనుఁగొని ముల్లోకంబులు, ఘనవాతహతాంబునిధులకరణిఁ జలించెన్. 2970

క. ఊహ గలంగక యీగతి, సాహసమున నగ్నిఁబడినజనకజను జగ
న్మోహనవిగ్రహఁ గనుఁగొని, హాహాకారములు చేసి రసురులు ప్లవగుల్. 2971

ఆ. సవనమందు మంత్రసంస్కృత యగువసు,ధార పడినభంగి దహనమధ్య
మందుఁ బడినసీత నఖిలజగన్మాతఁ, జూచి వగచి రచటిసుదతు లెల్ల. 2972

తే. కరము శప్త యై నాకలోకమున నుండి
నిరయమునఁ బడ్డదేవతాతరుణిమాడ్కిఁ
బావకునియందుఁ బడినయాపరమసాధ్విఁ
జూచి శోకించి రప్పుడు సురలు మునులు. 2973

క వారలదీనధ్వని విని, కారుణికుఁడు విభుఁడు ఘోరకర్మము నాచేఁ
గారిత మయ్యె ననుచుఁ గన్నీ రొలుకఁగ ధ్యాన మూని దీనుం డయ్యెన్.

బ్రహ్మరుద్రేంద్రాదులు రాముని జూడ వచ్చుట.

సీ. రాజరా జగుయక్షరాజు రిపుధ్వంసి యైనకాలుఁడు సహస్రాక్షుఁ డైన
పురుహూతుఁడు పరంతపుం డైనవరుణుండు మూఁడుకన్నులు గలభూతనాథుఁ
డఖిలలోకవిధాత యైనవిరించనుఁ డాదిగాఁ గలనిఖిలాదితేయు

వరు లర్కసన్నిభవరవిమానములతో నచ్చోట నవ్వేళ నరుగుదెంచి

తే. సముచితంబుగ నంజలిసహితులై న
రాఘవునిఁ జూచి కేయూరరత్నవలయ
ముద్రికాలంకృతము లైనభుజము లెత్తి
యిట్లనుచుఁ బల్కి రాజగద్ధితునితోడ. 2975

ఆ. రామభద్ర నీవు త్రైలోక్యకర్తవు, జ్ఞానవిదులలోన ఘనుఁడ వీవు
నిన్ను నీవు దెలియనేరక వహ్నిలోఁ, బడెడుసీత నేల యుదుపవకట. 2976

సీ. అఖిలలోకంబుల కాదికర్తవు నీవు. పరుఁడవు పూర్వకల్పంబునందు
సాధ్యులయందుఁ బంచమసాధ్యుఁడవురుద్రులందష్టముఁడవు స్వయంప్రభుఁడవు
వాసుదేవుండవు వసువులలో ఋతధామాఖ్యవసుఁడవు తలఁప నీకుఁ
గర్ణంబు లాశ్వినుల్ గన్ను లినేందులు వసుధ పాదములు దివంబు శిరము

తే. సృష్టి కాద్యంతములయందు దృశ్యమాన
మైనవస్తువు నీవు మహానుభావ
ప్రాకృతం బైనపురుషునిభంగిఁ బుణ్య
శీల యగుజానకి నుపేక్ష చేసె దేల. 2977

వ అని పలికిన సర్వలోకవిభుం డైనరాముండు లోకపాలురచేత సంస్తూయమానుం డయ్యును బ్రహ్మవలన నాత్మస్వరూపగుణవిభూతిని సర్వజనులయందుఁ బ్రకటింపం జేయుట కుద్యుక్తుం డై స్వసౌశీల్యంబు దర్శింపం జేయుచు నయ్యమరశ్రేష్ఠుల కిట్లనియె. 2978

ఉ. అవ్వసుధేశశేఖరున కాజికిఁ బుత్త్రుఁడ రామనాముఁడ
న్మవ్వరకంటెఁ బెద్దను మనుష్యుఁడ నంచుఁ దలంచుచుందు నే
నెవ్వఁడ నాకుఁ బూర్వతను వెయ్యది విష్ణుఁడ నంటి రిప్పుడే
నివ్వసుధ న్జనించుటకు నెయ్యది కార్యము దెల్పుఁ డింతయున్. 2979

క. అని పలికిన విని మెల్లన, వనజభవుఁడు రాముఁ జూచి వాగ్వైచిత్రి
న్వినిపించెన నీచందము, విను మని యిట్లనుచుఁ బల్కె వినయం బెసఁగన్. 2980

—ॐ బ్రహ్మదేవుండు నీవు నారాయణుఁడ వని రామునకుఁ జెప్పుట ॐ—

సీ అనఘాత్మ నీవు నారాయణుండవు చక్రధరుఁడవు విభుఁడవు దైత్యహంత
వప్రమేయుండవు స్వప్రకాశుండవు పురుషోత్తముండవు భూతభవ్య
కాలాత్మకుండ వక్షరుఁడవు నిత్యుండ వాదిమధ్యాంతశూన్యాద్వయుఁడవు
పరమాత్ముఁడవు పరబ్రహ్మవు పరుఁడవు సత్త్వభూతుండవు తత్త్వనిధివి

తే. పురుషుఁడవు శార్ఙ్గకోదండధరుఁడ వజుఁడ
వఖిలవిషయేంద్రియవిభుండ వచ్యుతుండ

వనుపమచతుర్భుజుండ వనంతనామ
రూపుఁడవు సర్వలోకైకదీపకుఁడవు. 2981

తే. ఏకశృంగవరాహుండ వీవ కావె, భావనాతీతమూర్తివి నీవ కావె
నిఖిలలోకైకకర్తవు నీవె కావె, నిరుపమానందఘనుఁడవు నీవె కావె. 2982

తే. అజితుఁడవు వ్యాపకుఁడవు సర్వాదితేయ
వందితుఁడవు, విద్యామయనందకాఖ్య
ఖడ్గధరుఁడవు నిరుపమకాంతియుతుఁడ
వాద్యుఁడవు శాశ్వతుఁడవు బృహద్బలుఁడవు. 2983

సీ. శమమును దమమును క్షమయును బుద్ధియు నిత్యచిద్వస్తువు నీవె కావె
సత్యంబు సుఖము వషట్కార మోంకార మావిర్భవస్థాన మీవ కావె
మధుసూదనుఁడవు వామనుఁడవు ప్రభవుండ వీశ్వర రూపుండ వీవ కావె
యింద్రకర్ముఁడవు మహేంద్రుండ వఖిలలోకేశుండ వజరుండ వీవ కావె

తే. కమలనాభుండవు రణాంతకారి వఖిల, నేతవు నియామకుండవు నీవ కావె
ప్రాణులకు నిత్యము స్వకర్మఫల మొసంగ, నేర్పరివి విశ్వమయుఁడవు నీవకావె.

వ. మహాత్మా దివ్యు లగుమహర్షులు నిన్ను విష్వక్సేనుండ వనియును సేనాని వని
యును సర్వలోకంబులః కాశ్రయణీయుండ వనియు నుపాయభూతుండ వని
యును సహస్రశాఖసామవేదస్వరూపుండ వనియును నిత్యనైమిత్తికకామ్య
రూపసామాన్యవిశేషచోదనారూపశతజిహ్వుండ వనియును శ్రేష్ఠతముండ వని
యు నస్మదాదుల కెల్లఁ గర్త వనియును స్వయంప్రభుండ వనియు ననవరతం
బారాధించునట్టిముక్తులకుఁ బ్రాప్యస్థానం బనియును సృష్టికంటెఁ బూర్వం
బును బరంబును స్వాంతర్గుప్తానంతకోటిజీవసంఘాతుండ వైయుండుమేటి వని
యును సత్యంబ వనియుఁ బరంబ వనియును బ్రభవనిధనంబులు లేనివాఁడ వని
యు నపరిచ్ఛేద్యుండ వనియును బ్రహ్మాదులు నీనిజరూపం బెఱుంగ రనియు సర్వ
భూతంబులయందును గోబ్రాహ్మణులయందును దిక్కులయందును గగనంబునం
దును బర్వతంబులందును వనంబులందును నిత్యం బంతర్యామిత్వంబున గోచ
రించువాఁడ వనియును సహస్రశీర్షుండ వనియును సహస్రనేత్రుండ వనియునుం
గొనియాడుదురు మఱియును 2985

తే. ఆదికూర్మస్వరూపుండ వై సమస్త, భూమిభారంబుఁ దాల్చినప్రోడ వీవు
అంతమందును సంకర్షణాత్మకుండ, వై జలంబులఁ దోఁచుమహాహి వీవు. 2986

సీ. లోకనాయక విను లోకంబు లన్నియు నరయ నీకుక్షిలో నణఁగి యుండు
నీకోప మగ్నియు నీజిహ్వ భారతి నీహృదయం బేను నీప్రసాద
మిందుండు నీస్థైర్య మిల నీశరీరంబు నిఖిలజగంబులు నీదుఱెప్ప
లహము రాత్రియుఁదనూరుహములు వేల్పులు పరఁగనీప్రాణము ల్పవనములును

తే. నీదుసంస్కారములు సర్వవేదములును, నీదుకర్ణము ల్దిక్కులు నీదుదృక్కు
లర్కచంద్రులు నీకంటె నన్యమైన, వస్తు వెద్దియు లేదార్తవరద రామ.

తే. విశ్వనాయక మున్ను త్రివిక్రమములు
విక్రమించి త్రిలోకంబు లాక్రమించి
బలిని బంధించి యనుకంప వెలఁగ రాజ్య
మింద్రున కొసంగినఘనుండ వీవ కావె. 2988

తే. అనఘచారిత్ర నీవు నారాయణుఁడవు, వసుమతీపుత్రి లక్ష్మి రావణవధార్థ
మర్థి మానుషరూప మింపలరఁ దాల్చి, యవని నవతార మొందితి వయ్య నీవు.

తే. రావణుఁడు నేఁడు హతుఁ డయ్యె రణములోన
నవతరించినపని దీఱె హర్ష మొదవె
రాజనుత యింక శేషకార్యములు దీర్చి
చెలఁగి స్వస్థానమునకు వేంచేసె దీవు. 2990

క. నీవిక్రమంబు తేజము, నీవీర్యము నీయశంబు నీదర్శనముం
దేవ నినుఁ గూర్చి యే నిటు, గావించిన స్తవ మమోఘకరమై యుండున్. 2991

క. సూరిజనస్తుత ధర్మవి,శారద నీయందు భక్తి సలిపెడువారె
వ్వారు గల రట్టిసజ్జను, లారయ ధరలో నమోఘు లై యుందు రొగిన్. 2992

క. అజుని ఖగధ్వజునిఁ జతు,ర్భుజుని ధృతద్విజుఁ బురాణపురుషోత్తముని
న్భజియించునట్టిజను లుభ, యజగంబులఁ గోర్కు లొంది యరుగుదు రభవా.

క. శ్రుతిసిద్ధము దివ్యం బ ప్రతిమం బతిగుహ్యమును బురాతన మగునీ
యితిహాసము గొనియాడిన, చతురుల కశుభంబు లేదు సత్య మధీశా. 2994

అగ్నిదేవుండు సీతాదేవిని రామునకు సమర్పించుట.

వ. అని యిట్లు పద్మగర్భుండు గొనియాడిన నమ్మహాత్మునివచనంబు విని యవ్విభావ
సుండుశీఘ్రంబున వహ్నిప్రవేశకాలంబునందు యాదృగ్వస్త్రాంగరాగప్రగాభ
రణయుక్తయై యుండెఁ దాదృశసౌభాగ్యయుక్తయైనసీత ననంతగుణసమేత
నతినత్కులజాత నభినవాదిత్యసమద్యోత నానీలకుంచితచికురవ్రాత ననర్ఘతప్త
కాంచనభూషణస్ఫీత నంచితపాతివ్రత్యధర్మాభీత నక్లిష్టమాల్యాభరణోపేత
నఖిలలోకైకమాత నంకంబున నిడికొని చితామధ్యంబున వెల్వడి రాముని
కడకుం జనుదెంచి యద్దేవి నమ్మహాత్మున కొసంగి వినయంబున నిట్లనియె. 2995

ఉ. రామనరేంద్ర యీజనకరాజకుమారికయందుఁ గల్మషం
బేమియు లేదు నీవచన మించుక యైన నతిక్రమింప దీ
శ్యామ సువృత్త సాధ్వియు ననన్యశరణ్య మనంబు ధ్యానము
న్నీమముతో ననారతము నీపయిఁ జేర్చి భజించు నిత్యమున్. 2996

మ. అగజేశస్తుతవీర్య కృత్రిమమృగవ్యాజంబున న్నిన్ను దూ
రగతుం జేసి దురాత్ముఁ డాదనుజుఁ డీరామ న్సతీరత్న మో

ర్యగుణాఢ్య న్మిథిలేంద్రపుత్రిని బలాత్కారంబునం దెచ్చి చా
ర్యగతి న్దాఁచె నిజాలయోల్లసదశోకారామమధ్యంబునన్. 2997

ఉ. మాయలు పన్ని రావణుఁడు మాటికి నెన్నిదురుక్తు లాడినం
బాయక రాక్షసాంగనలు పట్టుగఁ దర్జనభర్జనోక్తుల
న్రాయిడి పెట్టిన న్వినక రాజవరా త్వదధీనచిత్తయై
యీయవనీతనూజ మది నెప్పుడు నిన్నె దలంచుఁ గావునన్. 2998

క. రవికులవర నావచనము, జవదాఁటక పుణ్యసాధ్వి జనకతనూజ
న్బ్రవిమలచిత్తను జేకొని, యవిరళమోదమున నేలుమయ్య మహాత్మా. 2999

వ. అని అగ్నిదేవుండు పలికిన విని ద్యుతిమంతుఁడును మహాతేజుండును దృఢవిక్ర
ముండును ధర్మభృద్వరిష్ఠుండును వక్తలలోన శ్రేష్ఠుండు నగు రాముండు ప్రీత
చేతస్కుండై యానందబాష్పవ్యాకులలోచనుండై యొక్కింతసేపు విచారించి
యవ్వైశ్వానరున కిట్లనియె. 3000

—రాముం డగ్నిదేవునివచనంబున సీతాదేవిం బరిగ్రహించుట.—

చ. సురవర యీమహీజ పరిశుద్ధచరిత్రను గా నెఱింగియు
న్బరసదనస్థయైనతనపత్నిని శోధన సేయ కర్థిఁ గ్ర
మ్మఱఁ గొనియె న్రఘూత్తముఁడు బాలిశుఁ డంగజమత్తుఁ డంచు స
త్పురుషులు ధిక్కరింతు రని దోషము వాయఁగ నింతచేసితిన్. 3001

క. ముల్లోకంబులఁ గలవా, రెల్ల విలోకించుచుండ సీసతి శిఖలో
మెల్లనఁ జొచ్చి శుచిత్వము, తెల్లము గావించె నేఁడు దేవత లలరన్. 3002

క. మిగుల న్స్వతేజోరక్షిత, యగుసీసతి గడవఁ జాలఁ డాదశకంఠుం
డొగి సాగరంబు వేగ మెసఁగ వేల నతిక్రమింపఁజాలనిమాడ్కిన్. 3003

తే. దినకరునిఁ బాసి యుండనిదీప్తిభంగిఁ, బరఁగ సీసాధ్వి నన్నెడఁబాసియుండ
దాత్మవంతుఁడు కీర్తిన ట్లనిశ మేను, విమలచారిత్ర సీసతి విడువఁజాల. 3004

క. దురితాత్ముఁడైనరావణుఁ, డరయఁగ సందీప్తయైనయనలశిఖక్రియ
న్నిరుపమగతి వెలిఁగెడునీ, కరటిగమన సంస్పృశింపఁ గాఁ జాలఁ డొగిన్. 3005

వ. మహాత్మా త్రిలోకంబులయం దతివిశుద్ధయు ననన్యహృదయయు మచ్చిత్తపరిర
క్షిణియు నైనయీసీత నవశ్యంబు భవద్వచనంబునం బ్రతిగ్రహించెదనని పలికి
యారఘువంశవల్లభుం డమ్మహీపుత్రిని సాదరంబుగాఁ గైకొని ప్రియవచనంబుల
గారవించి తత్సమేతుం డై రోహిణీసహితుం డైనపూర్వశశాంకునిపోలికంబున
నలరె సీతాపరిగ్రహణంబు విలోకించి యెల్లవారును బరమానందభరితాంతఃక
రణులై రంత సర్వలోకమహేశ్వరుండు రఘుపుంగవు నవలోకించి యిట్లనియె.

—ఈశ్వరుం డచ్చటికి వచ్చియున్నదశరథుని రామునకుం జూపుట.—

సీ. కమలాక్ష దైవయోగమున నీయద్భుతకర్మంబుఁ జేసితి కడిమి మెఱసి
ఖలుఁడైనదశకంఠువలనఁ బుట్టినభయ మణఁగించి జగముల కమితహర్ష

మొసఁగితి వింక నయోధ్య కేగి మహాత్మ భరతుని శత్రుఘ్నుఁ గరముఁ బ్రీతి
మన్నించి తల్లుల మక్కువ సేవించి రాజ్యంబు గైకొని ప్రజలఁ బ్రోచి
తే. వంశకరు లగుపుత్త్రులఁ బడసి యశ్వ, మేధసవనంబుఁ జేసి యమేయకీర్తి
తగ నుపార్జించి ద్విజులకుధన మొసంగి, చెలఁగి స్వస్థానమునకు వేంచేయుమయ్య.
శా. దేవా యీమహనీయుఁ డాదశరథాధీశుండు మీతండ్రి సం
సేవార్హుండు మహాయశుం డితఁడు నీచేఁ దారితుం డై సురేం
ద్రావాసంబు లభించి భాస్వరవిమానారూఢుఁ డై నిన్ను సం
భావింపం జనుదెంచినాఁ డితనికి న్భక్తి న్నతిం జేయుమా. 3008
వ అని నియోగించి దేవదేహగ్రహణంబున నపరిజ్ఞాతుఁ డై యున్నదశరథుని
నంగుళినిర్దేశంబుఁ జేసి చూపిన. 3009
ఉ. ఆరఘువంశశేఖరుఁ డుమాధిపువాక్యము లాలకించి సొం
పార విమానరాజమున నద్భుతకాంతి వెలుంగువాని సు
శ్రీరమణీయచేలము ధరించినవాని గురు న్మహాగుణో
దారునిఁ గాంచి లక్ష్మణయుతంబుగ నంజలిఁ జేసె భక్తితోన్. 3010

దశరథుఁడు రామలక్ష్మణులఁ గవుంగిలించుకొనుట.

చ. తన కిటు మ్రొక్కినట్టిసుతు ధన్యునిఁ బ్రాణసమాను రాముని
గనుఁగొని దేవయానమునఁ గన్నతరద్యుతి నొప్పుచున్నయ
జ్జనపతి హర్షయుక్తుఁ డయి సయ్యన నంకముఁ జేర్చి బాహువుల్
మునుకొని గ్రుచ్చి తచ్ఛిరము మూర్కొని వేడ్క దలిర్ప నిట్లనున్. 3011
చ. ధనపర యైనకైక మును తప్పక పల్కినక్రూరవాక్యము
ల్మనమున నాటియున్నయవి మానుగఁ దద్విరహితుండ నైననా
కనిమిషలోకవాసము సురాధిపసఖ్యము దేవమానిపూ
జనము రుచింపకున్నయది సత్యముఁ బల్కితి నందనోత్తమా. 3012
ఆ. కుశలి వై ననిన్ను గుణి యైనలక్ష్మణుఁ, గాంచి నేఁడు మిమ్ముఁ గౌఁగిలించి
హీనువిముక్తుఁ డై నయినుమాడ్కి దుఃఖంబు, వలన విడువఁబడినవాఁడ నైతి.
తే. ఖ్యాతిఁ గన్నయష్టావక్రుచేతఁ దొల్లి, యలకహోళుఁడు తారితుం డైనమాడ్కి
శీలవంతుండ వై ననీచేత నేను, దారితుఁడ నై చెలంగితిఁ దనయవర్య. 3014
తే. అసురకంటకుఁ డై నదశాస్యు నాజిఁ, బొరిగొనుట కట్లు నాఁడు నిర్జరులచేత
రమణనభిషేకవిఘ్న కార్యముఘటింపఁ, బడియె ననియిప్పు డెఱిఁగితిఁ బరమపురుష.
క. గహనమున నుండి గ్రమ్మఱ, గృహమున కరుదెంచినట్టికృతకృత్యుని ని
న్నహిమాంశుఁజూచి మీయమ, యహిమాంశుకులేంద్ర ధన్యయగు నిక్క ముగన్.
క. విలసదభిషేకపుష్కర, కలితాంగుఁడ వై ననిన్నుఁ గనుఁగొని పురిలోఁ
గలవా రందఱు హర్షో, జ్జ్వలు లై విహరింప...

క. యుక్తుం డనురక్తుఁడు కడు, భక్తుఁడు నృపధర్మవిదుఁడు భరతుఁ డతనితో
యుక్తుఁడవై యుండఁగ నాసక్తి న్నినుఁ జూచుకాంక్ష చాలఁ బొడమెడిన్.

రాముఁడు కైకేయీభరతుల ననుగ్రహింపుమని దశరథునిం బ్రార్థించుట.

వ. వత్సా సీతాలక్ష్మణసహితుండ వై ననీచేత నరణ్యంబునఁ బదునాల్గువత్సరం బులు నిర్యాతితంబు లయ్యె నివ్వృత్తవనవాసుండ వైతివి నీప్రతిజ్ఞ సాఫల్యంబు నొందె. రావణవధం బాపాదించి దేవతలకు సమ్మోదం బొసంగి కృతకృత్యుండ వై శాశ్వతం బైనయశం బుపార్జించితివింక భ్రాతృసహితంబుగా సామ్రాజ్యంబు గైకొని దీర్ఘాయుష్మంతుండవై సుఖింపుమని పలికిన నారాముం డమ్మహీపతివచ నంబు విని యంజలి గీలించి మహాత్మా నాయందుం గలవాత్సల్యంబు భరతుని యందును బ్రకటింపం జేయుము మున్ను సపుత్ర వైననిన్నుఁ బరిత్యజించెద నని కైకేయితో నాడితి విప్పు డాఘోరశాపం బమ్మహాదేవిని స్పృశింపకుండ ననుగ్రహింపు మని ప్రార్థించిన నమ్మహారాజశేఖరుఁ డగుంగాక యని పలికి పదంపడి సౌమిత్రిఁ గౌఁగిలించికొని యిట్లనియె. 3019

సీ. జానకీయుతుఁడవై సతతంబు రాముని నతిభక్తి సేవించినందువలన
నాకు సమ్మోదంబు నీకు ధర్మఫలంబు పరమయశంబు సంప్రాప్త మయ్యె
రామభద్రుఁడు జగత్త్రయమంగళప్రదుం డింద్రాదిదిక్పతు లితరసురలు
పరమర్షు లిచటికిఁ బఱతెంచి యమ్మహాపురుషునిఁ బూజించి పొగడి రిపుడు

తే. రాముఁడు ప్రసన్నుఁ డగుచుండ రమణ నీకు
స్వర్గము యశంబు మహిమయుఁ జాలఁ గలుగుఁ
గావున ననారతంబు రాఘవున కర్థి
నుచితభంగి శుశ్రూష సేయుము కుమార. 3020

తే. విను మఖిలవేదతాత్పర్యవిషయభూత, మక్షరంబు రహస్య మవ్యక్త మజము
నిర్మలం బవ్యయము బ్రహ్మనిర్మితంబు, నైనపరతత్త్వ మితఁడె సుమ్మనఘచరిత.

క. రాముని మహానుభావునిఁ, గా మది నెఱిఁగికొని నీవు ఘనతరభక్తి
న్నేమంబున సేవింపుము, సౌమిత్రీ దీన యశము జగముల నిండున్. 3022

వ. అని లక్ష్మణుం బ్రబోధించి యమ్మహీపతి సీత నవలోకించి యిట్లనియె. 3023

చ. ఘనభుజుఁ డైనరాఘవుఁడు గ్రద్దన నిన్నిపు డన్నమాటకు
న్మనమునఁ జింత సేయకుము మానవతీ పరిశుద్ధఁ జేయుమం
తనమున నిట్లొనర్చెఁ బరదైవము నీకు విభుండె గావున
న్మనుకొని యిమ్మహాత్ముని సమున్నతభక్తి భజింపు మెప్పుడున్. 3024

క. అని యిటు రాముని లక్ష్మణు, జనకసుతను గారవించి జననాథుఁడు చ
య్యన దివ్యవిమానముతోఁ, జనియె న్సురపురి కనంతసమ్మోదమునన్. 3025

### ఇంద్రుఁడు రామునకు వరంబు లొసంగుట.

తే. అంత జంభాంతకుఁడు ముదితాత్ముఁ డగుచు
రామభద్రునిఁ గాంచి హర్షమునఁ బలికెఁ
బొసఁగ నీదర్శనము మాకమోఘ మయ్యె
హర్షయుక్తుండ నైతి మహాత్మ నేఁడు. 3026

క. నీకోరినవర మొసఁగెదఁ, బ్రాకటముగ వేఁడు మనినఁ బ్రాంజలి యై సీ
తాకాంతుఁడు హర్షంబునఁ, బాకారిం జూచి మధురభణితిం బలికెన్. 3027

సీ. అమరేంద్ర నామీఁద ననుకంప గలదేని యడిగెద దాని సత్యముగఁ జేయు
మస్మదర్థంబుగా నాంద్రడ్డబిలఁ బాసి యరుదెంచి నాకుఁ బ్రియం బొనర్పఁ
దెగువమై రణములోఁ బగతుల మార్కొని వారిచే హతు లైనవార లెవ్వ
రట్టిగోలాంగూలహర్యక్షవీరు లెందఱు గల రందఱు మరల బ్రతికి
తే. తగ విశల్యు లై తొల్లిటిపగిది నలఘు
మతియుఁ దేజమ్ము భుజవిక్రమంబు బలము
ధృతియు దాక్ష్యంబు గలిగి వర్తించువారు
గాఁ బ్రసాదింపు మిదియె మత్కాంక్షితంబు. 3028

ఆ. మఱియు ననిమిషేంద్ర మర్కటోత్తములు వసించి యున్నవిపిన మంచితముగ
సంతతంబు మూలజలఫలయుక్త మై, యుండునట్టివరము లొసఁగ వలయు.

వ. అని యడిగిన నప్పాకశాసనుండు రఘుపుంగవునితో మహాత్మా నీ విప్పు డడిగిన వరంబు రణంబున రాక్షసప్రయుక్తసాయకవిలూనంబు లై యావలావలం బడిన కరచరణకర్ణనాసాకంఠ పుచ్ఛాది సర్వావయవస్వస్థానసంధానపరలోకగతజీవిత సమానయనసరూపాఘటితార్థఘటకత్వంబువలన మహత్త్వంబు ప్రాపించి యున్నది నావచనం బనృతంబు గాదు నీవు కోరినయట్లు సంగ్రామంబున దానవుల చేత నికృత్తాననబాహు లై కూలినవానరభల్లూకగోలాంగూలవీరు లెందఱు గల రందఱు మత్ప్రసాదంబున నీక్షణంబున సప్రాణు లై సుప్తు లైనవారు ప్రబుద్ధు లైనమాడ్కి లేచి నీరుజులును నిర్వ్రణులును సంపన్నబలపౌరుషులును నై తమతమసుహృద్బాంధవజ్ఞాతిపుత్రకళత్రాదులం గూడుకొని పరమానందంబున సుఖింతురు గాక యకాలంబునందునుం బాదపంబులు ఫలవంతంబు లై పుష్పశబళంబు లై యుండుఁగాక నదీసంఘంబులు విమలసలిలోపేతంబు లై యొప్పుఁ గాక యని పలికిన నప్పుడు పురందరునివరప్రభావంబున రణంబున హతు లైన వానరు లందఱు సజీవితు లై నిద్ర మేల్కొనినతెఱంగున లేచి నిర్వ్రణు లై యిది యేమి యాశ్చర్యం బనితలంచుచుఁ బరమానందంబునం బొదలుచుండి రంత దేవత లందఱు స్తవార్హుం డైనరాముని సౌమిత్రిని యథార్హపూజనంబులం బరితుష్టులం జేసి సాధువాక్యంబులం బ్రస్తుతించి సంప్రీతచేతస్కు లై రామ భద్రున కిట్లనిరి. 3030

చ. అనఘచరిత్ర నీవు రయమార నయోధ్యకు నేగి కైకయీ
తనయుని లక్ష్మణానుజునిఁ దల్లుల జానకి నూఱడించి మిం
చినయనురాగ మొప్ప నభిషిక్తుఁడ వై విపినాటకోటుల
న్ననయము గాఁగ వీడుకొని సమ్మతి నేలుము సర్వరాష్ట్రముల్. 3031

క. అని పలికి ప్రీతుఁ డగురా, మునిచేత ననుజ్ఞ వడసి మునుకొని సుర ల
ర్కనిభవిమానంబులతోఁ, జనిరి యథాస్థానమునకు సమ్మోదమునన్. 3032

క. అనిమిషులు చనినపిమ్మట, ఘనుఁ డారాఘవుఁడు ముదము గదుర సుమిత్రా
తనయావనిజాయుతుఁ డై, మునుకొని యొకచోట వాసము న్జేసె రహిన్.

చ. సమధికరామలక్ష్మణభుజాపరిరక్షిత మైనకీశసై
న్యము సముదగ్రకాంతియుత మై సముదంచితహర్షయుక్త మై
సముదితతేజ మై విజితశాత్రవసైన్యకదంబ మై రహి
న్విమలశశిప్రణీతరజనీక్రియ నొప్పె జయాభిరామ మై. 3034

తే. రామభద్రుఁ డీరీతి నారాత్రి యచట
నిరుపమప్రీతితో సుఖనిద్రఁ జేసి
మేల్కొనినయప్పు డాజగన్మిత్రుతోడ
నంజలి ఘటించి పలికె నయ్యసురవిభుఁడు. 3035

ఉ. భానుకులప్రదీప నవపద్మనిభేక్షణ లైనకాంతలు
స్నానుగ మజ్జనోపకరణంబులు చేకొని వచ్చినారు సు
స్నాన మొనర్చి దివ్యహారచందనమాల్యదుకూలవస్త్రనా
నానవరత్నభూషణగణంబులచేఁ గయిసేయు మిత్తజిన్. 3036

తే. అనిన విని లక్ష్మణాగ్రజుఁ డవ్విభీష
ణోక్తుల కనంతహర్షసంయుక్తుఁ డగుచు
మరల నిట్లని పలికె నప్పరమసఖునిఁ
గాంచి యనురక్తి మనమునఁ గడలుకొనఁగ. 3037

ఉ. ఈకపిలోకవల్లభుఁ డహీనసుఖోచితుఁ డార్తబంధుఁడు
న్నాకు హితం బొనర్పఁ బ్రధనంబున వైరుల నోర్చి డస్సినాఁ
డీకపివీరు లంద ఱతిహేతుల గాసిలి యున్నవార ల
స్తోకమతి న్మదర్థముగ శూరుల వీరి బహూకరింపుమా. 3038

సీ. గురుభక్తియుక్తుండు పరమధర్మజ్ఞుండు సత్యసంధుఁడు సాధుసమ్మతుండు
లలితుండు భ్రాతృవత్సలుఁడు కుమారుండు ప్రాణతుల్యుం డైనభరతుఁ డట్లు
మద్వియోగజశోకమగ్నుఁ డైయుండ నా కభిమత మగునె మాల్యాంబరాది
ధారణ మమ్మహాధార్మికు వీక్షింప కున్న నామనమున కురుముదంబు

తే. గలుగ దిప్పుడె పురికిఁ బోవలయు మాకు
దూరపథ మెవ్విధంబునఁ జేరఁ గలనొ

యనిన విని యంజలి ఘటియించి యాసురేంద్ర
చంద్రుతో వెండి యలవిభీషణుఁడు వలికె. 3039

చ. పురుషవరేణ్య చూడు మదె పుష్పకనామవిమానరాజ మం
బరమణిసన్నికాశము సముంచితరత్నవినిర్మితంబు వి
స్ఫురితశిరస్సహస్రము సముజ్జ్వలభద్రవితానయుక్త మం
బరచరము న్మనోజవము భవ్యము కామగ మెన్ని చూడఁగన్. 3040

ఆ. దీనిమీఁద నెక్కి తేని రఘూత్తమ, యొక్కపగటిలో నయోధ్య కేలమిఁ
గోర్కి మీఱ నిన్నుఁ గొనిపోవు దుర్గమ, పథ మనుచు విచారపడఁగ వలదు.

క. ఈదివ్యవిమానము మును, శ్రీదుఁడు మాయన్న తపముఁ జేసి నలువచే
మోదమునఁ బడసె రావణుఁ, డాధనపతి నాజిఁ దోలి యటు గొని తెచ్చెన్.

క. అనఘా భవదర్థం బది, మునుకొని పాలింపఁబడియె ముదము దలిర్పం
గొని తెప్పించెద మీ రిపు, డనుపమగతి దాని నెక్కి యరుగుఁడు ప్రీతిన్.

వ. దేవా యేను నీ కంతరంగభక్తుండ నేని నాయందుఁ గృప గలదేని మత్ప్రాణ
ధనంబులు భవదధీనంబులు చేసి యుండుట సత్యం బేని సీతాలక్ష్మణసహితం
బుగా నొక్కింతకాలం బిచ్చట వసించి నాచేత సర్వకామంబుల నర్చితుండవై
సైన్యసుహృజ్జనసహితంబుగా శాస్త్రవిహితం బైనమత్పూజనంబు సత్ప్రకారం
బున నుండి ప్రతిగ్రహించి ప్రీతియుక్తుండ వై యరుగవలయు నేను నీకు
భృత్యుండ నగుటవలన నిమ్మాట ప్రణయబహుమానసౌహృదంబులవలన
నాడితిఁ గాని యాజ్ఞాపించినవాఁడఁ గా నని ప్రార్థించిన నారఘువల్లభుం డలరి
సర్వజనంబులు వినుచుండ వెండియు నవ్విభీషణున కిట్లనియె. 3044

చ. దనుజవరేణ్య నీ విపుడు తద్దయుఁ బల్కినమాటకంటెఁ బూ
జన మధికంబె సఖ్యమున సర్వవిధోత్తమబాంధవంబున
న్ఘనతరసౌహృదంబున సకల్మషభక్తి ననారతంబు నే
ననుపమభంగిఁ బూజితుఁడ నైతిని నాకొకభేద మున్నదే. 3045

చ. గురుతరచిత్రకూటగిరికూటముపై వసియించి యున్నన
న్నరుదుగఁ గ్రమ్మఱించుటకు నచ్చటి కెవ్వఁడు వచ్చె సారెకు
న్నిరమున యాచితుండ నయి చేకొని యెవ్వనికోర్కి దీర్ప కేఁ
బఱపితి వీటి కాభరతు భక్తిరతు న్వెసఁ జూడఁ గోరెదన్. 3046

క. గురువుల వృద్ధులఁ బౌరుల, నరుదారఁగ జానపదుల నఖిలసచివులం
బరమాప్తుల జనయిత్రుల,గర మనురాగమునఁ జూడఁ గాంక్షవొడమెడిన్. 3047

చ. దనుజవరేణ్య మా కిచటఁ దాలిమితో నిలువంగ రాదు వ
చ్చినపని చక్కనయ్యె నిఁక శీఘ్రమునం బురికిం జన న్వలె
న్ఘనముగ నేను నేఁ డఖిలకామములం బ్రతిపూజితుండ నై
తిని దడ వేల నీ వనుమతించి విమానము [illegible]

విభీషణుఁడు రామునకుఁ బుష్పకవిమానము నొసంగుట.

వ. అని పలికిన నవ్విభీషణుండు రయంబునం దగువారిఁ బురంబులోనికిం బనిచి కాంచనచిత్రాంగంబును వైడూర్యకృతవేదికంబును వరాకారకూటాగారపరిక్షిప్తంబును సమంతతో రాజితప్రభంబును పాండురధ్వజపతాకాలంకృతంబును గాంచనహర్మ్యశోభితంబును హేమపద్మవిభూషితంబును గింకిణీజాలప్రకీర్ణంబును ముక్తామణిగవాక్షితంబును ఘంటాజాలఘణంఘణితంబును మధురస్వనవంతంబును మేరుశిఖరాకారంబును విశ్వకర్మనిర్మితంబును ముక్తారజితసన్నిభబహుహర్మ్యసమన్వితంబును స్ఫాటికచిత్రాంగవైడూర్యవరాసనంబును మహార్హాస్తరణోపేతంబును మహాధనోపపన్నంబు ననాధృష్యంబును మనోజవంబును బుష్పభూషితంబు నగుపుష్పకవిమానంబు దెప్పించి రామునకు సమర్పించి కృతాంజలిపుటుండును వినయవినమితోత్తమాంగుండును హర్షపులకితగాత్రుండును నై దేవా నీకింకరుండ నేమి సేయం గలవాఁడ నానతిమ్మనిన నారఘుపుంగవుండు స్నేహపురస్కృతం బగువాక్యంబున నిట్లనియె. 3049

సీ. దానవనాథ యీతరుచరవీరు లాహవమునఁ బ్రాణభయంబు విడిచి
యనివర్తులై పోరి యరుల నిర్జించిరి వీరివిక్రమమున భూరిదైత్య
రాజ్యంబు నీకు సంప్రాప్తించెఁ గృతభృత్యు లగువీరి నందఱ నర్హాభంగి
ధనరత్నభూషణదానంబులఁ గరంబు సత్కరింపుము నీవు సంభ్రమమున

తే. సర్వకపులు నీచే నట్టు సత్కరింపఁ, బడి నిరంతరసమ్మోదపరు లగుదురు
దీన నీకు యశంబును మానితముగ, సంతతంబును నాకు హర్షంబు గలుగు.

రామునిపనుపున విభీషణుఁడు వానరుల నందఱ సత్కరించుట.

చ. సదయుని సంగ్రహీతను యశస్విని ద్యాగిని మానవాధిపు
న్వదలక సైన్య మూర్విఁ దఱి వచ్చినయప్పుడు ప్రోచుఁ బ్రీతితో
నదయుని ద్యాగశూన్యు నభిమానతను రాజగుణప్రహీను దు
ర్మదుని బరిత్యజించి సమరంబు ఘటిల్లిన వేళ బల్విడిన్. 3051

చ. అనిన విభీషణుండు మనమంది యనర్ఘమణీసువర్ణనూ
తనపటుకాంచనాభరణదానములం దగ నర్హాభంగిఁ గా
ననచరుల న్ఘనంబుగ మనం బలర న్వెస సత్కరించినం
గనుఁగొని రాఘవుండు మదిఁ గౌతుకము న్మహ ముల్లసిల్లఁగన్. 3052

క. జగతీతనయానుజయుత,ముగఁ బుష్పక మెక్కి యంకమున జనకసుతం
దగ నిడికొని దైత్యేంద్రుని, నగచరవీరులను జూచి నయముగఁ బలికెన్. 3053

క. వృక్షచరులార మీచే, నక్షయముగ మిత్రకార్య మది దీర్పఁబడె
న్దక్షత మీమీయిరవుల, కక్షీణజవంబుతోడ నరుగుఁడు ప్రీతిన్. 3054

ఉ. మిత్రుఁడ వై ననీ వతిసమృద్ధభుజాబలశక్తి నిగ్రా

మిత్రుల నాజి గెలిచి మిత్రుని కార్యముఁ దీర్చి బలీవ్రడి
ధాత్రిఁ గృతప్రతిజ్ఞుఁ డనఁ దద్దయు సన్నుతి కెక్కి యింక నో
మిత్రకుమార నీపురికి నేటికిఁ బొమ్ము చమూయుతుండ వై. 3055

చ. గురుకృప నాయొసంగినయకుంఠితదానవరాజ్య మేలుచుం
దిరముగ లంక నుండు మలదేవత లైనను దేటి చూడఁ జా
లరు నిను సంప్రమోదము సెలంగ నయోధ్యకుఁ బోయెదన్ లస
న్నిరుపమభక్తితో ననుమతింపుము రాక్షసలోకవల్లభా. 3056

సుగ్రీవవిభీషణాదు లయోధ్యవఱకుఁ గూడ వచ్చెద మని రామునితోఁ జెప్పుట.

క. అన విని వా రందఱుఁ గర, మనురాగము మీఱ రాఘవాన్వయపతితో
వినయ మిగురొత్తఁ బలికిరి, ఘనతరముగ ఫాలభాగఘటితాంజలు లై. 3057

ఉ. వేడ్కఁ దలిర్ప నేము రఘువీర యయోధ్యకు వత్తు మిందఱుం
దోడ్కొని పొమ్ము భ్రాతృసహితు న్నినుఁ బుణ్యుఁ గృతాభిషేకునిం
జూడ్కుల విందుగా నచటఁ జూచి పురంబును గాంచి యవ్వల
న్వీడ్కొని మాగృహంబులకు వేగమె వచ్చెద మట్లు సేయవే. 3058

క. మీతల్లుల మీగృహముల, మీతమ్ముల మీసమస్తమిత్రులఁ జూడం
జేతోమోదము గదిరెడు, సీతాధిప యిష్టసిద్ధి సేయుము ప్రీతిన్. 3059

క. అన విని రఘునాథుఁడు తన, మనమున ముద మావహిల్ల మర్కటవిభునిన్
దనుజకులేంద్రునిఁ దక్కిన, వనచరులం జూచి కరుణ వఱలఁగఁ బలికెన్. 3060

చ. ఘనమతులార మీరు రిపుడు కౌతుక మొప్పఁగ మాయయోధ్యకు
న్ననుకొని వచ్చు టెంతయుఁ బ్రమోదము గాదె సుహృద్వ్రతంబుగాఁ
జనియెద మత్పురంబు గని చయ్యన వత్తురు గాని రండు మీ
రనుపమలీల నందఱు రయంబునఁ బుష్పక మెక్కఁ డిత్తఱిన్. 3061

వ. అని పలికినఁ దదనుమతంబున సుగ్రీవుండు హనుమదంగదసమేతుం డై చమూ యుతంబుగాఁ బుష్పకవిమానం బారోహించె విభీషణుం డమాత్యసహితం బుగా విమానారోహణంబుఁ జేసె నిట్లందఱు నప్పరమాసనం బెక్కి యసంబా ధంబుగా నాసీను లై రి రాముండు సీతాలక్ష్మణసహితంబుగా సాకేతుం డై భై రుండుం బోలెఁ దదీయాగ్రభాగంబున నధివసించె నిట్లందఱు యథాసుఖంబు గా నాసీను లై నయనంతరంబ కౌబేరం బై నయద్దివ్యవిమానంబు రామునిచేత ననుజ్ఞ వడసి వాహానాకారనిర్మితమరాళంబులతోఁ గూడ గగనంబున కుద్గమించి మారుతోద్ధూతం బై నమహామేఘంబుకరణి నతిత్వరితగమనంబునం జను చుండె నప్పుడు రఘుపుంగవుండు పూర్ణచంద్రనిభాననయగుజానకి నవలోకించి యి ట్లనియె. 3062

**సీతారామలక్ష్మణులు వానరరాక్షససహితంబుగాఁ బుష్పకారూఢులై యయోధ్యకుఁ బయనంబగుట.**

క. కైలాసశిఖరనిభను, శ్రీలక్షిత మగు త్రికూటశిఖరాగ్రముపైఁ
గ్రాలెడులంకను జూడుము, నీలాలక విశ్వకర్మనిర్మితపురమున్. 3063

క. హరిరాక్షసవీరులసం, గర మిదె పృథురక్తమాంసకర్దమమై భీ
కరమై చతురంగకళే,బరయుతమై చూడ నొప్పె భామిని కంటే. 3064

మ. పటునిష్ఠం దప మాచరించి నలువం బల్మాఱు మెప్పించి యు
త్కటభంగి న్నిఖిలార్థము ల్వడసి దోర్గర్వాతిరేకంబునం
గుటిలుండై చరియించురావణుఁడు సంక్షోభీకృతాదిత్యుఁ డి
చ్చట నాచే హతుఁ డయ్యెఁ జూచితివె చంచచ్చారుపద్మేక్షణా. 3065

రాముఁడు సీతాదేవికి దారిలో నాయావిశేషములం జెప్పుట.

సీ. ఇందీవరేక్షణ యిచ్చట నాచేత హతుఁ డయ్యె ఘటకర్ణుఁ డత్యుదీర్ణుఁ
డేణాంకముఖి చూడు మిచట నీలునిచేత సుప్రశస్తుఁడు ప్రహస్తుండు మడిసెఁ
గనకాంగి యిచట లక్ష్మణునిచే హతుఁ డయ్యెఁ జలితమహీభృత్తు శక్రజిత్తు
సామజయాన యిచ్చటవాయుసుతునిచేహతుఁడయ్యెధూమ్రాక్షుఁడాజిదక్షుఁ

ఆ. డలరుఁబోఁడి యిచట హతుఁ డయ్యె వికటుండు, శూరుఁ డైనవాలిసుతునిచేత
నలసుషేణుచేత నాజి విద్యున్మాలి, నిహతుఁ డయ్యె నిచట నీలవేణి. 3066

వ. మఱియుఁ గుంభకర్ణనందను లైనకుంభనికుంభులు రావణునితనయు లైన యతికాయమహాకాయులును దేవాంతకనరాంతకత్రిమస్తకులును మహోదర మహాపార్శ్వ వజ్రదంష్ట్ర మకరాక్ష విరూపాక్ష మత్తప్రమత్తాకంపనాదిరాక్షస యోధులును నిహతు లైనప్రదేశంబులు వేర్వేఱ విలోకింపుము. 3067

క. ఆదశకంఠునిసతి మండోదరి పతిఁ గూర్చి యశ్రు లొలుకఁగఁ దగ ని
ర్వేదించెఁ జిత్తమున నడ, లూఁది సపత్నీసహస్రయుత యై యిచటన్. 3068

క. వారాశి దాఁటి యిచ్చట, నారాత్రి వసించినార మజ్ఞానన సొం
పారఁగఁ గల్లోలాకుల, పారావారానిలములు పై వీవంగన్. 3069

క. అగణితబలుఁ డగునలుచే, మిగుల న్సలిలార్ణవంబు మీఁదఁ జతురత
న్దగ సేతువు గట్టించితి, సొగసుగ నీకొఱకు దానిఁ జూడుము తరుణీ. 3070

ఉ. రంగదభంగసంతతతరంగకరంబులు సాఁచి యావియ
ద్గంగను గౌఁగిలింపఁ జనుకైవడి మ్రోయుచు మిన్ను దాఁక ను
ప్పొంగెడుదాని శుక్తిదరపుంజనిషేవిత మైనదాని మా
తంగఝషాకులం బయినదాని నపారపయోధిఁ గంటివే. 3071

ఉ. తోయజనేత్ర నీకడకుఁ దోరపువేడ్క మహాజవంబుతో
వాయుసుతుండు వచ్చుతఱి వానికి నించుక విశ్రమార్థ మీ

తోయధిచేతఁ బంపఁబడి తోయము వెల్వడి వచ్చెఁ గాంచన
చ్ఛాయల నొప్పునీశిఖరికాంచననాభము దీనిఁ జూచితే. 3072

వ. దేవీ యిది సముద్రతీరపుణ్యక్షేత్రంబు మహాపాతకనాశనంబును బవిత్రంబును విమలంబును ద్రైలోక్యపూజితంబు నై యుండు నీసముద్రోత్తరతీరదేశంబున స్కంధావారనివేశనంబు గావించితి నిది సేతునిర్మాణమూలప్రదేశం బగుటం జేసి సేతుబంధం బనఁ బ్రాశస్త్యంబు వహించు మఱియు నిచ్చట సేతుబంధంబుకంటె మున్ను మహాదేవుండు సన్నిధానంబుఁ జేసి జలోపరిభాగంబున సేతుకరణరూపప్రసాదం బొసంగె నిచ్చట రాక్షసవల్లభుం డగువిభీషణుండు శరణాగతుం డయ్యె నని పలికి వెండియు నిట్లనియె. 3073

తే. ఏను వర్షరాత్రము వసియించినట్టి
శైల మిదె మచ్ఛరంబున వాలి యిచట
నిహతుఁ డై కూలెఁ గపిపతి మిహిరతనయుఁ
డేలుకిష్కింధ యిదె చూడు మిందువదన. 3074

రామనియోగంబున సీతాహితార్థంబు వానరు లందఱుఁ దమతమపత్నులనుం దోడ్కొనివచ్చుట

క. అన విని కిష్కింధాపురిఁ, గనుఁగొని సమ్మోద మాత్మఁ గడలుకొనంగాఁ
దనవిభునిఁ జూచి యిట్లనె, జనకజ మృదుఫణితిఁ బ్రణయసాధ్వసయుత యై.

ఉ. ఆదర మొప్ప భాస్కరసుతాదికవానరపత్ను లైనతా
రాదిసమస్తవానరమృగాక్షులు గొల్వ భవత్సమేత నై
మోదముతో నయోధ్యకు సమున్నతభంగిఁ జనం దలంచితిం
గా దన కర్థి నాత్మ ననుకంప దలిర్పఁగ నట్లొనర్పుఁడీ. 3076

క. నా విని రఘుపుంగవుఁ డటు, గావించెద ననుచుఁ బలికి ఘనపుష్పకముం
ద్రోవ నటు నిల్పి యలసు, గ్రీవుని వీక్షించి పలికెఁ బ్రీతి దలిర్పన్. 3077

చ. దినకరపుత్ర కీశయువతీసహితంబుగ మాయయోధ్యకుం
జనఁగఁ దలంచె జానకి ప్రసన్నమతి న్వెసఁ దత్ప్రియార్థ మ
ల్లనఁ గపు లంద ఱాత్మసతులం దగఁ దోడ్కొని వచ్చువారుగా
ననుమతి సేయు మీవును రయంబున రమ్ము సతీయుతంబుగన్. 3078

చ. అనిన మహాప్రసాద మని యాతఁడు సర్వవనాటయుక్తుఁ డై
యనుపమరత్నకాంతిఁ జెలువారు నిజాగ్ర్యగృహంబులోనికి
న్నెనరు దలిర్ప నేగి రుచినిర్జితతారను దారఁ గాంచి యి
ట్లనియె మృదూక్తి రామవిభుఁ డానతి యిచ్చినచంద మేర్పడన్. 3079

చ. సరసిజనేత్ర సర్వకపిసత్తము లాత్మకళత్రయుక్తు లై
ధరణిసుతాప్రియార్థ మిటు దప్పక యోధ్యకు నేఁడు రావలె

న్భరువడి నట్లు సేయు మని భానుకులేంద్రుఁడు పల్కెఁ గావునం
దిరముగ నీవు వానరసతీసహితంబుగ రమ్ము చెచ్చెరన్. 3080

క. పరఁగ నయోధ్యకు నేగిన, భరతాదులఁ బం క్తిరథుని పత్నుల నచటం
బరికింప వచ్చు నప్పని, పరమహితము గాదె మనకుఁ బంకజనేత్రా. 3081

వ. అని పలికినఁ దత్క్షణంబ శోభనాకార యగుతార వానరపత్నుల నందఱ రావించి వైదేహికిఁ బ్రియంబుగా మన మందఱము భర్తృసహితలమై యయోధ్యాపురంబున కరుగవలయు రామవచనప్రకారంబున సుగ్రీవుం డిట్లానతిచ్చె నిది నాకును బరమప్రియం బైనయది సాకేతపురప్రకారంబును బౌరజానపదసహితంబుగా రామప్రవేశంబును బట్టాభిషేకంబును దశరథస్త్రీవిభూతియు విలోకింపం గలుగు నని పలికిన వానరస్త్రీ లందఱుఁ దారచేత ననుజ్ఞాత లై చతుర్విధాలంకారంబులం గై సేసి తారాసహితంబుగాఁ జనుదెంచి ప్రదక్షిణంబుఁ జేసి పుష్పకవిమానం బారోహించిరి సుగ్రీవుండు సర్వవానరసహితంబుగా నారోహించె నంత నద్దివ్యవిమానంబు గగనంబున కెగసి రాముని యభిమతప్రకారంబునం జనుచుండె నప్పు డారఘుపుంగవుండు జానకి నవలోకించి వెండియు నిట్లనియె. 3082

చ. చకితమృగాక్షి మ్రోల నొకశైలము గంటివె ఋశ్యమూకనా
మక మది సర్వధాతుగణమండితమై చపలాయుతాంబుదం
బుకరణి నొప్పుచున్నది నభోమణిపుత్త్రునితోడ వహ్నిసా
క్షికముగ నిచ్చటం జెలిమిఁ జేసి తదగ్రజుఁ జంపఁ బూనితిన్. 3083

మ. పరికింపం దగుఁ జిత్రకాననము పంపానామదివ్యత్సరో
వర మిచ్చోట నినుం దలంచుకొని దుర్వారోగ్రకామవ్యథా
తురత న్మిక్కిలి గాసిఁ జెందితి రహిం దోడ్తోడ నీపద్మినీ
వరతీరాశ్రమభూమియందు శబరి న్వామాక్షి వీక్షించితిన్. 3084

ఆ. రాజవదన యిచట యోజనాయతబాహుఁ, డధికఘోరరూపుఁ డగుకబంధుఁ
డస్మదీయకరగతాసిచే ఖండిత, హస్తపాదుఁ డగుచు నవనిఁ బడియె. 3085

తే. వనజనేత్ర జటాయునివాసభూత, మైనన్యగ్రోధపాదప మదియె చూడు
మిచట నీకొఱ కాపతగేశ్వరునకు, రావణునకును ఘోరసంగ్రామ మయ్యె. 3086

క. జానకి చూడు మిది జనస్థానం బిచ్చటనె గాదె తప్పక యనిలో
దానవవరులు ఖరాదులు, మానకను త్సాయకముల మడిసిరి వరుసన్. 3087

సీ. ఇది మనయాశ్రమం బిందీవరేక్షణ యిది గౌతమీనది యేణనయన
యిదిపర్ణశాల రాకేందునిభానన యనురుఁ డిచ్చోట ని న్నపహరించె
నిది యగస్త్యాశ్రమ మిభరాజనిభయాన యిదియె మందాకిని హేమగాత్రి
యిది సుతీక్ష్ణాశ్రమ మిది శరభంగునియాశ్రమపదము పద్మాయతాక్షి

తే. యిచటఁ జూపట్టె మనకు సురేశ్వరుండు
దండిమైఁ దాపసాశ్రమమండల మిదె
పరఁగఁ గులపతి మనకుఁ జూపట్టె నిచట
నెలఁత యిచట విరాధుండు నిహతుఁ డయ్యె. 3088

తే. ఇచట ననసూయ నీకు సందృష్ట యయ్యె
నిదియె చిత్రకూటాఖ్యమహీధరంబు
ప్రీతి నిచటికి నన్నుఁ బ్రార్థించుకొఱకు
భరతుఁడు చమూసమేతుఁడై యరుగుదెంచె. 3089

సీ. అలివేణి కంటె దవ్వులఁ జిత్రకాననశోభితతట యైనసూర్యసుతను
బద్మాక్షి గనుఁగొంటె బ్రహ్మలోకసమాన మగుభరద్వాజునియాశ్రమంబు
భామిని చూచితె పావనజీవనవిలసిత యగుజాహ్నవీస్రవంతి
కళ్యాణి యవ్వలఁ గనుఁగొంటివె నిషాదవిభుఁ డున్నయలశృంగిబేరపురము

తే. సంప్రపుష్పితతరుసహస్రప్రకీర్ణ
యూపమాలిని యగుసరయూస్రవంతి
వరుస వీక్షింపు మదియె యిక్ష్వాకురాజ
ధాని యై యొప్పు మనయయోధ్యాపురంబు. 3090

క. సేమమున మరల నిచటికి, గోమలి వచ్చితి వయోధ్యకుఁ బ్రణామంబు
న్నేమము నొనరింపు నీ వన, భూమితనయ భక్తి మెఱయ మ్రొక్కె న్హరికిన్.

చ. అపుడు సమస్తకీశులు నిశాటవిభుండు విభీషణుండు నా
కపివిభుఁ డట్టు లెత్తి కుతుకంబున హేమవిశాలకక్ష్యల
న్విపులగజాశ్వపంక్తుల వినిర్మలపాండురహర్మ్యపాళి నిం
ద్రపురివిధంబునం దనరుదాని నయోధ్యను జూచి రింపుగన్. 3092

తే. అంతలోన భరద్వాజునాశ్రమాంతి,కమున కద్దివ్యయానంబు కడురయమున
నరుగుటయు రాముఁ డల్లన నచట డిగ్గి, గాఢభక్తి నమ్మునినాథుపాలి కరిగె.

రాముఁడు భరద్వాజమహర్షిని సందర్శించుట.

వ. ఇవ్విధంబున నారఘుసత్తముండు పదునాలవవత్సరంబు సంపూర్ణం బగుచుండఁ జైత్రశుక్లపక్షపంచమీదివసంబున భరద్వాజాశ్రమంబుఁ జేరి నియతుండై సముచితంబుగా నమ్మహామునిని సందర్శించి యభివందనంబు గావించి వినయంబున ని ట్లనియె. 3094

క. మునివర సాకేతపురం, బనామయం బై సుభిక్ష మై యున్నదె మా
యనుజుఁడు ప్రజలం బ్రోచునె, జనములకు సుఖంబు గలదె సర్వము శుభమే.

క. అన విని దరహాసము మో,మున కెంతయుఁ జెలువొసంగ మునినాథుం డా
జనకతనయామనోహరుఁ, గనుఁగొని యిట్లనియె ముదము గడలుకొనంగన్.

తే. పాదుకాన్యస్తరాజ్యుఁడై పంకదిగ్ధ
వృషముచందానఁ దాపసవేషుఁ డగుచు
యుష్మదాగమనము గోరు చున్నవాఁడు
భరతుఁ డఖిలంబు శుభముసుందిరమునందు. 3097

సీ. వదలక కైకయీవాక్యచోదితుఁడవై కరమర్థిఁ బితృవాక్యకరణరూప
ధర్మం బనుష్ఠింపఁ దలకొని రాజ్యంబు సర్వభోగంబులు సకలసుఖము
సకలజనానురంజన మైననగరంబు విడిచి వల్కలములు జడలుఁ దాల్చి
పరఁగఁ బదాతివై ఫలమూలభోక్తవై విపినంబునకుఁ జనువేళ నిన్నుఁ

ఆ. జూచి యేను జాల శోకించితి మహాత్మ, యిపుడు బంధుగణసహితుని విజిత
వైరి నాత్తమిత్రవర్గు సమృద్ధార్థుఁ, గాంచినంత ముదము గలిగె నాకు. 3098

వ. వత్సా నీదుసుఖదుఃఖంబు సర్వంబు నాకు విదితం బయ్యె నీవు విరాధునిం జంపుటయు జనస్థాననివాసులైన రాక్షసులనందఱ వధించుటయు బ్రాహ్మణార్థంబునందు నియుక్తుండవై తాపసరక్షాదీక్ష వహించి పంచవటియందు నివసించియుండు నప్పుడు భవనోన్మనోహారిణి యైన యీసీతను రావణుండు మ్రుచ్చిలించి కొని పోవుటయు మారీచదర్శనంబును కబంధదర్శనంబును పంపాభిగమనంబును సుగ్రీవసఖ్యంబును వాలివధంబును వైదేహీపరిమార్గణంబును హనుమంతుని సముద్రలంఘనాదికార్యంబును నలసేతుబంధంబును లంకావరోధంబును బుత్రమిత్రబాంధవామాత్యబలవాహనసహితంబుగా రావణుండు రణంబున నీచేత నిహతుం డగుటయు సర్వదేవతాసమాగమంబును దేవతావరప్రదానంబును మొదలుగాఁ గలకార్యంబు లన్నియుఁ దపోలబ్ధవిజ్ఞానంబున నెఱింగి యున్నవాఁడ నీ కభీష్టం బైనవరం బొసంగెద వేఁడుము మద్దత్తం బైనయతిథిసత్కారంబుఁ బ్రతిగ్రహించి రేపకడ సాకేతపురంబునకుఁ జనుమని పలికిన నారఘుసత్తముండు భరద్వాజుని వాక్యంబు శిరంబునం బ్రతిగ్రహించి సంహృష్టుండై యమ్మహాత్మున కిట్లనియె. 3099

భరద్వాజుండు రామునకు వరం బొసంగుట.

సీ. మునినాథ సాకేతపురమార్గమున సర్వపాదపంబు లకాలఫలము లగుచు
మధువులు గురియుచు మహితసుధాకల్పవివిధఫలంబుల విస్తరిల్లి
వఱలునట్లుగ మీరు కరుణింపుఁడనిన నయ్యనఘుఁ డట్లగుఁగాక యనుచుఁ బలుక
పాదపంబులు స్వర్గపాదపనిభములై ఘనమధుస్రవములై కరము శుష్క

తే. వృక్షములు పత్రయుతములై విఫలనగము
లమృతకల్పఫలాఢ్యంబులై విపుష్ప
తరువులు సుమాన్వితంబులై వరుస నపుడు
మూఁడుయోజనముల నేలఁ జూడ నయ్యె. 3100

చ. ముదము దలిర్ప నాప్లవగముఖ్యులు మానితపఃప్రభావము

ల్వదలక పెక్కుచందములఁ బ్రస్తుతిసేయుచుఁ గాంక్ష దీరఁ ద
న్మృదుఫలము ల్భుజించి యెలమి న్వివరి తేనెలు ద్రావి బల్విడిం
ద్రిదశవిభుత్వ మబ్బినగతిం గడువేడ్కఁ జెలంగి ర త్తఱిన్. 3101

వ. అంత నారామచంద్రుండు దూరంబున నయోధ్యాపురంబు విలోకించి ప్రియ కాముం డై ప్రియం బైనక ర్తవ్యకార్యంబు విచారించి నిశ్చయించి హను మంతు రావించి యిట్లనియె. 3102

—రాముండు తనరాక భరతునకుం దెల్ప హనుమంతునిం బంపుట.—

ఉ. మత్సందేశముఁ బ్రీతితోఁ దెలిపి భామారత్నము న్జానకిం
దత్సందేశముఁ జెప్పి న న్నలభిమర్దానంబుచే లక్ష్మణు
న్వాత్సల్యంబునఁ బ్రోచినట్టిధిమణావంతుండ వీ వన్నిట
న్వత్సా నీసముఁ డై నదాత గలఁడే వర్ణింప మా కెందునన్. 3103

చ. భరతుఁడు భ్రాతృవత్సలుఁడు పాయక నే నిట వచ్చునప్డు మ
త్పురమున కర్థి న న్మరలఁ దోడ్కొని పోవఁగఁ జిత్రకూటభూ
ధరమున కేగుదెంచి వితతంబుగ వేఁడి మదీయచి త్తము
న్గరఁగక యున్నఁ బాదుకలు గైకొని గ్రమ్మఱ వీటి కేగుచున్. 3104

చ. అఱమఱ లేక చెప్పెద మహాత్మ చతుర్దశవత్సరాంతవా
సరమున నీముఖాంబుజము సమ్మతి మీఱఁగ జూడ నేని ని
ష్ఠురగతి వహ్నిమధ్యమునఁ జొచ్చెద నంచుఁ బ్రతిజ్ఞఁ జేసి వాఁ
డరిగె మహానుభావుఁ డతఁ డంతయుఁ జేసెడువాఁడు గావునన్. 3105

ఉ. ప్రాకటశ క్తి నబ్భరతుపాలికి నీ విపు డేగి వేడ్క మా
రాక యెఱుంగఁ జెప్పి సుకరంబుగ నాతనిఁ బ్రోచి పిమ్మటన్
మాకుశలప్రదానమున మాతలఁ దక్కినవారి నెల్ల న
స్తోకముదబ్ధిఁ దేల్చి పరితుష్టుఁడ వై చను దెమ్ము చెచ్చెరన్. 3106

చ. నలువుగ శృంగిబేరపురనాథు నిషాదపతి న్గుహు న్గుణో
జ్జ్వలుఁ గని నాదుకౌశలము సమ్మతి నేర్పునఁ దెల్పి యవ్వలం
దలఁగ కయోధ్యకుం జని ధృతవ్రతుని న్భరతుం గుమారు న
త్యలఘుచరిత్రుఁ గాంచి వినయంబున మత్కుశలంబుఁ దెల్పుమా. 3107

వ. మఱియును. 3108

సీ. బలవంతుఁ డై నయాతుఁడు దశాస్యుండు దండకారణ్యమధ్యమున నుండి
జనకజ మ్రుచ్చిలి గొనిపోవుటయుఁ గపివిభునితో మైత్రిఁ గావించుటయును
వాలి నొక్కమ్మునఁ గూల నేయుటయును వెలఁదుక వెదుకంగ విపినచరులఁ
బంపుటయును గీశబలసహితంబుగా వారిధితీరంబుఁ జేరుటయును

తే. జలధి ప్రార్థించుటయు నతం డలరి దివ్య
రూపధారి యై వెనఁ బొడసూపి కాన,

లిచ్చి సదుపాయ మెఱిఁగించి యేగుటయును
గడలిపై సేతువు నలుండు గట్టుటయును. 3109

చ. తొలఁగక సేతుమార్గమునఁ దోయధి ప్రేల్మిడి దాఁటి రావణుం
గలన వధించి జానకిని గ్రమ్మఱఁ గైకొని యక్షశూలభృ
జ్జ్వలరుహగర్భపాశధరశక్రులచేత వరంబు నొందుట
ల్కలుషవిదూరు మజ్జనకుఁ గాంచుటయు న్గృతకార్యసిద్ధియున్. 3110

మ. ధరణీపుత్త్రియు లక్ష్మణుం డనుజుఁడున్ దైత్యాన్వయశ్రేష్ఠుఁడు
న్వరుసం గొల్వ ననంతవానరచమూవారాభియుక్తుండ నై
యరు దాపుష్పక మెక్కి బల్విడి సమృద్ధార్థుండ నై వచ్చుట
ల్గర మర్థి న్వినిపింపు సర్వమును నీకన్నంత విన్నంతయున్. 3111

సీ. మారుతసుత నీవు మారాక ప్రీతితో నెఱిఁగింప విని కైకయీసుతుండు
ఖేదంబు నొందునో మోదంబు నొందునో యతనియాకారంబు నతనిభావ
మతనివృత్తాంతంబు నతనియింగితములు నతనిసంభాషణం బతనిబుద్ధి
యతనియాననవర్ణ మాతనివ్యవసాయ మతిసూక్ష్మబుద్ధిచే నంత యెఱిఁగి

తే. సత్వరంబుగఁ జనుదెమ్ము సర్వకామ,ఫలదము రథాశ్వహస్తిసంకులము పితృపి
తామహసమాగతం బైనధరణిరాజ్య,మెవ్వనిమనంబు దగ హరియింపకుండు.

క. చిరకాలపరిచయంబున, నిరవుగ రాజ్యార్థి యయ్యె నేనియు వినుమా
భరతున కొనఁగెద రాజ్యము, కర మరుదుగ నతఁడె యేలుఁగాక ధరిత్రిన్.

ఉ. నా విని ధీరుఁ డాపవననందనుఁ డెంతయుఁ బొంగి చారునా
నావిధరూపధారణమున న్గడు దక్షుఁడు గాన నేర్పున
న్నావిరి సంశయార్హ మగువానరరూపము మాని యింపుసొం
పావహిల న్మనోజ్ఞమనుజాకృతిఁ గైకొని సమ్మదంబునన్. 3114

చ. గరిమ నయోధ్య కేగ ననుకట్టి భుజంగమభక్ష్యులుబ్బఁ జా
గరుడునికైవడి న్జవము గైకొని గ్రక్కున దాఁటె దేవకి
న్నరమునియక్షసిద్ధవనునాగనభోగపత్త్రిసాధ్యకిం
పురుషవిహారదేశ మగుభూరిఘనాభివృతాభ్రవీథికిన్. 3115

వ. ఇట్లు గగనంబున కుద్గమించె. 3116

చ. రయమున నేగుచుం గనియె రమ్యఫలాశఫలప్రసూనసం
చయభరితాంబరోల్లిఖితచారువిశాలరసాలవృక్షసం
ఘయుతవనంబులుం ద్రిపథగాయమునానదిమధ్యసంస్థితా
క్షయమునిమందిరంబులును గైరికధాతువిచిత్రితాద్రులన్. 3117

హనుమంతుండు శృంగిబేరపురమందు గుహునకు రామాగమనం బెఱింగించుట.

క. అంగజహరుఁ డలశైలసు,తుం గూడిననాఁటిసొంపు దాల్చి యలరునా
గంగాయమునాతటినీ,సంగమవిషయంబు గనుచుఁ జని చని యవలన్. 3118

ఉ. రంగదభంగసంగళతరంగపరంపరల న్నభశ్చర
ద్గంగను సంస్పృశించెడువిధంబున నొప్పెడులోకపావని
న్గంగను సాంద్రహర్ష మెసఁగం గని యానది నుత్తరించి యా
ముంగలిశృంగిబేరపురము న్గని సంగతి మీఱి నచ్చటన్. 3119

ఉ. ఆజగ దేకవీరుఁడు మహాత్ముఁడు వాయుకుమారుఁ డాగుహు
న్రాజితసత్త్వశాలిఁ గని రామకథాకథనప్రభూతము
ద్రాజితవక్త్రుఁ డై ఘనుఁడు రాముఁడు నీప్రియమిత్రుఁ డాభర
ద్వాజునియాశ్రమంబునకు వచ్చెఁ బ్రియానుజసంయుతంబుగన్. 3120

ఉ. పంచమినాఁటిరాత్రి నరపాలశిఖామణి రాముఁ డచ్చటం
గొంచక నిద్రఁ జేసి మునికుంజరుచేత ననుజ్ఞ గాంచి య
భ్యంచితరీతి రేపకడ నంపక మై వెస రాఁ గలండు నీ
వించుకసేపులోనఁ దగ నిచ్చటఁ జూచెద వాదయానిధిన్. 3121

వ. అని పలికి సకలజగదానందకారి యగురామభద్రుని ప్రత్యాగమనంబు నాచేతఁ గథితం బయ్యె నని సంప్రహృష్టతనూరుహుం డై మహాతేజుం డగువాయునందనుండు వేగవంతుం డై మార్గశ్రమంబు విచారింపక మహావేగంబున నాకాశంబున కెగసి వాయుమార్గంబునం బోవుచు. 3122

మ. కనియె న్ముందట రామతీర్థము నపంకస్యాందికాఖ్యాపగ
న్గనదంభోరుహషండమండలయుతాఖండద్యుతి న్గోమతి
న్వినుతస్వచ్ఛసుశీతలోదకయుత న్వేదశ్రుతి న్నిమ్నగ
న్ఘనవేదండనిపీతతోయతమసాకల్లోలినీరత్నమున్. 3123

క. ధనధాన్యోపేతంబులు, జనయుతములు సకలసస్యసంపన్నంబు
ల్వనరాజిరంజితంబులు, జనపదములు చూచికొనుచుఁ జనియె లఘుగతిన్. 3124

చ. నిరుపమభర్మనిర్మితవినిర్మలశర్మదరమ్యహర్మ్యము
ల్వరశుకశారికాపికరవస్ఫురితోరుమహావనంబులు
న్సురుచిరహేమరత్నరుచిశోభితసాలములు న్గభీరసా
గరనిభఖేయము ల్గలిగి క్రాలునయోధ్యను గాంచె దవ్వులన్. 3125

వ. ఇట్లు విలోకించి యమ్మహారాజధానికిఁ గ్రోశమాత్రదూరంబున. 3126

క. ఆమారుతపుత్రుఁడు మణి, ధామరుచివితానరంజితస్ఫుటవీథీ
స్తోమ మగుదాని నంది, గ్రామంబును గని తదంతికంబున నొకచోన్. 3127

సీ. సమదకోకిలకీరశారికామధుకరబర్హిణనిస్వనబంధురంబు
రుచిరపల్లవఫలప్రచయసూనగుళుచ్ఛకళికాభిరామశాఖాచయంబు
శీతలానిలసమానీతనానావిధవ్యాకీర్ణవాసనావాసితంబు
స్ఫుటితపద్మోత్పలభూషితామృతతుల్యజీవనోపేతసరోవరంబు
తే. పోషితవిచిత్రమృగరాజభూషితంబు, చమరకస్తూరికామృగసంకులంబు

చైత్రరథనందనోద్యానసన్నికాశ,మగుమహోద్యానమొకటిసొంపలరఁగనియె.

—హనుమంతుఁడు భరతునిం జూచుట.—

వ. ఇట్లు మహోద్యానంబు సొచ్చి తన్మధ్యదేశంబున. 3129

సీ. జడలగుంపు ధరించి శైవాలయుతసూర్యతనయాలహరిభంగిఁ దనరువాని
నెఱిమించి పసిఁడిజన్నిదముదాల్చి తటిత్సమేతమేఘముమాడ్కి మెఱయువాని
వల్కలంబులు గట్టి వనరాజిరంజిత నీలాచలమురీతి నెగడువాని
నలువొప్పఁ గృష్ణాజినము దాల్చి నీలాభ్రకలితాంబరములీలఁ గ్రాలువాని

తే. మౌనివేషంబు గైకొని మహితధర్మ,యుక్తి నాశ్రమవాసి యై యున్నవానిఁ
గార్శ్యమాలిన్యలక్షితకాయుఁ డైన,వాని బ్రహ్మర్షిసమతేజుఁ డైనవాని. 3130

క. నిర్మలచిత్తుని నియతుని, ధర్మవిశారదునిఁ దనువుఁ దాల్చినసాక్షా
ద్ధర్మముక్రియఁ జూపట్టెడు, ధర్మాత్ముని వశిని ఋజుని దాంతుని వాగ్మిన్. 3131

క. దీనుని ఫలమూలాశను, మానధనుని రామనామమంత్రజపపరు
ధ్యానాసక్తమనస్కుని, దీనావనచణగుణాఢ్యు ధీగుణయుక్తున్. 3132

చ. అకలుషచిత్తరామచరణాంకితపావనదివ్యహేమపా
దుకలు పురస్కరించుకొని తోయధిమేఖల నేలువాని సే
వకులను నాల్గువర్ణములవారి స్వధర్మములందు నిల్పి నే
ర్పుకలిమి సంతతం బరసి ప్రోచెడువాని మహానుభావునిన్. 3133

శా. కాషాయాంబరధారులై విమలులై కౌతూహలం బొప్ప ని
ర్దోషు ల్పౌరపురోహితు ల్సుగుణసంస్తుత్యు ల్సమంత్రాదికా
శేషామాత్యులు చుట్ల నుండి మిగుల న్నీతేశవృత్తాంతము
న్భాషింపం దగుభంగి వారినడుమ న్బాగొప్ప నాసీనుఁ డై. 3134

చ. కడిమిమెయి న్రఘూత్తముఁడు కానకుఁ బోయి చతుర్దశాబ్దము
ల్కడచన నమ్మహాయశుఁడు గ్రమ్మఱ వచ్చెడుజాడ లేదు నే
నుడుగక యన్నమాట మది నుంచెనొ లేదొ యటంచు దీనుఁ డై
యడలుచు నున్నవాని సుగుణాభిరతు న్భరతు న్గని న్రహిన్. 3135

వ. ఇట్లు సముచితంబుగా సందర్శించి. 3136

క. తక్కక రామునిరూపం, బక్కజముగ నతనిరూప మచ్చొత్తినయ
ట్లొక్కటి యై యుండుట గని, గ్రక్కున నద్భుతము ముదముఁ గడలుకొనంగన్.

—హనుమంతుఁడు భరతునకు రామాగమనంబు దెల్పుట.—

వ. ప్రియవచనశీలుం డగునమ్మారుతనందనుండు నిటలతటవిన్యస్తపుటుం డై పర
మానందసంపాదకం బైనమధురవాక్యంబున ని ట్లనియె. 3138

చ. అనఘచరిత్ర యెవ్వఁడు జటాజినము ల్ధరియించి దండకా
వనమున కేగె నెవ్వనివివాసనము న్దలపోసి యాత్మలోఁ
బెనువగఁ బూని నీవిటు తపించెద వారఘురాముఁ డెంతయు

ద్దనకుశలంబుఁ దెల్పు మని తప్పక నన్నిటఁ బంప వచ్చితిన్. 3139

ఉ. రాముఁడు జన్యరంగమున రావణుఁ జంపి కృతార్థుఁడై రహి
న్భూమితనూజఁ జేకొని సమున్నతవానరసైన్యయుక్తుఁడై
కోమలమూర్తి లక్ష్మణుఁడు గొల్వ సుఖస్థితి నేగుదెంచె నా
హైమవతీకుమారయుతుఁడైనపురారిక్రియం జెలంగుచున్. 3140

తే. జంభశాసనుఁ గూడినశచివిధమునఁ
జంద్రుఁ గూడినరోహిణిచందమునను
రామచంద్రునిఁ గూడి యాభూమిపుత్రి
ముదము దీపింప వచ్చుచున్నది మహాత్మ. 3141

క. ధీరోత్తమ నీ విప్పుడె, శ్రీరామునిఁ గలసి మెలసి శీఘ్రంబున నీ
దారుణశోకము విడిచెదు, వారక శుక్లాన్యమైనవస్త్రముఁ బోలెన్. 3142

చ. అన విని కైకయీతనయుఁ డప్రతిమప్రముదాబ్ధివీచిక
ల్మునుకొని తన్నుఁ గప్పికొన మోహవశంబున నూరకుండి యం
త నొకముహూర్తవేళ కటుతప్పక కన్నులు విచ్చి మ్రోలఁ గ
ల్పనగముభంగి నున్నప్రియవాదిని ధీరుని వాయుపుత్రునిన్. 3143

ఉ. చూచి ముదంబు నొంది పరిశుద్ధకుశాజినపీఠి నుండి వే
లేచి సుధామయోక్తుల వలీముఖవర్యు బహూకరించి హే
మాచలధీరుఁ డామనుకులాగ్రణి హస్తికరాభహస్తము
ల్సాఁచి ప్రియత్వ మేర్పడఁగఁ జయ్యనఁ గౌఁగిటఁ జేర్చి వేడుకన్. 3144

భరతుండు హనుమంతునకు బహుమతు లొసంగుట.

క. ఆనందబాష్పధారలఁ, దా నెంతయుఁ దడిసి పిదపఁ దరుచరవరు నె
మ్మే నంతయుఁ దడుపుచు నృప,సూనుం డిట్లనె శిరీషసుమమృదులోక్తిన్. 3145

క. దేవజగంబుననుండి మ,హావాత్సల్యంబు మెఱయ నరుదెంచినయా
దేవతవో మనుజుఁడవో, ధీవర నీవిధము నాకుఁ దెలియం జెపుమా. 3146

చ. ప్రియమున నిట్టిసత్ప్రియము ప్రీతి దలిర్పఁగఁ జెప్పినట్టినీ
కయుతగజంబులు న్శతసహస్రహయంబులు లక్షగోవులు
న్నియుతమణుల్వరాభరణభాసితలం గులశీలసౌకుమా
ర్యయుతలఁ జంద్రవక్త్రలఁ బదార్వురఁ గన్యల హేమవర్ణలన్. 3147

క. ఇచ్చెదఁ గైకొను మీ వని, యచ్చుపడం బలికి భరతుఁ డతఁడును దానుం
జెచ్చెర నాసనములపై, మచ్చికఁ గూర్చుండి రపు డమానుషలీలన్. 3148

వ. ఇవ్విధంబున నగ్ర్యాసనంబులయందు సుఖాసీనులైనయనంతరంబ భ్రాతృవత్సలుం
డగుభరతుండు రామసమాగమనశ్రవణసంజాతసాంద్రానందరసపోషితసర్వాం
గుండై వెండియు హనుమంతు నవలోకించి యిట్లనియె. 3149

సీ. అనఘాత్మ మన్నాథుఁ డైనరాముఁడు వనంబున కేగి పెక్కుహాయనములయ్యె

నానందకరమైనయమ్మహాత్మునిశుభవార్త నేఁ డిట్లు నీవలన వింటి
మని యున్ననరునకు మహి శతాబ్దములలో ఘనతరానందంబు గలుగు ననెడు
జనవార్త నేఁటికి సత్యార్థమై తోఁచె విపులసమ్మోద మావిర్భవించె
తే. నృపులకు వనాటులకు సఖ్య మెట్లు గలిగె
నేమికారణమునఁ గల్గె నెందుఁ గల్గె
నంతయును బ్రీతి నెఱిఁగింపు మనినఁ బవన
తనయుఁ డవ్విభుతోడ నిట్లనుచుఁ బలికె. 3150

హనుమంతుఁడు భరతునకు రామునివృత్తాంతమంతయుం జెప్పుట.

సీ. నృపతి కైకకు వర మిచ్చుటయును రాముఁ డెలమిఁ గాననమున కేగుటయును
దనయశోకమున మీతండ్రి చచ్చుటయును దూతచోదితుఁడవై తొడరి నీవు
చను దెంచుటయును రాజ్యము గైకొనక చిత్రకూటాచలమున కేగుటయు రామ
భద్రునిఁ గడు భక్తిఁ బ్రార్థించుటయు నమ్మహాత్ముఁడు ధర్మాత్ముఁ డగుటవలన
తే. రాజ్య మంగీకరింపక రా ననుటయు, వరుసఁ దత్పాదుకలు గొనివచ్చుటయును
నృపకులోత్తమ యింతయు నీకుఁ దెలిసి, యున్న దేకద యవ్వలియునికి వినుము.
చ. నృపకులశేఖరా పురికి నీ విటు వచ్చినపిమ్మట న్మద
ద్విపతురగోష్ట్రగోవృషభవీరవిమర్దితవృక్షషండమై
విపులభయప్రవేగహతవిష్కిరవన్యమృగప్రకాండమై
యపు డలచిత్రకూటవన మంతయుఁ బాడటి యుండె నెంతయున్. 3152
మ. అకలంకేందుసమానవక్త్రుఁ డగురామాధీశుఁ డచ్చోట ని
ల్వక భార్యానుజయుక్తుఁడై భయదకోలవ్యాఘ్రవేదండశ
ల్యకభల్లూకమృగేంద్రభీషణము నుద్యత్ప్రాంశుశాఖావిసా
రికుజాతం బగుదండకావనముఁ జేరె న్భూరితేజంబునన్. 3153
ఉ. ఆయడవి న్విరాధుఁడు నగాభశరీరుఁడు రాక్షసుండు నా
గాయతసత్త్వుఁ డంబుదనిభార్భటితో భయదాట్టహాసుఁడై
డాయఁగ నేగుదెంచినఁ గడంగి నదత్కరినట్ల యమ్మహా
కాయునిఁ ద్రుంచి రాముఁడు నిఖాతమునం బడవైచె నుద్ధతిన్. 3154
క. ఈవిధి నద్భుతకర్మము, గావించి మహాత్ములైనకాకుత్స్థవరు
లావిరి శరభంగమునిశ్రీ, పోవనమండలము సేరఁబోయిరి వెలుఁగన్. 3155
వ. ఇట్లు సాయాహ్నసమయంబునకు శరభంగునిరమ్యాశ్రమంబు సేరం జని. 3156
క. ఆమునిచేఁ బూజితులై, భూమద్యుతు లతఁడు దివికిఁ బోయినపిదప
న్స్వామీ శసుత సుతీక్ష్ణము, హామునిరమ్యాశ్రమమున కరిగిరి వరుసన్. 3157
ఉ. ఆజటివర్యుఁ డిచ్చినమహాపచితిం గొని యవ్వనంబులో
రాజిలుచున్న సర్వమునిరాజులఁ గాంచి నమస్కరించుచు
న్తేజ మెలర్పఁ గుంభభవదివ్యమునీంద్రునిపాలి కేగి త

త్సూజనము గ్రహించి నరపుంగవు లెంతయు హృష్టచిత్తులై. 3158

తే. ఆయగస్త్యునివలన దివ్యాయుధములు, వడసి గౌతమీనదిచెంత వఱలుపంచ
వటి ప్రవేశించి మువ్వురచ్చట వసించి, యుండిరి పలాశశాలలో నుత్సుకముగ.

ఉ. అంతట నొక్కనాఁ డొకమహాసురి శూర్పణఖాఖ్య వచ్చి తా
నెంతయుఁ గ్రుద్ధయై వెస మహీతనయం గబళింపఁ బోయినం
బంత మెలర్ప లక్ష్మణుఁడు భ్రాతృనియోగమున న్సితాసిచే
వింతగ దానినాసికయు వీనులు గోసి విరూపఁ జేసినన్. 3160

మ. అలుక న్దానవి ఘోరనాదమున నాహాకారముం జేయుచు
న్గల మొప్ప నవ్వడిఁ బాఱి యచ్చట జనస్థానంబునం దున్నదో
ర్బలశాలి న్ఖరనామరాక్షసుని శుంభద్విక్రమాటోపుని
న్బలసంయుక్తునిఁ జేసి దారుణగతిం బంపెన్ రణార్థం బొగిన్. 3161

చ. అనమున రాముఁ డొక్కఁడు మహాశనితుల్యశిలీముఖంబుల
న్వెస నిగిడించి యాభువనవిశ్రుతులం బదునాల్గువేలర
క్కసుల భుజాబలాధికులఁ గల్మషుల న్మఖవిఘ్నకారులం
గసిమసి చేసె నొక్కత్రుటికాలములోన మహాద్భుతంబుగన్. 3162

ఉ. దానవవంశవర్యు నతిదర్పితు దూషణువైరిదూషణు
న్దోన సమోఘవీర్యు నరిదుర్దము రాక్షసశేఖరు న్ఖరు
జ్యానినదప్రకంపితమహాద్రిశిరుం ద్రిశిరుం దగం జన
స్థాననివాసులం దునిమె దారుణభంగి ఘనాంబకంబులన్. 3163

వ. ఇవ్విధంబున నర్ధాధికముహూర్తమాత్రంబున నక్తంచరుల నందఱ నిశ్శేషం
బుగా రూపుమాపిన. 3164

ఉ. ఆవిధ మంత గన్గొని రయంబున రాక్షసి లంక కేగి ర
క్షోవిభుఁడైన రావణునకుం దగఁ జెప్పిన వాఁ డమర్షియై
పావకుకైవడిం గనలి పాపుననుక్కునిఁ దాటకేయుని
న్దేవవిరోధినిం బనిచెఁ దెంపుమెయి న్వెస వారియొద్దకున్. 3165

ఉ. వాఁ డటు రత్నచిత్రితసువర్ణమృగాకృతి నొంది బల్విడి
న్వేడుకతోడ నవ్విపినవీథిఁ జరించుచు దేవిచిత్తము
న్దోడ హరించిన న్బ్రమసి తొయ్యలి రామునిఁ జూచి యీమొకం
బేడది నామనంబు హరియించెడుఁ గంటివె నీవు ముంగలన్. 3166

శా. ఆహా యెంతవిచిత్ర మీమృగము నుద్యత్ప్రీతితోఁ బట్టితె
మ్మూహింప న్మనయాశ్రమాభరణమై యొప్పారు నంచు న్నను
త్సాహం బేర్పడఁ బల్కిన న్విభుఁడు కాంతాప్రేరితుండై సుస
న్నాహం బొప్పఁగ నేగె నమ్మెకమువెంట న్సద్ధనుష్పాణియై. 3167

శా. ఈచందంబునఁ బోయి రాముఁడు రయం బేపార దాని న్బల
ప్రాచుర్యంబునఁ బట్టలేక కడుదూరం బేగ దోషాటమా
యాచాతుర్య మటంచు నెంచి పటుశౌర్యస్ఫూర్తి శోభిల్ల మా
రీచు న్నీచుని ఘోరకాండమున ధాత్రిం గూల్చె నత్యుద్ధతిన్. 3168

క. ఆ తాటకాసుతుం డీ,రీతి శరాలీఢుఁ డై ధరిత్రిం బడి హా
సీతా హా లక్ష్మణ యని, యాతతముగఁ బేరుకొనుచు నసువులు విడిచెన్. 3169

క. అనినదము విని యప్పుడె, జానకిపనుపునఁ బ్రతాపసాంద్రుండు సుమి
త్రానందనుండు కౌస,ల్యానందనుసేమ మరయ నరిగెం బెలుచన్. 3170

శా. ఆలో రావణుఁ డేగుదెంచి కుటిలుం డై భాముఁ డారోహిణిం
బోలెన్ జానకి బల్మిఁ గైకొని జగంబు ల్హోయఁ దద్రక్షణా
లోలు న్వృద్ధు జటాయువు న్విహగపాలుం ద్రుంచి మింటం జనెన్
శైలాగ్రంబున నుండి యేవురు కపుల్ సంభ్రాంతు లై చూడఁగన్. 3171

శా. ఈరీతిం జని లంక సొచ్చి దనుజాధీశుండు హేమాచలా
కారాగారమునందు డించి మృదువాక్యప్రౌఢిఁ బ్రార్థించి దు
ర్వారప్రార్థతఁ ద న్గణింపక తృణప్రాయంబుగా నెంచి న
న్నైష్కరాశ్యంబున దాఁచె నిష్కుటమున న్నారీశిరోరత్నమున్. 3172

ఉ. రామనరేంద్రుఁ డీగతి నరణ్యమునం బటురౌద్రభంగి మా
యామృగరూపధారిని నిశాటుని గీ టణఁగించి వచ్చి సు
శ్రామనమానుఁ డాశ్రమపదంబున జానకిఁ గాన కెంతయు
న్భీమతరప్రశోకపరిపీడితుఁ డై యనుజాన్వితంబుగన్. 3173

ఉ. ఆవిపినంబునం గలమహాద్రుమము ల్నగము ల్నికుంజము
ల్పావనగౌతమీనదియుఁ బద్మనిబద్ధజలాశయంబులు
న్భావరుఁ డన్నియు న్వెదకి భూమిజఁ గానక శోకదీనుఁ డై
వావిరి మేదినిం బడినవాని జటాయువుఁ గాంచె నొక్కచోన్. 3174

క. అతఁడు పితృసఖుఁడు గావునఁ, జతురత సంస్కారవిధులు సలిపి మిగుల శా
శ్వతసౌఖ్య మొసఁగి యనుజా,న్వితుఁ డై యద్దేవి నడవి వెదకుచుఁ గడఁకన్.

చ. చనిచని యొక్కచో నమితసత్త్వ మహావికృతాంగునిం గబం
ధునిఁ గని వానిఁ జంపుటయుఁ దోడనె దివ్యశరీర మబ్ధు గై
కొని యతఁ డింద్రలోకమునకు న్జనుచు న్దగ ఋశ్యమూకమం
దనువుగ నున్నభానుసుతు నర్థిఁ గనం జను మంచుఁ బల్కెనన్. 3176

వ. మహాత్మా రామభద్రుండు కబంధోపదిష్టమార్గంబునఁ బంపాపుష్కరిణి నధిగ
మించి యందున్నశబరిచేత నర్చితుం డై విశాలసాలజాలం బైనఋశ్యమూక
శైలంబునకుం జని వానరాధిపుం డైనసుగ్రీవునితో సఖ్యంబు గాంచె నంతకు
మున్న బలవంతుం డైనవాలిచేత నిరస్తుం డైనసుగ్రీవుండును సీతావియోగ

దుఃఖితుం డగురాముండును సమానావస్థలు గలవా రగుటం జేసి మనంబునం
బరస్పరసంబంధంబు గాంక్షించుచున్నవారు కావున నయ్యిరువుర కితరేతర
సంవాదంబున గాఢం బైనప్రణయంబు గలిగె నంత. 3177

క. బలవంతుం డైనవాలిని, బలసూదనసుతుని నొక్కపటుబాణముచే
నిలం గూల నేసి రవిజున, కెలమిం గపిరాజ్య మిచ్చెం గృప దళుకొత్తన్.

ఉ. రామునిసత్కృపం బ్లవగరాజ్యము నొంది కృతార్థుం డై రహి
న్థామనిధిప్రియాత్మజుండు దాశరథిప్రియపత్ని యైనయా
భూమికుమారిక న్వెదకం బుచ్చె ననేకసహస్రకోటులం
గామశరీరుల న్గిరినికాశుల మారుతతుల్యవేగులన్. 3179

వ. ఇట్లు సుగ్రీవప్రేరితు లై దశకోటివానరులు సీతామార్గణవ్యగ్రు లై నలుదెస
లకుం జని రేను వారిలోం గొందఱ వానరులం గూడి దక్షిణదిక్కునకుం జని
వింధ్యమహీధరప్రాంతకాంతారసుందరకందరసానుకటకాధిత్యకలయందు వైదే
హి నన్వేషించి యెందునుం గానక క్షుత్పిపాసాపరవశుల మై యొక్కబిలంబులో
నికి డిగ్గి మరలి వెడలు తెఱం గెఱుంగక పరిభ్రమించుచుండ మాకుం గొండొక
కాలం బతిక్రమించె నంత నొక్కయోగినిమహిమంబున నమ్మహాబిలంబు వెడలి
వచ్చి సుగ్రీవభయభ్రాంతుల మై యొక్కచోటం బ్రాయోపవేశనంబుం జేసి
యుండ నప్పుడు జటాయువునన్న యగుసంపాతి యనువాండు మాకడకుం జను
దెంచి లంకాపురంబునం గలరావణునియశోకవనంబులో జానకియున్నదని చెప్పి
యరిగిన యనంతరంబ ప్రాయోపవేశనంబు చాలించి. 3180

ఉ. ఏ నొకరుండ వానరులకెల్లం బ్రియంబుగ నాత్మవీర్యము
న్మానుగం దాల్చి మారుతసమానజవంబునం బన్నగారిచం
దాన విహాయసంబునకు దాటి వెన న్శతయోజనంబు లం
భోనిధి నుత్తరించి యటువోయి త్రికూటనగాగ్రమండలిన్. 3181

చ. అతులితహేమసౌధముల నంచితరత్నవిశాలశాలల
న్వితతవిమానరాజముల విశ్రుతకాంచనవప్రగోపుర
ప్రతతుల రమ్యచత్వరవరంబుల నొప్పుచు విశ్వకర్మని
ర్మిత మయి నాగపట్టణమురీతి వెలింగెడు లంకలోపలన్. 3182

చ. అరుదుగ నయ్యశోకవనికాంతరమందు దురంతచింతచే
మరువు దొఱంగి యశ్రుకణపూరితలోచన యై కృశాంగి యై
నిరుపమశోకవేగమున నీరధిలోనం జలించుభారభృ
త్తరిపగిదిం జలించుచు వితాకున మాటికి వెచ్చ నూర్చుచున్. 3183

ఆ. మలినపటముతోడ మాసినజడతోడ, నొప్పు దూలి గుందుచున్నదాని
రేణుజాలయుతశరీరంబు గలదానిం, బుణ్యసాధ్వి జనకపుత్త్రిం గాంచి. 3184

క. జననాయకుం డిచ్చినకాం,చనముద్రిక గుఱుతొసంగి సదమలమతి మె

ల్లనఁ బతిక్షేమం బంతయు, వినిపించితి వీను లలర వినయం బెసఁగన్. 3185

శా. ఆరామామణి విశ్వసించి పతివార్తాకర్ణనోద్భూతవి
స్తారానందరసప్రబుద్ధవిలసత్సర్వాంగి యై మోము రా
కారాజచ్ఛశిభంగి సొంపలర వేడ్క న్నన్ను మన్నించి శం
కారాహిత్యముతో శిరోమణి యభిజ్ఞానార్థ మర్పించినన్. 3186

శా. దానిం జేకొని యేను వేల్పు లరుదంద న్దైత్యరాడ్జీవిత
స్థానం బైనయశోకకాననము విధ్వంసంబు గావించి దై
త్యానీకంబుల నాజిరంగమున బాహాశక్తి మర్దించి ర
క్షోనాథాత్మజు నక్షునిం దునిమి సక్రోధుండ నై పిమ్మటన్. 3187

మ. గరిమ న్వాలగతాగ్నిచే మిగుల లంకాపట్టణం బంతయు
న్వరుస న్భస్మము చేసి రాముమహిమ ల్వర్ణించి పేర్వాడి గ్ర
మ్మఱఁ బాథోనిధి దాఁటి రాముకడకు న్వానొప్ప నేతెంచి యా
దర మారం దగ మానికం బొసఁగి సీతాక్షేమముం దెల్పితిన్. 3188

ఉ. ఆనృపవంశవర్యుఁడు ప్రియాకుశలశ్రవణాభిజాతసాం
ద్రానుపమానహర్షపులకాంచితవిగ్రహుఁ డై సుధారసం
బానినవేల్పుమాడ్కి విగతాసుభయుం డయి వీతశోకుఁ డై
మానుగ నా కొసంగె నసమానభుజాపరిరంభణం బొగిన్. 3189

వ. ఇవ్విధంబున నాలింగనంబు గావించి యుద్యోగంబు సమకట్టి. 3190

చ. అలిగి యుగాంతకాలమున నద్భుతభంగి జగంబు లేర్చఁగాఁ
దలకొనినట్టిపావకువిధంబున రాక్షసనాశమందు ని
శ్చలముగఁ జిత్తము న్నిలిపి సర్వవనాటచమూసమేతుఁ డై
నలకృతసేతుమార్గమున నల్వుగ నీరధి దాఁటి బల్విడిన్. 3191

సీ. అనిలోన నేను ధూమ్రాక్షుఁ డాదిగ దైత్యవీరులఁ దునిమితి విక్రమమున
బలశాలి యగునీలుఁ డలప్రహస్తునిఁ జంపె వనచరవిభుఁడు కుంభుని వధించె
వాలితనూజుండు వజ్రదంష్ట్రాదులఁ బరిమార్చె సౌమిత్రి ప్రధనమందు
నతికాయశక్రజిదాఖ్యులఁ దెగటార్చె రామభద్రుండు దుర్వారభంగిఁ

తే. గలన రావణకుంభకర్ణుల వధించె, నిట్లు విజయంబు గైకొని యింపు మీఱ
నగ్నిముఖమునఁ బరిశుద్ధ యైనయవని,సుతను జేకొని రఘుపతి యతిముదమున.

చ. అనిమిషవల్లభుండు యముఁ డర్ణవనాథుఁడు శూలపాణియున్
వనజభవుండు దేవమునివర్గయుతంబుగ నేగుదెంచి చ
య్యన బహుభంగుల న్వినుతు లర్థి నొనర్చిన నంతవారిచే
ననుపమలీల దుర్లభము లైనవరంబులు గాంచి పిమ్మటన్. 3193

తే. దేవవిష్టపమున నుండి దివ్యరూప, ధారి యై చనుదెంచినతండ్రిఁ గాంచి
ప్రస్తుతించి రణంబునఁ బడినకపుల, నెల్లఁ గ్రమ్మఱ బ్రతికించి యింపు మీఱ.

వ. రావణానుజుఁ డైనవిభీషణుని లంకారాజ్యంబున కభిషిక్తునిం జేసి సుగ్రీవవిభీషణజాంబవదంగదాదిసుహృత్సమేతుం డై సీతాలక్ష్మణసహితంబుగాఁ బుష్పకనామవిమానం బారోహించి కిష్కింధాపురమార్గంబునఁ గ్రమ్మఱ భరద్వాజాశ్రమంబునకుం జనుదెంచి మునిసన్నిధియందు వసించియున్నవాఁ డమ్మహాత్ము నల్లి పుష్యయోగంబున నవిఘ్నంబుగా సందర్శింపంగల వని సర్వంబును సవిస్తరంబుగా విన్నవించిన సత్యం బైనమారుతివచనంబు విని భరతుండు పరమానందరసప్రబుద్ధసత్త్వుం డై యంజలి గీలించి హనుమంతు నవలోకించి యిట్లనియె.

సీ. పూర్వాచరితపుణ్యపుంజంబు లన్నియు ఫలియించెఁ గా నేఁడు పవనతనయ
నాకోర్కు లన్నియు నయముతో నేటికిఁ బూర్ణంబు లయ్యె నో పుణ్యచరిత
నేఁడు గా నా కనిందితసర్వశుభములు సమకూడె నిచ్చట సాధువినుత
నిరుపమం బైనమానితసౌమనస్యంబు నేఁడు గా సమకొనె నిర్మలాత్మ

తే. రఘుకులం బంతయును నేఁడు రమణ కెక్కె
ఘనత సౌభాగ్యకీర్తులు గలిగె నేఁడు
రాజకోటికి మిక్కిలి తేజ మెసఁగెఁ
గాన లేయుండు వచ్చినకారణమున. 3196

వ. అని పలికి సత్యవిక్రముం డగుభరతుండు ప్రీతిమంతుం డై శత్రుఘ్ను నవలోకించి పరమానందకరం బగువాక్యంబున నిట్లనియె. 3197

మ. మననాథుం డగురాముఁ డిచ్చటికిఁ బ్రేమ న్వచ్చుచున్నాఁడు చ
య్యన నానాపురదేవతాయతనచైత్యాగారము ల్వీథులు
న్ఘనవాదిత్రసుగంధమాల్యముల శృంగారంబు గావింప వే
డ్కనియోగింపుము యోగ్యు లైననరులం గౌతూహలం బొప్పఁగన్. 3198

—భరతునినియోగంబున రాజపురుషు లయోధ్యారాజమార్గంబుల నలంకరించుట.—

వ. మఱియు మహానుభావుం డగురామచంద్రు నెదుర్కొనం జన వలయు స్తుతిపురాణజ్ఞు లైనసూతులును సర్వవైతాళికులును సర్వవాదిత్రకుశలులును గణికలును రాజపత్నులు నమాత్యులును సైన్యంబులును సేనాగణాంగనలును రాజన్యులును బ్రాహ్మణులును శ్రేణీముఖ్యులును దక్కినజనంబులును శశిసన్నిభం బైనరామునివదనంబు విలోకించుటకు శీఘ్రంబునం జనుదెంచువారుగా నియోగింపు మని పలికిన నతండు తద్వచనప్రకారంబున నయ్యైపనులకుఁ దగువారల నియమించి రామాగమనం బెఱింగించి ప్రయాణంబు చాటింపం బంచిన నందుఁ గొందఱు విషమస్థలంబులు సమతలంబులు గావించిరి కొందఱు పరిమళోపేతం బైనశీతోదకంబులు చిలుకరించిరి కొందఱు లాజపుష్పంబులు చల్లిరి పురవరంబున రాజవీథులందుఁ బతాకాధ్వజంబులు నిలిపిరి గృహాంగణంబులందు రంగవల్లికలుదీర్చిరి యసంబాధం బైనరాజమార్గంబు సుగంధమాల్య

పుష్పపంచవర్ణరంగవల్లికల నలంకరించిరి బహిర్ద్వారంబులందు రంభాస్తంభం
బులు నాటి రంత. 3199

తే. అర్థసాధకాశోకసిద్ధార్థవిజయ
మంత్రపాలకధృష్టిసుమంత్రవరజ
యంతులు యథార్హయానంబు లర్థి నెక్కి
యింపు సొంపారఁ బతిఁ జూడ నేగి రపుడు. 3200

ఉ. పొందుగ మత్తనాగములు భూరికరేణువులుం దురంగము
లస్యందనము ల్మహోక్షములు సచ్ఛిబిక ల్శకటాదికంబు లిం
పొందఁగ నెక్కి సంతసము లొప్పెసఁగం బురిలోనఁ గల్గువా
రందఱు రామచంద్రు నవు డర్థి నెదుర్కొన నేగి రెంతయున్. 3201

క. నరవిభునిపత్ను లందఱుఁ, దఱుచుగ యానంబు లెక్కి తగఁ గౌసల్యం
బరఁగ సుమిత్రాదేవిని, బురస్కరించుకొని చనిరి పుత్రులఁ జూడన్. 3202

క. హరిఖురశబ్దము రథనే,మిరవము గజబృంహితంబు మేదురభేరీ
వరపటహకాహళాదిక, వరవాద్యధ్వనులు మ్రోసె వసుధ చలింపన్. 3203

భరతుఁడు సపరివారుండై రాము నెదుర్కొనం బోవుట.

వ. ఇత్తెఱంగున నయోధ్యానగరంబునం గలవా రందఱు రామదర్శనలాలసులై
పరమోత్సాహంబున నందిగ్రామంబునకుం జనుదెంచి రప్పుడు భరతుండు వార
లం గలపికొని ధర్మకోవిదుండు గావున రామపాదుకలు శిరంబున నిడికొనిశుక్ల
మాల్యోపశోభితంబైన పాండురచ్ఛత్రంబును హేమవిభూషితంబులైన రాజార్హ
వాలవ్యజనంబులును బరిగ్రహించి యుపవాసకృశాంగుం డయ్యును రామాగ
మనసంజాతసాంద్రానందరసపోషితసర్వాంగుం డై చీరకృష్ణాజినాంబరధరుండై
సాక్షాద్బ్రహ్మర్షియుం బోలె వెలుంగుచు బ్రాహ్మణోత్తములును శ్రేణీముఖ్యు
లును వణిజులును మాల్యమోదకహస్తులైన సమంత్రులును బ్రాసశక్తిఖడ్గహ
స్తంబులైనవీరభటసహస్రంబులును గాంచనాపీడంబులైనహయంబులును
శాతకుంభవిభూషితంబులైనమదవారణంబులునుబతాకావంతంబులైనరథం
బులును సాంద్రప్రకారంబునం దనవెంట నరుగు దేరసచివసమన్వితుండై శత్రు
ఘ్నసహితంబుగా రాము నెదుర్కొనం బోవుచుఁ బవననందనుం గనుంగొని
యిట్లనియె. 3204

హనుమంతుఁడు భరతునకు రాముఁడు సమీపించెనని చెప్పుట.

చ. వనచరవంశవర్య రఘువర్యుఁడు వచ్చెడుజాడ గాన మా
వనచరవీరు లిచ్చటికి వచ్చెడుచందము దోఁప దేమియుం
గొనకొని ధాత్రిలోఁ గపులకుం జలచిత్తము గల్గు నండ్రు నీ
వనుపమలీల జాతిగుణ మర్మిలిఁ గైకొని పల్కవే కదా. 3205

ఉ. నా విని ప్రీతితోఁ బవననందనుఁ డంజలిఁ జేసి యిట్లనున్

దేవ కవిత్వ మూని యిటు దెల్పినవాఁడను గాను జూడుఁ డీ
త్రోవ మహీరుహావళి మధుస్రవ మై ఫలపంక్తి గల్గి నా
నావిధనూనలీనఖగనాదిత మై యటు చూడ నయ్యెడిన్. 3206

ఉ. రాజకుమార మున్ను సురరాజు వలీముఖు లున్నచోట ధా
త్రీజవితాన మాత్తమధుదివ్యఫలప్రసవప్రకాండ మై
రాజిలుచుండుఁ గాక నివరం బొసఁగె న్మతి వెంటనే భర
ద్వాజమునీంద్రుఁ డట్టులె ముదం బలరం గృపఁ జేసె నంతయున్. 3207

క. మున్ను సబలుండ వగునీ కున్నతగతి నమ్మునీంద్రుఁ డొనరించినసం
పన్నతరాతిథ్యము విని, యున్నారము మానిశిష్యు లొగి నెఱిఁగింపన్. 3208

క. హరిబల మప్పుడు గోమతి, తరించుచున్న దని బుద్ధి దలఁచెద విను మం
బరవీథి నిండి చెలఁగెడు, గుఱుతుగఁ బరివ్యాప్తకీశకోలాహలమున్. 3209

క. మానుగ వాలుకినీనది, వానను లటుదాఁటి యిపుడు వచ్చుచు నున్నా
రోనృపసుత యతిసాంద్రం, బై నెఱసినపాంసుజాలమదె గనుఁగొనుమా 3210

క. ఆలోకింపుము దవ్వులఁ, గాలాంబుద మాకనమునఁ గదలినమాడ్కిం
జాలఁ జలించుచు నున్నది, సాలవనము ప్లవగవాలకయుచలితం బై. 3211

సీ. పటుతపంబున మున్ను పరమేష్ఠి మెప్పించి ధనదుఁడు ప్రీతి నెద్దానిఁ బడసె
దారుణరణమున ధననాథుని జయించి దశకంఠ దైత్యుఁ డెద్దానిఁ గొనియె
రమణీయతరదివ్యరత్నదీధితులచే నతిచిత్ర మై యెద్ది యలరుచుండు
మనసునకంటె గాడ్పునకంటె ముంగల సత్వరంబుగ నెద్ది చనఁగ నొప్పుఁ

తే. గామదం బెద్ది చిత్తానుగమన మెద్ది
యట్టిపుష్పక మను దేవయాన మెక్కి
రాముఁ డరుదెంచుచున్నాఁడు రమణితోడఁ
జూడు మదె మింట శశిభంగిఁ జూడ నయ్యె. 3212

తే. అని సమీరాత్మజుఁడు పల్కునంతలోన
మణిసువర్ణరోచుల నభోమండలమును
వెలుఁగఁ జేయుచు భానుమండలముకరణి
నవ్విమానోత్తమంబు డాయంగ వచ్చె. 3213

భరతుఁడు పుష్పకారూఢు లైనసీతారామలక్ష్మణులం జూచుట.

ఉ. రాముని లక్ష్మణు జ్జనకరాజకుమారిక నవ్విభీషణు
న్నామనిధిప్రియాత్మజునిఁ దక్కినకీశులఁ గీశపత్నులం
బ్రేమ మదలిర్పఁ గన్గొని పురిం గలస్త్రీయువవృద్ధబాలకు
ల్నామజవాజియానరథజాలము డిగ్గిరి సంభ్రమంబునన్. 3214

క. వారలహర్ష సమీరిత, భూరినినాదంబు తూర్యములఘోషణ మ
బ్జారివిలోకనవర్ధిత. నీరధినిస్వనముభంగి నింగిఁ జెలంగెన్ 3215

తే. మంత్రపాలసుమంత్రాది మంత్రివరులు
పూర్ణజైవాతృకునిఁ బోలెఁ బుణ్యచరితు
రామభద్రుని వీక్షించి ప్రమద మెసఁగ
వాహనంబులు డిగ్గిరి వరుసతోడ. 32.6

చ. భరతుఁడు భ్రాతృవత్సలుఁడు పాయక లక్ష్మణజానకీయుతుం
బరమపవిత్రమూర్తి నరిభంజను భానుకులాబ్ధిసోము ధ
ర్మరతుని సత్యసంధుని విమానగతు న్రఘువర్యుఁ గాంచి బం
ధురవినయంబు హర్షము కుతూహలము న్మది నుప్పతిల్లఁగన్. 3217

చ. ఎదురుగ నిల్చి ఫాలమున నింపుగ నంజలిఁ జేసి నమ్రుఁడై
త్రిదశనగాగ్రభాగమునఁ దేజము మీఱుఘనంబుమాడ్కి సొం
పొదవ విమానరాజమున నుజ్జ్వలభంగిఁ జెలంగురాముని
న్వదలనిప్రేమఁ జూచె రఘువర్యుఁడు కన్నులగర్వ దీఱఁగన్. 3218

తే. వైజయంతాగ్రగతుఁడైన వజ్రపాణి
యనువునఁ జెలంగురామభద్రునకు నుదయ
పర్వతాగ్రంబుపైఁ దోఁచుభాస్కరునకుఁ
బోలెఁ జాఁగిలి మ్రొక్కె నప్పురుషవరుఁడు. 3219

తే. అంతలోఁ బుష్పకవిమాన మబ్ధినడుమ, నుండి తీర్థదేశంబున కున్నతగతి
నరుగుదెంచినపోతంబుకరణి గగన, దేశముననుండి చేర నేతెంచె నపుడు. 3220

భరతుఁడు రామునకు నమస్కరించుట.

వ. అంత నారామచంద్రుండు సమీపగతులైనభరతాదులం జూచి రయంబున మహీతలంబునకు డిగ్గు మని విమానంబున కాజ్ఞాపించిన హంసయుక్తం బైన యమ్మహనీయవిమానంబు గగనంబున నుండి పుడమి కవతరించిన నప్పుడు సత్యవిక్రముం డగుభరతుండు సంభ్రమంబున విమానం బెక్కి రామునిసమీపంబునకుం జని యమ్మహాత్ముని చరణంబులు శిరంబుసోఁకం బ్రణమిల్లిన నద్దయాళుండు ముదితుండై చిరకాలంబునకు నంలబ్ధుండైనభరతునిఁ గ్రుచ్చి యెత్తి నిజోత్సంగంబున నిడికొని గాఢంబుగా నాలింగనంబుఁ జేసి యానందజనకంబులైనప్రియవచనంబుల గారవించె నంత భరతుండు వైదేహి కభివాదనంబు గావించి కృతప్రణాముండై నలక్ష్మణునిఁ బరిష్వజించి సంభావించి పదంపడి సుగ్రీవజాంబవదంగదమైందద్వివిదనలనీలఋషభసుషేణగజగవయగవాక్షగంధమాదనశరభపనసవిభీషణాదుల నందఱ వేర్వేఱఁ గవుంగిలించియాదరించిన నవ్వానరశ్రేష్ఠు లందఱుఁ గామరూపులు గావున మానుషరూపధరులై యానందవిశేషంబున భరతు నభినందించి కుశలం బడిగి రంతఁ గైకేయీసుతుండు సుగ్రీవు నవలోకించి యిట్లనియె. 3221

క. మీవంటిమిత్రు లెందును మావారికి దొరకరు

నీ వైదవవాఁడవు సుగ్రీవా సౌహృదముచే సఖిత్వము గలుగున్. 3222

వ. అని పలికి విభీషణు నవలోకించి. 3223

క. రాక్షసవర రఘువర్యుఁడు, రాక్షసుల వధించి జనకరాజకుమారిన్
దక్షతఁ గైకొను టెంతయు, నక్షయభుజశక్తి నీసహాయతఁ గాదే. 3224

వ. అని సాదరంబుగా నభినందించె నంత శత్రుఘ్నుండు చనుదెంచి రామలక్ష్మణు లకు నమస్కరించి పదంపడి వైదేహికిం బ్రణమిల్లిన నక్కుమారుని గౌరవించిరి తదనంతరంబ రాముండు తల్లికడకుం జని శోకకర్శితయై యున్నయద్దేవికి హర్షంబుఁ బుట్టించుచు వినయంబున నమస్కారంబు గావించి పదంపడి సుమిత్రకుఁ గైకేయికిఁ దక్కినజననయిత్రుల కందఱకు వేర్వేఱ ప్రణామంబుఁ జేసి పురోహితునిచరణంబుల కభివందనంబు గావించె నంత. 3225

చ. పురజనము ల్నిటాలమునఁ బొల్పుగ నంజలిఁ జేర్చి రాఘువే
శ్వర కరుణాసముద్ర నృపచంద్ర మహాత్మ కృతవ్రతుండవై
వరయశ మొంది సేమమున వచ్చితివే యన వారియంజలు
ల్సరసమతిం బ్రఫుల్లకమలంబులఁ బోలెఁ బరిగ్రహించుచున్. 3226

భరతుఁడు రామపాదుకలను రామునిచరణంబులకుఁ దొడుగుట.

వ. వారి నందఱ నయ్యైతెఱంగుల సంభావించె నప్పుడు. 3227

చ. భరతుఁడు హేమరత్నమయపాదుక లెంతయు జానకీమనో
హరుచరణంబులం దొడిగి యంజలిఁ జేసి మహానుభావ గ్ర
మ్మఱఁ బురి కేగుదెంచిననృపాలుని నిన్నిటు గాంచినందునం
బరువడి నామనోరథము పండెఁ గృతార్థుఁడ నైతి నిత్తఱిన్. 3228

ఉ. నీ దగురాజ్య మిందనుక నీపృథుతేజము నాశ్రయించి మ
ర్యాదలు దప్పకుండ నయమార్గమునఁ బ్రోచితి నింక దీని న
త్యాదరవృత్తిఁ జేకొను మహాత్మ పురంబు బలంబు గోష్ఠకో
శాదిక మంతయు న్దశగుణాధిక మై యలరారెఁ జూడుమా. 3229

క. అని పలుక నపుడు భరతుని, వినయోక్తుల కలరి దైత్యవిభుఁడును భాస్వ
త్తనయాదికపులు కన్నుల, ననువుగ బాష్పములు నించి రతిమోదమునన్.

వ. అంత నారఘువర్యుండు భరతునివినయవాక్యంబుల కలరి యతనిఁ గరంబులం దిగిచికొని యంకతలంబున నిడికొని సైన్యసమేతంబుగాఁ బుష్పకంబుతోఁగూడ భరతాశ్రమంబు ప్రవేశించి యందు విమానంబు డిగ్గి దాని నవలోకించి నీవు కుబేరునిపాలికిం జని తద్వశవర్తి వై యుండు మని యాజ్ఞాపించిన ననుత్తమం బైనయద్దివ్యయానంబు మనోజవంబున నుత్తరాభిముఖంబుగాఁ జని ధనదాల యంబు ప్రవేశించె విమానంబు చనినయనంతరంబ రామభద్రుండు శక్రుండు బృహస్పతికింబోలె సాన్వరూపుండై నవసిష్ఠున కభివందనంబుగావించియమ్ముని పుంగవునితోఁ గూడఁ బృథగాసనంబున నాసీనుం డయ్యె నంతఁ గైకేయా

నందవర్ధనుం డగుభరతుండు శిరంబున నంజలి గీలించి సత్యపరాక్రముండును జ్యేష్ఠుండు నగురామచంద్రున కిట్లనియె. 3231

—భరతుఁడు రాజ్యంబు గైకొమ్మని రామునిం బ్రార్థించుట.—

సీ. రఘుకులోత్తమ నీవు రాజ్యంబు విడనాడి కానకుఁ బోయినకతన నస్మ
దంబ నీచేఁ జాల నర్చిత యయ్యె మున్నలచిత్రకూటాద్రియందు మీకుఁ
బ్రీతి నర్పించిన పృథురాజ్య మెబ్బంగి న్యాసరూపంబున నాకు దత్త
మయ్యె నవ్విధమున నర్థిఁ గ్రమ్మఱ నీకు నిచ్చెదఁ గైకొని యేలు మిపుడు
తే.జగతి నసహాయబలవదుక్షుంబుచేత, విడువఁబడినభారంబు బల్విడిఁ గిశోరి
మోవఁ జాలనిచందాన నీవు దాల్పఁ,దగినమేదినీభర మేను దాల్పఁ జాల. 3232
చ. ఉదకరయప్రపీడితమహోన్నతసేతువుఁబోలె భిన్న మై
సిదిలము నొంది హీనదశఁ జెందిన యీమహనీయరాజ్యముఁ
సదమలబుద్ధి నీ కిపు డొసంగితిఁ జేకొని ధర్మపద్ధతి
న్వదలక పౌరజానపదవర్గము సంతసమంద నేలుమీ. 3233
ఆ. అశ్వగతి ఖరంబు హంసగతిని గాక, మనుసరింప లేనియట్లు నిఖిల
భువనకర్త వగుచుఁ బొగడొందు నీమార్గ, మనుసరింపఁ జాల నధిప! యేను.
సీ అనఘాత్మ యంతర్గృహంబున నాటినవృక్ష మంతంతకు వృద్ధిఁ బొంది
కడుదురారోహప్రకాండ మై పుష్పించి ఫలనిచయంబుఁ జూపక విశీర్ణ
మైన ఫలాకాంక్షి యై నాటినట్టివాఁ డాతరుఫలము నెట్లనుభవింపఁ
డయ్యె నట్లీవు లోకానందకారి వై భక్తుల భృత్యులఁ బరమహితుల
తే. మమ్ముఁ బాలింపవేని యోమాననీయ
చరిత యీయుపమానార్థ మెఱిఁగికొనఁగ
నర్హుఁడవు తండ్రిచే వినుతాతినుగుణ
శాలియుతుఁడ వై సృజియింపఁ బడుటవలన. 3235
మ.పరమప్రీతి నమాత్యరాజి వొగడం బట్టాభిషిక్తుండ వై
కర మర్థి న్బృథుకాంతి లోకము వెలుంగన్జేయుమధ్యందినో
ష్ణరుచిప్రక్రియ భూరితేజమున భాస్వల్లీల శోభిల్లుని
న్నరుదార న్జను లెల్లఁ జూచెదరు గా కత్యంతహర్షంబునన్. 3236
చ. అలయక కానలో ఖగమృగారవము ల్దగ నాలకించుచుఁ
మెలపునఁ గూర్కుచు న్మరల మేల్కొనునట్టిశ్రమంబు వాయఁగా
విలసితతూర్యఘోషముల వేణురవంబుల భూషణస్వనం
బుల మఱి మాగధస్తుతులఁ బొల్పుగ మేల్కొను మింక రాఘవా. 3237

—రాముఁడు భరతప్రార్థన నంగీకరించుట.—

మ.స్థిర యెందాఁకఁ జలింపకుండు నల జ్యోతిశ్చక్ర మెందాఁక నం
బరవీథిం జరియించు నందనుక భాస్వన్నీరధారాశిశం

కరజై వాత్మకశారదాభ్రతటినీకాండోల్లసత్కీర్తి వై
నరసాగ్రేసర సర్వరాజ్యమునకుం స్వామిత్వముం బొందుమా. 3238

చ. అని యిటు విన్నవింప విభుఁ డాభరతోక్తుల కిచ్చ మెచ్చి యా
తనిఁ గని నీవు వల్కినవిధంబున నీఘనరాజ్య మర్థిఁ గై
కొనియెద నంచుఁ బల్కె నయకోవిదుఁ డాభరతుండు రామునిన్
ఘనమతి నిట్లు డంబఱిచి గ్రక్కున నాసితుఁ డయ్యెఁ బీఠికన్. 3239

వ. అంత శత్రుఘ్నునిపనుపున సుహస్తులగు శ్మశ్రువర్ధకులతినిపుణులు రామునిం బరివేష్టించిరి భరతుండును మహాబలుం డగులక్ష్మణుండును వానరేంద్రుం డైన సుగ్రీవుండును రాక్షసేంద్రుం డగువిభీషణుండును సుస్నాతులై చతుర్విధాలంకారంబుల నలంకృతులైరి తదనంతరంబ రాముండు విశోధితజటామండలుం డై పరిమళసలిలంబున మజ్జనంబు గావించెనప్పుడు కొందఱు నేర్పరు లగువారు రామభద్రు నలంకరించిన. 3240

రాజపురుషులు రాము నలంకరించుట.

చ. హృదయగతోడురాత్రుచు లహీనగతి న్వెలి కుబ్బెనో యన
నుదమలచారుమౌక్తికవిశాలసరం బలరె న్లసద్వియ
న్నదిసలిలప్రవాహము ద్విధాకృత మై పడుచుండ మధ్యన
ర్త్యుదితనభంబుమాడ్కి నపు డొప్పె నురంబు తదంతరంబునన్. 3241

చ. విలసితతేజుఁ డై నరఘువీరుఁడు మేన ధరించునప్పు డు
జ్జ్వలదురుచారుమౌక్తికవిశాలమణీమయహారధారలో
పలఁ బ్రతిబింబితం బయినభాసురలోకము కుక్షిసంగతా
ఖిలభువనాభిశంక గలిగించెఁ గనుంగొనువారి కెంతయున్ 3242

చ. అరుదుగ రాఘవోల్లసదురోంబరమందు విచిత్రభూషణాం
తరగతవిస్ఫురద్బహువిధస్ఫుటరత్నము లొప్పె నత్తఱిం
దిరముగ ఋక్షపంక్తులగతిం బతకంబునఁ దాపినట్టినుం
దరతరవజ్ర మొప్పె వితతద్యుతి నవ్విధుమండలాకృతిన్. 3243

మ. పన మీఱం బరికింప నయ్యె నపు డాభాస్వత్కులాంభోధిరా
జనముత్తుంగకటీరదేశమున రజ్యత్కంజకింజల్కవ
ర్ణనవర్ణోరుసువర్ణచేల మలవర్షాకాలమేఘుంబుపై
ననమానద్యుతి నొప్పుగా ర్మెఱుఁగుచాయం జూడ్కి కింపారఁగన్. 3244

తే. కాంచనవిచిత్రకటిసూత్రకలితుఁ డగుచు, సుందరాకారుఁ డారాజనందనుండు
చాల శోభిల్లె నప్పుడు జంభవైరి, కార్ముకపరీతనీలమేఘుంబుకరణి. 3245

ఉ. చారువిచిత్రదివ్యమణిజాలవినిర్మితనత్కిరీటకే
యూరవిభూషితుం డగుచు నుష్ణకరాన్వయుఁ డొప్పె నప్పుడిం

పాఱఁగ ధాతుచిత్రితసుహర్మ్యసువర్ణమయత్రిశృంగరే
ఖారమణీయమైనబలఘస్మరనీలనగంబుచాడ్పునన్. 3246

మ. కమనీయోజ్జ్వలరత్నకుండలయుగాగ్రప్రోల్లసత్పద్మరా
గమణిచ్ఛాయలు గండభాగములఁ దద్గండస్థలచ్ఛాయలు
న్సమతం దన్మణులందుఁ గూడుకొని భాస్వల్లీల నా రెండునుం
గ్రమ మొప్పం బరికింప నయ్యె నొకవర్ణం బైనచందంబునన్. 3247

శా. సాక్షాద్విష్ణువు తాను గావున మహీజానేత సత్పుండరీ
కాక్షత్వంబును శ్రీమనోహరతయుక్హైరణ్యచేలత్వము
న్దక్షత్వంబు పితామహాతనుగురుత్వం బాత్తపద్మోల్లస
ద్వక్షంబు న్పురుషోత్తమత్వమును మోదం బొప్పఁ దాల్చెన్ప్రభున్. 3248

క. చందనలిప్తాంగుం డై, యందముగా మాల్యధారి యై కౌసల్యా
నందనుఁడు మెఱసె శారద, కందోడుపరీతనీలగగనముమాడ్కిన్. 3249

చ. శిరము దివంబు నాభిగతసీమ నభంబు పదంబు లుర్వి యై
పరఁగెడునవ్విరాట్పురుషవర్యుఁడు రామవిభుండు గానఁ బ్ర
స్ఫురితకిరీటహారవరభూషణబింబితలోక మత్తతి
న్వఱలె దివంబుచాడ్పున నభంబు తెఱంగున ధాత్రికైవడిన్. 3250

వ. మఱియు నేకావళీమాణవకగుచ్ఛగుచ్ఛార్ధగోస్తనార్ధహారదేవచ్ఛందతరళకలిత నక్షత్రమాలాపారిహార్యకటకోర్మికాముద్రికాసారసనతులాకోటిప్రముఖ నిఖిల పరిష్కారపరిష్కృతుం డై కామితఫలప్రదాయకుం డై పుష్పఫలభరితం బైనకల్పవృక్షంబుచందంబున నందంబుగాఁ బ్రకాశించె నంత. 3251

క. ఆరాజపత్ను లందఱు, గారవమున హారపటసుగంధసుమములం
జేరి మహీపుత్త్రి కలం,కారము గావించి రపుడు కడు హృద్యముగాన్. 3252

తే. సాధుగుణశీల యైనకౌసల్య యపుడు, పుత్త్రలాలన గావునఁ బొలుపు మీఱఁ
జారుభూషణపటము లొసంగి కీశ, సతుల నెల్ల నలంకారయుతలఁ జేసె. 3253

తే. అంత శత్రుఘ్నుపనుపున నలసుమంత్రుఁ, డర్కమండలసంకాశ మైనదివ్య
కాంచనరథంబు కరిశిశుకల్పహరులఁ, బూన్చికొని తెచ్చి రామునిముందట నిడె.

వ. కళ్యాణగుణసాంద్రుం డైనరామచంద్రుండు సర్వాంగశోభనం బైనయమ్మహ నీయరథంబు సముచితంబుగా నారోహించి యుదయమహీధరశిఖరాగ్రగతసహ స్రకరునిసొంపున దివ్యవిమానాధిరూఢుం డైనసహస్రాక్షునిపోలికిఁ బుష్పక విమానాధిగతుం డైనరాజరాజుసొబగున నభిరామదర్శనుం డై తేజరిల్లుచు నయోధ్యాభిముఖుం డై చనియె దివ్యాంబరాభరణమాల్యానులేపనాలంకృతు లై శుభకుండలభూషితు లై సుగ్రీవవిభీషణులరిగిరి వరాభరణసంపన్ను లై వానర కాంతలు సీతాసహితంబుగా నగరసమాలోకనౌత్సుక్యంబునం జని రటము

న్నయోధ్యాపురంబున రాజసచివులు పురోహితుం బురస్కరించుకొని యభిషేకో
పయోగిమంగళద్రవ్యసంపాదనార్థం బెది కర్తవ్యం బని యాలోచించిరి యశోక
విజయసుమంత్రాదులు రామవృద్ధికొఱకు నగరవృద్ధికొఱకుఁ గూడుకొని యా
లోచనంబు గావించి జయార్హుండైన రాముని యభిషేకార్థం బెయ్యది కర్తవ్యంబు
దాని నంతయు మంగళపూర్వకంబుగాఁ గావింప నర్హు లని పురోహితునకుం
జెప్పి రామదర్శనలాలసులై పురంబు నిర్గమించి రామునికడకుం జనుదెంచి రిట్లు
గూడుకొనిన యశోకాదిమంత్రులం గూడి రామచంద్రుండు నక్షత్రసహితుం
డైన చంద్రుండుం బోలె వెలుంగుచు ననంతవైభవాభిరంజితుం డై దివ్యరథం
బారోహించి సాకేతపురంబునకుం జనుసమయంబున. 3255

రాముఁడు సపరివారుఁడై యయోధ్యానగరంబు ప్రవేశించుట.

సీ. కమనీయగుణగణాకరుఁ డైన భరతుండు కడు వేడ్క హారులపగ్గములు పట్టె
శత్రుఘ్నుఁ డప్పుడు శతశలాకం బైన తతపాండురాతపత్రము ధరించె
లక్ష్మీవర్ధనుఁ డైన లక్ష్మణుం డభినవవ్యజనంబుఁ దాల్చి సొంపలర విసరె
విధునిభం బగునొండు వింజామరము గొని యలవిభీషణుఁడు చెన్నార వీచె
తే. నంజనాచలతుల్యశత్రుంజయాఖ్య, దంతి నెక్కె సుగ్రీవుఁ డాచెంత నరిగె
నవసహస్రనాగము లెక్కినయ మెలర్ప, మనుజరూపంబు గైకొని చనిరి కపులు.
చ. ఘనతరశంఖనాదములు కాహళవేణుమృదంగవల్లకీ
స్వనములు డిండిమధ్వనులు చాపతరాంక్యవిశాలభేరికా
నినదములు న్మహాపటహనిస్వనము ల్కరతాళశబ్దముల్
మునుకొని గాఢభంగి మినుముట్టి సమున్నతి మ్రోసె నత్తఱిన్. 3257
మ. అనుమానింపక యారఘూత్తముఁడు దేవారి న్దశాస్యు న్రణం
బున మర్దించి జగత్త్రయంబునకు సమ్మోదంబు గావించె నీ
యనఘుం డెంతమహాత్ముఁ డెంతఘనుఁ డాహా యంచుఁ గీర్తించు దే
వనికాయంబులస్తోత్రము ల్మధురవాగ్వైచిత్రి మ్రోసె న్దివిన్. 3258
ఉ. కాదన కీరఘూత్తముఁడు కానకుఁ బోయిననాఁటిఖేదమే
ఖేద మితండు వెండి పురికిం జనుదెంచెడు నేఁటిమోదమే
మోద మటంచు జానపదముఖ్యులు పౌరులు గూడి గాఢస
మ్మోదరసాబ్ధిఁ దేలుచు సమున్నతి రామునిఁ జూచి రయ్యెడన్. 3259
మ. మఱియు న్మంత్రిపురోహితుల్ హితులు సామంతుల్ బుధుల్ సేవకుల్
గరిమ న్దివ్యరథస్థుఁ డై పురికి వేడ్క న్వచ్చు రామాధిపుం
గరుణోదారునిఁ బూర్వశైలశిఖరాగ్రస్థోడురాజుం బలెన్
దెఱుఁగొప్పం గనుఱెప్ప వ్రేయక దమి న్వీక్షించి ర ట్లందఱున్. 3260
వ. మఱియు సాలంకారభూషిత లగుకన్యలును ధేనువులును జాతరూపాతత

హోదకహస్తు లగుపురుషులును బ్రత్యుద్గతులై పురోభాగంబునం బోవుచుండిరి వేదవేదాంగవిశారదు లైనవిప్రోత్తములు మంగళాశీర్వాదంబులు సేయుచు రామునిం బరివేష్టించి చనుచుండిరి రూపలావణ్యవతు లగువారయువతులును దాళస్వస్తికపాణు లగువైతాళికులును మృదంగప్రముఖనిఖిలవాదిత్రధరులును దమతమవిద్యావైశారద్యంబుఁ జూపుచుఁ బ్రమోదంబుతో నగ్రభాగంబునం జనిరి చతురంగబలసమేతు లైసేనానాథులు వెనుక ముందఱ నుభయపార్శ్వంబులం జాలు గొని పరమానందంబున నరిగిరి వందిమాగధసూతగాయకు లందంద స్తుతివచనంబుల నభినందించుచుఁ జనుచుండిరి కంచుకోష్ణీషధరు లగు సౌవిదల్లులు సువర్ణవేత్రపాణు లై మ్రోల నడుచుచుండిరి యిత్తెఱంగున రాముండు నయనాభిరాముం డై మంత్రిపురోహితసామంతసేనానాథప్రముఖనిఖిలజనపరివేష్టితుం డై నక్షత్రసహితుం డైనచంద్రునిభంగి వెలుంగుచు సుగ్రీవునిసఖ్యంబును హనుమంతునిప్రభావంబును రాక్షసులబలంబును సేతుబంధనసముద్రలంఘనలంకాదహనరావణవధాదికార్యంబును మంత్రులకుం జెప్పి వారి నందఱఁ బ్రమోదాశ్చర్యరసావిష్టచిత్తులం జేయుచు వానరుల మన్నించుచు భ్రాతృసహితంబుగా సుందరమందగమనంబునం జని సముచ్ఛ్రితధ్వజపతాకంబును సిక్తసమ్మార్జితపథంబును గ్రముకరంభాస్తంభరంగవల్యాద్యలంకృతప్రతిగృహాంగణంబును బ్రాసాదమాలావితతంబును నాపణప్రసారితనానావిధవస్తుసంపూర్ణవిపణిమార్గంబును హృష్టపుష్టజనాకీర్ణంబును మంగళవాద్యఘోషసన్నాదితంబును సర్వమంగళశోభితంబును నై చంద్రోదయసమయసంవర్ధితమహార్ణవంబుపగిది నుప్పొంగుచున్నయయోధ్యాపురంబు ప్రవేశించి రాజమార్గంబునం జనుసమయంబున. 3261

పౌరస్త్రీలు మేడలెక్కి రామునిం జూచి సంతసించుట.

చ. చలువలు గట్టి సంకుమదసౌరభగంధ మలంది మాల్యము
ల్చెలువుగఁ దాల్చి భూషణవిశేషములం గయిసేసి కౌతుకం
బలరఁ బురాంగన ల్విలసదంఘ్రివిభూషణఘంటికాధ్వను
ల్చెలఁగఁగ మేడ లెక్కి రఘుశేఖరుఁ గన్గొని సంభ్రమంబునన్. 3262

సీ. ఇతఁడె పో కాంతారగతు లైనఖరదూషణాదులఁ ద్రుంచిన యలఘుభుజుఁడు
ఇతఁడె పో వాలిని హింసించి కపిరాజ్య మినతనూభవున కిచ్చినఘనుండు
ఇతఁడె పో కపులచే నింపార సేతువు నబ్ధిపైఁ గట్టించినట్టిచతురుఁ
డితఁడె పో సంగరక్షితి రావణాది దుష్టాసురుల వధించినట్టిశూరుఁ
తే. డితఁడె సుమ్మి లంకారాజ్య మింపుతోడ, నలవిభీషణునకు నిచ్చినట్టిమహితుఁ
డీజగన్మోహనునిరూప మింపుతోడఁ, గాంచుఁ డిప్పుడు కన్నులకఱవు దీఱ. 3263

చ. తపములు పండెఁ గోరిక లుదంచితభంగిఁ జెలంగె జన్మము
ల్సఫలత నొందె భద్రములు చాలఁ జిగిర్చె సమస్తసంపద

ల్విపులము లయ్యె నేఁడు రఘువీరుని రామునిఁ జూచినందునం
జపలమృగాక్షులార మనసమ్మద మెవ్వరి కైనఁ గల్గునే. 3264

ఉ. భానుకులోత్తముండు మనపాలిటిభాగ్యము జానకీప్రియుం
డానలినారిభంగిఁ బ్రియమార వెలుంగుచు వచ్చుచుండ ని
మ్మానితరాజధాని యసమానశరత్నమయప్రదీప్తరా
కానిశమాడ్కి నున్నయది కంటిరె కంటికి నింపొనర్చుచున్. 3265

తే. రమణ నీలోకమిత్రునిరాకవలనఁ, బౌరజనచిత్తశోకాంధకార మణఁగె
మోముఁదమ్ముల కొకవింతమురువు గలిగె, సాధుజనలోకతతి కబ్బె సమ్మదంబు.

ఉ. ఆఁకలిగొన్న వేళఁ దగ నంగిలి యొండినవేళ నెండ పై
సోఁకినవేళ రోగములు సోఁకినవేళ సుధాప్రవాహము
న్నీఁక జలాశయంబు ఘననిష్కుటము న్గలితౌషధం బొగిన్
జేకుఱినట్ల యయ్యెఁ బురసీమకు నవ్విభురాక యిత్తఱిన్. 3267

వ. అని పెక్కుతెఱంగుల వక్కాణించుచు నానందసముద్రలహరిం దేలియాడు
చుండె నప్పుడు. 3268

చ. నిరుపమచంద్రకాంతమణినిర్మితనిర్మలహర్మ్యదర్పణాం
తరగతరామరూపములు తప్పక గన్గొని మున్ను లంకలో
దురమున యామినీచరులఁ ద్రుంచెడునప్పు డనేకరూపముల్
సరగునఁ దాల్చె నన్నది నిజం బని పల్కిరి కొంద ఱంగనల్. 3269

ఉ. ఆతతకేతనానిలరయప్రవికంపితనూతనోల్లస
చ్చూతపలాశతోరణముఁ జూచి సమున్నతసౌధసంచర
ద్భీతమృగాక్షు లయ్యధరబింబఫలగ్రసనస్పృహాభరా
యాతశుకాలి యంచు భ్రమ మంది మొగంబులు ద్రిప్పి రెంతయున్. 3270

శా. రాజత్సౌరభచంద్రదీపకళికారాజి న్నివాళించి రా
రాజాస్యల్ పురిఁ దీఁగెఁబోండ్లు క్షితిభృద్రాజు న్రఘుశ్రేష్ఠుని
న్రాజత్కోమలకాంతిసంభరితతారారాజిచే నెంతయు
న్రాజాస్య ల్నిశ లింపుతోడ క్షితిభృద్రాజు న్సుమేరుం బలెన్. 3271

ఉ. జాజులు మల్లెపువ్వులును సంపెఁగలు న్నవమాల్లికంబులు
న్లాజలు మైఁడిపళ్లెరములం దగ నుంచి పురీకులాంగన
ల్రాజకులావతంస మగురామునిపైఁ గడు వేడ్కఁ జల్లి రా
రాజితకల్పవల్లికలు రమ్యసుమంబులు చల్లుకైవడిన్. 3272

చ. అనుపమవాద్యఘోషము మహావిభవం బలర న్రథస్థుఁడై
మునుకొని పౌరజానపదముఖ్యులు గొల్వఁగ నిట్లు రాజవీ
థిని శశిభంగి రాఁ దగినధీరుఁడు రాముఁడు తాపసాకృతి

స్వనమున కేగునాఁడు గనువారలచూడ్కికి నిం పొనర్చునే. 3273

శా. ప్రాసాదంబులమీఁదనుండి కనుఱెప్ప ల్వ్రేయ కారాముని
న్నాసిం దప్పక చూచునట్టిపురకాంతాసుధ్యగామ ర్త్యభా
మాసందోహము నేర్పరించుటకు సామర్థ్యంబు లే దెంత ప్రే
తానంపన్నున కైన వీటఁ గల లోకశ్రేణిలో న త్తఱిన్. 3274

చ. వలనుగ రాజవీథి నిరువంకలఁ బాఁతినపూగపాదపం
బులకదళీమహీజములముంగలఁ జాల్గొని నిల్చి యున్నయం
జలిగతదీపపాత్రలగుచంచలనేత్రలు స్తంభనిర్మితో
జ్జ్వలదురుహేమపుత్త్రికలచందమునం గనుపట్టి రయ్యెడన్. 3275

మ. అతులప్రీతి నగేంద్రనందనికరం బాత్మీయమంత్రాధిదే
వత యారామునిఁ జూడఁగోరి బహురూపంబు ల్గ్రహిం దాల్చి స
త్కృతి సేయం జనుదెంచునో యనఁగ నుత్ప్రేక్షింపఁగా నయ్యె నా
తతరామాంగరుచిచ్ఛటాచ్ఛురితతత్ప్రాంగనారూపముల్. 3276

ఉ. వారక రామభద్రుపయి వ్రాలునెలంతలదృక్సమాజ మొ
ప్పారె నభంబుపైఁ గలసియాడుచకోరగణంబుభంగి సొం
పారఁ దమాలశాఖపయి హత్తినఖంజనపంక్తిరీతి శృం
గారరసాబ్ధిలోనఁ దిరుగంబడుమీనగణంబుకై వడిన్. 3277

ఉ. కమ్మనిపువ్వుసౌరభము కస్తురితావి పునుంగువాసన
ల్గుమ్మని రాజవీథుల బుగుల్కొనుచందనధూపగంధము
ల్గ్రమ్మనతీతనూపరిమళంబును గైకొని ఘ్రాణహారి యై
తెమ్మెర వీచె వారయువతీనిటలాలకము ల్చలింపఁగన్. 3278

చ. అమరిన వేడ్క నాడువెలయాండ్రు నయాభినయంబు దెల్పుచం
దము గన నయ్యె నీరఘువతంసునిఁ బోలినసుందరుండు మీ
యమరులయందు లేఁ డని మహోత్సుణదర్శనకౌతుకాగతో
త్తమసురలోకవారవనితాతతి కవ్విభుఁ జూపుకై వడిన్. 3279

చ. అతులితతప్తహేమరచితాంచితనిర్మలకుడ్యమధ్యని
ర్మితమణిజాలమధ్యమునఁ బ్రేమ వసించి రఘూత్తము న్సమా
తతగతిఁ జూచునట్టిమృదుధౌతపటావృత యైన లేమ యొ
క్కతె గన నయ్యెఁ బంకరుహగర్భముఖస్థితవాణికై వడిన్. 3280

ఉ. వాసవనీలనిర్మితకవాటముమాటున నర్ధగాత్రము
ల్లాసము మీఱఁ గన్పడ విలాసముతోఁ దగ నిల్చి రాముని
న్వాసవతుల్యుఁ గన్గొనెడుభామిని యొక్కతె పొల్చె న త్తఱి
న్భాసురలీల నీలఘనపార్శ్వవిలసత్పృథుచంచలాకృతిన్. 3281

శా. సాకేతాన్వయథవుఁ డౌట రాముఁడు రహి న్స్థానీయముం బాసి స
త్రక్షోణిం జరియింప నేగుతఱి ఘర్మవ్యాప్తి నేన్వృక్షముల్
ప్రక్షీణద్యుతి శుష్కపత్రకలన న్లక్షింప రాకుండెఁ ద
ద్వృక్షంబు ల్దనరె న్బలాశకును మోక్షేతంబు లై యత్తఱిన్. 3282

రాముఁడు రాజమందిరంబు ప్రవేశించుట.

ఉ. ఆరఘువర్యుఁ డీగతి మహావిభవంబున రాజవీథి నిం
పార నితాంతశీతలకటాక్షములం బురివారి నందఱ
వారక చూచుచుం జని ప్రభాప్రవిభాసితరాజమందిర
ద్వారముఁ జేరెఁ బంచవిధవాద్యరవంబులు మిన్ను ముట్టఁగన్. 3283

ఉ. అచ్చటఁ దేరు డిగ్గి హరిణాంకుఁడు శారదమేఘపంక్తిలోఁ
జొచ్చినరీతి వజ్రరుచిశోభితరాజగృహంబుఁ జేరి తా
నచ్చుపడంగఁ దల్లులకు నందఱికుం బ్రణమిల్లి వేడ్క వా
రిచ్చినదీవన ల్గొని రహిం బితృసద్మముఁ జేరెఁ బ్రీతితోన్. 3284

వ. ఇట్లు సముచితంబుగాఁ బితృగృహంబు ప్రవేశించి భరతు నవలోకించి మధురం
బుగా నిట్లనియె. 3285

చ. సురుచిరరత్నకాంతుల నశోకవనంబులఁ బద్మకైరవ
స్ఫురితసరోవరంబులను శోభిలుమామకమందిరంబునం
దరణిజు నుంపుమన్నఁ బ్రమదంబున నాతఁడు చేయిఁ బట్టి ప్ర
చ్ఛుఱఁ గొని పోయి తద్విపులసద్మమున న్విడియించె నాతనిన్. 3286

తే. అంత శత్రుఘ్నచోదితు లై సమస్త, పరిజనంబులు తైలదీపములు కనక
చారుపర్యంకములు వరాసనములుఁగొని, వెసఁ బ్రవేశించి రారామవేశ్మమందు.

వ. అప్పు డాభరతుండు తక్కినవానరుల నందఱ యథార్హస్థానంబుల విడియనియ
మించి సుగ్రీవు నవలోకించి యిట్లనియె. 328[illegible]

సుగ్రీవుఁడు వానరులకుఁ జతుస్సముద్రంబుల నుండి యుదకము దేర నియోగించుట.

మ. వనికిం జైత్రసమాగమం బవనికి న్వర్షాగమంబుం బయో
జినికిం దీవ్రకరోదయంబు నిశికి న్శీతాంశుసంలబ్ధి యె
బ్బినయ ట్లయ్యె మహానుభావుఁడు రణాభీరుండు కళ్యాణభా
జన మారాముని రాక యీనగరికి న్శాఖామృగాధీశ్వరా. 3289

ఉ. మిత్రసుతుండ వీవు మఱి మిత్రకులోత్థుల మేము గావున
న్మైత్రి ఘటిల్లె నీపగిది మాకును మీకును దైవతంత్ర మీ
చిత్రము ధీవరా తడవు సేయఁగ రా దిఁక నెల్లి భవ్యన
క్షత్రమునందు రామునకు గ్రక్కునఁ బట్టము గట్టు ముమ్మతిన్. 3290

చ. అన విని భానుజుండు హృదయంబున వేడుక పల్లవింపఁగా
వనచరవీరులం బిలిచి వారక నాల్గుసువర్ణకుంభము
ల్గొని చని నాల్గువారిధులలోనిజలంబులు సంగ్రహించి మీ
రినుఁ డుదయించునంతకు నహీనజవంబున రండు వీటికిన్. 3291

వ. అని యాజ్ఞాపించిన సుగ్రీవునిశాసనంబున సర్వరత్నవిభూషితంబు లైనశాత కుంభకుంభంబులుఁ గొని జాంబవంతుండును హనుమంతుండును వేగదర్శియు ఋషభుండునుజతుస్సముద్రజలహరణార్థంబు గరుడానిలతుల్యవేగంబునంజనిరి మఱియుఁ గొందఱు వానరులు నదీజలంబులు దెచ్చుటకుమణికలశంబులు గొని యరిగి రనంతరంబ. 3292

మ. అమరారాతివిరోధి యైనరఘువంశాధీశుపట్టాభిషే
కముఁ జూడం బురలక్ష్మి పంప సురలోకగ్రామణిం బిల్వ నె
య్యమునం బోయెడుదూతలో యనఁ గరం బంతంత కత్యంతదీ
ర్ఘము లై తూర్పున కేగె గోపురపతాకాచ్ఛాయ లింపారఁగన్. 3293

సంధ్యా సమయ వర్ణనము.

తే. రాముఁడు పలాశపల్లవస్తోమవిమతుఁ
డగు టెఱిఁగి నామసమత భయంబు గాంచి
తనమురు వడంచుకొనియెనో యనఁగ మొగిచె
సురుచిరపలాశపల్లవస్తోమ మపుడు. 3294

చ. చెలువుగ నాజిసూతియభిషేకనిమిత్తము పశ్చిమాశ క
ప్పలు గొనితేర నభ్రమునఁ బోయినవానరుఁ డాత్మహస్తమం
చలరుసువర్ణరత్నఘట మబ్ధి జలంబుల ముంచెనో యనం
జలరుహమిత్రబింబము వెసం జరమాంబుధిఁ గ్రుంకె నత్తఱిన్. 3295

క. హరిదిక్సతి క్రీడార్థము, వరుణహరిత్కాంతమీఁదవైచిన కెందా
మరబంతివోలె రవి యం,బరమున వడి నేగి చరమవారిధిఁ గ్రుంకెన్. 3296

ఆ. వృద్ధి నొంది రాజు వెనుకొని చనుదేర, నులికి గ్లానిఁ జెంది యున్నయినుఁడు
ఆత్మతేజ మెడలి యపరభూభృన్మణి, మఱుఁగుఁ జొచ్చె నది క్రమంబు గాదె.

ఆ. ఇనసమాగమమున కెంతయు రాగిల్లి, వరుణదిగ్వధూటి వన్నె మీఱఁ
గటితటంబునందుఁ గట్టినకౌసుంభ,వస్త్రమో యనంగ వఱలె సంధ్య. 3298

తే. పూర్వదిక్సతిమొగమునఁ బోడమెఁ గప్పు
వరుణదిక్కాంతమొగమున వఱలె రక్తి
యినునిఁ బాసినదానికి హీనతయును
గలసినదానికిఁ గనురక్తి గలుగు టరుదె. 3299

సీ. భువనబాంధవుఁ డస్తమున కేగె నంతలో దోషాకరుఁడు కాంతితో వెలింగెఁ
జక్రవాకంబులు జతఁబాసె నంతలో సారిధిఁ జకోరము ల్గోడుగూడెఁ

గనులవనంబులు కడు మోడ్చె నంతలో నుత్పలవిపినంబు లుల్లసిల్లెఁ
జిలుకలగుమి నీడములు చేరె నంతలోఁ గాళికాదికము లొక్కటఁ జలించె

తే. నట్టిదే కద లోకమర్యాద చూడఁ
గాలపరిపాకమునఁ జేసి ఘనుఁ డొకండు
గ్లానిఁ జెందుచు నుండ జఘన్యుఁ డొక్కఁ
డుపచయము నొంది వెలయు నీయుర్వియందు. 3300

తే. భ్రమరసందోహములు వివర్ణంబు లైన
నలినములఁ బాసి తగ సవర్ణంబు లైన
కలువలను జేరెఁ దమజాతి గలయు టుడిగి
యెలమిఁ బరజాతి గలయుదు రెవరు ధరణి. 3301

తే. పగలు మీఱి ప్రదోషప్రాప్తి బడలి యున్న
జలజములఁ బాసి క్షణదోపచయము గన్న
కలువలను జేరెఁ జంచరీకములు కలిమి
గలజనుల నాశ్రయింపరె గానపరులు 3302

మ. ప్రమదం బొప్పఁగ రామచంద్రునిమహాపట్టాభిషేకోత్సవా
ర్థ మిలాభాగ మలంకరించుటకు దిగ్రామాలి కర్పూరచూ
ర్ణము కస్తూరియుఁ జల్లెనో యనఁగ విన్నాణంబుగాఁ జంద్రిక
ల్తిమిరంబు ల్తిలతండులద్యుతి ధరిత్రిం గప్పె సొంపారఁగన్. 3303

తే. గగననీలోదకంబుపైఁ గ్రాలుపద్మ, కైరవంబులచందానఁ గాన నయ్యె
గండుచుక్కలు తన్మధ్యగతమనోజ్ఞ,హంసవిధమున హరిణాంకుఁ డలరె నపుడు.

తే. వసుధ గప్పినఘనశర్వరీవంబుభంగి
నింగిఁ జూపట్టెఁ దన్మధ్యనిహితదీప
కళికవిధమునఁ జంద్రుండు గాన నయ్యె
నుడులు తద్భ్రంధ్రములమాడ్కి నొప్పె నపుడు. 3305

సీ. చెలువొప్పు గగనలక్ష్మీవక్షమున వ్రేలుఁ బ్రతిలేనిమగజాలపతక మనఁగ
నాకాశకల్పవృక్షాగ్రభాగంబునఁ గొమరారునవపుష్పగుచ్ఛ మనఁగ
సరిలేనియభ్రకాసారమధ్యంబున నలరారుకొదమరాయంచ యనఁగఁ
గడు వేడ్క రేచాన కబరీభరంబునఁ దాల్చిన కేతకీదళ మనంగ

తే. సమయహాలికుండు గాఢసంతమసగహన
పదము నఱకంగఁ గైకొన్నపరశు వనఁగ
నపుడు సాకేతపురగోపురాగ్రమునకుఁ
జారుమౌక్తికకలశ మై చంద్రుఁ డలరె. 3306

సీ. ద్విజరాజనామ మురివిఁ జెలంగె నితనికి నధిగతహరిపదుం డగుటవలన
రాజాభిధానంబు రంజిల్లె నితనికిఁ గువలయానందంబు గూర్చుకతన

విధుఁ డనువిఖ్యాతి విలసిల్లె నితనికి శ్యామాభిరాముఁ డై యలరుకతన
సోమాభిధానంబు శోభిల్లె నితనికి దాక్షాయణీప్రాణదయితుఁ డగుట
తే. నన్నిటను జూడ దొడ్డవాఁడయ్యె నితఁడె, యేవగింపక విరహుల నేఁచుకతన
నవని దోషాకరుం డనునాఖ్య వడసె, ననుచు లోకంబు వర్ణింప నబ్జుఁ డలరె.
వ. అంత. 3308

మ. నవసంధ్యారుణకుంకుమం బలఁది నూత్నధ్వాంత మన్గా ప్పును
ర్చి విధూదంచితకేతకీదళము వాసిం గూర్చి జ్యోత్స్నాంబరం
బు వెసం గట్టి సదృక్షసంతతిమణీభూషావళుల్ మేన నిం
చి వియత్కాంత యలంకరించెఁ బురలక్ష్మీ న్వేడ్కఁ సైరంధ్రియై. 3309

వ. మఱియు నిజభుజప్రతాపపాటలీకృతదశాననదశాననవరశిరఃకాంతారకఠోరకు
ఠారధారాయితనిశితసాయకరఘునాయకనితాంతానంతకీర్తి మూర్తిభవించి
మిన్నుముట్టి దట్టంబుగా దశదిశలు వెలుంగం జేయుచున్నదో యని యుత్ప్రే
క్షింపఁదగి యొప్పుశిశిరకరునికరనికరంబులు సాకేతపురంబు గలయంబర్వ తరుల
తాభిరామగృహారామవాటికామధ్యసంస్థాపితవిశాలరసాలసాలమూలవిరచితన
వేందుకాంతవితర్దికమీఁద నిదురించి యున్నపంచశరుండు మేల్కాంచి యుదం
చితవివిధవర్ణతరుపర్ణాంతరసమాగతవిశదరశ్మినిచయంబులంబట్టి లేచి యామినిం
జూచి తలయూచి కరంబులు సాఁచి తుంటవింట జంటగా సంఫుల్లనవమల్లి
కాభల్లంబులు గూర్చి పేర్చి యార్చి కర్ణోపాంతంబు సోఁకఁ దీసి యేసినఁ
దదమోఘప్రదరవిదళితహృదయలై యదయలై పతులతోఁ బోలయల్కలు
పూని యున్నయన్నులు సుప్రసన్నలై మక్కువలు చెక్కులొత్తఁ జక్కెర
వింటివాని దర్పంబునేర్పున నపనయించుటకుఁ బ్రియులయొద్దకుం జను
నెడ వారలయడుగులకుఁ బఱచిన చలువమడుపులై తదీయశయనప్రాసాదకుడ్యం
బులకు వజ్రోపలంబులై తన్మహనీయపర్యంకంబులకు హంసతూలికాతల్పంబులై
వారలు తమ్ములమ్ములు సేయుటకుం జేకొనినసువర్ణవర్ణనాగవల్లీపర్ణంబులకు సుధా
చూర్ణంబులై విస్రస్తవసనలై విలాసపురుషులం గలసి క్రీడించువారలకటి
తటంబులకు దుకూలచేలంబులై మదనకదనక్రీడాయాససంజనితఘర్మసలిలక్షాళి
తకాశ్మీరకర్దమంబులైనవారలయురస్స్థలంబునకుఁ జందనపంకంబులై పరస్పర
పరిరంభసంభావనాసంభ్రమంబు సలుపుటకు దుర్లభం బని మణిభూషణంబులు
దొలంగ నిడుటవలన భూషణవిరహితంబులైనవారలకంఠోపకంఠంబులకు మౌ
క్తికహారంబులై మృదుమధురాధరపల్లవదంతక్షతవ్రణంబులకు బద్ధపటోచ్ఛేదం
బులై వికీర్ణకుసుమదామంబులైనవారలచికురబంధంబులకు మందారకుందార
విందప్రసూనదామంబులై పరిశ్రమపరిహారార్థంబు ముంగిళ్లకుఁ జనుదెంచు
నప్పుడు సుశీతలసుధాప్రవాహంబులై హర్మ్యగవాక్షమార్గంబుల సుందరంబు
లైనయంతరమందిరంబులు ప్రవేశించి వైమూర్ల్యఘృణిసుస్నాతభిత్తికలయందు

నత్తమిల్లి ముగ్ధాంగనలకు మార్జాలనేత్రశంక నంకురింపం జేయుచుఁ గ్రూరుం
డగుమారుండు కుసుమధన్వుండు గావునఁ బురారాతిశిరఃకుసుమం బైనశశాం
కునిఁ గోదండంబుగాఁ గొని తండోపతండంబులుగా భూమండలంబుమీఁద
నిండార నిగిడించిన నవమల్లికాకాండప్రకాండంబులపగిదిమెండుకొని గండుమీఁటి
విరహిణీమృగకదంబంబుల మేనఁ జఱుకుచుఱుక్కునం గాఁడి మూర్ఛాపార
వశ్యంబు సంపాదించుచువిగతపుష్పంబు లైనవిటపిపటలంబులకుస్ఫుటితప్రసూ
నవితానసంపదసొంపు సంపాదించుచు దూతికాసమాహూయమానులై వేడు
కకాండ్రు వెలయాండ్రగృహంబులకుం జని యంగజసంగరక్రీడాజనితపరిశ్రాంతి
నపనయించుటకు మరలి నిజమందిరంబులకుం జనుదెంచుచుండఁ జారుచామీ
కరప్రణాళీముఖంబుల గగనచుంబిసౌధవిమానాగ్రనిబద్ధతుహినకరకాంతమణి
సంజాతవారిధారాసారంబు సంపాదించుచు వసంతసమయసంపాదితనితాంత
లతాంత ఫలకుసుమరమణీయశోభాధరీకృతపురందరనందనోద్యానవన ప్రమదా
వనాంతరసంఫుల్లహల్లకసుగంధబంధురసరోవరతీరసంభూతకర్పూరకదళికాషం
డమండలాంతర్గతైలాలతాదికుంజపుంజమధ్యంబున నల్లిబిల్లిగానల్లుకొనినద్రాక్ష
పందిళ్లనడుమఁ బ్రన్ననిపటికంపుఁదిన్నెలమీఁద విరులపాన్పునం బవ్వళించి
యమందకందర్పక్రీడానందరసం బనుభవించి యలసిసొలసినిదురించుచున్నపౌర
దంపతులకుఁ బరిశ్రమాపనోదనార్థం బొడలం జిందినపన్నీటితుంపురులయం
దంబుపొందుపఱచుచులోకాలోకశిలోచ్చయసముత్సేధసువర్ణప్రాకారోపరిసం
స్థాపితమహోపలదారుయంత్రంబులు నిశాకాలసమాగతయక్షరాక్షసత్రాసజన
నంబుకొఱకుఁ గరంబులం దాల్చిననిశాతకృపాణధాళధళ్యంబులయనువుఁ జూ
పుచుగోత్రాభిరంజనరఘునాథభుజాపరిపాలితం బైనసాకేతపురంబు గోత్రభంజ
నసురనాథభుజాపరిపాలితం బైనయమరావతీపురంబు నపహసించుచునవ్వినచిఱు
నవ్వుసొంపు వహించుచు మనోహరంబు లై సుస్నిగ్ధంబు లై సుఖస్పర్శంబు
లై కామవర్ధనంబు లై ప్రకాశించుచుండె సాక్షాన్నారాయణుం డైన రామ
భద్రుండు నివసించి యుండుటవలనఁ జంద్రికాధాళధళ్యంబులఁ బరిఖ పయః
పారావారం బై సాలంబు వజ్రసాలం బై తరువులు కల్పవృక్షంబు లై యలరు
చుండ సాకేతపురంబు తెలిదీవిచందంబున నందం బగుచుండె నప్పుడు. 3810

ఉ. ఆతతసౌధభాగముల నన్నిశఁ బౌరులు నృత్తవాద్యసం
గీతకళావినోదము లొగిం బచరించుచు బ్రొద్దుపోయినం
బ్రీతిగఁ గంతుకేళి యొనరించి వసంతసమీరపోతము
ల్చాతురిఁ దద్రతిశ్రమజలం బడఁప న్నిదురించి రయ్యెడన్. 3311

ఆ. నాకపథమునందు పేఁక యనేకసహస్రయోజనంబు లరిగి యలసి
చరమశిఖరిశిఖరశయ్యపై రోహిణీభామఁ గూడి విధుఁడు పవ్వళించె. 3812

ఆ. పాండురుచిచయంబు పిండారఁ బోసిన, పగిది నలరునిలకుఁ బట్టపగలు

చేసి యపరదిగ్విలాసినీకబరికి, నబ్జబింబ మభినవాబ్జ మయ్యె. 3313

తే. శ్రీరఘుస్వామి పట్టాభిషేకవార్త
నెలమిఁ బాతాళవాసుల కింపు మీఱ
నెఱుఁగఁ జెప్పంగఁ గడువడి నేగె ననఁగఁ
గుముదబాంధవుఁ డపరాబ్ధిఁ గ్రుంకె నపుడు. 3314

క. జలజారి యస్తమించిన, దళముగఁ జీఁకటులు పర్వె ధారుణియందుం
బెలుఁచ నరాజక మగుచోఁ, జెలరేఁగరె మలిను లది ప్రసిద్ధము గాదె. 3315

చ. దినకరుఁ డెప్పుడుం దమకు దేవత గావున నాతఁ డస్తమిం
చునపుడు ముచ్చటం గొనినశోభను దాము ప్రతిగ్రహించెనో
యన రతితాంతకాంతలదృగంతము లెంతయు రక్తిఁ దాల్చె నొ
య్యనఁ గపురంపుఁదమ్ములమునంద రుచు ల్లనియించె స్త్రీలకున్. 3316

ఆ. జన్యజనకభావసంబంధమున నిజ,ద్యుతులు సురతతాంతసతులకనుల
కొసఁగి వానికాంతు లొగిఁ గొన్నచందాన, దీపకళిక లపుడు తెల్లనయ్యె. 3317

చ. వదలినకేశపాశములు వాడినదండలు గోటినొక్కులం
గదుములు వడ్డచన్నులును గందినమోవులు నిద్రమబ్బునం
జెదరినచూపులుం జెమటచిత్తడిఁ దోఁగిన మేను లొప్పు న
మ్మద మలరం బునారతులమైఁ బ్రియులం గరఁగించి రంగనల్. 3318

—సూర్యోదయసమయ వర్ణనము.—

సీ. ప్రాచీముఖంబున వఱలుముత్యాల చేర్చుక్కకై వడి వేగుఁజుక్క వొడిచె
నరుణోదయస్నాత లగువిప్రులను మేలుకొలుపుచుఁ గలకలఁ బలికెఁ గవులు
రతిపరిశ్రాంతనిద్రితదంపతులమేనిచెమట లార్పుచు సమీరములు విసరె
భూసురోత్తమగృహంబులఁ జెవి కింపుగాఁ దతసామగానశబ్దములు మీఱె

తే. హిమకరుం డైనకువలయాధీశ్వరుండు
చనుట కలయుగ్రకరుఁ డైనచక్రవిభుఁడు
వచ్చుటకుఁ జాలఁ జింతించి వన్నెఁ బాసె
ననఁగఁ దారలు గతకాంతు లయ్యె నపుడు. 3319

సీ. గగనకాసారోడుకైరవంబులు గోయఁ బ్రాచి సాఁచినహస్తపల్లవంబు
నెఱసినబలితంపునిబిడాంధకారకాంతారసీమకు బృహద్భానుహేతి
ప్రబలవిభావరీప్రతతి ద్రుంపఁగ సానఁ బట్టించి యెత్తినపరశుధార
జలజాతవనవాటికలఁ గల్గుజాడ్యంబు పరిహసింపంగఁ బొల్పడ్డమందు

తే. పయనములు వేకువం బోవుపథికతతికి
దారిఁ జూపెడు తెరువరిదంపతులకుఁ
బంచశరజన్యవిరతిఁ బుట్టించుచతురుఁ
డరుణుఁ డుదయించెఁ బ్రాక్పర్వతాగ్రమందు 3320

సీ. గ్రహరాజతురగరింఖాఘట్టనోత్థితప్రాక్శైలధాతుపరాగ మనఁగ
ధరణీసురార్ఘ్యాంబుశరలూనమందేహదేహోత్థితాసృక్ప్రవాహ మనఁగ
హరిసమాగతహృష్టయై ప్రాచి యురమునఁ బూసినకాశ్మీరపంక మనఁగఁ
బూర్వాచలంబుపైఁ బొడమినచూతవృక్షముమీఁదిచిగురాకుగమి యనంగ
తే. సమయరజకుండు పూర్వదిక్సతి కొసంగ, నాఱఁ బఱచినచెంగావిచీర యనఁగ
శక్రపురికోట కలఁదినజాజనంగ, నలరెఁ దూర్పుననూనూఁగుమొలకయెండ.

సీ. ప్రాక్పయోరాశిలోపల నుండి పయికిఁ బ్రాఁకినబడబానలకీల లొక్కొ
తోయజాప్తుని తేరు దోలుపిచ్చుకకుంటు పాఱఁ దీసినరశ్మిపటల మొక్కొ
ప్రాగాశ భేదించి పయి కుద్గమించిన ఫణిఫణామణిఘృణిగణము లొక్కొ
తగ నుదయాద్రి నెత్తముమీఁదిపాదిలో మొలకలెత్తిన కందమోసు లొక్కొ
తే. ప్రాజ్మహీధరపక్షతిప్రచ్ఛిదాక్ష
తోత్థశోణితధారాసమూహ మొక్కొ
యనుచుఁ గొనియాడ రవికిరణాంకురములు
పాటలద్యుతి నొకకొన్ని ప్రాఁకె నభము. 3322

సీ. ఉస్రంబు లొకకొన్ని యువతులకొప్పుపైఁ జెంగల్వతేకులరంగు దెలుప
నంశువు లొకకొన్ని యంభోజవనులందుఁ గార్కొన్ననిద్రాంధకార మడఁప
గిరణంబు లొకకొన్ని తరుషండములయందుఁ గెందలిరులవిచికిత్స నొసఁగ
భానువు లొకకొన్ని పరమానురక్తిచే గగనలక్ష్మిని బ్రీతిఁ గౌఁగిలింప
తే. వైరిమదసంతమసహేళి వాలి నాజిఁ
దునిమినరఘుప్రవీరునిదోఃప్రతాప
మంచితంబుగ మూర్తిభవించినట్లు
మిహిరమండల ముదయాద్రిమీఁదఁ దోఁచె. 3323

సీ. పసఁగునిగ్గులు దేఱఁ బ్రాచినెన్నొసలుపై దిద్దినసిందూరతిలక మనఁగఁ
దులకించుతొలిసంజ నెలఁతపేరురముపై భాసిల్లుమాణిక్యపతక మనఁగఁ
బాకశాసనువీటిపడమటిగోపురాగ్రమునఁ గ్రాలుసువర్ణకలశ మనఁగఁ
బూర్వాబ్ధిజలముఁ దేఁబోయినహరిహస్తకముమీఁదితపనీయఘట మనంగ
తే. బంధురార్జితచక్రతపఃఫలంబు
భూసురకృతనమస్కారములకుఁ బాత్ర
మజహరిపినాకిమూర్తిత్రయాభిరాముఁ
డరుఁగఁ డలరారెఁ బ్రాగ్దిశాభ్యంతరమున. 3324

చ. కనదలివేణి కోకకుచ కంబుశిరోధర హంసయాన ప
ద్మనయన చారుసైకతనితంబ మృణాళభుజాఢ్య సారస
స్వనమృదునాద సన్మకరజంఘిక యై కడు రక్తిఁ దాల్చె న
య్యినకరసంగతిం గనుల కింపుగఁ బద్మిని కాననంబునన్. 3325

సీ. మకరందరసపానమత్తరోలంబకదంబంబు మధురగీతములు పాడఁ
గారండవక్రౌంచసారసాదిపత్త్రిరాజికూజితవాద్యరవము లెసఁగ
శరదిందుచంద్రికాస్వచ్ఛపాండుచ్ఛదచామరములు పార్శ్వములఁ జెలఁగ
సూర్యభానుచ్ఛటాస్ఫురితోరుపుండరీకమహార్ఘపుండరీకములు వెలయ
తే. నేర్పు మెఱయ సారంగముల్ నృత్య మాడఁ
బ్రమదమునఁ గోకములు బరాబరులు సేయ
నభినవవిచిత్రసరసీసభాంతరమునఁ
గమల గొలువుండెఁ గెందమ్మిగద్దెమీఁద. 3326

వ. అంతకు మున్నె జాంబవత్సుషేణులు పూర్వసముద్రతోయంబును సమీరనందనఋషభులు దక్షిణార్ణవజలంబును వేగదర్శిగవయులు పశ్చిమోదధిసలిలంబును ఋషభనలు లుత్తరసాగరపుష్కరంబులను మఱియుఁ గొందఱు వానరశ్రేష్ఠులు నద్యంబువులు గొని సువర్ణఘటంబులం బట్టికొని తెచ్చి శత్రుఘ్నునకు సమర్పించి రాశత్రుఘ్నుండు కపివరసమానీతసరిత్సరిత్పతిపుణ్యతీర్థంబులు మునిశ్రేష్ఠుండైన వసిష్ఠునకు సమర్పించె నంత ననంతనితాంతానర్ఘనిర్మలశశికాంతభిత్తికాంతరసంక్రాంతనరనారీరూపంబులు సభాసదనాంతరస్థితజనంబులకు విచేతను లైన వానరుల నెల్ల సచేతనులం జేసినమహానుభావుం డగురామభద్రునిమహామహిమంబునఁ గుడ్యోపరిపరిలిఖితవిచిత్రచిత్రంబులు సప్రాణంబు లయ్యెనో కో యని యును దదీయచరణకంజాతరజఃపుంజంబు సోఁకి పాషాణంబు లెల్ల రూపామణు లయ్యెనో కో యనియు శంక నంకురింపం జేయ ననన్యసామాన్యగుణసాంద్రరామచంద్రపట్టాభిషేకమహోత్సవాలోకనకౌతూహలాతిరేకంబున దివంబుననుండి చనుదెంచినబృందారకసుందరీబృందంబులయందంబు పొందుపఱచుమహోన్నతమహేంద్రనీలస్తంభాగ్రవిరచితమణిమయసాలభంజికాపుంజంబులు నిజకరతలకలితచారుచామీకరప్రాంతాంతరాళస్థగితమాణిక్యదీపంబుల నివాళింప రమణీయవిశాలప్రవాళకవాటంబులయందు ఘటంబుగా సంఘటించిననీలైన మగఱాలగందపట్టెలమీఁద రంజిల్లునపరంజిగుబ్బలు రంజన్మంజుకంజపుంజంబు లని తుండంబులతండంబులు సాఁచి యంతలోన నుభయపార్శ్వచిత్రితసాంద్రమృగేంద్రరూపంబులు సూచి భయంబు గొని రయంబున వెనుకకుం బఱచుమహోత్తుంగమత్తమాతంగంబుల దానధారాసారంబునం బంకిలంబు లగుప్రాంగణపర్యంతగేహాళీప్రదేశంబులఁ బరినిబద్ధనిర్మలగారుత్మతరత్నంబులయందుఁ బ్రతిఫలించినకోరకితపూగవృక్షంబులు గోమయగోముఖంబులుగావించినించినరంగవల్లులభంగి నెఱిం గింపస్ఫటికోపలనిర్మితజాలవాతాయనరంధ్రసమాగతమందమరుచ్చలితవిశాలవితానంబునందు లిఖించినబహువిధదేవతావిగ్రహంబులు విలోకించి జనంబులు నిక్కంబుగా దేవతలు గగనంబుననుండి లాస్యంబులు సేయుచున్నవార లని డెందంబులఁ గీలుకొలుప నూతనచూతపత్త్రఘటితచారు

తోరణంబులు ద్వారోపరిభాగలంబమానపద్మరాగమణిదామంబు గాంచి బింబ
ఫలంబు లని భ్రమించి గ్రసనాభిలాష నరుగుదెంచి ముక్కులం గఱచి వ్రేలు
రాచిల్కలచాలుచెలువున నలర భిత్తికామధ్యంబున నూర్ధ్వముఖంబుగా వ్రాసి
నబిడాలంబులు తదుపరిభాగవిటంకంబుల నుంచినకృత్రిమకీరంబులంబట్టుటకుం
బొంచియున్నవాని తెఱం గెఱింగింప మహోన్నతశాతకుంభ స్తంభపక్షంబులఁ జే
త దివంబున కుద్గమించునోయనితలంచి యుల్లెగురకుండ నడ్డపెట్టినమాడ్కిఁ జూ
డ్కికి వేడ్క సేయుచున్న యతిస్థూలంబు లైనమగఱాలదూలంబుల వ్రేలుపచ్చ
ఱాలకోణిగలకుం దగిలించిన నిగనిగనితొగరుపన్నెకుందనంపుగొలుసులతుద
నలరుమహనీయధూపపాత్రలవలన నిర్గమించుచందనాగరుప్రముఖధూపవాసన
లుపరిగ్రహించితిన్నతెమ్మెర లెమ్మెగాగుబాళింపఁ గ్రిందంబఱచినపృథివీలక్షణాం
కం బైనకుథాస్తరణంబును మీఁదం గట్టినస్వర్గలక్షణాంకం బైనవితానంబును
రంజిల్లుచుండఁ దన్మధ్యభాగంబు పృథివీలోకస్వర్గలోకమధ్యగతనానావిధనక్షత్ర
శోభితం బైనయంతరిక్షంబు ననుకరింప నగఁ ఖచితమణిగణప్రభాచాకచక్యంబుల
వైజయంతంబుఁ బోలె శోభిల్లుచున్నయాస్థానమంటపమధ్యంబున విలసిల్లురత్న
మయభద్రపీఠంబున సీతాసహితంబుగా రామభద్రునిం గూర్చుండ నియో
గించి పురోహితశ్రేష్ఠుం డైనవసిష్ఠుండు ఋత్విగుపాధ్యాయసమేతుం డై మంగ
ళాచారంబులు నిర్వర్తించె నంత. 3327

## శ్రీరామచంద్ర పట్టాభిషేక ఘట్టము.

సీ. వరుస వసిష్ఠుండు వామదేవుఁడు మునివరులు సుయజ్ఞజాబాలివిజయ
కాశ్యపు ల్గౌతమకాత్యాయనులు నరశార్దూలుఁ దగు రామచంద్రు నెలమి
వసువులు దగ దివస్పతినిఁబోలె సుగంధి విమలప్రసన్నతోయముల చేత
నభిషేక మొనరించి రపుడు ఋత్విగ్ద్విజవరులు కన్యకలును మంత్రివరులు
తే. యోధు లభిషేక మొనరించి రుత్సుకతను, సర్వదిక్పాలకులు దేవసమితిఁ గూడి
వ్యోమముననుండి సకలదివ్యౌషధీర, సముల నభిషేక మొనరించి రమలబుద్ధి.
చ. పొలుపలరార మున్ను మనుముఖ్యతదన్వయజాతరాజవ
ర్యులు రహి నెద్ది దాల్చి ముద మొప్పఁగఁ దా మభిషిక్తు లైరి సొం
పలరఁగ నెద్ది తొల్లి కమలాసననిర్మిత మయ్యె నాసము
జ్జ్వలమణిరత్నశోభితవిశాలకిరీటము దెచ్చి చెచ్చెరన్. 3329
క. మునివర్యుఁడు ఘనుఁడు తపోధనుఁడు వసిష్ఠుండు రామధరణీశున కిం
పెనయఁగఁ బెట్టె విలోకన, జనముల కత్యంతసంతసం బుదయింపన్. 3330
క. అతులితనానామణిచిత్రిత మయి ధనయుక్త మయి యుద్దీర్ణం బై సం
భృతసజ్జనమై యపుడ, ప్రతిగతిఁ జూపట్టె నాసభాస్థలము రహిన్. 3331
తే. సంతసంబున శ్రీరామచంద్రుఁ డిట్లు, సర్వఋత్విక్పురోహితసమితిచేత
ననుపమంబుగ నభిషిక్తుఁ డయ్యె నఖిల,జనము లరుదంది యానందజలధిఁ దేలి.

సీ. భూరిమోదమునఁ దాంబూలకరండము వహియించి సేవించె భరతుఁ డపుడు
లక్ష్మణుండును భర్మలక్షణవ్యజనంబు భక్తితోఁ గరములఁ బట్టి విసరె
శత్రుఘ్నుఁ డానందసహితుఁ డై పాండరచ్ఛత్రంబుఁ బట్టెఁ బ్రసన్నబుద్ధి
నిరువంక శశినిభవరచామరంబులు వీచిరి కపిదైత్యవిభులు వేడ్క

గీ. వాయుపుత్త్రుండు సవినయావనతుఁ డగుచు
ముదితుఁ డై రత్నపాదుకల్ మోచి కొలిచె
నింద్రనందనుఁ డెన నుండి యెలమి మిగులఁ
జెలఁగు ప్రజకు బరాబరుల్ సేయుచుండె. 3333

సీ. శతదళసంయుక్తచారుచామీకరమయసరోరుహవరమాలికయును
దతరత్నకలితముక్తాహారము నొసంగె శక్రచోదితుఁ డయి స్వర్గనుండు
దివి దేవగంధర్వదివ్యగానంబులు చెలఁగె నప్సరసలు నెలమి నాడి
రతిసంభ్రమంబున నమరదుందుభులును దోరంబుగా నప్డు బోరుకొనియె

తే. నఖిలసస్యసమృద్ధ యై యలరె ధాత్రి, ఫలసమృద్ధియుఁ గనెఁ బాదపంబు లెల్లఁ
దవిలి సుమములు గంధవంతంబు లయ్యె, శ్రీరఘూద్వహుపట్టాభిషేకవేళ.

వ. ఇట్లు రామభద్రుండు పట్టాభిషిక్తుం డై బ్రాహ్మణులకు లక్షధేనువులును శతసహ
స్రతురంగంబులును శతవృషభంబులు నొసంగి వెండియుఁ ద్రింశత్కోటిని
ష్కంబులును నవరత్నఖచితనానాభరణంబులును మహార్హంబు లగుసువర్ణ
చేలంబులును ద్విజశ్రేష్ఠుల కొసంగె ననంతరంబ. 3335

ఉ. భానుమరీచితుల్యము సువర్ణమయంబును రత్నభాస్వరం
బై నమనోజ్ఞమాలిక దివాకరపుత్త్రున కిచ్చి వజ్రభృ
త్సూనుకుమారుఁ గాంచి మణిశోభితవజ్రమయాంగదంబు లెం
తే నయ మొప్పఁగా నొసఁగెఁ దేకువ నుల్లము పల్లవింపఁగన్. 3336

క. వరమణిజుష్టంబును హిమకరసదృశము నైనమౌక్తికప్రకరమనో
హరహారము శ్రీసీతా, సరసిజనేత్రకు నొసంగె సంతస మలరన్. 3337

క. నిరుపమదివ్యాంబరయుగ, ముకుతరమణిరత్నశోభితోత్తమకనకా
భరణంబులు సీతాముఖ, మరుదుగఁ గనుఁగొనుచు మారుతాత్మజున కిడెన్.

చ. పరమదయాళుఁ డై తనకు భర్త యొసంగినరత్నహారము
న్గరమునఁ బట్టి వానరులఁ గాంతుని మోమును సారెకు న్మనో
హరగతిఁ జూచుచున్నజనకాత్మజభావ మెఱింగి మోమునం
జిఱునగ వంకురింప సరసీరుహనేత్రుఁ డు రాముఁ డిట్లనున్. 3339

చ. వనరుహనేత్ర యెవ్వనిప్రభావమునం బరితుష్ట వైతి వె
వ్వని యెడ విక్రమంబు ఘనపౌరుషము న్మతియు స్థిరంబు లై
దనరుచు నుండు నట్టిగుణధాముని కిమ్ము హసీయహార మి
మ్మనిన ధరాకుమారిక రయంబున మారుతి కిచ్చె హారమున్. 3340

క. చెలువుగ ముక్తాహారము, గళమున ధరియించి యలజగత్ప్రాణసుతుం
డలరె సుధాకరకరనిభ, సలలితశుభ్రాభ్రకలితశైలముభంగిన్. 3841

వ. అంత దిగంతవిశ్రాంతయశోవిరాజితుం డగు రామచంద్రుండు మైందద్వివిదనీలుల
వారియభిప్రాయం బెఱింగి యుచితప్రకారంబులం బరితుష్టులం జేసి తక్కిన
సమస్తవృద్ధవానరుల నయ్యైతెఱంగుల నభీష్టవస్తుప్రదానంబులం దృప్తులం
జేసె నిట్లు విభీషణుండును సుగ్రీవహనుమజ్జాంబవత్ప్రముఖనిఖిలవానరులును
వస్త్రాభరణమణిరత్నాదిసత్కారంబుల యథార్హంబుగాఁ బ్రతిపూజితులై
రంత సుగ్రీవుండును సమస్తవానరులును రామాభిషేకమహోత్సవంబు సంద
ర్శించి తదనుజ్ఞ వడసి కిష్కింధకుం జనిరి విభీషణుండు సర్వకామప్రతిపూజి
తుండై కులధనంబును బ్రాపించి సంతోషవిశేషంబున ననుజ్ఞ వడసి లంకకుం
జనియె నిట్లు సర్వకపిరాక్షసవరులు తమతమనివాసంబులకుం జనినయనంతరం
బ యాజానకీరమణుండు వినిహతశత్రుండై మహాయశుండై రాజ్యంబు పరి
పాలించుచు లక్ష్మణుం జూచి యిట్లనియె. 3842

రాముఁడు భరతుని యువరాజుగాఁ జేయుట.

తే. అనఘ మత్తుల్యతేజుఁడ వరయ నీవు, లీల నస్మద్వంశనృపులు పాలించినట్టి
యవని నేలుము నాతోడ యౌవరాజ్యపట్టభద్రుండ వై భుజాబలము మెఱయ.

ఉ. నా విని లక్ష్మణుండు నరనాథునిఁ గన్గొని భక్తి నిట్లను
న్దేవ యనారతంబు భవదీయపదాంబుజసేవ సేయుచు
న్దేవ దలిర్ప సన్నిధి వసించి మనంగలవాఁడ నాత్మలో
వావిరిఁ గోర నెద్దియు భవత్పరిచర్యయుఁ దక్క నెంతయున్. 3844

క. మునుకొని రాఘవుఁ డంతట, ననుపమగతి యౌవరాజ్యమందు భరతుని
ఘనశౌర్యకలితు ననఘుని, బనివడి యభిషిక్తుఁ జేసెఁ బౌరులు మెచ్చన్. 3845

తే. వాజపేయశతంబులు పౌండరీక, తురగమేధశతంబులు దోడుతోడ
నర్థి నొనరించి దశసహస్రాబ్దకములు, రాజ్యపాలన మొనరించె రాఘవుండు.

చ. జనకసుతామనోహరుఁడు సత్యరతుం డయి రాజ్య మేలఁగా
జనములు జారచోరవిషసర్పమహాజ్వరబాధ లెవ్వియు
న్మనుకొని చెందకుండఁ గడు మోదముతో సుఖయించి రంగన
ల్పనివడి వేశ్యతోడ విధవాత్వ మెఱుంగక యుండి రెంతయున్. 3847

క. బాలమరణం బెఱుంగక, వాలాయము వృద్ధజనులు పరమముదమున
న్గ్రాలుచు నుండిరి రాముఁడు, హేలాగతిఁ బూజ్యరాజ్య మేలుచు నుండన్.

సీ. సర్వజనంబులు సత్యధర్మిష్ఠులై ఘనతరసంతోషకలితులైరి
రామునిఁ గాంచి పరస్పరంబును హింసఁ జేయక కడు మైత్రిఁ జెంది విగత
రోగులై దుఃఖ మెఱుంగక పుత్రపౌత్రాభివృద్ధియుఁ గల్గి యనవరతము
శీలంబు దప్పక చెలఁగి వర్షసహస్రజీవులై కడు వృద్ధిఁ జెంది రెలమి

తే. క్ష్మాజములు నిత్యఫలపుష్పశాలు లయ్యె
బరఁగఁ బర్జన్యుఁడును గాలవర్షి యయ్యెఁ
బవనుఁడు మనోజ్ఞముగ సుఖస్పర్శుఁ డయ్యె
మించి రఘురాముఁ డవనిఁ బాలించునపుడు. 3349

చ. పనివడి నాల్గువర్ణములవారు నిజోచితకర్మయుక్తులై
యనవరతంబు ధర్మరతులై శుచులై కడు సత్యవాదులై
యనుపమలక్షణాభియుతులై సుగుణాన్వితులై చెలంగి రా
ఘనమతి రాఘవుండు కుతుకంబున రాజ్యము నేలుచుండఁగన్. 3350

తే. భూరిగుణయుక్తులైనతమ్ములను గూడి
యఖిలజనములు తనుఁ గొనియాడుచుండ
నుదితతేజుండు రాముండు పదునొకండు
వేలవర్షంబు లిల యేలె వేడ్కతోడ. 3351

శ్రీమద్రామాయణ పఠన శ్రవణ పూజనాది ఫలశ్రుతి.

శా. ఆయుష్యం బతిధన్యము న్ఘనయశస్యంబు న్నృపశ్రేణికి
న్నైశ్రేయసప్రాప్తినిమిత్త మార్షమ్ము సభాసేవ్యాదికావ్యం బుపా
దేయంబు న్మునిరాట్కృతంబు సుజనధ్యేయంబు భద్రప్రదం
బీయాఖ్యానము దీని విన్నమనుజుం డింపొందు వీతాఘుఁడై. 3352

తే. చెలువు మీఱంగ రామాభిషేచనంబు
విన్న విత్తకామునకును విత్త మొదవుఁ
బుత్త్రకామున కొదవు సుపుత్త్రుఁ డరుల
గెలిచి రాజ్యంబుఁ బ్రాపించు క్షితివిభుండు. 3353

వ. మఱియు శ్రీరామచరిత్రంబు విన్న యువతులు రామలక్ష్మణభరతశత్రుఘ్నులచేతఁ గౌసల్యయు సుమిత్రయుఁ గైకయు నెట్లు జీవత్పుత్త్రలై రట్లు నిజపుత్త్రులచేత జీవత్పుత్త్రలై ప్రకాశింతు రదియునుంగాక. 3354

తే. జగతి శ్రీరామవిజయంబు శ్రద్ధధానుఁడై జితక్రోధుఁడై విన్నయమలచరితుఁ డఖిలదుర్గంబులఁ దరించి యుంచితముగఁ, బెద్దకాలంబు జీవించి పెంపు వడయు.

తే. మఱియు రామాయణము విన్నమానవుండు
కాంక్షితవరంబు లొందు రాఘవునివలనఁ
బరఁగఁ బరదేశమున నున్నబంధుజనులు
సేమమున వత్తు రాత్మీయధామములకు. 3356

వ. మఱియు శ్రీరామాయణశ్రవణమాత్రంబున దేవతలును బితృదేవతలును సంతుష్టు లగుదు రెవ్వనిగృహంబున నిమ్మహాకావ్యం బుండు నట్టిగృహంబున విఘ్నంబు లన్నియు శమించు రజస్వలాంగనలు విన్న గుణవంతులైనపుత్త్రులం బడ

యుదురు పురాతనం బైనయీయితిహాసంబు నిజమందిరంబున నునిచికొని యెవ్వాఁడు నిత్యంబుఁ బూజించుచుఁ బఠించు నతండు సర్వపాపవిముక్తుం డై దీర్ఘాయుష్మంతుండై విలసిల్లు మఱియు మహీవరుండు నమస్కరించుచు నిమ్మహా కావ్యంబు విప్రునివలన నాకర్ణించిన నతండు నిస్సంశయంబుగా సఖండైశ్వర్యం బును బుత్రలాభంబు నధిగమించు సీరామాయణశ్రవణపఠనంబున నారాయ ణుండును దేవాదిదేవుండును హరియు నవ్యయుండు నగు రాముండు సంతుష్టి నొంది కుటుంబధనధాన్యకీర్తిసుఖంబు లొసంగు మఱియు నాయుష్యంబు నారోగ్యకరంబును సౌభ్రాత్రకరంబును యశస్యంబును శుభంబును దేజోబల కరంబు నగునీయాఖ్యానంబు నియమంబున వృద్ధికాము లగువారిచేత విసం దగి యుండు మునికృతం బైనయిమ్మహాకావ్యంబు భక్తిచేత లిఖించినమహా త్ములు త్రివిష్టపంబుఁ బ్రాపింతు రిమ్మహాకథ మాచేత నాఖ్యాతం బయ్యె హరి కరుణవలన మీకు భద్రంబును బలంబును వృద్ధి నొందుఁ గాక యని యిట్లు కుశలవులు యుద్ధకాండకథావృత్తాంతంబు సవిస్తరంబుగా వినిపించిన విని రామ భద్రుండును లక్ష్మణభరతశత్రుఘ్నులునుం దక్కినసభాసదులు నుబరమానంద భరితాంతఃకరణు లై సాధువాక్యంబుల నక్కుమారులం బ్రశంసించిరి. 3357

ఉ. శంబరభృత్కులప్రవర శంబరముగ్నిభదేహ రుక్మిణీ
శంబరదృఙ్మనోసిలయ శంబరభిచ్ఛతతుల్యసుందరా
శంబరవైరివైరినుత శంబరజాతదళాయతేక్షణా
శంబరరాశిరాట్ఛయన శంబరవాజ్యశసేంద్రవందితా. 3358

క. వనమాలాశోభిత పావనమాలాకారరక్ష భాసురబృందా
వనకేళిలోల యమునా, వనకేళీచతుర గోపవనితాధీశా. 3359

మాలినీవృత్తము. శమితసకలదోషా బాలగోపాలవేషా
విమలసుగుణహృద్యా వేదవేదాంతవేద్యా
సుమహితగుణజాలా సూరిసంస్తుత్యశీలా
సముదితరవితేజా చంద్రవంశాధిరాజా. 3360

గద్యము. ఇది శ్రీరామచంద్రచరణారవింద రసాస్వాదనతుందిలేందిందిరాయమాణ మానస కులపవిత్ర కౌండిన్యగోత్ర పద్మనాభసూరిపుత్ర విద్యాసాంద్ర వేంకట కవీంద్రప్రణీతం బైనశ్రీమద్రామాయణం బనుమహాకావ్యంబునందు రాముని దండయాత్రయు సముద్రసంగమంబును రావణమంత్రంబును విభీషణనీతిప్రబో ధంబును రావణకోపంబును విభీషణుండు రాముని శరణంబు వేఁడుటయు రావణ వధోపాయనివేదనంబును సముద్రప్రార్థనయు రామకోపంబును సముద్రసమాగ మంబును సేతుబంధంబును సముద్రప్రతారణంబును శుకవిమోచనంబును వానర బలసంఖ్యానంబును సువేలారోహణంబును రావణసుగ్రీవులయుద్ధంబును రావణ మకుటభంగంబును లంకానిరోధంబును స్కంధావారనివేశనంబును నంగదుని

# తెలుగు విశ్వవిద్యాలయం

## ప్రచురణలు

**నిఘంటువులు-పదకోశాలు-విజ్ఞానసర్వస్వ సంపుటాలు :**

తిక్కన పద ప్రయోగకోశము 2వ సం.
తిక్కన పద ప్రయోగకోశము 3వ సం.
ఆముక్తమాల్యద పదప్రయోగసూచిక
మాండలికవృత్తి పదకోశం (వ్యవసాయం)
మాండలికవృత్తి పదకోశం (చేనేత)
మాండలికవృత్తి పదకోశం (కుమ్మరము)
శాసన పదకోశం సం.
ఆంధ్ర మహాభారత నిఘంటువు (అచ్చులు) (మొదటి సంపుటం) సం.
ఆంధ్ర మహాభారత నిఘంటువు (హల్లులు) (రెండవ సంపుటం)
త్రిభాషా నిఘంటువు సం.
శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు (5, 6, 7, 8 సంపుటాలు)
ప్రౌఢ్య నిఘంటువు (ఇంగ్లీషు-తెలుగు)
సంస్కృతాంధ్ర పదార్ణవము 2వ సం.
విజ్ఞాన సర్వస్వం
ఎ) మొదటి సంపుటం (చరిత్ర-రాజనీతి)
బి) పన్నెండవ సంపుటం (ఇంజనీరింగు-టెక్నాలజీ)

**కావ్యాలు-ప్రబంధాలు-వచనాలు :**

మహాభాగవతకల్ప కుసుమమాల
పోతన కవితాసుధ
భాగవత వైజయంతిక
వరాహ పురాణము
దశరథరాజనందన చరిత్ర
శ్రీరంగమాహాత్మ్యము
ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము
ప్రబోధ చంద్రోదయము
తాలాంకనందినీ పరిణయము
కుకుత్స్థ విజయము
సింహగిరి వచనములు
మూర్తి త్రయోపాఖ్యానము
అధిక్షేప శతకము
కువలయాశ్వ చరిత్రము
చంద్రికా పరిణయము
రాయవాచకము
ప్రతాపరుద్ర చరిత్రము
కృష్ణరాయ విజయము
సింహాసన ద్వాత్రింశిక
మార్కండేయ పురాణము
పాండురంగ మాహాత్మ్యము
ఆముక్తమాల్యద
పారిజాతాపహరణము
జైమినీ భారతము
మను చరిత్రము
మాధవ శతకం
ఇహం - పరం
శ్రీ మహాభాగవతము 1, 2 సంపుటాలు
వసు చరిత్ర
శృంగార నైషధము
ముకుంద విలాసము